శ్రీ

# ఆంధ్ర విజ్ఞానము

# (Telugu Encyclopædia)

ఐదవ సంపుటము.

## ప్రసాద భూపాలుఁడు

జమీందార్ ఆఫ్ దేవిడి.



జ్ఞానోదయము.

మొదటికూర్పు 1000 ప్రతులు.

1941

PRINTED AT THE BOX PRESS
BY B. V RAMANAYYA & SONS, RAJAHMUNDRY.

# విషయసూచిక

---

**బృహత్కరుఁడు**— అంగరాజవంశము క్షత్రియుఁడు. భద్రరథుని కుమారుఁడు.

**బృహత్కర్మఁడు**--(బృహత్కాయుఁడు చూడుఁడు)

**బృహత్కాయుఁడు**—ఈతనికి బృహత్కర్మఁ డనియుఁ బేరుకలదు. బృహద్దిషుని సంతతిలోని బృహద్ధను వీతనితండ్రి యని చెప్పఁబడినది.

**బృహత్ఫరాయణులు**--వీ రాంధ్రదేశ భాగముల నేలిన నృపతులు.

బృహత్స్వాన నక్షత్రగోళములు లేక పరశ్వాన నక్షత్రగోళములు. (నక్షత్రములు భారతీయులు గుర్తించినవి చూడుఁడు)

**బృహత్సేనుఁడు**—మగధ బార్హద్రథ సంతతి క్షత్రియుఁడు. తండ్రి సురక్షతుఁడు. పితామహుఁడు నిరమిత్రుఁడు. పుత్త్రుఁడు కర్మజిత్తు.

**బృహత్సేనుఁడు**—మద్రదేశాధీశుఁడు. కుమార్తె లక్షణ (శ్రీకృష్ణునియెనిమిదవభార్య). శ్రీకృష్ణుఁడు మత్స్యయంత్రమును బడఁగొట్టి యీమెను బరిణయమయ్యెను.

**బృహత్తత్త్వుఁడు**-పూరుసంతతి, చంద్రవంశక్షత్రియుఁడు. భుమన్యునిసుతుఁడు. హస్తికుని పితామహుఁడు. బృహత్క్షత్రుని పుత్రుని పేరు సుహోత్రుఁడని తెలియుచున్నది.

**బృహదగ్ని గోత్రము**- (కుశికగణము చూడుఁడు.)

**బృహదశ్వుఁడు** — ఇక్ష్వాకుసంతతి. సూర్యవంశక్షత్రియుఁడు. తండ్రి శబస్తుఁడు. పితామహుఁడు యువనాశ్వుఁడు. కుమారుఁడు కువలయాశ్వుఁడు.

వేఱొక, బృహదశ్వుఁ డను ఋషికలఁడు. ఈతఁడు పాండవు లరణ్యావాసమున నుండుతఱి యుధిష్ఠిరు నోదార్పఁజని నలచరిత్ర చెప్పిన వాఁడు.

**బృహదిషుఁడు** — అత్రి, చంద్ర పూరుసంతతి క్షత్రియుఁడు. తండ్రి అజామీఢుఁడు. సోదరులు నీలుఁడు, ఋక్షుఁడు. కుమారుఁడు భల్లాదుఁడు లేక బృహద్ధనువు. బృహదిషుని సంతతివారికి బార్హదిషు లని వాడుక యుండెను.

పూరుసంతతియందే భర్మ్యాశ్వుని మూఁడవ సుతునకును బృహదిషుఁ డనుపేరు కలదు.

**బృహదుక్థగోత్రము**—(ఔతథ్య ఉపగణము చూడుఁడు).

**బృహదుక్థగోత్రము** — ఇది అంగీరస సంతతి, గౌతమగణము.బృహదుక్థ ఉపగణము. అంగీరస-బార్హదుక్థ-గౌతమ,
అంగీరస-వామదేవ-బార్హదుక్థ (బృహదుక్థ),
అంగీరస-గౌతమ-ఔసిజ-ఔతథ్య-బార్హదుక్థ,
యని మూఁడు ప్రవరరూపములు.

**బృహద్రథుఁడు**— అత్రి-చంద్ర-పూరుకురు సంతతి క్షత్రియుఁడు. తండ్రి ఉపరిచర వసువు. సోదరులు కుసుంబుఁడు, మత్స్యుఁడు, ప్రత్యగ్రుఁడు, చేదిషుఁడు. కుమారులు జరాసంధుఁడు, కుశాగ్రుఁడు ననునిర్వురు. బృహద్రథునిసంతతివారు బార్హద్రథు లనఁబడుదురు. బృహద్రథుఁడు మగధదేశ భాగము నేలిన వాఁడు. రాజధాని గిరివ్రజపురము. బృహద్రథుఁడుపరిచరవసువుజ్యేష్ఠపుత్రుఁ డనియు, సత్యవతి సోదరి యనియుఁ జెప్పఁబడినది.

అంగదేశాధిపతి యొక బృహద్రథుఁడును. మిథిలదేశాధిపతి యొకబృహద్రథుఁడునుగలరు.

పాండవసంతతిలోని తిమి యనువాని కుమారుఁడొక బృహద్రథుఁడు కలఁడు. తిమితండ్రి

పేరు ధూర్వ్యుఁడు. ఈబృహద్రథుని సుతుని పేరు సుదాసుఁడు.

**బృహద్ధనువు** — (భల్లాటుఁడు చూ.)

**బృహద్ధనువు** — బృహదిషుని సంతతి. బృహదిషుని పుత్త్రుడు. కుమారుఁడు బృహత్కాయుఁడు.

**బృహద్భక్షము** — (నక్షత్రములు భారతీయులు గుర్తించినవి చూడుఁడు)

**బృహద్బలుఁడు**- యదుసంతతి. చంద్ర వంశక్షత్త్రియుఁడగు వసుదేవుని సోదరుఁడగు దేవభాగుని రెండవపుత్త్రుఁ డొకఁడును, కశుని తమ్ముఁ డొకఁడును, శ్రీరామసుతుండగు కుశుని సంతతిలోని కడపటివాఁ డొకఁడును నీపేరు గల వాండ్రు ముగ్గురు గలరు. భారతయుద్ధమున కౌరవపక్షమున యుద్ధ మొనర్చి మొదటివాఁ డభిమన్యునిచే నిహతుఁ డైనవాఁడు.

**బృహద్భానుఁడు**- అంగదేశాధీశుఁడు. తండ్రి బృహద్రథుఁడు. కుమారుఁడు బృహన్మనసుఁడు.

**బృహన్నల లేక బృహన్నలుఁడు**— అజ్ఞాతవాసకాలమున పేడిగడ్డము వహించిన యర్జునుఁడు పెట్టుకొనిన పేరు.

**బృహన్నల**—(అజ్ఞాతపాండవులు చూ.)

**బృహన్మనసుఁడు**-అంగ దేశాధీశుఁడు. తండ్రి బృహద్భానుఁడు.

**బృహస్థలి (ఇంద్ర ప్రస్థము)** — (సామంతపంచకము చూడుఁడు).

**బృహస్పతి (చార్వాకుఁడు)** — చార్వాకమతకర్త. ఈతనినుండి చార్వాకమతమునకు "బృహస్పతిమత" మనియు నందురు. ఈతఁడు పరమేశ్వరు నంగీకరింపనివాఁడు. ఇంక నీమతమునకు దేహాత్మవాదిమత మని పేరుకూడ కలదు. ఈతఁడు దేవతాగురుండగు బృహస్పతి కాడనియు, వేఱు బృహస్పతి యనియుఁ దేలుచున్నది. (చారు = మనోహరమగు, వాక్ = వాక్కుగలవాఁడని యర్థము.)

**బృహస్పతి**—తండ్రి యాంగిరసమహర్షి. ఈతఁ డాంగీరసున కగ్నిత్వము గలిగినపిదప జనించినవాఁ డనియుఁ గూడ చెప్పఁబడుటచే నిశ్చయమేదో తెలియకున్నది.

ఈతనికి వాచస్పతియనియుఁ బేరు కలదు. దేవతలకుగురువు గానగురుండనియుఁ బేరుకలదు, బృహస్పతి నవగ్రహములలో నొక గ్రహము. భార్యపేరు తార. (ఈమె చంద్రునివలనబుధునిఁ గనెను). ఉతథ్యుఁడను సోదరుఁ డీబృహస్పతికిఁ గలఁడు. ఉతథ్యునిభార్యయగు మమతయం దీ బృహస్పతివలన భరద్వాజమహర్షి గల్గెను.

సహోదరి యోగసిద్ధి. ఆమె అష్టవసువులలో నొకఁడగు ప్రభావసునిభార్య. ఆమెకుమారుఁడు విశ్వకర్మ.

బృహస్పతికి తారవలన నాల్గురుపుత్రులును, నొక పుత్రికయుఁగల్గిరట. (చార్వాకుఁడుచూ.)

**బృహస్పతి**—(గురుఁడు చూడుఁడు).

**బ్రాతిలశిష్ట గోత్రము** — (వృద్ధికుల చూడుఁడు).

**బెంగలూరు (బెంగుళూరు)**— ఇది యిప్పటి మైసూరురాజ్యమునకుఁ బ్రభుత్వకార్యస్థానము. సముద్రపునీటిమట్టముపై మూఁడువేల యేండుగులయెత్తునసుంటచల్లగనుండి సమశీతోష్ణస్థానముగఁ జెప్పఁబడినది. వేసవియందుఁ బెక్కండ్రీనగరమున వసింప నేగుచుందురు. ఇరువది యైదు చతురపుమైళ్ల వైశాల్యముగల పట్టణము. మీన్ టెంపరేచరు (ప్రాస్పోట్ తెర్మామీటరు) ౭౨-౬౮ డిగ్రీలనియు, ఏవరేజి వర్షపాతము ౩౬ అంగుళములనియుఁ జెప్పఁబడినది.

శ్రీరంగపట్టణమునందుండిన యాంగ్ల పటాలము లట ననారోగ్య మధికమగుట బెంగుళూరునకు మార్చఁబడి, క్రీ. శ. ౧౮౦౯ లో బెంగుళూరు కంటోన్మెంటు స్థాపింపఁబడెను. ౧౮౮౧లో రాజ్యము మైసూరుమహారాజకుటుంబమున కిచ్చివేయఁబడినతఱి స్వప్రదేశము బ్రిటీషుప్రభుత్వమువారి కొసంగఁబడుట నిప్పుడు మైసూరు బ్రిటీషు రెసిడెంటుగారి పాలనక్రింద నున్నది. ఆయన కొడగుప్రధానకమీషనరు పదవిఁగూడ వహించి బెంగుళూరునందే వసించుచుండును. మఱియు ప్రభుత్వకార్యాలయములతోఁబాటు మైసూరు దివానుగారును ఇటనే వసించుచుందురు.

బెంగుళూరులేని తొల్లింటికాలమున స్వప్రాంత రాజ్య మేలుచుండిన హొయిసలవంశస్థుఁడగు వీరబల్లాళనృపతి యొక తరి వేటకుఁజని తన పరివారమునుండి వేరై తప్పిపోయి డస్సి యాకలిఁగొని యొక గుడిసెకడ కేగి తినుటకేమైననిమ్మని యడుగ నందలి వృద్ధురాలు తన యింటఁగల బటానీలను నీటనుడికించి గుగ్గిళ్లుగఁజేసి యిచ్చెనఁట. ఆనృపతి వాటిందిని మిగిలినవాటిని తన గుఱ్ఱమునకిడి ప్రాణముఁగలుపుకొని యారాత్రి యట నిదురించెనఁట. కన్నడమున బెంగ లన బటాణీలు గాన నాప్రదేశమునకుఁ బెంగలూరు సాంకేతికమయ్యెనఁట. పిదప యెలహంకలో నివసించుచు స్వప్రాంతరాజ్యమేలిన కెంపగౌడ నృపాలుఁడీతావున నొకపాటిగ్రామము నిర్మింపఁ జేసెనఁట. ఆతావిప్పుడు హేలబెంగుళూరనఁ (పూర్వపుబెంగుళూరు) బరఁగుచున్నది. అక్కాలమున నొక జ్యోతిషవేత్త యిదిమహానగరము కాఁగలదని రాజునకుఁదెల్పి కొన్ని హద్దుల స్తంభములు భూపతిచే నిర్మింపఁజేసెనఁట. అట్లే బెంగుళూరు పెరిగినదందురు.

బెంగుళూరుంగూర్చి మాత్రము దెల్పు తావునఁను మైసూరురాజ్యచరిత్ర వ్రాయుటకుఁ దావు లేకున్నను, బెంగుళూరుచరిత్ర మైసూరు రాజ్యచరిత్రయె యగును. కెంపగౌడనృపాలుఁడు క్రీ. శ. ౧౫౩౭ లో కట్టించిన కోట మట్టిది. దానిని పడద్రోసి క్రీ. శ. ౧౭౬౧లో హైదరాలీ యిప్పుడున్న రాతికోటం గట్టించెను. దానిప్లానులు ఫ్రెంచియింజనీయరులు వ్రాసిరట. దాని కక్ష్యాఁమున ఢిల్లీదర్వాజా యనియు మైసూరు దర్వాజా యనియు నుత్తర దక్షిణదిశలందు రెండు ద్వారములుండెనఁట. ఇప్పుడం దానాటి రాజనగరుయొక్క యొకమూల మాత్రము కలదు.

క్రీ. శ. ౧౬౩౮లో బిజాపూర్ సేనాని బెంగుళూరుం బటుకొని శివాజీమహారాజు బంధువుఁడగు షహాజీకి వశము జేసెనఁట. ఆతని సుతుఁడగు వెంకోజీ మైసూరుప్రభున కమ్మివేచెనఁట. ౧౭౫౮ లో బెంగుళూరు హైదరాలీ నవాబువశమాయెను. ౧౭౯౧లో కారన్వాలీసు ప్రభువుక్రింది బ్రిటీషుసైన్యములు బెంగుళూరుం బట్టుకొని కోట తాత్కాలిక సైన్యస్థానముగ జేసిరఁట. క్రీ. శ. ౧౭౯౯లో టిప్పుసుల్తాన్ మరణానంతరము బ్రిటీషువారిదిగనే యుండినది. మైసూరుప్రభుత్వమువారికి వశపరుపఁబడినది. బెంగుళూరునందుఁ గనఁదగిన వింతలు పెక్కుగలవు. కట్టడములందు మహారాజుగారిభవనము, దానితోటయుముఖ్యములు. లాల్ బాగుద్యానవనము వింతవింత వృక్షములు గలది. కబ్బన్పార్కునందు ప్రభుత్వోద్యోగభవనములుమొదలగు పెక్కుకట్టడములు కలవు. మహారాజుగారి రాజనగరు ఇంగ్లాండులోని విండ్సర్ కాసిలు పోలికం గట్టఁబడినది.

బెంగుళూరునందు చేతిపనులు మెండు. అనేకఫాక్టరీలు కలవు. కూరగాయలు, పండ్లు,

పూవులు సమృద్ధిగను చౌకగను దొరకును. రైల్వేలసంధిస్థానము.

**బెంజామిన్**—(Benjamin) హిబ్రూ పేరు. son of my right hand అని యర్థము. ఈపేరున జాకబురాచేలులు తమ పుత్రునిఁ బిలుచుచుండిరఁట. ఇందలి ముద్దు పేరులు Ben ; Benny ; యనునవి. పురుష నామము. (క్రైస్తవనామములు చూడుఁడు.)

**బెంజాయిన్**—(Benzoin) Styrax benzoin చెట్లకొమ్మలనుండి తీయఁబడిన బంక వంటి రసపదార్థము (అనగా గుగ్గిలమువంటి దని భావము.) దీనినుండి చేసిన 'బెంజాయిక్ ఆసిడ్' దగ్గువ్యాధులయందు కఫహరములగు మందులలో కలియును. ఇంక నూదారంగు జేయ నుపయోగింతురఁట.

**బెంట్లీ** (Bently)—లాటిన్‌పదము.దీవించబడిన యని యర్థము. పురుషనామము.

(క్రైస్తవనామములు చూడుఁడు.)

**బెండచెట్టు**—లా. Abelmoschusఅనియు, కొన్నిచోట్ల Hibiscus Esculentus. ఆంగ్ల.- The Edible Hibiscus అనియు Ladies fingers హిందీ. ఓక్రా.

బెండ పెద్దజాతి యనియు, చిన్నబెండయనియు ద్వివిధముగ నుండును. మఱియుఁ దెలుపు ధాతువుగల కాయలు, ఎరుపు ధాతువుఁ గల కాయలు, ఆకుపచ్చ ధాతువుగలకాయలుగాచు మూడు భేదజాతులుగ గూడ నున్నవి. బెండ కాయలందు నూగులేకుండ నుండిన నది శ్రేష్ఠ మగు జాతియనియు, నూగు విస్తారముండిన నది యధమపుజాతి యనియు నెన్నఁబడును. నూగధికముండినకాయయందు జిగటయు నెక్కువగ నుండును. అది బెండకాయయందు దోష మనియు, నపథ్యమనియు చెప్పఁబడినది. ఆబంక వాతమును,కఫము నుద్రేకించుననిచెప్పఁబడినది.

పొట్టిజాతియందు తెలుపు నాకుపచ్చరంగు కాయలం గాచుజాతి పూనా (మహారాష్ట్రదేశము) పరిసరముల విస్తారము పైరుచేయబడు చున్నది. దీని కాయలకు నూగుగాని కాయయందు జిగురుగాని గానఁబడదు. దీనిని మన దేశపువా రేడాకులబెండ యనెదరు. ఇది యత్యుత్తమజాతిగ నెన్నఁబడునది.

బెండ భోజనపదార్థము గాన బెండ కాయలు విలువంగల్గి యుండును. ఇందడవిజాతి కారుబెండ లేక యడవిబెండ యనునొకజాతి కల దది భోజనమున కనర్హమయ్యుఁ గొన్నిగుణములం గల్గియుండ నాయుర్వేదవైద్యు లుపయోగింతురఁట.

బెండగింజలు శరీరపుష్టి ధాతుపుష్టింగల్గించు ననియు, మేహశాంతింగల్గించు శాకము బెండకాయయనియు, నింద్రియనష్టమును నివారించు ననియు, బెండకాయను పుల్లని మజ్జిగతో నుడికించి వార్చిన బంకవెడలిపోయి దోషపరిహార మగుననియు, జీలకర్ర, పుల్లటిపెరుగు, మజ్జిగలు బెండకువిరుగుడులనియుజెప్పఁబడినది.

**బెండపూడి అన్నయమంత్రి**— కాకతీయ(త్రిలింగ)సామ్రాజ్యమునమంత్రిగనుండిన సుప్రసిద్ధుఁడు. కాశ్యపసగోత్రము. తండ్రి పోలయామాత్యుఁడు. కుమారుఁడును పోలయామాత్యుఁడే! వీరిశాసనములు కృష్ణామండలము లోని శ్రీకాకుళమున గలవు. ఈయనమనుమఁడును నన్నయామాత్యుఁడే! రాజమహేంద్రవరమున వీరభద్రారెడ్డి ప్రభునికడ మంత్రిగానుండి శ్రీనాథమహాకవివల్ల భీమఖండము గృతి నందినవాఁడు. వీరు శైవులని చెప్పంబడియున్నారు. (త్రిలింగకాకతీయ సామ్రాజ్యము చూడుఁడు.)

## బెండపూడి అన్నమంత్రి వంశవృక్షము.

కాశ్యపస గోత్రము.




ఇతడు అల్లాడ వేమారెడ్డిచేత తెలుగు దేశమేలించెను. ప్రతాపవేమరాజువలన చోడవరము నగ్రహారముగా బడసెను. ఈ చోడవరము గోదావరీ మండలము లోనిబోడసకుర్రువద్ద నున్నది.

**బెంథామిజమ్** (Benthamism)—"మానవ జన్మముయొక్క ప్రయత్నపరిణామములు సౌఖ్యముగాని యన్యము కానేర"దను సిద్ధాంతము. భోగము, బాధలు లేకుండుటల యొక్క పరిణామ మింతయేయని యీమతనిశ్చయము. ఇతరులకొఱకుఁ దానొనర్చిన యుపకారవితతి యిప్పుడు సత్ఫలిత మొసంగునందురు.

ఈ కళను Jeremy Bentham మహాత్ముఁడు రచించెను. గాన నేటికిని నాతనిపేరఁ బరఁగుచున్నది.

Jeremy Bentham అను తత్వవేత్త క్రీ.వె. 1748—1832 కాలమున జీవించియుండినవాఁడు. ఈతని తండ్రి లండనునగరమున నటర్నీగానుండెను. ఈతఁడు బారిష్టరు- న్యాయవాది. (Lincon's Innకు చెందినవాఁడు). ఈతఁడు ధర్మశాస్త్రము, ప్రభుత్వవిధానములు, శిక్షలు గూర్చి విస్తారముగ వ్రాసియున్నాఁడు. లిబరలు, రేడికల్ పార్టీల కక్షలవారీతని మిక్కిలిగౌరవింతురు. Utility సిద్ధాంతము నుపపాదించెను. వేదనలందు దూరముగనుం

చుట, అనుభవించుట యనునవి మానవధర్మములని యీతనిమతము. ఈసిద్ధాంతి (కళ) మాతనిపేర నేటికిని బరగెడిని.

**బెక్టేరియా**—(అంటువ్యాధులు చూ.)

**బెగర్ ఆన్ హార్సుబేక్**—Put a beggar on horse back, and he will ride to the devil. అధముల కనర్హములగు సావకాశములొసంగిన తమకే గాక నితరులకుఁ గూడ నపాయకర మగుదు రనుట కీయుక్తిని వాడుచున్నారు. స్కాట్లాండు దేశమున Messengers నేర్పాటు చేయునప్పుడు 'Blue gowns' అను వాడుకపేరుగల licensed beggers ను దేశభక్తు లేర్పాటుచేసిరఁట. వారు గుర్రముల నెక్కినతోడనె యపాయకరులై బందిప ట్లారంభమాయెనఁట.

**బెచుఆనాలాండు**—దక్షిణాఫ్రికాయం దున్న బ్రిటీషుప్రొటక్టరేటు టెరిటరీ. ఉత్తరమున జాంబీసీవఱకు వ్యాపించియున్న దేశము. ౨౧3000 చతురపుమైళ్ళ వైశాల్యముగలది. వ్యవసాయ దేశము. అనేకమందిసామంతరాజుల పరిపాలనభాగములుగ నున్నది. వీరిని ఒకబ్రిటీషు రెసిడెంటుకమీషనరు అధికారముక్రింద నుంచియున్నారు. (దక్షిణఆఫ్రికా చూడుఁడు)

**బెజవాడ (తొల్లింటివిజయవాడ)**—ఆన్ధ్రదేశమందలి పట్టణము. కృష్ణానదీతీరము. అర్జునుఁడిట తపఁబొనర్పుటంజేసి యీపేరందినదని ప్రతీతి కలదు. విజయవాడ రానురాను బెజవాడగా మారెనఁట. కనకదుర్గ పర్వతము దరి నుండినది. పట్టణముంజుట్టియు, నూరుమధ్యను కొండలుండుటచే చాల వేడియైనస్థలముగ నుండును. కృష్ణానదికాల్వల మొగనుండుటయు గొప్ప యినుపదారులుకలియు తావగుటయు పంటలప్రదేశ మగుటయు వర్తకవ్యాపారము బలముగగలపట్టణము. ఇట కృష్ణానది కడ్డముగ నానకట్ట కట్టంబడి యున్నది. ఇది క్రీ. వె. ౧౮౫౫లో ముగింపఁబడినది.

పశ్చిమభాగమున కొండపైఁగల కనకదుర్గ దేవాలయము ప్రసిద్ధమైనది. కృష్ణానదిపై కట్టఁబడిన రెయిల్వేవంతెన చూడఁదగినది. కనకదుర్గాదేవస్థానమున్నగిరి కింద్రకీలాద్రి యని పేరు. ఇట యింద్రుఁడర్జునుఁ డొకప్పుడు తప మొనర్చెనఁట. కొండపల్లిదుర్గమిటకుఁబదిమైళ్ళదూరము. ఇది రెయిల్వేల కూడలిస్థలము.

**బెడెల్లోమీటరు**—జలగను శరీరమునకు పట్టించు (రక్తపరిశీలన- రక్తవైద్యము) నొక పరికరము. ఇది యెంతరక్తమును త్రాగినదో తెలుపుపరికరము. ఇది Bedellometer అనఁబడుచున్నది.

**బెడ్-గర్భప్రదేశము** (Bed)- Bed of a river, Tank etc. నది, చెఱువు, మొదలగువాని అడుగుభాగము. (Rivers చూడుఁడు.)

**బెడ్లాండ్సు** (Bad lands) — దీనికి పనికిరానిభూములని యర్థము. కొండలోవల చివరను, కొండల దిగువను, సముద్రప్రాంతమందును, మొదలగుతావులం దనగామెత్తని యెర్రమన్ను వర్షములకుఁ గరగి దిగి మెరకప్రదేశముగ నేర్పడియుఁ దిరుగ నావర్షపుజలములు వాటిపైఁ బ్రవహింప మెత్తనిమన్నగుట నెంతచిన్నప్రవాహముచేతనైనను కోయఁబడి గండ్లై యెందునకు నిరర్థకములై నిలచియున్న భూముల కీపేరు వాడెదరు. వీట్లపై చెట్టుచేమ లుండుట చాల యరుదు. ఇందు వసించుటకు జంతువులకు వీలు కాదు. వ్యవసాయములకుఁ గాని గృహనిర్మాణములకుఁగాని యీభూములు నిరర్థకములు.

ఈ పేరు తొలుత దక్షిణడెకోటాయందు ముత్పన్నమై పిదప నన్ని దేశములందలి యిట్టి నిరర్థకభూములకును వ్యాపించెను.

**బెడోయిన్ తెగవారు** — వీ రాదినరబ్బులు. అరేబియామధ్యనున్న కొండలప్రదేశము మొదలు సముద్రతీరము దనుక సీజిప్టు దేశపు యెడారిప్రాంతములను, ఇంక నిట్టివియె యగు నెడారులంబోలు నిరర్థకభూములందు నను, గుడారములలో వసించుచు మేకలను, గొఱ్ఱెలను, లొట్టిపిట్టలను, గుఱ్ఱములను మేపుకొనుచుండువారు. వీరికి స్థిరనివాసమున కిండ్లుండవు. వ్యవసాయము మొదలగు పనులం జేయనొల్లరు. శూరులు, స్వతంత్రప్రియు లనియు, కలహమునకు వెనుదీయ రనియు పేరందినవారు.

వీరిని జంపం బ్రయత్నించిన వైరియైనను వీరి గుడారమునకుం జేరి దాని త్రాటింబట్టుకొనిన వానినిరక్షించుట పరమపవిత్రమగు విధిగా నెంచునాచారము కలదు. తనప్రాణము నైన నట్టి శరణుజొచ్చినవారిని రక్షించుటయందుం గోల్పోవుటకు వెనుదీయరు. ఇర్వు రేకకాలమునం దొకచో నుప్పుకణములందినుట యిర్వురి ప్రాణమైత్రిని విధించు ననుబంధమునకుం గారణమగును. అట్టివా రాజన్మాంతము మిత్రులై యుండువిధి కలదందురు. వీరియందుం బెండ్లికూంతుండ్రను వివాహమునకుం గొంపోవుతరిం జెలికత్తెలు నీకాగలభర్త గొప్పగుఱ్ఱపురౌతనియు, తనవైరులం దునుమాడువాం డనియు, నెల్లర కాతిథ్యమిచ్చు దాతయనియు నీయనుంగుచెలికాండు అబుజయ్యాద్ అల్లాలాలీ యనియు, పొచ్చగించుచు, నీ వింక గర్వముగ నడువుమని పాటలంబాడుదురు. గాన నివి వారి కర్తవ్యలక్షణములని తెలిసెడిని. బెడోయిన్పదము అరబ్బీభాషాపదము.

బెడోయినులు గొప్ప గుఱ్ఱపుస్వారులని పేరందినవారు. వీరిమకామములందు లొట్టిపిటపాలు త్రాగుటకును కాఫీకషాయములోనను వాడుచుందురు. ఈటెలనాయుధములుగ ధరించువారు. ఇక్కాలమునం దుపాకులు రివాల్వరులు గూడ వీరియాయుధములైనవి. మహమ్మదీయులలో నితరతెగలకన్న తా మగ్రశ్రేష్ఠుల మని గర్వముగ ననుచుందురు. బైబిలునందు వివరింపంబడిన ఇస్మాయేలుమహాత్ముండువీరిమూలపురుషుడంట.

**బెతెల్‌హెమ్ యాత్రాస్థలము** — ఇది పాలస్తీనా దేశమున ప్రభువగు యేసుక్రీస్తు జన్మస్థానముగ పేరందినతావు. జన్మస్థానమని చూపుతావున ననేకశాఖల క్రీస్తుమతస్థులకు వేర్వేరు క్రైస్తవదేవాలయము లొకేతావునం గలవు. జరూసలేమునగరమున కైదుమైళ్ళదూరము. ఇచ్చటి దేవస్థానము హెలీనాచక్రవర్తిని కట్టినదందురు.

బెతెల్‌హేమునం దున్న క్రైస్తవచర్చి ప్రపంచకపురాతనపుచర్చిగం జెప్పంబడుచున్నది. క్రైస్తవులకు యాత్రాస్థలమై యున్నది. ఇచటి కేడుమైళ్ళదూరమునం గల బెయిటన్‌గ్రామము (ఎల్లాలోయిఎల్బెతేల్)న తొల్లింట నబ్రహాము ప్రవక్త డేరావేసి బలియొసంగినతా వందురు. ఇటనె యాకోబు బైబిలునందు సుప్రసిద్ధ స్వప్నముం గనెనంట. దానికే ;అబ్రహాము ప్రవక్త ఎల్లాలోయిఎల్బెతే లనిపేరిడెనంట. దానికి హిబ్రూభాషయందు దైవగృహమని యర్థమంట.

**బెనిడెక్టు లేక బెన్నెట్** (Benedect or Bennet)— లాటిన్ నామము. దీవించంబడిన యని యర్థము. పురుషనామము.(క్రైస్తవనామములు చూడుడు.)

**బెనిఫిట్ ఆఫ్ క్లర్జి** (Benifit of clergy)- తొల్లింటికాలమున పాదిరీల కైహిక

దోషకరములగు నేరములకు శిక్ష లేకుండు నేర్పా టుండెనట. దానికీపే రుండెనట. ఇప్పుడా సావకాశము తప్పింపఁబడినది. కాని వాడుక యందా పేరు సామెతగా నిలచియున్నది.

**బెనిఫిషియల్ ఇంటరెస్టు** (Benificial interest)—వాణిజ్య సంబంధపరిభాషా పదము. ఒకభూమిఁ గుదువయుంచి యప్పుఁ బుచ్చుకొనినతోఁడనే యాకుదువయాస్తి యప్పిచ్చినవానిదై యుండునని పద్ధతిమేరకుఁ జెప్ప వలయును. అట్లయ్యును నస్వాధీనపుఁగుదువ యగుతరి నప్పుఁబుచ్చుకొనినవారి వశమందే యుండుఁ గాన నేటేట దానినుండివచ్చు నాదాయము నప్పుబుచ్చుకొనినయాతఁడే యనుభవించుచుండును. ఆయాదాయమునకు benificial interest అనిపేరు.

**బెయికాల్సరస్సు**—ఆసియాఖండమున సైబేరియాదేశమున నిర్కుట్సుక్ పురముకడ నున్న పుణ్యతీర్థము.

**బెయిల్మెంటు** (Bailment)—వాణిజ్య సంబంధపరిభాషాపదము. తననరకుల నొకరికి బదులిచ్చుట, హామీనిమిత్తమిచ్చుట, యద్దెకిచ్చుట, యితరతావులం జేర్చుట కప్పగించుట, మరమ్మతు, మార్పులనిమిత్తమిచ్చుట మొదలగు ప్రత్యేకపుపనికిఁగా నప్పగించుట యని యర్థము. ఇందప్పగించునాతఁడు Bailor అనియు నప్పగించుకొనునాతఁడు Bailee యనియు పేర్లుకల్గియుందురు. ఇట్టితరి తిరిగి యప్పగించు వరకు Bailee, Bailor నకు బూచీగానుండెడిని.

**బెర్బర స్టేట్సు** (Barbary states)—ఇది భరతదేశమునందలి బర్బర (తొల్లింటి దేశము) దేశము కాదు. ఆఫ్రికాయందలి యీజిప్టుదేశము మొదలట్లాంటిక్కు మహాసముద్రముదనుకను మధ్యధరా సముద్రము మొదలు సహారాయెడారిదనుకను వ్యాపించి యున్న దేశమునకు బెర్బరదేశమని తొల్లి పేరుండెను. అది యిక్కాలమున మూఁడుస్టేట్సుగ చీలియున్నది. అవి ట్రిపోలీ తూర్పునను, మధ్యభాగమునందు ట్యూనిస్, ఆల్జీరియా స్టేటులును, పశ్చిమమున మొరాకోదేశమును ముఖ్యములు. ఇంకనుఁ గొన్ని చిల్లరస్టేటులు గలవు. కాని యవి ప్రాముఖ్యమైనవి కావు. బెర్బరులను జాతిప్రజలచే నివసింపఁబడుటబెర్బరదేశ మనఁబరగెను. వీరు మహమ్మదీయ మతస్థులు. ఈదేశము నరబ్బులు ఎల్మోఘ్రెబ్ (అనఁగా పశ్చిమము) యనెదరు.

ఆఫ్రికాఖండముయొక్క యుత్తరభాగమాది కాలమునందు తూర్పుభాగమున లైబ్యాదేశమునను, పశ్చిమమున మౌరిటానియాదేశమునను, నడుమ నాఫ్రికానూమిడియాదేశమునను వాడఁబడుచుండెను. అందు ఫినీసియనులనాటి పురాతనపుదగు కార్తేజినగరముండెను. దానిని వారు క్రీ.ము. ౮౮౦ సంవత్సరములనాడు నిర్మించిరని తేలుచున్నది. దానిని రోమనులు క్రీ.ము. ౪౬లో జయించి యాక్రమించిరఁట. వారినుండి గ్రీకులు కొంతకాలము వశపఱచుకొనిరి. క్రీస్తువెనుక నేడవశతాబ్దమున నాఖరుభాగమున గ్రీకుల నోడించి నరాసినులాక్రమించిరి. పిదపను మార్పులుకల్గి పైవివరింపఁబడిన మూఁడుభాగములుగ నిలచియున్నది.

మూఁడుదేశములు కలసిన బెర్బరదేశమునఁ బశ్చిమసముద్రతీరమున టెల్ అనుపేరుగల మిగుల ఫలవంతమగు భూభాగ మొకటియు, అట్లాసుపర్వతపంక్తిగల మధ్య సమతలభాగమును (ఇది యుత్తరమున నట్లాంటిక్కుమహాసముద్రము మొదలు కేప్ బాన్ అగ్రమువరకుం

గలదు.) దక్షిణమున సహారాయెడారివైపున నేటవాలుగల యిసుకప్రదేశమును, మూఁడు భేదములుగఁ గాననగును. ఇందు పెద్దనదులు లేనేలేవు. అట్లాసుపర్వతములందు నీటివసతి చక్కగాఁగలిగి ఫలవంతములగు లోయలు బెక్కు గలవు. కొండసెలయేరులుఁ గొన్ని కలవుగాని యవి వేసవియం దెండిపోవునవియె! పెద్దయెడారి వేఁడిగాడుపుల కాస్పదమైన తూర్పుభాగములు వేఁడిగానుండునవియె. సముద్రతీరములు కొంత వేడి తగ్గి యుండునవి.

గోధుమలు, బార్లీధాన్యము, జొన్నలు, పొగాకు, ప్రత్తి విశేషముగఁ బైరగుచున్నవి. ఖర్జూరఁపుఁదోటలు, నాలివ్ తోటలు, నారింజ తోటలు విస్తారముగ ఫలించుచున్నవి. ఖర్జూరఁపుఁదోట లిసుకప్రదేశములందు నిండియుంట నట్లాసు పర్వతపంక్తినుండి సహారాయెడారి వఱకుఁగల సీమను బెలెద్జెరీదని (ఖర్జూరపు సీమ) వాడుచుందురు.

గుఱ్ఱములు చాల ప్రశస్తమైన జాతివి. గొఱ్ఱెలు చాలనాణ్యమైన యున్నిని సమృద్ధిగ నిచ్చుజాతివి. సింహములు, సివంగులు మొదలగు మృగములును నడవులందుఁగలవు. గనులందు రాగి,యినుము, సైంధవలవణము దొరకుచున్నవి. పగడములు, స్పంజిదినుసులు సముద్రములందు దొరకుచున్నవి. తివాసీల నేతపరిశ్రమయు, తోళ్ళకు ప్రశస్తమగుపదునిడుచుంటయు చేతి పరిశ్రమలుగ చక్కగ వ్యాపించియున్నవి. పెద్దయూళ్ళందు, పట్టణములందు, మూరులును (తొల్లింటి అరబ్బులసంతతియే) బెర్బరులును, (వీరిని కబ్బాలీయులనియు నందురు) నాదిమ నివాసులగు ప్రజలును, బెడోయినరబ్బులును వారిమామూలుమేరకు తిరుగుచునే గుడారములందు నివసించుచుందురు. యూదులధికసంఖ్యాకులు కలరు. వారు ధనికులైయున్నవర్తకులకు వడ్డి కప్పిచ్చువారును నైయున్నారు. వీరు క్రీ. వె. ౧౫ వ శతాబ్దాంతకాలమున స్పానియా, పోర్చుగీసు దేశములనుండి వెడలఁగొట్టఁబడిన వారి సంతతివారు. అరబ్బీభాష దేశభాషయై యున్నది. బెర్బరు లింతుక భేదముగల బెర్బర భాషనుగూడ మాట్లాడుచుందురు.

**బెర్టిలన్ సిస్టమ్** (Bertillon system) ఇది నేరస్థులను పోల్చుటకైన శాస్త్రము, లేక పద్ధతి. Bertillon Alphonse అను ఫ్రెంచి దేశస్థుఁడు (క్రీ. వె. ౧౮౫౩-౧౯౧౪) ఫ్రాన్సు దేశపు క్రిమినాలోజీ (Criminology) లో పండితుఁడు. తండ్రిపేరు Louis Adolphe Bertillon. పారిస్ నగరమునజనించెను. తండ్రి కాలము ౧౮౨౧-౧౮౮౩ అని చెప్పఁబడినది. బాలుండగు నల్ఫాన్సి పారిస్ నగరపుఁ బోలీసు కొల్వునందుఁజేరి నేరస్థులం బోల్చునుద్యోగులలో పెద్దయై యీవిధానముఁగనిపెట్టెనఁట.

ఫ్రెంచిప్రభుత్వము క్రీ. వె. ౧౮౭౯ లో నీపద్ధతి నవలంబింప నుత్తరవు లొసంగెను. క్రీ. వె. ౧౯౧౪ ఫిబ్రవరి ౧౩ తేదీని ఆయన మృతినందెను.

ఈయన పద్ధతియం దెముక లాధారమై యున్న శరీరభాగములందు కొలచుటయు (ఏలయన నెముకలు యౌవనమువచ్చినపిదప నెదుగుటకాని క్షీణించి తగ్గిపోవుటగానిజరుగనేరదు) మొదలగు కొన్ని సాధనములు కలవు. అవి పత్రములందు వివరించుట మనదేశపు వ్రేలిముద్రవేయుటవలెనే పోల్కినిజాయితి నెఱుఁగుటకు వీలగునని చెప్పఁబడినది.

బ్రిటిషుసీమయందు వ్రేలిముద్రలువేయించుట నారంభించి బెర్టిలన్ సిస్టము కొలతలు వ్రాయుచుండుట మానివేయఁబడినది.

**బెర్నీస్-ఓబర్లాండు**— (స్విజర్లాండు దేశము చూడుఁడు.)

**బెర్ముడాద్వీపములు** (Bermudas isles)—అట్లాంటిక్కు మహాసముద్రమందలి ద్వీపములు ౩౬౦. ఇందు ౨౦ నివాసయోగ్యములుగ నున్నవి. అన్నియుంగల్పి ౧౯ చతురపుమైళ్ల వైశాల్యము. వీటియందు ప్రశస్తమైన హార్బరు (రేవుస్థలము) కలదు. ఇది Naval Station అయియున్నది. ప్రశస్తమైన తోటలు వేయఁబడినవి. Mr. Spaniard Juan Bermudez అనువానివలనఁ బదునాఱవశతాబ్ద ప్రారంభమున కనుంగొనఁబడి పేరందినవి.

**బెర్జెలియస్** (Berzelius) — Jons Jakob Berzelius స్వీడన్ దేశపు బారన్ రసాయనశాస్త్రపండితుఁడై యుండెను. క్రీ.శ. ౧౭౭౯ ఆగస్టు ౨౯ తేదీని జన్మించినవాఁడు. జన్మస్థలము Vafriersund అను పేరుగల గ్రామము. ఇది Linkoping పురముకడ నున్నది. క్రీ.శ. ౧౮౦౭ లో స్టాక్హామ్ యూనివర్సిటీ ప్రొఫెసరుపదవినంది, పదిసంవత్సరములు గొప్ప కృషిపరిశీలనలుసల్పి, రెండువేలకు పైఁగా రసాయనపదార్థములు Atomic and molecular weights కనుఁగొని వ్రాసెను. రసాయన భూతపదార్థముల (Chemical elements)కు గుర్తుల (Symbols) నేర్పఱిచినవాఁడు. ఇంక నీనుహానీయుఁడే Selenium అనుపదార్థమును, Selenic acid అను పదార్థమును, Cerium అనుదానిని Thorium అను దానిని గనుంగొనినవాఁడు.

ఈతఁడు క్రీ. శ. ౧౮౪౮ ఆగస్టు 7 న మృతినొందెనఁట.

**బెల్లాడ్ గానము** (Ballade)— ఇది యాదిని ఫ్రాన్సుదేశమునందుమాత్ర ముండె నందుట. ఇందు నాల్గు stanzas ఉండెడిని. మొదటిమూఁటియందు ఏడుకేక యెన్మిదిపంక్తు లుండును. అనఁగా నొక్కొక్క stanza యం దనిభావము. వీటన్నింటికి refrain (అంత్యనీమము) సాముదాయికమే. ఇందు stanza యన భరతదేశపుఁ బాటలందలి చరణముం బోలినదని యెఱుంగునది.

**బెలియారిక్కు ద్వీపములు** (Balearic Islands)— మధ్యధరాసముద్రమునందలి ద్వీపములు. స్పానియా దేశపుఁ బ్రాంతమునంగల నాల్గుపెద్దవి, ఏడుచిన్నవి ద్వీపములు. స్పానియా దేశమునకుం జెందినవి. సైన్యస్థానములుగ నున్నవి. ౧౯౩౬ చతురపుమైళ్ల వైశాల్యముగలవి.

ఇందు మజోరియాద్వీపము పెద్దది. మినోరియా, వెలిజా, ఫోర్మెన్టిరా, క్రెబ్రీరా యనునవిందలి యితరద్వీపములు. తక్కినయాఱును రాతిప్రదేశములై నివాసార్హములుగావు. పాల్మా పట్టణ మిందు ప్రధానపురము. ఇందు సైన్యములంగల్పుకొని మూఁడులక్షల యేఁబదివేలకుఁ బైగా జనులుందురని తెలియుచున్నది.

**బెలూచిస్థాన దేశము** (**బాలోక్ష దేశము**)— ఆసియాఖండమున నాఫ్ఘనుస్థానమునకు నరేబియాసముద్రమునకు నడుమనున్న దేశము. (అఫ్ఘనుస్థానము, బాలోక్షు దేశము, బ్రిటీషుబెలూచిస్థానము చూడుఁడు). ౧౩౦౦౦౦ చతురపుమైళ్లు వైశాల్యముగలది. మనుష్యులు చాల తక్కువ. మైలున కెనమండ్రు వసించుచున్నారని లెక్కింపఁబడినది. దేశము కొండలు, లోవలు, ఎడారుల మయమైనది. ఇందు కొంత భాగ మిండియాదేశపు రక్షణనిమిత్త మాక్రమించియున్నారు. దానికి బ్రిటీషుబెలూచిస్థానమనిపేరు. దాని కినుపబాట కలుపఁబడి సైన్యములతావులుగ నున్నది.

బెలూచిస్థానముయొక్క పశ్చిమ భాగము నన్నని యెట్టియిసుకబయలుగ నున్నది. ఇది గాలికి కెరటములవలెఁ బైకిలేచి విరుగఁబడుచుం డుట చూడఁదగిన వింతగనుండును. ఈశాన్యది క్ప్రదేశములు పీఠభూములు. వానినెక్కు మార్గమునకు బోలాన్పాసనిపేరు. అదిభరతదేశము నుండి బెలుచిస్థానమునకేగుమార్గమై యున్నది. ప్రజలు బెలూచీతెగవారును, బ్రాహూయి తెగవారును నగు పఠాను మహమ్మదీయులు. అపాయకరులని చెప్పఁబడినవారు.

కెలాత్పురము ప్రధానస్థానము. ప్రభువగు ఖానుగారిరాజధాని. ఇది సముద్రపు నీటిమట్టముపై ౫౦౦౦ యడుగులయెత్తున పీఠభూమి యందున్నది.

**బెల్జియమ్ దేశము**—ఐరోపాఖండము లోని దేశము. చాల చిన్నరాజ్యము. వైశాల్యము ౧౧౪౦౦ చతురపు మైళ్లు. సముద్రతీరమున నిసుకకొండలును, లోన సమతలప్రదేశమును గలవు. సముద్రతీర మించుమించంతయు హాలండునందువలె గట్టుచే నాపఁబడినది. ఆగట్టునకు Digues-de-mer అనిపేరు. ఇట్టివి దేశముపొడవునను సముద్రతీరమునఁ గలవు. అం దాస్టెండుకడ నున్నది తొమ్మిదిమైళ్ళ పొడవున ఱక్కగ నిర్మింపఁబడినది. వేసవియం దివి జనులతో కదలిక గల్గియుండి శీతకాలమున సముద్ర కెరటములదయకు, సుడిగాలులయధికారమునకు వదలివేయఁబడుచుండును. దేశము యొక్క యీభాగమునకు Dunes అనిపేరు.

ఇసుక, డ్యూన్సు, దాటి లోని (పశ్చిమమున) కేగఁగనే సమతలప్రదేశముకలదు. దేశమున ముఖ్యములగు నదులు మేస్ నదియును, షెల్టునదియునై యున్నవి. దేశమున రాతిస బొగ్గు,ఇనుము సమృద్ధిగ దొరకుట నినుపపనులు విస్తారముగజరగుచుండును. అడవులున్న తావులు దిట్టముగఁ గలవు. వ్యవసాయము మంచిస్థితి యందున్నది. వ్యవసాయప్రదేశమునకు ఫ్లెమిష్ కంట్రీ యనుపేరు వాడుచున్నారు. ఈ ప్రాంతముల వసించుప్రజలకు ఫ్లెమింగ్సనిపేరు. వారు జర్మనుదేశస్థుల సంతతివారు. ధాన్యములు, పొగాకు, గోధుమలు, నారదినుసులు, ద్రాక్షలు నపరిమితముగఁ బైరుచేయఁబడుచున్నవి. దేశము చిన్నది; జనబాహుళ్య మధికముగాఁ గలది. చతురపు మైలునకు ౫౮౯ మంది జనులు వసించుచున్నారని లెక్కింపఁబడినది గాన బెల్జియము దేశమున పట్టణములధికముగా నుండుట యబ్బురముగానేరదు. దేశమునఁగల ప్రజలలో ఫ్లెమింగ్సుతరువాతివారు Walloons అనఁబడువారు. వీరు ఫ్రెంచిప్రజల సంతతి. కాని యీ దేశపు టాదిమనివాసులు Belgae జాతివారు. వారినుండియె దేశమునకుఁ బేరు గల్గెనఁట.

ఫ్లాండర్సుదేశ మంతటను పొడవగుకాల్వలు దగ్గరదగ్గరగా గలవు. కాల్వలదరినే బాటలు వేయఁబడియున్నవి. ఈబాటల కొక ప్రక్కను బైసికిల్సునడుచుబాటలు కలవు. పొలములందు బంగాళాదుంపలు,టర్నిప్పుదుంపలువిస్తారముగఁ బైరగుచున్నవి. గోగ్రాసపుభూమి సమృద్ధిగా నుంట పశుసమృద్ధియుఁ గలదు.

Coxyde అనుగ్రామము సముద్రముదరి నిసుకప్రదేశమునఁ గలదు. అందు వసించుప్రజలందఱు చేపలంబట్టువారే. వారు గుఱ్ఱముపై నెక్కి సముద్రమునీటియందుఁ జొచ్చి అట్టె చేపలంబట్టుచుందురు. గుఱ్ఱములపైనుండి దిగరు. దేశమున త్రాగుడధికము. ఎంతచిన్నగ్రామమందైనను పది సారాదుకాణములకు తక్కువయుండవు. కొంచెము సొమ్ము పన్నుచెల్లించి లైసెన్సు తీసికొనినవా రందరు సారా దుకాణములు (Public houses) పెట్టవచ్చునఁట. ఇందుకు

సాయము బీరుసారాయము చాల చౌకగ లభించెడిని. ఆదివారములందు త్రాగుడధికము. సోమవారములందు కూలినాలులఁ జేయువారు పనికిదొరకరు. పనిలోనికి రారు.

బెల్జియమునందు ప్రయాణములుచాలచౌక. "Mr. Thackeray" యను గ్రంథకర్త తన "Vanity fair" అనుగ్రంథమున నొక ఆంగ్ల దేశస్థుఁడొకవారముదినములు విశ్రాంతిగైకొన బెల్జియం దేశమున కరిగి, యోడలందుప్రయాణ ములుప, నందొసంగుభోజనము మిగుల రుచ్య మైనదగుట నాతఁడు దానిని వదలలేక ఆపడవ లందే యెగువకు దిగువకు పయనములొనర్చుచు నుండిపోయెననియు, రైల్వే వేయఁబడినతోడనే పడవలకడసబురున నీటంబడి మున్గిపోయెననియు వ్రాసియున్నాఁడు. ఈ దేశమునందుఁ గూడ హాలండునందు వలెనే రైల్వేలు మనుష్యుల ప్రయాణములకును,కాలువ పడవలు సరకులకును నుపయోగించు చున్నారు. సైకిల్బండ్ల యుప యోగ మీ దేశమునం దెక్కువగా నున్నది. సముద్రతీరమున స్నానములొనర్ప నేర్పాట్లు కలవు. ఒక్కొక్కనా డనుకూలపరిస్థితులు కల్గు కతన రోజున కేమవేలమంది స్నానముల నా స్టేండువద్ద చేతురఁట. లీనెన్బట్టలు, ఉన్నిబట్టలు, నూలుబట్టలు విస్తారము నేయఁబడుసంస్థలుకలవు. దేశమంతటను ప్రజలప్రయాణముల కనుపబాట లున్నవి. వర్తకపుసరకుల నిటునటుఁ జేర్ప కాలు వలు, పడవలు విస్తారము కలవు.

దేశమున లిమిటెడ్ మోనార్కీప రిపాలన. భూపాలునకు నివాసము రాజధానియగు బ్రస్సె ల్సునగరము. ఈ దేశచరిత్రనెఱుంగని పెక్కం డ్రితలంచునటుల నిది యిటీవల నేర్పఱుపఁ బడినతటస్థరాజ్యముమాత్ర(Neutral Kingdom) మని తలంపరాదు. ఇది చిన్నరాజ్యమై నను గొప్పచరిత్రగల రాజ్యము. పిట్ట కొంచె మైనను కూత ఘనముననుటుల నీదేశస్థులు చేయుచేతిపనులను నధికమువైయచ్చెరువుగొలి పెడిని. బెల్జియము దేశముంగూర్చి తెల్పునంద ర్భమున ననేకకడగండ్లనంది ధైర్యము, పట్టు దల వీడక నిలచి యెట్టకేలకు నేసంబంధము లేని యన్యుల యచ్చెరువునకుఁ బాత్రమై తమ స్వశక్తి చాలకున్నను నన్యరాష్ట్రములచే నొక ప్రత్యేకరాష్ట్రముగ నేర్పఱుపఁబడి స్వేచ్ఛా స్వాతంత్ర్యముల ననుభవించుచు కష్టపడుచు ద్రవ్యార్జనమొనర్చుచు తమలో నన్యోన్యాస హానదుశ్చరిత్రలు తలంపక మతద్వేషములను జాతిద్వేషములను ఆత్మనాశనకరములుగ నెరింగి ప్రవర్తించుచున్న బెల్జియం దేశ ప్రజలచరిత్ర మిచట వివరించుట మాగ్రంధమునకు సమం జసము కాకపోదు. అట్లయ్యును ఆంధ్రవిజ్ఞానము కేవలచరిత్రగ్రంథము కాకపోవుటంజేసి వీలగు నంత క్లుప్తముగ వివరించుట యర్హము. సంవ త్సరములం దెల్పుచుంట చరిత్రయందు కథకు హాస్తులవంటిదై ప్రధానజ్ఞాన మిచ్చునదైనను నీచరిత్రయందు భేదములుగల మూఁడునాల్గు దేశములందలిచరిత్రల సంవత్సరములం దెల్పు చుంట చదువరులకు సుబోధక మగుచున్నను కలఁత, గాబరా, చికాకులఁగల్గించునని వెఱచి సంవత్సరములు దెలుపుట మాని చరిత్రకథన ముం దెల్పుటయె యీగ్రంథమునకు సమంజస మని తలంపనైనది.

ఆదికాలమున నీబెల్జియముచిన్నచిన్నసంస్థా నములుగ నుండి డ్యూకు-కౌంటు-బేరన్-లార్డు- బిషపు-భూపతి మొదలగు బిరుదనామములం ధరించిన చిన్నచిన్న భూపతులపాలనలం దుం డుటతో చరిత్ర ప్రారంభమగుచున్నది. అంతకు పూర్వచరిత్రలు తెలియకున్నవి. సాదృశ్యము లుగ బ్రాబంటు-డ్యూకులు-ఫ్లాండర్సు కౌం టులు-నామూరుకౌంటులు-మెలినీస్ ప్రభువులు-

లీజి-బిషప్‌భూపతులు మొదలగువారు తమ తమ భూములం బాలించుకొనుచు, శాంతిగాని యుద్ధముగాని వర్తకసంబంధముగాని సంధిపత్రములమూలమున నెరపుకొనుచుండువారు. వీటియందు ముఖ్యముగఁ జెప్పఁదగినది ఫ్లాండర్సు నందు ఘెంటు, బ్రూజెస్. యీ ప్రెస్ మొదలగు పట్టణములందు చేతిపనులు, వర్తకము నధికమగుట నొక్కొక్క తెగ వృత్తివ్యాపారముగల వారొక కూటముగ నేర్పడి యైక్యతఁ గల్గి బలవంతులై యుండిరి. ఈపద్ధతులే వారియందు స్వేచ్ఛాస్వాతంత్ర్యస్థానములును మూలములునై యుండెను. వీట్లకుగిల్డు(guild)లనిపేరుండెను.

ఇట్టిస్థితియం దైకమత్యమునకు నభివృద్ధికి విఘాతుకములగు నన్యోన్యాసహనమును స్వార్థపరత్వమును నీగిల్డులందు పొడసూపి పెరుగుచుండెను. వీటిని తగదని నివారించుచు సన్మార్గమున నడుపునాయకులు లేకుండిరి. గిల్డులలో నన్యోన్యద్వేషము బలపడి యంతఃకలహములు తలచూపెను. ప్రారంభముగ ఘెంటువారు యీప్రెస్‌వారిం బాధచేయఁ దలపెట్ట, యీప్రెసువారు విరోధభావముననుండిరి. ఒకయాంగ్లసైన్యము ఈప్రెస్సుపై దాడివెడల, ఘెంటువారాంగ్లసైన్యమునకు సాయపడిరని వదంతులు కల్గెను. బ్రూజెస్‌లోని గిల్డులు ఘెంటులోని గిల్డులపైఁ దలపడి కలహింప సిద్ధపడిరి. ఇట్టికలహములతో చేతిపనులు, వాణిజ్యము తగ్గిపోవుచుండెను.

ఈకలహము లింతటితో నాగక ప్రజలకు తమప్రభువులపై నసూయతలు, నాయకులు తమ స్వప్రయోజనమునకై బోధించుట ప్రారంభమై తిరుగబాటుబీజ మంకురించి వాణిజ్యములు వ్యాపారములు చెడుచుండెను. ఈపరిస్థితులందు ప్రభువులలోఁ ప్రభువుల కంతఃకలహములు మెండయ్యెను. దీని నంతయు ఫ్రాన్సుదేశమందలి బర్గండీస్టేటుప్రభుత్వము కనిపెట్టుచుఁ దరుణము కొఱకు వేచియున్నట్లుండెను. ఈస్థితిలో ఫ్లాండర్సుకౌంటుగా రొక్కకుమార్తెను మాత్రముగల్గియుండి చనిపోయెను. ఆబాలికను డ్యూకు ఆఫ్ బర్గండీ పరిణయమై ఫ్లాండర్సునందు ప్రవేసింపఁ గల్గెను. ఆయనపేరు Philip the Hardy అని చెప్పఁబడినది.

ఇటుల బర్గండీ డ్యూకువశమై తక్కిన బెల్జియన్‌స్టేట్సు ఒకటితర్వాతనొకటిగ బర్గండీడ్యూకులపాల్పడుచు నొక్క లీజిబిషప్పుప్రభుపు రాజ్యముతప్ప తక్కినవన్ని యుఁబీల్చి వేయఁబడియెను. బర్గండీడ్యూకులలో Charles the Bold అనువారి పాలనమున నాతని యేకపుత్రికయగు Mary of Burgundy రాకొమరిత Maximilian అనుపేరుగల Arch duke of Austria గారిని పరిణయమగుట సంభవించెను. దీనితో బెల్జియమురాజ్య మొక్క లీజి తప్పఁ దక్కినది ఆస్ట్రియా (House of Hapsburg) హాప్సుబర్గు వంశస్థులవశమాయెను.

ఆదంపతులకు Philip the handsome అనుపేరుగల సుతుఁడు గల్గెను. ఆ రాకొమరుఁడు స్పానియాదేశపు ఫెర్డినాండునృపతిసుతయగు Joanna the mad రాకొమరితను బరిణయమై ఐదవఛార్లెసునృపునిం గనియెను. ఆతెండును సకాలమున స్పానియాదేశమునకే గాక దానికిం జెందిన జర్మనీ బెల్జియములకుఁ గూడ భూనాథుఁడగు చక్రవర్తిగ నగుట సంభవించెను. ఈ మహీపతిపాలనము నలుబదేండ్లని చెప్పఁబడినది. ఈయనకుం బిదప నీయన సుతుండగు ఫిలిప్పుచక్రవర్తి రాజ్యాధిపత్యము వహించెను.

ఫిలిప్పుచక్రవర్తి రోమనూ-తలిక్కు క్రైస్తవుఁడు. అధికారప్రియుఁడుగాన ప్రజాస్వాతంత్ర్యమీాయనకు సరిపడకుండెను. నెదర్లాండ్సు బెల్జియంవారలకు స్వతంత్రము, స్వేచ్ఛ, ప్రధానములు. ఇంతదనుక నడచిన పాలనములం దివియాటంకపరుపఁబడలేదు. వారుతమపద్ధతులను తామే యించుమించు నిర్మించుకొనుచుండిరి. నేటికి ఫిలిప్పుభూపతివలనఁ జిక్కు గలిగెను. ఇంతటితో నాగక ఫిలిప్పుభూపతికి మతసహనమన్న్యులయందు లేదు. ప్రొటస్టాంటు మతస్థులగు బెల్జియపుప్రజలలోఁగొందరీస్వేచ్ఛను ప్రజలకు సంపాదించుచున్నారని యాయన తలంచి, వారియెడల వైషమ్యబుద్ధితో నుండెను. ఇరుదెగల ప్రజలను వారి నిజాభిప్రాయముల నెరుఁగునెపమున "Inquisition Court" అను నొక పరిపాలనశాఖాధికారుల నేర్పరచి పరిశీలించుచు స్వేచ్ఛాప్రియులగువారిని బాధింప మొదలిడెను.

ఇది ప్రజలను గలవరపరిచి తిరుగుబాటును వ్యాపింపఁజేసెను. దీనిని చరిత్రకారులు "నెదర్లాండ్సు తిరుగుబాటు" (Revolt of the Nether lands) అని వాడియున్నారు. (నెదర్లాండ్సుఅనిన హాలండు బెల్జియములనిభావము) చక్రవర్తియగు ఫిలిప్పుగారు ధనముంగల్గినవాఁడగుట నెక్కువ సైనికులంజేర్చి బెల్జియంప్రజల ననేకవిధముల నిర్బంధకరముగ నరికట్టుచుండెను. బెల్జియంప్రజలు లొంగనులేదు; ఫిలిప్పుభూపతి వదలను లేదు. ఇట్లు కొంతకాలము గడచెను. ఈకాలమున హాలండు దేశస్థులును బెల్జియం దేశస్థులును గలసి ఫిలిప్పుప్రభుత్వము నెదుర్చుటకు నొక యేర్పాటు కుదిరెను. దీనియందు William the Silent అనుపేరుగల Prince of Orange సలహాకలఁడని యొక వాడుక గల్గెను. దీనిని వినిన ఫిలిప్పుచక్రవర్తి మఱియు బట్టుదల కలవాఁడయ్యెను. హాలండుప్రజ లేకస్థులై నిలువఁబడి లొంగరైరి. ఇట్టి సందిగ్ధస్థితియందు ఫిలిప్పుచక్రవర్తి హాలండును వదలుకొనవలసివచ్చెను. బెల్జియంప్రజలందు చేతగాని నాయకులుంట నుద్యమము భగ్నమైయుండెను. హాలండు స్వతంత్రరాజ్య మాయెను.

బెల్జియములోని యొత్తిడిపడలేని ప్రజలు హాలండుదేశమునకును, కొంద రితరదేశములకును వెడలిపోయిరి. బెల్జియము బలహీనమాయెను. దానికింబిదప 'స్పానియా దేశపు నెదర్లాండ్సు' అనిపేరిడి ఫిలిప్పుచక్రవర్తి నిర్లక్ష్యముగ పాలించుచుండెను. ఎంతవరకు నిజమోగాని యొకచరిత్రకారుఁడు పిదపకాలములందు "the Flemish and Brabantine Cities were mere dens of thieves and beggars" అని వ్రాసియున్నాఁడు. బహుశః వర్తకవ్యాపారములం గోల్పోవుట, యైశ్వర్యముపోలఁగి ప్రజలు బీదలై యుండుట సత్యమె యైయుండవచ్చును.

ఇది యిట్లుండ చక్రవర్తికుమార్తెయగు ఇజబెల్లారాకుమార్తెను ఆస్ట్రియా ఆర్చిడ్యూకగు ఆల్బర్టునకిచ్చి పరిణయ మొనర్చుచోఁ గట్నముగ నీబెల్జియము దేశము నొసంగెను. ఫిలిప్పుచక్రవర్తియునుగాలధర్మమునొందెను. ఆస్ట్రియా రాజదంపతులు బ్రస్సెల్సునగరమున కరుగ, వారు చక్కగసన్మానములనంది ప్రజలనుబహూకరించుచుండిరి. ఇది క్రీ. వె. ౧౭౦౮. ఇత్తఱి బెల్జియముదేశమునకు "ఆస్ట్రియను నెదర్లాం"డ్సని పేరుగలిగెను. కొందరు చరిత్రకారులు హేప్సుబర్గురాజవంశస్థుల(ఆస్ట్రియాభూపతుల). పాలనమున బెల్జియముప్రజలు సౌఖ్యమున మనిరని వ్రాసియున్నారు కాని ధనవంతులుగ మాత్రము కాలేదు.

ఆస్ట్రియాచక్రవర్తులలో నొకఁడగు రెండవ జోసెఫు కాలమున బెల్జియముప్రజలను ఆస్ట్రియా దేశాచారములకు లోఁబఱచి ఆస్ట్రియా విద్యల నొసంగి యుద్ధరింతునని ఆస్ట్రియాచక్రవర్తిప్రభుత్వమువారు కృతనిశ్చయులై బెల్జియమ్ దేశాచారములం దించుకమార్పు గల్గించు శాసనములం జేయ మొదలిడిరి. నవీనాచారపరులు మౌనము వహించిరి. పూర్వాచారపరులం దశాంతి గలిగెను. తిరుగుబాటు ప్రారంభమగున ట్లుండెను. ఈసంశయస్థితియం దాస్ట్రియాచక్రవర్తి మరణింప, ప్రభుత్వ మీనూతన సంస్కారశాసనములను రద్దుపఱచుకొని శాంతిం గూర్చిరి. ఆస్ట్రియనుప్రభుత్వమును బలహీనమగు సూచనలు పొడకట్టెను. ఈసందర్భమున లోకప్రసిద్ధమగు ఫ్రెంచిరివల్యూషన్ నడచుచు చుట్టుపట్లవారిని భయపెట్టుచుండెను.

ఫ్రెంచి రివల్యూషనునందు వధింపఁబడిన చక్రవర్తిని ఆస్ట్రియాదేశపుచక్రవర్తిగ నుండిన రెండవజోసెఫు సోదరి. ఫ్రెంచి సేనలు ఒక నాయకునిక్రింద బెల్జియముజొచ్చి ఆస్ట్రియనులం దరిమివైచి దేశమును గల్పుకొనిరి. అదివఱకే డచ్చివారు స్వతంత్రులైనప్పటినుండి షెల్టునది వారివశమై బెల్జియనుల స్వాధీనమగుట ఆన్ట్వర్పు పురమునందలి వర్తకము తగ్గిపోయి యుండెను. ఫ్రెంచివారు డచ్చివారిని బెదరించి నదిని, అందలి యోడలు స్వేచ్ఛగా నడువఁదగిన "ఫ్రీరివరు"గఁ బ్రకటించిరి. ఇదికొంతవఱకు ఆంట్వర్పువారి కనుకూలమైనను రాజకీయకారణములవలన బ్రిటిషుప్రభుత్వమువా రంగీకరింపనందున బ్రిటిషు, ఫ్రెంచి ప్రభుత్వములకు యుద్ధము సిద్ధమయ్యెను. ఇందే నెపోలియను సేనాని క్రీ. వె. ౧౮౧౪లో పతితుఁడగుట సంభవించెను. ఈ యుద్ధకాలమంతయు బెల్జియము ఫ్రెంచివారిపరిపాలనముననే యుండ నయ్యెను.

నెపోలియనుసేనానిని 'ఎల్బా' ద్వీపమున నిర్బంధించినతరి, నైరోపాపవర్సుసభ కూడి యాయన చేసిన యల్లకల్లోలముల నెటుల సర్ది పరిస్థితులఁ జక్కపరుపనగునో యోచించిరి. అందు బెల్జియం దేశము హాలండు దేశము లీజిప్రిన్సిపాలిటీలం గల్పి యొకరాజ్యముగ నొనర్చి "నెదర్లాండు రాజ్య"మని పేరిడిరి. ఆరింజి రాజవంశస్థు నొకని (William the Silent భూపతిసంతతి వానిని) భూపతిగఁ జేయ నిర్ణయించిరి. అట్టివాఁ డక్కాలమున William of Orange గ నుండెను. ఆంగ్లేయు లాతని కొమరునకు Princess Charlotte రాకొమరితం బరిణయము చేయ నేర్పఱిచిరి. (ఇది ఇంగ్లాండు నెదర్లాండులకు స్నేహసంబంధము స్థిరమగునని తలంపఁబడినది.) క్రీ. వె. ౧౮౧౪ మార్చి నెలలో నీ వివాహము ప్రకటింపఁబడెను గాని జరుగలేదు. ఆమె జర్మను రాకొమరుని, ఆయన యొక రష్యను డ్యూకుకుమార్తెను బరిణయములైరి. నెపోలియన్ మహనీయుఁడు క్రీ. వె. ౧౮౧౫లో ఎల్బాద్వీపమునుండి తప్పించుకొనిన పిదప జూన్ నెలయందు వాటర్లూ యుద్ధము జరిగెను. అందు డచ్చిప్రజలు బెల్జియన్ప్రజలు కూడా డ్యూకాఫ్ వెల్లింగ్టన్ ప్రభు (సేనాని) ని క్రింద పోరాడి జయించిరి. ఇంతటితో నైరోపాలో శాంతిగల్గు పరిస్థితులం గూర్చి తిరుగ పవర్సు సభకూడి యోచించిరి.

బెల్జియనులు తమ్మొక ప్రత్యేకరాష్ట్రముగా నొనర్పఁగోరిరి. ఇప్పు డేతీర్మానమును కుదురక యభిప్రాయభేదము లుదయించి దాని నట్లే వదలిరి. కలహములతో పదునేను సంవత్సరములు గడచెను. ఈ సంక్షోభము నడంపఁ

దిరిగి యైరోపా పవర్సు లండను నగరమున సభకూడిరి. అందు బెల్జియమును వేఱుచేయుటకును, Prince Leopold of Saxecoburg రాకొమరుని భూపతింజేయుటకును తీర్మానించిరి. ఈరాకొమరుఁడు వెనుక Charlotte రాకొమరితెంబరిణయమైన Prince Leopold of Saxecoburg అను నాయనయె. ఆమె పిదపచనిపోయినను తమకొమారునితో నాయన యింగ్లాండునందే వసించుచుండెను. బెల్జియను దేశపాలకునిగ ఆయనకు ఒకటవలియోపాల్డు అనిపేరయ్యెను. ఏలయన నాయనకుమారునిపేరును లియోపాల్డే.

నెదర్లాండ్సను నామము పోయి బెల్జియం అనుపేరుగల్గిన క్రొత్తదేశము తటస్థదేశముగ నేర్పరుపఁబడెను. అనఁగా బెల్జియ మెవ్వరితోఁ గలహింపరాదు. ఇతరదేశములు బెల్జియము జోలికి పోకుండ గ్రేటుపవర్సు ఆఫ్ యూరప్ హామీ యిచ్చినవి. ఇది బెల్జియమునకు దీవనగనె పరిణమించి సైనికవ్యయమును తగ్గించినది. ఒకటవ లియోపాల్డు మరణానంతర మిప్పటి భూపతియగు రెండవలియోపాల్డు నృపతియై యున్నాఁడు. ఈయనకు కాంగోద్వీపములు (ఆఫ్రికా) స్వంతవ్యయములకుగా నొసంగఁబడినవి కాని,ఈయన వాటిని దేశమున కొసంగి కొంత ద్రవ్యము బెల్జియము ప్రభుత్వమీయఁగై కొనియెను.

బెల్జియం ప్రభుత్వ మన్నిమతముల నంగీకరించి యొకేరీతిం గారవించును గాని మతనిర్బంధము లేదు.

బెల్జియము దేశమునకు బ్రస్సెల్సు నగరము రాజధాని. చక్కనిపట్టణము. ఇందు చూడఁదగినభవనము లనేకములు కలవు. న్యాయస్థానభవనము చాల గొప్పది. సుప్రసిద్ధమగు వాటర్లూయుద్ధము జరిగినతా విచటికి తొమ్మిదిమైళ్ళ దూరమున నున్నది. బ్రస్సెల్సుతివాచీలు సుప్రసిద్ధములు. మఱియునీనగరము లేస్ Lace పనులకు పేరందినది. దీనికిఁ దూర్పున సించుక దూరముననే యున్న లోవెయిన్పురమున గొప్ప రోమనా్కథలిక్కు విశ్వవిద్యాలయము కలదు.

ఆంటువర్పుపురము షెల్టునదీతీరము. చాల పురాతనస్థలము. ఇట తొల్లింట షెల్టునదీతీరమున నొకరాక్షసుఁడు వసించువాఁ డఁట. నది గుండానడచు ప్రతియోడనుండియు తనయిష్టము మేరకు సుంకముం గొనుచుండువాఁడఁట. ఈయనిచో నోడయజమాని చేతినినఱకుచుండె నఁట. డచ్చిబాషయందు Werpen అనఁబడవేయుట యనియర్థముగాన ఆతావునకు hand werpen అనిపేరయ్యె నఁట. రానురాను అది Antwerp గామారెను. కొందరు నవనా[illegible]కు [illegible] నమ్మకున్నను [illegible] దుసమా[illegible] Brabo అనువీరుని విగ్రహము నేటికిని ఆంటువర్పుపురపుచౌకులలో నొకదానియందు పూర్వపుది కలదు. లోకప్రసిద్ధమైన రేవు(harbour) గలవర్తకస్థలము. ఆంట్వెర్పు దేవాలయము చాల గొప్పకట్టడము.

మెక్లిన్‌పురము: దీనిని 'మెలినీస్' అనుచుందురు. ఇటఁ జేయఁబడు రబ్బరుమైరులు సుప్రసిద్ధములు. ఇటఁ గల సెంటు రాంబోల్డుచర్చి క్రైస్తవ యాత్రాస్థలము. ఇది ఆర్చిబిషప్ స్థానము. వర్తకముతగ్గి పట్టణము బలహీనముగ నున్నటులఁ గన్పించెడిని. ఒకతతి రాత్రిఁ చంద్రుఁ డుదయించుకాలమున చర్చిటవర్ గుండా యెఱ్ఱనిమంటవలె కాంతులు గన్పింప. నూరిలోనివా రది యగ్నిప్రమాదముగఁదలంచి పంపులతో నీరట కెగురఁగొట్ట మొదలిడిరఁట. పిదపనిజస్థితిబయల్పడఁజూచిన నితరులుమెలినీస్

పురవాసులను Moon quenchers అని హేళనగా పిలువమొదలిడిరఁట. మెక్లిన్‌పురమునుండి బ్రస్సెల్సువఱకుఁ గల యినుపదారి యైరోపా ఖండమునఁ దొలుత వేయఁబడినది.

ఘెంటుపురము పురాతనస్థలము. చేతిపనుల వర్తకము అధికము. ఇట చర్చియందలి గంటకు రోలాండు అనిపేరు. స్పానియాపాలనమున అనవసరముగ నాగంట వాయించిన ఘెంటుపురవాసులు ఆయుధములంగొని ప్రభుత్వోద్యోగులపై యుద్ధసన్నద్ధు లగుచుండిరఁట. వాటర్లూ యుద్ధానంతర మీపురమభివృద్ధి నందినదందురు. ఇది విశ్వవిద్యాలయ మున్న తావు. పూఁదోఁట లధికముగాఁ గలవు.

బ్రూజెస్ తనవర్తకముం గోల్పోయి ధనహీనమైయుంట దీనిని Bruges-la-morte (Bruges the dead City) అనియెదరు. వెనుక గొప్పవర్తకస్థలమై యుండెను. సముద్రమునుండి యీపురికింగల ఓడలకాలువ యెండిపోయి యున్నది.

లీజిపురము Maas లేక Meuse నదీతీరము. ఇట గొప్పయినుపపనులు జరుగు యంత్రశాలలు కలవు. దీనిపరిసరముల Spa అను పేరుగల సుప్రసిద్ధమగు watering place కలదు.

ఆస్టెండుపురము ఓడలరేవు; సముద్రతీరము. సముద్రస్నానములతావు—రేవుపట్టణము.డొవరునుండి యిటకు ఓడల ప్రయాణపు టేర్పాటు కలదు.

**బెల్లఁపుపొయ్యి కీగలేనిదర్శనము**—(ఆంధ్రలోకోక్తి.)

**బెల్లపుకొండసీమ**— ఇది గుంటూరు మండలములోనిది. బెల్లముకొండ సుప్రసిద్ధమై యుండినకాలమునన్నీప్రాంతసీమకీపేరు వ్యాపించి యుండనోపు.

**బెల్లముకొండ రామారాయకవి**— పండితకవిసార్వభౌముఁడని పేరందిన యీమహావిద్వత్కవి గుంటూరమండలమునందలి నరసారావుపేట తాలూకాలోని పైడిపాడు (పమిడిపాడు) గ్రామమున జన్మించినవాఁడు. క్రీ.వె. ౧౮౭౫ సంవత్సరమున జనించెను. ఈమహనీయుని యుదయము యువనామసంవత్సర మార్గశీర్షబహుళ యమావాశ్య సోమవారము కటకలగ్నమునందని చెప్పఁబడినది. తండ్రి మోహనరాయఁడుగారు. తల్లి హనుమాయమ్మగారు. ఋగ్వేది. ఆశ్వలాయనసూత్రుఁడు. వీరికుటుంబము విద్వత్కుటుంబమనియు,వీరిపూర్వులందరును మహావిద్వాంసులనియుఁ బేరందినవారు. వీరిది మంచిభూస్థితికల్గి,గ్రామములుగల యైశ్వర్యవంతమగు సత్కుటుంబమని ప్రతీతి కలదు. నియోగిబ్రాహ్మణులు.

వీరికి సర్వసామాన్యమగు హూణభాషా పరిచయము గల్గియుండెను. అసమానధారణాశక్తియుతులు. ఏకసంతగ్రాహి యని పేరందినవారు.తర్క-వ్యాకరణమీమాంసాశాస్త్రములఁ జదివిన విద్వాంసులు. శరీరబలము గలవారు. మంచి శరీరవ్యాయామపరులు. అనుదినము నిన్నూరుదండెములు తీయుచుండువారని ప్రతీతి కలదు.

వీరు కావ్యములుగ రచించినవియు,వ్యాఖ్యానము,ఖండనలు వ్రాసినవియు స్తోత్రములు మొదలగునవి ౧౮౮ కలవని చెప్పఁబడినది. వీరిగ్రంథములు:— వ్యాకరణ శాస్త్రము, అలంకార శాస్త్రము, ధర్మశాస్త్రము, వేదాంతశాస్త్రము లందుఁ గలవు. వీ రేగ్రంథము రచించుతటినైన నొక్కయక్షరమునైనను గొట్టివేయనిసమర్థులు.

వీరి పదునేడవ వత్సరముననే వల్లభరాయస్తవమను స్తోత్రమును రచించి, అష్టాదశమంజరులుకల చంపుకావ్యము సముద్రమధన మను

పేరున రచించిరట. వీరిగ్రంథములందు రుక్మిణీ పరిణయచంపు (సవ్యాఖ్య), గరుడ సందేశము (సవ్యాఖ్య), హయగ్రీవ శతకము (సవ్యాఖ్య), కందర్పవిలాసము, కృష్ణలీలాతరంగిణి, వేదాంత కౌస్తుభము, గీతాభాష్యార్క-ప్రకాశము మొదలగునవికొన్నిమాత్రముబయటఁబడినవి. సిద్ధాంత కౌముదికి శరద్రాత్రి యనుపేర వీరు విపులమైన వ్యాఖ్యరచించిరని వినుదుము.

వీరు ప్రమాది సంవత్సర (క్రీ.వె. ౧౯౧౪) కార్తీకశుద్ధ నవమిని పరమేశ్వరునిసన్నిధి కరుగ భౌతికశరీరమును వీడిరి.

## బెల్లమువండేచోట ఈగలుండవా?

(ఆంధ్రలోకోక్తి)

**బెల్ ది కేట్** (Bell the Cat)-అసంభవమగువిధాన మని భావము. దీనికొక కట్టు కథ గలదు. ఒకప్పు డెలుకలన్నియు సభగూడి పిల్లివలని బాధ తమకు ముందుగా తెలియుచుండుసాధనమునకై యాలోచింపసాగెనట. అందొక యెలుక పిల్లిమెడ కొకగంట గట్టితిమేని దానిరాక మనకుఁ దెలియుచుండును. మనము పారిపోవుచు దానికి దొరకకుండ తప్పించుకొనుచుండఁ గల్గుదుమని సలహా నిచ్చెనట. గాని పిల్లిమెడలో గంటకట్టుట యసంభవమని తేలెనట. ప్రసంగములందు జరుపుటకు వీలుకాని అసంభవమార్గమునకీసామెత నుపయోగింతురు.

క్రీ.వె. ౧౪౮౨ సంవత్సరమున మూడవ జేమ్సు స్కాట్లాండు దేశమును పాలించుచుండెను. ఆతనికి దుర్మంత్రులు పెక్కండ్రు వద్దజేరి ప్రజల కొత్తిడి గల్గించుచుండ, నాదేశపు సామంతు లందరొకచోఁగూడి ప్రతిహతమేమిటో యనియాలోచింపసాగిరట. అందు గ్రేప్రభువు (Lord Grey) ఇది అసంభవమనియు, పిల్లికి గంట కట్టుటవంటిదే యనియు నుడివెనట. అందున కంగస్ ఐదవయధిపతి (Fifth Earl of Angus) తా నాగంట పిల్లికిఁ గట్టుపని కైకొందునని శపథముపల్కి-సాగించుకొనెనట. అట్లే భూపతికడనున్న దుష్టులగు దుర్మంత్రుల నురిదీయించి శాంతి కల్గించెనట. ఆతావు Lander Bridge గాఁ జెప్పఁబడినది.

**బే** (Bay)—(అఖాతము చూడుఁడు.)

**బేంకాఫింగ్లండు** (Bank of England)-ఇంగ్లండు ధనాగారము. ఇది భరతదేశపు సంస్థ కాకున్నను, నెక్కువ నమ్మకమునకాస్పదమాటయేగాక మనదేశమునం దైరోపావర్తకముతో కొద్దిగనో గొప్పగనో సంబంధము గల్గియుండకతప్పని ఆర్థికపరిస్థితులఁగల్గి యాంగ్లదేశపు నార్థికపరిస్థితులకు కేంద్రమని పించుకొనుచున్న ధనాగారపుసంస్థగాన దీని చరిత్రఁ దెలియుట యాంధ్రుల కవసరము గాక పోదు. క్రీ.వె. ౧౬౯౪ కాలమువరకు నాంగ్ల దేశమునకు పరాసు దేశముతో గొప్పవైరము లుండెను. అనేకకలహము లిరుదేశములవారికి నడుచుచుండెను. అప్పుడు మూడవవిలియము భూపాలునిపాలనము. మఱియు నక్కాలమున బ్రిభుత్వపరిస్థితులు ద్రవ్యముచాలక నిరుకుగ నుండుటయు, యుద్ధమునకు వలయు ద్రవ్యము చాలక శత్రుభయ మధికమైయుంటతో విషమ స్థితి స్ఫురించుచుండెను.

పరాసువారితో యుద్ధ మవసర మగుట భూపాలుఁడెఱిఁగి Mr. William Paterson అను ప్రజానాయకుండగు బుద్ధిశాలితో యోచింప నారాజభక్తిపరుండగు ధీశాలి యిట్లొక ధనాగారమును నిర్మింపఁ దలపెట్టెను.

పేటరుసన్ స్కాట్లాండు దేశస్థుఁడు. ఆయనయే యీధనాగారస్థాపన మొనర్చినవాఁడు. ఇట్లయ్యు నక్కాలమున జాకోబైట్సుగనుండిన

స్కాట్లాండు దేశస్థులును, కలహ మనిన నిరసించుటయే వృత్తిగాఁగల క్వేకరులును నీసంస్థయందు గొంత విముఖతఁ జూపుచునే యుండిరఁట. యూదులును తమ నిల్వధనము గలహాములపాల్సేయఁ బడుట నొల్లరైరఁట. ఎట్టకేల కెట్లో ధనాగారనిర్మాణము పూర్తి యయ్యెను. యుద్ధముయొక్క యత్యావశ్యకత నెఱింగినవాఁడగు భూపాలుండును, వారియందు ప్రీతిగల పేటర్సన్‌గారును పట్టు వీడక గట్టి ప్రయత్నములొనర్చి నిర్వహించిరి. Bank of Englandన కొక రాజశాసనపూర్వకమగు నధికారపత్రము (Charter) క్రీ.వె. ౧౬౯౪ జూలై ౨౭ తేదీని పుట్టెను. ఇదియె దీనికిఁ బునాది.

ఈఛార్టరువలన పండ్రెండులక్షల పౌనుల ద్రవ్యముఁ గూర్పవలయుననియు, ధనమిచ్చు భాగస్థులు "Governers and Company of Bank of England" అనుపేరున నొక సంఘముగ నేర్పడవలయు ననియు, ఆసంఘ మీధనాగారముయొక్కలెక్కలను సరిగానుంచి లాభద్రవ్యములను పంచుచు నవసరముల వెంబడి నోట్ల నిచ్చుచుండునటుల నేర్పడియెను. దీని పనులకు ప్రతిఫలముగ బాంకివారి కేఁటేట నాల్గువేలపౌనులు యెలవెన్సు ముట్టుచుండు నట్లును, ధనాగారము కూర్చినద్రవ్యమంతయు Eight per cent వడ్డీకి ప్రభుత్వమునకే ఋణ మిచ్చుటకును విధింపఁబడెను.

ఇందువలన యుద్ధమునకు వలయుద్రవ్య మేర్పడుటతో ధనాగారమున కేఁటేట వడ్డియు, ఎలవెన్సును గలసి యొకలక్ష పౌనులవరకు నాదాయ మేర్పడియెను. ఇటుల బేంకాఫింగ్లండును రెండేండ్ల ప్రాయము వచ్చువఱకు ౧౬౯౬ లో దీనిమూలధన మిరువదిరెండు లక్షల యొకవేయి పౌనుల కభివృద్ధి చేయఁబడియెను. ఆర్థికపరిస్థితులును ననుకూలించుచు నభివృద్ధినందుచుండ మఱి నాల్గువత్సరములకు ౧౬౧౦ యవ సంవత్సరమున ధనాగార మూలధన మేబదియైదులక్షల కధికపఱుపఁబడియెను. ఇటులఁ బెరుగుచు జనోపయోగముగఁ దనరుచు క్రీ. వె. ౧౮౧౬ జూన్ ౨౯ తేదీని నొకకోటి నలుబది యైదులక్షల యేబదిమూఁడు వేలపౌనులమూలధనము నేర్పఱిచి మహోన్న తస్థితికిం దెచ్చి గొప్పబలవంతమగు ధనాగారముగఁ జేసిరి. ఈస్థితి అమెరికా సంయుక్తరాష్ట్రముల ధనమానమున కక్కాలమునం దేడుకోట్ల ఇరువదియేడు లక్షల డాలరులాయె నని చెప్పఁబడినది.

ఆదిని పండ్రెండు లక్షలపౌనులుగ బ్రిటిషు ప్రభుత్వమువారి ధనాగారమునుండి గైకొని యుండినఋణము నానాటి కధికపఱుపఁబడుచు తీసికొనుచుంట క్రీ. వె. ౧౮౧౬ వ సంవత్సరమునాటికి ఒకకోటి నలుబదియారు లక్షల యెనుబదివేలుగ నయ్యెను. కాని, పిదప ప్రభుత్వమువా రందు నాల్గవవంతు తిరుగ బాంకికి చెల్లించివైచిరి. ఇట్లయ్యును క్రీ.వె. ౧౮౬౦ సంవత్సరమునకు ఒకకోటి పదిలక్షల పదిహేను వేల పౌనులు బాకీ నిలచియుండెను. దానిపై నాఁడాదిగ 2½ per cent వడ్డీ చెల్లుచుండుట కేర్పాటులు జరిగి, తదాదిగ నట్లే నడచుచున్నది. ఇది ధనాగార మభివృద్ధిలోనికి వచ్చిన చరిత్రము.

బాంకాఫింగ్లండు క్రీ.వె. ౧౬౯౫లో నాది నిరువదిపౌనులనోట్లను Issue చేసియుండెను. పిదప ౧౭౫౯ సంవత్సరమున పదిపౌనులఁ నోట్లను ఇస్యూచేసెను. పిదప ౧౭౯౩వ సంవత్సరమున ఐదుపౌనులనోట్లను ఇస్యూచేసెను. పిదప పందొమ్మిదవ శతాబ్దారంభకాలమునఁ గొంతకాల మొకపౌనునోటుల నిస్యూచేసెను.

పిదప నచిరకాలమున రెండుపౌనులనోట్లం గూడముద్రించి Circulation నందుంచెఁగాని క్రీ.వె. ౧౮౦౮ర సం॥రమున వాటిని నిలకడచేసి మానివైచెనని చెప్పఁబడినది. ఇప్పుడైదుపౌనుల నోటుకన్న తక్కువ విలువగల్గినవియును, వెయ్యి పౌనులకన్న నెక్కువవిలువఁగల్గినవియు Issue చేయుట మానివైచిరని తెలియుచున్నది. ఆది కాలమునఁ బ్రభుత్వమువా రొసంగిన యధికార పత్రమున "On demand" నోట్లు నిస్యూ చేయుటకని మాత్రముంట నిట్టిసావకాశము లెన్నియైనగల్గియున్నవఁట. నోట్లు బాంకియందే ముద్రింపఁబడుచున్నవి. ఈనోట్లు యునైటెడ్ కింగ్డమనంబడు నింగ్లాండు, స్కాట్లాండు, వేల్సు, ఐర్లాండు దేశములందు Legal tender లై యున్నవి. బాంకిలో సమర్పింపఁ బడగనే బంగారునాణెము లిచ్చివేయఁబడునవి.

ఈధనాగారమునకుఁ గడగండ్లు కొన్ని కలిగెను. వాటినింతవఱకు వివరించియుండలేదు. బాంకి ఏర్పరచబడిన రెండవసంవత్సరముననే కొలఁదికాలము జిక్కులంబడి భగ్నమగునేమో యని భయముకలిగెను. అసూయాపరులగు పోటీ బాంకివర్తకులు దీనిఁ బాడుచేయ సమకట్టి యెదుర్కొనుటయు, రాజకీయకక్షులు బలమై చికాకులఁ గల్గించుచుంటయు దీనికిఁ గారణములని చెప్పఁబడినది. కాని యెట్లో నిలచియుండెను. క్రీ. వె. ౧౮౨౫ సంవత్సరమున పెద్ద చిక్కుగలిగి యింగ్లాండు, వేల్సు, స్కాట్లాండు దేశములందు ౨౨౦ బాంకులు భగ్నమై పడిపోయెను. బాంకాఫింగ్లాండు స్థితి సంశయములోనికి వచ్చెను. దాని నిల్వబంగారమంతయు చెదరిపోయియుండెనట. దీనికి Foreign exchange తేడాలు కారణమన్ని చెప్పఁబడినది. ఆసంవత్సర ప్రారంభమున 1,40,00,000 పౌనులుగ నుండిన ధనముసంవత్సరాంతముకాకమునుపే10,00,000 పౌనులుగ నుండెను. కాని గొప్ప యొకిడుడుకు సంభవించిన నిముషమున బాంకి భగ్నమగు ననుకొనుచుండ నదివఱకే issue చేయఁబడి మరచిపోయిన యొకపౌను నోట్లపెట్టెలు కొన్ని యొక తావున నుంచబడియుంట గన్గొనఁబడి యప్పటిగండము గడచిపోయి నిలువఁబడియెను.

బాంకిఆఫింగ్లండు క్రీ.వె. ౧౬౯౪ మొదలు ౧౭౩౪వరకు నచ్చటచ్చటనుంపఁబడుట జరుగుచుండెను. పిదప స్థితిగతులు బలపడి లండను నగరమునందలి Thread needle Street నందు మూడున్నర యకరముల ప్రదేశమునఁ దనస్వంతభవననిర్మాణమొనర్చుకొని యందుఁ బ్రవేశించెను. ఇది నగరమధ్యమునందుంట వర్తకులకు నితరప్రజలకు ననుకూలముగనున్నది. క్రీ. వె. ౧౭౮౦ వ సంవత్సరపు నల్లరి, సంక్షోభములాదిగ క్రిందిభాగమున నొకబారకాసు ఏర్పఱుపఁబడి సాయంత్రి మేడుగంటలు మొదలుదయ మేడుగంటలవరకు సైన్యము దీనిఁ గావలి గాచుచుండుటకేర్పర్చబడియున్నది. విలువంపు కట్టడముల సరంబీయుండ్లనిండ వెండి బంగారుల నాణెములే గాక పాళ్ళకూడ నిల్వయుంచఁబడి భద్రముగానుండును.

బాంకాఫింగ్లండు కడుధనవంతమని, నమ్మకమనిపేరందిన ధనాగారమై యున్నది. ఈసంస్థయందు పెక్కం డెక్సిక్యూటివుద్యోగస్తులుగాక ఇరువదినల్గురు డైరక్టరులు పరిశీలించుచుండు నొకగవర్నరు, నొకడిప్టీగవర్నరు దీనిని నడుపుచుందురు. సగటున ౧౦౫౦చేతులు బాంకియందనుదినము పని జేయుచుండునవి కలవని చెప్పఁబడినది.

ఇతరబాంకులు గూడఁ దమ Bullion reserve నీబాంకియందే యుంచుదురఁట. అవి 10000000 ల కెప్పుడును తగ్గియుండదని చెప్పుచున్నారు. సర్వసాధారణముగ Daily

average 1,40,00,000 వరకు గల్గియుండునని యందురు. ఒకప్పు డీబాంకి 27½ డివిడెండు పంచియుండెను. ఇది క్రీ.శ. ౧౬౯౭ ప్రాంతము. ౧౭౫౩-౬౩ ల మధ్య పని చాలతక్కువగ నుండినతరి 4½ డివిడెండుపంచెనట. సర్వసాధారణముగ డివిడెండు 10 యుండునని చెప్పుదురు.

**బేంకింగు** (Banking)-వడ్డీవ్యాపారము అప్పిచ్చుట, బదులిచ్చుట, ఋణమిచ్చుట, పెట్టుబడిపెట్టుట. (వాణిజ్యసంబంధపరిభాషాపదము)

బేంకింగు-వడ్డీవ్యాపారమని యర్థము. వర్తకపునవసరమునిమిత్తము నమ్మకముపై యిర్వురు హామీపై బదులిచ్చుట లేక సరకుల నొకగది యందు వైచి, దానికి తాళమువైచి హామీ యుంచుకొని యర్థ్యమగుసొమ్ము బదులిచ్చుట మొదలగువడ్డీవ్యాపారము. సర్వసాధారణముగ వర్తకకార్యములకు ద్రవ్యము బదులిచ్చుటకే బేంకింగు అనుచున్నారు.

ఒకబాంకివలన వేరొక బాంకిపై నీయఁబడిన హుండీకి Bank bill అనిపేరు. చెక్కులకు Bankers Cheques అనిపేరు. బాంకియందు సొమ్ముదాచుచో దానిని కొంత నియమితకాలమువఱకు తీసికొననని యేర్పఱిచికొనినప్పుడు గాని, లేక తాను తీసుకొనుటకుముందింతకాలమున బాంకివారికి నోటీసునిత్తునని గాని, ఏర్పాటుతో జరిగినవ్యాపారమునకు Fixed Deposit అనియును, అట్టి వ్యాపారమునే చేయు బాంకికి Bank of Deposit అనియుఁ బేరులు. ఇట్టి బాంకులు సర్వసాధారణపు బాంకిడిపోజిట్టునందుకన్న నెక్కువ వడ్డీ నిచ్చెడివి. కొందరు భాగస్వాములు కలసి కొంత ద్రవ్యముంగూర్చి నిర్మించినదానికి Joint Stock Bank అని పేరు. ఒక్కనియొక్క స్వంతద్రవ్యముతోఁ గాని పదిమందికిమించని భాగస్వాములద్రవ్యముతోఁ గాని స్థాపింపఁబడిన బాంకి Private bank అని యెదరు. బాంకిమూలధనమునకు capital అనియు, వాటాలద్రవ్యములకు Bank stock అనియు సంజ్ఞలు. తనసొంతనోట్లను తాను issue చేయుటకు ప్రభుత్వమువారివలన నంగీకరింపఁబడిన బాంకికి Bank of issue అనియెదరు. అట్లా బాంకివలన issue చేయఁబడిన (on demand I promiss to pay the bearer) నోట్లకు బాంకినోట్లని వాడుకగలదు. టపాలో దొంగిలింపఁబడుచెక్కులనుండి రక్షణగా Bank Post bills అనునవి బాంకివారివలన issue చేయఁబడును. ఇట్టివి Bank of England వారివి చూచినపిదప నేడు రోజులకు సొమ్ము చెల్లింపఁబడునఁట. ఇందు బాకీకి కమీషనుగాని రూపాయలకు వడ్డీగాని యుండదఁట. బాంకివారు సొమ్ముబదులిచ్చినతఱి, వారికివ్వవలసినవడ్డీ రేటు తఱుచుగ బాంకీవాటాదారుల సభయందప్పటి యాదాయవ్యయములననుసరించి యేర్పఱుపఁబడుచు హెచ్చింపఁబడుచుతగ్గింపఁబడుచుండును. దానికి Bank rate అనిపేరు. బాంకియొక్క స్థితిగతులు, అభ్యుదయక్షీణతలు నప్పటప్పట వాటాస్వాములకుఁ దెలుపఁబడుచుండు నద్దానికి Bank return అనియెదరు.

బాంకికిఁజేరిన చెక్కుల నితర బాంకులనుండి వసూలుచేయు వ్యవహారము జరుగుస్థలమునకు Bankers clearing House అని యందురు. ద్రవ్యనష్టములు కలిగి బీదవాడై దివాలాతీసిన వానిని Bank rupt అనియెదరు.

ఈ సందర్భమున బాంకివ్యాపార చరిత్రిం చుకవివరించుట సమంజసము. విజయనగర సామ్రాజ్యమేలిన శ్రీకృష్ణదేవరాయ సార్వభౌముని సోదరుఁ డచ్యుతదేవరాయ సార్వభౌముఁడు క్రీ.శ. ౧౫౩౯ సంవత్సరమున తన రాజ్యమున ననంతనిధి యను పేరున బాంకి

స్థాపించెనఁట. ఇది యాంధ్రదేశమున మొదటి బాంకిఏర్పాటని తెలియుచున్నది.

ఇటలీదేశపు వెనిస్ నగరముననుు, స్పానియా దేశపు బార్సిలోనానగరముననుు, హాలండుదేశములోని ఆంస్టర్డమ్ నగరమునను చిరకాలము క్రిందట నేటో మోస్తరుబాఁకిపద్ధతి యుండెనని వినుదుము గాని యంతకన్న నేమియుఁ దెలియరాదు. ఆంగ్లసీమయందు ఒకటవచార్లెసు పరిపాలనముననో, పిదపనో యొకవిధమగు బాంకివ్యాపార ముండెనందురు గాని క్రీ. వె. ౧౬౯౪ సంవత్సరమున మొట్టమొదటియేర్పాటుగ Bank of England ఏర్పాటుచేయఁబడినది. తోడనే యట్టియేర్పాట్లు మఱికొన్ని యేర్పడెనఁటగాని ౧౬౯౭ సంవత్సరమున రద్దు పఱుపఁబడియాపివేయఁబడినవి. క్రమక్రమముగ నాటంకముతగ్గి పదునెన్మిదవశతాబ్దమున గొన్ని Private Banks తలసూపెనుగాని క్రీ. వె. ౧౮౩౩ సంవత్సరమున London and Westminister Bank యేర్పడి వ్యాపారమారంభింపఁగనే యున్ని బాంకులను చక్కనిపనిజేయఁ మొదలిడెనుకాని, యాప్రైవేటుబాంకులన్ని యు Banks of Deposit అయియుండెనఁట. పిదప క్రీ.వె. ౧౮౪౪ సంవత్సరమున Bank charters Act శాసింపఁ బడుటతో నోట్ల Issue నియమితమై యితరపద్ధతులుఁగూడ చక్కఁబఱుపఁబడుట బాంకులవ్యాపారము వృద్ధినంద నారంభించెను. కాని యప్పటప్పట వర్తకవ్యత్యయమూలమున నొక్కొకబాంకి దివాలాతీయుచుండుటయుఁ గూడఁగల్గియుండెను.

క్రీ. వె. ౧౮౬౨వ సంవత్సరమున Limited Liabilities Act శాసింపఁబడినపిదప నింగ్లాండునందు బ్యాంకివ్యాపార మభ్యుదయస్థితినందెను. అట్టి పద్ధతులపైన భరతదేశమునందు కొన్ని బాంకులేర్పఱుపబడి, పిదపవాట్లం జెక్కఁటిఁగల్పి యిప్పటి Imperial Bank of Indiaగాఁ జేయఁబడి వ్యాపారము సల్పుచున్నది. ఇదియె గాక పెక్కుబాంకులును పనిచేయుచున్నవి.

ఇంగ్లాండుబాంకులలో Bank of England మాత్రమె నోట్లనిస్యాచేయ స్వతంత్రము బడసినదఁట.

**బేకింగ్ ఎ బిల్** (Backing a bill)—(వాణిజ్యసంబంధ పరిభాషాపదము) ఎకమొదేషణ బిల్లు (హుండీ) పైని (surety) మధ్యవర్తి యంగీకరించి సంతకముచేయుటను Backing a bill అనియెదరు.

**బేక్డు నోటు** (Backed note)- వాణిజ్యసంబంధ పరిభాషాపదము. సముద్రముననుండు స్టీమరులోనికి పడవలలోనుండిగాని బంగ్లనుండిగాని పంపినసరకులను తీసుకొనుటకుఁ గాను ఖాయిదాకొట్టు వర్తకుఁడు ఎండార్సు చేసియిచ్చిన పత్రము.

**బేక్టీరియా** (Bacteria)—(అంటువ్యాధులు చూడుఁడు)

**బేక్ట్రియాదేశము**— (పాతాళరాజ్యము చూడుఁడు)

**బేక్టేరియాలోజీ** (Bacteriology)-- ఇది కేవల పాశ్చాత్య విజ్ఞానము. బేక్టేరియా నేత్రముల కగుపడునదికాదు. బలమగు భూతద్దములతోఁజూచినఁ గననగునదిగాన, భూతద్దముల నెఱుంగని యాదికాలమున దీనిం గూడ నెవ్వరెఱుఁగకుండిరి.

పరిశీలనలనుండి యిక్కాలమున కెఱుఁగఁబడిన బేక్టేరియా విజ్ఞానము మేరకిది vegitable substence అని తలంపఁబడుచున్నది. దీని నొక సుప్రసిద్ధాంగ్ల వైద్యవిద్యావిశారదుఁడు

"minute rod like spherical or filarientous aquatic plants" అని వివరించియున్నాఁడు. అతివేగముగ నభివృద్ధినంది పెరుగుటయు, విడిపోతగిన తునుకలతోఁ గూర్పఁబడి నదిగనున్న దగుటయు దీనికి వృక్షశాస్త్రవేత్తలు Schizophyta జాతిదనియెదరు. అనఁగా విడిపోవుజాతిమొక్క యని భావము.

బేక్టీరియా rod 1/50000 అంగుళము వెడలుపును (అనఁగా నరమైక్రను)—అంగుళమునందు 1/25000 భాగము పొడవు (అనఁగా నొకమైక్రను)నుకల్గి తరచుగనుండుననియు, నిం దనేక తునుక లొకటికొకటిగ దించినట్లంటుకొని యుండుననియు భూతద్దములతోఁ జూచినఁగాని కానరాకుండుననియుఁ జెప్పఁబడినది.

సూర్యకిరణములు voilet rays ను ప్రసరింపఁజేసిన, పెక్కుజాతుల బేక్టీరియా చచ్చిపోవునని కనిపెట్టఁబడినది. అందు ముఖ్యముగ Typhoid fever anthrax అనఁగా splenic fever మొదలగు రోగములఁ గల్గించు బేక్టీరియా నాశన మగునని చెప్పఁబడినది.

బేక్టీరియాయందు స్త్రీపురుషలక్షణ భేదములులేవు. కాని వీటికి Stato spores అనునవి కలవనియు, అవి కలయిక మాత్రముననే వృద్ధినొందుచుండు ననియు పరిశీలకు లనుచున్నారు. వీటినే కొందరు Resisting spores అనియు నందురు. బేక్టీరియా Chemical activity కి పేరందినది. Carbon, Hydrogen, Nitrogen, Oxygen, Sulphur అనునైదు Elements కలసియున్న జంతుశరీరపదార్థము, లేక వృక్షశరీరపదార్థములతోఁ సంబంధముఁ గల్గియుంట, వీనియుత్పత్తి విజృంభణములు కల్గునని కనిపెట్టఁబడినది.

కొన్నిజాతుల బేక్టీరియాలు నిరపాయకరములు. అందుకొన్ని జీర్ణశక్తి నభివృద్ధినొందించునవియుఁ గూడ గలవు. కొన్ని రోగములను వ్యాపింపజేయుచు ప్రాణాపాయకరములుగూడ నైయుండెడిని. పాలు, పెరుగు, వెన్న, జున్ను, మజ్జిగ పరిశ్రమలందునను, (Diary industry) Cheese making industry యందునను, బేక్టీరియా చేయుపనియే ప్రధాన కార్యమని కనిపెట్టఁబడినది. అంటువ్యాధులకుఁ గారణము బేక్టీరియా యనియు, అవి మనుష్యులకుఁ గాని జంతువులకుఁ గాని చెట్లకుఁగాని వ్యాపింపఁజేయుననియు కనిపెట్టఁబడినది. నిజమున Decompositions నందు అపాయకరమగు బేక్టీరియా లేకుండెనేని దుర్వాసనకన్న నధికమగు నపాయము లేదని చెప్పఁబడినది.

ఇంకను పొగాకు, తేయాకు, పాలు, పెరుగులు, ఛీజులు మొదలగువాటియందలి పదనులు, పరిమళములు, రుచులు కల్గుటకుఁ గారణము బేక్టీరియాయే యనియు, ఉచితోపచారములు మార్పులకుఁ గారణములనియు, తోళ్లు పదునుచేయుట,నానబెట్టుట Tanning చేయుట మొదలగుకార్యములందు, కురుపులచీమునందు, పచ్చరంగు కల్గుటయందు, నీలిమందుచెట్లనుండి నీలిరంగు దొరకుటయందు బేక్టీరియా కార్యమే ప్రధానమగు పనియని కనిపెట్టఁబడినది.

సముద్రోదకములందలి deeps నందు బేక్టీరియా జీవించదని కనిపెట్టఁబడినది. (సముద్రవిజ్ఞానము చూడుఁడు). నీటిపైభాగములందు, లోతులేని నీటియందు జీవింపఁగల బేక్టీరియా చేఁపల కాహారమగును.

కొన్నిజాతుల బేక్టీరియాలు రంగులఁ గల్గించును. రొట్టెలపై వ్యాపించు micrococcus prodigiolus అను నెట్టజాతియు, పురాతనపు నీటిగుంటలు చెరువులందలిమొం డాకులు కొన్ని

లపై వ్యాపించు bacterium rubesceus జాతియు, self coloured జాతులనియు, నదులం దాక పచ్చరంగు నీలిరంగు బేక్టీరియాయుండుననియు, కొన్ని జాతులు blue, violet రంగులు గలవి యుండుననియుఁ జెప్పఁబడినది.

బేక్టీరియాకాడలకు, నిజమున శాఖలుండవనియు, కనిపించనివన్నియుఁ జిన్న చిన్న తునుకల కూడికవలన నేర్పడిన false branches అనియుకనుఁగొనఁబడినది. ఇట్టి బేక్టీరియా జీవజంతువేమోయని భ్రమపడుటకుఁగారణములును గలవు. రెంటియందు dead or non living matter ప్రధానద్రవ్యమై యున్నది. అందు Elements of carbon, Hydrogen, Nitrogen, Oxygen, కొంచెముగా Sulphur Phosphates of lime alkalis ను గలవు. ఇవి యన్నియును గలసి Viscid labile material అగుచు, Protoplasam ఏర్పడును. ఇదియె వాటియందలి Cell-substanceగనై చెమ్మనఁబంధము కల్గుటఁజేసి Active life కలిగెడిని. ఒక్కొక్కతరి దాని కప్పటి పరిస్థితులనుండి Suspended animation ఏర్పడి నిల్వయుండుటయుఁ గూడ కలుగును.

సముద్రోదకములందలి కొన్ని జాతుల బేక్టీరియా సెంటిగ్రేడు ౦ డిగ్రీల తావునఁగూడ వృద్ధియగుననియు, నవి సెంటిగ్రేడు 65 డిగ్రీలకడ చాలజాతులు చచ్చిపోవుననియుఁ గొన్ని జాతులు వేడినీళ్ళయూటలలోఁగూడ 72డిగ్రీల వేడియందు బ్రతుకఁగలవనియు, అవి 100 డిగ్రీల వేడియందు (Boiling point) అన్ని Non spore producing జాతులు చచ్చుననియు, ఇంకఁ గొన్ని గట్టిజాతులు ముసలివగుతప్ప మూఁడుగంటల కాలమట్లుండినఁ గాని చావవనియుఁ గనిపెట్టఁబడినది.

ఒక్కొక్కతరి బేక్టీరియా జెల్లీవలె నగును. జెల్లీయనిన ద్రవమువలె పలుచన గాకయు, ఘనపదార్థమువలె కేవలము గట్టియుఁ గాక లేహ్యపాకముఁ బోలియుండు పదునని భావము. ఇందించుక జిగురు గలిగియుండును ట్లుండును. ఈ జెల్లీరూపము బంతివలెను, వలవలెను శాఖల గలిగినటుల నగపడుచు లోన ననేక జాతుల బేక్టీరియాలఁ గలిగియుండెడిని. జెల్లీరూపమున కీశాస్త్రజ్ఞులు Glocogenous అని పేరిడిరి. వృక్షశాస్త్రవేత్తలు పొరపాటున Zoogloca అనెదరుగాని ఇది జంతుసంబంధము కానిదగుట నాపేరుసరికాదు. జెల్లీయెదుగుచుండుతరి "Coenogloea (common)" అనియు నీటిపైఁదేలుచున్నను నడుగునమునిగియున్నను సామాన్యముగ "Mycoderma" యనియుఁ జెల్లెడఁబడినవి.

Micrococci జాతి Spirillum form జాతుల బేక్టీరియాలు తరుచుగ చకచక కదలుచున్నట్లగపడుచుండుతరి, దట్టమై మేఘములో యునున ట్లుండుతరి "Swarming phase" అనియు, కదలికలేక పడియుండినచిన్నముక్కలఁ బోలి నిలచియుండుతరి "Resting phase" అనియు పేర్లిడియున్నారు. వీటికదలికకుఁ గారణము చాల సన్నపుఁ దారములఁ బోలిన ప్రోటోప్లాసమ్ సమీపమునసె గాని యుండదే గాని యుండుననియు, నదియె కదలికఁ గల్గించుచుండుననియుఁ గనిపెట్టఁబడినది. దానికి "Cella" యనిపేరు. ఇది స్వచ్ఛమై (Transparent) కడుసన్నమై యుంటఁ గానఁబడుటదుస్తరమైయుండును.

మఱియు నీటిప్రవాహమున వేర్వేరురూపముల నందుచు జాతి మాఱుచున్నట్లగుపడుచుంటఁ బరిశీలనలందు గ్రహించుట కష్టముగనే యుండును.

బేక్టీరియాజాతు లెన్నియని నిర్ణయించుట కింకను పరికరములు చాలవనియె చెప్పఁదగును. ఎఱిఁగియున్నంతవఱకుఁ బేర్లిడఁబడినవి ముప్పది జాతు లనియు, వేయివఱకు నుపజాతులు నంతర్జాతులుఁ గలవనియుఁ దలంపఁబడుచున్నవి. వాటి నిట వివరించుటయు దుస్సాధ్యమే యైనను వీటియం దైదు తెగలు కలవని వివరించుట సమంజసము.

౧. Free oxygen కావలసినవి, పడనివి రెండురకములు. కావలసినజాతికి "Aerobic" అని పేరు. దీనినింకను "Aerobiontic bucleria" యనియు నందురు. దీనికి "Free oxygen" అందురు. ఇది లేకున్న Consequent chemical activities లేకపోవుటయే గాక బ్రతుకుటయే కష్టమనియెదరు.

. రెండవ జాతికి Anacrobic అని పేరు. ఇంకను దీనిని Anaerobiontic bacteria యనియు నందురు. దీనికి Free oxygen విష తుల్యముగ జంపెడిని.

౨. Spores గల్గించు తెగయు, కల్గింపని తెగయు రెండురకములు.

౩. రంగుపదార్థములుగల్గించు తెగయు, గల్గింపని తెగయు నిరుదెరగులు.

౪. Fluorescent. అనఁగా X. ray కిరణముల వెల్గునఁ గన్పించునవి, కన్పించనివి రెండు తెగలు.

౫. వేఁడి గాని Phosphorescence అనఁగా మెరుగుడుపురుగులఁబోలిన ప్రకాశము గల అణుమాత్రపు శరీరములు గల్గించునవి, కల్గింపనివి రెండురకములు.

ఈ యైదు తెగలందు పేర్లిడఁబడిన వన్నియుఁ జేరియుండును. అందు ముఖ్యములగువాటిని మాత్రము వివరింతుము.

మలేరియా (శీతపైత్య)జ్వరపు Parasites నకు Protozoa అనిపేరు. వీటినిగూర్చి Animal nature కలవికాని యివి Vegetable nature కలవి కావని ఇంకను నభిప్రాయపడుచున్నారు.

నోటిపండ్లయం దపరిశుభ్రత గల్గుచుండుతటి జనించుదానికి "Bacilli leptothrix" అనిపేరు. ఇది యధికముగ Chemical action కలది. పండ్లనొప్పి, పుప్పిపన్ను, పండ్లూడుట, నల్పు గల్గించును.

పుండ్లు, గాయములు, శుభ్రపఱచుచుండక నశ్రద్ధచేసిన జనించుదానికి "Septicaemic bacteria" యనిపేరు. ఇది యపాయకరమైనది. ఇంకను wound infiction జాతులు బేక్టీరియాలు నాల్గుకలవు. వాటికన్నిటికి సాముదాయకముగ "gasgangrene bacteria" అనియెదరు. Relapsing fevers అనఁగా (Famin fever) Trench fevers కల్గించు దానికి motile జాతిదగు Spirillum bacteria యనిపేరు. వీటి బెసిలై నల్లులచే వ్యాపించుననియు, Pulex cheopis అనుపేరుగల plague bacilli యెలుకలద్వారా మనుష్యులకు వ్యాపించుననియుఁ జెప్పఁబడినది. ఇంకను Pathogenous ba$_c$teria యను పేరుగలజాతి మేకలుమొదలగు పెద్దజంతువులకంటుకొని, లోనికరిగి, వాటిపాలగుండా మనుష్యులకు వ్యాపించి malta fever అను జ్వరముంగల్గించునని General Bruce అను వైద్యశిఖామణి కనుగొనినటులఁ జెప్పఁబడినది. ఇది యాజంతువులను బాధింపదఁట.

Iron bacteria యనుపేరుగలది soluble bi-carbonate of Iron కల యుదకములందునను, galvanized pepes పైనను

వ్యాపించి Reddish brown రంగును బ్రదర్శించుచుండునని చెప్పఁబడినది. దీనిని సర్వసాధారణముగఁ బ్రుదుష్పవట్టునట్లు భావించుచుందురు nitrogen bacteria అను పేరుగలది వ్యవసాయపుఁబొలములందు వ్యాపించి వాటికి బలకరమై యుండును. దీనియుపజాతి యగు Nitroso bacteria యనఁబడునది 'అమ్మోనియా' ను (అనఁగా N.H. 3.) నైట్రేటీసుగా పరిగణింపఁజేయును. ఇం దిఁకను గొన్ని జాతులు పంటలంబాడుచేయునవియుఁ గలవందురు.

కుష్ఠరోగమును గల్గించు బేసిలై క్రీ. శ. 1871లో నార్వేదేశమందలి బెర్జిన్‌పట్టణమున Hausen అనుపండితుఁడు కనుఁగొనెను. క్రీ. శ. 1?? లో Tubercle బెసిలై కనుఁగొనఁబడినదని చెప్పుదురు.

Micrococcus లేక Micrococci యను పేరుగల బేక్టేరియా యతివేగముగఁ బెరుగుటకుఁ జేరఁదినది. Macrococcusజాతియును లించుక పెద్దవి. వీనిలో స్రగుడ్లనుగల్గియుండును. Short bacellus అనియు, Long bacellus అనియు పేర్లుగల రెండుజాతులు సర్వసామాన్యముగనుండునవి. Ovoid farm (clostridium) జాతి మద్దెలను బోలి యుండునది. Peach coloured bacterium నుగొందరు Very large short bacillus అనియెదరు. వీటిగర్భమున ఏడు లేక యెన్మిది Sulphur granules ఉండును.

Vibrio form బేక్టేరియాయందు Undulate అనియు, More undulate అనియు రెండంతర్జాతులు గలవు. Sperillum జాతి బేక్టేరియాయందు Sperillum form అనియు, Folded Sperillum అనియు, Very short Sperillum అనియు, Close set sperillum అనియు నాలు గంతర్భేదములు గలవు. ఇవి కలరావ్యాధికిఁ గారణములు. వీటికి సాముదాయకముగ Comma bacillus అని పేరిడియున్నారు.

ఇవి గాక arborescent form జాతియు, Hay bacillus (ఎండుగడ్డియం దేర్పడు జాతి)యు, involution form జాతియు బేక్టేరియాలు గలవు. అందు ,,హే బేసిలస్సు'' అన్నిజాతులకన్న నధికవేగమున నభివృద్ధియగుటయు, ఇన్వల్యూషన్ ఫారమ్‌జాతి విఁతగ బలిసియుండి యధికముగ chemical action కల్గియుంటయు విఁతగొల్పెడిని. హేబేసిలస్సు దినమునకు 1,000,000,000,000 వఱకు వృద్ధినందునని చెప్పఁబడినది.

ఇట్టి బేక్టేరియా విజ్ఞాన మంతయు భూతద్దముపై నాధారపడి గ్రహింపఁబడుట దీని పూర్వచరిత్రయు నించుక వినోదకరముగనె యుండును. క్రీ. శ. 17 వ శతాబ్దాంతమున Antony van leenwenhock అను హాలండు దేశపువర్తకుఁడు తన నోటిపండ్లు పలుపు చుంటఁ బరిశీలించుకొ... యట జెరమ్ము కలవని కన్గొనెను. క్రీ. శ. 1730 లో డెన్మార్కు దేశస్థుఁడగు O. F. Muller అనుపండితుఁడు ఆదేశపు తీయనీటి బేక్టేరియాజాతులను నూరింటిని గన్గొని పేర్లిడి బొమ్మలు సహా వ్రాసి 1786 లో ,,animalia, infusoria, flu-vialiliaet terrestria" యను గ్రంథమును బ్రకటించెను. ఇందు బెక్టేరియాకు ,,విబ్రియో'' యనుపేరు గన్పించుచున్నది.

తరువాత జర్మనుదేశస్థుఁడగు Ehrenberg అనునాతఁడు మంచి microscope తో పరిశీలించి 1838లో Die infusionythurchen als volkomme organismen అను గ్రంథ

ము రచించుచో నందు 1500 జంతువుల బొమ్మలు ప్రకటించెను. ఇందు శాస్త్రాభివృద్ధి గాన్పించెడిని.

తరువాత Amici & J. Jackson Lister అనువారిపరిశీలన లించుమించు ప్రస్తుతస్థితికి దెచ్చెను. ఈలిస్టరుగారి సుతుండే సుప్రసిద్ధ శస్త్రవిద్యానిపుణుం డనంబడిన లిస్టరు ప్రభువు. క్రీ. శ. 1854 లో Davaine అను ఫ్రెంచిపరిశీలకుండు Splenic fever అనంబడు anthrax జ్వరపీడితమగు గొఱ్ఱె రక్తమున బాక్టీరియాయుండుట గనిపెట్టెను. పిదప నెల్లరు ను గొప్పగొప్ప పరిశీలన లొనర్చి బేక్టీరియా Vegetable kingdone గాని Animal సంబంధము కాదని యంగీకరించిరి.

దీనిని గొందరు ,,జరమ్సు థియరీ" యని వాడుచున్నారు. వీటినిగనిపెట్టిన మహనీయులు Pasteur, మఱియు Dr. Koch అనువైద్యులు. (జరమ్సు చూడుండు).

**బేక్ ఫ్రైటు** (Back Freight)— వాణిజ్యసంబంధ పరిభాషాపదము. ఏకారణము చేతనైనను (ఎగుమతిచేయంబడిన) సరుకు దిగవలసినతావునదింపంబడకుండ నెగుమతిచేయబడిన తావునకే తిరుగ పంపబడినపు డాతిరుగుమోతకగు ఛార్జీ (మూల్యము). ఇది సరుకుగలవారిచ్చుకొనవలసి యుండెడిని.

**బేక్బాండు** (Back bond)— వాణిజ్యసంబంధ పరిభాషాపదము. తనఖాపత్రము. ఒకరియొద్ద గొంతిసొమ్ము బదులుపుచ్చుకొని, వారికిం దనయాస్తిని (కుదువ) హామీ యిచ్చుటవలన ఋణమిచ్చినవారి కాయాస్తియందు ట్రస్టేర్పడును. ఆఋణముతీర్మానమగుతరి ట్రస్టుపోయి సంపూర్ణస్వాతన్త్ర్యము తిరిగి కల్గును.

**బేక్ వార్డేషన్** (Backwardation)— వాణిజ్యసంబంధ పరిభాషాపదము. సరుకులను ప్రత్యేకముగసొమ్మిచ్చికొనుటకంటె account adjustment చొకగc గుదిరినప్పటిస్థితి.

**బేటర్డు వాల్సు** (Battered walls)- (గోడలు చూడుండు.)

**బేడ్మింటన్ ఆట** (Badminton)— క్రీ. శ. ౧౮౭౩లో నాంగ్లదేశమునకుం దేబడిన యాట. లాంకెనిసువలెనే బేట్సు (Rockets) బంతులతోనిలువంబడి యాడుదురు. "Gloucester Shire" నందు డ్యూకాఫ్ Beanfort అనంబడిన సామంతప్రభువు, తొలుత నీయాట నాడినవాండంట. ౪౦ అడుగులపొడవు, ౨౦ అడుగులవెడలుపుంగల ప్రదేశమున (Court) నడుమ నడ్డముగ నొకజాలు తెరంగట్టి యటునిటు రెండుపక్షులుగ నీయాట నాడుచుందురు. వల నైదడుగులయెత్తున రెండకొయ్యలకుగట్టుదురు.

ఇది లాంకెన్నిసువంటి యాటయె గాని దానికన్న బలహీనమగు నాటగా దలంపంబడుచున్నది. దీని నిద్దరుగాని నల్గురుగాని యాడుట కలదు. నలుబది యడుగుల పొడవును, నిరువది యడుగుల వెడల్పునుగల్గినయంగణము (court) న నల్వురును, ఒక్కొకతరి నిద్దరే యాడుటకుం బదునేడడుగుల వెడల్పుగల యంగణము నిర్ణయ కాడుట కేర్పరుపంబడును. దీనినడుమ నైదడుగుల యెత్తగు చిక్కుతెర (net) గట్టి, యిరుదెసలనుండి యాటకాండ్రు ఫలకములం జేతంబట్టి దీనిని బంతులతో లాంకెనిస్సువలెనే యాడుదురు. ఈయాటయందు చేతిఫలకములను తనకండ్లకన్న నెత్తుగ పైకెత్తరాదనియు, బంతులంద్రిప్పికొట్టుచు నాడుట క్రిందుగనె జరుగుచుండవలెననియు నియమము కలదు. పదునేను పాయింట్లు (points) గెలిచి యాటకాండు జయమందినట్లు తలంపంబడును.

**బేతపూఁడి కృష్ణయ్యకవి**—ఆంధ్రకవులలో నాధునికులందుఁ బరిగణింపఁబడినవాఁడు. ఆఱువేల నియోగి. శ్రీవత్సగోత్రుఁడు.

ఈ కవి జానకీరాఘవము, (ఈ ప్రబంధము కమ్మవారగు నడపా నారప్పప్రభునకుఁ గృతి), అలమేలుమంగా వివాహము, పండిత మనోభిరామము రచించెను.

**బేదిమెట్రి** (Bathymetry)—నీటిపై దెబ్బతగులుతరి గలుగుశబ్దములంబట్టి యొక్కడి నీటిలోతుల నెఱుంగుకళ. ఇది సముద్రమున లోతు నెరుంగుట కాయాస్థలముల నుపయోగింతురు.

**బేదోమేటర్** (Bathometer)—మహాసముద్రములలోతును గొలచుటకు (త్రాడు తీగ గుండు మొ॥ అక్కరలేకుండ) నైన యొకపరికరము. దీనిని Spring balence అని యనియెదరు. ఓడనడుచుచుండఁగా లోతు నెఱుఁగఁజేయు యంత్రపరికరము.

**బేబి మహమ్మదీయ మతశాఖ**—పారశీక దేశమున క్రీ. వె. ౧౮౪౩ సం॥ర ప్రాంతమున బేబిలుద్దీ నను మహాత్ముఁ డీమతమును రచించెననియు, మహమ్మదీయ మతసంస్కరణముగ నాతఁడు కొన్ని క్రైస్తవ ధర్మములను, కొన్ని బౌద్ధధర్మములఁ గూడఁ జేర్చి యీమతమును గల్పించెననియు నందురు. దీనిఁగూర్చి సరిగాఁ దెలియరాకున్నది.

**బేబిలన్ పట్టణము**—ఇచటి నగరము చుట్టునుండినకోట పదునేను మైళ్ళొక్కొక్క దిశ కొలతఁ గల్గి, ౨౨౫ చౌకపుమైళ్ళ వైశాల్యము గల్గి యుండినదఁట. ఇప్పుడు పాడుదిబ్బ యై యున్నది. ఈకోటయందు దెబ్బది చౌకపు Towers ఉండినవఁట. ఇవి యొకటిపైనొకటిగ నుండినవియై ౬౬౦ అడుగుల యెత్తు గల్గి కడ Tower ఉండినదఁట. దానిపేరు Babel Tower అగుట నీవుటికిపేరుగల్గెనఁట. కోటగోడలు ౮౭ అడుగుల మందముగల్గి, ౩౭౦ అడుగుల యెత్తున నుండెనఁట.

**బేబిలన్ నగరపుటుద్యానవనము**—వీటికాంగ్లమున "Hanging Gardens of Babilon" అనియెదరు. ఈపూఁదోఁట బేబిలన్ భూపాలుఁడగు నెబూఖాడ్నెజారుయొక్క ప్రియపత్నియగు మెడియా దేశపు రాజకుమార్తెవినోదముకొఱకు కాయన చేయించెనని చెప్పఁబడినదఁట. ఇప్పు డాయుద్యానవన మంతరించుట నా తావును మాత్రముఁ జూపుచున్నారు.

ఇది నాలు గెకరముల పరిమితి ప్రదేశ మనియు ననేకఅంతస్తులు (terraces) గా నొకటి కన్న నొకటి యెత్తుగా మట్టుచేయఁబడె ననియు నన్నిటికన్న నెత్తైనతావున నొక సరస్సు నిర్మింపఁబడి దానిలోనికి యూప్రటీస్ నదీజలములు యంత్రములమూలమున నెక్కించుచుండిరనియు నానీటిచే నుద్యానవన మన్నియంతస్తులం దడుపుచుఁ బూదోఁటల నెంచుచుండి రనియు, అందనేకము ఫౌంటానాలు, పెక్క స్తంభములుఁ గూడ నమర్పఁబడెననియు నచ్చటచ్చట భవనములు, వినోదగృహములు నుండెననియు చెప్పఁబడినది. గాని యిప్పుడేమియుఁ గానరావు.

**బేబిలోనియా రాజ్యము**—భరతదేశ సంబంధమునఁగాకున్నను "బేబిలన్" అనుపేరు స్ఫురించినంతనే యది వైభవోపేతమైయుండిన మహానగరపుఁ బేరనియు, గొప్పబలవంతమై దనరినదియు నెబూఖాడ్నెజారు నృపతిపరిపాలించిన రాజ్యమునకు రాజధానియనియు తెలియుఁగాన దానిఁగూర్చి తెలిసియుంటయు సమంజసమే యగును.

ఈ రాజ్యభూమి టైగ్రిస్ యూప్రటీసునదుల

ప్రాంత దేశము. ఈనదులు తాముజనించిన ఆర్మీనియా దేశపు పర్వతములనుంచి జలప్రవాహముతోఁ గొనితెచ్చిన ఒండు నిల్వయగుచు పెరిగినభూమిగాఁ జెప్పనొప్పను. ఈపెరుగుట ౧౦౦సంవత్సరములలో మూడుమైళ్ళు లంకగ పెరుగుచుండుట సాధారణ పరిస్థితియై యుండని యూహనా వేయఁబడినది. ఒకకాలమున నీదేశమున పరిషియన్‌గల్ఫ్‌సముద్రతీరమున గొప్ప రేవుపట్టణముగ నుండిన 'ఎరిడూ' యనుపుర మిప్పుడు పారశీకసంయుక్తాగ్రగుడసముద్రము నుండి ౧౫౦ మైళ్ళదూరమున నుత్తరముగా నున్నది.

ఈనదులందు వరదకాలమున వెల్లువ లపరిమితముగ వచ్చుచుంట రెండునదుల కిరుదెసలను నీటికాల్వలు వెడలువగునవి విస్తారముగఁ దవ్వఁబడియు, వరదలవలన విస్తారమునష్టము తప్పుచుంటయు ఫలవంతమగు దేశము జలసమృద్ధిగల్గి పంటలదనముగ పండుచుంటయు వెడలుపగు నీటికాల్వలగుండా పడవలు తిరుగుచు రాకపోకలకు, ఎగుమతిదిగుమతులకు నదుపాయమధికముగ నుంటయు నీదేశమున కాధిక్యతం గూర్చుచుండెను. పెక్కండ్రుభూపతులు క్రొత్త కాల్వలం ద్రవ్వటంగూర్చియు, ప్రాతకాల్వలను తిరుగ లోతుచేయించి మరమ్మతుచేయించుటంగూర్చియు వేయించినశాసనముల నేకము లున్నవి.

ఇట్టి మహారాజ్యమునకు క్రీ. ము. ౪౨౦౦ నా డేమిపేరుండెనో తెలియరాకున్నది. క్రీ ము. ౨౫౦౦ సంవత్సరములనాడు బేబిలన్‌పట్టణప్రదేశమునకు త్తరభాగదేశము ఉరి లేక కియురిఅను పేరంబరగినటులను,దక్షిణభాగదేశము ఎంగి లేక కెంగి యను పేరం బరగుచుండినటులను తెలియుచున్నది. మఱికొన్ని శతాబ్దములకుం బిదప నుత్తరఖండము "అక్కాడ్" డనియు (అంగడి) దక్షిణఖండము సుమేరనియు పేర్గాంబరగెనని తెలిసెడిని. ఉత్తరభాగనివాసులు సెమెటిక్ తెగవారనియు, వారి యాదినివాస మరబ్బీదేశమనియుం దెలిసెడిని. ఇంక దక్షిణభాగనివాసులు సెమిటిక్ తెగకుఁ జెందిన సుమేరు లని తెలిసెడిని. వీరు క్యూనిఫారమ్ లిపిని వాడినవారు. వీరు నాగరికులుగఁ జెప్పఁబడినవారు. వారి క్యూనిఫారం లిపియు, బొమ్మలలిపినుండియు హీరోగ్లైఫిలిపినుండియు నెక్కువయభివృద్ధి నందినదిగ తోపకపోదు. క్రీ.ము. ౪౨౦౦ నాటి విట్టివికొన్ని బ్రిటిషుమ్యూజియమునం దుంపఁబడియుంట పోల్పనగుచున్నది. ఆనాటివారికి చిత్రములుచెక్కఁబడిన సౌఖ్యకరములగు గృహములును, పురములంజుట్టిన రక్షణదుర్గములును, కాలువలును గానవచ్చినవి. నేటికిఁగూడ దొరకుచున్న వారి చిత్రపుఁబనులు దానినిదృఢపఱుచుచునే యున్నవి. పరిశీలకు లింకను క్రీ. ము. ౬౦౦౦–౫౦౦౦ నడుమకాలముననే నాగరికులైయుండి రనుటకు వెనుదీయ నక్కఱయుండదని యన్నారు.

వీరిచరిత్రమును వ్రాసిన జర్మను దేశపు పండితుఁడగు Aduard Meyar చారిత్రకుఁడు సుమేరుల శరీరాకారములను, ధరించువస్తులను విమర్శించుచు నవి సెమిటిక్కుల దేవతల యాకారములతో పోల్కి గల్గియున్నటుల వివరించెను. సుమేరులు సెమెటులను జయించి, వారితోఁ గలసిపోయి యుండనోపు నని యాయన తలంచుచున్నాఁడు.

ఇట్టిప్రజలు పురములను, వాట్లప్రాంతముల పల్లెగ్రామములను నిర్మించుకొని నివసింపసాగిరి. వీరి కప్పట్టున నొక Central Government ఏర్పాటు జరుగలేదు. ఒకపెద్దగ్రామము రాజధానిగను, దానిచుట్టుపట్ల నుండు శివారుపల్లెలే రాజ్యముగను, వారినాయకుఁడే భూపతిగను

నేర్పాటులు జరిగి యనేకరాజ్యములు స్థాపింపఁబడిన ట్లాయెను. వాటికొక సుప్రసిద్ధపరిశీలకుఁడగు పండితుఁడు "City states"అని పేరిడి యున్నాఁడు.

ఇట్టి City states నిర్మాణమున కస్సీరియనులు మొదలిడిరి. ఆదిని అషూర్ సిటీస్టేటు ఏర్పడియెను. పిదప నొక్కొక్కటిగ పెక్కులు బయలుదేరెను. ఉత్తరమున అసీరియారాజ్యము, తూర్పున ఎలామ్ నందలి పర్వతములు, దక్షిణమున సముద్రప్రాంత భూప్రదేశమును అక్కాలమున కలాడు అనంబడు ఖాల్డియాయును, పశ్చిమమున సిరియాదేశపు ఎడారియు, అరబ్బీదేశపు ఎడారులును నించుమించు హద్దులుగాఁ గల్గిన సారవంతమగు ప్రదేశమంతయు సిటీసిటీస్టేటులే తయారయ్యెనని చెప్పిన నతిశయోక్తి కానేరదు.

ఇట్టి సిటిస్టేటున కధినాథుఁడగు భూపతికి పటేశి యను బిరుదనామమును, ఒకటి రెండు సిటీస్టేటుల కధినాథుఁడుగనో లేక ఎక్కువ గ్రామముల ప్రదేశము గలవాఁడుగనో యుండు సిటీస్టేటు అధినాథునకు షర్రు అను బిరుదనామమును ఉండెడిది. పరిశీలనలనుండి యిక్కాలమునకుఁ దెలిసియున్న సిటీస్టేటు లింకను ఉత్తరమునందు ౧. బేబిలోనియా, ౨. కిష్, ౩. ఓపిస్, ౪. సిప్పారు, ౫. కుతా, ౬. అగాడి (దీనికి అక్కాడనియుఁ బేరు కలదు). దక్షిణభాగమునందు ౧. లగాషు, ౨. షురుప్పాక్, ౩. ఉర్ (దీనికి ఉరి లేక కియూరి యనియుఁ బేరుకలదు. ఇది ఖాల్డియనుల సిటీస్టేటుగా నుండెను), ౪. ఎరిచ్, ౫. ఎరిడు, ౬. ఉమ్మా, ౭. అదాబ్ అనంబడునవియు నైయున్నవి. ప్రజలు వేర్వేఱుగనుంట వారి యిష్టదేవతలును వేర్వేఱుగనుండి ప్రతిస్టేటునందు నొక్కొక్కటిగఁ గాని, ఎక్కువజాతులు ప్రజలుకలసియుండుస్టేటులందు ఎక్కువసంఖ్యగాఁ గాని దేవస్థానములు ప్రతిస్టేటునందు నిర్మింపఁబడి వేర్వేరై యుండెను. ఏలయన ఆదిని ప్రజలు సుమేరులు, సెమిటులు, నై యుండినను ఇక్కాలమున భేదమనస్కులు గనై వేరువేరు మతాభిప్రాయముల నందిన వారుగనుమాఱియుండవలెను. ఈసందర్భమున లగాషునందు పటేశిగానుండినభూనాథుఁడొకఁడు గుడియా యనుపేరు గలిగినవాఁడు క్రీ. ము. ౨౪౫౦ సం॥ల ప్రాంతమునాఁడే పెద్ద రాజ్యమును పాలించినవాఁడనియు, గొప్ప భవనములను, దేవస్థానములనునిర్మింపఁజేసినవాఁడనియు, కాలువలం ద్రవ్వించి యనేక శాసనములు వేయించుటయేగాక తనశిలావిగ్రహముల రెంటిని స్థాపించినవాఁడనియు పేరొందినవాఁడు. ఆ విగ్రహము లిప్పుడు ఫ్రెంచిదేశమున లోవ్రెయి పురమున నుంచఁబడి యున్నవి.

ఇంక నీతులనే మంచిపేరందిన నృపాలుఁ డింకొకఁడు కలఁడు. ఆయన గూడియునకుఁ బూర్వుఁడో తరువాతివాఁడో సరిగాఁ దెలియకున్నది. కొందరాయన క్రీ.ము. ౩౮౦౦ నాటివాఁడనియు, మఱికొందరు క్రీ. ము. ౨౬౫౦ నాటివాఁడనియు, నిక కొందరు వేరుగ ననియు ననుచున్నారు.

ఈమహానీయుఁడు అక్కాడు భూపతియగు ఒకటవ సార్గాన్ నృపాలుఁడు. ఈయనకుఁ బ్రపంచమునాల్గుమూలల కధిపతి యని యర్థమిచ్చు బిరుదముండె నందురు. ఉత్తరపు బేబిలోనియా యంతయు నించుమించుగా నేలినవాఁడఁట. ఈయన పెక్కుశాసనములను వేయించెఁగాన అందీయనజీవితచరిత్ర కొంత లభించుచున్నది. గొప్పజయశీలుఁడు. ఈయనజన్మమేలనో యతి గోప్య మఁట. ఒకతట్టయం దుంచఁబడి నీట వదలివేయఁబడి "అక్కి"యను పేరుగల సేద్యగానిచే రక్షితుఁడై పెంపఁబడినవాఁడఁట.

ఈయునకుఁ బిదప నీయునసుతుఁడు నారామ్సిన్ రాజ్యమునకువచ్చెనఁట. ఈతఁడు క్రీ.ము. ౨౬౦౦ సంవత్సరములనాటివాఁ డని కొందర నెదరు. అక్కాఁడు అధికారముపిదప ఉర్‌నకు వచ్చెనఁట. దాని నేలిన భూనాథునిపేరు దుంగి యని తెలిసెడిని. ఉర్‌నుండి ఇసిన్‌పట్టణమును, తిరుగ దానినుండి ఉర్‌పురమును రాజధానీ గౌరవాధికారముల నందెనఁట. పిదప లార్సా యధికారస్థానమయ్యెనఁట. ఇట్టిమార్పులు జరిగి జరిగి క్రీ. ము. ౨౩౦౦ నాడు బాబిలోనియా "రా" వంశము సింహాసనమునకు వచ్చెను. అదివఱ కొకపాటి సిటీస్టేటు పరిపాలకులుగా నుండినది. ఎట్లట్లో యింతటినుండి క్రీ. ము. ౫౩౮ వఱకు చరిత్ర వరుసగ దొరకుచున్నది. పిదప పారశీకుల కీయధికారము వశ మయి పోయినది.

క్రీ. ము. ౨౩౦౦ సంవత్సరముల ప్రాంతకాలమునకు దొరకినచరిత్రము నిటుల వివరించిన పిదప పాలించిన రాజవంశములకు మరలవలసి యుండును. ఉత్తరభాగపు బాబిలోనియారాజవంశ మించుమించు క్రీ. ము. ౨౩౦౦ ప్రాంతమున ప్రారంభమగునట్లుతోఁచెడిని. ఈవంశము నం. దాఱవవాఁడగు నృపతి ఖమ్మురాపి లేక హమ్మురాబి క్రీ. ము. ౨౧౦౦ నాటివాఁడు. అక్కాలమున గొప్ప పరిపాలకుం డనియు, యుద్ధవీరుఁడనియు బాబిలోనియా సిటిస్టేట్సును స్వాధీనపఱచుకొని అస్సీరియాను లొంగదీసి ఎలామును వశవర్తులుగ నొనర్చెనని పేరొందిన వాఁడు. దేవాలయనిర్మాత. కాల్వలం ద్రవ్వించినవాఁడు. కూనిఫారం లిపియందు ధర్మశాస్త్రమును శాసనములుగ పెక్కుతావులందు స్తంభములపై చెక్కించి స్థాపించినవాఁడు. ఇట్టిదొక శాసనస్తంభము గొంపోఁబడి ఫ్రెంచిదేశమున Louvre పురమునం దుంచఁబడినది. దానినకలు లండను నగరమున బ్రిటిషుమ్యూజెయమునం దుంచఁబడి యున్నది.

తర్వాతదియగు కాస్సైటీరాజవంశము ఎలామ్ సంబంధపుది క్రీ.ము. ౧౭౫౦ మొదలు ౧౧౭౪ దనుక ౫౭౬ సంవత్సరములు బాబిలోనియాసింహాసనముంగైకొని పాలించెను. క్రీ.ము. ౧౬౦౦ ప్రాంతముల నీరాజ్యము పటిమం గోల్పోయి బలహీనమగుట కారంభించెను. ఈరాజవంశము వారిలో నిర్వురు, గొప్పపేరందిన నృపులు గాకున్నను రెండవబుర్నాబురియామ్ (క్రీ.ము.౧౪౦౦), ఆయనతర్వాతినృపాలుఁ డగు రెండవ కరయిండాష్ (క్రీ.ము. ౧౩౮౦) పేర్లు బయల్పడినవి గాన నిట వివరింపఁబడినవి. ఈవంశపునృపాలుల కాలమున ౧౬౦౦ ప్రాంతకాలమున అస్సీరియా దేశము జాతిపోయి స్వతంత్రమగుటయె గాక, బాబిలోనియా అస్సీరియాకు స్వాధీనమై వశవర్తియైయుండు దుర్గతికి పాలయ్యెను.

తరువాత సింహాసన మాక్రమించిన నృపాల వంశమునకు పాషీవంశ మనిపేరు. అది క్రీ.ము. ౧౧౮౪ మొదలు క్రీ. ము. ౧౦౫౨ వఱకు పాలించినది. ఇందొకనృపాలుఁడు సుప్రసిద్ధుఁడు. ఈతఁడు ఒకటవ నెబూఖాడ్నెజారు. క్రీ.ము. ౧౧౪౦ ప్రాంతమువాఁడు. ఈయన బాబిలోనియా (పతిత) రాజ్యమును పునరుద్ధరించెను. ఎలామును తిరిగి జయించెను. మెసపుటేమియా భాగముల నాక్రమించెను. సిరియాను వశపఱచుకొనియెను. బాబిలోనియా రక్షక దేవతయగు మార్డూకను లేక మరోడాను తిరుగ బాబిలోనియాలో ప్రతిష్ఠించెను, గాని అస్సీరియాభూపతి అషూరిషీషీయనునాతఁ డీతని సైన్యసహితముగ నెదిర్చి తనరాజ్యమునకు రానీయక తరిమివైచుటయగాక శత్రువుఁడై నిలచియుండెను. నెబూ

ఛాడ్నెజారునకు తర్వాతిభూపతులు బలహీనులు. అసీరియా దేశమును క్రీ. పూ. ౧౧౦౦నా డేలు చుండిన ఒకటవ టిగ్లాత్పైల్సెరు నృపతి తిరుగా బేబిలన్‌రాజ్యమును లోఁగదీసి సామంతరాజ్య ముగఁ జేసికొనెను.

తరువాత బాబిలోనియా రాజ్యపాలనము సల్పిన అయిదు, ఆరేడెన్మిదితొమ్మిది రాజవం శము లీదేశచరిత్రతో సంబంధముగలవి. వీట్ల యందలి కొందఱుభూపతులపేర్లు తెలిసెడిని. క్రీ. పూ. ౧౦౦౦ మొదలు ౬౦౦ వఱకు బాబి లోనియా రాజ్యపటిమ తగ్గుచున్నదనియే చెప్ప వలయును. క్రీ.పూ. ౬౨౫లో నెబోపోలాస్సా రను నృపతి (ఛాల్డియనుఁడు) బాబిలోనియాసిం హాసనము నధిష్ఠించి, మేడీలను బలముంగూర్చు కొని,అస్సీరియనులపై తిరుగఁబడి బాబిలోనియా రాజ్యమునకొక యుత్తేజముం దెచ్చెను. ఆయన సుతుఁడు రెండవనెబూఛాడ్నెజారుగారు (ఛాల్డి యన్) బేబిలోనియా సామ్రాజ్యమును వైభ వోపేతముగ నొనర్చెను. కాని ఈతండిక్కొడుకు లనాఁడు విద్యలు వ్యాపించలేదఁట. కుమారుని కాలము క్రీ. పూ. ౬౦౪-౫౬౨ అనఁబడినని.

ఈ రెండవ నెబూఛాడ్నెజారే క్రీ.పూ.౫౮౬ లో పాలస్తినాదేశపుజరూసలెమును ముట్టడించి, జహ్వాదేవాలయమును, పురమును దహింపఁ జేసి యూదులను తనదేశమునకు బలాత్కరించి గొంపోయినవాఁడని చెప్పఁబడినది. ఈతనికిఁ బిదప రాజ్యము క్షీణించుట ప్రారంభమై, కడ పటిభూపతి నెబోనిడస్ గారికాలము (క్రీ.పూ. ౫౫౫-౫౩౮) నందు ప్రజలచే స్వాగతమీయ యఁబడి, పారశీక నృపాలుండగు సైరెస్‌గారు రాజ్య మాక్రమించి యూదులను వదలివేయ, వారు వెడలిపోసాగిరఁట. ఇటుల నీరాజ్య మస్త మించుటతో నానాటికి పురములే మాఱిపోయి క్రొత్తపల్లెలు బయలుదేఱినవి.

**బేబెల్‌టవర్ (భాషలఏర్పాటు)**—క్రైస్తవులధర్మము మేరకు సృష్టికిం బిదవ నొకే భాషను మనుష్యులు వాడుచుండిరఁట. నోవా నాటి జలప్రళయమునకుఁ బిదప నొకప్పుడు ఆయనసంతతివా రందరేకమై దేవునిఆజ్ఞకువ్యతి రేకముగ నొక టవర్ (Tower) నిర్మాణము నకుఁగడంగి కట్టిరఁట. కినుకజెంది యొహోవా వారందరు వేర్వేరుభాషలు మాట్లాడునట్లు జేసి యొకరిభావము లొకరికి దూరమొనర్చె నని బైబిలునందు జెనిసిస్ ౯ యందుఁ గలదు. ఇటులజగమున భాష లనేకములైనవి. అట కల కలము గల్గుట నాకట్టడమునకు "బేబెల్ టవర్" అనుపే రయ్యెనఁట. బేబెల్ అనిన Confusion అనియు, noise అనియు నర్థము. అది పాడుపడుచున్న దీనావస్థయం దున్నది.

**బేరర్** (Bearer)—వాణిజ్యసంబంధమగు భాషాపదము. ఎవ్వరు దాని గొనిపోవునో వాఁడని యర్థము. ఆపత్రమెవ్వఁడు గొనిపోయి చూపి యడుగునో వాని కియ్యఁ దగినదానికి Bearer Bond అనిపేరు.

**బేరియము** — క్షారలవణములను నుండి గరఁగించి బలమగు విద్యుత్ప్రవాహమును దాని నెరపి భేదించుటచే బయల్పడిన ధాతువులలో నొకటి. పరిశీలకుఁడు సర్. హంఫ్రీ డేవిపట్టి తుఁడు. (హంఫ్రీడేవిపరిశీలకుఁడు చూడుఁడు.) ఇది క్షారధాతువు.

ఇది అగ్నిసంపర్కమున నాకుపచ్చవర్ణముగ జ్వాలలతో మండును. ఇది చాల సాహసవ యగునదిగా చెప్పఁబడినది.

**బేరోమెటర్** (Berometer)—వాతా వరణము (atmosphere) నందలి pressure ను కొలిచి ముందురాఁగల వర్షము మొదలగు కాలపరిస్థితుల నెఱుంగఁ జేయుపరికరము.

**బేరీ** (Barry)—ఐరిషునామము. సరిగా గురిచూచువాఁడని యర్థము. పురుషనామము. (క్రైస్తవనామములు చూడుఁడు).

**బేలన్సు ఆఫ్ ట్రేడ్డు** (Balance of trade)—వాణిజ్యసంబంధ పరిభాషాపదము. కావలసినకొంతకాలములోనొకతావు లేక దేశం యొక్క-యు,ఎగుమతులయొక్క-యు, దిగుమతులయొక్క-యు తేడా యనియర్థము.

**బేలన్సు ఆఫ్ పవర్** (Balance of power)—ఐరోపాఖండమునందలి రాజ్యములలో కొంచెము హెచ్చుతగ్గ క్రీ.వె. ౧౭౫౦ మొదలందరిమనస్సులందును వ్యాపించి యనుమానింపఁ జేయుచున్న రాజకీయసంబంధాలోచనము. ఇది"ఏరాజ్యమును అన్యరాజ్యముల స్వేచ్ఛాస్వాతంత్ర్యముల నడంచునటుల బలవంతముకానీయతగదు"అనిమైయున్నది. అనఁగా నన్నిరాజ్యములు తమతమస్వేచ్ఛాస్వాతంత్ర్యములతో నుండవలసినవే గాని యితరులవలన బాధింపఁబడరాదని భావము. ఇది చిన్నరాజ్యముల రక్షణకైన యేర్పాటని యందురు. రాజ్యముల యైకమత్య సూచకముగాఁ జెప్పుచుందురు.

**బేలన్సు షీటు** (Balance sheet)-వాణిజ్యసంబంధ పరిభాషాపదము. వర్తకము యొక్క- కొంతకాలమునందలి పెట్టుబడియు, జమలు, ఖర్చులు, లాభములు, నష్టములు, నిల్వ సరకులు, నిల్వధనములను వివరించు లెక్క-కాగితమని యర్థము.

**బేలారాక్ష గోత్రము**—(భరద్వాజ ఉపగణము చూడుఁడు.)

**బేలాస్టు** (Ballast)-(వాణిజ్యసంబంధ పరిభాషాపదము). రాళ్ళు, మన్ను, ఇసుక మొదలగువాట్లను మోయు నినుపదారిబండ్లను "Ballast Trains"అనెదరు.ఒకయోడయంఁదేసరకును లేక దనకవసరమగు బరువునకుఁగాను రాళ్ళుమొదలగువానిని వేసికొనవలసి వచ్చును. అట్లగుట కీపేరు వర్తించును.

**బేలూరు**— ఇది హాలిబేదు (తొల్లింటి దొరసముద్రము)నందలి దేవాలయములపనితనముంబోలిన పనితనముగలదేవస్థానములుగలది. (ద్వారసముద్రము చూ) బెఁగుళూరు పూనా రైలు(ఇనుపదారి)పైనున్న బనావరుస్టేషనునుండి హాలిబేదుమీఁదుగా మంచిబాట నిఱువది యాఱుమైళ్ళదూరమున బేలూరుగ్రామమున్నది. తొల్లింటి హొయిసల (బల్లాల) వంశనృపతులచే నిర్మింపఁబడిన చెన్నకేశవ దేవస్థానము చూడఁదగినది. ఇది హొయిసలభూపతి విష్ణువర్ధనునిచే క్రీ.వె. ౧౨ శతాబ్దమున నిర్మింపఁబడెననియు, నిర్మాత జక్కనాచారియను విశ్వబ్రాహ్మణుఁడనియుఁ జెప్పఁబడినది. చాళుక్య పనితనమున నసమానసౌందర్యవంతమని ఫెర్గూసన్ పొగడియున్నారు. ఫెరుగ్సన్పండితుఁడు "The amount of labour which each face of the poarch desplays, is such as I believe, never was bestowed on any surface of equal extent in any building in the world" అని వ్రాసియున్నాఁడు.

**బేస్బాల్ ఆట** (Baseball)— ఇది అమెరికా దేశఃపుజాతీయపుటాటగా నెంచఁబడుచున్నది. ఇది రౌండర్సుఆటను బోలిన యాట. ఏనూరడుగుల పొడవును, మున్నూటయేఁబది యడుగులవెడల్పుగల్గిన యొకపచ్చికరికమైదానమున మధ్యగ తొంబదియడుగుల కోలచౌకపు (Diamond shape) పల్లముంజేసి దాని యడుగుమూలకు హోమ్ (home) అనియు తక్కి-న మూలల కొకటి రెండు మూడు బేసు

(base) లనియు బేస్లిడి యందు పద్ధతులమేర కర్వాస్థలములందుండి బంతులతో నాడుదురు. ఈబంతిని కొట్టి యాటకు ప్రిక్కకు తోమ్మండుగురుగ నిలచియుందురు. ఈయాటనడుచుతరి దీనిధర్మములం బరిపాలించుచు విధించుచు నుండునధికారి యొకఁడుండును. అతని "umpire" అని పేరున వ్యవహరింతురు.

ఇది క్రీ. శ. ౧౮౪౦ లోఁ బ్రారంభమైనది. ౧౮౪౫లో అమెరికా న్యూయార్కు నందలి నిక్కర్ బోకర్ బేస్ బాల్ క్లబ్బువారిచే విధులు సంస్కరింపఁబడి యిట్టిపేరందినది. ఆనేకటీము లిక్కాలమున నాడుచున్నవి.

**బేసిక్కలర్సు** (Basic colours)—(రంగులు చూడుఁడు.)

**బేసిన్** (Basin) — Basin of the river. (నదులు చూడుఁడు.)

**బేసిలస్ సబ్టిలిస్** (Bacellus Subtilis)—ఇది జెర్మ్సు మైక్రోబ్సు బేసిలై మొదలగు జాతులకుఁజెందిన బేసిలై జాతులలో నొకటి. మిగుల నపాయకరమైనజాతిగఁ జెప్పఁబడినది. ఆంగ్లవైద్యశాస్త్రముగు ఆలోపతీవిధానమున "A little rod shaped organism standing out from all other bacteria by its amazing powers of resistance to heat" అని నిర్వచింపఁబడియున్నది. ఇది Hay fever అనఁబడు జ్వరములకుం గారణమని కనిపెట్టఁబడినవి.

పాలంగాచిన నందలిమైక్రోబ్సు అంతమందునని యందరెఱింగినదే. కాచనిపాలయందవి పెరిగి వేడికాలమందుఁగాని, ఉబ్బును, మెఱుపులుగలకాలమునందుఁగాని పులిసిపోవంజేసి చెడుపును. కాచినను అందుండు బేసిలస్ సబ్టిలస్ చనిపోవక అట్లే యుండఁగలవని పరిశీలనలు బయల్పరిచినవి.

మైక్రోబ్సు (Microbes) అనుకూలపరిస్థితులం దతిత్వరితముగ నభివృద్ధినంది యధికసంఖ్యాకము లగును. ఒకటియే యుండినను ఇరువదినె కెండ్లకాలములో పెరిగి రెండుగ తెగి యొకమినిటుకాలమున పదునారుగనై యవియె నెనుమినిట్లకాలములో ౬౪౦౦౦ గ నగునని పరిశీలకులు కనిపెట్టియున్నారు. కాని ప్రస్తుతపు బేసిలస్ సబ్టిలిస్ తడిగడ్డియందు (చెమ్మగలగడ్డి) (damp Hay) యందు పెరిగి అతివేడినిగల్గించెడిననియు, ఆవేడి తప్పించుకొనిపోవ వీలుకానియదనున అగ్నింగల్గించి ప్రమాదకరమగుననియు ననుభవమునుండి తేలుచున్నది. కానను వరిగడ్డి గోధుమగడ్డి మొదలగువాటిని జక్కఁగ నెండించిగాని కుప్పలుగ నిడరు. పొడియగువేడి వీటిని జంపఁగల్గునఁట. ఒక్కొక్కటి మిగిలి జీవించియున్న నభివృద్ధినందుటకు వలయుచెమ్మ యుండదు గాన వృద్ధిగానేరవఁట.

**బేసిలై** (Bacilli) — (అంటువ్యాధులు చూడుఁడు.)

**బైకాల్ సరస్సు** (Baikal lake)—సైబీరియా దేశ (పుదక్షిణ) ప్రాంతములనున్న తీయనీటిజలనిలయము. దీనింజుట్టి బైకాల్పర్వతిపంక్తి యుంటఁజేసి యిట్టిపేరందినది. పొడవు ౩౯౦ మైళ్ళును, వెడలుపు ౧౬ మొదలు ౬౦ మైళ్ళవఱకుఁగల్గి, వైశాల్యము ౧౩ ౫౫౦ చతురపు మైళ్ళని చెప్పఁబడినది. సముద్రపునీటిమట్టముపై ౧౫౬౦ అడుగులయెత్తున నున్నదఁట. అచ్చటచ్చట ౫౦౦౦ అడుగులవఱకు లోతుండుజలనిలయమని యనుచున్నారు. ఇం దనేక నదులు సంగమించునఁట. ఆసియాఖండమున నిది పెద్ద తీయనీటిసరస్సనియుఁ బ్రపంచమున నిది యారవదనియుఁ జెప్పఁబడినది.

**బై** (buy)—కొనుట లేక ఖరీదుచేయుట. (వాణిజ్యసంబంధపరిభాషాపదము.)

అనఁగా కొనుటయని యర్థము. కొను వానికి "Buyer" అనిపేరు. కొనువర్తకు లెక్కువగానుండుటకు "Buyers over" అనియు, అమ్మువా రెక్కువయుండిన Sellers over అనియుం బేరులు.

**బైచరాజు వేంకటనాథకవి**— ఆంధ్ర కవులలో మధ్యకవులందుఁ బరిగణింపఁ బడిన వాఁడు. క్షత్రియుఁడు. పెదతండ్రి లింగరాజు. తండ్రిపేరు పర్వతరాజు. తాతపేరు బాబిరాజు. వీరిపూర్వులలో నొకరగు బైచరాజు గారు సుప్రసిదులగుట వారినుండి వీరికి బైచరాజువారనియింటిపేరుకలిగెనఁట. ఈతఁడు క్రీ. వె. ౧౫౦౦ ప్రాంతమువాఁడని సి.పి. బ్రౌన్ దొరగా రభిప్రాయపడిరి. రచించినది పంచతంత్రము. ఆంధ్రపద్యకావ్యము. దీనిని హరిహర నాథున కంకితము చేసెను.

**బైజంటియమ్ పురము** (Byzantium)— ఇది యిప్పటి కాన్స్టాంటినోఫుల్ లేక తురుష్కుల స్తంబూల్ నగరము. అది క్రీ. ము. ౬౬౦ లో Byzas అను నాయకుని క్రింద మెగేరియానుండిచేరినకొందరు డోరిక్ జాతిప్రజలచే నిర్మింపఁబడి నివసింపఁబడినది. వారిచటి 'Golden horn' అనఁబడిన సముద్రపు టుప్పుటేటిపై నిర్మించిరని చెప్పఁబడినది.

కొంతకాలమునకు డెరయస్‌హిస్టాస్పస్ అను పారశీకప్రభూపతి ముట్టడించి దీనిని పాడుచేసెనఁట. కాని యచిరకాలముననే స్పార్టుల నాయకుఁడగు పౌసెనియస్ తిరుగ నిర్మాణముసల్పి వర్తకస్థలముగఁ జేసెనఁట. పారశీకులదౌర్జన్యమునకుఁ బిదప నూరువత్సరములదనుక అతెన్సు పురమువారితో కలహము, స్నేహము గూడ గలిగియుండుచు క్రీ.ము. ౩౫౫లో స్వతంత్రతం బడసెనఁట.

మేసిడోనియాభూపతి యగు ఫిలిప్ప్రభువు అతెన్సుపై దాడి వెడలుతరి బైజంటియమ్ అతెన్సుపక్షమునఁ జేరి నిలచి చిరకాలము వారి నెదిర్చెను. అలగ్జాండరుపరిపాలనమున కొంత స్వతంత్రితంబడసెనఁట కాని త్రేస్ నందు కుదిరిన సెల్టిక్ గాలులకు క్రీ.ము.౨౭౮నుండి యప్పనముచెల్లింప లోఁబడిపోయెను. పిదప క్రీ. వె. మొదటిశతాబ్దమున త్రేసుతోబాటు బైజంటియమును రోమనుసామ్రాజ్యమునకుఁ జేరిపోయెను. మహాకాన్స్టాంటైను చక్రవర్తి బైజంటియపు స్థలప్రాముఖ్యతంగుర్తించి యచ్చోరువంది దానిని తనరాజధానిగ నొనర్చుకొనియె నని చెప్పఁబడినది. ఆచక్రవర్తియె అత్తరి తనపేరున నీనగరము పరఁగఁదలఁచి "కాన్స్టాంటినోపి"లను నామము ప్రసాదించెనఁట. కాని తురుష్కుల నాడు వారు "స్తంబూ" లనునామకరణ మొనర్చిరఁట. నేటికిని వారల్లె వాడుచున్నను నితరులగు నైరోపాదేశములవారు క్రైస్తవులు గాన కాన్స్టాంటినోపి లనియె వాడుచున్నారు.

**బైజంటైనురాజ్యము**—ఇది తొల్లింటి రోమన్‌ఎంపైర్‌లోని రాజ్యభాగము. క్రీ. వె. ౩౯౫లో రోమనుసామ్రాజ్యము విభాగమై, అందిది తూర్పురాజ్యముగ నేర్పడినది. బైజంటియమ్ నగరము (కాన్స్టాంటినోపిల్ లేక స్తంబూల్ )రాజధానియయ్యెను.దీనియుచ్ఛదశయందు డాన్యూబుదేశములు, ఇటలీదక్షిణభాగము, బాల్కన్‌ద్వీపకల్పము, మధ్యధరాసముద్రపూర్వభాగప్రదేశములు, ఈజిప్టు, పశ్చిమ ఆసియాయందలి సీమలు నిందుఁ జేరియుండినవి. కాన్స్టాంటైనుచక్రవర్తి బైజంటియమ్‌పేరుమార్చి తనపేర "కాన్స్టాంటినోపిల్" అని పేరిడెను. టర్కులు తిరుగఁబడినకలహములందు కాన్స్టాం

టినోపిల్ వారి హస్తగతమై, ఆసియామైనరు వారికిఁ జేరిపోయెను. నికాకాఅను తావునకు రాజధాని మార్చఁబడెను. క్రీ. శ. ౧౩౫౪ లో ఉత్మాన్ తురుష్కులతోఁ గలహమున వారి వశమాయెను. వారు కాన్‌స్టాంటినోపిల్ పేరు మార్చి స్తంబూ లను నామ మిడిరి.

క్రీ. పూ. ౬౬౦ ప్రాంతమున బైజాంటియమ్, గోల్డెన్‌హారన్ అనంబడుచున్న సముద్రపుకాల్వ తీరమున నిర్మింపఁబడినదిగా పరిశీలకులు తలంచుచున్నారు.

**బైజవ గోత్రము**- (అగస్త్యిషేఁగణము చూడుఁడు.)

**బైజవాపన గోత్రము**— (గవిష్ఠిర గణము చూడుఁడు.)

**బైదల గోత్రము**-(నిధ్రువగణము చూ.)

**బైధా గోత్రము**— (జమదగ్నిబిధా ఉపగణము చూడుఁడు.)

**బైధానవగోత్రము**-(శండిలగణము చూ)

**బైనాక్యులర్**— ఇది దుర్భిణీ జాతులలో నొకటి. దూరమున నుండెడివస్తువులను సమీపముననున్న ట్లగపఱచు నద్దముల పరికరము.

**బైప్లేనులు**—(ఏరోప్లేనులు చూడుఁడు.)

**బైబిలు చరిత్ర** – ఇక్కాలఁపు నాంగ్ల పాలనమున చరిత్రలం జేసుక్రీస్తుమతకర్తకుం బూర్వపుకాలమునకుబి.సి.(Before Christ) అనియు, క్రీస్తువెనుక (Anno Domini or after Christ) నకు A.D. యనియు గురుతులు వాడఁబడుచుంట యెల్లరెఱింగినదే. బి.సి. కాలచరిత్ర ప్రాతనిబంధన యనియు, A.D. కాలచరిత్ర క్రొత్తనిబంధన యనియు బైబిలు రెండుగ్రంథములుగా నున్నది. నిబంధనపదమున కాంగ్లమున Testament అనుచున్నారు. కాని యూదిని 'Covenant' అని వాడుచుండిరఁట. అత్తరి వారియర్థము "దేవునివాగ్దాన" మని యయ్యుండెనఁట. పరమేశ్వరవాగ్దానము పూర్వనిబంధనలోఁ జెప్పఁ బడినది. క్రొత్త (ఉత్తర) నిబంధనయందు నిల్పుకొనఁబడినదని క్రైస్తవు లనెదరు. ఇంకఁ గొందరు క్రొత్తనిబంధన క్రొత్తవాగ్దాన మనుటయుం గలదు.

బైబిలుపదము గ్రీకుభాషాపదమగు Biblia నుండి కల్గినది. ఆ గ్రంథ మని దీనికి గ్రీకుభాష యందర్థము. ఆదిని Papyrus పొరలపై హీబ్రూభాషయందు యూదచరిత్రకారులు వ్రాసికొని పవిత్రగ్రంథముగ నుంచుకొనిన చరిత్ర గ్రంథము. పాపిరస్ అనుమాటకు గ్రీకుభాషయందు Biblos అనెదరు గాన గ్రీకులా గ్రంథమును 'Biblia' అని వాడుచుండిరఁట. వారినుండి యిటాలియను లాగ్రంథమును గైకొని వారి లాటిను భాషలోని కాపదమునే గైకొని పవిత్రగ్రంథమని యర్థమిచ్చు బిబ్లియాసేక్రా యని వాడఁదొడఁగిరఁట. రోమనులనుండి గైకొనిన యాంగ్లేయులు వారిభాషానువాదపదములగు "Holy Bible" అని వాడనారంభించిరఁట. ఇన్ని మార్పులనందినను దానికి "పవిత్ర గ్రంథ"మనియే యర్థము నిలచియున్నది. ఇది యూదులనాఁడాదిని ఒక్కఁడు వ్రాసినదికాక, పెక్కుండ్రు వేర్వేరు కాలములందు వేర్వేరు భాగములు వ్రాయఁ బిదప నన్నిటిం జేర్చి కూర్చిన గ్రంథముగాన దీనికర్థము పుస్తకము అనుటయే సమంజసముగనుండెడిని. క్రైస్తవులు దైవధర్మ రహస్యములు, మానవధర్మ రహస్యములు నిందు వివరింపఁబడినవని చెప్పుచున్నారు గాని యూదులనాఁడు జీవిత స్మృతి రహస్యము లిందున్నవని తలంచుచుండిరి.

ఇట్టి పవిత్రగ్రంథమగు బైబిలును మొలుత రచించినది యూదులు. వారికింకను ఇస్రాయేలీయు

లనియు, హెబ్రూజాతివా రనియుఁ గూడ వాడుకనామములు కలవు. అన్నిటి కీయూదమొకటియే యనుచుందురు. నిజము పరిశీలించిన నీగ్రంథము వారిస్వచరిత్రగనే యున్నది. వారు వ్రాసికొనినదియె. అందు వారికి తాము దేవునిచే నెన్నుకొనఁబడిన స్వజన మనియు, వారి నెప్పు డాపరమేశ్వరుఁడే కాచి రక్షించుచుండువాఁడనియుఁ, గాన వారికి దైవబలము కలదనియు. వారు లోకమునకంతకు ప్రధాన జనమనియు నమ్మక ముండినటులఁ గాన్పించెడిని. పరమేశ్వరుఁడు వారి కేవాగ్దానము లొసంగెనో వాటినే యా పవిత్ర గ్రంథమున వ్రాసిరఁట. తాము పరమేశ్వరుని స్వంతప్రజల మని చెప్పుకొనుటనుండి చాల గర్వముఁ గలిగియుండి రని పించకపోదు. ఐననువారిమతధర్మములనే యించుమించుగ నవలంబించియున్న క్రైస్తవు లందఱియందీగర్వము గాననగుచునే యుండెడిని. ఏలయన నన్యమతస్థులు రాళ్లకు రప్పలకు మ్రొక్కు విగ్రహారాధకు లనియు, తాము నిజదేవు నారాధించు లేక దైవోపాసకుల మని యనువారును తాము వెలుగునం దున్నా మనియు, నన్యులు చీకటియందున్న వారని పల్కువారును, బైబిలును సత్యవేదమని నుడువువారును క్రైస్తవేతర మతస్థులను Heathens (un-enlightened persons) అని హేళనగ వచించువారు వీరియందుఁ గాననగుచుందురు. క్రైస్తవ మతధర్మమున తండ్రి, కుమారుఁడు, పరిశుద్ధాత్మ త్రితయముగఁ జెప్పఁబడినది.

ఇందుతండ్రియనపరమేశ్వరుఁడును, కుమారుఁడన నేసుక్రీస్తుప్రభువును అని వీరిభావము. పరిశుద్ధమగు ఆత్మను "Holy Ghost" అనెదరు. అది గువ్వపిట్ట (Dove) రూపముననుండి పైవ్రాలు నందురు. ఈ మూటింగల్పి యార్షమతమున సృష్టిస్థితిలయములకు నిరూపణాకార నామములుగఁ జెప్పఁబడిన బ్రహ్మ విష్ణు శివుల త్రితయముం బోలిన త్రితయముగ నుడివియున్నారు. కుమారుఁడగు క్రీస్తుప్రభువును దేవునిసుతుఁ డందురు. ఆయన బోధకుఁడై యుండెఁగాన "మెస్సయా"యనివాడెదరు. ఈ రెండునిబంధనగ్రంథములం బరిశీలించినపూర్వనిబంధనయందు మెస్సయాకొఱకు నిరీక్షించుటయు, ఉత్తరనిబంధనయందు తాము నిరీక్షించునట్లు క్రీస్తుప్రభువు దేవుని రాజ్యమును స్థాపించుటయందు యూదులశత్రువులం జయించి తరిమివైచుచు తమ్మధికారమునం దిడుగ నిల్పుటకు మారుగ నాయన బోధలొనర్చి సాధువై శత్రువులను ప్రేమింపవలయుననియు, శత్రువు కుడిచెంపపైఁ గొట్టిన నెడమచెంప నందీయుమనియు బోధించుచుఁ జేపలవాండ్రను శిష్యులుగఁ గైకొనియుంట దేవుని వాగ్దత్తము ఫలించలేదని నిరాశజెంది యాబోధకునిఁ జేరక వదలివేయుటయుఁ గాన్పింపకపోదు.

ఈసంగతుల నింతట వదలి బైబిలు ఆంగ్లానువాదగ్రంథచరిత్ర మించుక విచారింపఁదగును. ఆదిని కొందరు యూదచరిత్రకారులచే రచింపఁబడి, వారినుండి గ్రీకులకును, వారినుండి రోమనులకును, వారినుండి బ్రిటిషువారికిని చేరిన లాటిన్ భాష బైబిలుగ్రంథము పదునేనవశతాబ్దపూర్వభాగమున, నింగ్లాండు రోమనులక్రింద నుండునాడు, John Wycliffe గారను నొకవిద్వాంసుఁడు (యార్కుషైరునివాసి) బైబిలుమహాగ్రంథము నెల్లరుఁ జదువుకొని యుచితరీతి నర్థము గ్రహింపఁ దగినదిగాఁ దలంచి యింగ్లాండుదేశ మంతటను దాని కథనములను ప్రజలకుఁ బ్రబోధ గావింప నారంభించి, పెక్కండ్ర నాకర్షించుచుండెనఁట. తన బోధలం దాయన తాను నిజస్థితిం గన్గొంటి ననియు, కడకు సత్యమే జయమందు ననియు

ననుచుండువాఁడఁట. ఆమహాత్ముఁడు ప్రొటెస్టాంటుక్రైస్తవుఁ డైనటుల స్పష్టముగాఁ గానరాదు. ఆయనబోధ లాయన Lutherworth గ్రామమున మరణించుటతో నంతరించినట్లాయెను. పిదప ముప్పదిసంవత్సరములనా డాయనయెముక లాగోరీనుండి పెల్లగించి యేటంబడ వైచిరని చెప్పఁబడినది. పిదప మఱి డెబ్బదిసంవత్సరములుకూడఁ గడచినపిమ్మట William Tyndale అనునాయన వైక్లిఫ్‌గారి వ్రాతల నన్నిటిని జక్కఁగఁజదివి మనస్సు గుదుర్చుకొని, రోమన్కాథలిక్ నిబంధనలనుండి తప్పించుకొనఁ దలంచినవాఁడై కొందరుపండితులం గుదుర్చుకొని వారితో జర్మనీదేశములోని హాంబర్గునగరమున కరిగి యట నిర్భయుఁడై లాటిన్భాషయందుండిన బైబిలుగ్రంథమును ఆంగ్లభాషలోని కనువదించి, కష్టములచేతను కాయక్లేశములచేతను పరివృతుండయ్యు నెట్లెట్లో కష్టముపై నాయనువాదగ్రంథము నింగ్లాండునకుం జేర్చెనఁట. దీనిని మతాధిపతియగు నప్పటి పోపు జగద్దేశికుం డంగీకరింపమి వారా యనువాదఁపుఁబ్రతులం జేర్చి సెంటుపాల్సుచర్చి యావరణమున నగ్నికి సమర్పించి తగులఁబెట్టిరఁట. టిండేలుగారును,ననుచరవర్గమును తప్పించుకొనుచు చెదరియు తిరుగ నాంగ్లానువాదగ్రంథము వ్రాయుచు బెల్జియమునందలి ఆంటువర్ప్పురమున ముగించిరఁట. ఆయన నట నిర్బంధించి బ్రస్సెల్సునగరమున బంధమున నిడి మరణింపజేసిరఁట గాని యాగ్రంథము వారికిఁ జిక్కలేదఁట. ఆగ్రంథమే నేటి బైబిలుగాఁ జెప్పఁబడినది. దీనిని John Porter గారు వ్యాపింపఁజేసిరందురు. క్రీస్తుప్రభువును "Light of the world" అని యాంగ్లేయులు బల్కెదరు.

## బైబిలునందు వివరింపఁబడినమేరకు చరిత్రాత్మకవిషయములు—

ఇవి క్రీ.ము. జరిగినవిషయములని యెఱుంగునది. క్రీస్తు పుట్టువఱకు నడచినకాలము అనఁగా క్రీ.ము. ౪౦౦౪ మొదలు క్రీ.వె. ౧ వఱకు సంవత్సరముల నారు భాగములుగ విభజించి వాటికి 'Period' అని పేరిడియున్నారు.

౧ పీరియడ్— క్రీ.ము. ౪౦౦౪ మొదలు క్రీ.ము. ౨౩౪౭ వఱకు

| | | |
|---|---|---|
| ప్రపంచసృష్టి— | జెనిసిస్ ౧-౨ | క్రీ.ము. ౪౦౦౪ |
| ఆదం ఈవుల పతనము | ,, ౩ | ,, ,, |
| కెయిన్ (కాబెల్) జననము | ,, ౪-౧ | ,, ౪౦౦౨ |
| ఆబెల్ (Abel) జననము | ,, ౪-౨ | ,, ౪౦౦౧ |
| ఆబెల్ మృతి (వధ) | | ,, ౩౮౭౫ |
| సేత్ జననము ఇప్పటికి ఆదమ్ ౧౩౦ వయస్సు | | ,, ౩౮౭౪ |
| ఎనోచ్ జననము | | ,, ౩౩౮౨ |
| మెతుసెలాజననము | | ,, ౩౩౧౭ |
| ఆదమ్ మృతి (౯౩౦ సంవత్సరములవృద్ధు) | | ,, ౩౦౭౪ |
| ఎనోచి ట్రాన్సిలేషన్ ౩౬౫ సం॥ వయస్సు | | ,, ౩౦౧౭ |
| సేతు మృతి వయస్సు ౯౧౨ సం॥ | | ,, ౨౯౬౨ |

నోవా జననము — క్రీ.ము. ౨౯౪౮

జలప్రళయముంగూర్చి వెరపింపఁబడి పశ్చాత్తాపబోధ నోవా నెరపుట (ఇది ౧౨౦ సంవత్సరములకాలము జరిగినది) — ,, ౨౪౬౮

మెతుశెలా మృతి (వయస్సు ౯౬౯ సం.) — ,, ౨౩౪౮

నోవా తన ౬౦౦ సంవత్సరముల వయస్సున ఆర్కు ఓడయందు ప్రవేశించుట (జలప్రళయము) — ,, ౨౩౪౮

౨ వ పీరీడు క్రీ. ము. ౨౩౪౮ మొ॥ క్రీ. ము. ౧౯౦౬ వఱకు.

నోవాజలప్రళయాంతమున ఆర్కు వీడి దిగుట. — ,, ౨౩౪౭

బేబెల్ నిర్మింపఁబడుట — ,, ౨౨౩౪

భాషలు, మనుష్యులజాతులు వేరగుట — ,, ౨౨౩౪

నిమ్రోదుభూపతి బేబిలోనియా అస్సీరియా రాష్ట్ర ప్రారంభము చేయుట — ,, ౨౨౩౩

మిశ్రాయీమ్ ఈజిప్టు దేశప్రభుత్వప్రారంభము — ,, ౨౧౮౮

నోవామృతి (వయస్సు ౯౫౦ సంవత్సరములు) — ,, ౧౯౯౮

అబ్రహామ్ (ఇబ్రహీమ్) జననము — ,, ౧౯౯౬

౩ వ పీరీడ్ క్రీ.ము. ౧౯౯౬ మొదలు క్రీ.ము. ౧౪౯౧ వఱకు.
అనగా ౪౩౦ సంవత్సరముల కాలము.

అబ్రహాము (ఇబ్రహీం) తన ౭౦వయేట పిలువఁబడుట — ,, ౧౯౩౬

అబ్రహాము (ఇబ్రహీం) కనానీయులపిలుపు — ,, ౧౯౨౧

అబ్రహాము రాజులనుగెల్చి లాతును విడుదలచేయుట — ,, ౧౯౧౩

అబ్రహాము (౮౬వయస్సున) ఇస్మాయేలుజననము — ,, ౧౯౧౦

అబ్రహాము (అబ్రాముమండి) పేరుమార్పు; దేవుని యొడంబడిక; సున్నతి ప్రారంభము; లాతువిడుదల; సోదొముగొమొర్రా; అద్మా-జబోలిమ్ నాశనము, (అసూయతవలన అగ్నిదహనము) — ,, ౧౮౯౭

ఇస్సాకు జననము (అబ్రహీమువయస్సు ౧౦౦ సం॥) — ,, ౧౮౯౬

అబ్రహాము అగ్నిబలిగా ఇస్సాకునీయ యత్నపడుట. — ,, ౧౮౭౧

అబ్రహాము భార్య సారామృతి (వయస్సు ౧౨౭ సం॥) — ,, ౧౮౫౯

ఇస్సాకు రిబకాల వివాహము — ,, ౧౮౫౬

ఇస్సాకు (వయస్సు ౬౦ సం.) జాకోబు (యాఖూబ్) ఇస్సావు జననము — ,, ౧౮౩౬

అబ్రహాము మృతి (వయస్సు ౧౭౫ సం॥) — ,, ౧౮౨౧

యాకోబు తన మేనమామనుకడకు (సిరియాలోని లాబానుకు) పయనమై యట నాయనకుమార్తెలు వేరూరాచేలురిద్దరను వివాహమగుట — ౧౭౫౯ మొదలు ౧౭౫౦ వరకు

జోశెప్ (యూసూఫు) జననము (యాకోబువయస్సు ౯౦ సం.) — క్రీ.ము. ౧౭౪౬

యాకోబు కనానుకు తిరిగి వచ్చుట — ,, ౧౭౩౯

జోసేపు తనసోదరులవల్ల బానిసగా నమ్మఁబడుట క్రీ.పూ. ౧౭౨౮
జోసేపు కల విరిచి చెప్పి గొప్పవాఁ డగుట ,, ౧౭౧౫
జోసేపు సోదరు లీజిప్టులోనుండుట (కొడుకువద్ద) ,, ౧౭౦౬
యాకోబు మెసయ్యానుగూర్చి చెప్పుట, మృతి (౧౪౭ వయస్సు) ,, ౧౬౮౯
జోసేపు మృతి (వయస్సు ౧౧౦ సం॥) ,, ౧౬౩౫
ఆరోన్ జననము ,, ౧౫౭౪
మోసెస్ (మూసా) జననము ,, ౧౫౭౧
మోసెస్ (మూసా) మిడియానుకు పలాయనము ,, ౧౫౩౧
మోసెస్ (మూసా)నకు దేవునియాజ్ఞ ఇస్రాయేలువిడుదలకు ,, ౧౪౯౧

౪వ. పీరీడ్ క్రీ. పూ. ౧౪౯౧ మొ. క్రీ. పూ. ౧౦౦౦ వఱకు
అనగా ౪౯౧ సంవత్సరములు.

ఇస్రాయేలీయులు రెడ్సీని మహిమగా దాటుట క్రీ.పూ.౧౪౯౧
శీనాయిపర్వతముపై దశఆజ్ఞలు దేవుడిచ్చుట ,, ౧౪౯౧
మోసెస్ సోదరియగు మిరియామ్ మృతి (వయస్సు ౧౩౦ సం.) ,, ౧౪౫౨
ఆరోన్ మృతి (వయస్సు ౧౨౩ సంవత్సరములు) ,, ౧౪౫౨
మోసెస్ (మూసా) మృతి (వయస్సు ౧౨౦ సం.) [illegible] చుట ౧౪౫౧
ఇశ్రాయేలీయులు యొర్డాను నదిని దాటుట (కనాను [illegible]
స్వాధీనపఱచుకొనుట). ,, ౧౪౫౧
జోషువ మృతి (వయస్సు ౧౧౦ సం.) ,, ౧౪[illegible]
శామ్యుఅల్ (సమూయేలు) జననము ,, ౧౧౫౫
ఎలి (పెద్దగురువు) మృతి ఫిలిస్టినియులు, దేవుని మం[illegible] (Ark) [illegible] ,, ౧౧౧౬
సౌలు ఇస్రాయేలీయులరాజుగ (anointed) ,, ౧౦౯౫
డేవిడ్ (దావీదు) జననము ,, ౧౦౮౫
డేవిడ్ (anointed) గోలియాత్‌ను వధించుట ,, ౧౦౬౩
సౌలు యుద్ధాపజయమంది నిరాశతో ప్రాణమువిడుచుటయు, డేవిడ్ యూదుల
రాజగుటయు ,, ౧౦౫౫
ఇశ్రాయేలీయులరాజగు ఇష్బొషెత్ హత్యచేయబడుటయు, ఆరాజ్యము దావీదు
రాజ్యమునకు జేరిపోవుటయు. ,, ౧౦౪౮
జెబూసిటీయులనుండి జరూసలెమ్‌పురము గైకొనబడి దావీదుకురాజధానియగుట. ,, ౧౦౪౭
డేవిడ్డు ఒతాషెబాతో లోపాయికారీ గల్గి ఆమెభర్తయగు ఉరియామృతికి
ప్రయత్నించుట. ,, ౧౦౩౫
దేవుఁడు నాతాను దీర్ఘదర్శిమహాత్ముని డేవిడ్డుకడకంపి ఆతనిపాపమునకు పశ్చా
త్తాపముగల్గించుట. ,, ౧౦౩౪

| | | |
|---|---|---|
| సోలోమోన్ (శిలేమాన్) జననము. | క్రీ.ము. | ౧౦౩౩ |
| అబ్సాలోమ్ తనతండ్రిపై తిరుగఁబడి జోఆబువలన వధింపఁబడుట | ,, | ౧౦౨౩ |
| డేవిడ్ సోలోమోనును (శిలేమాన్) రాజుగా ప్రకటించుటయు, తిరుగుబాటొనర్చిన అడోనిజాయనువాని నోడించుటయు. | ,, | ౧౦౧౫ |
| డేవిడ్ మృతి (వయస్సు ౭౦ సంవత్సరములు) | ,, | ౧౦౧౪ |
| సోలోమోన్ (శిలేమాన్) భూపాలుఁడు కట్టించిన జహ్వాదేవాలయము క్రీ. ము. ౧౦౧౧ మొ॥ ౧౦౦౪ వఱకు ఏడుసంవత్సరములు నిర్మాణము పూర్తియగుట. | ,, | ౧౪౦౦ |

౫వ. పీరీడ్ క్రీ. ము. ౧౦౦౪ దేవాలయనిర్మాణము మొదలు క్రీ. ము. ౫౮౮ జరూసలెమ్‌ను నాశనమొనర్చి యూదులను బేబిలన్ బందిగానీడ్చుకపోవుటవఱకు ౪౧౨ సంవత్సరముల కాలములోని సంగతులు.

ఈకాలమున యూదాదేశమొక రాజ్యముగను ఇస్రాయేలు దేశమొక రాజ్యముగను వేఱుగనుండెను. వేర్వేరు రాజులు పాలించుచుండిరి.

యూదాప్రభువులు.

| | | |
|---|---|---|
| రెహోబోమ్ భూపతి | క్రీ. ము. | ౯౭౫—౯౫౮ |
| అబిజా లేక అబిజామ్ భూపతి | ,, | ౯౫౮—౯౫౫ |
| ఆసా భూపతి | ,, | ౯౫౫—౯౧౪ |
| జహోషఫాత్ భూపతి | ,, | ౯౧౪—౮౯౨ |
| జహోరామ్ భూపతి | ,, | ౮౯౨—౮౮౫ |
| అహాజియాభూపతి | ,, | ౮౮౫—౮౮౪ |
| అథల్లాభూపతి | ,, | ౮౮౪—౮౭౮ |
| జోఆష్ లేక జహోఆహాజ్ నృపతి | ,, | ౮౭౮—౮౩౯ |
| అమేజియాభూపతి | ,, | ౮౩౯—౮౨౫ |
| ఉజ్జియా లేక అజారియాభూపతి | ,, | ౮౨౫—౭౫౮ |
| జోతామ్ భూపతి | ,, | ౭౫౮—౭౪౨ |
| అహాజ్ నృపతి | ,, | ౭౪౨—౭౨౬ |
| హెజికియా భూపతి | ,, | ౭౨౬—౬౯౮ |
| మనసియా భూపతి | ,, | ౬౯౮—౬౪౩ |
| ఆమోన్ భూపతి | ,, | ౬౪౩—౬౪౧ |
| జోసియా భూపతి | ,, | ౬౪౧—౬౧౦ |
| జోహోఆహాజ్ లేక షల్లుమ్ భూపతి | ,, | ౬౧౦(ఒకేసం.) |
| జోహోయికిమ్ భూపతి | ,, | ౬౧౦—౫౯౯ |

 బైబిలునందు వివరింపఁబడిన...

| | |
|---|---|
| జెహోయాలాచిన్ లేక కొనియాభూపతి | క్రీ.ము. ౫౯౯(ఒకేసం.) |
| జెడీకియా భూపతి | ,, ౫౯౯—౫౮౮ |

౫౮౮ లో బేబిలోనియాకు లొంగిపోయి బందెపా లగుట.

ఇంక ఇశ్రాయేలీయుల భూపతులు.

| | |
|---|---|
| ఒకటవ జెరొబోమ్ భూపతి | క్రీ. ము. ౯౭౫—౯౫౫ |
| నాదాబ్ భూపతి | ,, ౯౫౫—౯౫౩ |
| బాషా భూపతి | ,, ౯౫౩—౯౩౦ |
| ఎలాభూపతి | ,, ౯౩౦—౯౨౯ |
| జిమ్రిభూపతి | ,, ౯౨౯(ఒకేసం.) |
| ఓమ్రిభూపతి | ,, ౯౨౯—౯౧౮ |
| అహాబ్ భూపతి | ,, ౯౧౮—౮౯౭ |
| అహజియాభూపతి | ,, ౮౯౭—౮౯౬ |
| జెహోరామ్భూపతి (జరామ్) | ,, ౮౯౬—౮౮౪ |
| జెహుభూపతి | ,, ౮౮౪—౮౫౭ |
| జెహోయాఅహాజ్ భూపతి | ,, ౮౫౭—౮౩౯ |
| జెహోయాఆసాభూపతి | ,, ౮౩౯—౮౨౫ |
| రెండవజెరొబోమ్ | ,, ౮౨౫—౭౮౪ |
| అనార్కిభూపతి | ,, ౭౮౪—౭౭౩ |
| జెఖారియాభూపతి | ,, ౭౭౩—౭౭౨ |
| షల్లమ్ మేనాహెమ్భూపతి | ,, ౭౭౨—౭౬౧ |
| పెకాహియాభూపతి | ,, ౭౬౧—౭౫౯ |
| పెకా భూపతి | ,, ౭౫౯—౭౩౦ |
| హోషియా భూపతి | ,, ౭౩౦—౭౨౧ |

క్రీ. ము. ౭౨౧ బేబిలోనియావారికి లొంగిపోయి పరాజితులై బందెపాలైరి.

౬వ. పీరిడ్ క్రీ. ము. ౫౮౮ (జరూసలెమ్) పాడుచేయఁబడుట మొదలు క్రీస్తు జన్మము వఱకు (౫౮౮ సంవత్సరములు).

ఛాల్డియనులు జరూసలెముపట్టణమును నాశనమొనర్చి యూదులను బందెగొనుట.

| | |
|---|---|
| ఇశ్రాయేలీయులను ౭౨౧ యూదులను ౫౮౮ సైరస్ బేబిలన్ రాజ్య మాక్రమించుట | క్రీ. ము. ౫౩౮ |
| సైరస్ Proclamation | ,, ౫౩౬ |
| జరూసలెమునందు జహ్వా దేవాలయ శంఖుస్థాపనము | ,, ౫౩౪ |
| Arlaxerxes అనునాతఁడు దేవాలయపుపని నాపుట | ,, ౫౨౯ |

 బైబిలునందు వివరింపఁబడిన...

డెరయస్‌హిస్టాస్పస్ (అహాసుయెరస్) అనుకూలతీర్మాన మిచ్చుట (పాలస్తీనాదేశస్థులకు) క్రీ.ము. ౫౨౦

ఈస్తరు రాణీయగుట ,, ౫౧౮

జరూసలెమున జహ్వాదేవళము (రెండవసారి) పూర్తియగుట ,, ౫౧౫

Xerxes పారశీకదేశపు రాజగుట ,, ౪౮౪

Aataxerxes Longimanus రాజగుట ,, ౪౬౪

ఎజ్రా జరూసలెం పరిపాలకుఁ డగుట. ,, ౪౫౭

నెహెమియా జరూసలెం పరిపాలకుఁ డగుట. ,, ౪౪౫

డారియస్ నోతస్ జరూసలెంపాలకుఁ డగుట. ,, ౪౨౩

అలగ్జాండరు దిగ్రేటు పారశీకముపై దాడివెడలి తన మేసిడోనియా గ్రీకురాజ్య స్థాపన మొనర్చుట ,, ౩౩౫

జడ్డూస్ అనునతఁడు ప్రధానాచార్యుం డగుట. ,, ౩౩౨

అలగ్జాండరు మృతి ,, ౩౨౩

ప్టోలిమేకస్ లేగస్ సేనాని జెరూసలెమ్పైఁబడుట ,, ౩౨౦

ఏంటియోఛస్ ఎపిఫనీస్ జెరూసలెమును పట్టుకొనుట ,, ౧౭౦

జూడాస్ మెక్కాబేకస్ జెరూసలెమ్ పరిపాలకుఁడగుట ,, ౧౬౬

జొనాతాన్ జెరూసలెం పరిపాలకుఁ డగుట ,, ౧౬౧

జొనాతాన్ ప్రధానాచార్యుండగుట ,, ౧౫౨

రోమనులతోడి సైనునుసంధిపత్రము ,, ౧౪౩

జూడాస్ ప్రధానాచార్యుఁడను ప్రభువు నగుట. (ఈయనను అరిస్టొబ్రొజులస్ అనియు నందురు) ,, ౧౦౭

అన్నా (Prophetess) జననము ,, ౮౮

జరూసలెం పాఁపీ స్వాధీనమగుటయు యూదాదేశము రోమనుదేశమునకుం గలసిపోవుటయు ,, ౬౩

హెరోదు ప్రభువగుట ,, ౪౦

అగస్టస్‌సీజరు రోమనుచక్రవర్తి యగుట ,, ౨౮

వర్గిల్‌కవి మృతి ,, ౧౯

హెరోద్ తిరిగి (మూడవసారి) జహ్వాదేవాలయ ప్రారంభమొనర్చుట ,, ౧౮

జాన్ ది బాప్టిస్టు జననము ,, ౧౪

క్రీస్తుప్రభుని జన్మము (ఇది A. D. అను ప్రారంభమునకు నాల్గుసంవత్సరములు పూర్వము క్రీస్తుప్రభువు జన్మించినపిదప చూడుఁడు)

| | |
|---|---|
| జెహోయాకీన్ లేక కొనియాభూపతి | క్రీ.ము. ౫౯౯ (ఒకేసం.) |
| జెడీకియా భూపతి | ,, ౫౯౯—౫౮౮ |

౫౮౮ లో బేబిలోనియాకు లొంగిపోయి బందెపా లగుట.

ఇంక ఇశ్రాయేలీయ భూపతులు.

| | |
|---|---|
| ఒకటవ జెరొబోమ్ భూపతి | క్రీ. ము. ౯౭౫—౯౫౫ |
| నాదాబ్ భూపతి | ,, ౯౫౫—౯౫౩ |
| బాషా భూపతి | ,, ౯౫౩—౯౩౦ |
| ఎలాభూపతి | ,, ౯౩౦—౯౨౯ |
| జిమ్రిభూపతి | ,, ౯౨౯ (ఒకేసం.) |
| ఓమ్రిభూపతి | ,, ౯౨౯—౯౧౮ |
| అహాబ్ భూపతి | ,, ౯౧౮—౮౯౭ |
| అహజియాభూపతి | ,, ౮౯౭—౮౯౬ |
| జెహోరామ్భూపతి (జరామ్) | ,, ౮౯౬—౮౮౪ |
| జెహుభూపతి | ,, ౮౮౪—౮౫౭ |
| జెహోఆహాజ్ భూపతి | ,, ౮౫౭—౮౩౯ |
| జెహోఆషాభూపతి | ,, ౮౩౯—౮౨౫ |
| రెండవజెరోబోమ్ | ,, ౮౨౫—౭౮౪ |
| అనార్కీభూపతి | ,, ౭౮౪—౭౭౩ |
| జెఖారియాభూపతి | ,, ౭౭౩—౭౭౨ |
| షల్లమ్ మేనాహెమ్భూపతి | ,, ౭౭౨—౭౬౧ |
| పెకాహియాభూపతి | ,, ౭౬౧—౭౫౯ |
| పెకా భూపతి | ,, ౭౫౯—౭౩౦ |
| హోషియా భూపతి | ,, ౭౩౦—౭౨౧ |

క్రీ. ము. ౭౨౧ బేబిలోనియావారికి లొంగిపోయి పరాజితులై బందెపాలైరి.

౬వ. పీరిడ్ క్రీ. ము. ౫౮౮ (జరూసలెమ్) పాడుచేయఁబడుట మొదలు క్రీస్తు జన్మము వఱకు (౫౮౮ సంవత్సరములు).

ఛాల్డియనులు జరూసలెముపట్టణమును నాశనమొనర్చి యూదులను బందెగొనుట.

| | |
|---|---|
| ఇశ్రాయేలీయులను ౭౨౧ యూదులను ౫౮౮ సైరస్ బేబిలన్ రాజ్య మాక్రమించుట | క్రీ. ము. ౫౩౮ |
| సైరస్ Proclamation | ,, ౫౩౬ |
| జరూసలెమునందు జహ్వా దేవాలయ శంకుస్థాపనము | ,, ౫౩౪ |
| Arlaxerxes అనునాతఁడు దేవాలయపుపని నాపుట | ,, ౫౨౯ |

డెరయస్‌హిస్టాస్పస్ (అహాసుయెరస్) అనకూలతీర్మాన మిచ్చుట (పాలస్తినాదేశస్థులకు) | క్రీ.పూ. | ౫౨౦
ఈస్తరు రాణీయగుట | ,, | ౫౧౮
జరూసలెమున జహ్వాదేవళము (రెండవసారి) పూర్తియగుట | ,, | ౫౧౫
Xerxes పారశీకదేశపు రాజగుట | ,, | ౪౮౪
Aataxerxes Longimanus రాజగుట | ,, | ౪౬౪
ఎజ్రా జరూసలెం పరిపాలకుఁడగుట. | ,, | ౪౫౭
నెహెమియా జరూసలెం పరిపాలకుఁడగుట. | ,, | ౪౪౫
డారియస్ నోతస్ జరూసలెంపాలకుఁడగుట. | ,, | ౪౨౩
అలగ్జాండరు దిగ్రేటు పారశీకముపై దాడివెడలి తన మేసిడోనియా గ్రీకురాజ్య స్థాపన మొనర్చుట | ,, | ౩౩౫
జడ్డూస్ అనునతఁడు ప్రధానాచార్యుం డగుట. | ,, | ౩౩౨
అలగ్జాండరు మృతి | ,, | ౩౨౩
ప్టొలిమేకస్ లేగస్ సేనాని జెరూసలెమ్‌పైఁబడుట | ,, | ౩౨౦
ఏంటియోఛస్ ఎపిఫనీస్ జెరూసలెమును పట్టుకొనుట | ,, | ౧౭౦
జూడాస్ మెక్కాబేకస్ జెరూసలెమ్ పరిపాలకుఁడగుట | ,, | ౧౬౬
జొనాతాన్ జెరూసలెం పరిపాలకుఁడగుట | ,, | ౧౬౧
జొనాతాన్ ప్రధానాచార్యుండగుట | ,, | ౧౫౨
రోమనులతోడి సైమనుసంధిపత్రము | ,, | ౧౪౩
జూడస్ ప్రధానాచార్యుఁడను ప్రభువు నగుట. (ఈయనను అరిస్టొబ్రిజులస్ అనియు నందురు) | ,, | ౧౦౭
అన్నా (Prophetess) జననము | ,, | ౮౮
జరూసలెం పాంపీ స్వాధీనమగుటయు యూదాదేశము రోమను దేశమునకుం గలసిపోవుటయు | ,, | ౬౩
హెరోదు ప్రభువగుట | ,, | ౪౦
అగస్టస్‌సీజరు రోమనుచక్రవర్తి యగుట | ,, | ౨౮
వెర్జిల్ కవి మృతి | ,, | ౧౯
హెరోద్ ది గ్రేట్ (మూడవసారి) జహ్వాదేవాలయ ప్రారంభ మొనర్చుట | ,, | ౧౮
జాన్ ది బాప్టిస్టు జననము | ,, | ౧౪
క్రీస్తుప్రభుని జన్మము (ఇది A. D. అను ప్రారంభమునకు నాలుగుసంవత్సరములు పూర్వము క్రీస్తుప్రభువు జన్మించినపిదప చూడుఁడు)

**బైబిల్** — బైబి లొకపుస్తకము కాదు. పెక్కండ్రు దీనిని రచించుటయో ఇతరభాషల నుండి యనువదించుటయో జరిగియుండ, వాటి సముదాయపు కూర్పును బైబి లనుచున్నారు. ఇందు సర్వసాధారణముగ పురాతన నిబంధన (Old Testament) యు, నవీననిబంధనయు (New Testament) బైబిలనెదరు గాని నిజ మున నివియెగాక 'Mormam book' అనియు 'పెంటాటచ్' అనియు (ఐదవ పుస్తకము) జోషువా (ఆఱవపుస్తకము లేక Hexateuch) అనియుఁగూడ నిందుఁగలవు. పురాతననిబంధన యొక్కటినే ముప్పదితొమ్మండుగురు రచించి నవి ముప్పదితొమ్మిది వేర్వేరు పుస్తకములును, నవీననిబంధన ఇరువదియేడుపుస్తకములును గలవని చెప్పఁబడినది. ఇవి గాక రోమన్కా తలిక్కు మతస్థుల 'Apoerypha' అను పదు నాల్గుగ్రంథములు గలవు. ఇవి యన్నియు క్రైస్తవమతగ్రంథములే.

మొదట బైబిలును ఆంగ్లమునకు 'Jon Wyclif' అనువా రనువదించిరఁట. ఈయన కాలము A.D. 1382 అనిచెప్పఁబడినది. Tyndale అనుమహాపండితుఁడు Pentateuch అనుగ్రంథమును నవీననిబంధనను జోనాగ్రంథ మును ననువదించెనఁట. జర్మను, లాటిన్భాషల నుండి Coverdale పండితుఁ డాంగ్లమున కనువదించె నఁట. Mattheu, మహనీయుని యనువాదగ్రంథ మాంగ్లభాషయం దాధార మని తలంపఁబడుచుండెను.

క్రీ.వె. ౧౫౩౮లో Clergy వారందరు బ్రిటీషుప్రభునకు దరఖాస్తుపెట్టుకొని సరియైన యనువాదము చేయించి దయచేయుఁ డని ప్రార్థింప A.D. 1539 అఫీషియల్ వెర్షన్ ఒకటి బయలు దేఱఁదీసిరి. దానిని "Great Bible" అనుచుండిరి. దీనిని Coverdale అనువారి పరిశీలనక్రింద పూర్తిచేయఁబడెనని చెప్పుదురు. జనీవానగరమున 'Breeche's Bible' అని యొకటి బయల్వెడలెను. మఱి కొందఱు బిష ప్పులు కలిసి వేరొకబైబిలు కూర్చిరి. దీనికి "బిషప్పుబైబి"లనిపేరు.

రోమనుకాతలిక్కు క్రైస్తవులకు ప్రోటస్టాంటు వారు రచించినబైబిలుగ్రంథము సరిపడకుండెను. పిదప కొంద రింగ్లాండు దేశపు కాతలిక్కుమత స్థులు 'Douai Bible' అనుదానిని బయలు దేఱఁదీసిరి. ఇది చాల నమ్మకమగు గ్రంథ మనియెదరు. పందొమ్మిదవ శతాబ్దాంతమున Official version బైబిలును తిరుగ సవరించి రఁట. అది ౧౮౭౧-౧౮౭౪లమధ్య జరిగె నఁట. పిదప క్రీ. వె. ౧౯౦౧లో అమెరికన్ బైబిలు బయలుదేరెను. లాటిన్ భాషనుండి యీ మార్పు అనువాదములు జరిగెనని చెప్పఁబడి నది. రోమనులకాలమున ప్రజాసామాన్యభాష యందుండిన బైబిలునకు "Vulgate Bible" అనిపేరఁట. అది పాలస్తినాదేశపు బెత్లెహేము నందు Jerome అనుమహాత్ముఁడు వ్రాసెనఁట. ఇది క్రీ. వె. ౩౮౪ సనిచెప్పఁబడినది. బైబిలు గ్రంథములు కొన్ని వింతపేర్లతోఁ గలవు.

౧. Gutenberg Bible- ఇది లాటిన్భాష యందున్నది. ఆదిని A.D. 1450 కాలమున Mentyనందు లోహపురేకులపై చిత్రింపఁబడిన అక్షరములుగలదిగఁ జెప్పఁబడినది.

౨. Idele Bible- ఇది క్రీ.వె. ౧౭౦౯లో Idle Shepherd అనువారు (Idole Shepherd) రచించిరి.

౩. The Bug Bible-ఇది క్రీ.వె.౧౫౫౧లో రచింపఁబడినది. ఇందు రాత్రులందు నల్లుల భయమనుపాట యుండుటంజేసి యీపేరువాడు కయ్యెనఁట.

౮. Breeche's Bible- ఇది "జెనీవా బైబిలు" అనc బడును. Qeen Elizabeth రాజ్ఞిపాలనమున జెనీవాకు ప్రవాసమంపcబడిన కొందరాంగ్లేయులు దీనిని రచించిరని వాడుక కలదు. ఒక అత్తిచెట్టుయాకులకు రంధ్రములు (Breeches) చేసి పైనివాఁయుట నీపేరయ్యెనని యనెదరు.

౫. Place maker's Bible-ఇది అచ్చుపొరపాటున 'peace maker' అనుమాటలు place maker అని పడుటవలన నీపేరందెనందురు. క్రీ. వె. ౧౫౬౮.

౬. Rosin Bible- ఇది క్రీ. వె. ౧౬౦౦ సంవత్సరమున "translated Roslin" అని యుంట నిట్టిపేరయ్యెను.

౭. Treacle Bible-ఇది క్రీ.వె.౧౫౬౮ లో జెర్మియా యనువా రనువదించిరి.

౮. He and She Bible- "She went to the City" అనియు, He went to the City" యనియు రెండువిధములుగ ననువాదముంట నీపేరయ్యెనcట. క్రీ.వె.౧౬౧౧

౯. The wicked Bible - ఇం దేడవ యాజ్ఞవదలివేయcబడుటనీ పేరయ్యెనcట. ఇందు Thou that commet (not లేదు) adultery అనియుంట నీపేరయ్యె నcట. క్రీ. వె. ౧౬౩౨ ముద్రించినవారికి పిదప 300 పౌనులు అపరాధము విధించిరని చెప్పcబడినది.

౧౦. The Thumb Bible- ఈ పుస్తక మొక యంగుళము చౌకపు పరిమాణమును ఒక అరంగుళము దళసరియుండి అబ్బరుడీన్ పురమున నింగ్లాండునందు క్రీ.వె. ౧౬౭౦ సంవత్సరమున ప్రకటింపc బడి యీపేరందె నcట.

౧౧. The unrighteous Bible-క్రీ.వె. 1632 లో కేంబ్రిడ్జి ముద్రాక్షరశాల యందు ముద్రితమై అచ్చుపొరపాటున ఇట్లు పేరందెనట.

౧౨. The vinegar Bible - క్రీ. వె. 1717 లో ముద్రింపc బడినది. ఇందు vineyard అనుటకు బదులు vinegar అని అచ్చుతప్పుంట నిట్లు పేరందెనcట.

౧౩. The Printer's Bible-ఇది అచ్చుతప్పువలన పేరందిన గ్రంథమే. The Princes అనుటకు బదులు Printers అని యుండెనcట.

౧౪. The murderer's Bible-ఇదియు నచ్చుతప్పువల్ల పేరందినదే. Murmurers అనుటకు బదులుగ తప్పుగా murderers అని యుండెనట. క్రీ. వె. 1801.

౧౫. The caxton memorial Bible- ఇది క్రీ. వె. 1877 లో ముద్రింపc బడెనcట. నూరుప్రతులు మాత్రమె ముద్రింపcబడెనcట.

౧౬. The Red Letter Bible- క్రీ.వె. 1901 లో డాక్టరు లూయిస్ పండితుcడు ముద్రింపించి ప్రకటించెనcట. ఇందు క్రీస్తుప్రభువు వచించినమాట లన్నియు నెఱ్ఱసిరాతోను ప్రాత నిబంధనయం దాతనం గూర్చిన సంగతు లెఱ్ఱసిరాతోను ముద్రింపcబడియుంటనీపేరందెనcట.

ఇంకను ఆరు బైబిలుగ్రంథములు రద్దుపఱుపcబడి తొలగింపcబడినవి కలవు.

౧. పారిస్‌నగరమున క్రీ.వె. ౧౫౩౮వ సంవత్సరమున ముద్రింపcబడిన యొక అసంపూర్తి బైబిలుగ్రంథము.

౨. ఒకడచ్చుబైబిలు- దీని Jacob Van Lisvelt అనువారు రచించిరcట. ఇది యాతవ కూర్పుదనుక వచ్చె నcట గాని యత్తరి ముద్రించినవానితలc దీసివైచి పుస్తకమును నిషేధించిరని చెప్పcబడినది.

౩. ఒకఫ్రెంచి బైబిలు— దీనిని Rene Benoist Folio అనువారు మూఁడుసంపుటములుగ క్రీ. శ. ౧౫౬౬ సంవత్సరమున రచించిరఁట. ఇది యేలనో నిషేధింపఁబడినది.

౪. ఒక స్వీడిష్ బైబిలు–ఇది క్రీ.శ.౧౬౭౨ నాటిదఁట. దీనిని Lubeck అను పేరుగల తావున ముద్రించిరఁట. ఇం దనేక లోపములుంట నిషేధింపఁబడియెనని చెప్పఁబడినది.

౫. ఒకజర్మను బైబిలు– ఇదిక్రీ. శ. ౧౬౬౬ లో Helmstadt అనంబడుతావున కొంత ముద్రింపఁబడి నిషేధింపఁబడెను.

౬. ఒకఫ్రెంచి బైబిలు– దీనిని Marrolles అనువారు రచించిరఁట. ఇందు Genesis పుస్తకములు, Exodus పుస్తకములును Leviticus లోని మొదటి యిరువదిమూఁడధ్యాయములు గల్గి యసంపూర్తిగనుండి నిషేధింపఁ బడినదని చెప్పఁబడినది.

క్రైస్తవులు దీనిని "సత్యవేద"మని యతిశ్రద్ధతోఁ జెప్పుకొందురు గాని, వేదశబ్దమునకు నైఘంటికార్థముతోఁ గాని, ప్రసిద్ధార్థముతోఁ గాని పోల్కిలేదు. అసలుపదము గ్రీకుభాష యందలిదని కొంద రందురుగాని పుస్తకమున కర్థమిచ్చు బిబ్లియాపదము లాటిన్భాషలోనిది. ఆదిని బైబిలు హీబ్రూభాషలో నుండినది. అది పాలస్తీనాదేశపుయూదులకు స్వభాష. దానిని వేర్వేరుభాషలలోనికి వేర్వేరుభాషల మాటలాడు (పిన్నభిన్నదేశపు) క్రైస్తవు లనువాదములం గావించుకొనిరి. మనదేశమునఁగల యాంగ్లభాష బైబిలు "Tyndale" అనంబడిన పండితుఁ డనువదించినది. ఇది రెండుభాగములు. పూర్వభాగము ప్రభువగుయేసుక్రీస్తువరకుఁగల పాలస్తీనాయూదులు మొదలగువారి పూర్వుల చరిత్రయును, ద్వితీయభాగము ప్రభుపుచరిత్ర, ఆయనబోధనలు దర్మిలా చరిత్రయుఁ గల్గి యున్నది. ఇది నీతిబోధకము. భాష సాధువగు చక్కని శైలి.

ప్రాతనిబంధన(Old Testament)యందు ౯౨౯, నవీననిబంధన (New Testament) యందు ౨౬౦ అధ్యాయములును మొత్తము బైబిలునందు ౧౧౮౯ అధ్యాయములు కలవు. బైబిలునందు ౭౭౪,౬౯౦ పదములు గలవు.

**బైమెటలీజమ్** (Bimetalism) — రెండులోహముల సిద్ధాంతము. ఇది రాజకీయ సిద్ధాంతము. రెండు లోహములనిన బంగారము వెండి యని భావము. ఈరెండులోహములతోఁ జేయఁబడిన నాణెములు ప్రభుత్వమువారిచే ముద్రింపఁబడి వర్తకపు సరుకులవలె ధరలు మారకుండ నేర్పరుపఁబడినధర నిలచి చలామణి యగుచుండుట. క్రీ.శ. ౧౮౭౩ నుండి ప్రభుత్వమువారి యొక్కయు, ప్రజలయొక్కయు యోచనల నాకర్షించు చుండెను. ఇప్పటి రాజనీతిజ్ఞు లొకేలోహముతో నాణెములు ముద్రింపఁ బడుచుండుట యనేక చిక్కులకుఁ గారణమగుచుండు ననియు, రెండులోహముల తో నిర్దిష్టనాణెములు చేయుచుండుట మిక్కిలి సౌకర్య మనియు నభిప్రాయపడి యుండిరి. క్రీ. శ. ౧౮౭౦ మొదలు ౧౮౮౦ వరకు ప్రపంచ మన్ని దేశములందు నిర్దిష్ట నాణెముల యేర్పాటు గల్గియుంట వర్తకమునకు సమపాయమని వేర్వేరు దేశములవారికి తలఁపు బలమై యనేకప్రయత్నములు జరిగెను. అందమెరికా సంయుక్తరాష్ట్రము లెక్కువపట్టుదలతోఁ బ్రయత్నించెను. అత్తరి సంభవించిన President Election లో నిదియొక ముఖ్యాంశమై యుండెను. ఆంగ్ల పరాసు దేశములును బలమైన తలంపుతోనే యుండినవి. వెండిగనులఁ ద్రవ్వువా

రందరు భరతదేశమునను, ఇతర తూర్పు రాజ్యములను బంగారునందు వెండిధరతగ్గుట కాతురత పడుచుండిరి. ౧౮౩౦ మొదలు ౧౮౩౨ వరకుఁ బ్రిధానముగను పిదపఁగూడ గల్గిన చిక్కు-పరిస్థితు లడ్డమువచ్చి యాఁగిపోయి యున్నది.

**బైయోలోజీ** (Biology)—నైసర్గికజీవనముంగూర్చిన కళ. మనుష్యులయొక్క-యు, జంతువులయొక్క-యు, పక్షులయొక్కయు, వృక్షములు మొదలగువానియొక్క-యు, జీవనవిధాన ధర్మములను వివరించుశాస్త్రము. ఇది పెద్ద శాస్త్రమౌట వేర్వేరుభాగములను వేర్వేరుగ వివరింపఁబడుచుండెడిని.

Zoology జంతువులంగూర్చియు, Botany వృక్షవితతింగూర్చియు, నిట్లే వేర్వేరు కళలుగ నేర్పడియున్నది.

**బైరాంపండుగ**— మహమ్మదీయులలో, ముఖ్యముగఁ దురుష్కు-లు పారశీకులలో జరుపఁబడు మూఁడురోజుల పండుగ. ఇది రమదాన్ పండుగకుఁ దర్వాతనే వచ్చునది.

రమదాను పండుగకుఁ దెబ్బదిదినములకుఁ బిదప నాల్గుదినములు జరుపఁబడు మహమ్మదీయుల పండుగకును బైరాంపండుగ యని పేరు కలదు.

**బైలాస్ ఆఫ్ ఏ కంపెనీ** (Byelaws of a Company) — (వాణిజ్యసంబంధ పరిభాషాపదము.) ఒక వర్తకసంఘమువారు తమవర్తకకార్యములను నిర్వహించుకొన (జరుపుకొన) విధించుకొనిన పద్ధతులు.

**బైసెకిల్** (Bycycle)-- పర్వెడుతరి నిలచి యుండుంగాని యాగినతరి ప్రక్క-లకుఁ బడిపోవుచుండును. (Bycycle cannot stand upright when standing) తలఁచిన నిది చిత్రమనిపించును. దీనికిఁగల కారణ మది స్వతస్సిద్ధముగ నిలచునటులఁ జేయఁబడలేదు గాని పర్వెడుచుండుతరి Newton's first law of motion పద్ధతికి లోఁబడి పైకి నిలచుచుండుం గాని ప్రక్క-లకుఁ బడిపోవఁ జాలదు. "A moving thing will move at a constant speed in the same strait line for ever, unless it is acted on by some other force".

బైసికిల్ పర్వెడుచుండుతరి అది Moving thing గాన మరియొకఫోర్సు దాని నాపివేయువర కదియట్లే ముందునకు నడుచుచుండవలెను. అట్లు నడుచుచుండుటకుఁ బైకినిలువంబడుచుండవలెఁగాని ప్రక్క-లకుఁ బడిపోయి యుండ వీలుండదు.

**బైసిలెయి**—(అంటువ్యాధులు చూ.)

**బైసేవారీభాష**—(హిందీభాష చతుర్విధములు చూడుఁడు.)

**బొంకు బొంకరా పోలిగా అంటే టంగుటూరి మిరెయాలు తాటికాయలంత తేశండి ! అన్నాడఁట**—(ఆంధ్రలోకోక్తి).

**బొందిలీజాతివారు**—బుందేలఖండఁపు క్షత్రియులు. (యజాభుక్తిదేశము చూడుఁడు.)

**బొంబైనగరము** (Bombay)--బొంబైయను పేరుగల రాష్ట్రమునకు ప్రధాననగరమై యున్నది. గొప్ప వర్తకస్థలము, రేవుస్థలము నగుట నెల్లదేశములనుండి పొగయోడ లిటకేతెంచుచుండును. ఐరోపాదేశస్థులు భరతదేశమున కేగుతరి బొంబైరేవునందే దిగుచుందురు గాన నిదివారిచే నిండియా దేశఁపు సముద్రద్వారమని పిలువఁ బడుచున్నది.

సాలసట్టీద్వీపమునకు దక్షిణమున బొంబైద్వీపమునం దన్ని దెసలకు వ్యాపించినపట్టణము.

జనసమ్మర్ద మధికము. గొప్ప వాణిజ్యస్థల మగుటచే ధనసంపద చక్కఁగఁ గల్గియున్నది. ఇట గల మామాదేవి లేక ముమాదేవి (ఉమాదేవి) దేవస్థానమునుండి ముమ్మాయి యని యాదికాల మునఁ బేరంది నానాటికి మారి ముమ్మాయి బొంబాయి యనఁబడుచున్నది. నగరమున విక్టోరియా టెర్మిన స్సనఁబడు రెయిల్వే స్టేషను మొదలుగఁ జూడఁదగిన మహాభవనములు, కట్టడములు మొదలగునవ నేకములు దర్శనీయములు.

**బొంబైరాజధాని**—ఇందు మహారాష్ట్ర దేశభాగము, గుజరాతీ (ఘూర్జర) దేశభాగము, కర్ణాటక (కన్నడ) దేశభాగము, కొంకణ దేశభాగము, సింధుదేశము చేరి యున్నవి. ఉత్తరమున బెలూచిస్థానము, రాజపుత్రస్థానము, తూర్పున సెంట్రలిండియా స్టేట్సు, నిజాంరాష్ట్రము, దక్షిణమున మైసూరురాష్ట్రము పశ్చిమమున పశ్చిమ సముద్రమును నెల్లలు. ౧-౨3000 చ॥మైళ్ళ వైశాల్యముంగల్గి యుఁడి యాయందు ద్వాదశాంశపరిమితమై యున్నది.

సహ్యాద్రి (పశ్చిమాచల) పర్వతపంక్తి యుత్తర దక్షిణములకు వ్యాపించి యున్నది. (ఇండియా దేశము చూడుఁడు.) భీమానది, సైనానదితోఁ గలసి ప్రవహించు సంయుక్తనద మీ దేశమునఁ బ్రవహించుచున్నది. అది యట్లుగడచి కృష్ణవేణియందు సంగమించును. శబరమతి, కృతవతి, చందనా, గిరికర్ణిక, కాశ్యపి యనునామముల చే వాఁడఁబడుచున్న సబర్మతీనదియును, నర్మదానది (రేవానది) యును, తాపి, తాపని, మూలాతపియని వేర్వేరు గ్రంథములందుఁ జెప్పఁబడిన తపతీనదియును, దేశముగుండ బశ్చిమవాహినులై ప్రవహించి గల్ఫాఫ్ కాంబేయందు సంగమించుచున్నవి. మహతి, మహి, మహితా యనుపేర్లుగల మాహీనదియును నందే చేరును. గోదావరి, కృష్ణవేణీనదులు దక్కనుగుండా ప్రవహించి వాటియుపనదులుసహా పొలములఁ దడపుచున్నవి. సింధునదియొక్క కడభాగఁపు బ్రవాహము సింధుదేశముగుండా నడచును.

సహ్యాద్రియందు ప్రాంతములను వర్ష మధికము. ఏఁటేట నెన్నబదియంగుళములు వర్షించుచుండును. దిగువనున్న దక్కనునం దేఁటేట ముప్పది యంగుళము లే వర్షించు చుండును. సింధుదేశమున వర్షము చాలతక్కువ. అందు నుత్తరభాగమున మతివేఁడిగ నుండును. ఈ వర్షస్థితి ననుసరించియె యాయా భాగము లందు శీతోష్ణస్థితు లమరియుండును. గోధుమలు, ధాన్యము, జొన్నలు, ప్రత్తి పైరుచేయఁబడుచున్నవి. సముద్రతీరముల ధాన్యమును, ఖండేశము, ధార్వాడ, కలాడ్గి, బరోచి జిల్లాల యందు ప్రత్తియు ప్రధానముగుపంటలు. సముద్రతీరములందు కొబ్బరితోఁటలధికము. ఖండేశమున పశువు లధికముగఁ బెంపఁబడుచున్నవి. సహ్యాద్రియందలి మహారణ్యములు గొప్పకలప గల్గియున్నవి.

బొంబై రాజధాని-౧ డక్కను డివిజను, ౨ గుజరాతుడివిజను, ౩ కొంకణడివిజను, ౪ కర్ణాటకడివిజను, ౫ సింధుడివిజను ననుసైదుడివిజనులుగ నున్నది. డక్కనునందుఁ బ్రజలు మహారాష్ట్రులు. మాట్లాడునది మహారాష్ట్రభాష. గుజరాతు డివిజనునందుఁ బ్రజలు గుజరాతీలు. మాట్లాడునది గుజరాతీభాష. కొంకణడివిజనున గొంకణులు కొంకణభాష, కర్ణాటకమునఁ గర్ణాటకులు కన్నడభాష, సింధుదేశమున సింధియనులు సింధిభాష మాట్లాడుదురు. హిందువులందు స్వభాషయె గాక హిందీభాషయును మహమ్మదీయులందు దేశభాషయె గాక నురుదుభాషయును వ్యాపించియున్నవి. నగటున నైదవ

వంతు మహమ్మదీయులు మొదటి నాల్గుడివిజనులందుఁ గలరు. సింధుదేశమున మూఁడువంతులమంది మహమ్మదీయులు, నాల్గవవంతు హిందువులు. దేశమునఁ జతురపుమైలునందు ౧౫౦ మంది వసించు చున్నారని లెక్కింపఁ బడినది. హిందువులు, మహమ్మదీయులే గాక 80,000 పారశీకులు గలరనియు, యూదులు కొంత మంది కలరనియు, డక్కనునుత్తర తూర్పుభాగముల గొండలం దడవిజాతులవారగు భిల్లులు మొదలగుజాతులవారు గలరనియుఁ జెప్పఁ బడినది.

బొంబైనగరము గొప్పవర్తకస్థలము. బొంబై రాజ్య మంతటను ప్రజల వాణిజ్యావేశము, వాణిజ్యతన్మయత పరిశీలించినవారికిఁ గన్పించుచునేయుండును. బొంబై రాజధాని యిరువది నాల్గు జిల్లాలుగ విభజింపఁ బడినది. వాని వివరణములు—

1. గుజరాతుడివిజనునందు–౧ అహమ్మదాబాదు జిల్లా, ౨ ఖైరాజిల్లా, 3 పంచమహాలిజిల్లా, ౪ బ్రోచిజిల్లా, ౫ సూరతుజిల్లా.

2. డక్కను డివిజనునందు ౧ ఖండేశజిల్లా, ౨ నాశికజిల్లా, 3 అహమదు నగరుజిల్లా, ౪ పూనాజిల్లా, ౫ షోలాపూర్ జిల్లా, ౬ సతారాజిల్లా.

3. కర్ణాటక డివిజనునందు ౧ బెల్గాముజిల్లా, ౨ ధార్వాడజిల్లా, 3 బిజాపూరుజిల్లా.

4. కొంకణడివిజనునందు ౧ థానాజిల్లా, ౨ కొలాబాజిల్లా, 3 రత్నగిరిజిల్లా, ౪ ఉత్తర కనడాజిల్లా.

5. సింధుడివిజనునందు ౧ కరాచీజిల్లా, ౨ హైదరాబాదుజిల్లా, 3 షికార్పూరుజిల్లా, ౪ తారిజిల్లా ౫ పార్కారుజిల్లా, ౬ అప్పర్సింధు ఫ్రాంటియరుజిల్లా.

బొంబాయి, పశ్చిమసముద్రతీరమున భూభాగమున కవ్వల సాల్సెట్టిద్వీపమున కావలనున్న బొంబాయిద్వీపమునందలి నగరము. గొప్ప రేవు. విశేషవర్తకము జరుగుతావు. చక్కని రేవు. నైసర్గికమైనహార్బరుగలదు. ఇందుఁగల మామాదేవి లేక ముమ్మాదేవి యాలయమునుండి మామాయి యనిపేరంది ఆంగ్లోచ్చారణమున బొంబై యనఁబడుచున్నది. (బొంబై నగరము చూడుఁడు.) హార్బరునందున్న యెలిఫెంటా యనుపేరుగల ద్వీపమునఁగల కొండయందుఁ గొన్ని గుహాలు చూడఁదగినవి కలవు.

గుజరాతు డివిజనునందు సబర్మతీనదీతీరముననున్న అహమ్మదాబాదు పురము జిల్లా యందుముఖ్యపట్టణము. జలతారుదారము, పట్టుదారము, నూలుదారపుఁబను లిట నధికము. ఇత్తడిపనులు విశేషముగాఁ గలవు. తొల్లింట నొకప్పుడు గుజరాతు దేశమేలిన మహమ్మదీయులకు రాజధానిగ నుండినది గాన పురమున మహమ్మదీయకట్టడములు విస్తారము గాఁగలవు. ఢోలేరా పురము ప్రత్తివర్తకముగల తావు. గోగాపురము రేవుస్థానము.

ఖైరాజిల్లాయందు నరియాడుపురముప్రధానస్థానము. పంచమహాలుజిల్లా ప్రత్యేకోద్యోగి యధికారమున నున్నను. ముఖ్యస్థానవుఁగచేరీలు నరియాడునందే యున్నవి. బ్రోచిపురము (తొల్లిఁటి భరుకచ్ఛపురము) జిల్లాయందుప్రధానస్థానము; విశేషవర్తకము జరుగుతావు. ఇది నర్మదానదీతీరమున నున్నది. ప్రత్తివర్తక మిట నధికము.

సూరతుపురముజిల్లాయందు ప్రధానస్థలము. తపతీనదీతీరము. ఇట క్రీ. వె. ౧౬౧౨ సం. లో మొదటి ఇంగ్లీషు ఫేక్టరీ నిర్మింపఁబడినది.

డక్కనుడివిజనునందు ఖండేశజిల్లాయందు

ధూలియా ముఖ్యపట్టణము; గొప్పవర్తకస్థలము. భుసావళపురము వేఱుపట్టణము.

నాశికజిల్లాకు నాశికపట్టణము ముఖ్యస్థానము. ఇది గోదావరీనదీతీరమున నున్నది. ఇత్తడిచేతిపనులకుఁ బేరందినది. కాయగూరలిట విస్తారము పైరుచేయఁ బడుచున్నవి. ఇది స్నానతీర్థము. రామాయణప్రసిద్ధంబగు పంచవటియిటఁగలదు. శూర్పణఖముక్కును శ్రీరామసోదరుం డగు లక్ష్మణుఁడు కోసినతావగుటఁ బేరందిన స్థలము. ప్రభుత్వమువారు నోట్లు, స్టాంపులు ముద్రించు కర్మాగార మిట నిర్మించియున్నారు. ఇటకుఁ బదునారుమైళ్ళలో త్ర్యంబకక్షేత్రము గలదు. అది సుప్రసిద్ధ గౌతమాశ్రమము. గోదావరీనదీ జన్మస్థానము. పరిసరముల బౌద్ధులనాటి గుహాలు గలవు.

అహమ్మదునగరజిల్లాయందు అహమ్మదునగరము ప్రధానస్థానము. సైనానదీతీరము. ఒకప్పుడు మహమ్మదీయరాజధానిగ నుండినది.

పూనాజిల్లా- పూనానగరము ప్రధానస్థానము. తొల్లింట పేష్వాలకు రాజధానిగ నుండినది. పరిసరములనున్న కిర్కీ సైన్యస్థానము. సమీపమునసే గల సింగఘడమును, పురందరదుర్గమును చాల బలమైనవి. కర్లేయందు పురాతనపు దేవస్థాన మున్నది.

షోలాపూర్జిల్లాయందు షోలాపురము ప్రధానస్థానము. గొప్పవర్తకముగల పట్టణము. ఇచటికి పదునేనుమైళ్ళదూరమునఁగల కళ్యాణపురమున చాళుక్యవంశజుఁడగు బిజ్జలభూపతికడ వీరశైవ లింగాయత మతస్థాపకుఁ డగు బసవేశ్వరుఁ డుద్యోగిగనుండి, అచటి సంగమేశ్వరశివలింగమున నైక్యమైనతావుగలదు. చాళుక్యులరాజధానిగ నుండినది. పాండరిపురము పాండురంగక్షేత్రము. సుప్రసిద్ధయాత్రాస్థానము. చంద్రభాగా నదీతీరము.

సతారాజిల్లా అరణ్యమయముగుజిల్లా. సతారాపురము (తొల్లింటి సతారా) ప్రధానస్థానము. కొంతకాలము మహారాష్ట్ర రాజధానిగ నుండినది. సుప్రసిద్ధములగు మహాబలేశ్వరమును, సమశీతోష్ణ ప్రదేశమగు (౪౫౦౦ అడుగులు) నూతనతెరాక్ సానిటేరియమును నీజిల్లాలోనివి.

కర్నాటకడివిజను:- బెల్గాముజిల్లాయందు బెల్గాముపురము ప్రధానస్థానము; సైన్యము లుండుతావు; వర్తకస్థలము.

ధార్వాడజిల్లాయందు ధార్వాడ ప్రధానస్థానము. ప్రత్తివర్తక మిటఁగలదు. హుబ్లీనగరము ప్రత్తివర్తక మపరిమితముగఁ గలతావు.

బిజాపూర్జిల్లాయందు భాగల్కోటపురము ప్రధానస్థానము. కృష్ణానది ఉపనది యగు ఘటప్రానదీతీరము. బిజాపూరుపురము తొల్లింట మహమ్మదీయ సంస్థానమునకు రాజధానిగ నుండినపురము. ఇప్పుడు పాడగుచున్నది.

కొంకణడివిజను ఠాణాజిల్లా: దీని నుత్తర కొంకణమనియు ననుచున్నారు. బొంబాయికి ఉత్తరమున సముద్రతీరమునందే యున్నది. ఠాణాపురము ప్రధానస్థానము. ఇది సాల్సెటిద్వీపమునందున్నది. కల్యాణపురము రెయిల్వేసంధిస్థానము. బేసిన్పురము ఒకప్పుడు పోర్చుగీసువారిదై యుండినది.

కొలాబాజిల్లా బొంబైనగరమునకు దక్షిణమునసున్నది. అలీబాగుపురము ప్రధానస్థానము.

రత్నగిరిజిల్లా- దీనిని దక్షిణకొంకణ మని యందురు. సముద్రతీరమందున్నజిల్లా. ప్రధానస్థానము రత్నగిరిపురము. కొలాబాజిల్లాకు దక్షిణముగా నున్నది.

ఉత్తరకన్నడజిల్లా - దీనిని కార్వాడజిల్లా యనియు ననుచున్నారు. రత్నగిరిజిల్లాకు దక్షిణమునసున్న సముద్రతీరపుజిల్లా. ప్రధానస్థానము

కార్వాడుపురము. ఇది రేవుపట్టణము. కమ్తా వేరొకరేవుపట్టణము. హొనావరు వేరొకపట్టణము. సుప్రసిద్ధగోకర్ణక్షేత్ర మిందులోనిది. (ఈజిల్లాలోనిది). మఱియు దేశప్రసిద్ధమైన గిరిసొప్పా జలపాతము (౯౦౦ అడుగులయెత్తు) హొనావరుకడ నున్నది.

సింధుశివిజను—ఇది చాల పెద్దది. బంగాళ రాజ్యములో సగము వైశాల్యము గలది. దీనిగుండ సింధునదికడభాగము ప్రవహించు చుండును. నదీతీరప్రాంతములు చాలఫలవంతములు గాన దీని నిండియాదేశపు ఈజిప్టను చున్నారు. క్రీ.శ. ౧౭౭౯ లో నొకబెలూచి సావంతుఁడు దీనింబట్టుకొని యేలనారంభించెను. వారిసంతతివా రమీరు లనఁబడిరి. వారివేటకై యనేక ఫలవంతములగు ప్రదేశములు గ్రామములు కాళీచేయఁబడి డొంకలు బలియునట్లు చేయఁబడెనఁట. క్రీ.శ. ౧౮౪౩లో అమీరుల జయించి బ్రిటీషు ప్రభుత్వమువా రాక్రమించిరి. బెలూచీలు విస్తారముమంది కలరు. పట్టణములందు హిందువులు నివసించుచున్నారు. గ్రామములు మహమ్మదీయులవిగనే యున్నవి. జిల్లాలును పెద్దవియే.

కరాచీజిల్లాలో ప్రధానస్థానము కరాచీ పురము. గొప్పవర్తకము నడచురేవు. టిట్టా పురము తొల్లింటికాలపు హిందువులనాటి రాజధానిగ నుండినది.

హైదరాబాదుజిల్లాయందు హైదరాబాదు పురము ప్రధానస్థానము, సింధునదీతీరము. వర్తకస్థానము. చేతిపను లధికము. తొల్లింటి బెలూచీ యమీరులకు రాజధానిగ నుండినది. దీని కుత్తరముగాఁ గొన్నిమైళ్ళదూరమునఁ గల మియానిగ్రామముకడ జరిగినయుద్ధమున బ్రిటీషువారిచే నమీరో డింపఁబడెనని చెప్పఁబడినది.

తారుజిల్లా, పార్కరు జిల్లాలు- ఇవి యెడారులు; నిర్జలప్రదేశములు. ఈ రెండుజిల్లాల ప్రధాన కార్యాలయము లుమర్కోటయం దుంచఁబడియున్నవి. ఉమర్కోటయే సుప్రసిద్ధుఁడగు నక్బరుచక్రవర్తి జన్మించినతావు.

షికార్పూరు జిల్లాయందు షికార్పూరు ముఖ్యస్థానము. ఇది సింధునది పశ్చిమతీరమం దున్నది. కొంత వర్తకమును గలదు. దీని కాగ్నేయముగా సింధునదికి కుడివైపుతీరము నందు సుక్కూరును, దానికెదురుగ నెడమవైపు తీరమున రోహ్రీపురమును, రెంటికి నడుమ నదియందలిద్వీపమున బుక్కూరుదుర్గమునుఁ గలవు. ఇట సింధునదిం దాఁట రెయిల్వేవంతెన గలదు. సింధునదికి పశ్చిమముగా లార్కానాపురము గలదు.

అప్పర్సిందుఫ్రాంటియరుజిల్లా. షికార్పూరు జిల్లాకుత్తరముగా నున్నది. ప్రధానస్థానము జాకోబాబాదుపురము.

బొంబైరాజధానియందు ప్రభుత్వమునకు లోబడిన స్వదేశసంస్థానములు పెక్కు గలవు. చాలభాగము ప్రాముఖ్యతలేని చిన్నవిగనున్నవి. ముఖ్యములు ఖైర్పూరుస్టేటు, కథియవాడ ద్వీపకల్పమునందలి పాలన్పూరుస్టేటు, మహాకాంతి స్టేటు, రేవాకాంతస్టేటు, కాంబే (నవాబు)స్టేటు, కచ్ఛిద్వీపకల్పమునందలి రాజకోట, భావనగరు, పోర్బందరు, జూనీఘడ్ స్టేటును ముఖ్యములు. తక్కినవి చాల చిన్నవి. మహారాష్ట్ర దేశమున కొల్హాపూర్, సావంతవాడీ, సాంగ్లి స్టేటులు ముఖ్యములు. ఇంకను జంజిరా (నవాబు) స్టేటును చెప్పఁదగినదియె. ఇదిచాల చిన్నది.

**బొక్కెనచెట్టు**—బొక్కెన నీటిబొక్కెన మెట్టబొక్కెన యని రెండువిధములు. దీని

నీటిపిప్పలి యనియు నందురు. ఇది నీటిమోరలను దరుచుగ లేచుచెట్టు. నేల పాకునది. లా. Lippia Nodiflora. సం. జలపిప్పలీ.

దీని రస కషాయము లించుకవేడిఁజేసి ప్రసవ స్త్రీల మైలరక్తమును స్త్రీల రుతురక్తమును జక్కఁగ వెడలజేయుననియు, పాముకాటు విషమును హరించుననియు, వాతదోషము, క్రిమి రోగము, కుక్షివ్యాధులు, పిల్లల యజీర్ణదోషముల నడంచుననియు, దీనికషాయమున జటామాంసి కూడఁజేర్చిన నుదరరోగములను మలమూత్రములుగుండ జక్కగ వెడలఁజేసి యారోగ్యమిచ్చుననియు, ఆకునం దుదరరోగముల వాపుటయు, గాయముల మాన్పుటయు, గాయము నుండి రక్తస్రావమునాపుటయు, పుండ్లనుమానజేయుటయు, తలకుంగట్టిన సన్నిపాతదోషమడంగుననియు, పసరు చెవిలోఁబోసినచెముడు నివారణమగుననియు,పసరు లోనికిచ్చిన నుబ్బుజాడ్యము, గర్భోద్రేకము, విషోద్రేకము శాంతించుననియుఁ జెప్పఁబడినది.

**బొఖారాఖనాత్తు** — (మధ్యతురుష్కస్థానము చూడుఁడు)-(బూక్కరదేశము చూ.)

**బొచ్చు ఎంతకాలిస్తే బొగ్గులవుతుంది?**—(ఆంధ్రలోకోక్తి.)

**బొచ్చుగల పందులు**-ఐరోపాఖండమునందు యుగోస్లావియా దేశమున మేనంతటను గొర్రెబొచ్చువంటిబొచ్చుగల పందిజాతికలదు. అందు ముఖ్యముగ నోవీసా దనుపట్టణపరిసరసీమయందంతటను నీజాతిపందులంబెంచి బజారులందు విక్రయించుచుండుటకుఁ బేరందినది. ఆ ప్రాంతములం దీజాతిపందులకు Fleeced pigs అనిపేరు.

**బొడ్డచెట్టు (బ్రహ్మమేడిచెట్టు)**— లా: Ficus Hispida, ఆంగ్ల. Wild Fig tree, సం. కాకోదుంబరికా, కాకోదుంబీరకా, కాకోదుంబరః, ఫల్గుః, ఫల్గునీ, ఫల్గుఫలమ్, మలపూః, మలయూ.

దీనికాయలు పండినతోడనే పురుగు లేర్పడును గాన నంజూరుచెట్టుకు సంబంధించిన యధమపుజాతిగఁదోచెడిని. దీని లేత కాయలను కూరగఁజేతురు గాన నిదియు భోజనపదార్థమనియే చెప్పఁబడఁదగినది.

బొడ్డచెక్క,బొడ్డాకుల రసకషాయములందు ఉబ్బురోగము, కఫపైత్యము, దుష్టజాతికుష్ఠురోగము,పాండువు, రక్తపైత్యము, వ్రణములను నివారించు గుణము గలదని చెప్పఁబడినది.

**బొడ్డచెట్టు**— లా. Ficus Racemosa (or Glomerata), ఆంగ్ల. Fig tree లేక Gular Fig. సం. ఉదుంబరః, క్షీరవృక్షః, హేమదుగ్ధః. దీనిక త్తిచెట్టనియు, బొడ్డచెట్టనియు, వాడుకనామములు.

వెగటురుచిగల్గి వ్రణములశోధించును.ఉబ్బు, అతిసారము, విదాహము, తాపము,సర్పి, ప్రమేహము, రక్తపైత్యము, రక్తమూత్రము, స్త్రీల రక్తస్రావము, కుసుమరోగము, అతిమూత్రము, విరేచనములు, వీర్యనష్టములను హరించును. చలువజేయును. చిగుళ్ళుగట్టిపరచును. పైత్యరోగము లడఁచును. ఆయుర్వృద్ధి బలాతిశయములఁ గల్గించును.

చెట్టుపాలు కంతులు, గవదబిళ్ళలు నివారించును. పండు రక్తవృద్ధి, వీర్యవృద్ధి, వీర్యస్తంభనము,కండ్లకుచలువ, కొంచెము శ్లేష్మప్రకోపముఁజేసి రక్తపైత్యము, క్షయ, అతిసారముల నడఁచును. దీనికి విరుగుడు ౧ సొంఠి, ౨ పుదీనా, ౩ జీలకర్ర.

**బొద్ది చెట్టు తీగె**—బొద్ది (1) పెద్దబొద్ది (2) చిరి (లేక చిన్న) బొద్దియని ద్వివిధము.

రెంటికి గుణ మొక్కటే. లా. Cassampelos Pareira.

బొద్ది వేరు నల్లగ నించుకసు వాసనఁగల్గియుం డును. రస కషాయములందు కాకజేసి త్రిదో షములను శమింపఁ జేయుననియు, సుబ్బసము పాండురోగము మూత్రకృచ్ఛ్రము పురాణగ్ర హణి విషదోషము క్షయరోగములపై చక్కగ పనిచేసి నివారించుననియు, ఆకు మేహశాంతి గల్గించుననియు, నూరి పైనవేసికట్టిన క్రొత్తగా యములు మాన్పుబట్టుననియు చెప్పఁబడినది.

## బొబ్బర్లచెట్టు-లా. Dolichos Sinensis అనియు, Vigna Catiang.

సం. బర్బటః, మరుత్కరః, రాజమాషః. పీట్ల నలచందలనియు నందురు. ఇంచుక వేడిఁ జేసి పురుషులందు వీర్యపటుత్వము స్త్రీలయందు పాలుపడునట్లు చేయును. మలమూత్రముల నధి కముగ వెడలించి స్త్రీలరజోరక్తమును శుభ్ర పరచి అశ్మరీరోగము నడంచును.

ఇటులయ్యు బుద్ధిని క్షీణింపఁ జేయును. అపానవాయువు గల్గించును. మేహ,రక్త, శ్లేష్మ పైత్యములనుబకవ్వడువికారమును బుట్టించినను బుట్టించును. రక్తమును జెరిపి విదాహముగలి గించునని కొంద రందురు.

బొబ్బర్లకు విఱుగుడు లుప్పు, జీలకఱ్ఱ, దాల్చినిచెక్క, పులుసు, శాంతి యని చెప్పఁ బడినది.

## బొమ్మల కొండపల్లి దుర్గము-- (రెడ్డి ప్రభువులు-కొండపల్లిదుర్గము చూడుఁడు.)

## బొలివియాదేశము— దక్షిణమెరికా

యందు పెరూదేశమున కీశాన్యదిశగానున్న దేశము. దీనికి సముద్రతీరములేదు. క్రీ. వె. ౧౮౮౪లో ఛిలీదేశముతోఁ గలహించినఫలి తముగ నది వారిపాలయ్యెనఁట. మధ్యగుండా నేగు నేండీపర్వతపంక్తులరెంటినడుమను ౧౩౦౦౦ అడుగులయెత్తుగల విశాలవంతమైన గొప్పపీఠ భూమి కలదు. ౨౩౮౦౦౦ చతురపుమైళ్ల వైశా ల్యముగల దేశము. ఆండీస్ పర్వతములందు సుప్రసిద్ధమగు సొరోటా, ఇల్లిమాని అను రెండు శిఖరములు నీదేశములోనివి. పొటోశి వెండిగని యీ దేశమునందుగలదు. ఈ దేశమునకు విదేశ స్థులగు స్పానియావారివరిపాలననుండి విముక్తిం గల్గించిన బొలివరు సేనానిపే రీదేశమున కిడఁబడి నది. ప్రజ లిండియాజాతులవారు. వెండి,రాగి, మొదలగు లోహములు గనులయందు దొర కును. రబ్బరు, కోకోతోఁటలు విరివిగా నున్నవి. కాఫీ, జొన్నలు పండును. సూక్రి(౨౩౦౦౦జ.) పురము ప్రజాప్రభుత్వ కార్యస్థానమున్న తావు. కాని టిట్రకాకాపురము పెద్దపట్టణము. ఇందు ౬౦౦౦౦ జనులు వసించుచున్నారు. వీటి కినుప బాటకలదు.పొటోసీపురము పూర్వౌన్నత్యముం గోల్పోవుచున్న పురము. గనులందు వెండి తగ్గి పోవుచున్నదఁట.

## బొసినియాస్టేటు—ఇండియూబాల్కను

స్టేట్సులలో నొకటిగ నుండినది. ఇది తొల్లింట టర్కీప్రభుత్వమునకుఁ జెందియుండి, టర్కీ ఆస్ట్రియాల యుద్ధసందర్భమున క్రీ.వె. 1878 బెర్లినుసంధితీర్మానము మేర కాస్ట్రియాయందుఁ జేరిపోయియున్నది. (ఆస్ట్రియా చూడుఁడు. టర్కీదేశము చూ.) ఐరోపా ఖండములోనిది. (హెర్జిగోలినాస్టేటు,బాల్కన్‌రాష్ట్రములు చూ.)

## బొహిమియనిజమ్(Bohimianism)

పూఁచీ పేచీలపాటింపక స్వేచ్ఛావర్తనముగ సంచ రించుటకు బొహిమియనిజమనియెదరు. తొల్లింటి కాలమున బొహిమియాదేశమునుండి యీవే రితర దేశస్థులందు వ్యాపించినదని స్ఫురించెడిని.

ఇక్కాలమున బాధ్యతలం బాటింపక ప్రవ ర్తించువారింగూర్చి బొహిమియనిజ మనెదరు.

**బొహీమియా దేశము**—ఐరోపాఖండములోనిది. (ఆస్ట్రియా దేశము చూడుఁడు.)

**బోటనీ (వృక్షశాస్త్రము, Botany)**-పాశ్చాత్యవిజ్ఞానమున జగత్పదార్థములు చైతన్యసహితము లనియు (animate) చైతన్యరహితములనియు (inanimate) ద్వివిధములుగ విభజింపఁబడియున్నవి. అందు చైతన్యసహితపదార్థవిజ్ఞానమునకు Biology యని సాంకేతనామ మిడియున్నారు. చైతన్యరహితపదార్థముల నింక వేర్వేరు తెగలుగ విభజించి వాటికి వేర్వేరు సాంకేతికనామములం గూర్చిరి.

ఇంక Biology వివరించు చైతన్యసహితపదార్థము ను సచేష్టితము లనియు (Active life), నిశ్చేష్టితము లనియు (Passive life) తిరుగ ద్వివిధములుగ విభజించియున్నారు. సచేష్టిత చైతన్యసహితపదార్థములగు జంతుజాలముం గూర్చి వివరించుకలకు 'Zoology' అనియు నిశ్చేష్టిత చైతన్యసహితపదార్థములగువృక్షములంగూర్చి వివరించుకలకు Botany యనియు పేరిడిరి.

వృక్షజాతులు నైసర్గికావస్థయం దగుచుండుఁగాన వాటిఁగూర్చినకలకు పిదపకాలమున 'Natural Science' అని పేరు వాడుకి నందెను. ఈశాస్త్రమున వృక్షజాతులు పూవులంబూచి కాచునవియు, పూత కాపులు లేనివియు నను రెండు తెగలుగ విభజించియున్నారు. పూత కాపు లేని వృక్షజాతికి 'Crypotogams' అని సాంకేతికనామము. పూచి కాయుచెట్లయందింకను సవీర్యబీజజాతులు, నిర్వీర్యబీజజాతులు నను రెండు తెగలు కలవు.

సవీర్యబీజజాతులకు కొబ్బరి, చింత, యుసిరిక మొదలగునవి సాదృశ్యములు. వీటివిత్తనములనుండియె పునర్బీజాంకురము కల్గెడిని. నిర్వీర్యబీజజాతుల కనఁటిచెట్టు సాదృశ్యము. పూచి కాచుజాతులకు Phanaragams అని పేరుకలదు. కొందరు పూవులంబూచి కాయుని జాతులకు 'Flowering plants' అనిరి. కాని పిదప నీపేరు కేవలము పూవులంబూచి కాయుని జాతులకు, పూచి కాయులంగాచు జాతులకుఁ గూడ వాడుచున్నారు.

ఈవిభజన మింతటితో నాగక [illegible] సంవత్సరమున జీవనము ముగియువాటికి Annuals అనియు, రెండు వత్సరములలో జీవనము ముగియువాటికి 'Biennials' అనియు, అంతకన్న నధికకాలము జీవించువాటికి 'Perennials' అనియుఁ బేర్లిడియున్నారు.

ఈశాస్త్రమున చిన్నమొలకలుగల మొక్క-జాతులకు Herbs అనియు, పొదలు, [illegible] లుగ నుండు జాతులకు Shurbs అనియు, పెద్ద వృక్షములగు జాతులకు 'Trees' అనియు నొక విభజన చెప్పఁబడినది. వేరొక విభజనము Erect plants or woody plants [illegible] Prostrate plants అనియుఁ [illegible]. ఇం [illegible] మొదటిజాతి [illegible] జాతులు; రెండవజాతి నేలపాకు [illegible] లగు జాతిచెట్లును Root climbers అనఁ [illegible] వేళ్ళసహాయమునఁ [illegible] చెట్లును; Hook climbers (ఇవి [illegible] గలవు).

Tendril climbers- అనఁగా సన్నపు తీఁగలచుట్టులంజాచి వాటిచే నెత్తుగుతావు నవలంబించి దానిపై నాధారపడి మొగబ్రాకులతలును, Twiners అనఁగా మల్లె జాజి పెండలము కందమూలపుదుంపతీఁగలకు చుట్టుకొనుచు నెగబ్రాకుజాతులును, water plants లేక marsh plants లేక aquatic plants

or Hydrophytes అనఁగా నీటియందు పుట్టి పోక పెరుగు కలువ, తామర మొదలగు జాతులును, Dry plants లేక desert plants లేక Xerophytes (జెరోఫైట్సు) అనఁగా నీరు తక్కువగానుండు తావులందు పెరుగు బ్రహ్మచెముడు, చెముడుచెట్లు, మొగలిచెట్లు, కిత్తలినార, కలబంద మొదలగు నీరక్కరలేని చెట్లజాతియు, Parasatic plants అనఁగా నొకచెట్టుపై నాధారపడి దానిపైఁ బెరుగు బదనికజాతిచెట్టును, saprophytic plants అనఁగా కుక్కగొడుగు(mushroom) కాకిబొడ్డు, మొండిచెయ్యి మొదలగు మృతిపదార్థములపైఁ బెరుగు వృక్షజాతులునుగా విభజింపఁబడి వివరింపఁబడుట గాననగుచున్నది.

ఈ శాస్త్రమునం దారితేరిన పాశ్చాత్య విద్వాంసులు వృక్షజాతులను శాస్త్రతః యవి పూచు పూవుల విధములంబట్టి Natural orders అనియు, Scientific classification అనియుఁ జేసిలనికి వాటిధర్మముల మేరకు విభజించి యున్నారు. అందు Families genera and species లనాధారముగఁ గైకొని విభజించియున్నారు.

చెట్లయొక్క గుణగణములు, లక్షణములు నిటుల వివరింపఁబడినవి:- చెట్లకు ప్రాణముండును. అవి పెరుగఁగలవు. ద్రవపదార్థములనే భుజించును. ఆకుపచ్చరంగుగల్గి యుండును. సంచరింపఁజాలవు. దానిజాతినేవృద్ధిజేసికొన బీజములనిచ్చును. గాలిని బీల్చుకొనఁగలవు. కార్బన్ (Carbon) అనుపదార్థమును బీల్చుకొని జీర్ణ మొనర్చుకొని చెట్లకు జంతువులకుఁగూడ నాహార పదార్థముగ నుపయోగించు Starch- Protein- Fat sugar- Chlorophyll- Protoplasm అనుపదార్థములం గలిగింపఁ గలవని చెప్పఁబడినది.

వృక్షజాతు లన్నిటికిని గాలి, యుదకము, వెచ్చదనము, సూర్యరశ్మి యత్యవసరములని పరిశీలకులు తెలిసికొనియున్నారు. పిదప భూమియందున్న 1. Phospherus salts, 2. Nitrogenous salts, 3. Magnesium salts, 4. Calcium salts, 5. Potassic salts, 6. Iron salts ను, 1. Oxygen gas, 2. Hydrogen gas, 3. Nitrogen gas, 4. Carbon-di-oxide అను గాలులును కలిపి పది Essential Elements అనంబడునవియు చెట్లయాహారముగఁ జెప్పఁబడినవి గాన వీట్లనెఱుంగుట వృక్షశాస్త్రవేత్తల కత్యవసరమై యుండెడిని.

వృక్షములయుత్పత్తికిఁ బ్రధానమార్గములు రెండు శాస్త్రమునందుఁ జెప్పఁబడినవి. అవి ౧ విత్తనముల మూలమునను (Propogation by seeds), ఇతరసాధనముల మూలమునను (Propogation by Vegetation means) బీజములనుండి మొలచు చెట్లజాతులవిత్తనములను పాశ్చాత్యవృక్షశాస్త్రజ్ఞు లొకేపప్పుబద్ద గల(ఏకదళబీజ) జాతులనియు (Monocotyledons), రెండుపప్పుబద్దలుగల (ద్విదళబీజ) జాతులనియు (Dicotyledons) ద్వివిధములుగ విభజించియున్నారు. అందు ఏకదళబీజ జాతులు 1. Graminae (ధాన్యజాతులు), 2. Palmae (కొబ్బరి తాటి ఈఁత మొదలగు వృక్షజాతులు) 3. Araceae (పోకలజాతులు), 4. Commelinaceae, 5. Liliaceae (కలువ, తామర, చెంగలువ మొదలగు జాతులు) 6. Amaryllidaceae (తోఁటకూరచెట్లజాతులు మొదలగునవి,) 7. Iridaceae, 8. Musaceae, 9. Orchidaceae (ఏపిల్‌జాతులు మొదలగునవి.

పిదపఁ జెప్పఁబడినవగు ద్విదళబీజజాతులు

(Dicotyledons) తిరుగ (1) archichlamydeae జాతులనియు, (2) Sympetalae జాతులనియు ద్వివిధముగ విభజనచెప్పఁబడినది.

Archichlamydeae జాతియందు దుప జాతు లిరువదియారు కలవు. వీటికి Natural orders అనియు నందురు. ఈజాతి భేదములు పాశ్చాత్య విద్యావిశారదులు ముఖ్యముగా పుష్పముల భేదముల ననుసరించి విభజించి యుండిరి. 1. Fagales జాతి, 2. Urticaceae జాతి, 3. Moraceae జాతి, 4. Loranthaceae జాతి, 5. Polygonaceae జాతి, 6. Chenopodiaceae జాతి, 7. Portulacaceae జాతి,8. Caryophyllaceae జాతి, 9. Ranunculaceae జాతి, 10. Anonaceae జాతి, 11. Lauraceae జాతి, 12. Cruciferae జాతి, 13. Rosaceaeజాతి (గులాబీ), 14. Leguminosae జాతి (కంది,పెసర,ఉలవ మొ॥ పప్పుజాతులు), 15. Rutaceae జాతి,16. Euphorbiaceae జాతి (అనఁగా పాలుగల చెముడుజాతులు) 17. Anacardianceae జాతి, 18. Sapindaceae జాతి, 19. Balasaminaceae జాతి, 20. Malvaceae (ప్రత్తిజాతి), 21. Dilaniaceae జాతి, 22. Dipterocarpaceae జాతి, 23. Caricaceae జాతి, 24. Cactaceae బ్రహ్మచెముడు జాతులు, 25. Myrtaceae, 26. Umbelliferae.

పిదపఁ జెప్పఁబడిన Sympetalae జాతియు ద్విదళబీజజాతిలోనిదే. ఇందు పదునొకండు భేదజాతులు కలవు. వీటింగూడ Natural orders అనియెదరు.

1. Ericacea జాతి, 2. Myrisnaceae జాతి,3. Apocynaceae జాతి, 4. Convolvulaceae జాతి, 5. Labiatae జాతి, 6. Solanaceae జాతి, 7. Scrophulariaceae, జాతి, 8. Acanphaceae జాతి, 9. Rubiaceae జాతి, 10. Cucurbtaceae (గుమ్మడి పాదులజాతులు), 11. Compsitae.

ఇటుల పూవుల భేదములనుండి విభజింపఁబడిన యేకదళబీజజాతులు, ద్విదళబీజజాతులు సాముదాయిక లక్షణభేదముల నీక్రింద వివరింపఁబడినవి. వాటిననెల్ల యాంగ్లమున వివరించుటయె సమంజసముగ నుండుంగాన నటులనే వివరింపఁబడినవి.

Embryo—with one cotyledon (mono cotyledon) stem with closed bundles, scattered in cross section, leaves generally parallelveined, flowers with parts in threes. Embryo, with two cotyledons (Dicotyledons) Stem with open Bundles, usually in one ring, Leaf netveined, flowers with parts in twos fours, or fives, rarely in threes.

(a) Archichlanydeae, Perianth either absent, or in one whorl, or if in two whorls the parts of the inner whorl (patals) free, sometimes. one whorl is missing owning to supression and occasionally the corrolla is gamopetalous.

(b) Sympetalae— Perianth in two whorls. Corrolla with few exceptions, gamopetalous, stamens twice as many as the petals, or as many, or reduced to four or two Epipetalous except in Ericaceae and campanulaceae.

**బోట్టొమ్రి** (Bottomry)- (వాణిజ్యసంబంధపరిభాషాపదము).సరకులంగొంపోవుపడవల

నన్యులకుం గుదువబెట్టుటకు పేరు. అట్టికార్యమున వ్రాయఁబడుపత్రమునకు "Bottomry Bond" అనిపేరు.

## బోడతరము (బోడసరము)చెట్టు -

బోడతరముచెట్ల లెక్కలేనిభేదములు గలవందురు. అందు పెద్దబోడతరము, చిన్న లేక సన్న బోడతరము, తెల్లబోడతరము, నల్లబోడతరము, ఎఱ్ఱబోడతరము, నీటిబోడతరము ననునవి లెక్కింపఁబడినజాతులు. అన్నిటికిని గుణమునందు భేదము లెంచఁబడుటలేదు. ఇందు తెల్లబోడతరము శ్రేష్ఠమందురు. లాటిన్భాషయందు తెల్ల బోడతరమునకు 'Sphaeranthus Indicus' అనియు, బోడతరసామాన్యమునకు 'Sphaeranthus Hirtus' అనియుం బేర్లు గలవఁట. సంస్కృతమున తపస్వినీ, భిక్షుః, ముండికా, ముండితికా, ముండీ, శ్రావిణీ, శ్రమణా యను పేర్లు సామాన్యతః గాననయ్యెడిని.

బోడతరమువిత్తులచూర్ణము క్రిమిహర మనియు, వేరునందు మూలవ్యాధి నివారించుశక్తి కలదనియు, నాకునందు స్త్రీల చనుకుదురు, సామాన్యముగ రొమ్మునందయ్యెడి కురుపులు నివారించుగుణము కలదనియు, సమూలమునందు ఛిద్రశరీరమును బాగుజేసి ధాతుపుష్టి, వీర్యపుష్టి గల్గించుగుణము గలదనియుఁ జెప్పఁబడినది.

బోడతరము వేళ్ళు, కాడలు, పువ్వుల రసకసాయ చూర్ణములందు వేఁడిచేసి యీ క్రింది రోగముల నివారించుశక్తి కలదందురు—

అండవృద్ధి, ఆంత్రవృద్ధి, అనులోమవాతము, ఆందోళనరోగము, ఉన్మాదరోగము, కామిర్లు, కఫదోషము, గళరోగము, గుల్మ, జ్వరము, ద్వంద్వరోగములు, భ్రమ, భయరోగము, మనోచంచలము, మూత్రముపడుతరి చురుకు, మూలవ్యాధి, మేహరోగము, రక్తవాతము, మనోజడత్వము, శ్లీపద (బూరగాలు) రోగము, శూలలు.

దీనివిలువ యాయుర్వేద వైద్యశాస్త్రమున విస్తారముగ వివరింపఁ బడినది. బోడతరము కాయసిద్ధి గల్గించుననియు, వాచాలత్వము నధికపఱచుననియు, అన్ని జాతుల వ్రణములను మాన్పుననియు, పోయినయౌవనమును దిరుగ శరీరమునకుఁ గల్గించుననియు, నెరసినతల వెంట్రుకలు తిరిగి నల్లగబయలువెడలునట్లు జేయఁగల శక్తి దీనికిఁగలదనియు, శరీరమున ముదిమిని వ్యాపింపనీయక శరీరపటిమను, బలమును, యౌవనమును, నిల్వజేయుననియు, పరిమితమునకు మించిన వీర్యపటిమం గల్గించి, రతిసౌఖ్యము నభిలషింపఁ జేయుశక్తి దీనికిఁ గలదనియు, తామ్రమును దీనిచే శుద్ధిజేతురనియు ఋషులు వివరించిరి.

బోడసరపువిత్తుల (శర్కరతోఁ గల్పిన చూర్ణము)నొకసంవత్సరము తప్పక సేవించిన పోయినయౌవనపటిమ తిరుగఁగల్గి వెంట్రుకలు కస్తూరివలె నల్లనయి శరీరపుపటిమ, బలము స్థిరపడుననియు, పూవులను నీడ నెండించి చూర్ణముజేసి యావునేతితోఁ బుచ్చుకొనినను, బోడతరపువేళ్లు గుంటకలగరవేళ్లతో సమభాగము నీడనారించి చూర్ణముఁజేసి యావునేతితో నొకసంవత్సరము పుచ్చుకొనినను మిక్కిలి వీర్యపటిమ, దేహబలము గల్గి ముదిమిబాధ లేక తలవెంట్రుకలు నల్లగ బయలుదేరుచిహ్నముగ రతిసౌఖ్యాభిలాషియైమనియుండుననియు, తొల్లింటికాలమున రసవాదశాస్త్రయోగులు రాగిని బంగారుగ బోడతరము నుపయోగించుచుఁ జేయువారనియుఁ జెప్పఁబడినది.

మఱియు నీజాతికింజేరిన విత్తుబోడతరమును జాతికి లా. Sphaeran thus Indicus

అనియు సంస్కృతమున ప్లీహా, ప్లీహాహన్త్రీ, హాపుషా, హాబుషా యనియు నందురు. ఇది వేడిచేసి క్రిమి, గుల్మ, జలోదర, ప్లీహ, మూలశంక, శ్లేష్మముల నివారించునని చెప్పఁబడినది.

**బోడినెత్తికి బొండుమల్లె లేలను?**- (ఆంధ్రలోకోక్తి).

**బోడీస్ లా** (Bode's Law)— ఎస్ట్రోనొమీ శాస్త్రమున సూర్యునుండి Planets కుఁగల దూరమును లెక్కించుట కగు విధానమున కీపేరు వాడఁబడినది. ఇది కేవలము పరిశీలనల నుండి యేర్పడినదిగాన Empirical అనిరి. కొందరు గణితశాస్త్రవిధానవరు లీలెక్క యించుమించుగా సరిపోవు ననిరి. కడుదూరమునఁగల నెప్ట్యూను గోళముంగూర్చి పరిశీలన యట్లు కుదిరినదని చెప్పఁబడినది.

0-3-6-12-24-48-96-192-384 వీటికి నాల్గు చేర్చినచో ఈక్రిందిఅంకెలు వచ్చును.

4-7-10-16-28-52-100-196-388.

**బోదకాలుపురుగు**— ఇది సూక్ష్మజీవుల (worms) జాతికిఁ జెందిన పురుగులనుండి కలుగు నంటువ్యాధి. దీనివలన జ్వరముతోఁ గూడి కాలుచెయిమొదలగునవి వాచి, బోదకాళ్ళు, బోదచేతులు, బోదఅండములు, బోద స్తనములు ఒకటిగాని రెండుగాని యేర్పడును. లెక్కదినములమేరకుఁ గాని, కొందరి కప్పటప్పటఁగాని జ్వరము గల్గుచుండును. కొన్ని శరీరములకు జ్వరకాలమున విదాహము, అతిమాత్రము ౧౦౩డిగ్రీలదనుక జ్వరము గల్గుచుండును. విరేచనబద్ధముకాకుండ శరీరమును గాపాడుకొనుచుండిన నీజ్వరము నాపవీలగును. అజీర్తి, పైత్యోద్రేకము, ఎక్కువశ్రమపడుట, ఎండలోఁ దిరుగుట తప్పక జ్వరముం గల్గించును. రక్తనాళములలో నివి గ్రుడ్లంబెట్టి రక్తప్రవాహనిరోధము గల్గించినకతన బోద యేర్పడునని పరిశీలకు లనుచున్నారు. అట్టినాళము వాచి నొప్పిగల్గి బోద యేర్పడునఁట. జ్వరప్రారంభమున విస్తారము చలిగల్గి యుండును. రాత్రులం దీపురుగు లుద్భృతి గల్గియుండుం గాన నాతావుల రక్తముఁదీసి అద్దముపైపూసి భూతఅద్దములతోఁ బరిశీలించిన నాపురుగు లగుపడును. ఇది దోమల కాటుగుండా వ్యాపించు నంటువ్యాధిగఁ జెప్పఁబడినది. (జెరమ్సు చూడుఁడు. అంటువ్యాధులు, సూక్ష్మజీవులు చూడుఁడు.)

**బోదారుశృంగి** — ఇది గుజరాతు దేశమున పర్వతములందు దొరకు శిల యనెదరు. రసబద్ధము జేయు ననియు, త్రిదోషశమన మొనర్చి వ్రణముల మాన్పి రోగముల నడంచి కాయసిద్ధి గల్గించు ననియు, తలవెండ్రుకలకు కాంతి గల్గించు ననియుఁ జెప్పఁబడినది.

**బోదాక్ష గోత్రము** — (ముద్గల గణము చూడుఁడు.)

**బోధకగణము**— ఇది విశ్వబ్రాహ్మణుల యందొకగణము. ఇం దైదుగోత్రములు చెప్పఁబడినవి. (ప్రణవశాఖ విశ్వబ్రాహ్మణులు చూ.)

౧. బోధకగణము- ఇం దైదు గోత్రములు కలవు. ౧. కల్పర్షి గోత్రము- బోధక, కల్ప, ఉపకల్ప (త్రియార్షేయ ప్రవర). ౨. దేవసేన గోత్రము- దేవసేన, ఆదిత్య, విశ్వజ్ఞ, (త్రియార్షేయ ప్రవర). ౩. ఆదిత్యర్షి గోత్రము- ఆదిత్య, విశ్వజ్ఞ, వనజ, విచేతన, విధి (పంచార్షేయ ప్రవర). ౪. నిగమ గోత్రము- విచేతన, విధి, నిగమ, (త్రియార్షేయ ప్రవర). ౫. ఉపయజ్ఞర్షి గోత్రము- ఉపయజ్ఞ, సభ్య, క్రిమ, నియత, శ్రీయావద, (పంచార్షేయ ప్రవర).

**బోధనైకాదశి (మేల్కొల్పు ఏకాదశి)**- దీనిని 'ఉత్థానైకాదశి' యనియు నందురు.

శయనైకాదశిదినమున పరుండి నిదురించిన విష్ణుదేవుఁడు బోధనైకాదశియందు మేల్కాంచు నందురు. (పండుగలు చూడుఁడు. కార్తికశుద్ధ యేకాదశి మహైకాదశులు చూడుఁడు.)

**బోధాయనగణము**-ఇది విశ్వబ్రాహ్మణులయం దొకగణము. ఇం దైదుగోత్రములు చెప్పఁబడినవి. (సామశాఖ విశ్వబ్రాహ్మణులు చూడుఁడు.)

౧. బోధాయనర్షి గోత్రము: బోధాయన జాతరూప చిత్రసేన (త్రియార్షేయప్రవర.)

౨. జాతరూపర్షి గోత్రము: జాతరూప చిత్ర సేన ప్రబోధన. (త్రియార్షేయప్రవర)

౩. చిత్రసేనర్షి గోత్రము: చిత్రసేన ప్రబోధన జయ జయసేన విభవ (పంచార్షేయప్రవర).

౪. జయసేనర్షి గోత్రము: జయసేన విభవ విజయప్రద ప్రతిధార్మిక విఘనస (పంచార్షేయ ప్రవర).

౫. విఘనర్షి గోత్రము: విఘనస సుతప ప్రజాపతి (త్రియార్షేయప్రవర).

**బోధాయనర్షి**—ఈమహాత్ముఁ డాంధ్రుఁ డనియు, నివాసస్థలము సరిగాఁ దెలియరా కున్నను ప్రాక్సముద్రతీర మనియు బలమగు ప్రతీతి కలదు. ఈయనరచించిన(బోధాయన) సూత్రములు సుప్రసిద్ధములు. కడుప్రాచీనుఁడని వేఱుగ వ్రాయనక్కఱలేదు. ఈతని సూత్రము లంబట్టి యక్కాలమున వ్యాపించి యుండిన (దేవరన్యాయాది) కొన్ని దురాచారములు ధర్మములని యీసూత్రములం దంగీకరింపఁ బడియున్నను, ఈమహాత్ముఁ డొనర్చిన ఘన కార్యము సూత్రరచనకు (సూత్రములు చూ డుఁడు) ప్రారంభ మనియు, వేదధర్మములను సూత్రములుగ రచించుట నీయనయె ప్రప్రథమ మున నొనర్చెననియు నెఱుంగ వలయును. బోధాయనర్షి రేఖాగణిత (Indian Geometry) ధర్మములను భరతదేశమున ప్రారంభించెనుగాని యెక్కువగ వివరింపమి నాప్రారంభించినపేరుప్రతిష్ఠలాయాపస్తంబర్షికే దక్కుచు చుందురు. (ఆపస్తంభుఁడుచూడుఁడు. రేఖాగణితము చూడుఁడు. జియోమిట్రీ చూడుఁడు).

**బోధివృక్షము**— ఇది రావిచెట్టు. బుద్ధగయకడనున్న వృక్షముక్రింద తపం బొనర్చి, బుద్ధభగవానుఁడు జ్ఞానవంతుఁడగుబుద్ధుఁడగుట నీవృక్షమునకు బోధివృక్ష మనియు, నామహనీయునకు బుద్ధుఁడనియుఁ బేరయ్యెనఁట. ఈ వృక్షముయొక్కకొమ్మను నాటి, బ్రతుకఁ జేసి. అశోకచక్రవర్తిసుత యగు సంఘమిత్త యను యోగిని సింహళమునకుంగొంపోయి అనూరాధ పురమున నాటినది. ఇక్కాలమున నది యొక బోధివృక్షమై బౌద్ధుల యాత్రాస్థలమై యున్నది. ఈవృక్షముల నాంగ్లేయులు "Botree" అను చుందురు. (బుద్ధగయ చూడుఁడు. బీహారు దేశము చూడుఁడు.)

**బోనపార్టిజమ్** (Bonapartism) — ఫ్రాన్సుదేశమున క్రీ. శ. 1769 మొదలు 1821 వఱకు రాజ్యమేలిన యొకటవ Nepolean Bonaparte యొక్కయు, పిదప మూడవ Nepolean Bonaparte యొక్కయు(అనగా ఆరాజవంశస్థు లవలంబించిన) రాజనీతివిధానము. ఈకళ నారాజవంశస్థులకు ఫ్రాన్సురాజ్య పాలన మప్పగించ నిచ్ఛగించు ప్రతివాదిం గూర్చియు నుడువఁబడుచున్నది.

**బోనస్ లేక బోనస్సు**(Bonus)-వాణిజ్యసంబంధపరిభాషాపదము. ఒక Company యొక్క మామూలు devidend కధికముగ నొసంగఁబడిన ద్రవ్యము. ఇది నగదుగా నిచ్చి వేయఁబడవచ్చును, లేక చెల్లింపఁ బడవలసిన premium నుండి మినహాయింపఁబడవచ్చును.

**బోన్ టు పిక్** (Bone to pick)—కష్టసాధ్యమగు ప్రయత్నమున కీపేరు సామెతగా వాడుచుందురు. ఇటలీ దేశముకడనున్న సిసిలీ ద్వీపమున వివాహసందర్భమున కన్యాప్రదాత యల్లున కొకయెముకనిచ్చి "నీవు భార్యను సమ రింపఁగలవని చూప నీయెముక నెత్తుము" అను నాచార ముండెనఁట.

**బోయజాతి**—(కొరవజాతి చూడుఁడు).

**బోయరులు** (Boers)-క్రీ.వె. ౧౬౪౮ మొదలించుమించు రెండు శతాబ్దములవఱకు దక్షిణాఫ్రికా దేశమునకు వలసపోయి అటఁ గొప్పగొప్ప సేద్యగాండ్రైన హాలండు దేశస్థులకు బోయరు లనిపేరు. "బోయ"రన వ్యవసాయకుఁడని యర్థము. క్రీ.వె. ౧౮౯౯-౧౯౦౨ బోయరుయుద్ధము దేశప్రసిద్ధము.

మంచిస్థితియందున్న వ్యవసాయకులు, యుద్ధనైపుణ్యముగల బుద్ధిశాలురు, ఆతిథ్యమీయ వెనుదీయువారు కారని ప్రసిద్ధి.

**బోయిలింగుపోయింటు** (Boiling point)-నీటిం గాచిన నది యావిరిగ మారుట బోయిలింగనియు, అట్టి టెంపరేచరునకు బోయిలింగుపాయింటనియు సాంకేతికనామములు పెట్టి ఆంగ్లరసాయనిక శాస్త్రవిదులువాడుచున్నారు. నీటియొక్క బోయిలింగుపాయింటు భూమిపై పల్లపుఁబ్రదేశములందధికమై పర్వతాగ్రములు మొదలగు నెత్తుప్రదేశముల తక్కువగా నుండును. సర్వసాధారణముగ పల్లపుభాగముల ఫారన్హీటు తెర్మోమీటరునందు ౨౧౨ డిగ్రీలకడను, అదియె సెంటిగ్రేడు తెర్మోమీటరునందు ౧౦౦ డిగ్రీలుగను నీటియొక్క బోయిలింగుపోయిం టుండునని తేలినది. కాని, గాలియొత్తడి పోనుపోను తక్కువగనగుచుండుఁగాన పర్వతాగ్రముల వాటివాటి యెత్తుననుసరించి వేర్వేఱు తక్కువటెంపరేచరులందు నీటియొక్క బోయిలింగుపోయింటు కల్గుచుండును. ఉదాహరణముగ మాంటు బ్లాంకు (పర్వతాగ్రము) న ఫారన్హీటు తెర్మోమీటరునందు ౧౮౫ డిగ్రీల టెంపరేచరుకడను సెంటిగ్రేడు తెర్మోమీటరునందు ౮౫ డిగ్రీల టెంపరేచరుకడను నీటికి బోయిలింగుపోయింటు కల్గుచుండును.

లోహము లిట్టిభేదములతో నెక్కువటెంపరేచరులందుఁ గాని కరగవు. సాదృశ్యముగా బంగారము సెంటిగ్రేడు తెర్మోమీటరునందు ౧౦౬౪ డిగ్రీల టెంపరేచరున కరగి, ౨౫30 డిగ్రీల (వేఁడి) టెంపరేచరుకడ నీరువలె ప్రవహించునది యగును. తగరము ౨3౦ టెంపరేచరున కరగి ౨౨౭౫ టెంపరేచరున నీరువలె ప్రవహించుఁగాన నది బోయిలింగుపోయింటని చెప్పఁబడినది. రాగి ౧౦౮౨ టెంపరేచరున కరగి ౨3౦౦ డిగ్రీల టెంపరేచరున బోయిలింగుపోయింటు గల్గునని చెప్పఁబడినది. భూమియొక్క యుపరిభాగపుపొరలో నాలుగవవంతుండునని చెప్పఁబడిన సిలికాన్ (Silicon) సెంటిగ్రేడు ౧౫౦౦ కడ కరగి, 3000 డిగ్రీలటెంపరేచరున నీరువలె ప్రవహింప నగునట్టి బోయిలింగుపోయింటు సిద్ధించునని చెప్పఁబడియున్నది. ఇట్టివి సర్వసాధారణముగ సెంటిగ్రేడు తెర్మోమీటరునందే టెంపరేచరు వేఁడి డిగ్రీలను లెక్కించుచుండుట పరిపాటియైయున్నది. మఱియు నీటివలె పాఱునట్లు కరఁగఁజేయఁగల వేఁడినే (డిగ్రీలు) బోయిలింగుపాయింటు (Boiling point) అనెదరు.

ఇది యిటులుండ గాస్ల (gases) బోయిలింగుపాయింటు విచిత్రముగ నుండును. ఇది సెంటిగ్రేడు తెర్మోమీటరునందు మైనస్ (minus) ౧౫౨ డిగ్రీలకడ, ననఁగా ౧౫౨ డిగ్రీలశీతలమునను ఫ్లూవోరైన్ (fluorine)

౧౮౭౭ డిగ్రీలశీతలమునను నైట్రోజెన్ ౧౯౪ డిగ్రీలశీతలమునను ఆక్సిజెన్ ౧౮౨ డిగ్రీలశీతలమునను బోయిలింగుపాయింటు గల్గినవిగాఁ జెప్పబడినవి. ఇట బోయిలిం గనిన ద్రవరూపము మాఱి యావిరిగ నగుటయని తేలుచున్నది. వీటఁ గొన్నిటికి వేఁడిగల్గించియు, కొన్నిటికి శీతలముఁ గల్గించియు బోయిలింగుపోయింటుగల్గింపగల్గుట తేలుచున్నది.

బోయిలింగు పాయింటు వేఁడి సాధారణముగ నీ రావిరిగ మార్పుజెందఁ జేయఁగల వేఁడి నందురు. ఇది వాతావరణపు ఒత్తిడింబట్టి వేఱుగ నుండుటయే గాక వేర్వేరు ద్రవపదార్థములకు వేర్వేఱుగనుండెడిని. ఎత్తుకొలఁది మారుచుండును. నీరు సామాన్యముగ భూమిపై ౨౧౨ డిగ్రీల ఫారన్హీటునందునను(౧౦౦. సెంటిగ్రేడు) మోంటుబ్లాంకు పర్వతశిఖరముపై ౧౮౫ ఫారన్హీటునందునను Boiling point నందును, ఇంక స్పిరిట్సు ఆఫ్ వైను ౭౮ సెంటిగ్రేడనియు, పాదరసము ౩౫౭ సెంటిగ్రే డనియుఁ జెప్పుదురు.

**బోర్ (Bore)**— సముద్రజలములు సూర్యునిచేఁగాని చంద్రునిచేఁగాని యాకర్షింపఁబడి పోటుగల్గి యెత్తునకు లేచును. ఆసమీపప్రదేశముల సముద్రమునం జేరు త్వరితమున పారలి పాఱు నది యొక్కటి యుండునేని, యెత్తునకు లేచిన సముద్రపునీ రానదినీటిని రాకుండ నిలుపుటయే గాక, వాటను కుదురునేని తానెనుకుతిరిగి నదిలోనికివేగముగఁ బర్విఁకుటయుఁ గలదు. ఒకప్పుడుగొప్పధ్వనిఁ జేయుచు నదిలోని కతిత్వరితముగఁ బర్విఁకు చుండును. అట్టి పరుగునకు 'Bore' అనిపేరు.

**బోరిస్ (Boris)** — రష్యను నామము. యుద్ధవీరుఁ డని యర్థము. పురుష నామము. (క్రైస్తవ నామములు చూడుఁడు.)

**బోర్నియోద్వీపము**— ఇది ఓసీనియాయందలి మలేసియాద్వీప సమూహమునకుఁ జెంది, యందలి సుండా ద్వీపములలోనిదై యున్నది. ఇది సుమత్రాద్వీపమునకన్న మఱియంత కలదనియందురు. భూమధ్యరేఖ దీని గుండా నడిచెడిని. జావాద్వీపమున కీశాన్యదిశనున్నది. ఇందు 'కినీబాలు' అనుపేరుగల యుగ్ని పర్వత శిఖరము సముద్రపు నీటిమట్టముపై ౧౪౦౦౦ అడుగులయెత్తుగలది కలదు. సముద్రపుగాలులచే నిది సమశీతోష్ణప్రదేశమని చెప్పఁబడుచున్న ద్వీపము. భూమి చాల ఫలవంతము. వజ్రములు, బంగారము దొరకుగను లిందుఁ గలవు. 'ఔరాంగోటాంగు' అనుపేరుగలజాతికోతు (తోఁకలేనివి) లీద్వీపమున విస్తారముగాఁ గలవు. ఇందలి యాదిమనివాసులగు డైయాకు జాతివారు ద్వీపమధ్యభాగములందునను, మలయాజాతి చీనాజాతి ప్రజలు తక్కిన ప్రాంతములందునను వసించుచున్నారు. రాజధాని బ్రూనీపురము. ఇట దేశాధిపతియగు సుల్తాను నివసించుచున్నాఁడు. కాని, సామంతరాజులు నిజపరిపాలకులని చెప్పఁబడినది.పశ్చిమ తీరమున నున్న Pontianak పురము డచ్చివారిది. బ్రూనీకి నైరుతిదిశగానున్న సరవాల్ పురమున నొకయాంగ్లేయుఁడగు భూపతి రాజా యను బిరుదముగల్గి పరిపాలించుచుండును. Sir. James Brooke అనుపేరుగల మొదటి ఆంగ్లేయుప్రభువు దేశస్థులను సన్మార్గప్రవర్తకులుగఁ జేయుటయం దెక్కువ శ్రమపడినవాఁడనియు, నిది వారికుటుంబమునకు జాగీరనియుఁ జెప్పఁబడినది.

బోర్నియో ద్వీపముయొక్క యుత్తరభాగమును, ఆప్రాంతముననే గల లబూఅన్ ద్వీపమును నొకబ్రిటీషుకంపెనీవారి పరిపాలనయందున్నవి. ఈద్వీపమున గతకాలములందుఁ

గొప్ప ఘోరములగు క్రూరాచారములు కల వని వాడుకయుండెను.

**బోర్న్యూ స్టేటు**—ఆఫ్రికా ఖండమునందలి సూడాన్ లేక నిగ్రీటియా దేశములోని యొక స్టేటు. కుకాపురము రాజధాని. ఇదియును సొకోటూ స్టేటును కలసి నిగేరియా యని పేరిడఁబడిన Royal Niger Ccmpany వారి టెరిటరీలోనికిఁ జేరియున్నది. (ఆఫ్రికా ఖండము. సూడాన్ లేక నిగ్రీటియా దేశము చూడుఁడు).

**బోర్బన్ ద్వీపము**— (ఆఫ్రికా ఖండమునకుఁ జెందిన పండ్రెండు ద్వీపములు చూ).

**బోలాన్ పాస్**— బోలానుకనుమమార్గము. ఇది భరతదేశమునుండి బెలూచిస్థానము లోనికేగు కొండలమార్గము. శిబిపట్టణముకడ నారంభమై క్వెట్టాపురము దనుకఁగల కొండల లోపలగుండా ప్రవహించు బోలాన్ నదినుండి పేరందినది. అఱువదిమైళ్ళు పొడవు. ఇది పటాలములు నడచుటకైన రస్తా. ఇట బోలాన్ జిల్లాయనఁబడుచున్నది. ఇప్పుడీమార్గమునందు క్వెట్టాకు పోవు నినుపదారి కలదు. క్వెట్టా యాంగ్ల సైన్యస్థానము. ఇట పండ్ల వర్తకము మెండు. ఇది బెలూచిస్థానములోనిది. క్వెట్టా నుండి ఆఫ్ఘనుస్థానములోని కాంధహారుపురము నకేగుటకు ఖోజాక్ పాస్ గుండా మార్గముకలదు. ఇవి యన్నియు నిండియా దేశపు పశ్చిమోత్తర సరిహద్దునఁగలవి. (డురాండులైను చూడుఁడు. బెలూచిస్థానము, బాలోకు దేశము చూడుఁడు.)

**బోల్షివిక్కులు — మెన్షివిక్కులు** (Bolshevik & Menshevik) — రష్యా దేశపు కమ్యూనిస్టుల కిది ప్రతినామమే కాని వేరుకాదు. రష్యాతిరుగుబాటునకుఁ (విప్లవము) బూర్వము చాలకాలమునుండి యొక సోషలిస్టిక్పార్టీ దేశమునందు బలమైనది వ్యాపించియుండెను. దానియందు పిదప రహస్యముగ Social democrats గను, Social Revolutionaries, Extremists అను త్రివిధభేదాభిప్రాయపరు లేర్పడి మూఁడుశాఖలుగనైయుండిరి. రానురాను ఎక్స్ట్రిమిస్టులు బలపడుచుండిరి. క్రీ. శ. ౧౯౦౫ లో నొకసోషలిష్టు మహాసభ (Conference) జరిగి, అందు వారిఅధికసంఖ్య బయల్పడియెనఁట. Social extremists అను నది యాంగ్లపదము. దాని రష్యనుపదము బోల్షివిక్కు అనుదాని కాంగ్లభాషయందు a majority socialist అనియో లేక majority socialistic extremist అనియో యర్థమట. అటనుండి బోల్షివిక్కుపదము వాడుకనంద మొదలిడెను. అప్పటినుండి యల్పసంఖ్యాకులగు మితవాదసోషలిస్టులకు menshevike అను పేరు పెట్టఁబడెనఁట.

**బోల్షివిజమ్ కమ్యూనిజమ్. సోషలిజమ్ సిద్ధాంతములు**--ఇవి రాజకీయ కక్షల సిద్ధాంతములు. పెద్దకుఁగల యుద్దేశ్య దము లింకను స్పష్టముగ బయల్పడలేదు గాని నిటీవల నేర్పడినవీటి నిదమిత్థమని చెప్ప [illegible] కలుగకున్నది. రష్యా దేశమునం దేర్పడినవి. రహస్యసంఘజనితములు. (రహస్యసంఘములు చూడుఁడు). వీటిపరిపాలనకు సోవియట్ ప్రభుత్వమని పేరయ్యెను.

"Every thing should belong to every body" ప్రతివస్తువును బ్రతివానికిఁ (అందరికిఁ) జెంది యుండవలయుననునది వీరి మూలసిద్ధాంతము. ఇక "The ultimate aim of communism is to have an even distribution of wealth and to make people live for one another". అనఁగా దేశమందలి ధనమును సమముగ

వంచి ప్రతివాఁడు నొకరికై యొకరు జీవించున ట్లొనర్చుట కమ్యూనిజముసిద్ధాంతముగ జెప్పఁబడినది. ఇట్లే యగునేని Nationalization of wealth and Industries are essencial అని యెల్లరుఁ దలంచుచున్నారు. ఇందలినిజమును ఫలితములను కాలమే తెలుపఁగలదు, గాని ధనము చేతిపనులు సాముదాయికములౌట దేశమం దెవ్వరికి unemployment అనునది యుండ నేరదనియు, పని పాటలు దేశప్రభుత్వము (State) నకును దేశమందలి ప్రతివారి (individuals) కిని నొకేరీతి బాధ్యతఁ గల్గియుండుననియు, ఇటుల ప్రతివారు స్టేటునకు, స్టేటు ప్రతివారికిని జెంది యుంట, స్టేటు ప్రతివారి హక్కు-బాధ్యతలను సంరక్షించుచుండుననియు వారు సగర్వముగఁ బల్కుచుందురు.

'స్వంత' మనుపదము ప్రజలయం దెవ్వరికిఁ జెందక సాముదాయకమునకుఁ జేరిపోయి ప్రత్యేకతకు, మరుగునకుఁ దావులేని యీవిధానమునకుఁ గర్తయు, పునాది వైచినవాఁడునగు లెనిన్ (Lenin) మహాత్మునిపేరును, ప్రవర్తకులగు స్టాలిన్ (Stalin) మహాశయునిపేరును చిరస్మరణీయములై యుండఁదగినవి. వీరి కిప్పటి ప్రధాననాయకులగు స్టాలిన్మహాశయులు రష్యా దేశము ప్రపంచమున Greatest economic and military factor కాఁగల దనియు, దానినుండియె లెక్కిన యన్ని దేశము లీవిధానమును నేర్చి యవలంబించు ననియుఁ దెల్పియున్నారు. వీరియనుచరులుసోవియట్ లేబొరేటరీల ప్రాశస్త్యమును బొగడుచున్నారు. వారి Physical culture యొక్క యతిశయమును నుతించుచున్నారు. వారి పాఠశాలల యున్నత్యస్థితి నుద్ఘోషించుచు, నందుఁ గఱపఁబడు విద్యావిధానవిధులను స్తుతించుచున్నారు. వీరికి జాతి మత బాధలు లేవు గాన సంపూర్ణ స్వతంత్రత నలరారుచున్నా మనెదరు.

ఇంక వీరిసిద్ధాంత మంగీకరింపని విముఖులు వీ రెన్ని చెప్పుచున్నను వారికార్యము లింత దనుక పూర్తిగ నెరవేఱలే దనియు, ప్రారంభ స్థితియం దెవ్వరికి స్వంతఆస్తులు లేకుండనై ఇటీవల రానురాను తిరుగ నేర్పడుచుంట విఫలతమె యనియు, వీరు ప్రారంభించిన Collective farming ఫలిత మింకను పరిశీలింపఁబడవలసినదే యనియు, రష్యానుండి పెక్కండ్రు విద్యాధికులు, ధీశాలురు, రాజకీయపరిజ్ఞానవిదులు స్వదేశమును వీడి ఫ్రెంచిసీమలపాలై యుంటయు వీరిపాలనయందలి లోపములలో నెన్నఁదగినవనియు, గొంతకాలములో లోకము నిజఫలితముల నెఱుంగఁ గలదనియు, అన్య దేశములందలి రాజకీయవేత్త లనుచు, దీనికి "One man's show" అనివాడుచుంటయుఁ గలదు. (వైటురష్యనులు చూడుఁడు.)

**బోలోరురాజ్యము** — (బాల్టి స్థానము చూడుఁడు).

**బోలోమెటరు** (Bolometer)— వేడిని కొలుచుటకు సులభ మగు Electrical (instrument) పనిముట్టు లేక పరికరము.

**బోస్నియా దేశము**-(ఆస్ట్రియా దేశము చూడుఁడు.)

**బౌంటీ ద్వీపములు** (Bounty-Islands)-న్యూజిలాండునకుఁ జెంది పసిఫిక్కు మహాసముద్రపు దక్షిణభాగమునం దున్న ౧౩ ద్వీపములు. జనులు నివసించుచుండుట లేదు. ఇం దొకద్వీపమున నోడలుపగిలిపోయినవారలకొఱ కొక స్టోర్సు (డిపోవసతులు) ఏర్పఱుపఁబడి సంవత్సరమున రెండుసార్లు ప్రభుత్వపుస్టీమరు పోయి వారలం గొంపోయి తీసికొనిపోవుచుండును.

**బౌంటీస్** (Bounties)— వాణిజ్యసంబంధ పరిభాషాపదము. బౌంటీస్ అన ముందటి యేర్పాటు మేరకు కొన్ని చేతిపనుల (ఇండస్ట్రీ) నభివృద్ధిపఱచుటకుఁ గాని, పోటీని బలపఱచుటకుఁ గాని, (స్వదేశము యొక్క చేతిపనులనభివృద్ధిపఱుప) యొక యాసామీ తానురచించిన ఇండస్ట్రీ లేక export of certain goodsకు ప్రభుత్వ మూలని కొసఁగిన premium లకు Bounties అనిపేరు.

**బౌద్ధమతచతుర్నికాయములు**— ఈ మతపరిభాషయందు 'నికాయ'మన శాఖకర్థము. ఇట్టినికాయములు వారిమతగ్రంథమగు త్రిపిటకములకుఁగూడ గలవు. గాన వేటినికాయములు వాటికే దనరెడిని. ఈచతుర్నికాయములు మతస్థులందు నాల్గు భేదశాఖలని భావము ౧. మహాసాంఘికశాఖ, ౨. స్థవిరశాఖ, ౩. మూలసర్వస్థవాదిశాఖ, ౪. అర్యసమ్మితీయశాఖ యని నాల్గుభేదశాఖలవారికిని ప్రమాణగ్రంథము త్రిపిటకములే యైనను వారివారిశాఖా (నికాయ) ధర్మములమేరకు నాల్గు వ్యాఖ్యానములు త్రిపిటకగ్రంథమునకుఁ గలవు. వీరి సాంప్రదాయములు నాలుగుభేదములుగనున్నవని యెఱుంగఁదగినది. హుయ్యానత్సాంగు (చీనాయాత్రికుఁడు) ధాన్యకటకమునందుండు తరి నాలునెల లచట నాఁగి అచటివారగు సుభూతిస్వామి, సూర్యాచార్యస్వామి లనంబడిన యిర్వురు బౌద్ధపరివ్రాజకుల (భిక్షువుల) శిష్యుండై, మహాసాంఘిక నికాయ వ్యాఖ్యసహితముగ త్రిపిటకములం జదివెనని యాయన యాత్రాచరిత్రయగు సీయూకీ గ్రంథమునుండి తెలియుచున్నది. (హుయ్యానత్సాంగు సీయూకీ యాత్రాచరిత్ర చూ.) (బౌద్ధమతము చూ.)

**బౌద్ధమతదశానుస్మృతులు**—(దశబౌద్ధానుస్మృతులు చూడుఁడు.)

**బౌద్ధమతనిషేధములు**— బౌద్ధముని ధర్మమున దశనిషేధములు:-౧. మద్యపానము, ౨. స్త్రీసంగమము, ౩. జంతుహింస, ౪. చౌర్యము (దొంగిలించుట), ౫. నాట్యనాటకములం జూచుట, ౬ అనృతమాడుట, ౭. పరాహ్ణ (పగలు రెండుజాము లైనపిదప) భోజనము, ౮. సుగంధద్రవ్యలేపనము, ౯. ఎత్తగునయ్యాలపైఁబరుండుట, ౧౦ బంగారమును వెండిని పరిగ్రహించుట. ఇవి దశనిషేధకార్యములుగాఁ జెప్పఁబడినవి.

**బౌద్ధమతమహాభిక్షువులు** (Patriarchs) ౧. మహాకాశ్యపభిక్షువు, ౨. ఆనందుఁడు, ౩. సంగనవసు, ౪. ఉపగుప్తుఁడు, ౫. ధృతకుఁడు, ౬. మిచకుఁడు, ౭. వసుమిత్రుఁడు, ౮. బుద్ధనంది, ౯. బుద్ధమిత్రుఁడు, ౧౦. పార్శ్వుఁడు, ౧౧. పుణ్యయశుఁడు, ౧౨. అశ్వఘోషుఁడు, ౧౩. కపిమారుఁడు, ౧౪. నాగార్జునుఁడు, ౧౫. కాణదేవుఁడు, ౧౬. రాహులతాభిక్షువు, ౧౭. సంఘనంది, ౧౮. సంకయశేతుఁడు, ౧౯. కుమారదభిక్షువు, ౨౦. జయతభిక్షువు, ౨౧. వసుబంధుఁడు, ౨౨. మనూరుఁడు (మనోర్హితుఁడు), ౨౩. వక్లెనుభిక్షువు, ౨౪. సింహులపుత్రుఁడు, ౨౫. బసియాశితభిక్షువు, ౨౬. పుణ్యమిత్రుఁడు, ౨౭ పద్మార్యతరుఁడు, ౨౮. బోధిధర్ముఁడు.

**బౌద్ధమతము**—ఇది వేదబాహ్య (అవైదిక) మతములలో నొకటి. అవైదికమతములందు ఋగ్యజుస్సామాథర్వణాత్మక వేదమును ప్రమాణముగఁ గైకొనరు. కాని వేదమతలక్షణధర్మములను గైకొనుచుందురు. ఈమతమునకు వేదమను పేరుతోనున్న మతగ్రంథము లేదు. మతకర్తకు బుద్ధభగవానుఁడని పేరిడియున్నారు. ఈమహనీయుఁడు తొల్లింట నుత్తరకోసలదేశ

మున రోహిణీనదీతీరమునఁ గపిలవస్తుపురాధీశుండుగనుండిన శుద్ధోదనమహీపతిసుతుఁడు. ఇక్ష్వాకుసంతతి. సూర్యవంశము. గౌతమగోత్రజుఁడు. మాయాదేవీగర్భజనితుఁడు. తొల్లింట తలిదండ్రులిడినపేరు సిద్ధార్థి. భార్యపేరు యశోధర. సుతుఁడు రాహులుఁడు.

ఈమహనీయుఁడు రాకొమరుండయ్యు విరాగియై యౌవనముననే సర్వసంగపరిత్యాగియై యరణ్యమున కేగి తపం బొనరించుచు నెట్టకేలకు ఫల్గుణీనదీతీరమునంగల గయాక్షేత్రమునకుం గతిపయదూరమునఁగల (ఇప్పుడు బుద్ధగయ యనఁబడుతావున) యొకబోధి (రావి) వృక్షముక్రింద తపస్సిద్ధినంది జ్ఞానవంతుఁడగు బుద్ధుఁడాయెను. నాటినుండియు బుద్ధభగవానుఁడనుపేరఁ బరఁగుచున్నవాఁడు. బోధివృక్షముక్రింద జ్ఞానియౌటయు, ఈతనికి బుద్ధుఁడనుపేరు గల్గుటయు నీతనిమతమున ప్రధానతత్త్వము బుద్ధి యగుటయు నీమతమునకు బౌద్ధమత మని పేరు గల్గించెను. ఈజగద్దేశికుఁడు బోధించిన మత మొకటిగనే యుండెను గాని, వీనికిఁబిదప కొందఱు విద్వాంసు లభిప్రాయభేదములు గలవారై ౧. మాధ్యమికబౌద్ధ మనియు, ౨. యోగాచారబౌద్ధమనియు, ౩. సౌత్రాంతికబౌద్ధమనియు, ౪. వైభాషికబౌద్ధమనియుఁ జతుర్విధములుగ నొనర్చుకొనిరి. ఇంకను టిబెట్టుమొదలగు నుత్తరసీములందు బౌద్ధమతమున దేవుఁడు గలఁడు

బౌద్ధమతస్థులిక్కాలమున పూజించు బుద్ధభగవానునకు గౌతమశాక్యముని యనిపేరు. ఈమతమున దేవుఁ డంగీకరింపఁబడలేదు. గాన నీబౌద్ధు లుత్తరసాంప్రదాయపు నైశ్వరీకబౌద్ధులవలె స్వయంభునాథు డనఁబడు ఆదిబుద్ధుని (జ్యోతిరూపి) పూజింపక, గౌతమశాక్యమునినే (బుద్ధభగవానునినే) పూజించు చున్నారు. ఈ విధానమున పంచభూతతత్త్వములు, పంచతన్మాత్రతత్త్వములు, పంచకర్మేంద్రియ తత్త్వములు, పంచజ్ఞానేంద్రియ తత్త్వములు, అంతఃకరణతత్త్వములుమూడును కలసి యిరువదిమూఁడు తత్త్వములు చెప్పఁబడినవి. అందు బుద్ధితత్త్వమే ప్రధానతత్త్వము. దానికన్న వేఱగు నాత్మ (ప్రాణము) లేదని చెప్పఁబడినది. మఱియు బుద్ధి, జ్ఞానములొకటియనియె చెప్పఁబడినది.

శరీరము భౌతికమని చెప్పఁబడినది. మఱియుఁ బంచభౌతిక మగు జగత్తంతయు బౌద్ధమతధర్మముమేరకు క్షణికమని చెప్పఁబడినది. అనఁగా ప్రతివస్తురూపమును ప్రతిక్షణము నందు మాఱుచు కొంచెము వృద్ధినందియో, క్షీణించియో, యెండియో, పొట్టికియో (పొట్టియో) పటుత్వ మెక్కువయయియో, పటుత్వముతగ్గియో, స్థలము మాఱియో వికారరూపముం జెందియో యేదోవిధమున రూపగుణలక్షణములలో దేనినైన మార్చుకొని (నాశనమై) తిరుగ వేరుగతుల నుత్పన్నమగుచున్న దని భావము. దీనికి "భావనాచతుష్టయ" మని పేరు. ఇట్లనుటవలన జగత్తంతయు క్షణక్షణమున కేదోమార్పు కల్గి మాఱుచుండుం గాని స్థిరముగ నుండదని సిద్ధాంతము. క్షణికభావన, దుఃఖభావన, స్వలక్షణభావన, శూన్యభావన యని క్షణికధర్మము చతుర్విధము.

౧. క్షణికము :— జగత్తుసర్వముస్థిరముగ

నొకేరీతిని యుల్లె యుండక క్షణక్షణమునకును మార్పుజెందుచుండెడిని. బుద్ధియు నిట్లె క్షణికము గాని స్థాయి కానేరదు.

౨. దుఃఖము సంసారము–జీవించుటయంత యు దుఃఖమనఁబడును. మతకర్త లందఱును, తీర్థకరులందఱునుసంసారముదుఃఖకరమైనదనిరి.

౩. స్వలక్షణము – జగత్తుసర్వము క్షణిక మగుట ప్రపంచ పదార్థములలో సంపూర్ణ సమానలక్షణములు గలవి యుండుట యసంభ వము. దేనితోఁ గాని దేనిని పోల్చిచెప్పుటకు శక్యముకాదు గాన ప్రతిపదార్థము జగత్తునందు స్వలక్షణముగలది యనియె చెప్పవలయును.

౪. శూన్యము— సత్ పదార్థములు స్వప్నావస్థయందు వలెనే జాగ్రదవస యందు నను క్షణికములగుటంజేసిశూన్యములగుచుండు గాన, నన్నిటిని శూన్యము లనియె చెప్పవల యును. జగత్సర్వము శూన్యమే యనఁబడఁ దగినది. ఈమతమునందు క్షణక్షణమునను నశించుచు మార్పు నందకుండునట్టి స్థిరసత్యా లక్షణములుగలయాత్మలు లేవు. దేవుఁడును లేఁడు.

బౌద్ధధర్మమున ప్రత్యక్షము, అనుమానము నను రెండుప్రమాణములే యంగీకరింపఁబడినవి. ఈరెండుప్రమాణములవలన నీశ్వరసిద్ధి కలు గదుగాన నీశ్వరుఁ డంగీకరింపఁబడలేదు. ఇంక వీరిమతగ్రంథములం దీశ్వరునిఁ గూర్చి చెప్పఁ బడలేదు గాన వీరికి శబ్దప్రమాణమునను ఈశ్వరసిద్ధి కలుగదు. బౌద్ధమతమును లోక మున కుపదేశించిన సుగతుఁడగు బుద్ధుఁడే యీమతస్థు లుపాసింపఁదగినవాఁడు. భరత భూమియం దేల్లెడలనే గాక, బర్మా, చీనా, జపాన్, సయాం మొదలుగాఁగల దేశములందు బుద్ధభగవానుని విగ్రహములనే బౌద్ధమతస్థు లారాధించుచున్నారు.

ఈమతగ్రంథమునకు "త్రిపిటక" మని పేరు. పిటక మనిన బుట్ట లేక చిన్నగంప యని యర్థము. కాశ్మీరదేశాధీశుఁడగు కనిష్కమహా రాజుకూర్చిన బౌద్ధమహాసభయందు బౌద్ధభిక్షు వు లీగ్రంథములం గూర్చిరని చెప్పఁబడినది.

సుత్తపిటకము, వినయపిటకము, అభిదమ్మ పిటకము నను పేర్లుగల యీ పిటకత్రయముం గలసి నూట యెన్మిది సంపుటములు లక్షా యెన్మిదివేల పుటలు గలదిగఁ జెప్పఁబడిన. యుద్గ్రంథము.

౧. సుత్తపిటకము:—ఇందు ముఖ్యముగ బుద్ధభగవానుని బోధలు, ఉక్తులు గలవు.

౨. వినయపిటకము:—ఇందు బౌద్ధభిక్షు వుల (సన్యాసుల) నియమములు, ధర్మములు, నిరూపింపఁబడినవి. బౌద్ధ సన్యాససంఘధర్మము లిందుఁగలవు.

౩. అభిదమ్మపిటకము:—ఇందు జన్మము, దానికారణములు, జీవిత ధర్మ రహస్యములు, గృహారామస్తూప చైత్యాదులంగూర్చిననియమ ములు వివరింపఁబడినవి.

ఇంకను దమ్మపదమను గ్రంథము వేరొకటి కలదు. దీనికి త్రిపిటకసార మనియు, బుద్ధగీత యనియుఁ బేర్లుకలవు. ఇట్టిగ్రంథము లింకను పాళీభాషయందు రచింపఁబడినవి. చతుర్విధ

బౌద్ధములు విజృంభించినపిదప బౌద్ధమతగ్రంథములు విస్తారముగనే వృద్ధినందినవి.

ఈమతమున జగమంతయు ప్రకృతియనియు, దానిపని నది చేసుకొనుచునే యుండుశక్తి గల దనియు, చెట్లు మొలచుట, పెరుగుట, పూచుట, కాచుట, మృతినొందుట మొదలగు పనులన్నియు ప్రకృతియొక్క కార్యములే యగును. జన్మములెత్తి మనుష్యులు పుట్టుట పెరుగుట మృతినందుట తిరుగ జన్మించుట మొదలగునవన్నియు ప్రకృతికార్యములే. బుద్ధియగు ఆత్మకు ప్రకృతిసంబంధమున లెక్కలేని జన్మములు కర్మననుసరించి గల్గుచుండెడిని. జన్మము అజ్ఞానజనకము. జన్మవాంఛ దుఃఖమూలము. జన్మవాంఛా విరాగము అజ్ఞానముకు తగ్గుటకు సూచన. జన్మములనుండి విముక్తిగాంచుటయన దుఃఖమునుండి విముక్తిగాంచుట యనియు, అజ్ఞానముం జయించుట యనియుఁ జెప్పఁబడినది. అజ్ఞానకల్పితములై దుఃఖభాజనములగు జన్మపరంపరలందుఁ దగుల్కొనియుంటయె బంధమని చెప్పఁబడినది. జన్మబంధమునుండి తప్పించుకొనుట కగుసాధనము. సన్యాసస్వీకరణమె యనియు, నిజమగు బౌద్ధసంస్కారము సన్యాసస్వీకరణమే యనియుం జెప్పఁబడినది.

సన్యాసము ప్రతివారును స్వీకరింపవలయును. ఇది బౌద్ధసంస్కారమగుట ప్రతిబౌద్ధుఁడు యుక్తవయస్సునొందగనె ఒకతరి స్వీకరించి, కొంచెముకాలము సన్యాసులతోఁగలసియుండి, తిరుగ గృహమునకుఁ జేరుచుండును. వార్ధక్యమున పరమార్థచింత గల్గినవాఁడగునేని భిక్షువై తక్కినకాలముంగడపి నిర్వాణపదమందెడిని.

బౌద్ధమతధర్మమున భిక్షువులకు కొన్ని విధులు చెప్పఁబడినవి. తాను పాశ మొనరించుకొవక భిక్షాన్నమె భుజింపవలయును. ఎవ్వరిని భిక్షకై యడుగక వారంతటవారే యిడిన భోజనపదార్థములం గైకొనవలయును. తనకువలయు భోజనము దొరకినపిదప నట నాలసింపక, తనవిహారమును జేరుకొనవలయు. స్త్రీ లెదురగుతఱి వారివైపు మనసునందైనను చలనము కలుగనీయకుండుటకై చూడక తనచేతి వీవనను మోము కాదెనకడ్డముగ నిడుకొనవలయును. ఈమొదలగువిధులు ౨౨౩ భిక్షువులకుఁ గలవు. మఱియు దశనిషేధములు చెప్పఁబడినవి. అవి ౧. మత్తుగల్గించు మద్యాదిపానములఁ ద్రావరాదు. ౨. స్త్రీలఁ బైకొనరాదు. ౩. జంతుహింస నొనర్పరాదు. ౪. చౌర్యము మనమున కంటనీయరాదు. ౫. నాట్యము, నాటకములఁ జూడరాదు. ౬. అనృతవాక్యము లాడరాదు. ౭. మధ్యాహ్నమునకుఁ బిదప భుజింపరాదు. ౮. సుగంధద్రవ్యముల నలందరాదు. ౯. ఎత్తుగ శయ్యలపైఁ బండరాదు. ౧౦ సువర్ణరజితము లెవ్వరినుండియైనను గైకొనరాదు. ఇవి బౌద్ధమతభిక్షులకు నిషేధములు. మఱియు బౌద్ధభిక్షువులకు కమండలధారణము, శిరోముండనము, వల్కలరక్తాంబరధారణము, పూర్వాహ్ణభోజనము, సంఘముగఁగలసి విహారభవనమున నివాసము నిత్యవిధులుగఁ జెప్పఁబడినవి. బౌద్ధపడక్షరీమహామంత్రమును, మరీచమంత్రము మొనలగు కొన్ని బౌద్ధమంత్రములు వీరికి

జపించుచుండఁదగినవికలవు. అవి బంధవిముక్తికి సాధనములుగఁ జెప్పఁబడినవి.

బౌద్ధమతమునందు అవలోకితేశ్వరుఁ డను నామాంతరముగల పద్మపాణిబోధిసత్వుఁడును, మంజుశ్రీబోధిసత్వుఁడును, వజ్రపాణిబోధిసత్వు లెనమండుగురు దశదిశాధిపతులు. ఈమతమున తూర్పు ఆగ్నేయము మొదలగుఅష్టదిశలును, ఊర్ధ్వదిశయు, అధోదిశయుం గలపి దదిశలుగ చెప్పఁబడినవి. ఈదశదిశాధిపతులగు పదిమంది బోధిసత్వులును వందనీయులే. వర్షకాలమున బౌద్ధభిక్షువు లొకచోనుండి గడపవలయుంగాని, సంచారమునకై పోరాదనునియతి కలదు. దీనికిం బర్యాషణ మనిపేరు.

బౌద్ధమతధర్మమున జగత్సర్వము జ్ఞానము, జ్ఞేయము నని ద్వివిధము. జ్ఞానము సకల వ్యవహారహేతువగు బుద్ధి. ఇదియె ఆత్మ యనఁ బడును. దీనిని అంతరార్థమనియు వాడుదురు. రెండవయది జ్ఞేయము. పృథివిమొదలగుభూత ములును సకలభౌతికములగు జగద్వస్తువులును (పర్వతములు నదులు, ఘటపటాదిసకలము). దీనిని బాహ్యార్థమనియు వాడుదురు.

ఈవిధానమున ముక్తికి నిర్వాణ మనిపేరు. జన్మములబంధమునంది తప్పించుకొనగల్గినయవ స్థకు నిర్వాణావస్థ యనిపేరు. దానిని త్రివిధ ములుగఁ జెప్పుచున్నారు.

౧. జలప్రవాహమువలె నెడ తెగనిప్రవాహ ముగ నడచుచుండు జ్ఞానపరంపరకు నిర్వాణ మనిపేరుగలదని కొందరనిరి. ఇది క్షణికభావన కనుకూలమగు లక్షణము.

౨. సుఖదుఃఖములస్పర్శ యనునది లేక పరిశుద్ధమగు జ్ఞానపరంపరను నిర్వాణమని కొందరు నిర్వచించిరి. ఇదియు నదీజలప్రవా హమువలె క్షణికధర్మమునకు నిర్బాధకరము.

౩. చమురు సరిపోయి ఆరిపోవుచుండుదీపము క్రమక్రమముగ తగ్గిపోవునటుల తగ్గిపోవుటయే నిర్వాణావస్థయని కొందరు చెప్పియున్నారు. ఇటుల బౌద్ధమతనిర్వాణము త్రివిధము.

ఈమతమున స్వర్గనరకములు, దేవతలు ఉన్నట్లు తోఁచెడింగాని చెప్పఁబడలేదు. (చతుర్విధబౌద్ధములు ఆయాతావుల చూడుఁడు.) (బౌద్ధదశ భూమికలు చూడుఁడు. బౌద్ధమత చతుర్నికాయములు చూడుడు.)

బౌద్ధమతసిద్ధాంతమునకుఁగర్త బుద్ధభగవా నుఁడని తలంపఁబడుచున్నది గాని బుద్ధు లనేకులు గలరనియు, అందియనయొకబుద్ధుఁడనియు వీరి మతగ్రంథముల యందుఁ గానవచ్చెడిని. బౌద్ధమైశ్వరీక మనియుఁ బ్రజ్ఞాస్వాభావికమనియు ద్వివిధము. ఐశ్వరీకబౌద్ధము హిమవత్పర్వత ముల కవ్వలిప్రదేశములందును, ప్రజ్ఞాస్వాభావిక బౌద్ధ మివ్వలిప్రదేశములను గానవచ్చెడిని. (బౌద్ధానుక్రమణిక చూడుడు)


బౌద్ధానుక్రమణిక.
ఆదిబుద్ధుఁడు స్వయంభునాధుఁడు జ్యోతిరూపి, మహాదేవుఁడు, గుహ్యేశ్వరీశక్తి.
విరోచనబుద్ధుడు
తెలుపురంగు,
శక్తి
వజ్రధాతేశ్వరి.
ఈతఁడు
ధ్యానబుద్ధుఁడు
వజ్రపాణి
బోధి
సత్వుఁడు
వజ్రపాణి
బోధి
సత్వుఁడు
అక్షోభ్యబుద్ధుఁడు
ఊదారంగు
శక్తి
లోచనాశక్తి
ఈతఁడు
ధ్యానబుద్ధుఁడు.
వజ్రపాణి
బోధి
సత్వుఁడు
వజ్రపాణి
బోధి
సత్వుఁడు
రత్నశాంభవుఁడు
పీతవర్ణము.
శక్తి
మాముఖశక్తి
వజ్రపాణి
బోధి
సత్వుఁడు
వజ్రపాణి
బోధి
సత్వుఁడు
అమితాభుడు
బుద్ధుడు
ఎఱ్ఱరంగు
పాండురాశక్తి.
పద్మపాణి
బోధి
సత్వుఁడు
అవలోకి
తేశ్వరుఁడు
శివవిగ్రహ
ముంబోలి
యుండెడి
విగ్రహము
ఈతనికిం బిదప
బ్రహ్మ, విష్ణు, రుద్రులు
ముగ్వురు.
మంజుశ్రీ
బోధి
సత్వుఁడు
అమోఘసిద్ధుఁడు
ఆకుపచ్చ రంగు
శక్తి
తారాదేవి.
వజ్రపాణి
బోధి
సత్వుఁడు
వజ్రపాణి
బోధి
సత్వుఁడు

**బౌద్ధాయన గోత్రము** — (జమదగ్ని భిదా ఉపగణము చూడుఁడు).

**బౌద్ధులయాత్రాస్థలములు** — బుద్ధ భగవానుఁడు తనశిష్యుఁ డగు నానందునితో ౧. తన జన్మస్థానమగు లుంబినీవనమొకటియు, ౨. తాను సంబోధి (బుద్ధత) నొందిన బుద్ధగయయందలిబోధివృక్షమొకటియు, ౩. తొలుత ధర్మచక్రముఁ ద్రిప్పిన (బోధించిన) మృగధావ (ఇప్పటి సారనాథము) మొకటియు, ౪. తననిర్వాణపుఁదావొకటియు (కుసినగరమునందలి సాలవనము, బుద్ధనిర్వాణస్థలము) నను నీ నాలుగుస్థలములకు యాత్రసల్పి దర్శింపవలయు ననిశాసించెననిచెప్పఁబడుట నవి బౌద్ధయాత్రాస్థానములుగ నున్నవి.

ఇంకను జన్మస్థానమునకుఁ బద్మమును, సంబోధికి బోధివృక్షమును, ప్రథమబోధకు చక్రమును, నిర్వాణమునకు, స్తూపమును చిహ్నములుగ నేర్పఱచుకొని యున్నారు.

**బౌతధ్య గోత్రము**-(బౌతధ్య ఉపగణము చూడుఁడు).

**బౌల్సు ఆట**— (Bowls) ఈ యాట నాంగ్లదేశమునం దెక్కువగ నాడబడుచుంట దీనినాంగ్లులజాతీయపుటాటగా నెన్నుచున్నారు. ఒక గరికమైదానముపై నిరుకక్షులుగ, కక్షకు నొక్కొకరుగను, (Singles) నిర్వురిర్వురుగను (Doubles) నల్వురునల్వురుగను (Quartettes) గూడ నాడుచుందురు. ఈ యాట బంతులు బరువుగనుండెడివి. వీటిని "Lignum Vitae" అనుదానితోఁ జేయుదురట. ఇఁదుఁ గేంద్రస్థానమునకు White Jack అనిపేరు. ప్రతియాట కడభాగమునకు End అనిసంజ్ఞ. ఇట్టి End లనేకము లొకయాటయందుండును. ఇందిరువదియొక్క పాయింట్లకు ఒక జయము (Win) లెక్కింపఁ బడును. ఆటకాండ్రకు రబ్బరుకాలిజోళ్లు విధింపఁబడియుండును.

**బౌస్ట్రోఫీడనోలజీ** (Boustrophedonology)— కుడినుండి ఎడమకును, ఎడమనుండి కుడివైపునకును వరుసలుగ వ్రాయుచుండువ్రాతకు Boustrophedon writing అనిపేరు. అట్టివ్రాతలభాషలు, అక్షరములు గూర్చి తెలుపుకళ.

**బ్రతికియుంటే బలుసుకూర ఏరుకొని బ్రతుకవచ్చు నన్నట్లు**— (ఆంధ్ర లోకోక్తి).

**బ్రతికియుండిన సుఖములఁ బడయవచ్చు**— (ఇది భారతోక్తి).

**బ్రతుకని బిడ్డ బారెడన్నట్లు**—(ఆంధ్రలోకోక్తి.

**బ్రదర్ జోనాతాన్** (Brother Jonathan) ఇద్దరు సహవాసస్థులలో నొకరికొకరు "Brother Jonathan" అని నామెతిగా వాడుచున్నారు. ఇది రెండువిధములుగ వాడుకనందినది. తొల్లింటకాలమున దావీదను యూదుల ప్రభువునకు మిక్కిలి యనురాగవంతుఁడు, నమ్మకము గలవాఁడు నగు జోనాతానను నొక చెలికాడుండెనని బైబిలునందుఁ జెప్పఁబడినది. మఱియు నమెరికాయుద్ధకాలమున వాషింగ్టన్ సేనాని తన సైన్యముతో Massachusitts రాష్ట్రమున నుండు తఱి నచటిపరిపాలకుండగు Jonathan Turnball అనునతనిపై భోజనపదార్థముల కాధారపడవలసివచ్చెనఁట. తనసైన్యములభోజనపదార్థములంగూర్చిన యేసంగతి వివరింపవలసివచ్చినను "I will consult Bro. Jonathan" అనుచుండువాఁడఁట. ఆయుక్తియే రానురాను

సామెతగమాటి నేటికిఁ బ్రిసంగములందు నొకే కార్యమునఁ గలసి పనిచేయువారలలో నొకరి కొకరు Bro. Jonathan అని వాడఁబడు చున్నారు.

**బ్రిన్సువిక్కుడచ్చీ** — ఐరోపాఖండమున జర్మను దేశములోని మైనరుస్టేట్సునకుం జెందిన డచ్చీ. (జర్మను మైనరుస్టేట్సు - జర్మనీ దేశము చూడుడు.)

**బ్రహ్మ**—బ్రిహ్మదేవునికి విధాతయనియు, ధాతయనియు మొదలగుపేర్లు వాడుకనంది యున్నవి. ఈతడు సృష్టికర్త. జగత్సృష్టికి నిర్ణీత వ్యక్తి. పరమేశ్వరునియొక్క సృష్టి నొనర్చు నవస్థకు నిరూపణము. పురాణపద్ధతుల మేరకు సృష్టిని వ్యక్తీకరించి బ్రిహ్మదేవునిగఁ జేసి, విష్ణుదేవునినాభికమునుండి జన్మించుటయు, శరీరసంజాతయగు సరస్వతీదేవిని భార్యగానమర్చుటయు, ఆదిసృష్టిగల్గింపబడినవారలను మానసపుత్రులుగ గుదర్చుటయు, చతుర్ముఖునిగ నిరూపించుటయు మొదలగునవన్నియుఁ బురాణములయందుఁ గాననయ్యెడిని.

బ్రిహ్మమానసపుత్రులు సృష్టియభివృద్ధియగుటకుగాను సంతానములంగని దేశమున నింపబుట్టింపఁబడినవారని యెఱుంగునది. బ్రహ్మ మనస్సునందే జనించిరని మాత్రిము తెలియుంగాని ప్రిత్యేకపుతలిదండ్రులకు సంతానమై జనించి రనుట కేమియుం దెలియకున్నది. క్రైస్తవమతధర్మమునను, మహమ్మదీయమతధర్మమునను గల ఆదమ్ ఈవు దంపతులవలెను జరథుస్త్ర మాజ్డాయాస్నా (అనఁగా పారశీక) మతధర్మమున మాష్యో మాష్యోయీాదంపతుల వలెను, హిందూసనాతనమతధర్మమున, బ్రహ్మ మానసపుత్రులనఁబడువారు సృష్టినభివృద్ధిపరచ సంతానముఁగన, ఆదిసృష్టి నందినవారలని పరిగణింపఁ బడుదురు గాక.

పురాణముల మేరకు బ్రిహ్మమానసపుత్రులు ముప్పదినల్వురు గాననగుచున్నారు. అందు ౧ మరీచి, ౨ అత్రి, ౩ ఆంగీరసుఁడు, ౪ పులస్త్యుఁడు, ౫ పులహుఁడు, ౬ క్రతువు, ౭ భృగువు, ౮ వశిష్ఠు, ౯ దక్షుఁడు అను తొమ్మండుగురి వలననే సృష్టి యభివృద్ధి నందుటఁ జేసి వారికి నవబ్రిహ్మలనియు, లేక నవప్రిజాపతులనియుఁ బేరుప్రిసిద్ధమయ్యెను. తక్కినవారిలో, ౧ సనకుఁడు, ౨ సనందనుఁడు, ౩ సనత్సుజాతుఁడు, ౪ సనత్కుమారుఁడు, ౫ ఋభుఁడు, ౬ నారదుఁడు, ౭ హంసుఁడు, ౮ అరుణి, ౯ యతి యనఁబడినతొమ్మండుగురు నూర్ధ్వరేతస్కులనియు, అజన్మజ్ఞానులై, యైహికసౌఖ్యవిముఖులై సృష్టికిందోడ్పడ లేదనియుఁ జెప్పఁబడినది. తక్కిన పదునార్వురును సృష్టివిముఖు లనియే చెప్పఁదగును. వారి కేసంతానమును గానరాదు. (బ్రిహ్మమానసపుత్రిలు చూడుఁడు.)

**బ్రహ్మ ఉత్తర వేది**-(కురుక్షేత్రశమంతపంచకము చూడుఁడు).

**బ్రహ్మకపాలము** — (అరుణోదయు దేశము చూడుఁడు).

**బ్రహ్మకళలు**— (కళలు చూడుఁడు).

**బ్రహ్మకుండము**— బ్రిహ్మపుత్రినది జన్మించుతావునగల జలనిలయమునకుఁ బ్రహ్మకుండమని పేరు. ఇది స్నానతీర్థము. బ్రిహ్మపుత్రినది నచట లోహిత్యయని యందురు. దీనింగూర్చినప్రిశంస మహాభారతము, భీష్మపర్వము, ౯ అధ్యాయమునఁ గలదు. ఇంకను కాళికాపురాణము ౮౨ అధ్యాయమున దీనింగూర్చి చెప్పఁబడినది. పరశురాముని పాప మిట పరిహారమయ్యె నఁట.

**బ్రహ్మగిరిపర్వతము**—బొంబై రాజధాని నాశికజిల్లాలోని త్రియంబకపర్వతము.

దీనిపైనుండియే గోదావరినది జన్మించుచున్నది. దీనింగూర్చినప్రశంస పద్మపురాణోత్తర ౬౨అ. నఁగలదు.

ఇంకను దక్షిణదేశమునఁగొడగు (Coorg) కనుమలందు కావేరీనది యుత్పన్నమగుతావున చంద్రితీర్థమునఁ గల కవేరమహర్షియాశ్రిమ ముండుపర్వతమునకును బ్రిహ్మగిరి యని పేరు కలదు.

ఇంకను నోంకారమాంధాత క్షేత్రిమునఁగల నర్మదానదియొక్క యుత్తరశాఖకు కావేరియని యుఁ బేరుకలదు. పద్మపురాణసర్గ ౮ యందు జెప్పఁబడినది.

**బ్రహ్మగ్రింధి**—(గ్రింధులు చూడుఁడు.)

**బ్రిహ్మచర్యాశ్రిమము** — (ఆశ్రిమ చతుష్టయము చూడుఁడు.)

**బ్రహ్మచెముఁడు**—ఈశబ్దము సరికాని పైసను వాడుకయం దిటులనే యున్నది. ఆంధ్రిభాషా సాంప్రదాయార్థపదము.

బ్రహ్మకు బధిరము అసందర్భము. విస్తారము బధిరముగలవారిఁగూర్చి దీనిని వాడుచున్నారు.

ఇంకను ముండ్లజాతి మట్టలు గల చెముడు డొంకను బ్రహ్మచెము డందురు.

**బ్రహ్మణ్యగోత్రము**- (అగస్త్యఉపగణము చూడుఁడు.)

**బ్రహ్మదత్తుఁడు**-ఈపేరుగలవారు పెక్కండ్రుగలరు. చూళియను ఋషిపుత్రుఁడు బ్రహ్మదత్తర్షి. ఈతఁడు కుశనాభునికుమార్తెలనూర్వుర బరిణయమై వారికుబ్జత్వము వాపినవాఁడు.

బృహదిషుని సంతతి. అణుహనికుమారుఁడు బహ్మదత్తుఁడు. ఈతఁడు యోగతంత్రమనుగ్రంథము రచించినవాఁడు.

బ్రహ్మదత్తుఁడను పేరుగల క్షత్రియుఁడొకడు గౌతమునకు భోజనమిడుచో నందు మాంసఖండముండుట నాతనిచే గృధ్రి (గ్రద్ద) మగు నట్లు శపింపఁ బడినవాఁడు. పిదప శ్రీరామ కరస్పర్శనమున నాశాపనివృత్తి కల్గెనని చెప్పఁ బడినది.

మరియు నొక బ్రహ్మదత్తుఁడను భూపతి గలఁడు. చంద్రివంశ క్షత్రియుఁడు, అంగదేశ మేలినభూపతి. (అంగదేశము చూడుఁడు.)

**బ్రిహ్మదేశము** — ఇప్పటి బర్మాదేశ మని తలంప బడుచున్నది. రామాయణము కిష్కింధకాండము ౪౦ యందు బ్రిహ్మదేశపు ప్రిశంస కలదు.

(ఆంధ్రివిజ్ఞానానుబంధ మగు బర్మాదేశ చరిత్రి చూడుఁడు.)

**బ్రహ్మనక్షత్రము లేక గోళము**— (నక్షత్రములు భారతీయులు గుర్తించినవి చూ.)

**బ్రహ్మనాళము**—ఇది బనారస్ (కాశీ) పట్టణముకడ గంగానదియందుగల [illegible] భాగమునకుఁ బేరు.

అటఁగల మణికర్ణికాకుండము దీని[illegible] స్నాన మనియుఁ జెప్పబడినది.

**బ్రిహ్మపుత్రినది** — ([illegible], బ్రిహ్మకుండములు చూడుఁడు). దీని[illegible] నదియనియుఁ బేరుకలదు.(అంధనదము చూ).

**బ్రిహ్మపురరాజ్యము** — ఇప్పటి గఢవాలు సంస్థానరాజ్యము. కుమాను డివిజనునుఁ గల్పి యొకప్పు డొకరాజ్యమైయుండి యీ పేరంబరగుచుండెనని తెలియుచున్నది. దీనిం గూర్చిన యితరసంగతులు తెలియవు గాని బృహత్సంహిత ౧౪ యందు ప్రశంసకలదు.

**బ్రిహ్మవృష్ని గోత్రిము**— (గవిషిర గణము చూడుఁడు).

**బ్రహ్మపురవైష్ణవులు**-- (తెలగాణ్యులు చూడుఁడు)- ఆంధ్రబ్రాహ్మణులు చూడుఁడు- గోల్కొండ వ్యాపారులు చూడుఁడు).

**బ్రహ్మపురేయ గోత్రము** — (వసిష్ఠ గణము చూడుఁడు.)

**బ్రహ్మమానము (కాలమానము)**- భూమి యొకసారి సూర్యునింజుట్టివచ్చువఱకు నొక సంవత్సరకాల మగునని యందఱెఱిఁగినదే. ఇది మనుష్యులకు మనుష్యమానములెక్క. ఇంక కృత త్రేతా ద్వాపరయుగములు నాలుగుం గలసి ౪౩౨౦౦౦౦ సంవత్సరము లొకమహాయుగ మనఁబడును. ఇట్టి మహాయుగములు డెబ్బదియొక్కటియగునేని ౩౦౬౭౨౦౦౦౦ సంవత్సరములకాలము మన్వన్తర మనఁబడును. మన్వంతరములు పదునాలుగుగాన, పదునాల్గు మన్వంతరముల కాలము ౪౨౯౪౦౮౦౦౦౦ సంవత్సరములగును. ఇది వేయిమహాయుగముల కాలమగును. ఇది బ్రహ్మమానముచే నొక పగలు. ఇంక రాత్రియు నింతకాలముండును గాన ౮౫౮౮౧౬౦౦౦౦ సంవత్సరములును, వీట్లకు పగలురాత్రిమధ్య సంధ్యాకాలము ౨౫౯౨౦౦౦౦ సంవత్సరములును, రాత్రి పగలుమధ్య సంధ్యాకాలము ౨౫౯౨౦౦౦౦ సంవత్సరములును కలిపి ౮౬౪౦౦౦౦౦౦౦ మనుష్యమానసంవత్సరముల కాలమగును. ఇది బ్రహ్మమానముచే నొకదినము.

ఇట్టిదినములు బ్రహ్మమానమాసమునముప్పది కలవు. ఈదినములకుఁ గల్పము లని పేరు. (కల్పములు చూడుఁడు.) ఇట్టిమాసములు పండ్రెండయ్యేనేని బ్రహ్మమానఁపు సంవత్సరమగును. ఇందు ౩౧౧౦౪౦౦౦౦౦౦౦౦ మనుష్యమానఁపు సంవత్సరములుండును. ఇట్టివి నూరుసంవత్సరములు పరమేశ్వరునిసృష్టికిఁ బరిమితిగాఁ జెప్పఁబడినది. దీనిని బ్రహ్మయుఃప్రమాణ మని యెల్లరు సర్వసాధారణముగ వాడెదరు. ఇందు మనుష్యమానసంవత్సరములు ౩౧౧౦౪౦౦౦౦౦౦౦౦౦౦ ఉండెడిని. అక్కడికిఁ బ్రలయము సంభవించును. (ప్రలయములు చూడుఁడు.) ఈబ్రహ్మయుఃప్రమాణసంఖ్యకు "పరము" అని సంజ్ఞ కలదు గాన సృష్టిపరిమితికి (బ్రహ్మయువునకు) పరమాయువని పేరు. ఇందు మొదటి ౧౫౫౫౨౦౦౦౦౦౦౦౦౦౦ మనుష్యమానసంవత్సరములు ప్రథమపరార్థ మనియుఁ దర్వాతి ౧౫౫౫౨౦౦౦౦౦౦౦౦౦౦ సంవత్సరములు ద్వితీయపరార్థమనియు నందురు.

**బ్రహ్మమానసపుత్రులు (ముప్పదినల్వురు)**—పురాణముల మేరకు బ్రహ్మమానసపుత్రులు ముప్పదినల్వురని తెలియుచున్నది. (బ్రహ్మ చూడుఁడు.)

౧. అగ్ని- ఈతని కభిమానాగ్ని యనిపేరనియు, ఈతఁడు బ్రహ్మమానస పుత్రులలో జ్యేష్ఠుఁడనియుఁ జెప్పఁబడినది. మఱియు నీతనిం గూర్చి పురాణమతములం దభిప్రాయభేదము కలదు. కాశీక్షేత్రమునవిశ్వానరుఁడనుఋషికగ్ని కుమారుఁడై పుట్టివైశ్వానరుఁడనుపేరఁ దెనరనియు నొకచోఁ గాన్పించుచున్నది. మఱియు అగ్ని అష్టవసువులలో నొకఁడనియు(తండ్రి ధర్ముఁడు, తల్లి దక్షప్రజాపతికొమార్తె యగు వసువు.) కొన్నిపురాణములందు జెప్పఁబడినది. భాగవతమున నగ్ని ప్రజాపతియొక్కసుతుఁడని చెప్పఁబడినది. అన్నిటియందు నగ్ని వసువులలో నొకఁడగుకతన వసువులకు ప్రధాన నాయకుండని చెప్పఁబడినది. ఇంకను నగ్ని అష్టదిక్పాలురలో నొకఁడనియు, ఆగ్నేయదిశ కధిపతియనియు, భార్య స్వాహాదేవి యనియుఁ గాననగుచున్నది. (అగ్నులు చూడుఁడు.)

౨. అత్రిమహర్షి - భార్య అనసూయాదేవి. ఈమె మహాపతివ్రతయని పేరందినది. ఈతని తపోమహిమవలన అనసూయయందత్రిమహర్షి బ్రహ్మాంశగఁ జంద్రుని, విష్ణ్వంశగ దత్తాత్రేయ మునిని, రుద్రాంశగ దూర్వాసమహర్షిని సుతులుగఁ బడసెను. చంద్రునిసంతతికి చంద్రవంశక్షత్రియు లనుకులవిభాగము కల్గినది. అత్రి బ్రహ్మ నేత్రములనుండి జనించెననిగూడఁ జెప్పఁబడినది.

౩. అధర్మము-

౪. అంగీరసుఁడు- అంగీరసున కాంగిరుఁడనియు, బృహస్పతి యనియుఁగూడ పేర్లు కలవు. ఈతఁడు బ్రహ్మముఖమునుండి జనించినవాఁడనియుఁ గూడ కలదు. దేవతలపై నలిగి, యగ్ని యగ్నిత్వమువదలి యొకప్పుడేగుతఱి నాంగిరసున కాయగ్నిత్వ మిచ్చిరనియు, కొంతకాలమునకు తిరుగ నగ్నిరా, నాతని యగ్నిత్వపదవి యాతనికి సమర్పించి, యగ్ని కాంగీరసుని జ్యేష్ఠపుత్రునిగ నేర్పఱచిరనియు, అట్టితఱి నాంగీరసున కార్గురుపుత్రులు, నొక్క పుత్రికయుం గల్గిరనియు, అందు బృహస్పతియు, ఉతధ్యుఁడును (తక్కినవల్వురిపేర్లును తెలియకున్నవి) ఆరుగురు పుత్రులును యోగసిద్ధి యనుపుత్రికయుం గల్గిరనియుఁ గూడ చెప్పఁబడినది.

౫. ఋభుఁడు- ఇతనికి ఋషభుఁ డనియుం బేరు కలదు. ఇతఁడు సనక సనందన సనత్సుజాత సనత్కుమారులతోఁగూడ జన్మమందినవాఁడు. వీరైదుగురు సృష్టివిముఖు లని చెప్పఁబడినది.

౬. ఏకతుఁడు.

౭. క్రతువు- భార్య దక్షప్రజాపతి కుమార్తె యగు సన్నతీదేవి. ఆమెవలన నీతని కంగుష్ఠమాత్రప్రమాణశరీరులు, మహాతపస్సంపన్నులు నగు నఱువదివేలుగురు వాలఖిల్యమహర్షులు సంతానముగలిగిరి.

౮. కర్దముఁడు— బ్రహ్మయొక్క భార్యయందు పుట్టినవాఁడని వేరొకచోటఁ జెప్పఁబడినది. కర్దముఁడు పులహుని కుమారుఁడనియుఁ గూడ జెప్పఁబడిన పురాణాభిప్రాయభేదమును గలదు. భార్య స్వాయంభువమనువుకొమార్తె యగు దేవహూతి. కుమారుఁడు కపిలమహర్షి. దేవహూతి కపిలునివలననె భక్తియోగము గ్రహించెనఁట.

౯. కామము- బ్రహ్మయొక్క ఆత్మనుండి జనించినదని చెప్పఁబడినది.

౧౦. క్రోధము- బ్రహ్మయొక్క భ్రూయుగమునుండి జనించినదని చెప్పఁబడినది.

౧౧. జాంబవంతుఁడు-భల్లూకములకురాజు. ఈతనికుమార్తె జాంబవతీదేవి. శ్రీకృష్ణునిభార్యలలో నొకతె.

జాంబవంతుఁడు సుగ్రీవునిమంత్రియని రామాయణమునఁ జెప్పఁబడినది. కాని ఆజాంబవంతుడెవ్వఁడో తెలియరాకున్నది. జాంబవతీ శ్రీకృష్ణులకు సాంబుఁడనుకుమారుఁ డుండెను.

౧౨. జ్యేష్ఠాదేవి-విధాత ధాతలతోఁగలసి యొకేసారి పుట్టినది. ఈమె వరుణుని యష్టభార్యలలో నొకతె. వరుణునివలన నీమెకు అధర్మనునుసుతుఁడు గల్గె ననియు, ఈజ్యేష్ఠాదేవికే కాళికాదేవి, మహాంకాళి యనుపేర్లుకూడ గలవనియు, మఱియు లక్ష్మీదేవి యీమెచెలియలనియుంగూడచెప్పఁబడినది. ఈమెను నిర్భాగ్యదేవతగా సర్వసాధారణముగ నందఱుఁ దలంచుచుందురు.

౧౩. త్వష్ట-భార్యపేరు రచనాదేవి. కుమారుఁడు విశ్వరూపుఁడు. ఈవిశ్వరూపునిఁజంపుటం జేసి యింద్రునకు బ్రహ్మహత్యాపాతకము సంభ

వించెను. (విశ్వరూపుఁ డొకప్పుడు దేవతాచార్యుఁడై యుండి యింద్రునకు నారాయణకవచము పదేశించినవాఁడు). విశ్వరూపుఁడు రాక్షస పక్షాభిమానము గలవాఁడై యుంట నింద్రుఁ డీతనిఁ బరిమార్చెను. అందువలన నింద్రుఁడు కపింజలము, కలవింకము, తిత్తిరి పాత్రకముల పాలై వాట్లవిముక్తికై మిగుల శ్రమపడి వదల్చుకొనవలసివచ్చెనని చెప్పఁబడినది.

౧౪. త్రితుఁడు.

౧౫. దక్షుఁడు-కొందఱీతనిబ్రహ్మయొక్క అంగుష్ఠమునుండి కల్గినవాడుగఁ గూడ నుడివిరి. భార్యలు ౧. స్వాయంభువమనువు కూఁతురగు ప్రసూతీదేవి, ౨. వీరణప్రజాపతికుమార్తెయగు అసిక్నీదేవి, దక్షుని ప్రచేతస్సులకు (సోముని (చంద్రుని కుమార్తెయగు) మరీషయందు జనించినపుత్రునిగాఁగొన్నిచోట్లఁ జెప్పఁబడియున్నది. ఇది పురాణాభిప్రాయభేదము. దక్షప్రజాపతి సంతానమునకు (దక్షప్రజాపతిచూడుఁడు).

౧౬. ద్వితుఁడు.

౧౭. ధర్మము.

౧౮. ధాతి-ధాత, విధాతి, జ్యేష్ఠాదేవి, లక్ష్మీదేవి వీ రొకసారి జన్మమందినవారు. (స్వాయంభువమనువునకు సహాయార్థము).

౧౯. నారదమహర్షి - ఇతఁడు గతకల్పమున నుపబర్హణుఁడనుగంధర్వుఁడుగనుండినవాఁడట. గానవిద్యాప్రవీణుఁడు. కలహప్రియుఁడు. స్థిరముగ నొకచోట నుండక సదా సంచారమొనర్చుచుండువాఁడు. బ్రహ్మచారిగ ననపత్యుఁడై యుండువాఁడు. సృష్టివిముఖుఁడు. భక్తుఁడు. పర్వతుఁడనువాఁడీతనిమేనల్లుఁడని చెప్పఁబడినది.

౨౦. పులస్త్యుఁడు- ఈతఁడు బ్రహ్మకర్మములందు జనించినవాఁడనియుఁ జెప్పఁబడినది. భార్య హవిర్భుక్కు. ఈమెకు ప్రీతి యనియుఁ బేరు కలదు. ఈమెయం దగస్త్యుఁడు విశ్రవస్సు జన్మించిరనియుం జెప్పఁబడినది. ఈసందర్భ మభిప్రాయభేదమయమై యున్నది.

౨౧. పులహుఁడు- ఇతనికి కిన్నరుఁడు, కింపురుషుఁడు నను నిర్వురు సుతులు గల్గిరి. అందు కిన్నరుని సంతతివారు కిన్నరులు. దేవతలలో నొకభేదమగు తెగ. వీ రశ్వముఖము, నరశరీరము గలవారనికూడ జెప్పఁబడినది. మఱియుఁ గింపురుషునిసంతతివారు కింపురుషు లనఁబడిరి. వారును దేవతలలో నొకభేదమగు తెగవారే. వీ రశ్వదేహము నరముఖము గలవారనిగూడఁ జెప్పఁబడియున్నది.

౨౨. భృగువు-వరుణుఁడొనర్చిన యొకానొకయాగమందలి యగ్నినుండి జనించినవాఁడనియుఁ జెప్పఁబడినది. భృగుమహర్షి కిరువురు భార్యలుండినటుల దెలిసెడిని. మొదటిభార్యవలన భృగువునకుఁ గవి యనుపుత్రుఁడు గల్గెను. ఆతని సుతుండే అసురులగురువగు శుక్రాచార్యుఁడు. రెండవభార్యయగు ఖ్యాతివలన భృగువునకు ధాత విధాత యని ఇర్వురుసుతులు గల్గిరి. ధాతకుమారుఁడు మృకండుఁడు. ఈతనికొడుకు మార్కండేయర్షి. ఇంక రెండవసుతుండగు విధాతకు ప్రాణుఁడనుసుతుఁడు గల్గెను. ప్రాణునకు వేదశిరుఁడు, అతనికి అశేనస్సు ననువారు కల్గిరి.

౨౩. మనుర్దేవుఁడు-ఈతనింగూర్చి భారతమునమాత్రముబ్రహ్మమానసపుత్రుఁడనికలదు. తక్కినపురాణములం దీతనిపేరు కానరాదు.

౨౪. మరీచి- ఈతనివలన సృష్టి యెక్కువగా వృద్ధినొందెను. భార్యపేరు కళాదేవి. ఈమె కర్దమప్రజాపతిపుత్రిక. కుమారుఁడు కశ్యపమహర్షి పెక్కుసంతతులకు మూలపురుషుఁడైనవాఁడు.

౨౫. మృత్యువు-ఈమె పుత్రిక యనియు, చంపు దేవతయనియు, రక్తాస్య యనియు, అసితాంగియనియు, అరుణాంబర యనియుఁ జెప్పఁబడినది.

౨౬. యతి- ఊర్ధ్వరేతస్కుఁడు, సృష్టివిముఖుఁడు, జ్ఞాని. మఱియు నితఁడు నహుషుని జ్యేష్ఠపుత్రుఁడుగ తిరుగ కాలాంతరఋణశేషమున జన్మించియు నా పేరుననే బరఁగి పూర్వవాసనచే యోగియై రాజ్యకాంక్ష జెందక జనుటం జేసి యయాతిభూపతి యయ్యెను.

౨౭. లక్ష్మి- ఈమె భృగుపుత్రిక యై జన్మించి భార్గవి యనిపేరందెననియు, సముద్రమథనమున జన్మించిన దేవి యనియుఁ జెప్పఁబడినది. జ్యేష్ఠాదేవి యీమెకు జ్యేష్ఠసోదరిగాఁ జెప్పఁబడినది. లక్ష్మీదేవి విష్ణుదేవుని భార్యగఁ జెప్పఁబడినది. మోక్షలక్ష్మి యనియు నీమెకుఁ బేరు కలదు.

౨౮. వసిష్ఠమహర్షి- బ్రహ్మమానసపుత్రుఁడై (ప్రాణమునుండి) తొలుత జనించినవాఁడు. నిమి యొకప్పు డీతని నొకక్రతువు జేయించుమని కోర నాతఁడు చేయించక ఇంద్రుఁడొనర్చు వేఱొక క్రతువునకుఁ జనియెను. దానం జేసి నిమి గౌతముని రావించి యాతనిపరిముఖమున నాక్రతువు నెఱవేర్చుకొన, వశిష్ఠుం డలిగి నిమి నశరీరుఁ డగునట్లు శపింప, నిమియు నట్లే ప్రతిశాపంబిచ్చెను. దానివలన నుభయులశరీరములు దగ్ధముకాఁగా వశిష్ఠుఁడు మిత్రావరుణులయంశంబున నగస్త్యునితో కుంభసంభవుఁడై జనించెను. నిమిపేరిట జ్ఞాపకార్థము నిమిషమని తెప్పపాటుకాలమునకు పేరిడఁబడెను.

వశిష్ఠుఁడు బహుతపఃప్రభావసంపన్నుఁడు. ఇక్ష్వాకువంశప్రభువులకు కులగురుఁడు. వైవస్వతమన్వంతరమున సప్తమహర్షులలో నొకఁడు. ఇతని కరుంధతియు, ఊర్జయు నను నిర్వురు భార్యలు. అరుంధతి కర్దముని కుమార్తె; ఊర్జ దక్షప్రజాపతికుమార్తె.

వశిష్ఠున కరుంధతియందు శక్తి మొదలగు వారు నూర్వురు సుతులుగల్గిరి. అందు పెక్కండ్రు విశ్వామిత్రుని తపోగ్నిచే మరణించిరి. తన సుతుల నందఱను గోల్పోయియు, వెనుదీయక విశ్వామిత్రునికి సుగుణము, శాంతి, ఓర్పు, నిర్లిప్తత మొదలగు బ్రాహ్మణ్యగుణములు కుదురువఱ కోర్చి, యాతని బ్రహ్మర్షిగ వశిష్ఠుఁ డొనర్చినవాఁడు. వశిష్ఠపుత్రుండగు శక్తియే పరాశరునితండ్రియు, వ్యాసమహర్షి తాతయు నాయెను. (వశిష్ఠుఁడు చూడుఁడు.)

వశిష్ఠుఁడు రెండవభార్యయగు ఊర్జయందు ౧. రజుఁడు, ౨. గోత్రుఁడు, ౩. ఊర్ధ్వబాహువు, ౪. సవనుఁడు, ౫. అనఘుఁడు, ౬. సుతపుఁడు, ౭. శుక్రుఁడు నను సుతులం బడసెను. వీరు స్వాయంభువుమన్వంతరమున సప్తమహర్షులు.

౨౯. విధాతభార్య నియతి. ధాత అన్నగారు.

౩౦. సంకల్పుఁడు లేక సంకల్పము. తలంపు కలుగుట యనియర్థము.

౩౧. సనకుఁడు, ౩౨. సనత్సుజాతుఁడు, ౩౩. సనత్కుమారుఁడు, ౩౪. సనందనుఁడు. (వీరూర్ధ్వరేతస్కులు. సృష్టివిముఖులు. సర్వత్రసంచారముసల్పుశక్తిగలవారు. మహాభక్తులు.)

**బ్రహ్మయోనితీర్థము (పితృధాకపురము)**- పంజాబునందలి కర్నాల్ జిల్లాయందిప్పుడు పితృధాకపురము పిహోవా యనం బడుచున్నది. సరస్వతీనదీతీరము. నదియందు బ్రహ్మయోనితీర్థము కలదు. ఇది కడుప్రసిద్ధము. కురుక్షేత్రమందలి స్థానేశ్వరమునుండి పశ్చిమముగా పదునాల్గుమైళ్ళదూరము.

మహాభారతము-వనపర్వము ౮౩ అధ్యాయమునను, భాగవతము దశమస్కంధము ౭౮ అధ్యాయమునను ప్రశంసింపఁబడినది.

మఱియు వామనపురాణము అధ్యా. ౫౮ శ్లో. ౧౧౫ యందు బ్రహ్మధాకపట్టణము ఓఘావతీనదీతీరమున నున్నటులఁ జెప్పఁబడినది. బ్రహ్మధాక శాసనములు ప్రసిద్ధములు.

**బ్రహ్మర్షిదేశము**—బ్రహ్మావర్తదేశమునకును, యమునానదికిని నడుమనుండు దేశమని తలంపఁబడినది. కురుక్షేత్రప్రాంతమున నుండియు నగునని తలఁపఁబడుచున్నది.

మత్స్య పాంచాల శూరసేన దేశభాగము లాక్రమించియుండె నందురు. అది దీని ఉచ్ఛకాలమే మొ. మనుసంహిత-౨-౧౯ యందు దీనిప్రశంస కలదు.

**బ్రహ్మర్షులు**—(ఋషులు చూడుఁడు).

**బ్రహ్మలు తొమ్మండుగురు (నవ బ్రహ్మలు)**-బ్రహ్మత్వము పరమేశ్వరుని సృష్టి యొనర్చునవస్థకు నిరూపణము. ఇది యొకపదవిగాఁ జెప్పఁబడినది. కాన, బ్రహ్మలు మాఱుచుందురు. పదునాల్గు మన్వంతరము లొకపగలుగను, ఇరువదియెన్మిది మన్వంతరములు బ్రహ్మమానము నొకరోజుగను, బ్రహ్మత్వపరిమాణ మిట్టిమానముచే నూరేండ్లు, లేక ౧౦౦౮౦౦౦ మన్వంతరములకాలమని చెప్పఁబడినది.

కొన్నిపురాణములందు బ్రహ్మత్వమునకు మానసపుత్రులుగ తొమ్మండుగురు బ్రహ్మత్వమునకర్హులగువారిని సృష్టించెనందురు. వారినే నవబ్రహ్మ లందురు. వారు ౧ మరీచి, ౨ అత్రి, ౩ అంగిరసుఁడు, ౪ పులస్త్యుఁడు, ౫ పులహుఁడు, ౬ క్రతువు, ౭ భృగువు, ౮ వశిష్ఠు, ౯ దక్షప్రజాపతి. మతాంతరమున భృగువునకు బదులు వామదేవుఁడని కలదు.

**బ్రహ్మవలిగోత్రము**— (వసిష్ఠగణము చూడుఁడు).

**బ్రహ్మవిద్య**—పరమేశ్వరు నెఱుంగఁజేయు శాస్త్రము లేక విద్యకు బ్రహ్మవిద్య యనిపేరు.

భారతమున ప్రజాపతిభార్యపేరు బ్రహ్మవిద్య. ఈమెసుతుఁడు ధ్రువుఁడు. (ఈతఁడుఅష్టవసువులలోనివాఁడు).

మిక్కిలి కష్టమైనవిద్యకు బ్రహ్మవిద్య యనియు నందురు.

**బ్రహ్మవేత్తలు నాల్గువిధములు**—

అద్వైతసిద్ధాంతమున—

౧. బ్రహ్మవిదుఁడు— జ్ఞానభూమిక లేడింటిలో నాల్గవభూమికం జేరినవాఁడు.

౨. బ్రహ్మవిద్వరుఁడు- ఐదవ భూమికం జెందినవాఁడు.

౩. బ్రహ్మవిద్వరీయుఁడు- ఆఱవభూమికం జెందినవాఁడు.

౪. బ్రహ్మవిద్వరిష్ఠుఁడు— ఏడవభూమికం జెందినవాఁడు. వీరి కివి సొజ్ఞలు.

జ్ఞానభూమికలు:—

౧. శుభేచ్ఛ(ఆత్మతత్వమెఱుంగవలయుననుకోర్కెఁ గల్గియుండుట), ౨ విచారణ, ౩.తనుమానసి(సత్వగుణాధిక్యమై రజోగుణము,తమోగుణము క్షీణించుట) ౪ సత్వాపత్తి (శుద్ధసత్వగుణమయుఁడై యుండుట), ౫ అసంసక్తి (ఆసక్తిని విడుచుట, ౬ పదార్థాభావన (అపరోక్షజ్ఞానముఁగల్గియుండుట), ౭ తుర్యము లేక తురీయము. (జగద్భ్రమలు తగ్గిపోయి జగమంతయు పరమేశ్వరమయమే యనియు, నామరూపాత్మకమగున దంతయు భ్రాంతియనియు, వస్తుతః పరమేశ్వర పదార్థమే యనియు నెఱుంగుట.)

ఈయేడింటిని జ్ఞానభూమికలని యద్వైత వేదాంతవాదశాస్త్రమునఁ జెప్పఁబడినది.

**బ్రహ్మవైవర్తపురాణము**— ఇదికూర్మ పురాణమున తొమ్మిదవదిగను, దేవీభాగవత మున నేడవదిగను, భాగవతమున తొమ్మిదవది గను, తక్కినవాట్లయందు పదియవదిగను చెప్పఁబడిన పురాణము. వశిష్ఠప్రోక్తము. గ్రంథ సంఖ్య ౧౮౦౦౦.

**బ్రహ్మవ్రాత బయల్పడేది కాదు**— (ఆంధ్రలోకోక్తి.)

**బ్రహ్మ శిఖరము**— ఉదగ్రహిమాలయ మునందలి శిఖరము. (గంగానది చూడుఁడు).

**బ్రహ్మ శిరము**—ఇది యొక యస్త్రము. అల్పులపై దీనిం బ్రయోగింపరాదు.

**బ్రహ్మసమాజమతము**— దీనికి పరిశు ద్ధాస్తికమతమనియుఁ బేరు కలదు. ఇది యిటీవల కల్పితమైన మతము. వంగదేశమున రాజా రామమోహనరాయి యనఁబడు మహాత్ముఁడు మతసాంఘికసంస్కారములను కొన్నిటిని మనసు నందుంచుకొని యీమతమును కల్పింపనెంచి, క్రీ.శ. ౧౮౨౮ సంవత్సరమున బ్రహ్మసమా జమును నెలకొల్పి వ్యాపింపఁజేసెను. పిదప దేవేంద్రనాధటాగూరను గొప్ప భక్తుఁడును, పిదప కేశవచంద్రసేనుఁడను నొకగొప్పభక్తుఁ డును దీనియభివృద్ధికిఁగారకులై వ్యాపింపఁజేయు టయె గాక, మతనిబంధనను మార్చి యభివృద్ధి నందించిరి. వీరివీరికాలములందు కలిగినమార్పుల మేరకు మతము చాలవఱకు మాఱిపోయినను తొల్లింటిపేరున నట్లె యుండి, యాంధ్రదేశ మున పరిశుద్ధాస్తికమతమనిగూడ వాడుకనామ మందినది.

ఈమతమునందు పరమేశ్వరుఁ డద్వితీయుఁ డు. అతని నారాధించుటకు మానసికారాధనమే ప్రధానము. ఆప్రార్థన లెప్పటికప్పు డూహించు చుఁ జేయవలయునని నిబంధన కలదు. ఈమత మున దైవభక్తి దైవారాధనలకుఁ బిదప సాంఘిక జీవనధర్మము ముఖ్యమైనది.

హిందూమత ధర్మములను సంస్కరించుట దీనిముఖ్యోద్దేశమై యుండెను. గాన తత్ఫలిత ముగ హిందూమతము దురాచారభూయిష్టమని తూలనాడుచుండుటయు, స్వోత్కర్ష నదేపనిగ పొగడుకొనుచుండుటయు నాంధ్రబ్రహ్మసామా జికులం దచ్చటచ్చటఁ గాననగుచుండును.

ఈమతస్థులందు గమనించఁదగినది సర్వ సమానత, భోజన ప్రతిభోజనములు, సంబంధ బాంధవ్యములు. వీరియం దెట్టియాటంకములను కట్టుబాట్లను పాటింప నక్కఱలేక నె నడచును. దైవారాధన సంఘబాధ్యతలయందు స్త్రీ పురు షులు సమానులని చెప్పఁబడినది. ఏకపత్నీ వ్రతము వీరియందు విధింపఁబడియున్నది. వధువు నకు పదునాల్గును, వరునకు పదునెన్మిదియు వత్సరములు వయస్సురాని దే వివాహము జరుగ రాదని మతవిధి కలదు. వితంతూద్వాహములు వీరియందుఁ గలవు. ఈఆచారసందర్భములందు హిందువుల పూర్వర్షులమతము తమదేయని పే రెదరు.

బ్రహ్మసమాజమతమునందు పంచధర్మములు చెప్పఁబడినవి. అవి ప్రధాన ఆచరణీయధర్మ ములు.

౧. ప్రథమధర్మము- బ్రహ్మమునందలి దృఢవిశ్వాసధర్మము. బ్రహ్మము సృష్టికిఁ గర్తయు భర్తయు హర్తయు ననియు, అద్వి తీయము, ఆదిమధ్యాంతరహితము, జ్ఞానస్వరూ పము, న్యాయస్వరూపము, దయ ఆనంద సత్య స్వరూపము, సర్వవ్యాపి యనియు, మఱియు నాత్మస్వరూపుండగుట మనోగ్రాహ్యుఁడనియు,

జగద్విధానచర్యలంబట్టియాయనగుణగణములు నిర్ణయింపఁ బడఁదగు ననియు, నసమానుఁ డనియు, విగ్రహాదుల నాతనిగాఁ జేయుట గొప్ప దోషమనియు, ఈశ్వరేచ్ఛానుసారమౌ నిశ్చల భక్తివిశ్వాసములతో మెలఁగుటయె జీవునకు పరమధర్మమనియుఁ దలంచి నమ్మట.

౨. ద్వితీయధర్మము- జీవాత్మ నశించునది గాదనియు, నిరంతరాభివృద్ధి గాంచునదియనియు తనప్రవర్తనల బ్రహ్మమున కుత్తరవాదియై తా నుండునను విశ్వాసధర్మము.

జీవునకుఁగల జ్ఞానాదిశక్తులవలన నీశ్వరేచ్ఛ నెఱింగి, యీశ్వరేచ్ఛానుసారము లగు పుణ్య కార్యములనే యొనర్చుచు, నీశ్వరేచ్ఛా వ్యతిరిక్తములగు పాపకార్యముల నొనర్పకయుం డవలెననియు, పుణ్యకార్యము లాత్మాభివృద్ధి అనుకూలములు, ఆనందదాయకములు, సద్గతి నొసంగునవి యనియు, పాపకార్యములు ఆత్మా భివృద్ధికి ప్రతికూలములనియు, దుఃఖసంధాయ కములు, దుర్గతి నొసంగునవి యనియు, ప్రపం చమె యాత్మాభివృద్ధికి తగినతావనియు, సాంఘిక ధర్మముల నెఱపుచు సాంఘికమానవజీవితములం దీశ్వరునారాధించుటయె యుత్తమధర్మమనియు జీవాత్మకు పరమాత్మయందే యునికిఁ గల్గించిన నభివృద్ధి గల్గుననియు నమ్మట.

ఇందు సద్గతినే స్వర్గమనియు, దుర్గతినే నరక మనియు ననఁదగుననియు, పాపవిమోచనమునే మోక్ష మనఁదగుననియుఁ జెప్పఁబడినది.

౩. తృతీయధర్మము- సర్వజనసోదరభావము గల్గియుండుధర్మము. విశ్వమానవకోటి యేక కుటుంబమే యనియు, బ్రహ్మ మందఱికి తండ్రి యనియుఁ, గాన మనుష్యులందఱు సోదర తుల్యులై సమానులే యనియు, జాతి మత కుల భేదము లీశ్వరశాసన విరుద్ధము లనియు వీట్లం బాటించుట ఈశ్వరశాసనోల్లంఘన మనియు నమ్మట.

౪. చతుర్థధర్మము- ఈశ్వరోపాసనధర్మము. ఈశ్వరునకు జీవాత్మతోఁగలసంబంధమున నీశ్వ రారాధనపుటావశ్యకత యేర్పడుచున్నదనియు, ఈశ్వరుఁ డనుదినము జీవునిపైవర్షించు కటాక్ష మునకుఁ గృతజ్ఞతతో తనభారములం దెల్పుచు ప్రార్థించుకొనుచుండవలయును. జీవునియందుఁ గల లోపములను సవరించుకొనుచు, నీశ్వరుని యందలి గుణముల నలవడఁజేసికొనుచుండవలె ననియు, జీవుఁడంతర్ముఖుఁడై ధ్యానమునల్పుచు పాపములం దలచుకొని పశ్చాత్తాపపడి, పాప విమోచనకై ప్రార్థించుచు ప్రాపంచికదుఃఖము లకు దూరుడౌచు, నాత్మశాంతిఁ బడయవలయు ననియు, నీశ్వరోపాసన వీటినిగల్గించుననియు నమ్మట.

ఇందుఁ జెప్పఁబడినసన్మార్గమునకు స్వాభా వికమార్గమనియు, నటుల కానిది యస్వభావ మార్గమనియుఁ జెప్పఁబడినది. మానసికారాధ నము ఆరాధనము, ధ్యానము, ప్రార్థనము నని త్రివిధములుగను జెప్పఁబడినది. ఇంకను బ్రహ్మ ధర్మము మేరకు బహుదేవతారాధనమును విగ్ర హారాధనమును దోషముంగల్గించు నీశ్వరా పరాధకార్యములని పేర్కొనఁబడినవి.

౫. పంచమధర్మము-దోషరహితులగు మను ష్యులు గాని, నిర్దుష్టములగు గ్రంథములు గాని యుండునని నమ్మట యసమంజసమనుధర్మము.

ఈశ్వరుఁ డొక్కఁడె పరిపూర్ణుఁడై దోషర హితుఁడై యుండుంగాని, మనుష్యులం దేవో దోషము లుండకపోవనియు, గ్రంథము లన్నియు మనుష్యవిరచితములే గాని దైవకృత గ్రంథము లుండవనియు, గాన వాట్లయందు దోషముగాని, లోపములుగాని యుండవచ్చు ననియు, గురువు

లును, సద్గ్రంథములును సత్య మెఱుంగుటకు సాయమొనర్పుఁగాన గౌరవింపఁదగినవనియు, సత్య మేగ్రంథమునందుండినను నాచరణీయమే యగుననియు, సత్యాసత్యవిచక్షణ, వివేకజ్ఞానము లాత్మకుఁ(జీవునకుఁ) గలవనియు నమ్ముట.

ఇవి పంచధర్మములు. వీని నమ్ముట ప్రధానము. పరిశుద్ధాస్తికమతస్థులు ప్రార్థించుతఱిఁగాని, ఈశ్వరుని స్మరించుకొనుతఱిఁ గాని "బ్రహ్మకృపా హి కేవలమ్" అనియు,"ఏకమేవాద్వితీయమ్" అనియు బిగ్గరగ ననుచుందురు గాని ఇవి వారి మంత్రములు గావనియు, స్మరణీయభ_క్తివాక్యము లనియు నెఱుంగునది.

**బ్రహ్మసా(గ)రము**--కురుక్షేత్రమున స్థానేశ్వరమున కుత్తరముగనున్న యొకపాటిసరస్సు. ఉత్తర దక్షిణములకు ౧౯౦౦ అడుగులును, తూర్పుపడమరలకు ౩౫౭౮ అడుగులునుగలది. దీనిమధ్యను ద్వైపాయన మనుపేరుగల యొక ద్వీప ముండుటచే నీసరస్సునకుఁ ద్వైపాయన హ్రద మనియు వాడుక గలదు. ద్వైపాయన హ్రదమున చంద్రకూపమను బావి కలదు. దీనిని (బ్రహ్మసాగరమను) ఋగ్వేదమున శర్యణావతమని వాడియున్నారు. (ఋగ్వేద ౧-౮౪-౧౪) ఇప్పటికిని ఈసాగరమున కీశాన్యదిక్కున దీనివంటిదె యున్న వేరు చిన్నసరస్సునా సఁనే త్సాన్ అనినాఘుచున్నారు. అది శార్యణావతశబ్దము యొక్క మార్పే గాని వేరు కాదు. తొల్లింట రెండుసాగరము లొకటిగనే యుండి అది ప్రధానస్నానతీర్థమై యుండనోపు.

ఈతీరమున విధాత తపంబొనర్చి క్రతువు లొనర్చుటం జేసి బ్రహ్మసాగరమనియు, క్షత్రియులను హతమొనర్చి పరశురాముం డట తర్పణము లిడుచుతపంబొనర్చి పాపపరిహారము గల్పించుకొనినకతమున నాతనిపేర రామహ్రదమనియు దీనికి వాడుకలుగలిగెను. మఱియునిట నొకతావున భీష్మునిఁజంప శ్రీకృష్ణుఁడుచక్రముం బ్రయోగింపఁ బ్రయత్నించుటం జేసిన సందర్భమూలముగ నత్తావున చక్రతీర్థమని పేరంబరగు స్నానములతీర్థ మయ్యెను.

కురుభూపతి యీసరస్సుదరిని గొప్పతపం బొనర్చుటం జేసి యీసాగరప్రాంతభూమికి కురుక్షేత్రమనియుఁ బేరయ్యెను.

ఈతీరముననే యింద్రుఁడు వృత్రాసురుని జయించివధించెను. మఱియునిటనే పురూరవున కూర్వసియుఁ దిరుగ లభించెను.

(బ్రహ్మతీర్థముంగూర్చి పుష్కరసరస్సు చూ.)

౧౦ బ్రహ్మసావర్ణికమనువు- తండ్రి భూతి ప్రజాపతి గాన నీతనికి భౌత్యుఁడనువాడుక యుండెను. బ్రహ్మసావర్ణి, బ్రహ్మజ్ఞానియని ప్రసిద్ధి. భార్యాపుత్రులు గానరారు.

ఈతని మన్వంతరమున ఆపోభూతి, హవిష్మ_స్త, సుకృతి, సత్యర్షి, నాభాగర్షి, అప్రతిమర్షి, వశిష్ఠర్షి యనువారలు మహర్షులు.

ఫాల్గుణశుద్ధపౌర్ణమి బ్రహ్మసావర్ణికమన్వాది.

**బ్రహ్మసూత్రములు** — [illegible] రచింపఁబ [illegible] బ్రహ్మ [illegible] విష్టసంఖ్య [illegible] అద్వైత ద్వైత [illegible] వారివారి సిద్ధాంతములకు [illegible] నర్థములగునట్లు సరిచి భాష్యములు వేర్వేఱుగ వ్రాసికొనియున్నారు. పిదప చైతన్యమతస్థులు, వీరశైవులను లింగాయతులును గూడ నీబ్రహ్మసూత్రములకే భాష్యములు గుసుర్చుకొనిరి. కొన్నిసూత్రము లొకయధికరణముగను, కొన్ని యధికరణములొక పాదముగను, నాల్గేసిపాదము లొక యధ్యాయముగను, నాల్గు అధ్యాయములు

ములుగల భాష్యములుగ నున్నవి. (మీమాంస శాస్త్రములు చూడుఁడు.)

నీలకంఠ (అద్వైత) భాష్యమున ౧౯౦ అధికరణములును, ౫౪౬ సూత్రములును, శ్రీకంఠ (అద్వైత) భాష్యమున ౧౮౨ అధికరణములును, ౫౪౫ సూత్రములును, శంకర (శక్తివిశిష్టఅద్వైత) భాష్యమున ౧౯౧ అధికరణములు, ౫౫౫ సూత్రములును శ్రీ (విశిష్టాద్వైత) భాష్యమున ౧౫౬ అధికరణమును, ౫౪౫ సూత్రములును, నానందతీర్థకృత మధ్వ (ద్వైత) భాష్యమున ౨౭౬ అధికరణములును, ౫౬౪ సూత్రములును,

శ్రీకర (వీరశైవ లింగాయత అద్వైత) భాష్యమున ౧౬౬ అధికరణములు, ౫౪౩ సూత్రములును గాననగుచున్నవి.

ఇందు శ్రీకరభాష్యము క్రీ. శ. 1920 సంవత్సరమున శ్రీ దేవిడీ సంస్థానాధీశు లగు 'ఇజ్జతాసార్' శ్రీ కందుకూరి బాలసూర్య ప్రసాద భూపాలుని యాధిపత్యమున సికందరాబాదు నగరమున జరిగిన శైవపండితమహాసభయందు నిరసింపఁబడినది. పిదప వీరశైవసంఘము (లింగాయతసంఘము) వారు దీని నవలంబించి దోషముల సంస్కరించి ముద్రింపించిరి.

**బ్రహ్మస్తంబ గోత్రము** — (భరద్వాజ ఉపగణము చూడుఁడు).

**బ్రహ్మహృదయనక్షత్రము** (గోళము)- (నక్షత్రములు భారతీయులుగుర్తించినవి చూ.)

**బ్రహ్మాండపురాణము**— దేవీభాగవతమున నారవదిగను, దక్షిణవాట్లయందు పదునెన్మిదవదిగనుఁ జెప్పఁబడిన పురాణము. బ్రహ్మప్రోక్తము. దేవీభాగవతమున ౧౨౧౦౦ గను, శివపురాణ మాత్స్యపురాణములందు ౧౨౨౦౦ గను తక్కినవాట్లయందు ౧౨౦౦౦ గను గ్రంథసంఖ్య చెప్పఁబడినది.

**బ్రహ్మానందము**—(ఆనందములు చూ.)

**బ్రహ్మావర్తదేశము**— దీని కుత్పల దేశమనియుఁ బేరుండెనని యొక ప్రతీతి కలదు. సరస్వతీ దృషద్వతీనదులమధ్య దేశము. ఆర్యులకు చాలకాలము నివాసభూమియని జెప్పఁబడినది.

ఈదేశమునకు బ్రహ్మావర్తపురము రాజధానియఁట. దాని నిప్పుడు చిత్తూరని వాడుచున్నారు. మఱియుఁ బ్రతిష్ఠానమనియుఁ బేరుండెనందురు. ఇటనుండిన కోటజాగాను తొల్లింట నీదేశమేలిన యుత్తానపాదుని నివాసభవనముండిన దుర్గమనియుఁ జూపెదరు. ఇది గంగాతీరమందున్నది. దీని కెదురుగ గంగకవ్వల వాల్మీకాశ్రమస్థలము కలదు. అటనే సీతామహాదేవి కుశలవులం గనెనఁట. ఇప్పటి బ్రహ్మావర్తఘాటనఁబడుచున్న రేవుననే యోడపై నాగంగానదిం దాటించి యామె నవ్వలి వాల్మీకాశ్రమమునకుఁ జేర్చిరని చెప్పుచున్నారు.

ఈపురముండినప్రాంతమున కుత్పలవన మని పేరుండె నందురు. గాని మహాభారతము వనపర్వము ౮౭ నందు ఉత్పలవనము పాంచాలమునఁ జెప్పఁబడి యుంటయు, వేరు నిదర్శనములులేకుంటయు నిశ్చయమున వీలులేకున్నది.

**బ్రహ్మావర్తము(బ్రహ్మావర్తపురము-చిత్తూర్)**—, గంగానదిపైనున్న గొప్ప తీర్థస్థలము. కాన్పూరుపట్టణమునుండి పదునాలుగు మైళ్ళదూరమునఁగలదు. ఇప్పటిపేరు చితూర్.

ఇటఁజూడఁదగినది బ్రహ్మావర్తఘట్టమునను న్నయొకదేవాలయమునఁ దొల్లింట శ్రీరాముఁ డశ్వమేధయాగ మొనర్చుతరి వదలినయశ్వము నకై కుశలవులతో సంభవించిన కలహమున శ్రీరాముల పైవదలినశరము. అదియేలోహమో

తెలియదు గాని యాతుపచ్చరంగుగ నుండును.

ఇట గంగకవ్వలనున్న వాల్మీకాశ్రమమునకు శ్రీరాముని యాజ్ఞమేరకు లక్ష్మణుఁడు గర్భవతియైయున్న సీతామహాదేవిం దెచ్చి విడచెనఁట. అటుల గంగను పడవపై దాటినది బ్రహ్మావర్తఘట్టమునని శ్రీమద్రామాయణమున నుత్తరకాండ ౫౧వ యధ్యాయమునఁగలదు. ఆయాశ్రమముననే సీతాదేవి కుశలవులం గనెనఁట.

వాల్మీకమహర్షి శ్రీమద్రామాయణమును రచించినతా విదియే.

**బ్రాంటోమీటరు** — గ్రీకున Bronte అనిన పిడుగనియు, Metron అనిన కొలయనియు నర్థము.

ఇది యురుములు, మెఱుపులు, పిడుగులుగల పెద్దవానలు (Thunder storms) రికార్డు చేయఁగల యంత్రపరికరము. జార్జి జేమ్సు సైమండ్సు అను పేరుగల బ్రిటిషు మీటరియాలోజిష్టుగారు దీనిని గనిపెట్టిరి. క్రీ. వె. 1890లో నుపయోగమునం దుంచఁబడినది. గడియారములఁ బోలినయంత్రముచే నడుపఁబడుచు కాగితము చుట్టలపై పెన్సిలులతో రికార్డు చేయుచుండును. గంటలో నారడుగుల కాగితము నడచునని చెప్పఁబడినది. మధ్యకాలములు atmospheric pressure, వర్షపాతము, గాలివేగము, ఉఱుము, మెఱుపులు మొదలగునవి వివరించెడిని.

**బ్రాడ్‌కేస్టింగ్** (Broadcasting Radio) ఇది Wireless teliphoney లోనిభాగము. ఇక్కాలమున నచ్చటచ్చట దీనిస్థానములందు పాడఁబడుపాటలను వినుటకు గొప్పవారిచే తమయిండ్ల నమర్పఁబడినయంత్రపరికరములగుండా విన నేర్పాట్లు చేయఁబడుచు, వినోదకరమగు గృహోపకరణముగఁ బరిగణింపబడుచున్నది. దీనిగుండా దూరదేశపు టుపన్యాసములు విననగుచున్నవి.

ఇంగ్లాండునందు మార్కోనీకంపెనీవారు దీనిం బరిశీలించి ప్రయత్నముల నల్పుచు క్రీ. వె. ౧౯౧౯లోఁ బ్రయత్నముచేసి సఫలులై చేమ్సుఫోర్డునుండి నడపిరి. అదియే దీనికిఁ బ్రారంభమని చెప్పవలయును. ౧౯౨౦సం॥లో వారికంగీకారపత్రి (Permission) మీయఁబడుటచే నొక బ్రాడుకేస్టింగుస్టేషను చెమ్సుఫోర్డుకడనున్న రిటిల్ కడఁ గట్టఁబడెను. తొలుత వారమునకొకసారి చిన్నప్రోగ్రేము నడుపుచుండిరి. ౧౯౨౨నుండి మార్కోనికంపెనివా రొకపాటి యుపన్యాసములు, పాటలు నడుపనారంభించిరి.

క్రీ. వె. ౧౯౨౨ లో ఎలక్ట్రికల్ పరికరములం జేయు పనివాండ్రప్రతినిధులకు పోస్టుమాస్టరుజనరల్ గారితో నొక సంభాషణసభ జరిగి, యం దార్గురుప్రతినిధులు రెండుసంవత్సరములదనుక స్థానములను సాపించి, బ్రాడ్ కేస్టింగుపనులను నడుపుటకు పూచీపడిరి. వారికి లండన్, అబ్బరుదీన్, బర్మింగ్హామ్, బౌరన్మౌత్, కార్డిఫ్, గ్లాస్గో, మాన్చెస్టర్, న్యూకేసిల్ పట్టణములందు స్థానములు నిర్మింప పని నడుపపెర్మిషనొసఁగఁబడెను. మఱియు వారికి "బ్రిటిష్ బ్రాడ్ కేస్టింగుకంపెనీ" యనునామమేర్పడి లైసెన్సు లీయఁబడెను.

లండన్, బర్మింగ్హామ్, మాంచెస్టరులనుండి ౧౯౨౨ నవంబరు ౧౫ తేదీని బ్రాడ్ కేస్టింగు ప్రారంభమైనదని చెప్పఁబడినది. పిదప ౧౯౨౪ సం॥లో తిరుగ లైసెన్సులు పునరంగీకారమున నీయఁబడి రాను రాను వృద్ధియై బ్రిటిషుసామ్రాజ్యమంతటను వ్యాపింపసాగెను. ౧౯౨౬ లో హై పవరుస్టేషనులుకట్టఁబడుటతోఁ బ్రిటిష్ప్రభుత్వమువారా Broad Casting Control

తీసికొనిరి. అప్పటినుండియు దానికి 'బ్రిటిష్ బ్రాడ్ కేస్టింగు కార్పొరేష' నను పేరఁ బరఁగు చున్నది.

(రేడియో వైర్లెస్ చూడుఁడు.)

**బ్రాన్ న్యూ** (Bran New)- తొల్లింటిది బ్రాండు న్యూ (క్రొత్త) అను వాక్యము నుండి క్లుప్తపఱుపఁబడిన రూపము. వాడుక చేయఁబడినదని యర్థము.

**బ్రాహ్మణగ్రామన్యాయము**—బ్రాహ్మణగ్రామ మన నాగ్రామమున నందఱు బ్రాహ్మణులే యుందురని యర్థముకాదు. ఇతర వర్ణములవా రెంద రుండినను నెక్కువ ప్రాముఖ్యతనందినవా రాగ్రామమున బ్రాహ్మణులే యని భావము. ఇట్లే యామ్రవనన్యాయము. (అనఁగా నితరచెట్లుఁ గూడ నందున్నను వీని కెక్కువప్రాముఖ్యతఁ గలిగి యుండుటవలన మామిడితోఁట యని పేరగును).

**బ్రాహ్మణపరివ్రాజకన్యాయము**-మొదటిశబ్దమునను రెండవశబ్దార్థము స్ఫురించుటచే నూనిచెప్పట కీన్యాయము వర్తించెడిని. ఇట్టివి గోబలీవర్దన్యాయము, బ్రాహ్మణవసిష్ఠన్యాయము. అనవసరపు పునరుక్త్యర్థములైనను, ఒత్తి తెల్పునవిగ వాడుచున్నారు.

**బ్రాహ్మణశ్రమణన్యాయము**-శ్రమణ శబ్దము బౌద్ధ(సన్యాసి)భిక్షువున కన్వయించుఁ గాన నిటఁదొలుత బ్రాహ్మణుఁడైయుండెననియు పిదప బౌద్ధభిక్షువాయెననియు భావము.

పూర్వపుస్థితి యిప్పటి మారినస్థితిఁ గూడ దెల్పుటయందీ న్యాయమును వాడుచుందురు.

**బ్రాహ్మణాబాదు పురము**-ఇదితొల్లింటి ముశిక దేశములోనిది. ఇప్పుడు సింధుదేశము నందున్న పురము. బ్రాహ్మణుల కొకప్పుడా దేశమునఁ బ్రధానపురముగ నుండెనందురు. గాని యప్పటిపేరు తెలియకున్నది. ఇప్పటిపేరు తర్వాత వాడుకనందినది.

**బ్రాహ్మణులలో చిన్నవాడి బెస్తలలో పెద్దవాడికి పనిరక్కు అధికము**—(ఆంధ్రలోకోక్తి.)

**బ్రాహ్మణులు**—భరతదేశపుఁ బ్రజలందుఁ బూర్వకాలమున బ్రాహ్మణు లగ్రవర్ణమువారని చెప్పఁబడినది. ఆదియందు బ్రాహ్మణులు,క్షత్రియులు నొకేవర్ణముగ నెంచఁబడుచుండిరనియు, వారియందు కేవలముఁ దపోవృత్తి నియమముఁ గల్గి ఋషులై, యాశ్రమవాసులైనవారు బ్రాహ్మణులుగను,ఆయుధధారులై శరీరబలము నుపయోగించుటయె వృత్తిగాఁగల్గి యుద్ధసంసిద్ధులై రాజకార్యములందు నిమగ్నులై యైహికవాంఛలఁగల్గినవారు క్షత్రియులనియు నానాటికేర్పడిరి. ఇట్లయ్యును సంబంధబాంధవ్యములఁ గల్గి యుండినటులఁ దెలిసెడిని.

ఇటులనే బ్రాహ్మణుఁడగు జమదగ్నితల్లి యగు సత్యవతీదేవి క్షత్రియుండగు గాధిరాజు కుమార్తె. బ్రాహ్మణుండగు గౌతమునిభార్య యహల్య క్షత్రియకన్య. ఇట్లెన్నియో నిదర్శనములు పురాణములందుఁ గానవచ్చెడిని. గాని విశ్వామిత్రునికాలమునకు కులభేదపు టేర్పాటు బలమయ్యెనని తోఁచెడిని.

పిదప బ్రాహ్మణులు వింధ్యపర్వతమున కుత్తర దేశనివాసులందరును గౌడబ్రాహ్మణులనియు, దక్షిణదేశనివాసు లందరును ద్రావిడబ్రాహ్మణులనియుఁ బిలువఁబడసాగిరి. ఉత్తరదేశనివాసులు మత్స్యమాంసభక్షకులుగను దక్షిణదేశ ద్రావిడశాఖవారు కేవలశాకాహారులు గను నుండిరి. కాలానుగతమున నీరెండుశాఖల బ్రాహ్మణులును నొక్కొకరై దేశీయాంతశ్శాఖలై చీలి

మొత్తమున దశవిధశాఖలుగ నేర్పడిరి.

వింధ్యోత్తరవాసులగు గౌడులు ౧ గౌడబ్రాహ్మణులనియు, ౨ కన్యాకుబ్జులనియు, ౩ సారస్వతులనియు, ౪ ఉత్కలబ్రాహ్మణులనియు, ౫ మైథిలులనియు నైదుశాఖలుగఁజీలిరి. వింధ్య పర్వతపంక్తికి దక్షిణదేశముల వసించిన ద్రావిడులు ౧ ద్రావిడబ్రాహ్మణులనియు, ౨ ఆంధ్రులనియు, ౩ మహారాష్ట్రబ్రాహ్మణులనియు, ౪ కర్ణాటకులనియు, ౫ ఘూర్జరశాఖబ్రాహ్మణులనియు నైదుశాఖలుగఁ జీలిరి. రానురాను వీరియందింకను నంతశ్శాఖ లేర్పడి పలుతెగల వారై యున్నారు. ఈ పదితెగలంగూర్చి వేర్వేరుతావులందుఁ జూడనగును.

నేటికిని గౌడశాఖలైనను కాలానుగతముగనే దేశములకుం జేరి యెచ్చట వసించుచున్నను మత్స్యమాంసముల భుజించువారుగనే యున్నారు. ద్రావిడశాఖలైదును కాలానుగతముగనే దేశములకుం జేరి యెచ్చట వసించుచున్నను శాకాహారులుగనే యున్నారు. వీరు మత్స్యమాంసములు భుజింప నొల్లరు.

**బ్రాహ్మము**— ఇది విష్ణు, మార్కండేయ, లింగ, వారాహ, కూర్మ, పద్మ, శివ, భాగవత, నారదీయ, బ్రహ్మవైవర్త, మాత్స్య పురాణములందు మొదటిపురాణముగను, దేవీ భాగవతమున నైదవపురాణముగను జెప్పఁబడినది. బ్రహ్మ మరీచ్యాదులకు బోధించిన బ్రహ్మకల్పవిషయములు మొదలగున విందుఁ గలవు. దీని గ్రంథసంఖ్య మత్స్యపురాణమున ౧౩౦౦౦ గను, దేవీభాగవతమున ౧౦౭౦౦ గను, తక్కిన పురాణములందు ౧౦౦౦౦ గను జెప్పఁబడి యున్నది.

**బ్రాహ్మవలి లేక బ్రహ్మవలిగోత్రము**- (ఉపమన్యుగణము చూడుఁడు).

**బ్రాహ్మి (బ్రహ్మలిపి)**— (భరత దేశపు లిపులు చూడుఁడు.)

**బ్రాహ్మణీనది**— ఈ పేరుగల నది యుత్కలదేశమునం దున్నది. దీనిఁ గూర్చిన ప్రశంస మహాభారతము, భీష్మపర్వము, ౯ అధ్యాయమునందునను పద్మపురాణము సర్గ. ౩ నను గలదు.

**బ్రిటానియా బొమ్మ**— ఇది బ్రిటీషు దేశమును సూచించు చిహ్నముగా నిక్కాలమున వాడఁబడు చున్నది. బ్రిటీషుద్వీపములందు పెన్నీ నాణెములపై నీబొమ్మ ముద్రింపంబడియుంట గాననగును. సర్వసాధారణముగ రాజ్యాంగగౌరవస్థితులఁ దెల్పు కార్యములం దీచిహ్నము నుపయోగించుచున్నారు.

ఆదిని బ్రిటీషురాజ్య మేలినప్రభువు రెండవ చార్లెసుభూపతిపాలనకాలమున నీమె జీవించి యుండినది. అప్పు డీమె పేరు Frances Stuart అని యుండినది. ఈమె Duchess of Richmond పదవియం దుండిన వనితారత్నము. అక్కాలమున సౌందర్యరాశియని యెన్నఁబడిన స్ఫురద్రూపిణి. ఈమెలావణ్యము వలననే నాణెములపై దేశలాంఛనముగ నీమె రూపము ముద్రింపఁబడెనఁట. ఆకాలఁపు చిత్రలేఖనకళాకౌశలుఁడని చెప్పఁబడిన Sir. Peter Lely యను పేరుగల చిత్రకారునిచే వ్రాయఁబడిన యీమెపట మింకను లండనునగరమున Barber's Hall నందుంచఁబడి యున్నది. ఇంకను నిట్టివి Hampton Court Palace భవనమునం దొకటియు, Islip Chapel of West Minister Abbey దేవళమున Queen Anne మహారాజ్ఞిపట్టాభిషేకమహోత్సవమున నిడంబడిన మైనపువిగ్రహాకారము (wax Effigy) ను రచింపఁ బడినవి

కలవు. ఆమెకు జంతువులం దెంచు మక్కువ యధికమట. తనపిల్లుల సంరక్షణకై కొంత యాస్తినిచ్చి తన విల్ (will) నందు వివరించెనట.

తరుచుగ బ్రిటీషునాణెములపై నీక్రిందిపదము లుంట గాననయ్యెడిని. ఆ నాణెములపై నున్న లాటిన్భాషాపదముల కర్థము. Dei = దేవుని యొక్క, gra = కరుణవలన, Rex = భూపతి, omn = ఎల్ల లేక ఎల్లరు, omnibus = ఎల్లరకులేక అందరికి, Fid = నమ్మకము లేకమతము. def = రక్షకుడు, (గాన) Fid def = defender of the faith అని యాంగ్లమున నర్థమగును. ఇటులనే యాంగ్లశబ్దమగు George అనుదానికి లాటిన్భాషారూపము Geargius అగును. ఇవిలాటిన్భాషాపదములు. కొన్ని క్లిష్టపరుపఁబడిన రూపములందున్నను, లాటిన్భాషాపదములే. ఆభాష తొల్లింట పాశ్చాత్యదేశములవారికి పవిత్రభాషయైయుండి విద్వాంసులచే గౌరవసూచకముగ వాడంబడుచుండిన దనుట నెల్లరెరింగినదే. పాశ్చాత్య పండితులకు లాటిన్ భాష భరతదేశపుఁ బండితులకు సంస్కృత దేవనాగరి వంటిదిగా నుండినది.

**బ్రిటీషు అప్పర్గినియా** — (నైగేరియా చూడుండు.)

**బ్రిటిష్ ఆర్డర్సు ఆఫ్ ఛివెలరీ** (British orders of Chivalery)—

1. The most Noble order of the Garter. దీని చిహ్నము K. G. (Knight of Garter.)

2. The most Ancient and most noble order of the Thistle. దీనిచిహ్నం K. T. (Knight of Thistle).

3. The most Illustrious order of St. Patrick. దీనిచిహ్నము K. P. (Knight of St. Patric).

4. The most Honourable order of the Bath. దీనిచిహ్నము (1) K.C.B. (Knight Commander of Bath) అనియు, 2. C.B. (Companion of Bath) అనియు రెండు కలవు.

5. Order of Merit. దీని చిహ్నము O. M.

6. The most exalted order of the Star of India. దీనిచిహ్నము G.C. S.I. (Knight Grand Commander of Star of India) అనియు, K. C.S.I. (Knight Commander of Star of India) అనియు C.S.I. (Companion of Star of India) అనియు మూఁడు కలవు.

7. The most distinguished order of St. Michael and St. John వీని చిహ్నములు G.C.M.G. (Knight Grand Cross of St. Michael and St. George) K. C. M. G. (Knight Commander of St. Michael and St. George) C. M. G. (Companion of St. Michael and St. George) అని మూఁడు కలవు.

8. The most Eminent order of the Indian Empire. G.C.I. E. (Knight Commander of Indian Empire) C. I. E. Commander of the Indian Empire) అనియు రెండు కలవు.

9. The Imperial order of the Crown of India దీనికి చిహ్నము C. I.

10. The Royal Victorian order దీనికిఁ జిహ్నములు G. C. V. O. (Knight Grand Cross of Victorian Order).

K. C. V. O. (Knight Commander of Victorian order.) C. V. O. (Commander of Victorian order). M.V.O. (Member of Victorian Order) అనియు, నాలుగు కలవు.

11. The most Excellent order of the British Empire. G. B. E. (Knight or Dame Grand Cross of British Empire).

K. B. E. (Knight Commander of British Empire). D. B. E. (Dame Commander of British Empire). C. B. E. (Commander of British Empire), O. B. E. (Officer of British Empire), M. B. E. (Member of British Empire).

12. Order of the companions of Honour: దీనికి చిహ్నము C.H. (Companion of Honour).

13. The Distinguished Service Order దీనికిఁజిహ్నము D.S.O.అనిఒకేవిధము.

14. The Imperial Service Order. దీనికిఁ జిహ్నము I. S. O. అని ఒకేవిధము.

15. The Royal Order of Victoria and Albert దీనికిఁ జిహ్నము V. A. అని యొకే విధము.

16. The order of St. John of Jerusalem దీనికిఁ జిహ్నములేదు.

ఇవి యన్నియు ధైర్యశౌర్యౌదార్యన్యత్య ములోకరియందు స్థిరపఱచుటకు ప్రభుత్వమువారొసంగు బిరుదములుగఁ జెప్పఁబడినవి.

## బ్రిటిషుకోలనీలు ఫారెన్ప్రొజిషన్సు-

బ్రిటీషుప్రభుత్వరాజ్య మింగ్లండు, వేల్సు, స్కాట్లాండు, ఐర్లాండులు కలసినదని వేరుగఁ జెప్ప నక్కఱలేదు. ఈప్రభుత్వమునకు లోనై స్వపరిపాలన ననుభవించుచున్న దేశములు ప్రభుత్వమువారివగు దేశములు, సీమలు, ప్రభుత్వంవారి రక్షణయందున్న ప్రభుత్వములు, రాజ్యములు కలసి బ్రిటిషు సామ్రాజ్య మనియు, కొందరిచే కామన్వెల్తు ఆఫ్ బ్రిటీషు ఎంపైరనియు, పిలువఁబడుచున్నది. స్వదేశములగు ఇంగ్లాడు, వేల్సు, స్కాట్లాండు, ఐర్లాండులు గాక తక్కినవాటికి "బ్రిటిషుప్రభుత్వపు కోలనీలు-ఫారన్ పొజిషన్సు" అని వాడుచున్నారు.

౧. ఐరోపాయందు జిబ్రాల్టరు. ఇది స్పానియా దేశమునకు దక్షిణమునన్నున్న దుర్గస్థానము. మాల్టా మధ్యధరాసముద్రమునఁగల ద్వీపము. వైశాల్యము ౧౧౯ చతురపుమైళ్లు.

౨. ఆసియాఖండమునందు బ్రిటీషు ఇండియా రక్షకసంస్థానములు (హైదరాబాదు, మైసూరు, కాశ్మీరము మొదలగునవి) బర్మారాజ్యము, సింహళద్వీపరాజ్యము (క్రౌన్కోలనీ) ఏడెన్, సైప్రస్, స్ట్రెయిటు సెటిల్మెంట్సు, లబూఆన్,హాంకాంగు. వైశాల్యము౧౮౬౬౬౦౦ చ. మై. అంచనా వేయఁబడినది.

3. ఆఫ్రికాఖండమున సియర్రిలియోన్, నైగేరియా, సెంటుహెలీనాద్వీపము, ఎసెన్షనుద్వీపము, కేపుకోలనీ, నేటాల్దేశము, ఆరంజిరివర్ ఫ్రిస్టేటు, ట్రాన్సువాల్దేశము, రోడీషియా, బ్రిటీషు ఈస్టుఆఫ్రికా,మయూరిటియస్,సాకోత్రా వైశాల్యము ౫౩౨000 అని అంచనా వేయఁబడినది. ఇందు రక్షిత సంస్థానములు ౨౦౬0000 చతురపు మైళ్లు వైశాల్యముండు నని చెప్పఁబడినది.

అమెరికాయందు కనడా దేశము (డొమినియన్), న్యూఫౌండ్లాండుదేశము, హాండూరాస్ (మధ్యఅమెరికా), బ్రిటీషు వెస్టిండీసు దీవులు, బ్రిటీషుగినియా, ఫాక్లాండు దీవులు. వైశాల్యము 33౫౯000 చతురపుమైళ్ళని అంచనా వేయఁబడినది.

ఓసీనియాయందు ఆస్ట్రేలియాద్వీపఖండము, టాస్మానియా, న్యూజీలాండురాజ్యము, ఫిజీ ద్వీపములు, ఉత్తరబోర్నియో, న్యూ గినియా భాగము. వైశాల్యము ౩౨౬౦౦౦౦ చతురపు మైళ్ళని అంచనా వేయఁబడినది.

బ్రిటీషు సామ్రాజ్యవైశాల్యము ౯౦౦౦౦౦౦ చతురపు మైళ్ళనియు, భూభాగమం దాఱవవం తనియు, ప్రపంచమందలి జనాభాలో నాల్గవవం తీసామ్రాజ్యమునఁ జేరి యున్న దనియుఁ జెప్పఁబడినది. రక్షకసంస్థానములం గల్పుకొని నచో ౧౧౬౦౦౦౦౦ చతురపుమైళ్లుండున నియు, ౪౦౭౦౦౦౦౦౦ జను లిందున్నారనియుఁ జెప్పఁబడినది. (బ్రిటీషుసామ్రాజ్యము చూ.)

**బ్రిటీషుగుయానాదేశము**—(గుయానా దేశము చూడుఁడు).

**బ్రిటీషుతూర్పుఆఫ్రికా**—తూ॥(ఆఫ్రికా చూడుఁడు.) ఇది జర్మనుతూర్పుఆఫ్రికా హద్దు నుండిజూబానదివఱకు వ్యాపించియున్న దేశము. ఉత్తరమున అబ్సీనియా, ఆంగ్లోయీజిప్షన్ సాడానులవరఱకు వ్యాపించియున్నది. మొంబాసా ప్రధానస్థానము. ఇదిబ్రిటీషుప్రభుత్వమువారిది.

**బ్రిటీషుదేశమందలి పెద్దయుద్యోగము**— నరపాలునకుఁబిదప బహుళః రాజ కుటుంబము. అనఁగా రాణియును, యువరాజు, యార్కుప్రభువు, కన్నాటుప్రభువు మొదలగు వారు పరిగణింపఁ బడుదురు. రాజకుటుంబము నకుఁ బిదప ఆర్చిబిషప్ ఆఫ్ కాంటర్బరీ (Arch Bishop of Canterbury).

ఆర్చిబిషప్ ఆఫ్ కాంటర్బరీ యగుట కెవ్వరి కైనను తగినంత విద్యయు, వ్యయమునకు ధనమును, మతదీక్షయు, పట్టుదలయుఁ గల్గి యుండిన సాధ్య మగునని చెప్పకొందురు. పిదద యార్కు ఆర్చిబిషప్పను (Arch Bishop of york). ఈయునకుక్రిందు గనో మీదుగనో సమానుడుగనో ధాన్నులరుప్రభుపును కలఁడు. పిదప ప్రధానమంత్రియు పరిగణింపఁ బడుదురు. ప్రధానమంత్రి(Prime minister) త్వ మెవ్వరి కైనను సాధ్యము కావచ్చును. అధి కారమునకు వచ్చిన పార్టీనాయకుఁడు ప్రధాన మంత్రి యగుచుండును.

**బ్రిటీషుదేశమునందుకూలి(Wages) జీతము (Salary) నియమితమూల్యము (Stipend) లకుఁ గల భేదము**— వేజస్ (Wages)— ఇది తక్కువరకపు పని. కాయకష్టముతోఁ జేయునది. ఒప్పుకొనిన పని జేయుటకు ప్రతిఫలముగ రోజున కింతయని గాని, వారమున కింతయని గాని నిర్ణయించుకొ నిన ప్రతిఫలము. ఇది లేబర్ (Labour) తర గతివా రొనర్చునది.

సాలరీ(Salary)–ఒకయుద్యోగమునకు లేక యొకనౌకరికి నిచ్చు ప్రతిఫలమూల్యము. ఇది వేజస్ కన్న గౌరవప్రదముగ నెంచఁబడుచుండు నది. నియమితకాలమున కీయఁబడుచుండునది. పెద్దపెద్దయుద్యోగు లీతరగతివారుగ నుందురు.

స్టైపెండు (Stipend)– ఒకసానమున లేక ఒక ఆస్తివిషయమున నియమితుఁ డైనవాని కాయాదాయము లేక ఆయాస్తినుండి ఏర్పాటు మేర కానియమితస్థానకార్యముల నిర్వహించు చుండుటకు ప్రతిఫలముగ నిచ్చుచుండు మూల్యము. ఇది యొకప్రత్యేకతకు సంబంధించిన యుద్యోగ మనఁదగినది.

**బ్రిటీషుదేశస్థులు వాడునట్టి ఆంగ్లపదములు**—బ్రిటీషుసీమలందు పల్లెగ్రామ ముల వసించువారు, వారియనుదినసంభాషణ మున సాధారణముగ నైదువందలుమొద లేడు వందలమాటల (English words) వఱకు

వాడుకొందురని లెక్కవేయఁబడినది కాని విద్యావంతులు వేయిమొదలు రెండువేలవఱకు నుపయోగించుట కలదు.

వార్తాపత్రికలందును కొంతపాండిత్యపు విలువగల పుస్తకములందును రెండువేలు మొదలు మూఁడువేలవఱకు నాఁగ్లపదములు వాడఁబడుచుండునని లెక్కింపఁబడినది. కాని వర్తకమునందును వృత్తులందును మాటలు విశేషముగ పెరిగియుండెడివి. విద్యుచ్ఛక్తిశాస్త్రసంబంధములు, న్యాయశాస్త్రసంబంధములు మొదలగు శాస్త్రసంబంధ పదములే నాల్గువేలవఱకు నిఘంటు (Dictionary) వునం జేర్పఁబడినవి. చిత్రకళాశాస్త్రము, వైద్యశాస్త్రము మఱి వేయిపదములను నిఘంటువునందుఁ జేర్చెను.

గొప్పగ్రంథముల రచించుకర్త లైదువేల పదములను వాడుట లెక్కింపఁబడినది. బైబిలునం దాఱువేలపదము లుండునఁట. మిల్టనుకవి కావ్యముల నెన్మిదివేలవఱకు వేర్వేఱుపదములు గలవఁదురు. షేక్సుపియరు మహాకవికావ్యములన్నిటియందు నెన్మిదివేలవఱకు వేర్వేఱుపదములు లెక్కింపఁబడినవి.

**బ్రిటీషు పార్లమెంటు (ప్రజాసంస్థ) సభ్యులు తమ పదవు (స్థానము)లకు రాజీనామానిచ్చు పద్ధతి(సాంప్రదాయము)**—లండనునగరమందుగల ప్రజాసంస్థ(British Parliament)కు ప్రజలచే నెన్నుకొనబడిన సభ్యులు ప్రజాప్రతినిధులగుట తమపదవికి తామే రాజీనామానిచ్చి వదలుకొన వీలులేకుండెనఁట. అవసరముగుచో పార్లమెంటును రద్దుచేసి తిరుగ నెన్నికలు జరుపుకొనున ట్లాజ్ఞాపించు నధికార మొక్క నరపాలునకే గల్గియుండిన దఁట. మఱియు పార్లమెంటుసభ్యులు జీతముగల యే ప్రభుత్వోద్యోగమునందుండ రాదను పద్ధతిగలదఁట.

ఇంగ్లాండునందలి ఆక్సుఫర్డుషైరు బక్కింగ్హాముషైరులనడుమ గల ఛిల్టర్నుమల ప్రదేశము "హన్డ్రెడ్సు" అనుభాగము (Division)గా పేరిడఁబడినది యుండునఁట. ఈప్రదేశమున దొంగలబాధ యధికముగ తొల్లి యుండెనఁట. ఇట ప్రత్యేకపోలీసుదళమేర్పడి, దాని ప్రధాని (నాయకుని)గ నొక చీఫ్ కానిస్టేబిల్ (Chief Constable) ఉద్యోగి యుండువాఁడట. ఆతనికి జీతము సంవత్సరమునకు ఇరువది షిల్లింగు లుండునఁట. కాలము మాఱి భద్రమేర్పడి యిప్పుడట దొంగభయము లేకుంట నాప్రత్యేక పోలీసుదళము మానినను, చీఫ్కనిస్టేబిల్ ఉద్యోగము మాత్ర ముంచి రఁట. మానుకొనఁదలచిన పార్లమెంటుసభ్యులకో అకది నామమాత్రముగ నుండును గాని యుద్యోగి యుండుట లేదు. మానుకొనఁదలఁచిన సభ్యుఁడు ఆపదని నంగీకరించి తనసభ్యత్వమును వీడినతోడనే ఆచీఫ్కనిస్టేబిల్ ఉద్యోగమునకుఁగూడ రాజీనామా నిచ్చి తనవలెనే పిదప తనసభ్యత్వమును వీడఁదలంచిన పార్లమెంటుసభ్యులకై కాళీగా నుంచునఁట. దీనిని నామెతగా(Chief Constable of Chiltern Hundreds) అని తమ పదవి వదలుకొనుసభ్యులంగూర్చి నుడివెదరు.

**బ్రిటీషు పార్లమెంటు హౌసులు**—తొల్లిటికాలమున నాంగ్లసీములందు ద్రవ్యము భూములమూలముననే యుండునది. దేశమున ముఖ్యులు భూస్వాములే గాన, నాలోచనలకు భూపతులు భూస్వాములనే బిలువనంపి రావించి యోచించుచుండువారఁట. రాజసభయందలి వారిస్థితి వారివారి భూస్వామ్యమును దెల్పునదే గాని ప్రజాప్రతినిధిత్వమును గాని, లేక వారి స్వదూరాలోచనబలమును దెల్పునది గాని గాకుండెను. ఇది హౌస్ ఆఫ్ లార్డ్సు.

వీరు పరిమితివిస్తారములు గల్గిన భూస్వాములు. దేశమున నింక నపరిమితసంఖ్యాకులగు భూస్వాము లుండియు నీసభయందు పాల్గొనం జాలకుండిరి. కాలము గడచినకొలంది వారు కొందఱు ప్రతినిధుల నెన్నుకొని రాజసభకంపనుత్తరువాయెను. నానాటికి వారిసంఖ్యయు నెక్కువ యయ్యెను. ఇది హౌస్ ఆఫ్ కామన్సు.

రానురాను పట్టణములు, పల్లెలు, క్రమముగ సంఘములు సంస్థలుంగూడ తమతమప్రతినిధుల నంప నయ్యెను. అది యంతయు హౌసాఫ్ కామన్సును బలపఱచుటకే పరిణమించెను. అట్లు బలమంది యనేకమార్పులం జెంది, స్వపరిపాలనా స్వతంత్రమంది బ్రిటీషుదేశమున హౌస్ ఆఫ్‌లార్డ్సు (House of Lords) అప్పర్ హౌస్ గను, హౌస్ ఆఫ్ కామన్సు (House of Commons)లోవర్ హౌస్ గనున్నది. అందు లోవర్ హౌస్ మహాబలయుక్తమును, దేశమును ఉపయోగపఱచుకొనుసంస్థయునై యున్నది. ఆంగ్ల (బ్రిటీషు) పాలనము నెఱపుసంస్థ యిదియె.

**బ్రిటీషు బెలూచీస్థానము**- ఆసియాఖండమునందలి బెలూచిస్థాన దేశమునుండి బ్రిటీషు ప్రభుత్వమువారు భరతదేశపు రక్షణ సైన్యస్థానమునకుంగానుఆక్రమించిఇండియాకుం గలుపుకొనిన దేశము. దీని కేగుమార్గమునకు బోలాన్పాస్ అనిపేరు. దీనికడనున్న క్వెట్టాపురము సైన్యస్థానము. కొంతపండ్లవర్తక మిటం గలదు.

భరతదేశమునందు సింధుదేశపు జంక్షను రైల్వే సంధినుండి సింధుపిషాన్ రైల్వే వాయవ్యదిశగా నడిచి శిబిమీందుగా బోలాన్పాసునందు చేరి కడకేగి క్వెట్టామీందుగా బోస్తాను చేరును. వేఱొక యినుపదారి నారిపాస్ మార్గముననేగి బోస్తానుచేరును. బోస్తానునుండి ఆఫ్ఘనిస్థానములోని కాంధహారుపురమున కొక యినుపదారి వేయంబడినది. (ఆఫ్ఘనిస్థానము, డూరాండు లైను, బెలూచిస్థానము చూడుండు).

**బ్రిటీషురాజపరంపర** — బ్రిటీషు దేశ మాంధ్ర విజ్ఞానమున కేమి సంబంధ మని సంశయము గలుగవచ్చును. ఇక్కాలముననే గాక క్రీ. శ. ౧౮౩౭ నుండియు నవిచ్ఛిన్నముగా బ్రిటీషుచక్రవర్తులు భరతదేశము నేలుచుంట నారాజులంగూర్చి వివరించుట యసమంజసము కానేరదు.

౮౦౨-౮౩౯ ఎగ్బర్టు నృపాలుండు. పిదప నీయనసుతుండు సింహాసనమునకు వచ్చెను.

౮౩౯-౮౫౮ ఎతెల్వుఫ్- ఈయనకు ౧. ఎథెల్ బాల్డు, ౨ ఎతెల్బర్టు, ౩ ఎతెల్ రెడ్, ౪ ఆల్ఫ్రెడ్డను నలురు సుతులుండిరి.

౮౫౮-౮౬౦ ఎతెల్బాలు.

౮౬౦-౮౬౬ ఎతెల్బర్టు.

౮౬౬-౮౭౧ ఎతెల్ఫ్రెడు.

౮౭౧-౯౦౧ ఆల్ఫ్రెడ్డు- ఈయనకుం బిదప ఈయన సుతుండగు ఎడ్వరు సింహాసనమునకు వచ్చెను.

౯౦౧-౯౨౫ ఎడ్వర్డు ది ఎల్డర్- ఈయనకు ౧ అతెల్సటన్, ౨ ఎడ్మండు, ౩ ఎడ్రెడ్డు అను ముగ్వురు కుమారు లుండిరి.

౯౨౫-౯౪౦ అతెల్స్టన్.

౯౪౦-౯౪౬ ఎడ్మండునృపాలుడు.

౯౪౬-౯౫౫ ఎడ్రెడ్డునృపాలుడు - ఈయనకు సంతానములేదు. తరువాత ఈయన అన్నగారగు ఎడ్మండునృపాలుని సుతులలో జ్యేష్ఠుండగు ఎడ్వేగారును ఆయనకుం బిదప రెండవ సుతుండగు ఎడ్గరుగారును రాజ్యమేలిరి.

౯౫౫-౫౯ ఎడ్వేనృపాలుడు (నిస్సంతు).

౯౫౯-౭౫ ఎడ్గరునృపాలుఁడు - ఈయనకు ౧ ఎడ్వర్డనుకుమారుఁడు, ౨ ఎథెల్రెడ్డనుసుతుండును నిర్వురుకుమారులునుండిరి.

౯౭౫-౭౮ ఎడ్వర్డునృపతి-ఈయనకు ఎడ్వర్డు ది మార్టైరనువాఁడుకయుండెను. ఈయనకు సంతు లేదు.

౯౭౮-౧౦౧౬ ఎథెల్రెడ్డు - ఈయనకు ఎథెల్రెడ్ ది రెడ్లెస్ అనియు వాడుకయుండెనఁట. భార్యపేరు ఎమ్మాదేవి. వీరికి ౧ ఎడ్మండు ఐరన్సైడ్, ౨ ఎడ్వర్డు ది కన్ఫెసర్ అనునిర్వురు సుతు లుండిరి. అందు జ్యేష్ఠసుతుండు తండ్రితోడనే ౧౦౧౬లో మృతినొందెను. రెండవ సుతుఁ డతిబాలుఁడుగ నుండ నామెకొఱకు స్వెయెస్ గారిసుతుఁడగు కెన్యూటుగారు సింహాసనమునకు వచ్చిరి.

౧౦౧౬-౩౫ కేన్యూటునృపాలుఁడు-ఈయనకుఁ బిదప ఈయనసుతులగు ౧. హెరోల్డు, ౨. హార్డీకేన్యూటును ఒకరితరువాత నొకరు రాజ్యమేలిరి.

౧౦౩౫-౪౦ హెరోల్డునృపతి (నిస్సంతు).

౧౦౪౦-౧౦౪౨ హార్డీకేన్యూటు నృపతి (నిస్సంతు.) ఈయనకుఁ బిదప ౯౭౮-౧౦౧౬ రాజ్యమేలిన ఎథెల్రెడ్ ది రెడ్లెస్ నృపాలునకును, ఎమ్మా(దేవి) గారికిని రెండవసుతుఁడగు ఎడ్వర్డు ది కన్ఫెసర్ రాజ్యమునకు వచ్చెను.

౧౦౪౨-౬౬ ఎడ్వర్డు ది కన్ఫెసర్ నృపాలుఁడు. ఈయనకు సంతులేదు. ఈయనను ఒకటవ విలియమ్‌గారోడించి ౧౦౬౬లో రాజ్యమాక్రమించిరి. నాటినుండి యీయన విలియం ది కాన్కరర్ అనిబిరుదనామమంది రాజ్యమేలిరి.

ఇది యిట్లుండ ఎడ్వర్డు ది కన్ఫెసరుగారి జ్యేష్ఠసోదరుండగు ఎడ్మండు ఐరన్సైడుగారు క్రీ. శ. ౧౦౧౬లో మరణించిరని మున్ను వివరింపఁబడెను. ఆయనకు ఎడ్వర్డను కుమారుఁడుండెను. ఆయనకు ఎడ్గార్ ది అథేలింగనుసుతుండును, మార్గారెట్ అనుకుమార్తెయును గల్గిరి. ఆకుమార్తెను మూడవ మాల్కోమ్‌ఆఫ్ స్కాట్లాండుగారు వివాహమాడిరి. ఆదంపతులకు మాటిల్డా యను రాకొమార్తె కలిగెను. (ఇక కథకుఁ జనెదము).

౧౦౬౬-౮౭ ఒకటవ విలియము (విలియమ్ ది కాన్కరరు) నృపాలుఁడు- ఈయననుండియే రాజవంశము బ్రిటీషురాజకుటుంబముగాఁ బరిగణింపఁబడుచున్నది. ఈయనకు ౧. విలియమ్, ౨. హెన్రీ, ౩. రోబర్టాఫ్ నార్మండీయనుసుతులును, అడేలా యనుకుమార్తెయు సంతానము గల్గియుండిరి. జ్యేష్ఠుండగు విలియమ్ రెండవ విలియమనుపేర రాజ్యమునకు వచ్చెను.

రెండవసుతుండగు హెన్రీ పైనవివరింపఁబడిన మాల్కోమ్ III ఆఫ్ స్కాట్లాండు గారికిని, మార్గారెటు (దేవి) గారికిని గల్గినసుతయగు మాటిల్డా రాకొమరితను బరిణయమైయుండెను. రాబర్టాఫ్ నార్మండీగారికి విలియమ్ క్లిటో యను సుతుఁడు గల్గెఁగాని యాతఁడు నిస్సంతానాయెను. కుమార్తెయగు అడేలా (దేవి)గారికి స్టెఫెన్ అనుసుతుఁడు గల్గెను.

౧౦౮౭-౧౧౦౦ రెండవ విలియమ్ నృపతి పిదప ఈయన సోదరుఁడు ఒకటవహెన్రీగారు సింహాసనమునకు వచ్చిరి.

౧౧౦౦-౧౧౩౫ ఒకటవహెన్రీనృపాలుఁడు- ఈయనభార్య మాటిల్డాదేవియని మున్నువివరింపఁబడియె. ఆమె శాక్సనువనిత. వీరికి మాటిల్డారాకొమరిత కల్గెను. ఆమె జయోఫ్రీఆఫ్ ఏంజోగారిం బరిణయమై హెన్రీ యనుసుతుం గనెను. జయోఫ్రేగారు ౧౧౫౧లో మరణించిరి.

ఒకటవ హెన్రీ నృపాలుని యనంతరము, వెనుక వివరింపఁబడిన అడేలా రాకుమారి సుతుఁడగు స్టెఫెన్ గారు రాజ్యమునకు వచ్చిరి. వీరు విలియమ్‌ది కాన్కరరుగారికి దౌహిత్రులు.

౧౧౩౫-౧౧౫౪ స్టెఫెన్ నృపాలుఁడు- ఈయన కొకసుతుఁడుండెఁగాని ౧౧౫౨లో మృతి నొంద నిస్సంతానాయెను. ఈయనకుఁ బిదప మాటిల్డా జియోఫ్రేగార్ల సుతుండును, ఈయన పెద్దమేనమామగా రగు ఒకటవ హెన్రీగారికి దౌహిత్రుఁడును నగు రెండవహెన్రీ రాజ్యమునకువచ్చెను.

౧౧౫౪-౧౧౮౯ రెండవ హెన్రీ నృపాలుఁడు- ఈయనకు ౧ హెన్రీ (౧౧౮౩ లో మృతినందెను.) ౨ రిఛర్డు, ౩ జియోఫ్రీ, ౪ జాన్ అను నల్వురుసుతు లుండిరి. అందు రెండవ సుతుండు ఒకటవరిచర్డుగా ఈయనకుం బిదప సింహాసనమునకు వచ్చెను. మూడవసుతుఁడు కౌంటాపు బ్రిటానీపదవి నందియుండి, ఆర్థరను సుతుఁబడసెఁగాని యాబాలుఁడు ౧౨౦౩లో మృతినంద నిస్సంతానాయెను.

౧౧౮౯-౯౯ ఒకటవ రిఛర్డు నృపాలుఁడు- నిస్సంతుగాన పిదప ఈయనతమ్ముఁడు జాన్ సింహాసనమునకు వచ్చెను.

౧౧౯౯-౧౨౧౬ కింగు జాన్. ఈయనకు హెన్రీయనియు, రిఛర్డనియు నిర్వురు సుతులుండిరి. జ్యేష్ఠుండగు హెన్రీ ఈయనకుఁబిదప సింహాసనమునకు వచ్చెను. రెండవసుతుండగు రిఛర్డుగారు ఎరిల్ ఆఫ్ కారన్వాల్ పదవియందు నిస్సంతై మరణించిరి.

౧౨౧౬-౭౨ మూడవ హెన్రీనృపాలుఁడు- ఈయనసుతుండగు ఎడ్వర్డు పిదప రాజ్యమునకు వచ్చెను.

౧౨౭౨-౧౩౦౭ ఒకటవఎడ్వర్డునృపాలుడు- పిదప ఈయనసుతుఁడు రాజ్యమునకు వచ్చెను.

౧౩౦౭-౨౭ రెండవ ఎడ్వర్డునృపాలుఁడు- (సుతుఁడు).

౧౩౨౭-౭౭ మూడవ ఎడ్వర్డునృపాలుఁడు- ఈయనకు ౧ ఎడ్వరు ది బ్లాకుప్రిన్సు అను కుమారుఁడు, ౨ లియోనెల్ రాకుమారుఁడు, ౩ ఎడ్మండురాకొమారుఁడు, ౪ జానాఫ్ గాంటు రాకొమారుఁడునను నల్వురుసుతులుండిరి. అందు మొదటియాతఁడు, తండ్రి జీవితకాలముననే మరణింప, నాతనిసుతుండగు రెండవరిఛర్డు పితామహునకుం బిదప సింహాసనమునకు వచ్చెను.

రెండవసుతుఁడు డ్యూకాఫ్ క్లారెన్సు పదవి నందిన లియోనెల్ రాకొమరుఁడు. ఈయనకు ఫిలిప్పా యనుకుమార్తెయుండెను. ఆమె ఎరిలాఫ్ మార్చిగారిం బరిణయమై రోగర్ మోర్టిమారను సుతుంగనియెను. ఆయన ఎనీమోర్టిమే రను సుతం గన, నామె రిఛర్డుఎరల్ఆఫ్ కేంబ్రిడ్జిగారిని బరిణయమై రిచర్డు డ్యూకాఫ్ యూర్కుం గనియెను.

మూఁడవసుతుండగు ఎడ్మండు డ్యూకాఫ్ యార్కుపదవి నందెను. ఈయన ముమ్మను మఁడే పైఁజెప్పిన రిఛర్డుఎరలాఫ్ కేంబ్రిడ్జిగారు (ఏనీమోర్టి మేరుగారిభర్త.)

౪వ సుతుండగు జానాఫ్ గాంటుగారి కొకరి తరువాతనొకరుగ నిరువురుభార్యలైరి. అందు కేతరైననునామెవలన జాన్ బియెఫోర్డు ఎరలాఫ్ సోమర్సెట్టను కొమారుఁడు కలిగెను. ఆయన సుతుఁడు జార్జ్ బియోఫోర్టు డ్యూకాఫ్ సోమర్సెట్ గారు. ఆయనకుమార్తె మార్గారెట్ బియోఫోర్డు. ఈమె ఎడ్మండు టూడోరుగారిని పరిణయమై ఎలిజబెత్తుగారి భర్తయగు ఏడవ హెన్రీ నృపాలునిం గనియెను.

ఇంక జోన్ఆఫ్ గాంటుగారు వేరొకభార్య

యగు బ్లాంచిగారివలన నాల్గవ హెన్రీనృపాలుం గనియెను. ఇటుల మూడవఎడ్వర్డు నృపతికిం బిదప నాయనపౌత్రుఁడు రెండవరిఛర్డు సింహాసన మధిష్ఠించెను.

౧౩౭౭-౯౯ రెండవ రిఛర్డునృపాలుఁడు- ఈయనకు సంతు లేనందున ఈయనకుంబిదప వీరినాల్గవసోదరుఁడు జానాఫ్ గాంటుగారికి బ్లాంచీదేవివలనఁ గల్గినసుతుఁడు నాల్గవహెన్రీనృపాలుఁడు రాజ్యమునకు వచ్చెను.

౧౩౯౯-౧౪౧౩ నాల్గవహెన్రీనృపాలుఁడు- (పిదప ఈయనసుతుఁడు).

౧౪౧౩-౧౪౨౨ ఐదవహెన్రీనృపాలుఁడు- (పిదప ఈయనసుతుఁడు).

౧౪౨౨-౧౪౬౧ ఆరవహెన్రీనృపాలుఁడు- ఈయనకు సంతు లేదు గాన నీయనకుం బిదప ఆయనముత్తాతగారి (జానాఫ్ గాంటు) సోదరుండగు లియోనెల్ (డ్యూకాఫ్ క్లారెన్సు) గారి సంతతియం దాఁవతరపు మనుమఁడగు నాల్గవ ఎడ్వర్డుగారు రాజ్యభారము వహింపనాయెను. అయన సోదరులలో జ్యేష్ఠుఁడు ఆయనకుంబిదప ఆయనసోదరుఁడు మూడవరిఛర్డుగారును రాజ్యమేలిరి. వారి కింకను జార్జి డ్యూకాఫ్ క్లారెన్సను పేరిటి సోదరుఁ డుండెనుగాని వారికి సంతు లేకపోయెను.

౧౪౬౧-౮౩ నాల్గవ ఎడ్వర్డునృపాలుఁడు- ఈయనసుతుఁ డెడ్వర్డు. ౧౪౮౩ సం॥రమున నచిరకాలముననె మృతుండగుట తమ్ముఁడు సింహాసనమునకు రానయ్యెను. నాల్గవఎడ్వర్డు భూపతికి ఎలిజబెత్తనుకుమార్తెయునుండి యామె ఏడవహెన్రీనృపాలుని బరిణయమయ్యెను.

౧౪౮౩-౮౫ మూడవరిఛర్డునృపాలుఁడు- ఈయనకు సంతు లేదు. ఈయనకుం బిదప రాజ్య మన్నగారియల్లునకు వచ్చెను.

౧౪౮౫-౧౫౦౯ ఏడవహెన్రీనృపాలుఁడు- ఈయనకు ఎన్మిదవహెన్రీయను కుమారుఁడును ఆర్థరను వేరొకకుమారుఁడును మార్గారెట్టు, మేరీ యను నిర్వురుకొమార్తెలును కల్గియుండిరి. అందు ఎన్మిదవహెన్రీ ఈయనకుం బిదప భూపాలుఁడయ్యెను. ఆర్థరుగారికి సంతతి లేదు. జేమ్సు IV ఆఫ్ స్కాట్లాండుగారిని బరిణయమయ్యెను. మేరీ రాకొమరిత లూయీ XII ఆఫ్ ఫ్రాన్సుగారిని బరిణయమయ్యెను. వారి మనుమరాలే లేడీ జేన్ గ్రే గారు.

ఇంక రెండవ కుమార్తెయగు మార్గారెట్టు గారు జేమ్సు IV ఆఫ్ స్కాట్లాండుగారిం బరిణయమై యైదవజేమ్సు ఆఫ్ స్కాట్లాండుగారిం గనెను. ఆయనకుమార్తె మేరీ రాకొమరిత. ఆమె లార్డు డార్న్లేగారిని వివాహమాడెను. ఆదంపతులకు జేమ్సు అనుసుతుఁడు గల్గి నృపాలుఁడాయెను.

౧౫౦౯-౪౭ ఎన్మిదవ హెన్రీ నృపాలుఁడు. ఈయనకు ఆరవఎడ్వర్డు కుమారుఁడు; మేరీరాకొమరితయు, ఎలిజబెత్ రాకొమరితయు నిర్వురుపుత్రికలు. వీరందరు వరుసగ తండ్రికిం బిదప రాజ్యపాలన మొనర్చిరి.

౧౫౪౭-౫౩ ఆరవ ఎడ్వర్డు నృపాలుఁడు.

౧౫౫౩-౫౮ మేరీరాజ్ఞి.

౧౫౫౮-౧౬౦౩ ఎలిజబెత్తురాజ్ఞి- ఈమె సుప్రసిద్ధురాలు. ఈమెకుఁబిదపఁ బైనివివరింపఁబడిన మేరీరాకొమరితకు డార్న్లేప్రభువునకు సుతుండగు జేమ్సుగారు స్కాట్లాండు ఇంగ్లాండుల యైక్యముతో సింహాసనమెక్కిరి. వీరికిఁ బూర్వము స్కాట్లాండు రాజపరంపరయం దైదుగురు జేమ్సునరపతులుంట నీయనను 'ఆరవ జేమ్సు ఆఫ్ స్కాట్లాం'డనియు, ఇంగ్లాండునకా పేరున నీయనయె మొదటివాఁడు గాన 'ఒకటవ

జేమ్సు ఆఫ్ ఇంగ్లాం'డనియుఁ గూడ వాడు చుండిరఁట.

౧౬౦౩-౨౫ ఒకటవ జేమ్సు ఆఫ్ ఇంగ్లాండు నృపాలుఁడు- ఈయనకు పెద్దకుమారుఁ డగు హెన్రీగారు ౧౬౧౨ సం॥మున అనంతానవం తుఁడై యీయనకుముందే మృతినందెను. ౨వ సుతుఁడగు ఒకటవ ఛార్లే యీయనకుఁ బిదప సింహాసనమునకు వచ్చెను. ఆయనభార్య పేరు హెన్రియెట్టా మేరియా యని చెప్పఁబడినది. కుమార్తెయగు ఎలిజబెత్తు రాజ్ఞీమణిత ఫ్రెడరిక్కు ఎలక్టరుపేలా-టైనుగారిని బరిణయమై యిర్వురు సుతులను, సోఫియా యనుకుమార్తెను గనెను. ఆమె(కుమార్తె) ఎర్నెస్టు ఎలక్టర్ ఆఫ్ హనోవర్ గారిని బరిణయమై యొకటవజార్జిభూనాధునిఁ గనెను. కుమార్తెరువురకు సంతతి లేదు.

౧౬౨౫-౪౯ ఒకటవఛార్లెసు నృపాలుఁడు- ఈయనకు ఛార్లెస్సు, జేమ్సు ననునిర్వురుసుతులును, మేరీ, హెన్రిట్టా యను నిర్వురుకుమార్తెలును నుండిరి. జ్యేష్ఠుఁడు ఛార్లెసు మేరీరాజ్ఞీమణిత విలియమ్ II ఆఫ్ ఆరెంజిగారిని వివాహమాడి, మూడవ విలియమ్ నృపాలునిఁ గనియెను. హెన్రిటా రాజ్ఞీమణిత ఫిలిప్పాఫ్ ఆర్లీన్సుగారిని బరిణయమై ఏనామేరియా యనుసుతం గనియెను. ఆమెయు డ్యూకాఫ్ సేవోయిగారిని బెండ్లియాడి కుమారునిఁ గనియెను. పిదప నా బాలుండును డ్యూకాఫ్ సేవోయిపదవినంది వర్ధిల్లెను. ఈసంతతివారు సార్డీనియాభూపతు లైరి.

౧౬౪౯-౬౦ ఈ పదునొకండు సంవత్సరములు కామన్వెల్తుపరిపాలనకాలము. ఇందు నరపాలుఁడు లేడు. పిదప నొకటవ ఛార్లెస్సు నృపాలుని జ్యేష్ఠసుతుఁడు రెండవ ఛార్లెసుగారు సింహాసన మెక్కిరి.

౧౬౬౦-౮౫ రెండవఛార్లెసునృపాలుఁడు- ఈయనకు సంతతి లేదు. ఈయనకుఁ బిదప నీయనతమ్ముఁడు రెండవజేమ్సుగారు సింహాసన మెక్కిరి.

౧౬౮౫-౮౮ వ సంవత్సరమున ఈయన ఏన్హైడను భార్యవలన మేరీయను నొకకుమార్తెను, ఏనీ యను నొకకుమార్తెను గనియెను. అందు మేరీరాజ్ఞీమణిత మూడవ విలియము నృపాలుని బెండ్లియాడెను గాని వారికిసంతతి లేదు. రెండవకుమార్తె ఏనీ పెండ్లియాడనేలేదు. రెండవ జేమ్సునృపాలుఁడు తరువాతి రెండవభార్యయగు మేరీ ఆఫ్ మోడెనాగారివలన జేమ్సు ది ఓల్డు ప్రిటెండరు అనుసుతుంగనియెను. ఆయనకు "ఛార్లెసు ఎడ్వర్డు ది యంగు" ప్రిటెండరనియు, "హెన్రీ డ్యూకాఫ్‌యార్కు" అనియునిర్వురు సుతులు గల్గిరి. వారిర్వురకు సంతతి లేదు.

రెండవ జేమ్సునృపాలునకుఁ బిదప నాయనకు ఏన్హైడనుభార్యవలనఁ గల్గిన కుమార్తె మేరీ, భర్తయగు మూడవవిలియమునృపాలుఁడు సింహాసనమునకు వచ్చి ౧౬౮౯ మొదలు ౧౭౦౨ వఱకుఁ బాలించెను. ఈయనభార్య మేరీరాజ్ఞి ౧౬౯౪ సం॥రం లో చనిపోయెను. మూడవవిలియముగారిమరణానంతరము రెండవ జేమ్సునృపాలుని రెండవ కుమార్తెయు, మేరీరాజ్ఞిగారి చెల్లెలు నగు ఏనీరాజ్ఞిగారు ౧౭౦౨-౧౪ సింహాసనమునకు వచ్చిరి. వీరికిని వీరియప్పగారివలెనే నిస్సంతేగాని వీరిపిదప వెనుక వివరింపఁబడిన (సోఫియా ఎర్నెస్టు ఎలక్టరు ఆఫ్ హానోవరుగార్ల సుతుఁడగు) ఒకటవజార్జిగారు వారసు లైరి.

౧౭౧౪-౨౭ ఒకటవ జార్జి నృపాలుఁడు— ఈయనకుఁబిదప నీయనకుమారుఁడు ౧౭౨౭-౬౦ రెండవజార్జినృపాలుఁడు సింహాసనమునకుఁ వచ్చెను. ఈయనకు ఫ్రెడరిక్కు ప్రిన్సాఫ్

వేల్సుగా రనియు, డ్యూకాఫ్ కంబరాండుగా రనియు నిర్వురుసుతులు. డ్యూకుగారికినిస్సంతు. ప్రిన్సుగారు రాజ్యమునకు రాలేదు గాని వారి సుతుఁడు రెండవజార్జి నృపాలునకుఁ బిదప ౧౭౬౦-౧౮౨౦ మూడవ జార్జి నృపాలుఁడుగ సింహాసన మెక్కెను. ఈయనకు ౧ జార్జి, ౨ ఫ్రెడరిక్కు, ౩ విలియము, ౪ ఎడ్వర్డు, ౫ ఎర్నెస్టు అని యైదుగురుసుతులు.

అందు జ్యేష్ఠసుతుఁడు తండ్రికిఁబిదప సింహాసనమునకు వచ్చెను. ఫ్రెడరిక్కు డ్యూకాఫ్ యార్కు:పదవియందుండి౧౮౨౭లో నసంతానవంతుఁడై మరణించెను. మూడవసుతుఁ డన్నగారికిఁ బిదప నృపాలుం డయ్యెను. నాల్గవ సుతుఁడు ఎడ్వర్డుగారు డ్యూకాఫ్ కెంటుపదవియందుండి, విక్టోరియా ఆఫ్ సాక్సికోబర్గు(దేవి)గారిని పరిణయమై సుప్రసిద్ధురాలగు విక్టోరియా మహారాజ్ఞిగారిం గనెను. ఐదవ సుతుం డగు ఎర్నెస్టుగారు డ్యూకు ఆఫ్ కంబర్లాండుగానుండి ౧౮౩౭-౧౮౫౧ హనోవరునరపాలుఁ డాయెననియు, ఈయనకుఁ బిదప ఈయన కుమారుఁడు ఐదవజార్జి ఆఫ్ హనోవరుగారు ౧౮౫౧-౧౮౬౬ వఱకు హనోవరు నరపాలుం డాయెననియుఁ జెప్పఁబడియున్నది. దీని నట్లు వదలి అసలుకథకుఁ జనెదము. మూడవజార్జి భూనాథునకుఁ బిదప సింహాసనాధిపత్యము:—

౧౮౨౦-౩౦ నాల్గవజార్జినృపాలునకు వచ్చెను. ఈయనకు ఛార్లొటీ రాకుమార్తె సుత. ఆమె అసంతానవంతురాలై ౧౮౧౭లో మృతినొందెను. పిదప రెండవసోదరుఁడు విలియము సింహాసనమెక్కెను.

౧౮౩౦-౩౭ నాల్గవ విలియమునృపాలుఁడు- ఈయనకు సంతులేదు. ఈయనకుఁబిదపసింహాసన మీయనయన్నగారికుమార్తె విక్టోరియా మహారాజ్ఞికి వచ్చెను. ఆమెభర్త ఆల్బర్టు ఎడ్వర్డు ఆఫ్ సాక్సికోబర్గుగారు.

౧౮౩౭-౧౯౦౧ విక్టోరియామహారాజ్ఞి - ఈమె గొప్పపేరందినది. 'విక్టోరియా ది గుడ్' అని యీమె ననుచుందురు. ఈమెయే యిండియాచక్రవర్తినిగా ౧౮౫౮లో సింహాసన మధిష్ఠించినది. ఈమెకుఁబిదప నీమెసుతుఁడు రాజ్యమునకువచ్చెను.

౧౯౦౧-౧౯౧౦ ఏడవఎడ్వర్డునృపాలుఁడు- ఈయనను ఎడ్వర్డు ది పీస్మేకరనియెదరు. ఈయనకు ఆర్థరుడ్యూకాఫ్కన్నాటుగారు సోదరులు. ఈయన చక్రవర్తి.

ఈయనకుఁ బిదప నీయనసుతుఁడు జార్జిగారు సింహాసనమునకు వచ్చి బ్రిటీషునరపాలుఁడును భరతదేశపుఁజక్రవర్తియు నయ్యెను.

౧౯౧౦-౩౬ ఐదవజార్జినృపాలుఁడు- ఈయనయు బ్రిటీషుసామ్రాజ్యపు (భరతదేశపు) చక్రవర్తి ఈయనకు ౧ ఎడ్వర్డు, ౨ జార్జి, ౩ ఆల్బర్టు, ౪ హెన్రీ యను రాకొమరులును, మేరీ యను రాకుమార్తెయుఁ గల్గిరి.

వీరికి పిదప జ్యేష్ఠసుతుఁడగు ఎడ్వర్డురాకుమారుఁడు ౧౯౩౬లో సింహాసనమునకు వచ్చెను గాని, యచిరకాలముననే కొన్ని యభిప్రాయభేదములు గల్గుటచేత సింహాసనము వదలివేయ, వీరిసోదరుఁడు ఆరవజార్జి నృపాలుఁడను నామమున ౧౯౩౬లో సింహాసనమునకు వచ్చెను. వీరి జ్యేష్ఠసోదరుఁడు సింహాసనమునం దున్నకాలమున వారి నెన్మిదవ ఎడ్వర్డు నృపాలుం డనెడివారు.

ఇంక నీబ్రిటీషురాజ పరంపరంగూర్చి తెలియఁదగిన యితరహాంశములు-- ఆంగ్లోశాక్సను నృపతుల నిక్కాలపు ప్రభుత్వమువారు బ్రిటీషు రాజవంశముగాఁబరిగణింపక, ఒకటవవిలియమ్

( విలియమ్ ది కాన్కరరు ) గారినాట నుండియే బ్రిటీషురాజవంశ మనియెదరు. విక్టోరియామహారాజ్ఞి గారి భర్తగా రగు ఆల్బర్టు ఎడ్వర్డుగారు హనోవర్ పేరు పెట్టునుకుం జెందిన వారు. విక్టోరియామహారాజ్ఞి గారినాడుహనోవర్ గుయెల్ఫుని యనుచుండిరి. వారిసంతానమును కొందరుహనోవర్ హనోవరుగా వాడుచుండిరట.

ఐదవ జార్జిసార్వభౌముండు క్రీ. శ. ౧౯౧౭ జూలై నెలలో నొకరోయల్ ప్రొక్లమేషనుమూల మున నంతటినుండియు నీరాజవంశము హౌస్ ఆఫ్ విండ్సు రని వాడఁబడున ట్లేర్పఱచి విధించెను. నాటనుండియు నట్లే వాడఁబడుచున్నది.

ఎనిమిదవ యెడ్వర్డుసార్వభౌముండు క్రీ. శ. ౧౯౩౬ జనవరి ౨౦వ తేదీని తండ్రిమరణానంతము రాజ్యమునకువచ్చెను. తదుపరిసుమారు ౧౧ మాసముల యనంతరము ౧౯౩౬ డిశంబరు ౧౧వ తేదీని అంత్యసందేశముతో రాజ్యమునువీడెను.

బ్రిటీషువారిలో వృద్ధదంపతులుతమవివాహములనూర్తి జ్ఞాపకచిహ్నముగఁ జేసికొను నుత్సవములు "Anniversaries" అనిపేరు. వీట్లకుఁ బ్రత్యేకనామకరణములు కొన్నిటి కమర్పఁబడియున్నవి. వీటి నిజగాత్వమే మొకాని యివి వివాహములవంటివే యని కొందరినెదరు.

మొదటిది Cotton anniversary.
రెండవది Paper ,,
మూఁడవది Leather ,,
ఐదవది Wooden ,,
ఏడవది Woolen ,,
పదియవది Tin ,,
పండ్రెండవది Silk ,,
పదునేనవది Crystal ,,
ఇరువదియవది China ,,
ఇరువదియైదవది Silver anniversary
ముప్పదియవది Pearl ,,
నలుబదియవది Ruby ,,
ఏబదియవది Golden ,,
అరువదియవది Diamond ,,
డెబ్బదియవది Platinum ,,
డెబ్బదియైదవది Radium ,,

**బ్రిటీషుసామ్రాజ్యము**-బ్రిటీషుసామ్రాజ్యము ఏర్పాటు, అందులవిధానము రాజకీయవేత్తలకు విచిత్రమనిపింపకపోదు. ఒక్కొక్క దేశమున దూరదృష్టిలోపములవలన ప్రజల కొకప్పుడు కొంతయొత్తిడి గల్గుచుండినను, దీనిపరిణామము ప్రజాస్వపరిపాలనావిధానలక్షణము గాన నభివృద్ధి కిందు మార్గములు కలవని చెప్పఁబడినది. ఏది యెట్లున్నను వైశాల్యమందును వైభవమందును ప్రతిభయందును బ్రిటీషుసామ్రాజ్యమునకు సాటి మఱియొకటి గానరాదు. ప్రపంచమందంతటిలో నాల్గవభాగ మాంగ్లసామ్రాజ్యముతో సంబంధము గల్గియుండుట నెఱిఁగినవారలు "బ్రిటీషు సామ్రాజ్యమున సూర్యుఁ డస్తమింపఁ" డనియందురు. అనఁగా రాజ్యమున నొకచోసూర్యాస్తమయమై రాత్రియైనను, వేఱొకచోపగలుగ నుండునని భావము.

స్వేచ్ఛాస్వపరిపాలనలుగల్గిన పెక్కు దేశములిట్లొక సామ్రాజ్యమునఁ జేరియుండుటవలన నొకచక్రవర్తియేలుబడి కిన్ని దేశములంగీకరించి సంబంధము గల్గియుంటగ తేలుచున్నది. బ్రిటీష్ చక్రవర్తికి లోఁబడిన దేశము లన్నియుఁ దమ రక్షణకు సామ్రాజ్యమందలిబలము నుపయోగించుకొనుటయని భావము. బ్రిటీషుద్వీపములు గ్రేటుబ్రిటను, ఐర్లాండును గాన నవి మూలస్థానములు. వాటింగల్పి 'యునైటెడ్ కింగ్డమ్' అనియెదరు. అది నిరుపమానబలముగల ప్రభు

త్వముగనున్నది. చక్రవర్తియు మహా వైభవోపేతుండై ఆయా దేశముల ప్రజాసౌఖ్యాభివృద్ధులే ప్రధానముగ నెఱపుటయె తనధర్మముగ పాలన నెఱపుచుండును.

సామ్రాజ్యముయొక్క పరిమాణము ౧౩౯ ౦౯౮౦౦ చ. మైళ్లనియు, సామ్రాజ్యమున పాలనలందు ప్రజలు 450000000 గలరనియు లెక్కింపఁబడినది. డొమినియనులు తమ పరిపాలనమును తామె నెఱపుకొనుచు, చక్రవర్తి గారియేలుబడికి లోఁబడియుండును. వాటియందొక్కొక రాజప్రతినిధి యుండును. అవి ఆస్ట్రేలియా, కనడా రాజ్యము, న్యూఫౌండు లాండు, న్యూజీలాండు, దక్షిణాఫ్రికా, దక్షిణ రొడీషియా, ఐరిష్ ఫ్రీస్టేటు ననఁబడు రాజ్యములు.

ఇండియా సామ్రాజ్యము బ్రిటీషు పరిపాలనయందు స్వపరిపాలనావస్థ నందుచున్న సామ్రాజ్యరాజ్యము. ఇది సామ్రాజ్యమునఁ జాల ప్రాముఖ్యమైనదిగఁ జెప్పఁబడినది. ఇంక క్రౌను కోలనీలని చెప్పఁబడునవి సింహళద్వీపము, నైగీరియా, జమైకా యనఁబడునవి. వీట్ల పరిపాలనము ప్రభుత్వము వారిచే నెఱపఁబడుచుండును. ప్రజాభిప్రాయము నెఱుంగుటకు ప్రజాప్రతినిధి సభలుకలవు. ఇవి గాక కెనియా దేశము, న్యాసాలేండనఁబడునవి సంరక్షితరాజ్యములు. లీగాఫ్ నేషన్సువలన మాండేటు ద్వారా బ్రిటీషు సామ్రాజ్యమునందుఁ జేరి పాలింపఁబడునవి టంగనాయికా దేశము, ఇంక ననేకములగు ద్వీపములు, పరగణాలు, సైన్యస్థానములు, నౌకాశ్రయస్థానములుఁ గలవు. అన్నియుఁ గలసి బ్రిటీషు సామ్రాజ్య మనఁబరఁగుచున్నవి. ఈ మహాసామ్రాజ్యమునకు ప్రధాన ప్రభుత్వస్థానమింగ్లాండు దేశమున లండనునగరపు వెస్టుమినిస్టరునందున్న పార్లమెంటును, దానిసంబంధమైనఆనగరమునందే యున్న వేర్వేఱు ప్రభుత్వ కార్యాలయములునైయున్నవి. చక్రవర్తిగారికుటుంబము విండ్సరు దుర్గమున తఱచుగ నివసించుచుందురు

డొమినియనుల కార్యనిర్వాహణమునకును కాలోనీల కార్యనిర్వాహణమునకును ఇండియా దేశపు కార్యనిర్వాహణమునకును ప్రత్యేకముగా చక్రవర్తిగారికి కార్యదర్శులు కలరు. వారిని సెక్రిటరీ ఆఫ్ స్టేటు లనెదరు. న్యాయస్థానపరిపాలనాపద్ధతియందు చక్రవర్తిగారి ప్రివీకౌన్సిలు తీర్మానములు కడపటితీర్మానములుగ నెన్నఁబడుట కేర్పాటు కలదు. దీనింగూర్చి ఐరిష్ ఫ్రీ స్టేటును, దక్షిణాఫ్రికాయును నభిప్రాయభేదములు గల్గియుండెను. సామ్రాజ్యాంతర్గతరాజ్య ప్రతినిధులు గూడుసభకు సామ్రాజ్యసభ (Imperial Conference) యనిపేరు. ఆ సభ అవసరములవెంబడిఁగూడుచు రాజ్యతంత్రవిధులను తీర్మానించుచుండును.

ఆదినుండియు నుండిన బ్రిటీషు దేశరాజ్య ప్రభుత్వముంగూర్చి వివరింప నిట తావుకాదు. కాని బ్రిటిషుసామ్రాజ్యము క్రీ. వె. ౧౫౮౩ నుండి ప్రారంభమని చెప్పనగును. అక్కాలముననే న్యూఫౌండ్లాండు చేరినది. అప్పటినుండియు కొద్దిగనో గొప్పగనో పెరిగి బలపడుచుండెను. క్రీ. వె. ౧౭౮౩ లో నమెరికాసంయుక్త రాష్ట్రములు వీడిపోయెను. పిదప సింధియా దేశము సామ్రాజ్యమునకుఁ జేర్పఁబడియెను. ఈజిప్టును దక్షిణాఫ్రికాయును జేర్పఁబడియెను. ఐరోపాయుద్ధానంతరముమాండేటురాజ్యములు కలుపఁబడెను. క్రీ. వె. ౧౯౨౨ లో ఈజిప్టు స్వేచ్ఛాస్వతంత్రములనంది వేరయ్యెను.

**బ్రిటీషుసామ్రాజ్యమున కోలనీ, డొమినియను (Colony and Dominion)లకుఁగలభేదము** — కోలనీప్రభుత్వ పాలనము బ్రిటీషుపార్లమెంటు పరిశీలనక్రింద

రమారమి నన్ని కార్యములు నెరవు చున్నట్లు నడుపు నుద్యోగులహస్తగతమై యుండును. ప్రజలకు పరిపాలనాధర్మమున బాల్యావస్థతలం చఁబడినరీతిని సర్వమునకు స్వతంత్రత గానరాక ప్రభుత్వమంతయు నుద్యోగస్థులకు యుక్తమని తోఁచినరీతిని ప్రజలకొఱకు కాంగ్లులచే నడుపఁబడునది. శాసననిర్మాణసభలు, ప్రజాస్వపరిపాలనాసంస్థలు మొదలగునవి యున్నను, కడకాలమున నన్నిటిముఁగుదాళ్ళు పరిపాలకుఁడగు గవర్నరుహస్తగతమై యుండును.

డొమినియనులందు ప్రజాప్రభుత్వమే స్ఫురించునంతటి స్వేచ్ఛ ప్రజలకు పరిపాలనయందుఁ గలదు. వారిసమ్మతిమేరకు ప్రభుత్వవిధానమమరుచుండును. బ్రిటీషు పార్లమెంటునుండి యొకగవర్నరు నంపఁబడుచు, ఆయన చక్రవర్తికిఁ బ్రతినిధిగానుండుటకును అవసరముగుతఱినే దేనిసలహో నిచ్చుటకుఁగాని పరిపాలనయంత్రమున నతఁడు జోక్యముకల్గించుకొనఁడు. ప్రజాపాలన మనఁగా ప్రభుత్వమొనర్చుకార్యములు, ప్రభుత్వవిధానము, ప్రజాభిప్రాయమునకు బాధ్యత వహించవలసియుండును. తండ్రికడ నెదిగిన పెద్దకుమారునివలె స్వతంత్రము గల్గియు పార్లమెంటు చక్రవర్తులకులోఁబడి మెలఁగుచుండుట "Dominion Status" అనఁబడును.

**బ్రిటీషు సెంట్రల్ ఆఫ్రికా** — ఇది దక్షిణాఫ్రికాయందున్న దిఇంచుమించు 40000 చతురపుమైళ్ల వైశాల్యముగల సీమ. జాంబా ప్రధానస్థానము. (దక్షిణాఫ్రికా చూడుఁడు.)

**బ్రిటీషు సోమాలీలాండు** — ఇది తూర్పుఆఫ్రికాయం దున్నది. (ఆఫ్రికాదేశము చూడుఁడు). ఇది గల్ఫాఫ్ ఏడెన్ (ఏడెన్ సంయుక్తాగ్రగుడము)నకు దక్షిణముగ నున్నప్రదేశము. బేబిల్‌మాండబ్ జలసంధికి సమీపము. బెర్బెరా రేవుస్థలము. ప్రజలు సోమాలీలు.

**బ్రిటిషుహాండేరాస్ దేశము (బెల్లిజీ దేశము)** — ఇది మధ్య యమెరికాదేశమునం దున్న బ్రిటీషుప్రభుత్వమువారి ప్రదేశము. ఇది చిన్న యింగ్లీషుకోలనీ. బెలిజీపురము ప్రధానస్థానము. ఇది రేవుపట్టణము. ఇటనుండి లాగ్‌వుడ్ కలపయు, మహాగనీ కలపయు విశేషముగ నెగుమతి జరుగుచుండును.

**బ్రిడిచిన్ సిద్ధాంతము (Bredichin Theory)** — ఇది తోఁకచుక్కల శరీరతత్వమునుఁ గూర్చిన సిద్ధాంతము. ఎస్ట్రోనోమీశాస్త్రసంబంధమునఁ జెప్పఁబడినది. ఈ సంతితుఁడు రష్యాదేశపు ఎస్ట్రోనోమీ శాస్త్రవేత్త.

"Multiple tails are due to particles of different density the short highly curved tails, being composed of heavy iron particles. The intermediate ones of hydrocarbons, while the long strait tails pointing almost exactly away from the sun are of hydrogen"

ఈసిద్ధాంత మిటులఁ జెప్పఁబడినను నిటీవలి స్పెక్ట్రోస్కోపు పరిశీలన లనుకూలింపకున్నవి. వీటియందు హైడ్రోజన్ గాని ఐరన్ పార్టికిల్సుగాని గానరాకున్నవి.

వేర్వేఱు కార్బన్ కాంపౌండ్సుయొక్క Spectra యును, అందు ముఖ్యముగ swan spactrum' అనిచెప్పఁబడినదియు, క్రొవ్వొత్తి దీపమునం దగుపడు నూదారంగుభాగమగు cyanogen ను తోఁకచుక్క తల యొక్క spectrum నందు కానఁబడుచున్నవి.

ఇంక తోఁకచుక్క తోఁకయొక్క స్పెక్ట్రము నందు carbon monoxide ఉండునటుల Prof. Fowler పండితుడుకనుగొనియున్నాడు. (తోఁకచుక్కలు చూడుఁడు. ఎస్ట్రోనోమీ చూ. స్పెక్ట్రమ్ ఎనలైసిస్ చూడుఁడు).

**బ్రీచెస్సైబిలు** (Breeches Bible)—క్రీ. వె. ౧౫౬౦లో ప్యూరిటానులవలన స్విజర్లాండుదేశపు జెనీవానగరమున ననువదింపబడిన జెనీవాబైబిలు లేక నింగ్లీషుబైబిలునకీపేరు వాడుచుందురు.

అత్తిచెట్టుయాకులకుbreechesచేసి వాటిపై వ్రాయబడినందున Breeches Bible అని పేరయ్యెనఁట.

**బ్రూస్** (Bruce)—నవీననామము Robert Bruce (జయశీలుని) పేరు. పురుష నామము.

(క్రైస్తవనామములు చూడుడు.)

**బ్రూహమ్ బండి** (Brougham)- ఇది యొంటిగుఱ్ఱముచేగాని రెంటిచేగాని లాగబడు బండి. నాల్గుచక్రములుగలది. టాపుగాని,



హుడ్డలుగాని యమర్పఁబడి కోచిమాన్ తావుఁ గల్గియుండును. లార్డు బ్రూహాంపేరఁ బరగు చున్నది. ఆయన దీనిఁ జేయించి తొలుత వాడుచుంట నీపేరయ్యెనట.

**బ్రెజిల్ దేశము** -దీనిని యునైటెడ్ స్టేట్సు ఆఫ్ బ్రెజిలని వాడుచున్నారు. దక్షిణమెరికా ఖండములోనిది. ఉత్తరమున 'వెనిజుయెలా' 'గువానా' దేశములును, తూర్పున నట్లాంటిక్కు మహాసముద్రమును, దక్షిణమున 'ఉరుగుయె' దేశమును, పశ్చిమమున 'పరాగుయె' 'బొలీవియా' 'పెరూ దేశము' నెల్లలు. ఇది చాల పెద్ద దేశము. ౩౨౦౦౦౦౦ చతురపుమైళ్ల వైశాల్యము. ఈ మహాదేశపుటడవులయందు విస్తారముగదొరకు 'బ్రాజా' (braza) కట్టియని పేరుగల యొపు మూపఁపుకలపజాతినుండి దీని కీపేరు గల్గినది. ఈజాతిచెట్లితరదేశములందుఁ బెరుఁగవట. ఇది పోర్చుగీసువా రిడిననామము.

వాయవ్యదిగ్భాగమునగొప్పగొప్పSelvas (అడవిమైదానములు) కలవు. అవి 'అమజాన్' నది, దానిశాఖానదుల యుదకములచేఁదడుపఁ బడుచుండును. మధ్యను, తూర్పునను, ౨౦౦౦ అడుగులయెత్తుగల పీఠభూమికలదు. ఇందుత్తర దక్షిణములకు చిన్నచిన్న పర్వతపు వరుసలు గలవు. 'బ్రెజిల్' వేఁడిదేశమైనను బాధకరమైన వేడికాదు. "ప్రాన్సిస్కో"నది పైభాగములు వజ్రపుగనులచేఁ జేరందినవి. అట బంగారమును విస్తారముగ లభించుచున్నది. వ్యవసాయము దేశమున చాలతక్కువ. ఐనతావులందు కాఫీ, చెఱుకు, ప్రత్తి, పొగాకు, కసవ ధాన్యములు, గోధుమలు పైరగుచున్నవి. "బ్రాజా" కలప, యితరజాతికలపలు, కోకో తోఁటలుఁ గలవు. అడవిమృగములు విస్తారము. జొన్నలు, మొక్కజొన్నలు భోజనపదార్థముగ నుపయోగించుచుందురు. కాఫీతోఁట లపరిమితముగ దేశమంతటనుగలవు. తెల్లజాతులవారు, నీగ్రోలు, ఇండియనుజాతులు, వీరిమిశ్రజాతులు ప్రజలు. దేశముయొక్క మధ్యభాగములం దిండియన్ జాతు లధికముగఁ గలవు.

తొలుత నీదేశము పోర్చుగీసువారిదై యుండి (౧౫౩౦-౧౮౨౨) స్వతంత్రదేశముగ నారాజవంశములోని యొకరిక్రింద నుండనయ్యెను. కాని క్రీ. వె. ౧౮౮౯లో ప్రజాప్రభుత్వమయ్యెను. రియోడిజానియారో ప్రభుత్వస్థానమున్నపురము. ఇది గొప్పవర్తకస్థలము. బాహియా ౧౨౦౦౦౦ నగరము. రేవుస్థానము. ఇదిపూర్వపు రాజధాని. పెర్నాంబుకోపురమును, మారన్హాముపురమును

నితరపట్టణములు. మానక్ష్వామును మరాన్హావో యనియు ననుచున్నారు. ఇవియు రేవుస్థలములే. పారాపట్టణము రబ్బరువర్తకముచేఁ బేరందిన నగరము. ఈప్రాన్తముల రబ్బరుపంట యపరిమితము.

**బ్రెయిలీటైపు అక్షరములు** (Braille Type అక్షరవితతి)—ఇవి గ్రుడ్డివారు చదువుటకైన యక్షరములు. తడవిచూచి గ్రహింపనగునవి. క్రి. వె. ౧౮౦౯లో ఫ్రాన్సుదేశమున జన్మించిన Louis Braille అను పేరుగల యంధుఁడు వీటికిఁ గర్త. ఈతనికి ప్రమాదవశమున మూఁడవయేట పసితనమందే యంధుఁడగుట ప్రాప్తించె నఁట. ఈ యక్షరములు, అంకెలు, గురుతులు కాగితములపై చిన్నచిన్న రంధ్రములుగఁ జేయఁబడి యుండ, నంధులు వ్రేళ్లచే తడవుచు గ్రహించి చదువుదురు.పిదప నిది పాశ్చాత్యగానమునందుఁగూడ వాడఁబడినదని విందుము. దీనిపుస్తకములును గొప్ప లైబ్రరీలయందున్నవని తెలియుచున్నది.

**బ్రేండ్-బ్రేండన్** (Brand or Brandon) ట్యూటోనిక్కు-పదము. ఖడ్గమున కర్థము. పురుషనామము. (క్రైస్తవనామములు చూడుఁడు.)

**బ్రైట్ నోట్సు, సోల్డునోట్సు** (Bright notes & Sold notes)— వాణిజ్య సంబంధ పరిభాషాపదములు. వర్తకు లన్యోన్యమొకరికొకరు కింకొకరు సరకులం గొనుటయు, నమ్మటయుఁ దెలిపి వివరించు పత్రములు. ఇవి కంట్రాక్టునోట్సుగఁ దనరెడిని.

**బ్రైడ్ గ్రూమ్** (Bride groom) — ఇందు groom అన నిరీక్షకుఁ (waiter) డని యర్థము. పశ్చిమసీమలందు పెండ్లినాఁడు పెండికొమారుఁడు, పెండ్లికొమారునకు స్నేహితులకు waiter గా నుండుట యాచారమఁట.

**బ్రైయొలజీ** (Bryology)—Mosses గూర్చియు, నవి జనించు దేశభూములం గూర్చియు, వాట్లయందలి భేదములఁ గూర్చియుఁ దెలుపు కల.

**బ్రైలీ సిస్టమ్ లేక పద్ధతి** (Braily System)—గ్రుడ్డివాండ్రకు విద్య నేర్పు పదతి. దీనిని Louis Braille అనునాయన కనిపెట్టెను. ఈయన క్రి. వె. ౧౮౦౯ మొదలు౧౮౫౨ వఱకు జీవించియుండిన యాంగ్లేయుఁడు.

పిదపకాలమున నీపద్ధతి ప్రాతకు టైపురైటరు యంత్రముఁ గూడఁ జేయఁబడినదని విఁదుము.

**బ్రోంటోమీటర్** (Bronto meter)- ఉఱుములు, మెఱుపులు పిడుగులతో భయంకరముగ వీచు తుపానును లెక్కించుపరికరము. Mr. G. J. Symons అనువారిచే క్రి. వె. ౧౮౬౦లో కనిపెట్టఁబడి నిర్మింపఁబడినది. గడియారముంబోలిన యంత్రముచే నడుపఁబడుచు పొడవుగల చుట్టకాగితముపై కలములతో తుపానుంగూర్చిన గురుతు లీయంత్రముచే రికార్డు చేయఁబడును.

వాతావరణమున మార్పులు, మెఱుపులు, పిడుగులు, గాలిబరువు, విసరులు, సుడులు మొదలగున వన్నియు మధ్యకాలపు టాలస్యముల తోసహా వివరించునది.

**బ్రోకర్** (Broker) —(వాణిజ్యసంబంధ పరిభాషాపదము.) దళాలు వర్తకుఁడు లేక Commission Agent. ఈతఁడు తనకమీషను కుగా నన్యవర్తకుల కార్యములను (కొనుట, అమ్ముట, ఎగుమతి, దిగుమతి రవానాలు చేయుట మొదలగు నవసరములగు సర్వకార్యములును) జరుపువాఁడు. అతఁ డట్టిపనులకుఁ గాను తీసుకొను ద్రవ్యములకు Commission అనియు, Brokerage అనియు పేర్లు. అట్టి

వాఁడు తా నెవ్వరికిఁగాను సరకులఁ గొనెనో వారికిఁ దెలుపుకొనిన సరకుల తప్సీలుపత్రము నకు Broker's bought note అనియు, అమ్మిన సరకుల తప్సీలుపత్రమునకు Broker's Sold Note అనియు, సర్వసామాన్యముగ నీనోట్లకు Broker's note లకు Broker's contract note అనియు నందురు. Broker ఎగుమతి దిగుమతులు చేసిన లెక్కలకు Broker's returns అనిపేరు.

**బ్రోచిజిల్లా**— (బొంబాయి రాజధాని చూడుఁడు.) బ్రోచిపురము (తొల్లింటి భృగుకచ్ఛపురము) ప్రధానస్థానము.

**బ్రౌన్ కోల్**—(లిగ్నైటు చూడుఁడు.)

**బ్లండరు బస్సు**— తొల్లింటి కాలమునం దుండిన చెన్నపురి [illegible] లు, [illegible] వెడల్పైన [illegible] బరువుగనుండిన వాటికి, [illegible] వచ్చి [illegible].

[illegible] 'బ్లండరు [illegible]' [illegible] చాలకు 'బ్లండరు బస్సు' అనిరి [illegible].

**బ్లడ్ స్టోను** (Blood stone Helio-trope Opagne) —దీనిని హెలియోట్రోపి యనియు ఒపేక్ అనియు నందురు. ఆంగ్లరసాయనవేత్తలు "dark green variety of Chalco dony with red spots" అనెదరు.

తగునంత గట్టిగనుండి చక్కనిమెఱుగు గైకొనురాయి. దీనిని segnet rings ఉంగరములకు వాడుదురు.

**బ్లాంకు చక్కు**— (వాణిజ్య సంబంధ పరిభాషాపదము) Blank అనిన నింపఁబడని లేక ఖాళీగా వదలివేయఁబడిన యని యర్థము. ఒకవేళ హుండీయందు సొమ్ము వివరింపఁబడక యుండుతఱి తా నంగీకరించినటుల Accept చేయబడుట Blank acceptence అనిపేరు. ఇందు హుండీస్టాంపునుబట్టి హుండీమొత్తమా యంకెలకు లోబడి యుండవలయు ననియు, హెచ్చురాదనియు తెలియఁగలదు. ఆసామీ పేరు వివరింపఁబడని హుండీ వ్రాయఁబడినచో దానిని బ్లాంకు బిల్ ఆఫ్ ఎక్స్ఛేంజి ఆర్ బ్లాంకు-నోటు అని యందురు. మొత్తము వివరింపఁబడని సొమ్మును బ్యాంకులో బదులు తీసుకొనవచ్చుటకై 'బ్లాంకు క్రెడిట్' అని యందురు. ఎవరికో వ్రాయఁబడని హుండీపత్రము మొదలగు వాట్లపైన వ్రాలు (endorse) చేసియుంచుటకు బ్లాంకు ఇండార్సుమెంటు అనిపేరు. అట్టివాటిఁ [illegible] ఎవరికో [illegible] ట్రాన్సుఫరు చేయఁబడుటకు Blank transfer అనిపేరు.

**బ్లాక్ హోల్ ఆఫ్ కలకత్తా** — (కలకత్తా చీకటికొట్టు చూడుఁడు).

**బ్లాక్ డెత్ లేక మహామారివ్యాధి**— [illegible] నొకటి. క్రీ. శ. [illegible] శతాబ్దికాలమున నీ బ్లాకు డెత్ (Black Death) వ్యాధి ఆసియా ఐరోపాఖండములలో వ్యాపించి పెక్కుదేశములజననష్టముఁ గల్పించినది. ఇది చీనాలో నారంభమైనదందురు. కొందరట నిదిభూకంపములు వఱదలనుండి కల్గినదందురుగాని సరియగుస్థితి తెలియకున్నదఁట. చీనాదేశమున ౧౩౦ లక్షలును, ఆసియాయందంతటను ౩౨౦ లక్షల జనమును మరణించిరఁట. లండనునగరముననే లక్షజనులు నశించిరఁట. ఇది భయంకరవ్యాధి.

**బ్లాకుఫ్రైడే** (Black Friday) . శ. ౧౮౬౬ సం. రము మేనెల ౧౧ తేదీ

శుక్రవారమునాడు సింగ్లండు దేశమున నార్థిక పరిస్థితియందు గొప్ప యొత్తిడి చిక్కు సంభవించెను. అప్పటి సుప్రసిద్ధ బాంకింగుహౌస్ అగు ఓవరెండునందలి Gurney & Co., ౧౧౦౦౦౦౦౦ పౌనులకు ననపటిమను గోల్పోయెననియు, అది లండనునందు గొప్పచిక్కు గల్గించెననియుఁ జెప్పఁబడినది.

అమెరికా సంయుక్తరాష్ట్రములందు న్యూయార్కు నగరమున ౧౮౬౯ సెప్టెంబరు ౨౪ తేదీయును, ౧౮౭౩ సెప్టెంబరు ౧౮ తేదీయు ఆర్థికపరిస్థితుల అనుకూలమున నిట్టి చిక్కులనే సంభవించినవఁట [illegible] దేశమున రెండు [illegible] కీపేరు [illegible]

**బ్లాకుబుక్కు (నల్లపుస్తకము) బ్లాకుగార్డ్సు (Black book)**—అనుమానాస్పద [illegible] నల్లనిపుట్టల [illegible] పుస్తకములలో వ్రాయుచుండు వాడుక యుండెనఁట. నేఁటికి [illegible] [illegible] గూర్చి [illegible]బడుచున్నది. ఇంకను బ్లాకుగార్డ్సు అనిన [illegible], [illegible], [illegible] [illegible] [illegible] కాలమున నీపేరు వాడుచున్నారు. తొల్లింటి కాలమున నిట్టివారిని వదలఁగొట్టుకొనుటకై వారి వంటమనిపాత్రలను 'Black Guard' అను నొక యుద్యోగికి వశపఱుపఁబడు చుండినవఁట. రానురా నెల్లెటో ఆ దుర్మార్గునకే యాపేరు వర్తింపఁబడు చున్నది. కారణము స్పష్టముగాఁ దెలియకున్నది.

**బ్లాకు హేండు ఆర్గనైజేషన్ (Black hand organization)** — నేరము లొనర్చుట కేర్పడిన రహస్యసంఘముల కీపేరిడఁబడినది. వీటినడంచుట కేర్పడిన సంఘములకు 'White hand organization' అని పేరయ్యెను. అమెరికాసంయుక్తరాష్ట్రములయందొకప్పుడేర్పడి యనేక ఘోరకార్యము లొనర్చి భయముఁగల్గించిన Italian black mailing organization చాల భయంకర సంస్థలలో నొకటిగఁ జెప్పఁబడినది. అది బ్లాకు హేండు ఆర్గనైజేషనే.

**బ్లాక్ లెడ్-(Black lead)** సరియగుదీనిపేరు 'Graphite' అనియు 'Plumbago' అనియు నైయున్నది. దీనిరంగుంబట్టి దీనికి అజ్ఞులు 'Black lead' అని వాడుక గల్గించిరి, గాని నిజమున నిది Lead (సీసము) కాదు. దీనిని రసాయనశాస్త్రవిదులు 'Compound of carbon and iron' అనియెదరు.

**బ్లాటింగు పేపరు (Blotting Paper)** దీనిని ఒత్తుడు కాగితమనియు, సద్దు (అలదు)డు కాగితమనియు కొందరు వాడుచుందురు. (కాగితము చూడుఁడు.)

కాగితముపైని వ్రాసిన సిరాయక్షరములు తడిగాఁ గొంతకాల మటుల నిలచియుండి క్రమముగ నీ రావిరియై యెగసిపోవ శరఁగిన గట్టిపదార్థముగ సిరారంగుపదార్థము సన్నపు పొరయై నిలచియుండఁ జదువ వీలగుచుండును. ఈబ్లాటింగుపేపరు పైనఁ బూయంబడు నునుపుపొర పూయంబడమి నిది స్పంజివలె పీల్చుకొనశక్తిఁ గల్గినదియై యుండును గాన దీని కలఁదిన నీటిం బీల్చుకొని మిగిలిన సిరారంగు అక్షరములను కాగితముపై నిలువఁజేసెడిని. గాన దీనికి 'ఒత్తుడు' లేక 'అద్దుకాగిత'మని పేరయ్యెను.

**బ్లీచింగ్ పౌడర్-(Bleaching powder)** బ్లీచింగ్ పౌడ రనఁగా రంగులను గాని సిరామచ్చలను గాని తుడిచివేయుపొడి యని యర్థము. ఇది Calicium Chloride యొక్కయు, Hypochloride యొక్కయు

Compound. ఇందులో పైనవివరించిన రెండు వస్తువులును గాక కొంచెముసున్న మునీ రుండును. మంచిరకపు Bleaching Powder తయారు చేయుటకు సున్నము బాగుగాఁ జల్లించి (Slaking) కొంచెము తడిగా నుండుస్థితిలోనే యుపయోగింప వలయును. బాగుగా నెండి పోయిన ముగ్గుసున్నము Chlorine ను పీల్చఁ జాలదు. ఆప్రకారము తయారుచేయఁబడిన ముగ్గుసున్నము 3 లేక 4 అంగుళములయెత్తు గల పొరగా నేలమీఁద నుండు పెద్దజల్లెడ రేకులలోఁ బోయఁబడును. దీనికి "Chlorine Chamber" అనిపేరు. ఇది 6 అ॥యెత్తును 10 అ॥ల వెడల్పును 100 అ॥ నిడివియుఁ గలిగి యుండును. ఈ Chamber యొక్క ప్రక్కగోడ లును, కప్పును సీసపురేకులతోఁ జేయఁబడును. ముందు భాగము Asphalted ఇనుపరేకులతోఁ గప్పఁబడియుండును. ఆచాంబరునంతకును రెండు గవాక్షము లుండును. వాని ద్వారముననే లోని భాగము చూడఁగలము. తరువాత Chlorine Gas ప్రత్యేకముగాఁదయారుచేసిగాని, Electrolitic విధానమునందు ఉపలబ్ధి By-product) గా సంగ్రహించి గాని యొకకోన నుండి Chamber లో ప్రవేశపెట్టఁబడును. రెండవకోననున్న రంధ్రముగుండా లోనిగాలి పోవుచుండును. Chamber పూర్తిగా నిండిన వెంటనే Gas తోనింపుట ఆపివేయఁబడును. Gas ప్రవాహము ఆపివేసినవెంటనే గాలిపోవు రంధ్రమును మూసివేయఁబడును.

Chamber కప్పుమీఁద నొకయంచున నమర్పఁబడిన గొట్టముద్వారా Chlorine లోపలికి పంపఁబడును. అది గాలికన్న బరువైన దగుటచే మొట్టమొదట క్రిందిభాగము నావ రించి Temperature అధికమగునట్లు చేయును. Temperature 25C° కన్న నధికముగా పోకుండునట్లు జాగ్రత్తగా చూచుచుండవల యును. Chamber లోనికి అగత్యమైనదాని కన్న నధికముగ Chlorine ఎన్నఁడు పోనీయ రాదు. సున్నమంతకును నన్ని పొరలకును సమానముగా Chlorine పట్టునట్లు పెద్దగరిటెవంటి దానితో కలియఁబెట్టుచుండవలయును. Chlorine పట్టుటకు 24 గంటలకాలము పట్టును. ఈ కాలమంతయు Chamber మూసియే యుంచ వలయును. Chamber లోని Bleaching Powder తీసివేయుటకుముందు కొంచెము ముఁగ్గుసున్నము జల్లి ప్రక్కప్రక్కలను మిగిలి యున్న Chlorine తీసివేయవలయును.

ఇట్లు తయారుచేయఁబడిన Bleaching Powder డబ్బాలలో Pack చేసి రవానాకు సిద్ధపఱతురు.

**బ్లూమౌంటెన్సు** (Blue mountains) దక్షిణ దేశములందు ఉదకమండల ముండిన పశ్చిమకొండల భాగమునకు 'బ్లూ మౌంటెన్సు' అని సుప్రసిద్ధనామముగలదు. ఇట్లె యమెరికా సంయుక్తరాష్ట్రమున Oregen నందులావాచేఁ గప్పఁబడిన గ్రైనైటుపర్వతమునకు నీపేరుగలదు. దీనిపై Pine, Fir వృక్షములు, నడవులు దట్ట ముగఁ గలవు.

మఱియు న్యూ సౌతువేల్సున విభాగపు హద్దుగనున్న పర్వతముల కీపేరుగలదు. అందు యూకలిప్టసు అడవులు కలవు.

ఇంకను జమైకాద్వీపమున తూర్పు పడమర లుగా వ్యాపించియున్న పర్వతపంక్తియందుఁ గల Blue mountain peak గల పర్వత భాగమునకును బ్లూమౌంటనే పేరు సుప్రసిద్ధ మైయున్నది.

**బ్లూ స్టాకింగు** (Blue stocking)— దీనికి ఊదామేజో డని యర్థము. ఫ్రెంచిదేశపు పారిస్ నగరమున విద్యావంతులైన యధిక

తెలివి తేటలం గల్గిన యాఁడువారిసంఘములు కొన్ని కలవు. ఇంకను నిటలీదేశపు వెనిస్ నగరమునను గొన్ని స్త్రీసంఘము లిట్టివేర్పడి యున్నవి. ఇందలి సభ్యులు (వనితలు) ఊదా మేజోళ్ళను ధరించుటనుండి వారిసంఘములకు బ్లూస్టాకింగుసంఘము లని పేరు వాడుకనందెను.

**బ్లూ బుక్కులు**— బ్రిటీషుసీమయందు క్రీ. వె. 1681 సంవత్సరమున రాజకీయవాతావరణము చాల యల్లకల్లోలమై ప్రజల నమ్మకమునకుఁ బాత్రముగాకుండునంతటి గడబిడలు గల్గి ప్రజాభిప్రాయము పార్లమెంటునందు జరుగుచుండునదంతయు ప్రకటించుచుండుట నేర్పాటుజేసెను. ఆప్రకటనలు ఊదారంగు అట్టలు గల పుస్తకములందుంట వాట్లకు బ్లూబుక్కులు (Blue books) అని వాడుక గల్గెను. అవి తక్కువధరకు విక్రయింపఁ బడుచుండినవి. పార్లమెంటునందలి నిజస్థితులు ప్రజలకు వెల్లడియగుచుండఁగల్గెను. నేటికిని అట్లే యున్నది.

విదేశప్రభుత్వములతో నడపు సంగతులను తెల్లయట్టలపుస్తకములలో నుంచుట తెల్లపుస్తకములని పేరందెను. ఇంక నిట్టి పుస్తకములే యైరోపాయందలి యితరదేశపు ప్రభుత్వసభలందు జరుగుచర్యలను వివరించునవియుఁగలవు. అవి పరాసుదేశపుపచ్చపుస్తకములు (Yellow books of France) ఇటలీ గ్రీన్ బుక్కులు (Green books of Italy) మొదలగునవి.

**భృంజాయన గోత్రము**–(జమదగ్ని భిదా ఉపగణము చూడుఁడు.)

**భక్తి ౯ విధములు (నవవిధభక్తులు)**· శైవధర్మమున ౧. శ్రవణము (శివపురాణములను వినుచుండుట), ౨. కీర్తనము (శివనామసంకీర్తనము, లేక భజన సేయుట), ౩. స్మరణము (శివనామములను స్మరణచేసుకొనుచుండుట), ౪. పాదసేవనము (తీర్థమును సేవించుచుండుట), ౫. అర్చనము (శివపూజావిధి), ౬. వందనము (నమస్కారము), ౭. దాస్యము (ఉపచారములుసల్పుట), ౮ సఖ్యము (స్నేహితునియందువలె ప్రేమాసక్తులంగల్గి యుండుట), ౯. ఆత్మనివేదనము (తనసర్వమును (ప్రాణముసహా) శివునియందు శరణ్యముపొందించుట).

**భక్తిపంచకము (పంచవిధభక్తులు)** ౧. పితృభక్తి, ౨. రాజభక్తి, ౩. గురుభక్తి, ౪. దేశభక్తి, ౫. దైవభక్తి. వీటికి భక్తిపంచకమనిపేరు.

**భక్తిలేనిపూజ పత్రికిచేటు**— (ఆంధ్రలోకోక్తి). నిరర్థకకార్యమని భావము.

**భగందరము (ఆసనపవిత్రరోగము)** ఆంగ్. Fistula-in-ano. అండములకు, గుదస్థానమునకు నడుమభాగమున చిన్నకురుపువలె లేచి పక్వమై, చితికి, రసి, చీము, రక్తము స్రవించుచుండెడిజబ్బు. ఈరసితగిలినతావులందు కురుపులు లేచునంతటి దోషద్రవముగలది.

**భగవతీ నది** — నేపాళదేశమున భాగమతియనంబడునది. దీనితీరముననే పశుపతినాథ శివక్షేత్రము గలదు. ఇది బౌద్ధగ్రంథములందు బగ్గుముదా యని వివరింపఁబడినది.

**భగవంతునియం దుండు షడ్గుణములు**— (షడ్గుణములు లేక షడ్గుణైశ్వర్యములు చూడుఁడు.)

**భగవద్గీత**—(అనుగీత చూడుఁడు.)

**భగీరథప్రయత్నములు**— సగరచక్రవర్తి మునిమనుమఁడగు భగీరథుఁడు కపిలుని శాపాగ్నిచే భస్మమయిపోయిన తనపితృలోకమునకుఁ గతులుగల్పింపఁదలఁచి యాకాశగంగను భూలోకమునకుఁ దెచ్చుటకుఁగా నెన్ని ప్రతిబంధకములు దటస్థించినను పట్టినపట్టు విడువక మిక్కిలిపట్టుదలతోఁ బనిచేసి తుట్టతుదకు సాధించెను. అప్పటినుండియుఁ దానుసంకల్పించుకొనిన కార్యమున కెన్నియంతరాయములు వచ్చినను వెనుకదీయక సాధించుప్రయత్నమునకు "భగీరథప్రయత్న"మని పేరువచ్చెను.

**భగీరథ మహారాజు తపస్థానము**—(గంగానది చూడుఁడు).

**భగీరథ మహారాజు**—ఇక్ష్వాకుసంతతి. సూర్యవంశ క్షత్రియుఁడు. తండ్రి అంశుమంతుఁడు. పితామహుఁ డసమంజసుఁడు. కుమారుఁడు శ్రుతుఁడు. ఇతనికిఁ గృతుఁడు లేక సుహోత్రుఁ డన్నిపేరులు వాడుక గలదు. భగీరథుఁడు తపంబొనర్చి గంగను భూమికిఁ దెచ్చినవాఁడు. (సగర చక్రవర్తి చూడుఁడు. భగీరథుఁడు తపంబొనర్చిన తావులఁ గూర్చి భాగీరథి చూడుఁడు. గంగానది చూడుఁడు. మహారాజులు చూడుఁడు.)

**భగుఁడు**- ద్వాదశాదిత్యులలో నొకఁడు. దక్షాధ్వరధ్వంసమున వీరభద్రస్వామి యీతని నేత్రములఁ బెరికెనని చెప్పఁబడినది.

**భగ్గా వెలుగా**-(ఆంధ్రభాషాసాంప్రదాయార్థపదము) చేతఁగానియప్రయోజకునిచే నిర్వహింపఁబడు కార్యము భగ్న మగుటం దెల్పుతరిని నిరసన, వంచనలతో నీప్రయోగముఁ జేయుచుందురు.

**భగ్గోలాశాఖ క్షత్రియులు**-(క్షత్రియకులము చూడుఁడు.)

**భజమానుఁడు**—ఈతనిఁగూర్చి సిసలుగఁ జెప్ప వీలుగాకున్నది. ఈతనిసుతుఁడు భోజుఁడనియు, తండ్రి కుంతిభోజుఁడనియు నొకచోఁ గానవచ్చెడిని. ఈతనిసుతుఁడగు భోజునకు సుతుఁడు హృదికుఁడనియుఁ జెప్పఁబడినది.

వేరొకచోట భజమానుఁడు సాత్వతుని సుతుఁడనియు, నిర్వురు భార్యలనియు, నందు మొదటిభార్యవలన ౧ నిమ్లోచి, ౨ కింకణుఁడు, ౩ వృష్ణి యను ముగ్గురు సుతులనియు, రెండవభార్యవలన ౧ శతాజిత్తు, ౨ సహస్రాజిత్తు, ౩ అయుతాజిత్తు అను ముగ్గురుసుతులు గలరనియుఁ జెప్పఁబడినది.

ఇంకను కుంతిభోజుని సోదరుఁడగు సంఘాతుని జ్యేష్ఠపుత్రుఁడు భజమానుఁడని చెప్పఁబడినది. కాని మఱియేమియుఁ దెలియరాదు.

**భటగ్రామము (భటపురము)**—దీని నిప్పుడు నేపాలభాషయందు భాట్గాఁ అనుచున్నారు. కొందఱు దీనిని (భటులు-సైన్యము) భటగ్రామమనియు, మఱికొందరు భగత్పట్టణమనియుఁబోల్చుచున్నారు. నేపాల దేశములోని యొకభాగమున కొకప్పుడు రాజధానిగ నుండినది. ఇట రాజ్యమేలిన నరేంద్రదేవుఁ డను భూపతి నేపాలభూమియం దప్పుడు గల్గియుండిన ద్వాదశవర్షమహాక్షామమునువారింప కామరూపదేశమునుండి సింహనాథుఁ డను పేరుగల యొకసిద్ధుని తీసుకొనివచ్చెనఁట. ఆతఁడు క్షామనివారణఁ గల్పించెనఁట. ఆసిద్ధుఁడే యవలోకితేశ్వరుఁ డను పేరుగల (సింహనాథలోకేశ్వరుఁడు) పద్మపాణిబోధిసత్వుఁడఁట. కామరూపదేశమందలి పూతలకాపర్వమునుండి నేపాళములోని యవితపురమునకుఁ దీసికొనివచ్చెనని కొందరు బైలదేరఁదీసి యున్నారు).

బౌద్ధమత షడక్షరీ మంత్రము "ఓం మణీ

పద్మహం” అనునది పద్మపాణి బోధిసత్త్వప్రీతి పాదకమంత్రమేనఁట.

**భట్టాచార్యుఁడు** — ఈవిద్వాంసుఁడు వార్త్తికమురచించినవాఁడు. మరియు నీతనిమతమునకు భాట్టమతమనిపేరు. ఇది కర్మవాదిమతముఁబోలియించుక భేదముతోనుండును. (పూర్వమీమాంసామతము చూడుఁడు). ఈయనకుఁ ప్రభాకరుఁ డనునాయన శిష్యుఁడు. ఈతఁడు ప్రాభాకరమతకర్త్త.

**భట్టుమూర్తి (మూర్తిరాజు)కవి**-ఆంధ్రకవులలో మధ్యకవులందుఁ బరిగణింపఁ బడినవాఁడు. ఈతనిఁ దరుచుగా రామరాజభూషణుఁడును భట్టుమూర్త్తియు నొకఁడేయని పెక్కండ్రు పొరబడుచుందురు. ఇటీవలి పరిశీలనలవలననిర్వురను వేఱనియు, నిద్దరుఁ బినతండ్రి పెదతండ్రి కుమాళ్లనియుఁ దేలినది.(రామరాజభూషణుఁడు చూడుఁడు. ప్రబంధాంకమువారి వంశావళి చూడుఁడు.) వీరింటిపేరు ప్రబంధాంకమువారు. తండ్రిపేరు వేంకటరాయభూషణుఁడు. తాత తిమ్మరాజు. పెద్దతండ్రి సూరపరాజు. పెద్దతండ్రికుమారుఁడు రామరాజభూషణుఁడని బిరుదమందిన మూర్త్తిరాజు (వసుచరిత్రకర్త్త.)

ఈకవి రచించినది కావ్యాలంకారసంగ్రహమనఁబడు నరసభూపాలీయము. దీనిని (ఆర్వీటి బుక్కరాజవంశావళి చూడుఁడు.) నరసింహరాజునకుఁ గృతియిచ్చెను. కృతిపతియింటిపేరు గొబ్బూరివారు.

ప్రబందాంక సింగరాజు వంశావళి.

భట్టుమూర్త్తి (మూర్త్తిరాజు) నరసభూపాలీయ గ్రంథకర్త్త. రామరాజభూషణుఁడు(వసుచరిత్ర, హరిశ్చంద్రనలోపాఖ్యానకర్త్త.)

(వీరిద్దరు పినతండ్రి పెదతండ్రి కుమాళ్ళు) ఇంటిపేరు ప్రబంధాంకమువారనిబిరుదనామము.




**భట్టోజి దీక్షితుఁడు**—పాణినీయ వ్యాకరణసూత్రములను సిద్ధాంతకౌముదిగ ప్రకరణములు విభజించి గ్రంథముగ నొనర్చిన పండితుఁడు. ఇతఁడు గౌడబ్రాహ్మణుఁడఁట.

**భద్రకర్ణము**— దీనికిఁ గర్ణపుర మనియు, కర్ణాళియనియుఁ బేర్లుగలవు. నర్మదానదిదక్షిణతీరమున నున్నది. ఇటఁ బ్రసిద్ధశివలింగము గలదు. దీనిఁగూర్చి మహాశివపురాణప్రథమ పటలమందు ౧౫ అధ్యాయమునను, మహాభారతము వనపర్వము ౮౪ అధ్యాయమునను ప్రశంసలు కలవు. ఇది భద్రకర్ణక్షేత్రము. నర్మదానదియందు నదీసంగమమొకఁడ నున్నది. నదీసంగమమును భద్రకర్ణతీర్థమనియు నందురు.

మఱియు కతియవాడు దేశమునఁ ద్రినేత్రేశ్వరమనంబడు తావున భద్రకర్ణహ్రదము (సరస్సు)కలదు. ఇటశివలింగమునకుఁ ద్రినేత్రేశ్వరుఁడనిపేరు. ఇప్పటిపేరు తాన్. దీనింగూర్చి కూర్మపురాణ ౧౩౪ నందునను, స్కాందపురాణప్రభాసఖండమున నర్బుదమాహాత్మ్యము ౮ అధ్యాయమునను ప్రశంసలుగలవు.

**భద్రకర్ముఁడు**-శుక్రాచార్యపుత్రుడు. చండామార్కుని సోదరుఁడు. (చండామార్కుఁడు చూడుఁడు).

**భద్రగజము**- (గజలక్షణము చూ.)

**భద్రచారుఁడు**— అత్రి చంద్ర యాదవ క్షత్రియుఁడు. తండ్రి శ్రీకృష్ణుఁడు. తల్లి రుక్మిణీదేవి. సోదరులు ప్రద్యుమ్నాదులు. (శ్రీకృష్ణుఁడు చూడుఁడు).

**భద్రతిథులు**—శుక్లపక్షమునందు షష్ఠి సప్తమి, అష్టమి, నవమి, దశమి తిథులు భద్ర తిథు లనఁబడును.

**భద్రభూపాలుఁడు** క్రీ. శ. ౧౧౫౦ సంవత్సరమునాటివాఁడని తెలుచున్నది. పాశ్చాత్యచాళుక్యులలో భువనైకమల్లుఁ డనునృపతికిఁగప్పముఁగట్టు సామంతరాజు. కృష్ణానదీతీరమందలి యాఱువేల గ్రామములఁ బాలించుచుండు భూపాలుఁడు. రాజరాజమనోజ దశదిశాభరణాంక నరేంద్రచతురానన కవిబ్రహ్మ కవిరాజశిఖామణి యనుబిరుదములుగలవాఁడు.

ఈతఁడు రచించినది సుమతీశతకము, నీతిశాస్త్రముక్తావళి యనఁబడునవి. ఈతనికవిత్వము ద్రాక్షాపాకము. చక్కని భావగర్భితము. సరళధార. సూర్యవంశక్షత్రియుఁడని తెలియుచున్నది.

**భద్రబాహువు**-యదుసంతతి. చంద్రవంశ క్షత్రియుడు. వసుదేవుని సుతుఁడు. సోదరుఁడు సుభద్రుఁడు, భద్రుఁడు.

మఱియు జైనమతగురువులలో భద్రబాహు వొకఁడుగలఁడు. (దిగంబర శ్వేతాంబర విభేదములు చూడుఁడు).

**భద్రమండలము**- దీనిని భద్రదమండలమనియు నందురు. భద్రకరమైన రంగవల్లి (ముగ్గు) యని యర్థము. దీనింగూర్చి యాగమములందిటులఁ జెప్పఁబడినది.

శ్లో॥ క్షేత్రే తేన పదవీక్షితే వపదే మధ్యే లిఖే
త్కర్ణికామ్।
కింజల్కాన్విత మష్టపత్రసహితం పద్మం
తదభ్యగ్రకే।
వేదాశ్రాస్థిత కోష్టకాని మతిమాన్ సంత్యజ్య
శిష్టేషు సత్।
కోణే ష్వష్టసరోరుహాణి విలిఖేత్ స్యా
ద్భద్రదమ్మండలమ్॥



అనఁగా నేకు పొడవు, నేడు వెడలువు గలి నలుబదితొమ్మిది గదులంగల్గిన చౌకమునందు నడుమనున్న తొమ్మిదిగదులందు కింజల్కసహితమగునష్టదళపద్మములిఖించి, దానికిపైని క్రిందను కుడియెడమ వైపులందున్న నాల్గు మధ్యగదులను వదలి, తక్కినగదులందు గది కొక్కటిమేరకు ముప్పదియా రష్టదళపద్మములు చిన్నవి లిఖింపవలయును. ఇది భద్రమండల మనఁబరఁగును.

**భద్రముస్తలు**—(నాగముస్తలు చూ.)

**భద్రయాచారి కవి**— (రుద్రయ్యకవి) ఆంధ్రకవులలో మధ్యకవులందు బరిగణింపఁ బడినవాఁడు. విశ్వబ్రాహ్మణుఁడు. ఈతనిఁగూర్చి సరిగాఁ దెలియదు. భద్రయ్య, రుద్రయ వేరని కొందరును, నిద్దరు నొకరే యని కొందరును దలంచు చున్నారు. రుద్రయ్యకవి గుంటుపల్లి

భాస్కరునికడ నుండినశవి యని యప్పశవి యభిప్రాయపడియున్నాఁడు.

రచించినది సరసమనోరంజన మనుప్రబంధము భద్రియపేరిటను సునందాపరిణయము, నిరంకుశోపాఖ్యానము రుద్రియ్యపేరిట నున్న వందురు. ఒకవేళ "భ" అక్షరము "రు" అక్షరము పొరపాటుగ లేఖకప్రమాదజనితమై మారినను మారనోపు. ఏదియెట్లైనను పరిశరములు లేవుగాన దీని నిర్ణేవదలఁదగునని తేలుచున్నది. భద్రియ్యయింటిపేరు తెలియదు. రుద్రియ్య యింటిపేరు కందుకూరివా రని చెప్పఁబడినది. ఇద్దరు విశ్వబ్రాహ్మణులే.

క్రి. వె. ౧౬౨౦ ప్రాంతమువాఁడని రావుబహద్దూర్ కందుకూరి వీరేశలింగం పంతులువారభిప్రాయపడియున్నారు.

**భద్రరథుఁడు**—అంగభూపతి. చంపుని పౌత్రుఁడు. కుమారుఁడు బృహత్కర్ణుఁడు.

**భద్రవతీపురము**—మహాభారతప్రసిద్ధమగునీపురము మధ్యరాష్ట్రములలోని చాందాపురమునకు వాయవ్యదిశగా ౧౮ మైళ్ల దూరమున నిప్పుడు భండాకనుపేరఁ బరఁగుచున్నది. ఇది శ్యామకర్ణాశ్వముకొఱకైన యుద్ధముచే పేరందినదఁట. భీమసేనుఁడీయుద్ధముననశ్వముఁ గొనిపోయె నఁట. కొండవద్ద భీమపాదము జూపుదురు.

**భద్రసేనుఁడు**—యదుసంతతి,చంద్రవంశక్షత్రియుఁడు. తండ్రి మహిష్మంతుఁడు.

**భద్రాచలము(శ్రీరామక్షేత్రము)**-ఆంధ్రదేశమునం దిది యొక సుప్రసిద్ధయాత్రాస్థలము. నిజామునంస్థానరాజ్యమునఁ జేరియున్నది. భద్రగిరి యనుకొండపై శ్రీరామాలయ మున్నది. ఆదిని శ్రీరామలక్ష్మణులు సీతాదేవిని వెదకుచు నిట గోదావరినదిం దాటిరఁట. ఇటీవలఁ గొందరు పరిశీలకులు క్రొత్తగా డెముచుట్టునుండు నరణ్యమును దండకారణ్యమనియు, నిదియే పంచవటి యుండినతావనియు, నిటనే వారి (విడిది) పర్ణశాల యుండెననియు, నిదియే యీ పవిత్రస్థల మనియుఁ గొంతవాదు కను సాగించి యూరకుండిరి. ఈప్రాంతముల కొన్నితావుల కాపేర్లుగూడఁ గలవు. ఇక్కాలమున శ్రీరామనవమి (చైత్రశుద్ధ నవమి) ని శ్రీరామ సీతాకళ్యాణము వైభవోపేతముగ జరుపుచున్నారు. అత్తరి నేబదివేల యాత్రస్థులేతెంచఁ దర్శనయాత్రియు గౌతమీనదియందు స్నానతీర్థమును రొక్కటమై జరుగును. అప్పటి తలంబ్రాలు(బియ్యము) నిండ్లకుఁబ్రసాదమో యనునట్లు గొంపోవుదురు. ఈ దేవాలయ స్థానాధిపత్యము బోరగంపాడు తహశీలుదారుగారిది. ఆయన నైజాంప్రభుత్వపు తహశీలుదారు. గోదావరి శవ్వలితీరమున బోరగంపాడునం దుండువాఁడు.

ప్రధాన దేవళమున శ్రీరామ లక్ష్మణ సీతా భరతశత్రుఘ్న విగ్రహములు పూజింపఁ బడుచున్నవి. ప్రధాన దేవళముఁ జుట్టి ప్రాకారమున నిరువదినాల్గు చిన్న దేవళములును, గొన్ని మంటపములు, ప్రాకారములు, నిరివిగఁ గట్టఁబడినవి. ఇవి యన్నియు గోపరాజు గోపన్న యను నైజాం ప్రభుత్వోద్యోగి నిజాంప్రభుత్వపు ధనాగారము (బొక్కసము) నుండి భక్తిపరవశుఁడై యనధికారముగ వ్యయపఱచి కట్టించెనఁట. దానిం దెలిసి తానీషాప్రభుఁ డీతని బంధింప, శ్రీరాముఁ డామూల్యముఁ జెల్లించెనని రామదాసుచరిత్రయందుఁ జెప్పఁబడినది.

ఈకథన మెంతవరకు విశ్వసనీయమైనను, దేవాలయమునందా రామదాసు(గోపన్న)గారి విగ్రహము గలదు. మఱియు నారులక్షలరూప్యము లీకట్టడములకై యాయన వ్యయపఱిచె

నని బలముగు వాడుక గలదు. ధనవంతమగు దేవస్థానమై యాత్రికాలమున వైభవోపేతమై శ్రీరామభక్తులచే నారాధితమై తనరారుటయందే సంశయమును లేదు.

భద్రాచలమున కరుగఁ బెక్కుమార్గము లున్నను నందు రెండుప్రధానములుగ నున్నవి. బెజవాడయందు H.E.H. The Nezams State Railway నెక్కి డోర్నకలుసంధి యందు బండిమార్చుకొని కొత్తగూడెముమీఁదుగా భద్రాచలంరోడ్డు స్టేషనునందుదిగి యటనుండి మోటారుబండ్లపై బోరగంపాడున కరుగుదురు. అది గోదావరినదికి దక్షిణతీరమం దున్నది. తహస్సీలుదా రుండుతావు. అటనుండి పడవలపై నదిదాటి యుత్తరఁపుగట్టుననే యున్న భద్రాచలమునకుఁ జేరుదురు. ఇంకను రాజమహేంద్రవరముననే గోదావరిజలములందే పడవలలోఁగాని చిన్నస్టీమరులందుఁగాని పయనమొనర్చుచు భద్రాచలమునకరుగుచుంట.

**భద్రాద్రి గోత్రము**— (భరద్వాజ ఉపగణము చూడుఁడు.)

**భద్రాదేవి**—వసుదేవునిభార్య. ఈమెకుఁ గౌసల్యయనియుఁ బేరుకలదు. మఱియుఁగృష్ణునిభార్యలలో కేకయరాజపుత్రి యొకభద్రాదేవికలదు. ఇంకను దుర్గకు భద్రయని నామము గలదు. ఆమెను భద్రకాళి యనియు నందురు. దక్షయజ్ఞమునకు పూర్వము దాక్షాయణియనఁ బరగిన సతీదేవి (గౌరీదేవి) దక్షపుత్రికయైబరగి యాతనిశివద్వేషమునకు వీరభద్రస్వామి దక్షు నిశిక్షించి యాగవిధ్వంస మొనర్ప, నీమెయు నాతనిసంబంధము వీడి యాదేహము వదలెను. పిదప హిమవంతునికడఁ బెరిగి హైమవతియనియు బర్వతరాట్పుత్రిగాన పార్వతియనియుఁ బేర్లం బరగెను.

**భద్రానది**—దీని నిప్పుడు యార్కండునది యనుచున్నారు. ఈనదీతీరముననే యార్కండనుపురము గలదు. దానిని స్వదేశస్థులు జరష్టా ననియు నందురు. దీనింగూర్చినప్రశంస విష్ణుపురాణమున ౨ అధ్యాయమునఁ గలదు.

భాగవతమున ౫-౧౭ యం దీభద్రానది గంగానది విభజింపఁబడిన నాలుగు శాఖలలో నొకటియని తెల్పుచున్నది.

**భద్రావతీపురము (భద్రవతీపురము)** పాంచాలములోని పిండ్దాదన్ఖాను పురముకడ (జీలమ్‌జిల్లా) ఇప్పుడు బౌరి లేక బుఆరీ యనంబడు గ్రామము) పురాతనపు భద్రవతీపురముగాఁ బోల్చియున్నారు. ఇచటఁ బెక్కు పాడుపడినయానవాళ్లు గలవు.

పద్మపురాణోత్తర 30 వ అధ్యాయమున భద్రావతి సరస్వతీతీరదేశపురముగను, జైమినీ భారతము ౬ అధ్యాయమున భద్రావతి హాస్తినాపురమునుండి ఇరువది యోజనములదూరము ననియుఁ జెప్పఁబడినవి.

పెక్కండ్రు పెక్కువిధముల నీ భద్రావతిని వేర్వేఱుతావులఁ బోల్చి యనుమానములఁ జూపియున్నారు.

**భద్రాసనము**-యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి.

అండములకడ రెండునరికాళ్ళను జోడించి కూర్చుండి చేతులను సిద్ధాసనమునందు వలెనే నాభికడ నొక యరచేయి తిరుగవైచి దానిపై రెండవ అరచేయి వైచుట భద్రాసనమనియు, దీనియభ్యాసము కఠినమైన యాసనములు వైచిన గల్గుశ్రమను నివారించుననియుఁ జెప్పఁబడినది.

**భద్రికాపురము**— ఇప్పుడు భదేరియా యనుచున్నారు. (అంగదేశము చూడుఁడు.)

భాదీయనగరమని పేరుండెను. బుద్ధభగవానుని శిష్యురాలై పెక్కండ్రను బౌద్ధమతము నవలంబిం జేసిన విశాఖాదేవిజన్మస్థానము.

**భద్రిణ గోత్రము** - (విష్ణువృద్ధోపగణము చూడుఁడు).

**భదోరియా క్షత్రియులు** — (చౌహానులు చూడుఁడు.)

**భమంష్టిగోత్రము**-(భీమశిష్టకులగోత్రము చూడుఁడు.)

**భయ**— హేతిభార్య. విద్యుత్కేశునితల్లి. ఒకరక్షస్త్రీ.

**భయము.** భయము మనస్సునందుఁగలు బలహీనత. అసహాయతవలనఁగలు నిరాశయు నేయుండును. దీనికిఁ గారణ మన్యులు బలాఢ్యులై తన్ను వంచింపనో, ఆపదపాల్సేతు నినియో తోఁచి, యెదుర్కొనుటకుఁ గాని, తప్పించుకొనుటకుఁ గాని వీలు చాలదని నిరాశ జెంది, యేది రానున్నదో రానిమ్మని యూరకుండుటకు భయముపరిణామము ఇట్టివాటిని instincts అనియాంగ్లపరిశీలకులనుచున్నారు. ఇందలి విచిత్రము భయమునుండి నడచుకార్యములు, యోచన, యూహలనుండి గాక, భీతి నుండియే నడుపఁబడుచుండు ననియు, భీతితత్పూర్వగా నుండినయదనున యోచన పైకొని నడపు చుండుననియుఁ దలంపఁ బడుచున్నది. సర్వసాధారణముగ భయములు యదార్థములే యై యుండుం గాని, ఒక్కొకతరి యనవసరముగ భయముకల్గుటయుఁ గలదు. సదా భీతిగల్గియుండుట యొకజబ్బుగాఁ దలంపఁబడుచున్నది.

**భయాష్టకము (అష్టభయములు)**- బౌద్ధమతధర్మమున:—

౧. విషజంతువులవలన భయము. (పాములు, తేళ్ళు మొదలగునవి.)

౨. ఆయుధములవలన భయము. (దుష్టుల ఆయుధములనిభావము).

౩. చోరభయము(దొంగలవలనభయము.)

౪. మృగభయము(ఏనుగులు,సింహములు, పశువులు పొడుచుట మొదలగుభయములు).

౫ క్రూరభయము- క్రూరమృగము లగు పులులు మొదలగు జంతువులు, మతసహనము లేని క్రూరులు మొదలగువారి భయము.

౬ అగ్నిభయము-(ఇందు కాలుట మొదలగునవి.)

౭. జలభయము- నీటి ప్రవాహములు, వరదలు,తుపానులు, నుప్పెనలు మొదలగుజలప్రళయమునుండి భయము.

౮. వాయుభయము- ప్రళయప్రచండవాయువులవలనఁ గల్గెడి భయము.

**భరణి నక్షత్రము**—ఆకసమునఁ ద్రికోణాకారమున నుండు మూడు నక్షత్రముల సముదాయము. భరతదేశపు జ్యోతిశ్శాస్త్రమునందు దీనికి యమః,యమసంజ్ఞికః,యామ్యః, అంతకః, యమమాటలను బర్యాయపదములుగ వాడియున్నారు.

యముఁ డధిదేవతయనియు, మనుష్యగణనక్షత్రమనియు, అధోముఖనక్షత్ర మనియు, స్త్రీస్వభావమనియు,ఏనుఁగు, కాకి, ఉసిరికచెట్టు దీనిసంబంధము లనియు,భరణి ప్రవేశించినపిదప నిఱువదినాల్గు ఘటికలపై త్యాజ్యము (దోష ఘటికలు) ను, నలువది యెనిమిది ఘటికలపై నమృత ఘటికలనియు, నిది క్రూరస్వభావ నక్షత్రమనియుఁ జెప్పఁబడినది.

# భరతదేశపు జాతీయమహాసభ అధ్యక్షులు

| సం॥రము | స్థలము. | అధ్యక్షుని పేరు. |
|---|---|---|
| 1885 | బొంబాయినగరం | డబ్లియు సి. బెనర్జీగారు |
| 1886 | కలకత్తా | శ్రీయుత దాదాబాయి నౌరోజిగారు |
| 1887 | మద్రాసు | బదురుద్దీన్ తయ్యాబ్జిగారు |
| 1888 | అలహాబాదు | యూల్ గారు |
| 1889 | బొంబాయినగరం | సర్. విలియం వెడర్బర్న్ గారు |
| 1890 | కలకత్తా | సర్. ఫిరోజషా మెహతాగారు |
| 1891 | నాగపూర్ | శ్రీయుత పి. ఆనందాచార్యులుగారు |
| 1892 | అలహాబాదు | డబ్లియు. సి. బెనర్జీగారు |
| 1893 | లాహోరు | శ్రీయుత దాదాబాయి నౌరోజిగారు |
| 1894 | మద్రాసు | శ్రీయుత ఆల్ఫ్రెడ్ వెబ్ గారు |
| 1895 | పూనా | శ్రీ సురేంద్రనాథ బెనర్జీగారు |
| 1896 | కలకత్తా | మహమ్మదు రహిముతుల్లా సయానిగారు |
| 1897 | అమరోటి | సర్. సి. శంకరనాయరుగారు |
| 1898 | మద్రాసు | ఆనందమోహనబోసుగారు |
| 1899 | లక్నో | రమేశచంద్రదత్తుగారు |
| 1900 | లాహోరు | యన్. జి. చంద్రసర్కారుగారు |
| 1901 | కలకత్తా | డి. యి. వాచాగారు |
| 1902 | అహమదాబాద్ | సురేంద్రనాథ బెనర్జీగారు |
| 1903 | మద్రాసు | లాల్ మోహన ఘోష్గారు |
| 1904 | బొంబాయి | సర్. హెన్రీ కాటన్ గారు |
| 1905 | కాశీ | గోపాలకృష్ణ గోక్లేగారు |
| 1906 | కలకత్తా | దాదాబాయి నౌరోజిగారు |
| 1907 | సూరత్ | డాక్టరు. రసవిహారఘోష్ గారు |
| 1908 | మద్రాసు | డాక్టరు. రసవిహారఘోష్ గారు |
| 1909 | లాహోరు | పండిత మదనమోహన మాలవ్యాగారు |
| 1910 | అలహాబాద్ | సర్. విలియమ్ వెడర్ బరన్ గారు |
| 1911 | కలకత్తా | పండిత బిషన్ నారాయణధార్ గారు |
| 1912 | బాంకిపూర్ | ఆర్. యన్. మథోల్కరుగారు |
| 1913 | కరాచీ | నవాబు సయ్యద్ ముహమ్మదు బహదూర్ గారు |
| 1914 | మద్రాసు | భూపేంద్రనాథబోస్ గారు |
| 1915 | బొంబాయినగరం | సర్. సత్యేంద్ర ప్రసన్న సిన్హాగారు. |

| సం॥రము. | స్థలము. | అ. |
|---|---|---|
| 1916 | లక్నో | ఆనరబుల్ బాబు అంబికాచరణమజుందారుగారు |
| 1917 | కలకత్తా | బిసెంటమ్మగారు |
| అవసరకాంగ్రెసు | బొంబాయినగరం | శ్రీ హసన్ ఇమాముగారు |
| 1918 | ఢిల్లీనగరం | పండిత మదనమోహన మాలవ్యాగారు |
| 1919 | అమృతసరం | పండిత మోతీలాలు నెహ్రూగారు |
| అవసరకాంగ్రెసు | కలకత్తా | లాలా లజపతిరాయ్‌గారు |
| 1920 | నాగపూర్ | సేలం విజయరాఘవాచార్యులుగారు |
| 1921 | అహమ్మదాబాద్ | హకిం అజమల్ ఖానుగారు (జైలునందున్న సి. ఆర్. దాసుగారికిగాను) |
| 1922 | గయ | చిత్తరంజనదాసుగారు |
| అవసరకాంగ్రెసు | ఢిల్లీ | మౌలానా అబుల్ కలామ్ అజద్‌గారు |
| 1923 | కాకినాడ | మౌలానా మహమ్మదాలీగారు |
| 1924 | బెల్గాము | మహాత్మాగాంధిగారు |
| 1925 | కాన్పూర్ | శ్రీమతి సరోజనీదేవిగారు |
| 1926 | గౌహాతి | శ్రీమాన్ యస్. శ్రీనివాస అయ్యంగారు |
| 1927 | మద్రాసునగరం | డాక్టరు. యమ్. ఏ. అన్సారీగారు |
| 1928 | కలకత్తా | పండిత మోతీలాల్ నెహ్రూగారు |
| 1929 | లాహొరు | పండిత జవహరులాలు నెహ్రూగారు |
| 1931 | కరాచి | సర్దార్ వల్లభభాయి పటేలుగారు |
| 1932 | ఢిల్లీనగరం | సేఠ్ రంఛోడ్‌లాల్ అమృతలాల్ గారు |
| 1933 | కలకత్తానగరం | జె. యమ్. సేన్‌గుప్తాసతిగారు |
| 1934 | బొంబాయినగరం | శ్రీయుత రాజేంద్రప్రసాదుగారు |

**భరతదేశఁపు పురాతనఁపు శతఘ్ని (ఫిరంగి)**-దీనినిప్పుడు జెంజెమా యని వాడుచున్నారు. చరిత్రమేరకు కడుపురాతనమైనదిగా తలంపఁబడుచున్న శతఘ్ని. పంజాబు దేశమందలి లాహొరుపట్టణమున సెంట్రలుమ్యూజియమున భద్రపర్చియున్నారు. బండిపైననే అమర్పంబడి నిల్వయుంచఁబడియున్నది. పానీపట్టుయుద్ధమునందిది పనిచేయుట చరిత్రకుఁ దెలిసినవిషయము అంతకుపూర్వఁపు సంగతి యెఱుకరాదు.

**భరతదేశప్రభుత్వములు**- భరతదేశమాంగ్ల సామ్రాజ్యములోనిది. దీనిని హిందూదేశమనియు నందురు. ఆంగ్లమున దీని కిండియా యనిపేరు. తొల్లింట భరతుఁడను రారాజుచే పాలింపఁబడుట భరతవర్షమనిపేర్వడసి రానురా నామాట భరతదేశముగా మాఱి యున్నది.

రాజకీయముగా నిండియాదేశము కొంత బ్రిటిషుపాలనమునను, కొంత స్వదేశసంస్థానములపాలనమునను పరిపాలింపఁ బడుచున్నది. బ్రిటీషుఇండియా వైస్రాయి, గవర్నరులు వీరిచే పరిపాలింపఁబడుచు బ్రిటీషు పార్లమెంటు శాసనవిధికి లోఁబడియున్నది. స్వదేశ సంస్థానములు, వాటివాటిసంస్థానాధిపతులగుప్రభువులచేపాలిం

 భరతదేశప్రభుత్వములు

పఁబడుచు బ్రిటిషు ప్రభుత్వమునకు లోఁబడి పాలన నడపఁబడుచున్నవి. బ్రిటిషు ఇండియా బంగాళము,బొంబై, మద్రాసు రాజధానులుగ గలిగిన ప్రెసిడెన్సీలుగను, పంజాబు, సంయుక్త రాష్ట్రములు, మధ్యరాష్ట్రములు,పశ్చిమోత్తర పరగణాలుగను, కొన్ని యేజన్సీ భాగములుగను, ఆసాం మొదలగు భాగములుగను, విభజింపఁబడి పరిపాలన నందుచున్నవి.

ఇంక స్వదేశసంస్థానములు పెక్కు గలవు. ఇందుఁ గొన్ని పెద్దరాజ్యములుగను, గొన్ని చిన్నవిగను, గొన్ని యత్యల్ప వైశాల్యము గల విగను గూడ నున్నవి. ఇఁదు పేరందినవి డెబ్బదియారు కలవు.

౧. హైదరాబాదురాజ్యము-- దీనిని నిజాము రాజ్య మనియు నందురు. దీనిని బాలించు ప్రభువునకు "నిజాముల్ ముల్కు" అను బిరుదనామము గలదు. 82698 చతురపుమైళ్ళ వైశాల్యముగల రాజ్యము. 12471770 జనసంఖ్య. ప్రధాననగరము హైదరాబాదు.

౨. బరోడారాజ్యము-దీనిని బాలించుప్రభువునకు "గైక్వాడు మహారా"జని బిరుదనామము గలదు. ౮౧౮౨ చతురపుమైళ్ల వైశాల్యము. ౨౧౨౧౮౭౫ జనసంఖ్య. ప్రధాననగరము బరోడాపురము.

౩. గ్వాలియరురాజ్యము- దీనిఁబాలించు ప్రభువునకు "సింధియామహారా"జని బిరుదనామముగలదు. ౨౬౩౮౨ చతురపుమైళ్ల వైశాల్యము. ౩౧౯౫౪౭౬ జనసంఖ్య. గ్వాలియరుపురము ప్రధాననగరము.

౪. కాశ్మీరరాజ్యము-- జమ్మురాజ్యమును దీనితోఁగల్పి యొకేప్రభుత్వముగఁ బరిపాలింపబడుట, నీ దేశభూపతికి జమ్ము కాశ్మీరమహారా జని బిరుదనామముగలదు. ౮౦౦౦౦ చతురపుమైళ్ళవైశాల్యము. ౩౩౨౨౦౩౦ జనసంఖ్య. శ్రీనగరము రాజధాని.

౫. మైసూరురాజ్యము- దీనిఁ బాలించుప్రభువునకు"మహారా"జని బిరుదనామముగలదు. ౨౯౪౬౦ చతురపుమైళ్ల వైశాల్యము. ౫౮౫౯౯౫౨ జనసంఖ్య. ప్రభుత్వకార్యాలయముండుతావు బెంగుళూరు. మహారాజు నివసించు రాజధాని మైసూరుపురము.

౬. భూపాలరాజ్యము-దీనిఁ బాలించుప్రభువునకు "నవా"బని బిరుదనామము గలదు. ౬౯౦౨ చ॥ మైళ్ల వైశాల్యము. ౬౯౨౪౪౮ జనసంఖ్య. భోపాలుపురము ప్రధానస్థానము.

౭. ఇఁడోరురాజ్యము-దీనికి హోల్కారు రాజ్యమనియుఁ బేరు కలదు. దీనిఁ బాలించు ప్రభువునకు 'మహారాజా హోల్కారు' రను బిరుదము గలదు. ౯౫౧౯ చతురపుమైళ్ళ వైశాల్యము. ౧౧౫౧౫౯౮ జనసంఖ్య. ప్రధాననగరము ఇండోరు.

౮. కలాత్ (Kalat) రాజ్యము- దీనిం బాలించుప్రభువునకు 'ఖాన్' అనియు, 'వాల్' అనియు బిరుదములుగలవు. ౫౪౭౧౩ చతురపుమైళ్ళ వైశాల్యరాజ్యము. ౩౦౦౫౪౩ జనసంఖ్య. బెలూచిస్థానములోని కలాత్ పురము (కలట్) రాజధాని.

౯. కొల్హాపురరాజ్యము- బొంబైరాజధాని సరిహద్దులకుఁజెందిన చిన్నరాజ్యము. రాజవంశము శివాజీయొక్క సంతతియని చెప్పఁబడుచున్నది. ౩౨౧౭ చతురపుమైళ్ళ వైశాల్యము. ౮౩౩౭౨౦ జనసంఖ్య. కొల్హాపురము ప్రధానస్థానము. ఇదియె పరిపాలకుఁడగు మహారాజు వసించుతావు. వీరికి ఛత్రపతి యని బిరుదము.

౧౦. ఉదయపూరురాజ్యము-దీనిని మేవారురాజ్యమనియు నందురు. దీనిఁ బాలించు

ప్రభువునకు 'మహారా' జనియు, 'మహారాణా' యనియుఁ బిరుదులు కలవు. ౧౨౬౯౧ చతురపుమైళ్ళవైశాల్యము. ౧౩౮౦౦౬౩ జనసంఖ్య. ఉదయపూర్ రాజధాని. వీరు శ్రీరాముని సంతతివార మందురు.

౧౧. తిరువాన్కూరు రాజ్యము- దీనిని మళయాళరాజ్య మనియు నందురు. దీనిని బాలించుప్రభువునకు మహారా జనియు, పద్మనాభదాస యనియు బిరుదములు గలవు. ౭౬౨౫ చ॥మైళ్ళ వైశాల్యము. ౪౦౦౬౦౬౨ జనసంఖ్య. ప్రధానస్థానము తిరుఅనంతశయనము (Travancore తిరువాన్కూరు).

౧౨. బహావల్పూర్ రాజ్యము-దీనిఁ బాలించు ప్రభువునకు నవాబను బిరుదము గలదు. ౧౫౦౦౦ చ. మై. వైశాల్యము ౭౮౧౧౯౧ జనసంఖ్య. ప్రధానస్థానము భావల్పూర్.

౧౩. భరతపూర్ రాజ్యము-దీనిఁ బాలించు ప్రభువునకు మహారా జనుబిరుదము గలదు. ౧౯౯౩ చ. మై. వైశాల్యము. ౪౦౬౪౩౭ జనసంఖ్య. ప్రధానపురము భరతపూర్.

౧౪. బికనీరురాజ్యము-దీనిఁబాలించు ప్రభువునకు మహారాజనుబిరుదముగలదు. ౨౩౩౧౫ చ.మై. వైశాల్యము. ౬౫౯౬౮౫ జనసంఖ్య. ప్రధాననగరము బికనీరు పురము.

౧౫. బూందిసంస్థానరాజ్యము-దీనింబాలించుప్రభువునకు మహారా వను బిరుదము గలదు. 'రాజా'యనియు వాడుదురు. ౨౨.౨౦ చ.మై. వైశాల్యము. ౧౮౭౦౬౮ జనసంఖ్య. ప్రధానపురము బూందీపురము.

౧౬. కొచ్చిన్ సంస్థానరాజ్యము-ఇది మళయాళమునకుఁ జెందినరాజ్యము. దీనిఁబాలించు ప్రభువునకు మహారా జనుబిరుదము గలదు. ౧౪౧౭ చ.మై. వైశాల్యము. ౯౭౯౦౧౯ జనసంఖ్య. "ఎరనాకులం"ప్రభుత్వకార్యాలయము లుండుతావు. మహారాజు కొచ్చిన్‌పురమున నివసించును.

౧౭. కచ్ఛిరాజ్యము-దీనిఁబాలించు ప్రభువునకు మహారా వనుబిరుదము గలదు. ౭౬౧౬ చ.మై వైశాల్యము. ౪౮౪౫౪౭ జనసంఖ్య. కచ్ఛిపురము ప్రధాన నగరము.

౧౮. జయపురరాజ్యము-దీనినిఅంబరురాజ్యమనియు నందురు. తొల్లింటి అంబరీషపురరాజ్యము. దీనిఁబాలించుప్రభునకు మహారా జనుబిరుదము గలదు. ౧౫౫౭౯ చ. మై. వైశాల్యము. ౨౩౩౮౮౦౨ జనసంఖ్య. జయపూర్ ప్రధాననగరము.

౧౯. కరౌలీసంస్థాన రాజ్యము- దీనిని బాలించు ప్రభువునకు మహారాజ బిరుదము గలదు. ౧౨౪౨ చతురపుమైళ్ళవైశాల్యము. ౧౩౩౭౩౦ జనసంఖ్య. కరౌలీపురము ప్రధాన రాజ్యకార్యస్థానము.

౨౦. కోటాసంస్థారాజ్యము-దీనిఁ బాలించు ప్రభువునకు మహారావను బిరుదము గలదు. ౫౬౮౪ చతురపు మైళ్ళ వైశాల్యము. ౬౩౦౦౬౦ జనసంఖ్య. కోటాపురము ప్రధాన రాజ్యకార్యస్థానము.

౨౧. జోద్పూర్ సంస్థానరాజ్యము- దీనిని మార్వార్ రాజ్యమనియు నందురు. తొల్లిఁటి యోధపురరాజ్యము. దీనిఁ బాలించుప్రభునకు మహారాజబిరుదము గలదు. ౩౪౯౬౩ చతురపుమైళ్ళ వైశాల్యము. ౧౮౪౧౬౪౨ జనసంఖ్య. రాజధాని జోద్పూరు.

౨౨. పాటియాలసంస్థానరాజ్యము- దీనిఁ బాలించు ప్రభువునకు మహారాజను బిరుదము గలదు. ౫౯౩౨ చతురపుమైళ్ళ వైశాల్యము. ౧౪౯౯౨౩౯ జనసంఖ్య. పాటియాలపురము ప్రధానస్థానము.

౨౩. రీవాసంస్థానము– (త్రొల్లింటి రేవా) దీనిఁ బాలించుప్రభువునకు మహారాజ బిరుదము గలదు. ౧౩౦౦౦ చతురపుమైళ్ళ వైశాల్యము. ౧౪౦౧౫౨౪ జనసంఖ్య. రీవాపురము రాజధాని.

౨౪. టోంకు సంస్థానపు రాజ్యము– దీనిఁ బాలించుప్రభునకు నవాబను బిరుదము గలదు. ౨౫౫౩ చతురపు మైళ్ళ వైశాల్యము. ౨౮౭౮౯౮ జనసంఖ్య. టోంకుపురము ప్రధాన స్థానము.

౨౫. ఆల్వారు సంస్థాన రాజ్యము– దీనిఁ బాలించుప్రభువునకు మహారాజ బిరుదము గలదు. ౩౨౨౧ చతురపుమైళ్ళ వైశాల్యము. ౭౦౧౧౫౪ జనసంఖ్య. ఆల్వారునగరము రాజధాని.

౨౬. బన్సవారాసంస్థాన రాజ్యము– దీనిఁ బాలించు ప్రభునకు మహారావల్ అను బిరుదముగలదు. ౧౬౦౬ చ.మై. వైశాల్యముకలదు. ౧౯౦౩౬౨ జనసంఖ్య. బన్సవారాపురము ప్రధానస్థానము.

౨౭. దాతియా (దత్తియా) రాజ్యము– దీనిఁ బాలించుప్రభునకు మహారా జనిబిరుదము గలదు. ౯౧౧చ.మై. వైశాల్యము. ౧౪౮౬౫౯ జనసంఖ్య. దత్తియాపురము ప్రధానస్థానము.

౨౮. దేవాస్ (జ్యేష్ఠశాఖ) సంస్థానరాజ్యము– దీనిఁ బాలించు ప్రభువునకు మహారాజని బిరుదము గలదు. ౪౪౯ చ॥మైళ్ళవైశాల్యము. ౭౭౦౦౫ జనసంఖ్య.

౨౯. దేవాస్(కనిష్ఠశాఖ)సంస్థానరాజ్యము దీనిఁబాలించుప్రభునకు మహారా జనుబిరుదము గలదు. ౪౧౯ చ.మై. వైశాల్యము. ౬౬౯౯౮ జనసంఖ్య.

౩౦. ధార్ సంస్థానరాజ్యము–దీనిఁబాలించు ప్రభునకు మహారా జనుబిరుదముగలదు. ౧౭౭౭ చ॥మై॥ వైశాల్యము. ౨౩౦౩౩౩ జనసంఖ్య.

౩౧. ఢోల్పూరు సంస్థాన రాజ్యము– దీనిఁ బాలించు ప్రభునకు మహారా జనియు, రాణా యనియు బిరుదములు గలవు. ౧౨౦౦ చ.మై. వైశాల్యము. ౨౩౦౧౮౮ జనసంఖ్య. ఢోల్పూరు పురము ప్రధాన రాజ్యకార్యస్థానము.

౩౨. డుంగార్పూరు సంస్థానరాజ్యము–దీనిం బాలించు ప్రభునకు మహారావల్ అనుబిరుదము గలదు. ౧౪౪౭ చ.మై. వైశాల్యము. ౧౮౯౨౭౨ జనసంఖ్య. డుంగార్పూరుప్రధానస్థానము.

౩౩. ఇడార్ సంస్థానరాజ్యము– దీనిఁబాలించుప్రభువునకు మహారాజను బిరుదము గలదు. ౧౬౬౯ చతురపు మైళ్ళ వైశాల్యము. ౨౨౬౩౫౫ జనసంఖ్య.

౩౪. జైసల్మేరుసంస్థాన రాజ్యము– దీనిం బాలించుప్రభువునకు మహారావల్ అనుబిరుదముగలదు. ౧౬౦౬౨ చ॥ మైళ్ళవైశాల్యము. ౬౭౬౫౨ జనసంఖ్య. జైసల్మేరుపురముప్రధాన స్థానము.

౩౫. ఖైర్పూరు సంస్థాన రాజ్యము– దీనిఁ బాలించు ప్రభువునకు మీరార్ అనుబిరుదము గలదు. ౬౦౫౦ చతురపుమైళ్ల వైశాల్యము. ౧౯౩౧౫౨ జనసంఖ్య. ఖైర్పూరు ప్రధాన స్థానము.

౩౬. కిషన్ఘర్ సంస్థానరాజ్యము–దీనింబాలించు ప్రభువునకు మహారా జను బిరుదము గలదు. ౮౫౮ చతురపు మైళ్ల వైశాల్యము. ౨౭౭౩౪ జనసంఖ్య. కిషన్ఘర్ ప్రధానపురము.

౩౭. ఓర్ఛా సంస్థానరాజ్యము–దీనిఁ బాలించుప్రభువునకు మహారాజా యని బిరుదము గలదు. ౨౦౭౯ చతురపు మైళ్ల వైశాల్యము. ౨౮౪౯౪౮ జనసంఖ్య.

౩౮. ప్రితాపఘర్ సంస్థానరాజ్యము— దీని పాలించుప్రిభువునకు మహారావత్ అను బిరుదము గలదు. ౮౮౬ చతురపుమైళ్ల వైశాల్యము. ౬౭౧౧౪ జనసంఖ్య. ప్రితాపఘర్ పురము రాజధాని.

౩౯. రాంపూర్సంస్థాన రాజ్యము— దీనిఁ బాలించు ప్రిభువునకు నవా బనిపేరు. ౮౯౨ చతురపుమైళ్ల వైశాల్యము. ౪౫౩౬౦౭ జనసంఖ్య. రాంపూరు ప్రిధానస్థానము.

౪౦. సిక్కిం రాజ్యము-పాలించుప్రిభువునకు మహారాజను బిరుదముగలదు. ౨౮౧౮ చతురపుమైళ్ల వైశాల్యము. ౮౧౭౨౧ జనసంఖ్య.

౪౧. సిరోవా సంస్థానరాజ్యము— దీనిఁ బాలించు ప్రిభువునకు మహారావను బిరుదము గలదు. ౧౯౬౪ చతురపుమైళ్ళ వైశాల్యము. ౧౩౬౬౩౯ జననంఖ్య.

౪౨. బనారస్ రాజ్యము- దీనిఁ బాలించు ప్రిభువునకు మహారాజను బిరుదము గలదు. ౮౭౫ చ॥మైళ్ళ రాజ్యము. ౩౬౨౭౩౫ జనసంఖ్య. బనారస్‌పట్టణ మీరాజ్యములోనిది కాదు. బనారసుకడ గంగ కవ్వల రామనగరము (వ్యాసకాశీనంటి) రాజధానియు,ప్రధాన కార్యస్థానము నైయున్నవి.

౪౩. భావనగర్సంస్థానము- దీనిఁ బాలించు ప్రిభువునకు మహారాజని బిరుదము గలదు. ౨౮౬౦ చ॥ మైళ్ళ వైశాల్యము. ౪౨౬౪౦౪ జనసంఖ్య. భావనగరము ప్రిధానపురము.

౪౪. కుచిబీహారు సంస్థానరాజ్యము- దీనిం బాలించు ప్రిభువునకు మహారాజను బిరుదము కలదు. ౧౩౦౭ చదరపు మైళ్ళ వైశాల్యము. ౫౯౨౪౮౯ జనసంఖ్య. కుచిబీహారపురము ప్రథానస్థానము.

౪౫. ధ్రంగాధ్రా సంస్థానరాజ్యము- దీనిం బాలించు ప్రిభునకు మహారాజను బిరుదము కలదు. ౧౧౦౭ చదరపు మైళ్ళ వైశాల్యము. ౮౮౪౦౬ జనసంఖ్య.

౪౬. జహోరాసంస్థానరాజ్యము-దీనిఁ బాలించు ప్రిభునకు నవాబని బిరుదము కలదు. ౬౦౧ చ॥మైళ్ళ వైశాల్యము. ౮౫౭౭౮ జనసంఖ్య.

౪౭. ఝాలవార్ సంస్థానరాజ్యము- దీనిం బాలించు ప్రిభువునకు మహారాజరాణా యని బిరుదము కలదు. ౮౧౦ చ॥ మైళ్ళ చిన్నరాజ్యము ౯౬౧౮౨ జనసంఖ్య. ప్రిధానపురము ఝాలవార్ పట్టణము.

౪౮. జిండ్ సంస్థానరాజ్యము- దీనిఁ బాలించుప్రిభునకు మహారా జనుబిరుదము గలదు. ౧౨౫౯ చ॥ మైళ్ళవైశాల్యము. ౩౦౮౧౮౩ జనసంఖ్య.

౪౯. జూనఘడ్ సంస్థానరాజ్యము- దీనిఁ బాలించుప్రిభునకు నవా బనుబిరుదము గలదు. ౩౩౩౬ చ॥ మైళ్ళ వైశాల్యము. ౪౬౫౪౯౩ జనసంఖ్య.

౫౦. కపూర్తల సంస్థాన రాజ్యము- దీనిఁ బాలించుప్రభునకుమహారాజనుబిరుదముకలదు. ౬౩౦ చ॥మై॥ వైశాల్యముగల చిన్నరాజ్యము. ౨౮౪౨౭౫ జనసంఖ్య. కపూర్తల (తొల్లింటి కర్పూరతలము) ప్రధానపురము.

౫౧. నాభాసంస్థానరాజ్యము-దీనిఁ బాలించుప్రభునకు మహారా జను బిరుదము కలదు. ౯౨౮ చ॥మై॥వైశాల్యము.౨౬౩౩౩౪ జనము.

౫౨. నవనగరసంస్థానరాజ్యము- దీనిఁబాలించు ప్రభునకు మహారా జనుబిరుదముగలదు. ౩౭౯౧ చ॥మై॥ వైశాల్యము. ౩౪౫౩౫౩ జనసంఖ్య. నవనగరము ప్రధానపట్టణము.

౫౩. పాలన్పూరు సంస్థానరాజ్యము- దీనిఁ బాలించుప్రభునకు నవా బని బిరుదము గలదు

 భరతదేశప్రభుత్వములు

౧౭౫౦ చ॥మై॥ వైశాల్యము. ౨౩౬౬౦౪ జనసంఖ్య. పాలన్పూరు ప్రధానపురము.

౫౪. పోర్బందరు పురము- దీనిని బాలించు ప్రభునకు మహారా జనుబిరుదముగలదు. ౬౪౨ చ॥మై॥ వైశాల్యము గల చిన్న సంస్థానము. ౧౦౧౮౮౧ జనసంఖ్య.

౫౫. రాజపిప్పల సంస్థానరాజ్యము- దీనిం బాలించుప్రభునకు మహారా జనుబిరుదము కలదు. ౧౫౧౭ చతురపు మైళ్ళ వైశాల్యరాజ్యము. ౧౬౮౪౫౪ జనసంఖ్య. రాజపిప్పల పురము ప్రధానస్థానము.

౫౬. రట్లం సంస్థానరాజ్యము. దీనిఁ బాలించు ప్రభునకు మహారాజను బిరుదము కలదు. ౬౯౩ చ॥ మైళ్ళ చిన్నరాజ్యము. ౮౫౪౮౯ జనసంఖ్య. రట్లం ప్రధానస్థానము.

౫౭. టిప్పెరా (తొల్లింటి త్రిపుర) సంస్థాన రాజ్యము- దీనిం బాలించు ప్రభునకు రాజా యను బిరుదము గలదు. ౪౧౧౬ చ॥ మైళ్ళవైశాల్యము. ౩౦౪౪౩౭ జనసంఖ్య.

౫౮. అజయఘడు సంస్థానరాజ్యము- దీనిం బాలించుప్రభువునకు మహారాజని బిరుదము కలదు. ౮౦౨ చతురపుమైళ్ల చిన్నరాజ్యము. ౮౪౭౯౦ జనసంఖ్య. అజయఘడము ప్రధానస్థానము.

౫౯. చంబాసంస్థానరాజ్యము- దీనిం బాలించు ప్రభునకు రాజాయని బిరుదము గలదు. ౩౨౧౬ చ॥ మైళ్ళ వైశాల్యము. ౧౪౧౮౬౭ జనసంఖ్య. చంబాపురము (తొల్లింటి చంపాపురము) ప్రధాన స్థానము.

౬౦. చర్ఖారీసంస్థానరాజ్యము- దీనిం బాలించు ప్రభునకు మహారా జనుబిరుదముగలదు. ౮౮౦ చ॥ మైళ్ళ వైశాల్యముగల చిన్నరాజ్యము. ౧౨౩౪౦౫ జనసంఖ్య.

౬౧. ఛత్తర్పూర్ సంస్థానరాజ్యము-దీనిం బాలించు ప్రభునకు మహారా జనుబిరుదము గలదు. ౧౧౩౦ చ॥ మైళ్ళ వైశాల్యము. ౧౬౬౫౪౯ జనసంఖ్య. ఛత్తర్పూర్ ప్రధాన కార్యస్థానము.

౬౨. ఫరీదుకోటసంస్థానరాజ్యము—దీనిఁ బాలించు ప్రభువునకు రాజా యను బిరుదము గలదు. ౬౪౩ చ॥ మైళ్లుగల చిన్నసంస్థానము. ౧౫౦౬౬౧ జనసంఖ్య. ఫరీదుకోట ప్రధానస్థానము.

౬౩. గోండాల్సంస్థానరాజ్యము-దీనిఁ బాలించుప్రభువునకు ఠాకూర్సాహెబని బిరుదము గలదు. ౧౦౨౪ చతురపుమైళ్ల వైశాల్యము. ౧౬౭౦౭౧ జనసంఖ్య.

౬౪. జాంజీరాసంస్థానరాజ్యము-దీనిబాలించు ప్రభువునకు నవాబని బిరుదము గలదు. ౩౨౭ చ॥ మైళ్ల చిన్నరాజ్యము. ౯౮౫౯౦ జనసంఖ్య. జంజీరాపురము ప్రధానస్థానము.

౬౫. మండీసంస్థానరాజ్యము-దీనిఁ బాలించుప్రభువునకు రాజా యని బిరుదము గలదు. ౧౨౦౦ చ॥ మైళ్ల వైశాల్యము. ౧౮౫౦౪౮ జనసంఖ్య. మండీపురము ప్రధానపట్టణము.

౬౬. మణిపూర్ సంస్థానరాజ్యము—దీనిఁ బాలించు ప్రభువునకు మహారా జని బిరుదము గలదు. ౮౪౫౬ చతురపుమైళ్లు వైశాల్యము. ౩౮౪౦౧౬ జనసంఖ్య. మణిపూర్ ప్రధానస్థానము.

౬౭. మోర్వీసంస్థానరాజ్యము-దీనిఁ బాలించు ప్రభువునకు ఠాకూర్సాహెబని బిరుదము గలదు. ౮౨౨చ॥మైళ్ల వైశాల్యము. ౯౬౬౯౭ జనసంఖ్య.

౬౮. పన్నాసంస్థానరాజ్యము-దీనిఁ బాలించుప్రభువునకు మహారా జను బిరుదము గలదు.

౨౫౯౬ చ॥ మైళ్ల వైశాల్యము. ౧౯౨౬౦౦ జనసంఖ్య. పన్నాపురము ప్రధానపట్టణము.

౧౯. పుదుకోట సంస్థానరాజ్యము- దీనిఁ బరిపాలించు ప్రభునకు "రాజా" యను బిరుదమును, "తొండైమాన్" యనుబిరుదమునుగలవు ౧౧౭౯ చ॥మై॥ గల చిన్న రాజ్యము. దక్షిణ దేశమున తిరుచినాపల్లి మండలముకడనున్న రాజ్యము. ౪౨౬౮౧౩ జనసంఖ్య. పుదుక్కోట ప్రధానపురము.

౨౦. రాజఘుడ్ సంస్థానము-దీనిఁ బాలించు ప్రభునకు రాజా యని బిరుదముగలదు. ౯౬౨ చ॥మై॥ వైశాల్యము. ౧౧౪౯౭౨ జనసంఖ్య. రాజఘుడ్ పురము ప్రధానపట్టణము.

౨౧. సల్లానా సంస్థానరాజ్యము-దీనిఁ బాలించుప్రభునకు రాజా యని బిరుదము గలదు. ౨౯౬ చ॥మై॥ వైశాల్యముగల చిన్న రాజ్యము. ౨౭౧౬౫ జనసంఖ్య.

౨౨. శిర్మూర్ (నహాన్) సంస్థానరాజ్యము- దీనిఁ బాలించుప్రభునకు మహారాజా యని బిరుదము గలదు. ౧౧౯౮ చ॥ మై॥ వైశాల్యము. ౧౪౦౪౬౮ జనసంఖ్య. శిర్మూరుపురము ప్రధాన పట్టణము.

౨౩. తెవారి సంస్థాన రాజ్యము- దీనిని గడ వాలు సంస్థానరాజ్య మనియు నందురు. ఇది తొల్లింటి చతురశీతిలింగ దేశము, లేక అరుణోద దేశ మనియుఁ బరగుచుండినది. ౪౫౦౦ చ॥మై॥ వైశాల్యము. ౩౧౮౪౮౨ జనసంఖ్య. శ్రీనగరము ప్రధానపురము.

౨౪. బంగనపల్లి-ఇది కర్నూలు మండలము నంటియున్న చిన్న రాజ్యము. దీనిఁ బాలించు ప్రభునకు నవాబను బిరుదముగలదు. ఇది ౨౫౫ చ॥మై॥ వైశాల్యముగల చిన్న సంస్థానరాజ్యము. ౩౬౬౪౬ జనసంఖ్య. బంగనపల్లి ప్రధానపురము.

౨౫. సాండూరు సంస్థాన రాజ్యము- ఇది బళ్ళారిజిల్లానంటియున్న చిన్న సంస్థానరాజ్యము. దీనిఁ బాలించుప్రభునకు శ్రీమంతనియు, హిందూ రావనియు, మామ్లాకత్మాదారనియు, సేనాపతి యనియు బిరుదములు గలవు. ౧౬౪ చ॥మై॥ వైశాల్యము. ౧౧౬౪౮ జనసంఖ్య. సాండూరు ప్రధానపట్టణము.

ఇంకను గొన్ని చిన్న సంస్థానములు గలవు.

**భరతదేశపు లిపులు**—భరత దేశ మొక ఖండమునుబోలి యనేకభేదజాతులు భేదభాషలుఁ గల్గినదౌట పెక్కులిపులఁగూడఁ గల్గిన దేశము. లిపిఁగూర్చి తెలియుటకు (లిపి చూడుఁడు.) సంస్కృతభాషగూర్చియు, భరత దేశపులిపులఁ గూర్చియు వ్రాసియున్న Burnell పండితుఁడు మొదలగువారు భరతదేశపులిపియగు సంస్కృత మాదిని లేదనియు, బౌద్ధుల ప్రాబల్యకాలమునుండి లిపి యేర్పడెననియు, పారశీక చక్రవర్తియగు డెరయస్ గారీదేశముపై దాడి వెడలి వచ్చినతఱి వారిలిపి యిటకు రా, దాని నుండి భరతదేశపులిపి జనించెననియు, పారశీక భాషయందలి "డిపి" నుండి "లిపి" యనుశబ్దము కల్గెననియు, లిపిలేని భరత దేశమున వేదములు కంఠతః వల్లెవేయుటయె శరణ్యమయ్యె ననియు మొదలగు కొన్నిసంగతులను వ్రాసియుండిరి. ఇవి పొరపాటనిమెదము గాక. ఈమహానీయుల నన్యులనువలె నిరసించి వదలివేయఁ జనదుగాన నావ్రాతలు సరికావనియు, క్రీ.ము ఎన్మిదివేల యేండ్లపూర్వకాలముననే పాణిని సంస్కృత భాషకు వ్యాకరణమును, అంతకు మున్నే యాతనికిఁ బూర్వుఁడగు శాకటాయనుఁడు వేఱొక వ్యాకరణమును రచించియుంటయుఁ, గొంత కాల మార్యులలో నార్యులుగనే మేరువు(హారీ బరేజా) ప్రాంతములనుండుచు, దేవాసురయుద్ధ

మున రాతిపవహిూవలంబులై నిలిచి, యాసంగరమున వా రోడినకతన దేవతాపహిూవలంబులతోఁ గలిసియుండ నొల్లక, గాంధారావగ దేశములఁ గడచి, యవ్వలి పర్సిపోలిస్ నకుఁ జేరుకొని పారశీకు లనఁబరగుచు "అహుర" (అసుర) నారాధనమొనర్చుమతస్థులుగనార్యులమనియే చెప్పుకొనుచుండు పారశీకులు సంస్కృతపదమగు 'లిపి' నుండి 'డిపి' నే సంపాదించుకొనిరో లేక పారశీకుల 'డిపి' నుండి భారతీయులు లిపిఁ గైకొనిరో యోచించిన తెలియఁ గలదనుటయు, వేదములు స్వరయుక్తముగ నధ్యయనముఁ జేయవలసినవి గాన గురుముఖతః అధ్యయనమంది కంఠతః వల్లెవేసి దోషరహితస్వరముతో స్థిరపర్చుకొనుట గల్గెననియు సూచించియింతటితోనీసంగతివదలుదుముగాక.

సంస్కృత లిపి (దేవనాగరి లేక బ్రాహ్మి) ఇతరలిపులనుండి జనించినదికాదు. స్వతంత్రోద్భవము గలది. లెక్కలకు సంఖ్యాస్థానములు, వేదములకు ఛందో వ్యాకరణములు, క్రీ. పూ. ఏడెన్మిదివేల వత్సరములనాఁడే గల్గినది. భరత భూమి ఇందలి లిపులు పెక్కులు గలవు. క్రీ. పూ. ౫౦౦ సంవత్సరములనాడు వ్రాతినందిన బుద్ధభగవానుని జీవితచరిత్రము "లలితవిస్తార" మను గ్రంథమున వివరింపఁబడినది. ఆగ్రంథము పాళీభాష బ్రాహ్మిలిపియం దున్నది. ఇది యశోకచక్రవర్తి కాలమునకుఁ బూర్వమే రచింపఁబడి యామహారాజు కూర్చిన మూఁడవబౌద్ధ మహాసభలో (పాటలీపుత్రమున) చదువఁబడిన దందురు. ఇదిచీనాభాషలోని కనువదింపఁ బడిన దనియు, నది క్రీ. వె. ౭౬ అనియు, మాక్సుముల్లరు పండితుఁడు వ్రాసెను. ఈగ్రంథమున బుద్ధభగవానున కెఱుకయైనవిగ నఱువదినాల్గు లిపులు వివరింపఁ బడియున్నవి. లలితవిస్తరము ౧౦ వ సర్గమునం దివి చూడనగును.

౧ బ్రాహ్మి, ౨ ఖరోష్టి, ౩ పుష్కరసారీలిపి ౪ అంగలిపి, ౫ వంగలిపి, ౬ మాగధీలిపి, ౭ మాంగల్యలిపి, ౮ మనుష్యలిపి, ౯ అంగులీయలిపి, ౧౦ శకారిలిపి, ౧౧ బ్రహ్మావల్లీలిపి, ౧౨ ద్రావిణలిపి, ౧౩ కినారిలిపి, ౧౪ దక్షిణలిపి, ౧౫ ఉగ్రలిపి, ౧౬ సంఖ్యాలిపి, ౧౭ అనులోమలిపి, ౧౮ అర్ధధనుర్లిపి, ౧౯ దరదలిపి ౨౦ ఖాస్యలిపి, ౨౧ చీనాలిపి, ౨౨ హూణలిపి, ౨౩ మధ్యాక్షరవిస్తరలిపి, ౨౪ పుష్పలిపి ౨౫ దేవలిపి, ౨౬ నాగలిపి, ౨౭ యక్షలిపి, ౨౮ గంధర్వలిపి, ౨౯ కిన్నరలిపి, ౩౦ మహోరగలిపి, ౩౧ అసురలిపి, ౩౨ గరుడలిపి, ౩౩ మృగచక్రలిపి, ౩౪ చక్రలిపి, ౩౫ వాయుమరుల్లిపి, ౩౬ భౌమదేవలిపి, ౩౭ అంతరిక్షదేవలిపి, ౩౮ ఉత్తరకురుద్వీపలిపి, ౩౯ అపరగౌడాదిలిపి, ౪౦ పూర్వవిదేహలిపి, ౪౧ ఉత్క్షేపలిపి, ౪౨ నిక్షేపలిపి, ౪౩ విక్షేపలిపి, ౪౪ ప్రక్షేపలిపి, ౪౫ అపరమాగధిలిపి, ౪౬ వజ్రలిపి, ౪౭ లేఖప్రతిలేఖ లిపి, ౪౮ అనుధ్రుతలిపి, ౪౯ శాస్త్రావర్తలిపి, ౫౦ గణావర్తలిపి, ౫౧ ఉత్క్షేపావర్తలిపి, ౫౨ విక్షేపావర్తలిపి, ౫౩ పాదలిఖితలిపి, ౫౪ ద్విరుత్తరపదసంధిలిపి ౫౫ దశోత్తరపదసంధిలిపి, ౫౬ అధ్యాహారిణీలిపి, ౫౭ సర్వమతసంగ్రహిణీలిపి, ౫౮ విద్యానులోమలిపి, ౫౯ విమిశ్రితలిపి, ౬౦ ఋషితపస్తప్తలిపి, ౬౧ ధరణీప్రేక్షణలిపి, ౬౨ సర్వౌషధినిష్యందాలిపి, ౬౩ సర్వసారసంగ్రహిణీలిపి, ౬౪ సర్వభూతమతసంగ్రహిణీలిపి యని చెప్పఁబడినది.

ఈలిపులఁగూర్చి యిక్కాలమున నంతగాఁ దెలిసినను, దెలియకున్నను నీదినములందుఁ బరిశీలకులు లెక్కింపఁదగిన లిపులు నలుబదియైదు వఱకుఁ గన్పించుచున్నవి.

౧ అరవలిపి, ౨ అరారా లిపి (ఇది సింధు నదీప్రాంతములందువాడఁబడునది), ౩ అసామీ లిపి, ౪ ఇరాన్పాలీ, ౫ ఓడ్రలిపి, ౬ ఓర్ఝాలిపి (బీహారు దేశమునందు ఓర్ఝా బ్రాహ్మణులు వాడుచున్నారు), ౭ కన్నడము, ౮ కరాడీ, (బొంబై రాజధాని కర్హాడబ్రాహ్మణులు వాడుచున్నారు), ౯ కాయధీ (కాయధీ జాతివారు వాడుచున్నారు), ౧౦ ఖరోష్టి, ౧౧ గుజరాతీ, ౧౨ గురుముఖీ (పంజాబులోని సిక్కులు వాడుచున్నారు), ౧౩ గ్రంథలిపి, (అరవ దేశమునందుఁ గలదు), ౧౪ తాంత్రికలిపి, ౧౫ టిబ్బతి (టిబెట్టు దేశస్థులు వాడుచున్నారు), ౧౬ తుళు, ౧౭ తెలుఁగు, ౧౮ ధలలిపి, (పాంచాల దేశపు దేరాజాతివారు వాడుచున్నారు), ౧౯ డోగ్రీ, (కాశ్మీరదేశములోని యొక లిపి) ౨౦ దేవనాగరి (దీనినే నాగరీ యనియు నందురు), ౨౧ నిమాడీ (మధ్య రాష్ట్రములలోని నేమాడ్ మండలమున వాడుచున్నారు), ౨౨ నేపాలీ, ౨౩ పరాచీ, (ఖేరాయ్), ౨౪ పాహాడీ, (కుమాయూన్ పరగణాలందు గడవాల్ సంస్థానరాజ్యసీమలందువాడుకగలదు), ౨౫ బినియా (శిర్సాహిసారే) ౨౬ బంగాళీ, ౨౭ బహ్వాలపురి లిపి, (బహ్వాలపురి సంస్థాన ప్రాంతసీమల వాడుచున్నారు), ౨౮ బడియాలిపి, ౨౯ బిశాతీలిపి, 30 మణిపురీలిపి, 3౧ మలయాల లిపి, 3౨ మార్వాడీలిపి, 33 ముల్తానీ, 3౪ మైథిలీ, 3౫ మోడీ, (మరాటదేశమునందు వాడుచున్నారు). 3౬ రోరీలిపి, (పంజాబులోని రోరీ ప్రాంతమున వాడుచున్నారు. సింధు దేశములోను గలదు), 3౭ లామావాసీలిపి, 3౮ లుంగీ (పంజాబులోని సియాల్కోట ప్రాంతసీమలందు వాడుచున్నారు), 3౯ సరాపీ (దీనిని శ్రావకీ యనియు నందురు), ౪0 సారికా లిపి, (పంజాబునందు దేరాజాతివారి భాషాలిపి) ౪౧ సఈసీ లిపి, ౪౨ సింహాళీలిపి, ౪3 శికార్పురి, ౪౪ సింధి. ఇవి గాక గాంధారలిపి పారశీ లేక ఉర్దు లిపులు వాడుకయందుఁ గలవు. (దాక్షిణాత్యలిపుల పరంపరా వృక్షముచూడుఁడు— సంస్కృతభాష చూడుఁడు).

**భరతనాట్యకళ**—ఆదిని పరమేశ్వరుఁడు (శివుఁడు), సమస్తదేవతాగణములు, ప్రమథగణములు చూచి మెచ్చుంగునటులఁ గనకసభయందుఁ దనకు లీలాసహధర్మచారిణి యగు శివకామినీశక్తి (పార్వతి) కెదుటఁ దాండవమాడెనని పురాణములయందుఁ జెప్పఁబడినది. ఆ నాట్యమునకు 'శివతాండవ' మనియు, నాట్యమొనర్చిన పరమేశ్వరావస్థకు 'నటరాజత్వలీల' యనియుఁ బేరులు సుప్రసిద్ధములయ్యెను. ఇట్లు భరతదేశమున కనుగ్రహింపఁబడిన నాట్యకళకు 'భరతనాట్యకల' యని పేరు కల్గెను. దీనిని గొందఱు ప్రమథులును, వారినుండియే మఱికొందఱు ఋషులును నభ్యసించి నేర్చిరి. ప్రమథులందు భృంగీశుఁడట్లు నేర్చినవాఁడేయందురు. క్రమముగ భరతునికడకుఁ జేరి యా మహాత్ము నుండి భరతనాట్యకలగాఁ బేరనుకూలింప విరివిగా దేశమున వ్యాపించెను. ఈ నాట్యకళను దక్షిణ హిందూదేశమున హొయిసల రాజ్యముండినకాలమున భూపాలకుఁడుగనుండిన విష్ణువర్ధనమహారాజుధర్మపత్ని సరస్వతీదేవి నేర్చియుంట "నృత్యసరస్వతీదేవి" యని పేరందియుండెనఁట. ఆనాట్యకళావిశారద యగు తన యనుంగురాజ్ఞిప్రోత్సాహమున నాభూపాలుఁడిప్పుడు మైసూరురాజ్య మందున్న బేలూరుపురమునఁ జెన్నకేశవస్వామి దేవాలయముఁ గట్టించి యందు భరతనాట్యకలా ప్రదర్శనాకారముల నన్నింటిని విగ్రహాకారమున నాట్యప్రదర్శన రూపములఁ జెక్కించివేయించెనఁట. ఈభూపతి

నిర్మింపఁజేసినకాల మొగా్రి నగరమున షాజహానుచక్రవర్తి తన యనుంగు సతీమతల్లికి జ్ఞాపకార్థముగ తాజ్ మహల్ భవనమును నిర్మింపకమున్నె దువందల సంవత్సరములనాఁడని పరిశీలకులు లెక్కించియున్నారు. ఆచెన్న కేశవ దేవళమున బేలూరునందు దేవునియెదుట నాట్యకళావిశారద యగు సరస్వతీమహారాజ్ఞి నాట్యమాడుచుఁ దననాట్యవిద్యను బ్రదర్శించుచుండు తఱి నల్లనిమార్బెలురాతిఫలకము నతినున్నగఁ జేసి నేల కమర్చియుంచువారఁట. ఆమహాదేవి ఆనాట్యవిద్యావిశారద, ఆసరస్వతీ మహారాజ్ఞియు, నిర్మాతయగు విష్ణువర్ధనమహారాజును భౌతికశరీరములను వదలినను, ఆ శాస్త్రమును నిరూపించు విగ్రహచిత్రములు శిలామయములగుట నేఁటికినిల్లినిలిచియున్నవి. వాటినిఁజూడనగుంగాని వాటిపేర్లు సరిగాఁ దెలియరాకున్నవి. ఇటీవల బెంగుళూరు వాస్తవ్యుఁ డగు రామగోపాలుఁడను నాట్యకళాప్రపూర్ణుఁ డొకఁడు తానటుల నటించుచుఁ దిరుగ నాకళను బునరుద్ధరించిప్రదర్శించుచున్నాఁడనివిందుము. ఆయనతన యిరువదిరెండవయేటనే నాట్యకళా ప్రపూర్ణుఁడని జగమున మెప్పువడసి పేరందినవాఁడు. ఈయనతండ్రిగారింకను (ఏ.డి. ౧౯౪౦) నాటికి వృద్ధాప్యమున జీవించియున్నారనివిందుము. వీరిది బెంగుళూరు నివాసము. తండ్రి జన్మతః రాజపుత్రస్థానదేశస్థుఁడనియు, తల్లిబర్మాదేశపు వనితారత్నమనియు నందురు. తండ్రిగారు సంస్కృతమున భారతీహరి రచించిన గ్రంథము ననువదించియుంట దానిఁ జదివి రామగోపాల్ గారు భరతనాట్యకళపై నభిమాన మూనిరఁట. బాల్యముననే యితరులు నాట్యమొనర్చినఁ జూచి తానటుల నాట్యమాడఁగలశక్తి గల్గియుండెనఁట. బాల్యముననే మళయాళదేశప్రసిద్ధంబగు కథాకళినాట్యాభినయము లభ్యసింపఁ గేరళ దేశమునకరిగియుండెనఁట. ఈయన యిట్టి వృత్తియందుఁ బ్రవేశించుట వీరికుటుంబమువారికిష్టములేకుండెనఁట. కాని దసరా మహోత్సవములందు కాలేజికార్యములందీయన ప్రదర్శించుచుండినకళానిపుణత మైసూరుయువరాజుగారి దృష్టి నాకర్షించియుండె నఁట గాని వారినుండి రామగోపాలుగారి కేప్రోత్సాహముఁ గలుగలేదఁట. రామగోపాలుగారు తొలుతఁ గొంత కాలము సోలోనాట్యకళాప్రవీణ యనిపేరందిన లా మేరీగారితో నుండి, యుత్తర హిందూస్థానమేగాక మలేస్టేట్సు, జావాద్వీపము, ఫిలిప్పైన్ దీవులు,చీనాజపానులుగూడఁదిరిగివచ్చినవాఁడు. జపానునందు మెప్పునందినవాఁడు. పిమ్మట నమెరికా, యింగ్లాండు, ఫ్రాన్సులందుఁ దన విద్యాప్రదర్శనములఁ జూపి భరతభూమికిఁ దిరిగి వచ్చినవాఁడు.

**భరతపురసంస్థానము**— ఇండియా దేశమందలి రాజపుటానాయేజన్సీలోని బ్రిటిషు రక్షితసంస్థానము లిరువదింటిలో నొకటి. భరతపురము రాజధాని.

**భరతమహారాజు (చక్రవర్తి)**— తండ్రి ఋషభమహారాజు. తాత నాభిమహారాజు. ఈతఁడు చాల పేరందిన చక్రవర్తి. ఈతని పాలనము చాల గొప్పది. ఈతనినుండియే యీతని దేశమునకు "భరతవర్ష"మని పేరయ్యెను.

ఈతనిఁగూర్చియెక్కువ తెలియకున్ననుపిదప నీతఁడు తపస్వియై కడపటికాలము గడపెనని తెలియుచున్నది. సుతుఁడు సుమతి మహారాజు.

మఱియు దశరథ మహారాజునకుఁ గైకేయి యనుభార్యయందు జనించినసుతు (శ్రీరామసోదరు)నకుభరతుఁడనిపేరు. ఈతఁడే శ్రీరాముఁడరణ్యవాసమొనర్ప నేగినకతన దశరథునియనంతరము శ్రీరామునిపేర రాజ్యపాలన మొనర్చిన

వాఁడు. ఈతనిభార్య కుశధ్వజుని పుత్రికయైన మాండవీదేవి.

పూరువంశస్థుఁడగు దుష్యంతమహారాజునకు శకుంతలయందుఁ గల్గినపుత్రునకు భరతుఁ డని పేరు కలదు. ఇతనికి చిరకాలము సంతానము కలుగకపోఁగా భరద్వాజుని శిష్యుఁడై యాగ మొనర్చి భమన్యుఁడు లేక వితథమన్యుఁ డను సుతునిఁబడసెను. ఈతనిసంతతిరాజులచరిత్రము గాన భారతమని పేరయ్యెను.

ఇంకను అగ్నిత్వమొనర్చిన శయుఁడనువాని పెద్దకుమారుఁడగు పుష్టిమతికి భరతుం డనిపేరు కలదు. (మహారాజులు చూడుఁడు).

**భరతవర్షము**—జంబూద్వీపము, భరత వర్షము నను రెండుపేరు లొకేదేశమును నిరూపించుచుఁ గొంత సంశయము కలుగఁ జేయునని తోఁచెడిని. జంబూ ద్వీపనామము భూగోళ శాస్త్ర సంబంధ పదము (Geographical conception); భరతవర్షపదము రాజకీయపరిపాలనాసంబంధ (Political conception) పదమని యెఱుంగునది.

విష్ణుపురాణము ౨ భాగము 3 అధ్యాయమునను, మార్కండేయపురాణము ౫౭ యందునను, భరతవర్షము తూర్పున కిరాతదేశము, దక్షిణమున మహాసముద్రము, పశ్చిమమున యవనదేశము, ఉత్తరమున హిమవన్నగము నెల్లలుగఁ జెప్పఁబడినది. ఆసేతు హిమాచల పర్యంత దేశమునకు "భరతవర్ష" మనిపేరు. భరతుఁడను చక్రవర్తి యేలినదేశము.

భరతునకుఁ బూర్వ మీదేశము హిమవత్ఖండము, ఆర్యావర్తము, బ్రహ్మావర్తము, దక్షిణాపథము మొదలగుఁ బెక్కు పేర్లంబరఁగుచుండు వేర్వేఱు భాగములచేఁ దనరెడిదిగ లింగపురాణము పూర్వభాగము ౪౭ యందుఁజెప్పఁబడిది.

**భరత శాస్త్రము**— (అభినయ భరతశాస్త్రము చూడుఁడు).

**భరతుని పట్టణము రాముని రాజ్యము రెండును సుఖప్రదములే; ధర్మనిరతములే**— (ఆంధ్ర లోకోక్తి).

**భరద్వాజ ఉపగణము**—దీనికి కేవల భరద్వాజఉపగణమని వాడుకనామము కలదు. ఇది ఆంగీరస సంతతి. భరద్వాజ గణములోని యొకఉపగణము. ఇందు గోత్రములు (౧౮౮) చెప్పఁబడినవి.

(బోధాయన సూత్రోక్త గోత్రములు ౮౦)

౧ అగ్నివేశ్య, ౨ అగ్నిస్తంబ, 3 అరుణ, ౪ అశ్వభారి, ౫ ఆత్రేయాయణ, ౬ ఆపస్తంబ, ౭ అశిల, ౮ ఇంద్రస్తంభ, ౯ ఉద్యహావ్య, ౧౦ ఉరూఢ, ౧౧ ఋక్ష, ౧౨ ఐదమేఘి, ౧3 ఐపస్వి, ౧౪ కక్షిల, ౧౫ కరభికి, ౧౬ కల్మాష, ౧౭ కాదోవమేక, ౧౮ కామ్యాయన, ౧౯ కార్గివి, ౨౦ కరుణాయన, ౨౧ కారుపథి, ౨౨ కారుపాయన, ౨3 కావాల్య, ౨౪ కుక్ష, ౨౫ కుముదగంధ, ౨౬ కేశరవయ, ౨౭ కౌకాక్షి, ౨౮ కౌన్డాయన, ౨౯ కౌండిన్య, 3౦ వాసిన, 3౧ గౌర్వాయన, 3౨ చేలక, 33 త్రైదేహ, 3౪ ధాన్యాయన, 3౫ దాభి, 3౬ ధూమగంధి, 3౭ దేవమతి, 3౮ దేవాశ్వ, 3౯ జేవి, ౪౦ నృత్యాయన, ౪౧ పహారి, ౪౨ ప్రవాహ్లీయ, ౪3 పాగ్వంశి, ౪౪ భద్రాద్రి, ౪౫ భరద్వాజ, ౪౬ భరూడేయ, ౪౭ బ్రహ్మస్తంబ, ౪౮ భారద్వాజ, ౪౯ భాష్కల, ౫౦ మంగడ, ౫౧ మత్స్యక్రోధ, ౫౨ మామన్య, ౫3 మహావేల, ౫౪ మానభిద్య, ౫౫ యమస్తంభ, ౫౬ రాజస్తంభ, ౫౭ రిపమత, ౫౮ రుద్రాంగపథ, ౫౯ వాయుస్తంభ, ౬౦ వాహాలభ్య, ౬౧ వాహ్య, ౬౨ వేదవేల,

౬౩ వేల, ౬౪ వైనుతి, ౬౫ శఠ, ౬౬ శ్వంగ, ౬౭ శార్దూలి, ౬౮ శాలాని, ౬౯ శాలాహారి, ౭౦ శ్యామేయ, ౭౧ శిఖాయన, ౭౨ శౌద్ధి, ౭౩ సఘోమకృత్, ౭౪ స్థనకర్ణ, ౭౫ సింధు, ౭౬ సూర్యస్తంభ, ౭౭ సైంహికేయ, ౭౮ సోజ్వలి, ౭౯ సౌరభ, ౮౦ హారిణద్వేయ.

(మాత్స్య సూత్రోక్త గోత్రములు ౪౨).

౧ ఔవేయ, ౨ కథ, ౩ కథ్య, ౪ కపి, ౫ కపిస్థరి, ౬ కాండణ్యా, ౭ కామకాయన, ౮ కికాజి, ౯ కుటిత, ౧౦ కుపిత, ౧౧ కులకి, ౧౨ ఘూనిక, ౧౩ చేలారూక్ష, ౧౪ జైంహ్వాలాయన, ౧౫ త్రయంబక, ౧౬ తురస్వా, ౧౭ నిదాంగపథ, ౧౮ పూతిమాష, ౧౯ బంధు, ౨౦ మాతవచన, ౨౧ మాధూకర్ణ, ౨౨ మాపాయన, ౨౩ రిక్ష, ౨౪ లఖాయన, ౨౫ వాదన, ౨౬ వాలతుగారివ, ౨౭ వివిపి, ౨౮ శజ్కృతి, ౨౯ శంభు, ౩౦ శల్క, ౩౧ శాక్తలాజ, ౩౨ శ్రీపథ, ౩౩ శైఖేయ, ౩౪ శైవగవ, ౩౫ శైశిరి, ౩౬ శౌంగ, ౩౭ శౌనక, ౩౮ సత్వస్తంభ, ౩౯ స్తంభశబ్ద, ౪౦ సాయుధోదారి, ౪౧ స్వారణాది, ౪౨ సింధవ.

౨. (ఆపస్తంభ సూత్రోక్త గోత్రములు)

౧ ఊర్జాయన, ౨ కృక్వ.

ఇతర గ్రంథోక్త గోత్రములు (౬౧).

౧ గోశ్వపి, ౨ ఆశ్వలాయన, ౩ కాచకి, ౪ కాణ్యాంవిజలి, ౫ కాయన, ౬ కారగ్రివి, ౭ గిలి, ౮ కురుక్షేత్ర, ౯ కౌరుక్షేత్ర, ౧౦ శాజ్ఞలాయన ౧౧ గాంగోదకి, ౧౨ గోద్వేషి, ౧౩ గోశ్వపిగిలి, ౧౪ చికీర్షి, ౧౫ జైత్వలాయన, ౧౬ జైత్రి, ౧౭ తూర్ణకర్ణి, ౧౮ త్రైతుంది, ౧౯ పరేపమతి, ౨౦ ప్రివాహి, ౨౧ పైల, ౨౨ పౌలి, ౨౩ భామ్కలి, ౨౪ బాజపృశ్ని, ౨౫ మాత్స్యతీస, ౨౬ మార్కండి, ౨౭ మాలోహార, ౨౮ మైథునమతి, ౨౯ యాడాకి, ౩౦ లభాయని, ౩౧ వాతాంగిరధి, ౩౨ వారాహి, ౩౩ వాలిశాయని, ౩౪ వాలుహి, ౩౫ వాహ్యాగచ్ఛి, ౩౬ వాహి, ౩౭ వైషు, ౩౮ శాకలాయన, ౩౯ శిలాతలి, ౪౦ స్వజ్జంకి, ౪౧ సాంగి, ౪౨ సాత్యముగ్రి, ౪౩ సామస్తవి, ౪౪ సారగ్రివి, ౪౫ సారావరి, ౪౬ సాలహి, ౪౭ సాగయ, ౪౮ సౌడి, ౪౯ సౌబుద్ధిక, ౫౦ సౌజపృశ్ని, ౫౧ సావిమ, ౫౨ స్వాపశ్వ, ౫౩ హారికర్ణి, ౫౪ హాలోహార, ౫౫ దశాదకి, ౫౬ దేవస్థాని, ౫౭ దేవాగారి, ౫౮ దాగయ, ౫౯ ద్రౌణి, ౬౦ ధాగవి, ౬౧ ధౌతాంబకి.

ఈ (కేవల భరద్వాజ ఉపగణమునందలి) గోత్రములకుఁ బ్రవరలు:—

౧ ఆంగీరస బార్హస్పత్య భరద్వాజ.

౨ ఆంగీరసబార్హస్పత్యభరద్వాజ అత్కీల. (లేక అక్షీల).

౩ ఆంగీరస కథ్య అత్కీల (లేక అక్షీల).

**భరద్వాజ గణము**—ఇది ఆంగీరస సంతతియందలి యొక గణము. ఇందు కేవల భరద్వాజ, గర్గ, రౌక్షాయణ, కపి యను నాలుగు ఉపగణములు గలవు.

**భరద్వాజ గోత్రము**-కపిఉపగణముచూ.

**భరద్వాజ గోత్రము**—(భరద్వాజ ఉపగణము చూడుఁడు).

**భరద్వాజ మహర్షి**- తండ్రి ఉతథ్యుఁడు తల్లి మమత. బృహస్పతివలన జనించినవాఁడు. ఇప్పటి యలహాబాదునం దీతని యాశ్రమస్థానము. ఈతఁడు ప్రతిష్ఠించిన శివలింగముకలదు. అనేకమంది శిష్యులకు విద్యఁ గఱపినవాఁడు. శ్రీరాముని కీతఁ డొనర్చిన భరద్వాజవిందు సుప్రసిద్ధము. సామెతగా నైనది.

**భరద్వాజర్షి గోత్రము**- (శిష్టుకరణములు చూడుఁడు). ఈ గోత్రమువారికిఁ బ్రధానర్షులు అంగీరసుఁడు, భరద్వాజుఁడు ననియు, వీరిప్రవర ఆంగీరస, బార్హస్పత్య, భారద్వాజ యనియుఁ జెప్పఁబడినది.

౧ కూరాడవారు, ౨ కొట్టికవారు, ౩ చౌ ఘురివారు, ౪ డొంకాడవారు, ౫ దధిరావు వారు, ౬ నాగమణివారు, ౭ పక్కివారు, ౮ బెహరావారు, ౯ భోగిలవారు, ౧౦ మణిపాత్రిపవారు, ౧౧ మద్దారావువారు, ౧౨ రాజేటివారు, ౧౩ రాయఘుడవారు, ౧౪ రేగిడివారు, ౧౫ వంతరాంవారు, ౧౬ వీరఘట్టంవారు, ౧౭ సింహాపువారు.

**భరద్వాజాశ్రమము**- భరద్వాజమహర్షి యాశ్రమము. ప్రయాగ, (ఇల్హాబాదు) పురమున కల్నల్‌గంజ్ యనఁబడుతావునఁ గలదు. రామాయణప్రసిద్ధ మగు భరద్వాజమహర్షి యొనర్చినవిందు(శ్రీరామునకు)ఇటనె జరిగినది.

**భరద్వాజుఁడు**- ఋషి. తండ్రి ఉతథ్యుఁడు. తల్లి మమత. పితామహుఁడు బ్రహ్మమానసపుత్రుఁడగు ఆంగీరసుఁడు. కుమారుఁడు ద్రోణాచార్యుఁడు. పౌత్రుఁడు అశ్వత్థామ.

భరద్వాజుని తండ్రి ఉతథ్యునకు సంతతి లేకపోగా మమతయాజ్ఞమేర కుతథ్యుని జ్యేష్ఠ సోదరుఁడగుబృహస్పతివలన నాంగీరసునిఁ గనెనని చెప్పఁబడినది. భరద్వాజుఁడును ఘృతాచిం జూచి మోహితుఁడె యామెంగూడకయె వీర్యము జాఱి యొక కుంభమందుఁ బడ దానిచే ద్రోణుఁడు జనించెనఁట గాన ద్రోణునకు కుంభసంభవుఁ డని వాడుక గలదు. శ్రీరాముని కరణ్యావాసమేగుతరిని అరణ్యావాసమునుండి తిరిగి వచ్చుతరిని గూడ విందులొనర్చె నఁట. నేటికిని సమృద్ధికరమగు గొప్పవిందులకు భరద్వాజ విం దని వాడుకగాఁ జెప్పుచుందురు. మఱియు శయుఁడను అగ్నియొక్క జ్యేష్ఠపుత్రునకు భరద్వాజాగ్ని యనుపేరు గలదు. ఋగ్వేదములోని యేడవ మండలమును సామవేదమందలి కొన్ని సామములును నీతనివై యున్నవి. భరద్వాజశిక్ష, భరద్వాజకల్పము,భరద్వాజసంహితయు నీతనిపేరు వహించియున్నవి. కూర్మపురాణమున శతతేజుఁడనినపే రీతని కేయుందురు.

భరద్వాజునకుఁ "కులపతి" యను బిరుదముండెను. ఇప్పటి యలహాబాదునం దీయన యాశ్రమ ముండెను. అది గంగాతీరమైయుఁడెనఁట. అందాయననాటి శివలింగము కలదు. ఆయాశ్రమమునే విద్యాపీఠ మాయనది (విశ్వవిద్యాలయ) ముండె నఁట. ఇప్పుడును అలహాబాదావిశ్వవిద్యాలయమును సర్వకళాశాలయు నాపరిసరములనే యున్నవి.

భరద్వాజశిక్షకు ఆంధ్రుఁడగు వెలమకంటి సూరావధాని రచించినవ్యాఖ్య కలదు. ఈ సూరావధానియేనాటివాఁడో తెలియరాకున్నది.

**భరద్వాజవిందు**-కులపతియగుభరద్వాజ మహాముని శ్రీరాముఁడు వనవాసమునకుఁ బోవుచు మార్గవశమునఁ దనయాశ్రమమునకు రాఁగా సామాన్యమయినవిందు చేసెను. ఆ రాముఁడే రావణవధానంతరమున నయోధ్యకుఁ బట్టముగట్టుకొనఁబోవు సందర్భమునఁ దన యాశ్రమమునకు రాఁగా నసామాన్యమైనట్టియు, సర్వసమృద్ధమయినట్టియు, నద్వితీయమయినట్టియునిందొనర్చెను. "ఇదియేమి మహానుభావా నాఁటి విందునకును నేఁటివిందునకు నింతవ్యత్యాస మగుపడుచున్న" దని రాముఁడు ప్రశ్నింపఁగా నామునిపుంగవుఁడు "అవస్థాత్స్వాజితే రామా నశరీరం కదాచనా" అని ప్రత్యుత్తర మిచ్చెను. అప్పటినుండియు సర్వ

సమృద్ధముగాఁ జేయఁబడిన యేవిందునకైన "భరద్వాజవిందు" అనునది సుప్రసిద్ధమయ్యెను.

**భలానసమార్గము**—దీని నిప్పుడు "భోలాన్ పాస్" అనుచున్నారు ఇది ఋగ్వేదమునఁ జెప్పఁబడినదఁట.

**భల్లము**- -(బాణాగ్రములు చూఁడుడు.)

**భల్లసన్నిపాతము**- (సన్నిపాతదోషము చూడుఁడు.)

**భల్లాటదేశము**-శుక్తిమానపర్వతప్రాంతదేశ మనియు, దీనిని పాండవద్వితీయుం డగు భీమసేనుఁడు జయించెననియు, మహాభారతము సభాపర్వము 30 యందు చెప్పఁబడినది. కల్కిపురాణమునను దీని ప్రశంసకలదు.

**భల్లాదుఁడు లేక బృహద్ధనువు** — అత్రి చంద్ర పూరుసంతతి క్షత్రియుఁడు. తండ్రి బృహదిషుఁడు. మఱియు బృహదిషుని సంతతి యందే ఉదక్సేనుని సుతునకును భల్లాటుఁడని పేరుగలదు. ఇతఁడు భారతయుద్ధమునఁ గర్ణునిచే నిహతుఁడైనవాఁడు.

**భల్లూకపుపట్టు**—(ఆంధ్రలోకోక్తి.)

**భవనందిగోత్రము**-(నిధ్రువగణము చూ.)

**భవానీనగరము**—తులజాభవానీక్షేత్రము. ఇది ౫౨ శక్తిపీఠములలో నొకటి. శంకరవిజయమునను దేవీ భాగవతము ౭-౩౮ అధ్యాయమున దీని ప్రశంసలు గలవు. దేవిపేరు మహాసరస్వతి యనియునందురు. నిచట మహిషాసురుని వధించినతావని దేవీభాగవతమున జెప్పఁబడినది.

నైజాము రాజ్యములోని నాల్దుర్గ జిల్లాయందు G. I. P. Ry. కుద్వాజంక్షను నాల్గుమైళ్ల దూరమున నిపుడు తులజాపూరనుపేరఁ బరగుచున్నది.

**భవిష్యపురాణము**—ఇది లింగ కూర్మపురాణముల నారవదిగను, శివపురాణమున నైదవదిగను, దేవీభాగవతమున మూఁడవదిగను, భాగవతమునఁ బదియవదిగను, తక్కినవాట్లయందు తొమ్మిదవదిగను జెప్పఁబడిన పురాణము. సుమంతుఁడు శతానీకునకుఁ జెప్పినది. అర్కప్రభావభవిష్యత్కల్పాదు లిందుఁగలవు. గ్రంథసంఖ్య శివపురాణమున ౧౪౫౦౦ గను, నారదీయమున ౧౪౦౦౦ గను, బ్రహ్మవైవర్తమున ౧౪౫౦౦ గను, తక్కినవాట్లయందు ౧౪౫౦౦ గను చెప్పఁబడినవి.

**భవుఁడు**— పరమేశ్వరుండగు రుద్రుని యెన్మిది యాకారములలో నొకటి. (అష్టమూర్తి చూడుఁడు).

**భరుకచ్ఛదేశము (భారుకచ్ఛము)** -రాజధాని భరుకచ్ఛపురము. దీనికి భృగుపురమనియు వాడుక యుండెనని ప్రబంధచింతామణియందు కలదు. ఇప్పుడు బరోచి యనంబడుచు నాంగ్లులచే బ్రోచి యనంబడుచు బొంబై రాజధానియం దున్నది. గొప్పవర్తకస్థలము.

కాతన్త్రమనంబడు కలాపవ్యాకరణకర్తయగు శర్వవర్మాచార్యుఁడు భరుకచ్ఛపురనివాసి. ఈతఁడు ప్రతిష్ఠానపురాధినాథుండగు సత్యవర్మ నుని సమకాలికుఁడుగ కథాసరిత్సాగరమునఁ జెప్పఁబడినది. ఇచట రాజ్యభ్రష్టుండైన బలిచక్రవర్తిచే శుక్రాచార్యుఁ డొకయాగము చేయించెననిమత్స్యపురాణము ౧౧౪ యందుఁ జెప్పఁబడినది. ఇచటి శకునికావిహారమునఁగల జైనదేవాలయ మమరభట్టనువానిచే క్రీ. వె. పండ్రెండవ శతాబ్దమున కుమారపాలుని రాజ్యపాలనకాలమున నిర్మింపఁబడెనని యందొక శిలాశాసనము కలదు.

**భరుణ్డ గోత్రము**— (కణ్వాఉపగణము చూడుఁడు.)

**భరూడేయ గోత్రము** (భరద్వాజ ఉపగణము చూడుడు.)

**భర్గభూమి (భార్గభూమి)**— చంద్ర వంశ క్షత్రియులలో కాశ్యునిసంతతి వారిలోఁ గడపటివాఁడు. తండ్రి భార్గవుఁడు.

ఈతఁ డింద్రునివైరులగు నసురులను జయించినకతన దివిరాజ్యమును బొందినవాఁడు. ఈ తనిసుతులు వేనూర్గురు మదోన్మత్తులు దివిరాజ్య మాశించి దేవతలతోఁ బోరి నిహతులైరి.

**భర్చున్యాయము**— భర్చుశర్మ యను బ్రాహ్మణుఁడు తనయోగ్యతలచే రాజానుగ్రహపాత్రుండై సన్మానమందుచుండెనఁట. సన్నిధానవర్తులగు కొందరసూయాపరులగు దురాత్ములు చూచియోర్వఁజాలక నిశీథమున నాతని దూషిమునసుంకు నడవికిం గొనిపోయి కొట్టి చచ్చెనని తలంచి వదలివచ్చిరఁట. భర్చుశర్మ మెల్లగ లేచి యొకతావునకేగి శరీరము కుదుర్చు కొనుచుండెనఁట. ఈలోన రాజు విచారించుచుండ, దుర్మార్గులు భర్చుశర్మ చనిపోయెననియు పిశాచమై యచటనచట గన్పించుచున్నాడనియు జెప్ప నమ్మించిరఁట. పిదప నెల్లో బయల్పడి భర్చుశర్మ సర్వము రాజున కెఱుకపఱుప వారిం దండించెనఁట. దుర్మార్గులగు మోసగాండ్ర పనులంగూర్చి దెల్పుట కీన్యాయము వర్తించును.

**భర్మ్యాశ్వుఁడు (హర్యశ్వుఁడు)**- అత్రి చంద్ర పూరు సంతతి క్షత్రియుఁడు. తండ్రి నీలుఁడు. బిలక్షుఁడనియుఁ గొన్ని తావులందుఁ జెప్పఁబడినది.

కుమాళ్లు ముద్గలుఁడు, యవీనరుఁడు, బృహదిషుఁడు, కాంపిల్యుఁడు, సృంజయుఁడు ననఁ బడు నైదుగురు.

**భస్మన్యాజ్యాహుతి రితిన్యాయము**- నిరర్థకకార్య మని యర్థము. హోమము, నాహుతి యగ్ని హోత్రమునం దొనర్పఁబడ వలసినవి. అగ్ని యారినది చూచుకొనక మిగిలిన రొయ్యిబూడిదయం దిచ్చిన యాహుతి నిష్ఫలితమని దెల్పు భావము.

**భస్మము (విభూతి)**—శివభక్తిగలవారు భస్మను ధరింతురు. గోమయముంబట్టి యెండించి దానిని శివాగ్నియందుంచి పంచాక్షరీమహామంత్రముచేఁగాని, ప్రణవముచేఁగాని ఆశివాగ్నియం దాజ్యహోమ మొనర్చి దానంతట నది చల్లారఁగ నేర్పడినభస్మమునకు భస్మమనియు, విభూతి యనియుఁ బేరుకలదు. దీనిని శివ భక్తిగలవారు ధరింతురు.

వీరాగమమున విభూతి, భసిత, భస్మ, క్షార రక్షా, పరాభూతి యనఁబరగు షట్ప్రభావసంపన్నతలం గల్గింపఁబడిన భస్మకు విభూతి యని పేరని దెల్పుచున్నది. ఇట్టి ప్రభావసంపన్నతం గల్గింప దీనిని పంచబ్రహ్మాత్మకముగ నొనర్చెదరని చెప్పఁబడినది.

విభూతిధారణ మొనర్చు తావులంగూర్చి శైవసిద్ధాంతశిఖామణియందిటులఁ జెప్పబడినది.

శ్లో. ఉత్తమాంగే లలాటే చ శ్రవణద్వితయే తథా। గళే భుజద్వయే చైవ హృది నాభౌ చ పృష్ఠకే। బాహుయుగ్మే కకుద్దేశే మణిబంధద్వయే తథా। త్రిపుండ్ర మ్భస్మనా ధార్య మ్మూలమంత్రేణ...

**భస్మాసురవరము**— భస్మాసురుఁడను నామాంతరముగల కరవీరుఁడను రాక్షసుఁడు. ఇతఁడీశ్వరునిగూర్చి ఘోరమయిన తపస్సు జేయ పరమేశ్వరుఁడు ప్రత్యక్షమై "వరం బ్రూహి" యనియడుగఁగా, 'తానెవరిశిరముమీఁదఁ జేయి వైచినవారుభస్మమగునట్లు వరమిమ్మనికోరెను.

ఈశ్వరుఁ డట్లొయిచ్చెను. మొదటి పరిశోధనకు పరమేశ్వరునిశిరస్సునందే వాఁడు చేయివేయఁ దలంచెను. పరమేశ్వరుఁడు వానిబారినుండి తప్పించుకొనునప్పుడు మహావిష్ణు వారక్కసుని దారుణప్రయత్నమునకుఁ దగినశాస్తి చేయం దలంచి 'స్నానముచేసి శుచియైన యనంతరము నఁగాని యీవరము సిద్ధింప'దని భస్మాసురునికిఁ దెలుపఁగా, నాతఁడు స్నానార్థము జలమక్కడనే గావలయునని కోరెను. విష్ణువు మెరకగానున్న చిన్నకంచమునుబోలు గుంటలో జలములభించు నట్లుజేసి యీరాక్షసునందులో స్నానముచేయు మని కోరెను. రాక్షసుఁ డాగుంటలోని యల్ప జలమున మునుగ ననువుగామి తన దోసిలితో నీటినెత్తి నెత్తిపై నిడికొని, వరప్రభావమునఁ దనహస్తస్పర్శచేఁ దానె భస్మమయ్యెను.

**భస్త్రికకుంభకము**-(అష్టాంగయోగములు చూడుఁడు).

**భస్త్రిక కుంభకము**- పద్మాసనమున మఠము వైచుకుని కూర్చుని ఉదరగ్రీవములను వంచకసఁగా నిలిపియుంచి, నోరుమూసికొని రెండు ముక్కురంధ్రములగుండా గాలినిపీల్చి, కుంభించకుండా తోడనే రెండు ముక్కు రంధ్రముల గుండా రేచించుట భస్త్రికకుంభక మని చెప్పఁ బడినది. అనఁగా పూరించుట, రేచించుటలు తప్ప ఇందు కుంభించుటలేదుగాన అలసటవేగఁ గల్గునప్పుడు బంధత్రయపూర్వకముగ సూర్య నాడిద్వారమున పూరించి, కొంచెముసేపు కుంభించి చంద్రనాడిద్వారమున రేచించిన అలసట తీరును.ముక్కుకుడిరంధ్రము సూర్యనాడి,యెడమ రంధ్రము చంద్రనాడి యని యెఱుంగునది.

**భక్షితేఽపి లశునే న శాన్తో వ్యాధిరితి న్యాయము**—ఆచారము విడిచి వెల్లుల్లి తిని నను వ్యాధి కుదురలేదు. విధముచెడినను సుఖము దక్కలే దనునర్థముల నీన్యాయము వాడుదురు.

**భక్ష్యములు ౫(పంచ)భక్ష్యములు**- భక్ష్యమన తినునదియని యర్థము. పిండివంటలు మిఠాయిలు మొదలగునవి భక్ష్యములు.

౧ భక్ష్యములు, ౨ భోజ్యములు, ౩ లేహ్యములు, ౪ చోష్యములు, ౫ పానీయములు.

**భాంగతి గోత్రము**—(ఆత్రేయగణము చూడుఁడు).

**భాంగి గోత్రము**-(గర్గఉపగణముచూ).

**భాకుటిగోత్రము**— (లౌగాక్షిగణము చూడుఁడు.)

**భాగంతి గోత్రము**—(వీతహవ్య లేక యాస్క గణము చూడుఁడు).

**భాగప్రస్థము**— మీరటుపురమునకుఁబడమటగా ముప్పదిమైళ్ళదూరమునఁ గల 'భాగపాట్'అనఁబడుగ్రామము. (మీరటుమండలము యమునానదీతీరము).శ్రీకృష్ణ రాయబారమునం దడిగిన యైదు ప్రాంతములలో నొకఁ. దీనికి జయంత మనియు, మాకండి యనియుఁ బేర్లు కలవు. (శమంతపంచకము చూడుఁడు.)

**భాగమాన గోత్రము** — (ఆత్రేయ గణము చూడుఁడు).

**భాగలగోత్రము** —(ఆత్రేయ గణము చూడుఁడు).

**భాగల గోత్రం**-(ఔతథ్య ఉపగణము చూడుఁడు).

**భాగలి గోత్రం**-(వీతహవ్యలేక యాస్క గణము చూడుఁడు).

**భాగలి గోత్రం** (ఆత్రేయ గణము చూడుఁడు).

**భాగల్లండము**-రీవారాజ్యము, నాగోడు రాజ్యము, మైహారుసంస్థానరాజ్యము, తారోన్

సోహావాల్, కోరీరాజ్యములు మొదలగునవి చేరిన మధ్యయిండియాప్రదేశమున నించుమించుగా ౧౮౫౬౦ చొ॥మైళ్ళ ప్రదేశభూమి కీపేరు వాడఁబడుచున్నది. ఇందుఁ జాల విలువగల యడవులు, గనులు గలవందురు.

**భాగల్పూరుజిల్లా**-భాగల్పూరు ప్రధాన స్థానము. (బీహారు దేశము చూడుఁడు.)

**భాగలేయగోత్రము**—(వీతహవ్య లేక యాస్క-గణము చూడుఁడు).

**భాగవతమతము**—ఈమతకర్త శుక మహర్షి యని చెప్పఁబడినది. శుకమహర్షికృత మగు బ్రహ్మసూత్రభాష్యమును, శుకభాగవతమును ఈమతస్థులకుఁ బ్రమాణగ్రంథములు. అందు శుకభాగవతము వేదతుల్యమందురు. దానికి సర్వవేదాంతసార మని పేరు. వీరివేదము ఋగ్యజు స్సామాథర్వణాత్మక వేదమే యని తెలియఁగునది. విష్ణుపారమ్యమతము. ఇం దీశ్వరుని పేరు నారాయణుఁడని చెప్పఁబడినది.

ఈమతమునఁ బ్రకృతి, పురుషుఁడు, నారాయణుఁడు నని మూఁడు తత్త్వములు. నారాయణుఁడు పరబ్రహ్మము. ప్రకృతివలనఁ బురుషునకు సంసారము కల్గుచున్నదనియు (పురుషులన జీవులనిభావము) పురుషులకు కర్మ,భక్తి,జ్ఞానములు ముక్తిసాధన సాధనములనియు, నారాయణభక్తి తరింపఁజేయశక్తిగలదనియుఁ జెప్పఁబడినది.

కర్మ- ౧ నిషిద్ధకర్మలనియు(ఇవి నరకప్రాప్తికరములు), ౨ ప్రవృత్తికర్మలనియు (ఇవి స్వర్గప్రాప్తికరములు), ౩ నివృత్తికర్మలనియు (ఇవి భక్తిజ్ఞానముల నిచ్చునవి) త్రివిధమని చెప్పఁబడినది.

రెండవదియగు భక్తి నారాయణునియందలి భక్తిగ నిర్వచింపఁబడినది.

ఇందు మూఁడవది యగు జ్ఞాన మనేకజన్మముల కష్టాంగయోగసిద్ధికరమని చెప్పఁబడినది. యోగసిద్ధివలన తత్క్షణమునఁ గాని ప్రారబ్ధాపసానమునఁగాని వైకుంఠముంజేరి నారాయణ బ్రహ్మానందమును ప్రాణి యనుభవింపఁగల్గును. మఱియు నట్టితరి పురుషుఁ డర్చిరాది ధూమాది మార్గనిబంధన లేక తనయిష్టానుసారము వైకుంఠమున కేగఁగల్గుననియుఁ జెప్పఁబడినది. మఱియు రామకృష్ణా ద్యవతారములు నారాయణ తాదాత్మ్యసంబంధములు గాన వాటి నారాధించినను ముక్తినంద వీలగునని చెప్పఁబడినది. ఈమతమున నారాయణుండగు పరబ్రహ్మమునం దైక్యమే ముక్తి.

**భాగవతము**—ఒకపురాణము. సంస్కృతమునఁ దొలుత రచించినది బొప్పనభట్టు గాన దీనికి బొప్పనభట్టీయ మని పేరు కలదు. ఆంధ్రమున పద్యములుగ రచించినది బమ్మెర పోతరాజు. బొప్పన భట్టీయమున ౧౮౦౦౦ గ్రంథసంఖ్య గలదు. ఇది వ్యాసప్రోక్తపురాణముల(అష్టాదశపురాణ)లోనిది కానేరదు. దేవీభాగవతము వ్యాసప్రోక్త పురాణములలోనిది. శ్రీకృష్ణచరితాదు లిందుఁ గలవు.

**భాగవిజ్ఞేయ గోత్రము**—(వీతహవ్య లేక యాస్క-గణము చూడుఁడు).

**భాగవిత్తాయన గోత్రము**-(ఉపమన్యు గణము చూడుఁడు).

**భాగవిత్తి గోత్రము**-(వీతహవ్య లేక యాస్క-గణము చూడుఁడు.)

**భాగవితి గోత్రము**—(ఔతథ్యఉప గణము చూడుఁడు.)

**భాగహారము**—హరించుట లేక భాగించుట.చతుర్విధగణితములలోనొకటి. (గణితము చూడుఁడు.)

**భాగహి గోత్రము**-(ఉపమన్యు గణము చూడుఁడు).

**భాగీరథీ జాహ్నవీ సంగమము**— హిమాలయముపై గడవాల్ రాజ్యమునకుఁ జెందిన యీపవిత్రస్థలి యొకలోయయందుఁ గలదు. పుణ్యతీర్థము. జాహ్నవీనది భాగీరథి యందు సంగమించెడితావు. హరిద్వారము గుండా పోవగును.

**భాగీరథీనది**—భగీరథ మహారాజునకుఁ బరమేశ్వరునిచే నొసంగఁబడిన గంగ హిమవన్నగరముపైఁ గలదు. దీనియం దితరనదులు చేరినపిదప నిదియే గంగయనఁబడినది. (గంగానది చూడుఁడు.)

**భాగురిగోత్రము**- (నిధ్రువగణము చూ).

**భాగురి గోత్రము**-(వీతహవ్య లేక యాస్క-గణము చూడుఁడు.)

**భాగురి] గోత్రము**-శాండిలగణము చూ.

**భాగేశ్వరక్షేత్రము**— సంయుక్తరాష్ట్రములలోని ఆల్మోడానుండి భాట్ పరగణా కేగు మార్గమునందు ఆల్మోడాకు ౨౬ మైళ్లదూరమునందుఁగల శివక్షేత్రము. సరయూ గోమతీ నదుల సంగమముననే భాగనాధశివలింగము కలదు. ఒకపాటి వర్తకస్థలము. ఇది వర్షకాలమున ననారోగ్యప్రదేశమై యుంట నప్పుడు ప్రజలలోఁ బెక్కండ్రును, వర్తకులును, వేఱు తావుల కరిగి తిరుగ వచ్చుచుందురు.

**భాజనము**-(ఆయుర్వేదమానము చూ.

**భాజపృశ్ని గోత్రము** — (భరద్వాజ ఉపగణము చూడుఁడు.)

**భాట్టమతము**- వార్తికకారుఁడైన భట్టు దీసికిఁగర్త. ఇది పూర్వమీమాంసమతమున కించుక భేదము గలదిగ నదే మత మైయున్నది. దీని విధానము.

ఆత్మ స్థిరమును, జడరూపమును నై యున్నది. ఆత్మ చేతనరూపము. నిద్రించి మేల్కాంచినపిదపఁ దాను జడావస్థయం దుంటినని తలంచును. అనఁగా స్మరణగల్గునని భావము. సుషుప్తియం దాత్మస్వరూపము తప్ప మత్తియేదియు జ్ఞానసాధనమై యుండదు. ఇందువలన స్మరణకు సాధనము సుషుప్తియందలిజ్ఞానముగఁ దేలుచున్నది. ఇది యాత్మస్వరూపమే యని చెప్పఁబడినది.

ఇంకను నాత్మ ప్రకాశమువంటి దనియు, అప్రకాశరూప మనియు, (అనఁగా సుషుప్తియందు చేతనాభాస సహిత అజ్ఞానమయ కోశావస్థయు నని) చెప్పఁబడినది. ఆనందమయకోశావస్థ ప్రకాశమానస్థితిగఁ జెప్పఁబడినది. తక్కిన పరిస్థితులన్నియుఁ బూర్వమీమాంసలోనివే.(పూర్వమీమాంసచూడుఁడు.)

**భానుఁడు**—భానుఁడన సూర్యునకు సర్వసాధారణముగ నర్థము కలదు. మఱియు వసుదేవునిసోదరులలో నొకభానుఁడు కలఁడు.

**భానుద్వితీయ**—ఆదివారమున సంభవించినద్వితీయ. పర్వదినము. (పండుగలు, పర్వములు, వ్రతదినములు చూడుఁడు.)

**భానుమతి**— కార్తవీర్యార్జునుని చెలియలు. అహంయాతిభార్య. మఱియు దుర్యోధనునిభార్యయు, సహదేవునిభార్యయు భానుమతినామములు గలవారు. సహదేవునిభార్య శ్రీకృష్ణునిపినతండ్రి భానుఁడనువాని కుమార్తె.

**భానుమంతుఁడు**- కళింగభూపతియగు శ్రుతాయువుయొక్క- కనిష్ఠసోదరుఁ డొకభానుమంతుఁడు.

మఱియు మిథిలారాజ్యాధిపతులలో జనక మహారాజు (సీతతండ్రి) కుమారుఁడని కొన్నిచోట్లను, జనకమహారాజునకు అమితధ్వజుఁడు,

కృతధ్వజుఁడు ననునిర్వురుసుతు లనియు, అందు అమితధ్వజునకు ఖాండిక్యుఁడును, ఖాండిక్యునకు భానుమంతుఁడును సుతులనియు, వేరొకచోఁ జెప్పఁబడినది. (ఇంక కృతధ్వజునకు కేశిధ్వజుఁడు సుతుఁడఁట.)

**భానువు**—రెండవదక్షప్రజాపతికుమార్తె. ధర్మునిభార్యలలో నొకతె. ఈమెసంతతివారు భానువులు.

**భానుసప్తమి**—(రథసప్తమిఁజూడుఁడు). మాఘమాసమున నే యని యెఱుంగునది. మాఘమాసపు ఆదివారములు సూర్యపూజకుఁ బవిత్రదినములు.

**భామహుఁడు**-వరరుచివ్రాసినభాష్యము (వృత్తికి)నకు "మనోరమ" యనువ్యాఖ్యానము వ్రాసిన వైయాకరణి.

**భాయ్దర్శ**--అయోధ్యరాష్ట్రమున ఫైజాబాదుపురమునుండి పదిమైళ్ళదూరమునఁగలదు. శ్రీరాముఁ డరణ్యవాసమునుండి తిరిగివచ్చుతఱి భరతుం డెదురేగ సోదరులు కలుసుకొనిన తావు. తొల్లింట దీని భాయ్దర్శ యనిపేరయ్యెఁ గాని, యిటఁగల గ్రామము నిప్పుడు భద్రాసా యనుచున్నారు. ఇట భరతకుండము గలదు.

**భారత కాలమునాటి వణిఙ్మార్గములు** (Trade Routes in the times of Mahabharatta)—

మానవజాతి యున్నంతకాలమును దేశకాలములతో నిమిత్తములేకయే వాణిజ్యము ప్రబలముగ సాగుచునే యుండును. వాణిజ్యమున కవసరమగు చక్కనిబాటలకు వణిఙ్మార్గము లని పేరు. వణిక్కులమార్గములు వణిఙ్మార్గములు. భారతకాలమున నేదేశమునుండి యేదేశమునకేమార్గ మెట్లేర్పడియుండెనో యట్టివి దెలుపుటయే యీవ్యాసప్రయోజనము.

౧. కళింగ, మగధ, చేది, సాళ్వ శూరసేన దేశములమార్గమున నొక వణిఙ్మార్గమును,

౨. మగధనుండి ప్రాగ్జ్యోతిషము వఱకును, నొక వణిఙ్మార్గమును,

౩. హస్తిపురినుండిపాంచాలమార్గమున కాలయవనుని రాజ్యముమీఁదుగా కుశస్థలమువఱకు గలప్రదేశములమీఁదుగా నొక వణిఙ్మార్గమును నుండెను. "ఇన్ని మార్గములను పరిరక్షించుట, నిరోధించుట, యభివృద్ధిసేయుట, క్రొత్త మార్గములఁ గనిపెట్టుట, మొదలగు ప్రధాన కార్యములు సామ్రాజ్యధురంధరులకు వారి కార్యములై యుండ, నట్టి ప్రధాన కార్యముల నిర్వహింప నెంచక, పాండుపుత్త్రులపై దాడి వెడలుటయా నీకు ప్రప్రథమ కార్యమైనది?" అని భీష్ముఁడు దుర్యోధనునితో నుడివిన ఘట్టమునఁ దెలిపి యున్నాఁడు.

**భారత దుష్ట చతుష్టయము (దుష్ట చతుష్టయము)**—భారతమున ౧ కర్ణుఁడు. అంగరాజు. తండ్రి సూర్యుఁడు. తల్లికుంతీదేవి. ౨ దుశ్శాసనుఁడు. ౩ శకుని, ౪ దుర్యోధనుఁడు హస్తినాపురరాజ్యపు యువరాజు. తండ్రి ధృతరాష్ట్రమహీపాలుఁడు. తల్లి గాన్ధారీదేవి. భార్య భానుమతి. భారత యుద్ధమున మడిసెను.

**భారతయుద్ధకాలమునాటి భరతఖండము**- హిమాలయోత్తరభాగముననున్న నేటి టిబేతులోనివగు ఉత్తరకురు, కాంభోజ, ఉలూక దేశములును, తూర్పున చైనా, ఆస్సాం దేశములలోని ప్రాగ్జ్యోతిషమును, మధ్యఆసియా ఆఫ్ఘనిస్థానములలోని ఉశీనర, మద్ర, బాహ్లిక దేశములును, భరతఖండస్థరాజ్యములు గా నాఁడు పరిగణింపఁబడియుండెను.

యుద్ధసమయమున కెంత విస్తీర్ణము యుద్ధభూమిగా నేర్పఱుపఁబడె నని యోచింప

పదునెనిమిది యక్షౌహిణులసైన్యము నిలిచిన స్థల మిట్లు వర్ణింపఁబడినది.

నేటి యలహాబాదు మొదలించుమించుగ రాజపుత్రస్థానవు టెడారివఱకును యుద్ధరంగ మనియు, నందు వారణావతము, అహిచ్ఛత్రము, పంచనదము, కురుజాంగలము, రోహితకార ణ్యము, కాలకూటము, గంగాకూలములలో కౌరవులసైన్యములు పన్నబడి, యించుమించుగ నైదువందలమైళ్లు యుద్ధరంగమై యుండెననియు, నుద్యోగపర్వము ౧౯౯ అధ్యాయమునఁ దెలుపఁ బడియున్నది. ఆయాహవరంగములో దుర్యోధ నాదుల పక్షమువారగు భీష్మద్రోణాదులకు, పాండవులలోనివారగు శిఖండి ధృష్టద్యుమ్నాదు లెదురుగ నొడ్డనములఁదీర్చి నిలిచియుండిరి.

సైంధవవధమునాఁ డన్నిదిక్కులసైన్యముల నొక్కటిగాఁ గూర్పవలసివచ్చినప్పు డేవైపునఁ జూచినను గౌరవసైన్యమే పదిరెండుయోజన ములస్థలము నాక్రమించియున్నదని మహాభార తము, ద్రోణపర్వము ౧౯౦ అధ్యాయమున వర్ణింపఁబడి యుండుట గుర్తింపఁదగియున్నది.

**భారతము**—భరతవంశపురాజులచరిత్ర. "భారతః పంచమో వేదః" అనఁబడిన ధర్మ ప్రమాణగ్రంథము. గ్రంథసంఖ్య ౨౪౦౦౦. వ్యాసుఁడు తొలుత సంస్కృతమునను, నన్నయ భట్టారకుఁడు, తిక్కనసోమయాజి, ఎఱ్ఱాప్రగ్గడ యును ఆంధ్రపద్యరూపమునను రచించిరి. ఇది పదునెన్మిదిపర్వము లనంబడు పదునెన్మిది భాగ ములుగ నున్నది.

**భారతి (వృత్తి)**-(లక్షణము చూడుఁడు.)

**భారద్వాజ గోత్రము**- భరద్వాజ ఉప గణము చూడుఁడు).

**భారద్వాజ (పక్షి) శాస్త్రము**—భర ద్వాజము నల్లగా నుండును గాన కాటుకపిట్ట యనియు, పసలపోలుగాఁ డనియు నందురు. ఇది పశువులమీఁదఁ గూర్చుండునలవాటుపడినపిట్ట. అదియుండినతావున పంటలకు లోపము రాదం దురు. సిరిగలపక్షిగాన దీనిరాక నందఱు కాం క్షింతురు. దీనిశకునము (ఎదురగుట) సౌఖ్య ప్రదమందురు. ఇది యడ్డముగా నెదుట నెగిరి పర్విడిన శుభప్రద మనియు, మగపక్షి జయ మును, ఆఁడుపక్షి శుభమును, ఎదురైగాని అడ్డ ముగ బర్విడిగాని గల్గించునవి యనియుఁ జెప్పఁ బడినది. ఆఁడుపక్షియు మగపక్షియుఁ గలసి యాటులజరిగిన గొప్పశుభశకునముగఁ దలంపఁ బడెడిని.

**భారద్వాజాయనగోత్రము**- (ఆత్రే యగణము చూడుఁడు.)

**భారమతగోత్రము**- (గర్గఉపగణము చూడుఁడు.)

**భారశివులు**—వీరు వింధ్యాద్రి మొదలు గంగానదివఱకు నడుమనుండుసీమల నేలిన నర పాలురు. వీరు కుషానువంశ నరపాలకుల పిదప రాజ్యమునకు వచ్చిరి. కుషానులనోడించినవారు వీరేయని యనుమానము పరిశీలనలవలన కలు గును గాని నిదర్శనములు కానరాకున్నవి. భార శివులకు వారాటకవంశనృపులతో వివాహసం బంధబాంధవ్యములు కలవు.

**భార్గవ గోత్రము**-(ఆర్ష్టిషేణగణము చూడుఁడు).

**భార్గవ దేశము**—ఇప్పటి ఆసాంపశ్చిమ ప్రాంతసీమల నొకప్పు డీపేరుగలదేశ ముండె నఁట. ప్రజలను భార్గవులని వాడిరఁట. ఆంగ్ల మున భోర్సు అనంబడువార లీతొల్లింటి భార్గస్ అనుపేరువారే నఁట.బ్రహ్మాండపురాణము ౪౯ యం దీప్రశంస గానవచ్చెడిని.

**భార్గవీనది**—ఉత్కలదేశమందలి పూరీ (జగన్నాథము) కి సమీపముగాఁ బ్రవహించు చిన్ననది. దానినిప్పుడు భాగీ యనుచున్నారు.

చైతన్య చరితామృతమున నిత్యానందుఁడీనదీతీరమున (కమలాపుర మనఁబడుతావున) చైతన్యగురుని దండమును విఱచి నదిం బాఱవైచెననియు, దానంజేసి దీనికి"దండ భాగానది" యని పేరయ్యెనని వివరింపఁబడినది.

**భార్గవుఁడు**-చంద్రవంశ క్షత్రియులలో కాశ్యుని సంతతి. తండ్రి అలర్కుఁడు. కుమారుఁడు భార్గభూమి.

మఱియు భృగువంశమున నొకఁ డీపేరు గలవాఁడు గలఁడు.

**భాలంకాయనిగోత్రము**-(లౌగాక్షిగణము చూడుఁడు.)

**భాలన్దనగోత్రము**- (నిధ్రువగణము చూడుఁడు.)

**భాల్లకాయనిగోత్రము**- (జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.)

**భా ల్ల త్గోత్రము**-(గర్గఉపగణము చూడుఁడు.)

**భాల్లవి గోత్రము**-(గర్గఉపగణము చూ)

**భాల్లవి గోత్రము**— (ఆర్ష్టిషేణ గణము చూడుఁడు).

**భాలుక్యగోత్రము**-(పరాశరగణము చూడుఁడు).

**భావంజి కూర (ఆలగిచ్చకూ )**-దీనింగూర్చి సరిగాఁ దెలియదు. దీని యాకుల కూరగఁ జేతురనియు, నది మిక్కిలి వేఁడిచేసి విషదోషములనడంచి, క్రిమి నడంచి, బలము, అగ్ని దీప్తి,శరీరమును తేలికగల్గించుననియందురు.

**భావనా చతుష్టయము**— బౌద్ధమత ధర్మమున ౧ క్షణికము- జగమంతయును క్షణక్షణమునకు మాఱుచుండుట, కొద్దిగనో గొప్పగనో మాఱుట, ఎదుగుట, ఎండుట మొదలగునవి క్షణక్షణమునకు గల్గుచుండు మార్పులు. ౨ దుఃఖము. ౩ స్వలక్షణము. ౪ శూన్యభావన.

**భావాధికరణన్యాయము**- భావించుట యనఁగనే దేనిని? దేనిచేత? ఏరీతిని భావించుట యని యోచన గల్గుననియు, వాటి ప్రత్యుత్తరములకై వెదకికొనవలె ననియు దీని తాత్పర్యము.

**భావికస్వప్నములు**- (స్వప్న శాస్త్రము చూడుఁడు.)

**భావైకదేశావతరణన్యాయము**-వాదమునం దెదుటికక్షివారు తమబలమును చూపుచుండ, తా మోడిపోదురని యితరు లనుకొనకుండ వారు చెప్పుచుండినసంగతులు ఖండించకపూర్వమే తోడ్తోడనే వారిసంగతులకు సంశయములు తామేకరువు పెట్టుచుండుట కీన్యాయము వ రించును.

**భావ్నగరుసంస్థానము**—బొంబైరాజధానీప్రభుత్వమునకు లోఁబడిన చిన్నస్వదేశ సంస్థానము. కచ్ఛిద్వీపకల్పములోనిది. భావ్నగర్పురము రాజధాని.

**భాష ఎనిమిది విధములు (అష భాషలు )**- ౧ సంస్కృతభాష-ఆద్యప్రకృతి, స్వర్గలోకభాష, దేవభాష. కావ్యనాటకాదులందు దేవ, భూసుర, ముని, ఋషి, నృప,అమాత్య, కంచుకి,విట, విదూషక, విరక్తనృపాంగనా వారాంగనాద్యుత్తమ పాత్రలకు సంస్కృతమర్హ భాష.

౨. ప్రాకృతభాష- ఇది ద్వితీయ ప్రకృతి. సంస్కృతజన్యము. మహారాష్ట్ర దేశీయము. క్షపణు(జైన)లు, బౌద్ధులు మొదలగు కర్మసంబంధములేని అవైదికార్థ మతపాత్రలకును, తక్కువ స్త్రీపాత్రలకును ప్రాకృత మర్హభాష. ప్రాకృత వాఙ్మయమును సరస్వతీదేవియొక్క బాల్యమందలి వాక్కులని యనెదరు.

౩. ఆంధ్రము- ఇది సంస్కృతభాషయొక్క వికృతి. త్రిలింగదేశభాషయౌట దీనిం దెలుంగనియెదరు. "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" యని చెప్పఁబడినది.

౪. శౌరసేని-ప్రాకృత జన్యము. శూరసేన దేశమునందు తొల్లింటికాలమున నెక్కువవ్యాపకము గాంచినభాష. వైశ్యశూద్రాది మధ్యమ పాత్రలకీభాష నుపయోగింతురు

౫. మాగధి-ప్రాకృతజన్యము. మగధ దేశమున తొల్లి వ్యాపించినభాష. ధీవర లుబ్ధాద్యులకీభాష నుపయోగింతురు.

౬. అపభ్రంశ భాష- ప్రాకృత జన్యము. ఆభీరదేశమున వ్యాపించినభాష. పతితులకును, ఛండాలురకును, పరమనీచపాత్రలకు నీభాషను వాడిరి.

౭. పైశాచిభాష- ప్రాకృతజన్యము. పాండ్య కేకయ నేపాళాది కొన్ని దేశముల తొల్లింటికాలమున కొంచెముపాటి భేదములతో వ్యాపకము గాంచియుండెనని తెలిసెడిని. పిశాచరాక్షసాది భయంకరపాత్రముల భాష నుపయోగింతురు.

౮. చూళికభాష- ఇదియు పైశాచిక భాషలోని భేదము. దానివలెనే వాడఁబడునది.

**భాష గోత్రము-** (హిమోదక ఉపగణము చూడుఁడు.)

**భాషలవర్ణములు (అక్షరములు —** అనేకభాషలయందు వర్ణము లనేకవిధ సంఖ్యాకములుగ నుండెడిని. వర్ణములన నక్షరములని యర్థము. (క్షరించనివి). సంస్కృతభాషకు వర్ణము లేఁబది. ఇవి పంచాశద్రుద్రరూపము లని చెప్పఁబడినవి. వర్ణసముదాయమున కాంగ్లమున Alphabet అనియెదరు. ఇది గ్రీకుభాషయందలి మొదటి రెండక్షరములగు 'అల్ఫా' 'బీటా' యనుపదములనుండి యేర్పడియెనఁట. ఆంధ్రభాషయందుఁ గొన్ని యచ్చులు, కొన్ని హల్లులు నధికముగనుంట (ఎ, ఒ, ౘ, ౙ, ఱ, ళ అక్షరము లధికములు) ౫౬ అక్షరములైనవి అరవమున పై అక్షర మధికము. లాటిన్భాషయందు ౨౩ను, గ్రీకుభాషయం దిరువదినాల్గును ఇటలీభాషయందు ౨౧ యు, హిబ్రూ (పాలస్తీనాదేశ) భాషయందు, సిరియాదేశభాషయందు ౨౪ గేసి యక్షరములును, పరాసు భాషయందు ౨౫ ను, ఇంగ్లీషు, డచ్చి (హాలండుదేశభాష), జర్మనుభాషలం దిరువదియారేసి యక్షరములును, స్పానియాభాషయందు ౨౭ ను, అరబ్బీభాషయందు ౨౮, కోప్టిక్కు (ఈజిప్టులోనిది) భాషయందు ౩౨, రష్యాభాషయందు ౩౩, స్లెనియాభాషయందు ౩౮, జియోర్జియను భాషయందు ౩౯, స్లావోనిక్కు భాషయందు ౪౦, పారశీకదేశపు జెండుభాషయందు ౪౫ ను అక్షరములు కలవు.

చీనాభాషయం దక్షరములు లేవు. కాని యిరువదివేల యుచ్చారణలు కలవు. (కొన్ని హల్లులును కడ నొకయచ్చుఁగల్గి పలుకఁదగినవి యుచ్చారణ యనఁబడు చున్నది). అవియే అక్షరస్థానములం దుపయోగింపఁ బడుచుండును ఇటాలియనుభాషయందు Trilellion Combinations పదునేడు కలవని చెప్పఁబడినది. అనఁగా నవి యన్నియు విభాగములతోనహా 17,000,000,000,000,000,000 అగునఁట. ఆంగ్లభాషయందుTwentynine thousand

quatrillion combinations కలవని లెక్కించియున్నారు. అనఁగా 20,000,000,000,000,000,000,000,000,000. వీట్లను లెక్కించుట నిరర్థకమని తోఁచెడిని.

**భాష్కల గోత్రము** — (వైన్యగణము చూడుఁడు.)

**భాష్కల గోత్రము**—కణ్వ ఉపగణము చూడుఁడు.)

**భాష్కల గోత్రము**—(భరద్వాజ ఉపగణము చూడుఁడు.)

**భాష్కలి గోత్రము** — (భరద్వాజఉపగణము చూడుఁడు.)

**భాష్టకి గోత్రము**— (కుశికగణము చూ.)

**భాష్టకృత్ గోత్రము**— (గర్గఉపగణము చూడుఁడు.)

**భాష్యణ్యా గోత్రము** —(శరద్వంతఉపగణము చూడుఁడు.)

**భాషాంగరాగములు**-మేళకర్తా రాగములు సంపూర్ణము లనియు, వాట్లనుండి జనించినవి జన్యరాగములనియు, సంగీతశాస్త్రమున మేళకర్తా రాగములందునను జన్యరాగములందునను గూర్చి వ్రాయఁబడినది. (చూ.)

జన్యరాగములు ఉపాంగరాగము లనియు, భాషాంగరాగము లనియు ద్వివిధము. అందు భాషాంగరాగములు తా నే మేళకర్తారాగమునుండి జనించినజన్యరాగమో ఆమేళకర్తా రాగమునందలి స్వరములనే గాక అన్యస్వరములంగూడఁ గలియుండురాగము. సంగీతశాస్త్రమున భాషాంగరాగము లనఁబడినవి. (ఉపాంగరాగములు చూడుఁడు.)

ఇటులనే ధీరశంకరాభరణజన్యమగుబిల్హరి యందు కైశికీనిషాద స్వరమును, నట భైరవి జన్యమగు భైరవిరాగమున చతుశ్రుతి ధైవతమును, అన్యస్వరము ఇవి యెక్కువ సుఖము సంగఁ జేర్పఁబడినవి గాన నివి భాషాంగ రాగములని యెఱుంగునది. (సంగీతము చూ.)

**భాషాంశములు** ౫ ౧ విషయము— (దేనింగూర్చి సూత్రము వ్రాయఁ బడినదో యది.) ౨ విశయము - (అందుఁగల్గెడి సంశయము.) ౩ పూర్వపక్షము - (కాదనిచూపి వాదించుట.) ౪ సిద్ధాంతము - (అగునని చూపుచు వాదించుట.) ౫ సంగతము-(ఆద్యంతసందర్భములవలన నభిప్రాయము కుదిర్చి చూపుట).

**భాసగిరి** —బీహారములోని గయాక్షేత్రము కడనున్న బ్రహ్మయోనిపర్వతశాఖ కీపేరుగలదు.

**భాస్కరగోత్రము**-(వీతహవ్య లేక యాస్కగణము చూడుఁడు.)

**భాస్కరలవణము**—ఇది లవణపు జాతులలోనిది కాదు. భాస్కరుఁ డనువైద్యశిఖామణి రచించిన యౌషధవిశేషము.

శ్లో॥ పిప్పలీ పిప్పలీమూలం ధన్యాకంకృష్ణజీరకం
సైంధవం చ విడంచైవ పత్రంతాలీశ కేసరం
ఏషాద్విపలికాన్భాగాన్ పంచ సౌవర్చలస్య
చ। మరిచా జాజిశుంఠీనా మేకైకస్యఫలం
ఫలం। త్వగేలే చార్ధభాగే చ సాముద్రాత్ కుడవ ద్వయమ్
దాడిమా త్కుడవం చైవ ద్వేఫలే చామ్లవేతసాత్
ఏత చ్చూర్ణీకృతం శ్లక్ష్ణం గంధాద్య మమృతోపమమ్
లవణం భాస్కరం నామ భాస్కరేణ వినిర్మితమ్। జగతస్తు హితార్థాయ వాతశ్లేష్మనుయాపహమ్। వాతగుల్మం నిహం త్యేతద్వాతసూతాని యాని చ॥ (చక్రదత్తః)

ఇది సుప్రసిద్ధాపదము. ఉత్తరదేశములం దధికవ్యాపకము నందియున్నది.

**భాస్కరక్షేత్రములు (౧౦) దశభాస్కరక్షేత్రములు**—౧. వారణాశీక్షేత్రము-కాశీపట్టణము ప్రసిద్ధము.

౨. పుష్పగిరిక్షేత్రము-ఆంధ్రదేశమున బళ్లారిమండలములోని హోసుపేటకు సమీపమున తుంగభద్రానదీతీరమున (జీర్ణవిజయనగరములోని) విరూపాక్షక్షేత్రముకడ నున్న వేరు క్షేత్రము.

౩. కాంచీక్షేత్రము-చెంగల్పట్టు మండలములోని కాంచీపురము.

౪. నివృత్తిక్షేత్రము.

౫. అలంపురీక్షేత్రము--కర్నూలుపట్టణమునకు సమీపము; N. G. S. R. అలంపూర్ రోడ్డుస్టేషనుకు సమీపము.

౬. శ్రీశైలము-- కర్నూలుమండలములోని ప్రసిద్ధక్షేత్రము.

౭. విరూపాక్షక్షేత్రము- బళ్లారిమండలములోని హోసుపేటకడనున్న తొల్లింటిజీర్ణవిజయనగరములోని యిప్పటి హంపీగ్రామ మనంబడు విరూపాక్షక్షేత్రము (పంపాపతి శివలింగము).

౮. శ్రీరామసేతు- రామేశ్వర దేవస్థానమును, అటకు పదునెన్మిదిమైళ్ళుగల సేతువును సుప్రసిద్ధక్షేత్రములు.

గోకర్ణక్షేత్రము- బొంబై రాజధానిలోని ఉత్తరకన్నడపు (కార్వార్) జిల్లాలోని గోకర్ణక్షేత్రము.

౧౦. కేదారక్షేత్రము- హిమవన్నగముపై గడవాలు సంస్థానపుహద్దులలోని బదరీకేదారక్షేత్రము.

వీటియందు ప్రాయశ్చిత్తాదులు, పిత్రర్చనలు, జరుపఁదగునని చెప్పఁబడినది

**భాస్కరాచార్యుఁడు (మతకర్త)**-ఈమహనీయుఁ డొకతరి నొకసన్యాశిని భిక్షకుఁ బిలిచెనఁట. అతఁడు వేళకు రాకపోయె. మబ్బుగలినదిన మగుట సాయంకాలమయినటుండెనఁట. అంత సన్యాశి వచ్చి సూర్యాస్తమయినకతన భుజింపరా దని తెల్పెనఁట. భాస్కరాచార్యుఁడు ఖిన్నుఁడై సూర్యునిం బ్రార్థింపఁ బశ్చిమముననున్న నింబవృక్షము (వేపచెట్టు)గుండా ఇంచుకమబ్బు వీడిపోయి సూర్యదర్శనమాయెనఁట. నాఁడాదిగ నాయనకు నింబార్కుఁడని పేరు వాడుకయయ్యెనఁట. గాన భాస్కరాచార్యకృతమగు మతమునకు నింబార్కమత మని పేరు ప్రసిద్ధంబయ్యెనఁట. (నింబార్కమతము చూడుఁడు.) సూర్యసిద్ధాంతమును రచించినది వీరేయని కొందరనెదరు. వీరు సూర్యాంశజనితులని ప్రతీతి కలదు. వీరిమతానుసారము వేదభాష్యము రచించిరఁట గాని మహమ్మదీయులకాలమున నది నశింపఁ జేయఁబడిన దందురు. వీరిమతమునకు భాగవతము ప్రమాణగ్రంథము. రాధాకృష్ణులఁ బూజించు భక్తులు.

**భాస్కరాచార్యులులేక భాస్కరపండితుఁడు లేక భాస్కరకవి**— ఆంధ్రకవులలోమధ్యకవులందుఁ బేర్కొనఁబడినవాడు

ఈకవి యాదికాలమునాఁ డార్యవైశ్యులకు కులగురువై పౌరోహితుఁడై యుండినవాఁడు.

రచించినది కన్యకాపురాణము. ఇది కుసుమశ్రేష్ఠికొమరితగా జన్మించిన వాసవకన్యకాపరమేశ్వరీచరిత్రమును నూటరెండుగోత్రముల యార్యవైశ్యులగ్నిగుండంబునఁబడుట, కొందరు వెడలిపోవుట మొదలగు కథనములుగల పద్యకావ్యము. ఇతనికాలము కన్యకాపరమేశ్వరి యుండినకాలమును,పిదపనుగూడనె యుండును.

ఇతనినిభాస్కరపంతులని యిటీవలివారువాడిరి.

**భాస్కరీయసిద్ధాంతమతము** - ఇది షడ్వేదాంతవాదిమతములలో నొకటి. ఈ మతమున నీశ్వరుఁడు సచ్చిదానందాత్మక నిర్గుణపరబ్రహ్మము. ౧ సత్ అన త్రికాలాబాధ్యము. (భూతవర్తమాన భవిష్యత్కాలముల బాధలు లేనిదని భావము), ౨ చిత్ అన నొకదానినుండి కల్గినది గాక, తనస్వప్రకాశప్రతిభయే కల్గియుండుట, ౩ ఆనందమన దుఃఖములు వేదనలు లేని సంతసము. ఈమూఁడును గుణములుగాఁగలదిగ బ్రహ్మము నిర్వచింపఁబడినది. ఇది యీమతమున నీశ్వరునిలక్షణము.

ఈ మతమునందు పరిణామ వికారములు రెండు వివరింపఁ బడినవి. సముద్రజలము తరంగములవలె పెక్కురూపములం ధరించియు, కొంతసేపుండి తిరుగ యథాప్రకారముగ సముద్రజలములఁ గలసిపోవునటుల, పరబ్రహ్మపదార్థముగుజగత్తు వేర్వేరురూపములనొంది వేర్వేరు పదార్థములై వేర్వేరు పేరులఁబరఁగుచుఁ గొంతకాల ముండి, యారూపములు నశించి, నాపేర్లం గోల్పోవుచు మారి, తొల్లింటి జగద్వస్తువితతిలో నైక్యమైపోవుట బ్రహ్మముయొక్క పరిణామ మనియు, నటులఁ గాక పాలు వికారముం జెంద పెరుఁగుగనో మజ్జిగగనో యగుట (అనఁగాఁ దిరిగి తొల్లింటి వస్తువుగనై యుం డైక్యమునందఁజాలక వేరురూపము స్థిరమగుట) వికార మనియు, బ్రహ్మమున కీవికార మగుట లేనేలే దనియు నీమతసిద్ధాంతము.

సంసారము మొదలగు జగద్భేదనలన్నియు మిథ్యయే గాన బ్రహ్మముయొక్క వికారరూపములవలె భ్రమింపఁ జేయుచున్నవియే గాని, నిజమున గావనియు, జగద్వస్తుసముదాయము వేర్వేరు నామరూపములందుచు, తిరుగ వాట్లగోల్పోవుచో పూర్వస్థితికిఁ జేరుచుంట బ్రహ్మముయొక్క పరిణామమనియుఁ జెప్పఁబడినది. ఈశ్వరుఁడు నిర్వికారుఁడనియీమతసిద్ధాంతము. సంసారాదివేదనలన్నియు నజ్ఞానమువలనఁగల్గిన భ్రమలే కాని నిజము కావనియు, నిదియే నిజమగుమిథ్య యనియుఁ జెప్పఁబడినది.

ఈశ్వరపరిణామమగు జగమంతయుసత్యము. ఆత్మ శరీరమునకంటె వేరగుపదార్థము. ఆత్మజ్ఞానము నిజమగు వేదాంతవిజ్ఞానము నెఱుంగుటఁ దెలియఁగలదు. ప్రాణి (ఆత్మ) బ్రహ్మపదార్థము గాని యన్యము కాదు. బ్రహ్మముయొక్క పరిణామవికారభేదముల నెఱుంగుటనాత్మజ్ఞాన మెఱుంగ దారితీయును. ఆత్మ పరమాత్మల జ్ఞాన మైక్యము దారితీయును. ఈజ్ఞానము నెఱుంగుటవలన ముక్తి గలెడిని. జీవాత్మపరమాత్మల యైక్యమే ముక్తిగాఁ జెప్పఁబడినది(భాస్కరాచార్యుఁడు(మతకర్త)చూ.)

**భాస్త్రేయగోత్రము**- (జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.)

**భాస్వరగణము**— వీరి నభాస్వరు లని కొందరు వాడియున్నారు. భాస్వరు లన 'ప్రకాశించువా' రని యర్థము. వీ రరువదినల్వు రని చెప్పఁబడినది. కాని పేరులు తెలియవు.

భాస్వరులు నవదేవతాగణములలోనివారు.

**భాస్వరము (ఫోస్ఫరస్) Phosphorus**— జర్మనుభాషయందు 'ఫోస్ఫరస్' అన వెలుతురుఁ దెచ్చునని యర్థము. ఇది 'కెమికల్ యెలిమెంట్' అని చెప్పఁబడినది. దీని కెమికల్ సింబల్ Pఅనియు, ఎటోమిక్ వెయిట్ 31.027 అనియు, ఎటోమిక్ నెంబరు 15 అనియుఁ జెప్పఁబడినది. ఇది ఫోస్ఫేటుతో గలిసి దొరకుం గాని ప్రత్యేకముగ దొరకునది గాదు. ఇది మొక్కలయందుండును గాన వాటిని దినిన పశువులలో

నికిఁ జేరుకొని వాటి యెముకలందు ఫోస్ఫేటు రూపమున దొరకెడిని. ఆ బ్లెముకలందుఁ జేరుకొనిన ఫోస్ఫేటు ఎముకలబరువునం దైదింట మూఁడుభాగములుండునని లెక్కించియున్నారు.

ఫోస్ఫరస్ వాయుపథమునకు బహిరంగపఱుపఁబడగనే మండును. ఇదిపచ్చగనుండును. దీనిని సెంటిగ్రేడు తెర్మామీటరు ౨౮౦ లేక ౨౯౦ డిగ్రీల వేఁడిచేసి యెఱ్ఱఫోస్ఫరస్ గఁ జేయనగును. అట్టిది యగ్గిపుల్లలుచేయుటయం దుపయోగించుచున్నారు. 'ఫోస్ఫరసు వరమ్ కిల్లర్' అని చెప్పఁబడినది.

ఫోస్ఫరసునకు సంస్కృతపు పేరు భాస్వరము.

**భిత్రి జయస్తంభము**—బెంగాల్ నార్తు వెస్ట్రిన్ రెయిల్వే. (B.N.W.Ry.)సయ్యద్పూర్ భిత్రిస్టేషనునుండి యీశాన్యదిశగా నైదు మైళ్ళదూరమున, నఁగా బనారసు గాజీపూర్ రస్తాపై బనారసునుండి ౨౩ మైళ్ళదూరమున భిత్రి యను పెద్దగ్రామము గలదు. ఇట స్కందగుప్తమహారాజు హూన్నులఁ జయించినట్టి శాసనముతో జయస్తంభము కలదు. దీనిపైనుండిన విష్ణువిగ్రహము శిథిలము జేయఁబడినది. ఈ స్తంభమందలి శిలాశాసనము క్రీ. వె. ౪౫౫ సంవత్సరమున హూన్నులం జయించినటులఁ జెక్కఁబడినది. ఇది యొకచౌకపుదిమ్మపై ౨౮ అడుగులయెత్తుగల యేకాండీశిలా స్తంభము.

**భిభ్రాజ (సరోవర)ము**— ఇది మానససరోవరమని హరివంశము ౨౩ అధ్యాయమునఁ గలదు. ఇది టిబెట్టునందు కైలాసశిఖరమున కీవతల నున్నది.

**భిలి గోత్రము**—(రథీతర ఉపగణము చూడుఁడు).

**భిలీభాయనగోత్రము**— రథీతరఉపగణము చూడుఁడు).

**భిల్లీచందనన్యాయము**—కిరాత స్త్రీకి భిల్లి యందురు. అరణ్యమందుండుమంచిగందపు వృక్షపువిలువ నెఱుంగనిభిల్లి దానింబగులఁగొట్టి పొయిలో కట్టెలక్రిందఁ గాల్చినను గాల్చునని భావము. విలువనెఱుంగనివారు దుర్వినియోగ మొనర్చుటను దెలుపున్యాయము.

**భిల్లులు**- కిరాతజాతులలోని యొక తెగవారు. స్త్రీలను భిల్లి యందురు. రాజపుత్రస్థానమున విస్తారముగ వ్యాపించియున్నారు.

అర్జునుఁడు తపంబొనరించుతఱి నతని వెన్నునఁ గలమచ్చను శక్తిం జూపుటకు పార్వతీపరమేశ్వరులు భిల్లదంపతుల రూపమున వచ్చి యర్జునునితో మాయాకలహమునకుఁ గడంగి కలహలీలయం దోడుట నభినయించి పార్వతి కాతని వీపుమచ్చంజూపి యర్జునునకుఁ బ్రసన్నుండై పాశుపతాస్త్ర మొసంగెనని మహాభారతమునఁ జెప్పఁబడినది.

భిల్లులు గుజరాతిభాషకుఁ జెందినభాషను మాట్లాడుదురు. భరతదేశమునఁ బదిలక్షలు కలరఁట. ధనుర్విద్యానిపుణతి గలవారు.

**భిక్షాధికారి యైనను గావలయును, లక్షాధికారియైనను గావలయును**—(ఆంధ్రలోకోక్తి.)

**భిక్షిరిగోత్రము** -(సిధృవగణము చూ.)

**భిక్షుపాదప్రసరణన్యాయము**-- బౌద్ధమతసన్యాసులకు భిక్షువు లనిపేరు. ఆభిక్షువు లెవ్వరిని యాచింపక తమంతటతా మొసంగిన భోజనపదార్థములను మాత్రము గైకొనుచు వెచినచోట నాగక, స్త్రీలకేసిచూడక మోము కడ్డముగ వీవనం ద్రిప్పుచు నేగవలయు నని విధులు కలవు. ఇటుల నిర్బంధముల మేరకుఁ ద్వరితముగఁ గాళను, ఎక్కడ నిలువకను నడపుట కీన్యాయము వర్తించును.

**భిక్షువు**—(బౌద్ధసన్యాసి లామా చూ.)

**భీజితిగెరాత్రిము**-(శరద్వంతఉపగణము చూడుడు.)

**భీమకవీయప్రశ్న (లక్షణము) శాస్త్రము**—వేములవాడభీమకవి గొప్ప దైవజ్ఞుడని (జ్యోతిశ్శాస్త్రవేత్తయని) చెప్పబడినది. ఈతడొక ప్రశ్న లక్షణమును, ఒక జ్యోతిషవిధానమును రచించె నట. ఇవి చాల చిన్నగ్రంథములు. ఐనను నాంధ్ర వాఙ్మయమున నుంట వాట్లనీగ్రంథమున వివరించుట సమంజసమని తోచెడిని. అందు ప్రశ్నలక్షణ మేడు శ్లోకములు మాత్రమే గలది.

శ్లో. ప్రష్టోక్తాద్యాని అంకాని అష్టభాగాఽవశిష్టకే। సూర్యాదితోగ్రహం జ్ఞాత్వా తాని చాఽష్టోత్తరే శతే ॥ ౧

శ్లో. త్యక్త్వా శేషంతు విజ్ఞాయ పునః పృష్టం తథా వద। అంకాని చాష్ట శేషేతు పూర్వవద్గ్రహనిర్ణయః ॥ ౨

శ్లో. అష్టోత్తరశతే శేషే పునరుక్తాని సంత్యజ। శిష్టాష్టోత్తర శేషే తు అష్టభిర్హ్వారణేశ్చ తే॥ ౩

శ్లో. శేషే గ్రహాన్తు విజ్ఞాయ ప్రథమోక్తాంకశేషకే। ఏకం విసృజ్య శేషాంకా నష్టభిరుణయే తతః॥

శ్లో. తస్మిన్ ది శేషం తు సంయుక్తేఽంక వినిర్ణయః గ్రహాత్రయం నిరయాంకే క్రమాత్తిష్ఠే త్ఫలం భవేత్॥ ౫

శ్లో. ఆద్యోక్తాంకస్య శేషంతు జ్ఞేయమాద్య గ్రహేణ హి। తస్మిన్నేకం విసృజ్యాఽథ గుణయే చ్ఛేష మష్టధా॥ ౬

శ్లో. గుణితాంకేషు సంయోజ్య ద్వితీయగ్రహసంఖ్యకమ్। మిళితాంకానియావంతి తచ్ఛ్లోకే సగ్రహాక్రమః॥ ౭



శ్లో. ఇత్యుక్తమ్ భీమకవినా స్వలోకోపకారకమ్। విధానముం దెల్పుట కీక్రింది రెండుశ్లోకములుం జెప్పబడినవి:—

• మేకి మేకీ మేకి మేకీ మెమె మేకీ దశైవమే। కిమె మేకీ చ షణ్మేకీ కిమె మేళ్యష్ట మేకిమే॥

• కీకీ మెమెకి మేమేకీ షణ్మే మేకీ కిమేత్యపి। చతుష్షష్ట్యాత్మకశ్లోకఫల మేవం ప్రకీర్తితమ్॥

ఫలశ్లోకములు అఱువదినాలుగు:—

శ్లో. రవౌ షట్చ ద్వాదశంచ త్రింశత్షష్టిర్గుణశతిః।త్రయస్త్రింశ చ్చతుస్త్రింశ త్సప్తత్రింశ దథోచ్యతే॥ ౧

యః పంచదశకం శ్లోకం భీమోక్తగ్రంథతత్త్వగమ్॥

శ్లో. ఆదిత్యార్క సుధాంశుశ్చేద్విజయశ్రీసమాగమః। ఈప్సితం సుఖసంపత్తిః కల్పవృక్ష ప్రదర్శనాత్॥

అరువదినాలుగు ఫలశ్లోకముల ప్రారంభము:—

శ్లో. భానుచంద్రార్కయుక్తశ్చేద్విదేశగమనం భవేత్। బంధువర్గజనైర్ద్వేష శ్శాంతివృక్ష ప్రదర్శనాత్

శ్లో. అర్కాంగా రాహియుక్తాశ్చే త్స్వస్థానే పూజ్యతే సదా। జ్వరాదిరోగ నాశశ్చ లభతే ప్రియదర్శనాత్ ॥ ౨

శ్లో. అర్కసౌమ్యశని ర్యత్రి దృశ్యంతే కార్యహానితః।శక్రిస్యాఽపి శ్రియంహంతి మారకస్య ప్రదర్శనాత్ ॥ ౩

శ్లో. సూర్య జీవ భృగుర్యోగా ద్భూలాభస్సుప్రియం భవేత్। సుఖాసిమాయురారోగ్య లభతే మృగదర్శనాత్ ॥ ౪

శ్లో. మార్తాండ శుక్ర జీవాశ్చేన్మరణంరోగపీడనమ్। కుక్షిరోగం మానహానిః కారాగృహ నిదర్శనాత్ ॥ ౫

శ్లో. అర్కార్కి బుధసంయోగే బంధుప్రీత్యాచ జీవనమ్ । నష్టస్య లాభ దేశత్వం విమానం పూజ్యదర్శనాత్ ॥ ౬

శ్లో. అర్కాహిభౌమ సంయోగే వ్యాధిరోగాది ధైర్యకృత్ । మానహాని ర్ధనాశశ్చ కారాగృహ నిదర్శనాత్ ॥ ౭

శ్లో. యతేంద్రుభానుసూర్యాశ్చ స్వస్థానే పూజతే సదా । ఈప్సితం సర్వసంపత్తి రైరావత నిదర్శనాత్ ౮

శ్లో. చంద్రసోమాహి యుక్తాశ్చేత్ సర్వం సంవత్సమృద్ధయః సువార్తా రాజపూజా చ విజయశ్రీ నిదర్శనాత్ ॥ ౯.

శ్లో. చంద్రాంగారకార్కిచ వినష్టం లభతే ధనమ్ । విజయం సర్వసంపత్తిః మహామేరు ప్రదర్శనాత్ ॥ ౧౦.

శ్లో. సుధాంశు సౌమ్యశుక్రాశ్చే ద్వ్యాధిః భౌమ భయం భవేత్ । భవే త్స్వజనవిద్వేషో దావానల నిదర్శనాత్ ॥ ౧౧.

శ్లో. యధేందు గురు జీవాశ్చ ధనధాన్య సమృద్ధయః । రాజపూజ్యాం మహా కీర్తిః పద్మాకరనిదర్శనాత్ ॥ ౧౨.

శ్లో. యధేందు శుక్రసౌమాశ్చ ద, తత్ర బంధుభిః । దృశ్యతే సుఖసం వాచ్యం కుంజరస్య ప్రదర్శనాత్ ॥ ౧౩.

శ్లో. యది చంద్రార్కి భౌమాశ్చ ధనలాభః ప్రియం యశః । బంధుప్రీతి రతిశ్చైవ శ్వేతచ్ఛత్రాది దర్శనాత్ ॥ ౧౪.

శ్లో. యధేందు రాహుచంద్రాశ్చ పురా భూపభయం భవేత్ । పశ్చా ద్రాజ్ఞస్య సన్మానం దధికుంభ ప్రదర్శనాత్ ॥ ౧౫

శ్లో. యధా కుజార్క రాహుశ్చ బహులాభ స్తధా భవేత్ । జయం లాభో నృపా త్పూజా మత్తమాతంగదర్శనాత్ ॥ ౧౬.

శ్లో. అర్ధచంద్రార్క సంయోగే ప్రస్థానే భయ ముచ్యతే । స్వస్థానే సుఖ మాప్నోతి కామధేను ప్రదర్శనాత్ ॥ ౧౭.

శ్లో. భౌమద్వయసితై ర్యుక్తే ధనలాభః ప్రియం యశః । శ్రీలాభంచ సుసంప్రీతిః కామధేను ప్రదర్శనాత్ ॥ ౧౮.

శ్లో. అర్ధసౌమ్య సురేజ్యాశ్చేత్ నీచాశ్రయ తతో భవేత్ । స్వస్థానే సుఖ మాప్నోతి హరిదశ్వస్య దర్శనాత్ ॥ ౧౯.

శ్లో. అంగార గురు సౌమ్యాశ్చేత్ సర్వశత్రు క్షయో భవేత్ । స్వస్థానే సుఖ మాప్నోతి హరిదశ్వస్య దర్శనాత్ ॥ ౨౦.

శ్లో. భౌమ శుక్రజేషు స్యాత్ రాజ్యలాభో ధనాగమః । భూలాభో వస్త్రలాభ శ్చ ధరణీధ్రప్రదర్శనాత్ ॥ ౨౧.

శ్లో. భౌమ మంద సుధాంశుశ్చేత్ కార్యహాని రనర్థతా । అతిక్లేశశ్చ భవతి శాల్యవృక్ష ప్రదర్శనాత్ ॥ ౨౨.

శ్లో. భాను స్వర్భాను భానూనాం మనసా చింతితం ఫలమ్ । బంధుమిత్రధన ప్రాప్తిః చింతామణినిదర్శనాత్ ॥ ౨౩.

శ్లో. బుధార్కార్కిషు యుక్తేషు మిత్రతా మధిగచ్ఛతి । ధనలాభంచ విజ్ఞేయం పద్మాకర నిదర్శనాత్ ॥ ౨౪.

శ్లో. బుధేందు సితయోగే స్యా దతిక్లేశో మహద్భయమ్ । బంధుమిత్ర విరోధశ్చ శూన్యవాపీప్రదర్శనాత్ ॥ ౨౫.

శ్లో. సౌమ్యార్క గురుసంయోగే ఉప్యనేక శుభదర్శనమ్ । స్వస్థానే సుఖ మాప్నోతి తరుణాదిత్యదర్శనాత్ ॥ ౨౬.

శ్లో. సౌమ్యాత్రయసమాయోగే రాజపూజా ధనాగమః । సౌఖ్యంచ ప్రియతం చైవ చూతవృక్షప్రదర్శనాత్ ॥ ౨౭.

శ్లో. జషు స్యాత్ రాజ్యలాభో
ధనాగమః | శ్రీలాభ స్యా త్సమాయోగే
రక్తాంబరనిదర్శనాత్ ॥ ౨౮.

శ్లో. సౌమ్యశుక్రేందుసంయోగే ఆరోగ్యం
ధనసంపదః | గమనే సుఖ మాప్నోతి
కేతక్యాశ్చ ప్రదర్శనాత్ ॥ ౨౯.

శ్లో. సౌమ్యార్క భానుసంయోగే ధనోత్సాహ
వివర్ధనమ్ | సర్వోత్సాహా మనుష్యా
ణాం బృందావననిదర్శనాత్ ॥ 30.

శ్లో. బుధో రాహుశ్చ రాహుశ్చ సహసా
సర్వసంపదః | సంస్థానే కార్యసంపత్తిః
ఐరావతనిదర్శనాత్ ॥ 3౧.

శ్లో. గురుభానుశ్చ శుక్రశ్చ యాత్రాయాం
నిష్ఫలం భవేత్ | మిత్ర స్యాత్మవిరో
ధశ్చ శూన్యవాపీప్రదర్శనాత్ ॥ 3౨.

శ్లో. గురుచంద్రసురేజ్యాశ్చమహా దుఃఖ
మవాప్నుయాత్ | ఆత్మార్థం బంధు
విద్వేషః భిన్నపత్రప్రదర్శనాత్ ॥ 33

శ్లో. గురుభౌమబుధేషు స్యాత్ నష్టద్రవ్యా
గమో భవేత్ | రాజ్యలాభో మహో
త్సాహా దర్పణస్య ప్రదర్శనాత్ ॥3౪

శ్లో. గురుసౌమ్యార్క సంయోగే ఈప్సితస్య
సమాగమః | అతిస్నేహశ్చ సౌఖ్యంచ
నవరత్న ప్రదర్శనాత్ ॥ 3౫

శ్లో. గురుద్వయేందుసంయోగే గోత్రబంధు
విరోధకృత్ | కార్యనాశశ్చ జాయంతే
వసుదేవప్రదర్శనాత్ ॥ 3౬

శ్లో. గురుభార్గవభాను శ్చ విద్యాలాభ శ్చ
సర్వదా | గురుప్రతిష్ఠాసంపత్తిః దేవేం
ద్రస్య ప్రదర్శనాత్ ॥ 3౭

శ్లో. వాగీశమందరాహూణామ్ ఉదయో
రాజ్యసంపదః | మిత్రలాభో నృపా
త్పూజా కుమారస్వామిదర్శనాత్ ॥ 3౮

శ్లో. జీవాహి మందసంయోగే శతుర్భయ
మథాగమః | అర్థలాభో భవే త్సౌఖ్యం
ఐరావత్యాః ప్రదర్శనాత్ ॥ 3౯

శ్లో. శుక్రభానుశ్చ జీవశ్చ పుత్రలాభో ధనా
గమః | పుత్రసౌఖ్యంచ భాగ్యంచ ధనాది
ప్రియదర్శనాత్ ॥ ౪0

శ్లో. శుక్ర సౌమ్య బుధేషు స్యాత్ శత్రునాశో
ధనాగమః | జనాశ్వ ధన సంపత్తిః
దీర్ఘ జస్య ప్రదర్శనాత్ ॥ ౪౧

శ్లో. శుక్రభాను కుజేషు స్యాత్ పుత్రలాభో
ధనాగమః | స్థానేస్థానేతు పూజ్యంతే
పుష్పవృక్ష ప్రదర్శనాత్ ॥ ౪౨

శ్లో. కావ్య సౌమ్యేందు సంయోగే రాజకీర్తి
ర్ధనాగమః| కార్యసిద్ధిశ్చ విజ్ఞేయా పూర్ణ
కుంభ ప్రదర్శనాత్ ॥ ౪3

శ్లో. కావ్యజీవార్క సంయోగే సర్వకార్యంచ
సిద్ధ్యతి | భవే త్సుఖంచ కీర్తించ పూర్ణ
కుంభ ప్రదర్శనాత్ ॥ ౪౪

శ్లో. శుక్రద్వయ భుజంగాశ్చ జన్మపీడాపరా
ధవః విదేశగమనే చింతా ఊషరస్య
ప్రదర్శనాత్ ॥ ౪౫

శ్లో. శుక్రార్క మందసంయోగే అప్సుతేరాజ
సంపదః|యాత్రాయా మర్థలాభ స్యాత్
లతావల్లీ ప్రదర్శనాత్ ॥ ౪౬

శ్లో. శుక్రరాహుసితేర్యుక్తే నృపపీడా రణే
తథా చిత్తనాశశ్చ భీతిశ్చ చంద్రికా
యాశ్చ దర్శనాత్ ॥ ౪౭

శ్లో. యది మందార్క సౌమ్యాశ్చ శత్రుపీడా
పరాభవః | దేశే సర్వార్థహానిశ్చ శఫలీ
శత్రుదర్శనాత్ ॥ ౪౮

శ్లో. మందేందు భూమిజాయోగే యేనకేనచ
యస్య వా | పుత్రలాభో యశశ్చైవ
షోడశోపరి దర్శనాత్ ॥ ౪౯

శ్లో. మంద మంగళ చంద్రాశ్చ రాజపూజా ధనాగమః। భవేచ్చ మహతీలక్ష్మీ స్స్వర్ణ కుంభప్రదర్శనాత్॥ ౫౦

శ్లో. భవే న్మందజ్ఞసూర్యేషు విద్యాసౌఖ్యం ధనం యశః। అంతే మహద్భయం చైవ కార్యభంగనిదర్శనాత్॥ ౫౧

శ్లో. మందజీవ భుజంగేషు పుత్రలాభో ధనాగమః। యోషిత్సంగం చ లభతే క్షీర సాగర దర్శనాత్॥ ౫౨

శ్లో. శని శుక్రార్క సంయోగే స్థానభ్రష్టం స్థిరంయశః। అంతే మహద్భయం చైవ కార్యభంగ నిదర్శనాత్॥ ౫౩

శ్లో. ద్వయార్క శుక్రసంయోగే సుస్థిరాశ్చ సుఖాదయః। గమనే కలహం రూఢిః రూపరాగ ప్రదర్శనాత్॥ ౫౪

శ్లో. మందాహి గురుసంయోగే సుస్థిర శ్చ సుఖోదయః।గమనే భూమణంభూతిఃపుత్ర జీవ ప్రదర్శనాత్॥ ౫౫

శ్లో. రాహుభాను కుజేషుస్యాత్ రాజ్యలాభో ధనాగమః। స్థానే స్థానేతు పూజ్యంతే మిత్రలాభ ప్రదర్శనాత్॥ ౫౬

శ్లో. రాహు చంద్రేందు సంయోగే యాత్రా సిద్ధి స్సమాగమః। స్నేహవృద్ధిశ్చ భవతి శంఖవస్త్ర ప్రదర్శనాత్॥ ౫౭

శ్లో. రాహు మంగళ భానూనామ్ ఉదయే మంగళోత్సవః। సర్వశతృజయావాప్తిః దేవేంద్రస్య ప్రదర్శనాత్॥ ౫౮

శ్లో. రాహుసౌమ్య భుజంగేషు శతృనాశో ధనాగమః। కార్యసిద్ధిశ్చ భవతి మహామేరు ప్రదర్శనాత్॥ ౫౯

శ్లో. భుజంగ జీవ మందేషు తేజో విజయవృద్ధయః। రాజపూజా భవే ద్వృద్ధిః మహాలక్ష్మీ ప్రదర్శనాత్॥ ౬౦

శ్లో. రాహు శుక్ర సితేషు స్యాత్ వ్యర్థతా కార్యనాశనమ్। శత్రుపీడా చ భవతి నష్ట చంద్ర ప్రదర్శనాత్॥ ౬౧

శ్లో. రాహుర్మందో గురుశ్చైవ యాత్రా మర్థ ఫలం భవేత్।పశ్చాత్క్రమేణ సౌఖ్యంచ దధికృత్య నిదర్శనాత్॥ ౬౨

శ్లో. సరాహు రాహు సౌమ్యాశ్చ ధనలాభో భవే త్సుఖమ్। గమనే రాజపూజా చ పూర్ణకుంభ ప్రదర్శనాత్॥ ౬౩

[ఇందు కొన్ని తప్పులును గలవు. వాటిని సవరించి టీకాతాత్పర్యములు వ్రాయఁగలవారు వ్రాసిన లోకమున కుపచరింపనోపు].

**భీమద్వాదశి**--మాఘశుద్ధద్వాదశి కీపేరు కలదు. పాండవద్వితీయుఁడగు భీమసేనుఁడు వ్రత మాచరించినదాదిగ నాయనపేరఁ బరఁగు చున్నదఁట.

**భీమభాసద్రుఢన్యాయము**-భీముఁడు, భాసుఁడు, ద్రుఢుఁడు అసురులు.

**భీమరథా లేక భీమరథీ నది**--కృష్ణా నదిలో సంగమించు భీమానది. దీనింగూర్చి గరుడపురాణము ౧-౫౫ నందునను,మార్కండేయపురాణము ౫౭ అధ్యాయమునను ప్రశంసింపఁబడినది.

**భీమరథుఁడు**—అత్రి చంద్ర యాదవ క్షత్రియుఁడు. తండ్రి వికృతి. కుమాళ్ళు ౧. మధురథుఁడు, ౨. శకుని, యనువారలు. పౌత్రులు మధురథునకు దేవమతియు, శకునికి కరన్తియు ననువారలు.

**భీమశంకరదేవస్థానము** — ద్వాదశ తేజోలింగములలో నొకటి. భీమానదిజన్మస్థానముకడ నున్నది. పూనా నగరప్రాంతమున సహ్యాద్రిపైనున్న క్షేత్రము. దీనిని ఢాకినీక్షేత్ర మనుచున్నారు. (ఢాకినీక్షేత్రము చూడుఁడు.)

**భీమశంకరలింగము**—(ద్వాదశ తేజో లింగములు- రెండవవ్యాసము చూడుఁడు.)

**భీమశిష్టకులగోత్రము** — ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్య గోత్రములు చూడుఁడు.)

భీమశిష్టకుల(భీమ శ్రేష్ఠకుల భమష్టి)గోత్రము ఏకార్షేయ (౫౭)గోత్రము. సంస్కృతగోత్రము. వాసుదేవస వసుదేవగణము. జాబాలిరి. ఆపస్తంబయజుశ్శాఖ. ప్రమాణ ఆద్యప్రవరఖండః. సమానగోత్రము. జాబాలిస భీమేశుఁడు దేవత. భీమాంబ భార్య. సింధునదీతీరము తపస్థానము. భీమాబితటాకము.జపములక్ష. దీపములు ౧౦౦. క్షేత్రసంఖ్య ౧౦౦. రత్నములు దానము. తెల్ల పట్టు భీమశాకము వర్జనీయములు.

**భీమసేనుఁడు**-అత్రి చంద్ర పూరు కురు సంతతి క్షత్రియుఁడు. తండ్రి పాండురాజు. తల్లి కుంతీదేవి. తండ్రి యనుజ్ఞవలన (కుంతీదేవి) వాయువువలనఁ గనిన సంతానము. బహుబల శాలి. భారతయుద్ధమున కౌరవులను నూర్గుర నీతఁడే వధించినవాఁడు. సోదరులు యుధిష్ఠిరాదులు. ఈతనికి ద్రౌపదివలన శ్రుతసోముఁడును, హిడింబాసురుని చెలియలగుహిడింబయను భార్య వలన ఘటోత్కచుఁడును, జలంధరయను వేరొక భార్యవలన సుగుణుఁ డనువాఁడును ముగ్వురు సుతులు గలిగిరి. ఈతనికి భీముఁడని వాడుక నామము. భీమసేనుని శంఖమునకు పౌండ్రమని యు,నజ్ఞాతవాసకాలనామములు జయంతుఁడు, బృహన్నలుఁడు ననియుఁ దెలియుచున్నది.

**భీమానదీజన్మస్థానము** (ఢాకినీక్షేత్రము చూడుఁడు).

**భీమాష్టమి**—మాఘశుద్ధ అష్టమి.(పండుగలు చూడుఁడు).

**భీమాస్థానము (క్షేత్రము)**-ఇచట నొక చిన్నకొండపై భీమాదేవి దేవస్థానమును, అటనే యోనితీర్థమును గలవు. దీనింగూర్చిన ప్రశంసలు పద్మపురాణము, స్వర్గఖండము ౧౧ అధ్యాయమునను,మహాభారతము, వనపర్వము ౮౨ అధ్యాయమునను గలవు.

ఇప్పుడు తఖ్తిభాయి అని పిలువంబడుచు పెషావరున కీశాన్యదిశగా ౨౮ మైళ్ళదూరమున నున్నది.

**భీమ్లాశాఖక్షత్రియులు**— (శిశోదియా క్షత్రియులు చూడుఁడు.)

**భీముఁడు** — అత్రిసంతతిలోని చంద్ర వంశక్షత్రియుఁడు. తండ్రి విజయుఁడు.

ఈపేరు పాండవమధ్యముండగు భీమసేనున కును, విదర్భ రాజులలో నొకనికిని (దమయంతి తండ్రి), అష్టమూర్తులలో నొకమూర్తికినిగూడఁ గలదు. (అష్టమూర్తులు చూడుఁడు.)

**భీమైకాదశి**-మాఘశుద్ధ యేకాదశి కీపేరు గలదు. పాండవద్వితీయుఁ డగు భీమసేనునిచే వ్రతమాచరింపఁబడిన వ్రతదినమాదిగ నాయన పేరఁ బరఁగుచున్న దినము.(భీమద్వాదశి చూ.)

**భీర (మహాభీర, అడభీర, భూతాంకుశపు)చెట్టు** — ౧ భీర, ౨ మహాభీర, 3 అడభీర యని త్రివిధమనియు, అడభీరను భూతఘ్ని యని యందురనియు, మఱియు నాడభీర భూతాంకుశజాతికిఁ జెందినదనియు నందురు.

భీర మహాభీరల ఆకు, కాడలు కాల్చినబూడిదలందు చిడుము, గజ్జి, మొదలగు చర్మరోగములను, వ్రణములను మాన్పుశక్తి గలదనియు, ఆకురసమునందు పైత్యశాంతిఁ గల్గించుగుణము గలదనియు నందురు. భూతవైద్యులు ధూపము వైచెదరఁట.

భూతాంకుశపుచెట్టును మాభేరి, మొగభేరి, (మొగబీర యనివాడుక) చినరణభేరి అనియుఁ

గూడ నందురు. వేరునందించుక సువాసనయుఁ గలదు. భూతాంకుశపు చెటు సమూల రస కషాయములందు (వేరు ముఖ్యము) సమస్త కుక్షిరోగములు, పురాణగ్రహణి, రక్తగ్రహణి, సమస్త వాతపునొప్పులు హరించి నివారించు ననియు, సమూలమునుండి బట్టితోఁదీసినచమురు మర్దనచేయుటవలన వాతపునొప్పులు, మేహవాతనొప్పులు, పక్షవాతనొప్పులు, శమించుననియు ఆకులరసకషాయములు బిడ్డలకు వచ్చు కడుపు నొప్పులు, అజీర్తి, పిల్లలకు పండ్లువచ్చునపుడు వచ్చు జ్వరబాధలు నివారణమగు ననియు, స్త్రీల ఋతురక్తదోషములను నివారించి మైల రక్తమును చక్కఁగ వెడలించుననియు, తలనొప్పుల నాపుననియు, చలిజ్వరములు మాన్పునని యుఁ జెప్పఁబడినది.

ఈభూతాంకుశపుచెట్టునకే "రణభేరి" యనిపేరును కలదఁట. కొందరు చినరణభేరి యనియందురట. అట్లగునేని పెద్దరణభేరి (పెద్ద భూతాంకుశపుచెట్టు)కూడ నుండియుండవలసి యున్నది. ఇది గానరాదు.

**భీర్భూమ్జిల్లా (వీరభూమి)**—ప్రధాన స్థానము సూరీపురము. (బంగాళా దేశము చూ).

**భీల్సా**—తొల్లింటి దశార్ణ దేశమునకును, శ్రీరాముఁడు శత్రుఘ్నునిసుతుఁడగు శత్రుఘాతి నొసంగిన విదిశాదేశమునకును ప్రధాన నగర మైయుండెను.

ఇప్పుడు భిల్సా యనుపేరఁబరగుచు భోపాల సంస్థానమున నున్నది. వేత్రవతీనదీతీరము. (విదిశ చూడుఁడు).

**భీల్సావనములు (Bhilsa Topes)**-(పంచవనములు, విదిశాదేశము చూడుఁడు.)

**భీష్మఏకాదశి (భీష్మైకాదశి)**— మాఘ శుద్ధ యేకాదశి వ్రతదినము, పర్వదినము. ఐదు దినము లంపశయ్యపైఁ బఁడియుండి పాండవులకు ధర్మము లుపదేశించిన గాంగేయుఁ డగు భీష్ముఁ డీదినమునఁ బ్రాణములను వీడెఁగాన నామహనీయునిపేరఁబరగు పర్వమై యున్నది. అపుత్రవంతు లీదినమున నామహాత్ముని (సంతాన మర్థించి) వ్రత మాచరించి, ద్వాదశి దినమున విష్ణుదేవునకు బృందా (తులసి) వివాహోత్సవము జరిపి పూజింతురు. (పండుగుల నుచూడుఁడు. మహాఏకాదశులు చూడుఁడు.)

**భీష్మకుఁడు** — విదర్భదేశాధీశుఁడు. కుమార్తె రుక్మిణీదేవి. కుమాళ్ళు 1 రుక్మి, 2 రుక్మరథుఁడు, 3 రుక్మకేశుఁడు, 4 రుక్మబాహువు, 5 రుక్మనేత్రుఁడు.

**భీష్మపంచకము**—మాఘశుద్ధమున ఏకాదశి, ద్వాదశి, త్రయోదశి, చతుర్దశి, పౌర్ణమి తిథులు.

**భీష్ముఁడు**—అత్రి చంద్ర పూరవు కురు సంతతిక్షత్రియుఁడు. తండ్రి శంతనమహారాజు. తల్లి మానవరూపధారిణి యగు గంగాదేవి. సోదరులు చిత్రాంగదుఁడు విచిత్రవీర్యుఁడు ననువారు. భిన్నోదరులు.

భీష్ముఁ డష్టవసువులలోఁ గడపటివాఁడగు ప్రభాసుఁడు వశిష్ఠునిశాపమున నిటుల జన్మించె నని చెప్పఁబడినది. ఇతఁడు ధర్మశాస్త్రవేత్త. విలువిద్యయందు విశారదుఁడు. బ్రహ్మచారి. భారతయుద్ధమున కౌరవసేనలకు దళవాయియై పదిదినములు యుద్ధముచేసి యర్జునునిబాణహతుఁడై యుత్తరాయణము ప్రవేశించువఱకు శరతల్పముపై శయనించియుండి యశేషధర్మములు నెఱింగించి యేకాదశిరోజున శరీరము విడిచినవాఁడు. ఈతనిపేర నేటికిని భీష్మఏకాదశి పిలువఁబడుచున్నది. ఈయనకు దేవవ్రతుఁ డనుపేరు కలదు.

**భుంజాయన గోత్రము**— (శండిలగణము చూడుఁడు).

**భుంజాలగోత్రము**-శండిలగణము చూ.

**భుగ్ననేత్రసన్నిపాతము**- (సన్నిపాతదోషము చూడుఁడు).

**భుజంగఏవ జానీతే భుజంగచరణస్థితిమ్**—ఇదిసంస్కృతభాషయందలిలోకోక్తి. పాములయడుగుజాడలు పామునకే తెలుసునని యర్థము.

**భుజంగనగరము**- (ఉరగపురముచూ)

**భుజంగాసనము**—యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి. బోరగిలఁ బరుండి నాభి కిరుప్రక్కలఁ జేతులుంచి యూర్ధ్వ భాగము భూమి కంటకుండఁ గొంచెము పైకి లేవనెత్తుట భుజంగాసన మనఁబడును.

దీనియభ్యాసమున కుండలినీప్రబోధ మగు నని చెప్పఁబడినది.

**భుజంగినీముద్ర** — యోగాభ్యాస విధానమునఁ జెప్పఁబడిన వింశతి ముద్రలలో నొకటి.

మెడను ముందునకు వీలగునంతవఱకు చాచి వాయువును లోనికిఁ బీల్చుచు వదలివేయుచుండుట భుజంగినీముద్ర యనియు, దీనియభ్యాసము సకలరోగనివారణప్రదమనియుఁ జెప్పఁబడినది.

**భుజపత్రిచెట్టు (భూతఘ్నిచెట్టు)**— లా. Betula Bhojapathra. సం. భూర్జపత్రః, భూతఘ్నః, భూతహా, వల్కద్రుమః, భూజః. భుజపత్రియాకురసములందు, లేక కషాయము నందు కర్ణరోగములు నివారించు గుణమును, మేహశాంతి గల్గించుగుణమును, రక్తపైత్యశ్లేష్మముల హరించుశక్తియుఁ గలదని చెప్పఁబడినది.

**భుజాసనము**— యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి. ఇది ద్వివిధము.

౧. వామభుజాసనము— ఎడమకాలిమడమను సీవనిస్థానముక్రింద (గుదస్థానముకడ) నుండునట్లును, కుడికాలిమడమ నెడమకాలి శీలమండ కంటునటుల నిలువున నుంచి, కుడిమోఁకాలిపై కుడిమోఁచేతి నానించి, కుడియరచేతిని కుడిపిఱుదుపై నానించి, ఎడమమోఁచేతిని ఎడమవైపు నేల కానించి, ఎడమయరచేతియందు గడ్డము నానించి, ఎడమవైపున కొరిగి కూర్చుండుటకు పేరు.

౨. దక్షిణభుజాసనము- కుడికాలిమడమను సీవనిస్థానముక్రింద (గుదస్థానమున) నుండునట్లును, ఎడమకాలిమడమను కుడికాలిసీలమండ కంటునటుల నిలువుననుంచి, ఎడమమోఁకాలిపై ఎడమమోఁచేతి నానించి, ఎడమయరచేతిని ఎడమపిరుదుపై నానించి, కుడిమోఁచేతిని కుడి వైపు నేల కానించి, కుడియరచేతియందు గడ్డము నానించి, కుడివైపున కొరిగి కూర్చుండుట.

దీనియభ్యాసమున వామాసనమందుదక్షిణ నాడియు, దక్షిణాసనమునందు వామనాడియు చలించుచుండునని చెప్పఁబడినది.

**భుజ్యుఁడు** — భుజ్యుఁ డొకఋషి. ఈతఁడు లహ్యునిపుత్రుఁడు. జనకుని పండితసభలో (యాజ్ఞవల్క్యుని) "పరీక్షిత్తనయు లేలోకమున నుండి"రని యాజ్ఞవల్క్యునిఁ బ్రశ్నించుటయే గాక, భరతఖండమునకుఁ బశ్చిమముననున్న మద్రదేశము మొదలు ప్రాగ్భాగమున నున్న మిథిలవరకును పరీక్షిత్తనయులం గూర్చి వెదకుచు శకునముల నడుగుచు వచ్చెను. జనమేజయులయందున్న తనప్రేమ నిట్లు వెల్లడించెను.

**భుమన్యువు లేక హుతమన్యుఁడు**- అత్రి చంద్ర పూరువు సంతతి క్షత్రియుఁడు

తండ్రి భరతమహారాజు. తమ్ముళ్లు బృహత్క్షత్రుఁడు, నరుఁడు, గర్గుఁడు, మహావీర్యుఁడు నను నల్వురు. తల్లి సునందాదేవి. ఈతఁడు భరద్వాజుని తపోమహిమవలన। తల్లిదండ్రులకుఁ గల్గిన సుతుఁడని చెప్పఁబడినది.

**భువనములు ౧౪**-చతుర్దశభువనములు. భువన మన లోకమని యర్థము.

ఊర్ధ్వలోకము లేడు- ౧ భూలోకము, ౨ భువర్లోకము, ౩ సువర్లోకము, ౪ జనలోకము, ౫ మహర్లోకము, ౬ తపోలోకము, ౭ సత్యలోకము.

అధోలోకము లేడు- ౧ అతలము, ౨ వితలము, ౩ సుతలము, ౪ తలాతలము, ౫ రసాతలము, ౬ మహాతలము, ౭ పాతాళము. వీటిని ౧౪ భువనము లందురు.

**భువనాధ్వ**—భువనములు రెండుసూరుల యిరువదినాలుగుగ నద్వైతసిద్ధ గ్రంథము లందుఁ జెప్పఁబడినది. వీటి సముదాయమునకు "భువనాధ్వ" యని పేరుకలదు. ఇట 'భువన' మనిన పవిత్రస్థలి యని యర్థమఁట. ఇవి శివలింగస్థాపితములై యున్న పవిత్రస్థలములుగ నెఱుంగఁదగును. వీట్లంగూర్చి సిద్ధాంతశేఖరమను గ్రంథమున నైమిత్తికకాండలోని షడధ్వశోధన ప్రకరణమున వివరింపఁబడియున్నది.

౧ అనాశ్రితభువనము, ౨ అనాధభువనము, ౩ అనన్తభువనము, ౪ వ్యోమరూపిణీభువనము, ౫ వ్యాపినీభువనము, ౬ ఊర్ధ్వగాభువనము, ౭ మోచికాభువనము, ౮ రేచికాభువనము, ౯ దీపికాభువనము, ౧౦ ఇందికాభువనము, ౧౧ శాంత్యతీతభువనము, ౧౨ శాంతిభువనము, ౧౩ విద్యాభువనము, ౧౪ ప్రతిష్ఠా భువనము, ౧౫ నివృత్తి భువనము, ౧౬. సదాశివభువనము, ౧౭. శిఖండీశభువనము, ౧౮. శ్రీకంఠేశభువనము, ౧౯. త్రిమూర్తి భువనము, ౨౦. ఏకరుద్రభువనము, ౨౧. ఏకనేత్రభువనము, ౨౨. శివోత్తమభువనము, ౨౩. సూక్ష్మేశభువనము, ౨౪. అనంతేశభువనము, ౨౫. మనోన్మనీభువనము ౨౬. సర్వభూతదమనీభువనము, ౨౭, బలప్రమథనీభువనము, ౨౮. బలవికరిణీభువనము, ౨౯. కలవికరిణీభువనము, ౩౦. కాళీభువనము, ౩౧. రౌద్రీభువనము, ౩౨ జ్యేష్ఠాభువనము, ౩౩ వామాభువనము, ౩౪ అంగుష్ఠమాత్రభువనము, ౩౫ ఈశానభువనము, ౩౬ ఏకేక్షణాభువనము, ౩౭ ఏకపింగభువనము, ౩౮ ఉద్భవభువనము, ౩౯ భవభువనము, ౪౦ వామదేవభువనము, ౪౧ మహాద్యుతిభువనము, ౪౨ సిఖదభువనము, ౪౩ ఏకవీరభువనము, ౪౪ పంచాంతకభువనము, ౪౫ శూరకభువనము, ౪౬ పింగళభువనము, ౪౭ జ్యోతిర్భువనము, ౪౮. సంవర్తకభువనము, ౪౯. క్రోధభువనము, ౫౦. ఏకశివభువనము, ౫౧. అనంతభువనము, ౫౨. అజభువనము, ౫౩. ఉమాపతీభువనము, ౫౪. ప్రచండభువనము, ౫౫. ఏకవీరభువనము, ౫౬. ఈశానభువనము, ౫౭. భవేశభువనము, ౫౮. ఉగ్రభువనము, ౫౯. భీమభువనము, ౬౦. వామభువనము, ౬౧. శ్రీకంఠభువనము, ౬౨ ఉమాభువనము, ౬౩. కౌమారభువనము, ౬౪ వైష్ణవభువనము, ౬౫ బ్రాహ్మ్యభువనము, ౬౬ భైరవభువనము, ౬౭ కృతభువనము, ౬౮ అకృతభువనము, ౬౯ బ్రహ్మభువనము, ౭౦ ప్రాజేశభువనము, ౭౧. సౌమ్యభువనము, ౭౨ ఇంద్రభువనము, ౭౩ గాంధర్వభువనము, ౭౪ యక్షరాక్షసభువనము, ౭౫ పైశాచికభువనము, ౭౬ స్థలేశ్వరభువనము ౭౭ స్థూలేశ్వరభువనము ౭౮ శంఖకర్ణభువనము ౭౯ కాలజ్ఞానభువనము, ౮౦ మండనము, ౮౧ మాకోటిభువనము, ౮౨ ద్విరండ

భువనము, ౮౩ చకలండ భువనము, ౮౪ స్థాణు భువనము, ౮౫ స్వర్ణాక్ష భువనము, ౮౬ భద్రకర్ణ భువనము, ౮౭ గోకర్ణభువనము, ౮౮ మహాబలభువనము, ౮౯ అవిముక్తభువనము, ౯౦ రుద్రకోటిభువనము, ౯౧ వస్త్రాపదుక భువనము, ౯౨ భీమేశ్వర భువనము, ౯౩ మహేంద్రభువనము, ౯౪ అట్టహాసభువనము, ౯౫ విమలేశభువనము, ౯౬ నఖలభువనము, ౯౭ అనాఖలభువనము, ౯౮ కురుక్షేత్రభువనము, ౯౯ గయాభువనము, ౧౦౦ భైరవభువనము, ౧౦౧ కేదారభువనము, ౧౦౨ మహాకాళభువనము, ౧౦౩ మధ్యమేశభువనము ౧౦౪ ఆమ్రాతకభువనము, ౧౦౫ బిల్వేశ భువనము, ౧౦౬ శ్రీశైలభువనము, ౧౦౭ హరిశ్చంద్రభువనము, ౧౦౮ నకులీశ భువనము, ౧౦౯ భారభూతి భువనము, ౧౧౦ దండీశభువనము, ౧౧౧ ముండీశ భువనము, ౧౧౨ ఓషధీ భువనము, ౧౧౩ పుష్కర భువనము, ౧౧౪ నైమిశారణ్యభువనము, ౧౧౫ ప్రభాస భువనము, ౧౧౬ అమరేశభువనము, ౧౧౭ భద్రకాళీభువనము, ౧౧౮ వీరభద్రభువనము, ౧౧౯ త్రిలోచన భువనము, ౧౨౦ లిస్సుభువనము, ౧౨౧ నభోభువనము, ౧౨౨ వివాహ భువనము, ౧౨౩ సంవాహ భువనము, ౧౨౪ త్రిదశేశభువనము, ౧౨౫ ప్రత్యక్షభువనము, ౧౨౬ గణాధ్యక్షభువనము, ౧౨౭ విభుభువనము, ౧౨౮ శంభుభువనము, ౧౨౯ దంష్ట్రియభువనము, ౧౩౦ వజ్రిభువనము, ౧౩౧ ఫణీంద్ర భువనము, ౧౩౨ ఉదుంబరీశభువనము, ౧౩౩ గ్రసనభువనము, ౧౩౪ మారుతాశభువనము, ౧౩౫ క్రోధనభువనము, ౧౩౬ అనంత భువనము, ౧౩౭ వృషధరభువనము, ౧౩౮ వృషభభువనము, ౧౩౯ బలిప్రియభువనము, ౧౪౦ భూతపాల భువనము, ౧౪౧ జ్యేష్ఠభువనము, ౧౪౨ శర్వభువనము, ౧౪౩ సురేశభువనము, ౧౪౪ వేదపారభువనము, ౧౪౫ జ్ఞానభుగ్భువనము, ౧౪౬ సర్వజ్ఞభువనము, ౧౪౭ ఈశభువనము, ౧౪౮ విద్యాధిపభువనము, ౧౪౯ ప్రకామదభువనము, ౧౫౦ ప్రసాదికభువనము, ౧౫౧ శ్రీదృగ్భువనము, ౧౫౨ కర్తృదృగ్భువనము, ౧౫౩ లక్ష్మీదృగ్భువనము, ౧౫౪ జటాధర భువనము, ౧౫౫ సౌమ్యదేహభువనము, ౧౫౬ ధన్యభువనము, ౧౫౭ రూపవద్భువనము, ౧౫౮ నిధీశభువనము, ౧౫౯ మేఘవాహన భువనము, ౧౬౦ కపర్దిభువనము, ౧౬౧ పంచశిఖభువనము, ౧౬౨ పంచాంతకభువనము, ౧౬౩ క్షయాంతకభువనము, ౧౬౪ తీక్ష్ణభువనము, ౧౬౫ సూక్ష్మకభువనము, ౧౬౬ వాయువేగభువనము, ౧౬౭ లఘుభువనము, ౧౬౮ శీఘ్రభువనము, ౧౬౯ సునందభువనము, ౧౭౦ మేఘనాదభువనము, ౧౭౧ జలాంతకభువనము, ౧౭౨ దీర్ఘబాహుభువనము, ౧౭౩ క్షయభద్రభువనము, ౧౭౪ శ్వేతభువనము, ౧౭౫ మహాబలభువనము, ౧౭౬ పాశహస్తభువనము, ౧౭౭ అతిబలచూడభువనము, ౧౭౮ బలభువనము, ౧౭౯ దంష్ట్రిభువనము, ౧౮౦ లోహిత భువనము, ౧౮౧ ధూమ్రభువనము, ౧౮౨ విరూపాక్ష భువనము, ౧౮౩ ఊర్ధ్వకేశి భువనము, ౧౮౪ భయానకభువనము, ౧౮౫ క్రూరదృష్టి భువనము, ౧౮౬ హంతృభువనము, ౧౮౭ మారణభువనము,౧౮౮ నవ్యత్రిభువనము౧౮౯ ధర్మపతీభువనము, ౧౯౦ అధర్మపతీ భువనము, ౧౯౧ వియోక్తృభువనము, ౧౯౨ సంయోక్తృభువనము, ౧౯౩ కర్తృభువనము, ౧౯౪ విధాతృభువనము,౧౯౫ ధాతృభువనము, ౧౯౬ హరభువనము, ౧౯౭ మృత్యుభువనము,౧౯౮ యామ్యభువనము, ౧౯౯ క్షయాంతకభువనము ౨౦౦ భస్మాంతకభువనము, ౨౦౧ బభ్రుభువనం,

౨౦౨ దహనభువనము, ౨౦౩ జ్వలనభువనము, ౨౦౪ హరణభువనము, ౨౦౫ ఖాదక భువనము, ౨౦౬ పింగళభువనము, ౨౦౭హుతాశనభువనము,౨౦౮ అగ్నిరుద్రభువనము, ౨౦౯ త్రిదిశాధిప భువనము, ౨౧౦ పినాకిభువనము, ౨౧౧ శాస్త్రభువనము, ౨౧౨ అవ్యయభువనము, ౨౧౩ విభూతిదభువనము, ౨౧౪ప్రమర్దన భువనము, ౨౧౫ వజ్రదేహభువనము, ౨౧౬ బుద్ధ భువనము, ౨౧౭ అన్యజా భువనము, ౨౧౮ కపాలీశభువనము, ౨౧౯ రౌద్రభువనము, ౨౨౦ వైష్ణవభువనము, ౨౨౧ బ్రాహ్మభువనము, ౨౨౨ హాటకభువనము,౨౨౩ కూశ్మాండభువనము,౨౨౪ కాలాగ్ని భువనము.

**భువనాష్టకము(అష్టభువనములు)**- ౧ రుద్రభువనము, ౨ విష్ణుభువనము, ౩ బ్రాహ్మ భువనము, ౪ సత్యభువనము, ౫ కూశ్మాండ భువనము, ౬ హాటకేశ్వరభువనము, ౭ హూహూభువనము, ౮ కాలాగ్ని భువనము. ఇవి పవిత్రవంతములు, సుప్రసిద్ధములు, ప్రధాన భువనములు నగుట "అష్టభువనము" లని పేరందినవి. (భువనాధ్వ చూడుఁడు.)

**భువనేశ్వరము**—ఉత్కళదేశమునందు జగన్నాథ మెట్టి విష్ణుక్షేత్రమో భువనేశ్వర మట్టిపోల్కిగల శివక్షేత్రము. కాని, మిగులధనవంతమైనది కాదు. ఉత్కలులు తమదేశమున కృష్ణార్క పార్వతీ హర క్షేత్రములు నాలుగు గల్గియుంట (అనగా కృష్ణక్షేత్రము జగన్నాథము లేక పూరీ. అర్కక్షేత్రము లేక సూర్యక్షేత్రము కొనార్కము. పార్వతీ లేక విరజాదేవీ క్షేత్రము జాజిపూర్. హర (లేక శివ) క్షేత్రము భువనేశ్వరము వనిభావము) నీప్రాంతసీమ బహు పవిత్రవంతమగు దేశమని గర్వముగ పల్కెదరు.

ఇచటి శమునందలి శివలింగమును 'లింగరా' జనియు నందురు. భువనేశ్వరమన భువనాధినాధుఁడగు ఈశ్వరునిక్షేత్రమని యర్థము చెప్పఁ బడినది. శైవాగమములందు శివక్షేత్రములను భువనములందురు. అవరణమునసే పార్వతీదేవి యాలయము కలదు. లింగరాజస్వామి సృష్టి స్థితి లయాత్మక శివలింగమని చెప్పఁబడి యున్నది.

భువనేశ్వరమున లింగరాజస్వామికి నివేదనమొనర్పఁబడిన ప్రసాదములు వర్ణవివక్షితం బాటింపక సర్వవర్ణములవారును, కలసి భుజించుట కలదు. ఈ యాచారము జగన్నాథమునందు వలెనే యిచటను నడుచుచున్నది. భోగ నైవేద్యములును విశేషముగ జరుగుచుండును.

ప్రధానదేవళము ౧౮౦ అడుగుల యెత్తు కలది. సున్నములేకుండ రాతిపేర్పున కట్టఁబడి రాతిమేకులచే బిగింపఁబడినది. క్రీ.వె. ౬ మొ॥ ౯వశతాబ్దముల మధ్యకాలమునఁ గట్టఁబడినది. ఇదియొక పెద్దప్రావరణ గోడలమధ్య నున్నది. పని చాల చిత్రముగానుండి చూడఁదగియుండును. ఈ ప్రావరణమున నలువదియై దితరదేవళములు కలవు. అందు పార్వతీదేవి దేవళము చాల సుందరవంతమగు పనితనము గలది.

భువనేశ్వరమున గ్రామమధ్యముగా బిందుసరోవరము కలదు. అది యొకపాటిచెఱువు. దానియుదకములు సమస్తపవిత్రతీర్థములనుండియు ఉదకబిందువులం జేర్చి యిందు నింపుటచే "బిందుసరోవర" మనుపేరు గల్గెనఁట. బౌద్ధమతప్రాబల్యము తగ్గి హిందూమతము తిరుగఁ దలయెత్తుకాలమున నుత్కలదేశపు కేసరివంశనృపతులు దేవళసముదాయముల నిర్మింపఁజేసిరి. ఒక రాజవంశపుశాఖ వైతరణీనదీతీరపు జాజిపురమునందునను, మఱియొకశాఖ భువనేశ్వర

మునను రాజధానులుగ రాజ్యమేలుచుండిరి. ఇది భువనేశ్వరపురాజులపని.

దీనియుచ్ఛకాలమున భువనేశ్వరారణ్యమున మొత్త మేడువేల దేవళములుండెనని యచటివారందురు. ఇప్పుడు చాల భాగము పాడుపడి పడుచున్నవి. ఈదేవళము లన్నియు నొకచోనున్నవి కావు. కొన్ని దేవళము లొకగుంపుగనుండి, ఇట్టిగుంపులు చుట్టును వేర్వేరుతావులకుఁ జెదరియున్నవి. ఈప్రాంతారణ్యమున కేకాంబరవన మని పేరుండె నఁట. అవే రొకశివలింగమునుండి కల్గెనఁట. ఆశివలింగ మిప్పటికి నేకాంబరనాధుఁడనుపేరున ప్రధానదేవాలయావరణమునం దున్నది. అది చాల పురాతనమఁట. దేవాలయములందు పరశురామేశ్వర దేవాలయము క్రీ. శ. రెండవశతాబ్దమునాఁటి పురాతనపుఁబనియనియు,లింగరాజస్వామి(ప్రధాన) దేవళము క్రీ. శ. ఆరవ శతాబ్దమునాఁటి పనియనియుఁ, దక్కిన యితర దేవాలయసముదాయ మాఱవశతాబ్దము మొదలు పండ్రెండవ శతాబ్దముల మధ్యకాలమున నిర్మింపఁ బడినవనియుఁ బరిశీలకు లనుచున్నారు. ప్రధాన దేవళమున దీపారాధనలందు లలితేందు కేసరి పేరు వచించుచుందురు.

ఈప్రాంతములందు చిత్రకల పరశురామేశ్వరమున ప్రారంభమై, లింగరాజస్వామి దేవళమునను చ్ఛదశనంది కోనార్కి దేవళమున నిలచిపోయినదని యీప్రాంతపుఁ బనివాండ్రనుట కలదు.

కేసరివంశనృపతు లీదేశము నాఱువందల వత్సరములు పాలించిరందురు. వారు శివభక్తులఁట. వారి నివాసదుర్గ మిప్పుడు పాడుదిబ్బయై లింగరాజస్వామి దేవళఁపు దక్షిణభాగమున నంతతోఁటప్రక్కను గానవగుచుండును. ఇచటికిఁగొంతదూరమున పొలములందుఁగల రాజారాణికోవెల యెక్కువసుందరవంతమైనది. గౌరీకేదార మనంబడుతావునంగల దేవాలయములలో నొకటియగు ముక్తేశ్వర దేవాలయ మెక్కువ పనితనము గలది. అట గౌరీకుండ మను జలప్రవాహకుండమును, కేదారకుండము, సిద్ధకుండము నను నితర జలకుండములు రెండు "మినిరల్వాటర్సు"అని పేరందినవి. ఇంకను ననేక గుంపులుగ దేవాలయములు చెదరియున్నవి. ఖండగిరిగుహ లిటకు నాల్గుమైళ్ళుండును. మంచిబాట కలదు. (ఖండగిరిగుహలు చూడుఁడు.)

భువనేశ్వరమున కైదుమైళ్ళదూరమున ధవళి యనంబడుగ్రామముకడ నశ్వతమగిరి యనంబడు గండశిలాతలమునఁ గొన్ని యశోకుని శాసనములు కలవు. అవి పదమూడుశాసనములనియు, నందు కడపటిరెండును తర్వాతికాలమున నటఁ జేర్పఁబడిన వనియుఁ దలంపఁబడుచున్నవి. ధవళి తొల్లింటి తోసలిపుర మని పోల్చుచున్నారు. ఇటనేయున్న గణేశునివిగ్రహ మీయుత్తరదేశమంతటియందు నారంభమునఁ జెక్కఁబడిన మొదటివిగ్రహమందురు.

## భూకంపము (Earth quake)

-భూమియొక్క పైపొర హఠాత్తుగా కదలుటకుఁ బేరు. అడుగునఁగల యగ్నివేఁడి మొదలగుకారణములవలన నుపరిభాగము కదలి పగిలి పల్లముగనైలేక మెరకగనై హఠాత్తుగఁగల్గిన చీకాకును భూకంప మందురు. అగ్నిపర్వతములు భూకంప కారణ మందురు.

కొండప్రక్కభాగములు మిగుల వాటముగలవిగనుండి పైకారణములవలనను, పైనుండి బరువుయొక్క ఒత్తిడివలనను, వర్షాధిక్యమువలనను జాఱుటకు "Lam slip" అనియెదరు.

భూమి కదలుట, కూలుట, పెరుగుట

మొదలగునవి. ఇవి యగ్ని యొక్క పనియని తెలుపఁబడుచున్నది. (Mountains చూ.)

**భూకంపములు**-భూకంపములు Earth quakes అనియు, Earth shakes అనియు నాంగ్లపరిశీలకులు ద్వివిధముగ విభజించి, భూగర్భమందుండు అగ్ని వేఁడి కొన్ని కారణములవలన నొక్కొకతరి నొక్కొక దెసకు విజృంభించుకతన దానిపైనున్న భూమిపొరలు(Earth layers) ఒండొంటి నొరసికొనుటతో కదలిక desturbance యేర్పడి యాచలనము భూమిపైపొరం గదుపును. ఒక్కొకతఱి భూమి నుబికించును. ఒక్కొకతరినాపైపొరను గృంగ జేయుచుండును. ఇవి యన్నియు భూకంపములే. అన్నియు భూమియంతరాళమందలియగ్ని యొక్క ఉద్ధృత పరిమాదజన్యములే.

ఇంక భూచలనములంగూర్చి వివరించుట కష్టము. ఏల యన భూమి తనకుతానె గిరగిర తిరుగుచుంట భూచలనమే యగును. అట్లు తిరుగుచు సూర్యునిం జుట్టివచ్చుచుంట భూచలనమే యగును. ఈతిరుగుటలందు కడుంగడు మారము పర్వికుట సతిత్వరితగతిగా నుకువవలసియుండును. ఈయవస్థయందు పొరలుపొరలుగనున్న భూమిపైపొరలలో అడుగుపొరలుగూడ చల్లబడుట సంభవించినచో ఆచల్లఁబడిన పొర సంకోచము(తగ్గిపోవుట)కృంగఁజేయును. దానిపై నానుకొనియున్న పైపొరలుగూడ నించుక క్రిందికి గృంగవలసి యుండును. అట్టితరి భూచలనమో భూమి క్రిందికి దిగఁబడి కృంగుటయో సంభవింపవచ్చును. దానినిగూడ పొరపాటున పెక్కండ్రు భూకంప మనియెదరు.

భూకంపములు భూమిలోపలిభాగమందున్న వేఁడినుండి కల్గుచున్నవి. భూమి పొరలుగా నుండును. అందు పైపొర చల్లబడియుంట నందు వేఁడి యధికముగానుండదు. పైపొరలోనివేఁడి పొరపై నానియుండునుగాన, లోనిపొర చల్లబడి కుగ్గుచున్నకొలఁది పైపొర దిగఁబడిపోవలసి వచ్చును. దీనికై ఆప్రాంతమున కదలికగల్గును. దీనిని భూకంప మందురు. ఒక్కొకచో వేఁడి యతిశయించుటవలన నుబుకుటతో పైపొర పగులుటయుఁ గలదు. ఆపరిసరములు కదలుట భూకంప మనఁబడు చున్నది. భూకంపములు జపాను దేశమునను, న్యూజీలెండు దేశమునను, తరుచుగఁ గల్గుచుంట గాననయ్యెడిని. లోని యగ్ని గడబిడలు, అగ్నిపర్వతసంబంధమునఁగల్గినను గలుగవచ్చును లేక సముద్రఁపుఁ గ్రింది భాగమునఁ గల్గినను గలుగవచ్చుననుచున్నారు. భూకంపము భూమిపైపొరయందు గడబిడతరంగమును గల్గించును. అది కొంతదనుక పయన మొనర్చి యాగిపోవును. భూకంపము నష్టదాయకము.

**భూఖండములు (నవఖండములు)**-భూఖండమన నిట నార్యాక్రాంతభూమియందలి ఖండము లని భావము. ౧ భరతఖండము, ౨ ఇంద్రఖండము, ౩ చరుఖండము, ౪ గభస్తి ఖండము, ౫ నాగఖండము, ౬ తాంబ్రి ఖండము, ౭ వారుణఖండము, ౮ సౌమ్య ఖండము, ౯ గంధర్వఖండము.

ఇంక నాంగ్లులచే ౧ ఆసియా ఖండము, ౨ ఐరోపాఖండము, ౩ ఆఫ్రికాఖండము, ౪ అమెరికాఖండము, ౫ ఆస్ట్రేలియాఖండము (Continent) నని వివరింపఁబడి యున్నవి.

పురాణముల మతమున భాస్కరాచార్య సిద్ధాంతోక్తభూఖండములు తొమ్మిదిగఁ జెప్పఁబడినవి. ౧ ఇంద్రఖండము, ౨ కశేరుమత్ఖండము, ౩ తామ్రపర్ణి ఖండము, ౪ గభస్తిమతీఖండము, ౫ కుమారికఖండము, ౬ నాగ

ఖండము, ౭ సౌమ్యఖండము, ౮ వారుణఖండము, ౯ గాంధర్వఖండము. (కాంటినెంటు చూ.)

**భూగమన వేగము** — భూమి తనకుతానై గిరగిర తిరుగుచు (ఒకదినము) సూర్యుని జుట్టి యొకసంవత్సరమునాఁటికి యథాస్థానమునకు వచ్చుచుండు గమనవేగమును పరిశీలకులు సెకండునకు పదునెన్మిదిన్నర మైళ్ళని లెక్కించి యున్నారు. ఇట్లగునేని గంటకు 8280 మైళ్ళును, దినమునకు 198720 మైళ్ళును గావలయును. మఱియు నిట్లే యగుతఱి సంవత్సరమునందు భూమియొక్క గమనవేగము 7,25,79,720 మైళ్లుండును.

ఫిరంగి ముఖమునుండి విడువఁబడిన గుండు సెకండునకు రెండువేలయడుగు లేగుననియు, మేఘములనుండి యుఱుముధ్వని సెకండునకు 1140 అడుగు లేగుననియు, మెఱుపుయొక్క వెలుతురు సెకండునకు 186000 మైళ్ళేగుననియు పరిశీలకులు చెప్పుచున్నారు. సూర్యుని నుండి ధ్వని భూమికిం జేరువఱకు పదునాల్గు సంవత్సరములకాలము పట్టునందురు. వెలుఁగు 449 సెకండ్లు, లేక యొకగంట పదిమినిట్లు యిరువదితొమ్మిది సెకండ్లగునఁట.

**భూగర్భశాస్త్రము**- (జియోలాజీ చూ).

**భూగోళము ఏర్పడుట**—పాశ్చాత్య శాస్త్రవేత్తలు సూర్యగోళము చల్లఁబడుచు సంకోచావస్థ (Condensing) జెందుతఱి మున్నొకప్పుడు ప్రేలికరఁగుచున్న కొంతముక్క విడఁబడి ఈతరునందు గోళముగనై రానురాను చల్లారుచు భూమిగనైనదందురు. విడఁబడుతఱి నది మండు గాసెస్ (Gases) కరఁగిన లోహాదులు (Molten metals) గానుండెనఁట. చల్లఁబడుచు సంకోచావస్థం జెందుతఱి దానిలోపలి భాగమున నొత్తఁబడుచున్న యగ్ని ప్రేలి వెలుపలిపొరం బగల్చుకొని బయటఁబడుటయు, నవియుఁగూడ గొంతకాలమునకు చల్లబడియారిపోవుచుండునవియే యగ్నిపర్వతములు. లోహపదార్థము చల్లఁబడి ముడుచుకొనుచుండ దానినుండి ఆంగ్లమున 'Slag' అనఁబడు పదార్థమును బయటకుపిండబడినదియె చిట్లమనఁబడుచున్నది. అట్టిపనియే యిక్కాలఁపు Iron Foundry యందునను జరుగుచుంటఁ గానవచ్చెడిని.

ఇట్లేర్పడిన భూగోళఁపు వెలుపటిపొరయం దినుము, సున్నము (Lime), గంధకము, సోడియమ్, పొటాషియము లనంబడు పదార్థములున్నట్లు కన్గొనఁ బడినవి. అవి జీవనాధార పదార్థములు. మఱియు నాభూమియొక్క వెలుపటిపొర పగులుకాలములందు భూగర్భము నుండి యావిరి వెడలి, యుదకముగ నేర్పడుటయు, Carbon dioxide gas ను కలిసి భూమియం దుదకము గల్గెనఁట. వాతావరణమును నిటులనే యేర్పడియె నఁట. సూర్యగోళమునుండి వేరైన యీభూగోళము కోట్లకొలఁది వత్సరములిట్లగ్నియందుఁ గడపిన పిదప నీ మార్పులు గల్గెనఁట. ఉదక మావిరి యగుచు మేఘములై తిరుగ వర్షించుచు భూమిం జేరి దానిని చెకలించి తిరుగ లోనికింజనుచు నిప్పుడున్న పదునుకుఁ దెచ్చెనఁట.

**భూగోళశాస్త్రము** (Geography)—భూమినిగూర్చిన సంగతులం దెల్పునది భూగోళశాస్త్రము. దీని కాంగ్లమున 'Geography' యనెదరు. గ్రీకుభాషయందు Ge అన భూమికిని Graphe యన వివరమునకును నర్థముగాన నీశాస్త్ర మొక్క భూమినిగూర్చి తెల్పునదేగాని యితరగోళములం గూర్చి తెలుపుశాస్త్రము కానేరదు. ఇంకను మానవునకును తత్సంబంధ

జ్ఞానములందుఁగల యితరజంతుజాలములకు సంబంధముదృష్టితో వివరింపఁబడినదని భావము.

భూగోళశాస్త్రము వ్రాయుటయందు భూగోళమునకు సంబంధించినంతవరకు ఖగోళశాస్త్రము (Astronomy) ఏవస్తువులచే నేవిధములుగ వేట్లచే భూమి చేయఁబడినదో ఆవిధానము (Geology)రసాయనధర్మము(Chemistry)లును వివరింపఁబడిన దనియును, మనుష్యనివాసమున కుపయోగించిగాని, అనుబంధించిగాని, యుండునంతవఱకు వృక్షశాస్త్ర ధర్మములు (Botany) జంతుశాస్త్ర ధర్మములు (Zoology), Anthropology, meteorogy యును నడచిన చరిత్ర (History) యుఁ గూడ నిందుఁ గలదనియు నెఱుంగ వలయును.

ఇట్టిభూగోళశాస్త్రము సర్వసాధారణముగ నాల్గువిధములైయుండెడిని. Mathematical, Physical, Political, Commercial భూగోళములని చతుర్విధములు.

౧. Mathematical Geography భూమియొక్క ఆకారము, పరిమాణము, దానిచలనముయొక్క విధానము, దానికి సూర్యచంద్రాది ఇతరగోళములతోఁగల సంబంధములను వివరించును. ఇది యంతయు సంకెలు, గణితముఁ గల్గియుండును.

౨. Physical Geography- భూమియొక్క శరీరముఁగూర్చి దెలుపునది. అనఁగా భూమియొక్క యుపరిభాగము (అగుపడురీతి) భూగోళమండలిభాగము (Land) జలభాగము (Ocean sand rivers), పర్వతములు (Mountains) వాతావరణములు (Atmospheres) వాయుప్రవాహములు, జలప్రవాహములు (Ocean currents), భూమిపై వసించు ప్రాణి సముదాయములు, భేదములు, నైసర్గికముగ భూమియందు జరుగు మార్పులు (Natural forces which alter the surface) వీట్లనుగూర్చి వివరించును.

౩. Political Geography- ఇది భూమియొక్క వేర్వేఱు భాగముల వసించు వేర్వేఱు జాతిప్రజల రాజ్యపాలనానుకూలముగ విభజింపఁబడిన భాగములగూర్చి దెలుపును., వీట్లను దేశము లందురు. రాజకీయధార్మికమగు జాతీయుబల మీవిభాగములందువర్తించెడిని. అనఁగా సామ్రాజ్యములు, సంస్థానములపేరఁ బరగు భూభాగములని యర్థము. ఈసామ్రాజ్యములు గాని, సంస్థానములు గాని, యెట్లుత్పన్నములైనవో యెటుల వృద్ధినందినవో; యెటుల క్షీణించినవో, ఆయాదేశపాలనము లెన్నిమార్పు లెట్లెట్లు చెందెనో దానిఁ దెల్పునది దేశచరిత్రము గాన నిట్టి జాగ్రఫీ, చరిత్రాత్మక భూగోళశాస్త్రము (Historical Geography) అనఁబడును.

౪. ఇంక నాల్గవది Commercial Geography- ఇది ఆయాదేశములందుఁ గలుగు ఖనిజములు (menerals) వ్యవసాయకములు మొదలగు ధాన్యాదులు, పండ్లు మొదలగు మానవోపయోగ సంబంధములగు సర్వమును గూర్చియు, వాట్లవిక్రయములఁగూర్చియు, అట్టి పదార్థము లన్యదేశములకుఁ గొంపోవనగు మార్గసౌకర్యములం గూర్చియు వివరించును. ఇంకను మనుష్యుల కుపయోగించు చేతిపనులు, యంత్రసాహాయ్యమున నొనర్పఁబడు పనులు, పదార్థములం గూర్చియు, వాట్ల నన్యదేశముల కెగుమతి దిగుమతులం జేయు సౌకర్యములం గూర్చియు వివరించునది.

ఈనాల్గును జాగ్రఫీయొక్క నాల్గుభాగములనియు, వేర్వేఱు విధములగు జాగ్రఫీలు గావనియు, వీట్లలో నొక్కటితో తక్కినవి సంబంధముకలవే యనియు మనసునం దుంచుకొనవల

యును. ఇందు పొలిటికల్ జాగ్రఫీ ప్రధానమైనది. తరువాత జాగ్రఫీయొక్క నిజమగు బలము కమర్షియల్ జాగ్రఫీ యని యెఱుంగ వలయును. ఫిజికల్ జాగ్రఫీయొక్క శరీరతత్వమువంటిది. తక్కినదిపరిమాణములవివరమే. ఇవి యన్నియు ముఖ్యములే. అన్నియుఁ గలిసియే జాగ్రఫీకుండ వలసిన ధర్మము లన్ని బరిపూర్తి యగును.

**భూచమ్పక లేక భూమిచమ్పక**— ఇది దుంపలంగల్గియున్న (అల్లమును బోలిన) చిన్న చెట్టు. లా. Kdempferia Rotunda. సం. దుగ్ధిఘుణః, భూచంపకః, భూమిచంపకః.

దుంపలరసము సర్వవిషహర మనియు, స మూలచూర్ణము లోనికిచ్చిన దేహమునందు చేరి గట్టిపడిన రక్తము, చీము, దుష్టపదార్థకూటములు గరఁగించి వెడలించుశక్తి గలదనియు, పైకివ్రాసిన క్రొత్త గాయముల మాన్పుశక్తి గలదనియుఁ జెప్పఁబడినది.

**భూచలనము** (Motions of the Earth)— భూమి సూర్యునిఁ జుట్టివచ్చుటను భూచలనమందురు. భూమి సూర్యుని,చంద్రుఁడు భూమిని, ఆశ్రయించుకొనియుండు గోళములు (Satellites) గాన చంద్రుఁడు భూమినిఁజుట్టి తిరుగుచుండ, దానితోసహా భూమి సూర్యుని జుట్టి తిరుగుట భూచలనము.

భూమి తిరుగుట యన రెండుసంగతులు ముఖ్యముగా మనసునం దుంచుకొనవలయును. భూమి తనకుతానే సర్వదా గిరగిరఁ దిరుగుచుండుట యొకటి; అట్లు తనలోతాను దిరుగుచు సూర్యుని జుట్టివచ్చుచుండుట యొకటి. తనలో తాఁ దిరుగుతరి సూర్యునకెదురుగనుండు భూభాగమున పగలనియు, వెనుకమరగియుండు భూభాగమునకు రాత్రి యనియు, నెల్ల రెఱిఁగినదే. అట్లు సూర్యున కెదురుగనున్న భూభాగము భూమి తనలోతా గిరగిరఁ దిరుగుతరి, తిరుగ సూర్యునికెదురుగ నేతెంచునప్పటి కిరువదినాల్గు గంటలకాల మగును. అందు సూర్యునింజూచుచు గడచుకాలము పగ లనియు, సూర్యునకు మరుగుపడిన వెనుకభాగమున గడచుకాలము రాత్రి యనియుఁ జెప్పఁబడుచు, తనకుతానై గిరగిర నొకతరి భూమి తిరుగుకాల మొకరోజుగ పరిగణింపఁ బడుచున్నది.

ఇంక తా నిట్లు తిరుగుచు, సూర్యునిం జుట్టి వచ్చుకాలము మూఁడువందల యఱువదియైదు దినములకుఁ గొంచెమెక్కువకాలము పట్టును. దీని నొకసంవత్సర మందురు. ఈసంవత్సరమునందు చంద్రుఁడు భూమింజుట్టి తిరుగుచు, పదునొకండు లేక పండ్రెండు లేక పదమూఁడు పౌర్ణములను, అన్ని యమావాస్యలను గడచి, తాను తొల్లింట ప్రారంభించిన తావునకుఁ జేరెడిని. దానికి చాంద్రమానసంవత్సరమని వాడుకయుఁ గలదు. ఇందు పదునొకండుమాసము లుండునేని నష్టమాసవత్సర మనియు, పండ్రెండు మాసము లుండుతరి సమమాసవత్సర మనియు, పదమూఁడుమాసము లయ్యేనేని యధికమాస వత్సర మనియు, నీచాంద్రమానసంవత్సరమును మూఁడుభేదములుగ నెఱుంగునది.

భూమియొక్క చలనమునుగూర్చి యెఱుంగుటకు శాస్త్రదృష్టిచేభూమియందు భావింపవలసిన కొన్ని హద్దులంగూర్చి జ్ఞాపక ముంచుకొనకుంటే మేని యేదియు నర్థము కాకుండెడిని. వాట్లను గూర్చి గూడ నించుక వివరింప నవసరమగును. భూమియం దెత్తగునట్టి యొకభాగము కడు వేఁడియగునది భూమిని జుట్టియుండును. ఈభాగమున భూమియొక్క చుట్టుకొలత ౨౪౯౦౦ మైళ్లుండునని శాస్త్రజ్ఞులు కనిపెట్టియున్నారు. మఱియు నీభాగము సరిగా తూర్పుపడమరల

కుండునది. ఈప్రదేశమధ్యభాగమునుండి యొక రేఖను భావింతుముగాక. దీనికి భూమధ్యరేఖ (Equator) యనుసాంజ్ఞ. దీని కుత్తరమున గల గోళార్ధమును, దక్షిణమునగల గోళార్ధమును సమములే.

భూగోళముయొక్క ఉత్తరపు కడభాగమున కుత్తరధ్రువమనియు, దక్షిణపుకడభాగమునకు దక్షిణధ్రువ మనియుఁ బేర్లు. ఈ ధ్రువప్రదేశముల మధ్యభాగములం దుత్తర దక్షిణముల కొకరంధ్రమును భావింతుమేని, ఆతిన్నని రంధ్రప్రదేశమునకు "Axis" అనిపేరు. ఉత్తరదక్షిణములకున్న ఏక్సిస్ రేఖయు, తూర్పు పడమరలకు వ్యాపించియున్న భూమధ్యరేఖయు సంధించుతావున ఈశాన్య, ఆగ్నేయ, నైరుతి,వాయవ్యమూలలు సమముగ నుండి, యొక్కొకటి తొంబది డిగ్రీలం గల్గియుంట, సగటున నాల్గు మూలలుం గలసి (4 x 90) మూడువందల అరువదిడిగ్రీలప్రదేశ మని లెక్కింపఁదగినది.

భూమి తనకుఁదాను గిరగిరఁదిరుగుతరి, పశ్చిమమునుండి తూర్పునకు తిరుగుఁగాన, భూమిపైనుండి చూచువారల కెదుటివైపు (తూర్పు)న సూర్యుడు చంద్రుఁడు మొదలగుగోళములన్నియు నుదయించునట్లును, వెనుకభాగము (పడమర)న నస్తమించునట్లును గాననగుచుండును. మఱియు భూమియొక్క యుత్తరపుకోనవైపు ఏక్సిస్ రేఖ యొక్క ఉత్తరపుకోనకుపైగా నాకసమున నొక నక్షత్ర ముండును. అది భూమి యెటుల దిరిగినను ఆనక్షత్ర ముత్తరధ్రువమును వీడనట్లు సర్వదా ఉత్తరపుదిశనే యాకసమునఁ గానన గుచుండుటచే దానిని ధ్రువనక్షత్ర (Pole star) మనియెదరు.

మఱియు భూమి సూర్యునిఁ జుట్టివచ్చు సంవత్సర కాలమునందు సూర్యునివద్ద నుండి 30000000మైళ్లదూరప్రాంతమున వేసవియందు సంచరించును. ఇంకను ౯౨౫౦౦౦౦ మైళ్ళ దూరప్రాంతముల శీతకాలమున సంచరించును. కడుసమీపముగనుండు దినములు ఆంగ్లవత్సరపు జూన్ ౨౨ తేది ప్రాంతములనియు, కడుదూరముగ నుండుదినములు డిశంబరు నెల ౨౨ వ తేది ప్రాంతములనియుఁ గనిపెట్టఁబడినది.

సూర్యునిఁజుట్టి భూమి తిరుగుచు నడుచుమార్గమున నిపు డొకరేఖను భావింతము గాక. దీనికి "Orbit" అనిపేరు. లాటిన్ భాషయందు "Orbit" అనిన వృత్తము (Circle) అని యర్థము. ఈ యర్థమునుండి Orbit రేఖ ఒక Circle గా నుండునని తలంపరాదు. తొల్లింటి కాలపు విద్వాంసు లట్లె తలంచి పొరబడిరిగాని యీమధ్యకాలమునఁ బరిశీలకులు సూర్యునివద్ద నుండి భూమివద్దకు వేర్వేరు నెలలయం దుండెడి దూరమును లెక్కించుకతన ఆర్బిట్ రేఖ పొడవు హెచ్చుగను, వెడలుపు తక్కువగనుగల కోలని రూపమున నుండు వలయము (Oval) గా గ్రహించియున్నారు.

భూమి సూర్యునిఁజుట్టి తిరుగుటయం దెప్పుడును సూర్యున కెదురుగ తన భూమధ్య రేఖ (Equator) యుండునట్లు తిరుగును గాన, భూమధ్యరేఖాప్రాంతముల నుండువారి కెల్లప్పుడు పగలు రాత్రియు సమముగనే యుండును. అనఁగా రెండును పండ్రెండుగంటలకాలమే యుండెడిని గాని భూమియొక్క యితరభాగములం దట్లుగాక భేదము గల్గియుండును. భూచలనము సంవత్సరము పొడుగునను,ఒక్క భూమధ్యరేఖకు తిన్నగ పైని సూర్యుడుండునట్లు తిరుగక కొంతకాల ముత్తరమునకును, గొంతకాలము దక్షిణమునకును దిరిగి సంచరించు చుండును. ఇట్లగుటవలన భూమిపైనుండువారికి సూర్యుఁ డుత్తరదిశగావంగి కొంతకాలమును, దక్షిణదిశ

గావంగి కొంతకాలమును, పగలు కన్పించుచుండును. సూర్యుఁ డుత్తరముగా వంగి కన్పించు కాలమును "ఉత్తరాయణ" మనియు దక్షిణముగావంగి కన్పించుకాలమును 'దక్షిణాయన' మనియు మనము వాడుదుము.

భూమియందలి భూమధ్యరేఖను సూర్యుని యందును మధ్యరేఖగ నుండునట్లు భూమి సూర్యునికి తిన్నగా నుఁడునట్లును, సూర్యుఁడు భూమికి సరిగా తూర్పునఁగాని పడమటనుగాని సమముగ నుండునట్లును భావించి, సూర్యుని మధ్యగా తూర్పుపడమరల కొకరేఖను తలంచి దానిని మనభూమధ్యరేఖ (Equator) కుఁ గలిపి, యంతయునొకే తిన్నని Straight line రేఖగనుండునట్లు భావింతము. దానికి 'Plane' అనిగాని, Plane of revolution రేఖయని పేరు. భూమి ఉత్తరాయణమున దక్షిణమునకు దిరిగి వంగుట భూమధ్యరేఖకుఁబైన యుత్తరముగా నిరువదిమూఁడున్నరడిగ్రీలకడ భూమిందాకి భూమధ్యరేఖతో ఏక్సిస్ రేఖ కలియుభూమధ్య భాగమున తానును సంధించి ముందునకు భూగోళముయొక్కకడకుఁజనునట్లుభూగోళమును సూర్యగోళమును నమర్చి సూర్యునిమధ్యనుండి తూర్పుపడమరలకునడచు ప్లేన్ ఆఫ్ రివల్యూషన్ రేఖను నడపి గీచినట్లు భావించుదుమేని దానికి Ecliptic రేఖ యనిపేరు. ఇట్లుమటయం దుత్తరాయణమున భూమి భూమధ్యరేఖనుండి పైగా నిరువదిమూడున్నర డిగ్రీల ప్రదేశము వఱకును (ఉత్తరధ్రువమునుండి క్రిందుగా నరువది మూడుడిగ్రీల ప్రదేశమునకును) సూర్యునకు తిన్నగా దక్షిణమునకు క్రిందికి వంగునని యెఱుంగవలయును.

ఇటులనే దక్షిణాయనమున భూమి భూమధ్యరేఖనుండి క్రిందుగా నిరువదిమూఁడున్నర డిగ్రీలప్రదేశమువఱకును (దక్షిణధ్రువమునుండి



పైగా నఱువదియాఱు డిగ్రీలప్రదేశమునకును) సూర్యునకు తిన్నగా నుత్తరమునకు పైకి వంగెడిని. ఇటుల వంగుచు తిరుగకుండినచో మన కుత్తరాయణ దక్షిణాయన భేదము లుండక సర్వము నొకేవిధముగ కాలముండెడిని. మఱియు వేసవియును శీతకాలమును కలుగుచుండుటకు మారుగ భూమధ్యరేఖాప్రాంతముల సర్వదా వేసవియును, దాని కుత్తర దక్షిణ దేశప్రాంతముల నొకేరీతి సర్వదా పోనుపోను బలీయముగ శీతకాలమును మాత్ర ముండెడిని.

ఇటుల భూమి ఉత్తరమువైపునకును దక్షిణమువైపునకును వంగి తిరుగుటవలనఁ గలిగిన ఉత్తరాయణ దక్షిణాయనముల కాలములను పశ్చిమశాస్త్రవేత్తలు ఉత్తరాయణపుకొనను జూన్ ౨౨ తేదిగను, దక్షిణాయనపుకొనను డిశంబరు ౨౨ తేదిగను నిర్ణయించిరి గాని, భారతజ్యోతిషసిద్ధాంతవేత్త లాయాదేశభేదములనుండి కొంచెము దినము లెచ్చుతగ్గు లుండుట తొల్లింటి కాలముననె గనిపెట్టి, ఏసంవత్సరమున కాసంవత్సరపు పంచాంగములందు సూర్యసంక్రమణప్రవేశములుగను, మకరసంక్రాంతినుత్తరాయణప్రారంభ కాలముగను, కర్కాటక సంక్రాంతిని దక్షిణాయణ ప్రారంభ కాలముగను వేర్వేఱుతిథుల పంచాంగములలో స్పష్టముగఁ దెలుపనారంభించిరి. నేఁటికి నట్లేజరుగుచున్నది. మనదేశమందలిజ్యోతిషసిద్ధాంతధర్మమునమకర కుంభ, మీన, మేష, వృషభ, మిథున మాసములకాల ముత్తరాయణముగను, కర్కాటక సింహ, కన్యా, తులా, వృశ్చిక,ధనుర్మాసముల కాలము దక్షిణాయనముగను పరిగణింపఁబడుచున్నది.

ఉత్తరాయణమున సూర్యుఁడు భూమధ్యరేఖకుత్తరముగా నిరువది మూఁడున్నర డిగ్రీల ప్రదేశమున సరిగ పైన సూర్యుఁడు కన్పించుకా

లమును వేసవిమధ్యకాలము (Mid summer) అనఁబడును. అట్లే భూమధ్యరేఖకు దక్షిణమున నిరువదిమూఁడున్నర డిగ్రీలప్రదేశమున సరిగా పైని సూర్యుఁడు గన్పించు దక్షిణాయనకాలమును మధ్య శీతకాలము (Mid winter) అనఁబడును. వేసవి మధ్యకాలమున సూర్యరశ్మి ఉత్తరధ్రువమునకు పైగా నుత్తరదిశనాకాశమున నిరువది మూఁడున్నర డిగ్రీలప్రదేశమువఱకు వ్యాపించు ననియు, మఱియు నత్తరి దక్షిణ ధ్రువమునుండి యుత్తరముగా నిరువది మూఁడున్నర డిగ్రీల ప్రదేశమునుండి పైననే గాని క్రిందికి సూర్యరశ్మి అసలే కన్పించదని పరిశీలనవలనఁ గనిపెట్టఁబడినది. అనఁగా భూమధ్యరేఖకు దక్షిణమున యఱువదియారున్నరడిగ్రీల ప్రదేశమునకుఁ గ్రిందు భాగమున దక్షిణధ్రువప్రదేశములందు సూర్యోదయమే కన్పించదనిభావము. అటులనే దక్షిణాయనపు మధ్యశీతకాలమున (Mid winter) సూర్యరశ్మి దక్షిణధ్రువమువకుఁ గ్రిందుగా దక్షిణదిశనాకాశమున నిరువదిమూఁడున్నర డిగ్రీలప్రదేశమువఱకు వ్యాపించుననియు, మఱియు నత్తరి యుత్తరధ్రువము (North Pole) నుండి దక్షిణముగా నిరువదిమూఁడున్నర డిగ్రీల ప్రదేశమునుండి దిగువనే గాని పైగాసూర్యరశ్మి అసలే కన్పించదనియుఁ బరిశీలనవలననే తెలినది. అనఁగా భూమధ్యరేఖకు నుత్తరమున ౬౬న్నర డిగ్రీలప్రదేశమునకు పైభాగమున నుత్తరధ్రువప్రదేశములందు సూర్యోదయమే కన్పించకుండునని భావము. ఇందువలన నుత్తరదక్షిణధ్రువప్రదేశముల నాఱు నెలలు సూర్యోదయమే యుండని యొకేరాత్రిగను, ఆఱు నెలలుసూర్యుఁడస్తమింపని యొకేపగలుగను సంవత్సరము గడచునని యెఱుఁగునది.

భూమధ్యరేఖ కుత్తరముగా 23న్నర డిగ్రీల ప్రదేశమున సూర్యుఁడు తోఁచఁదగిన కాలము జూన్ నెల ౨౨ తేదిగను, భూమధ్యరేఖకుదక్షిణముగా ౨౩న్నర డిగ్రీల దూరప్రదేశమున సూర్యుఁడు తోఁచఁదగినకాలము డిశంబరు నెల ౨౨ తేదియనియు, పశ్చిమదేశపు పండితులేర్పఱచియుంట మున్ను వివరింపఁబడియె. ఎక్లిప్టిక్ (Ecliptic) రేఖయందలి భూమిని (ఈక్వేటరు కుత్తరదక్షిణముల 23న్నర డిగ్రీల దూరమున) తాకు ఉత్తరదక్షిణపు హద్దులకు "Solstices"అని పేరిడియున్నారు. లాటిన్ భాషయందు Sol అన సూర్యుఁడనియు, Sto అన నిలుచుటయనియు నర్థము. ఇటుల నొకదినము సూర్యుఁడు మరలునట్లు గన్పించుట కాలన్యమగునఁట. అవి మార్చి డిశంబరు మాసములలోని ౨౨ తేదులుగ మనసునందుంచుకొనఁదగును. ఇంకనా Ecliptic రేఖ భూమిపై నడచుచు, భూమికి మధ్యభాగమగు భూమధ్యరేఖ ఏక్సిస్ రేఖలసంధికడనే తానును గలియును.

మార్చినెలయందును సెప్టెంబరు నెలయందు ఇరువది రెండవ తేదులందు సూర్యుఁడు ఉత్తరదక్షిణాయనముల కారంభించు ననియు, నందురు. ఉత్తరాయణమున భూమధ్యరేఖకు పైగానున్న యుత్తరగోళార్థమున మార్చినెల నుండి దినదినాభివృద్ధిగను, ఉత్తరమున కేగుకొలఁది మరియు నెక్కువగను, పగటికాల మెక్కువగను, రాత్రికాలము తక్కువగను, నారంభించుచు, ఉత్తరధ్రువమున రాత్రి యసలే లేనిపగలుగ దోఁచెడిని. అటులనే భూమధ్యరేఖకు క్రిందుగనున్న దక్షిణగోళార్థమున దినదినక్షీణముగను, దక్షిణమున కేగుకొలఁది మరియు నెక్కువగను పగటికాలము తగ్గిపోవుచు, రాత్రికాల మెక్కువగుచు, దక్షిణధ్రువమున పగలుననదే లేక ఆరుమాసములును రాత్రిగనే తోఁచెడిని.

ఇంక దక్షిణాయనమున సెప్టెంబరు ౨౨వ తేదీ నుండియు నిందుకు వ్యతిరేకముగ నుత్తరమున పగలు తగ్గి, రాత్రి హెచ్చుచుచు, నుత్తర ధ్రువమున నాఱుమాసము లేకరాత్రిగఁ దోఁచును. అట్లే దక్షిణమున రాత్రి తగి పగలు హెచ్చుచు దక్షిణధ్రువమున నాఱుమాసము లొకే పగలుగఁ దోఁచును.

**భూటాన్‌దేశము** -తొల్లింటి భోటస్థాన రాజ్యము. ఇది స్వతంత్రరాజ్యము. కొండలచే నరణ్యములచే నిండి దుర్భేద్యమై అగమ్యమైన ట్లున్న రాజ్యము. ఎత్తుపర్వతములచే పరివేష్టితము. ప్రభువునకు 'దేవు', 'రాజా' యనుబిరుదము గలదు. రాజధాని పునఖాపురము. ప్రజలు భూటానీయులు. వీరు తార్తారుసంబంధులఁట. బౌద్ధమతస్థులు. పర్వతములక్రిందిప్రదేశములకు "డూఆరు" లనివాడుదురు.

**భూతఘ్ని చెట్టు**-(భుజపత్రిచెట్టుచూ.)

**భూతచతుర్దశి** - చైత్రశుద్ధచతుర్దశి. మన్యపుప్రదేశముల నీరాత్రియందు భూతములు భ్రమించి తిరుగునని భూతబలు లిత్తురు.

ఈదినమున శివచతుర్దశీవ్రత మాచరింతురు గాన, దీనికి "శివచతుర్దశి" యనియు వాడుక పేరు గల్గెనందురు. (పండుగులు చూడుఁడు.)

**భూతం భవ్యాయ కల్ప్యతే**-- వెనుక చేసినపనులే ముందుకుఫలించునవియనిభావము. ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి.

**భూతమసుగోత్రము**--(శండిలగణము చూడుఁడు).

**భూతములు (పంచ భూతములు)**- పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము ననభూతము లైదగుట వీటికి పంచ భూతములనియు వాడుక గలదు. ఆంగ్లమున భూతమునకు 'Element' అనిపేరు. ఇది స్వతస్సిద్ధపదార్థ మని భావము.

యోగశాస్త్రమున నీపంచభూతము లిటుల వివరింపఁ బడినవి:—

౧ పృథివీతత్త్వము- లకారబీజము, పసుపు రంగు, చతుష్కోణము, బ్రహ్మ అధిపతి, ధ్యానస్థానము (అవయవము) హృదయము.

౨ జలతత్త్వము-వకారబీజము, కుందపుష్ప వర్ణము, అర్ధచంద్రాకారము, విష్ణు వధిపతి, ధ్యానావయవము కంఠము.

౩ అగ్నితత్త్వము-రకారబీజము. రక్తవర్ణము, త్రికోణాకారము, రుద్రుఁ డధిపతి, ధ్యానావయవము తాలువులు.

౪ వాయుతత్త్వము- యకారబీజము, కృష్ణవర్ణము, వర్తులాకారము, ఈశ్వరుఁ డధిపతి, ధ్యానావయవము భ్రూమధ్యస్థానము

౫ ఆకాశతత్త్వము- హకారబీజము, నీలవర్ణము, నిరాకారము, సదాశివుఁ డధిపతి. ధ్యానావయవము బ్రహ్మరంధ్రస్థానము.

**భూతాంకుశపు చెట్టు** (భీరచూడుఁడు.)

**భూతాంగదేశము (భూటాన్‌దేశము భోటా దేశము)**— దీని నిప్పుడంద రెరిగియే యున్నారు. హిమవన్నగ దేశము. ఆప్రదేశ సీమల ప్రజలిప్పుడు బోటియాలుగ నుండెదరు.

"తారాతంత్ర"మను గ్రంథమున కాశ్మీరము మొదలు కామరూప దేశముదనుక మానససరోవరదక్షిణదిశగా భోటదేశ మని చెప్పఁబడి యున్నది.

# భూపటములు (MAPS) వ్రాయుటయందు డిగ్రీల దూరములు—

ఈకొలతలు భూమధ్యరేఖ (Equator) నుండి ఉత్తరముగ పైకిఁగాని, దక్షిణముగ క్రిందికిఁగాని యిట్లేయుండునని యెఱుంగునది. అనఁగా నీమైళ్ళకొలతలే యీక్వేటరునుండి ఉత్తర ధృవముదనుకను, ఈక్వేటరునుండి దక్షిణధృవము దనుకనుగూడ వర్తించును. భూమధ్యరేక (Equator) లాంగిట్యూడు. సున్న (Cyphor) డిగ్రీగా నెఱుంగునది.

మఱియు నిందు వివరింపఁబడిన కొలతమైళ్ళు (పొడవు) స్టాట్యూట్ మైళ్ళుగ నెఱుంగునది. ఒక అమెరికాదేశపు గణితశాస్త్రజ్ఞుని లెక్కమేరకు భూమధ్యరేఖ చుట్టుకొలత 79262614 మైళ్ళని చెప్పఁబడినది. (భూపరిమాణము చూడుఁడు). కాని యీలెక్కను వేర్వేరు దేశముల విద్వాంసులం దభిప్రాయభేదము లుండుటచేత నిదమిత్థమని నిర్ణయించి వ్రాయుటకు వీలు కానిదిగ నున్నది. ఆంగ్లపండితుల లెక్కమేర క్రిందికొలతలు కొన్ని వివరింపఁ బడినవి—

| | | | | |
|---|---|---|---|---|
| లాటిట్యూడు | 2 | డిగ్రీలప్రదేశమున | సాట్యూటుమైళ్లు | 68.96 |
| ,, | 4 | ,, | ,, | 68.83 |
| ,, | | ,, | ,, | 68.66 |
| ,, | | ,, | ,, | 68.42 |
| ,, | 10 | ,, | ,, | 67.96 |
| ,, | 12 | ,, | ,, | 67.48 |
| ,, | 14 | ,, | ,, | 66.93 |
| ,, | 16 | ,, | ,, | 66.31 |
| ,, | 18 | ,, | ,, | 65.61 |
| ,, | 20 | ,, | ,, | 64.79 |
| ,, | 22 | ,, | ,, | 63.96 |
| ,, | 24 | ,, | ,, | 63.00 |
| ,, | 26 | ,, | ,, | 62.01 |
| ,, | 28 | ,, | ,, | 60.03 |
| ,, | 30 | ,, | ,, | 59.75 |
| ,, | 32 | ,, | ,, | 58.51 |
| ,, | 34 | ,, | ,, | 57.20 |
| ,, | 36 | ,, | ,, | 55.82 |
| ,, | 38 | ,, | ,, | 54.37 |
| ,, | 40 | ,, | ,, | 52.85 |
| ,, | 42 | ,, | ,, | 51.27 |
| ,, | 44 | ,, | ,, | 49.61 |

| లాటిట్యూడు | డిగ్రీలప్రదేశమున | | స్టాట్యూటుమైళ్ళు | |
|---|---|---|---|---|
| ,, | 46 | ,, | ,, | 47.80 |
| ,, | 48 | ,, | ,, | 46.16 |
| ,, | 50 | ,, | ,, | 44.35 |
| ,, | 52 | ,, | ,, | 42.50 |
| ,, | 54 | ,, | ,, | 40.57 |
| ,, | 56 | ,, | ,, | 38.57 |
| ,, | 58 | ,, | ,, | 36.57 |
| ,, | 60 | ,, | ,, | 34.50 |
| ,, | 62 | ,, | ,, | 32.36 |
| ,, | 64 | ,, | ,, | 30.22 |
| ,, | 66 | ,, | ,, | 28. 8 |
| ,, | 68 | ,, | ,, | 25.88 |
| ,, | 70 | ,, | ,, | 23.60 |
| ,, | 72 | ,, | ,, | 21.32 |
| ,, | 74 | ,, | ,, | 10.02 |
| ,, | 76 | ,, | ,, | 16.69 |
| ,, | 78 | ,, | ,, | 14.34 |
| ,, | 80 | ,, | ,, | 11.08 |
| ,, | 82 | ,, | ,, | 9.60 |
| ,, | 84 | ,, | ,, | 7.21 |
| ,, | 86 | ,, | ,, | 4.82 |
| ,, | 88 | ,, | ,, | 2.42 |
| లాటిట్యూడు 90 డిగ్రీల ప్రదేశమున స్టాట్యూటుమైళ్ళు దీనినే పోల్సు (Poles) అనియెదరు. ఇచట నన్ని లాటిట్యూడు డిగ్రీలు కలసిపోవును. | | | | 0. |

**భూపరిమాణము**—భూమి యొక్క Equatorial semi diameter 39631307 మైళ్లనియు, దానియొక్క Polar semi diameter 3949871 మైళ్లనియు, పోలువద్ద 1 latitude degree 69407 మైళ్లనియు, భూమధ్యరేఖ (Equator) కడను ఒక latitude degree 68704 మైళ్లనియు నొక యమెరికా దేశపు విద్వాంసుడు లెక్కించి యున్నాడు. ఇందువలన (ఇదియే నిజమగుతఱి) Area and cubic contents of the Earth యీవిధముగ నాయెనని నిర్ణయించెను. Surface 196971984 చ॥ మైళ్ళనియు, Cubic contents 259944035515 క్యూబిక్కు మైళ్లనియు తేలుచున్నది.

**భూపరీక్ష**—శిల్పశాస్త్రమునందు చెప్పఁబడిన నిర్మాణములకు స్థలమును పరిశీలించుటకుఁ

బేరు. (శిల్పశాస్త్రము చూడుఁడు).

ఇది చాల ముఖ్యమనియు, నిది యనుకూలింపకున్న సర్వము నిష్ఫలమనియుఁ జెప్పఁబడినది. వాస్తుకర్మకు తెల్లనిరంగుగల భూమి చాల యోగ్యము. ఎఱ్ఱనిరంగుగలభూమి మధ్యమము. పచ్చరంగుగలభూమి యధమపక్షము. నల్లని రంగుగలభూమి పనికిరాదు.

భూమియందు చిల్లపెంకు లుండరాదు. అది యశుభప్రదమనియు, నెముకలు, బూడిదయు, నాశనకరమనియు, చౌడు జీవహానికర మనియుఁ జెప్పఁబడినవి. దేవాలయనిర్మాణము పర్వతములందుత్తమ మనియు, వనములందు మధ్యమ మనియు, నదీతీరములందధమమనియు, గ్రామాగ్రముల నధమాధమము లేక నసర్వ మనియుఁ జెప్పఁబడినది.

తీయనిరుచిగలమన్నుగలభూమి ఉత్తమము. మిశ్రమమగు రుచి మధ్యమము. పులుపు రుచి యధమము. చేదు లేక ఉప్పని రుచి యధమాధమము నసర్వమనియేచెప్పవలయును. భూమియందలి మన్ను పద్మగంధ మగునేని మహాయోగ్యమనియు, ఏనుఁగు, గుఱ్ఱము మదముల వలె వాసనయుండిన మధ్యమమనియు, పశుధాన్యాదులవంటి వాసనయుండిన నధమ మనియు, నితరవాసన లసర్వమనియుఁజెప్పఁబడినవి. పొడవు, వెడల్పు, సమానముగా నుండి చతురమగుభూమి యుత్తమము. పొడ వెక్కువగను, వెడల్పు తక్కువగను నున్నభూమి మధ్యమము. వాస్తుకర్మకు మున్ముందు నిర్ణీతమగుభూమియం దొక మూర చౌకముగ గొయ్యి త్రవ్వి, దాని నిండ సాయంకాలము నీళ్ళుపోసిన, తెల్లవాఱువఱకందు కొంచెమైనను నీరు నిలిచి యుండిన శ్రేయమనియు, లేకున్న సౌఖ్యప్రదము కాదనియుఁ జెప్పఁబడినది. ఇంకను వేఱుమతమున నిది ప్రధానముకాదని చెప్పఁబడినది.

**భూప్రదక్షిణమున కాలము తగ్గుట హెచ్చుట**—భూప్రదక్షిణమొనర్చుతరి (డేటులైను చూడుఁడు.) ప్రయాణమున దాటి ప్రతిడిగ్రీదూరమునకును ప్రయాణవేగముం బట్టియు, ప్రొద్దున కెదురేగుటయో లేక ప్రొద్దుతో సహా అరుగుటయో అనుసరించి యుండెడిని.

డేటులైనుకుఁ బశ్చిమదిశనుండి తూర్పున కరుగుతరి, దాటిన ప్రతి పదునేను డిగ్రీల ప్రదేశమునకును నిరువదినాల్గు గంటల కాల మతీతమగుతావునకుఁ జేరుచుంట జరుగుఁగాన గడియారముల ముందునకును డేటులైనుకు తూర్పుదెసనుండి పశ్చిమమునకరుగు తరి దాటిన ప్రతి పదునేను డిగ్రీలప్రదేశమునకును ఇరువదినాల్గు గంటలకాలము వెనుకఁ బడినతావునకుఁ జేరుచుంట బరగుఁగాన గడియారములను వెనుకకును త్రిప్పుకొనుచుండవలసి యుండును.

**భూప్రదేశము** (Soil)—పాశ్చాత్య విధానవిజ్ఞానమున భూప్రదేశము "Soils Containing mineral matter"అనియు"Soils containing organic matter (humus) అనియు ముఖ్యముగ రెండు భేదజాతులుగఁ జెప్పఁబడినవి.

Soils of mineral matter, Sand, Clay, Carbonate of lime ఉండుననియుఁ జెప్పఁబడినది. ఇసుకభూములందు నూటికైదు వంతులు Clay ఉండెడిని. దీనిని Sandy soil అనెదరు. నూటికైదు మొదలు పదివంతుల వఱకు Clay (బంకమన్ను) ఉండిన దానిని "Sandy Loam" అనియెదరు. ఇరువది మొదలు ముప్పదివఱకు బంకమన్నుండిన దానిని "Clay Loam" అనియెదరు. ముప్పది మొదలు నలువదివఱకు బంకమ న్నుండినదానిని "Clay soil" అనియు, నిసుకయందు నలువది

భాగముల కధికముగ బంకమన్నుండిన "Strong and heavy clay soil" అనియు వాడెదరు. ఇసుకతోడను నూటికి కైమువంతులు మొదలిరువదివంతుల వఱకు Carbonate of lime కలిసిన నాప్రదేశమునకు "Marl" అనియు, సున్నపు భాగముల కధికముగ "Carbonate of lime" గలదేని దానిని "Caleareous soil" అనియుం బేర్లు పెట్టియున్నారు.

ఇవి ప్రకృతిభూశాస్త్రమువారు భూమిపై సిన్నులు నిర్ణయించుటయును భూమియొక్క తరముల గ్రహించి, భూమినిరూపించుటయుం దాచరణలో నున్నవి.

**భూభాగముల హద్దులు-** గుండ్రని బంతివలెనున్న ప్రపంచమునకు మధ్యగ నెతగు ప్రదేశమునందు భూమిపైనుండియైనను సముద్రముగుండనైనను తిన్నగా భూమినిజుట్టి ఒక సరిహద్దు భావింపఁబడుచున్నది. దీనికి భూమధ్య (Equator) రేఖఅనిపేరు. ఈరేఖకు కుడివైపు తూర్పు, ఎడమవైపు పడమర యని యెఱుంగునది. మఱియు నీరేఖకు పైనుండు నుత్తరార్ధభూభాగమున, క్రిందనుండు దక్షిణార్ధభూభాగమును (సముద్ర భూములం గల్పుకొని) సమముగ నున్నవి.

భూమికు త్తరపుకొనను చలి మిక్కుటమవుట వాగ మోడలుగాని,విమానములుగాని యేగనశక్యమై నేఁటికి నటఁగల దేని నెఱుంగఁజాలకున్న భాగమును ఉత్తరపు ఫ్రిజిడ్ జోన్ (North Frigid Zone)అనియును,అట్లే భూమియొక్క దక్షిణపుకొనను చలి మిక్కుటమవుట నేగ నశక్యమై నేఁటికి నటఁగలదేని నెఱుంగఁజాలకున్న భాగమును దక్షిణపు ఫ్రిజిడ్ జోన్ (South Frigid zone) అనియును పేర్లు పెట్టఁబడియున్నవి. మఱియు నిట్లే ఉత్తరపు ఫ్రీజిడ్ జోన్ యొక్క దక్షిణపుహద్దునకు (Arctic Circle) ఆర్కిటిక్ సర్కిల్ అనియును, దక్షిణపు ఫ్రిజిడ్ జోన్ యొక్క ఉత్తరపుహద్దునకు అంటార్కిటిక్ సర్కిల్ (Antarctic Circle) అనియును పేరు పెట్టఁబడినవి.

మఱియు నటులనే ఈక్వేటరు హద్దునుండి ఉత్తరముగా దానికిని,ఆర్కిటిక్ సర్కిల్ హద్దునకును, నడుమగా ట్రాపిక్ ఆఫ్ కేన్సర్ (Tropic of Cancer) అనుపేరుగలహద్దుగ నొక గీతయును, ఈక్వేటరునకును దక్షిణముగ నంటార్కిటిక్ సర్కిలునకునునడుమగా,ట్రోపిక్ ఆఫ్ కేప్రికోరన్ (Tropic of Capricorn) అనుపేరుగలహద్దుగ నొకగీతయును భావింపఁబడుచుండును.

ఉత్తర దక్షిణ ఫ్రిజిడ్ జోనులంగూర్చి మన కేమియుఁ దెలియదు. అటకేగుటకును వీలు లేదు. గాని శాస్త్రజ్ఞు లీరెండు జోనులయందును గొప్ప సూదంటురాతిపర్వతములు సముద్రపునీటిమట్టమునకు పైగా పెరిగినవి యుండు ననియు, నవియే దిశలంజూపు కంపసుముల్లుల నుత్తరదక్షిణముల కాకర్షించుచున్న వనియుఁ దలంచు చున్నారు.

పిదప ఆర్కిటిక్ సర్కిలునుండి ప్రారంభమై దక్షిణముగ ట్రాఫిక్ ఆఫ్ కేన్సర్ హద్దువఱకు గలప్రదేశమునకు "ఉత్తరపు టెంపరేటు జోను" అనియును,దక్షిణపు ఫ్రిజిడ్ జోను కుత్తరపుటెల్లయగు నంటార్కిటిక్ సర్కిలునుండి ప్రారంభమై యుత్తరమున ట్రోపిక్ ఆఫ్ కేఫ్రికోరన్ హద్దువఱకుగల ప్రదేశమునకు దక్షిణపు టెంపరేట్ జోన్ అనియును పేర్లు పెట్టఁబడినవి. ఈ రెంటికిని మధ్యప్రదేశమునకు, అనఁగా ట్రోపికల్ ఆఫ్ కేన్సరు హద్దునకు, ట్రోపిక్ ఆఫ్ కేప్రికోరన్ హద్దునకు మధ్యగల ప్రదేశమునకు ఈక్వేటరు

సహా టోరిడ్ జోను (Torrid Zone) అనిపేరు. ఈక్వేటరు టోరిడ్ జోనుయొక్క మధ్యభాగము గుండా భూమిని జుట్టియుండును.

ఇప్పుడు ౧ ఆర్కిటిక్ సర్కిల్, ౨ ట్రాపిక్ ఆఫ్ కాన్సర్, ౩ ఈక్వేటరు, ౪ ట్రాపిక్ ఆఫ్ కేప్రికోరన్, ౫ అంటార్టిక్ సర్కిల్ ఇవి భావింపఁబడుభూమియందలిహద్దు లనియు, అట్టిహద్దులందు భూపటములందు (Maps) తిన్ననిగీతలు వాలుగ గీయఁబడుననియు, ఆగీతలను లైన్సు (Lines) అనియందురనియు మనసునం దుంచుకొనవలయును.

తొల్లింటికాలమున నావికులు సముద్రప్రయాణములందు రక్షణకై సముద్రదేవతల నారాధించువారు. ఐరోపా దేశస్థులగు నావికులు బలుల నిచ్చువా రఁట. అం దీక్వేటరు, సముద్రదేవతాధికారపు ప్రధానస్థానముగఁ దలంచువారఁట.

నావికులలో నొకఁడు నెప్ట్యూన్ వేషమును, అతనిభార్యవలెను నాగకన్యకలవలెను నింకను జలచరములవలెను నెప్ట్యూన్ పరిచారకులవలెను వేషములం ధరించి సముద్రమునుండి పైకి ఓడలోనికెక్కివచ్చున ట్లెక్కివత్తురు. వారిని గౌరవించి మ్రొక్కులిడి యోడస్సైనికు లదివఱకు హద్దుదాఁటనివాని నొక్కని బలి యిచ్చుట నటింతురు. వానింగొని వారు సముద్రమునఁ జేరునటుల నేగుదురు. తొల్లింటికాలమున నావికులు తమయోడ లీహద్దులలో దేనినైన దాఁటుటతో, నిట్టియుత్సవములం జరిపి, యొక్కొక్కని బలియిచ్చుచుండి రఁట. ఇక్కాలమున బలియిచ్చుట మాని తక్కినయుత్సవమును మాత్రము తప్పక జరిపెదరు. బలియిచ్చునట్లు సిద్ధమొనర్చినవేషగానిని సముద్రమునం బడఁదోయుటకు బదులుగ సముద్రస్నానము జేయించుచున్నారు.

**భూమంచిరెడ్లు**-వీరియందు ౧ ఆత్రేయ, ౨ కలిగల, ౩ కౌటిన్య, ౪ చక్రపాల, ౫ తామసపాల, ౬ పైడిపాల, ౭ మైపాల, ౮ రకునుళ్ళ ౯ వామనపాల, ౧౦ శోభనపాల, ౧౧ సిరిపాల యను పదునొకండు గోత్రములవారున్నారు. (రెడ్లు, రెడ్డికులమువారు చూడుఁడు) వీ రుత్తరసర్కారులం దధికముగఁ గలరందురు. వీరియందును నంతశ్శాఖ లేర్పడి యున్నవని వినుచున్నారము.

౧ ఆత్రేయగోత్రమున- డమావారు, డంకావారు, శూలంవారు.

౨ కలిగలగోత్రమున- బేతిరెడ్డివారు.

౩ కౌటిన్యగోత్రమున- గొలుకూరివారు, గుడిమెట్లవారు, కట్టుపురెడ్డివారు.

౪ చక్రపాలగోత్రమున-ద్వారంపూడివారు, దేకారెడ్డివారు, చల్లావారు, చిర్లవారు, శ్యామావారు, చింతావారు, నాళ్ళవారు.

౫ తామసపాలగోత్రమున- వెలగలవారు, ఇల్లువారు, సత్తివారు, సబ్బెళ్ళవారు, జాగరివారు.

౬ పైడిపాలగోత్రమున-పడాలవారు, పోతంశెట్టివారు, లంకిశెట్టివారు, పులగంవారు, పప్పువారు.

౭ మైపాలగోత్రమున- ఇందువారు, మేడపాటివారు, మండవారు, మల్లిడివారు, కొవ్వూరివారు.

౮ రకునుళ్ళగోత్రమున- తేతలివారు, తాడివారు, రెడ్డివారు, తమనంపూడివారు.

౯ వామనపాలగోత్రమున- చిన్నంరెడ్డివారు, కర్రివారు, కైవల్యవారు, కోనాలవారు, కావలివారు, పరాగవారు, చూశిగవారు, వోగిరెడ్డివారు.

౧౦ ...మున- అల్లంవారు, ఆర్తమూరువారు, ఆత్మకూరివారు.

౧౧ సిరిపాలగోత్రమున- నల్లమిల్లివారు, నాంద్రవారు, నాగిరెడ్డివారు, చిన్న లేక చిన్నం వారు.

ఈయింటిపేరులు గలవారు కలరు. ఇందు మైపాలగోత్రము మహీపాలగోత్రమనియు, సిరిపాల గోత్రము శిరిపాలగోత్ర మనియుఁ దలంపఁ బడుచున్నది

**భూమధ్యరేఖ** (Equator)— భూగోళము ను ఉత్తర దక్షిణదిశలు పైగను, క్రిందుగను తూర్పు పడమరదిక్కులు (మనకు) కుడియెడమ వైపులుగను, నమర్చి యుంచి చూచితి మేని సరిగా తూర్పు పడమరలకుఁ జూపించు మధ్య భాగము పెద్దదిగా నుండును. ఈపెద్ద భాగముగుండా సరిగా తూర్పు పడమరలకు భూగోళముంజుట్టి యొక రేఖను భావించిన, నా గీత కుత్తరదిశయం దొకగోళార్ధమును, దక్షిణ దిశయం దొకగోళార్ధమును, సమముగా నుండు నట్లు విభజింపఁబడుట తెలియనగును. అట్లు రెండుగోళార్ధములను విభజించుచు భూమిని జుట్టియుండునట్లు భావింపఁబడిన రేఖ (గీత) కు భూమధ్యరేఖ యనిపేరు (Equator).

భూమితిరుగునప్పు డీభూమధ్యరేఖాప్రాంత మే సర్వదా సూర్యున కెదురుగ నుండునట్లు తిరుగుచుండెడిని. భూమియందలి యీభాగమే మిక్కిలి వేఁడిప్రదేశము. మనము దక్షిణముగ నీ భూమధ్యరేఖాప్రాంతమున కేగుచుండిన కొలఁది శీతోష్ణస్థితి వేడియగుచుండుట ప్రసిద్ధమే. ఈభాగమున భూమినిజుట్టికొలచినచో, నదిగా భూమియొక్క మధ్యపరిమాణము (Circumference) ఇరువదినాలుగువేల తొమ్మిదివందల మైళ్లుండుననియు, భూమికి మధ్యగా నొకదెస నుండి రెండవదెసకుఁ గన్నము పొడిచి కొలచిన చో నామధ్యకొలత ఏడువేల తొమ్మిదివందల యిరువదియారుమైళ్లుండుననియు (Diameter) పరిశీలనవలన శాస్త్రజ్ఞులు కనిపెట్టియున్నారు.

**భూమధ్యరేఖాప్రాంతముల వేఁడి యధికము**—భూమధ్యరేఖ భావితరేఖ గాని నిజమున నట నేరేఖయు లేదు. ఉత్తరదక్షిణ ధ్రువప్రదేశములకు నడుమగ భూమింజుట్టియుం డునటుల గీయఁబడిన భావితరేఖ. దీనిపైననె తిన్నగ సూర్యచలనముంట నిటకు వేఁడి యధిక ముగఁ బ్రసరించెడిని. దీని కిరుదెసలందుఁగల ప్రదేశములకు "ట్రోపిక్సు" లేక "ట్రోపిక్ జోను"న్ననంబడు చున్నవి. అం దుష్ణ మధికముగా నుండును. అందుండుకతన భరతదేశ ముష్ణదేశ ములలో లెక్కింపఁ బడియున్నది. దానిందాటి యుత్తరమునకుఁగాని,దక్షిణమునకుఁగాని,ధ్రువ ప్రదేశములపై కరుగుకొలఁది నుష్ణము తగ్గి, శీతల మధికమగుచుండును. తుదకు ధ్రువప్రదే శములందు శీతలమే గాననగును. సూర్యుఁ డుత్తరాయణగతిం జెందుతఱి నుత్తరధ్రువ మునం దారునెల లొకే పగలుగ నుండి, సూర్యాస్తమయ మనున దెలియఁబడకుండె డిని. అత్తఱి దక్షిణధ్రువము సూర్యునికి మరుగై యారునెల లొకే ట్రిగ సూర్యోదయమే తెలియఁబడక నుండును. ఇంక సూర్యుఁడు దక్షిణాయనగతిం జెందుకతన దక్షిణధ్రువము నం దారునెల లొకేపగలుగ నుంట సంభవించు చుండును.

**భూమధ్య సిద్ధాంతము**— భరతదేశ మునం దాదికాలమునుండియు నీవిధాన మంగీ కరింపఁ బడియున్నట్లు కానరాదు. మన కండ్ల కగుపడురీతిని భూమిని జుట్టి సూర్యచంద్రాది గ్రహము లన్నియుఁ దిరుగుచున్నట్లుంట, భూమి

మధ్యనున్న దనియు, దానినాశ్రయించి తక్కిన గ్రహములు మొదలగునాకాశగోళములన్నియుఁ దిరుగుచున్న వనియుఁ దలంపఁబడు సిద్ధాంత మిది. ఐతరేయబ్రాహ్మణమున 3-౪౪ యందు సూర్యునింగూర్చి వివరించుచు "నాస్త మేతి నోదేతి" (అస్తమయము నుదయము లేదు) యనిచెప్పుటం జేసియు, మధ్యగనుండు ప్రధాన గోళమై వెలుఁగు, వేఁడి, నన్యగోళముల కొసంగుటవలన సూర్యుని దైవస్వరూపునిగ వర్ణించి యుంటం జేసియు, పిదప వరాహమిహిరాచార్యుఁడు సూర్యుని గ్రహరా ట్టని వివరించుటం జేసియు, సూర్యుఁడే మధ్యనుండ భూమ్యాది గోళములు సూర్యునిం జుట్టి తిరుగునవిగనే తలంపఁబడినట్లు స్ఫురించెడిని. ఇది భరతదేశపు ముచ్చట. దీని కనుగుణముగనే భరతదేశపు జ్యోతిషమున కుజ, బుధ, శుక్ర, శని గోళములు కొంతకాలము ఋజుగతిని (ముందుకు నడుచువిధి), కొంతకాలము వక్రగతిని(ముందుకు నడచుట) మాని, వెనుకకు నడిచిన ట్లగుపడి, తిరుగ ముందున (ఋజుగతి) కరుగువిధి గల్గి యున్నటుల చెప్పఁబడియున్నవి.

ఇట్లనుటవలన నాగోళము లటుల నిజముగ దిరుగుచుండునని యర్థము గాదు. సూర్యకుటుంబములోని గోళమగు భూమిపైవారల కాగోళముల అన్యవిధానగమనము లట్లగుపడుచుండునని యట్లు వివరింపఁబడెనని యెఱుంగవలయును.

ఇటుల నిది యుండ, పశ్చిమదేశస్థులగు గ్రీకులం దాదికాలమున అరిస్టాటల్ పండితుఁడు మొదలగువారు సూర్యునే మధ్యగను, తక్కిన గోళములు దానిం జుట్టి తిరుగుచున్నటులఁ దలంచియుండిరి, గాని పిదప పోలమీపండితుఁడది సరికాదనియు, భూమియే నడుమగ నుండ, తక్కినగోళములు దానింజుట్టి తిరుగుచుండుటయె నిజమనియు, నట్లే యగుపడుచున్న దనియు, సిద్ధాంత మొనరించి వ్యాపింపఁజేసెను.

కుజ బుధ శుక్ర శనుల వక్రగతుల కాగోళములు భూమిని జుట్టి తిరుగుటయందగు పెద్ద వలయము లేగాక, మార్గమున చిన్నచిన్న వలయములుగూడ నేర్పడునట్లు తిరుగునని ప్టోలమీ పండితుఁడు సమాధానమును వివరించెను ఈ విధానమునకు "Geo centric system" అని పేరు. Geo అను గ్రీకుభాషాపదమునకు భూమి యనియు, Centric అనిన మధ్య యనియు నర్థములు.

ప్టోలమీపండితాభిప్రాయమే దేశములందు బలముగ వ్యాపించి యైరోపాసీముల నాటుకొని యుండెనఁట. ఇది క్రీస్తుపూర్వమునుండియు ప్రజలచే నమ్మఁబడుచుండె నఁట. పిదప ౧౪౭౩-౧౫౪౩ కాలమున (క్రీస్తు వెనుక) కోపర్నికస్ పండితుఁడు దీనిని నిరసించి, సూర్యుఁడే మధ్యగనుండుననియు, దానింజుట్టి సూర్యకుటుంబమందలి తక్కినగోళములు తిరుగుచుండు ననియు వాదింపమొదలిడి, కడకు క్రీ. వె. ౧౫౩౦ నాటి కొక గ్రంధమును రచించి దానింజూచి ప్రాణములు విడిచెనని చెప్పుదురు. ఈ విధానమునకు "Helio Centric System" అనెదరు.

పిదప నీకోపర్నికస్ పండితవిధానమును కెప్లరు పండితుఁడును బోధించి యైరోపాదేశములందు సర్వత్ర వ్యాపింపఁ జేసెను.

(కోపర్నికస్ పండితుని సిద్ధాంతము చూడుఁడు. కెప్లరుపండితుని సిద్ధాంతము చూడుఁడు ఎస్ట్రానొమీ చూడుడు. కాస్సలేషను చూడుఁడు 'కెప్లర్సు త్రిలాస్ ఆఫ్ప్లానెటరీ మోషన్సు' చూడుఁడు.)

**భూమి గోత్రము**- ఆత్రేయగణము చూ.

**భూమిగోత్రము**-(గర్గఉపగణము చూ.)

**భూమితిరుగుచున్నను కదలిక లియకుండుట (Earth turns without shaking)**—భూమి కడుంగడు భారము తన యందుఁగల గొప్ప బంతివంటి గుండ్రనగునదని యెల రెరింగినదే. దాని తిరుగుచుండుస్థితియు నాగుట లేనిది. గాన నెల్లప్పు డొకేరీతి నుండి కదలిక తెలియరానిదిగా నున్నది. భూమిపై నుండువారలకు కుదుపుండకపోవుటకుఁ గారణ మది విధిమీరక యొకేరీతిఁ దనకుతానే తిరుగు చుంటయు, విధి మీరక యొకేరీతిని సూర్యునిం జుట్టి తిరుగుచుంటయు నైయున్నది. ఇంకను తనకుదాను తిరుగుచుంటచే నొడుదుడుకు లేకుం డుటకుఁ గారణమనియు, నెడతెరిపి లేనిసూర్యుని యాకర్షణ దానిం బలపఱుచుచుండు ననియుఁ దలంప నగుచున్నది. భూమి తిరుగుచుండుట యేపాటిగనైన కదలిక కుదుపుగా నెంచఁదగినస్థితి భూమధ్యరేఖకడ త్వరితగమన విశేషమును, ధ్రువప్రదేశమున నాలస్యగమనస్థితియు నైయుం డవలయుం గాని, వేరేమియు లేదు. చంద్రుని యాకర్షణశక్తి దాని కెదురుగనున్న సముద్రజల ములకుఁ బోటు గల్గించి, పొంగఁజేయగల్గునే గాని, భూమిపై తడబాటు కుదుపుఁగల్గింపఁజాల వని మన మెరింగినదే. కొందరు భూతత్త్వవేత్తలు చంద్రుని యాకర్షణశక్తి దాని కెదురుగనుండి, భూమిపైపొర నించుక పైకుబుకఁజేయునేమో యని యనుమానించుదురు గాని, యట్లయినను నది, యేతలవెండ్రుకవాసియోయై తెలియఁబడ రానిదిగనే యుండునుగాని కుదుపఁజాలదు. ఇంక భూకంపములు కుదుపఁజాలినను నవి వేరుకార ణము గలవి గాని భూమితిరుగుటతో నేసంబం ధముగలవి కావు.

**భూమిపై చరించుప్రాణులు నీటి యందు బ్రతుకజాలకపోవుటకు జలచరప్రాణులు భూమిపై గాలియందు బ్రతుకకపోవుటకుఁ గలకారణము** — ప్రతిప్రాణియు నూపిరిఁదీయుచుంట జీవితమునకు ముఖ్యము. అటులఁ గాదేని చచ్చిపోవలసి యుండును. ఈసందర్భమున ప్రాణులు భూమిపై వ్యాపించియున్న గాలిని బీల్చుచు, నూపిరిదీయు నవి యనియు, నీటియందు కరగి కలసిపోయి యున్న (Air dissolved in water) గాలింబీల్చుకొనుచు నూపిరిదీయునవి యనియు, ద్వివిధములుగ విభజింపఁ దగును. అందు మొదటితరగతియందు మనుష్యులు, పశువులు మొదలగునవియు, మొసళ్ళు, తిమింగిలము మొదలగునవియు నుండును. వీటియూపిరితిత్తుల కాంగ్లమున "Lungs" అనెదరు. వీటిమూలమున గాలినిబీల్చుకొనుచు నూపిరిదీయ నయ్యెడిని. రెండవతరగతియందు చేఁపలు మొదలగు జలచరము లుండును. వీటియూపిరితిత్తుల కాంగ్లమున "Gills" అనియెదరు. వీటిమూలమున నీటియందు కలసియున్న గాలిని బీల్చుచు, నూపిరి దీయ నయ్యెడిని. ఒక్కొకసందర్భమున మొదటి తరగతిప్రాణులు నీటియందు మునిగియుండిన నైనను మాటిమాటికి నూపిరిదీయుచుంటకు నీటి పైమట్టమున కరుదెంచుచు గాలింబీల్చికొని యూపిరిదీయుచుండ వలయును గాననే యివి నీటిలోని కధికలోతునకుఁబో వీలుండఁజాలదు. గిల్సు గలచేపలు మొదలగుజలచరము లూపిరి తీయ నీట మున్గుచుండ వలసియుండును గాననే యివి భూమిపై చాలకాలము నిలువఁజాలక చచ్చిపోవును. ఇట్లయ్యు చేఁపలు మొదలగు జలచరములు చూడఁగలవు. చెవిటిజంతువులు కావు. ఐనను వినుటయందు చాల తక్కువ సామర్థ్యముఁ గల్గినవని తెలిసెడిని.

**భూమిపై నుండువారు భూమితోఁ బాటు గిరగిర తిరుగు చుండుట**— భూమి గుండ్రని బంతివలె నుండుననియు, నది తనకుదానే తిరుగుచుండుతరి భూమిపైనుండువారును, దానితోఁబాటు తిరుగుచుండ వలయుననియు, నెల్ల తెలిసిన దే. ఇందు చిత్ర మొకటి కలదు. వేర్వేఱు తావులందు భూమిపైవసించువారు వేర్వేఱు త్వరితగతులం దిరుగవలసియుండును. ఉత్తరదక్షిణ ధ్రువములనుండువా రిరువది నాల్గుగంటలలో నొకసారి మాత్రము తిరుగవలసియుండును, గాన చాలయాలస్యమని తోఁచక పోదు. భూమధ్యరేఖపై నిలచిన మనుష్యుఁడు గంటకు వేయిమైళ్ల మేర కిరువదినాల్గుగంటలలో నిరువదినాల్గు మైళ్లు తిరుగవలసి యుండును. ఇది అతిత్వరితమని తోఁచక తప్పదు. ఇంక మధ్య వేర్వేరుతావుల వేర్వేరు త్వరితగతు లుండుచుండును. ఇట్లనుదినము జరుగుచునేయున్నది. భూమి కడుపెద్దదియు, దానిమధ్యభాగమునకు సర్వము నాకర్షించు చున్నదియుఁగాన మనము త్వరితగతి నెఱుంగజాలకుందుము.

**భూయాశిగోత్రము**— (కపిఉపగణము చూడుఁడు.)

**భూరాక్షక్షత్రియులు**— (చౌహానులు చూడుఁడు.)

**భూరి**—అత్రి చంద్ర పూరువు కురు సంతతి క్షత్రియుఁడు. తండ్రి సోమదత్తుఁడు. పితామహుఁడు బాహ్లికుఁడు. సోదరులు భూరిశ్రవుఁడు, శల్యుఁడు.

**భూరిశ్రవుఁడు**—అత్రి చంద్ర కురు సంతతి క్షత్రియుఁడు. తండ్రి సోమదత్తుఁడు. పితామహుఁడు బాహ్లికుఁడు. సోదరులు భూరి, శల్యుడు. భారతయుద్ధమున సాత్యకిచేనిహతుఁడైనవాఁడు.

**భూరిసేనుఁడు**—మరీచిసంతతి, సూర్యవంశక్షత్రియుఁడు. తండ్రి శర్యాతి. పితామహుఁడు వైవస్వతమనువు. సోదరులు ఉత్తానబర్హి, అనర్తుఁడు.

**భూరుహము (మాంసరోహిణి)**— దీనికి సంస్కృతమున భూరుహా, వికషా, అని పేర్లుకలవు. స్త్రీలరక్తకుసుమ (అసృగ్దర)రోగము మూలవ్యాధి (రక్తముపడునది), రక్తపైత్యము, శూలల నివారించునని చెప్పఁబడినది.

**భూలింగన్యాయము**— భూలింగపక్షి "మా సాహసమ్" అని కూయుపక్షి. దానిపనులయం దతిసాహసముగలపక్షి యని పేరందిన పక్షి గాన తాఁ జెప్పునది చేయనివారింకూర్చి యీ న్యాయము వర్తింపఁ జేయుచుందురు. "చెప్పునది యొకటి చేయుది మఱియొకటి" యని తెలుఁగుసామెతయు "Practice what you preach" అను నాంగ్లసామెతయు నీయర్థ మిచ్చునవియె.

**భూవలయరేఖ** (Horizon)— సముద్రమునఁ దుఁగాని, సమతలభూప్రదేశమునందుఁగాని యుండి చూచిన చుట్టును చూపున కాగి సంతదూరముకడను కొనభాగ మాకసముతోఁ గలసిపోవున ట్లగుపడు తావున రేఖ వలెఁ గన్పించు నానవాలును "భూవలయరేఖ" యందురు. ఎస్ట్రొనొమీ శాస్త్రమున దీనిని "హారైజన్" అనియెదరు. దీని నాశాస్త్రమున "Sensible horizon" అనియు, "Rational horizon" అనియు ద్వివిధముగవాడుచున్నారు.

మొదటిదానిని కండ్లకగుపడు భూవలయరేఖ యనియె జెప్పనగును. రెండవదియగు "రేషనల్ హారైజను" అనంబడునది శాస్త్రదృష్ట్యా ఆప్రదేశమునందు భూమి కించుక లోఁబడి

యుండునటుల భావింపఁబడిన రేఖ. దూరమునకు భూమి చూపునకు కన్పట్టనగునటుల కృంగి యగుపడును గాన, లెక్కకు సరిగా కుదురునటుల గీయఁబడిన భావితరేఖ కీపేరు ఎస్ట్రొనామీ శాస్త్రదృష్ట్యా వాడెదరు. ఇది దూరవుగోళముల పరిశీలనసందర్భమున శాస్త్రవేత్తల కీ లెక్క భావితరేఖ ఉపయోగించెడిని.

(ఎస్ట్రొనామీ చూడుఁడు. భూమిగోళము చూడుఁడు. ఈక్వేటరు చూడుఁడు. మెరిడియన్ చూడుఁడు.)

**భూశర్కర (దుంపచెట్టు)**-దీనింగూర్చి సరిగా తెలియదు. దుంప తీయగ నుండునఁట. దుంపకషాయము రోగుల కాహారముగ నిత్తురఁట. వీర్యపుష్టి, దేహపుష్టి, ధాతువృద్ధి, బలము గల్గించి మేహశాంతి యొనర్చి శరీరతత్వమును సమధాతువునకు మార్చునందురు.

**భూషణార్ధి కవి**-(కవి కవులు చూడుము)

**భూసంధి**—(ఇస్థమస్ చూడుఁడు.)

**భూస్కారదేశము (బోఖారా రాజ్యము)**-క్రీ. వె. ౬౯౭ మొ॥ ౭౩౮ వఱకు కాశ్మీర రాజ్యమేలిన లలితాదిత్య నృపాలుఁడు దీనిం జయించి, తనరాజ్యమునకు గల్పుకొని ఏలెనని కల్హణపండితుని రాజతరంగిణియందు చెప్పఁబడినది.

Vembery's Travels in Central Asia అను గ్రంథమునందు తూర్పున కోఖండు (దీనికి ఫెర్గానా యనియు పేరు కలదు). బదక్షాన్ పర్వతములు, దక్షిణమున ఆక్సస్ నది, పశ్చిమమునను ఉత్తరమునను పెద్దయెడారి సరిహద్దులుగ చెప్పఁబడినవి. రాజధాని భూస్కారపురము. ఇప్పుడుబోఖారా యనంబడుపురము. బోఖారాదేశ మని తేలుచున్నది.

**బేటీద్వారక**- -(ద్వారకలు చూడుఁడు.)

**భేతాలభట్టు**—గొప్పపండితుండు. (ఉజ్జయని చూడుడు.)

**భేదతంత్రము (గుణము)**— రాజనీతియందలి షడ్గుణములలో నొకటి. (షడ్గుణములు లేక షడైశ్వర్యములు చూడుఁడు.)

**భేదము**—(ఉపాయములు చూడుడు.)

**భేరుశంకుఁడు (బభ్రుశంకుఁడు)**—యదుసంతతి చంద్రవంశ క్షత్రియుఁడు. పౌత్రుఁడు శశిబిందుమహారాజు.

**భేల్లకిగోత్రము**— (జమదగ్నివత్సఉపగణము చూడుము.)

**భైమగవ గోత్రము**-(హారితఉపగణము చూడుఁడు.)

**భైమతాయన గోత్రము**—(పరాశరగణము చూడుఁడు).

**భైరవకవి** — ఆంధ్రకవులలో పూర్వకవులలో నొక్కఁడుగపరిగణింపఁబడినవాఁడు. తండ్రి గౌరన్న. గౌతమసగోత్రుఁడు. నియోగిబ్రాహ్మణుఁడు. రావుబహదూర్ క. వీరేశలింగంపంతులుగారితఁడు హరిశ్చంద్ర నవనాథచరిత్రముల రచించిన గౌరనమంత్రి పుత్రుఁడేమోనని తలంచుచున్నారు, కాని నిదర్శనములు గానరావు.

ఈతఁడు రచించినవి-శ్రీరంగమాహాత్మ్యము, కవిగజాంకుశము, రత్నశాస్త్రము నను గ్రంథములు. శ్రీరంగమాహాత్మ్యము, బాగయామాత్య పుత్రుండగు రామామాత్యుండను వాడుకనామము గల రాఘవమంత్రికిం గృతినిచ్చెను.

**భైరవఘాటీ (కనుమ)**- ఇం దమరనాథక్షేత్రము కలదు. (కాశ్మీరదేశము చూడుఁడు.)

**భైరవఘాటీ (పర్వతమార్గము)అమరనాధ క్షేత్రము**— అమరనాథము సుప్రసిద్ధశివక్షేత్రము. కాశ్మీరదేశమందు పర్వతముల

పైనున్న గుహ దేవతలపూజకై యేర్పఱుపఁబడినదనియు, చంద్రప్రతిష్ఠితమనియు నందురు. (కాశ్మీరదేశము చూడుఁడు.) రాజధానియగు శ్రీనగరమునుండి మోటారులుపోవు మంచిబాటను ౬౧మైళ్లదూరమున 'పహాల్గా' మనఁబడు సమశీతోష్ణప్రదేశము. సముద్రపునీటిమట్టముపై౭౨౦౦ అడుగుల యెత్తుగలది. ఒకపాటి వర్తకస్థలము కలదు. అటనుండియే యాత్రికులు భోజనసామగ్రులం గొనిపోయెదరు. ఈపరిసరములనున్న కోలాహలనదియందు శేషనాగమనంబడు నది సంగమించును. అటనుండియే అమరనాథమునకరుగుపర్వతమార్గ మారంభమగును. ఇటనుండి గుఱ్ఱములు, డోలీలు కాలినడక మొదలగునవి ప్రయాణసాధనములు. ఇట పర్వతారణ్యము దట్టమై యుండును.

పిదపఁదొమ్మిదిమైళ్లదూరమున 'చందన్వాడి' యను స్థలమునం దాగి, ముందున్న కష్టపుఁ బయనము నెదుర్కొన బడలికఁ దీర్చుకొనవలయును. ఇచట నివాస మారోగ్యసౌఖ్యముల నొసంగెడిని. సముద్రపు నీటిమట్టము ౯౫౦౦ అడుగులయెత్తు. బిర్చిచెట్లధికముగా పెరుగును. సెలయేరుల ప్రవాహపుఁజప్పుడులు, అడవిజాతి పూలచెట్లు, మనోహరములై యుండ శేషనాగ నదిపై నేర్పడిన మంచువంతెన యద్భుత మనిపించును.

పిమ్మట మైలున్నరదూరముదనుక పిసుఘాటి కనుమపై కెక్కవలయును. కష్టముగా నుంటయు, చలి మిక్కుటమగుటయు, ఎక్కడారియందిరుదెసలను విషవృక్షము లధికముగఁ బ్రబలి పూచి గాలికి విఱ్ఱవీగుచుండుగాన జాగరూకతఁ గలిగి నడువవలయును. పైని సౌందర్యదృశ్య మద్భుతమై శ్రమ త్వరలోనే నివారణమగును. పిదప మూఁడున్నరమైళ్ళు కొండప్రక్కంబడి యిరుకుదారులగుండ కాలుజారిన రెండవదెస నగాధమగు లోతునఁ బడును గాన మెల్లఁగ జాగ్రతగ నడువవలయును.

అటనుండి యైదుమైళ్ళదూరమున శేషనాగ నదీజన్మస్థానమగు శేషనాగసరస్సు కలదు. దాని మూఁడుదెసలందు హిమశిఖరపర్వత పరివృతమై యెటఁగన్న నట సెలయేరులపతనములతోఁ దనరెడిని. వాటిజలము లతిమాధుర్యవంతములు. అటకుఁ గతిపయదూరమున "పంచతరణి" యనుపేరుగలతావున నొకదానిప్రక్క నింకొకటిగ నైదు జలప్రవాహములు ప్రవహించుచుండెడిని. ఇట నల్లనిరంగుగల మంచు కన్పించెడిని.

పిదప రెండుమైళ్ళున్నరదూరము ఘనీభవించిన మంచుపై నడిచి పోవలయును. పిదప నొక మైలున్నరదూర మెక్కుచు దిగుచు నడిచి, కడపటిమైలుదూరము తిన్నని సమతలమార్గమున నమరనాథముగుహకుఁ జేరనగును. ఈసమతల మార్గము కొకవెపు భైరవఘాటీయనియు, రెండవ ప్రక్కను కైలాసఘాటీ యనియు, రెండు పర్వతోన్నతప్రదేశములుకలవు. ఆదికాలమున వాటి పైనుండి దూకి విరాగులు ప్రాణముల విడుచువారఁట. వాటినుండి సెలయేరు లధికముగ నుద్భవించి యమరగంగయందుఁ జేరును. ఇటుల పహాల్గామునుండి యమరనాథ మిరువదిమైళ్లున్నర యుండును.

**భైరవ విప్రన్యాయము**- ఆషాఢభూతి గానిచర్య యనితాత్పర్యము. వంచకుని మాయచర్యం దెలుపుట కీన్యాయము వాడుచుందురు.

**భైరవులు ఎనిమిదివిధములు (అష్టభైరవులు)**—౧ ఋరుభైరవ, ౨ ఛండభైరవ, 3 ఋండభైరవ, ౪ ఉన్మత్తభైరవ, ౫ కపాలి

భైరవ, ౬ భీషణభైరవ, ౭ కాలభైరవ, ౮ ఆనన్దభైరవులు.

"భక్షణాత్ రక్షణాత్ వమనాత్ భైరవః" అని భైరవ శబ్దమునకు సృష్ట్యధినాధునిఁగొంద రర్థము జెప్పిరి. భైరవులు దారుకావన విహారమునందలి మోహినీ మోహానులసంతానమఁట. (శాస్తాడమని పేరఁట). (హరిహరపుత్ర దేవస్థానములు చూడుఁడు).

**భైక్షవాహగోత్రము**- (రథితర ఉపగణము చూడుఁడు).

**భోగములు ౮ (అష్టభోగములు)**- ౧ సంపద, ౨ మంచివస్త్రములు, ౩ ఆభరణములు, ౪ భోజనసౌఖ్యము, ౫ తాంబూల సౌఖ్యములు, ౬ సౌఖ్యకరమగు శయ్య (పాన్పు) ౭ సంభోగసౌఖ్యములు, ౮ పుష్ప చందన పరిమళద్రవ్యాదిసుగంధద్రవ్యానుభవసౌఖ్యములు.

**భోగవర్ధనమఠము**— గోవర్ధనమఠమునకీపేరు కలదు.

**భోగిపండుగ** - (మకరసంక్రాంతిపండుగ చూడుఁడు.)

**భోజదేశము**-(కుంతిభోజదేశము చూ.)

**భోజనపదార్థములను వండు నాచారము**—జగమున భోజనపదార్థములను వండుట యొక యాచారమైనది. పండ్లను వండక నే తినెదరు. కొన్ని పప్పుజాతులను కొబ్బెర మొదలగు కొన్ని యాహారపదార్థములను పెక్కండ్రు వండకయే తినుటయుం గలదు. వండుట యనఁ నుడికించుట, వేయించుట, పేల్చుట, కాల్చుట మొదలగు కృత్యములు. వీట్లకుఁ గారణములు మూఁడు కలవు. అందు మొదటిది తినుపదార్థములను మెత్తపఱచి (పక్వమొనరించి) నములుటకు దంతములకు, కొఱుకుటకు పండ్లకు, మ్రింగుటకు గళమునకు సౌఖ్యకరమై యుండును. రెండవది ఉప్పు, కారము, పులుపు, మొదలగు కలుపుడురుచు లుడుకుతరి దానిం జక్కఁగ పట్టును. ఇది చక్కనిరుచులం గల్గించును. మూఁడవది వేయించుట, పేల్చుట, కాల్చుటలయందు రుచికరమగుస్థితిని గల్గించుచు రూపము, లేక రంగులను మార్చెడిని. వీట్ల యన్నింటికన్నను ముఖ్యములగు జాగ్రతలు రెండిందుఁ గలవు. వండుటవలన సులభముగ జీర్ణమగునవిగ నగుటయు, అందేమైన విషజీవు లుండిన నశించి బాధలం గల్గింపని యారోగ్యస్థితి నిలుపుటయునై యున్నవి. పాలు కాచుటకుఁగూడ నివియే కారణములని వైద్యశాస్త్రవిదు లనుచుందురు.

**భోజనలవణము**-మానవులు భుజించు పదార్థములందు చేరుచుండు లవణము (ఉప్పు) సముద్రలవణ మనియు, సైంధవలవణ మనియు రెండుగునది. ఈ రెంటియందేదో యొకటి, ఆయా ప్రాంతముల నేది సులభముగ లభించునో యదిగా నుండెడిని. భరతదేశమునం దీలవణములందు సముద్రలవణము నాల్గింట మూఁడువంతులుగను, సైంధవలవణము నాల్గింట నొకవంతుగను లభించుచు వాడఁబడుచున్నది. ఉప్పుగల్లీలను ప్రభుత్వమువారి లెక్కలందు "సాల్టుఫేక్టరీ" లనుచుందురు. సముద్రపుటుదకమునుండి యుప్పుదీయుటకు దానినుండి కారుప్పునీటి నావిరియగున ట్లొనర్చుపద్ధతి వాడుకయందుంచి యున్నారు. భరతదేశమున సముద్రలవణము సర్వమును చేయుట బ్రిటీషుప్రభుత్వమువారి యధీనమున "Monopoly" గా నున్నది.

సైంధవలవణము గనులనుండి (భూమిలోనుండి) త్రవ్వి యెత్తఁబడుచున్నది. అట్టిది సింధుదేశమునను ట "సైంధవలవణ"మని పేరయ్యెను. ఇంకను నిట్టివి రాజపుత్రస్థానమునందును, పాంచాలమునందునను గలవు. ప్రభుత్వంపు లెక్కలమేర కేటేట భరతదేశమున గనులనుండి ౫౦౦౦౦౦ టన్నుల సైంధవలవణము తీయఁబడుచున్నదని తేలినది. ఒక్క "ఎస్కిమో" జాతివారికిం దక్క, తక్కిన ప్రపంచజాతుల కందరికి లవణములేనిది భోజనమువడదని చెప్పఁబడియున్నది.

**భోజపురి భాష**— (హిందీభాష చతుర్విధము చూడుఁడు).

**భోజమహారాజు**— మాళవదేశ మేలిన సుప్రసిద్ధుఁడగు భూపతి. గొప్పవిద్యాపోషకుఁడు. ఈయన రాజధాని ధారానగరము. (అవంతి దేశము చూడుఁడు).

**భోజరాజువంటిరాజు కుదిరితే కాళిదాసువంటికవి సిద్ధమగును**— ఆంధ్ర లోకోక్తి.

**భోజవంశనృపతులు**— వీ రనేకులు కలరు. కుంతీభోజ దేశ మేలినవారు. వీరు భోజవంశజు లనఁబడిరి. భోజరాజువంశమువా రని భావము. భోజమహారాజుకుమారుఁడు రుక్మి; కుమార్తె రుక్మిణీదేవి (శ్రీకృష్ణునిభార్య.)

**భోజసిగోత్రము**-(కపిఉపగణము చూ.)

**భోజుఁడు(కుంతీభోజుఁడు మహాభోజుఁడు)**— అత్రి చంద్ర యాదవ క్షత్రియుఁడు. ఇతనికి భోజుఁడనియు, మహాభోజుఁడనియు, కుంతీభోజుఁ డనియు వాడుకపేరులు గలవు. ఈతనికి పుత్రసంతతి లేదు.

ఈతఁడు దేవమీఢునకు మారిషయందు జన్మించినకుంతీదేవి నభిమానపుత్రికగా పెంచుకొనెనని చెప్పఁబడినది. కుంతీదేవి పాండురాజు భార్య. పాండవులతల్లి. వసుదేవునిచెల్లె లని యుంగూడ వేరొకచోఁ గాననగు చున్నది. ఆమెకు పృథ యని మొదటిపే రఁట. ఆమె దూర్వాసమహర్షికి సేవ లొనర్చి మెప్పించి యొక దివ్యమంత్రముపదేశమందె నఁట. ఆ మంత్రశక్తివలన పాండవులను, కర్ణునిఁగూడఁ గనెనఁట.

మఱియు కృతవర్మపితామహుఁడు భోజుఁడే (హృదికుని తండ్రియు భజమానుని పుత్రుఁడు కుంతీభోజుని మనుమఁడు).

ఇంకను మాళవభూపాలుఁడగు భోజమహారాజుపేరు దేశప్రసిద్ధమే. ఈతఁడు ముంజుని యన్నకుమారుఁడు. సర్వసాధారణముగ విద్యల భోజుఁడని సామెతగా చెప్పెదరు.

మఱియుఁ గుంతీభోజునిసంతతిక్షత్రియులను 'భోజు' లని వాడుక గలదు.

**భోటదేశము (భూటాన్)**- భూతాంగ (భూటాన్) దేశమునకీపేరువాడుకయందున్నది.

**భోపాల్‌స్టేటురాజ్యము** — సెంట్రలిండియా ఏజన్సీసంస్థానములలో బ్రిటీషురక్షిత సంస్థానములలో నొకటి. ప్రభువు మహమ్మదీయుఁడు. తొల్లింటి భోజపాలితమైన మాళవదేశభాగమై యిట్టి పేరందిన దఁట. బెట్వా (తొల్లింటి వేత్రవతి) నదీతీరమందున్న భోపాల్పురము రాజధాని.

**భోవనిగోత్రము**- (కుశికగణము చూ.

**భౌతవిచార న్యాయము**— వెఱ్ఱివాని యాలోచనలని యర్థము. మతిభ్రమణముగల వారిమాటలనిరసించునటుల నిరసింపఁదగినదాని కీన్యాయమును వాడుచుందురు.

**భౌతికలింగము లైదు** —౧ పృథ్వీలింగము- కంచియందలి యేకామ్రేశ్వరలింగము.

౨. జలలింగము- తిరుచనాపల్లికడనున్న జంబుకేశ్వరమునందలి (శ్రీరంగములోని యొక భాగము) జంబుకేశ్వరలింగము.

౩. తేజోలింగము- తిరువన్నామలై (అరుణాచలక్షేత్రము) పురమందలి యరుణాచలేశ్వరలింగము.

౪. వాయులింగము- శ్రీకాళహస్తిపురమందలి కాళహస్తీశ్వరలింగము.

౫. ఆకాశలింగము— చిదంబరమునందలి నటరాజస్వామిదేవాలయములోని యాకాశలింగము. (చిదంబరరహస్యస్థలమున)

**భౌది గోత్రము**—(జాతుకర్ణ్య గణము చూడుఁడు).

**భౌమాలగోత్రము**-నిధ్రువగణముచూ.

**భౌమచతుర్థి**—మంగళవారమున సంభవించిన చతుర్థి కీపేరు వాడుదురు. (పండుగలు- పర్వతిథులు- ప్రతదినములు చూడుఁడు).

**భౌవన గోత్రము**-(నిధృవగణము చూ.

**భ్రగగోత్రము**-(జాతుకర్ణ్యగణము చూ).

**భదత్యాగోత్రము**—(జమదగ్ని భిదా ఉపగణము చూడుఁడు).

**భ్రమదకుల గోత్రము**- (భ్రమరకుల చూడుఁడు).

**భ్రమపంచకము (శుద్ధాద్వైతవాద మతధర్మమున)**—౧ జీవేశ్వరభేదభ్రమ. జీవునకు నీశ్వరునకు భేదము తోఁచుట.

౨ దేహాత్మభ్రమ- శరీరము, నాత్మయు నొక్కటియేయని తోఁచుట.

3 "ఏకాత్మనః శరీరత్రయేణ భిన్నః" ఇతి భేదభ్రమ- కారణ సూక్ష్మ స్థూలశరీరములందు ప్రాణి వేర్వేరుగ నుండునని తోఁచుట.

౪ "అభిన్న కార్యకారణయోః భిన్న" ఇతి భేదభ్రమ- బ్రహ్మ, విష్ణు, రుద్రులు, సృష్టి, స్థితి, లయములకు కారణకర్త లనియు, వారియందు భేదముండుననియు తోఁచుట.

౫ జగత్సు- సత్యభ్రమ, జగత్తు మిథ్య గాదనియు, సత్యమనియు తోఁచుట. ఇవి కేవల భ్రమలనిశుద్ధాద్వైతవాదమతసులు చెప్పుదురు.

మతాన్తరమున:—

౧ దేహాత్మభ్రమ,— తాను దేహమేనని తోఁచుట యొకభ్రమ.

౨ పాషాణాదిభ్రమ— దేవుఁడు కాని శిలా దారువిగ్రహములను దేవుఁడనుకొనిపూజించుట యొకభ్రమ.

3 మిథ్యాత్మ భ్రమ— ఆత్మ నశించునని తోఁచుట యొకభ్రమ.

౪ దేవతాభ్రమ— అన్యు లగునట్టియు, దేహేంద్రియాదులతోఁగూడినట్టియు, బ్రహ్మ, విష్ణు, రుద్ర, శ్రీరామ, శ్రీకృష్ణాదులు మోక్షకర్తలని భ్రమించి నిర్గుణుండగు పరమేశ్వరుని మరచుట.

౫ కర్మభ్రమ— మోక్ష స్వర్గ వాంఛలతో శ్రౌత స్మార్తోక్తకర్మలు, నుపవాసములు, వ్రతములు చేయుట యొకభ్రమ.

**భ్రమరకీటన్యాయము** — తుమ్మెద పిల్లనుకనుటతో చచ్చుంగాన, దానిజీవితకాలమున గూటినిగట్టి, యం దొక వేరుజాతిపురుగు నిడి, దానికడ ఝుంకారధ్వని చేయుచుండును. కొంతకాలమున కాపురుగు తుమ్మెద యగును. ఈ న్యాయమును గురుశిష్య న్యాయముగను వాడుచుందురు. గురుఁ డజ్ఞానియగుశిష్యుని తనవలెనే జ్ఞానిగానొనర్చుట భ్రమరకీటన్యాయము.

**భ్రమరకులగోత్రము**-ఆర్య వైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్యగోత్రములు చూడుఁడు). భ్రమరకుల (భ్రమదకుల-భ్రవదకుల) ఏకార్షేయ (30) గోత్రము, సంస్కృతగోత్రము. తిత్తిరిస, తిత్తిరిగణము, గార్గ్య, ఆపస్తంబయజుశ్శాఖ. ప్రమాణ మత్స్య సూత్రము. సమానగోత్రము గార్గ్యస. గిరీశుఁడు దేవత. విశ్వాంబ భార్య. ప్రయాగ ఆపస్నానము. విశ్వాంబుధి తటాకము. జపము లక్ష. దీపములు 30. క్షేత్రసంఖ్య ౨౦. పీతాంబరదానం. పాలపండు వర్జనీయము.

**భ్రమరన్యాయము**— తుమ్మెద పూవులలో వాలునది యైనను నన్నిపూవులలో వాలదు. తేనెలభించుపూవులయందు మాత్రమే వాలును. తేనెలభింపనివాట్లను వదలివేయును. సంపంగిపూవులజోలి కసలే పోక తప్పించుకొనును. తామరపూవులలో సాయంత్రము వేళ పోదు. ఏలయన నది సూర్యాస్తమయముతో ముకుళించిన, నందు తెల్లవారులు నిర్బంధమున నుండవలసివచ్చునని దానికిఁ దెలుసును.

జాగ్రతగా ప్రవర్తించుటను దెల్పున్యాయము

**భ్రమరహస్తము** — (హస్తాభినయము చూడుఁడు. భరతశాస్త్రము చూడుఁడు.)

**భ్రమరాంబ** —(అంబాత్రయము చూ.)

# భృగుమహర్షి వంశావళి (భృగుమహర్షి సంతతి)

భృగుమహర్షి (ఈయన బ్రహ్మామానస
పుత్రుఁడు ఈయనకు ఖ్యాతి
యనియు, పులోమయనియు
నిర్వురు భార్యలు)

భార్య ఖ్యాతి

కవి

కావ్యుడు లేక శుక్రా
చార్యుఁడు, భార్య శతపర్వ
రాక్షసుల కాచార్యుఁడు తెల్లని
కాంతిగల్గియుండ
శుక్రాచార్యుఁడు

ధాత భార్య ఆయతి
లేక కుహూదేవి

మృకండర్షి
మృకండర్షికి గ భార్య
యతికన్య, భార్య మనస్విని

మార్కండేయుని
సిద్ధుఁడు. చిరంజీవి.

విధాత భార్య
నియతి

ప్రాణుఁడు

వేదశిరుఁడు

ఉశేనసు

చండామార్కుఁడు
తండ్రి తరువాత
ఈయన
రాక్షసులకు
గురు వయ్యెను.
ప్రహ్లాదున కీతఁడే
విద్యలఁ గఱ
పినవాఁడు.

దంష్ట్రి

త్వష్ట్రి

ధర్మకర్మఁడు

కుమారె
(అరజి యోగిని)

కుమారె
దేవయాని

# భృగుమహర్షి వంశావళి



భార్య పులోమ
చ్యవనుఁడు
ప్యాసుకన్య ప్రమతి
భార్య ఘృతాచియను అప్సర
ఔర్వ్యుఁడు
భార్య మనుకన్య
రురుఁడు
ఋచీకుఁడు
భార్య గాధిరాజు కూఁతురు
సత్యవతి. వీరు నూర్గురు సోదరులు.
శునకుఁడు
శౌనకుడు
శునశ్శేఫుఁడు
(మధ్యముఁడు)
జమదగ్ని
భార్య రేణుక
పేరు తెలియదు
ఉరుపతి
ఉత్సాహుఁడు
విశ్వావసువు
పరశురాముఁడు

**భృగు మహర్షి** భృగుమహర్షి బ్రహ్మ మానసపుత్రుఁడు. వరుణి యజ్ఞగుండ మందలి యగ్నినుండి జనించినవాఁడని మఱికొన్నిచోట్ల చెప్పఁబడినది. భార్య దితి (హిరణ్యకశిపుని కుమార్తె). ఈమెయందుపుత్రుఁడు కవి. ఈకవి పుత్రుఁడు శుక్రాచార్యుఁడు (దానవగురుఁడు.) పుత్రిక దేవవర్ణి. అల్లుఁడు విశ్వవోబ్రహ్మ. మఱియొకభార్య ఖ్యాతి. (ఈమె కర్దమప్రజా పతి కూఁతురు). ఈమెయందు పుత్రులు ధాత విధాత యనువారలు. ధాతకు మార్కండేయుని తండ్రియగు మృకండుఁడు పుత్రుఁడు. విధాతకు పాణుఁడును, పాణునకు వేదశిరుఁడును, వేద శిరునకు శేనస్సునుగల్గిరి. ఇంకొకభార్యపులోమ. ఈమెయందు చ్యవనుఁడు కల్గెను.

**భృగుపారగోత్రము**-- (నిధృవగణము చూడుఁడు.)

**భృగుఆశ్రమము**-- (భృగుతుంగపర్వతము చూడుఁడు.)

**భృగుగోత్రము**-(నిధృవగణము చూ.)

**భృగుతీర్థము**—జబ్బల్పూర్ (జాబాలిపురము)నుండి పశ్చిమముగా పండ్రెండుమైళ్ళ దూరమున మార్బెల్రాక్సుమధ్య నర్మదానది యందలితీర్థము. ఇచటి గ్రామమునకు "భేరా ఘాటన్" అనియెదరు. ఇచట చౌషటస్యోగి నులదేవస్థానము కలదందురు.

ఈ తీర్థ దేవస్థానములంగూర్చి పద్మపురాణము, స్వర్గఖండ ౯ అధ్యాయమునను, మత్స్య పురాణము ౧౯౨ అధ్యాయమునను ప్రశంసలు కలవు. (యోగినులు ౯౪ పేర్లు- శ్రీచక్రము చూడుఁడు. లేక యోగినులు చూడుఁడు.)

**భృగుతుంగపర్వతము (భృగు ఆశ్రమము)**— ఈపేరుగలపర్వతము నేపాలమున గండకీనదీతీరమునఁగలదు. దీనిప్రశంస వరాహ పురాణము ౧౪౬ యందు గలదు. బృగుమహర్షి యాశ్రమ మని చెప్పఁబడినది.

మహాభారతవ్యాఖ్యాత యగు నీలకంఠుఁడు పంచకేదారములలో నొకటియగు తుంగనాథ మును "బృగుమహర్షి యాశ్రమ" మని వివరించి యున్నాఁడు.

**భృగు పట్టణము**—అరుణోద దేశము నందలి బదరీకేదారమునకు సమీపమున నున్న యొక పుణ్యక్షేత్రము.

**భృగుపురము**-(భరుకచ్ఛపురము చూ).

**భృగుక్షేత్రము** — భరుకచ్ఛ పురమున (బ్రోచి) కీపేరు వాడుక గలదు.

**భృగ్వద్వీపగోత్రము**— (ఆర్ష్టిషేణ గణము చూడుఁడు.)

**భృత్యాచారము**— శైవాగమములందు జెప్పఁబడిన పంచాచారములలో నొకటి. ఇది ౧ దాసాచారము, ౨ వీరదాసాచారము, ౩ భృత్యాచారము, ౪ వీరభృత్యాచారము, ౫ సమయాచారము, ౬ కళావస్తుఆచారము నని యాఱుబేదములు కలది.

**భ్రామశిష్టకులగోత్రము**--(వృద్ధికుల చూడుఁడు.)

**భ్రమదకులగోత్రము**— (భ్రమరకుల చూడుఁడు.)

**భ్రష్టకగోత్రము**--(గర్గఉపగణము చూ.)

**భ్రష్టావసరన్యాయము**— జరగఁదగిన పని యొకతఱి జరుగకతప్పిపోయినచో, ననఁగా నాకార్య మత్తఱి భ్రష్టమయినచో, నింక నా కార్యమట్లు జరుగఁదగినదని భావము.

**భ్రాజగోత్రము**—(జమదగ్ని భిదాఉప గణము చూడుఁడు.)

**భ్రాజితాక్షిగోత్రము**— (గర్గఉపగణము చూడుడు.)

**భ్రాతృద్వితీయ**—(యమద్వితీయ యని యనందురు). కార్తికశుద్ధద్వితీయ.(పండుగలు, పర్వములు, వ్రతదినములు చూడుడు.)

**భ్రామరీకుంభకము**—నోరుమూసి తాలువులబలముచే రెండు ముక్కుద్వారములగుండా పూరక కుంభక రేచకములుమూడునుచేయుట. ఇట్టి కంఠము మొదలు నాసిక పర్యంతము భ్రమరనాదముగల్గి, మహానందప్రదమైయుండు ననియుఁజెప్పఁబడినది. (కుంభకముచూడుఁడు).

ఈ యభ్యాసక్రమ మిటుల చెప్పఁబడినను యోగులు దీనిని నిశ్శబ్దకాలమగు నర్ధరాత్రము నం దభ్యసింతురు. పద్మాసనాసీనులై (మఠము వైచుకొని కూర్చుండి రెండు చేతులతో చెవులు నోరు మూసి బిగించి ముక్కురంధ్రములగుండా పూరక, కుంభక, రేచకము లొనర్తురు. ఇట్టికతి కుంభకకాలమున కుడిచెవియందు మొదట చిణి చిణి చిణి యనునాదముగల్గి, పిదప వంశనాదము పిదప మేఘగర్జననాదము, తుమ్మెదనాదము, ఘంటానాదము, భేరీనాదము, మృదంగనాదము, దుందుభినాదము, అనాహతనాదముతుదకుధ్వని కలుగును. ఆధ్వని కల్గుట నోర్చి వినుచుండిన జ్యోతిదర్శనమై, క్రమముగ నందు మనస్సు లీనమై, పిదప సమాధిస్థితికల్గునని చెప్పఁబడినది. (అష్టాంగ యోగములు చూడుఁడు).

**భ్రాష్టవిదుగోత్రము**—(గర్గ ఉపగణము చూడుఁడు.)

**భ్రాష్ట్రేయగోత్రము**—(జమదగ్నివత్సఉపగణము చూడుఁడు.)

**మంకెనచెట్టు**—లా. Pentapetes Phoenicea. సం. అర్కవల్లభః; బంధుజీవః; బంధూకపుష్పవృక్షః.

మంకెన-పెద్దజాతి చిన్నజాతి రెండుభేదములు గలవని కొందరును, నొకేజాతి యని కొందరును ననుచున్నారు. ఎఱ్ఱని పూవులఁ బూచుట సుప్రసిద్ధము.

ఆకులు విరేచనబద్ధముఁజేసి కఫమును,వాతమును హరించును. ఆకు నూరినైనవేశికట్టిన గడ్డలను మృదువుపరిచి యణగించి నొప్పితీయును. విత్తులు మేహశాన్తి, పైత్యశాన్తి, గల్గించి శెగరోగము నాపును. పూవులు వాతమును, పైత్యమును హరించి కఫమును, మలబద్ధమును గల్గించును.

**మంకణుఁడు**—ఋషి. తపోమహిమాతిశయుఁడు. సారస్వతమున నటనము సల్పినవాఁడనియు, పరమేశ్వరుని యనుగ్రహపాత్రుఁడై ప్రకృతి (పరమేశ్వరార్ధాంగము) యొక్క మాహాత్మ్యమెరిఁగినవాఁడనియుఁ జెప్పఁబడినది.

శ్రీముఖలింగక్షేత్రమున ముఖలింగపురమున కొకటిన్నర మైళ్ళదూరమున వటాద్రి (మఱ్ఱికొండ)పై మంకణేశ్వరశివలింగము గలదు. ఇది మంకణమహాముని యాశ్రమమున నాయనచే బ్రతిష్ఠింపఁబడినదని యచ్చటివారందురు. శ్రీముఖలింగక్షేత్రమహాత్మ్యమున నీవటాద్రియొక్కయు మంకణాశ్రమమును, మంకణఋషి గూర్చియుఁ బ్రశంసలుగలవు. వటాద్రియందు బరమేశ్వరుఁడీయనకు సాక్షాత్కరించిన ట్లాక్షేత్రమహాత్మ్యమున జెప్పఁబడినది.

**మంగచెట్టు**— లా. Randia (లేక Gardenia లేక Posqueria) Dumetorum. ఆంగ్ల. Emetic nut tree సం. కరహా, కరహాటః, కరహాటకః, మదనః, మదనఫల వృక్షః, శ్వసనః.

దీనివేరు చెక్క, ఆకులరసకషాయచూర్ణము లం దీక్రిందిరోగములఁ గుదుర్చుశక్తిఁ గలదని చెప్పఁబడినది.

అస్థిగతజ్వరమువంటి సమస్త జ్వరములు, అతిశ్వాస,ఉబ్బురోగము,కాస,గుల్మ, దురదలు పడిసెము, పాండువు, పీనస, పొత్తికడుపులోని శూలలు,రక్తవిరేచనములు,నీళ్ళవిరేచనములు, వ్రణములు, వాతరోగము, విద్రధి (అనఁగా నాభియందు పుట్టువ్రణము), శ్లేష్మరోగముల నడచునని చెప్పఁబడినది.

మంగవేరు నూరి తలకు రుద్దిన శిరోవాతములు హరించి తలపేలు చచ్చునని యు, మాను చెక్క నూరి పైని పట్టువేసిన నెముకలనొప్పి, పోటును శమించుననియు, గాయములు మానుననియు,లేతకాయలకూర త్రిదోషములశమింపఁ జేసిసర్వరోగహారముగనుండుననియు,జఠరదీ దేహపుష్టి నొసంగుననియు, మఱియు, కఫ, కాస, క్రిమి, వాత, శ్వాస, క్షయరోగముల నడంచుననియు, నెండుకాయలచూర్ణము లోని కిచ్చిన నించుక వికారముగల్గించి వాంతియై శ్లేష్మము బడిపోవుననియు, చెమటఁబట్టించుచు క్రిమినిజంపి, రక్తవిరేచనముల నాపుననియు, ఎండుకాయలను నీటనానించి పిసికి వడకట్టిననీళ్లు లోనికిచ్చిన వాన్తి యగుననియు, నెండుకాయలనునూరి పట్టువెచిన వాతనొప్పులు, మేహ వాతనొప్పులు, ఊదుబ్బవ్యాధి, గడ్డలు, గాయములు, చర్మరోగములు, నరములజబ్బు నిమ్మళించువనియు, మంగపండునం దుబ్బు, కాస, జ్వరము, వ్రణములు, వమనము, విషదోషము, శ్లేష్మరోగముల నడంచుశ గలదనియుఁ జెప్పఁబడినది.

**మంగడగోత్రము**—(భరద్వాజ ఉపగణము చూడుఁడు.)

**మంగమకులగోత్రము**- ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలోనొకటి. (వైశ్యగోత్రములు చూడుఁడు.)

మంగమకుల (వంగమూలకుల వ్రికశిష్ట వ్రికాల)గోత్రము. ఏకార్షేయ(౬౭) గోత్రము. సంస్కృతగోత్రము వాయువ్యస.వాయుగణము. హయగ్రీవర్షి. ఆప స్తంబసూత్రి యజుశ్శాఖ. ప్రమాణగ్రంథ మాద్యప్రవరఖండ. సమాన గోత్రము హయగ్రీవస. జలేశుఁడు దేవత. కృష్ణాంబభార్య. గోదావరీతీరము తపస్థానము. కృష్ణసరస్సుతటాకము. జపము లక్ష. పములు ౨౦ ౨౧. అన్నదానము. అనుములు వర్జనీయము.

**మంగలికత్తి (దారు)** (Razor and —ఎంతచక్కనిపదును (దారు) గల మంగలకత్తియైనను మనకండ్లకుఁ దానిదా రెడ తెగక జక్కగనున్నట్లు కన్పించుఁగాని భూత ద్దము (Microscope) నందుఁ బరిశీలింతు మేని మంగలికత్తిదారు (edge) రంపమువలెఁ గక్కులఁ (Saw-like teeth) గల్గియుంట గాననగును. ఇవి సూక్ష్మాతిసూక్ష్మము లగుట గంటిదృష్టికిఁ గానరాక, భూతద్దమునందు దర్పితమగుటవలన నె(magnified through microscope) గాననయ్యెడిని.

కత్తిని వాడుచున్న కొలది నివిపెద్దవియగుచు నెగుడుదిగుడులఁ జెందుచుండును. అప్పుడు కత్తి సరిగా తెగకపోవును. మనము 'కత్తిమొద్దయి నా'దని యనుకొందుము. గానినిజముగఁ దెగమి

సంభవించుట కత్తి మొద్దగుటవలన గాదు.

అట్లుసంభవించిన కక్కులకు "molecules" అనెదరు. ఆకత్తి నుత్తరదక్షిణములుగా నుంచి కొంతకాల (రమారమి యొకవారము) ముంచి కదపకుండినచో నుత్తరదక్షిణధ్రువములకడనుండి 'ఇనుము' 'ఉక్కు'లనుఁ దమదిశల కాకర్షించు మేగ్నెటిక్ కరెంటు (Magnetic Currents) లీకత్తి మొనను (కంపస్‌నందలి ముల్లును వలె) లాగనారంభించి క్రమముగ మొనయందలి పండ్లవంకరలఁ దీర్చితిన్నగ సాగదీయును. పిదపఁ గొంచముగ మంగలి రాతిపైనిఁ దోలుపైని నూరి (Stroping) నచో నపరిమితముగు పదునుతో సౌఖ్యముగ క్షౌరమొనర్పఁ గలుగును. కత్తి కేవలము మొద్దగునేని సానబట్టించి నూర కిట్లుంచినఁ జక్కగ పనిచేయగలుగును.

**మంగలి జాతి** —గంధర్వసంబంధమున నొక బ్రాహ్మణాంగన విధాతచే సముద్రమున శిలయై యుండ శపింపఁబడి పరశురాముని పాదస్పర్శనమున శాపవిముక్తి నొంది పరమేశ్వరుఁ గూర్చి తపమాచరించి యాతనివరమున నొక సుతుఁగనెననియు నాతఁడే మంగలిజాతికిమూలపురుషుఁడనియు, వీరియం దొక బలమగు ప్రతీతి కలదు. ఇందుకు గ్రంథనిదర్శనములు గానరాకున్నను, వీరియం దీవాడుక యనుశ్రుతముగ వచ్చుచున్నది. వీరుత్తరదేశములందు "నాయి" యనఁబడుచున్నారు. క్షౌరముల జేయుటవృత్తిగ గల్గియున్నారు. బ్రాహ్మణజాతి వారమనుచుందురు

**మంగలిఇంటి ఎదటి పెంటదిబ్బ ఎంతత్రవ్వినా బొచ్చే**—(ఆంధ్రలోకోక్తి).

**మంగలి పాత, చాకలి క్రొత్త**- (ఆంధ్రలోకోక్తి).

**మంగళగిరి**- గుంటూరుమండలములోని యొకక్షేత్రము. యొకపాటికొండపై నొకటియు దిగువనొకటియు, రెండు నృసింహస్వామి దేవళములు గలవు. కొండపైనున్న దేవస్థానమునఁ గల నృసింహవిగ్రహముఖ మొకసాలగ్రామమనియు నందలి రంధ్రమేనోరనియుఁ జెప్పుదురు. అందు పానకము నొక శంఖముతో బోతురు. సగముఁ బోసినపిదప నికలోనికిఁ బోదనిప్రతీతి. ఈక్షేత్రమును చైతన్యదేవుఁడు దర్శించినటుల చైతన్యచరితామృతము ౨-౯ యందుకలదు.

**మంగళగిరి ఆనందకవి**— ఆంధ్రకవులలో నాధునికులలో నొకఁడుగఁబరిగణింపఁబడినవాఁడు. ఆర్వేల నియోగి. తొల్లింట నాత్రేయసగోత్రము. పిదప క్రైస్తవుఁడు.

రచించినది వేదాంతరసాయనమను క్రైస్తవమతగ్రంథము. పద్యకావ్యము. దీనిని నిడిమామిళ్ళ దాసయ్యగారికిఁ గృతియిచ్చెను. ఈకృతిపతియుఁ గ్రైస్తవుఁడైన నియోగియే.

కవి కృష్ణామండలవాసి. కృతిభర్త బందరుపురమున నుద్యోగి. కూచిమంచి తిమ్మకవికి సమకాలికుఁడు, గాన క్రీ. వె. ౧౭౫౦ సం॥ర ప్రాంతమువాఁడు.

**మంగళగోత్రము** — (శండిలగణము చూడుఁడు.)

**మంగళగౌరీవ్రతము**-స్త్రీలకు వివాహమాది యైదుసంవత్సరములదనుకఁ బ్రతిశ్రావణమాసమునందలి మంగళవారములందు మంగళగౌరీదేవిఁ బూజించువ్రత మొనర్చుదురు. దీనిని సర్వసాధారణముగ శ్రావణమంగళవారముల నోమనివాడుచున్నారు. సౌమంగల్యరక్షణకై యీవ్రత మాచరించెదరు. (స్వర్ణషోడశగౌరీవ్రతము జూడుఁడు.)

**మంగళములు ౮ (అష్టమంగళములు)**—౧ చామరముతో విసరుట, ౨

ఘంటానాదము, ३ దర్పణము, (అద్దమును జూపుట) ४ వాద్యము, ५ దీపహారతి, ६ కోడి, (హారతిభేదము) ७ వేత్రహస్తుడు (దండముగాని యాయుధముగాని ధరించినయనుచరుఁడట) ८ విప్రద్వయము కల్గుట. జైనమతధర్మమున దీక్షకరులుపొందినవి పంచమంగళములు.

**మంగళవారము** (Tuesday)- అంగారకుడు లేక కుజునికి పవిత్రదినము. దీనికిమంగళవారమని పేరుంట, క్షయసంవత్సరమున కక్షయయని వాడునట్లే, దీనిని మంగళవారమని వాడుచుందురు. భరతదేశమునందలి శూద్రులు మంగళవారము గ్రామదేవతల నారాధింపఁ బవిత్రదినమని పాటించుచున్నారు. శ్రావణమాసమునందలి మంగళవారములు సౌభాగ్యగౌరి నారాధించుటకుఁ బవిత్రదినములు.

**మంగిపట్టణము**—ఇది శాలివాహనుని రాజధాని యగు ప్రతిష్ఠానపురము (నైజాము రాజ్యములోని ఔరంగాబాదు ప్రాంతము)గ (పైఠన్ పురముగ) Burgess antiquities of Bidar and Aurangabad ५४ పుటయందుఁ జెప్పఁబడినది.

**మంగోలియాదేశము**- ఆసియా ఖండమున చీనారాజ్యమునందలి యొక దేశము. ఇది మంచూరియాకు పశ్చిమముగా నున్నది. గోబీ ఎడారి యీ దేశములోనిది. దీనిని షామోఎడారి యనియు నందురు. దేశమధ్యమునందున్న బయలు ०१५०० మైళ్ల పొడవుఁగలది. ఇది ఇసుకయు మధ్యమధ్యశిలలుఁ గలది. ఎడారి మధ్యమున చీనావారిచే 'హాన్హాల్' అనంబడు పెద్దదియగు బల్లపుఁబ్రదేశము గలదు. దీనియం దొకప్పుడు నీరుండి యెండిపోయెనని చెప్పుదురు. *హాన్హాలనిన నెండిపోయినసముద్రమనియర్థము.

మంగోలియా దక్షిణభాగములందు హొయాంగ్హోనదిలో కలియుచిన్నచిన్న యుపనదులనీరు పొలములందును నుపయోగించు కాల్వలనేకములుం గలవు. దేశమున సైబీరియానుండి వీచుచలిగాలులుం జాలబాధకరముగ నుండును. బార్లీ మొదలగు ధాన్యములు పైరు చేయంబడుచున్నవి. జొన్నపంటయు, వరిపంటయు గొంచముగలదు. ప్రజలు తార్తారుజాతివారు. చాల మోటవారు. వారు నాటినుండియును మేపుకొనుచు దేశదిమ్మరులై యుందురు. పైకాలమున నొకసామ్రాజ్య దేశముగ నున్నది. దాని కక్కిరి తీరమున 'ఉర్గా'పురము ప్రధానపురమై యున్నది. దీనితొల్లిటి పేరు 'ఉర్గాపురి' "మనియందురు. చాల కాలమువరకుఁ జీనాదేశమునకు లోబడిన చిన్న చిన్న ఖానులను సామంతరాజులచే పాలింపబడుచుండి యిప్పుడు ప్రజాప్రభుత్వముఁ జేరి యున్నది. బౌద్ధమతగురుండగు 'లామా'ను పూజించుట ప్రధానముగాగల బౌద్ధమతస్థులు. ఆయన యుర్గాపురముననే యుండును. మొయిమచ్చిన్నరము వర్తకస్థానము. (చీనారాజ్యము చూడుఁడు). దీనికి పశ్చిమమున జంగేరియా టెరిటరీ కలదు.

**మంచనకవి** — ఆంధ్రకవులందు పూర్వకవులలోఁ బరిగణింపఁబడినవాఁడు. రచించినది కేయూరబాహుచరిత్రము. దీనిని నండూరి గుండనమంత్రికిం గృతి యిచ్చెను.

**మంచారేయ గోత్రము**—(వీతహవ్య లేక యాస్కగణము చూడుఁడు).

**మంచికి చెడ్డకూ గూడ మనస్సే సాక్షి**—(ఆంధ్రలోకోక్తి).

**మంచివారికి మాటయే చాలును**- (ఆంధ్రలోకోక్తి).

**మంచివారికి మరణమే సాక్షి** - (ఆంధ్రలోకోక్తి).

**మంచు** (Vally mist) — హఠాత్తుగను త్వరితముగను రాత్రులందు భూమిశీతలమై వాయుపథమునందున్న నీటియావిరి జేరుకొని చిన్నతుంపురులఁ బోలినజలకణములుగ భూమిపై (వర్షించునటుల) పడును. దీని నాంగ్లమున 'Vally mist' అనియెదరు. ఈజలకణములు బచ్చికపైనిన్నీ, చెట్లయాకులపైనిన్నీ పడి జలబిందువులుగనుండుదాని నాంగ్లమున 'Dew' అనియెదరు. ఇది ఘనీభవించిన జలరూపము గాదు. (స్లీటు, ఉదకము, దానికార్యములు చూడుఁడు. మీాటియారోలోజీ చూడుఁడు.)

**మంచు** (Ice)— వేసవికాలమున సౌఖ్యప్రదము లనిపించు శీతలపానీయము (Cold Drinks) ల నొనర్చుటకు యంత్రములసాహాయ్యమున మంచుఁజేయుట యెల్లరెరిఁగినదే. ఈయంత్రముల నెఱుఁగని ప్రాచీనదినములలో సమీాపముననుండు పర్వతశిఖరములు మొదలగు తావులనుండి తెప్పించుకొను చుండువారు. మొగలైచక్రవర్తులు వందలకొలది మైళ్లదూరము నుండి తెప్పించుకొనుచు భద్రపర్చి వాడుకొను చుండువారని చెప్పఁబడినది. పాశ్చాత్యదేశము లందు శీతకాలమున నదులు ఘనీభవించినతరిఁ గైకొని భూగృహము (Cellars) లందు భద్రపర్చువారని తెలిసెడిని.

తర్వాతకాలమున Wenham lake ice దిగుమతి చేయఁబడి బొంబైనగరమున నొక చల్లని Tower లో భద్రపరుపఁ బడుచు వాడుకొనఁబడుచుండెను. బంగాళమున నేదోవిధమున మంచును చేయుచుండువారని వదంతికలదు. Shade temparature ఫారెన్హైటు తెర్మోమీాటరునందు 120 డిగ్రీలు చూపునదనుననహా నీటియావిరి శరీరఁపువేఁడి నధికముగ లేవనీయదు అను రహస్యము నెరింగినవారికి మెరకపల్లములందు నీరుపోసి గడ్డిపైనుంచి (మట్టినేలయందు) న వేడిగాలి దానిపైమంచును పేర్కొనజేయుట గాననగునఁట. దానిమూాలమున బంగాళమున మంచుజేయువా రుండిరఁట. వడగండ్లు మంచే నని యందరెరింగినదే. దానిని కరుగనీయక నిలపియుంచు పద్ధతియే యిందలి రహస్యమని యెరుంగవలయును.

**మంచుకాలము**— (ఐస్ పేజి చూ.)

**మంచు నీటికన్న తేలికయై యుండుట**—మంచు నీటియొక్క ఘనరూపమే యైనను నీటికన్న తేలికయై, యనఁగా పరిమాణము నందధికమై యుండును. అనఁగా నొకక్యూబిక్ అడుగునీటిని మంచుగఁ జేయఁగలిగితిమేని యొక క్యూబిక్ అడుగు మంచుకన్న నధిక పరిమాణముగల మంచుముక్కగ నగును. మఱియొక విధమునఁ జెప్పినచో నొక క్యూబిక్ అడుగునీటికన్న నంతే పరిమాణముగల మంచు తేలికగానుండి తక్కువ తూగును. Heat expands bodies and cold contracts them అను నాంగ్లరసాయనశాస్త్రధర్మమున కిది లోబడదని యెఱుంగునది. ఈలోబడకపోవుట నీరు ఘనీభవించుతఱి జరుగుచుండునని పరిశీలనలు తెల్పుచున్నవి. గాననె యొక్కొక్కతఱి నట్టి తిరుగుచాటునందు మంచు పగులుటయుఁగలదు. శీతలదేశములందు నీటిగొట్టములు Frost నుండి చక్కని రక్షణము లేనితావుల పగులుటయుఁ గలదు. మంచునందు కూడియున్న గాలి చాల తేలికగా నుంట నిట్లు జరుగుచుండునఁట. ఎత్తుగుపర్వతాగ్రములందు సిద్ధమగుమంచునందును జరుగుపని యిదియెనఁట. మనుష్యశరీరమునందలియెముకలందుకన్న నెగురునట్టి పక్షులశరీరము నందలి యెముకలందు తేలిక యధికమగుట నవి యెగుర వీలగుచున్నదని పరిశీలకులనుచున్నారు.

**మంచుబిందువులు గరికపై నేర్పడుట-డ్యూపాయింటు** (Droplets of Dew on grass- Dew Point)—వాతావరణమున గాలియందు నీటియావిరిగూడ నుండునని యెల్లరెరిఁగినదే. వేడిగాలి (Warm air) యందధికమును, చల్లగాలియందుఁ గొంచముగను నీటియావిరి యుండునని పోల్చఁబడియున్న రహస్యమే.

వేడికాకుండ నీటియావిరిని గాలి యెంతదీసు కొనగలదో యంతయావిరింగై కొన్న గాలి నాంగ్ల రసాయనశాస్త్రవేత్తలు 'Saturated air' అనెదరు. దానికి శీతలముఁతగులునేని యందలి నీటియావిరి యడగి దట్టమైన చిన్నచిన్న జల బిందువులుగ నేర్పడును. అట్టితరి నాగాలి యా నీటియావిరిని భరింపఁజాలనిదగును. అట్టివాతావరణపరిస్థితి కాంగ్లమున 'Dew point Temperature' అనిపేరు. ఈసంనర్భమున శీతలము తగులుటయున శీతలవాయువువీచుటగా పొరఁబడరాదు. అట్లేయగునేని నావీచుశీతలవాయువీనీటియావిరింగల వేడిగాలిం దరిమివేయునది యని యెరుంగఁదగును.

చల్లగనుండు రాత్రులందు నిర్మలముగ నిర్మేఘముగ నాకసముండుతరి తెల్లవారుజాము నకు భూమియందలి యధికోష్ణము తప్పించుకొని దరినుండు వాతావరణపుగాలిలోనికిఁ జేరుకొను టతో భూమి శీతలమై దానిపైగల గాలిపొరం గూడ శీతలమగునట్లొనర్ప పైఁజెప్పన Dew point Temperature ఏర్పడి వాయువునం దలి నీటియావిరి చిన్నచిన్నబిందువులు లేక జల కణములై భూమిపైనుండు పచ్చికపైఁబడి గాన నయ్యెడిని. పచ్చికలేకున్న నించుకభూమిపైపొరఁ దడవఁజేసెడిని. దీనిని మంచుబిందువు లనెదరు. ఆంగమున దీనికే 'Dew' అనిపేరు.

హఠాత్తుగా డ్యూపాయింటుటెంపరేచర్ అతిశీతలము నందుతరి Artificial dew ఏర్పడును. సాదృశ్యముగా నొకగాజుగళాసు నందు మంచువైచిననీటిని(Ice cold water) వెచ్చనివాయువుగల గదిలోనికిఁ దెచ్చియుంచిన నాగళాసు వెలుపలిభాగమున చెమర్చినట్లు జలబిందువు (మంచుబిందువులు లేక డ్యూ) లేర్పడి కన్పడును. దీని నాంగ్లరసాయన శాస్త్రవిదులు Artificial dew అనెదరు. (హెూరు హాస్టు ఐస్ క్రిస్టల్సు చూడుఁడు.) గాలినుండియేర్పడిన మంచుబిందువులు కొన్ని బుగ్గియొర్క పరమాణువులు (కంటికగుపడనివి) జుట్టికొనియు, కొన్ని పొగకణములఁ జుట్టికొని యుంచుటకలదు. ఈసందర్భమునఁ బొగయంతయు కణములమయమని యిటీవలిపరిశీలనలు బయల్పరచినవి. వీల్చి యొకతరిపైకివదలిన సిగరెట్టుపొగయందు ౪౦౦౦౦౦౦౦౦౦ నాల్గువందలకోట్లవరకు పొగకణములు లేక పరమాణువు లుండునఁట.

**మంచూరియనాదేశము**—ఆశియా ఖండమున చీనారాజ్యములోని యొకదేశము. ఆమూరునదికి దక్షిణమున నున్నది. క్రి. వె. ౧౬౪౪ నుండి రష్యావారిది మాదనుచుండిరి. కిరినొలాపురము ప్రధానపురము. కొండలమయమైనదేశము. శీతకాలమున చలి మిక్కుటము. ఆమూరునది మంచుగ బిగిసిపోవుచుండును. ఓటుధాన్యము దక్షిణభాగములందు విరివిగ పైరుచేయఁబడుచున్నవి. అరణ్యము విస్తారము గలదు. దేశమున జనము చాల తక్కువ. వీరు చీనాదేశపువారగు జాతులు. బౌద్ధమతము దేశమందలిమతము.

ముక్డెనుపుర మొకప్పుడు ప్రధానపట్టణమై యుండెను. న్యూఛంగుపురము ప్రధానమగు

రేవుస్థానము. పోర్టుఆర్థరు రేవుపట్టణమును, డెలిన్వా నేవుపట్టణమును రష్యావారికి గుత్తకీయఁబడిన రేవులు. ఇవి లియావోటంగు ద్వీపకల్పమునం దున్నవి.

**మంజారి గోత్రము**— (వ్యాఘ్రస్య లేక మిత్రయువగణము చూడుఁడు).

**మంజిష్ఠ**— లా. Rubia Cordifolia అనియు, Rubia Manjista; ఆంగ్ల. Indian madder root ఇది బంగాళా దేశఁపు మూలిక యందురు. సం. జ్వరనాశనీ, నాగకుమారీ, మంజిష్ఠా.

మంజిష్ఠచూర్ణము, కషాయము వేడిఁజేసి స్త్రీల ఋతురక్తమును ప్రసవస్త్రీల మైలరక్తమును వెడలించును. శిశువుల క్షయనివారించును. విషదోషము నివారించి మేహశాంతి గల్గించి, నేత్రరోగముల నివారించు ననియు, కఫోద్రేకము నడంచుననియు, కామిల, మూలవ్యాధి, బహుమూత్రముల నివృత్తిజేయు ననియుఁ జెప్పఁబడినది.

**మంజీరానది** - ఇది గోదావరీనదియందు గలియును. దీనికి వంజుళ, వంజీర యనియుఁ బేర్లు వాడబడినవి. మహాభారతము భీష్మపర్వమున మంజుళమని పేర్కొనబడినది.

**మంజుపట్టణము**- నేపాలదేశమునందు కట్మాండునగరమునుండి రెండున్నర మైళ్ళదూరమున గలదు. కొంతకాల మాదేశమున కిది రాజధానిగగూడ నుండినది. మంజుశ్రీబోధి సత్వుఁడు నిర్మింపజేసిన పురమని స్వయంభుపురాణము 3-౧౫-౨ యందు చెప్పఁబడినది. పిదపఁ బట్టణము పాడైపోవ, నశోకచక్రవర్తి తాను నేపాలమున కరిగిన యానవాలుగ నా పాడుపడిన తావుననే 'పాటాన్' లేక 'లలిత పాటాన్' అనఁబడుచున్న యిప్పుడున్న పట్టణమును నిర్మింపఁజేసెనని Smith's early history of India, page 162 నందు చెప్పఁబడినది.

స్వయంభునాథదేవస్థాన మిటకు మైలున్నర దూరమున (కట్మాండునుండి ఒకమైలు) నున్నది.

**మంజూషాఖున్యాయము**-ఒక పాము లవానియింటఁ బాములపెట్టెలో నిద్దియో తిండి సామగ్రియున్నదని యెలుక లాపాములపెట్టెకుఁ గన్నము జేసి లోనదూర నాపా మాయెలుకలఁ దినివైచెనని కథగలదు. అట్టిస్థితి కీన్యాయము వాడుదురు.

**మండకారిగోత్రము**-(హారితఉపగణము చూడుఁడు.)

**మండపాక పార్వతీశ్వరకవి**— ఆంధ్రకవులలో నాధునికులందుఁ బరిగణింపఁబడిన వాఁడు. వేగినాటి బ్రాహ్మణుఁడు. పారాశరస గోత్రము. తండ్రిపేరు కామేశ్వరపండితులు. వీరిది వంశపరంపరగా గొప్పవిద్వాంసులు కవులుగల కుటుంబము. బొబ్బిలి యాస్థానమున బ్రధానవిద్వత్కవి. ఆకాలమున సంస్కృతాంధ్రముల నింతపండితుడు లేడనిపించుకొనిన మహాకవి. చతుర్విధకవిత్వములు జెప్పనేర్చిన వాడు.

ఈమహాకవి రచించినగ్రంథము లెనుబది బయటఁబడినవి. ఈయనను శతాధికగ్రంథకర్త యని యనుచున్నారు. రాధాకృష్ణసంవాదము, కాంచీపురమాహాత్మ్యము, అమరుకకావ్యము, ప్రబంధసంబంధ బంధనిబంధనగ్రంథము, శ్రీకృష్ణాభ్యుదయము ననునవి వ్యాపించినవి. ఇంకనిట్టివెన్నియో యముద్రితములుగ నున్నవఁట.

**మండచిత్రగోత్రము**— (జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.)

**మండనమిశ్రుడు** —తొల్లి కర్మవాదిగ నుండి శంకరభగవత్పాదులచే నోడి, శిష్యుడై సన్యసించి విశ్వరూపస్వామియనంబడిన మాహిష్మతీపురవాసి. (అనూపదేశము చూడుడు- సురేశ్వరాచార్యుడు చూడుడు.)

**మండలకుష్ఠు**—కుష్ఠురోగభేదములలో నొకటి. శరీరమునం బొడలుగ లేచునది.

**మండలత్రయము**-(గ్రంథులు చూ.)

**మండలము**—మండలమనిన సమూహము,పరివేషము,దేశము, ప్రతిబింబములకర్థము.

దశమండలములు-౧ వియత్ (ఆకాశ) మండలము, ౨ తమో (చీకటి) మండలము, 3 మేఘమండలము, ౪ జ్యోతిర్మండలము, ౫ తారా (నక్షత్ర) మండలము, ౬ విద్యు (మెరపు) న్మండలము, ౭ సూర్యమండలము ౮ చంద్రమండలము, ౯ వహ్ని (అగ్ని) మండలము, ౧౦ హిరణ్మయమండలము నని సీతారామాంజనేయసంవాదమునం జెప్పంబడినది.

**మండిసంస్థానము**— పంజాబుదేశములోని బ్రిటీషు రక్షితసంస్థానములు 3౪ లో నొకటి. సిక్కుసంస్థానము. మండీపురము రాజధాని

**మండుగోత్రము** — (జమదగ్ని వత్సకపగణము చూడుడు.)

**మండుకులగోత్రము** - ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్యగోత్రములు చూడుడు). మండుకుల (మందకుల) గోత్రము, ఏకార్షేయ (౧౮) గోత్రము. సంస్కృతగోత్రము కపిలస-కపిలగణము. ఆపస్తంబయజుశ్శాఖ. ప్రమాణగ్రంథ మాద్యప్రవరఖండ. కోటీశ్వరుడు దేవత. కమలాంబభార్య. కేదారము తపస్థానము. కమలాంబునిధి తటాకము. జపమర్బుదము. దీపములు ౫౦. క్షేత్రసంఖ్య ౫౦. గోదానము. మామిడికాయ వర్జనీయము.

**మండుగోత్రము**—(వీతహవ్యలేకయాస్క-గణము చూడుడు).

**మండూకతోలనన్యాయము**—కప్పల తక్కెడ యని యర్థము. కప్పలందూచవలెనన్న యవి స్థిరముగా నుండునవి కావని భావము. నాయకునియాజ్ఞకు లోబడని సమాజమునకును యజమానికి లొంగని కుటుంబమునకును కప్పల తక్కెడసమాజ మని వాడుదురు.

**మండూకప్లుతిన్యాయము**—వ్యాకరణ మహాభాష్యమునం జెప్పంబడిన న్యాయము. కప్పదాటువలె నొకసూత్రముయొక్క పరిస్థితుల నుండి కొన్నిటిందాటి వేరొకసూత్రపరిస్థితి కొకే సారి జనుట కప్పదాటువలె ననిభావము.

స్తిమితము నెమ్మది లేక వెర్రిసంచారము లొనర్చువారి చర్యల న్యాయము వాడుచుందురు.

**మండూకముద్ర**—యోగాభ్యాస విధానమునం జెప్పంబడిన వింశతిముద్రలలో నొకటి.

నోటినిమూసి నాల్కనుపైకెత్తి యిటునటు ద్రిప్పుచుండినం బ్రసవించునది యమృతతుల్యమనియు, దానిని మ్రింగిన జరామరణముల దూరమొనర్చుననియు నిదిమాండూకముద్రయనియుం జెప్పంబడినది.

**మండూక వసాక్తాక్షాణాం వంశేషూరగభ్రమరితిన్యాయము**—కప్పక్రొవ్వు గండ్లకు వ్రాసిన నేత్రములుభ్రమనెంది వెదురు కఱ్ఱలబాములవలెం గన్పడం జేయునని యర్థము.

మణిమంత్రౌషధులవలన మరుగు పర్చబడి భ్రమజెందువారికి నిజస్థితి సరిగా గోచరించదని భావము.

**మండూకాసనము**— యోగ శాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి. రెండుమీఁగాళ్లు నేలనానించి రెండరికాళ్ళుఁ బిరుదులనానించి గుదస్థానము బిగించిపట్టి మోఁకాళ్ళపై చేతులనానించి కూర్చుండుట మండూకాసనము. దీనివలన నపానవాయువూర్ధ్వగతిఁజెందునని చెప్పఁబడినది.

**మంత్రకూటము (మంథెన)**—ఇది యిప్పటి నైజాము రాజ్యమున మంథెన యనఁబడుచున్నది. ఇది యొకప్పుడు కాకతీయ (త్రిలింగ) సామ్రాజ్యమున గుండరాజను సామంతరాజు పాలనక్రింద నుండె ననియు, నాతఁడు తిరుగఁబడినకతన కామసేనానిచే నిహతుఁ డయ్యెననియు తెలియుచున్నది. (త్రిలింగ (కాకతీయ) సామ్రాజ్యము చూడుడు) ఇంక నీప్రాంతముననున్న వేములవాడ తొల్లింట వేంబాలవాడ (వేపచెట్లగ్రామము) యనియు, కొల్లిపాకనాడు (కొల్లిపాకేనాడు) మనదినాడు మిత్తినాడు కోసగెనాడు గావిదిరాలనాడు కాళ్లకెలగునాడు సిందవాడినాడు యివియున్నియుఁ గ్రీ. వె. ౧౧౮౩-౧౧౮౮ లలో పశ్చిమచాళుక్యుల పాలనక్రింద నుండినటుల రెండవజగదేకమల్లుని ప్రధాని కేశిమయ్యగారిసుతుఁడు చామరాజు వేయించిన (ఆదవాని తాలూకాలోని గుర ·లగ్రామమందలి) రామేశ్వరస్వామి శివదేవాలయమునగల శాసనమునుండి తెలియుచున్నది. (కొలనుపాక క్షేత్రము చూడుడు.) మధ్యకాలము కడదనుక మంథెన,కింతలి గ్రామముల ప్రాంతదేశము హిందువుల వేదముఁ జదివిన ఘనపాఠీలచే పేరందియుండెను. ఇప్పుడదిపోయి వంట బ్రాహ్మణులచేఁ బేరందియున్నది.

**మంత్రప్రయోగములు (ప్రయోగములు లా)**—౧ వశ్యము. (తానొకరినిఁ దనకు స్వాధీనునిగా చేసుకొనుట.)

౨ మారణము. (తానొకరిచావునకై జపమొనర్చుట).

3 స్తంభనము. (కదలమెదలలేకుండుటకై జపమొనర్చుట).

౪ సంమోహనము. (మోహించు (వలచు) టకై జపమొనర్చుట).

౫ ఉచ్చాటనము. (పిశాచాదుల వెడలగొట్టుటకై జపించుట).

౬ ఆకర్షణము. (పిశాచాదుల వచ్చునట్లు జపించుట.

౭ భీషణము, (భయము కల్గించుటకై జపించుట.)

౮ భేదము. (విరోధముంగల్గించుటకు జపించుట.)

౧-౨-3-౫-౬-౮ ఇవి షట్ప్రయోగములనఁ బడుచున్నవి

**మంత్రము సరిగారాని సంధ్యావందనమునకు మరిచెంబె డుదకము వ్రయనొక్కువ**— (ఆంధ్రలోకోక్తి).

**మంత్రయోగము (ప్రాకృతయోగము)**—(అభ్యాసయోగములు చూడుఁడు.)

**మంత్రవరగోత్రము** -- (కపి యుపగణము చూడుఁడు).

**మంత్రసాని** -(Midwife) పురుడుపోసి ప్రసవమున నుపచార మొనర్చుస్త్రీ. కాని యీామెయందు మంత్రమును లేదు, సానియుగా నేరదు. దీని కాంగవిధానమునఁ బరీక్షలు గలవట. మంత్రసాను లాపరీక్షయందు కృతార్థులై యుండవలెనఁట.

**మంత్రాధ్వ (సప్తకోటిమహామన్త్రములు)**— మూలవిద్యా సంజాతములగు సప్తకోటి మహామంత్రములు మంత్రాధ్వయని చెప్పఁబడినది. అధ్వ యనిన మార్గమని యర్థము. ప్రతి మంత్రమునకును నారు విన్యాసవిధులుండును. అవి ౧ హృదయవిన్యాసము, ౨ శిరోవిన్యాసము, ౩ శిఖావిన్యాసము, ౪ కవచవిన్యాసము, ౫ నేత్రవిన్యాసము, ౬ అస్త్రవిన్యాసము అనునవి. అవి ప్రధానములు.

మహామంత్రవితతియందుఁ బంచబ్రహ్మమంత్రము (౧ సద్యోజాత ౨ వామదేవ ౩ అఘోర ౪ తత్పురుష ౫ ఈశానమంత్రము) లెక్కువ ప్రాముఖ్యము నందినవిగాన నవియును మూలవిద్య కంబిదప ముఖ్యములు.

సప్తకోటి మహామంత్రములకు నీవిన్యాసమంత్రము లారును బ్రహ్మమంత్రము లైదును గలసి పదునొకండును ప్రతినిధులవలె నగ్రగణ్యములై దనరెడిని. ఈ పదునొకండును మన్త్రాధ్వవిన్యాసమున పంచుచుందురు.

మఱియు నీ (సప్తకోటి) మహామంత్ర వితతియందు ప్రధానపదము లెనుబది యొకటియని చెప్పఁబడినది. అవియె పదాధ్వయగును. వాట్లను వివరింతుము.

౧. ఓం (పదము) శివాత్మకము (అక్షరసంఖ్య ౧).
౨. వ్యోమవ్యాపినే పదము. (అక్షరసంఖ్య ౫) శివాత్మక పంచాంగవాచకపదము.
౩. వ్యోమరూపాయ (అక్ష ౫) ,, ,,
౪. సర్వవ్యాపినే (అక్ష ౫) ,, ,,
౫. శివాయ (అక్ష ౩) ,, ,,
౬. అనన్తాయ (అక్ష ౪) అనన్త వాచక పదము.
౭. అనాథాయ (అక్ష ౪) సూక్ష్మవాచక పదము.
౮. అనాశ్రితాయ (అక్ష ౫) శివోత్తమ వాచకపదము.
౯. ధృవాయ (అక్షరసంఖ్య ౩) ఏకనేత్రవాచక పదము.
౧౦. శాశ్వతాయ (అక్ష ౪) ఏకరుద్రవాచకపదము.
౧౧. యోగపీఠసంస్థితాయ (అక్ష ౮) త్రిమూర్తివాచకపదము.
౧౨. నిత్యయోగినే (అక్ష ౫.) శ్రీకంఠవాచకపదము.
౧౩. ధ్యానాహారాయ (అక్ష ౫.) శిఖండవాచకపదము.
౧౪. ఓన్నమశ్శివాయ (అక్షర ౬.) గాయత్రీవాచకపదము.
౧౫. సర్వప్రభవే (అక్షర ౫.) సావిత్రీవాచకపదము.
౧౬. శివాయ (అక్షర ౩.) విద్యేశపూజావాచకపదము.
౧౭. ఈశానమూర్ధాయ (అక్ష ౬.) (ఈశానబ్రహ్మము.) పంచబ్రహ్మవాచకపదము.
౧౮. తత్పురుషవక్త్రాయ (అక్ష ౭) (తత్పురుషబ్రహ్మము). ,,
౧౯. అఘోరహృదయాయ (అక్ష ౭) (అఘోరబ్రహ్మము), ,,

౨౦. వామదేవగుహ్యాయ (అక్ష ౭) (వామదేవబ్రహ్మము) పంచబ్రహ్మవాచకపదము
౨౧. సద్యోజాతమూర్తయే (అక్ష ౭) (సద్యోజాతబ్రహ్మము). ,,
౨౨. ఓన్న మోనమ (అక్షర ౫) భండవాచకపదము.
౨౩. గుహ్యాతిగుహ్యాయ (అక్షర ౬) (హృదయవాచకము) షడంగవాచకపదము.
౨౪. గోప్త్రే (అక్ష ౨) (శిరోవాచకము). ,,
౨౫. నిధనాయ (అక్ష ౪) (శిఖావాచకపదము) ,,
౨౬. సర్వవిద్యాధిపాయ (అక్ష ౭) (కవచవాచకపదము). ,,
౨౭. జ్యోతీరూపాయ (అక్షర ౭) (నేత్రవాచకపదము). ,,
౨౮. పరాయఛన్డనాధాయ (అక్ష ౮) అస్త్రవాచకపదము ,,
౨౯. చేతనాచేతనాయ (అక్షర ౭) ఆసనాత్మక పరమేశ్వరవాచక పదము
౩౦. వ్యోమవ్యోమ (అక్షర ౪) ధర్మవాచకపదము.
౩౧. వ్యాపిన్వ్యాపిన్ (అక్షర ౪) జ్ఞానవాచకపదము.
౩౨. అరూపిన్యరూపిణ్ (అక్షర ౬) వైరాగ్యవాచకపదము.
౩౩. ప్రథమప్రథమ (అక్షర ౬) ఐశ్వర్యవాచకపదము.
౩౪. తేజస్తేజ (అక్షర ౪) కర్ణికావాచకపదము.
౩౫. జ్యోతిర్జోతి (అక్షర ౪) అనంతవాచకపదము.
౩౬. అరూప (అక్ష ౩) శివాగమోక్తము ఊర్ధ్వ, అధో, దిక్కేసరసంబంధ వాచకపదము.
౩౭. అనగ్ని (అక్షర ౩) ,, ,, ,, ,,
౩౮. అధూమ (అక్ష ౩) ,, ,, ,, ,,
౩౯. అభస్మ (అక్ష ౩) ,, ,, ,, ,,
౪౦. అనాధ (అక్ష ౩) ,, ,, ,,
౪౧. నానానా (అక్ష ౩) ,, ,, ,, ,,
౪౨. ధూధూధూ (అక్ష ౩) ,, ,, ,, ,,
౪౩. ఓంభూః (అక్ష ౨) పరమేశ్వరసంబోధన ,, ,,
౪౪. ఓమ్భువః (అక్ష ౩) ,, ,, ,, ,,
౪౫. ఓమ్సువః (అక్ష ౩) ,, ,, ,, ,,
౪౬. అనిధన (అక్ష ౪) ,, ,, ,, ,,
౪౭. నిధన (అక్ష ౩) ,, ,, ,, ,,
౪౮. నిధనోద్భవ (అక్ష ౫) (పరమేశ్వరసంబోధన) ,, ,,
౪౯. శివ (అక్ష ౨) ,, ,, ,,
౫౦. శర్వ (అక్ష ౨) ,, ,, ,,
౫౧. పరమాత్మ (అక్షర ౪) ,, ,, ,,
౫౨. మహేశ్వర (అక్షర ౪) ,, ,, ,,

౫౩. పరమేశ్వర (అక్ష ౫) (పరమేశ్వసంబోధన) ఊర్ధ్వ, అధోదిక్కేసర సం॥వా॥ము
౫౪. మహాదేవ (అక్ష ౪) ,, ,,(సద్భావేశ్వర వాచకపదము.)
౫౫. మహాతేజ (అక్ష ౪) ,, ,, ,, ,,
౫౬. యోగాధిపతి (అక్షర ౫) ,, ,, ,, ,,
౫౭. ముఞ్చముఞ్చ (అక్షర ౪) ,, ,, ,, ,,
౫౮. ప్రథమ ప్రథమ (అక్షర ౬) ,, ,, ,, ,,
౫౯. శర్వ శర్వ (అక్షర ౪) ,, ,, ,, ,,
౬౦. భవ భవ (అక్షర ౪) ,, ,, ,, ,,
౬౧. భవోద్భవ (అక్షర ౪) ,, ,, ,, ,,
౬౨. సర్వభూతసుఖప్రద (అక్ష ౮) ,, ,, ,, ,,
౬౩. సర్వసాన్నిధ్యకర (అక్ష ౭) ,, ,, ,, ,,
౬౪. బ్రహ్మ విష్ణు రుద్రపద (అక్ష ౮),, ,, ,, ,,
౬౫. అనర్చితానర్చితాయ (అక్ష ౮) ,, ,, ,, ,,
౬౬. అసంస్తుతాసంస్తుతాయ (అక్ష౮),, ,, ,, ,,
౬౭. పూర్వస్థిత పూర్వస్థిత (అక్షర ౮) ఊర్ధ్వ, అధో దిక్కే సరసంబంధ వాచకపదము.
౬౮. సాక్షిన్సాక్షిన్ (అక్ష ౪) పత్రివాచకపదము.
౬౯. తురుతురు (అక్ష ౪) ఇంద్రవాచకపదము అష్టదిక్పాల వాచకపదము.
౭౦. పతఙ్గపతఙ్గ (అక్ష ౬) అగ్ని ,, ,,
౭౧. పింగ పింగ (అక్ష ౪) యమ ,, ,,
౭౨. జ్ఞాన జ్ఞాన (అక్ష ౪) నిఋతి ,, ,,
౭౩. శబ్ద శబ్ద (అక్ష ౪) వరుణ ,, ,,
౭౪. సూక్ష్మ సూక్ష్మ (అక్ష ౪) వాయు ,, ,,
౭౫. శివ (అక్ష ౨) కుబేర ,, ,,
౭౬. శర్వ (అక్ష ౨) ఈశాన ,, ,,
౭౭. సర్వదా (అక్ష ౩) సర్వవిద్యాధిప వాచకపదము
౭౮. ఓన్నమోన్నమ (అక్ష ౫) బ్రహ్మశిరోమృత వాచకపదము.
౭౯. ఓం శివాయ (అక్ష ౪) రుద్రాణీవాచకపదము.
౮౦. నమోన్నమ (అక్ష ౪) పాశుపతవాచకపదము.
౮౧. ఓం. (పదము) (అక్షర ౧) వజ్రాదీనాంవాచక పదము.

ఈ యెనుబదియొక్క పదములుం గలిసి "పదాధ్వ" యనంబడును.

**మంత్రా(ధ్వా)ంగములు (ఏకాదశ మంత్రాంగములు)**— మహామంత్రములు ఏడుకోట్లు. ఇవి మూలవిద్యా సంజాతములు.

పంచబ్రహ్మమంత్రములు- ౧ సద్యోజాత, ౨ వామదేవ, ౩ అఘోర, ౪ తత్పురుష, ౫ ఈశాన మంత్రములు.

న్యాసమంత్రములు- ౧ హృదయ, ౨ శిర, ౩ కవచ, ౪ నేత్ర ౫ అస్త్ర మంత్రములు.

పంచాక్షరీ మంత్రము (మూల విద్యామంత్రము). ఇవి మంత్రాంగములనియు మంత్రాధ్వయనియుఁ జెప్పబడును.

**మంత్రాంగములు ౯ (నవాంగములు)**- ౧ ఋషి, ౨ ఛందము, ౩ దైవతము, ౪ బీజము, ౫ శక్తి, ౬ కీలకము, ౭ వినియోగము, ౮ [illegible]గన్యాసము, ౯ హృన్న్యాసము.

**మంత్రాలయము (మంచెళ్ళ)**-ఆంధ్రదేశ[illegible]ళ్లామ డలమున M. & S. M. రైల్వే బొంబాయిలైనునందున్న తుంగభద్ర స్టేషనునకు తొమ్మిదిమైళ్ళదూరమున మంచెళ్ళయను గ్రామము గలదు. అట రాఘవేంద్రస్వామియను బ్రాహ్మణమధ్వమతయతిసమాధి కలదు. దానిని మంత్రాలయ మనెదరు. ఇట నేఁటేట శ్రావణమాసమున [illegible]ప్పయాత్ర జరుగును. చాల దూరదేశములనుండి జనులేతెంతురఁట. ఒక చిత్రమైనకథ దీనింగూర్చి మధ్వులు చెప్పెదరు. ఈమంత్రాలయమునకు భూక్షేత్రి కొంత కలదఁట. దానిని ప్రభుత్వమువారాక్రమించి కల్పుకొనబోవునప్పుడె తెంచిరఁట. స్వామిసమాధి నుండి పైకివచ్చి మనోయనువారితో మాట్లాడి యాచిక్కునునివారించెనఁట. తుంగభద్ర స్టేషను తుంగభద్రానదీతీరముననేయున్నది. ఇదినిజాం రాజ్యము దాటు హద్దు.



**మంత్రిప్రగ్గడ సూర్యప్రకాశకవి**— ఆంధ్రకవులలో నాధునికులందు పరిగణింపఁబడినవాఁడు. అరువేల నియోగిబ్రాహ్మణుఁడు. హారీతసగోత్రము. ఆపస్తంభసూత్రము. తండ్రి పేరు శరభరాజు. మాడుగుల సంస్థానమున విద్వత్కవిగా నుండెను. ఈతఁడు రచించినవి కృష్ణార్జున చరిత్ర. (ఇది ద్వ్యర్థికావ్యము.) సీతారామచరిత్రమనెడి ప్రబంధము, భీమలింగ శతకము ననునవి.

**మంత్రితగోత్రము**. (సిద్ధవర్ణము చూడుఁడు.)

**మందర**—దశరథమహారాజుభార్యయగు కైకేయియొక్క సేవకురాలు. ఇది [illegible]గూను గలది. కైకేయికి దశరథుఁడొసంగిన తొల్లిటివరములఁజ్ఞాపకముజేసి [illegible]ము నరణ్యములకుఁ బంపి భరతునిచే రాజ్యమేలింప కార్యముసడపి [illegible]ంచినది.

**మందరగిరి**—(అంగదేశము చూడుఁడు)

**మందవిష న్యాయము**— మందవిషమున కాంగ్లమున 'Slow poison' అనియెదరు. ఘోరవిషము తోడనే ఘాత చేయును. మందవిష మట్టుల గాక బాధతో నారంభించి రోగిఁజేసి ఆలస్యముగ ప్రాణము దీయును.

**మందసారపురము**-(దశపురము చూ.)

**మందాఊర్ (పట్టణము)**—(పురిహార క్షత్రియులు చూడుడు.)

**మందారచెట్టు (దాసానిచెట్టు)**- లా. Hibiscus (Rosa) Senensis. ఆంగ్ల. China Rose అనికొందరు, Shoe flower tree అనికొందరు, Hibiscus అని కొందరు చెప్పిరి. సం. ఆదిత్యపుష్పికా, జపా.

మందారయందు లెక్కించుటకు వీలుకానన్ని జాతులు గలవు. వివిధములగు రంగుల భేదము

లచేనొప్పు పూవులఁ బూచుటవలన గల్గుభేదములే గాక మందారయందొంటిరెక్కపూవును, ముద్దపూవులఁ బూచుజాతిభేదములును, నొకే తొడిమయందు రెండుపూవులఁ బూచుజాతికి ద్విముఖియనియు, మూడుపూవు లొకేతొడిమయందుండఁ ద్రిముఖియనియు నిట్లే చతుర్ముఖియనియు పంచముఖియనియు షణ్ముఖి సప్తముఖి మొదలగుజాతిభేదములు గాననయ్యెడిని.

దాసానిపూవుల రసకషాయములందు తాపజ్వరము నివారించుగుణమును, మేహశాంతి, పైత్యశాంతిని గల్గించుగుణమును గలదనియు, పూవులరసముతో సమభాగము నూనెగల్పి గాచి తలకురాచుచుండిన తలవెంట్రుకలు నల్లబడి యెదుగుననియు, నేతిలో వేయించి లోని కిచ్చిన స్త్రీల ఋతురక్తస్రావము కట్టుననియు నొకటిరెండుపూవు లనుదిన ముదయమున నె లోనికిఁ దినిపించుచుండిన కన్యలు ఋతుమతు లగుదురనియుఁ జెప్పఁబడినది.

మందారవేరునందు స్త్రీలఋతురక్తస్రావము కట్టుగుణమును ఆకులపసరునందు (లోని కిచ్చిన) విరేచనము, మూత్రము వెడలించు గుణమును కలదందురు

**మందారపురము(మండోర్)**-జోద్పూరు సంస్థానము చూడుఁడు. (జాడ్పూర్).

**మందాయన్తే నఖలాః సుహృదామభ్యుపేతార్థకృత్యా**-ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి.

మిత్రుల కార్యముల నెరవేర్ప ప్రతిజ్ఞంజేసి నవారాలసింపరని భావము.

**మంది యెక్కువైనకొలదీ మజ్జిగ పలచన**—ఆంధ్రలోకోక్తి.

**మంది లావైః మఠమునకు చేటు** (ఆంధ్రలోకోక్తి).

**మందో౽ప్యవిరతోద్యోగః సదా విజయ భాగవేత్**— ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి. మందుఁడైనను ప్రయత్నమును విడువఁడేని కార్యజయమందునని భావము.

**మంద్రజాతిగజము**—(గజలక్షణము చూడుఁడు).

**మకరందతాళము**-(తాళములు చూ).

**మకర రాశి- దీని అధిపతి శని**-ఇది యుత్తరాషాఢానక్షత్రమునందలి ౨,౩,౪ పాదములును, శ్రవణనక్షత్రమంతయును, ధనిష్ఠయందు ౧, ౨ పాదములును గలిసిన ౯ పాదముల రాశి. ప్రమాణము ఘ. ౫-౧౫ లేక గంట ౨-౬.

మకరము- సౌమ్యరాశి, చరస్వభావరాశి, వైశ్యవర్ణరాశి, స్త్రీలక్షణరాశి, కర్బురవర్ణము, పూర్ణజలరాశి, దక్షిణదిగ్రాశి, పృష్ఠోదయరాశి. రాత్రి బలమధికము. మోకాళ్ళయందు బలము గలదనియుఁ జెప్పఁబడియెను.

మకరరాశి-శనికిస్వక్షేత్రము. మూలత్రికోణ మెవ్వరికిఁ గాదు. కుజున కుచ్చ, గురునకు నీచ, శుక్రనకు మిత్రక్షేత్రము. రవికి శత్రుక్షేత్రము. చంద్ర, కుజ, బుధ, గురులకు సమక్షేత్రము. మకరలగ్నమునకు రవి అష్టమాధిపతి. చంద్రునకు సప్తమస్థానాధిపత్యము. కుజుడు చతుర్థ, ఏకాదశస్థానములకును, బుధుఁడు షష్ఠమనవమ స్థానములకును, గురుడు తృతీయ ద్వాదశస్థానములకును, శుక్రుడు పంచమ, దశమస్థానములకును, శని లగ్న ద్వితీయస్థానములకునుఅధినాథులై యుందురు.

**మకరరేఖ**- (పురుషసాముద్రికము చూ. సాముద్రికము చూడుఁడు.)

**మకరసంక్రాంతి పండుగ**-సూర్యుఁడు మకరరాశికిఁ బ్రవేసించునదనునకు మకరసం

క్రాంతి యనిపేరు. ఇది మూడుదినముల పండుగ నాచరింపఁబడుచున్నది. అందు మొదటి దినమును భోగి యనియు, రెండవదినమును సంక్రాంతిపండుగ యనియు, మూడవదినమును కనుమనియు వాడుచున్నారు. ఈ మూడుదినములపండుగ బలిచక్రవర్తి ధర్మపరిపాలనకు జ్ఞాపకముగ నేర్పర్చిరందురు. మకరరాశియందు రవి ప్రవేశించిన నిరువదిఘడియలకు పిత్రర్చన శ్రాద్ధము విధింపఁబడినది. (పండుగలు చూ).

ఇది యుత్తరాయణమునకుఁ బ్రారంభము. దీనిని దక్షిణదేశస్థులు "పొంగల్" అనియెదరు. జనవరినెల పూర్వార్ధమునవచ్చుచుండుపండుగ.

**మకుళపర్వతము (కోలాహలపర్వతము)** — దీనికిప్పటిపేరు కలుహాపహాడ్. పురాణప్రసిద్ధమగు కోలాహలపర్వత మిదియని యచటివారనెదరు. బుద్ధగయకు దక్షిణముగ ౨౬ మైళ్ళదూరము. హజారీబాగ్ జిల్లాలోని ఛత్రాయనుపురమునుండి యుత్తరముగఁ బదునారుమైళ్ళ దూరము.

ఇట నొకపర్వతోపరి విశాలసమతల ప్రదేశమున కులేశ్వరీ (దుర్గ) దేవస్థానము గలదు. మరియు నీపర్వతముపై బుద్ధభగవానుఁడు తన ౬౦ వ పర్యూషణము (వర్షాకాలనివాసము) గడపెనఁట. ఇందొకతావున తొల్లింట బుద్ధుడు నిలిచినతావున నాయనపాదచిహ్నము రాతియందు గాననగును. ఒకబౌద్ధశాసనమున 'మ' అక్షరము చెడిపోయి 'కుల'యనియో 'కులుహ', యనియో సరిగా తెలియక గాననగుచుండును. దీని కాకాశలోచనలోవ యనిపేరు. ఇందు బౌద్ధనిర్మాణముల యానవాళ్ళు విరివిగ గాననగుచున్నవి.

**మక్కా (బక్కా) పట్టణము**— అరేబియాదేశమున ప్రధాననగరము. మహమ్మదీయుల ప్రధానయాత్రాస్థలము. (కాబా చూ.)

ఇదియొకప్పుడి దేశమున వర్తకస్థానములలో నగ్రగణ్యమై యుండెనఁట. ఇప్పుడు కేవల మహమ్మదీయ యాత్రాస్థానమై యున్నది. మహమ్మదుజగద్గురునిజన్మస్థానమిది. జనసంఖ్య ౮౩౦౦౦. స్వదేశస్థులు దీనిని బక్కా యని పల్కుచుందురు.

**మక్కో(మధ్య)కాళింగము**- (కలింగ దేశము చూడుఁడు).

**మఖ పుబ్బలు వొఱుపైతే మహాక్షామము సిద్ధమే** —(వఱపు = వర్షింపకుండుట) (ఆంధ్రలోకోక్తి)

**మఖ యుఱిమితే మదురుమీది మొక్కగూడా చక్కగా కాస్తుంది** — (ఆంధ్రలోకోక్తి).

**మఖానక్షత్రము**—ఆకసమునందు పాలకీయాకారమునఁ జేరియుండు నైదునక్షత్రములు. జ్యోతిషశాస్త్రగ్రంథములందు దీనికిఁ బితా, పితృభం, పైత్రి, మేఖలా, యను పదములు పర్యాయపదములుగ వాడఁబడినవి.

ఈనక్షత్రమునకు పితృదేవత లధిదేవతలని యు రాక్షసగణనక్షత్రమనియు నధోముఖము, స్త్రీస్వభావముగలది యనియు, నెలుక, బోరువ పక్షి, మర్రిచెట్టు నీనక్షత్రసంబంధము లనియు, నిదిప్రవేశించిన ముప్పదిగడియలపై త్యాజ్యము (విషఘటికల)నియు, నేబదినాల్గు ఘటికలపై యమృతమనియు, క్రూరస్వభావ నక్షత్రమని యుఁ జెప్పఁబడినది.

**మగధరాజ్యము (కైకతదేశము)**— ఋగ్వేదము 3, ౫3, ౧౪యందునను, వాయుపురాణము ౧౦౫ యందునను, మగధదేశమునకుఁ గైకతదేశమని తొల్లింటిపేరనియు, తారా

తంత్రమునందు మగధ దక్షిణభాగమున కనగా వరుణపర్వతము మొదలు శ్రీధ్రకూటమువరకు కైకతదేశమని వాడుక యుండెననియు, తెలియుచున్నది.

రామాయణము ఆది ౩౨ వలనను, మహాభారతము, సభాపర్వము ౨౪ వలనను, మగధ బీహారరాష్ట్ర భూమిగను, నందు ముఖ్యముగ దక్షిణబీహారదేశభాగ మనియు, చెప్పఁబడిన ధోరణినుండి స్ఫురించెడిని. అధర్వసంహిత ౫, ౨౨, ౧౪, ౧౫ యందు పశ్చిమపుటెల్ల శోణభద్రనదిగాఁ జెప్పఁబడినది. రామాయణము ౧, ౩౨, యందు శోణభద్రానది మాగధి యనియు, సుమాగధి యనియుఁ బేర్కొనఁబడినది. లలితవిస్తరమను గ్రంథమున ౧౭ యందు గయాశీర్షము మగధదేశమునఁ గలదని చెప్పఁబడినది. ఇది యిప్పటి గయాక్షేత్రము. మత్స్యపురాణము ౨౨యందు బుద్ధగయకు తొల్లింటి పేరు రురవిల్వ యని చెప్పఁబడినది. ఇటనే బోధివృక్షముక్రింద తపంబొనర్చి బుద్ధభగవానుఁడు జ్ఞానియై బుద్ధుండాయెనఁట.

బౌద్ధమతగ్రన్థములందు బుద్ధగయ కంటె ముఖ్యముగ నాబోధివృక్షమునకు మహాబోధి యనుపేరు చెప్పఁబడినది. చాలకాలము నిలచి రాజ్యపాలన నెరపిన యీమగధరాజ్యము బౌద్ధమతమున కాటపట్టయియుండుట సుప్రసిద్ధము. ఇంకను తనబలప్రతాపములచే ననేకదేశముల జయించి రాజ్యములను వశపర్చుకొని ప్రజానురంజకముగ బరిపాలనలు నెరపుచు పెక్కుతావులందు శిలాశాసనములనువేయించి మనకు పెక్కుసంగతుల నెఱుంగజేసిన మగధయేలికలను వివరించి పిమ్మట పురములుమొదలగునవి వివరించుట సమంజసముగాన నీగ్రన్థమునందట్లె వివరింతుము గాక.

తొలుత నెఱిగినంతవరకు మగధరాజ్యమేలినవారు బార్హద్రధక్షత్రియులు. వీ రత్రిసంతతి. చంద్రవంశమున జనించినవారు. బృహద్రధుఁడను మహారాజుసంతతివారు గాన బార్హద్రధులనఁ బరగిరి. బృహద్రధుఁ డుపరిచరవసువు కుమారుఁడు. ఈతనిసుతుఁడు జరాసంధుఁడు. ఈతఁడు శ్రీకృష్ణునికి సమకాలికుఁడగు వైరి. పాండవద్వితీయుఁడగు భీమసేనునిచే కలహమున నిహతుఁడైనవాఁడు. ఈతనితర్వాత నీతనిసంతతివా రిరువదియిద్ద రీరాజ్యమేలిరి. అందు కడపటివాఁడు పురంజయుఁడు, లేక రిపుంజయుఁడు. ఆతని మంత్రియగు శునకుఁ డాతనిఁ జంపి తన సుతుఁడగు బ్రిద్యోతనునిమగధరాజుగ జేసెను. ఇక్కాలమునకుఁ గలియుగాబ్దములు వేయిగ లెక్కించిరి.

శిశునాగవంశనృపతులు క్రీ. ము. ౬౮౫ మొదలు ౪౨౧ వరకు అనఁగా ౨౬౪ సంవత్సరములు పాలించిరి. పిదప నవనందులు ౧౦౦ సంవత్సరము లేలిరి. పిదప మయూర లేక మౌర్యభూపతులు ము. ౩౨౧ మొదలు క్రీ.వె. ౧౮౮ వరకు ననగా ౧౩౩ సంవత్సరములు పాలించిరి. పిదప శుంగవంశపునృపులు క్రీ.ము. ౧౮౮ మొదలు క్రీ.వె. ౭౬ వరకు ననగా ౧౧౨ సంవత్సరములు పాలించిరి. పిదప కణ్వవంశనరపతులు క్రీ.ము. ౭౬ మొదలు క్రీ.వె. ౩౧ వరకు ననగా ౪౫ సంవత్సరములు పాలించిరి. పిదప నాంధ్రభృత్యు లనఁబడిన శాతకర్ణి లేక శాతవాహనప్రభువులు క్రీ. ము. ౩౧ మొదలు క్రీ. వె. ౩౧౨ వరకు ననగా ౩౪౩ సంవత్సరములు పాలించిరి.

ఇంకను పాలవంశనృపతులగు గోపాలనృపతియు నతని సుతుఁడు ధర్మపాలనృపతియు నీరాజ్యమును క్రీ. వె. ౮౧౫ మొదలు ౮౬౦

వరకు సనంగా ౮౫ సంవత్సరములు పాలించి
నటుల నిదర్శనములు గలవు. వీరికిఁ బిదప
రాజ్యము మహాపద్మనందీయులవశమాయెను. వారి
నుండి యాంగ్లాక్రాంతమై భరతదేశపుసామ్రా
జ్యపాలనయందుఁగలసిపోయినది. క్రీ.వె. ౩౨౬
మొ॥౩౭౫వరకు సముద్రగుప్తుఁడీదేశము నేలినట్టి
నిదర్శనములుగలవు. ఈతఁడుచక్రవర్తి. మఱియు
నీతఁడు రాజధానిని పాటలీపుత్రమునుండిఅయో
ధ్యకు మార్చినటులఁ జెప్పఁబడినవి. తరువాత
గుప్తవంశపునృపతులఁగూర్చి పూర్తిగఁ దెలియ
కున్నను గుప్తవంశమునఁగడపటివాఁడు కుమార
గుప్తుఁ డనియు క్రీ.వె. ౫౩౦ మొదలు ౫౫౦
వఱకు నీతనిపాలనకాలమనియు నీతఁడు రాజ్య
భ్రష్టుఁడై అయోధ్యవీడి తక్కినకాలము శ్రవస్తి
యందుఁ గడపెననియుఁ జెప్పఁబడినది.

ఇటులనే బింబిసారుఁడు బుద్ధభగవానునిసమ
కాలికుఁడు. ఈయనసుతుఁ డజాతశత్రుఁడు.
ఆతనిమనుమఁడు చంద్రగుప్తమహారాజు. ఆతని
సుతుఁడు బిందుసారుఁడును, నాతనిసుతుఁడశోక
చక్రవర్తియు మౌర్యులు. చంద్రగుప్తుఁడును,
నశోకుఁడును కీర్తివిస్తారులు. అశోకుని శిలాశాస
నములు ప్రసిద్ధములు. అశోకునికాలము క్రీ.ము.
౨౭౨ మొదలు ౨౩౨ వరకు నని లెక్కించి
యున్నారు. శిశునాగుఁడు (ఆవంశమునమొదటి
భూపతి) పాటలీపుత్రమునుండి రాజధానిని
విశాలీనగరమునకు మార్చెనని చెప్పఁబడినది.
కడపటి శిశునాగనృపతి కాలాశోకుఁ డఁట.

బార్హద్రధనరపతుల కాలమున రాజధాని
గిరివ్రజపురము. దీనికి రాజగిరి యనియు, కుశా
గారపురమనియు బేరుండెనఁట. రాజగృహమని
వాడుకనామముండెడిదఁట. దీనినే హిందూస్థా
నిలో గిరియెక్ అందురు. ఉపరిచరవసువుకాల
మున దీనిని వసుమతి యనుపేరున తొలుత
నిర్మింపఁబడినదని రామాయణము ఆది. ౩౨
యందు చెప్పఁబడినది. పాట్నానుండి ౬౨
మైళ్ళ దూరమునను, బీహారునకు దక్షిణముగ
౧౪ మైళ్ళ దూరమున నున్నది. బౌద్ధగ్రంథ
ములందు దీనికి కుసుమపురమని పేరిడియున్నారు.

గిరివ్రజమునకు కోటవలెచుట్టును పర్వతములే
యుంట గిరివ్రజమని పేరయ్యెనఁట. ఇవి ౧
వైహారపర్వతము, (భౌద్ధగ్రంథములందు గిజ్ఝ
కూట మనిగలదు. ఇప్పటివాడుకపేరు వైభార
గిరి). ౨ వరాహపర్వతము, (భౌద్ధగ్రంథము
లందు 'ఇసిగిరి' ఇప్పటివాడుకపేరు విపులగిరి).
౩ వృషభపర్వతము (భౌద్ధగ్రంథములందు
'విభారము' ఇప్పటివాడుకపేరు రత్నకూటము)
౪ ఋషిగిరిపర్వతము, భౌద్ధగ్రంథము లందు
లేపుల్లము. ఇప్పటివాడుకపేరు గిరివ్రజగిరి).
మరియు నీపర్వత ముదయగిరియనియు, శోణగిరి
యనియు, రెండుభాగములుగ నేర్పడియున్నది.
౫ చైత్యకపర్వతము (పాలీపాండవగిరి. ఇప్పటి
పేరురత్నాచలము.) ఈపర్వతములు గిరివ్రజ
ముంజుట్టి కోటవలెనేయుండును.

వైభారగిరి, రత్నాచలముల నడుమ లోవ
యొక్క పశ్చిమదిశగా జరాసంధుని రాజనగ
రుండినతావును శోణభాండారమను గుహనుండి
మైలుదూరమున వైభారగిరిపాదముకడనే రంగ
భూమి యనుపేరుగల యాయన తాలెంఖానా
యుండినప్రదేశమును జూపుచున్నారు. భీము
నితో కలహమొనర్చి ౧౩వ దినమున జరాసం
ధుఁడు నిహతుడైన ప్రదేశమును మల్లభూమి
యనుచున్నారు. ఉదయగిరికి దక్షిణముగ రాతి
నుండియే యేర్పడిన రస్తాకడ నేవో వ్రాతలు
కలవు. అవి చక్కగ తెలియకున్నవి. ఉత్తర
ద్వారముకడనే ఆనాటి జరాదేవియాలయము
కలదు. మరికొన్ని జైనుల దేవస్థానములును
గలవు

ఉత్తరద్వారసమీపమున నెన్మిది యుష్ణోదకబుద్బుదకుండములు గలవు. అవి ౧. వ్యాసకుండము, ౨. మార్కుండము, ౩. సప్తర్షికుండము, ౪. బ్రహ్మకుండము, ౫. కాశ్యపకుండము, ౬. గంగాకుండము, ౭. యమునాకుండము, ౮. అనన్తకుండము ననఁబరగుచున్నవి. వీటికిఁ దూర్పుగా కొంచెము దూరముననే సూర్య, చంద్ర, గణేశ, రామ, సీతా, కుండములును మరియొ దుష్ణోదకకుండములును, తూర్పున కొంచెముదూరముననే శృంగర్షికుండము గలదు. దానిని మహమ్మదీయులాక్రమించి మఖ్దుమ్ కుండమని పేరిడియున్నారు. ఈప్రాంతములందే బుద్ధభగవానుఁడు, ఆనందుఁడు తపం బొనర్చిన గుహలును, బుద్ధభగవానునకు బింబిసారుఁడర్పించిన వేణువనవిహారముండిన తావును, ఇంక పెక్కు విహారస్థలములను జూపుచున్నారు.

రాజగృహముకడనే యొక మైలుదూరమున కొత్తరాజగృహమని యొకపాటిప్రదేశముజూపి యజాతశత్రుని మనుమఁడగు నుదయాశ్వుని కాలమున (క్రీ. పూ. ౫౧౯-౫౦౩) కొత్తరాజగృహము రాజనివాస మైనదని జూపుచున్నారు. రాజగృహమున కుత్తరముగ నేడుమైళ్ల దూరమున నొకకొండపై నాలందవిశ్వవిద్యాలయపుపాడు గన్పించుచుండును. దానియందంబలత్తికావన ముండినప్రదేశము గలదు. ఇచటి గ్రామమునకు "ఖాన్మత" యనిపేరు. ఇందే వసించుచుండిన గోబాలమఖాలీపుత్తస్వామి యాజీవకబౌద్ధమతశాఖానిర్మాత.

రాజగృహమునకు దక్షిణముగ పదిమైళ్ళ దూరమునగల పావకపురము (ఇప్పటి పావా) జైనతీర్థకరులలోకడపటివాడగుమహావీరస్వామి నిర్వాణపదమందిన తావు.

అజాతశత్రుఁడు రాజ్యమునకు వచ్చిన యెన్మిదవయేట భగవానుఁడు నిర్వాణపథగతుఁడాయెనట. విభారత పర్వతపాదమున సప్తర్షి గుహకెదుట మొదటిబౌద్ధమహాసభ యజాతశత్రునిర్మితమగు శాలలో జరిగెనందురు. దానికి మహాకాశ్యపుఁ డధ్యక్షుఁడట. తర్వాత శిశునాగులలో పదునొకండవవాడగు కాలాశోకుని కాలమున క్రీ. పూ. ౪౪౩ సం. విశాలీనగరము (అప్పటి రాజధాని.) బెలూకారామ విహారమున రేవతుని యధ్యక్షతక్రింద రెండవబౌద్ధమహాసభ నడచెనఁట. కాలాశోకుని కాలము క్రీ.పూ. ౪౫౩-౪౨౫ నని లెక్కింపబడినది.

విశాలీపురమునకు తొల్లింటిపేరు వసుకుంద పురము. పిదప గుందగామమై విశాలీపురమనఁ బరగి యిప్పుడు 'బెసార్' అనుగ్రామమై ముజఫర్పూరుజిల్లా తిరుహూతు డివిజనునం దొక గ్రామమై యున్నది. మహావీరస్వామి యిట జన్మించెననియు, తొల్లింట సామంతరాజ పుత్రుఁడనియు, తల్లిపేరు త్రిశాలాదేవి యనియు, భార్యపేరు యశోద యనియు, కుమార్తె పేరనోజ్జ యనఁబడు ప్రియదర్శనా దేవి యనియు తెలియుచున్నది. తల్లియగు త్రిశాలాదేవి భూపతియగు చేటకుని సోదరి యఁట. చేటకుని కుమార్తెయగు చెల్లన యనఁబడు విదేహాదేవి మగధరాజగు బింబసారునిరాణి. ఆమె సుతుఁడే యజాతశత్రునృపాలుఁడు. మరియు నజాతశత్రునకు కునికుఁడనియుఁ బేరుండె నఁట. అజాతశత్రుని భార్య శ్రావస్తిపురాధీశుఁ డగు ప్రసేనజిత్తు కుమారియగు వజ్రాదేవి. మరియుఁ బ్రసేనజిత్తు సోదరియగు కోసలాదేవి అజాతశత్రుని సవతితల్లియె. అనగా బింబసారుని వేరొకరాణి యని యెఱుంగునది.

మహావీరస్వామిమరణము క్రీ. పూ. ౫౨౭ సంవత్సరమని కొందరును క్రీ.పూ. ౫౬౯ యని కొందరును పరిశీలకులు లెక్కించుచున్నారు.

హ్యూనచ్యాం గేడవ శతాబ్దమున దర్శించు తరి పాటలీపుత్రము పల్లెటూ రనివ్రాసెను.

విహారపురము (బీహార్) కొంతకాలము రాజధానిగ నుండెను. దీనితొల్లిటిపే రుద్దండ పురమనియు దండపురమనియు నుండెనట. ఇచటనుండిన విహారములనుండియే యీపేరు గల్గెనట. బంగాళ దేశమేలిన పాలవంశపు నృపతులు మగధనాక్రమించి యేలుతరి నిదే రాజధానియట. వారినాటి కోట యానవాళ్ళు నేటికిం గలవు. వీరిలో గోపాలనృపతి యుద్దండపురమున గొప్పబౌద్ధవిహారము నిర్మింపజేసెనట. విక్రమశైలవిహార మాతని సుతుఁడగు ధర్మపాలమహారాజు నిర్మించెనట. ఇది క్రీ. వె. ౮వ శతాబ్ద మధ్యకాలమట. దానిపా డిప్పుడు గంగానదికుడితటున నొక కొండపై గానఁబడు చుండును.

బీహారపురమునకు వాయవ్యదిశగా నున్న వేఱొకకొండపై నొక విహారమును, నందుమంచి గందఁపుకఱ్ఱతో చేయబడిన యవలోకితేశ్వర బోధిసత్వవిగ్రహమును తాను చూచినటుల హ్యూనత్సాంగు (ఏడవశతాబ్దమున) వ్రాసియుంట నక్కాలమున వైశ్వారిబౌద్ధు లిట నుండిరా యని సంశయము గలెడిని.

పాలవంశపురాజుల పాలన మంతమైనపిదవ మహమ్మదీయులు బీహారు పురముననే రాజ్యపాలనఁ గొంతకాలమొనర్చుచుండిరఁట. క్రీ. వె. ౧౫౪౧ సంllరము షర్షా రాజధానిని తిరుగ పాట్నాకు మార్చెనఁట. నాఁడాదిగ బీహారము పాడుపడసాగె నఁట.

సుయూరులకుం బిదప గుప్తవంశపు నృపతులపాలనమని తెలుచున్నది. అనఁగా నాల్గవ శతాబ్దమున సముద్రగుప్తుఁడు క్రీ. వె. ౩౨౬–౩౭౫ కాలమునను కడపటి కుమారగుప్తుడు క్రీ. వె. ౫౩౦ మొదలు ౫౫౦ వరకు) అప్పు డాతనిసైన్యాధిపతి యశోధర్ముఁ డాతనిఁ బడఁ ద్రోసి, తాను విష్ణువర్ధనుఁ డనుపేర రాజై కనూజకు రాజధానిమార్చెనని తెలుచున్నది. క్రీ. వె. ౪౭౬ సంవత్సరమున జన్మించినటుల చెప్పఁబడినను ప్రసిద్ధ జ్యోతిషవేత్త యార్యభట్టు డిచటివాఁడు. పాణినిసూత్రవార్తిక కర్తయగు వరరుచియను పేరుగల కాత్యాయనుఁడు మహానందుడను పేరుగల కడపటినంద భూపతికడ ప్రధానులలో నొకడుగనుండెను. యోగానందుడు లేక మహానందుడను పేరుగల చాణక్యుఁ డిచ్చటివాడే.

చంద్రగుప్తమహారాజాస్థానమునకు క్రీ.పూ. ౩౨౧, ౨౯౭ నడుమ సెల్యూకస్ నెక్టారువద్ద నుండి రాయబారిగవచ్చిన మెగస్తనీసు పాటలీపుత్రమును గంగ, హిరణ్యా, వాహు (శోణ భద్రానది) సంగమముకడ నున్నదిగ వర్ణించియున్నాఁడు.

పాటలీపుత్రమున పాటలాదేవి (పాతాళేశ్వరి) దేవస్థానము సుప్రసిద్ధమై నాటికి నేటికి గలదు. ఇది శక్తిపీఠము

## మగ్రాశాఖ క్షత్రియులు-- (శిశోదియా క్షత్రియులు చూడుఁడు.)

## మగ్వాంప్ (Mugwump)—అమె

రికాదేశమున రాజకీయవ్యవహారములం దేవిధానమునకుఁ గూడ సరిపడని సిద్ధాంతములఁదెల్పు రాజకీయవేత్త కీపేరిడియున్నారు.

ఇది అమెరికాదేశఁపు ఇండియనులపదము. హేళననామముగా వాడెదరు.

## మఘాత్రయోదశి—భాద్రపద బహుళపక్షమున (మహాలయపక్షమునఁ) త్రయోదశిదినమున మఘానక్షత్రము సంభవించెనేని దానిని మఘాత్రయోదశియని పితృర్చనలకుఁ

గడుంగడు పవిత్రదినముగనెంచి యాచరింపు దురు.

**మచ్ఛావతారస్థలము** — (కాశ్మీరదేశము చూడుఁడు).

**మచిలీపట్టణము**—ఆంధ్రదేశమందలి కృష్ణామండలములోని యొక సముద్రతీర పట్టణము. దీనికింకను మచిలీబందరనియు బందరనియుఁగూడ వాడుక పేరులు గలవు. ఇచటివారు కొందరు బృందావనశబ్దమునుండి బందరనుపేరు కలెననియూహించి వాడిరిగాని బందరనిన రేవుకరముగాన నదిసరికాదని పెక్కండ్రుతలంచుచున్నారు. ఇంకను గొంద రీయూరునందుఁగల గొడుగుపేటనుండి దీనిని ఛత్రపురమనిరి. ఇచటనుండిన కోటద్వారమునందలి పెద్దచేపలను జ యాదిని మచిలీపట్టణమని పే యనని యొక ాడుకకలదు. పట్టణమందు వేశ్వేరుభాగ మ లీజేశ చాటము మేంకు వేశ్వేరు పేటని పే ని. ముఖ్యముగనీపురి కో యనియు, స్వదేశస్థులు నివసించుభాగ మని మూడు భాగములు నున్నదని యొక సుప్రసిద్ధాంగ్ల పరిశీలకుఁ డనియున్నాఁడు. ఇందు కోటభాగ మిం మి చ వదలి వేయఁబడినదని యె చెప్పవచ్చును. క్రీ. వె. ౧౮౬౪ సంవత్సరము వం బరునెలలో నొకనాటిరాత్రి యుప్పెనవలన బందరుపట్టణము జాల నష్టపడి ముప్పదివేలజనులు మృతిపాలెరి. అనేకకుటుంబము లితరతావులకు లేచిపోయిరి. ఇటనుండిన సైన్యస్థానమె వేయఁబడియెను. కాని జిల్లాయుద్యోగస్థుల కిదియె ప్రధాననివాసస్థానమై యున్నది.

బందరు కలంకారీబట్టకు పేరందినది. అనఁగా రంగుఅద్దకపుబట్ట. దీనికి పాలంపూరుబట్టయనియు నందురు. వానిని పారశీకదేశమున కెగుమతిఁ జేయుచుండిరి. ఇచటి తివాసులిండ్లాండున కంపఁబడుచుండునవి. ఇచటి సముద్రపురేవు మేటవేసినది. పట్టణము పలుచఁబడినది.

మచిలీపట్టణపు చరిత్ర ౧౭వ శతాబ్దము నుండియుఁ గొంత తెలియుచున్నది. ౧౬౧౧ సంవత్సరమునుండియు ఈస్టుయిండియా కంపెనీ వర్తకము ప్రారంభమైనది. దీనిని పోర్చుగీసువారు, డచ్చివారు, ఫ్రెంచివారు నొకొక్కతరి స్వాధీనపఱచుకొని యుండినట్లు నిదర్శనములు గలవు. క్రి. వె. ౧౭౫౯ లో నాంగ్లప్రభుత్వమువారి వశమై, నేటికి నట్లేయున్నది. పట్టణమున దేవాలయములందు గోరీలయందుఁగొన్ని శాసనములుకలవు గాని యవి యంతప్రాముఖ్యమైనవి కావని తెలియుచున్నది. బందరు గొప్పదు మహమ్మదీయుల హ సగతి మె యు ా

**మచ్ఛేరీ దేశము**—అళ్వారు (తొల్లిటి సాళ్వదేశము).

**మజ్జిహిమదేశము**—మధ్యమ దేశమున కిది బౌద్ధులనామము. (మహావగ్గ మను బౌద్ధగ్రంథమున ౫-౧౩-౧౨లయం దిట్లు వాడఁబడినది.

**మజిలీస్ తాను(బట్ట)**- ఆసియా ఖండమునందలి అల్జీరా యనంబడు మెసపొటేమియాయందలి మసోలుపురమునకు ఆ దేశమునకు మసోలు దేశముగను, అందు నేయఁబడుచుండిన ప్రశస్తమైనబట్టకు మసోలు తానులనియుఁ బేరు కలిగెను. కాలములు మాఱినకొలది మసోలుతానులు మజలీసుతానులుగ మార్పునందెను. (అల్జజీరా దేశము చూడుఁడు).

**మజ్జిగ**—దీనిని సంస్కృతమున తక్రమందురు. చల్లయని వాడుకనామము. పాలుతోడుపెట్టిన పెరుగునందు కొంచెము నీరుపోసి పలుచగ నొనర్పఁబడినది. త్రిదోషహరమై మనో

హారమై యుండు భోజనపదార్థము. దేహపుష్టి నిచ్చి తృప్తిగల్గించి యనుకూలమై యుండును

గేదెమజ్జిగకన్న నావుచల్ల శ్రేష్ఠమని చెప్ప బడినది. వాతశరీరులకు,వాతరోగులకు గేదెచల్ల యననుకూలము. తియ్యనిచల్ల పైత్యమును, పుల్లనిచల్ల వాతదోషమును, వెగటుగనున్న చల్ల శ్లేష్మరోగమును నివారించునని చెప్పఁబడి నది. మఱియుఁ గొంచెము పులిసినచల్ల వీర్య వృద్ధిఁగల్గించుననియు, కొంత బాగా పులిసినది కఫ, కాస, వాత, శ్వాసరోగముల నివారించు ననియు, నెక్కువగా పులిసినది త్రిదోషహారమై యాకలిఁ బుట్టించునని చెప్పఁబడినది. ఇంకను పైత్యమునకు తీయనిచల్ల శర్కరతోడను, వాత మునకు కొంత పులిసినచల్ల సైంధవలవణము తోడను, శ్లేష్మమునకు మిక్కిలి పులిసి వగరుగ నున్నచల్ల శొంఠి, పిప్పళ్ళు, మిరియములు, లవంగములు,ఏలకులు, ఆకుపత్రకము సమభాగ ములుగఁ జేర్చి క్షారముగ నొనర్చి దానితో జేర్చి పుచ్చుకొనుచుండిన నివారణ మగునని చెప్పఁబడినది.

గ్రహణి, అజీర్తిరోగములుగలవారు మజ్జిగ నుప్పుగల్పియు, మూలవ్యాధి గలవారు కొడిశ చెక్కచూర్ణము గల్పియు, మూత్రకృచ్ఛము గలవారు మజ్జిగయందు బెల్లముఁ గల్పియు, ప్రమేహ రోగముగలవారు తేనెఁ గల్పియు, పాండురోగముగలవారు మజ్జిగలో శొంఠిచూ ర్ణముఁగల్పియు బుచ్చుకొనుచుండిన - వ్యాధి తగ్గునని చెప్పఁబడినది.

కొన్ని తత్వములవారి కిది సరిపడదని తోచి నను వైద్యులతోయోచించి జాగ్రత్తగ నడుప దగునని యాయుర్వేదశాస్త్రములందు చెప్పఁ బడినది.

తక్రము (మజ్జిగ)ను దశవిధములుగ నుడివి యున్నారు-

౧. మథితము- (మథించబడినది) పెరుగు నందు నీటింజేర్చకుండ చేయఁబడిన చల్ల. ఇది జిడ్డుగ చిక్కగ నుండును. ఇది జ్యేష్ఠ, ఆషాఢ, ఆశ్వయుజ, కార్తిక, మార్గశిర, పుష్యములఁ బుచ్చుకొననగుననియు, దక్షిణ చైత్ర వైశాఖ, శ్రావణ, భాద్రపద, మాఘ, ఫాల్గుణమాస ములఁ బుచ్చుకొనరాదనియుఁ జెప్పఁబడినది. దీని నిట్టి మాసములందు బుచ్చుకొనుచుండుట వలన నరుచిదోషము , నుదరరోగములు, గ్రహ ణిరోగము, పైత్యవాతము, జఠహీనత, మూత్ర ఘాతము దరిఁజేరవనియు, శోషదరిఁజేరదనియు, జెప్పఁబడినది.

౨. మిళితము- ఒకపాలు పెరుగునందు మూఁడుపాళ్ళు నీరుగల్పి చేసినది. మిళితమన 'కల్పినది' యని యర్థము. ఇది యారోగ్యకర మి సర్వకాలములందు పుచ్చుకొనదగియుండు ననియు, దీనివలన నతిసారము, నరుచి, పైత్యం, రక్తవాతము మొదలగు రోగములు దరిజేరవని యుఁ జెప్పఁబడినది.

౩. గోళము- ఒకపాలు పెరుగునం దొకటి న్నరపాలు నీరు గల్పి జేసినది. ఇది జ్యేష్ఠ, ఆషాఢ, శ్రావణ, భాద్రపద మాసములం దారోగ్యవాంఛాపరులు పుచ్చుకొను చుండవల యుననియు, అందువలన నామరోగములు, ప్రమేహము, మేహము, శ్లేష్మరోగముల దరి జేరనీయక యాకలి మందగించుట శరీరసవిష దోషముల నడంచి నేత్రదృష్టికి బలమొసగి వీర్యవృద్ధి గల్గించి మనుజుల కారోగ్యకరమై యుండునని చెప్పఁబడినది.

౪. పాథభము-ఒకపాలుపెరుగునం దైదు పాళ్లు నీటింజేర్చి చేసినది. ఇది సర్వకాలముల యందనుకూలమైయుండి, గుల్మరోగము, రక్త ముపడెడుమూలవ్యాధి నడంచినను, నిచుక

శ్లేష్మముఁ జేయునని చెప్పఁబడినది.

౫. కాలశేయము-పెరుగునకు మూఁడుపాళ్లలో నొకపాలు నీరుఁగల్పి చేసినది. ఇది యాశ్వయుజకార్తీకమాసములందు బుచ్చుకొనదగినదనియు, ఆకలిలేకపోవుట, గ్రహణి, దేహము (చర్మము) ముడతలుపడుట (అనగా శరీరమున రక్తముతగ్గుట యనిభావము) వాతదోష విషదోషముల నడంచి యారోగ్యకరమై యుండునని చెప్పఁబడినది.

౬. కరమథితము- పెరుగునకు సమముగఁ నీళ్లుగల్పి చేతితో చేసినది. కరమథితమన చేతితో మథించిన దని యర్థము. బాగుగ పులుపు గలి యుండును. ఇది వర్షాకాల మంతయు పుచ్చుకొనదగి యుండును. కొద్దిగ కాకయు నొక్కొక్కతటి విరేచనబద్ధమును జేసినను, ఆకలి నుద్రేకించి వీర్యవృద్ధిఁ గల్గించి యుబ్బు, కామిల రోగము, కఫవాతము, అరుచిదోషము, (హితవులేకుండుట) చర్ది, భగందరము, ప్రమేహము, మూలవాఁ వీని నడంచి యారోగ్యప్రదమై యుండునని చెప్పఁబడినది.

౭. ఉదశ్వితము- నాలుగవ పాలు నీరుపోసి మజ్జిగ జేసినది. ఇది జ్యేష్ఠ,ఆషాఢ మాసములందనుకూలమై యుండి యభిఘాతము, దారుణ గ్రహణి, దారుణపైత్యము, సర్వవాతములు నివారించిబలమునభివృద్ధిపఱచునని చెప్పఁబడినది.

౮. తక్రము- పెరుగునకు సగము నీళ్లుపోసి మథించినది. వసంతఋతువు(చైత్రవైశాఖమాసములం దనుకూలమైయుండుటయేగాక, ఉబ్బు ఉదరరోగములు కడుపులోబల్ల భగందరము పాండువు వాతముల నడచి పైత్య శాంతి గల్గించి, ఆకలి నభివృద్ధిపఱచు ననియుఁ జెప్పఁబడినది. కొందరుఋషు లీమజ్జిగయందు శొంఠి, పిప్పలి, మిరియములు, ఉసిరికపప్పు సమభాగముల కషాయముఁ గల్పి పుచ్చుకొనుచుండిన సంపూర్ణారోగ్యప్రదమై యాయుర్వృద్ధిఁ గల్గించునని చెప్పబడినది.

౯. దండాహతము-పెరుగునకు రెండువంతుల నీరుపోసి కవ్వముతో మథించి చేసినమజ్జిగ. ఇది సర్వకాలములయందుఁ బుచ్చుకొనఁదగి యుండుననియు, నొడలికాకను బలమును నభివృద్ధిపరచుటయేగాక మూత్రమేహములు, పిటికామేహము, ప్రమేహము, మూలశంకరోగముల నివారించు ననియు, జీర్ణశక్తి నపరిమితముగఁ గల్గించుననియుఁ జెప్పఁబడినది.

౧౦. అతిమిళితము- పెరుగునకు తొమ్మిది పాళ్ళు నీరుఁబోసి చేసినది. సర్వకాలముల ననుకూల మనియు, నతిసారము, సమస్తకఫ దోషములు, ముఖరోగములు కడుపులోబల్ల, భగందరము, మూలవ్యాధుల నడచు ననియుఁ జెప్పఁబడినది.

ఇంకను మజ్జిగ కాచి పుచ్చుకొనుచుండిన నతిసారము, మూర్ఛాయాసమువలనగల్గిన బడలిక, పీనస, మొదలగు శ్లేష్మరోగములు, నోటిపూత మొదలగుముఖరోగములు, సమస్తకఫ దోషములు నివర్తించి యారోగ్య మొసంగు ననియు రోగులకు శేవ్యమనియుఁ జెప్పబడినది. ఆయుర్వేదవైద్యశాస్త్రమున "తక్రాన్తేన భోజనమ్" అని చెప్పఁబడియుంట భోజనము కడను మజ్జిగ నుపయోగించుట యాచారమైయున్నది.

**మజ్ఝాంతికుఁడు**—అశోకచక్రవర్తిచే బౌద్ధమత వ్యాపకమునకు గాంధార దేశమున కంపబడిన యొక బౌద్ధభిక్షువు.

**మటబే లాండు**—దక్షిణాఫ్రికాయందలి రోడ్జేశియా టెరిటరీలో దక్షిణ రోడ్జేశియా యందు చేర్పఁబడిన టెరిటరీ. (దక్షిణఆఫ్రికాయను రోడ్జేశియాయును చూడుఁడు).

**మటభంగానది**—(మహాద్గంగ చూ).

**మట్టితైలము లేక పెట్రోలియమ్**—దీని నాంగ్లమున Rock oil అనియు, Petrolium అనియు నందురు. భూమిలో నాల్గు లేక నయిదువేల యడుగులలోతునఁ దరుచుగ దొరకెడిని. ఇది పలుచని మడ్డిగను, చిక్కగను, ఆకుపచ్చ, పసుపు లేక ఆకుపచ్చనలుపు, లేక నలుపు పసుపురంగులు కలిసినదిగ నుండును.

ఇది పాశ్చాత్య రసాయనశాస్త్రవేత్తలచే 'Carbon and Hydrogen mixture' అని చెప్పఁబడినది. ఒక గొప్పవిద్వాంసుఁడు పెట్రోలియమును "A mixture of a number of Compounds of Carbon and Hydrogen'' అని వచించి యున్నాఁడు. గొప్పపరిశీలనలవలన నిది 'Decomposition of animal and Vegetable matter' అని తేలినది. మట్టితైల మనేకచోట బయలు దేరుచున్నను, ప్రపంచమున ముఖ్యమగు గనులు (నూతులు) అమెరికా సంయుక్తరాష్ట్రములు, రష్యాదేశము, మెక్సికోదేశము, పోలాండు, పారశీకదేశము, బర్మాదేశములందున్నవి.

మట్టితైల మనాదిగ మనదేశమునం దౌషధముగ వాడబడుచుండెడిదిగాని యితరోపయోగము లెక్కువగ వర్తకసరణిని తీయబడి వ్యాపించుట క్రీ. శ. ౧౮౫౯ సంవత్సరమునుండి యని చెప్పదగును. ఇసుక "Sand stone" అనఁబడురాయి "Lime stone" అనఁబడు రాయి గల భూమిలోనుండుతరి వాట్లయందీ పెట్రోలియము వ్యాపించియుండియు, బలముగ నదుమఁబడిన (Compressed air) గాలిచే దట్టముగ నదిమిపెట్టబడి భూమియందుండును. దీనింబరిశీలించి పైకిఁదీయ నూతులఁ ద్రవ్వుదురు. ఆనూతులు మనదేశఁపు బోరింగునూతులఁ ద్రవ్వినటులనే ద్రవ్వుదురు. మరియు నానూతులనుండి మన "artesian wells నుండి నీరుపైకెగిరిపడునటులనే పెట్రోలియమును భూమట్టమున కెగురుటయుఁ గలదు. ఒకప్పుడది Sub-artesian wellsవలె భూమట్టమువరకురాక కొంతలోతున నిలచియుండిన దానిని బంపుల మూలమున బైకిలాగుదురు.

ఒక్కొకనూయి అరమైలు సుమారము లోతుండుకతనను, ఇనుపగొట్టములు, ఉక్కుగొట్టములు, నూతిలోని కమర్పఁబడవలసి యుంటను ఒక్కొకనూతికి చాల ధనము పెట్టవలసియుండును. లాభించినచో నొక్కొకనూయి రోజురోజును పదులవేలసంఖ్యగా పీపాలపెట్రోలియమ్ నిచ్చుటయుఁగలదు.

పైకితీయఁబడిన పెట్రోలియమునకుఁ గొంత వేడిఁ దాకించిన పెట్రోలావిరియై, యందు నుండి పైకెగురును. దానిని గొట్టములనుండి నడిపి క్రమముగఁ జల్లార్చి, పరిశుభ్రముగ (Petrol) పెట్రోలగును. పిదప నంతకన్న నెక్కువవేడి సంధింపఁ గెర్సనైలును, నింకను నధికవేడికి పేరాఫిన్ పైకెగురును. ఇట్లే యధికపర్చినకొలది లూబ్రికేటాయిల్సు లేచును. అన్నియుఁ బోగా మిగిలినది 'క్రూడ్ ఆయిల్' అనంబడును. అది రెండువిధములుగ నుండును. ఒకదానియందు పేరాఫిన్ మైనమును, రెండవజాతి Crude oil నందు ఆస్ఫాల్టును లభించును. క్రూడ్ ఆయిలును Liquid Fuel గా వాడుచున్నారు. ఇటుల పెట్రోలియమ్ లోకుల కుపచరించుచున్నది. ఇటీవల సముద్రపు టోడలు క్రూడ్ ఆయిలు నుపయోగించుకొన నారంభించుచున్నవి. కొన్ని యావిరియంత్రములు రాక్షసిబొగ్గునకు బదులు క్రూడాయిల్ నే కాల్చుచున్నవి. ఆయిల్ ఎంజినులు, మోటారుబోట్లు, ఇటీవల కొన్ని రైల్వే ఎంజినులు

సహా కూర్చిడాయిల్నే యవలంబించుచున్నటులఁ దెలియుచున్నది.

మట్టితైలము పైనిరాచిన సమస్తవాతనొప్పులు, మూర్ఛజబ్బులు, అపస్మారవ్యాధి, పక్షవాతములు, రాచపుండ్లు నివారణ మగునని చెప్పఁబడినది.

**మట్టి ద్రోణాచార్యులు**- (ఏకలవ్యుఁడు చూడుఁడు).

**మట్ల అనంతభూపాలకవి**— ఆంధ్రకవులలో మధ్యకవులందుఁ బరిగణింపఁ బడినవాఁడు. క్షత్రియుఁడు. సూర్యవంశము. తండ్రిపేరు యెల్లభూపాలుఁడు. తల్లి రంగమాంబ. గురువుపేరు తిరుమల తోళప్పాచార్యులు. తండ్రియగు నెల్లభూపాలుఁడును, నీయనంతభూపాలుఁడును చిన్నసంస్థానాధిపతులగు ప్రభువులే. వీరి పూర్వులలో నొకరగు వరదరాజు శ్రీకృష్ణరాయసార్వభౌమునియల్లుడని తెలియుచున్నది. అనఁగా నార్వీటి బుక్కరాజు మునుమనుమఁడగు నళియరామరాజునకు తోటియల్లుఁడనిభావము. క్రీ. వె. ౧౫౫౦-౮౦ మధ్యకాలమున నుండి యుండును.

రచించినది కాకుస్థవిజయమనెడిప్రబంధము. దీనిని తనతండ్రియగు నెల్లభూపాలునకుఁ గృతియిచ్చెను. ఎల్లభూపాలుని తండ్రిపేరు కోనభూపాలుఁడని తెలియుచున్నది.

**మఠశుద్ధి (స్థానమున గ్రహము లేకుండుట)**—జ్యోతిషశాస్త్రమున ముహూర్తకాల నిర్ణయమునందు తత్కాల జాతకచక్రమువ్రాసి యందు- ౧. నిషేకమున లగ్నస్థానము, ౨. గృహప్రవేశమున ద్వితీయస్థానము, ౩. కృషిప్రారంభమున తృతీయస్థానము, ౪ విద్యారంభమున నాల్గవస్థానము, ౫. యాత్రారంభమున నైదవస్థానము, ౬. నూతనవస్త్రధారణమున నారవస్థానము, ౭. వివాహమున నేడవస్థానము, ౮. ఉపనయనమున నెన్మిదవస్థానము, చౌలమున తొమ్మిదవస్థానము, ౧౦. అన్నప్రాశనమున పదియవస్థానము, ౧౧. నామకరణమున పండ్రెండవస్థానమునం దేగ్రహములు నుండరాదనియు, (అది మఠశుద్ధి యనియుఁ) జెప్పఁబడినది.

**మఠితాళము(మఠిమ లేక మధ్యమ)** (తాళములు చూడుఁడు).

**మర్త్యతాళము**— (తాళములు చూ).

**మడికి సింగన్నకవి**- ఆంధ్రకవులయందు పూర్వకవులలోపరిగణింపఁబడినవాడు. నియోగిబ్రాహ్మణుఁడు. భారద్వాజసగోత్రము. తండ్రి యయ్యలరాజు. తల్లిపేరు సింగమ్మ. సోదరులు అనంతరాజు, అబ్బరాజు, నారయరాజు నను వారలు. అహోబలనృసింహస్వామి వరప్రసాదమున జన్మించినవాఁడు. కాపురము గోదావరీ మండలములోని నది కుత్తరతీరమందున్న పెద్దమడికి. ఈతఁడు తిక్కన సోమయాజి (కవిబ్రహ్మ) కుమారుఁడై గుంటూరునం దాధిపత్యముచేసిన కొమ్మనకు దౌహిత్రినిపుత్రుండఁట. క్రీ. వె. ౧౪౨౦ సం॥రముల ప్రాంతమువాఁడై యుండనోపు.

ఈకవి రచించినది పద్మపురాణము. దీనిని కందనమంత్రి కంకిత మొనర్చెను. క్రీ. వె. ౧౩౪౦-౧౩౭౮ కాలమువాఁడు.

మడికి సింగనకవి తిక్కన సోమయాజికి మునుమరాలి పెనిమిటి యని తేలుచున్నది.

**మడుగులోతు చూడగలము గాని మనస్సులోతు చూడలేము**— (ఆంధ్ర లోకోక్తి.)

**మణికర్ణక్షేత్రము (పార్వతీ నదీతీరము)**-పార్వతీనదీతీరము, పార్వతీనదిపాంచా

లదేశమున విపాశ (బీయాస్) నదియందు సంగమించెడి నది. ఇటఁ గల వేడినీళ్ల యూటలలో నన్నముకూడ నుడుకునని యందురు. పార్వతీనది నిప్పుడు పారానది యనియు పాబా నదియనియు ననుచున్నారు. కోహిస్థానములోని జలంధరుదోఆబ్ నందు బిజౌరాకడ గలదు.

**మణిగ్రీవుఁడు**—తండ్రి కుబేరుఁడు. నలకూబరుని తమ్ముఁడు.

**మణిచూడపర్వతము**— పూనానగర ప్రాంతదూరమున జెజూరీపట్టణముకడ నున్న కొండలవరుస వీట్ల పశ్చిమపుకడను జెజూరీపురమున్నది. ఇట తొల్లింట మల్ల, మల్లి యను యసురుల నివాసమనియు, వారిని శివాం (ఈశ్వర)శసంభూతుఁడగు ఖండోబా (ఖండీరావు) యనుపేరుగల భూపతి వధించెననియు బ్రహ్మాండపురాణము క్షేత్రఖండము మల్లారిమహాత్మ్యమున జెప్పబడినది. ఈశివక్షేత్రమున గల మల్లారిశివలింగమును ఖండోబా యనియు నందురు. ఇది మహారాష్ట్రదేశమున గొప్ప శివక్షేత్రములలో నొకటి.

**మణిప్రదీపప్రభా న్యాయము**—దీనిని భ్రమాన్యాయ మనియు నందురు. ఇది సంవాది భ్రమ యనియు, విసంవాదిభ్రమ యనియుఁ ద్వివిధము.

మణియొక్క కాంతిఁ జూచి మణియని భ్రమించుట సంవాదిభ్రమయనియు, దీపపుకాంతినే మణిగా భ్రమియించుట విసంవాది భ్రమ యనియుఁ జెప్పుదురు.

**మణిప్రభామణిమతి న్యాయము** - బ్రహ్మమునందు ధ్యానము బ్రహ్మము జేరమారమనియు, నైనను ధ్యానమునకు గురియగునది సగుణబ్రహ్మ మగుఁగాని నిరుణబ్రహ్మము గాదుగాన నిరర్థకమని తలంపరాదనియు నెట్లన మణియొక్క కాన్తి (మణియొక్క గుణమె గాన) నసలుమణిని దెల్పునదిగనె యుండునటులనే నిర్గుణపరబ్రహ్మకాంతియగు సగుణబ్రహ్మమును నిర్గుణపరబ్రహ్మముం దెల్పుఁగాన నట్టిదే యనియు భావము.

అనఁగా మణిప్రభ (రత్నముయొక్క కాన్తి) మణిం దెల్పునటులనే సగుణబ్రహ్మము నిరుణబ్రహ్మముం దెల్పునదియె గాన సగుణబ్రహ్మారాధనయు, ధ్యానమును, నిర్గుణబ్రహ్మముం దెలియ సాధకము లగునని తాత్పర్యము. ఇచట మణికి, నిర్గుణబ్రహ్మమునకు, మణిప్రభకును, సగుణపరబ్రహ్మమునకు సాదృశ్యము లనియెఱుంగునది. మఱియు దీపికాదీపన్యాయమును నిట్టిదే.

**మణిపుష్పము**—సహదేవుని శంఖము. (ధనుర్విద్య చూడుఁడు.)

**మణిపూరక చక్రము**—యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన శరీరమందలి షట్చక్రములలో నొకటి. మణిపూరకచక్రము నాభిస్థానమునం దుండుననియు, నీలవర్ణము నూర్ధ్వముఖము ననియు, ఇట 'రం' అనునది బీజమనియు విష్ణువధిపతియనియు, నిందు పదిదళములు గలవనియు వాట్లపై నొక్కొకటిగ, డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ యను పదియక్షరము లుండుననియు నీచక్రమునందు అజప దినమున కారువేలు నడచుచుండుననియుఁ జెప్పఁబడినది.

**మణిపూర్ సంస్థానరాజ్యము**—ఇది భరతదేశఁపు 'ఆస్సాము'నకును 'అప్పర్బర్మా' దేశమునకును సరిహద్దు దేశముగ నున్న రాజ్యము. ఉత్తరమున నాగసీమ (నాగజాతివారు వసించుదేశము). తూర్పున నప్పర్బర్మా దేశములోని పర్వతారణ్యము, దానిం గల్పు 'చిండ్విన్'లోవయు, దక్షిణమున లషాయి పర్వతపంక్తులు, దాని యరణ్యసీమలు, పశ్చిమ

మున నాసాములోని కచారుజిల్లా దీని కెల్లలుగ నున్నవి.

మణిపూరులోయందు దొకపల్లము జలములచే నావృతమై "లోగ్టా"అనుపేరుగల గొప్ప సరస్సేర్పడినది. దీనియందలిద్వీపములు, సరస్సుయొక్క చుట్టుపట్లప్రదేశములు, మహారణ్యమయమై జననివాసములతో వింతసీమగాఁ గన్పట్టెడిని. మఱియు నీతావుల నడవి (వేఁట) మృగము లధికము.

ఆసాంబెంగాలు రైల్వేపైనున్న 'దిమాపూరు'స్టేషనునుండి చక్కని బాటను ౧౩౩ మైళ్ళ దూరమున నీసంస్థానపు రాజధానికిఁ జేరనగును. రాజ్యముచుట్టును పర్వతపంక్తులు, మహారణ్యములు కలవు, ఇదియే రాజ్యములోనికేగు ప్రధానమార్గముగ నున్నది. ఇదియును నాగ(గిరి) పర్వతములపై తిరుగుడుమార్గములుగ నెక్కియున్నదై దిగి లోనికరిగెడిని. ప్రయాణము సరిగా ... నుంటు నితరసంస్థానముల వలె దీని నెల్ల రెఱుంగకుంట వింతగానేయుండు. ఇటీవల మోటార్లు నడుచుచున్నవి.

రాజధాని 'ఇంఫాల్'(పురము)అనుచున్నారు ఇంఫాల్ నదీతీరము. ఇదియే తొల్లింటిమణిపురమని యచటివారనెదరు. ఈరాజ్యపువర్తకమంతయు నీదేశపుస్త్రీల హస్తగతమైయుండుట గాననగును. వర్తకమొనర్చు స్త్రీలయందు మెయితేయిజాతిస్త్రీ లధికముగాఁగలరు. ప్రజలు నాగజాతివారును, కుకీజాతివారును, మైతేయిజాతివారు నైయున్నారు. ప్రభువు భరతదేశపు క్షత్రియుఁడఁట. ఇప్పటి మహారాజుపేరు H.H. Sir. చూరాచాందు సింగ్ జీ. ఈయన యిష్టదైవము గోవిందజీ. ఈదేవునిదేవస్థానము రాజప్రాసాదావరణమునందే కలదు. గొప్పదేవళము ఇంఫాల్ నదీతీరమునందున్నది. ఇది ప్రభుకుటుంబమున సనాతనమతమఁట. ప్రజలగు నాగజాతివారిలోఁ బెక్కు తెగలు కల వందురు. అందు ముఖ్యములు కాబూయినాగులు, అంగామీనాగులు ననంబడుదురు. కాబూయిలు హిందువులు. తక్కినవారియందుఁ జైతన్యవైష్ణవమతము కొంతవఱకు వ్యాపించి యున్నది. గౌరాంగస్వామియే యిటకేతెంచి మతము బోధించెనని యామతస్థులగు ప్రజ లనెదరు. ఈరాజ్యపాలన భరతదేశపుబ్రిటీషుప్రభుత్వమువారి పొలిటికల్ ఏజంటు పరిశీలనయం దున్నదఁట.

పోలో యాట నాదిని నీమణిపూరుసంస్థానపు జాతీయమగు నాట యనియు, బ్రిటీషువారి సైనికులగు రాయల్ హుజార్సు కేవలరీవారు మణిపూరురాజ్యపు ప్రజలనుండి నేర్చి క్రీ. శ. ౧౯వ శతాబ్దమున నింగ్లాండు దేశమునందు నేర్పిరనియు, నిచటివారు గర్వముగ బల్కుదురు. ప్రజలు దీనిని చక్కగ నాడుచుందురు. ఇచటి పోలోగుఱ్ఱములును త్వరితగమనము గలవి. ఈదేశపుగుఱ్ఱములు పేరందినవి. (పోలోఆట చూడుఁడు.)

ఇంక విమర్శనీయమగు వేఱొక్కసంగతితో ముగింతుము గాక. పాండవమధ్యముఁడగు నర్జునుఁడు భూప్రదక్షిణ మొనర్చుచు మణిపురరాజగు మలయధ్వజునిసుత చిత్రాంగదను వివాహమాడిన దీమణిపురమే యనియు నందు వివరింపఁబడిన నది యీనదియే యనియు, నిచటివా రంద రేకగ్రీవముగ ననుచుందురు. ఇది మహాభారతప్రసిద్ధమగు కథనము. విజయవిలాసము రచించిన చేమకూర వేంకటరాజుకవి యామణిపురము తామ్రపర్ణీ నదీప్రాంతమున నెక్కడనో దక్షిణపాండ్యదేశ మందనున ట్లమర్చియున్నాఁడు. కాని యచట నానవాళ్ళేమియుఁ గానరావు. దీని నిజమారయుటకు పరి-

శీలనలు జరుగదగునని వదలుచున్నాము.(జావా (యవ) ద్వీపమున నర్జునునిఁగూర్చిన మరభిప్రాయము జూడుఁడు.) ఈ దేశమందలి పర్వతములకు లుపయాపర్వతము లనిపేరు.

**మణిభద్రగణము**—ఇది విశ్వబ్రాహ్మణులయందొక గణము. ఇందైదు గోత్రములు జెప్పఁబడినవి. (ప్రణవశాఖ విశ్వబ్రాహ్మణులు చూడుఁడు.)

౧. మణిభద్రగోత్రము- మణిభద్ర, హాటకాంగద, సర్వదమన, విశ్వకర్మ, విశ్వరక్షక, (పంచార్షేయప్రవర).

౨. మునిసువ్రత గోత్రము- మునిసువ్రత, ఉదర, వేదపాలక, (త్ర్యార్షేయప్రవర).

౩. శ్యతివర్ధనగోత్రము- ఉదర, వేదపాలక, శ్యతివర్ధన, (త్ర్యార్షేయ ప్రవర)

౪. యాజ్ఞికర్షి గోత్రము- వేదపాలక, శ్యతివర్ధన, యాజ్ఞిక (త్ర్యార్షేయ ప్రవర)

౫. సౌజ్ఞికర్షి గోత్రము- శ్యతివర్ధన, యాజ్ఞిక సౌజ్ఞిక, (త్ర్యార్షేయ ప్రవర).

**మణిమంత్రాదిన్యాయము**- ప్రయత్నములవలన కారణకార్యములకుఁ గ్రమముగ పనినడచుట జరగును. మణిమంత్రాదుల ప్రయోగము క్రమముగ పనినడచుట యుండక ప్రయోగమాత్రముననె ఫలితము గలిగెడిని.

ఇట మణిమన్త్రాది ప్రయోగమే కారణమును తోడనే కన్పించిన ఫలితము కార్యమును నై యున్నవి. ఇట్టి సందర్భముల నీన్యాయము వాడుదురు.

**మణిమతీపురము**-వాతాపినమ్ముఁడగు నిల్వలుఁడుండిన తావు. (మహారాష్ట్రదేశము చూడుడు.)

మణిమతీపురమునకు దుర్జయ మనియుఁ బేరుండినటుల గాన్పించెడిని. మహాభారతము,వనపర్వతము ౯౬ యందుఁ బ్రశంసకలదు.

**మణిమహేశక్షేత్రము**--పాంచాలముకడ 'చంబా'(చంపా లేక చంపాపురి) సంస్థానరాజ్యమున రావీనదీతీరమున నిప్పుడు 'బర్మావార్'అను గ్రామమునందున్న శివక్షేత్రము. తొల్లింట నిది యాసంస్థానఁపురాజధానిగనుండెనట. ఇది యాత్రాస్థలముగ నున్నది. ఇచటి శివలింగమునకు మణిమహేశుఁడనిపేరు.ఫాలశిల పంచముఖముల శివలింగము. రావీనదీజన్మస్థాన సమీపము. రావీనదీజన్మస్థానమున మణిమహేశ్వర మను (మంచు)సరస్సు కలదు. అందు బూధ్హాల్ నదిగ జన్మించి పిదప నదియె రావీనది యనంబడును.

**మణివిక్రయదృష్టాంతరన్యాయము**
మణియన రత్నమునర్థము. రత్నములనాణ్యము వాట్లధర లెఱిగినవారు రత్నములను విక్రయించినచో తగుమూల్యము వచ్చునుగాని,రత్నములఁ గూర్చి యెఱుంగనివారు రత్నవిక్రయమున సరియగుమూల్యము రాబట్టనేరరని భావము.

దేనియందు చక్కనిజ్ఞాన ముండదో దానిఁ గూర్చి వా రనర్హు లని తెల్పుట కీన్యాయము వర్తించెడిని.

**మణిశిల**-దీని నాంగ్లమున 'Red.Orpiment' అనెదరు. సంస్కృతమున నైపాలీ, మనశ్శిలః, మనశ్శిలా, మనోగుప్తా, వితుండా, మనోహ్వా యనియెదరు.

మణిశిలను పైని బూసిన చర్మరోగములు హరించుననియు, లోపలికిచ్చిన వేడిఁజేసి జ్వరములు నివారించుననియు,లోనికిచ్చుటకు శాస్త్రోక్తముగ శుద్ధిచేయఁబడవలెననియు, లేకున్నఁ బెక్కురోగములకు కారణమగుననియు, దీనికి

విఱుగుడు లావుపాలు, తేనెయనియుఁ జెప్పఁబడినది

**మతంగాశ్రమము**—బీహారములోని గయాజిల్లాయందు బుద్ధగయ కెదురుగ ఫల్గుణీనదికవ్వలఁ దొల్లింటి మతంగాశ్రమము గలదు. ఇంట మతంగేశ్వరశివలింగము గలదు.

మధ్యకాలమున బౌద్ధాక్రాంతమై గంధహస్తిస్థూపమని పేరిడఁబడెనంట గాని శివలింగము జోలికిఁ బోరైరంట. ఇప్పుడు హిందూ దేవస్థానమైయున్నది. ఇంట మతంగవాపి స్నానతీర్థము గలదు.

**మతంగగోత్రము**—(ఆత్రేయగణము చూడుఁడు)

**మతంగదేశము**—తొల్లింట నొకప్పుడు కామరూపదేశమున కాగ్నేయము మతంగదేశమను నొకచిన్న దేశ ముండెడిదంట. అందు వజ్రపుగనులు సుప్రసిద్ధములై యుండెనంట.

**మతంగుఁడు**—ఈపేరుగలవారిద్దరు గాననగుచున్నారు.

ఒకబ్రాహ్మణస్త్రీయందొకమంగలికిఁ బుట్టినవాఁ డొకఁడు మతంగఋషియై తప మాచరించువాఁడు గలఁడు. వేరొకమతంగుఁడు మతంగకులజాతుఁడయ్యు దపంబువలన బరిశుద్ధుండై యుండెను. ఈతనిగర్భమున పరాశక్తి కుమార్తెగ జన్మించి మాతంగి లేక మాతంగకన్య యని పిలువఁబడెను. ఈ మహర్షియుని యాశ్రమము బళ్ళారి మండలములోని జీర్ణవిజయనగరమున హంపికెదురుగ మతంగపర్వతముపై తుంగభద్రానదీతీరమున నని తెలిసెడిని.

**మతము (Religion)**- మతము మానవత్వమునకుప్రధానధర్మము. మతవిధి నెఱుఁగనివారు పరిశుద్ధులుగను, యోగ్యులుగ నుండుట కలవాటుపడియుండుటస్వతస్సిద్ధముగ గలుగదు పవిత్రులుగ నుండుట యసంభవము.

మతముల నేకములు లోకులనావరించియున్నవి. ప్రతిమతమునందునను జగత్కర్తృత్వము, జగత్కర్తయొక్క సాకారనిరాకారత్వలక్షణములు పరమేశ్వరుఁడు సగుణుఁడా? నిర్గుణుఁడా? యను విచారమును, సృష్టియొక్కనిమిత్తోపాదానకారణములును, ఆత్మలు, లేక ప్రాణులస్థితి, కర్మబంధములు, తత్త్వములు, జగత్పదార్థతత్త్వము, పరమేశ్వరార్చనావిధి విధానములు, బంధవిముక్తికి మార్గము, ప్రాణముయొక్క ముక్తి మొదలగునవి తెలుపఁబడుచుండును.

మనుష్యులకు మతవిధులుగ నాంతరంగికపరిశుద్ధియు, బహిరంగశుద్ధియు, సవనములై యుండుటం జేసి యహింస, సత్యము, శుచి, [illegible]ము. క్షమయు నాచరణీయములుగ నుండును. మతవిధులఁ బాటింపమి దోషమనఁబడును. కొన్ని మతములందు దోషములకు పరిహారములుగ కొన్ని సత్కార్యములు, మహత్కార్యములు, తీర్థస్నానవిధులు, పరమేశ్వరార్చనలు, తెలుపఁబడి యున్నవి. కొన్ని మతములందు కర్మానుభవమును మాత్రమే విధింపఁ బడినది.

మతమనిన మనస్సు నమ్మినవిధాన మని భావము. అభిప్రాయమని యర్థము. భరతదేశమున త్రిమతములన స్మార్తుల యద్వైతసిద్ధాంతము, మాధ్వవైష్ణవులద్వైతసిద్ధాంతము, రామానుజీయవైష్ణవుల విశిష్టాద్వైత సిద్ధాంతమునని ప్రసిద్ధముగ నర్థమగుచున్నది. ఇంక షణ్మతములనిన శైవ, వైష్ణవ, శాక్త, గాణాపత్య, సౌర, కాపాలికము లని ప్రసిద్ధముగ నర్థమగును.

పాశ్చాత్యుల యభిప్రాయమున మతమనినఁ బరమేశ్వరునితో మానవులకుఁగల సంబంధమాత్రమై యున్నది. ఇంకను కోర్కెలు, ప్రవ.

ర్తనము, ఆచారములు, అభ్యాసములు, మత సంబంధముగలవిగ నేయుండునని కొందరనుచుందురు గాని జాతీయత, దేశభక్తి దేశకాల పాత్రల కవసరమగురీతిగ గుదురుకొనుచుండుట గాననగుచుండెడిని. మతము మనుష్యులయందుండురీతిని దైవారాధన, సంఘబాధ్యతలకుఁ బురికొల్పుచుండును.

క్రైస్తవమతస్థులగు పాశ్చాత్య మతశాస్త్ర వేత్తలు మతముల నైదుతెగలుగ విభజించి వివరించిరి.

1. Religions of the natural life, and of an animistic force.

2. Religions of anthropomorphism, and external morality.

3. Religions of ecstasy, and asceticism.

4. Religions of monotheistic tendency, and ethical dualism.

5. Religions of true monotheism, and reconciliation.

**మతరరాజ్యము (మతరద్వీపరాజ్యము)**—మతరద్వీపము రానురాను మారుచు నిప్పుడు మదురద్వీప మనఁబడుచున్నది. ఇది బోర్నియో (తొల్లింటిభరణి)ద్వీపమునకు దక్షిణదిశను జావాసముద్రమునందు జావా(తొల్లింటియవ) ద్వీపముకడనున్న చిన్నద్వీపము.

ఈరాజ్యముంగూర్చిన చరిత్ర చక్కఁగాఁ దెలియరాకున్నది. తృణంజయుఁడను భూపతి యీరాజ్య మేలుచుండినకాలమున శ్రీభువిరాష్ట్రాధిపతిగనుండిన పణంభాహాగిరిలయుఁ డను భూపతిసుతు లిర్వురు మహమ్మదీయులై మత వ్యాప్తికి తృణంజయునిపై దండెత్తివచ్చి సంగరమున నోడింపఁబడి తృణంజయునిచే గారాగృహమునందుంచబడిరని నిదర్శనములు కానవచ్చుచున్నవి.

శ్రీభువిరాష్ట్రమును పణంబాహాగిరిలయుఁడు క్రీ. శె. ౧౫౮౦ ప్రాన్తమున పాలించినవాఁడగుట నీతృణంజయుఁడు పదునారవ శతాబ్దాంతకాలముననో పదునేడవ శతాబ్దాంతకాలముననో యుండినవాఁడుగానోపు. పణంబాహుగిరిలయుఁడు తనరాజ్యమును పెద్దకుమారుఁడగు పంగేరంమార్తవిజయునకును రెండవ కుమారుఁడగుపంగేరంకర్తవిజయునకును సమముగఁ బంచియిచ్చి మూడవకుమారుఁడగుపంగేరంవంశకర్త యనువానికి పైయిర్వురచే భరణ మిప్పించెననియు, రాజ్యముపంచుకొన్న యిర్వురుసుతులును మహమ్మదీయ మతస్వీకరణ మొనర్చి మార్తవిజయుఁడు సుల్తాన్నేపూయనియు, కర్తవిజయుఁడు సుల్తాన్ ఆనంఅనియు పేర్లనుమార్చుకొనిరనియు, పిదప మతావేశపరులై మతవ్యాప్తికి మతరరాష్ట్రముపై దాడివెడలి సంగరమున తృణంజయునిచేనోడింపఁబడి కారాగృహమునందుంపఁ బడిరనియు, వారు విడుదలనందుకాలమునకు వారిరాజ్యములు హోలండువారి స్వాధీనమై పదభ్రష్టులైరనియుఁ దెలియుచున్నది. దీనింబట్టి వారితొల్లింటి శ్రీభువిరాజ్యము జావాద్వీపములోనిదే మో యని తోఁచెడిని.

ఎచ్చటిదైనను మతరద్వీపరాజ్య మేలినభూపతులలో తృణజయుని నామమే గాక వేర్వేరు శాసనములనుండి నరపతిరాజు, పూర్ణప్రభువు, పురూరవభూపతి, సూతవిజయుఁడు, కహిగుణధర్ముఁడగు భూపతులపేర్లు గానవచ్చుచున్నవి. గాని వారికాలములు గాని, యితరచరిత్రములు గాని తెలియవచ్చుట లేదు. (మోజోపహితరాష్ట్రము చూడుఁడు.)

**మతినిబట్టియే గతి**-(ఆంధ్రలోకోక్తి)

**మతిసారుఁడు**—(అంతిసారుఁడుచూ).

**మతిపురము**—దీని నిప్పుడు మదవారనియు, ముండోరనియు, మధ్యబా రనియు, వాడు

చున్నారు. పశ్చిమ రోహిల్లాఖండసీమయందు బిజనోరున కుత్తరముగా నెన్మిది మైళ్ళదూరమున (హరిద్వారమునకు దక్షిణమున ముప్పదిమైళ్లు) నున్నది. దీనికి బ్రలంబనమనియుఁ బేరుకలదు.

**మత్తకుంజర సంఘాతం భినత్త్యేకోపి కేసరీ**— (ఇది సంస్కృత భాష యందలి లోకోక్తి). మదించిన యేనుఁగుగుంపుఁ బరిమార్చుట కొక్క సింహమైనఁ జాలునని భావము.

**మత్తుఁ గలిగించు సారాయమ్ములు మొదలగు పానీయములందుఁగల 'ఆల్కహాలు** (Alcohol) ఇది వేర్వేరు నిషా పదార్థములందు వేర్వేరు పరిమితులుగ గలుపుదురు. ఎక్కువనిషాచేయు స్కాచివిష్కీ మొదలగు మత్తుఁగల్గించు పానీయములం దేబదినాలుగు లేక నేబదియైదు భాగములు (నూటికి) కూడ గల్పుదురనియు, నిషా సారాయములందు నూటికి కేబదియేడు భాగములు (57 percent) 'అల్కహాలు' గలుపఁబడినవాటికి proof అని వాడుకనామము గలదనియుఁ దెలియుచున్నది. ఇవి పాశ్చాత్యసారాయములు.

| | | | |
|---|---|---|---|
| బీరు (Beer) | 4.0 | — | percent |
| Porter | 4.5 | | do. |
| Ale | 7.4 | | do. |
| Cider | 8 6 | | do. |
| Perry | 8.8 | | do. |
| Elder | 9.3 | | do. |
| Moselle | 9.6 | | do. |
| Tokay | 10.2 | | do. |
| Rhine | 11.0 | | do. |
| Orange | 11.2 | | do. |
| Bordeaux | 11.5 | | do. |
| Hock | 11 6 | | do. |
| Gooseberry | 11.8 | | do. |
| Champaine | 12.2 | | do. |
| Claret | 13.3 | | do. |
| Burgundy | 13.6 | — | Percent |
| Malaga | 17.3 | | do. |
| Lisbon | 18.5 | | do. |
| Canary | 18.8 | | do. |
| Sherry | 19.0 | | do. |
| Vermouth | 19.0 | | do. |
| Cape | 19.2 | | do. |
| Malmsey | 19.7 | | do. |
| Marsala | 20.2 | | do. |
| Madeira | 21.0 | | do. |
| Port | 23.2 | | do. |
| Curacoa | 27.0 | | do. |
| Aniseed | 33.0 | | do. |
| Maraschino | 34.0 | | do. |
| Chartreuse | 43.0 | | do. |
| Gin | 51.6 | | do. |
| Brandy | 53.4 | | do. |
| Rum | 53 7 | | do. |
| Irish whiskey | 53.9 | | do. |
| Scotch do. | 54.3 | | do. |

**మత్స్యకౌశిగోత్రము**—(భరద్వాజ ఉపగణము చూడుఁడు.)

**మత్స్యగుండము**— ఇది విశాఖపట్టణ మండలమునందలి మాడుగుల యేజన్సీలోనున్న ప్రకృతిసిద్ధమగు మంచినీటిమడుగు. ఇది మాడుగుల నగరమునకు నైరుతిమూలను సుమారిరువదిమైళ్ళ దూరమునందు గలదు. ఇది యీ ప్రాంతముల నొక యాత్రాస్థలముగాఁ బరిగణింపఁ బడుచున్నది. ఇందు బలిష్ఠముగాఁ బెరిగి, మచ్చికపడిన చేప లుండుటచేతనే దీనికీపేరు వచ్చినది. పక్షితీర్థమునందలి పక్షులవలెనే యీమత్స్యగుండమునందలి మత్స్యములు మానవుల పుణ్యపాపములను పరిశోధించుటకు నిదర్శనములంట. యాత్రికులు తమతమ చేతులయందు బియ్యము నుంచుకొని మత్స్యములను బిలుతురు. పుణ్యాత్ముల చేతులయందలి బియ్యమునే యవి

భక్షించుటకు వచ్చునంట.

ఈగుండమున కిరువైపులను లింగాకారముగ నున్న రాళ్ళనేకము లున్నవి. ఈరాళ్ళను గూర్చి చిత్రమయినకథఁ జెప్పుదురు. పూర్వము సార్థవాహులు గొంద రొక బిడారుతోవచ్చుచు నీగుండముదరి బసజేసిరంట. అందులోని సార్థవాహులు గొంద రీగుండములోని మత్స్యములనుబట్టి వండితినివేసిరంట. తోడనే యాసార్థములోనివారందరును మిగిలినమత్స్యముల శాపము వలన రాలుగ మారిపోయి రంట.

**మత్స్యదేశము** — పాండవు లరణ్యవాసాజ్ఞాతవాసము లొనర్చుకాలముునను, భారత సంగ్రామకాలమునను, మత్స్యదేశము విరటుఁడను మహారాజుచేఁ బాలింపఁబడుచుంట నాయన పాలన ప్రజారంజకముగనుంటఁగాఁబోలు నా దేశము విరాటదేశముగ పేరంది యుండెను దీని ప్రశంసలు మహాభారతము- సభాపర్వము 30 యందునను, విరాటపర్వము ౧ అధ్యాయము నను గలవు. విరట మహారాజు మత్స్యదేశ మేలెననుట నిస్సంశయాంశము.

ఈదేశముఁగూర్చియనేకు లనేకప్రదేశముల జూపుచుంట వింతగొల్పకపోదు. కొందఱు దినాజ్పూరుప్రాంతసీమను మత్స్యదేశ మనుచు, కొంతానగరము నుత్తర గోగ్రహణ ప్రదేశముగఁ జూపుచుందురు. కొందఱుబంగాళములోని మిడ్నపూరును దక్షిణగోగ్రహణస్థల మనుచున్నారు. మఱికొంద ఱాంధ్రదేశమునందలి విశాఖపట్టణ మండలములోనిమాడుగులప్రాంతసీమను మత్స్యదేశమనుచు మాడుగులగ్రామమును విరాట్పురమనుచుందురు. మఱియు వీరే యులమండను గోగ్రహణస్థలమనియు, జామియనుగ్రామమును శమి (జమ్మిచెట్టు) యనియుఁ దెల్పుచుందురు. ఇంక నిచటి యేజన్సీప్రాంతమందున్న జయపురపుసీమయం దిట్టితావులఁ జూపించువారును గలరని విందుము.

మత్స్యదేశ మానాడు సుప్రసిద్ధములై యుండిన షోడశదేశములలో నొకటిగ బౌద్ధమతగ్రంధమగు పిటకములందు మహాజనపదమని చెప్పబడినది. వారు మత్స్యశబ్దమును మచ్ఛ యని వాడిరి. బహుశః మచ్ఛ్యదేశపుటెనుగు వారి టుల వాడియుండనోపు. ఈపేరునఁ బరగుగ్రామము రాజపుత్రస్థానపు నాళ్వారుసంస్థానపు రాజధానియగు 'అల్వారు'నుండి దక్షిణముగా ౨౨ మైళ్ళదూరమునందుఁ గలదు. ఇంక విరాట్పురము 'బైరా' తనఁబడు గ్రామముగ ఢిల్లీనగరమునుండి దక్షిణముగ ౧౦౫ మైళ్ళదూరమునను, రాజపుత్రస్థానములోని జైపూరున కుత్తరముగ నలుబదిమైళ్ళ దూరమున నున్నదనియు, ఇది తొల్లింటి మత్స్యదేశమున విరాట మహారాజునాడు రాజధానిగ నుండెననుటల నిండియాదేశపు "ఆర్కియాలోజికల్సర్వే" కొలత చేసి రైటిరుగనుండిన మేజరుజనరల్, సర్ కన్నింగుహాముపండితుండు తన యార్కియాలోజికల్సర్వేరిపోర్టు రెండవసంపుటము ౨౪౪ పుట యందు వివరించి యున్నాడు. ఇటనే పాండవు లజ్ఞాతవాసముఁ గడపిరని యాయన సూచించెను. ఈబైరాతు గ్రామ పరిసరములఁగల కొండకు పాండుగిరి (పాండవగిరి)యనుపేరు వాడుక యందున్నది. ఇందు గల గుహాకు భీమగుహ యని పేరుకలదు. అందొకశాసన మశోకచక్రవర్తినాటిది కలదు. అది Corpus Inscriptionum Indicarum ౧వ సంపుటము, ౨౨ పుట యందుఁ గాననగును.

మహాభారతము, విరాటపర్వము ౧ యందునను సభాపర్వము 30 యందునను యుధిష్ఠిర మహారాజు తమయజ్ఞాతవాసకాలమున తమ వైరియగు దుర్యోధనునిపనులఁ గనిపెట్టి జాగ్రతఁ

గొనుచుండుటకై హస్తినాపురమునకు సమీపస్థానముగనుండిన దేశమును దమ యజ్ఞాతవాసకాలమును గడుపనెన్నుకొనెనని చెప్పఁబడినది.

ఇటులనే యగుచో రాజపుత్రస్థానము జయపురరాజ్యము ఇప్పటియాల్వారురాజ్యము భరతపూర్ సంస్థానరాజ్యభాగమును నాటి మత్స్యదేశములోనివై యుండియుండనోపు ననియు నిదియె భారతమునందు వివరింపఁబడిన మత్స్యదేశమనియుఁ బరిశోధకులు తలంచుచున్నారు. ఇంకను Thornton's Gazetteer నందునను, నార్కి-యాలాజికల్ సర్వే రిపోర్టు యిరువదియవసంపుటము ౨ పుటయందునను, రెండవసంపుటము ౨౨౫ పుటయందునను, దీనింగూర్చినవిషయములు గాననయ్యెడిని.

**మత్స్యద్వాదశి**-(అఖండద్వాదశి చూ.)

**మత్స్యపురాణము** — మత్స్యపురాణము, (మాత్స్యము) లింగ, కూర్మ, పురాణములందు పదునేనవదిగను, దేవీభాగవతమున నొకటవదిగను తక్కినవాట్లయందు పదునారవదిగను జెప్పఁబడిన పురాణము. మత్స్యస్వరూపియగు విష్ణుదేవుఁడు మనువునకు జెప్పిన పురాణము. గ్రంథసంఖ్య మత్స్యపురాణమునం౧౪౦౦౦ గను, నారదీయపురాణమున ౧౫౦౦౦ గను, భాగవతమున ౧౮౦౦౦ గను, తక్కినవాట్లయందు ౧౯౦౦౦ గను, జెప్పఁబడినది.

**మత్స్యరేఖ** — (పురుషసాముద్రికము చూడుఁడు. స్త్రీసాముద్రికము చూడుఁడు.)

**మత్స్యహస్తము** — (హస్తాభినయము చూడుఁడు- భరతశాస్త్రము చూడుఁడు.)

**మత్స్యాయుగోత్రము**- (హారిత ఉపగణము చూడుఁడు.)

**మత్స్యాసనము**- యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి. వెల్లకిలబరుండి కాళ్ళు పద్మాసనమువైచి రెండుచేతులను శిరస్సుపై లంకెవేసి పరుండుట. ఇది మలశుద్ధికరమని చెప్పఁబడినది.

**మత్స్యుఁడు**— అత్రి చంద్ర పూరు కురుసంతతి క్షత్రియుఁడు. తండ్రి యుపరిచరవసువు. సోదరులు బృహద్రథుఁడు, కుసుంబుఁడు, ప్రత్యగ్రుఁడు, చేదిషుఁడు. ఈతనినుండి ఈతఁడేలిన దేశమునకు మత్స్యదేశమని పేరయ్యెను.

**మత్స్యేంద్రాసనము**- యోగశాస్త్రమున జెప్పఁబడిన యాసనములలో నొకటి. నేపాలదేశమున మహాక్షామకాలమందు వర్షములుకురియఁజేసి ఆదేశరక్షకుఁడని పేరంది నేటికిని పూజింపఁబడుచున్న మత్స్యేంద్రనాథయోగి యభ్యసించి యోగసిద్ధినొందుట నీయాసన మీయనపేరునఁ బ్రసిద్ధమయ్యెను.

కుడిపాదము నెడమతొడమీద నుంచి యెడమకాలిమడమ కుడిమోకాలికిఁ దాపియుంచి యెడమచేతిని వెనుకభాగమునుండి త్రిప్పి మరలించి యెడమచేతితో కుడికాలిమడమను పట్టుకొని కుడిచేతిని యెడమమోకాలివెలుపలనుండి త్రిప్పి యెడమకాలి బొట్టనవేలుఁ బట్టుకొని కూర్చుండుట మత్స్యేంద్రాసనమనియు, దీనికి బ్రకారాంతముగ నెడమపాదమును కుడితొడపైనుంచి దానిని కుడిచేతిని వెనుకభాగమునుండి త్రిప్పి మరలించి పట్టుకొనుటయు, కుడికాలి మడమ నెడమమోకాలు దాపియుంచి దానినెడమచేతిని కుడిమోకాలివెలుపటనుండి త్రిప్పి దానితోపట్టుకొనుటయుఁ జెప్పఁబడినది. ఇందువలన సమస్తరోగములు నడంగి కుండలినీప్రబోధమగునని చెప్పఁబడినది.

**మదకగోత్రము**-(ధనంజయగణముచూ).

**మదనచతుర్దశి**— చైత్రశుద్ధ ద్వాదశి దినమున గొందరును, త్రయోదశి దినమున

గొందరును, చతుర్దశి దినమున గొందరును, దమనవృక్షముక్రింద మదనపూజ యొనర్చుచుందురు. ఈతిథులభేదము పూర్వాచారపు సాంప్రదాయము ననుసరించియుండును. అత్తరి మదనద్వాదశి యనిగాని, మదనత్రయోదశి యని గాని కూడ ననుచుందురు. (మదన పంచమిఁ జూడుఁడు.)

**మదనత్రయోదశి** (మదనచతుర్దశి చూడుఁడు.)

**మదన తపోవనము (కామాశ్రమము)**—బాలియాజిల్లాలో కొరాం జేడిగ్రామమున కుత్తరముగా నెనిమిదిమైళ్ళ దూరమున నాకాలమున శోణభద్రానది గంగానదిలో సంగమించుతావున మన్మథునిఁ బరమేశ్వరుఁడు దహింపచేసినస్థలముఁ జూపుదురు. (రామాయణము బాలకాండము) ఇప్పుడది మేటవేసినది.

**మదనద్వాదశి**—(మదనచతుర్దశి చూ.)

**మదనతాళము**—(తాళములు చూ.)

**మదనతృణము (మదనగడ్డి)**—ఇది గడ్డిజాతులలో నొకటి. దీని రస కషాయము లందు వాతదోషము, విషదోషము, శ్లేష్మదోషములు నడంచుశక్తి కలదందురు.

**మదనపంచమి**—దీని నింకను వసంత పంచమియనియు నందురు. మాఘశుద్ధపంచమి వసంత ప్రవృత్తివ్రత మాచరించి మదనపూజ, హరిహరనాథులపూజ యొనర్తురు. (పండుగలు, పర్వతిథులు, వ్రతదినములు చూడుఁడు.)

**మదనపల్లి సమశీతోష్ణప్రదేశము** — M.S.M. చిన్నలైను పాకాల-ధర్మవరములైను పైనున్నది. రైలుస్టేషనునుండి యెన్మిదిమైళ్లదూరము. సముద్రపునీటిమట్టముపై ౨౫౦౦ ఎత్తు. మార్గమున నారోగ్యవరమనంబడుతావున నుబ్బసము,క్షయదగ్గుల యాస్పత్రియు నీప్రాంతములఁ జేరందిన సంస్థ.

మదనపల్లియందు థియసాఫికల్ సొసైటీవారి మొదటితరగతి కాలేజీయును ఒకహైస్కూలును ప్రసిద్ధములు. ఇది సీడెడ్ డిస్ట్రిక్టులు చిత్తూరు జిల్లాలకు సమశీతోష్ణప్రదేశముగ వాడఁబడుచున్న తావు.

**మదనబుడత చెట్టు**- లా. Spermacoce hispida. దీనివేరు పాలసుగన్ధివేరు వలెనే గుణములఁ గల్గియుండుననియు, రక్తమును శుభ్రపర్చుట, తత్వమును బాగుచేయుట, మొదలగు గుణములు గలవని యందురు.

**మదనానపచెట్టు (బప్పానప)**— మదనానపచెట్టునకు బప్పాయిచెట్టు, బప్పానపచెట్టు, పాపాయిచెట్టు, మదనాపచెట్టు మొదలగుపేర్లు వాడుకయందున్నవి. ఇందు పెద్దపండ్లగాచు జాతియు చిన్నపండ్లంగాచుజాతియు రెండు ముఖ్యభేదములును, చిన్నజాతియందు విత్తనములు లేనిజాతి యొకటియుఁ గలదు. ఇది యత్యుత్తమజాతిగను, పెద్దపండ్లది యుత్తమజాతిగను నెంచబడుచున్నది. ఇదిగాక పొడుగాటికాడలను వైచి పొడవునను పూవులంబూచి కాయలను గాయని గొడ్డుజాతిమదనానప యొకటి గలదు. అది యధమాధమపుజాతి యందురు. ఇది స్తంభమువలె పెరుగుచెట్టు. కఱ్ఱయందేమియు సతువ లేనిది. పాలుగల చెట్టు.

లా. Carica papay. ఆంగ్ల. Papaya tree. సం. పపీత, పారిన యనికొందరనిరి గాని సరిగా తెలియరాకున్నది. దీనిపండ్లు ఆహారోపయోగము.

పండు చలవ సమధాతువ జేయును. అగ్నిమాంద్యము, పురాణగ్రహణి, విరేచనబద్ధప్రకృతి, నిక్కాశ, రక్తమువమనమూలవ్యాధి, రక్త

స్రావము, మూత్రద్వారమునఁ బుట్టెడి పుండ్లు నివారించును. లోనిచెడు వేడి నడంచును. పండు గుంజు పైనిరాచిన నొడలుపేలుట మానును. పండులోనివిత్తులందు క్రిముల హరించు గుణము గలదు. విత్తులనెండించి చేసినచూర్ణము చక్కగ పని జేయునందురు.

ఆకులు దంచి పైనవేసికట్టిన నరములసంబంధముగునొప్పులు మానును. బోదకాలిరోగము నివృత్తియగును. పాలుతీసినతోడనె (నిల్వయుంచిన చెడును) మర్దనచేసిన తేలు విషబాధ మానును. లోనికిచ్చిన విరేచనమై కడుపునొప్పి మానును. గర్భిణీస్త్రీలకు లోనికిచ్చిన గర్భస్రావముఁ గల్గించును. క్రిమిని హరించును. పాలు కాయలనుండితీసిన వెండలో ఇసుకయందొక పాత్రలోనుంచి యెండించి చూర్ణము జేసి, యది లోనికిచ్చిన జీర్ణశక్తి బలపడి యగ్నిమాంద్యము నివృత్తియగును. ఈ (dispepsia) రోగము నిది బలముగ మాన్పునని యందురు. దీనిపచ్చి కాయలు పిల్లతల్లులకు పాలుపడఁజేయును. చెట్టు పాలు పూయుచుండుటవలన తామర, తీట, గజ్జి, చిడుము, మొదలగు చర్మవ్యాధు లంతరించును. కొందరికి దురదగల్గి రసికారుటయుగల్గి మాన్పబట్టును. పైనివ్రాయుటవలనసనె కార్జము (liver), ప్లీహము (spleen) పెద్దదగుట మాని తగ్గును.

బప్పాసపుపూవు నలిపి పేనుకొరికి వెంట్రుకలూడినతావున రాచిన తిరుగ వెంట్రుకలు చక్కగా మొలచెడిని.

దీనికి విరుగుడులు శొంఠి,పిప్పలి, మిరియాల చూర్ణము గాని, కషాయముగాని, లోనికిచ్చుటయని చెప్పఁబడినది.

**మదములు ౮ (అష్టమదములు) అష్టవిరాగములు**— ౧. ధనమదము, ౨. రాజ్యమదము, ౩. బలమదము, ౪. విద్యామదము, ౫. తపోబలమదము, ౬. రూపమదము, ౭. యౌవనమదము, ౮. కులమదము.

ఈ యెనిమిదిమదములనుండి కలిగిన విరాగముల అష్టవిరాగము లనియెదరు.

౧. ధనవిరాగము (ధనమునందు విరక్తి), ౨. రాజ్యవిరాగము (రాజ్యాధిపత్యమునందును నధికారగరిమయందును విరక్తి), ౩. బలవిరాగము (తాను బలవంతుఁడనను గర్వమును వదలుట), ౪. విద్యావిరాగము (తాను విద్వాంసుఁడనను గర్వమునందు విముఖత), ౫. తపోమదము (తన తపోమహిమలయందు విరక్తి), ౬. రూపవిరాగము (తనసౌందర్యమునకై తనకుఁగల గర్వమునుండి విరక్తిఁ జెందుట), ౭. యౌవనవిరాగము (యౌవన[illegible] స్థిరముగునది కాదని తెలిసి [illegible] మానుకొందుట), ౮. కులవిరాగము (నా [illegible]కులజుఁడనను గర్వమునుండి విరక్తిఁ జెందుట).

**మదములు ౩ మహాభా**—(త్రిమదములు చూ.) ఇం[illegible] ధనమదము, విద్యామదము, శరీరబలమదము, లేక యౌవనమదము లను త్రిమదము లనెదరు. దీనికి బౌద్ధాంతర్ముగ ధనమదము, విద్యామదము, రూపమదము లేక సౌందర్యమదములు త్రిమదములనియెదరు.

**మదరింగ్ సండే (Mothering Sunday)**— లెంటుపర్వములందు నాల్గవ యాదివారము.

**మదర్ కేరీస్ చికెన్సు** (Mother Carey's chickens- సముద్రపుఁగోళ్ళు)- ఇవికన్పించుట తుపానునకుఁ జిహ్నమని తలంతురు. వీట్లకు Procellaria, Pelagica అని లాటినునామము మరియు నావికులు Mother carey's chickens అని యందురు.

**మదశక్తివదితి న్యాయము**-మధుపానముచే గల్గిన మత్తతయం దధికబలము (సాహసము) గల్గి, యది క్షీణించినతోడనే బలమును క్షీణించుట యని యర్థము. ఒకటితో నొకటి యన్యోన్యముండు ఫలితముఁ గూర్చి తెలుపు న్యాయము.

**మదాత్యయము (రోగము)** — అతి మద్యపానదోషమున జనించు వికారరోగము.

**మదీనాపురము**— మహమ్మదీయులకుఁ బవిత్రస్థలము. అరేబియాదేశములోనిది. ఇటకు మహమ్మదు జగద్గురుఁడు క్రీ.వె. 590 సంవత్సరమునఁ జేరెను. నాఁడాదిగ హిజ్రా శకము ప్రారంభ మాయెను. ఇందు మహమ్మదుగారి గోరీ కలదు.

మహమ్మదీయులు భక్తిపారవశ్యమున నీపురమును "అల్మదీనాతున్నబీ" యనగా జగద్గురుని పురమని యనుచుందురు. అరబ్బీభాషయందు మదినా యనఁ పుర మని యర్థము.

**మద్దిచెట్టు**—మద్ది తెల్లమద్ది, నల్లమద్ది, కర్పూరపుమద్ది యని త్రివిధభేదములు గలది. మద్దికట్టె దూలములు, వాసములు మొదలగు నింటికలపకు వాడఁబడుఁ గాన విలువఁ గల్గి యున్నది. కర్పూరఁపు మద్దియం దించుక కర్పూరపువాసన గలదుగాన నాపేరయ్యెను. ఇది అడవిచెట్టు. బాటల కిరుప్రక్కల నిటీవల నాటి నీడకై పెంచుట యభ్యాసమయ్యెను.

లా. Terminalia Glabra తెల్లమద్ది, Terminalia Tomentosa నల్లమద్ది, Beetaptera Arjuna మద్దిసామాన్యము. కొందరీపదమును కర్పూరపుమద్దికి వాడి యది శ్రేష్ఠజాతియనిరి. కలప యుపయోగదృష్టిచే నల్లమద్దిని శ్రేష్ఠమందురు.

సం. అర్జునః (మద్దిసామాన్యము లేక కర్పూరపుమద్ది), ధవళః, నదీసర్జః; ఈ రెండుపదములును తెల్లమద్దికి వర్తించును. ఇంద్రద్రుః, ఇంద్రద్రుమః, ఇంద్రనుతః, (నల్లమద్ది).

తెల్లమద్దిచెట్టు- దీని రస, కషాయ, చూర్ణములు చలువ, మేహశాంతి జేసి జ్వరము, నోటిపూత, పలుగురుపు, వ్రణములు, విదాహము, హృద్రోగముల నడంచుననియు, నాకులరసము చెవిలోఁబోసిన కర్ణరోగములును, పైనిపూసిన నానువాతపునొప్పులు, గాయములు మానును. ఆకులభస్మము మొండికురుపుల మాన్పును. కాయలందు స్త్రీల ఋతురక్తమును జక్కఁగ వెడలించి శరీరమలముల వెడలించును. చెక్క గాల్చి చేసినభస్మము తాంబూలమునందు సున్నమునకుబదులుగ వాడినచో కఫగుల్మములు హరించునందురు. నల్లమద్దియం దీగుణమును, వ్రణముల నార్చెడి గుణమును గలదనియు, శైత్యదోషము నడంచుననియు, కర్పూరఁపు మద్దికాయలకూర వాతదోషమును హరించి కఫము నివారించి అగ్నిదీప్తిఁ గల్గించుననియుఁ జెప్పఁబడినది.

ఈజాతి పేరువహించిన ఓషధి. వేరుమద్ది యనఁబడు చిన్నజాతిచెట్టొకటి కలదు. దాని చెక్క లేక నాకుల రస కషాయములు, వ్రణములను మానఁజేయుననియు, గుల్మ, పాండువు, తాపము, వాతరోగములు, శూలల నివారించుననియుఁ జెప్పఁబడినది.

**మద్రగారి గోత్రము**— (హారిత యుపగణము చూడుఁడు).

**మద్రణగోత్రము**-(ఆత్రేయగణము చూ.)

**మద్రణగోత్రము**-(విష్ణువృద్ధఉపగణము చూడుఁడు).

**మద్ర దేశము (తక్కదేశము)** — మద్రను బాహ్లికదేశమని పెక్కండ్రు తలంచిరి.

గాని మహాభారత కర్ణపర్వము ౪౪ యందు బాహ్లికము మద్రదేశమందలి యొకభాగ మని చెప్పఁబడియుంట యోచింపఁదగినది. హేమ చంద్రుని "అభిధానచింతామణి" యనుగ్రంథ మున తక్కదేశమనిగూడ పేరు చెప్పఁబడినది రావి, యిరావతీ నదుల మధ్యదేశమని తేలు చున్నది. పెషావరున కీశాన్యదిశగా నుండును. ఇప్పుడు 'మర్దన్‌జిల్లా' యనియు, 'హోతీ మర్దన్'అనియు, 'ఆలీమ ద్రా' యనియు పిలువఁ బడుభాగము. స్వదేశీయు లగు పఠానులచే యూసుఫ్‌జాయి దేశమని చెప్పఁబడు దేశము. ఇం దిక్కాలమునఁ బెక్కు గ్రీకోబాక్ట్రియను నాణెవాళ్ళు గలవు. బౌద్ధకట్టడముల పాడలును గలవు. బ్రహ్మాండ పురాణము ౪౯ యందు ప్రశంసింపఁబడినది.

మహాభారత ముద్యోగమం దుందు శల్యుఁడు మాద్రీదేవి సోదరుఁడగు మద్రదేశాధీశుఁడుగఁ జెప్పఁబడినది. మత్స్యపురాణము ౨౦౮-౫౯ యందునను, మహాభారతము వనపర్వము ౨౦౨ యందునను, సత్యవంతునిభార్యయు, పతివ్రత యు నగు సావిత్రితండ్రి యశ్వపతి మహారా జీమద్రదేశాధీశుఁడేనని కలదు. రాజధాని శకల పురము. (బాహీక, బాహ్లికదేశములు చూ). శకలపురము చూడుఁడు). ఎనమండ్రు యవన భూపతులు ౮౨ సం॥లు దీనిఁ బాలించిరఁట.

**మద్రుఁడు**-అత్రిసంతతి. చంద్రవంశము. తండ్రి శిబిచక్రవర్తి. ఈతనినుండి ఈతఁడేలిన దేశమునకు మద్రదేశమని పేరయ్యెను.

సోదరులు వృషదర్భుఁడు, సువీరుఁడు, కేక యుఁడు.

**మద్రేక్షక్షత్రియులు**— (చౌహానులు చూడుఁడు.)

**మదోకిగోత్రము** — (వీతహవ్య లేక యాస్కగణము చూడుఁడు.)

**మద్వానీశాఖక్షత్రియులు**-(చాళుక్య శాఖ క్షత్రియులు చూడుఁడు.)

**మదనకులగోత్రము**— ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్య గోత్ర ములు చూడుఁడు.)

మధనకుల (మధునకుల, మిధునకుల) గో త్రము. ద్వ్యాముష్యాయణగోత్రము. మిత్రగణము. సంస్కృతనామము మైత్రేయస, లేక మిత్రయు వస. ఆపస్తంబయజుశ్శాఖ. ప్రమాణగ్రంథము లాశ్వలాయన, మాత్స్యసూత్రములు. నాగేశుడు దేవత. నాగాంబభార్య. కైలాసము తపస్థానము. నాగామృబ్ధి తీర్థస్థానము. జపము గాయత్రి. దీప ములు 30 క్షేత్రములు ౨౬. గజము,ఘటములు దానము. జిల్లేడు, మొగలి,కొఱ్ఱచాప, బెత్తము వర్జనీయములు.

**మధియమా స్కార్వినస్ లైబ్రరీ**-(హాం గేరీ దేశము చూడుఁడు.)

**మధుఁడు**— ఈపేరుగలవారు పెక్కండ్రు గలరు.

శ్రీకృష్ణునిచే నిహతుఁడైన మధుఁ (కైటభు లలోని)డను రాక్షసుఁ డొకఁడు మధుఁడు.

శ్రీరాముని సుతుఁడగు కుశుని సంతతిలోని సూర్యవంశక్షత్రియుఁ డొకమధుఁడు గలఁడు. ఈతఁడు కలాపగ్రామమున యోగనిష్ఠతో నుం డువాఁడు. ఈతఁడు మున్ముందు సూర్యవంశప్ర తిష్ఠ నుద్ధరించువాఁడని చెప్పఁబడినది.

రావణుని బావమఱఁది యొక రాక్షసుఁడు మధుఁడు. ఈతనినుతుఁడు లవణాసురుఁడు వైఢూర్యపర్వతమున నశ్వినీదేవతలు సోమపా నమొనర్చుతరి చ్యవనునిచే పుట్టింపబడిన రాక్ష సుఁడొకఁడు మధుఁడు. (ఇన్ద్రవైరి). ఈతఁడు మద్యస్త్రీమృగయాక్షముల నాశ్రయించి యుం డునటుల చ్యవనునిచే నిర్మింపఁబడినవాఁడు.

కార్తవీర్యార్జునునినాల్గవసుతుడొకమధుడు. (యదుసంతతి చంద్రవంశ క్షత్రియుఁడు).

దేవక్షత్రుని సుతుఁడొకమధుఁడు. ఈతఁడు యదుసంతతిచంద్రవంశక్షత్రియుఁడు.

**మధురత్రయము**-ఆయుర్వేద వైద్య శాస్త్రమున ౧ తేనె, ౨ శర్కర, ౩ నెయ్యి. వీనికి మధురత్రయము లేక త్రిమధురము లనిపేరు.

**మధుపురి**—వ్రజమండలములోని మధుర సమీపమున నైదుమైళ్ళదూరమునఁ దొల్లిఁట మధుఁడను రాక్షసుని పురఁపుపాడు గానవగును. ఇట నిప్పుడు మహోలీ యను పేరుగల గ్రామము గలదు. మరియు నీప్రాంతముననే వ్రజమండలవనములలోని మధువన ముండెడిది. ఈమధునామము లన్నియు మధురాక్షస సంబంధములే!

మధుసుతుఁడగు లవణాసురుని శ్రీరాముని కనిష్ఠసోదరుఁడగు శత్రుఘ్నుఁడు వధించినటుల జెప్పఁబడినది

**మధుమంతము**— ఇక్ష్వాకుమహారాజు కడపటి కుమారుఁడగు దండకుని రాజధానీ పురము. (దండకారణ్యము చూడుఁడు.)

**మధుమంతవనము**-(దండకారణ్యము చూడుఁడు.)

**మధుమతీనది**—ఇప్పుడు 'మోహ్వార్' అనియు 'మోధ్వార్' అనియు ననుచున్నారు. 'రనోద్' అనుతావునజనించి సింధునదిలో సంగమించునది. 'మాల్వా'లోని సోనారి యనఁబడు తావునకెగువగ నెనిమిదిమైళ్ళదూరమున సింధు నదియందిది సంగమించుతావును గాంచనగును.

మాలతీమాధవనాటకమున నవమాంకమున దీనిప్రశంసకలదు.

**మధుమేహము** — ఇది బహుమూత్ర భేదములలో నొకటి. మూత్రమున దీయని (పంచదార)పదార్థ మధికమై చిక్కనమై వెడలు జబ్బు. మూత్రము విడిచిన తావున చీమలు పట్టుచుండెడిని.

**మధుర (దక్షిణమధుర)** తొలింటి కాలమునఁ బాండ్యరాజ్యము దేశమున బేర్వడ నిదినములం దిప్పుడు 'వైగై నది' పారుచుండిన ప్రదేశమున మధురయుండిన ప్రదేశ పరిసర వృక్షము లొక అరణ్యమనంబడుచు నందు కదంబవృక్షములు మెండగుట గదంబవనమని పేరంది యుండునటులను, నందొకచో "మీనాక్షమ్మాణి" యనఁబడిన యొక వనదేవత యొక కదంబవృక్షముచాటున నుండుటయు, నాప్రక్కగనే యచటి ద్రవిడులచే "చొక్కనాతన్" అనఁబడిన యొక శివలింగ ముండుటయు పరిలీలనదృష్టికి మనస్సునకు తోపకపోదు. ఈ మధురాపట్టణము కట్టకపూర్వ మీమీనాక్షీ శక్తి యరణ్యమునఁ ద్రవిడులచే మహాభక్తితో పూజింపఁబడిన దేవతయని గొప్పబలముగల నమ్మిక మరవలయందు గలదు.

రానురాను పాండ్యరాజ్యమేర్పడి భూపతులచే బెక్కు సీవు లీదేవస్థానమునకు లభించినవి. దేవాలయమును గొంతబాగుగనే నిర్మింపఁబడినది. నేటికిని తొలింటి కదంబవనముండిననాటి చెట్లలోని చెట్టుగా నొక యెండిపోయిన మ్రానును దేవాలయావరణమున చూపుచుందురు. ఆదికాలమున గదంబవనవాసినియైన మీనాక్షీదేవి నేటి కావనముఁ బోగొట్టుకొనినను, మహాసౌధముఁ బోలిన దేవాలయ నివాసినియై భక్తి గౌరవములకు గురియగుచు పూజలందుచునే యున్నది.

తొల్లింటి పాండ్యభూపతులచే నిర్మింపఁబడిన ప్రాత దేవాలయమునందు గర్భాలయము తప్ప తక్కిన పైభాగములు ప్రహారీగోడలను, ఢిల్లీ

ప్రభువగు నల్లాఉద్దీన్ యొక్క సైన్యాధిపతి యగు మాలిక్కాఫర్ భగ్నపర్చి తనధర్మమును నెరవేర్చుకొనెననియు నిప్పటికట్టడములు తర్వాత నిర్మించిన వనియు నందురు.

ఇప్పటి దేవాలయము చాల పెద్ద దేవాలయములలో నొకటి. కడు ధనవంతమైనది. ఎక్కువనగలు, వెండిబంగారు వాహనములు గలది. నాల్గు ప్రాకారములు గలవు. మొత్తమున దేవాలయావరణము ౮౩౦ అంగుళపొడవును, ౭౩౦ అంగుళ వెడల్పును గల్గి మధురా పట్టణమునకు మధ్యగ నమరియున్నది. ముఖమంటపము లన్నియు బజారులుగ నుపయోగపడుట దేవాలయమునకు చాల నద్దెలు వచ్చుచుండును. దేవాలయంపుఁబ్రధానబహిర్ద్వారములునాల్గింటిపైగల గోపురములు చాల పెద్దవి. మిగుల పనితనము గలవి. అందు దక్షిణపువైపు గోపురము మఱియు నెక్కువ యెత్తైనది.

ఉత్తరపుగోపురమునందుగల రాతిస్తంభము లిఱువదిరెండును గలసి యైదు స్తంభముల కుదురులుగ నుండుట విచిత్రముగ నుండును. అందన్నియు రాతిధ్వనిఁ గాక కంచుధ్వనిఁ గలిగి యుండును. ఈదేవాలయమునఁ జూడఁదగిన వస్తుశక్తిమంటపము గణేశుఁడు,(ఇది చాల పెద్ద విగ్రహము.) శివగంగసంస్థానమువారి వెయ్యి దీపముల ద్వారము, ముదలి మంటపము, సహస్రస్తంభమంటపము, పొత్తామరైసరస్సు, రాణీమంగమ్మగారి దేవస్థానము,; చిలుకలమంటపము, మంటపనాయకము, సంగత్తార్ దేవళము, కల్యాణమంటపము, (ఇది క్రీ.శ. ౧౬వ శతాబ్ద మధ్యకాలమున ప్రభువైన విశ్వనాథ నాయకునికడ మంత్రిగనున్న ఆర్యనాథుఁడు నిర్మించెనఁట. ఇందు ౯౮౫ స్తంభములు మాత్రమే కలవు) పుదుమంటపము, మొదలగునవి కొన్ని గలవు.

మధురయందుఁ దింకనుఁ జూడఁదగినవి తెప్పాకులంసరస్సు, పాళయంకోట జమీందారుగారి యావరణమునఁ గల పెద్దమఱ్ఱిచెట్టు, తిరుమల నాయకుని రాజనివాస భవనము, తమకము, (ఇదియిప్పటికలెక్టరుగారి నివాసము) మొదలగునవి కొన్ని కలవు.

**మధురజిల్లా** — అరవదేశములోనిది. చెన్నపురిరాజధానిలోఁ జేరినది. వైఘా(విఘనస) నదీతీరమందున్న దక్షిణమధురాపట్టణము జిల్లాయందుఁ బ్రధాననగరము. ఇది తొల్లింటి పాండ్యదేశములోనిది. ఒకప్పుడు మధురరాజ్యమేలిన యాంధ్రనాయకప్రభువులకు రాజధానిగ నుండినది. ఇచ్చటి దేవస్థానములు సుప్రసిద్ధములు. చాల ధనవంతములు. డిండిగలు గొప్ప వర్తకస్థానము. మానమధురా, షోలవందాన్, శివగంగా, (గొప్పజమీందారీస్థానము.) అమ్మయనాయకనూరును నితరపట్టణములు.

**మధుర (ద్వీపము)**—హిందూమహాసముద్రమున డచ్చి ఈస్టుఇండీ సనఁబడుచున్న ద్వీపములందొకటి. ౧౭౭౦ చతురపుమైళ్ళవైశాల్యము. ఇందుఁ గొన్ని వేడినీళ్లయూట లున్నవి. జనాభా ౧౬,౩౦,౦౦౦. వీరిప్రధానవృత్తి పశువులఁ బెంచుటయు, చేపలఁబట్టుటయు నైయున్నది. ఇంచుక వ్యవసాయముఁ గలదు.

**మధురరాజ్యము-దక్షిణ మధురరాజ్యము పాండ్యదేశ ము**—ఇది తొల్లింటి పాండ్యరాజ్యము. రాజధానియు దక్షిణమధురాపురమే. కృతమలానదీతీరము. ఈనదినిప్పుడు 'వైగై' యనుచున్నారు. చైతన్యచరితామృతమున నిట్లే చెప్పఁబడినది. మధురకు తొల్లిటి పేరు హాలాస్యక్షేత్రము.

పాండ్యదేశమంతరించి విజయనగర సామ్రాజ్యమున గలసిపోయి యుండెను. దానికాలమున

విజయనగరరాజులు బలహీనులై యుండుతరి నక్కాలమున విశ్వనాథనాయకుఁ డను పేరుగల యాంధ్రుఁడగు సామంతభూపతి స్వతంత్రత వహించి మధురారాజ్యము స్థాపించెను. ఆయన శిలావిగ్రహము రామేశ్వరఁపు దేవస్థానమున నందీశ్వరునికడ నున్నది.

పిదప క్రీ. వె. ౧౬౨౩-౧౬౫౯ వరకు రాజ్యమేలిన తిరుమలనాయకుఁడు మిగులబలాఢ్యుఁడు. ఈతనికాలమున రాజ్యము వృద్ధియయ్యెను. క్రీ.వె. ౧౫౫౦ సంవత్సరమున 'ఆర్య నాయకుఁ'డనుభూపతి మీనాక్షి దేవస్థానఁపు సహస్రస్తంభమంటపము నిర్మించినటుల శిలాశాసనములందు బయల్పడినది.

**మధురావహగోత్రము**- దీనినే మధుర గోత్ర మనియెదరు. (గర్గఉపగణము చూడుఁడు.)

**మధువనము (మధుబన్)** — ఇది జైనుల యాత్రాస్థలము. ఇట దిగంబర జైనులకు శ్వేతాంబర జైనులకు వేర్వేరు దేవళములు, యాత్రికులనివాసభవనములు గలవు. ఈస్టిండియన్ రయిల్వే గ్రాండు కార్డులైనుపై నున్న "ఇసిరి" స్టేషనుసమీపమున పరేశనాథ మనఁబడు జైనయాత్రాస్థలమునకు మార్గమునం దున్నది. కలకత్తానుండి ౨౦౧ మైళ్ళదూరము. మధుబన్ పర్వతపాదమునం దున్నది.

కురుక్షేత్రవనముల నొక మధువనము గలదు.

**మధువు** — అత్రి, చన్ద్రి యాదవకుత్రియుఁడు. తండ్రి యనూరథుఁడు. సోదరు లంశుఁడు, పురుహోత్రుఁడు నను నిర్వురు.

మఱియు మధు వనఁబడు వనములలో వ్రజ మండలమున నొకమధువన ముండెను. ఇందు ధ్రువుఁడాశ్రమ మేర్పరచుకొని తపంబొనర్చెనట.

వేరొక మధువనము గిష్కింధకు సమీపమునను డెనఁట. అది సుగ్రీవునివనమని చెప్పఁబడినది. ఇక్కాలమున మైసూరుపురమున నొక మధువనము గలదు. ఇది నవీనము.

**మధుశ్ఛందుఁడు** — విశ్వామిత్రుని సుతుఁడు.

**మధుసూదనవ్యూహము**— రామానుజీయ వైష్ణవ, చైతన్య వైష్ణవ, మతధర్మములందుఁ ద్వాదశాత్మ రూప మహావిష్ణువు. అందు ద్వితీయ చతుర్వ్యూహములలో నొకటి యనియు, సంకర్షణవ్యూహము లైదింటిలో నొక యుపవ్యూహ మనియు, వైభవవిలాసమూర్తి యనియు, వరుసగ చక్ర, శంఖ, పద్మ, గదలాయుధములనియు జెప్పఁబడినది.



(విష్ణుదేవాలయ విగ్రహములు చూడుఁడు.)

**మధూపగోత్రము**- (హరితయుపగణము చూడుఁడు.)

**మధ్య అమెరికా (Central America)** ఇది యెక్కువ వెడలుపులేని పేటివంటి భూప్రదేశము. మెక్సికో దేశమునకును పెనామా దేశమునకును నడుమనున్నది. పొడవునను మిట్టలవలెనున్న మెరకప్రదేశములు, పీఠభూములు, మయమైయున్నది. ఇందు 'నికారగువా' యించుక మైదానముగ నగుపడును. ఇందున్న పర్వతములలో పెక్కు లగ్నిపర్వతములు. భూకంపము లప్పుటప్పుట గల్గుచుంటయే కాక గొప్ప నాశనమునుగూడ గల్గించుచుండును. ఇట్లే Old Guatemala పట్టణము రెండుసారులు నాశనమొనర్పఁబడి యున్నది.

క్రీ. వె. ౧౮౨౮ వరకు మధ్యయమెరికా

స్పానియా దేశరక్షితమై యుండెను. పిదప విడుదల నొందెను. ఇది యిక్కాలమున నైదు ప్రజాపరిపాలనాప్రభుత్వములై యున్నది.

'నికారగువా సరస్సు'నుండి ప్రవహించు San Juan నదియును చెక్కు లితరప్రవాహములును దేశమునజలాశయములు. దేశమందలి పల్లపుప్రదేశము లనారోగ్యప్రదేశములు. దేశమందంతటను వెండిగనులు గలవు. అడవులయందు 'మహాగనీ'కఱ్ఱ, 'లాగ్వుడ్' అనంబడు కఱ్ఱ 'కోచినాల్'అనంబడుకఱ్ఱ కలపయు దొరకును. కాఫీ, నీలిమందు, అరఁటిపండ్లు, నరటిపండ్లు బైరు చేయఁ బడుచున్నవి. మెక్సికో దేశస్థుల జాతులవారే మధ్యయమెరికాయందును వసించుచున్నారు. (మెక్సికో దేశము చూడుఁడు.) ౧. గ్వాటెమాలా (Guatemala republic 48290 Sq. miles). ౨. నికారాగువా (Nicaragua republic 49200 Sq.miles). ౩. సాల్వాడోర్ (Salvador republic 7255 Sq.miles). ౪. హొండూరాస్ (Honduras republic 47250 Sq.miles). ౫. కోస్టారికా (Costa Rica republic 23000 Sq. miles) వైశాల్యములఁ గల్గిన యైదు ప్రజాపరిపాలన లిందుఁ గలవు. ఇదిగాక బ్రిటీషు హొండూరాస్ సీమయుఁ గలదు.

**మధ్యఆసియా**— (తురుష్క స్థానము చూడుఁడు).

**మధ్యకాలపుఁబ్రపంచమందలి ఏడు వింతలు** (Seven wonders of the world middle ages) — ౧. రోమకపురియందలి కొలీసియమ్. ఇటలీదేశములోనిది. ఇది చాల గొప్పకట్టడము. ప్రదర్శనములకై నిర్మింపఁబడినది. ఇందు జనులు కూర్చుండుటకుఁ దావు కలదు. ఇప్పుడు పాడగుచున్నది.

౨. అలగ్జాండ్రియాపురమందలి Catacomb గుహలు. ఇవి వింతవని గల్గియుండును. ఈజిప్టు దేశములోనే యాపురమున్నది.

౩. చైనా దేశపు గొప్ప కోటగోడ. దీనిఁ గూర్చి ప్రత్యేకముగ వివరింపఁబడినది. పొడవు ౧౫౦౦ మైళ్ళు, మడతలు ౧౦౦౦ మైళ్ళు, ౨౫౦౦౦ కావలి గోపురములు గలది. (చీనా దేశపు గొప్పగోడ చూడుఁడు.)

౪. స్టోన్హెంజి— ఇది ఇంగ్లండు దేశమునందున్నది. దీని పూర్వోత్తరము లెవ్వరికిఁ దెలియవుగాని ఇది డ్రూయిడ్స్ట్రియను మత దేవస్థానముగనుండెనిదేమోయనితలంచుచున్నారు. చాల గొప్పగొప్ప రాతిపలక లీగోడలందెత్తఁ బడినవి.

౫. పైజానగరపు టొరగిన గోపురము— ఇటలీదేశములోనిది. ఇది ప్రత్యేకముగ వివరింపబడియున్నది (చూడుఁడు.)

౬. నాన్కిన్ పట్టణమునందలి పోర్సిలెయిన్ (Porcelain) గోపురము— ఇది చీనాదేశములోనిది. ప్రత్యేకముగ వివరింపఁబడినది.

౭. సెంటుసోఫియా మశీదు— ఇది టర్కీదేశములోని స్తంబూల్ నగరమునగల గొప్ప భవనము. తొలుత రోమనులకాలమున కాన్స్టాంటునోపిలు (Constantnople) నగరమున రోమనుల దేవస్థానమున నిర్మింపఁబడి,మహమ్మదీయ్యాక్రా నమొ మశీదుగ మార్చఁబడినది. ఇందు వింత లనేకములు గలవు.

**మధ్యకాళింగము**-(కళింగదేశముచూ.)

**మధ్య తురుష్క స్థానము** (Central Turkistan)- ఆసియా ఖండమున తురుష్కస్థానదేశములోని భాగదేశము. దీనికిని తూర్పు తురుష్కస్థానమునకును నడుమ పామీర్ పీఠభూమి కలదు. అది ౧౪౩౦౦ అడుగుల యెత్తు

గలది. దానియందే సిరిఖూల్ సరస్సు కలదు. అందే ఆముడారియా (ఆక్సను) నది జన్మస్థానము గలదు. తొల్లి యిది తూర్పున ఖోఖాన్ ఖనాత్తనియు, మధ్యను బోఖారాఖనాత్తనియు, పశ్చిమమున ఖీవాఖనాత్తనియు, మూడు భాగములుగ నుండెను. ఒకఖాన్నృపతి పరిపాలించు దేశమునకు ఖనాత్తని పేరు. రష్యా దేశము ఖోఖానంతయును బోఖారా ఖీవాఖనాత్తులలోని భాగముల నాక్రమించికలుపుకొని తన రష్యా టర్కీస్థానునకుఁ జేర్చుకొనెను. మిగిలిన ఖానులిద్దరును వారికి లోబడి యున్నారు. ప్రజలు, మహమ్మదీయులు. 'టర్కోమను' తెగ, 'ఉజ్బెకు' తెగ 'కిర్ఘిజు' తెగలకుఁ జెందినవారు.

బోఖారాపురము ట్రాన్సుకాస్పియన్ రైల్వేనంటియున్న పురము. ఇందనేకమహమ్మదీయ మత పాఠశాలలు గలవు. గొప్పవర్తకస్థలము. అరాల్సముద్రతీరమందున్న ఖైవాపుర మొకప్పుడు స్లేవుమార్కెట్టు (బానిసలవర్తకము) నకుజెందిన పురము. బొఖారాఖానుగారిని, చుట్టుపట్ల మహమ్మదీయమతస్థులగు భూపతులు మతాధిపతిగా నెంచుచున్నారు. (ఆముడారియానది చూడుఁడు)

**మధ్యదీపికాన్యాయము—** చుట్టుపట్లకంతకు వెల్గిచ్చునటుల మధ్యగ దీపముంచినటుల చేసినపనిని దెల్పుట కీన్యాయము వర్తించెడిని.

**మధ్యదేశము-** మనుసంహిత ౨-౨౧ యందుత్తరమున హిమాలయ సరస్వతీనదుల నుండి దక్షిణమున వింధ్యనగమువరకుఁ గల దేశమనియు, గరుడపురాణ ౧-౫౫ యందు పాంచాల, కురు, మత్స్య, యౌధేయ, పాటచ్చర, కున్తిశూరశేనలుగల దేశ మనియుఁ జెప్పఁబడినది. Max Muller పరిశోధకుఁడు బ్రహ్మర్షి బ్రహ్మావర్తదేశము లిందులోని వని వ్రాసియున్నాఁడు. అంతర్వేద మిందే చేరి యుండెను. ప్రారంభకాలమున కాంపిల్యపురము తూర్పుకొనయం దుండెనఁట.

బౌద్ధగ్రన్థములందు మఝ్ఝిమ దేశమని పేర్కొనఁబడినది. మహావగ్గము ౫-౧౨-౧౩ యందు తూర్పున కజంగలపురము మహాశాల, యాగ్నేయమున సలావతీనది, దక్షిణమున సెతకన్నిక, పశ్చిమమున తునాపురపరిసరసీమలు, నుత్తరమున నుశీరధ్వజపర్వతము నెల్లలుగఁ జెప్పినది.

**మధ్యమమణి న్యాయము—** దీనిని నాయకమణిన్యాయమనియు నందురు.

మధ్య నొకపెద్ద రత్నము నుంచి చుట్టును చిన్నమణులుంచి చేసిన నగయందు నాయకమణియగు మధ్యమమణి తక్కినరత్నములకు శోభ దెచ్చును.

ప్రజానాయకులఁ గూర్చిన న్యాయము.

**మాధ్యమికదేశము-** మహాభారతము, సభాపర్వము ౩౨ యందు మాధ్యమిక శిబిదేశములు గల్పి ప్రశంసింపఁ బడియు వేర్వేరు దేశములుగఁ జెప్పఁబడినవి గాన శిబిదేశ మీప్రాంతముననే యుండియుండవలెను. కాని బాబూ నందులాల్ డే పరిశోధకుఁడీ రెండు దేశములొకటియెయని యభిప్రాయ మిచ్చియున్నాఁడు. దీనికి నగరిపురము రాజధానియఁట గాన రాజపుత్రస్థానమందలి చిత్తూరునకు సమీపమునఁ గల నగరిపురప్రాంతదేశమై యుండవలెనని పోల్చియున్నారు.

మహాకవి కాళిదాసు, తనమాళవికాగ్నిమిత్ర నాటకమునఁ బంచమాంకమున విదిశాదేశపు రాజప్రతినిధిగఁ జెప్పఁబడిన యగ్నిమిత్రుని కుమారుఁడగు వసుమిత్రుఁడు, నగరిపురముపై దండెత్తివచ్చిన మిళిందు (మేనందేరు నృపుని) నోడించినటులఁ జెప్పియున్నాఁడు. ఈసందర్భమున నగ్నిమిత్రుఁడు శుంగవంశపురాజనియుఁ

దండ్రిపేరు పుష్యమిత్రుఁడనియుఁ జెప్పుదురు.

**మధ్యమేయగోత్రము** — (వీతహవ్య లేక యాస్క-గణము చూడుఁడు).

**మధ్యరాష్ట్రములు** (Central Provinces)— ఇండియా దేశమున నడుమగ నుంట నీపే రిడియుందురు. తొల్లింటి చేదిదేశమును గొన్ని ఇతర భాగములును చేరినదైనరాష్ట్రము. దీని నాంగ్లమున సెంట్రల్ ప్రావిన్సెస్సు అనియు, ఆంగ్లవిద్యా విశారదులు సి.పి. అనియుఁ గూడ వాడుచునే యున్నారు ఇప్పుడిది యన్ని వైపులను స్వదేశసంస్థానములచేఁ జుట్టుకొనఁబడియున్నది. ఇందు స్వదేశసంస్థానము లధికముగఁ గలవు. అన్నియుఁ గల్పి వైశాల్యము ౧౬౦౦౦ చతురపుమైళ్ళుండునని తలపఁబడుచున్నది.

సాత్పురా (సప్తపుర) పర్వతములు మధ్యరాష్ట్రములను సమమగు రెండు భాగములుగ విభజించుచున్న ట్లున్నవి. ఉత్తరమున వింధ్యాద్రియు, దానికిక్రిందుగ నర్మదానది ప్రవహించు లోయయుఁ గలవు. సాత్పురపర్వతములకు దిగువ దక్షిణమున సమప్రదేశమున గోదావరి యుపనదులగువరద,వేనగంగ(ఇప్పటి వెయిన్ గంగ) కలసి ప్రాణహితయను పేరఁబరగుచు, పోలము లఁదడిపి గోదావరీనదియందు సంగమించును. సాత్పుర పర్వతపంక్తికే వేర్వేరు తావులందు వేర్వేరునామముల వాడుకగలదు. జబ్బల్పూరునకు దక్షిణమున వీటిని పాబ్మరి కనుమలని యందురు. మఱియొకతావున మహాదేవ పర్వతములందురు. దీనిశాఖకే రీవాసంస్థానమునందలి మేఖలపర్వతమని యందురు. ఇటనే యమరకటకక్షేత్రము గలదు. ఛత్తీస్‌ఘడ్ పీఠభూమి (3౬ కోట్ల రాజ్యము) తూర్పుభాగమునందుఁ గలదు. ఈసీమయందు మహానది ప్రవహించుచున్నది. నగటునచాలభాగమడవులు కొండలుగను,భూములు సారవంతములుగను గలదేశము. వర్షము లధికముగ గురియుఁగాన భూములు పండుటలో లోప ముండదు. వరి ముఖ్యముగఁ బైరగుచున్నది.

మధ్యరాష్ట్రమునం దనేకతావుల రాతిస బొగ్గుగనులు గలవు. వరదానదిలోవ ప్రత్తిపంటకు పేరందిన ప్రదేశము. కెయిన్గంగ ప్రవహించు సమతలప్రదేశమంతయు 'మధ్యరాష్ట్రములవరిపోల' మనఁబడుచున్నది. ఛత్తీస్‌ఘడు నందు గోధుమపంట మితిమీరి పండుచున్నది. ప్రజలందించుమించు యిరువదిలక్షలు గోండు జాతులవారు. హిందీ ప్రధానమైనభాష. మహారాష్ట్రులు మహారాష్ట్ర [illegible]ం,నోఘ్రలోధ్రిమును మాట్లాడుచుందురు.

నాగరుజిల్లా, నర్మదజిల్లాయును, క్రీ. వె ౧౮౧౮ లో బ్రిటీషుప్రభుత్వమునకుఁ గలసినవి. ౧౮౫3లో నాగపూరు కలసినది. ౧౮౬౧ లో మధ్యరాష్ట్రములఁగల్పి యొకరాష్ట్రముగఁ జేయఁబడినది. ఇందు నాలుకమీషనరుడివిజనులు గలవు. ఉత్తరమున జబ్బల్పూరు డివిజను, తూర్పున ఛత్తీస్ఘడుడివిజను, దక్షిణమున నాగపూరుడివిజను, పశ్చిమమున నర్మదాడివిజనును, గలసి పందొమ్మిదిజిల్లాలుగ విభజింపంబడియున్నది గోండుజాతులు గోండ్వానా నాక్రమించినవారు. వారికి భాషకలదు గాని లిపి లేదందురు. హిందీభాషను మాట్లాడుచున్నారు. మహమ్మదీయులు మధ్యరాష్ట్రములందు చాల తక్కువగా నున్నారు.

నాగపూరు నగరము మధ్యరాష్ట్రములకు ప్రధానస్థలము. నాగనదీతీరము. ఒకప్పుడు దీనినాక్రమించియేలిన మహారాష్ట్రభూపతులకు రాజధానిగ నుండినది. వారు నివసించిన భవన

ములుగల దుర్గము సీతాబల్దికొండపై నిర్మింపఁబడినది కలదు. దీనిసైన్యస్థానము తొమ్మిదిమైళ్ళ దూరముననున్న కేంప్టీపురమునఁగలదు. రామటెక్కము (రామ్టేక్కు)పురము పుణ్యక్షేత్రము.

హింగన్ఘాటిపురము ప్రత్తివర్తకము విశేషముగ జరుగుతావు. వరోడాపురము రాతిసబొగ్గుగనుల దగ్గరనున్న పురము. చాందాపురమొకప్పుడు గోండుప్రభువుల రాజధానిగ నుండెను. అది గోండ్వాలో ప్రధానపట్టణమైయున్నది.

జబ్బల్పూరు (తొల్లిఁటి జాబాలిపురము) గొప్పవర్తకస్థానముగను సైన్యస్థానముగనున్న పురము. ఇచట తొల్లిజాబాలిఋషి యాశ్రమముఁగల్గియుండిన పవిత్రస్థలి. నర్మదానదియం దిటకారుమైళ్ళదూరమున గ్వారియాఘాటను (తొల్లింటిగౌరీఘట్టము) స్నానతీర్థ మున్నది. ఒకనదిస్సుతీరముననున్న సాగర్పురము సైన్యనిలయమైయున్నది. రాయిపూరు గొప్పవర్తకస్థలము.

ఇంకను చింద్వాడాపట్టణము, హోషింగాబాదుపురము, బెతూల్పురము, తపతీనదీతీరమునందలి బుర్హాన్పూరు(పురము) (ఇదియొకప్పుడు మహమ్మదీయులరాజధాని) (ఇట అశీర్ఘుఁడు (దుర్గము) సుప్రసిద్ధము. ఖాండ్వాపట్టణము, (ఇటసుప్రసిద్ధమగు తులజాభవానీ దేవీక్షేత్రము గలదు.) బిలాస్పూరు, సాంబల్పూరు, అనునవి యితరప్రసిద్ధపట్టణములు. రాయపూరు గొప్ప రెయిల్వేసంధిస్థలమై యున్నది. సాంబల్పూరు రత్నములకును, పొత్తిపంచలనేతకును, టూసా సిల్కుబట్టనేతకును పేరందినస్థలము.

**మధ్యలయ**— (లయప్రాణము చూ.)

**మధ్యార్జునక్షేత్రము**- దక్షిణదేశమున తంజావూరు మండలమునందు కుంభకోణపట్టణమునుండి యిరువదియారు మైళ్ళదూరమున తిరువడమరుదూ రనఁబడిన శివక్షేత్రము కలదు. దానిని మధ్యార్జున మనియెదరు. ఇట మహాలింగస్వామి యనుపేరుగల శివలింగముగలదు. ఇంక నీయూరనే శూద్రకులజుల మఠాధిపతియగు నొకస్వామి కలడు. ఆయన పూర్వాశ్రమమున శూద్రుఁడయ్యు శైవుండఁట. ఈయనకు పెక్కండ్రు శిష్యులును ధనమును గలదందురు.

**మధ్యాష్టమి**—దీనిని రుద్రాష్టమియనియు నందురు. భాద్రపద బహుళ యష్టమి. రుద్రాష్టమియనువారు శతరుద్రులం బూజింతురు. (పండుగలు చూడుఁడు.)

**మధ్యేఘటః** — ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి.

ఇది యవాంతరముగా వచ్చిన పితూరీ యనియర్థము.

**మధ్వనవమి**- మార్గశిరశుద్ధనవమి. దీనికి స్మార్తవులగు నద్వైతు లీపేరిడి యుందురు. ఆనందతీర్థస్వామియొక్క పుణ్యదినమును, ద్వైతులగు వైష్ణవులాచరించుదినమునునై యున్నది. (పండుగలు చూడుఁడు.)

**మధ్వమతము**—(ద్వైతవాద మతము చూడుఁడు).

**మననపంచకము** - బౌద్ధమతధర్మమున ౧. శ్రద్ధ, ౨. స్మృతి,(జ్ఞాపకము లేక తలంపుగల్గుట), ౩. వీర్యము (తోడనేగ్రహించుశక్తి, ౪. సమాధి (చక్కగా నొకదానియందు బుద్ధి నిలచుట), ౫. ప్రజ్ఞ (కార్యమొనర్చు నేర్పు) ఇవి మననపంచక మనఁబడును. వీట్లంజక్కఁగ మననమొనర్పుఁడని బుద్ధభగవానుఁడు బోధించెను.

**మనవాళమహాముని**— (రామానుజీయవైష్ణవ సాంప్రదాయపరంపరఁ జూడుఁడు.)

**మనశ్శాస్త్రము** (Psychology)-- ఇది యాంగ్లకల. దీనికిఁ గొన్ని శాస్త్రధర్మములు కొఱఁతవైయుండుటఁ జేసి యీశాస్త్రముఁ జదివినవారియందే యభిప్రాయభేదములు గల్గి, యన లీశాస్త్రమునే యడుగంటఁ జేయ నాయత్తపర్చుటయైనది. వాట్లను తొలుదొల్త నెఱుంగుట సమంజసము. ఇది Mental phenomina విధివిధానముల నెఱింగి వాట్లను నడపువిధానమని యందరంగీకరించెదరు. అనఁగా మనస్సంబంధమగు Sensations, Emotions, Memories, Thoughts, Actions of will మొదలగువాటింగూర్చిన విధివిధానములని భావము. ఇంక నివి యన్నియు నన్యులకుఁ దెలియునవి కావు. కండ్లకగుపడు రంగులతీరు, జిహ్వకుఁ దెలియు రుచులస్థితి, మనస్సునకుఁ దోఁచు సౌందర్యము, మనస్సునంటిన వ్యామోహము, సిగ్గు, క్రోధము మొదలగువాటి నెఱుంగుట యన్యుల కసాధ్యమే యగును. ఒకవేళ వా రన్యులకుఁ దెలుపఁ దలఁచినను సరియగుమాట లేభాషయందైనను కుదురుట దుస్సాధ్యము. ఇట్టిపరిస్థితులు సరిగా నున్నస్థితిఁ దెలియుట కన్యులకుఁ బూర్తిగఁ గాకున్నను గొంతవరకైనను నసాధ్యమైయుండును.

ఇటుల పరిశీలనకు దుస్సాధ్యమగు మనస్థితులంగూర్చి శాస్త్రవివరణము కల్గినలోపములకు పరిహారముల నెఱుంగుట యన హేయముగఁ దోపకపోదు. గాన నీశాస్త్రము నిట్లుంచిపరిశీలనముఁ జేయుటకన్న, దీనిని క్రొత్తవిధానముల నవలంబి యుద్ధరింపదగునని కొందరును, దీనిని వదలక నామనస్థితిని పరిపరివిధములఁ బ్రయత్నించి వీలగునంతవరకుజక్కఁగ నెఱిఁగి కలబాధలకుఁ బరిహారములు వీలగునంత సలుపుటయె సమంజసమని మరికొందరును నభిప్రాయభేదములపాలై యుందురు.

ఇట్లయ్యు నీశాస్త్రజ్ఞు లున్నంతదనుక, తెలిసినంతవరకు, పరిహారముల నారసి వైద్యవిధానచికిత్సలు సలుపుచునేయుంట నడచుచున్నది. వీటింగూర్చిన వైద్యశాలలు గలవు. మనస్సుయొక్కస్థితి, దానికార్యములు త్రివిధము లని విభజింపఁ బడినవి. దీనికి Introspective Psychology అని పేరిడియున్నారు. పరిశీలనలు దీనిధర్మములను బలపరుచుచుంట నిదియే ప్రచారమునందున్నది.

౧. Cognitive కార్యములు, ౨. Affective కార్యములు, ౩. Conative కార్యములు నని త్రివిధములు.

౧. కోగ్నిషన్ కార్యములందు ౧. Sensations అనియు, ౨. Perceptions అనియు, ౩. Images అనియు, ౪. Thoughts లేక Ideas అనియు నాలు గంతర్భేదములు చెప్పఁ బడినవి.

౧ సెన్సేషన్—— దీని నాంధ్రమున స్మారక మనెదరు. ఇది కొన్ని నరములకడలనుండి జనించునని చెప్పఁబడినది. ఆ నరములకడభాగములకు receptors అని శారీరకముగఁ బేరు కలదు. ధ్వని, వెలుతురు, స్పర్శము, శీతోష్ణములు, రుచులు, వాసనలు, తెలుసుకొనుట స్మారకముయొక్క కార్యములు. ఇవి యాంగ్ల శారీరకశాస్త్రమునందు వివరింపఁబడినవి. స్మారకము, బహిర్వ్యాపారముల నెఱుంగుటకు ద్వారముఁ బోలినది. దీనినుండి బహిర్వ్యాపారస్థితుల నెఱుంగుచుందుమని భావము.

౨. పెర్సెప్షను- స్మారకముగ చక్కగ పని చేయుటయనగ నొకచప్పుడు వినఁబడిన దానిని మోటారుబండి వచ్చుచుండు శబ్దమనియు, లేక గుఱ్ఱపురౌతు వచ్చుచున్న శబ్దమనియు, మొదలగువానిఁ బోల్చగల్గుట "పెర్సెప్షన్" అనఁ

బడును. లోపల వ్యాపించియున్న sensation ఇటుల బహిర్గతమగుట పెర్సెప్షననఁబడినది. పుస్తకముఁజూచుచు గట్టిగాచదువుటయు నిట్టిదే యనఁబడినది.మఱియునీపెర్సెప్షనకుబూర్వానుభవము తోడై యుండవలెను. అది లేకున్న బాలుఁడు చప్పుడు విని దానింబోల్చలేనిస్థితివంటిదిగనే యుండును.

౩ ఇమేజి – దీనికి బింబ మనియు, ఆకార మనియు, స్థము. సెన్సేషను, పెర్సెప్షనలు, చక్కగపనిచేసియుండెనేని అభిప్రాయము మనస్సున నాటుకొనును. తరువాత నొకప్పుడది జ్ఞాపకమునకురా నాతొల్లింటిబింబము మనస్సునకు గోచరమై స్ఫురించెడిని. తనకడలేని మిత్రుఁడు జ్ఞాపకమునకురాఁగా నాతనిబింబము మనస్సునకు గోచరమై స్ఫురించుటయు నిట్టిదియె. దీనికి Visual image యనియెదరు. తాను వినియున్న కంఠధ్వని జ్ఞాపకమునకురా మనస్సునకు గోచరించు వాక్కు బింబము 'Auditory image' అనియెదరు. ఆ నదివర కాఘ్రాణించియున్న వాసన జ్ఞాపకముగలిగి మనస్సునకు గోచరించినది 'Alfactory image' అనియెదరు. ఇవియన్నియు నట్టివే యగును.

౪ తలంపులు లేక ఊహలు– మనస్సునకుఁ గల్గిన 'Activity' (ఉద్వృత్తము)అని చెప్పఁబడినది. ఒకసంగతినుండి వేరొకసంగతి స్ఫురించుటయు, జ్ఞాపకము వచ్చుటయు, Imagination, reasoning కూడ నిదేకారణముగగల్గిన కార్యములని చెప్పఁబడినది.

౨ ఎఫెక్టివుకార్యములు–మనస్సునకుఁ గల్గిన సెన్సేషను పెర్సెప్షనులు కారణముగ సంభవించెడి ఫలితములు ఎఫెక్ట్సు అనంబడినవి. ఈశాస్త్రమున నివి ,౧ Physical pain or pleasure, ౨ Feeling tone, ౩ Emotions అని మూఁడుగ విభజింపఁబడియున్నవి.

౧ మొదటిదగు ఫిజికల్ పెయిన్, ప్లెషర్లు, గొప్ప సంకటస్థితికి లోఁబడినవి. ఇవి శరీరమునకుఁ గల్గిన కష్టసుఖములు. వీని నెఱుకపఱచుటకు నరములకడ ప్రదేశములకుం గల్గిన Stimulation యుద్వృత్తమే కారణమని యిటీవల పరిశీలనలుఁజయల్పరిచినవి. అనఁగా నరములకొనలఁదుఁగల్గిన stimulation వలన గలిగిన స్మారకమే నొప్పికి గాని సుఖమునకు గాని కారణమగు నని భావము. ఇంకను పరిశీలన సల్పిన శాస్త్రజ్ఞులు నొప్పిగలిగించుకారణమున కతిసూక్ష్మముగా నున్న లేతదశయే సుఖము లేక నానందము గలిగించుననిచెప్పియున్నారు.

౨ ఫీలింగు టోన్– ఈ శాస్త్రవిదులవలన "The varying current of pleasentness or unpleasentness, which accompanys all experience" అని నిర్వచించియున్నారు. అనఁగా సుఖదుఃఖానుభవస్థితియొక్క ప్రవాహమని భావము.

౩ ఇమోషనులు – అనుభవిత క్లేశానంద జన్యములగు Feelings ను బలవత్తరముగ నొక్కొకతరి సాభినయముగ శరీరావయవములచే ప్రదర్శించుటను 'ఇమోష' ననియెదరు. james Lange అనుపేరుగల సుప్రసిద్ధపరిశీలకుఁడు Emotions are simply strongly toned sensationsఅని వివరించియున్నాఁడు.

ఇవి Physiological activities and movements of the body అని కొందరనిరి గాని పెక్కండ్రు శాస్త్రవిదులు "Well defined emotions of fear and anger contain affective elements not to be accounted for in this way" అనియున్నారు. గాని యిది వివాదమధ్యమున్న విషయముగఁ జెప్పఁదగినది.

3 కోనేషను కార్యములు - ఇవి మనస్సం బంధకార్యములు. అభిమానము, పట్టుదల, వాంఛ, యయిష్టము, నిశ్చితత్వము మొదలగున వీసంబంధములు. దీనికి Biology సంబంధము గల్గుటతన నీశాస్త్రధర్మములందు ప్రాముఖ్యత నొందియున్నటుల తోపకపోదు. మానవజీవిత మితర పశుజీవితములం బోలి ప్రవర్తన ధర్మము కలదియె గాన, మానవజీవితమును నిర్దేశ పరం పరావిలసితమై యుండెడిని. అట్టివాటి కనుకూల వర్తనలు, ప్రతికూలవర్తనల నడుపుచుంటకే మనస్సుయొక్క కార్యము లానవాళ్ళుగ నుండు నని యొక సుప్రసిద్ధపరిశీలకుఁ డనియున్నాఁడు.

మానవ వర్తనముంగూర్చి W. Mac. Dougall పండితుఁడువ్రాసిన మహాగ్రంథమున మానవుఁడు తనపూర్వులనుండి కొన్ని instincts నందుంచుట సహజమని వివరించియున్నాఁడు. ఇది emotion సంబంధమునని తోపకపోదు. ఈ 'ఎమోషన్సు' అన్నిజాతుల జీవజంతువులందున్నను వాటిలక్షణములు వేర్వేరు జాతులందు వేర్వేరుభేదములుగ నుండెడిని.

ఇంక నీశాస్త్రవిషయముల నిట్లు వదలి వీటి తోసంబంధముగల యితరవిషయములను విచారింతము. మానవప్రవర్తనమునకు మనస్సుతో సంబంధము లేకపోలేదు. ప్రవర్తనము సత్ప్రవర్తనము దుష్ప్రవర్తనము నని ద్వివిధముగ నుండును. ఇది సాంగత్యము, బోధ, భయము, ఒత్తిడి, ఇబ్బంది, నిర్బంధము, దురభ్యాసము మొదలగువానినుండి యేర్పడునవి. కొంతకాలమునకవి మనస్సునందు స్థిరపడుటయుఁ గలదు.

ఇంకను మనస్సు చైతన్యవంతముగ నుండుటయు, చైతన్యదూరముగ నుండుటయు స్ఫురింపకపోదు. హిప్నాటిజమ్ (వశీకరణశక్తి) వలనఁ గొందరు చైతన్యదూరులుగ చేయఁబడుట చూచుచున్నాము. అట్లు చేయఁబడినతరి చేసినవా రేమిచేయుమనిన దానినెల్ల నొనర్ప సంసిద్ధులుగ చేయఁబడినవారుగ నుందురని తెలిసెడిని. చేయువారి మనశ్శక్తికన్న చేయఁబడువారి మనశ్శక్తి యధికబలముగలది యగునేని హిప్నాటిజమ్ అట వర్తింపనేరదందురు. గానహిప్నాటిజమ్ మనస్సును వశపర్చుకొనుటగా తేలుచున్నది. (హిప్నాటిజమ్ చూ). ఈవిద్యవిషయమై Feud పండితుఁడును, ఆయనయనుచరవర్గమువారును చిరస్మరణీయులు. ఎక్కువపరిశీలనలు సల్పి చక్కని గ్రంథములఁ వ్రాసినవారు.

## మనసగోత్రము-(నిధ్రువగణము చూ.)

## మనస్సు మహామేరువపై దాటుతూంటుందిగాని కాలు గడపదాటదు-

(ఆంధ్రలోకోక్తి)

**మనస్సాక్షిమతము** — మనస్సునకు సత్యమని తోచినవి సత్యమనియు, లేనివి యసత్యమనియు ప్రతిపాదించు మతము. ఇదియద్వైతవిశిష్టాద్వైత ధర్మములఁ గొన్నిగొన్నింటిఁ గల్పి యగుచున్న మతము.

మతకర్త నెల్లూరుమండలముబోని వెంకటగిరిసంస్థానాధిపతులుగ నుండినవారగు సర్వజ్ఞకుమారయాచేంద్రభూపాలుఁడు. క్రీ. శ. ౧౮౭౬ వ సంవత్సరమున నీమతనిర్మాణము జరిగినదని తెలిసెడిని.

ఈమతమున పరమేశ్వరుఁడు నిరాకారియయ్యు వాసుదేవశబ్దముచేసాకారుఁడై యున్నట్లేర్పడుచున్నదని చెప్పబడినది.

మనస్సాక్షిమతమునకు మనస్సాక్ష్యమను నది ప్రధానగ్రంథము. ఇందు ప్రధాన సిద్ధాంతషట్కము చెప్పఁబడినది.

౧. భగవంతుఁడు(పరమేశ్వరుఁడు)కలఁడు.

ఇతఁడు సాకారనిరాకారములఁ గూడ దనరెడి వాఁడు.

౨. నిర్గుణుఁడైన పరమేశ్వరుని మనోధ్యానమే యర్చన. అనగా సర్వవ్యాపియగు వాని విగ్రహముగ జేయ వీలులేదుగాన మనస్సుచేతనే ధ్యానించుట కర్తవ్యము.

౩. పరోపకారము చేయుచుండుట మానవ ధర్మము.

౪. స్వధర్మములగు జాత్యాచారాది ధర్మములను జరుపుచుండవలయుఁ గాని పరిత్యజించ రాదు.

౫. ప్రాణముకంటె మాన మీలోకమున ప్రధానముగాన మానసంరక్షణముపట్ల నేమరి యశ్రద్ధగ నుండఁజనదు.

౬. నాస్తికుఁడుగ నుండరాదు. ఏలయన భగవంతుఁ డుండునేని నాస్తికునకు దండన తప్పదు. గావున యాస్తిక్యమే శ్రేయము.

**మనస్వి ఋషి**-ఋషి. దేవలుని రెండవ సుతుఁడు. సోదరుఁడు క్షమావర్తుఁడు.

**మనస్విని**— ఈ పేరుగల స్త్రీ లిద్దరు గానవచ్చుచున్నారు. ప్రజాపతిభార్య యొక మనస్విని. ఈమె సోముఁడను వసువుతల్లి. మృకండ ఋషిభార్య యొక మనస్విని. ఈమె మార్కండేయుని తల్లి.

**మనస్యుఁడు**—ప్రవీరుని సుతుఁడు.

**మనస్సు, బుద్ధి, జ్ఞాపకము, స్పృహ** మనస్సును, బుద్ధిని, శరీరసంబంధ తత్త్వములు ౩౬లో భరతదేశస్థు లెన్నుదురు. శరీరేంద్రియములు శరీరభాగములవలె మనస్సు, బుద్ధి, నేత్రముల కగుపడునవి కావు. మనోబుద్ధులు కలవని మనస్సుచేతనే యెఱుంగ నగుచున్నది. శరీర తత్త్వములలో తొలుత మనస్సును, బిదప బుద్ధియు, నగ్రగణ్యములు గాననే భరతదేశపు మతవిధానమున "మనఏవ మనుష్యాణాం కారణంబంధమోక్షయోః" అనగా మనుష్యుల బంధమునకు గాని, మోక్షము (విముక్తి) నకుఁ గానికారణమగునది మనస్సేయని యొకధర్మము గలదు. మనస్సు స్వచ్ఛమైనది. దానికి స్వతసిద్ధమైన గుణదోషము లుండవు. అట్టిదానిని బుద్ధి ప్రోత్సహించుచు దానికి గుణదోషములు లక్షణములుగఁ గల్గించుచుండును. ఇంద్రియే కాదు. నిత్యకృత్య జీవితకార్యము లన్నింటికి మనస్సును ప్రోత్సహించుచుండి నడపునది బుద్ధియే. సర్వసాధారణముగ నీబుద్ధి పూర్వానుభూతి, ఊహాపోహలు, యోచనలపై నాధారపడియుండును. బుద్ధిని మోహ, సంతస, దుఃఖములకు మూలమగు నవ్యక్తతగా వర్ణించియున్నారు.

ఆంగ్ల శరీరశాస్త్రవేత్తలు మనస్సును Master అనియు, శరీరమును (శరీరేంద్రియములతోసహా) 'slave' అనియు వి[illegible] శరీరమున మనస్సే లేకుండిన నేదియుఁ దెలియకుండు ననిరి. శరీరేంద్రియములవలె నది చూడఁబడదనిరి. శరీరావయవములు శరీరభాగములలో నిది యొకటియన వీలులేదనిరి. పెక్కుండ్రు ఆంగ్లేయ పండితులు మనస్సును sensation అనిరి. కాని, నిజమున నిది చైతన్యము కాదనిపుంచెడిని. వారి ఇటీవలి పరిశీలనలు వారికి materialistic world (బాహ్యప్రపంచము) శరీరేంద్రియములచే తెలియనగు గాని యాధ్యాత్మికప్రపంచకమను జగిత్తు వేఱుగ spiritual world కలదనియు, దానిఁదెలియుటకు వలయునది మనస్సనియు బోధించినవి. భరతదేశస్థులియాధిభౌతిక ఆధ్యాత్మిక జగతులనే యనాది కాలమునుండియో గ్రహించినటుల పూర్వకాలపు గ్రంథములనుండి తెలియుచున్నది. పాశ్చాత్యులు కండ్లు, చెవులు మొదలగు నింద్రియము

లను instruments of seeing and hearing etc., అని గ్రహించిరి. బాహ్యప్రపంచమునకు 'Physical world' అనియు, ఇది matter, space, motion, eather లతో చేయఁబడినదని యొప్పింగిరి. తక్కిన దృగ్గోచరము కాని దానిని 'Realm of mind' అనియు పేరిడిరి. ఒక సుప్రసిద్ధ పండితుఁడు "when we study sensation, we are knowing something, more important, more wonderful, more real, than anything we have studied yet' అని వ్రాసియున్నాఁడు. ఆతనయే ఇంకను వివరించుచు that everything we know is known to us through our senses, and it is one of the great discoveries of recent years that the senses which have to do with our own bodies play a great part of their own in making of the mind, and the daily lives of our minds అని వ్రాసియున్నాడు.

క్షుత్పిపాసాదులు మనస్సువలననే తెలియఁబడుచున్నవి. సుఖదుఃఖములు కష్టనిష్ఠురములు, స్వేచ్ఛావిశ్రాంతుల నెరుంగుటకు మనస్సే కారణము. జ్ఞాపకము, మరపు, మనస్సే గల్గించునది. మనోబుద్ధులకుఁ గలభేదము నెరుంగజేయునది మనస్సేగాని యన్యము కాదు. మనస్సే లేకుండిన దానిని చైతన్యరాహిత్య పదార్థ మనదగియుండును. శరీరమున మనస్స్వస్థితి లేనివాడు మొద్దుగను, వెర్రిగను, నుండును. మనస్సే లేకుండిన నెరింగినదే లేకుండును. చైతన్యము, స్పృహ, జ్ఞాపకము, మొదలగునవన్నియు మనస్సునాశ్రయించి యుండునవియే. బుద్ధి మనస్సుంబ్రోత్సహించునది.

పదు నేడువందలసంవత్సరములకాలమునాడు John Locke' అను పేరుగల యాంగ్లవిద్వాంసుఁడు మనస్సుంగూర్చి పరిశీలించి "Nothing is in the mind that was not first in the senses and that the whole of our knowledge and ideas and beliefs depend on two things: sensation in the first place and reflection of what the senses tell us: — అని వ్రాసియున్నాడు.

**మను గోత్రము**-(కుశికగణము చూ.)

**మనుఁడు**—మిథిల దేశాధీశుఁడు. హర్యశ్వుని కుమారుఁడు. కీర్తిరథుని పితామహుఁడు.

**మనుబాల (పాలగురుగు లేక పాలకూర) చెట్టు**-లా. Holostemma rheedei సం. జీవన్తి (సువర్ణమనుబాల), జీవనీయా (సువర్ణమనుబాల) మధుశ్వాసా, మధుస్రవా. (ఈ రెండు సాధారణపుమనుబాల).

స్వర్ణమనుబాల (స్వర్ణజీవన్తి) శ్రేష్ఠమైనదు రు. ఇది పాలంగల్గి ప్రాకులత. ఎఱ్ఱచుక్కలు గల తెల్లపూవులం బూయును. మనుబాలవేరును ఆకును దంచి పైన వేశకట్టిన కండ్లమనకలు మొదలగు నేత్రరోగములును, లోనికిచ్చిన నతిమూత్రమును, సెగరోగమును నివారణయగు ననియు, వేరుకషాయము వగరపుతో గూడిన దగ్గు నివారించుననియు, ఆకువేరుల రస కషాయము చలువజేసి, నేత్రరోగముల నడంచి కాళ్ళు, చేతులు, కండు మంటల నాపి వెంట్రకలకు బలమొసగి సర్వరోగములు నడంచి కంఠస్వరమును బాగుచేయుననియుఁ జెప్పఁబడినది.

**మనుమంచిభట్టు**- ఈకవి శాలిహోత్రుని సంస్కృతహయలక్షణానుసారముగ నాంధ్రమున హయలక్షణసార మను గ్రంథము రచించి కుమారకంపభూపాలున కంకిత మొనర్చెను. ఈకంపన్న యొడయారు సాళువవంశజుఁ

డనియు దండనాథుడనియుఁ జెప్పఁబడినవాఁడు.

ఈతని రావుబహదూర్ కందుకూరి వీరేశ లింగంపంతులవారుపూర్వకవులలో పరిగణించిరి.

**మనుమసిద్ధి—** తొల్లిఁట నెల్లూరుసీమ నేలిన భూపతి. తొలుత తిక్కనసోమయాజి యీతనియాస్థానమున నుండువాఁడు.

**మనువులు౧౪(చతుర్దశమనువులు**

౧. స్వాయంభువమనువు- బ్రహ్మపుత్రుఁడు. భార్యపేరు శతరూప. ఈమె కనంతి యనియుఁ బేరుకలదు. ప్రియవ్రతుఁడు, ఉత్తానపాదుఁడు. కుమాళ్ళు. సూతి (ఆకూతి), ప్రసూతి, దేవహూతి, యనఁబడువారు కుమార్తెలు. ఈతఁడు మొదటిమనువు. (మత్స్యపురాణము)

౨. స్వరోచి-స్వారోచిషుఁడనియునందురు. తల్లి వరూథిని యని మార్కండేయ పురాణమునను, మనోరమయనియు, వనదేవత యనియు వేర్వేరుచోట్లనుగలదు. తండ్రి స్వరోచి విష్ణుని గూర్చి తపమాచరించి మనువయ్యెను.

౩. ఉత్తముఁడు-తండ్రి యుత్తముఁడు. తల్లి బహుళ. ఈతఁడుమనువైయుండునపుడుసుశాంతి యింద్రుఁడనియు, వశిష్ఠపుత్రులు సుతేజ, సుతపాదులు, మహర్షులనియు తెలిసెడిని.

౪. తామసమనువు- తండ్రి సురాష్ట్రుఁ డను భూపతి. తల్లి యుత్పలావతి. భాగవతమున తండ్రిపేరు ప్రియవ్రతుఁడని చెప్పఁబడియున్నది. జానుజంఘుఁడు, నరుఁడు, శాంతి, ప్రస్థలుఁడు, ధ్రువుఁడు, కృతబంధువు, తామసుని కుమాళ్ళని చెప్పఁబడినది

౫. రైవతుఁడు- ప్రియవ్రతునివంశస్థుఁడగు దుర్దముఁడనువానికి రేవతియందు పుట్టెననిభాగవతమునందుచెప్పఁబడియున్నది. అనర్తునికుమారుఁడని వేరొకతావున గలదు. ఇతఁడు సముద్ర మధ్యమున గుశస్థలి యను పురమును నిర్మించుకొనెనఁట. రేవతి కూతురు. బలభద్రు (బలరాముఁ)డు అల్లుఁడు.

౬. చాక్షుషమనువు-విశ్వకర్మ కుమారుఁడని భాగవతమునందు గలదు. చక్షుర్మనువు సర్వతేజస్సునకు పుత్రుఁడనియు, ఆకూతి తల్లియనియు, వేరొకచోట గలదు. బృహతియందు రిపుని వలన పుట్టినకుమారుఁ డని మఱియొక తావునఁ గలదు.

౭. వైవస్వతమనువు-వివస్వంతుని (సూర్యుని)కుమారుఁడు. తల్లి సంజ్ఞాదేవి. పేరు శ్రాద్ధదేవుఁడు. ఇక్ష్వాకు, నాభాగుఁడు, ధృష్టుఁడు, సంయాతి,వర్షుఁడు, వృషధ్రుఁడు, వసుమంతుఁడు, నరిష్యంతుఁడు, పృషపదుఁడు పుత్రులు; పుత్రిక యిల. కొంతకాలమునకీ ఇలయే సుద్యుమ్నుఁడు లేక నిళమహారాజయ్యెను. ఇళ స్త్రీగానుండు తరి బుధుఁడు భర్త. వశిష్ఠ తప మాచరించి ఇళను పురుషునిగా నొనర్చెను.

౮. సూర్యసావర్ణిమనువు-తండ్రిసూర్యుఁడు; తల్లి ఛాయాదేవి.

౯. సావర్ణిమనువు.

౧౦. బ్రహ్మసావర్ణి మనువు.

౧౧. రుద్రసావర్ణిమనువు-ఇతనికివంశకర్తలు వేదవంతుఁడు, ఉపదేవుఁడు, దేవశ్రేష్ఠుఁడు, విదూరథుఁడు, మిత్రవంతుఁడు, మిత్రదూరుఁడు ననువారు.

౧౨. ధర్మసావర్ణిమనువు-

౧౩. రౌచ్యమనువు-తండ్రి రుచి.తల్లిప్రమోతిని. కుమార్తె మాలిని. ఈతనితర్వాత చిత. సేనుఁడు, ధృవుఁడు, సురథుఁడు మొదలగు వారు రాజులై పాలించిరి.

౧౪. భౌచ్యమనువు- (జైనుమతగ్రంథముల నీతని నాభిమహారాజని పేర్కొనియున్నారు. మరియు నీతనినే విధాతగ వర్ణించి యున్నారు)

**మనుష్యలఘువు**-- సంగీతశాస్త్రమున జాతి (లయ) ప్రాణమునందుగల దశలఘువులలో నొకటి. (౪ అక్షరములకాలము).

(జాతి (లయ) ప్రాణములు చూడుఁడు.)

**మనుష్యశరీరము నడచుటకే యనుకూలము**-మనుష్యశరీరము నడచుటకును పక్షిశరీర మెగురుటకును రచింపఁబడినవి. (పక్షిశరీర మెగురుటకే యనుకూలము. చూడుఁడు.) మానవ శరీరమునందు నడచుతరి శరీరము మోయుటకు నిచ్చవచ్చినటుల త్వరితగతిం గాని మందముగఁగాని నడచుటకు బలమైన తొడలు,పక్కలు,పాదములు దృఢముగ నమర్పఁబడియున్నవి. కాళ్ళయందుఁగలబలము పక్షుల శరీరపు ఱెక్కల Musclesలలోని బలముతో పోల్పఁదగియుండును. పనులఁజేయు చేతులు పైన నమర్పఁబడియుంట నడచుట కేబాధయు కల్గింపవు. బుద్ధిచాతుర్యమున వాయువిమానములఁ గల్పించి యాకాశాకౌశలతనంది యాకాశమునం దెగురఁగల్గినను మానవశరీరము ఆకాశమున సంభవించు పెక్కు లననుకూలపరిస్థితుల నెదుర్కొన వలసియుంట నట్టిశక్తి కృతకమనిపింపకపోదు.

**మనుష్యుల కంఠధ్వని (VOICE) యెంతదూరము వినిపించెడిని**— ఇది ధ్వనియొక్క బలమునుండి యుండును.

గాలిపటును గాలియందలిశీతోష్ణస్థితియుఁ జక్కగనుండుట వినుపించుటకు ముఖ్యములు. గాలి పలుచగనుండు(హిమవన్నగముంబోలిన) పర్వతోపరిభాగముల దగ్గరనున్నవారితో మాట్లాడుచున్నను మాట సరిగా వినిపించనేరదు. ఆకాశమున గడబిడలు లేక బ్దముగా నుండుతరిని గాలి పొడిగా (dry) నుండుతరిని మానవస్వర మొక మైలుదూరమువినుపించునని లెక్క వేయఁబడినది. సర్వసాధారణముగ మంచిస్థితిగతులయందు పొలములలో కేకవేసి పిలుచు పిలుపులు రెండువందలగజముల దూరమువరకు వినిపించుట యందఱెరిఁగినదే. మంచుప్రదేశమై నిశ్శబ్దమయమగు నుత్తరధృవభూములందు (North pole regions) పిలుపొకమైలు దూరము జక్కగ వినిపించునని గ్రహించి యున్నారు.

విద్యుచ్ఛక్తి సంయుతమైన ధ్వనులు టెలిఫోనులమూలమునను wireless ఏర్పాటులయందునను నెంతదూరమైనను వినుపించుట కనిపెట్టఁబడినది.

**మనుష్యులు ఎదుగుట**- ఇక్కాలమున పుట్టినదాదిగ నైదేండ్లీడు వచ్చువరకు బాలురకును బాలికలకును పొడవునందును శరీరపుష్టియందును బరువునందును చాకచక్యాదియితరలక్షణములందును నేభేదమును లేకుండుటయు, నెదుగుటగూడ నొకేవిధమున నడచుచుంటయు గాంచనగుచునే యున్నది.

పిదపఁ బదునొకండు వత్సరములు గడచువరకు మగపిల్లవాఁడుశరీరపుష్టిగలిగియు,నాడుపిల్ల శరీరపుష్టియందు బాలునికన్న గొంత తగ్గినట్లు గానననగుచు నెదుగుదురు. శరీరదృఢము పుష్టివలన బాలుని పొడవంతగా నరాకుండుటయును బాలిక పొడవు స్పష్టమైగానంబడుచున్నను, బదునొకండు వత్సరములకడను బాలిక, యంత వయస్సేగల బాలునికన్న నంగుళమో యరంగుళమో తగినయె యుండెడిని.

అంతటనుండి పదునేను లేక పదునారువత్సరముల వయస్సుకడ నాడపిల్ల బాలునికన్న హెచ్చుగ నెదిగెడిని. అట్టితరి నామెయె బాలునికన్న బరువుగఁ దూగెడిని. ఇంతటినుండి బాలుఁడే బాలికకన్న త్వరితముగ నెదుగుటయందును, బలముగ శరీరపుష్టిఁ గల్గియుండుటయందును

త్వరితగతిఁ గాంచును. ఆఁడువారిరజస్వల యగుటయందునను, ప్రథమ ద్వితీయ ప్రసవకాలములందునను పొడవగుట పెక్కుతావులఁ గానవచ్చుచున్నను, శరీరబలమును కొంతవరకు గోల్పోవును. ఇంక పురుషుఁడటుల గోల్పోవక నిరువదియైదేండ్లవరకు నెదుగుటయో, శరీరపుష్టి నందుటయో, సంభవించుచునే యుండెడిని. స్త్రీ లెదుగుట పందొమ్మిదివత్సరములతో సాధారణపరిస్థితులలో నాఁగిపోవును.

**మనుష్యులు చెట్లు పీల్చుగాలి (ఊపిరి)**—మనుష్యు లూపిరి లోనికిపీల్చునపు డన్నిరకములగాలియు లోనికేగును. అందు ప్రాణవాయువు (Oxygen), మానవశరీరమందలి రక్తమును శుభ్రపరచుచుండుట కుపయోగపడునది గాన నది శరీరమందలివాయువుతో కలసిపోయి యుపయోగపడును. దీని నుచ్ఛ్వాసమందురు.

శరీరమునం దపరిశుభ్రత వహించినగాలిని కార్బానిక్ ఏసిడ్ (Carbonic acid gas) అని పేరిడియున్నారు. దీనిని ప్రధానభాగముగ గల్గినవాయువును మన మూపిరిపైకివిడుతుము. దీనిని నిశ్వాసమందురు. దీనిం దిరుగ బీల్చిన నపాయకరము. ఇది బైటబడినంతట బహిఃప్రపంచమందలి తక్కిన మహావాయువునం జేరి కలసిపోవును. అందుచేతనే వాయుప్రవాహము చక్కగలేనితావులందు వసించుట యపాయకరమని తలంచబడుచున్నది. ఇది మానవశరీరధర్మవిధానము.

ఇంక వృక్షశరీరధర్మవిధాన మిందుకు వ్యతిరేకము. పగలంతయు సూర్యరశ్మియందు జెట్లు బహిఃప్రపంచమహావాయువునుండి కార్బానిక్ ఏసిడ్ గాస్‌ను లోనికిఁ బీల్చుకొనుచు, నందలి కార్బన్ (Carbon) భాగమును తనశరీరమున కుపయోగించుకొనుచు, నాక్సిజెన్ (ప్రాణవాయువును) బయటికి వదలివేయుచుండును. ఇందు, లోనికిఁదీసికొనిన కార్బానిక్ ఏసిడ్ గాస్‌ను, ఆక్సిజెన్ గా మార్చుటయందే తనవృక్షశరీరమున కుపయోగించుకొనుటగా పెక్కండ్రు వృక్షశాస్త్రపండితు లభిప్రాయపడి యున్నారు. ఇది పగటియందు జరుగుపని. సూర్యరశ్మి లేనినాటి రాత్రియం దిందుకు వ్యతిరేకమగును.

వృక్షములు రాత్రియంతయు కార్బానిక్ ఆసిడ్ గాసు నట్లే బైటికి వదలుచుండును. ఆక్సిజెన్ గా మార్చజాలదు గాన చెట్లుగాని పూవులుగాని రాత్రులందు మూసినతల్పులుగల గదియందుంట శ్రేయముగా దందురు.

ఇంకను హృదయము (Chest) నకును, పొత్తికడుపు (Stomach) నకును నడుమ పెద్దదియగు కండ (muscle) అనునది యుండును. దీని కుచ్ఛ్వాసనిశ్వాసములతో సంబంధము గలదు. ఇది ముడుచుకొనుటయు, ఊపి[illegible] లంగ్సు (Lungs) అనునది పెద్దదియగుటయు మనము శ్వాసము లోనికి పీల్చుటయు నొకతటి జరుగును. ఇంక మజిల్ విజృంభించుటయు నూపిరితిత్తి ముడుచుకొనుట, మనము నిశ్వాసము విడుచుటయు నొకతటి జరుగును. ఇట్లొకటితర్వాత నొకటి జరుగుచునే యుండును.

ఒకప్పు డకాత్తుగ ప్రమాద వశముననో సకారణముగనో మజిల్సు ఎక్కువగా ముడుచుకొని బిగిసియుండిపోవును. మనము సన్నముగ నుండిన యూపిరి నాళ మెక్కువ గాలిని లోనికి పీల్తుము. ఆ గాలి లోపలనిలిచియుండును. సాధారణపుపరిస్థితియందువలె నది ఊపిరి నాళములనుండి పైకిరాజాలదు. ఏలయన నూపిరివిడుచుటయం దంతలోతుగ దీర్ఘముగ నిశ్వాసము విడుచుట మనకు పరిపాటు లేదు కాన నట్లు జరు

గదు. లోనిగాలి తప్పించుకొనుచు బలాత్కారముగ మధ్యమధ్య నూపిరినాళముల నుండియే బయటి కెగదన్ని గెంటినట్లు వచ్చుచుండెడిని. దానిని యెక్కిళ్లు వచ్చుచున్న వందుము. (Hicc-ups). ఇది ఊపిరియొక్క అసాధారణపరిస్థితికాని మామూలుపరిస్థితి కాదు.

Hicc-ups ను కొందరు తెలియక దగ్గుతో సంబంధము గలదని పొరబడి Hic-cough అనెదరు. దీనిని పరిశీలించిన వైద్యశాస్త్రజ్ఞులు ఎక్కువకారము, ఘాటుగల పదార్థములుఁ దినుటవలన శరీరమున నీరుతగ్గి, దాహమెక్కువయగుచుండుతరిని, శరీరమునందెక్కువ వేడియు, నెక్కువ చుట్టలుగాల్చుట మొదలగునవి సంభవించినకతన, నజీర్తి శరీరమున వ్యాపించియుండు ననియుఁ జెప్పియున్నారు.

దాహము త్రాగుటవలన నాళములందు లోసను మార్పుఁజెందించుట, తృళ్ళిపడుట, నిద్రాసంభవించిన నెక్కిళ్ళు, మరపు గల్గుటతో నాగిపోవునని కనిపెట్టఁబడినది. ఎక్కిళ్ళు తరుచుగ నిరువదిమినిట్ల కాలముకన్న నెక్కువయుండునవి కావు.

**మనుష్యులువసించు గదులందుండు మొక్కలు**-సూర్యరశ్మి మొక్కలందలి గ్రీన్‌స్టఫ్ (green stuff) గూడ పగలంతయు నాక్సిజెనును తయారుచేయుచుండెడిని. అనగా గదులలోనుండు మనుష్యులుపీల్చియూపిరివదలిన కార్బన్-డి-ఆక్సైడుగాలిని ఆక్సిజెను గాసు (Oxygen gas)గా మార్చుచుండునని భావము. గాన, పగలు వసించు గదులందుండు మొక్క లుపయోగకరములే యగును.

**మనుసంబంధిగోత్రము** -- (సంకృతి గణము చూడుఁడు.)

**మనుష్యులుపోయినా మాటలు నిలచియుంటవి**—(ఆంధ్రలోకోక్తి.)

**మనోదోషములు**—(దోషములు చూ.)

**మనోదృష్టి (Vision)**— నేత్రములకుఁ గన్పించుట సహజము. దానికి నేత్రదృష్టి యని పేరు. మనస్సున కూహించుట, దూరాలోచనము సల్పుట, వారపారల నెఱిఁగి కలుగఁగల మంచిచెడ్డల నెఱుంగుట సహజము. దీనికి మనోదృష్టియని పేరు. మనస్సునకు బుద్ధియుఁ దోడై యుండుఁ గాన, మనస్సునకు స్ఫురించినదానిని బుద్ధిగోచరమనియు ననుచుందురు.

నేత్రదృష్టి వర్తమానకాలపు స్థితియనియు మనోదృష్టి భవిష్యత్స్థితియనియు, నెఱుఁగునది. ఒక్కొకతరి భూతకాలపు స్థితిగూర్చి తలంచితిమేని యదియును మనోగోచరమగుటయుఁ గూడ సంభవించుచుండెడిని.

**మనోవ్యాధికి మందులేదు**—(ఆంధ్రలోకోక్తి.)

**మన్నా (ధమాసా)**- (తురన్జబీన చూ.)

**మన్నా**—మన్నా బైబిలునం దాకాశము నుండి యెహోవా దేవుడు ఇశ్రాయేలీయుల కాహారముగా బంపెనని చెప్పఁబడియున్న వస్తువు. ఇది తీయనిరుచిగల బంకపదార్థము. Tamarisk (తమారిస్క) అనుపేరుగల చెట్లకొమ్మలనుండి బయలువెడలునది. నేటికిని యరబ్బులు పాలస్తినాదేశమున దీని నేరి యట కేతెంచిన విదేశస్థుల కమ్ముచునేయుందురు. తేనెవలె బుడగలరూపమునఁ జెట్లకొమ్మలనుండి జారి, యారి, గడ్డకట్టి బిగిసిపోవు బంకపదార్థము. బలకరమని యందురు.

**మన్నారుద్వీపము**-మన్నారు (పురము). తలమన్నారు. (రెయిల్వేఅగ్రము)ఇది సింహళ

ద్వీపమున కుత్తరమున నున్నది. తలమన్నారు పట్టణ మీమన్నారుద్వీపములోనిదే. ఈద్వీప మాగ్నేయమునుండి వాయువ్యమున కిరువదిరెండుమైళ్ల పొడవు. దీనియందాగ్నేయఁపుఁగడను మన్నారుపురమును వాయవ్యఁపుగడను దలమన్నారునుఁ గలవు. మన్నారుద్వీప మంతయుఁ దుప్పలు డొంకలు బలసియున్న ప్రదేశము. ఇసుకలయందు నడుమ నల్లతాడి'మంక్ బ్రెడ్' అనంబడు చెట్లు గాననగును. ఈ వింతచెట్లు ముప్పదియడుగుల యెత్తునకుఁ బెరిగి చుట్టుకొలత యిరువదియడుగులవరకునుంట వింతగదోఁచెడిని. ఇంక నల్లతాడిచెట్టు భరతదేశఁపు తాడిచెట్లంబోలి పొడవుగా నుండక చెట్టుకర్రిరంగు కడునల్లగా నుండెడిని. తెల్లతుమ్మ లేక బొడుగుతుమ్మచెట్లు ద్వీపమంతటఁ గలవు. ప్రజలు చేపలఁ బట్టువాండ్రు. మన్నారునందు కొందరితరజాతులవారునుంగలరు. సముద్రతీరమునం దొక్కటియు మధ్యభాగమునం దొక్కటియు రోమ న్కాతలిక్కు దేవస్థానము లున్నవి. అయ్యవి వారి యాత్రాస్థలములు. ప్రజలు రోమన్కాలిక్కు క్రైస్తవమతస్థులే.

**మన్మథబాణము లైదు**—దీనిని సాధారణముగా "పంచబాణము" లని వాడెదరు. బాణమనఁ గోల యని యర్థము.

౧ అరవిందము-(తామరపూవు), ౨ అశోకపుష్పము (రక్తాశోకము), ౩ చూతకుసుమము. (మామిడిపూవు), ౪ నవమల్లిక (మల్లెపూవు), ౫ నీలోత్పలము- (నల్లఁగలువపూవు).

ఈ యైదుపూవులును మన్మథునిబాణములు. కాని మన్మథబాణమన వి ల్లిఱువు(చెఱకుకఱ్ఱ) గను,నారి (తాఁడు) ని తుమ్మెదలబారనియుఁ గలదు. దీనినుండియే మన్మథునకు పంచబాణుఁడనియు పంచసాయకుఁడనియు పంచాస్త్రుఁడనియుఁ బేరయ్యెను

**మన్మథహస్తము** — (హస్తాభినయము చూడుఁడు. భరతశాస్త్రము చూడుఁడు.)

**మన్మథావస్థలు**-(అవస్థాత్రయము,మన్మథావస్థలుచూడుఁడు). దశవిధ మన్మథావస్థలు- ౧. చూపు, ౨. మనస్సంగము, ౩. సంకల్పము, ౪ జాగరము, ౫. కార్శ్యము, ౬. అరతి, ౭. అలజ్జ, ౮. ఉన్మాదము, ౯. మూర్ఛ, ౧౦. మరణము (మరణోద్యమము).

మతాంతరమున మొదటి పదియవస్థలును, ౧౧ జ్వరము, ౧౨ సంతాపమును జేర్చి ద్వాదశ మదనావస్థలనియెదరు.

**మన్మథుఁడు**-ఈతఁడు విష్ణుదేవునిపుత్రుఁడని కొందఱును రుక్మిణీశ్రీకృష్ణులకు ప్రద్యుమ్నుడను పేర బుట్టినవాఁడని మఱికొందరును జెప్పుచున్నారు. "అరవిందము, అశోకము,చూతము, నవమల్లిక, నీలోత్పలము" అను నైదుబాణములతో విరహిజనుల నీతఁడు వేధించునఁట.మలయమారుతము, వసంతము, కోకిలము మొదలగునవి వీనికిఁ బరివారమఁట. ఆంధ్రప్రబంధములలోని విరహులగు నాయకీనాయకు లీతని, నీతనిపరివారమును, బ్రువ్వఁదిట్టుట గన్పట్టెడిని.

పాశ్చాత్యభాషలయం దిట్టి మన్మథుని 'Cupid' అందురు. ల్యాటిన్ భాషయందు 'Cupido'అన వాంఛయనియర్థము. రోమనుల యొక్కయు గ్రీకులయొక్కయు పూర్వగాథలలో నీతఁడు స్త్రీ పురుష సంగమవాంఛాధిదేవతగ వివరింపఁ బడెను. రోమనుల 'Amor' గ్రీకులు 'Eros' అనియు నీమహనీయుని వాడుదురు. ఈతఁడు 'Aphrodite' అను పేరుగల రోమనుల ప్రేమాధిదేవతకుఁ బుత్రుఁడనియు, యౌవనవతియగుకన్యకంబోలి గాని, బాణాసనమును చేతదాల్చి ఱెక్కలతో నున్న బాలుని బోలికాని యుండునట. వీనితల్లికి

Roman Venus అనిపేరు. హిందువులగ్రంథములందు మోదనము, ఉన్మాదనము, సంతాపనము, శోషణము, నిశ్చేష్టాకరణము నీతని ప్రజ్ఞ లనియు (శరఫలితములు), నీతనివైరి శంబరాసురుఁడనియుఁ జెప్పంబడినది. (ప్రద్యుమ్నుఁడు చూడుఁడు).

**మన్యంపుజ్వరము**-(మలేరియాజ్వరము చూడుఁడు).

**మన్యకులగోత్రము** — ఆర్య వైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్యగోత్రములు చూడుఁడు). మన్యకుల (మానసకుల) గోత్రం-ద్వ్యార్షేయ (౨) ఋషులుగల గోత్రము. సంస్కృత గోత్రము మానవస. మనుగణము. ఆపస్తంబయజుశ్శాఖ. ప్రమాణగ్రంథ మాద్యప్రవరఖండ. సమానగోత్రీకులు. మను, మాండవ్యస, మునిరాజస. దక్షేశుఁడు దేవత. దక్షాంబ భార్య. శ్రీశైలము తపస్థానము. దక్షసరస్సు తటాకము. జపము అర్బుదము. దీపములు ౫౫. క్షేత్రసంఖ్య ౨౧. షోడశమహాదానములు దానము. ఎఱ్ఱబట్ట, మానిపసుపు, వరనీయములు.

**మన్యుగణము**—ఇది విశ్వబ్రాహ్మణులయందొక గణము. ఇందైదుగోత్రములు చెప్పఁబడినవి. (ఋక్శాఖవిశ్వబ్రాహ్మణులు చూ).

౧ మన్యుపదర్షి గోత్రము-మన్యు, మామన్యు, మన్యుపద, యను త్రయార్షేయప్రవర.

౨ మామన్యుఋషిగోత్రము- మామన్యు, మృత్యుంజయ, భూబల, విరూప, సవభ్య, యను పంచార్షేయప్రవర.

3 భూబలర్షి గోత్రము- మను, మన్యు, భూబల యను త్రయార్షేయప్రవర.

౪ సువర్తర్షిగోత్రము-భూబల, విరూపాక్ష, సువర్తి, యను త్రయార్షేయప్రవర.

౫ విశ్వదత్తర్షిగోత్రము-విరూపాక్ష, సువర్త, విశ్వవేత్త యను త్రయార్షేయప్రవర.

**మన్వాదులు**—(మనువులు, మన్వాదులు చూడుఁడు.)

**మన్రోసిద్ధాంతము** (Monroe Doctrine)—అమెరికాసంయుక్తరాష్ట్రముల యధినాథుఁడైన ప్రెసిడెంటు మన్రోకాలమున నమెరికాయందు యుద్ధములు జరుగునట్లు సూచనలు గల్గియుండెను. యునైటెడ్‌స్టేట్సు, కనడాలు తప్ప తక్కిన చిన్నచిన్న రాజ్యములు తొల్లింట స్పానియా దేశముతో సంబంధమును కొద్దిగనో గొప్పగనో గల్గియే యుండెను గాని, తనంతట తానేర్పడి యున్న స్వతంత్రరాజ్య మేదియుఁ గాకుండెను. అక్కాలమున నాచిన్నరాజ్యములన్నియు స్పానియా (Spain) రాజ్యమునుండి చీలిపోయి తమస్వతంత్రమును ప్రకటించుకొనియెను. ఐరోపారాజు లన్ననో యెల్లప్పుడును మత్సరమున నితరులపై దాడివెడలి వారినడంచివేయ వెఱచువారుగారు.

ఐరోపా దేశమందలి రాజ్యములు కొన్ని స్పానియాదేశమునకు సహాయపడునటులను, స్పానియా యమెరికాలోని చిన్నరాజ్యములపై దాడివెడలి స్వాధీనపర్చుకొనుటకు రహస్యంపు టేర్పాటులు జరుగుచున్నటుల వదంతులు వినఁబడుచుండెను. ఐరోపాదేశస్థుల కలహాభూమిగా తమప్రక్కనున్న రాజ్యములు పాడువడుటయు, బలమగువారు తమప్రక్కనున్న వారిని జయించి తమప్రక్కనుంటయు, తన సంయుక్తరాష్ట్రములకు శ్రేయముగాదని ప్రెసిడెంటుమన్రో తలంచి తమసభయం దొకసిద్ధాంతమును ప్రతిపాదించి యామోదమునుబడసి ప్రకటించెను. ఆసిద్ధాంతమిది:

"అమెరికా సంయుక్తరాష్ట్రముల ప్రభుత్వ

మైరోపా దేశరాజకీయములలో జోక్యముఁ గలిగించుకొన నిచ్ఛగింపనిదయ్యును నమెరికాలోని దేశముల సంబంధ వ్యవహారముల నన్యు లెట్టి జోక్యమునైనను గల్గించుకొనుటను సహింప” దనుసిద్ధాంతమునుఁ బ్రకటించెను. ఇదియైరోపా దేశపుప్రభుత్వములను జోక్యము కలిగించుకొన కుండ వారించుటయె గాని వేఱు కాదు. ఇందువలన నమెరికాయంతయు నమెరికావారికేగాని యన్యులకుఁ గారాదని యర్థము.

పిదప నీసిద్ధాంతమునఁ గొంచెము మార్పులప్పటప్పట జరిగినను, మొత్తమున మన్రో సిద్ధాంతము నేటికిని నిలచియె యున్నది. ఈ సిద్ధాంతరక్షణమేర కనికము యునైటెడ్ స్టేట్సు పశ్చిమ త్తతతో జాగ్రతఁగొనియె యుండునఁట.

**మన్సూన్ లేక మోన్సూన్** (Monsoon)-సం. ఋతుపవనము. వర్షమును దెచ్చు (లేక వర్షముఁగురిపించు) గాలి యనియర్థము. ఇవి మనదేశమున'నార్త్ ఈస్టు మన్సూన్'అనియు, 'సౌత్ వెస్టుమన్సూన్' అనియు రెండువిధములు. 'నార్త్ ఈస్టుమన్సూన్, జూలైయాగస్టు మాసములను, 'సౌత్ వెస్టుమాన్సూన్' సెప్టెంబరు అక్టోబరులనుండియు వీచి వర్షములఁ గురిపించెడిని.

**మమత**—ఉతథ్యునిభార్య.దీర్ఘతమ. భరద్వాజుల తల్లి. ఈమె, బావగారగు బృహస్పతి వలన భరద్వాజునిఁ గనినటుల చెప్పఁబడినది.

**మమతనిద్ర** (Twilight sleep) — ఇది గాఢనిద్ర కానేరదు. కునికిపాటునుండి గల్గు మమత. నేత్రములు మూతబడుటకన్న చేష్టలు దక్కియుంటకన్న నితరనిద్రాలక్షణములు పూర్తిగానుండవు. చైతన్య మించుక తప్పియు, తప్పని యట్లుండెడిని. జిహ్వాకు రుచులఁ గ్రహించు శక్తి మరుగువడను. నేత్రములఁ దెఱచినచో బరు వనిపించును.

ఇట్టి మమతనిద్ర నాంగ్లమున Twilight sleep, లేక Partial unconsciousness, అనియెదరు. పరిశీలకులగు ఆంగ్లవైద్యశిఖామణులిటిసితిని 'Scopolamine morphine' అను మూలిక (drug) నుండి శరీరమునకుఁ గల్గింపనగు ననియు, స్త్రీల ప్రసవవేదనలందలి మానసిక కాయిక వేదనలఁ దెలియని స్థితియందు వారల నుంచగల్గుటయో లేక తప్పించుటయో జేయనగునని యు ననుచున్నారు. ఇట్టిమమతనిద్రలందు స్వప్నములు తిరుచుగాఁ గల్గుచుండును. నైసర్గికస్థితియం దీమమతకునుకు చిరకాలము నిలువక ఘ్రముగ మెలకువ గల్గుచుండెడిని.

**మమ్మీ**— ఈజిప్టుదేశమునఁ దొల్లింటి కాలమున పీనుఁగుల కొక లేపనము శరీరమంతటనుఁబూసి కుళ్ళిపోకుండ:భద్రపర్చి సమాధులందుంచుచుండిరి. అట్టిపీనుఁగులకీపేరు వర్తించును.

మనుష్యులనే గాక జంతువులఁ గొన్నిటిఁ గూడ నటు మమ్మీలుగ నాయాదికాలమున నీజిప్టుదేశమున చేసిన విటీవల బయల్పడినవి

**మయరాష్ట్రము** సంయుక్తరాష్ట్రములలోని మేరతుపురప్రాంతదేశమున కీపేరొకప్పు డుండెనందురు. ఇట మయ దానవుని కోటయుండినతావుగ నానవాళ్ళఁజూపుదురు. ఈమీరటు తొల్లింట హస్తినాపురముండిన ప్రదేశపరిసరము కాదు. కాళీనది కిరువదిమైళ్ళదూరమునఁగల యంధకోట లేక నంధకేశ యని తొల్లింటపేరుగల్గిన తావు. ఇట బిల్వేశ్వరంమహాదేవశివలింగము సుప్రసిద్ధము. ఈశివలింగమును మయాసురపుత్రికయు, లంకారాజ్యఁపు రాజ్ఞియునగు మండోదరీదేవి (రావణభూపతిభార్య) యర్చించెనని శివపురాణము ౧-౪౧ యందుఁ జెప్పఁబడినది.

మయశిల్పము, మయవాస్తుశాస్త్రము దేశప్రసిద్ధములు. వీటిని రచించిన దీమయుఁడే నఁట. ఈతఁడు భూపతియైన మయుఁడు.

**మయులనాగరికత** (Civilization of Mayas)-ఈమయులంగూర్చి సరిగా తెలియకున్నది. మధ్యయమెరికా మొదలు హాండూరాస్ వరకును, మెక్సికో దేశమునను, వీరిపురాతనఁపు టానవాళ్ళు గానవచ్చెడిని.

వీరు 'Toltecs' కన్న పురాతనులని తలఁపబడుచున్నారు. 'Hittites' కన్న పురాతనులుగ పిలఁపఁబడు 'Aztecs' కన్న యెంకనుచాల రెట్లు పురాతనులని 'Toltecs' పిలఁపఁబడుట యెల్లరెఱిఁగినదే.

వీరిపూర్వఁపు టానవాళ్లంబట్టి వీరింగూర్చిన పరిశీలనలు సల్పిన 'Niven' పండితుఁడు డగ్గిపర్వతములబుగ్గిచాడి వీరినాటి యానవాళ్ళు బయలుదేఁదీసి, మెక్సికోనగరమున కనతిదూరముననున్న Pre-historic Pyramid ను చక్కఁగఁ బరిశీలించి, యీ మయుల నిర్మాణములు క్రీ. మునుపు ౫000 సంవత్సరములకుఁ దక్కువపురాతనఁపుది కాదని తెల్పియున్నాఁడు. మరియు నాయన వా రాసియాఖండఁపు వారనియు బహుశః మంగోలియాసంబంధులై యుందురనియుఁ బోల్చియున్నాఁడు. వీరు భరతదేశఁపు మయసంతతివారనియు, నెప్పుడో యటకు వలసపోయియుందురనియు, భరతదేశఁపు పరిశీలకులు తలంపనగుచున్నది.

పిదప A. P. Maudslay పరిశీలకుఁడు పదమూఁడు సంవత్సరములకాలము దీనిం బరిశీలించి యున్నాఁడు. క్రీ. వె. ౧౮౮౧ మొదలు ౧౮౯౪ వరకు మయుల యానవాళ్లున్నప్రదేశమును సర్వేచేసియు త్రవ్వించియు పరిశీలనల సల్పుచు మయుల యమెరికాస్థితిగతులఁగూర్చి లోకమునకుఁ గొంత వెల్లడించెఁగాని, వీ రాదిని భరతదేశపు మయసంతతివారేమో కనుఁగొనుటకు వలయు పరికరము లందు లభింపకున్నవి. కొన్ని విగ్రహముల నాయన గైకొని, వాటింబోలిన విగ్రహములు బోతపోయించి, యింగ్లాండు దేశమున కనిపెఁగాని యవిచాలకాలము బయటబడక యిటీవల లండనుమ్యూజియమున కివ్వబడినవి. వాటింగూర్చి తెలియఁదగిన చరిత్రలు లేకున్నను పోలికలు భరతదేశపుమయసంతతివారేమో యను నూహ బలపడుచున్నది.

భరతదేశఁపు మయుఁడు విశ్వకర్మ సంతతిలోనివాఁడు. వాస్తుశాస్త్రమును దేవాలయశిల్పములు రచించినవాఁడు.

**మయులు**-ఈజాతివా రమెరికా దేశమున నిండియన్ జాతులలోని ఒక తెగవారుగనున్నారు. వీరివంశము దిబువని యొంతశాఖలుగలవఁట. వీరు మయుని సంతతివారని కొందరు పరిశీలకులు తలంచుచున్నారు. వీరినిర్మాణము లగు కొన్ని దేవాలయములు కనుఁగొనఁబడినవి. ఇంతవరకు కన్గొనినవాటిలో పురాతనపుదిగఁ దలఁపఁబడుచున్నకట్టడము ౧౯౧౬ సంవత్సరమునఁ గనుగొనఁబడినది. అది మయసీమయందు North Guatemala పరగణాలో Vaxactum అనుచోట నున్నది. ఇది క్రీ. వె. నేబది సంవత్సరములనాటికట్టడమని తలంచుచున్నారు. ఇట్టికట్టడములింకను గలవు. అవి యన్నియు నీమయుల పూర్వుల నిర్మాణములఁట. వీరింగూర్చి మంచి పరిశీలనలు జరుగవలసి యున్నది.

**మయూరహస్తము**-(హస్తాభినయముఁ జూడుఁడు. భరతశాస్త్రముఁ జూడుఁడు).

**మయూరగోత్రము** --(కుశికగణముఁ జూడుఁడు).

**మయూరతుత్థము**—దీని కాంగ్లమున Subacetate of Copper అనిపేరు. (రాగి చూడుఁడు.)

దీని నాయుర్వేదవైద్యశాస్త్రోక్తముగ శుద్ధి యొనర్చిన భస్మము. సమస్తచర్మరోగములను, వ్రణములను, నివారించునని చెప్పఁబడినది.

**మయూరశిఖ (చెట్టు)**- లా. Celosia Cristata. ఆంగ్ల. Maiden Hair. సం. శిఖావలా, శిఖరీ, శిఖిముఖీ. కొందరు కేకి (నెమలి) శిఖా యనికూడ వాడియున్నారు.

మయూరశిఖ చిన్నదిగ నుండుచెట్టు. గాయములుమాన్పి బలమొసఁగునదియు, అతిసారము, గొంతుకలో పుండు, దగ్గు, శేరపము, పైత్యము, మూలవ్యాధులు శమింపఁజేయునదియుఁ జెప్పఁబడినది.

**మయూరాసనము**—యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి.

రెండుమోఁచేతులను నాభికిరుప్రక్కల నుండునటులను, రెండుయరచేతులును నేలనానించి శరీరమును పైకి లేవనెత్తి వంకర లేక సరిగా నుండుట మయూరాసన మనఁబడును. దీని యభ్యాసమున జీర్ణశక్తి యధికమగు నదియు, విషమైనను బాధింపకుండ శరీరమునుండి బైటికి వెడలిపోవుననియు, కఫరోగములు నశించుననియు నిద్రాలస్యాదులు త్వరలో తగ్గుననియుఁ జెప్పఁబడినది.

**మయూరీపురము**—దీని నిప్పుడు 'మాహే' యనుచున్నారు. మలబారుతీరమునందున్న రేవు.

**మయూరుఁడు**—గొప్పవిద్వాంసుఁడు. బాణభట్టుని మామగారు (అవన్తిదేశము చూ.)

**మరకాళ్లు (మరగాళ్లు)**—మరగాళ్లపై నడచుట బాలురకేగాక పెద్దవాండ్రకుఁ గూడ నొక నేర్పుగల విద్యగా నుండెను. ఇది భరత దేశముననేగాక నితరదేశములందును, నైరోపా



దేశములందును వాడుకనందియుండి యిటీవల కొంత తగ్గియున్నది. ఇంచుక యభ్యాసముతో నలవడు నేర్పు.

**మరణము** -(జననమరణములు చూ.)

**మరణమునకుఁ బిదప నా స్థలమును వదలివేయుట**—౧. కృత్తిక, ౨. రోహిణి, ౩ మృగశిర, ౪ పునర్వసు. ౫ ఉత్తర, ౬ చిత్త, ౭ విశాఖ, ౮ భరణి, ౯ ఉత్తరాషాఢ, ఈనక్షత్రములందు మరణముసంభవించిన నాతావును మూఁడుమాసములు వదలివేయవలయును.

౧ ధనిష్ఠ, ౨ శతభిషము, ౩ పూర్వాభాద్ర ౪ ఉత్తరాభాద్ర, ౫ రేవతి నక్షత్రముల మరణము సంభవించిన నాతావు నారుమాసముల వఱకు వదలివేయవలయును.

పాడ్యమి, ద్వితీయ, షష్ఠి, సప్తమి,

ఏకాదశి,త్రయోదశి,చతుర్దశి తిథులయందును, ఆదివారము, మంగళవారము, శుక్రవారము, శనివారము, మరణము సంభవించినచో శాంతి జేయవలయునని చెప్పఁబడినది.

**మరణానుస్మృతి**—దశ బౌద్ధానుస్మృతులు చూడుఁడు.

**మరాటదేశము**—(మహారాష్ట్రదేశము చూడుఁడు).

**మరాటి మొగ్గలు**—ఇవియొకచెట్టుపూవులు, లేక మొగ్గలని తలఁపఁబడుచున్నవి. లవంగమొగ్గలఁ బోలినవి.

నొప్పి బాధ నివారించి, యించుక మత్తుఁ జేసి, నిద్రఁగల్గించి, విరేచనములు కట్టునవియు పాలతోఁ పుచ్చుకొనిన వీర్య స్తంభన గావించునవియుఁ జెప్పఁబడినది. మరాటిమొగ్గ లోనివిత్తులతోసహా లోనికియ్యవలెనందురు.

**మరిగంటి సింగరాచార్యులు**- ఆంధ్రకవులలోనాధునికుఁడుగ బరిగణింపఁబడినవాఁడు. వైష్ణవ బ్రాహ్మణుఁడు మౌద్గల్య గోత్రము. తండ్రిపేరు వేంకటాచార్యులు. తాతపేరు తిరుమలాచార్యులు.

రచించినది దశరథరాజనందనచరిత్ర. ఇది నిరోష్ఠ్యరామాయణమని కూడ పేరందినగ్రంథము. ఇతఁడిరువది గ్రంథముల రచించినట్లు తెలియుటయె గాని తక్కిన పందొమ్మిదియుఁ గానఁబడుట లేదు.

**మరిడిజాడ్యము**—[వాంతిభేధి(విషూచివ్యాధి) చూడుఁడు.]

**మరిన సుభద్రయ్యమ్మ**— ఆంధ్రకవులలో నాధునికులందుఁ పరిగణింపఁబడినది. ఈ మహనీయురాలు గొప్ప విదుషీమణి. పురగిర క్షత్రియులు. మహారాజా గోడే నారాయణ గజపతిరావు బహద్దరువారి మేనత్త. ఈమె చాలభక్తురాలు. విశాఖపట్టణము నివాసము.

ఈ మహాదేవి రచించినవి శ్రీరామదండకము, రఘునాయకశతకము, కేశవశతకము, కృష్ణశతకము, రాఘవరామశతకము.

**మరిన్ని(and)అనుటకు & గుర్తు**—అచ్చు ముద్రణయంత్రములు, టైపురైటరుయంత్రములు లేకుండిన తొల్లిటికాలమున, బ్రిటీషుద్వీపదేశములందు వ్రాతయె యాపనులఁ జేయుచుండినదినములలో, లేఖరులు వృత్తిజీవనముగ వ్రాయుచుండెడివారు.

అట్టివారు త్వరితముగ పని ముగియుటకు తరుచుగ సంభవించుచుండు పెక్కుమాటలను కుదిలపరచియు,గుఱుతులుగమార్చియు, సాంకేతికములుగ నొనర్చియు పలుతెరంగుల భాషను క్లుప్తపరచుచుండిరి.

అట్టివాట్లలో 'మరిన్నీ' యను నర్థమిచ్చు (and) అను పదమునకు లాటిన్ (Latin) భాషయందు "et" అనుమాటను క్లుప్తపర్చి "&" గుర్తుగ కొంతరూపము మారినను,కొంత సంబంధముగ నుండునట్లు జూపి, సంకేతముగఁ జేసికొనిరి. దీని శాంగ్లభాషయం దనువాదపదమగు 'ఎండ్' గా పలుకసాగిరి.

ముద్రణయంత్రములు వచ్చినపిదప నట్లే గుర్తుకరముగఁ జేసిరి. టైపురైటరులందును నా పద్ధతినె యనుసరించి "&"ను and నకు గుర్తుగ నిడిరి.

ఇపుడు తెలుఁగుభాషలో వ్రాయుచున్న విషయములలో సైతము "మరియు" నను నర్థమిచ్చుచోట "మరియు" నని వ్రాయుటకు బదులు "&" అను గుర్తునే వ్రాయుచున్నారు.

**మరీచి**—బ్రహ్మమానసపుత్రుఁడు. ఈతనికి కర్దమప్రజాపతి కుమార్తెయగు కళయందు

కస్యపుఁడను కుమారుఁడును, పూర్ణిమ యను కుమార్తెయును గలిగిరి. వేఱొకచో పూర్ణిమను కుమారుఁ డనియుఁ జెప్పఁబడినది.

**మరీచి గోళము లేక నక్షత్రము** — (నక్షత్రములు భారతీయులు గుర్తించినవి చూ.)

**మరుకచ్ఛము** —(కచ్ఛ దేశము చూ.)

**మరుచ్చక్రవర్తి** - షోడశ మహారాజులలో నొకఁడు. (మహారాజులు చూడుఁడు.)

**మరుతగోత్రము**-- (జమదగ్నిభిదా ఉపగణము చూడుఁడు.)

**మరుత్వంతుఁడు**-తండ్రి ధర్ముఁడు. తల్లి మరుద్వతి. (ఈమె దక్షునికుమార్తె) సోదరుడు జయంతుఁడు.

**మరుత్తు చక్రవర్తి** — ఇక్ష్వాకు సంతతి. సూర్యవంశ క్షత్రియుఁడు. తండ్రి యగ్నివర్ణుఁడు. పుత్రులు నహుషుఁడు, అంబరీషుఁడు, యయాతి. కుమారుఁడు నరిష్యంతుఁ డని వేరొకచోటకలదు ఈయన గొప్పక్రతువు లొనర్చినవాఁడని ప్రసిద్ధి.

**మరుత్తులు ౭ (వాయువు) సప్తమరుత్తులు**- దితిగర్భమున జనించినవి. ౧. ఆవహుఁడు, ౨. వివహుఁడు, ౩. సంవహుఁడు, ౪. అతివహుఁడు, ౫. అనువాహుఁడు, ౬. పరీవాహుఁడు, ౭. వహుఁడు.

ఇంకను మరుత్తుచక్రవర్తి యిక్ష్వాకునితమ్ముని కొమారుఁడగు నాభాగుని సంతతియం దవీక్షిత్తు (అనంబకు వానికి) కొమారుఁడు. ఈతని కొమారుఁడు నరిష్యంతుఁడు. మరుచ్చక్రవర్తి యాగముల నెక్కువగా చేసినవాఁడు. యాగోపకరణముల నన్నింటిని బంగారముతోఁ జేయించిన వాఁడనివివరింపఁబడినది. మహాధనవంతుఁడు.

**మరుద్వృధా నది**-జీలమ్, చీనాబ్ నదులు కలసి చంద్రభాగమైన నదీభాగమున కీపేరు కలదు. ఈపేరు ఋగ్వేదము ౧౦-౭౫ యందు వాడఁబడినది. పంజాబు దేశములోనిది. (దశ పవిత్ర ప్రవాహములు చూడుఁడు).

**మరుదేశము**— భారత యుద్ధకాలమున కురుసైన్యముల కిది యొక విడిదలతావు.

**మరుధన్వదేశము**— (అంబరీష పుర రాజ్యము చూడుఁడు).

**మరువము**—లా. Ocymum Caryophyllatum. ఆంగ్ల Sweet Marjoram. సం. కులకః, మరిచకః, మరుః, మరువః.

ఇది పరిమళముగల మొక్క. స్త్రీలు దమనమునువలెనే దీనిని శిరస్సునం దలంకరించుకొందురు. దీని రస, కషాయ, చూర్ణములందు వేడి చేసి కార్శ్యరోగము, తాపము, పైత్యము, పైత్యభ్రమ, మేహము, విదాహము, విషదోషము, శ్లేష్మము, క్షయరోగముల నివారించు గుణము గలదనియు, నజకులను మాన్పుశక్తి గలదనియు, నించుకవిరేచనబద్ధముఁగూడ గల్గించుననియుఁ జెప్పబడినది.

**మరువర్ధనానది**-చీనాబ్ నదిలోకిస్త్వార్ పురముకడ సంగమించు నొకచిన్ననది.

**మరుస్థలి**—దీని నిప్పుడు 'మార్వార్' అనుచున్నారు. మారవభూమియో లేక మారవ ఖండమనియో యొకప్పుడు పేరుండెనందురు.

దీని ప్రశంస పద్మపురాణము, ఉత్తరఖండము ౬౮ అధ్యాయమునఁ గాననగుచున్నది. భవిష్యత్పురాణము ప్రతిసర్గ ౩-౨ యందునను గలదు. (మరుధన్వదేశము లేక సాళ్వదేశము చూ.)

**మర్కటకిశోర న్యాయము** — కోతిపిల్ల తల్లిని గట్టిగా పట్టుకొనును గాని, తల్లి పట్టుకొనక కొమ్మలలో గంతులువేయు చుండును. పిల్లపట్టు గట్టిగానుండక జాఱిపడిపోయిన నాపిల్లను తల్లి వదలివేయును.

**మర్కటగోత్రము**—(కణ్వ ఉపగణము చూడుఁడు)

**మర్కటాయనిగోత్రము**-(కణ్వ ఉపగణము చూడుఁడు)

**మర్మగోవా (మర్గావో)**— (పోర్చుగీసిండియా చూడుఁడు).

**మర్షణగోత్రము** — (విష్ణువృద్ధ ఉపగణము చూడుఁడు).

**మర్హా విశ్వానదుల ంగమము (దోహ్రి)**— అయోధ్య రాష్ట్రములోని జాబాదు జిల్లాలోని మర్ఘోర్దా యనఁ బడిన తావున (మర్హా విశ్వానదుల సంగమముకడ) దోహ్రి యనఁబడిన తావు కలదు. ఇటతొల్లిఁటి యంధముని యాశ్రమ ముండె నఁట. ఆతని కుమారుండగు శర్వణుని దశరథమహారాజు లేడి యనుకొని చంపెనఁట. పుత్రశోకానలతప్తుఁడై నయంధముని దశరథునకు శాపమిచ్చె నఁట. గాననె దశథుఁడు శ్రీరాము నరణ్యావాసమునకుఁ బంపి తాను పుత్రశోకానల తప్తుఁడై మరణింప వలసి వచ్చెనఁట.

**మఱ్ఱిచెట్టు**. లా. Ficus Indica అనియు, Ficus Bengalensis. ఆంగ్ల: Banian tree. సం. న్యగ్రోధః, వటః, క్షీరి. (న్యగ్రోధగణముఁ జూడుఁడు.) వటవృక్షము హిందువులకు పవిత్రము. సంయుక్తరాష్ట్రముల లోని యలహాబాదుకడ ప్రయాగకుఁ జేరి త్రివేణీసంగమమున నక్షయవటమును, బీహారము లోని గయానగరమున వటవృక్షమును, నుత్కల దేశమునందలి శ్రీజగన్నాథమున వటవృక్షమును ప్రసిద్ధయాత్రాస్థలములు. అందు కడపటిరెంటిక్రిందను పితరర్చనఁ జేసి పిండములు వైచెదరు. మరియు దక్షిణామూర్త్యవతారమువ మఱ్ఱిచెట్టుక్రిందనె మౌనవ్యాఖ్యచే బరబ్రహ్మతత్వమును బరమేశ్వరుఁడు లోకమునకు బోధించెనని యద్వైతులమతము.

ఇది నల్లమఱ్ఱి తెల్లమఱ్ఱి యని ద్వివిధము. అందు తెల్లనిది శ్రేష్ఠమని యాయుర్వేద వైద్యులందురు. మఱ్ఱిచెట్టు చక్కనినీడ నిచ్చునదిగాన బాటల కిరుప్రక్కలను దీనిని నాటుచుందురు. దీనినీడ దట్టముగాన చల్లగనుండును. ఇది చిరకాలజీవి యగుచెట్టు.

గొప్ప మఱ్ఱిచెట్టు కలకత్తాకడ సిబ్బూర్ అను తావునగల యుద్యానవనమునం దొకటి పురాతనపుది గలదు. అది ప్రసిద్ధము. దక్షిణ మధురాపురమున, పాలయంపట్టు రాజాగారి బంగళాకుం జేరియున్న దొకటి గాంచఁదగినంత పెద్దమఱ్ఱి.

మఱ్ఱిచెక్క కషాయచూర్ణములు లోనికిచ్చిన నజీర్తి, యతిమూత్రము, నుబ్బుజాడ్యము, జ్వరాతిసారముల నడంచుననియు, చిరకాలము సేవించిన కాయసిద్ధి గల్గుననియు, చిరకాలజీవియగుననియు, మఱ్ఱిపట్ట రసకషాయములు చలవజేసి తాపము, పైత్యవికారము, బడలిక, వాంతులు, శ్వాసల నివారించుననియు, మఱ్ఱియూడల రసకషాయములు మేహశాంతి నొనర్చి రక్తపైత్యమడంచి విరేచనబద్ధము గల్గించుటేగాక, మఱ్ఱి చిగుళ్లు నమలుచుండిన నోటిపూత మానును. మఱ్ఱియూడలతో దంతధావన మొనర్చుచుండిన సమస్త దంతరోగములు నివారణమగును. పండ్లచిగుళ్ళు గట్టిపడును. మఱ్ఱిపండ్లలోని విత్తులు మేహశాంతి,వీర్యపుష్టిఁ గల్గించుననియు మఱ్రిపాలు లోనికిచ్చిన మేహశాంతి గల్గించి, కుష్ఠురోగమును సైతము మాన్పుననియు, నోట పుక్కిలించి యుమిసిన నోటిపూత నివారణమగుననియు, మఱ్ఱియూడల చూర్ణముగాని కషాయముగ్గాని స్త్రీల కుసుమరోగము నివారించు

ననియు, నగ్నిమాంద్యము నడంచి యించుకవాతము జేయుననియుఁ జెప్పఁబడినది.

మట్టికి యింగువ, జీలకర్ర, దాల్చినచెక్క, లవంగాలు విరుగుడులని యందురు.

**మఱ్రేనది** (Murray river)—ఆస్ట్రేలియాయందు పెద్దనది. ౧౨౦౦ మైళ్ళ పొడవు గలది. దీనిసంబంధియగు డార్లింగునదితోఁగల్పి యాదేశస్థులు గర్వముగ ౨౩౦౦ మైళ్ళ పొడవందురు.

డివైడింగురేంజి కనుమలందు పుట్టి దక్షిణాస్ట్రేలియాలోని యలగ్జాండ్రినా సరస్సునందు కలసిపోయి, యవ్వలిదెసయందుండి చిన్నప్రవాహముగ వెలువడి సముద్రగామి యగును. మొదటిభాగమున నీనదీజలములు భూమిలోనికింకిపోవుట సన్నగిలి,కొన్ని పండ్లతోటలఁ దడుపమాత్ర ముపయోగించెడిని.

ఎటులనయినను నీనదియు దీని యుపనదులు నుపయోగించు నదులనియె జెప్పవలసియున్నవి.

**మలకగోత్రము**-(సంకృతి ఉపగణము చూడుఁడు).

**మలద దేశము**— కరూశదేశముకడనే మలదదేశ ముండిన దనియు, దాని కుత్తరపథమని పేరుండె ననియు తెలియుటకన్న వేరేమియుఁ దెలియకున్నది. రామాయణమున నీదేశప్రశంస కలదు.

**మలపతిగోత్రము**-(జమదగ్నివత్సఉపగణము చూడుఁడు).

**మలపాక ధాతుపాక దోషములు**—(ధాతుపాక మలపాక దోషములు చూడుఁడు.)

**మలబారు జిల్లా**— మళయాళదేశము లోనిది. చెన్నపురిరాజధానిం జేరి యున్నది. ఇచటి మహమ్మదీయులగు మాప్లా లధికసంఖ్యాకులు గలరు. కాలికట్టుపట్టణము ప్రధానస్థానము. ఇది పెద్దపట్టణము ఇది జామోరీన్ ప్రభుని జమీందారీప్రధానస్థానము. దీనికి జేపూరు రేవుపట్టణము. తలచ్చేరి వేరొక రేవుపట్టణము కన్ననూరు సైన్యస్థానము. పాల్ఘాటు పురము, పొన్నానిపురము (Ponnani) వేరుపట్టణములు.

**మలయుపర్వతము** — కావేరీ నదికి దక్షిణమున పశ్చిమకనుమల దక్షిణఁపుకడ భాగము. కోయంబత్తూరుకొండలలోవ మార్గమునకు దక్షిణముగనున్న పర్వతముమొదలు తిరువాన్కూరుకొండల కీపేరువర్తించునందురు. ఇందగస్త్యకూటమను పర్వతమున తామ్రపర్ణినది జన్మస్థానసమీపమున నగాస్త్యాశ్రమముండినదఁట.

**మలయుమారుతము** — (చందనగిరి చూ.డుఁడు)

**'మలయు' దేశపు సామెతలు** —

అరఁటిచెట్లు రెండుసార్లు కాయవు.

ఎవ్వరు మిరపకాయలు నమిలితే వారి నోరే మండుతుంది.

ఒకయింట నిద్దరు సవతు లుండుట, ఒక బోనులో రెండుపులు లున్నచందమే.

కోపమునకు కండ్లు లేవు.

చిక్కుడుగింజకు తనపాదే తెలియదు.

చెఱకువ్యవసాయము పెదవులపైనే చేయ నారంభించుటా?

చెవులు పట్టుకొని లాగితే (ఎద్దు) రాకపోతే పైపని కొమ్ములు పట్టుకొని లాగడమే!

దారితప్పితే బాటప్రారంభమునకు తిరిగి రావలసినదే?

నోరు మంచిదికాకుంటే శరీరమునకుబాధే!

పిశాచమునకు జడిసి పీనుగను పట్టుకున్నట్లు.

పులియైనా తనపిల్లలజోలికి పోదు.

పెయ్యను సంరక్షించుమని పెద్దపులి కప్పగించినట్లు.

మహారణ్యములో మయూరనృత్యము.

ముంటికిగుంటచుట్టు గాబుచేరినట్లు.

రెండుదారుల రంపము.

రెండుపడవల పైనిలుచుట యపాయకరము.

లోతుకు(నీటిలో)దిగినకొలఁది చలిఉండదు.

**మలయధ్వజుఁడు**—ప్రవీరుఁడు, చిత్రవాహనుఁడు నను మారుపేరులుగల యీ మలయధ్వజుఁడు ద్రవిడ దేశపురాజు. అనఁగా పాండ్య దేశాధీశుఁడు. మన్వాదిస్మృతులలో నీతఁడు సంకీర్ణుఁ డని చెప్పఁబడినది. తనకూఁతురు చిత్రాంగద నర్జునుఁడు పెండ్లియాడెను.

అర్జునాదిపాండవులు సంకీర్ణు లగుటచేతనే సంకీర్ణుఁడగు (చిత్రవాహనుని) మలయధ్వజుని కూఁతురు చిత్రాంగదను వివాహమాడుట యసంగతము కాదని విమర్శకు లనుచున్నారు. వీరిరువురకును జన్మించినవాఁడు బభ్రువాహనుఁడు.

మలయధ్వజుని కోరికమేరకు బభ్రువాహనుని నాతనికే దత్తత నిచ్చెను. ఆకాలమున నవసరము కలిగినను యుద్ధమునకు దత్తునాహ్వానింపరు. ఒకానొకసమయమున నీబభ్రువాహనుఁడు తనతండ్రియగు నర్జునునితోఁ బోరాడుటయు, నర్జునుని జితోష్మీయునిపించుస్థితికిఁ దెచ్చుటయు మాత్రము సత్యము. అట్లయ్యును మహాభారత యుద్ధమున మాత్ర మీబభ్రువాహనుఁడు చేయి జేసికొనలేదు. కాని మలయధ్వజుఁడు (చిత్రవాహనుఁడు లేక ప్రవీరుఁడు) మాత్రము మహాభారతయుద్ధమునఁ బాండవులకు సహాయుఁడుగాపోయి మహాశౌర్యముతోఁ బోరాడి యశ్వత్థామచేఁ జచ్చెను.

ద్రావిడదేశప్రభు వగు నీమలయధ్వజునం బంధముగూడ పాండవసాంకర్యమునే దృఢపరచుచున్నది.

ఈమలయధ్వజుఁ డతిరథుఁడు.

**మలయాలదేశము**-కన్యాకుమారియగ్రమాది, కొంకణముదనుక పశ్చిమకనుమలకవ్వల సముద్రముదనుక నుండిన దేశము. ఇం దిప్పుడు తిరువాన్కూరురాజ్యము, కొచ్చినురాజ్యము, కొంత యితరభాగములు బ్రిటీషిండియాక్ మలబారుజిల్లాలుగ నున్నదేశము. దీని నిప్పటికి మళయాళదేశ మనుచునే యున్నారు.

తొలుత చేర, కేరళము లనుపేరులఁ బరగెడిదఁట. తులువ, ముషిక, కువ, కేరలదేశము లొకప్పు డిందుచేరియుండె నఁట.

ఇప్పటి తిరువాన్కూరురాజ్యపు రాజధానియైయున్నదియు, నాంగ్లులచే 'Trivandrum' అని పిలువఁబడుచున్నదియు నగు తిరువనన్తశయనపురము అనంతపద్మనాభ (విష్ణుదేవుని) క్షేత్రము; గొప్పధనవంతమగు దేవస్థానము. దీనిని చైతన్యస్వామియు నిత్యానందస్వామియు దర్శించినటుల చెప్పఁబడినది.

పద్మపురాణ, ఉత్తరభాగము ౭౪ యందు ప్రశంసింపఁబడినది.

**మలాకా సెటల్మెంటు**—ఇది స్ట్రెయిటు సెటల్మెంటులలో నొకటి. (చూడుఁడు.)

**మలాని క్షత్రియులు**— (చౌహాను క్షత్రియులు చూడుఁడు.)

**మలినదర్పణన్యాయము** అద్దము నకుఁ గళాయిచెడి ముఖమునీడ యందు సరిగా కన్పించకుండుట కర్థము. స్పష్టముగాఁ దెలియని బోధఁగూర్చి యీన్యాయము వాడుదురు.

**మల్లూాఖన్ న అయిదన్ చరిత్రగ్రంథము**—ఇది పారశీకభాషలోని చరిత్రగ్రం

థము. కమాలుద్దీన్ అబ్దుర్రజాకు పండితుఁడు దీనిని రచించినవాఁడు. ఈతఁడు తనవార్ధక్యదశయందు చనిపోవుటకు రెండుసంవత్సరములు ముందుగ క్రీ. వె. ౧౪౮౦ ప్రాంతమున దీనిని వ్రాసెనఁట. ఇందు రెండుసంపుటములు కలవు. మొదటి దంతయు తైమూర్ (లేక తామర్లేన్) చక్రవర్తి చరిత్ర; రెండవసంపుటమున నాతైమూర్ వంశస్థులచరిత్రయును, కర్ణాటాంధ్రసామ్రాజ్యమేలిన విజయనగరరాజ్య చక్రవర్తియగు ఇమ్మడిదేవరాయ మహారాజచరిత్రయు, నింక తా నెవ్వరి యాస్థానమునఁ గొల్వుండి బహూకరింపఁబడెనో యట్టి పారశీకాద్యితరభూనాథుల చరిత్రలునుగలవు. పరిశీలకులీచరిత్రయే లభింపకుండిన నిమ్మడిదేవరాయ మహారాజపాలనమునాఁటి విజయనగరసామ్రాజ్యపరిస్థితులు బయటఁబడకుండఁ బోయియుండుననుచున్నారు. ఇందునుండి విజయనగర సంబంధభాగమును, బెంగాలు సివిల్సర్వీసునకుం జెందిన C. J. Oldfield I. C. S. గా రాంగ్లభాషలోని కనువదింప, దానిని సుప్రసిద్ధపరిశీలకులగు Sir Henry M. Elliot పండితుఁడు పరిష్కరించి యున్నాఁడు.

అబ్దుర్రజాకుగారి తండ్రిపేరు జలాలుద్దీన్ యిసాక్. ఈకుటుంబము సమర్కండుదేశమున హేరట్పురవాస్తవ్యులిసాక్పండితుఁడు పారశీక చక్రవర్తిప్రభుత్వమున "కాజీ" యుద్యోగము కొంతకాలమును, "ఇమామ్" ఉద్యోగము కొంతకాలమును చేసి వారి యాస్థానపండితుఁడుగ నుండెను. అప్పటప్పట నాయననుండి ధర్మగ్రంథములనాచక్రవర్తివినుచుండువాఁడఁట.

ఆయనసుతుఁడగు మనగ్రంథకర్త (చరిత్రకారుఁడు) అబ్దురజాకుగారును గొప్ప విద్వాంసుఁడు. అరబ్బీభాషావైయాకరణి. ఆభాషా వ్యాకరణమునకు (అజ్దుద్దీన్ యాహ్యాపండితుని) విపులమగు గొప్పవ్యాఖ్య రచించి, సుల్తాన్ షారూఖ్ గారి కంకిత మిచ్చినవాఁడు. అందు సర్వనామములు, ప్రత్యయములుఁ జక్కఁగ వివరింపఁబడి యుండుట ప్రసిద్ధము. అది మహాగ్రంథమని పొగడ్తలఁగాంచుచున్న గ్రంథము. ఈచరిత్రకారుఁడు జయనగరచక్రవర్తియాస్థానమునను, గిలాన్దేశమునను, పారశీకసుల్తాన్ ప్రభుత్వపు రాయబారిగ నుండినవాఁడు. పెక్కండ్రు భూపతులమన్ననలఁ బడసినవాఁడు. హేరట్పురము జన్మస్థానమనియు, క్రీ. వె. ౧౪౧౩ నవంబ ఆరవతేది జన్మకాలమనియు, ౧౪౮౨ అక్టోబరున మృతినందె ననియుఁ జెప్పఁబడినది.

క్రీ. వె. ౧౪౪౧ లో రాయబారిగ నియమింపఁబడి, హోర్ముజు రేవుపట్టణమున రెండునెలలాపివేయఁబడి, యోడ నెక్కి యరబ్బీదేశమందలి "ఉమా"స్సింధుశాఖపైనున్న మస్కాటు రేవునందు దిగి, కరియాట్పట్టణమున శరీరాస్వస్థతచే నాఁగి, యట ననారోగ్యవంతుఁడౌట నహర్ పురమున కోడపై నరిగి, యట జ్యేష్ఠసోదరుఁడు మౌలానా అఫీఫుద్దీన్ అబుల్వాహబుగారు మృతినొంద, నాయనయపరకర్మలు నెఱపి యటనుండి తిరుగ నోడపైఁ బయలుదేఱి పందొమ్మిది దినములకుఁ గళ్ళికోటరేవున భరతదేశమునకుఁ జేరి, యచటిప్రభుఁడగు సామోరి (జామోరీన్) దర్శన మొనర్చి, (బహుశః ఆయనే విజయనగరాధీశ్వరుఁ డని తలఁచిగాఁ బోలును) యాఱునెల లచట వసించి, పిదప నెట్టకేల కటనుండి భూమిపైఁ బయనము సాగించుచు విజయనగరమునకుఁ జేరి చక్రవర్తి దర్శనము జేసి, మన్ననలందుచుఁ గొంతకాల మటనుండి, కలవు గైకొని మరలి డెబ్బదియైదు దినములు పయనముసల్పి తనదేశమునకుఁ జేరుకొనియెనఁట. అక్కాలమున విజయనగరచక్రవర్తి

ఇమ్మడి దేవరాయమహారాజు (దేవరాయ లను పేరుగల భూపతులలో రెండవవాఁడు). వీరిది సంగమరాజవంశము.

**మలెయాదేశము**—ఆసియా ఖండమున నిండూచైనీ స్వినెన్సులాయం దున్నది. ఇది చిన్న సంస్థానములుగ చీలి యున్నది. కొంత భాగము సయాంరాజ్యమునఁ జేరి యున్నది. ఉత్తరభాగము సయాంలోనిది. స్టేట్సులలో ముఖ్యమైనవి ఉత్తరమున కెడా, పెరాక్సే ట్సును, దక్షిణమున జోహూరు స్టేట్సును పెద్దవి. స్వదేశభూపతులచేఁ బాలింపఁబడు చున్నవి. పెరాక్సేటు, సెలాంగోరుస్టేటు, నైగ్రీ స్టేటు, సెంబిలాన్ స్టేటు, పాహాంగుస్టేటు గలసి ఫెడరేటెడ్ మలేస్టేట్సనఁబడు చున్నవి. ఇవి బ్రిటీషుప్రభుత్వమువారి రక్షణయం దున్నవి. ఇట నొక బ్రిటీషు రెసిడెంటు గలఁడు. ఈ యనయే మలెయాస్టేట్సుకు హైకమీషనరుగను బోర్నియో హైకమీషనరుగను గూడనుండును.

క్రాభూసంధి మలయాను భూమికిం గల్పును. దేశమునఁ దగరఁపుగనులు విస్తారముగఁ గలవు. వీట్లయందు చీనావారు పనిచేయుచున్నారు. దేశమున మేంగోస్టీనుతోఁటలు విస్తారముగఁ గలవు. ఆచెట్ల కిదియే స్వదేశము. ప్రజలు మలయా తెగవారు. ఆదిని సుమత్రాద్వీపవాసు లఁట. వారుమహమ్మదీయమతస్థులు. కోడిపందె ములు మొదలగువినోదముల నభిలషించువారు.

**మలేరియా జ్వరము** (Malarial Fever)—ఇది సూక్ష్మజీవుల(worms)జాతికి జెందినపురుగులనుండికల్గు నంటువ్యాధి. ఈజ్వర మునకుఁ గారణమగు సూక్ష్మజీవులకు (Parasites) మూఁడు జాతులుగలవని యింతదనుక జరిగిన పరిశీలనలనుండి తేలినది. వీటికి రూప భేదమే గాక రోగలక్షణభేదము గూడ గలదు. మొదటిదగు Plasmodium Vivax, లేక Laverania Malaria, రెండవది Plasmodium Mlaria, మూఁడవది Plasmodium Falciparum malaria అను పేరులఁ బరఁగెడిని. ఇందు మూఁడవది దుష్టజాతిజ్వర మును గల్గించును. మొదటిది రెండవదిసామాన్య జాతులు.

సామాన్యజాతులం దింకను Benign జాతి యనియు, Quartan జాతియనియు, నొక్కొక దానియందు రెండేసిభేదములు కలవు. మొదటి దగు Plasmodium Vivax పురుగులవలనఁ గల్గెడి జ్వరములకు జ్వరమువదలినదాది తిరుగ తగులుటకు ౪౮ గంటలవిరామముండెడిని. దీనికి "Benine Tertion" అనెదరు. ఇంక రెం డవతెగపురుగు జ్వరమువదలినదాదిగా మూఁడు దినములు విశ్రాంతి వదలి, తిరుగ జ్వరము గలి గించెడిని. దుష్టజాతి కీవిధానము లుండవు. ఉష్ణదేశములం దీజ్వరవ్యాధి యధికముగ నుండుటయు, సమశీతోష్ణప్రదేశముల వేస వియందు దీపించుటయు, మన్యఁపుఁబ్రదేశముల నివి తరుచై గన్పించుటయు, నీటిపాఱుదల సరి లేనితావులం దిది వర్షములుముగిసినపిదప నెక్కు వగుటయు గమనింపఁ దగిన యంశములై యున్నవి.

ఈరోగమునకాయుర్వేదవైద్యులు శీతపైత్య జ్వరమని పేరిడియున్నారు. ఇందుఁ బెక్కుభేద ములజ్వరములు చెప్పఁబడినవి. ఈజ్వరముతగు లుటకుఁబూర్వ మించుక మత్తు,నొడలుభారము, అస్వస్థత, శరీరమున వ్యాపించియుంట లక్షణ ములు. జ్వరముతోఁ దలనొప్పి, వెన్నునొప్పియు నొకొక్కప్పుడు కండ్లనొప్పులు సిద్ధమగును. ఈ జ్వరమున మూఁడవస్థలు కలవు. మొదటిది శీత లావస్థ. ఇందు చలి, వణకు, నెగిరిపడుటయు,

నొకొక్కరికి నోటిపండ్లు కదలుట, నలుపు గల్గి యుండును. రెండవది యుష్ణావస్థ. ఇందు కాలు సేతులు మంటలు, తలవేడి మొదలగు లక్షణములు గల్గియుండెడిని. మూఁడవది స్వేదావస్థ. శరీరభాగములందుఁ గాని,శరీర మంతటను గాని చెమటలు పట్టి జ్వరము తగ్గుటతోఁ గొంత విశ్రాంతి కల్గిన ట్లుండును. ఒకొక్కసారి జ్వరము తగులుట యును, నీమూఁడవస్థలు కూడ సంభవించును. Sir R. Ross పండితుఁడు గొప్పపరిశీలన లొనర్చి మలేరియా Parasities పదునేనుకో ట్లుండు నని బహిరంగపఱచి యున్నాఁడు. గులాబీచెట్లయాకుల వాసన యీపేరాసిటీస్‌ను నశింపఁజేయునని చెప్పఁబడినది. ఆంగ్లవైద్యు లీరోగమునకు "క్వినైను" తగినయౌషధ మనుచున్నారు. మలేరియాదోమలకాటునుండి యీపురుగులు శరీరమందలి యెఱ్ఱనిరక్తము (Red Capsules) నందుఁ బ్రవేశించునని యందురు. (దోమలు చూడుఁడు. అంటువ్యాధులుచూడుఁడు. సూక్ష్మజంతువులుచూడుఁడు. పెరాసిటిస్ చూడుఁడు).

ఇంక నీసందర్భమున నీమలేరియాపురుగును గూర్చి యించుక వివరించుట సమంజసము. దోమకాటుతో మలేరియాపురుగు మనుష్యుని రక్తమునఁ జేరును. రోగిరక్తము నద్దముపై నలఁది భూతద్దముతోఁ బరిశీలించినయెడలఁ జిన్నయుంగరము వలె నాసూక్ష్మజీవి యగుపడెడిని. Capsules తరుచు పురుగు వృద్ధియై సంతానముం గనును. ఇట్లగుటకు మొదటి తెగపురుగునకు ౪౮ గం॥ లకాలమును, రెండవ తెగపురుగునకు ౭౮ గం॥ లకాలమును బట్టునని తేలుచున్నది. మానవశరీరమం దిట్లు వృద్ధి నొందిన మలేరియాపురుగు, వివిధావస్థలఁజెందెడిని. బాగుగ నభివృద్ధినందిన కడపటియవస్థయం దీపురుగు గర్భదండాకారముగ నగునని చెప్పఁబడినది.

మనుష్యుఁ డగురోగిని దోమ కఱచుటతో, రక్తపానమున దోమశరీరమునం దీపురుగు చేరి, యట గ్రుడ్లు పెట్టును. తిరుగ నాదోమకాటు వలన మనుష్యశరీరములోనికిఁ జేరుచు, రోగమును వ్యాపింపఁజేయుచుండును. దోమకడుపున పురుగభివృద్ధి యగుటకుఁ బదిదినములు పట్టును. మానవశరీరమునం దిది ప్రవేశించినదాదిగ పది దినములకు జ్వరముకలుగఁజేయును. స్త్రీపురుషరూపములు దోమలం దేర్పడకుంట నొక్కొక సందర్భమునఁ గల్గుననియు, నత్తటి నాపురుగులు నశించుచుండు ననియు పరిశీలనలవలన ధ్రువపడినది. (దోమలు చూడుఁడు).

(స్టెగోమియా జాతిదోమ, అనాఫిలీస్ జాతి దోమ, క్యూలెక్సుజాతిదోమ చూడుఁడు).

**మలేసియా** (Malaysia) — ఇది 'ఓసీనియా'యందలి యైదుభాగములలో నొకటి. ఇది పసిఫిక్కుమహాసముద్రమునందలి వాయవ్యదిశయందున్న ద్వీపసముదాయము (ఓసీనియా చూడుఁడు). మలేసియా ద్వీపసమూహమున కిష్టిండియన్ ఆర్చిపెలెగో యనియు వాడుక నామము గలదు. ఈద్వీపములు 'Sunda Islands' అనియు, బార్నియోద్వీపమనియు, ఫిలిప్పైన్‌ద్వీపము లనియు (ఇందు సెలిబిస్ ద్వీపము జేరియున్నది.) 'మొలుక్కా'ద్వీపము లనియు నాల్గు తెగలుగ శాస్త్రజ్ఞులు విభజించి యున్నారు. మరికొందరిందలి యేష్యాటిక్కు ద్వీపములను వేరుసమూహముగ నెన్నుదురు. కొందరు పైనాల్గింటిలోనే కల్పుచుందురు. కొందరు భూగోళశాస్త్రజ్ఞు లివి యాశియా సంబంధద్వీపములే యనియెదరు.

మలయావా రను పేరుగల ప్రజ లీద్వీపముల నెక్కువగ నివసించుటఁజేసి యీద్వీపసమూహ

మునకు మలేశియాయను పేరు కల్గెనందురు. కాని యీద్వీపముల యాదిమనివాసు లనాగరికులును క్రూరులును నగు నీగ్రోజాతివా రనియు వారిని మలయావారు మధ్యభాగములకుఁ దరిమి రనియుఁ దేలుచున్నది.

ఈద్వీపము లన్నియుఁ బర్వతమయములు. అందుఁ బెక్కు లగ్నిపర్వతములుగ నున్నవి. బార్నియోద్వీపమున రత్నములు, బంగారము దొరకును. లబూఆన్ ద్వీపమున మంచిరాతిస బొగ్గుజాడలు గలవు. ఇది బ్రిటీషుప్రభుత్వము వారిది. వీటియందు మిరియములు, జాజికాయలు, లవంగములు, ధాన్యము, చెఱకు, కాఫీగింజలు, నీలిమందును జక్కగాఁ బైరగుచుంట గాననగు చున్నది.

మలయాజాతిప్రజలు పెదురుకర్రలతో వం దిళ్ళు వేసి వాటిపై గృహములను నిర్మించుకొనె దరు. వాటి నెక్కుటకు నిచ్చెన లుండును. వీరు పడవలను చతురతతో నడుపునేర్పు గలవారు. కొందరు వర్తకము చేయుచుందురు కాని దోపి డిగాఁడ్రని వీరికి వదంతికలదందురు. వీరు మహ మ్మదీయమతస్థులు.

**మలై చిదంబరము**—(పేరూరు చూ).

**మల్లతాళము**-(తాళములు చూడుఁడు).

**మల్లదేశము**— మల్లదేశములు రెండు, లేక మూఁడు, గాననయ్యెడిని. మహాభారతము భీష్మపర్వము ౯ వ అధ్యాయమున దూర్పున నొకటియుఁ బశ్చిమముననొకటియు రెండుమల్ల దేశములు జెప్పఁబడినవి. బుద్ధభగవానుని కాల మునఁ గుశనగరప్రాంతమున నొకమల్లదేశము చెప్పఁబడినది. ఇప్పటి కాశియా (తొల్లింటి కుశినగర) ప్రాంతమునఁగల పాటిదిబ్బల నా కాలపు మల్లభూపాలసామంతుల ప్రాసాదము లుగ నచటివారు జూపుచున్నారు. రామాయ ణోత్తరకాండము ౧౧౫ వ అధ్యాయమున శ్రీరాముఁడు తనసోదరుఁడగు లక్ష్మణునిపుత్రుఁ డగుచంద్రకేతునకు మల్లదేశ మొసఁగి రాజుగఁ జేసెనని చెప్పఁబడినది. ఇది ఇప్పటి ముల్తాన్ పురప్రాంతదేశమని పెక్కండ్రు పరిశీలకులు దలంచుచున్నారు. ఈపురము రావీనదియుభయ తీరములం దున్నదిగా తేలుచున్నది.

పూర్వము మాళిస్థానపురమనియుండిన యీ నగరము కాలానుగతిని మూలస్థానపురముగ మారి, ఇప్పటికి ముల్తా ననఁబడుచున్న దఁట. ఇది సూర్యక్షేత్ర మఁట. హ్యూయనచ్యాం గీక్షేత్రముఁదర్శించి ఇట బంగారుసూర్యవిగ్రహ ముండినటుల వ్రాసియున్నాఁడు. అప్పు డిదియే దేశపురాజధాని యఁట. మల్లులదేశ మనియు నప్పుడు బాచ్యరాజులు దేశమును పాలించు చుండిరనియు వ్రాసియున్నాఁడు. అలగ్జాండరు చరిత్రకారుఁడు దీనినిమల్లులదేశమని పేర్కొనిరి.

ఇప్పటిముల్తానుపురమునకు దక్షిణముగానా ల్గుమైళ్ళదూరముననున్న సూర్యదేవస్థానమును, సూర్యకుండమును, శ్రీకృష్ణుని సుతుఁడగుసాం బునకు శాపమువలనఁ గల్గిన కుష్ఠువ్యాధి నాపు కొన సూర్యునిఁగూర్చియిట తపంబొనర్చెనఁట. ఇది సాంబుఁడే ప్రతిష్ఠించి కుండముఁ ద్రవ్వించె నని చెప్పఁబడినది. దీనిఁగూర్చి భవిష్యపురాణ బ్రహ్మ.౭౪యందును, బ్రహ్మపురాణము౧-౧౪౦ యందును ప్రశంసలు గలవు. ఇది యిక్కాల మున సుప్రసిద్ధసూర్యక్షేత్రమై దనరుచున్నది. భవిష్యపురాణ. బ్రహ్మ ౭౪యందు సూర్యదేవు నర్చించు పూజారులను శాకద్వీపమునుండి యా దిని రప్పించిరని చెప్పఁబడియున్నది.

తొల్లింట రాజధానీపుర ముండిన తావున హిరణ్యకశ్యపుని రాజధానియుండెనఁట. అప్పటి దానిపేరు తెలియరాకున్నను పెక్కండ్రు హిరణ్యా

కశ్యపపురమని యుండియుండినదిగ తలంచుచున్నారు. 'కన్నింగ్హాము పండితుఁడు' నట్లేయని పోల్చియున్నాఁడు.

మహాభక్తుఁడగు ప్రహ్లాదుఁ డిటనే విష్ణుదేవుని నృసింహావతారమున రక్షణఁ బడిసెనఁట. పాతకోటలోని నృసింహదేవస్థానము హిరణ్యాకశ్యపుని నివాసభవన ముండినతావఁట. అందలి స్తంభమునుండి యవతారమూర్తి వెడలినతావు ననే దేవస్థాన మేర్పడియెనఁట. ఇప్పుడాపరిసరములను 'ప్రహ్లాదపూ' రని వాడుచున్నారు. ఈ పేరు ప్రహ్లాదపరిపాలనమునుండి గల్గియుండు నందురు.

ఇప్పటి ముల్తానునుండి యేబదిమైళ్ళదూరమున సులైమాన్ పర్వతమందలి యొకకొండ చరియకు ప్రహ్లాదపర్వత మని వాడుకనామము కలదు. అటఁగల యొకసరస్సులోని కటనుండి ప్రహ్లాదుఁడు తండ్రియాజ్ఞ మేరకు త్రోసివేయఁ బడెనఁట. ఆతావులన్నియుఁ బంజాబులోనివే.

రామాయణమున మల్లభూమియనియు, మహాభారతము,సభాపర్వము 30 యందు మాళవయనియుఁ బేర్కొనంబడినట్టియు, రామాయణోత్తర ११౫ యందు మల్లదేశమని ప్రశంసింపఁబడిన దేశ మిదియే యైయున్నది.

**మల్లనాథుఁడు**-జైనతీర్థకరులలో నొకఁడు. (తీర్థకరులు చూడుఁడు). మల్లనాథుఁడు—(మల్లినాథుఁడు). చిహ్నము కుంభము. ఇక్ష్వాకువంశక్షత్రియుఁడు. తండ్రి కుంభనృపాలుఁడు. తల్లి ప్రజావతీదేవి. జన్మస్థలము మిధిలాపురము పొడవు-౨౫ధనస్సులు. వర్ణము సువర్ణచ్ఛాయ. ఆయు వేబది యైదువేలు. గణధర్సంఖ్య ౨౮. నిర్వాణస్థలము సుమేరుశిఖరము. అంతరాళము ౫౪ లక్షల సంవత్సరములు.

**మల్లపర్వతము** — పరేశనాథ (జైన) క్షేత్రముండిన పర్వతమున కీపేరుండెను.

**మల్లంపల్లి నాగభూషణకవి** — ఆంధ్ర కవులలో నాధునికులందుఁ బరిగణింపఁ బడినవాఁడు. నియోగిబ్రాహ్మణుఁడు. శైవమతస్థుఁడు. హరితసగోత్రము. తండ్రిపేరు త్రిపురాంతకారాధ్యులు.

రచించినది బసవవిజయమను శైవమతగ్రంథము. పద్యకావ్యము.

**మల్లవరపు వాలేశ్వరకవి**—ఆంధ్రకవులలో నాధునికులందు పరిగణింపఁబడినవాఁడు. పాకనాటి నియోగిబ్రాహ్మణుఁడు. (పాకనాడు చూడుడు.) శైవుఁడు. గౌతమసగోత్రము. తండ్రిపేరు పోలయామాత్యుఁడు. కాపురము మల్లవరమో లేక యాప్రాంతమో యని తోఁచెడిని.

ఈకవి భల్లాణచరిత్రమును పద్యకావ్యముగ రచించి,ఆంధ్రదేశమున బళ్ళారిమండలములోని విన్నకోటయందలి మల్లవరమున సుప్రసిద్ధుండగు నాగేశ్వరస్వామికిఁ గృతి సమర్పించెను.

**మల్లశాస్త్రము**— మల్లశాస్త్రగ్రంథము లిక్కాలమునఁ గానరాకున్నవి. గాని కసరతు చేసి మల్లవిద్య నెఱింగినవారుతరతరములుగజ్ఞాకపరంపర పోషింపఁ బడుచు నెఱుంగుచున్న కొన్ని యంశముల పేర్లనుమాత్రము వివరింతుము. ఆంగ్ల మల్లశాస్త్రము మే మిందు గైకొనలేదని యెఱుంగునది.

ఉపవిడములు ౧౬- ౧ దండనిలకడ, ౨ కదలునిలకడ, ౩ కదలు మెలకువ, ౪ విదళింపు నిలకడ, ౫ దిశావదిశలు, ౬ పాదపు పారుపు, ౭ హస్తపుపారువు, ౮ దేహపు పారుపు, ౯ నయపుపారువు, ౧౦ వీవ, ౧౧ రాకడ, ౧౨ పీకసర, ౧౩ పైసర, ౧౪ ఝుంపు, ౧౫ ఫిక్కు- ౧౬ కరలాఘవము.

కాయమానములు౧౨-విష్ణుచక్రము,౨రామ

బాణము, ౩ నాగబంధము, ౪ తోలకరిమెఱుపు ౫ అల్లిమత్తు, ౬ విస్సందు, ౭ హస్తాభరణము, ౮ పదఖండము, ౯ ఉరిత్రాడు, ౧౦ లోబిత్తరి, ౧౧ వెలిబిత్తరి ౧౨ సర్పాంకుశము.

గతులు ౧౨- ౧ హరిగతి, ౨ గజగతి, ౩ వ్యాఘ్రగతి, ౪ మహిషగతి, ౫ జంబుకగతి, ౬ కుక్కుటగతి, ౭ మార్జాలగతి, ౮ హరిణగతి, ౯ చటకగతి, ౧౦ పక్షిగతి, ౧౧ తాండవగతి, ౧౨ నరగతి.

దండలు ౧౨- ౧ సమదండ, ౨ గజదండ, ౩ భృంగిదండ, ౪ ఎడమవరదండ, ౫ కుడివరదండ, ౬ భృంగిపటలము, ౭ వేసరపుదండ, ౮ సింగపుదండ, ౯ పోదలికదండ, ౧౦ అడుగడుగునకుం గల్గుపొదలికదండ, ౧౧ మద్దెలసంచుదండ, ౧౨ కుక్కుటపుదండ.

నరకులు ౩ - లోవెలినరకు, గుజ్జరిధుముకు నరకు, ౩ చూరణనరకు.

ప్రచారములు ౩౨ - ౧ భ్రాంతము, ౨ ఉద్భ్రాంతము, ౩ అప్లుతము, ౪ అవిప్కృతము, ౫ ఆహికము, ౬ అవిధము, ౭ ఆకరము, ౮ అవికరము, ౯ వికృతము, ౧౦ మిశ్రితము, ౧౧ మానవము, ౧౨ నిర్మర్యాద, ౧౩ చిత్రికము, ౧౪ భిన్నము, ౧౫ సవ్యజానువు, ౧౬ అపసవ్యజానువు, ౧౭ క్షిప్రము, ౧౮ ద్రుతము, ౧౯ సవ్యబాహువు, ౨౦ వినీతబాహువు, ౨౧ త్రిబాహువు, ౨౨ సవ్యోత్తరము, ౨౩ ఉత్తరము, ౨౪ సవ్యకరము, ౨౫ తుంగబాహువు, ౨౬ ప్రధితము, ౨౭ యాధికము, ౨౮ అపృష్టప్రవాహరణము, ౨౯ వల్గితము, ౩౦ కుంచితము, ౩౧ స్వస్తికము, ౩౨ గుడంబము.

పరువడులు ౧౨-. ౧ ఎడమయడుగు (పరువడి), ౨ కుడియడుగు (పరువడి), ౩ కదలుపరువడి, ౪ దాటుపరువడి, ౫ కోపుపరువడి ౬ ఒంటియడుగుకత్తెర (పరువడి), ౭ సర్పబంనుకత్తెర (పరువడి), ౮ చిట్టడుగుకత్తెర(పరువడి), ౯ జాగినకత్తెరల (పరువడి), ౧౦ పొదలికకత్తెర (పరువడి), ౧౧ పావురపుపావులపరువడి, ౧౨ జాగినపావులు (పరువడి).

మొనలు ౧౨- ౧ లోమొన, ౨ వెలిమొన, ౩ ఉసిమొన, ౪ చతురుమొన, ౫ పుణ్యాంపుమొన, ౬ పాపంపుమొన, ౭ చాటడుగుమొన, ౮ దాటడుగుమొన, ౯ కదలుమొన, ౧౦ అరమీటుమొన, ౧౧ నెరమీటుమొన, ౧౨ సరితాళంపుమొన.

విన్నాణములు ౩౨- (వీటిని విన్నాణము లని వాడుచున్నారు.) ౧. కక్కి, ౨. కొక్కిస ౩. డొక్కస, ౪. ముత్తెర, ౫. కుమ్మరింపు, ౬. జోడింపు, ౭. సందుసీసకము, ౮. గొన్తుడూరును, ౯. సమసీసము, ౧౦. సురాటంబును ౧౧. చేవ, ౧౨ కరదనము, ౧౩ కల్లంబు, (కల్లము) ౧౪. తోట్టి, ౧౫. కిల్లి, ౧౬. బరిపోటి, ౧౭. రొండివేటు, ౧౮. పణము, ౧౯. కర్ణాతు, ౨౦. సుభారము, ౨౧. చోంగణము ౨౨. పెట్లాగు, ౨౩. రూణింపు, ౨౪. సరిబిత్తరము, ౨౫. వాటీళము, ౨౬. లాగు, ౨౭. సింగిణి, ౨౮. పాదనివారణము, ౨౯. పదగళాప్తి, ౩౦. గళకత్తెర, ౩౧. నృసింహము, ౩౨. కాశనిలకడ.

విసరులు ౧౪ :- ౧. ధారు, ౨. ధాణు, ౩. ధోడ, ౪. ఉద్ధడ, ౫. అస్త్రటీక, ౬. టీక, ౭. నాట్య, ౮. ధారుధాణు, ౯. ఝాటు, ౧౦. ధాణుకపాలు, ౧౧. ధారకపాలు, ౧౨. ధాణుధారు, ౧౩. కథాక, ౧౪. ధాణుధాక.

ఇంకను పల్లిటీ లనియు, దండెము లనియు, పేరీ లనియు, మొదలగునవి కొన్ని గలవు గాని

సరియగు లెక్క గానరాదు. ఇంకను, నివి దేశ భేదములనుండి వేర్వేరుపేర్లం బరగుచుండు భేదములగు మెళకువతోఁ గూడియుండుటయు, శాస్త్రగ్రంథములు లేమికిఁ దోడై యిదమిత్థమని వ్రాయుటకు వీలుగాకున్నవి. మధ్యకాలములందు మహమ్మదీయులవశమై యీవిద్య చాల వఱకు మాఱినదనియె చెప్పవలయును. మల్లశాస్త్రబోధనాప్రదేశముల నిక్కాలమున "తాలింఖానా" లనుచున్నారు

**మల్లారిలింగక్షేత్రము** - నిజాము రాష్ట్రమున రాయచూరుమండలమునందున్న క్షేత్రము. సుప్రసిద్ధము.

**మల్లారిషష్టి**- (స్కంధషష్ఠి చూడుఁడు).

**మల్లారెడ్డికవి**—ఆంధ్రకవులలో మధ్యకవులందుఁ బేర్కొనఁబడిన రాజకవి. రెడ్డికులము. రాచుళ్ళగోత్రము. తండ్రిపేరు కాచభూపతియని వాడుకగల కాచిరెడ్డి. వీరింటిపేరు కామినేనివారనియు, ఢిల్లీయందు పాదుషాచే గొప్పమన్ననలందినటులఁ జెప్పఁబడిన కామినేని కామారెడ్డి యీతనికి సోదరుఁడనియు వాడుకలు గలవు. మల్లారెడ్డి గొప్పశివభక్తుఁడు. వైయాకరణి యనియు, వేదాంతశాస్త్రవిదుఁడనియు, శైవాగమశాస్త్ర విశారదుఁడనియు నిదర్శనములు గలవు. మల్లారెడ్డి సామంతభూపాలుఁడై గోల్కొండభూపతియగు మాలిక్ ఇబ్రహీంషా పాలనమునాటివాఁ డందురు. పెక్కండ్రుకవుల నాదరించి పోషించినవిద్యాభిమాని.

ఈరాజకవి రచించినవి శివధర్మోత్తరఖండమును షట్చక్రవర్తిచరిత్రము ననంబడు పద్యకావ్యములు. షట్చక్రవర్తిచరిత్ర యాశ్వాసాంతగద్యములో "ఇతి శ్రీమద్బిక్కనవోలు పట్టణప్రసిద్ధ సరిత్తటావలంబ సిద్ధరామేశ్వర వరప్రసాదసమాసాదిత" అని చెప్పికొనియుంట నిప్పటి నిజాంరాజ్యములోని బిక్కనూరని తెలుచున్నది. ఇటనే సిద్ధరామేశ్వరశివలింగము సుప్రసిద్ధము. ఈకవి మల్లారెడ్డియు అటనో లేక నాప్రాంతముననో సామంతభూపాలుఁడుగనుండి యుండనోపు.

మల్లారెడ్డినృపతి గొప్పశివభక్తుఁడు. ఈతని రాజ్యమునందే గోదావరీనదీతీరమున వేములవాడ యను క్షేత్రమునఁగల రాజేశ్వరస్వామి యం దీతని కపారభక్తి గలదందురు. ఢిల్లీనగరమున కామినేని కామారెడ్డిని గారవించినది యక్బరుచక్రవర్తియని వినుచున్నారము

మల్లారెడ్డి కాలమున గోల్కొండ నవాబు మాలిక్ ఇబ్రహింషా యగునేని, ఇది సరియగునో కాదో పరిశీలింపవలసి యుండును. అనఁగా కాదేని కామినేని కామారెడ్డి యీమల్లారెడ్డికి సోదరుఁడు గాకుండును. ఇంకను మల్లారెడ్డిభూపతి యింటిపేరు కామినేనివారు గాక ఇంకొకరై యుండి యుండవలసివచ్చును. ఇది యింకను పరిశీలింపఁ బడఁదగినదని మాయభిమతము.

**మల్లికార్జునపండితారాధ్యులు**—ఈ మహాత్మునుండియే శైవారాధ్యబ్రాహ్మణులో నర్చు శివభక్తివిధానమునకు పండితాచారమనియు, బసవేశ్వరులాచరించిన శివభక్తికి వారినుండియె బసవాచారమనియు వాడుకలుగల్గెను. పండితాచారము వేదోక్తాగమవిధానము; బసవాచారము కేవ లాగమోక్తము. మల్లికార్జనపండితులు తూర్పుగోదావరీ మండలములోని ద్రాక్షారామ నివాసియనియు, ఋగ్వేది, గౌతమసగోత్రజుఁ డనియు, తల్లిపేరు గవరమ్మయనియు, కోటిపల్లి (కోటిఫలి) కాపురస్థుండగు అవాంతరారాధ్యులవారి శిష్యుఁడనియు, క్రీ. శ. ౧౧౬౦-౭౦ ప్రాంతములవాఁడనియు, బసవేశ్వరులకు సమకాలికుఁడనియు, సుప్రసిద్ధపరిశీలకు

లగు చిలుకూరి వీరభద్రరావుగారు దెల్పియున్నారు. గొప్పవిద్వత్కవి. శివతత్త్వసారమను పద్యకావ్యము రచించినవాఁడు. సుప్రసిద్ధపరిశీలకులగు భండారు తమ్మయ్యదేవరగారు బసవేశ్వరులమృతి క్రీ. శ. ౧౧౬౮-౭౦ యని నిర్ణయించిరి. మల్లికార్జునపండితులకు బసవేశ్వరులు తనశివభక్తివిధానముఁ దెల్పిరఁట. దానికి పండితులు "ఆ॥ వె॥ జననిపైనిప్రేమ జనయిత్రిపై భక్తి । వదలలేనిబాల పగిఁదినేను । భక్తిమీఁది వలపు బ్రాహ్మ్యంబుతోఁబొత్తు। బాయఁజాలనేను బసవలింగా" అని ప్రత్యుత్తరమిచ్చి వారిఁ జూడఁగోరిరఁట. కాని వారును వీరును కలుసుకొనకముందే బసవేశ్వరులు మృతినందిరని విని తనశిష్యునిపరిముఖమున శ్రీశైలయాత్ర తనకుఁగాను చేయించి తాను వెళ్లిగ్రామమునందు మరణించిరని చెప్పంబడినది. (బసవేశ్వరులు చూ.)

**మల్లికామోదము**-(తాళములు చూ.)

**మల్లిచెట్టు**—లా. Jasminum Sambac. ఆంగ్ల Jasmine tree. సం. మల్లికా, మదయన్తీ.

మల్లెజాతియం దైదు భేదజాతులు గలవు. ౧ త్రిపురమల్లిక, ౨ మోహినీమల్లిక, ౩ వటపత్రీమల్లిక, ౪ మోహనమల్లిక, ౫ వృత్తమల్లిక (బొండుమల్లె లేక బొడ్డుమల్లె) యనియు. మల్లెపూవుల పరిమళము సుప్రసిద్ధము. స్త్రీలు తలయందు పరిమళమునకై యలంకరించుకొనెదరు. హిందువులీపూలతో దేవుని పూజింతురు. గౌరవార్థము మల్లెపూదండలను పూజ్యులమెడ నిడి గౌరవింతురు.

మల్లెపూవులు వెండ్రుకలకు నేత్రములకు బలమొనంగు ననియు, స్త్రీలకు చనుకుదురగుతరి పాలు చేపురాకుండ నాపుటకు దోసెడుపూలఁ జితుకకొట్టి పైనికట్టిన యాపుననియుఁ జెప్పఁబడినది. ఆకులరసము లేక వేరురసమునందు వాతపైత్య రక్తదోషముల నడంచి, నేత్రరోగముల మాన్పి శుక్లవృద్ధి గల్గించుగుణము గల్గియున్నది. అడవిమల్లెయాకు రసమునందు స్త్రీలఋతుశూలల నివారించుగుణమును, నొగరుపు, ధ్వనిగలదగులను నివారించుగుణమును, గలదని చెప్పఁబడినది.

మల్లెయందుగానవగుముఖ్యజాతిభేదములు—తుప్పలవలెఁ బెరిగి పూచుజాతియును, తీగలుగఁ బ్రాకి పూచుజాతియు ౨ యున్నవి. ఇందు మొదటిజాతియందే యాకులభేదములు పూవుల భేదములు గలవు. తక్కినజాతులు గానబడవు. అడవిమల్లెతీగజాతి యధమపుజాతిదిగ నెంచబడును.

**మల్టిప్లెక్సు, టెలిగ్రాఫీ**—ఇది ఎలెక్ట్రిక్ టెలిగ్రాఫీయం దొకవిధానము. దీనిమూలమున నొకేతంతిపై నేకకాలమునఁ బెక్కు వార్తాసముదాయములనొకటితోనొకటి కలసిపోకుండ నొకేసారిగ నిరుదెసలనుండి వాయించుచు తంతీవార్తల నంపగలుగుచున్నారు. ఇటుల నెక్కువపని జరుగుచున్నది.

(తంతీవార్తాయంత్రము చూడుఁడు).

**మశూచికము**—ఇది యంటువ్యాధి; త్వరగా వ్యాపించునది. మూడు లేక నైదు లేక యేడు దినములు తీవ్రజ్వరముగల్గి పిదప శరీరమున బొక్కలు ప్రారంభమగును. వీటికిఁ గుండలని వాడుచున్నారు. అవి తరుచుగ ముఖమునందు ప్రారంభమై క్రిందికి పాదములకు దిగును. దీనినిసవ్యఁపుఁబోతయనెదరు. కొందరి కింకను పాదములకడ నారంభించి ముఖమువరకును పైకెక్కి తిరుగఁ గ్రిందికిఁ దిగును. దీని నపసవ్యఁపుఁ బోత యనియు ననుటకలదు. ఈ పోతలందు విధముఁ దప్పినచోఁ బ్రాణాపాయము కల్గునందురు.

మశూచిపోత చులకన యగునేని యైదుదినములకుఁ బొక్కులు చితుకనారంభించును. దీనిని చిలుకుట లేక చిలుకబారుట యనివాడుచున్నారు. ఇంక పోత బరువగుతరి నిరువదియొక్క దినములవరకు చిలుకబారక నిలుచుటయుఁ గలదందురు. తరుచుగ నేడు, తొమ్మిది, పదునొకండు దినములకుఁ జిలుకబారుచుండెడిని. ఈవ్యాధి మనుష్యులకు పశువులకు మాత్రము దాకుచుండును. దీనికిఁ గారణమగు సూక్ష్మజీవులఁగూర్చి యింకను పరిశీలనలు స్పష్టపర్చలేదు.

కుండలలోని చీమును వేరొకరికి సూదితో గ్రుచ్చి రక్తమునం దంటించినచో వారికి యీ వ్యాధి తగులుటవలన కుండలలోని చీమునం దీసూక్ష్మజీవు లుండునని తేలుచున్నది. కుండ లెండినను వాటిపొలుసులం దీసూక్ష్మజీవు లుండి గాలిలో నెగిరి యురమైలుదూరముదనుక గాలితోపోయి వ్యాధిని వ్యాపింపజేయునని కన్గొనఁబడినది.

ఈగలుకూడ నీరోగమును వ్యాపింపజేయును. బాగుగ పక్వముగాని యాహారమును దినువారును, బలహీనులును, రోగిసమీపమున నివసించువారును నీరోగమునకు సులభముగా పాల్పడెదరనిచెప్పఁబడినది. ఈరోగవ్యాప్తికి పసుపు, వేఁపాకు నిరోధము లందురు. ఒకసారి యీరోగముఁ బడినవారు జన్మమున దిరుగ నీ రోగమునకు పాల్పడకుందురని యనుచున్నారు. ఈరోగవ్యాప్తికి నిరోధముగ ప్రభుత్వమువారు టీకాలను వేయుచుందురు. ఈరోగము కొందరి కంధత్వముఁ గల్గించును.

**మషోనాలాండు**— దక్షిణాఫ్రికాయందలి రోడ్డేశియా టెరిటరీలో, దక్షిణ రోడ్డేశియా యందు చేర్పఁబడిన టెరిటరీ. (దక్షిణాఫ్రికాయను-రోడ్డేశియాయను చూడుఁడు).

**మసకావతీ పురము**— దీనిని అలగ్జాండరు చరిత్రకారులు 'మస్సగ' యనియు, నక్బరు చక్రవర్తి చరిత్రకారులు 'మాష్నగ' రనియు వ్రాసియున్నారు. యూసూఫ్‌జాయి దేశమున (స్వాత్ శుభవస్తు)నదీతీరమున బాజోర్పురము నుండి ౨౪ మైళ్ళదూరమునం దున్నది. Mac Crindles Magasthenes and Arrian ౧౮౦ పుటయం దీపట్టణ మలెగ్జాండరు దాడి నెదిర్చినాల్గురోజులు నిలువగల్గెనని చెప్పఁబడినది.

మసకావతీపురము మసకెనోయిజాతివారి దేశపు ప్రధాననగరమని అరియన్ వ్రాసెను.

**మసుర(పప్పు)చెట్టు (మశూరపప్పు)** లా. Cicer-lens-సం. మంగల్యకః, మసూరకః, మసూరిః, రాగదాలిః, లాసకః,వ్రీహికాంచనః ఇంకను మరికొన్ని తావులందు కల్యాణబీజః,అనియు, గభోలికః అనియు, తాంబూలరీగః, అనియుఁగూడ వాడియున్నారు. హిందీభాషయందు 'మసూర్' అని వాడెదరు. శరీరబలము, వీర్యబలము గల్గించి యించుక పైత్యోద్రేకము, నించుకకఫశాంతియు జేయును. ఉత్తరహిందూస్థానమున కందిపప్పు సెనగపప్పు వలెనే దీనిని భోజనపదార్థముగ వాడుచున్నారు. బహుశః యిది యెర్రనిరంగుగల కందిపప్పు తెగలోనిదియో లేక బటాణీ బొడిశనగవంటి వేరుజాతిదియో యయియుండును. కొందరు దీనిని చిరుశెనగపప్పనుటయుఁ గూడగలదు.

**మసురవిహారము**—స్టెయిన్ పరిశీలకుఁ డుద్యాణదేశఁపు పురాతనరాజధాని యగు మంగుళూరునకు నైరుతిదిశగా నిరువదిమైళ్లదూరమున (బునేరుదేశమున) నున్న యిప్పటిగుంబటోలుగా బోల్చియున్నాఁడు.

**మసూరియుమ్ (Masurium)**—ఇది యొక Chemical Element అనియు తలఁపఁ

బడుచున్నది. దీని Symbal Ma. అనియు, Atomic number 43 అనియు చెప్పఁబడినది క్రీ. శ. ౧౯౨౫ సంవత్సరమున Noddack and Tacke అనువారలవలన కనుఁగొనబడినది. Rhenium తోఁ గలసి Mineral Columbite నందు దొరుకునని చెప్పఁబడినది.

**మసొల్ దేశము**-(అల్జజీరా దేశము చూ.

**మసొల్ పట్టణము**—ఇది మెసపొటేమియా దేశమున టైగ్రిస్ నదీతీరమునందు బాగ్దాదు నగరమునకు ఉత్తరముగా ౨౨౦ మైళ్ళదూరమున నున్నది. ఇట నానవి పర్వతోత్పన్న ప్రదేశ [illegible] ముఖ్యాలకు [illegible]. అది మెసపొటేమియా సమతల ప్రదేశమునకు ఖుకుసుసాన్ మెరక ప్రదేశములకు నడుమ నుండును. మసొల్ ఒకప్పుడు పడవలరేవుగను, వర్తకస్థానము నైయున్నది. తొల్లింటి కారవాన్ సారస్తాలుకలియు తావుగాను, నాటి కారవానావర్తకమునకు కేంద్రముగ గలదు. దీనిఁ జుట్టియుండు కోటగోడ లారుమైళ్ళుండును. అవి కొన్ని భాగములు నిలిచియున్నవి. నాటికాలమున సల్లాయుద్దీను, నాదర్షాల ముట్టడులకాగినవని చరిత్రప్రసిద్ధము. మసొలు నీమయందు విస్తారము నేయఁబడి, దేశదేశముల కెగుమతిచేయఁబడు బట్టలతానులకు మసొలిన్ తానులని వాడుకగల్గి, నానాటికి మజిలిను తానులనఁబడుచున్నవి. ఇతర దేశములందు కూడ నేయఁబడుచున్నవి. అస్సీరియా సామ్రాజ్యకాలమున రాజధానియగు నినివేనగర పరిసరగ్రామమైయుండిన నీమసొ లిప్పుడు పట్టణమునకుఁ దూర్పుననుండు టైగ్రిసునది కవ్వలి హెచ్చు తగ్గు మట్టిదిబ్బలు నినివేనగరపు తావునఁ జూపు నట్లయ్యెను. టర్కీవారి పరిపాలన కాలమున ంచి వర్తకముచెడి, యేగ బాటలేక గష్టతర గ్రామమై, సుల్తానుగారి సామ్రాజ్యమున నేగ బాటలేనితావని క్రీ. శ. ౧౯౦౦ ప్రాంతమున నొక యాత్రికుఁడు వ్రాసియున్నాఁడు. ఐరోపా మహాసంగ్రామానంతరము బ్రిటీషధికారమున బాటలు నిర్మింపఁ బడినవి. టర్కీ-ప్రభుత్వము నాటివంతెన (నదియందలి నీటిభాగము) పడవల వంతెనగను, మెరకభాగము రాతివంతెనగను నేటికిని బాగుగనే యున్నను, నిటీవల చక్కని ఇనుపవంతెన వెడల్పుగ నిర్మింపఁబడి టైగ్రిసు నదిదాట వీలగుచున్నది. పట్టణము పెరుగుచు పరిశుభ్రత నందినది. విద్యుద్దీపము లమర్పఁబడినవి. (బాగ్దాదు-మసొల్ యినుపదారి చూ).

అంతియె గాక నిది ఇరాక్ (మెసపొటేమియా) దేశమందున్న పురాతనస్థలము. అరేబియన్ నైట్సుకథలయందు దీనిప్రశంసలు గలవు. టైగ్రిస్ నదిపై నౌకలలో మసొలునుండి బాగ్దాదునకు విశేషముగ వర్తకము నడచుచు, రాకపోకలు జరుగుచుండెనఁట. మసొలుప్రాంతములు తెల్లనిరంగుగలరాళ్లు విశేషముగ దొరకుచుంట పురసౌధములు వాటిచే గట్టఁబడుచు పట్టణము తెల్లనిరంగుతో నగుపడుచుండును. పురముంజుట్టి కోట గలదు. ఇది మహమ్మదీయ స్థలమని మహమ్మదీయులును, క్రైస్తవస్థలమని క్రైస్తవులు ననుచున్నారు. ఇట నిప్పుడు ఛాల్డియన్ పాట్రియార్చియు (జగద్దేశికుడు) ను, నెస్టోరియన్ పాట్రియార్చియు (జగద్దేశికుఁడు)ను వసించుచున్నారు. వేరొక జాకోబైటు బిషప్పుగురుండును నిటనే గలఁడు. ఇటకు సమీపమున నేగల రెండుదిబ్బలను తొల్లిఁటి నినివేపురముండినతావుగఁ జూపుచున్నారు. దానిని నెబోపోలాసార్ భూపతియు, వేండీస్ భూపతియుఁ గలసి సంగరమున నాశనమొనర్చిరఁట. అది క్రీ.పూ. ౬౦౬ సంవత్సరమఁట.

౧౯. శ. ౧౮౪౫లో దానిని ఆర్కియాలోజికల్ ప్రభుత్వశాఖవారి ప్రేరణమునఁ ద్రవ్విం

చిన Layard పండితుఁడు కొన్ని అస్సీరియో లోజికల్ పదార్థములఁ బయలు దేరఁదీసియు న్నాఁడు. అందు కొన్ని ఫలకములు బైబిలునందు వివరింపబడిన జలప్రళయము (deluge) కథఁ గూర్చిన విషయములఁ దెల్పునవి కలవని చెప్ప బడినది. పరిసరములందున్న వేరొకచిన్న దిబ్బపై నొక మశీదు గలదు. అందు జోనాప్రవక్తగోరీ కలదని చూపుచున్నారు. మోటారులలో నట నుండి పోవగిన కొంతదూరమున నిమ్రోదుపుర మునందు సత్రాప్రం జూపెదరు. అవి బైబిలునందలి జెనిసిస్ -X-12 నందు వివరింపబడిన కలా (Calah) అనెదరు. పైవివరించిన Layard పరిశీలనకుగా [illegible] త్రవ్వించి దానినుండి బయల్పడిన కొన్ని విగ్రహాదివస్తువులు, చిత్రపుం బనులు స్వదేశమున కంపెనట.

మసౌల్ నుండి [illegible] దూరమునందు మోటారులుపోవు నుంచి బాటపై తెల్కయీఫను పేరు గల గ్రామము [illegible] అల్ కోషను గ్రామము కనుఁ బోనగును. అట నాహూమ్ ప్రవక్త సమాధికలదు. అది యాత్రాస్థలముగ నున్నది. దానిఁ గనిపెట్టుకొని యొక యూదుల (Jews) కుటుంబమున్నది. వారేదాని యజమానులట. తెల్కయీఫ్ గ్రామసీమ స్త్రీల సౌందర్యము నకుఁ బేరందినదని అచటివార నెదరు. ఆదివార ములందచటివారు వింతదుస్తుల ధరించుట గాననగుచుండును.

మసౌలునుండి వేరుబాటను కొంతదూరము నందు "బై ఇధ్రి" యనుపేరుగలగ్రామమునను నాపరిసరసీమయందును యాజిడీలను ప్రజలు గలరు. వారు పిశాచపూజ నొనర్చువారనియు వారిప్రధాన (మత)పిశాచాలయము షేయిక్ ఆద యను గ్రామమనియు నచటివార నెదరు. ఆ షెయిక ఆది పిశాచపూజాస్థానమును కతిప యదూరముననే బాటపైఁ గలదు.

## మహతాపి ప్రయత్నేన తమిస్రాయాం పరామృశన్ కృష్ణశుక్లవివేకం హి నకశ్చి దధిగచ్ఛతీఇతి న్యాయము-

గాఢాంధకారమున నెంతటి పరిశీలకుని కైనను తెలుపు, నలుపు భేదము గానరాకుండునని భావము.

## మహతి దర్పణే మహన్ముఖం తదేవ కనీనికాయా మణు రితి న్యాయము--

పెద్దయద్దమునందు మహాబింబముగఁ గన్పించు నాకారమే యణుమాత్రంపు కంటిగుడ్డులోని పాపయందును గన్పించునని భావము.

**మహతీనది**-మాళవదేశమున చంబల్నది యొక్క ఉపశాఖ. దీని నిప్పుడు 'మాహి' యనుచున్నారు.

దీనిప్రశంస వాయుపురాణము ౧-౪౫-౯౭ శ్లోకమునఁ గలదు.

**మహత్నునది** - ఆఫ్ఘనుస్థానమున నాల్గొ సానను పేరఁ బఱగెడు గోమాల్నదిలోఁ గలియు నది. దీనిఁగూర్చిన ప్రశంస ఋగ్వేదము ౧౦-౭౫యందు గాననగును.

**మహద్గంగ**-- గంగానదియొక్క ఒకశాఖ. దీనిని మటభంగా యనియు వాడుచున్నారు. ఇది హుగ్లీ నదియందు సంగమించును.

**మహామండుజాతి మహమ్మదీయులు** --వీరిసీమ పశ్చిమోత్తర సరిహద్దుపరగణా సంబంధమున ఖైబరుకనుమమార్గమున కుత్తర మున కాబూల్ (కుభా) నదివరకు వ్యాపించి యున్నది. దురాండులైనుకు తూర్పున వీరు వసించుచుఁడుట కలదు. కొండలమయమైన సీమ. వీరు పఠాన్ జాతికిఁ జెందిన యుపశాఖ. తొల్లిఁట వీరు ఇరాన్ దేశంపు నార్యజాతిగ బోల్చుచున్నారు. పుస్తుభాష నుత్తరవిధాన మున మాట్లాడువారు.

**మహమ్మదీయ ఇస్లాముమతనిషేధములు** — దైవభక్తివిహీనత, నిషాపానీయములు, పంది, మతగ్రంథములందు నమ్మకములేకుండుట, ప్రవక్తలందు నిరసనబుద్ధిగల్గియుండుటయు, మతవిధులు నాల్గింటియందు బాధ్యతలేకుండుట, విగ్రహారాధనము సహించుటయు నివి సప్తనిషేధకార్యములుగఁ జెప్పఁబడినవి.

**మహమ్మదు** — ఈమహాత్ముఁ డరబ్బీదేశమందలి ఖురాయిష్ తెగలోనివాఁడు.తండ్రిపేరబ్దుల్లా.తల్లిపేరు అమీనా. జన్మస్థానము మక్కానగరము.

ఈచరిత్ర వివరించుటయందు మతమున కనుకూలించు మాహాత్మ్యము లనేకములు దాఁటిపోడవునను ముసల్మాను గ్రంథకర్త లనేకులు వ్రాసియుండిరి. ఏమతమైన నొకరీతిగఁ జూచువిజ్ఞానగ్రంథమున కట్టి వివరణములను వదలి, మహమ్మదుగురుని జీవితచరిత్రము వ్రాయుటయె పద్ధతియని చదువరు లెఱుంగఁ దగినది.

వీరికి మదీనాకాపురస్థులగు అబ్దుల్‌మతలీబుగారు పితామహులు.మహమ్మదుగారుతల్లిగర్భమునం దుండఁగనే తండ్రిగారగు అబ్దుల్లాగారు చనిపోయిరి. తల్లిగారగు అమీనాబీ మక్కాయందు క్రీ. వె. ౫౭౦ సంవత్సరమున వీరిని బ్రసవించిరి. వీరియింట "బరాకా" యనిపేరుగల యాఁడుబానిస యుండెను. అది చాల విశ్వసనీయ. ఆమె బాలుని కుపచారము లొనర్చుచుండునది. వీరిజన్మకాలమును Mr. Perceval పరిశీలకుఁడు A.D. 570 అగస్టు, 20 తేదీయని నిశ్చయపఱచియున్నాఁడు.

అరేబియాదేశమున గొప్పవారింటి పిల్లలను పట్టణములందు పెంచుటకన్న నెడారియందలి యొకపల్లెటూరఁ బెంచుట శ్రేయస్కర మని తలంపఁబడుచుండునది. మఱియు నెడారియందలి జనపథవాసు లప్పుడప్పుడు పట్టణముల కేతెంచి, యిది యొకవృత్తిగ పిల్లలం గైకొని తమగ్రామములకుఁ గొంపోయి పెంచుచు, కోరినతరి వారితండ్రుల కాపిల్లల నప్పఁజెప్పుచుండువారు. దానికిఁ గొంత ప్రతిఫలము వారికీయఁబడుచుండును. అటులనే బానీసాద్గ్రామనివాసులగు హలీమా యనునామెయు, నామెభర్తయు అమీనాగారినుండి బాలునిఁ గైకొని పెంచుటకు వారిగ్రామమున కేగిరి. బాలుండును దినదినప్రవర్ధమానుండై 'బానీసా' వనంబడు గ్రామమున పెరుగుచుండ, రెండేండ్లప్పుడొకసారియు, నాలుగేండ్లప్పుడొకసారియు, మక్కాకుఁదెచ్చి తల్లిగారికిఁ జూపి యైదవయేట తల్లిగారి కప్పగించిరఁట.

బాలుని యాఱవయేట తల్లిగారితో మదీనాకుఁ గొంపోఁబడి, తాతగారగు అబ్దుల్‌మతలీబుగారియింట నొకమాస ముండిరఁట. వారిబాలుని మక్కాలోని కాబాకుం గొంపోయి, యట వీరికి "మహమ్మ"దని పేరిడిరఁట. మహమ్మదన పొగడబడినవాఁ డని యరబ్బీభాషయం దర్థము. లేక నుతింపఁ బడిన వాఁడని అర్థము. తాతగారల్లారుముద్దుగఁ బెంచుచుండ వారట నొకనెల యుండి యొంటిగ తల్లికుమారులిర్వురు మక్కాకు తిరుగుప్రయాణమై వచ్చుచుండ "అబ్వా" యనుగ్రామమున తల్లిగారగు అమీనాగారు మరణింపఁ, ఆడబానిస యగు బరాకా మహమ్మదుబాలుని తిరుగ మదీనాకుఁ జేర్చి తాతగారి కప్పగించెనఁట.

అప్పటి కెనుబదివత్సరముల ముదుసలియగు నాయన ఖిన్నుఁడై, బాలు నతిగారాబమునఁ బెంచుచుండ, రెండు సంవత్సరములు గడచెను. అబ్దుల్‌మతలీబుగారు స్వసంఘమున తగవరి

యగు మర్యాదస్థుఁడు. ఆయన కవసానమత్తరి సంభవించి తనసుతుండగు అబూతలీబుగారికి మహామ్మదుగారినప్పగించి మృతినొందెను. అంతటినుండి బాలుండగు మహామ్మదుగారు పినతండ్రి యగు అబూతలీబు సంరక్షణయం దుండ నయ్యెను. అట వీ రింటిపనులయందు పినతండ్రిగారితో మెలంగుచుండిరఁట. మహామ్మదువారు బాల్యమున మేఁకలఁ గాచుచుండిరని బలమగు వదంతి కలదు. అది నిజమే యగుచో నీకాల మునందే యైయుండనోవు.

మహామ్మదువారు పండ్రెండవయేట పినతండ్రిగారితో సిరియా దేశమున కొక వర్తకపు కార్వానాలో నేగిరని చెప్పఁబడినది. ఇట వీరి తెగంగూర్చి యించుకవివరించుట సమంజసము. వీ రరబ్బులలో 'ఖురాయిష్' తెగవా రని చెప్పఁబడినది. వీరు వర్తకులుగ నుండిరి. వీరి తొల్లింటిపేరు బానీకినానాశాఖవా రనియుం డెను. వారియం దొకఘనున కార్గురు సుతు లుండిరఁట. అం దొక్కనిపేరు 'ఖురై' యని యుండెనఁట. వీరికాలము క్రీ. వె. ౨౦౦ సం॥ రములకాల మఁట. ఖురైషుసంతతివా రగుట "ఖురాయిష్" అనఁబడి రని తెలిసెడిని.

అటుల పినతండ్రితో సిరియాదేశమున కేగినమహామ్మదు గారి నొకమహాత్ముఁడు చూచి, తనవిజ్ఞానబలముచే నీయన యొకదీర్ఘదర్శి యగు నని యెఱిఁగి, వీరిని మక్కాకుఁ గొంపోవుట సముచితమని వీరిపినతండ్రిగారికి సలహాయిచ్చె నఁట. అబూతలీబుగారు నావిజ్ఞానియెడ గౌరవ ప్రపత్తి కలవాఁడై, మక్కాకేగ నిశ్చయించుకొని, తనవాణిజ్యకార్యముల ముగించుకొని మదీనాజేరి, యటనుండి మహామ్మదువారితో మక్కా ప్రవేశించెనఁట. ఇది క్రీ వె. ౫౮౨-౫౮౩ గానోవు.

అప్పుడు మెక్కాసీమ కడునరాజకమై కార వాన్ మార్గములు బందిపట్లుయయ్యె, వర్తకము రమారమి నిలిచిపోయెడిదుస్థితికి రా, ప్రజలు తహతహలాడుచుండుస్థితియం దుండెనఁట. పెద్ద లందరు గూడి సభలొనర్చుచు దీని నెట్లు నివా రింపఁదగునని యోచించు చుండిరఁట. మహామ్మదువా రాసభల కేగుచు మాట్లాడునంతటి బుద్ధిశాలియు, దిట్టరియు, నౌచుండెనఁట. వర్తకపుకార్వానులతో కొందరు బలాఢ్యు లేగుచు వాటినిరక్షించుట కేర్పాట్లు చేసుకొనుచుండిరి. అట్లుపోవు కార్వానారక్షకులలో నొకరుగ మహామ్మదువా రేర్పడిరఁట. ఇటుల పది పండ్రెండు సంవత్సరములు వీరికిఁ గడచెను.

ఆకాలమున మక్కాయందు ఖాదీజా యను ధనవంతురా లుండెనఁట. ఆమె తనద్రవ్యముం బెట్టి నరకులంగొని నమ్మకస్థులగు వర్తకులవశ మొసర్చి, విదేశములకు లొటిపిటలపై నంపి, యమ్మించి లాభమున సగము తాఁగొనుచు, సగము వర్తకుల కొసంగు చుండునది. ఇదియే యామెవర్తకము. ఇటులనే మహామ్మదు గారికిని కొంతసరకిచ్చి పంపెనఁట. ఆతఁ డప్పటికిరువదియైదు సంవత్సరములవయస్సుండియు కడు నమ్మకస్థుఁడని పేర్వడసియుండె నఁట. ఆతఁడు తిరిగివచ్చినపిదప, నామెయు నాతనిమెలకువల కచ్చెరువంది యాతనిం బరిణయ మయ్యెనఁట. ఇది బహుశః క్రీ వె. ౫౯౩-౫౯౪ ప్రాంతమై యుండవలయును. ఈమెయే మహామ్మదు దేశికుని ప్రథమకళత్రము. ఈమెవలనవీరికిఫతీమా యను కుమార్తె కల్గెనఁట.

ఈసందర్భమున మహామ్మదువారి గుణాతిశయములంగూర్చి యొక్క సంగతి వివరింప వలసి యున్నది. ఒకతటి కాబా శిథిలమై పడి పోయెనఁట. యాత్రికాధారభూతమై మక్కా-

యందు దనరుకాబా (బైతుల్లా)ను మరమ్మతు జేసి పునరుద్ధరింపకుండిన యాత్రి నిలచిపోయి, యేటేట యాత్రికాలమున వచ్చుచుండు రాబడి చెడి, యెల్లరకు ద్రవ్యలోపము గల్గుగాన, నట నుండు నాలుగు తెగలవారు నేకీభవించి దానిని మరమ్మతు చేయింపదొడఁగిరఁట. కాని యం దుండు నల్లరాతి(పవిత్రశిల) నే తెగవారు తిరుగ నట నుంచవలయునా యని కలహములు గల్గి, సఖ్యము కుదురక, ఎట్టకేలకు దేవాలయావరణముయొక్క బానీషైబా యనుపేరుగల ద్వారముగుండా, లోనికెవ్వరు వచ్చిన వారిచే నట నుంపించుటకు సఖ్యపడిరఁట. అదృష్టవశమున మహమ్మదుగురుండే వచ్చుట సంభవింప నందరియ్యకొనిరఁట. దూరాలోచనాధురంధరుఁడగు మహమ్మదుగురుండును తనశాలువ నారాతికడ బఱచి యం దారాతి నుంచి, నాలుగు తెగల నుండి పెద్దలను రావించి, నాలుగువైపులం బట్టుకొనుమని, కట్టుచుండిన కాబాకడకుం గొంపోవ జేసి, యం దాగ్నేయదిశగా నమర్చి, యాత్రిస్థులకు సౌఖ్యముగ నందునంతటియెత్తుగనుండఁ జేసి యందరినితృప్తిపరచెనఁట. మఱియుమహమ్మదువారికడ జయ్యదను బానిస యుండెనఁట. వాని నమ్మకమునకు మెచ్చి మహమ్మదువా రతనికి స్వేచ్ఛ నొసంగినను, వాఁడు పోక వారిసేవ వదలకుంటజూచి, వానికి తమతల్లిగారినాటి బానిస సేవకురాలగు బరాకానిచ్చి పెండ్లిచేసిరఁట.

పిమ్మట మహమ్మదువారు సహధర్మచారిణి యగుఖాడీజా సకలోపచారము లొనర్చుచుండ, సౌఖ్యముగ మక్కానగరమున నామెయింట మనుచుండిరి. మక్కా నగరమునకు రెండు మూఁడుమైళ్ళదూరముననే 'హిరా' యను పేరుగల పర్వతమును అందొకగుహాయునున్నది. దానిలోనికి మహమ్మదువా రేగి ప్రార్థించుకొనుచుండెడివారఁట. ఒకతరి వారికి మైవివశత గల్గుట సంభవించెను. అత్తరి 'జిబ్రేల్' అనుపేరుగల దేవదూత వారి కగుపడి, అన్త్యస్వర్గమునం దుండినట్లు చెప్పఁబడిన "ఖురా" ను లోకులకు వెల్లడిచేయఁబడుటకు తెల్ప మొదలిడెను. ఇటుల మొత్త మిరువదిమూఁ డేండ్లు నడచువఱకు ఖురాన్ పూర్తియయ్యెనఁట. ఈ మైవివశత కల్గుచుండుతఱి, మేను వడఁకుట స్వేదము గల్గుచుండెననియు, భార్యయగు ఖాదీజా వారికి బట్టగప్పి పైన శీతలోదకముఁజల్లుచు పరిచర్యయొనర్చుచుండెడి దనియుఁ జెప్పఁబడినది. ఈ మైవివశతకు వీరిమతగ్రంథమున "వాహి" అని పేరు. వీరి కత్తరి నొక్కొక్కప్పుడు చిన్నగంట మ్రోఁగినట్లు ధ్వని వినఁబడి, దానినుండి 'ఖురా' న్మాటలు వినఁబడుచుండు ననియు, నొక్కొకప్పుడులొటిపిట్టపై నేగుచుండుతఱి నీమైవివశతరా నేలఁబడిపోవువా రనియు ఃబ్దుల్‌రహిమానను గ్రంథకర్త వ్రాసెను.

మహమ్మదువా రిట్లు జిబ్రేలుపరిముఖమున గ్రహించుచుండిన ఖురానును లోకులకు వెల్లడించుచుండిరి. ఇది మహమ్మదీయమతమును బోధించుటగా పరిణమించనయ్యెనఁట. ఖురాను మహమ్మదుజగద్గురుని కవిత్వము కాదనియు, జిబ్రేల్పరిముఖమున వచ్చినదే యనియు, మఱియు జిబ్రేల్బోధితనిజార్థము లేపాటి దాటినను నల్లాకోపమునకుం బాత్రులౌ స్థితియం దుండిరనియు, ఖురానువ్యాఖ్యాత లభిప్రాయపడుచున్నారు. వారును ధర్మపత్నియగు ఖాదీజాతోఁగూడి నమాజుచేయుచుండి రనియు నొకతరి యట్టికాలమున పెంచుచున్నబాలుండగు ఆలీ, (ఈతఁడు బహుశః మహమ్మదువారి పినతండ్రియగు అజాతలీబుకుమారుఁ డేమో) పదమూఁడేండ్లవాఁడై నమాజుచేయుటఁజూచి, తానును మతమవలంబించెనఁట. పిదప జయ్యదును మతస్వీకరణ మొనర్చెనఁట.

మక్కావా రెవ్వరు మహమ్మదువారిమత బోధ వినక నిరాకరించుచు, కొందరు విరోధ భావముననుండిరి. వీరిని వంచకుఁడగు మోసగాఁడనియు, సోదిచెప్పువాఁడనియు, కవి యనియు నిందించుచుండిరి. ఐనను గొందరు మాత్రము వీరిబోధ విని మతస్వీకరణ మొనర్చువారిని బాధించుచు, కడగండ్లపాల్సేయుచుండిరి. ఈ సందర్భమున వారికడగండ్లు తాను జూడఁజాలక మహమ్మదరబ్బీల యెనుబదిముగ్గుర నబ్సీనియా దేశమున కనిపి, యట జీవించుఁడ నెనఁట. వేరొకతరి వీ రీమతబోధ మానుకొనిన తమ నాయకునిగ నొనర్తు మని ప్రజ లనినను, మహమ్మదువా రందు కియ్యకొన రెరఁట. మరియొక తరి వీరితో సంధి నిష్ప్రయోజన మని "మీ వుఁడు మీకు, మా దేవుఁడు మాకు, మీ మతము మీది, మా మతము మాది. బోధ మానుకొనినశాంతిగల్గు"నని యుప్పరినున్న ఘనులలో నొకతెగవరియగు "అబూతలిబు" రి ముఖమున రాయబారము జరుగ, మహమ్మదు బోధకుఁడు నిరాకరించె నఁట.

తరువాత విరోధము లధికమై యొత్తడి, యశాంతి, యధికము కాఁగా మహమ్మదువారు మక్కా వదలి మదీనాపురమునకుఁ బోవ నిశ్చయించుకొన వలసివచ్చెను. వారు ముందుగాఁ దనమత మనుసరించినవారి నందరిని కొంతకొంతమందిగా మదీనాకుఁ బంప మొదలిడిరఁట. రెండునెలల కందఱును మక్కా వదలి, వెడలిపోవ, మహమ్మదు జగద్దేశికులును నొకరాత్రి పట్టణము వీడి అబూబకరనువారితోఁ గూడి వెడలిపోయి, రాత్రియం దొకగుహాలో దాఁగి, విరోధులు వీరిని వెంటఁదరుముకొని వెదకుకొనుచు రా, మూఁడుదినములం దుండిరఁట. ఆకాలమున సాలెపురుగు లాగుహాముఖమును పట్టలిమూసివైచెనని వాడుక గలదు. వీరిప్రయాణము



నకు వీరిమతగ్రంథములందు "హిజ్రి" యని పేరు. అది యిక్కాలమున మహమ్మదీయులందు శకముగఁగూడ పాటింపఁ బడుచున్నది.

అటుల మక్కామార్గముంబట్టి యేగుచు, దారిలో "కూబా" యనుగ్రామమున బోధింప నచటి లకీమత మామోదము కాఁగా, రబీఉలవాల్ నెల ౧-వ దినము సోమవారమున నట నొకమసీదునకు శంఖుస్థాపన మొనర్చిరి. ఇది యిస్లాముమతమునకుం దేర్పడిన మొదటి మసీదని చెప్పఁబడినది. ఇది హిజ్రి ౧ వ సంవత్సరముగ లెక్కింపఁబడినది. పిదప మహమ్మదువారు మదీనా చేరనయ్యెను.

మదీనాపరిసరమున నొకవిశాలమగు కొండలోవయందు వారు విడిసి, నాడు శుక్రవారమగుట నట ప్రార్థనలు సల్పిరఁట. ఆతావుననే పిదప నొకమసీదు నిర్మింపఁబడి "మజీదుల్జుమా" (శుక్రవారపుమసీదు) అని పిలువఁబడుచున్నది. మదీనాయందు వా రబ్రహింమతమునే పునరుద్ధరింపఁ బంపఁబడితి మని బోధింపసాగిరఁట. వారిబోధ ప్రజలకుఁ జక్కఁగ రుచించి, వారు వీరిని గురుఁడనుచుండిరఁట. మదీనాయందుఁ గొందరు యూదులును, కొలఁదిసంఖ్య వులును నుండిరఁట. మహమ్మదువారుయూదుల తూలనాడక వారితో సఖ్యముఁ గల్గించుకొని రెండుమతములవారు నవసర మగుతరి నన్యోన్య సహాయము, యుద్ధముగల్గినతరి నర్పుకొనుచుండుట కేర్పర్చుకొనిరి. తోడనే మహమ్మదు వారి నిరుతెగలవారును దండనాధికారిగ నియమించుకొనిరఁట.

వీరు మదీనాయందు జనరంజకులై మతాధిపతులై అధికారగరిమచేఁ దనరుచు బలపడుచుండుటఁజూచి యోర్వలేని యసూయాపరులు కొంద రుండియుఁ జేయునది లేక వగచుచు

నూరకుండుటయె గాక వీరికి లొంగవలసిన దుర్గతిపాలైరని చెప్పఁబడినది.

మదీనాపురమునకుఁ జేరిన తోడనే వీరిస్థితి యొక్కసారి గొప్పమార్పు జెందెను. అచిరకాలముననే వీరు మతాధిపతులగుటయే గాక, ఇంచుమించు ప్రభుత్వమునకు వచ్చిరా యనునట్లయ్యెను. వీరి జీవితచరిత్రయం దిది ముఖ్యమగు విచిత్రము. మక్కాలో పట్టుదలగలబోధకుఁడు, బాధ్యతగల సంస్కర్త, ప్రజలచే క్రోధముతో నెదిరింపఁబడుచున్న క్రొత్తదీర్ఘదర్శి, సోదె చెప్పువాఁ డనియు, కవియనియు, వంచకుఁ డనియుఁ బ్రజలచే నిరసింపఁబడుచు, చికాకులు, నాటంకములు నల్లరలమధ్య నుండినవాఁ డయ్యెను. వెయ్యేండియు సైన్యాజ్ఞాపకుఁడు పదిదినములలో మదీనాను చేరినతోడనే దుస్సాధ్యుఁడు, సర్వతంత్రస్వతంత్రుఁడు, నధికారి, ప్రభుత్వము నడపువాఁడు, మతాధిపతి మక్కాలో దేశద్రోహి యనుకొనఁబడి, మదీనాలో నమ్మకస్తుఁడగు ప్రభువగుట మక్కాలో పదమూఁడువత్సరముల ప్రయత్న మంతయు మదీనాలో ఫలించినది.

ఇంక మదినాలోని వీరి జీవితచరిత్ర పూర్వమువలెనే మాహాత్మ్యముల మతము మై యుంటకన్న, వీరొనర్చిన కలహములతోఁగూడియున్నది. ఈ కలహములను విమతస్థుల నిరసనలతోడను స్వమతస్థుల సమర్థనలతోడను చరిత్రపుటలు నింపియున్నారు. అట్టి భేదాభిప్రాయముల కీపుస్తకమున తావీయక జీవితచరిత్రయే యిందు వివరింపఁబడును.

వీరు మదీనాయం దుండుకాలమున సంభవించిన యుద్ధములలోఁబరిగణింపఁదగినది 'బదర్' యుద్ధము. ఇది వారిబలమున కభివృద్ధికి దారితెఱచెనని కొందఱిమతము. పిదప నుడువఁదగినది 'ఉహూద్' సంగరము. అందు మహమ్మదు జగద్గురుని దవడ కొకరాయితగిలిముందలిపండ్లు నాలుగు విఱిగిపోయెనని చెప్పఁబడినది. అత్తఱి వారు నేలఁబడి పోయిరఁట.

హిజ్రా నాలుగవ సంవత్సరమున నించుమించుగ యుద్ధములు లేక వీరు విశ్రాంతి గలిగి యుండిరఁట. ఐదవసంవత్సరమునను, నాఱవసంవత్సరమునను స్వల్పకలహములు తప్ప పేర్కొనఁదగినవి లేకుండెను. కాని వీరొనర్చినయుద్ధములు కలహములు నింతవఱకు యూదులనడఁచివేయుటయు, మక్కాసీమవారిని బాధించి లోఁబఱచుకొను ప్రయత్నములు, నని చెప్పవలసి యున్నవి. యూదులు వీరిప్రాణముం దీయ ప్రయత్నించుచుండిరని తలంపఁబడినది.

క్రీ. వె. ౬౨౮ మార్చి నెలయందు వీరు మక్కాయాత్రకై వెడలిరఁట. మక్కా పవిత్రావరణముహద్దున నున్న 'హుదైబియా' యను గ్రామముకడ నున్న యొకచెట్టుక్రింద ముసల్మానులు విడిసిరఁట. అటనుండి మక్కావారువారిని నిలిపి మహమ్మదుగురునితో నొక సంధిపత్రము గుదుర్చుకొనిరఁట. అందు పదివత్సరములదనుక మక్కావారికిని, మదీనావారికిని, యుద్ధము లేమియు జరుగకుండుటకును, ఒకరి నొక రెదిరించకుండుటకును మహమ్మదువారిపార్టీనుండి మక్కావారిపార్టీలోనికి చేరువారు గాని, మక్కావారికక్షనుండి మహమ్మదువారిసంఘమునకు జేరగోరువారు గాని, తమతమసంఘమువారియనుమతిపత్రముగల్గిచేరుట కేయభ్యంతరము లేకుండుటకును, అట్టియనుమతిపత్రము లేకుండఁ జేరువారి నిర్వురు త్రిప్పి వేయుచుండుటకును, నాసంవరత్సము మహమ్మదువారు మక్కాలోనికిఁ బ్రవేశింపకుండి, తిరిగి మదీనాకు వెళ్ళిపోఁ గలందులకును, తరువాతిసంవత్సరమున మహమ్మదువారు మక్కా

యాత్ర జేసుకొని మూఁడుదినములుండుటకును, అప్పుడందులోనికి మక్కావారెవ్వరును రాకుండుటకును, అట్టితరి మహమ్మదు వారి మనుష్యులాయుధపాణులై రాకుండుటకును సంధిపత్రము పుట్టెను. ఇందువలన నిరుపక్షుల వారు సమానస్థితిగలవారుగ నుభయులు నంగీకరించుట యేర్పడియెను. మహమ్మదువారును నట్లే వెనుకకు మరలిరి.

తరువాతిసంవత్సరమునఁ జెప్పఁదగిన యుద్ధములేమియుఁ గానరావు. క్రీ. శ. ౬౨౯ సంవత్సరమున మహమ్మదువారు సైన్యములతో సహా మక్కాకరిగి యాత్రం జేసిరి. తొల్లింటి కాలమునుండి యుండిన కాబాయాత్రను మహమ్మదువారు రూపుమాపుదురని యుండిన యనుమానము నిరాధారమయ్యెను. మహమ్మదువారు యథావిధిగ నట యాత్రసల్పిరి. అంతటితో మక్కాదేవాలయము మహమ్మదీయమతస్థానముగ మారెను. ప్రజలును వారియందు భక్తిగలవారై క్రమక్రమముగఁ గ్రొత్తమతము పెఁగలయనూయతనుమానుచుండుట ప్రారంభమయ్యెను. మహమ్మదువారు "మెయిమునా"యను మక్కాబాలికను వివాహమాడి తమపదునొకండవభార్యగఁ గైకొనుటతో ననురాగము, స్నేహభావము, నిరుపక్షుల వారికి బలపడుట ప్రారంభించెను.

క్రీ. శ. ౬౩౧ వఱకు శాంతముగనే కాలము గడచెను. పిదపఁగొంచెము చిల్లరకలతలు సంభవించెను. అక్కాలముననే మక్కాప్రాంతముల గొప్పపలుకుబడిగల బలవంతుఁడొకఁడు మహమ్మదీయమతము స్వీకరించుటతో సర్వమును మారిపోయెను. మహమ్మదువారి కక్కడిప్రజలును లోఁబడి, వారిమతము స్వీకరించుచుండిరి. ఇందుకుఁ బ్రధానకారణము మహమ్మదువారి సైన్యములు మక్కావారి వర్తకవ్యాపారవాసుల నెదిర్చి బాధించుచు లోఁగదీయుటయే యని కొందఱుపరిశీలకు లనుచున్నారు. ఇటుల నచిరకాలముననే మహమ్మదువారి యధికారము క్రింద రెండుసీమలు నేకమై స్వతంత్రదేశముగ నాయెనఁట.

పిదప హిజ్రనుకాలము కొంత ప్రాముఖ్యత గల్గినదందురు. హిజ్రా ఎన్మిదవసంవత్సరమున మేరీ యనుభార్యవలన మహమ్మదువారి కొక పుత్రుఁడు గల్గి సంతోష ముదయించెఁ గాని బాల్యముననందే యా పిల్లవాఁడు మృతినందెను. మహమ్మదువారికుమార్తె (ఖాదిజా పుత్రిక)ను పెంచినబాలుఁడగు ఆలీకిచ్చి పరిణయమొనర్చియుండిరి. మక్కాసీమయందు మహమ్మదువారి యుద్యోగులు నెలకొల్పఁబడి, వారికిఁ బూర్తిగ లోబడి యుండెను.

పిదప మహమ్మదువారు మతవ్యాపకమునకు మొదలిడి గొప్ప ప్రయత్నము లొనర్చిరి. కొన్నిదండయాత్రలు గూడ నడచెను. అన్నియు జయప్రదముగనే పరిణమించెను. ఇంతటిలో వారు మహమ్మదీయమతదీక్ష పూర్తియాయెనని తలఁపినందిరి.

మహమ్మదువారికి కాలము సమీపించుట తెలియుచుండెను. గెబ్రేలు పరిముఖమున "అజ్రేల్" అను చావుదూత ద్వారముకడ నున్నట్లు మహమ్మదువారెఱింగిరఁట.

క్రీ. శ. ౬౩౨ జూన్ ౮ వ తేదిని మహమ్మదువారు స్వర్గము కేగిరని చెప్పఁబడినది.

ఈమతమునకుఁగర్త మహమ్మదువారుగాన దీనికి "మహమ్మదీయమత"మని పేరుకల్గుట సంభవించినను, మతకర్తచేనియ్యఁబడినపేరు "ఇస్లాం" మతమనియైయున్నది. ఈమతమునమతసిద్ధాంతమంతయు మతకర్త జీవితచరిత్రకు లోఁబడియుంట నదియే ప్రధానమై దనరెడిని

మహామ్మదు జగద్దేశికుఁడు మక్కా నగరమున జన్మించినవాఁడు. తండ్రిపే రబ్దుల్లా. తల్లి పేరు అమీనా దేవి. పితామహుఁడు అబ్దుల్ ముతలీబు. పెదతండ్రి అబుతలీబు. వీరిది ఖురాయిష్ తెగ.

(తుమిరీడ్ తెగ మహామ్మదీయులు చూ).

"ఇస్లాం"మతమున పరిభాషాపదము లెఱుంగుట ప్రథమవిధి. "లాహిల్లాహిలల్లా మహామ్మదురసూ లిల్లా" యనునది 'కలీమా' యనంబడును. దీనికి దేవునికన్న వేఱుదేవుఁడు లేఁడని (అద్వితీయుఁడని భావము) మహామ్మదుమతప్రవక్త యని యర్థము.

ఈమతగ్రంథమునకు 'ఖురా' నని పేరు. దీనిని 'అల్కితా' బనియు నందురు.

ఈమతమునకు 'ఇస్లాం' అనిపేరు. ఇస్లామన శరణ్యమని యర్థము.

ఇస్లాంమత సిద్ధాంతధర్మములకు "ఇమాన్" అనిపేరు.

ఇమాన్సిద్ధాంత మతమార్గమునకు 'దీన్' అని సాంకేతికము.

మహామ్మదు దేశికుల యాజ్ఞలు, వర్తనలు, "సున్నాత్" అనఁబడెడిని.

మతగ్రంథమగు "ఖురాను" కంఠతః వల్లెవేసినవానికి "హాఫిజ్" అని సాంకేతికము.

మహామ్మదు దేశికులు సంశయనివారణార్థము దెల్పియుండిన స్పష్టార్థములకు—ననఁగా సాంప్రదాయార్థములకు 'హదీత్' అనిపేరు. 'హదీత్' అనిన సాంప్రదాయ మనియే యర్థము.

మహామ్మదు దేశికమార్గానుచరులగు శిష్యవర్గమువారు దెల్పియుండిన స్పష్టార్థములకు "ఇజ్మా" యనిపేరు. దీనికి 'ఇత్జిహద్' అనియు నందురు. ఈసందర్భమున మహామ్మదువారి తరువాతివారగు నల్వురుఖలీఫా (Successor) లు నుడివిన "ఇత్జిహాద్" సాంప్రదాయములు మిగుల బలవత్తరములని యెంచబడుచున్నవి.

మహామ్మదు జగద్గురునికిఁ బిదప మతాధిపత్యమునకు వచ్చియున్న మతగురువులకు 'ఖాలీఫా' యని సాంకేతికము. టర్కీసుల్తానులు 'ఖాలీఫా' లనఁబరఁగు చుండిరి. ఈ నడుమనే యాదేశమున ఖలీఫా పదవి నిరాకరింపఁబడి తీసివేయఁబడినది. తర్కీసుల్తానులకుం బూర్వము రేబియాదేశ మేలిన ప్రభువరంపర ఖాలీఫా లనఁబరఁగిరి.

తర్వాత ముఖ్యులు కొందరు నుడివిన సాంప్రదాయధర్మస్పష్టార్థములకు "క్వియాస్" అని వాడెదరు.

ఈమతక్షేత్రమగు మక్కాయందలి మశీదులోని దేవాలయమునకు "కాబా" యనియు, 'బైతుల్లా' యనియు సాంకేతికనామములు. 'బైతుల్లా' యన దేవతాగృహమని యర్థము. ఇది భూమికి మధ్యగా నున్నదనియు, స్వర్గమునం దున్న కాబాకు సరిగా క్రిందిభాగమున భూమి యం దున్నదనియు చెప్పఁబడినది. దీనివాయువ్యమూల నొక పవిత్రశిల కలదు. అది పాపములం బీల్చుకొనునది.

మక్కాయందు కాబాకుఁ గతిపయదూరమునందున్న పవిత్రజలనిలయ మగు దిగుడు (లేక బొడ్డన) బావికి "జంజం" అనిపేరు. ఇది పానముచేతురు. తొల్లికాలమున నిది దైవదత్తముగఁ గల్గింపఁబడిన నీటియూటగఁ జెప్పఁబడినది.

ప్రపంచమును జుట్టియుండు పర్వతములకు "కోహికాఫ్" అనిపేరు.

కోహికాఫ్ పర్వతములందు వసించుదూతలకు "జిన్" అనిపేరు.

"ఇబిలీస్" అను పిశాచమునకు "సెతాన్" అని పేరు.

మహమ్మదు దేశికులు స్వర్గములన్నిటిని జూడఁ బోవుతరి నెక్కిపోయినవాహనమునకు "బురాఖ్" అని పేరు.

నిజమతమగు నిస్లాం మతభక్తి విశ్వాసము లేనివారికి "ఖాపర్" అని సౌజ్ఞ.

ఇస్లాంమత దేవాలయము లనందగు మందిరములకు "మజీదు" లనిపేరు.

మజీదునం దొకయెత్తగుతావున కెక్కి వేళలందు ప్రార్థనకుఁ బిలుచుచు నఱచువానికి "ముయుద్దీన్" అనిపేరు.

మతసిద్ధాంతముఁ దెలిసి తెల్పెడిప్రవక్తలకు "మౌల్వీ" లనిపేరు.

మక్కాయాత్రనొనర్చినవారికి "హాజీ" యని సాంకేతికము.

మతశ్రేష్ఠజన్ములకు "మౌలానా" లనిపేరు.

మహమ్మదు గురుశాఖాసంబంధులకు "పీర్జాదా" లనిపేరు.

మక్కాయాత్ర కరుగుచుండుతరి దారిలో నెదురగువారితో "నే నిచట నుండుట నీవెఱింగియుండు"మని యర్థమిచ్చు "లబ్బేక్షుర్బాక్" అనుమంత్రమునకు "తల్జియా" యని సాంకేతికము.

ఈమతమునకు మతప్రవక్తలు రెండులక్షలమంది కలరనియు, వారందరు మహాత్ములే యనియు, అందు ఖురానునందు వివరింపఁబడిన వా రిరువదియైదుగురు ముఖ్యు లనియు, నందిరను నార్గురు మరీప్రాముఖ్యత గాంచినవారనియు, "హదిత్తు" గ్రంథమున వివరింపఁబడినది.

౧. ఆదమ్- ఈప్రవక్త ఆదిపురుషుఁడు. భార్యపేరు ఈవ్. ఈయనను ఆంగ్లులు Adam the first man అనియెదరు.

౨. నూహూ- ఈప్రవక్త ప్రపంచమంతయుఁ బాపభూయిష్ఠమై జలప్రళయముచే నాశనమగుతరి నొకయోడ జేసుకొని యందుండి తనవారిని, మృగపక్షి కీటకాదులను, విత్తనములకుఁగాను రక్షించినవాఁడు.

౩. ఇబ్రహీమ్- ఈప్రవక్త తనమహాగుణోన్నతిచేత దేవుండగు యోహూవాకు స్నేహితుఁ డనంబరఁగిన వాఁడు. ధర్మశీలుఁడు. ఈతని నాంగ్లులు Abraham the friend of God అనియెదరు.

౪. ఇశ్రాయేలీయుల నైగుప్తు (ఈజిప్టు) దేశమునకు నడపుకొనుచు వచ్చుతరి ప్రజానాయకుఁడై యుండిన మతాధిపతి, మహాభక్తుఁడైనవాఁడునగు మోషీప్రవక్త- ఈమహాత్ముని పరిముఖమున దేవుండగు యెహోవా ప్రజానుష్ఠానమునకుఁ బదియాజ్ఞ లొసంగెను. ఇది మధ్యేమార్గమున సీనాయికొండలపై జరిగెనని చెప్పఁబడినది. ఈ మహనీయు నాంగ్లులు Moses the Law giver అనియెదరు

౫. యూసుఫ్- ఈప్రవక్త స్వప్నఫలితము లెఱింగినవాఁడు. బాల్యమున బానిసగా నన్నలచే నమ్మబడి, తనబుద్ధికుశలతచే నైగుప్తు దేశమున మంత్రియైనవాఁడు.

౬. మహమ్మదు దేశికుఁడు - రమదాన్‌మాసము ముప్పది దినములు హీరా పర్వతగుహలందు ఆవేశతన్మయుతంబుదియుండి, దేవదూతయగు జిబ్రేలుముఖతః ఖురానును విని, లోకమునకు దైవధర్మములను వెల్లడించిన మహామహుఁడు. ఈయన యందరికన్నను గొప్పవాఁడనియు, "మతకర్త" యనియుం జెప్పఁబడిన వాఁడు.

ఇస్లాంమతమున దేవుఁ డద్వితీయుఁ డనియు,

నెత్తగు పైస్వర్గమునం దుండువాఁ డనియుఁ జెప్పఁబడినది. దేవునకు త్రిసహస్రనామములు గలవనియు నందు దేవదూతలకు వేయినామములు తెలిసియున్న వనియు, ప్రవక్తలకు మఱివేయి నామములు తెలిసియున్న వనియు, యూదుమతస్థుల శామతగ్రంథములందుఁ జెప్పఁబడిన వనియు, మరి మూఁడువందలనామము లామత గీతములందు వాడఁబడిన వనియు, మంత్రములందు మూఁడువందలనామములు చెప్పఁబడిన వనియు, "ఇస్లాం" మతగ్రంథమగు ఖురాను నందు తొంబదితొమ్మిది నామములు వివరింపఁ బడిన వనియు, మిగిలిన యొకపేరు నీజగమున నెవ్వ రెఱుంగ రనియుఁ జెప్పఁబడినది.

ఇన్ని నామములు దేవుని కున్నను,వీటియన్నిటియందు మేటియై దనరునది "అల్లా" యను పవిత్రనామమే యనియు, "తఫ్సీరీబహార్" అను పేరుగల "ఇజ్మా" గ్రంథమునందుఁ జెప్ప బడినది.

ఈమతధర్మమున మానవశరీరమునందుండు శ్రవణశక్తి, చింతనశక్తి, దృశ్యశక్తి, శరీరబలము, వాక్కు, జ్ఞానము, జీవనము ననునవి దైవసంబంధములని చెప్పఁబడినవి.

దేవుండగు "అల్లా"కూర్చుండుతక్తు (భద్రాసనము)కడఁ గనిపెట్టుకొనియుండి నియమింపఁ బడినపను లొనర్చుచుండు దేవదూతలలో సామాన్యులు, ముఖ్యులు, నని యిరుదెఱఁగులు. ప్రప్రథముండగు మిగ్నాయెల్‌ను, మహాదూత జిబ్రేలును, ఇసాఫీల్, ఇజాయెల్ అనువారు మహాదూతలు.

మానవులపనుల నరయుచు సాక్ష్య మిచ్చు దేవదూతలు గలరు. దేవదూతలకు క్షుత్పిపాసలు, స్త్రీపున్నపుంసకలక్షణములు లేవు. అదృష్టశరీరులు. గోరీలందుండువారి మతశీలములఁ బరికించుదూతలకు "అ.కిర్ మంకిర్"అని పేర్లు కలవు. "ఇబిలీస్"అన నీమతమున "సైతాను" (పిశాచము).ప్రపంచముంజుట్టి'కోహికాఫ్'అను పర్వతపంక్తియు నందువసించు'జిన'అనువారును గలరనియు, వీరగ్నిసంభూతులనియు, వీరిలో గొందరిస్లాంమతస్థులు, కొందరు కాఫరులును గలరు, మహాదూతలు, సామాన్యదూతలు, వెలుతురునుండి కల్గినవారని చెప్పఁబడినది.

శరణ్యమగు 'ఇస్లాం' షడ్విధములని చెప్పఁ బడినది. అవి యాఱునమ్మకములు –

౧. నిజమగుదేవుఁడగు "అల్లా" తప్ప వేరు దేవుఁడు లేడనునమ్మకము.

౨. మహాదూతలు నల్వురును, సామాన్యదూతలును, సైతానును, మనుష్యుల పుణ్యపాపచర్యలం గనిపెట్టుచుండు సాక్షిదూతలును కలరను నమ్మకము.

3. మతగ్రంథములగు'ఖురానిషరీఫు'నందు, 'హదీత్' గ్రంథములందు 'ఇజ్తిహాదు' గ్రంథములందు "క్వియాస్" గ్రంథములందుఁ గల నమ్మకము.

౪. రెండులక్షల ఇరువదినాల్గువేల నబీలు (మతప్రవక్తలు) ప్రవచించినవానియందుఁ గల నమ్మకము. అందుమహామ్మదువారు ముఖ్యులు, కడపటివారు నను నమ్మకము.

౫. ఏడు స్వర్గలోకములు, ఏడు నరకలోకములును కలవనియు, మనుష్యుల పుణ్యపాపములను తీర్మానపుదినమున త్రాసునందుంచి తూచుదురను నమ్మకమును, అత్తరి మహామ్మదటనుండి కాఁచి రక్షించుననుు నమ్మకము.

౬. లోకమున ప్రాణులకు మొదటినుండి కడవరకు "నజీబ్" (విధి) ప్రకారము కష్టసుఖములు, మంచిచెడ్డలు, ఆపదసంపదలు మొదలగునవి నడుచుచుండుననియు, దానిని దప్పింప

నేరును కర్తలుగా ననునమ్మకము. ఈమూడు నమ్మకములపూర్వకమగు మతమునకు 'ఇస్లాం' మని పేరు.

ఇంక మతధర్మాచరణవిధాన మగు 'దీన్' నాల్గు విధములు.

౧. కలాత్-ఇస్లాంమతస్థుఁడు దినమునకైదు సార్లు మక్కా-నగరమందలి కాబావైపునకుఁ దిరిగి నమాజు (ప్రార్థనను) నొనరించుచుండుట. ఆంధ్రదేశమునకు మక్కా-నగరము పశ్చిమముగ నుండునని మశీదులన్నియుఁ దూర్పుముఖమై యుండును. అందెదురుగ నమాజొనర్చువారు మక్కా-వైపు (పశ్చిమాభిముఖులై)యుందురని యెఱుఁగునది.

౨. జకాత్ - తనయాదాయమునం దర్ధభాగమును బీదలకు దానమొనర్చువ్రతమునకు "జకాత్" నియమమని పేరు.

౩. రమదాన్ మాసమున పగలంతయు నుపవసించుచు, పగలు ఖురానునందలి ముప్పది యవభాగ మనుదినము పఠించుచు, నెల పూర్తియగువరకు ఖురాన్వ్రతమును పూర్తియగునటుల నొనర్చుట "రోజా" యనఁబడును.

౪. హాజ్ యాత్ర- కడపటినెల యగు "మహారేవ" మ్మాసమున యాత్రార్థియై మక్కా నగరమున కేగుట. అనఁగా యథావిధిని మక్కా-యాత్రనల్పుట యని భావము

మహమ్మదు మక్కా-ను జయించి పోయినది శుక్రవారము గాన, నీమతస్థులకు శుక్రవారము పవిత్రదినము. ఇస్లాం మతస్థులలో ౭౩ భేదములుగల తెగలవారు కలరనియు, వీరియందొకరికడ నొకఁడు సొమ్మిప్పిచ్చి వడ్డీ గైకొనరాదనియుఁ దెలియుచున్నది

మహమ్మదుమరణానంతర మల్లుండగు ఆలీకి కొందరు ఖలీపాపట్ట మిచ్చిరి. మహమ్మదు ప్రియభార్యయగు అయెషాబేగమ్ అనునామె తనతండ్రియగు అబుబకర్ అనువానిని ఖలీపాపట్టభద్రుం జేసెను. అత్తరి మతము "షియా" లనియు, సున్నీలనియు నిరుతెగలవారైరి. ఇస్లాం రాను రాను డెబ్బదిమూడు తెగలైరఁట. మొహరంపండుగ నొనర్చువారు షియాలు. (మెహద్రాలీ తెగ మహమ్మదీయులు చూడుఁడు. రోషనియా తెగ మహమ్మదీయులు చూడుఁడు).

**మహర్నవమి (మహానవమి)**-ఆశ్వీజ శుద్ధనవమి. ఈదినమున దేవీపూజ లొనర్తురు. ఆంధ్రదేశమున పుస్తకరూపిణీసరస్వతీపూజలును వంగదేశమున దుర్గాపూజలును, హరిద్వార ప్రాంతమున కాళీపూజలును చేయుదురు. (పండుగలు చూడుఁడు.)

**మహర్షులు**—తొల్లిఁటికాలమున పవిత్ర పురుషులైనవారిని ఋషులని వాడుచుండువారు. అందు గొప్పవారిని మహర్షు లనెడివారు. కాని భృగువు, అంగీరసుఁడు, కశ్యపుఁడు, అత్రి, వశిష్ఠుఁడు, అగస్త్యుఁడు, విశ్వామిత్రుఁడు సప్తమహర్షులనియు, కౌశికుఁడు, కశ్యపుఁడు, భరద్వాజుఁడు, అత్రి, వశిష్ఠుఁడు వీరిని పంచమహర్షులనియు, సుప్రసిద్ధముగ వాడిరి.

ఇంకను ముప్పది యొక్కరిని మహర్షులని పెక్కుగ్రంథములందు వాడియున్నారు. వారివారికాలములందు వారు చాల గొప్పవారుగ నుండి యుందురు. వారు ౧. అగస్త్య మహర్షి, ౨. అత్రిమహర్షి ౩. అంగీరసమహర్షి, ౪. హిరణ్యగర్భమహర్షి, ౫. రోమహర్షణమహర్షి, ౬. కపిలమహర్షి, ౭. కశ్యపమహర్షి, ౮. గౌతమ మహర్షి, ౯. సచ్చిదానందమహర్షి, ౧౦ జమదగ్ని మహర్షి, ౧౧. సనకమహర్షి, ౧౨ సనత్కుమారమహర్షి, ౧౩. శుకమహర్షి, ౧౪. దధీచిమహర్షి, ౧౫. దూర్వాస మహర్షి,

౧౬.నారదమహర్షి. ౧౭.పతంజలిమహర్షి,౧౮. భరద్వాజమహర్షి, ౧౯. పరశురామమహర్షి, ౨౦. భృగుమహర్షి, ౨౧. పులస్త్యమహర్షి, ౨౨. మార్కండేయ మహర్షి, ౨౩. వశిష్ఠ మహర్షి, ౨౪. వాల్మీకిమహర్షి, ౨౫. విశ్వామిత్రమహర్షి. ౨౬. వ్యాఘ్రపాదమహర్షి,౨౭. వ్యాసమహర్షి, ౨౮. పిప్పలాదమహర్షి, ౨౯. శతానందమహర్షి, ౩౦. యాజ్ఞవల్క్యమహర్షి ౩౧. మాండవ్యమహర్షి యనఁబడువారలు.వీరిఁగూర్చి వేర్వేఱుతావులందుఁగాననగుచుండను.

వీరియందు సప్తమహర్షులు సుప్రసిద్ధులు. సప్తమహర్షిత్వము పదవి యనియు,వాటిని కొందఱు ఋషు లందుచుండి రనియు, పరిశీలనల నుండి తెలుచున్నది. ఇంక పంచర్షులు, పరమేశ్వరునినుండి వరుసగ సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన మంత్రము లనఁబడు పంచబ్రహ్మమంత్రముల నుపదేశము నందిన వారనియు తెలిసెడిని. తక్కిన ఏకత్రింశన్మహర్షులఁగూర్చి (ముప్పదియొక) వారివారి తావులందే తెలిసిననంగతులు వివరింపఁబడును.

(ఋషులు చూడుఁడు).

## మహాఏకాదశితిథులు (పదకొండు)-

౧ ఆషాఢశుద్ధఏకాదశి-:చాతుర్మాస్యఏకాదశి ప్రథమైకాదశి. విష్ణుదేవుఁడీదినమున నిద్రించుననియు, గాన నిది శయనైకాదశి యనియు నందురు. యతులకు చాతుర్మాశ్యలు ప్రారంభము.

౨ ఆషాఢబహుళయేకాదశి- యతులకుఁ జాతుర్మాస్యైకాదశులలో నొకటి.

౩ శ్రావణశుద్ధయేకాదశి-యతులకు చాతుర్మాస్యైకాదశులలో నొకటి.

౪ శ్రావణబహుళయేకాదశి- యతులకుఁ జాతుర్మాస్యైకాదశులలో నొకటి.

౫ భాద్రపదశుద్ధయేకాదశి- పరివర్తనైకాదశి. యతులకు చాతుర్మాస్యైకాదశులలో నొకటి.

౬ భాద్రపదబహుళయేకాదశి- యతులకు చాతుర్మాస్యైకాదశులలో నొకటి.

౭ ఆశ్వీజశుద్ధయేకాదశి- యతులకు చాతుర్మాస్యైకాదశులలో నొకటి.

౮ ఆశ్వీజబహుళయేకాదశి- యతులకు చాతుర్మాస్యైకాదశులలో నొకటి.

౯ కార్తీకశుద్ధయేకాదశి- యతులకు చాతుర్మాస్యైకాదశులలో నొకటి. బోధనైకాదశి, యనఁగా విష్ణుదేవుఁడు ప్రబోధనము (నిద్ర నుండి మేల్కొనుట) నొందును. భీష్మైకాదశి. అపుత్రవంతులు గాంగేయుఁడగు భీష్మపూజ చేసి యేకాదశీవ్రత మాచరించి ద్వాదశియందు తులశీబృందావివాహ మొనర్తురు. భీష్ముఁ డైదు దినములు శరపంజరమునఁ బండియుండి పాండవులకు ధర్మము లుపదేశించి యేకాదశియందు ప్రాణములు విడిచెనని చెప్పఁబడినది.

౧౦ కా[illegible] బహుళ ఏకాదశి.

౧౧ పుష్యశుద్ధయేకాదశి- వైకుంఠయేకాదశి. శ్రీవైకుంఠమున భక్తులరాక నిమిత్తము ద్వారములన్నిటిం దెరచి యుంచఁబడునని చెప్పబడినది. దీనినే ముక్కోటియేకాదశి యనెదరు. మూడుకోట్లదేవతలు శ్రీరంగనాథుని సేవింప శ్రీరంగమున కేతెంతురని శ్రీవైష్ణవుల నెడఁగు.

ఈపదునొకండు యేకాదశులును అతిపవిత్రవంతములగుట మహాయేకాదశు లని పేరందినవని చెప్పఁబడినది. మరియు నాషాఢ, శ్రావణ, భాద్రపద, యాశ్వయుజమాసములందలి యెనిమిది యేకాదశులును, కార్తీకశుద్ధ యేకాదశి తోఁగల్పి తొమ్మిదియేకాదశులను చాతుర్మాస్యైకాదశులనియెదరు.ఈచాతుర్మాస్యలందుయతు

లోకేశావునఁ గడపవలయునని నియతికలదు.

**మహాకణ్వగోత్రము**-(ఉపమన్యుగణము చూడుఁడు).

**మహాకర్ణాయనగోత్రము**- (ఉపమన్యుగణము చూడుఁడు).

**మహాకషాయవర్గము** (దీపనీయవర్గము చూడుఁడు)

**మహాకాళుఁడు**— అత్రిసంతతి. చంద్రవంశపు క్షత్రియుఁడు. పితామహుఁడు పురంజయుఁడు. తండ్రి జనమేజయుఁడు. కుమారుఁడు మహామనుఁడు.

ఈసందర్భమున యమునికి కాలుఁడనియు, రుద్రునకు మహాకాలుఁడనియుఁ బేర్లుకలవనియుఁ జెల్పుట సమంజసము.

**మహాగంగ** — అలకనందానది పేరు.

**మహాకోరలయగోత్రము** -(శండిలగణము జూడుఁడు.)

**మహాకోసలదేశము**— (దక్షిణకోసలదేశము జూడుఁడు.)

**మహాచక్రియగోత్రము**— (సిధృవగణము జూడుఁడు.)

**మహ్దాగారు**— (రాజోవు మహమ్మదీయ మతాచార్యుఁడు). అరబ్బీభాషయందు సన్మార్గమున నడుపఁబడినవాఁడని యర్థము. మహమ్మదీయ లింకొక మతాచార్యుఁడు రానున్నాఁడనియు, నాతనిపేరు మహ్దీ యనియు నందురు. మహమ్మదుసంతతివానినే మహదీ యందురఁట. ఆతనికి నతనియిష్టమునకు వ్యతిరేకముగ మహదీగ జను లెన్నుకొనవలయునఁట. ఇది మక్కాయందు జరగవలసియున్నదఁట. మరియు నిది యొక కలీఫ్‌మరణానంతరము జరగునందురు. ఆకాలముననె క్రీస్తును, క్రీస్తుం బోలిన యొక మతాచార్యుఁడును సిరియాదేశముననవతరించి న్యాయమగు సత్పరిపాలనము స్థాపించుదురఁట కొందరు మహమ్మదీయ ప్రభువుల కీబిరుదముండెను.

**మహాత్రేయగోత్రము**-(ఆత్రేయగణము చూడుఁడు.)

**మహాతృతీయ**- సూర్యుఁడు మేషరాశి గతుఁడై (మేషమాసమునందుండుట)నప్పుడు శుద్ధతృతీయయందు వ్యతీపాత్ సంభవించుటయు, నత్తరిని సింహరాశియందు కుజగురులు కలసియుండుటయు సంభవించునేని దానినిమహాతృతీయ యనెదరు.

**మహాదీక్షలు (శైవసిద్ధాన్తమున నేకవింశన్మహాదీక్షలు)**-క్రియాదీక్షాంతర్గతములు ౭:- ౧ ఆజ్ఞాదీక్ష, ౨ ఉపమాదీక్ష, ౩ కలాభిషేచనదీక్ష, ౪ స్వస్తికారోహణదీక్ష, ౫ భూతిపట్టదీక్ష, ౬ ఆయత్తదీక్ష, ౭ స్వాయత్తదీక్ష

మనుదీక్షాంతర్గతములు ౭:- ౧ ఏకాగ్రదీక్ష, ౨ దృఢవ్రతదీక్ష, ౩ పంచేంద్రియార్పణదీక్ష, ౪ అహింసాదీక్ష, ౫ లింగనిజదీక్ష, ౬ మనోలయదీక్ష, ౭ సద్యోముక్తిదీక్ష.

వేధాదీక్షాంతర్గతదీక్షలు ౭:-౧ సమయదీక్ష, ౨ నిస్సంసారదీక్ష, ౩ నిర్వాణదీక్ష, ౪ తత్త్వదీక్ష, ౫ అధ్యాత్మదీక్ష, ౬ అనుగ్రహదీక్ష, ౭ సత్వశుద్ధిదీక్ష. మొత్తము నిరువదియొకటి.

**మహాదానములు పదునారు**— (దానములు చూడుఁడు).

**మహాదేవుఁడు** — పరమేశ్వరుఁ డగు రుద్రుని యెనిమిద యాకారములలో నొకటి. (అష్టమూర్తిఁ జూడుఁడు.)

**మహాధనుస్సు**—(ధనుర్బాణము చూ.)

**మహానది**—వింధ్యాద్రికిఁ జెందిన సప్తపురపర్వతములందలి మేఖలపర్వతపంక్తియూర్ధ్వ

కడను(అమరకంటకమునకుఁ గొంతదూరమున) జన్మించి, ఛోటానాగపూరుకడ నున్నతసీమ లందు జనించిన చిన్నచిన్న నదీప్రవాహములఁ గొన్నిటిఁగల్పుకొని బలపడి, మధ్యరాష్ట్రము లందు బ్రవహించుచు, రాయపూరునకుఁ గతిప యదూరమున నొకపాటి ప్రవాహముగల్గి, సాంబల్పూరుకడ దక్షిణముగ మరలి, మరికొన్ని ప్రవాహములఁ జేర్చుకొని, యాగ్నేయదిశకు మరలి రెండుగఁజీలి, కటకముఁ జుట్టి, తిరుగఁ గలుసుకొని, పలుపాయలుగఁజీలి, కడకు ఛండీబాలేశ్వరము రేవుకడ బంగాళాఖాతమున సంగమించును. పంటకాలువలఁ గల్గి ప్రక్కసీమల నెక్కువగా ఫలింపఁ జేయుచుండునది. దీనికిఁ గటకముకడ నానకట్ట కట్టియున్నారు. ఇంకను నలువదిమైళ్ళ పొడవున నొకలోవను గోసికొని, తూర్పుకనుమల నిది దాటుతా వరణ్యామధ్యమై వింత గొల్పెడిని. ఇంకను డార్జిలింగుకడ నొక నదికి 'మహానది' యని పేరుగలదు. మహాభారతము, ఆదిపర్వము ౨౧౫ యందు గయవద్ద గల ఫల్గుణీనది కీపేరు వాడియున్నారు.

**మహానందీశ్వరము**— ఇది కర్నూలు మండలమున నరణ్యమునఁగల యొకదేవస్థానము. శివక్షేత్రము. ఇది శ్రీశైలమల్లికార్జున శివలింగముంజుట్టిన యుపలింగములలో నొకటిగఁ జెప్పఁబడినది. నందియాల పురమునుండి యాగ్నేయముగాఁ బదిమైళ్ళదూరమునగాజులపల్లి యనఁబడు రెయిల్వేస్టేషనునుండి మూఁడు మైళ్ళదూరమున నరణ్యమధ్యమునందుగల దేవస్థానము. ఇచటి కొండలకు నల్లమల(కొండ) లనిపేరు. వాటియం దనేక జలధారలు (నీటి బుగ్గలు) గలవందురు. వాటియం దిది శ్రేష్ఠమనియు నందురు. ఇచటిధార శివలింగము క్రిందుగ బ్రవహించుచు, దేవాలయావరణము ననేగల యొక జలకుండములోని కొకనంది నోటిగుండ వెలువడుచు, గుండమునుండి వేరు ద్వారమున నవ్వలికిఁ జనుచుండును.

జలకుండము ముప్పదిగజములు చతురముఁ గల్గి, యెదడులలోతునీటిని నిల్పునదియై యుండును. నీరు పరిశుభ్రమై యద్దమువలె స్వచ్ఛతంగల్గి,యడుగునఁగల సమస్తమును పైకిచూపుటకు పేరుగాంచి నిర్మలమైయుండును.

**మహానుభావమతకర్త (కృష్ణభట్టు)** - (కృష్ణభట్టు చూడుఁడు).

**మహానుభావ మతము** — మహానుభావమతమునకుఁ గర్త కృష్ణభట్టనువారు. వీరు శ్రీకృష్ణునిరూపముం బోలినరూపము గలవారనియు, కృష్ణాంశసంభూతులై గొప్ప మహిమలఁ గల్గినవా రనియు, వీరి శిష్యవర్గము భేతాళు నుపాసించి యొక కిరీటముం బడసినవా రనియు, దానిమాహాత్మ్యమున సాక్షాత్కృష్ణమూర్తివలె ప్రకాశించుచుందురు గాని, కృష్ణసంబంధ మేమియు వీరియందు లేదని వీరివైరులును జెప్పుచుండిరి.

ఈమతస్థులు నీలివస్త్రముల ధరింతురనియు, వీరిలో సన్యాసులు క్షౌరము జేయించుకొందురు, గాని గృహస్థులు క్షౌరముజేయించుకొనరనియు చెప్పబడినది. హింసాకార్యములు చేయరాదు. మన్మ్రుత్తికముద్రచే నిష్టదేవోపాసన చేయవలెను. శ్రీకృష్ణుని (కృష్ణభట్టురూపముననుు), దత్తాత్రేయుని నారాధించుటవీరిమతధర్మము. సన్యాసిని 'మహంతని'వాడెదరు. కృష్ణభట్టకృతమని చెప్పఁబడు కృష్ణచరితామృతము, గీత, లీలానిధి, లీలామృతము వీరికిఁ బ్రమాణ గ్రంథములు.

ఈమతస్థులు మహారాష్ట్రసీమలందు వరాడ దేశమున నున్నారు. వీరి సన్యాసు లుండు మఠములు పది కలవు.

**మహాపద్మ సరస్సు**—కాశ్మీర దేశమందలి వూలార్ సరస్సు. దీనికి (నాగ) మహాపద్మము నుండి యీ పేరు కల్గెనఁట. ఇంకను నరవాటో యనియుఁ బేరు కలదఁట.

**మహాప్రబంధవర్ణనలు ౧౮—**

నగరార్ణవ శైల ర్తు చన్ద్రార్కోదయ వర్ణనమ్। ఉద్యాన సలిలక్రీడా మధుపాన రతోత్సవా॥ విప్రలంభో వివాహ శ్చ కుమారోదయవర్ణనమ్। మంత్రి ద్యూత ప్రయాణాని నాయకాభ్యుదయా అపి॥

౧ పురవర్ణన, ౨ సముద్రవర్ణన, ౩ పర్వత వర్ణన, ౪ ఋతువర్ణన, ౫ చంద్రోదయ, సూర్యోదయ, ౭ ఉద్యానక్రీడ, ౮ జలక్రీడ, ౯ మద్యపానవర్ణన, ౧౦ రతివర్ణన, ౧౧ విరహ వర్ణన, ౧౨ వివాహవర్ణన, ౧౩ పుత్రోదయ వర్ణన, ౧౪ మన్త్రాంగవర్ణన, ౧౫ ద్యూత వర్ణన, ౧౬ ప్రయాణవర్ణన, ౧౭ నాయకా భ్యుదయవర్ణన, ౧౮ కథాసందర్భగ్రంథరచన. ఈ పదునెనిమిది యు మహాప్రబంధమునఁ జెప్పఁబడవలయును.

మతాంతరమునఁ బ్రబంధవర్ణన లిరువది రెండు:

సీ॥ పురమును ఋతుషట్కమును బ్రయాణం
బును శైలంబు వేఁటయు సాగరంబు। మా
నీంద్రపుణ్యాశ్రమంబును మంత్రంబు జ్యూ
తంబు బిదప నద్భుతరణంబు। విజయంబు
మద్యపానజవికారంబును వనవిహారంబును
వారికేళి। కన్యాంగసౌందర్యకథనంబు
హిమకరాభ్యుదయంబు విప్రలంభోచితంబు।
గీ. పద్మమిత్రోదయంబును బరిణయంబు
సురతమును దౌహృదంబును సుతజననము
ననఁగ నిరువదిరెండు వర్ణనలు దనరఁ
జెప్పవలయుఁ బ్రబంధము శ్రీమహేశ!

**మహాపాతకములు ౖదు (పంచమహాపాతకములు)**—౧. స్వర్ణస్తేయము (దొంగిలుట), ౨. సురాపానము (కల్లు మొదలగు మత్తుపదార్థములఁ ద్రావుట), ౩ బ్రహ్మహత్య. ప్రాణములఁదీయుట(ప్రాణి బ్రహ్మపదార్థము), ౪. గురుతల్పగమనము, ౫. మహాపాతకసహవాసము.

ఉపపాతకములైదు- (పంచోపపాతకములు).

౧. స్త్రీహత్య, ౨. వ్రాత్యత. ఎనిమిది సంవత్సరములకు పైబడి యుపనయనముకాకుండిన నాబాలుఁడు వ్రాత్యుఁడనంబడును. అది యుపపాతకము. ౩. చౌర్యము (దొంగలించుట). ౪. ఋణానుపాకరణము (అప్పెగబెట్టి తీర్పక పోవుట). ౫. అనాహితాగ్నిత్వము (ఔపాసనాగ్నిని విడిచి గృహస్థాశ్రమము నెఱపుట). ఈయైదు నుపపాతకము లనఁబడును.

**మహాపురాణములు**-- అష్టాదశపురాణములు. (పురాణములు, పురాణలక్షణములు చూడుఁడు.)

**మహాపౌర్ణమి** సూర్యుఁడు మేషరాసియం (మేషమాసమున) దుండుతఱిఁ బౌర్ణమీయాదివారమును, విశాఖానక్షత్రమును, వరీయాన్నామయోగమును సంభవించి, యప్పుడు మకరరాసియందు కుజుఁడును, ధనుస్సున బృహస్పతియు, తులారాశియందు శనియు నుండుట సంభవించునేని దానిని మహాపౌర్ణమి యనియెదరు. వైశాఖశుద్ధపౌర్ణమినిగూడ మహావైశాఖపౌర్ణమి లేక మహాపౌర్ణమి యనెదరు.

**మహాబంధముద్ర** — యోగాభ్యాస విధానమునఁ జెప్పఁబడిన ముద్రలలో నొకటి.

ఎడమకాలిమడమచే గుదద్వారము నదిమిపట్టి, యామడమీద కుడికాలినుంచి, జాలంధర

బంధముతో వాయునిరోధమునల్పుటకు మహా బంధముద్ర యని పేరు.

ఈయభ్యాసమువలన శరీరనాడు లూర్ధ్వగతి నందుటయు, నిడా పింగళా సుషుమ్నా నాడులు భ్రూమధ్యగతములై యపమృత్యుపరిహారమగు ననియుఁ జెప్పఁబడినది.

**మహాబలవిద్య** (అతిబల మహాబల విద్యలు జూడుఁడు.)

**మహాబలిపురము**-ఇది తొల్లిఁటి మామల్లాపురము. దీని తొల్లిఁటిసరియైనపేరు మహామల్లపురము. ఇంకను నరవదేశస్థులందు మహామలైపురమనియు, మల్లాపురియనియు, మావలిపురము లేక మహాబలిపురమనియుఁ గూడ వాడు నామములు గలవు. ఐరోపాదేశస్థులు దీనిపేరు 'Seven Pagodas' అనియెదరు. ఏలయన నొకప్పుడు ఇప్పుడు సముద్రపుటొడ్డునఁగల దేవాలయములవంటి దేవాలయము లేడు సముద్రపుటంచుదరి నుండెడివఁట. దేవళములపై తాపఁబడిన రేకులు సూర్యకాంతికి తళతళ మెఱయుచు సముద్రమున నోడలలో నుండిన[illegible]కి బహిరంగముగఁ గన్పడుచుంటఁ జేసి యీతావున కేడు గోపురము లని పేరుగల్గెనఁట. ఇప్పుడం దారు గోపురములు సముద్రాక్రాంత మైపోయెనని తలఁపఁబడుచున్నది.

కాని క్రీ.ము. రెండుశతాబ్దములకుఁ బూర్వమునుండి యీరేవుపట్టణ మట నుండెనని నిదర్శనములు గానవచ్చుచున్నవి. మరియు నీ పట్టణమునకు,రోము దేశము మొదలగు దేశములకు, వర్తకముండినటుల నీపట్టణప్రదేశములఁబూడ్చివేసినదిబ్బలు త్రవ్వుటయందు నిదర్శనములు దొరకుటఁ జేసి తలఁపఁబడుచున్నది. అందు చీనాదేశపు నాణెములుకూడ గలవు. పురాతనపుఁ టిటుక లిట దొరకుచుంట, నిట నొక పురాతన నగరముండుటఁ దెల్పును. ఆయిటికలఁబట్టి యవి క్రీ. ము. రెండువందలసంవత్సరములకు పూర్వముండినవై యుండునని తేలుచున్నది. మహాబలిపుర మనుపేరును, దాక్షిణాత్యు లీతావునకు బలిచక్రవర్తిపేరిడుట దీనినొక ప్రసిద్ధయాత్రాస్థలముగనొనర్చి ద్రవ్యార్జనమొనర్ప సమకట్టినదిగాని నిజముకాదు. తక్కిన యితరపేర్లును వాడుకలోనికి ప్రమాదాగతములైనవే.

ఈ పేరుకొఱకిచటి శాసనములను వివరించుటకిది తావు కాదు. ఇచటి స్థలపురాణమున మల్లాపురి యని పేరు వాడఁబడినది. ఈప్రాంతదేశమును తొల్లిఁట పల్లవులు కంచి రాజధానిగ నేలుచుండుతరి, మరుత్తనుభూపతి యమరభూపతిచే నోడింపఁబడెనఁట. అమరుఁడు మల్లులనువారి నాయకుఁ డఁట. గాన నాతని రాజమల్లుఁడనియు మహామల్లుఁడనియు వాడుచుండిరఁట. రానురాను జయశీలుఁడగు మల్లుని తెగవారిని 'మహామల్లు' లనియు ననుట కల్గియుండెనఁట. ఈపురమునకు మహామల్లపురమని వాడుకయుఁగల్గి ప్రసిద్ధంబయ్యె నఁట. ఈ సంగతి చెంగల్పట్టు మాన్యుయల్ నందుఁ గూడ గాననయ్యెడిని. ఇంకను ముఖ్యములగు పరిశీలనలపై వ్రాయఁబడిన యార్కియాలోజికల్ సర్వే ఆఫ్ఇండియా ౧౯౦౬-౧౯౦౭ సంవత్సరములరిపోర్టు పేజి ౨౧౭-౨౪౩ యందీసంగతి స్పష్టముగ వివరింపఁబడినది.

పరిశీలనలవలన నిచటి సముద్రముదరినున్న దేవళము One of Pagodas పల్లవులనాటిపనియనియు, (పల్లవులు చూడుఁడు) పంచపాండవులరథము లనఁబడునవి పల్లవులఁ జయించి రాజ్యమాక్రమించిన చాళుక్యులనాటి పనియనియు తేలుచున్నది. పల్లవులు (అనఁగా కాంచీపురమున రాజ్యమేలినవారు) ఆంధ్రులకుఁ బిదప రాజ్యమేలినవారు.

పరిశీలకులు పల్లవరాజగు నొకటవ నరసింహవర్మ నిర్మింపఁజేసెనందురు. ఇతఁడు చాళుక్య నృపతియగు రెండవపులికేశితో సమకాలికుఁడగుట, క్రీ. వె. ౬౦౯ ప్రాంతమై యుండునోపు. అంతకుపూర్వ మీపేరు లేక నీరేవుపట్టణ ముండినదని తలంచినను, మహామల్లపురమను పేరుగల్గుట కీకాలము జెప్పవచ్చును.

ఇంక నిచటికట్టడముల నిర్మాణము తర్వాతి కాలములోనిదని యెఱుంగఁబడుచున్నది. ఇచట చూడఁదగినకట్టడములు, రథములు, మున్నగునవి బౌద్ధులకాలమునాటివి. బౌద్ధభిక్షువుల నివాసమునకు నిర్మింపఁబడినట్లు తోఁచెడిని. పని పూర్తి కాలేదని తోఁచెడిని. వీట్లపోలిక బౌద్ధ విహారములను చైత్యములను విమానములను పోలి యుండును.

౧ ధర్మరాజరథము-ఇది ౨౭ × ౨౫ × ౩౪ అడుగులు. నాలుగంతస్తులు గలది. పశ్చిమాభిముఖమై యున్నది. ఒకేరాతినుండి పరస్థలముల దీసివైచి తొలువఁబడినది.

౨ భీమరథము- ఇది ౪౨ × ౨౫ × ౨౫ అడుగులు. ముందువైపున వరండా కలదు. పశ్చిమాభిముఖమైయున్నది. ఒకేరాతినుండి తొలువబడినది. ఇందు స్థంభములబలము చాలక నడుమను పగిలియున్నది.

౩ అర్జున రథము- ఇది ౧౧ × ౧౬ × ౨౦ అడుగులు. మూడంతస్థులపైని డాబా వంటికప్పు గలదు.

౪-౫ నకులసహదేవరథములు-ఈ రెండును ఒకేపెద్దరాతినుండి తొలువఁబడి చెక్కబడినది. గుజ్జుపులాకముఁబోలియుంచుకవంకరగానున్నవి బౌద్ధచైత్యముం బోలియున్నది.

౬ ద్రౌపదిరథము-అన్ని రథములలో నుత్తరపుకడనున్నది. పర్ణశాలపోల్కి గలది. ఏకశిల తొలువఁబడినది.

ఏనుఁగు,సింహము, ఎద్దు, ఇవి రాతియందు తొలువబడి చెక్కఁబడినవి.రథములకడ నేగలవు.

వరాహస్వామి దేవళము-ఇదినవీనమని తలఁపఁబడుచున్నది.

యమపురి-ఇట మహిషాసురమర్దని దేవళముగలదు. ఈ ప్రాంతమున లైటు హౌసు నిర్మింపఁబడినది.

కృష్ణస్వామిమండపము- దీనిని సత్రమనియు ననుచుందురు.

పంచపాండవమంటపము-

అర్జునతపస్సు-ఒకరాతిగోడపై చిత్రింపబడినపని. విగ్రహములు గావు.

గణేశమంటపము-

రామానుజమంటపము-

వరాహ, వామన, విగ్రహములు- భూమిఁదవ్వి తీయఁబడినవి

రాయలగోపురము- పని పూర్తికాలేదు.

సముద్రపుదరిదేవాలయము- తొల్లింటి యేడుదేవళములలో నొకటి.

కోఁతి, యేనుఁగ, చిలుక-

కృష్ణుని వెన్నముద్ద-(తెల్లనిరాతిగుండు.)

ధర్మరాజు సింహాసనము-

ద్రౌపతిస్నానము-

విడిదిబంగళా-

ఇది చెన్నపట్టణమునుండి ముప్పదియైదుమైళ్ల దూరమును, చెంగల్పట్టునుండి పదునెన్మిమిమైళ్ళు నుండును. బకింగ్హామ్ కాలువకును, సముద్రమునకును నడుమ నున్నది.

## మహాబలేశ్వరము (పంచగాని) సమశీతోష్ణప్రదేశములు—

పడమటి కనుమలపై నున్న తావు. బొంబై రాజధానిలోనున్న తావు.

ప్రభుత్వమువారి వేసవి నివాసస్థలము. పూనా, హుబ్లి ఇనుపదారి. M.S.M. లైను వాదర్ స్టేషనునుండి మంచిబాటను ౪౦ మైళ్ళ దూరము. వేసవియందునను, వర్షములకుఁ బిదపను బొంబై పూనా నగరములనుండి పెక్కండ్రు ధనికులు వసింప నేగుచుందురు, కాని వర్షకాలమున మహాబలేశ్వర మనారోగ్యకరమై యుండునందురు. సముద్రపు నీటిమట్టముపై ౪౫౦౦ అడుగుల యెత్తనియు, చల్లగానుండుటయెగాక సముద్రపుఁ గాలులు వచ్చుతావనియుఁ జెప్పఁబడినది.

క్రీ. వె. ౧౮౨౮లో బొంబై గవర్నరుగా నుండిన సర్. జాన్ మాల్కామ్‌గారు, సతారా రాజాగారినుండి యీతావును సంపాదించి యీ సమశీతోష్ణప్రదేశమును వాడుట కారంభించినారు. మార్గమున "పంచగాని" యను చిన్న శీతోష్ణప్రదేశము గలదు. అట నైరోపావారు సంవత్సరము పొడవునను వసించుచుందురు. అది వాదరునుండి ౨౯ మైళ్ళదూరమున మహాబలేశ్వరపు రస్తాపైననే యున్నతావు.

**మహాబోధి** — ఉర్వేలకు బౌద్ధులనాడు గల్గినపేరు. (బోధివృక్షము, బుద్ధగయ చూ). ఉర్వేలప్రశంస మత్స్యపురాణము ౨౨ననందుఁ గలదు.

**మహాభీర (అడభీర లేక భీర)**- -(భీర చూడుఁడు.)

**మహాభోజుఁడు**-(భోజుఁడు చూడుఁడు.)

**మహామఘము, (సరస్సు)**- తొల్లిఁటి చోళదేశమున తంజావూరు మండలములోని కుంభకోణపురమునఁ గల యొకసరస్సు; స్నానతీర్థము. సింహరాసియందు బృహస్పతి ప్రవేశించియుండుసంవత్సరమున, మాఘశుద్ధపౌర్ణమినిందు గొప్ప స్నానయాత్ర జరగుచుండును. సౌందర్యవంతముగ సోపానమంటపములనిర్మించియున్నారు.

**మహామతిమండలము**— సెంట్రల్ ఇండియాలో 'మండల'యను పేరఁ బరగుసీమ. మహేశమండల మనియుఁ బేరుకలదు.

**మహామనుఁడు**—అత్రిసంతతి, చంద్రవంశక్షత్రియుఁడు. తండ్రి మహాకాలుఁడు. పుత్రు లుశీనరుఁడు, తితీక్షువు ననువారలు.

**మహామహేశ్వరాచార్యుఁడు** -అభినవగుప్తాచార్యుఁడు చూడుఁడు.

**మహామాఘి**—మాఘశుద్ధపౌర్ణమి. దీనినింకను గొందరు మహాపౌర్ణమియనియు, మహామాఘపౌర్ణమి యనియు నందురు. (పండుగలు చూడుఁడు.) కాని, మహాపౌర్ణమియనిన వైశాఖపౌర్ణమి శస్త్రము.

**మహామాయుఁడు** — అధోలోకములలో నొకటియగు నతలము నేలిన భూపతి.

**మహామారి (వ్యాధి)**—ఇది సూక్ష్మజీవులవలనఁగల్గి వ్యాపించు ఘోరమైన యంటువ్యాధి. ఎక్కువ యపాయకరమైనది. దేశమందిది తగిలినచో జననష్టముగలిగి జనము పల్చఁబడుదురు. దీని నాంగ్లమున ప్లేగు (Plague) వ్యాధి యనియెదరు. దీనిం దొలుత క్రీ. వె. ౧౮౯౪లో 'సాటో' యను జపాను వైద్యుఁడు కనిపెట్టెనని చెప్పఁబడినది. ఇది మనుష్యులకును నెలుకలకును, వానినాశ్రయించి బ్రతుకుచుండు గోమారులకును, ఇంకనీ మొదలగుచిన్న జాతిజంతువులకు నంటుననియు, గుర్రములు, మేకలు, నావులు, గొర్రెలు నీవ్యాధికి వశముగావనియు పరిశీలనలనుండి తేలినది.

ప్లే గనిన తెగులు లేక నాపద యని యర్థమట. ఇంగ్లాండునందు "Great Plague in England" అని చెప్పంబడిన వాడుకమేర క్రీజబ్బొకప్పుడు కల్గెనఁట. మరియు పదునాల్గవ శతాబ్దమున నైరోపాదేశములందు "Black

death" అని చెప్పంబడిన దీమహామారియే. లండను నగరమున క్రీ. శ. ౧౬౬౫-౧౬౬౬ సంవత్సరములందు డెబ్బదివేలజను లీప్లేగువాతఁ బడిరని చెప్పఁబడినది. ఈజిప్టు దేశమున నిశ్రాయేలీయులను నిర్బంధించినకతన నాదేశప్రభువగు ఫరో పైనను, దేశమందలి స్వదేశస్థులగు ప్రజలపైనను, శిక్షగా పదిప్లేగులు విధింపఁబడినటుల బైబిలునందుఁ గలదు. (ఈజిప్టుదేశపు పదిప్లేగులశాపము చూడుఁడు.)

ఈవ్యాధి నలువది సంవత్సరములక్రితము భరతదేశమునం దగుపడి ప్రజలను వేధించెను. అందు తూర్పుబంగాళము, ఆసాములం దంతగా వ్యాపింపలేదు. జ్వరము Lymphatic glands అనంబడు నవయవములు వాచుట, త్వరితగతిని ఎక్కువ సంఖ్యగా మృతులు, శరీరమున సూక్ష్మజీవు (Bacillus) లగు పడుట, యను లక్షణములతో భయంకరముగ ప్రబలువ్యాధి. ఇందు ముఖ్యముగ తీవ్రజ్వరము, దగ్గు, ఆయాసము, గజ్జలలోను దవడలక్రిందను బిళ్ళ లేర్పడుటయు ముఖ్యలక్షణములు.

ఈ మహామారివ్యాధి యెండకాలమున తగ్గిపోయి, శీతకాలమునం దెక్కువయగుచుండును. వర్షము లధికముగ కురియుచో వ్యాధి తలయెత్తినటుల వ్యాపించుచు ప్రజలను జంపును. ఇందు మూడుజాతులు గలవు.

౧. Bubonic Plague- ఇందు glands వాచి పెద్దవి యగుటయు, గజ్జలు, దవడలు కడ బిళ్ళ లేర్పడుటయు, నుష్ణము, ముఖ్యలక్షణములు. ఇదియే భరతదేశమునం దిటీవల నగుపడిన జాతి. దీనివలన నూటియం దరువది మొదలు తొంబదియైదు పరకును చావులు గలిగెను.

౨. Pneumonic Plague- దీని నూపిరితిత్తుల ప్లేగువ్యాధి యనెదరు. ఇందు దగ్గు, ఆయాసము, ప్రధానలక్షణములు.

౩. Septicaemic Plague- దీని లక్షణములు సరిగా తెలియరాకున్నవి.

ఈ మూడుజాతులందు బిళ్ళలు కనబడు నందురు. మరియు వీటికి టీకాలు వేసి, రోగ మంటకుండ శరీరమును రక్షింపనగు ననియు, నొకవేళ వచ్చినను తీవ్రముగ రాకుండఁ జేయు ననియు ఘనవైద్యు లనుచుందురు.

ప్లేగు-సూక్ష్మజీవి (Plague Bacillus) ని మైక్రాస్కోపుద్వారా పరిశీలించిన 'Short thick Coco-bacillus with rounded ends' గానఁబడుననియు, ముదిరినతరి కొనలందు గాఢతరముగను శరీరమునం దించుక తక్కువగను మచ్చలు గల్గి Bepolar appearence కల్గియుండునఁట. ఇవి గుడ్లఁబెట్టి యభివృద్ధిఁజెందుజాతి యనియు, పొదగఁబడు కాలము, రెండు మొదలెన్మిది దినములనియు చెప్పుదురు. మానవశరీరములం దీసూక్ష్మజీవి యూపిరితిత్తులందుఁగాని, ప్రేగులందుఁగాని, రక్తనాళములందుగాని ప్రవేసించునని కన్గొనఁబడినది. గాలిగలతావుల నైనను, గాలిలేనితావులందైనను, స్వల్పకాలము బ్రతుకును గాని సాధారణముగ నొకశరీరము వెలుపల నెక్కువ కాలము జీవింపఁ జాలనంత దుర్బలమైనవనియు, సాధారణములగు క్రిమిఘాతుకౌషధములచే గాని, గాఢమగు సూర్యరశ్మిచే గాని, చచ్చుననియు, కనుగొనఁబడినది. ఇట్టి సూక్ష్మజీవులు రోగవ్యాప్తికి చాల గొప్పశక్తిఁ బ్రదర్శించగలవని యాశ్చర్యము గల్గించెడిని.

ఇవి కాళ్ళు మొదలగువాటియందలి కురుపులు, గోకుడుపుండ్లు మొదలగు 'ulsers'నుండి లోనికిఁబ్రవేశించి, క్రొత్తవారియందు రోగము నుద్భవింపఁజేయును. ముఖ్యముగా నెలుకలు,

వాటినాశ్రయించియుండు గోమారులు మొదలగుచిన్న జంతువులఁబట్టుకొని, వాటినుండి అన్యుల గృహములకుఁ జేరి, యందలివారికంటు రోగవ్యాప్తి గావించును. ఈ గోమారు లీగలఁబోలిన చిన్న జీవజంతువులు. సాధారణముగ నీరోగముండిన ప్రాంతముల నేయింటనైన నెలుకలు రక్తముం గ్రక్కుకొని చచ్చిపడియుంట సంభవించునేని, యాయింటియందా రోగము వ్యాపించి యున్నదని యెఱుంగఁదగినదే!

సాధారణముగ నెలుకలనుండియే యీ వ్యాధి వ్యాపించుట సంభవించుచున్నదఁట. ఒక్క యూపిరితిత్తుల మహామారియం దూపిరితిత్తులనుండి కఫముద్వారా సూక్ష్మజీవులు వెడలుచుండుఁగాన, నట్టిరోగివలన నీరోగము మనుష్యులకు వ్యాపించవచ్చును గాన నట్టితరి వైద్యులును, నుపచారమొనర్చువారును ముక్కునకును నోటికిని బట్టలఁగట్టుకొనెదరు. తక్కినజాతుల ప్లేగులందునుండి మనుష్యునకు వ్యాపింపఁజేయనేరదు గాన నుపచారమొనర్చువారు తాకినను భయము లేదందురు.

ఎలుకలు లేనిచో ప్లేగు వ్యాపింపదు. వాటిం జంపుట ప్రధానకార్యమని వ్రాయుదురు. ఈరోగము తగిలిన యింటిధూళియం దెలుక కన్నములందు, చీఁకటియందు ఇరుకుమూలల నీసూక్ష్మజీవు లుండుఁగాన జాగ్రత్తఁ గొనవలసి యుండునని చెప్పుదురు.

ఈరోగము పిల్లలకంటె పెద్దవారికిని, ముఖ్యముగ స్త్రీలకును దగులుచుండునని కనిపెట్టఁబడినది. ప్లేగుసూక్ష్మజీవులు గచ్చునేలలందు ౨౪ గంటలును, మట్టినేలలందు ౪౮ గంటలును మని యుండగలవని పరిశీలనలు బయల్పరచినవి. ఇయ్యవి కిరసనాయిలు తగిలినతోడనే చచ్చునని తేలుచున్నది.

**మహామేధ**—(మేధ చూడుఁడు.)

**మహాముద్ర**- యోగాభ్యాసవిధానమునఁ జెప్పఁబడిన వింశతి ముద్రలలో నొకటి. ఎడమకాలిమడమచే గుదద్వారము నదిమిపట్టి, కుడికాలు చాచి, యామడమను నేల కానించి, కుడికాలి బొట్టనవ్రేలును కుడిచేతితో పట్టుకొని, గడ్డమును వక్షస్థలమున కానించి యదిమిపట్టి, భ్రూమధ్యమున దృష్టులను నిలిపి యేకలక్ష్యముతో నుండుట మహాముద్ర యనఁబడును.

ఇంక నిటులనే కుడికాలిమడమచే గుదద్వారము నదిమిపట్టి, ఎడమకాలు చాచి, యామడమను నేలకానించి, యెడమకాలి బొట్టనవ్రేలు నెడమచేతితో పట్టుకొని, గడ్డమును వక్షస్థలమున కానించి యదిమిపట్టి, భ్రూమధ్యమున దృష్టుల నిలిపి యేకలక్ష్యముతోనుంటయుఁగూడ నీపేరు ననే బరఁగెడిని.

ఈముద్ర నభ్యసించుటవలన శ్వాసకాసలు, క్షయ, ప్లీహము, గుదావర్తము, అజీర్తి, జ్వరములు నివారణమై దూరమగునని చెప్పఁబడినది.

**మహాయానము, హీనయానము**-(నాగార్జునబోధిసత్త్వుఁడు చూడుఁడు.)

**మహారాజికగణము**—వీ రిన్నూటయిర్వురని చెప్పఁబడినది గాని పేర్లు తెలియవు. మహారాజికులు నవదేవతాగణములలోనివారు.

**మహారాజులు (పదునార్గురు)**- మహారాజులు (షోడశమహారాజులు) పదునార్గురు. సామ్రాట్టులని యర్థము.

౧. గయుఁడు-తండ్రి నక్తుఁడు. భార్య జయంతీదేవి. కుమారులు చిత్రరథుఁడు, స్వాతి, అవరోధుఁడు. గయుఁడు నూఱశ్వమేధయాగము లొనర్చి స్వర్ణగోదానము లిచ్చెనఁట. (ఈతనిది ప్రియవ్రతునివంశము.)

౨. అంబరీషుఁడు-తండ్రి మాంధాత. తల్లి బిందుమతి, కుమారుఁడు యౌవనాశ్వుఁడు.

౩. శశిబిన్దువు-తండ్రి చిత్రరథుఁడు. కుమారులు పృథుశ్రవుఁడు, పృథుదానుఁడు, పృథుకీర్తి, పృథుంజయుఁడు, పృథుకర్మ, పృథుయశుఁడు. (ఈతనిది క్రోష్టువంశము).

౪. అనంగుఁడు.

౫. పృథుచక్రవర్తి-తండ్రి వేనుఁడు, భార్య అర్చిదేవి, కుమాళ్లు విజయాశ్వుఁడు, (అన్తర్ధానుఁడు) ధూమ్రకేశుఁడు, హర్యశ్వుఁడు, ద్రవిణుఁడు, వృకుఁడు. (ఈతనిది స్వాయంభువుమనువంశము).

౬. మరుత్తు-తండ్రి యవీక్షిత్తు, తల్లి విశాలాదేవి, కుమాళ్ళు నెనషుఁడు, నరిష్యన్తుఁడు. (ఈతనిది యిక్ష్వాకుని తమ్మునికుమారుఁడగు నాభాగునిసంతతి).

౭. భరతుఁడు-తండ్రి ఋషభుఁడు,తల్లి జయన్తీదేవి, భార్య పంచజనీదేవి,భార్య సుమతీదేవి, భార్య రాష్ట్రభుక్, భార్య సుదర్శనాదేవి.

ఈతనిపాలనమునుండియే దేశమునకు"భరతఖండ"మని పేరయ్యెను. మరియు నీతఁడు కడకు సర్వసంగపరిత్యాగి యయ్యెను.

౮. వసుహోత్రుఁడు-తండ్రి భుమన్యువు. భార్య సువర్ణాదేవి. కుమారుఁడు హస్తిమహారాజు.(హస్తినాపురనిర్మాత).తాత పురూరవుని పౌత్రుఁడగు భీముఁడు. ఆతనితండ్రి జహ్నుఁడు.

౯. పరశురాముఁడు-తండ్రి జమదగ్ని. తల్లి రేణుకాదేవి.

౧౦. శ్రీరాముఁడు- తండ్రి దశరథమహారాజు.తల్లికౌసల్యాదేవి. సవతితల్లులు కైకేయీసుమిత్రలు. భార్యజానకి(సీతాదేవి).అయోధ్య రాజధాని. పితామహుఁడజమహారాజు. కుమాళ్ళుకుశలవులిర్వురు.గురువు వశిష్ఠమహర్షి.

౧౧. దిలీపమహారాజు- తండ్రి భగీరథుఁడు. తల్లి భానుమతి. భార్య సుదక్షిణాదేవి. కుమారుఁడు రఘుమహారాజు.

౧౨. సగరచక్రవర్తి- తండ్రి బాహుకుఁడు. భార్యలు కేశినీదేవి, సుమతీదేవి.

౧౩. రంతిదేవుఁడు-తండ్రి సంకృతి.

౧౪ యయాతి- తండ్రి నహుషుఁడు. తల్లి ప్రియంవదాదేవి. భార్యలు దేవయాన, శర్మిష్ఠ. దేవయానయందు యదువు, తుర్వసువును; శర్మిష్ఠాదేవియందు ద్రుహ్యువు, ద్రుహ్యుఁడు, అనువు, పూరుఁడు (చంద్రవంశపు రాజు) నను కుమాళ్ళను గనెను.

౧౫ మాంధాత- తండ్రి యౌవనాశ్వుఁడు. భార్య బిందుమతి. కుమాళ్లు పురుకుత్సుఁడు, అంబరీషుఁడు, ముచికుందుఁడు. మానసరోవరమును తనతపస్సుచేపవిత్రపరిచినవాఁడు. ఈయన యెముకలు గరణమాంధాత పర్వతగుహయందున్నవి.

౧౬ భగీరథుఁడు-తండ్రి దిలీపుఁడు. కుమారుఁడు,నాభాగుఁడు. తపశ్శక్తిచే గంగను దెచ్చినవాఁడు. ఈయనయాశ్రమము గౌడపాదపర్వతముకడ గలదు.

## మహారాష్ట్రము

**మహారాష్ట్రము**- దేవరాష్ట్రము, దక్షిణాపథము, అశ్మకదేశము రాష్ట్రదేశము, రాష్ట్రకూటదేశము, మరాటాదేశము ననుపేర్ల బిలువఁబడు దేశము.

మహారాష్ట్రమునకు దేవరాష్ట్రమని తొల్లి పేరుండెనని వారనుచున్నారు. ఈదేశప్రశంస వామనపురాణము ౧౩ అధ్యాయమునఁ గలదు. దీనికి దక్షిణాపథమని పేరుండెను. ఇప్పుడు 'దక్కను'ననువాడుక దానినుండియే కల్గినది. బుద్ధునికాలమున నాశ్మకదేశమని పేరుండి ప్రతిష్ఠానపురము (ఇప్పటి నైజాముర్యాజ్యము

లోని పైఠణ్ పురము) రాజధానిగ నుండెనఁట. అశోకుని శాసనములందు మహారాష్ట్రమని యుండుటవలన నప్పటికే మహారాష్ట్రమని పేరు గల్గియుండెనని తెలుచున్నది. అశోకచక్రవర్తి మహాదమ్మరక్షితుఁడను బౌద్ధమతబోధకు నీదేశమునకు మతప్రచారార్థ మంపెనని చెప్పఁబడినది. అది క్రీ. మునుపు ౨౪౫ ప్రాంతమఁట.

క్రీ.వె. 3౪౦ ఆ ప్రాంతమున సముద్రగుప్తుఁడీదేశమును జయించెనని తేలుచున్నది. పిదప నహపానవంశపుఁ ప్రభువులవశ మయ్యెను. వారికి జీర్ణనగరము(ఇప్పటిజూనేర్) రాజధాని. కడపటి నహపానవంశ ప్రభుని నాంధ్రభృత్యులేక శాతకర్ణిపులమేను జయించి రాజ్యమాక్రమించెనని చెప్పఁబడినది. ఆం
పిదప క్షత్రపరాజవంశస్థులు క్రీ. వె. ౨౧౮ మొదలు ౨౩౨ వరకు,ననగా పదునాల్గు సంవత్సరములు పాలించిరఁట. వీరిపాలనము దక్కనులో కొంతభాగము గాని, యంతయుఁగాదని పరిశీలనలవలన తేలుచున్నది. వారికిపిదప నాభీరులు ౬౭ సంవత్సరములు పాలించిరి. అనఁగా నాభీరులపాలన క్రీ.వె. 3౯౯ వరకు నని యెరుంగునది. పిదప రాష్ట్రకూటు (ఇప్పటి రాథోర్ జాతివారు) లధికారమునకు వచ్చిరి.

రాష్ట్రకూటులకు రాష్ట్రులు, రాష్ట్రికులు ననికూడ వాడుకనామము లుండెనఁట. వారి పాలననుండియే యీదేశమునకు రాష్ట్రదేశమనియు, మహారాష్ట్రదేశ మనియు, రాష్ట్రకూటదేశమనియుఁ బేర్లు గల్గెనఁట. మహమ్మదీయులకాలమున మహారాష్ట్రశబ్దము మరాటా యయ్యెనఁట. రాష్ట్రకూటులు క్రీస్తువెనుక నారవ శతాబ్దముదనుక పాలించిరి. పిదపను వీరిరాజ్యమంతయెుంద లేదనియు, కడభాగపు రాష్ట్రకూటు లటనట భాగముల పాలించుచునే యుండిరనియు కొందరు తలస్తురుగాని నిదర్శనములు గానరావు. ఇంతవరకు ప్రతిష్ఠానపురమే రాజధాని.

పిదప నారవశతాబ్ద ప్రారంభకాలమునుండి చాళుక్యులు పాలించిరి. వీరు క్రీ. వె. 753 వరకధిపతుగ నుండిరి. అందు జయసింహునిమనుమఁడు మొదటి పులకేశిపాలనమున రాజధాని ప్రతిష్ఠానపురమునుండి బాదామీకి మార్చెను. ఈతఁడశ్వమేధయాగ మొనర్చినవాఁడని చెప్పఁబడినది.

ఈసందర్భమున బాదామీ పూర్వచరిత్ర వివరించుట సమంజసము. ఇది మాలప్రభానదీ తీరము. మాలప్రభ కృష్ణానదియందు చేరికొను ఉపనది. తొల్లిఁట నీప్రాంత మంతయు అడవియై యుండెను. అందే బాదామీ యుండినతావు. వాతాపి యను రాక్షసుని నివాసస్థానమై యుండెను. అచటికిఁ గొంతదూరమందుండిన మణిమతి యనంబడు చుండిన తావున వాతాపి సోదరుఁడగు నిల్వలుఁడను రాక్షసుఁడుండువాడు. వాతాపినివాస మగుట, వాతాపీపురమనఁ బరఁగుచుండెను. ఇల్వలవాతాపులిర్వురును అగస్త్య మహర్షిచే నిహతులైరని చెప్పఁబడిరి. వాతాపిపురము కాలముగడచినకొలఁది వటపీపురమై, వటపి యనంబరగి, బటపిగా మారి, కడకు బాదామీ యై యాటనే బరఁగుచున్నదని తెలియుచున్నది.

బాదామీయందు రెండు గుహాలు కలవు ఆందొకదానిపైగల సంవత్సరసంఖ్యానామములు క్రీ.వె. ౫౭౯తో సరిపోవును. రెండవది జైన మతస్థుల గుహా. దీని సంవత్సరసంఖ్యానామములు క్రీ.వె. ౬౫౦ సంవత్సరముతో సరిపోవును. ఒకగుహాయం దొకయెద్దును ఏనుఁగును కలసినబొమ్మ కలదు. అం దొకదానిం గప్పిన,

రెండవది స్పష్టముగ తెలియుచుండును. ఇది చక్కని పనితనముగల చిత్రమని తలంపఁబడు చున్నది. ఇంక మన చాళుక్యభూపతులకడకు మరలుదము.

మొదటిపులకేశి మనుమఁడగు రెండవ పులకేశి, మిగుల బలాఢ్యుండగు రాజనియు, సీతఁడు కనూజభూపతియగు రెండవశిలాదిత్యుఁడనబడు హర్షవర్ధను నోడించినవాఁడనియు జెప్పఁబడినది. ఈతనికాలముననే హ్యూనచ్వాంగ్ ఈదేశమును దర్శించినాఁడట. అతఁడు "మోహొలాభా" యని దేశమును వ్రాసికొనెను. చాళుక్యులలో కడపటివాఁడగు రెండవకీర్తివర్మ నోడించి, క్రీ. వె 7౫౦ యందు రాష్ట్రకూటనృపతి యగు దన్తిదుర్గనృపాలుఁడుమహారాష్ట్రసింహాసన మెక్కెను. ఈతనితర్వాత రాజ్యాధిపతులలో మూడవ గోవిందవర్మ బలాఢ్యుండగు రాజని చెప్పఁబడినవాఁడు. ఈతని సుతుఁడగు శర్వుఁడను నామాంతరము గల అమోఘవర్షుఁడు రాజధానిని బాదామినుండి మాన్యఖేటమునకు మార్చెనని చెప్పఁబడినది. మాన్యఖేటము రానురాను మాల్యఖేటమై, ఇప్పుడు మాలేఖడ్ అనంబడుచున్నది. మాల్ఖేడ్ అనియు నందురు. భీమానదీతీరము. ఇప్పటి నైజామురాజ్యమునందున్నది ఈపర్యాయము రాష్ట్రకూటుల పాలనము క్రీ. వె. ౯౭౩ వరకు సాగెను. అత్తఱి రాష్ట్రకూటులు తిరుగా చాళుక్యవంశపు న్రృయగు తైలపునిచే నోడింపఁబడి, రాజ్యముం గోల్పోయిరి. ఇటుల తిరుగ చాళుక్యులపాలన మారంభ మయ్యెను. ఇక్కాలమున మాన్యఖేటము రాజధాని.

క్రీ.వె. ౧౦౪౦ మొదలు ౧౦౬౯ వరకు రాజ్యమేలిన ఆహవమల్లుఁడను నొకటవ సోమేశ్వరనృపతి, రాజధానిని మాన్యఖేటమునుండి కల్యాణపురమునకు మార్చెను. కల్యాణపురము కుంతలదేశములోనిది గాన నక్కాలమున కుంతల, మిందుచేరిపోయి యుండెనని తేలుచున్నది. అతనిసుతుఁడు త్రిభువనమల్లుఁ డనంబడు రెండవ విక్రమాదిత్యుఁడు. క్రీ. వె. ౧౦౭౬ మొదలు ౧౧౨౬ వరకు రాజ్యమేలినవాఁడు విక్రమాంకదేవచరితను రచించిన బిల్హణుఁడును, మితాక్షరుఁడును ఈతని యాస్థాన విద్వాంసులని చెప్పఁబడినవారు.

ఇత్తఱి చాళుక్యుల పరిపాలనమున క్రీ. వె. ౯౭౩ మొదలు క్రీ. వె. ౧౧౬౨ వరకు ౧౮౯ సంవత్సరములుసాగినది. అక్కాలమున రెండవ తైలపునికడ మన్త్రిగనుండిన బిజ్జలుఁడు లేక బిజ్జలుఁడు సింహాసనమాక్రమించి రాజై క్రీ. వె. ౧౧౯౨ వరకు ముప్పది సంవత్సరములు రాజ్యమేలెను. ఈతఁడు జైనుఁడు. ఈతనికడనే బసవేశ్వరుఁడు మన్త్రిగనుండినవాఁడు. బిజ్జలుఁడు, బసవేశ్వరుఁడు స్థాపించిన వీరశైవలింగాయతమతస్థుల నెక్కువ యొత్తిడి చేయుచుండెననియు, దానిని భరింపఁజాలక జగద్దేవుఁడను లింగాయతధీరుఁడొకఁడు తనవారి కష్టములకుఁ విముక్తి నొసంగుదునని బిజ్జలభూపతిని ఆయుననగరునందే వధించెననియుఁ జెప్పఁబడినది. బసవేశ్వరుఁడును కళ్యాణపురమందలి సంగమేశ్వర శివలింగమునం దైక్యమాయెనందురు. నేటికిని ఆదేవస్థానము లింగాయతుల యధీనమై యున్నది. అర్చనయు వారి విధానముననే నడుచుచున్నది.

క్రీ. వె. ౧౧౯౨ పిదప కొంతకాలము రాజ్యమరాజకమై యుండెనఁట, గాని అత్తరుణమున యాదవులీరాజ్య మాక్రమించి యేలసాగిరి.

యాదవభూపాలుండగు బిల్లముఁడు క్రీ. వె. ౧౧౮౭ సంవత్సరముననే దేవగిరియందు తన రాజధాని కట్టడముల నిర్మించుకొని రాజధానిగ

జేసుకొనినఁవాఁడని తెలియుచున్నది. యాదవులలో సింఘన నృపతి బలాఢ్యుఁడగు ప్రభువని చెప్పఁబడినది. ఈతనియాస్థానమున చెంగదేవుఁడుండినవాఁడనియు, చెంగదేవునితండ్రియు ప్రధానజ్యోతిషవేత్తయు నగు లక్ష్మీధరుఁ డనియు, తాత భాస్కరాచార్యుండనియు, ఈతఁడు లీలావతీగణితకర్త యనియు, క్రీ. వె. ౧౧౧౪ సంవత్సరమున జనించినవాఁ డనియుఁ దేలుచున్నది

యాదవులలో కడపటివాఁడగు రామచంద్ర నృపతికాలమున హేమాద్రి యనంబడిన హేమద్పన్తు మంత్రియైయుండువాఁడు. ఈతఁడు చతుర్వర్గచింతామణినిరచించినవాఁడు. మహారాష్ట్రదేశమున హేమద్పన్తుదేవళ మను పేరంబరగు పోల్కి దేవాలయములలో పెక్కింటి నీతండే నిర్మింపఁ జేసెనందురు.

రామచంద్రనృపతి యాస్థానమున ముగ్ధబోధవ్యాకరణము రచించిన వోపదేవుఁడు విద్వాంసుఁడని చెప్పఁబడినది. డాక్టరుబౌ ధాజీపండితుఁడు, వోపదేవులు పెక్కండ్రు కలరనియు, నొకడు ముగ్ధబోధవ్యాకరణమును, మరియొకఁడు కవికల్పద్రుమమనంబడు ధాతుపాఠమును, వేరొకఁడు భాస్కరాచార్యుని లీలావతికి వ్యాఖ్యవ్రాసిన వాఁడనియు, ఈతని తండ్రిపేరు భీమదేవుఁడనియు, ముగ్ధబోధవ్యాకరణకర్త తండ్రిపేరు కేశవుఁడనియు ఈ కేశవపుత్రుండగు వోపదేవుఁడే రామచంద్ర నృపతి యాస్థానవిద్వాంసుఁ డనియుఁ దెల్పియున్నాఁడు.

ఈ రామచంద్ర నృపతియు నీతని సుతుఁడు శంకరుఁడును క్రీ. వె. ౧౩౧౮ వత్సరమున అల్లాఉద్దీన్ కిల్జీచే నిహతులైరి రాజ్యముమహమ్మదీయుల వశమాయెను. పిదప ఛత్రపతి శివాజీ మహారాష్ట్రదేశమునకే గాక మహారాష్ట్రసామ్రాజ్యమున కేలికయయి చక్రవర్తి యాయెను. ఆయనచరిత్ర సుప్రసిద్ధమే.



**మహారాష్ట్రబ్రాహ్మణులు**— వేర్వేరు కాలములందు చీలిన మహారాష్ట్రశాఖ లిక్కాలమునకు ముఖ్యమగునవి పదునేఁడు గలవు. మహారాష్ట్ర బ్రాహ్మణులు మహారాష్ట్రదేశవాసులై యీపేరందిరి. వీరు శాఖాహారులు. (మహారాష్ట్రదేశము చూడుఁడు.)

మహారాష్ట్ర బ్రాహ్మణులు పంచద్రావిడ శాఖలలో నొకశాఖవారు. వీరియంతశ్శాఖలు—

౧. కాణ్వులు-కణ్వమహర్షి శిష్యవర్గమునకు జెందినవారగుట నీపేరందిరని తెలియుచున్నది శుక్లయజుర్వేదశాఖలలో నొకటి. వీరిది శతపద బ్రాహ్మణము. కాత్యాయనశ్రౌతసూత్రము. వీరికిఁ బ్రథమశాఖీయులనియుఁ బేరుకలదు. వీరు మహారాష్ట్రదేశఁపుసీమలందచ్చటచ్చటను, కొల్హాపూరుసంస్థానమునను, ఆప్రాంతసీమలయందు హెచ్చుగను నిప్పుడు నివసించుచున్నారు. వీరింగూర్చి చరణవ్యూహమునఁ బ్రశంస కలదు.

౨. కరాడకులు(కర్హాడకులు)- కృష్ణానది యందు కోయననది సంగమించుతావునకు దరినున్న కర్హాడపురప్రాంతసీమలందు నివసించు కతన వీరి కీపేరయ్యెను. కరాడదేశఁపువారని యర్థము. పరశురాముఁడు వీరి నొంటెనుండి నిర్మించినటులఁ సహ్యాద్రిఖండమునఁ జెప్పఁబడినది. భరద్వాజ, కౌశిక, వత్స, కౌండిన్య, కశ్యప, వశిష, జమదగ్ని, విశ్వామిత్ర, గౌతమ, అత్రి యను పదిగోత్రములు మాత్రము వీరి యందుఁ గలవు.

౩. కళంకీలు-వీరుపూర్వాచారపరాయణులై యెక్కువపట్టుదలఁ గల్గియుంట నోర్వలేని యితరులు వీరి కీపే రిడిరని చెప్పుదురు. వీరిపూర్వోత్తరములు సరిగా తెలియవు గాని యిక్కాల

మున నీపేరఁ బరగుచున్నారు.

౪. కీర్తంతులు - ఈశాఖవారు పన్నిద్దరు బ్రాహ్మణులసంతతియనియు, పన్నిగోత్రములు వీరియందుఁ గలవనియు, చెప్పఁబడినది. వీరిఁ గూర్చినప్రశంస సహ్యాద్రి ఖండమునఁ గలదు.

ఆదిని గోమాంచలప్రాంత పంచక్రోశసీమ వీరిస్థానమనియుఁబిదప నవబాగ్ ముండల ప్రాంత సీమలకును నితరదేశములకును జేరి రనియు నందురు. కొంకణదేశమునం దచ్చటచ్చటను వీరు గానవచ్చుచున్నారు. వీరిది ఋగ్వేదము; ఐతరేయబ్రాహ్మణము; ఆశ్వలాయనశాఖ.

౫. కుండగోళకులు - వీరినిగూర్చి సరిగా తెలియకున్నది.

౬. కొంకణస్థులు లేక చిత్తపావనులు—పరశురాముఁ డరువదిమందిని పూతులుగ నొనర్చి బ్రాహ్మణులందుఁ జేర్చినటుల సహ్యాద్రిఖండమునందు చెప్పఁబడినవి గాననే చిత్తపావను లని వీరికిఁ బేరయ్యెనఁట. వారిసంతతి వారిప్పుడు చిత్తపావనబ్రాహ్మణులనుపేరఁ బరగు కొంకణ స్థులై యున్నారు.

౭. ఝాడేలు - నాగపూర్ దేశవాసులగుట నాగపూర్ బ్రాహ్మణులనియు, ఝాడేబ్రాహ్మణులనియు వాడుకనందియున్నారు.శుక్లయజుర్వేదులు; కాణ్వమాధ్యందినశాఖవారు.

౮. దేవర్షులు- వీరిని దేవరుఖ్కులనియు, దేవరుఖులనియుఁ గూడవాడుక కలదు. దేవ శాఖవార మని వారు దెల్పుచున్నారు. బొంబై రాజధానిలోని రత్నగిరి మండలమున వీరు విస్తారముగ నున్నారు. బరోడారాజ్యముననను, ఉత్తరకొంకణసీమలందును గూడ వసించుచున్నారు. అథర్వణవేదశాఖవారు కొందరును, కృష్ణయజుర్వేదశాఖవారు కొందరును వీరియందుఁ గలరు.

౯. దేశస్థులు— వీరియందు ముఖ్యముగ మూఁడుతెగలు గలవు. ఋక్శాఖ (తెగ), సామవేదశాఖ (తెగ), అథర్వణశాఖ (తెగ). ఇంక నీమూఁడు తెగలవారుఁ గలసి గృహస్థు లనియు, భిక్షుకు లనియు నిరుతెగలవారుగ నున్నారు. గృహస్థులు లౌక్యవృత్తి గలవారు. వీరు దక్షిణ పరిగ్రహింపరు. వీరియందు పేరులకుఁ బిదప బిరుదములుగ రావు, పంత్, పటేల్, కుల్కరిణీ, దేశాహి, దేశపాండే, దేశముఖ్ మొదలగు బిరుదనామములు వాడుచుందురు. ఇంక భిక్షుకులు పౌరోహిత్యవృత్తిగలవారై దక్షిణలు పరిగ్రహించుచు తీర్థములందు వసించుచుందురు.

౧౦. పళశబ్రాహ్మణులు- బొంబై ప్రాంతమునఁ గానవచ్చుచున్నారు వాజసనేయశాఖవారు.

౧౧. పాధ్యాబ్రాహ్మణులు- కొంకణదేశమున నుపాధ్యాయులుగ నుండిరఁట. ఆపే రిట్లు మాఱిన దందురు.

౧౨. బొమ్మన్నాయి (బ్రాహ్మణజాయి)లు- వీరినిగూర్చి సరిగ తెలియరాకున్నది. వేదవిహితాచారములు నెరపుకొందురు. కొందరు వీరిని నింద్యులుగ నెంచుటయుఁ గలదు.

౧౩. మాధ్యందినులు- నాశికపట్టణప్రాంతమునను, కొల్హాపూర్ సంస్థానప్రాంతమునను గానవచ్చుచున్నారు. మధ్యాహ్నసంధ్య వీరికిఁ బ్రధానమందురు. శుక్లయజుర్వేదులు. శతపథ బ్రాహ్మణము. కాత్యాయన శ్రౌతసూత్రము.

౧౪. గోముఖబ్రాహ్మణులు- వీరినిగూర్చి సరిగా తెలియదు.

౧౫. వరాడీ బ్రాహ్మణులు- వీరికి బీరారు బ్రాహ్మణు లనియు వాడుక కలదు. నైజాము రాజ్యమందలి వరాడీ (బీరారు) నివాసులుగఁ

చిరకాలముంట నీపేరందిరి. ఋగ్వేదులుగను, శుక్లయజుర్వేదులుగను నున్నారు. మాధ్యం దినశాఖ.

౧౬. సావశాబ్రాహ్మణులు— దక్షిణమహా రాష్ట్రసీమలందుఁ గానవగుచున్నారు. సద్బ్రాహ్మణులుగ నున్నారు. కొందరు వీరినిగూర్చి యు[బ్రాహ్మణ] ... పురమొనర్చిన ౧౨౫ మందిపంతతివా రని యపవాదుక యొకప్పుడు వైచిరఁటగాని, దానికి నిదర్శనములు లేనందున వారి కేబాధయు లేకపోయె నఁట.

౧౭. సోపారబ్రాహ్మణులు—తొల్లింట తాటి చెట్లఁ బైరుపెట్టువారని యొకవాదుక యుండె నఁటగాని నింద్యులుగ నెంచఁబడలేదు. సద్బ్రాహ్మణులు. వీరిఁగూర్చి యితర సంగతులు తెలియవు.

## మహారాష్ట్ర దేశపు సామెతలు—

అన్యాయార్జితవిత్తమున కతివేగమే వ్యయము సిద్ధము.

ఇంటెంటను మంటిపొయిలు.

ఎవ్వరియన్నముఁ దినుచుందుమో వారికిఁ గృతఘ్నులము గారాదు.

ఒకేదండలోనివూస లొక్కలాటివే.

అవసరము తీరినవెనుక నౌషధమిచ్చిన వైద్యుఁడు చచ్చినా నరే యన్నట్లు.

గుడ్డివాఁడు పిండి విసరుచుండుట, కుక్క తినివేయుచుండుట.

గోడలకు చెవులూ, తలుపులకు నేత్రములూ కూడ నుంటవని తలంప వలయును.

తనమనస్సుకన్న తథ్యమువల్కుసాక్షి యుండఁడు.

తప్పక [illegible]ందునేని నీటిబింబువులే చెఱు [illegible]

పక్కపొడవుకొలఁదీ కాళ్ళు చాఁచుకొని పరుండవలసి యుండును.

పాట రానివానికి శ్రుతి లయ కుదురవు; నృత్యము రానివానికి నేల బాగుండదు; వంట రానివానికి కట్టెలు మండవు.

బలవంతుఁడు బలహీనునిచెవికి పైయధికారి.

బహుగర్విగ్రృహము పల్లములోనే!

బుద్ధిగలవాని కొకమాట చాలుఁగాని, బుద్ధి లేనివాని కొకకఱ్ఱ గావలయును.

మనస్సాక్షి చెప్పినమార్గమే మంచిది.

వీపుపై కొట్టుట కడుపుపై కొటుటకన్న నుపకారమే.

హామీ యుంటే యన లిచ్చుకోవలసినదే.

**మహారుద్రాష్టమి**—పుష్యశుద్ధ అష్టమి. రుద్రాభిషేకములు, పూజలు నొనర్చి రుద్ర శాంతిఁ గల్గించుపర్వదినము.

**మహారోముఁడు** — ఇక్ష్వాకు సంతతి. సూర్యవంశక్షత్రియుఁడు. మిథిలదేశాధీశుఁడు. తండ్రికీర్తిరాతుఁడు. కుమారుఁడుస్వర్ణరోముఁడు.

**మహాల్ స్టిక్ (Mahl stick) పరికరము**—చిత్రలేఖన మొనర్చువారు రంగులు వేయుతరి నెక్కవప్రదేశమునకు రంగుకుంచె నాడించుట కష్టముగా నుండునుగాన నట్టితరిఁ జేతినానించు నొకకొయ్యముక్క. దీని కొనకడ ను చిన్నపటు పమర్పఁబడియుండి, దానిపై చేతి నానుకొని రంగులు వేయుచు నెరపును. రెండవ కడ వ్రాయుచుండుపటముపై మోపఁబడును.

**మహాలయఅమావాస్య**—దీనిని సర్వ సాధారణముగ 'మాలాల అమావాస్య' యనియు, 'పోలాల అమావాస్య' యనియు వాడుచుందురు. భాద్రపద బహుళ అమావాస్య మహాలయ(శ్రాద్ధ)పక్షమం దమావాస్యగాన,

'పోలాల అమావాస్య' యనియు, పోలమ్మ లేక పోలేరమ్మ లేక పోలకమ్మ యనఁబడు దేవత నారాధించు వ్రతదినము గాన 'పోలాల అమావాస్య' యనియు నజ్ఞులు వాడెదరు. కంద, బచ్చలిచెట్లనుంచి, వానిక్రింద గౌరీదేవిం బూజింతురు (పోలేరమ్మ చూడుఁడు). గాన పోలాల యమావాస్య యని పేరయ్యెనఁట. కర్ణాట దేశపుస్త్రీలు ఫలగౌరీవ్రత మాచరింతురు.

**మహాలయపక్షము**-దీని నజ్ఞత మాళాయపక్షముగ వాడుచున్నారు. కొందరిందను పితృపక్షమనియు ననుటకలదు. ఇందు మృతతిథులందు మహాలయశ్రాద్ధమును, భరణీనక్షత్రముండు తిథియందు భరణీమహాలయ శ్రాద్ధమును, వ్యతీపాతయోగముండు తిథియందు వ్యతీపాతమహాలయ శ్రాద్ధమును, ద్వాదశియందు, యతిమహాలయ శ్రాద్ధమును, చతుర్దశియందు విషశస్త్రహత మహాలయశ్రాద్ధమును, అమావాస్యయఁదు మృతతిథులయందాటంకము చేజరగక నిలిచిపోయిన మహాలయశ్రాద్ధముల నాశ్వయుజ శుద్ధపాడ్యమియందు దౌహిత్రకృతమహాలయశ్రాద్ధమును జరుపవలయుననియు, అష్టమీతిథియం దన్ని మహాలయ శ్రాద్ధములును నాపక్షమున నెరపనగుననియుఁ జెప్పఁబడినది.

**మహాలయక్షేత్రము (అమరేశ్వరము)** (ఓంకారమాంధాత క్షేత్రము చూడుఁడు.)

**మహాలక్ష్మీవ్రతము**—స్త్రీలకు వివాహమైనదాదిగ సౌమంగళ్యముఁ గల్గియున్నంతదనుక నేటేట మార్గశిరమాసములందు ప్రతిగురువారమునను మహాలక్ష్మీదేవినిఁబూజించుచుందురు. ఇది యైశ్వర్యముఁ గాంక్షించి జరుపు వ్రతము. ఈ దినములందు (మార్గశిర లక్ష్మివారములందు) వెలగకాయలను పండ్లను భుజింపరాదని యొక పూర్వకథను జెప్పుచుందురు. దీనిని సర్వసాధారణముగ 'మార్గశిరలక్ష్మివారములనో' మనియెదరు.

**మహాలింగములు** - (తేజోలింగములు లేక ద్వాదశలింగములు).

౧ సోమనాథలింగము-సౌరాష్ట్రదేశమునందున్నది.

౨ మల్లికార్జునలింగము-ఆంధ్రదేశమున శ్రీశైలపర్వతముపై కర్నూలుమండలమునగలదు.

౩ మహాకాళేశ్వరలింగము-ఉజ్జయిని(మాళవదేశము)యందుఁ గలదు.

౪ ఓంకారలింగము- (తొల్లి చేదిదేశము) నర్మదానదియందలి మాంధాతద్వీపమున G.I.P.R. ఖాండ్వా మోరతక్కా స్టేషనులమీదుగా జననగును.

౫ కేదారేశ్వరలింగము-హిమవన్నగముపై ఘూర్వాల్ సంస్థానములోని బదరీకేదారక్షేత్రమునఁ గలదు.

౬ భీమశంకరలింగము - (ఢాకినియందుఁ గలదు.)

౭ విశ్వేశ్వరలింగము-కాశీయందు (బనారస్ సంయుక్త రాష్ట్రములు) కలదు.

౮ గౌతమీశ్వరలింగము-బొంబై రాజధాని నాశికమండలము నత్రియంబకక్షేత్రమునఁగలదు.

౯ వైద్యనాథలింగము- E.I.R మెయిను లైనుపై నున్న సంధిమీదుగా వైద్యనాథక్షేత్రమున కేగవలెను. ఇది చితాభూమి.

౧౦ నాగేశ్వరలింగము- బొంబై రాజధాని. ద్వారకకు సమీపమున.

౧౧ రామనాథ(సైకత)లింగము- శ్రీరామసేతువుకడ రామేశ్వరమున.

౧౨ అరుణాచల లింగము- తిరువణ్ణామలై S.I.R కాట్పాడి విల్లుపురంలైను. మరికొందరు

కడపటిది ముద్రించేశ లేక కృష్ణేశలింగ మనిరి. (శైవాలయము దేవగిరి, దౌలతాబాద్ దగ్గర నున్నది). ఎల్లోరా (హేలాపురము) సమీపము

**మహావనము**-(అరణ్యములు చూడుఁడు)

**మహావంధ్యాత్వము**-వంధ్యత్వము చూ.

**మహావ్రతమతము** ఇది అతిమార్గిక మతములలో నొకటి. అతిమార్గిక మతములు— ౧. పాశుపతము, ౨. మహావ్రతము, ౩. కాపాలము ననుత్రిమతములుగ నున్నవి. ఈమూడు మతములందును ఋగ్యజుస్సామాథర్వణాత్మక వేదము పాటింపఁబడక నాగమములను ప్రమాణ మగుమతగ్రంథముగఁ గైకొనఁబడినది.

మహావ్రతమతము విద్యాతత్త్వవాసి యగు రుద్రునిచేఁ జెప్పఁబడినది. ఈమతమున శివుఁడు పరమేశ్వరుఁడు. ఆత్మలనాదిగఁ గార్మికమాయా మలయుక్తములై యున్నవనియు, పతి, పశు, పాశము (బంధములు) నిత్యములు. పశువు (ప్రాణి) మలయుక్తుఁడైయుండుతఱి నిచ్ఛాక్రియాశక్తుల సహితుఁడై యుండును. నిర్మలుఁడై ముక్తావస్థఁ జెందుతఱి, క్రియాశక్తివదలి ఇచ్ఛాశక్తిదూరమై కేవలజ్ఞానశక్తిసహితుఁడై యుండునని చెప్పఁబడినది. అదియే ముక్తావస్థ.

పతియగు పరమేశ్వరుఁ డిచ్ఛాజ్ఞాన క్రియాశక్తులను మూటి నెల్లప్పుడును గల్గియే యుండువాఁడు. సర్వకర్తృత్వ మీశ్వరునకే చెందియున్నది. ఆత్మలనాదిగ మలద్వయసహితమై యున్నటుల, నీశ్వరుఁ డనాదిగనిర్మలుఁడు,మలరహితుఁడు నైయున్నాఁడు. ఆత్మలను బద్ధావస్థ నొందించుచు జన్మములపాల్సేయుచుండు టీశ్వరునికార్యమే. జ్ఞానము గల్గెనేని, యాత్మయందలియజ్ఞానమునశింపఁజేసి పరిపక్వస్థితి నిచ్చును. ఆగమోక్తమగు దీక్షావిధి జ్ఞానసాధకము. అది శివుని యర్చనయందు స్థిరమొనంగెడిని. శాస్త్రోక్తక్రమమున దీక్షనంది,యస్థులను(ఎముకలను) ధరించుచు, శివార్చనాది శాస్త్రోక్త ధర్మముల నెఱపినవారు బంధములనుండి విముక్తు లగుదురని ముక్తిమార్గము జెప్పఁబడినది. ఆత్మక కర్తృత్వమును, నిత్యవ్యాపకచైతన్యమును గల్గియుండిన యాత్మ శివజ్ఞానశక్తి గలదియై శివలోకమున జ్ఞానమాత్రశక్తితోనుండుట మోక్షముగఁజెప్పఁబడినది. తక్కినధర్మములు పాశుపత మహావ్రత కాపాలమతములకు సమానముగఁ జెప్పఁబడినది. ఈమతమునందు విద్యాతత్త్వము ప్రధానతత్త్వమని చెప్పఁబడినది.

**మహావ్రతశైవము**— ఇదిచతుర్దశ శైవభేదమతములలో నొకటి. (చూడుఁడు). ఈమతమునం దాణవమల మాయామల కార్మికమలము లనఁబడునవి మలత్రయము. ఇవి యనాదిగ నుండినవి. పతి (పరమేశ్వరుఁడు), పశు (ప్రాణము), పాశము (బంధము) లనునవి త్రిపదార్థములు. ఇవినిత్యములు. పతి పశువును మలత్రయము లను పాశములచే బంధించి, జన్మముల గల్గించుచుండుస్వతంత్రము గలవాఁడు. పశువును పక్వస్థితి గల్గినచో, నాత్మ పరిపక్వము నొందినదిగా నెంచబడుతఱి,పతియగు పరమేశ్వరుఁడు దీక్షావిధిమూలమున బంధములు సడలిపోవున ట్లనుగ్రహించును. ఇది పరమేశ్వరుని జ్ఞానశక్తిగ తలంపఁబడుచున్నది. ఆగమోక్తమున పతిని పూజించుచుండుటవలన కర్తృత్వసంహారములనువిడచి,యాత్మ నిత్యవ్యాపకచైతన్యలక్షణయుక్తమై దనరుచు, శివునిజ్ఞానశక్తినిగూడఁగల్గి శివలోకమునజ్ఞానయుతమైయుండుట సిద్ధించును. ఇదియే యీమతమందలి ముక్తి.

**మహావాల్యగోత్రము**—(వాధ్ర్యస్యకేశ మిత్రయుపగణము చూడుఁడు).

**మహావాక్యములు**— ఋగ్వేదమునం

దిరువదియొకటియు, యజుర్వేదమునందు నూట తొమ్మిదియు, సామవేదమునందు వేయియు, నథర్వణవేదమునం దేబదియు శాఖలు గలవు. ఇటుల చతుర్వేదములందును పదునొకండువందల యెనుబదిశాఖలు గలవు. ఈ శాఖలనుండి వేర్వేరుమతసిద్ధాంతములవారి కనుకూలించుసంగతులుండఁజూచి,యాయామతములవారు తమ తమ మతములకనుకూలించునటుల,నొక్కొక్కశాఖకొక్కొక్కటిగ నుపనిషత్తులఁ గూర్చుకొనిరి. ఈపని యాదికాలముననే జరిగెను. ఇట్లుపనిషత్తులు పదునొకండువందల యెనుబదిగ చెప్పఁబడినవి. ఇక్కాలముననాయుపనిషత్తులన్నియుఁ గానరాకున్నవి. తొల్లిఁటికాలమున శ్రీరాముఁడాంజనేయునకుఁ బ్రధానములుగ నూటయెనిమిది యుపనిషత్తు లుపదేశించెనని శుక్లయజుర్వేదీయమగు ముక్తికోపనిషత్తునందుఁ గలదు.

నేఁటికినినాయష్టోత్తరశతోపనిషత్తులే పూర్వగౌరవములతోఁ బరిగణింపఁబడుచున్నవి. వీట్లకు విద్యారణ్యస్వామివ్యాఖ్యవ్రాసెను. వీట్లనుండిన ప్రధానధర్మవచనముల నేరి మహావాక్యములని వ్రాసిరి. ఇవి అద్వైతమతస్థులకు చాల ముఖ్యములు. దానికి "మహావాక్యరత్నావళి" యని పేరిడియున్నారు. మహావాక్యములు వెయ్యిన్నెనిమిదికలవు. అవి యిరువదితెరఁగులుగనున్నవి.

| | |
|---|---|
| విధివాక్యములు | ౬౬ |
| బంధమోక్షవాక్యములు | ౩౧ |
| అవిద్వన్నిందావాక్యములు | ౨౧ |
| జగన్మిథ్యావాక్యములు | ౩౩ |
| ఉపదేశవాక్యములు | ౫౪ |
| జీవబ్రహ్మైక్యవాక్యములు | ౩౭ |
| మననవాక్యములు | ౩౮ |
| జీవన్ముక్తివాక్యములు | ౧౧౮ |
| బ్రహ్మ (లేక) స్వానుభూతి రూపకవాక్యములు | ౧౧౭ |

సమాధివాక్యములు
నానాలింగస్వరూపవాక్యములు
పుంలింగస్వరూపవాక్యములు
స్త్రీలింగస్వరూపవాక్యములు
నపుంసకలింగస్వరూపవాక్యములు
ఆత్మవాక్యములు
సర్వవాక్యములు
బ్రహ్మవాక్యములు
వశిష్ఠవాక్యములు
ఫలవాక్యములు
విదేహముక్తివాక్యములు

**మహావాయువాతావరణము**(Atmosphere)—భూమిని జుట్టుకొనియుండు మహావాయుమండలికి సాధారణముగా 'Atmosphere' అని యర్థమున్నను, నిజముగ నాయాప్రదేశముల వాతావరణస్థితికి దీనిని వాడెదరు. ఆరోగ్యవంత మగు వాతావరణ ముండిన Atmosphere మంచిదనియు, లేకున్న చెడ్డదనియు, చల్లగానున్న దనియు వాడుదురు. కాని వీచు గాలిని గాని, నిలిచియున్న గాలిని గాని "Atmosphere" అనుట లేదు. వాయువు, దాని కార్యములు చూడుఁడు.)

**మహావారుణి త్రయోదశి** — చైత్ర బహుళ త్రయోదశి శనివారము, శతభిష నక్షత్రము, శనిగ్రహము శతభిషమునం దుండుటయు సంభవించినచో నీపేరంబరగుననియు, నిది కడుదుర్లభయోగమనియు, వ్రతదినము, పర్వదినమునియుఁ జెప్పఁబడినది.(పండుగలుచూ).

**మహావేధముద్ర**—యోగాభ్యాస విధానమున వివరింపఁబడిన వింశతిముద్రలలోనొకటి.

మహావేధముద్ర మూలబంధముద్ర వలెను, నుడ్డియాణముద్రవలెను నుండును, గాని రెండును

కలిసినదిగా నున్నది.

ఎడమకాలి మడమను గుదస్థానమునకును, లింగస్థానమునకును మధ్య నదిమిపట్టి, గుదాకుంచన మొనర్చి, కడుపును వెన్నెముకకదిమి, కుడికాలిమడమను లింగస్థానముపై నానించి, (ఉడ్డియాణబంధముద్రాపూర్వక) అనగా నాభిస్థానమున వెన్నెముకకంటునటుల నొక్కిపట్టుట ద్వారా వాయునిరోధము గల్పించి, కుంభకము సల్పుట "మహావేధముద్ర" యనఁబడును.

ఇందువలన జఠరాగ్ని బలపడుటయు, నణిమాద్యష్టసిద్ధులు గలుగుటయు, సంభవించునని చెప్పఁబడినది.

**మహావేలగోత్రము**— (భరద్వాజోపగణము చూడుఁడు.)

**మహావీరనాథుఁడు** (౨౪ వ తీర్థకరులలో నొకఁడు— (తీర్థకరులు చూడుఁడు). మహావీరనాథుఁడు లేక మహావీరస్వామి. వీరి కింకను వీర, అతివీర, సన్మతి యను పేర్లు కలవు. వీరిచిహ్నము పెద్దపులి. ఇక్ష్వాకుసంతతిక్షత్రియుఁడు. తండ్రిపేరు సిద్ధార్థరాజయనియు, తల్లిపేరు త్రిశిలాదేవియనియుఁ జెప్పఁబడినవి. జన్మస్థానము (భాగల్పూరువద్ద) కుండల్పూరు. పొడవు ఏడుమూరలు. వర్ణము శరీరచ్ఛాయ. ఆయువు డెబ్బదిరెండుసంవత్సరములు. గణధర్ సంఖ్య ౧౧ నిర్వాణమైన స్థలము (ఇప్పటి బీహారుపరగణాలోని కుండల్పూరు (భాగల్పూరుకడనున్న) పావాపూర్.

వీరు మతసంఘనాయకులై యుండిరనియు, నొకతరి వీరికాలమున కుండల్పూరుప్రాంతమున గొప్పక్షామము సంభవింపఁ, గొంత జైనసంఘముతో వీరు దక్షిణముగా (ఇప్పటి మైసూరు రాజ్యములోని) శ్రావణబెలగోలమున కేగిరనియు మార్గమధ్యమున బోధలొనర్చుచు నేగి, క్షామానంతరము తిరిగి వచ్చిరనియు, నీలోన వీరేగిన పిదప నాయకుఁడైన భద్రబాహుస్వామి యనుచర జైనసంఘమువారు తెల్లనిబట్టలంగట్ట, దిగంబరజైనులగురువుమహావీరస్వామి తెగవారుభద్రబాహుస్వామి యనుచరులగు శ్వేతాంబరజైనులతో కలియనొల్లక, వేరుగనుండిరనియు, నాఁడాదిగ జైనులలో 'శ్వేతాంబర దిగంబర' విభేదములు గల్గెననియుం జెప్పఁబడినది. (దిగంబర శ్వేతాంబర విభేదములు చూడుఁడు).

తీర్థకరు లిరువదినలుగురు నగురూపదేష్టలు, పంచమంగళయుతులు, ధర్మతనులు, త్రికాలజ్ఞానులు, మహిమాన్వితులు నని చెప్పఁబడినది.

తీర్థకరులకుఁ బిదప ౮, ౯౯, ౯౯, ౯౯౭ (ఎన్మిదికోట్ల తొంబదితొమ్మిదిలక్షల తొంబదితొమ్మిదివేల తొమ్మిదివందలతొంబదియేడ్గురు) మునులు కలరని చెప్పఁబడినది. (అంగదేశము చూడుఁడు), (మగధరాజ్యము చూడుఁడు).

[కొందరీమహావీరనాథుని మహావీరస్వామి యనియు ననుట కలదు].

**మహావీరస్వామి శిష్య పరంపర** — జైనమత సంస్థాపనాచార్యుఁ డని పేరందిన మహావీరస్వామి, ఇక్ష్వాకువంశస్థుఁడై చైత్రశుద్ధ త్రయోదశిని జన్మించిన మహాత్ముఁడు. డెబ్బది రెండవయేట కార్తీకబహుళ అమావాస్యనాఁడు, పావా (అపాప) పురియందు నిర్వాణపదమందినట్లు చెప్పఁబడినది.

వీరి శ్వేతాంబర జైనశాఖలు ౮౪ కలవు. అందు నంచల గచ్ఛము (శాఖ) గురువులకు సూరు లనియు, నాచార్యు లనియు, పట్టధరు లనియుఁ బిరుదములు గలవు. శ్వేతాంబరజైన ధర్మమునకు కర్త మహావీరస్వామి. ఈయనకుఁ బిదప ౩౮ దవ గురుఁడగు నుద్యోతనసూరివరకు నన్నిశాఖలు కలసి,యటనుండి వేరై గురుపరంప

రలు వేరగును. అత్తరి క్రీ. శ. ౧౧౧౩ వత్సరమున నేబదియవగురుఁడగు నార్యరక్షితసూరి, యంచలగచ్ఛమును స్థాపించి, దానికి మొదటివాఁడయ్యెను. ఈగచ్ఛము (శాఖ)నకు వరాగచ్ఛమునియు, పాటన్ (అనహిలా) పట్టణమండలమున (రాధంపురప్రాంతపు) శంఖేశ్వర గ్రామమున నుండుట శంఖేశ్వరగచ్ఛ మనియు, పిదప నానాబీరమునందుంట నానావాలగచ్ఛమనియు, ఆర్యరక్షితసూరికాలమున విధిపక్ష గచ్ఛమనియు పేరులుండి, తుదకచలగచ్ఛము నాఁబరగి, ఇంచుకమారి యంచలగచ్ఛమై నిలచి యున్నది

౧ మహావీరసూరి, ౨ సుధర్మసూరి, ౩ జంబుసూరి, ౪ ప్రభవనాథ, ౫ స్వయంభవనాథ, ౬ యశోభద్ర, ౭ సంభూతివిజయ, ౮ భద్రబాహు, ౯ స్థూలభద్ర, ౧౦ ఆర్యమహాగిరి, ౧౧ ఆర్యసుహస్తి, ౧౨ ఆర్యసుస్థితసూరి, ౧౩ ఇంద్రదిన్నసూరి, ౧౪ దిన్నసూరి, ౧౫ సింహగిరి, ౧౬ వజ్రసూరి, ౧౭ వజ్రసేన, ౧౮ చంద్రసూరి, ౧౯ సమంతభద్రసూరి, ౨౦ వృద్ధదేవసూరి, ౨౧ ప్రద్యోతన, ౨౨ మానదేవ, ౨౩ మానతుంగ, ౨౪ వీరసూరి, ౨౫ జయదేవ, ౨౬ దేవానంద, ౨౭ విక్రమ, ౨౮ నరసింహ, ౨౯ సముద్ర, ౩౦ మానవదేవ, ౩౧ విబుద్ధప్రభ, ౩౨ విజయానంద, ౩౩ రవిప్రభ, ౩౪ యశోభద్ర, ౩౫ విమలచంద్ర, ౩౬ దేవసూరి, ౩౭ నేమిచంద్రసూరి, ౩౮ ఉద్యోతనసూరి (ఈయన ౮౪ గురుశిష్యులిట నుండియే శాఖాభేదము లేర్పడి వేరైరి. ఈయనకుఁబిదప సర్వదేవసూరి పట్టధరుఁడయ్యెను). ౩౯ సర్వదేవసూరి, ౪౦ పద్మదేవసూరి (ఈయనగురు వుద్యోతనుఁ డనియు సాంఖ్యదర్శన వేత్తయనియు, మతమునంజేర్చినకతన 'సాంఖ్యసూరి' యను బిరుదమును గాంచెను.

౪౧ ఉదయప్రభాసూరి, ౪౨ ప్రభానందసూరి. ఈయననాడే నానకగచ్ఛనామముగల్గెనందురు. ౪౩ ధర్మచంద్రసూరి, ౪౪ సువినయచంద్రసూరి, ౪౫ గుణసముద్రసూరి, ౪౬ విజయప్రభాసూరి, ౪౭ నరచంద్ర, ౪౮ వీరచంద్ర, ౪౯ జయసింహసూరి, ౫౦ ఆర్యరక్షితసూరి– (ఇతఁడు ద్రోణసుతుఁడట. జన్మము విక్రమశక ౧౧౩౬. దంతాణగ్రామమున జన్మించెనఁట. వి.శ. ౧౨౧౨యందు గురువుగారిచే విజయచంద్రోపాధ్యాయ బిరుదనామ మందెనఁట. గురుడై యీతఁడు ౨౧౦౦ పురుషులకు, ౧౧౩౦ సాధుస్త్రీలకు జైనదీక్ష నొసంగెనఁట. అందు ౧౨ ఆచార్యపదము, ౨౦ ఉపాధ్యాయపథము, ౭౦మంది పండితపథము నందిరనియు, ౧౦౩ సాధ్వీస్త్రీలు మహత్తరపదము ౮౨ ప్రవర్తినిపదమును బొందిరట. ఈయన కార్యరక్షితసూరియను పేరు వాడుకయై నూరేండ్లు జీవించి వి. శ. ౧౨౩౬ నిర్వాణపథ మందిరఁట). ౫౧ జయసింహసూరి– ఈతఁడు గొప్పనిస్సంగమహిమాన్వితుఁడు. ౫౨ ధర్మఘోషసూరి– రచించినది శతపది" యనుగ్రంథము. ౫౩. మహేంద్రసింహసూరి– రచించినది శతపదివ్యాఖ్యానము, తీర్థమాలాస్తవము. ౫౪ సింహప్రభాసూరి, ౫౫ అజితసింహసూరి, ౫౬ దేవేంద్రసింహసూరి, ౫౭ ధర్మప్రభాసూరి, ౫౮ సింహతిలకసూరి, ౫౯ మహేంద్రప్రభాసూరి, ౬౦ మేరుతుంగసూరి, ౬౧ జయకీర్తిసూరి, ౬౨ జకేసరి (ధనరాజు)సూరి, ౬౩సిద్ధాంతసాగర(శోణపాల) సూరి. ౬౪భావసాగర(భావద)సూరి,(దశవైకాలికసూత్రవృత్తిరచించెను)౬౫గుణనిధాన(సోనపాల) సూరి, ౬౬ ధర్మమూర్తి (ధర్మదాసు) సూరి. ఈతఁడుత్యాగి. రచించినవి. "వృద్ధచైత్యవందనము" 'ప్రద్యుమ్నచరితము'. ౬౭.కళ్యాణసాగర (కోదణ)సూరి. కచ్ఛదేశపాలకుని జైను

నిగఁజేసినవాఁడట, ౧౮ అమరసాగర (అమర చంద్ర) సూరి, ౧౯ విద్యాసాగర (విద్యాధర) సూరి, ౨౦ ఉదయసాగర సూరి (రచించినది స్నాత్రపంచాశికము, ౨౧ కీర్తిసాగరసూరి (కుమారజీ) ౨౨ పుణ్యసాగరసూరి (పానాచందు అనుపేరు), ౨౩ రాజేంద్రసాగరసూరి, ౨౪ ముక్తిసాగర (మోతీచంద), ౨౫ రత్నసాగరసూరి, ౨౬ వివేకసాగరసూరి.

**మహావీరుఁడు**—ఇక్ష్వాకు నిమి సంతతి క్షత్రియుఁడు. సూర్యవంశము. తండ్రి బృహద్రథుఁడు. పితామహుఁడు దేవరాతుఁడు. కుమారుఁడు ధృతిమంతుఁడు.

మఱియు జైనతీర్థకరులలో నొకమహావీరుఁడు కలఁడు. ఈతని మహావీరస్వామియందురు. ఇంక నాంజనేయునికి మహావీరుఁడని సర్వసాధారణముగ వాడుకనామము గలదు.

**మహావీర్యుఁడు**—అత్రి చంద్ర పూరువు సంతతి క్షత్రియుఁడు. తండ్రి భుమన్యువు, లేక మహతమన్యుఁడు. సోదరులు గర్గుఁడు, నరుఁడు, బృహత్క్షత్రుఁడు. కుమారుని పేరు దుక్షయుఁడు.

మఱియు మిథిలాధిపతియగు బృహద్రథుని కుమారునకును మహావీర్యుఁడని పేరు.

**మహాశక్తిపీఠములు ౫౨(ఏబదిరెండు)** శక్తిపీఠములునూటయెనిమిదిగ దేవీభాగవత నవమస్కంధమున జెప్పఁబడినది. తంత్రచూడామణిలో మహాశక్తిపీఠము లేబదిరెండుగ జెప్పఁబడినవి. కాళికాపురాణమున నిరువదియారుపపీఠములు వివరింపఁ బడినవి, వీట్లయందొకే పీఠమునకు రెండుమూడుపేర్లనువాడుటయు, స్థలము సరిగా తెలియని పీఠములను వివరించుటయు మొదలగు చికాకులనుండి వీట్లనివి యని గుర్తించుటకు వీలుగాకున్నను, నగటున నన్నియు దేవీభాగవతోక్తయష్టోత్తరశతపీఠములలోనివిగనేయున్నవి. వీట్లయందు నదునెన్మిదిపీఠములు మిగుల ముఖ్యతమములుగఁ జెప్పఁబడినవి. ఇంకను దేవీభాగవతము సప్తమస్కంధమున వేరొకతావున దేవీవినోదస్థానములుగ నలువదినాల్గు పీఠములు నుడువఁబడినవి.

ఈ వ్యాసమున తంత్రచూడామణియందు వివరింపఁబడిన మహాశక్తిపీఠము లేబదిరెండును వివరింపఁ బడును.

౧. అంబాభవానీపీఠము- ఆమి గ్రామము. సంయుక్తరాష్ట్రములలోని ఛప్రాపట్టణమునకుఁ దూర్పుగా ౧౧ మైళ్ళదూరమునఁ గలదు. ఇట భవానీపీఠము గలదు. సాధారణముగ దేవిని "భవాని" యనుచున్నారు.

౨. అస్తులాదేవి- బెలూచిస్థానము (తొల్లింటిబాహ్లీకదేశము) నందలి హంగ (తొల్లింటిశత) ద్వీపమునఁ గలదు. ఇట దేవిని సర్వసాధారణముగ 'కాళి' యనుచుందురు.

౩. ఏకవీరికాపీఠము-మయూరపురము. దీనిని పశ్చిమసముద్రతీరమునందలి మాహి (తొల్లింటి మాయూరి)గ కొందరును మరికొందరు వేర్వేరు విధములను బోల్చుచున్నారు. సంశయస్థలము.

౪. కరాదేవి - సంయుక్తరాష్ట్రములలోని అలహాబాదునకు వాయువ్యదిశగా ౪౧ మైళ్ళదూరమునగల కరాగ్రామము. దీనికిఁ గరోటకక్షేత్రమని తొల్లి పేరుండెనఁట. చేయిపడినతావు.

౫. కామరూపి- తొల్లింటి కామరూపదేశమగు నిప్పటి యాస్సామునందలి గౌహతిపురము కడ నొకకొండపైనున్న దేవస్థానము. దేవిని సర్వసాధారణముగ "కామాఖ్య" యనుచుందురు. (ప్రాగ్జ్యోతిషము చూడుఁడు.)

౬. కామాక్షీదేవి - దక్షిణభూమియందు చెంగల్పట్టుమండలములోని కాంచీపురము. ఇట

గాయత్రీమంటపము గలదు. దీని నిట కామకోటి పీఠమను పేరc (శంకరాచార్యపీఠము) బిలుచుచుందురు. ఇది శంకరాచార్యులవారి యాత్రామణఫలితము.

౭. కాళికాదేవి - తొల్లింటి బాలోత్కు దేశమగు నిప్పటి బెలూచిస్థానమునందు కీలట్ (తొల్లింటి కాలాత్ లేక కాళికా) పురముకడనున్న దేవస్థానము.

౮. కాళీదేవి - ఇప్పటి కలకత్తానగరము (తొల్లింటి కాళీఘట్టము) కడనున్న దేవస్థానము. ఇప్పుడు 'Tollip nalla' అనcబడు నాని గంగాతీరమం దున్నది.

౯. కిరీటాదేవి- బంగాళములోని మూర్షిడాబాదుజిల్లా, దహపాదనుండి నాల్గుమైళ్ళదూరమునగల కిరీటకోనయనంబడుతావు. మూర్షిడాబాదునుండి మూడుమైళ్ళదూరము కిరీటము పడినతావు.

౧౦. చాముండీదేవి- (వైజయంతీదేవియు) ఈక్షేత్రముకు వైజయంతీక్షేత్రమనియునందురు. బొంబైరాజధాని, ఉత్తరకన్నడాజిల్లా, బనవాసి (వనవాసి) గ్రామము. దీనికిc దొల్లింట క్రౌంచపురమనియుc బేరుండెను. వరదానదీతీరము.

౧౧. జ్వాలాదేవి- ఇది జ్వాలాముఖీ దేవస్థానముననే గల వేరొక మంటగల తావు. (జ్వాలాముఖి చూడుcడు).

౧౨. జ్వాలాముఖి- ఇచ్చటి దేవిని అంబికయనియు, మాతయనియు, మాతేశ్వరియనియు ననుచుందురు. కాంగ్రాజిల్లాలోని కొహిస్థాన్ డివిషను, లేక డెహరాదసబుడివిజన్‌లోని, జ్వాలాముఖిపర్వతము యొక్క పడమటి యేటవాలు ప్రదేశమందున్న యొకపాటి పట్టణమందలి దేవస్థానము. చుట్టుపట్ల భూప్రదేశమునుండి పర్వతము 3౨౮౪ అడుగులును, దేవస్థానము ౧౯౫౨ అడుగుల యెత్తుననుండును. ఈపర్వతమును 'చుంగార్కి-ధార్' అనియు నందురు. ఇది యగ్నిపర్వతము. ఇందలి రాతియందు తొలువcబడిన గుహాయం దిట్టిజ్వాలలు పది కలవు. అందు ప్రధానములు జ్వాలాముఖి, జ్వాలాదేవి యనునవి రెండు. ఈజ్వాలలు సర్వదామcడుచుండును. జ్వాలాముఖి దేవికి వేరే శిరస్సు లేదు. ఈపదిజ్వాలలలో నైదు దేవాలయములోపునను, నైదు గోడలమీదను గలవు. ఇవి జలంధరుcడను దైత్యుసంబంధములని చెప్పcబడినవి.

ఈతావు కాంగ్రాపట్టణమునకు దక్షిణముగ ౨౨మైళ్ళను, కోహిస్థానములోని 'నదౌణ' అనుపురికి వాయువ్యదిశగా ౧౦ మైళ్ళ దూరమునను గలది. దీనిప్రశంసలు తన్త్రచూడామణియందే గాక దేవీభాగవతము సప్తమస్కంధము 3వ అధ్యాయమునను గలవు.

౧౩. జోగులాంబ- 'అల్లంపూర్' అనcబడు తావు. నైజాంరాజ్యములోని కర్నూలు-హైదరాబాదులమధ్య నినుపదారిపై నాలంపూర్‌న ధూమశకటస్థానమునc గలదు.

౧౪. తులజాభవాని-ఖాండ్వాసంధి(Junction G.I.P.R.) నుండి నాల్గుమైళ్ళదూరమునందుగల తులజాపూరను గ్రామము. తొల్లింటి పేరు భవానీనగరమని యుండెను. శంకరవిజయమున తులాభవానీనగర మని చెప్పcబడినది. దేవీభాగవతము ౭-3౮యందు తులజాపురమని చెప్పcబడినది. మహిషాసురుని జంపినతావనియు నందురు. దేవిని మహాసరస్వతి యనియు తుకైయనియు నందురు.

౧౫. తారాదేవి- తారాపీఠము. దీనిని సిద్ధపీఠ మనియు నందురు. బంగాళములోని బీర్భూమ్ (వీరభూమి) నందలి నల్హాతిపురసమీ

పమున తారాపుర మనఁబడు గ్రామమునఁ గలదు. దీనిప్రశంస తంత్రచూడామణియందే గాక తారారహస్యమునందునను గలదు.

౧౬. త్రిపురేశ్వరీదేవి- ఈ పీఠము హిల్ టిప్పెరా రాజ్యమున, ఉదయపూర్ పురమున నున్నది.

౧౭. దేవీపీఠము- అయోధ్య (సంయుక్త) రాష్ట్రములోని గోండావట్టణమునకీశాన్యదిశగా ౪౬ మైళ్ళ దూరమందున్న దేవీపట్టణ మను గ్రామమునందున్న దేవస్థానము. (కుడిచేయి పడిన తావు.)

౧౮. నందినీదేవి-బంగాళములోనిబీర్భూమ్ (వీరభూమి) జిల్లా, నందిపురమునఁ గలదు.

౧౯. నయనాదేవి- త్రికక్షేత్ర మనియు నందురు. ఇప్పుడు దీనిని నైనిటాలనుచున్నారు. హిమవత్పర్వతముపై సంయుక్తరాష్ట్రపుహద్దున జేరియున్నది.

౨౦. నాశికాదేవి- బొంబైరాజధాని నాశిక్ జిల్లా నాశికపట్టణ పరిసరములందున్న పీఠము. నాశికపట్టణముకడనే పంచవటి కలదు.

౨౧. పరశుదేవి- సంయుక్త (అయోధ్య) రాష్ట్రములలోని ప్రతాపగడ్ జిల్లా పట్టుపుర మున కాగ్నేయదిశగా ౧౨ మైళ్ళదూరమునఁ గల పీఠము. (శరీరభాగము పడినతావు). గ్రామముపేరు పరశుపురము లేక పరశురామపుర మని వాడుచున్నారు.

౨౨. పాతాళేశ్వరి- ఈదేవిని పాటలేశ్వరి యనియు ననుచున్నారు. బీహారు పరగణాలోని పాట్నా (తొల్లింటి పాటలీపుత్రము) దేవీపీఠ సంబంధమని తెలుచున్నది. పాటలీపుత్రము తొల్లిటి మగధదేశపు రాజధానిగ నుండినది. దీనిప్రశంసబృహన్నలాతంత్రమునఁగూడగలదు.

౨౩. పురుహూతికాదేవి-

౨౪. ఫుల్లారాదేవి-దీనినట్టహాసక్షేత్రమనియు నందురు. బంగాళములోనిబీర్భూమ్(వీరభూమి) జిల్లా, లాభాపూర్ నకు తూర్పుభాగమునగొంత దూరమునందున్నది. ఇది ఈస్టిండియన్ రైల్వే యు, మోల్పూర్ స్టేషనునుండి 7 మైళ్ళ దూర మునఁ గలదు. దీనిఁగూర్చి కుబ్జికాతంత్రమున నేడవ యధ్యాయమునను, పద్మపురాణ శ్రీష్టి ఖండ ౧౧ అధ్యాయమునను వివరింపబడినది.

౨౫. బహుళాదేవి - ఈప్రాంతవాసులగు బంగాళీలు 'బెవులా' యని వాడుచున్నారు. బంగాళదేశములోని కట్వాపట్టణ పరిసరములందున్నక్షేత్రము.

౨౬. బిందువాసినీదేవి - బంగాళములోని తామ్లూల్(తొల్లింటి తామ్రలిప్తి పుర) పరిసర మునందున్నది.

౨౭. భ్రమరాంబ - ఈదేవి భ్రామరీశక్తి యనియుఁ జెప్పఁబడినది. ఆంధ్రదేశమునందలి కర్నూలుమండలమున శ్రీశైలక్షేత్రమునంగల యీదేవి యాంధ్ర, కర్ణాటక,కొంకణదేశముల యందు ప్రసిద్ధమై యున్నది.

౨౮. భవానీదేవి- ఆసాం(తొల్లింటి కామ రూపదేశము)లోని చిట్టగాన్గుపురము(తొల్లింటి ఛటాలా) కడనున్న చంద్రశేఖర పర్వతముపై సితాకుండముకడనున్న దేవీపీఠము. (సతీదేవి కుడిచేయిభాగము పడినతావుగఁజెప్పఁబడినది). వారాహీతంత్రమునఁగూడ దీనిప్రశంస కలదు.

౨౯. భవానీదేవి-ఈపీఠమును గౌరీభవాని యనియు, అంబాభవాని యనియుఁ గూడవాడు చున్నారు. ఇది గౌరీదేవీపీఠ మనుట సరియని తోచుచున్నది. తొల్లిఁటి విదర్భ దేశమున కుండినపురపరిసరములనుండిన దేవీపీఠము. రుక్మి ణీదేవి యిట గౌరీతప మొనర్చుచుండ, శ్రీకృష్ణుఁ డామెనుగైకొనిపోయి పరిణయమయ్యెనని చెప్పఁ

బడినది. ఆపద్ధతిని నేటివరకు నీదేశమున వివాహమునకుఁబూర్వము కన్యను గౌరీతపమొర్పఁ జేయుచుందురు. కుండినపురము మధ్యరాష్ట్రములలోని యమరావతికిఁ దూర్పుగ నలుబది మైళ్లదూరమున విదర్భానదీతీరమునఁ గలదు.

౩౦. భీమాదేవి- మహాభారతమునను, పద్మపురాణమునను ప్రశంసలు గలవు. దీని నిప్పుడు తక్తిభాయి యని వాడుచుందురు. పెషావరుప్రాన్తముల, హిందూపురమునకు వాయవ్యదిశగా ముప్పదిమైళ్ళదూరమునను పెషావరుపురమున కీశాన్యదిశగా నిరువదియెనిమిది మైళ్ళదూరమునను మరదన్ పురమునకు వాయవ్యదిశగా నెనిమిదిమైళ్ళ దూరమునను నొక ప్రత్యేక పర్వతముపైనున్న దేవస్థానము. ఇట యోనితీర్థము కలదు. దీని గూర్చి హ్యూనచ్యాంగు వ్రాసియున్నాఁడు.

౩౧. మంగళగౌరీదేవి- బీహారములోని గయానగరపరిసరముల బ్రహ్మయోనిపర్వతేఁపు చరియపై భాసనాథ మనఁబడుతావునఁ గలదు.

౩౨. మహాకాళీదేవి- ఉజ్జయినీక్షేత్రము. దీని నుజ్జయినీమహాకాళి యనుచుందురు. బంగాళదేశములోని బర్ద్వాన్ జిల్లా, కట్వా డివిషను లోని కోగ్రామము, మంగళకోట గ్రామము, అరేల్ గ్రామములకు సమీపమునఁగలక్షేత్రము.

౩౩. మహాలక్ష్మీదేవి-బొంబై రాజధానిలోని కొల్హాపురసంస్థానపు రాజధానియగు కొల్లాపుర పరిసరములందున్న పీఠము. కొల్లాపురమునకు తొల్లిఁటిపేరు కరవీరపురము.

౩౪. మహిషాసురమర్దని- బంగాళరాజ్యములోని బీర్భూమ్ (వీరభూమి) జిల్లా, బక్రిసాద్ గ్రామముకడనున్న పీఠము.

౩౫. మాణిక్యాంబ - ద్రాక్షవాటికయందున్న పీఠము.

౩౬. మాతాదేవి-జలంధరుజిల్లాలోని కోహిస్థానభాగమున మాంఝినది బాణగంగానదిలో సంగమగుతావున నున్న పీఠము. ఇట దేవిని వజ్రేశ్వరి యనియు నందురు. నాగరకోట ప్రాంతము.

౩౭. మాధవేశ్వరి- ఈదేవి యలోపీదేవి యనియుఁ జెప్పఁబడినది. సంయుక్తరాష్ట్రపుఁ బ్రధానపురమగు నలహాబాదు (ప్రయాగ) నందు గలదు. ఇది సతీదేవివ్రేఁపు పడినస్థానము.

౩౮. మీనాక్షీదేవి - దక్షిణదేశమునఁ (తొల్లింటి పాండ్యదేశము) గల మధురాపురమునగల పీఠము. దీనిని ద్వాదశాంతక్షేత్రమనియు నందురు. వైఘా (విఘనన) నదీతీరము. (సతీదేవినేత్రము పడినతావని యందురు.) దీనిప్రశంస దేవిభాగవతమున ౭-౩౮ యందుఁ గలదు.

౩౯. యోగాద్యాదేవి- బంగాళారాజ్యములోని బర్ద్వాన్ జిల్లా, బర్ద్వాన్ పురమునుండి యుత్తరముగా నిరువదిమైళ్ళ దూరముననుండు ఖైరాగ్రామమునందున్న పీఠము. (సతీదేవికుడిపాదము పడినతావు.)

౪౦. వింధ్యవాసినీదేవి - సంయుక్తరాష్ట్రములలోని మీర్జాపుర పరిసరములందు గంగాతీరమున వింధ్యపర్వతశాఖగఁజెప్పఁబడిన చిన్న గుట్టపైనున్న పీఠము. దేవిని వింధ్యాచలవాసిని యనియు నందురు. ఇది పంపాక్షేత్ర మనియుఁ జెప్పఁబడినది.

౪౧. విమలాదేవి - ఉత్కలదేశమున జగన్నాథము(పూరీ)నందు జగన్నాథస్వామి దేవాలయావరణముననేగల శక్తిపీఠము.

౪౨. విరజాదేవి - ఉత్కలదేశమునఁగల జాజిపూర్ (తొల్లింటి యజ్ఞపురముకడ (వైతరిణీనదీతీరము)ననున్న పీఠము. ఇట దేవాలయా

వరణమునసే నాభిగయాక్షేత్రమును, నట గదాధరవిష్ణుదేవుని తావును గలవు. ఈపీఠమును గూర్చిన ప్రశంసలు మహాభారతము వనపర్వము ౮౫ అధ్యాయమునను, బ్రహ్మపురాణము ౪౨ అధ్యాయమునను గలవు. మరియుఁ గపిల సంహితయం దిది గదాక్షేత్రమని చెప్పఁబడినది.

౪౩. విశాలాక్షీపీఠము-గంగాతీరమున కాశీ (బనారస్) పట్టణమునఁ గల పీఠము. ఇది దేశ ప్రసిద్ధము.

౪౪. వైష్ణవీదేవి-జ్వాలాముఖిక్షేత్రమునందే యీపీఠమును గలదు.

౪౫. శాంకరీదేవి-సింహళద్వీపమున, పశ్చిమసముద్రతీరమున నిప్పుడు త్రింకోమలీ పురముండినతావున నుండినపీఠము. ఇది యిక్కాలమునందు భగ్నపర్చబడియుంట గానరాదు.

౪౬. హరద్వారమునుండి కేదారనాథము (బదరీకేదారము)న కేగు మార్గమున కుమాఁడివిషనులోని సపాదలక్షపర్వత (శివాలిక్) పంక్తికిఁ జేరిన (వాయవ్యభాగమున) సురకోట పర్వతముపైనున్న దేవస్థానమునందలి పీఠము. దీనిప్రశంస దేవీభాగవతము,సప్తమస్కంధమున ౨౮ అధ్యాయమునఁ గలదు.

౪౭. శారదాదేవి-దీనిని సరస్వతీపీఠమనియు, సర్వజ్ఞశారదాపీఠ మనియుఁ గూడ నందురు. కాశ్మీరదేశమున కామరాజపురముసమీపమున కృష్ణగంగా, మధుమతీ నదులసంగమముదరిని గల సారది (తొల్లిఁటిశారద) గ్రామముననున్న పీఠము.

౪౮. శారికాదేవి-కాశ్మీర దేశమున హరముఖపర్వతముపై నున్న పీఠము. ఇట కస్యప మహార్షియాశ్రమ ముండినతావుఁ జూపుదురు.

౪౯. శ్రీశంకాళీదేవి-(దీనిని గూర్చిచక్కఁగ తెలియదు).

౫౦. శృంఖలాదేవి-తొల్లింటి ప్రద్యుమ్న నగరమునం దుండెను. బంగాళ రాజ్యములోని హుగ్లీజిల్లాలోనిపాండువాగ్రామమునప్రద్యుమ్న నగరనామము పాండువా యయ్యెనందురు. ఈ పీఠము భగ్నపర్చబడినది గాన నిప్పుడు లేదు.

౫౧ హరసిద్ధిదేవి-మాళ్వదేశపు తొల్లింటి రాజధానియగు నుజ్జయినీనగరమునగలపీఠము. దీని నిప్పు డుజ్జయినీమహాకాళియని యందురు. (ఉజ్జయనీమహాకాళి యిది కాదు).

౫౨ హింగుళాదేవి- బెలూచి (తొల్లింటి బాలోకు) దేశమున తొల్లిటి పీఠముండినతావుఁ జూపుదురు. నేటికి నీదేవస్థానమున నర్చనలు జరుగుచున్నను, ఈదేవి యటనుండి కదలిపోయి, సంయుక్త రాష్ట్రములలోని కుమాన్ డివిజనునందలి చంపావతి గ్రామముకడ కూర్మాచలపర్వతముపై(కూర్మాచలము లేక కుమాన్) క్రాంతేశ్వరశివలింగముండినతావునకు గతిపయ దూరమునఁ గల దేవస్థానమునఁ బ్రవేశించె ననుచున్నారు. అట దేవాలయము లేకున్నను, అర్చనాదులు నడచుచున్నవి. ఈ ప్రాంతవాసులు హింగుళాదేవిని హుల్యాన్లాదేవి యనియు, ఝూలాదేవి యనియుఁ గూడ వాడుచుందురు.

**మహాశాల**- దీనిప్రశంస పద్మపురాణము, సృష్టిఖండము ౧౧ అధ్యాయమునను, మత్స్యపురాణము ౨౨ అధ్యాయమునను గలదు. ఇది స్నానతీర్థముగ వివరింపఁబడినది.

శాలానది బ్రహ్మపురాణము ౧౦౬ అధ్యాయము ౨౦-౨౨ శ్లోకములందు గోదావరీ నదిలోఁ గలియునుపనదిగాఁ దెలియుచున్నది. ఆపేరుగలనది గాని తావుగాని యిప్పుడు తెలియఁబడకున్నది.

గ్రీకుచరిత్రకారులు 'మైసోలస్' అని దీనిఁ బేర్కొనిరి. 'ప్టోలమీ' గోదావరీ కృష్ణానదులు

సముద్రగ్రామములగు సముద్రతీరప్రాంతమునకు మైసోలాయని పేరని వివరించెను. పరిశోధకులు కొందరు కృష్ణామండలములోని మచిలీపట్టణ మీశబ్దపుసంబంధిగా ననుమానించుచున్నారు.

**మహాశివరాత్రి**—మాఘమాసమున కృష్ణపక్షత్రయోదశిని మహాశివరాత్రియందురు. ఇది సముద్రమథనకాలమున నుత్పన్నమై లోకనాశనమొనర్చుచున్న హాలాహలమును పరమేశ్వరుఁడు మ్రింగి, గళమునబంధించి నీలకంఠుఁడైన యానవాలుగ నాదినమున శివారాధనలు నుపవాసములు సల్పుచున్నారు ప్రతిమాసమునం దిట్టితిథులను 'మాసశివరాత్రము' లనియెదరు. (అరటంతీ చతుర్దశి చూడుఁడు.)

**మహాశ్వేతాశ్రమము**--(అచ్ఛోద చూడుఁడు.) (కాశ్మీరదేశము చూడుఁడు.)

**మహాశైవము**—ఇది చతుర్దశ శైవ భేద మతములలో నొకటి. (చూడుఁడు.) ఇందు మలత్రయము, త్రిపదార్థములు, శివసమవాది మతమునందు వలెనే యుండును. మూర్తామూర్తము లైనవారికన్న పతియగు శివుఁ డుత్కృష్టుఁడు. సంసారమును త్యజించి, జటా రుద్రాక్ష విభూతుల ధరించుచు (శివవేషధారియై) సగుణమగు శివారాధన మొనర్చుచుండుటవలన ముక్తికల్గును. మరియు నీమతమున 'సత్'అనిన గురులింగమని యందురు.

**మహాష్టమి**-ఆశ్వయుజశుద్ధఅష్టమి. దీనిని బంగాళదేశస్థులు దుర్గాష్టమి యనెదరు. హరిద్వారప్రాంత శైవాలకదేశస్థులు దక్షయజ్ఞవినాశినియగు భద్రకాళీ (మాయాదేవి) దేవిని బూజించుచుఁ గాళికాష్టమి యందురు. ఈదినమున సప్తమీతిథికలియుటయు, నాదివారమగుటయు దోషమనియెదరు.

ఇది, శరన్నవరాత్రములు లేక దేవీనవరాత్ర ములందలి యెనిమిదవదినము (పండుగలు చూ.)

**మహాసముద్రము (Ocean ఓషన్)**-మహాసముద్ర మన పెద్దజలభాగము. (Sea Portions చూడుఁడు.) సముద్రజలప్రవాహములు Ocean Currents చూడుఁడు).

**మహాసారపురము(ఇప్పటిమసార్)** ఇప్పటి బీహారములోని "అరాపట్టణము''నకు (షహాబాదుజిల్లా) పడమరగా నారుమైళ్ళదూరమున 'మసా'రని పిలువఁబడు గ్రామమెయున్నది. బౌద్ధమతోద్రేకకాలమున సైతం మిచటి విప్ర లోకొత్తమతము నంగీకరింపక తమ పూర్వుఁపుటాస్తేయభక్తి వీడ నిరాకరించి నిలచి పేరందిరి. ఇచటనారాయణదేవస్థానముగలదు. అది చూడఁదగినది.

**మహాస్థాన (పుర) ము**-ఇది తొల్లిఁటి (బంగాళములోని) పుండ్ర లేక పుండ్రకదేశఁపుఁబ్రధానసగరము. దీనికి బరేంద్ర పురమనియుఁబేరుండెను. బంగాళములోని మాల్దాజిల్లా బోగ్రా కుత్తరముగా నేడు మైళ్లదూరమున నిప్పుడు "బరేండా'' యనుపేరఁ బరగుచున్నది.

**మహాస్థానఘడము**—తొల్లిఁట పరశురాముఁడు రాజ్యమేలినతావు. బంగాళములోని బోగ్రాజిల్లా, బోగ్రాపట్టణమునకు తూర్పుగా పదిమైళ్ళ దూరమునం దున్నది. బౌద్ధులకాలమున దీనికి శైలధాపమనియో, లేక శిలాధాపమనియో(ధాతుగర్భమను నర్థమిచ్చు) పేరుండెనఁట. బౌద్ధమతము తగ్గి సనాతనార్యమతము తిరుగవృద్ధినందుకాలమున శిలాద్వీపమని మారెనఁట. (దేవీభాగవతము ౭-౩౮ యందు దీని ప్రశంస గాననగుచున్నది.)

ఇట తొల్లిఁటిదగు నుగ్రమాధవుని దేవస్థానము బంగాళ (గౌడ)దేశమేలిన జల్లాలసేనునికాలమువరకు నుండెనఁట. మరియు మహా

మ్మదీయులకాలమున నది భగ్నముచేయఁబడె నని తోఁచెడిని. అత్తరి పాసుల్లాజరత్తొలియా యనంబడిన యొకఫకీరు పరశురాముఁ డనంబడిన యొకతపస్విని నిహతుంజేసి పేరంది మహాత్ముఁడాయెనఁట. దానికి డిల్లీనవాబు భూదాన మిచ్చెనఁట. అది నేటికిని యాతనిపేర మహమ్మదీయయాత్రాస్థలమై యున్నది. ఈ పరశురాముఁడే జమదగ్నిసుతుండగు పరశురాముఁడని తురకలయం దొకవాడుక (ప్రచారము) కలదని యచటివారు జెప్పుదురు.

దీని తొల్లింటిపేరు పుండ్రవర్ధకపుర మని యుండెనఁట. అప్పుడది పుండ్రకదేశమునకు రాజధానిగ నుండెనఁట. ఇక్కాలమున నిటఁ జూడఁదగినది పాతకోటబౌద్ధదేవాలయము, ఫజ్లూకైర్‌మసీదు, సీతాదేవిఘట్టము, మహాంకాళికుండము మొదలగునవి కొన్ని కలవు. నారాయణీమేళస్నానయాత్ర యిట జరుగును. సుఖానపుఘూరు రైల్వేష్టేషనున దిగిబండ్లలోఁ బోవలెను.

**మహింతల్ పర్వతము**— ఇది సింహళమునందు యాత్రాస్థలమగు కొండ. అనూరాధపురమునుండి యెనిమిదిమైళ్ళ దూరమునందున్న వేయియడుగుల యెత్తుగల పర్వతము. దీని నెక్కుటకు రెండువేలశిలాసోపానములున్నవి. 'మహింతల్' అనిన మహిందునితావని యర్థము. మహిందుఁడు సుప్రసిద్ధబౌద్ధమతవ్యాపకుఁడగు నశోకచక్రవర్తిసుతుఁడు. యువరాజుగనుండియు, రాజ్యకాంక్షను వీడి, బౌద్ధమతబోధకుఁడై బౌద్ధభిక్షుఁడై లంకారాజ్యము(సింహళము) నకేతెంచినవాఁడు. భరతదేశమునం దాయనకు తండ్రి పెట్టినపేరు. 'మహేంద్రుఁడు' గానోపు! పాళీభాషయందు సింహాలదేశ(పుమార్పులకు లోనై "మహిందో" యాయెను.

క్రీస్తుప్రభువు జన్మించుటకు మునుపు 318 సంవత్సరములనాడు తిస్సా (బహుశః త్రిలోకాశ్రియశబ్దసంబంధము గానోపు) యనుపేరుగల భూపతి రాజ్యపాలన మొనర్చుచుండె నఁట. ఆయన సింహాలుఁడు. ఒకనాఁడాయన వేఁటాడుచుండ, నొకలేడింజూచి వెంటాడి యరుగుచుండ, మిస్సాపర్వతపుచరియలయందు బౌద్ధభిక్షు వగు మహిందుఁడును, అనుచర శిష్యవర్గమార్గురును గన్పించి, "తిస్సా మహీపాల! నీకు స్వాగత మిటు ర"మ్మని పిలువ, భూపతి తనమృగయా వినోదగమనముమాని, వారికడకరిగి వారిబోధన లనువినుచు నెట్టకేలకు మహిందోదేశికునిశిష్యుఁడై బౌద్ధుఁడాయెను. అదిపౌర్ణమిదినమని చెప్పఁబడినది. ఈతావప్పటినుండియే మో 'మహింతాల్ పర్వత' మని పేరందెను. అప్పుడు రాజధాని యనూరాధాపురమే. ఆభూపతి బౌద్ధుఁడైన నంగతి విని ప్రజలు బౌద్ధులు కాసాగిరఁట. అచట నప్పుడు నలుబదివేల సింహాళులు బౌద్ధులై బుద్ధబోధసంఘములందు శరణ్యముఁ బడసిరఁట. ఈ యాత్రాస్థల మరణ్యమున నున్నది.

కొండక్రింద నొకవైద్యశాల పాడైయున్నది గాననగును. అందొకపడవంబోలిన రాతితొట్టె గలదు. అం దానాఁడు రోగుల కౌషధములఁ గల్పిననీటియందు స్నానము లాచరింపఁజేయుచుండిరందురు. అక్కాలఁపుభూపతులు, వైద్యవిద్యావిశారదులై, ధర్మవైద్య మొనర్చువారఁట. అట్టివారిలో (క్రీ. శ. 341-370) బుద్ధదాసుం డనుభూపతి యగ్రేసరుఁడఁట.

"మహింతల్" పర్వతమునకు 'మిస్సాపర్వత' మని యాదినామమఁట. దాని నెక్కుటయందు కొంతదూరమున నొక బౌద్ధవిహారము పాడెనది గన్పడును. ద్వారమున కిరుదెసలయందు రెండు శిలాఫలకశాసనములు గలవు. అందు బౌద్ధభిక్షువుల విధులు, నిషేధములు, నాప్నికకృత్యా

ములు వివరింపఁబడినవి. మరికొన్ని సోపానము లెక్కిన కుడివైపున నొకబాట "సింహస్నాన ము" కడకుం జేర్చును. అట నెత్తగుతావున నుం కించి దూకుటకు సంసిద్ధమైయున్న రాతిసింహము నోటినుండి జలధార పడుచుండ, నందు స్నాన మాచరించు చుండిరఁట. అటనుండి మరలి మఱి కొన్ని మెట్లెక్కఁగనే "నాగపోకునా" జలనిలయ (స్థాన) మున్నది. అట నారడుగుల పొడవుగల యైదుపడగలనాగము రాతియందుఁ జెక్కఁబ డుట నీపేరయ్యెనఁట.

తిరుగ సోపానములకు మరలి తిరుగ మెట్లెక్కుటయం దచిరకాలముననే ప్రధానపవిత్ర స్థలి చేరనగును. అచటనే మహిందునిచే బోధిం పఁబడి తిస్సానృపాలుఁడు బౌద్ధమతస్వీకరణ మొనర్చిన తావు గలదు. అదియే పిమ్మట మహిందుశ్మశానమును నై యున్నది. తరువాత నత్తావున నొక గుండ్రనిభవనము నిర్మింపఁ బడి, వెలుపల చుట్టును స్తంభములచే నలంక రింపఁ బడినది కలదు. అద్దాని నిటీవల చక్కఁగ మరమ్మతుఁ జేయించియున్నారు. దాని కెడమప్రక్క నొక యెత్తగు శిలాతలమున నొకస్థూపముగట్టి, యందాయన యస్థుల నుంచియున్నారు. ఆప్రాంతముననే కొంత దిగువ నామహాత్ముఁడు నివసించిన గుహఁ జూపుచున్నారు. ఉత్సవములం దిటకు వేనకువేలు జను లేతెంతురఁట. ఈప్రాంతముల గ్రామములు లేవు. కొందరుబౌద్ధభిక్షువులిందుఁ గాననగుచుందురు. కొండదిగువను కలూదియా పోకునా సరస్సును, రాజగిరివేనా విహారమును గలవు. మహింతల్పర్వత మశోకచక్రవర్తి సుతుండగు మహిందో (మహేంద్రుఁడు) పేరఁ బరగుచున్నదని తలంపఁబడుచున్నది. (సింకా లముఁ జూడుఁడు.)

## మహిమానసిద్ధి-(సిద్ధి, సిద్ధులు చూడుఁడు)

## మహిషకదేశము-(అనూపదేశముచూ.

## మహిష్మంతుఁడు

- యదుసంతతి. చంద్ర వంశక్షత్రియుఁడు. తండ్రి సనాజిత్తు.

నర్మదానదీతీరమున మాహిపురమను రాజ ధానిని (చేదిదేశము) నిర్మించినవాఁడు. ఇట నిప్పుడు చూళిమాహేశ్వర శివలింగము గలదు. ఇది యోంకారమాంధాతక్షేత్ర సమీపమున నున్నది.

## మహిసాక్షి

—లా. Balsamodendron Mukul అనియు, Balsamodendron Agallocha, ఆంగ్ల. Gugul Gum, సం. మహి సాక్షీ యనఁబడును.

ఇది బాలింతబోలుఁ బోలిన యొకజాతిచెట్ల బంక. పరిమళముగల ధూపద్రవ్యము. ధూప దశాంగములలో నొకటి. లోని కిచ్చిన వేఁడి జేయుననియు, సమ్మెటలతో నెంతవిస్తారముగఁ గొట్టిన నంతబలముగఁ బనిచేయు ననియు నందురు. స్థితికొలఁది లోనికిచ్చినను, పైకి పట్టు వేయుటవలనను, మహిసాక్షివలన నగ్నిమాంద్యము, నడ్డగఱరోగము, నరిసారము, నప స్మారరోగము, క్రిమిరోగము, గండమాల, గ్రంధులు, గుల్మరోగము, నెత్తురుగడ్డలు, పురుగులుపట్టు వ్రణములు, భగందరము, మూల వ్యాధి, మేహవాతపునొప్పులు, రక్తగ్రహణి, రక్తక్షయ, వాతనొప్పులు, సెగరోగము నివా రణమగునని చెప్పఁబడినది.

## మహీకాంత (స్టేటు) సంస్థానము—

బొంబైరాజధానీ ప్రభుత్వముయొక్క యధికా రమునకుఁ లోబడిన చిన్నస్వదేశసంస్థానము. కతియవాడుద్వీపకల్పమునం దున్నది. మహీ కాంతపురము రాజధాని.

**మహీంద్రకుఁడు (మిథిలదేశాధిపతి)**- ఇక్ష్వాకుసంతతి. సూర్యవంశక్షత్రియుఁడు. తండ్రి విబుధుఁడు. పితామహుఁడు దేవమీఢుఁడు. కుమారుఁడు కీర్తిరాతుఁడు. ఇతనికి మహాధృతుఁడనియు నామాంతరము గలదు.

**మహీనరుఁడు**—పాండవసంతతి క్షత్రియుఁడు. తండ్రి దుర్దమనుఁడు. పితామహుఁడు రెండవశతానీకుఁడు. పుత్రుఁడు దండపాణి.

**మహెజీ దేవస్థానము**—బొంబైనుండి బుసావల్ నకేగు G.I.P రైల్వేయినుపబాటపై బుసావల్ నుండి 3½ మైళ్ళ దూరమున మహెజిస్టేషను గలదు. ఆగ్రామమున మహెజి దేవళము సుప్రసిద్ధము. (బొంబైనుండి ౨౮౧ మైళ్ళు).

మహెజీయాత్రము, సత్తరినె జరుగుసంతయు నారువారములు నడచును.

**మహెంజోదారో**--ఇది పూర్తిగనాశనమై సింధునదీప్రాంతముల మట్టిచేఁగప్పఁబడిపోయి, చిరకాలముండి, యిటీవల త్రవ్వి బయలుదేఱఁదీయఁబడినతావు. సింధుదేశమునం దున్నది. కరాచీ సిటీస్టేషనునుండి నార్తువెస్టర్న్ రెయిల్వే (N.W.R)పైని కోత్రివరకును మెయిన్‌లయినులోను, అటనుండి బ్రాంచిలైనులో డోక్రి స్టేషనువరకును పోవలయును. అనఁగా రమారమి కరాచీసిటీనుండి డోక్రివరకు ౨౮౭ మైళ్ళ దూర ముండును. డోక్రినుండి యేడుమైళ్ళ దూరములో మహెంజోదారో త్రవ్వుపనులు ప్రారంభ మగును. ఇక్కడికి లార్కానాపట్టణము పదునాల్గు మైళ్ళదూరముండును.

తొల్లిఁటికాలఁపు నీపట్టణముఁగూర్చి యేమియుఁ దెలియకున్నది. ఇఁకముందు పరిశీలనల నుండి దొరకవచ్చును. కొందరు పట్టణమునాశనమై పూడిపోయినపిదప చుట్టుపట్లవారు 'మహాలయద్వార'మని యాదిబ్బలను వాడుచుండ, నది మారి నానాటికి మహెంజోదారో యైయుండునని తలంచుచున్నారు. ఇది కేవల మూహయే గాని, నిదర్శనము లింకను బయల్పడలేదు. దీనిం ద్రవ్వుచున్న ప్రభుత్వమువారి యార్చియాలోజికలుద్యోగస్థు లీపురి జీవించియుండినకాలమును Chalcolithic Age అనిరి. అనఁగా క్రీ.ము. ౨౦ శతాబ్దములనాటి కాలమని యెఱుంగునది.

క్రీ.వె. రెండవ శతాబ్ద కాలముననే పాటిదిబ్బలఁ ద్రవ్వి, దొరకిన యిటుకలతో నొక యెత్తగుదిబ్బపై నొకబౌద్ధవిహారమును, స్తూపమును నిర్మించిరఁట. ఇదియుఁ బాడై యిప్పటి త్రవ్వటయందు బౌద్ధసన్యాసులగదులలో దొరకిన నాణెములఁబట్టి యాబౌద్ధాశ్రమణము కుషాన్‌భూపతి యగు వాసుదేవునికాలమని పోల్పఁబడినది. క్రీ వె. ౧౪౦ మొ॥ ౧౭౩ వఱకును వాసుదేవునిపరిపాలనకాలము గాన, నిదియు నూహించుటకుఁగొంతయవకాశముగల్గుచున్నది.

ఇంక నసలుపట్టణపు పాడుత్రవ్వఁదలయందుఁ గొన్ని శిఖాక్కచేయు ముద్ర (Seal)లు దొరకినవి. వాట్లపైనుండు నక్షరములంబట్టి యార్యులుత్తరమున సరస్వతీనదీతీర ప్రదేశములనుండి యీప్రాంతములకుఁ జేరనియాదికాలమని తలఁచుచున్నారు. ఆసీళ్ళపైనుండు నక్షరములభాష యింతవర కర్థముకాలేదు. కాని అవి యట్లుంటయు, వీధులక్రిందుగ మురికికాల్వ లింటివాడుకజలములగొనిపోవు నేర్పాటు(Under-ground Drainage) లుండుటయు, నింటింట స్నానపుగదులుండుటయు మొదలగుసంగతులవలననానాటిప్రాచీనకాలములం దచటివా రంతనాగరికతఁ గల్గియుండిరని స్పష్టముగఁ దెలియుచున్నది. ఇంక నీపరిశీలనలు పూర్తియై నిజస్థితులు బయల్పడవలసియున్నవి.

**మహేంద్రకూటము లేక (మాహేంద్ర పొంతనము)** - జ్యోతిషశాస్త్రమున వధూవరుల యెన్నికలఁగూర్చి వివరింపఁబడిన ద్వాదశ కూటములలో నొకటి. (ద్వాదశకూటములు చూడుఁడు.)

స్త్రీనక్షత్రము మొదలు పురుషుని నక్షత్ర పర్యంతము లెక్కింపఁగా, స్త్రీనక్షత్రమునుండి పురుషునినక్షత్రము నాల్గు, యేడు, పది, పదమూఁడు, పదునాలు, పందొమ్మిది, యిరువది రెండు, ఇరువదియైదు, నక్షత్రమగునేని మహేంద్రయోగము. శ్రేయమని చెప్పఁబడినది.

**మహేంద్రగోత్రము** — (అగస్తి యుపగణము చూడుఁడు.)

**మహేంద్ర నక్షత్రము (లేక గోళము)** (నక్షత్రములు, భారతీయులుగుర్తించినవిచూ.)

**మహేంద్రపర్వతము**-కొందరు తూర్పు కనుమలు (Eastern Ghats) మహేంద్ర పర్వతమే యనుచున్నారు. గంజాము మండలమున, మందసా సంస్థానమున, మందసాపురమునకు వెనుకగొంతదూరమున మహేంద్రపర్వతము గలదు. అట జన్మించి దిగువకుఁబ్రవహించి సముద్రము (బంగాళాఖాతము) నకుఁ జేరు చిన్న నదికి "మహేంద్రతనయ" యనియుఁ బేరు కలదు.

శ్రీరామునిచే నోడి,పరశురాముఁడిటకుఁ జేరి శివలింగప్రతిష్ఠ యొనర్చెనని రామాయణము కిష్కింధకాండమున ౬౭ లంకా ౮ యందు చెప్పఁబడినది.

రఘువంశము ౬-౫౪ నందిది కళింగదేశమని చెప్పఁబడినది. ఉత్తరనైషధచరిత్రమున ౧౨-౨౪ యందట్లే గాననగుచున్నది. పరశురామ ప్రతిష్ఠితశివలింగ మిట నేటికిని గలదు.

**మహేయదేశము**— ఒకప్పుడీదేశము మాహీనదిమొదలు నర్మదానదివరకు నుండిన చిన్న దేశమని తలంచుచున్నారు. ,వాయుపురాణము ౨-౪౫ యందు మాహేయులు నర్మదాదేశవాసులుగఁ జెప్పఁబడిరి.

**మహేశపురము**-(అనూపదేశముచూ.)

**మహేశ్వరక్షేత్రము**-మత్స్యపురాణము ౧౮౯ యందు నర్మదాతీరమని చెప్పఁబడినది. మహేశనియు,చూళిమహేశ్వరమనియు వాడుక.

**మహాక్షగోత్రము**- (ధనంజయగణము చూడుఁడు.)

**మహాత్సవనగరము**— (మహాబాపురముఁ జూడుఁడు).

**మహాత్సవనగరదేశము**—(యజాభుక్తిదేశము చూడుఁడు).

**మహాదరగోత్రము** —(హారిత ఉపగణము చూడుఁడు.)

**మహాదరగోత్రము**—(ఔతథ్య ఉపగణము చూడుఁడు).

**మహాదరగోత్రము**-(ఔశనసఉపగణము చూడుఁడు).

**మహాదధి**-బంగాళాఖాత మనఁబడుచున్న సముద్రభాగమున కిది తొల్లింటి పేరని తెలియుచున్నది. రామేశ్వరముకడ నున్న శ్రీరామసేతువుకడ కుడివైపున మహాదధియను సముద్రమును, నెడమవైపున రత్నాకరమను స్త్రీసముద్రమును గలియుతావునఁ జూపుచున్నారు. మహాదధియందు కెరటములు చాల తక్కువగ నుండెడిని. రామేశ్వరదేవస్థానమున కెదుటఁగల యగ్నితీర్థసముద్ర మీమహాదధియె.

రఘువంశము ౪-౩౪ యందు ప్రశంసింపఁ

బడినది. మఱియు వాయుపురాణము పూర్వ. ४२ అధ్యాయమునను దీనిప్రశంస కలదు.

**మహోదయపర్వకాలము**— (అర్ధోదయపర్వకాలము చూడుఁడు).

**మహోదయపురము**-(కనూజపురము కన్యాకుబ్జదేశము చూడుఁడు).

**మహోదరము**—ఇది చాల దుష్టస్థితికి చేరిన యుదరరోగము. ఉదరరోగము ముదిరిన యవస్థకీపేరందురు.

**మహోబాపురము(మహోత్సవ నగరము)**—తొల్లిటి మహోత్సవరాజ్యము (ఇప్పటిబుందేల్ఖండు)న కొంతకాలము రాజధానియై యుండెను. మహోత్సవనగరనిర్మాత యగు చంద్రవర్మమహారాజు పరిశుద్ధికై మహోత్సవమును క్రతువొనర్చెననియు,నందుచే నీ నగరమున కాపేరయ్యెననియు బలమగుప్రతీతికలదు.

తొల్లి ఛందేలురాజులు నిర్మించిన మదన సాగరతీరమున నీపట్టణము నిర్మింపఁ బడినది. చంద్రవర్మ మృతినందినప్రదేశమును 'కంకం' అని యెదరు. మదనసాగరము పవిత్రసరోవరమై యున్నది. ఇది మదనవర్మమహారాజనిర్మితమందురు. ఇట మామాదేవియాలయము గలదు. ఈప్రాంతముల కిరాతసాగరమని మరియొక సాగరము గలదు. అది కిరాతవర్మమహాజనిర్మితమఁట. ఇవి ౧౧-౧౨ శతాబ్దముల నాఁటివని యందురు.(బహుశః క్రీస్తువెనుకనై యుండును.) మహోబా G. I. P. రెయిల్వే, జాన్సీ మానిక్పూరులైనుపై జాన్సీనుండి ౭౬ మైళ్ళ దూరమున బుందేలుఖండునం దున్నది.

**మళయాళదేశము** — (కేరళదేశము చూడుఁడు.)

**మళయాళభగవతి (మూకాంబ)**—(అంబాతీర్థము చూడుఁడు.)

**మక్షికాన్యాయము**—ఈఁగవుండుచోట వెన వ్రాలుంగాని, మంచిస్థలము దానికి వుండుగల తావుకన్న రుచికాదు. దోషములనే వెదకువారనిభావము.

**మాంగులియాశాఖక్షత్రియులు**—(శిశోదియాక్షత్రియులు జూడుఁడు.)

**మాంఘీరు జిల్లా**- -మాంఘీరు (మోదగిరి)పురము ప్రధానస్థానము. (బీహార్ దేశము చూడుఁడు).

**మాంచెస్టరిజమ్** (Manchesterism)-మాంచెస్టరునగరముయొక్క యర్థశాస్త్రసంబంధమగు సిద్ధాంతము. వర్తకమునందు స్వేచ్ఛను సూచించును.

ఈపద్ధతి క్రీ. శ. 1839 సంవత్సరమున John Bright గారివల్ల Rechard Cobden గారివల్లను సాపింపబడినది. దిగుమతిసరకులపై సుంకములను విధించుపద్ధతిని నిరసించును.

**మాంజిగోత్రము**-(కణ్వాఉపగణము చూ).

**మాంటుగోమరీజిల్లా**— మాంటుగోమరీపురము ప్రధానస్థానము. (పంజాబుదేశము చూ.

**మాంటినీగ్రో రాష్ట్రము** — యిరోపాఖండమున బాల్కనురాష్ట్రములలోనిది. అడ్రియాటిక్కు సముద్రమునకు తూర్పుగా నున్నది. (బాల్కను రాష్ట్రములు చూడుఁడు). మాంటినీగ్రో యనిన నీలపర్వతములని (అనగా నీలపర్వతదేశమని)యర్థము. గొప్ప యరణ్యములు గలిగిపర్వతములిందలివి నల్లగానుంటనీపేరుగల్గెనఁట. ३६३० చ॥మైళ్ళవైశాల్యము. ఇది టర్కీప్రభుత్వముక్రింద కొంతకాలముండినది; క్రీ.వె. ౧౬౯२ నుండియు Petrovic అను నాయకుని క్రింద తిరుగుబాటొనర్చి తప్పించుకొనెను. క్రీ.వె. 1878 లో బెర్లిను ట్రీటీ సందర్భమున

(ఆస్ట్రియా-టర్కీ యుద్ధానంతరము) నీ దేశము యొక్క విడుదలను టర్కీచే నంగీకరింపఁజేసిరి. ఆనాయకుఁడే భూపాలుఁ డయ్యెను. సెట్టింజీ పురము రాజధాని. (టర్కీదేశముచూడుఁడు).

**మాండలేనగరము**—ఇది యిప్పటి రంగూనునగరమునుండి౩౦౬మైళ్ళదూరమునగలది. వెనుకటి రాజధాని. ఇందులక్షయేబది వేలజనులు వసించుచున్నారు. బర్మాస్టేటు రెయిల్వేయొక్క రివర్సింగుస్టేషనుగా నున్నతావు. ఐరావతీనది యొక్క ప్రాక్తీరమునందున్నది. క్రీ.శ. ౧౮౫౭ లో మిండన్ నరపాలుఁ డీనగరమును నిర్మించి, తనరాజధాని నిటకు మార్చెను. ఆయనసుతుండును, కడపటిన్నృపతియు నగు థీబాగారు దీనిం బెంచి విరివిగఁగట్టించెను. ఆయననుండియే బర్మారాజ్యము బ్రిటిషువారివశమై సామ్రాజ్యమునఁ జేరిపోయెను.

తొల్లిఁటి ప్రాతమాండలే పురమును జుట్టిన దుర్గము నిప్పుడు డఫ్రిన్ కోట(Fort Duffrin) అని పేరిడి వాడుచున్నారు. ఇప్పటి క్రొత్త మాండలేపుర మాకోటవెలుపలఁ గట్టఁబడినది. ఆకోటఁ జుట్టిన కందకము ౨౦౦ యడుగుల వెడలుపు గలది. కోట నాలుగుచతురఁపుమైళ్లు వైశాల్యముగల్గి, ౪౦ యడుగులయెత్తున దెసకు మూడేసిచొప్పున పండ్రెండుద్వారములు గల్గి, యన్నివంతెనలు గల్గియున్నది. ఇప్పుడు నాల్గు దెసలను నాల్గువంతెనలు నాల్గుద్వారములను మాత్రము తెరచియుంచి, తక్కినవి మూసివేసి యున్నారు. దీని నడుమను రాజప్రాసాదమును, అందు సింహాసనముండిన చావడియు, దర్శన మిచ్చుచుండిన తావులును గలవు. భవన మంతయుఁ జక్కని లేక్కరపూతఁగల్గి, యద్దములచే నలంకరింపఁబడియున్నది. గొప్పపాడవును వలమును గల్గిన టేకుదూలములు, స్తంభములు పని జూచ వింతగొలుపుచుండును. క్వీన్సుమోనాష్టరి యనఁబడుచున్న బౌద్ధవిహారమును థీబాభూపతిగారిభార్య సుపాయలాత్ రాజ్ఞిగారు కట్టించిన దందురు. అది చూడ ముచ్చటయగు భవనము. ఇంక నగరపరిసరమునసే యున్న 'కుతోడా' యనబడు దేవళసముదాయమునందు మధ్యనున్న ప్రధానదేవళము బుద్ధభగవానునిది. దానింజుట్టి ౭౨౯ దేవళములయందు బౌద్ధమతగ్రంథములగు త్రిపిటకములు ౭౨౯ శిలాఫలకములపైఁ జెక్కించి, యొక్కొక్క దేవళమున నొక్కొకటిగ థీబాగారితండ్రిగారు ప్రతిష్ఠించిరఁట. ఇదియంతయు నరమైలుచౌకఁపు నావరణమునం దున్నది. మాండలేమార్కట్టు నకు జోగ్యో బజారని పేరు. దీనిని మిండన్నరపాలుఁడు తొలుత కర్రతోఁ గట్టించెనఁట. గాని ౧౮౯౨లో కాలిపోవ నిప్పటియిటుకకట్టడమును పిదపఁగట్టించిరఁట. ఇందిప్పుడు బర్మావనితలఁపు వస్తువులన్నియు వెలకుదొరకెడిని. నగరపరిసరమందే వేయియడుగులయెత్తుగలమాండలేపర్వతమున్నది. దాని కీనగరమునుండియే పేరుగల్గినదఁట. దానిపై కెక్కి చూచిన నగరదృశ్యమును, దూరదృశ్యమును జక్కనియాకారముల నగుపడును.

మాండలేనగరము జిల్లాయందు ముఖ్యపట్టణముగాన నందు మండలకార్యస్థానము (కచేరీలు)లన్నియుఁ గలవు. ఇట డివిజనల్ కమీషనరుకచేరియుఁ గలదు. ఇటనుండిపోయిచూడఁదగినతావులు రెండు కలవు. అవి ౧ నదికవ్వలి తీరమున నైదుమైళ్ళదూరమునంగల మింగన్ పెగోడా దేవస్థానమును, (మింగన్పెగోడా చూడుఁడు.) ౨ ఫ్యేజాయ స్పెగోడాయునై యున్నవి. (ఫ్యేజాయస్పెగోడా చూడుఁడు.)

**మాండవ్యగోత్రము**— (జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు).

**మాండవ్యమహర్షి**—మాండవ్యమహర్షి గొప్ప తపస్సంపన్నుఁడు. ఈతఁడు బ్రహ్మర్షి. తపోమహిమచే నన్ని లోకములందును సంచరించుశక్తిగలవాఁడు. బాలుఁడుగ నుండుతఱి, తూనీఁగలఁబట్టుకొని వాటికి పుల్లలగుచ్చి యాటలాడిన దోషమున, మహర్షియైనపిదప నొకతఱి తపోనియతిని చైతన్యము మఱుఁగుపడి యుండ, నొక భూపాలుం దోచుకొనిన దొంగ లీతనియాశ్రమమున దాఁగ, తలారులు వెంటనంటి వారిం బట్టుకొని, వారితో మాండవ్యునిఁగూడ దొంగలగురువని భ్రమించి, ఆతని (మాటలాడకుండుట వలన) కొఱత వైచిరఁట.

పిదప నీతఁడుచలింపమి (తపోనియతియందే నిమగ్నుఁడైయుంట) గాంచి, వెఱచి రాజాకొరతందీయించివైచెనట. అతండు తపంబుచాలించి సంచరించుచు యమలోకమున కేగి యముని వలన బాల్యమున తూనీఁగలకుఁ జిన్నపుల్లలగుచ్చినదోషమున గొఱత ననుభవింపవలసివచ్చెనని యెరింగెనఁట. మాండవ్యుఁ డబ్బాల్యచేష్టకింత క్రూరదండనవిధించిన యముని శూద్రుడై జన్మించునట్లు శపించెనఁట. దానం జేసియముఁడు విదురుఁడుగ జన్మించె నఁట.

**మాండలేఖిగోత్రము** —(ఉపమన్యుగణము చూడుఁడు.)

**మాండవి**-శ్రీరామసోదరుఁడగు భరతుని భార్య. కుశధ్వజుని పుత్రిక. కుశధ్వజుఁడు మిథిలాధీశుఁ డగు జనక మహారాజుసోదరుఁడు. మాండవీదేవికి మాళవిక యనునామాంతరము గలదు.

**మాండులిగోత్రము**— (వశిష్ఠగణము చూడుఁడు.)

**మాండూకగోత్రము** —(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.)

**మాండూకబ్రహ్మి**- లా. Hydrocotyle Asiatica, ఆంగ్ల. Indian Penney work tree, సం. ఆదిత్యవల్లీ, బ్రాహ్మీ, మండూకపర్ణీ, మహాషధీ.

దీనికి ఆదిత్యభక్తి, వల్లారాకు, సరస్వతీయాకనియుఁగూడ వాడుకపేళ్లు కలవు.

దీనియాకునందు కాక, పైత్యము జేసి, విరేచనమును జేయు గుణము గలదనియు, ఉబ్బు, పాండువు, కామిల, చర్మరోగములు, కడుపులోనిబల్లలు, మాంద్యము, ఉన్మాదము, వెర్రి, పైత్యభ్రమల నడంచుశక్తి గలదనియు, కుష్ఠువ్యాధులపై మాండూకబ్రహ్మియాకుచూర్ణము, బలముగఁ బనిచేయుననియు, సెగ, సవాయి మొదలగు సుఖసంకటముల నాపుననియు, మొండిజాతికురుపులు, ముక్కులోని కంపు, పుండ్లు, గండమాలలు, గవదగ్రంధులు నివారించును. స్త్రీలఋతుదోషము నడంచి రక్తముఁ జక్కగ వెడలించుననియు చెప్పఁబడినది.

**మాండూకేయగోత్రము**- (జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు).

**మాండూకేయుఁడు**— ఋషి. ఇంద్రప్రమితిశిష్యుఁడు. ఋగ్వేదాధ్యేత.

**మాండూపురము** — మాళవ దేశపు మాండూపురము (సుల్తానులచరిత్రచూడుఁడు).

**మాండికగోత్రము**- (పరాశరగణము చూడుఁడు).

**మాండేటు ప్రదేశము** (Mandate Aria)--ఒకసేనను (ప్రభుత్వము) నుండియో లేక కొన్నిసందర్భములందు 'లీగాఫ్ నేషన్సు' సభవారినుండియో యొకదేశ మింకొకదేశకార్యముల నిర్వహించుచుండుటకు "మాండేటు అధారిటీ" యనియు, నట్టి ప్రదేశమునకు మాండేటుప్రదేశమనియు పేర్లు.

**మాంధర్యాగోత్రము**-(ఔతథ్య ఉపగణము జూడుఁడు.)

**మాంధాతగోత్రము** — (హరిత ఉపగణము జూడుఁడు.)

**మాంధాత చక్రవర్తి**—మరీచి ఇక్ష్వాకుల సంతతి. సూర్యవంశక్షత్రియుఁడు. మహా ప్రసిద్ధి వడసినచక్రవర్తియు,మహాతపస్వియగుఋషియు నైయుండెను. తండ్రి యువనాశ్వుఁడు. పితామహుఁడు పృథువు (త్రిధన్వుఁడు). కుమాళ్లు పురుకుత్సుఁడు (నర్మదభర్త), అంబరీషుఁడు, ముచికుందుఁడు నను ముగ్గురని కొన్నిచోట్లను, సుసన్ధి, ధ్రువసంధి, ప్రసేనచిత్తుఁడు, అంబరీషుఁడు నని నల్వురుగఁ గొన్నిచోట్లను చెప్పఁబడినది. భార్య బిందుమతీదేవి.

మాంధాతమహారాజుపేర నేటికిని నర్మదానదియందలి ద్వీపము (ఓంకారనాద శివలింగమున ఓంకారక్షేత్రము) మాంధాతద్వీప మనఁబరఁగుచున్నది. ఇట నామహర్షి గొప్ప తపంబొనరెనఁట. మఱియు హిమవత్పర్వతమున కైలాసశిఖరప్రాంతముల మానససరోవరమును పవిత్రపఱచి, తీర్థముగ నొనర్పఁదగిన తపంబొనర్చి, లోకహితార్థ మొసంగిన మహనీయుండీ మాంధాతయే. ఆసరోవరమీమహాత్మునిపేర నే "మానససరోవరంబు" నాఁబరఁగెడిని. మఱియు నాప్రాన్తముననే గరళపర్వతమున నొకగుహయందుఁ గొప్పతపంబొనర్చుటంజేసి తొల్లింట "గరళ పర్వత" మని పేరుండిన గిరి, నేటికిని నాఁడాదిగ "గరళమాంధాత పర్వత"మనియు పేరయ్యెను. అందుఁగల రెండుశిఖరములలో నొకటి, 'గరళశిఖర'మనియు,రెండవది"మాన్ధాతశిఖర"మనియుఁ బేరందియున్నవి. మఱియు నాతపంబొనర్చినపర్వతగుహయందే మాంధాత మహర్షి యస్తులు నేటికిని గానవయ్యెడిని. అట పితృశ్రాద్ధములొనర్చుచుందురు. అది పవిత్రక్షేత్రమై యున్నది. భార్య శశిబిందుమహారాజకుమార్తె యనియు, మాంధాత కేఁబది మంది కుమార్తె లనియు, వారందరు సౌభరి భార్య లనియుఁ జెప్పఁబడినది. షోడశ మహారాజులలో నొకఁడు. (మహారాజులు చూ.)



**మార్ భూమ్ జిల్లా**- (మానభూమిజిల్లా చూడుఁడు.)

**మాంసము తింటూరని దుమ్ములు మెడఁ గట్టుకొని తిరుగుదురా?**-(ఆంధ్ర లోకో.క్తి).

**మాంసరోహిణి**—(భూరుహము చూ).

**మాకండిసీమ**-(సామంతపంచకము చూ).

**మాకింటోష్**—ఒకజాతిరబ్బరుపూతగుడ్డ. (కలంకారి పరిశ్రమ జూడుఁడు).

**మాక్రోకోజమ్** (Macrocosm)— ప్రపంచక నిర్మాణపరిణామములఁ దెలుపు కళ.

**మాక్సువెల్ సిద్ధాంతము**(Maxwell Theory)— కాంతి కిరణములును (Light rays), ఉష్ణకిరణములును (Heat rays), ధ్వనిప్రమాణములును (Sound wave lengths) కూడ విద్యుత్ప్రసారము Electric flow) వంటి ప్రవాహమును గల్గినవే యని Maxwell పండితుఁడు నిరూపించెను. ఆమహనీయుఁడు విద్యుదయస్కాంతశక్తి వ్యాపించునటుల కాంతియణువులతరంగగమనద్వారమున నట్లె వ్యాపించు చున్నదని తెల్పెనని భావము.

ఈసందర్భమున ముందుగ"అణు"వననేమో వివరింపఁదగును. ఇవిభూపదార్థాణువులు గాని, జలసంబంధాణువులు(కణములు) కానేరవుకాంతి కిరణములందలివిగాని,ఉష్ణకిరణములందలివిగాని ధ్వనియందలివిగాని అత్యంత సూక్ష్మాంశమున

"కణు"వందురు. అది రేఖాగణితమునందు వివరింపఁబడిన "బిందు" (Point)తో పోల్పఁదగినదిగఁ జెప్పఁబడినది. అణువులతిసూక్ష్మములు. బిందునకు రేఖాగణితమున స్థాననిర్ణయమేకాని, కొలఁతి పరిమాణములు లేవని చెప్పఁబడినది.

కాని, పరిశీలకులు అణువునకుఁ గొలఁత యుండఁగల దనెదరు. మఱియు పైన చెప్పఁబడిన అణువునకు నిరంతరసంచలనవేగము కొంత గలదని భౌతికశాస్త్రజ్ఞులు పోల్చి యున్నారు.

త్రివిధములగు నణువులకుఁ గల సంచలనము (Flow) "స్వయంసంచలన" మనియు, "తరంగసంచలన" మనియు ద్వివిధములుగ నీ శాస్త్రజ్ఞులనెదరు. అనఁగా దీపము,సూర్యుఁడు, నక్షత్రములు మొదలగు ప్రకాశవంతమైన వస్తువులనుండి కాంతి ప్రసరించుట యన, దాని దీప్తియందలి అణువులు స్వయంసంచలనము ననో, తరంగసంచలనముననో, వ్యాపించుచు కండ్లకుందగిలి గాన్పించుట దీప్తినడఁచుట యని భావము. ఈప్రవాహమందలి అలలు నిమ్నోన్నతముగ (Wave motion) నుండునని పోల్పఁబడినది.

తరంగము లగునేని వాటి ప్రమాణము 1/50000 అంగుళప్రమాణముగ నున్నకడనుండి మానవనేత్రములకు గోచరము లగుచుండు ననియు, కాంతితరంగములు కంటికి కగుపడని వనేకము లుండుననియు, వాటితరంగాంతప్రమాణము మైళ్ళకొలఁదిగ నున్నను నేత్రములకగోచరము కావచ్చుననియు నందురు.

కాంతికిరణములందలి అణువులు గాని, వేఁడికిరణములయందలి అణువులు గాని, Photo Plate పైనఁ బూయఁబడిన ద్రావకములపైఁ బ్రసరింపఁజేయుతరి, ఆద్రావకాణువులు బాధింపఁబడుటయు, వేరుచేయఁబడుటయు, చెఱుపఁబడుటయు, మార్పు నందఁజేయంబడుటయు, భేదింపఁబడుటయు, కాంతికిరణాణువులందు సంచలనోద్రేకము కలదని తెలియుచున్నది. అనఁగా "అణుసంచలనోగ్రత" యని యెఱుంగునది. ఇది అణువులస్వయంచలనమున కొక సాదృశ్యము.

మరియుఁ గాంతికిరణములందలి అణువులు గాని, వేఁడికిరణములందలియణువులుగాని,కొన్ని యితరవస్తువులపైఁ బడుతరి, ఆవస్తువు లందలి యణువులను పైవిధమున బాధింపకుండుతరి, నద్దానిని తరంగసంచలముగా నెరుంగునది. ఇట్టి పరిశీలనలవలననణువులకు స్వయంసంచలనము, తరంగసంచలనము కూడ కల్గియుండునని తేలుచున్నది.

కొన్నివిధములగుశక్తిప్రసారములను స్వయంసంచలనముగనుమరికొన్నిటినితరంగసంచలనముగను నన్వయించుచున్నారు. ఇంకఁ గొన్నిఁటియందు ద్వివిధ సంచలనములు కూడ కలిసియుండునని యిటీవలి పరిశీలనలు బయల్పడఁజేసినవి. ఇక్కాలమున నణుసంచలనమువల్లనే యేపరివర్తన మైనను కల్గుచుండు ననుసిద్ధాంతము సర్వజనాంగీకృతమై యున్నది. "లెబిహెబాప్" పండితుఁ డీవిషయమై గొప్పపరిశీలన లొనర్చి, కాంతికిరణము లొక వస్తువుపైఁ బ్రసరింపఁ జేయఁబడినప్పుడు, మీఁదఁబడుకిరణములవల్ల నావస్తువునకుఁ గొంతయొత్తడి (భారపీడనము.) కల్గుచుండునని యంత్రసాధనముల ద్వారమున లెక్కించుచు ఋజువుపరచియున్నాఁడు. వెనుకటి భౌతికశాస్త్రపండితులుఅణువులకు స్థానచలనము మాత్ర ముండుననితలంచుచుండిరి.

ఈప్రకంపితతరంగచలనమునకుఁగూడకొంత గమనవేగమును కొంత చలనశక్తియుం గూడ కలదు. ఒక యణువునందలి ద్రవ్యభారపరిమి

తిని దాని చలనవేగముచే గుడించిన ఆ అణువు నందలి యుధృతి (Momentumత్వరితము) తేలగలదని లెక్కింపఁబడినది.

"లూయిడ్ బ్రోగ్నే పరిశీలకుఁడు విద్యుత్కణములకుఁగూడ స్వయంసంచలన ప్రసారమే గాక,తరంగసంచలన ప్రస్తారము(ప్రవాహము) కూడఁగలదని కనిపెట్టియున్నాఁడు. ఇంకను ఆపండితశిఖామణియే స్వయంసంచలనమునందున్న విద్యుత్కణము (అణువు) యొక్క ఉధృతి యెంత యెక్కువగ నుండునో, అనఁగా స్వయంసంచలనసముద్భూతతరంగసంచలనము యొక్క తరఁగాంతర ప్రమాణ మంతతక్కువగ నుండునని కనిపెట్టి బయల్పఱచి యున్నాఁడు. (ఈతరు చూడుఁడు, స్పెక్ట్రమ్ ఎనలైసెస్ చూడుఁడు.)

**మాగధీనది**—శోణభద్రానది. (మగధ రాజ్యము చూడుఁడు.)

**మాగధీభాష**— షట్ప్రాకృతభాషలలో నొకటి. (ప్రాకృతభేదములు చూడుఁడు- భాష లెనిమిదివిధములు చూడుఁడు.)

**మాగార్పిర్ మకరకుండము**- కరాచీ పట్టణమునుండి పదునొకండు మైళదూరమున ఈగ్రామము కలదు. సంస్కృతభాషలో మకర మనిన మొసలికర్థము. దానినుండి మాగార్ప దముగల్గెను. పీ రనిన పవిత్రతకర్థము. ఇదియంతయు మహమ్మదీయులచే నివసింపఁబడు సీమ. నిర్జలప్రదేశమగు నెడారిగనున్నది. ఈగ్రామమే నడుమ ఒయాసిస్‌వలె దోచును.

ఒక గోరువెచ్చని నీటియూట ఈప్రాంతముననే కలదు. ఆనీరొక మెరకయగు గుండము నందు చేరుకొనుచు, ఈ మాగార్పిరు మకరకుండమైనది. అం దేబదివరకు మకరములు వసించుచున్నవి. ఈజలధారనుండి అరమైలుదూరమున నెక్కువ వేడిగల నీటియూట వేరొకటి కలదు. ఈ రెండు నీటియూటలతేమనుండి అచటిచెట్లు చేమలు పెరిగి జీవించుచున్నవి.

గ్రామమునందు కొందరు మహమ్మదీయులు వసించుచున్నారు. వారే దీని యధికారులఁట. ఆదికాలమున నీజంతువులు బయటికిరుదెంచి మేకలు, గొర్రెలు, పశువులేగాక మనుష్యులంగూడ నారగింపమొదలిడ, నీగుండముజట్టు తోలుత మట్టిగోడను పిదప రాతిగోడను గట్టిరి. వీటియందొక మకరమును నాయక మను దానికి రాజాయని పేరిడిరి. దానిని మచ్చికజేసి దాని మూతికి సింధూరపురంగును తెల్లరంగును పూసియున్నారు. వీటికి మాంసాహారము వైచెదరు. పెక్కుఁడ్రి మకరకుండమును దర్శించుచుందురు. వారియీవినుండియే యీమహమ్మదీయ కుటుంబములు జీవించుచున్నవందురు. కరాచీ నుండి మాగార్పిరునకు మంచిబాటయు మోటార్ల ఏర్పాట్లును కలవు.

**మాగ్యారుజాతివారు**--హంగేరీదేశము చూడుఁడు.

**మాగీదర్భగోత్రము**— (కఁడిల గణము చూడుఁడు).

**మాఘపాదివారములనోము**— (నిర కనార్కవ్రతము చూడుఁడు).

**మాచవరపు పాపనామాత్య కవి**— ఆంధ్రకవులలోనాఘునికులందు పరిగణింపఁబడినవాఁడు. నందవరీక నియోగి బ్రాహ్మణుఁడు, శ్రీవత్ససగోత్రుఁడు. తండ్రిపేరు వేంకటాచలము. రచించినదినందవరీకచరిత్రమనుప్రబంధము.

**మాచిపత్రి**— లా Artemisia Indica, ఆంగ్ల. Worm wood, సం. బర్హపుష్పం, బర్హిచూడమ్, స్థానేయకః.

మాచిపత్రిచెట్టునకు నాగదవనమనియు వాడుకపేరు గలదు. ఆకులు వెన్నలరసము లేక కషాయము వ్రణములు, చర్మవ్యాధులు, కుష్టు రోగము, వాతనొప్పుల నివారించుటకుఁ బేరందినది. పిల్లలపుండ్లకు మాచిపత్రిరసము జెప్పిన మందు. మరియు, వరుసజ్వరములు, స్త్రీలఋతుబద్ధము, పసరు లోనికిచ్చిన నివారింపనగును.

ఆకులు వెచ్చజేసి కాపడము పెట్టుట, పైని వేసికట్టుటవలన కుళ్ళువ్రణములు మాన్పట్టుననియు, తలనొప్పి యాగుననియు, వాతపునొప్పులు హరించుననియు, కండ్లపైగట్టిన కండ్లమెరుపులు, పోటు, నివారణ మగుననియు, జెప్పఁబడినది.

అడవిమాచిపత్రికి లాటిన్భాషయందు 'Artemisia Vulgaris' అనియు, ఆంగ్లమున Wild worm wood అనియు, సంస్కృతమున 'వన్యదమన' మనిపేరందురు. దీనిరసము తలకుఁ బూసిన పిల్లల బాలపాపచిహ్నువ్యాధి కుదురునందురు.

**మాటకుమాటతెగులు, నీటికి నాచు తెగులు**—(ఆంధ్రలోకోక్తి).

**మాటగొప్పదేకాని మానిక పిచ్చ(చిన్నది)**—(ఆంధ్రలోకోక్తి).

**మాటలకు పేదరికములేదు**-(ఆంధ్రలోకోక్తి).

**మాటలతేటలు మాయింట, మాపటి భోజనములు మీయింట** — (ఆంధ్రలోకోక్తి.)

**మాతరగోత్రము** — (ఆర్ష్టిషేణగణము చూడుఁడు.)

**మాతరగ్నోత్రము** — (నిధ్రువగణము చూడుఁడు.)

**మాడభూషి నృసింహాచార్యకవి**— ఆంధ్రకవులలో నాధునికులందు పరిగణింపఁబడినవాఁడు. శ్రీవైష్ణవ బ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్ర నైధ్రువ కాశ్యపసగోత్రుఁడు. తండ్రిపేరు వేదాంతాచార్యులు. నూజవీడుసంస్థానాధిపతియగు శోభనాద్రిప్రభుని ప్రేరణమున "వల్లీపల్లవోల్లాస" మను ప్రబంధమును రచించెను. మాధుర్యవంతమగు కవిత్వము.

**మాడభూషి వేంకటాచార్యకవి**— ఆంధ్రకవులలో నాధునికులందుఁ బరిగణింపఁబడినవాఁడు. శ్రీవైష్ణవబ్రాహ్మణుఁడు. నైధ్రువ కాశ్యపసగోత్రుఁడు. తండ్రిపేరు నృసింహాచార్యులు. ఉభయభాషాపాండిత్యము గలవాఁడు. కాపురము పెంటపాఁడు. నూజవీడుసంస్థానవిద్వాంసుఁడై యుండినవాఁడు. విద్వానభినవపండితరాయబిరుదము గలవాఁడు. ద్విసంధాగ్రాహి. వ్యస్తాక్షరియం దష్టభాషలలో ప్రవీణతగలవాఁడు. నిర్దిష్టకవనము చెప్పఁగలవాఁడు. విద్వత్కవి. రచించినది భరతాభ్యుదయము.

**మాణిక్య గంగానదీతీర సుబ్రహ్మణ్య క్షేత్రము**-(కతార్గామా చూడుఁడు). సింహళ ద్వీపమునం దున్నది.

**మాణిక్యపురము**— పాంచాలములోని రావల్పిండిపురమునుండి దక్షిణముగా ౧౮మైళ్లు దూరమున నిప్పుడు 'మానికాల్యా' యను పేరు గల్గియున్న తావు.

ఇట బుద్ధభగవానుఁడు తొల్లింటిజన్మమున తిండిలేక శుష్కించియున్న యేడు పులిపిల్లలకు తనశరీరముఁ దినివేయ నిచ్చివేసెనఁట. ఇది యిప్పుడు బౌద్ధులవనములఁ గల్గియున్నది. అందు ప్రధానవనమును కనిష్కమహారాజు కట్టించెనఁట.

**మాణిగోత్రము**—(కుశికగణము చూ.)

**మాణివంశగోత్రము**-(శాండిలగణము చూడుఁడు.)

**మాతంగినీముద్ర**-యోగాభ్యాస విధానమునఁ జెప్పఁబడిన వింశతిముద్రలలో నొకటి.

కంఠములోతు నీటియం దేకాంతస్థలమున నిలువఁబడి నోటితో నీటిం బీల్చి నాశికారంధ్రములనుండి వెడలించుటయు, నాశికారంధ్రములతో నీటిం బీల్చి నోటితో వెడలించుటయు, నభ్యసించుట మాతంగినీముద్ర యనియు, దీని యభ్యాసమున నేనుఁగువలె యోగికి బలమొనఁగుననియు, శరీరారోగ్యము స్థిరపడుననియుఁ జెప్పఁబడినది.

**మాతలు (మాతృసమానలు)**-పంచ మాతలు:— ౧. ప్రభుపత్ని, ౨. అన్నభార్య, ౩. గురుపత్ని, ౪. భార్యతల్లి, ౫. తన్నుగన్న తల్లి పంచమాత లనఁబడుదురు.

సప్తమాతలు:—

శ్లో. మాతామహీ మాతులాని తథా మాతుశ్చ సోదరీ। శ్వశ్రూః పితామహీ జ్యేష్ఠా ధాత్రీచ గురవస్త్రియః॥

తల్లితల్లి, మేనమామభార్య, తల్లిసోదరి, భార్యతల్లి, తండ్రితల్లి, అన్నభార్య, గురుపత్నీ, వీరు సప్తమాత లనఁబడుదురు.

**మాతవచసగోత్రము**— (భరద్వాజఉపగణము చూడుఁడు).

**మాతులేయగోత్రము** - (గర్గ ఉపగణము చూడుఁడు).

**మాతృపుత్రన్యాయము**—ఇట్టి న్యాయము లనేకములు గలవు. సోదరన్యాయము. (అన్నదమ్ము లెట్లు మసలుదురో యట్లని భావము). మాతృపుత్రన్యాయము- (తల్లి కుమాళ్లెటుల మసలుదురో యట్లని భావము). భార్యాభర్తృన్యాయము-(భార్యాభర్త లెటుల మసలుదురో యట్లని భావము). గురుశిష్యన్యాయము- (గురుశిష్యు లెట్లు మసలుదురో యట్లని భావము) పోషకపోషితన్యాయము- (పోషించువాఁడు పోషింపఁబడువాఁడు నెట్లనోన్యము మసలుదురో యట్లని భావము). ప్రభుపాలితన్యాయము- (ప్రభువు పాలింపఁబడుప్రజలు నెట్లు మసలుదురో యట్లనిభావము).

**మాత్స్యగంధగోత్రము**— (శౌనక లేక గృత్సమదగణము చూడుఁడు).

**మాత్స్యన్యాయము**- చేపలలో పెద్దవి చిన్నవాటిని దినివేయుచుండును. బలాఢ్యుల వలన బలహీనులు లొత్తడిచేయఁబడుటఁ దెల్పుట కీన్యాయ ముపయోగించెదరు.

**మాత్స్యభావిగోత్రము**—(హారితఉపగణము చూడుఁడు).

**మాత్స్యక్షిసగోత్రము**— (భరద్వాజ ఉపగణము చూడుఁడు).

**మాతృప్తగోత్రము**-నిధ్రువగణముచూ.

**మాదన్న అక్కన్నగార్లు**- (అక్కన్న మాదన్నగార్లు చూడుఁడు).

**మాదయ్యగారి మల్లనకవి**— ఆంధ్రకవి. లాక్షణికుఁడు. మధ్యకవులందుఁ బరిగణింపఁబడినవాఁడు. శైవబ్రాహ్మణుఁడు. తండ్రిపేరు మాదయ్య. నియోగిశాఖ. కొండవీడు కాపురము. శ్రీకృష్ణరాయసార్వభౌమునికాలము వాఁడు. క్రీ.వె. ౧౫౪౦ వరకు నుండెనందురు. ఇంటిపేరు నాదిండ్లవారు. పేరు అప్పామాత్యుఁడు. తండ్రిపేరు మాదిరాజు. తల్లిపేరు కృష్ణమ్మ. ఈతఁడెచ్చటనో దండనాథుఁడుగను బిదప మంత్రిగనుగూడ నుండినవాఁడు. మాద

య్యగారి మల్లనయని వాడుకనందిన చెప్పఁబడినది. రచించినది మను ప్రబంధము. దీనిని నాదిండ్ల యప్పయామాత్యునకుఁ గృతి యిచ్చెను. కవిగురువు పేరఘోరశివాచార్యుఁడఁట.

**మాదాయనగోత్రము**- (వీతహవ్య లేక యాస్కగణము చూడుఁడు).

**మాదీఫలము(తురంజిదబ్బకాయ)**- మాదీఫలపుజాతియందు తియ్యనిరసముగలజాతియు, పుల్లనిరసముగల జాతియు నను రెండు భేదములు గాన్పించుచున్నవి. ఇవి గాక అధమపుజాతిగ నడవిమాదీఫల మొకటి గలదు.

లా. Citrus medica. సం.మాతులుంగః, సుపూరః.

మాదీఫలము త్రిదోషహరమనియు, చలువఁజేసి గుల్మముమొదలగు నుదరరోగములు మదాత్యయరోగము (అనఁగా తప్పదాగుడు వలన జనించు తలదిరుగు రోగము),మాంసగత వాతరోగము, మూలవ్యాధి, రక్తపైత్యము, శ్వాస కాసల నివారించుననియుఁ జెప్పఁబడినది. మేహశాంతికి పైత్యశాంతికి నిది పేరందినది. అడవిమాదీఫల మెక్కువ ముదిరిన పైతొక్క పైత్యము జేయునందురు.

**మాద్రి** — మద్రదేశాధీశుని కుమార్తె. శల్యునిచెల్లెలు. మిక్కిలి సౌందర్యవతి. పాండురాజుభార్య. ఆతనితో సహగమనమొనర్చినది. అశ్వనీదేవతలవలన నకుల సహదేవులఁ గనినది.

**మాధవత్రయము (త్రిమాధవక్షేత్రములు)**— ౧ ప్రయాగలోని త్రివేణీసంగమముకడనున్న వేణీమాధవస్వామిక్షేత్రము. ౨ కాశీలోని బిందుమాధవస్వామిక్షేత్రము. ౩ రామేశ్వరములోని సేతుమాధవస్వామిక్షేత్రము.

**మాధవప్రయాగ**—(పంచప్రయాగలు, ప్రయాగ చూడుఁడు).

**మాధవవ్యూహము** — రామానుజీయ వైష్ణవ, చైతన్యవైష్ణవ, మతధర్మములందు తదేకాత్మరూపమహావిష్ణువు అందు ద్వితీయ చతుర్వ్యూహములలో నొకటిగఁ జెప్పఁబడినది. దీనిని వాసుదేవ వ్యూహము లైదింటిలో నొక యుపవ్యూహమనియు, వైభవ విలాసమూర్తియనియు, వరుసగ గద, చక్ర, శంఖ, పద్మము లాయుధము లనియుఁ జెప్పఁబడినది.



(విష్ణుదేవాలయము లందలి విగ్రహముల చూడుఁడు).

**మాధవమంత్రికవి** — ఆంధ్రకవులలో నాధునికులందు పరిగణింపఁబడినవాఁడు. నియోగి బ్రాహ్మణుఁడు. తండ్రిపేరు గిరిమనమంత్రి. గోదావరీమండలనివాసి. రచించినది భగవద్గీత పద్యకావ్యము.

**మాధవి**— తండ్రి యయాతి మహారాజు. భర్త గాలవర్షి. కుమారుఁ డష్టకుఁడు.

—లా. Hiptage Madablota. సం.అతిముక్తః,అతిముక్తకః,కాముకా, చంద్రవల్లీ, భూమిమండపభూషణీ, భృంగప్రియా, మాధవీలతా, లతామాధవీ.

దీనికిఁబూవులగురివింద యని కొన్ని తావులఁ బేరుగల దందురు. మహారాష్ట్ర కర్ణాటదేశములలో గురివిందను మాధవీ, ఇంద్రగోచీ యను పేళ్ళు వాడుదురఁట. ఇంకను పోతువడ్లఅనియు, వడ్లయారాల యనియుంగూడ దీనినివాడువారు

గలరని తెలిసెడిని. దీని పూవులు చక్కనిపరిమళము గలవి. ఉద్యానవనములందు పొన్నచెట్టుకడ మాధవీలతను నాటి పెంచి దానికి వివాహ మొనర్తురు.

దీనిపూవులరసకషాయములం దుబ్బసమును చర్మవ్యాధులను, వాత మేహవాత నొప్పులను, పురుగులను నివారించుగుణము గలదని చెప్పఁబడినది. పూవులకై పూఁదోఁటలందు నాటి పెంచుదురు.

**మాధులగోత్రము** —(వీతహవ్య లేక యాస్కగణము చూడుఁడు.)

**మాధుక్షరగోత్రము** —(కారేణుపాలి ఉపగణము చూడుఁడు.)

**మాధుక్షరగోత్రము** —(ఔతథ్యఉపగణము చూడుఁడు.)

**మాధూకర్ణగోత్రము**· (భరద్వాజ ఉపగణము చూడుఁడు.)

**మాధూకేయగోత్రము** -(జమదగ్ని వత్స ఉపగణము చూడుఁడు).

**మాధూలగోత్రము**- అశ్మరథ్యగణము చూడుఁడు.

**మాధ్యందినగోత్రము**-(కుండినగణము చూడుఁడు).

**మాధ్యమిక బౌద్ధమతము** — ఇది చతుర్విధబౌద్ధమతములలో నొకటి. సర్వలక్షణములచే నీమతము బౌద్ధసిద్ధాంతము ననుసరించినది. (బౌద్ధమతము చూడుఁడు.)

బుద్ధభగవానుని తరువాతివారగు బౌద్ధపండితులలో నొకప్పుడు వివాదములు గల్గి,బౌద్ధులు నాల్గుతెగలవారైరి. వీరివిభేదము లొక్క జ్ఞానజ్ఞేయములగు నంతరార్థము (బుది లేక నాత్మ), బాహ్యార్థము (వెలుపలనుండు లేక బాహ్యగోచరములగు జగద్వస్తువు) లను గూర్చియే యుని యెఱుంగునది. ఇంకను వీరిలో నించుక నాచారభేదము లుండినను, నవి స్వల్పములు గాన పాటింపఁబడఁ జనవు. చతుర్విధబౌద్ధములన: ౧ మాధ్యమికబౌద్ధము, ౨ యోగాచారబౌద్ధము, ౩ సౌత్రాంతికబౌద్ధము,౪ వైభాషికబౌద్ధము సనునవి.

మాధ్యమిక బౌద్ధమతమునకు "సర్వశూన్యత్వవాదమత" మనిపేరు. జగము, బుద్ధి (ఆత్మ) యుఁ గలసి శూన్యమును క్షణికమును గాని స్థిరము, సత్యము నగునవి కావని యీమత సిద్ధాంతము.

ఈమతమున ౧ సత్తు, ౨ అసత్తు, ౩ సదసత్తు, ౪ సదసద్విలక్షణము నని నాల్గు పక్షములు జెప్పఁబడినవి.

౧ ప్రతీతిచే నుత్పన్నమైనది; (అనఁగా నిదివఱకే పుట్టియు, నిప్పు డునికి గల్గియున్నదియు నగుదానిని) "సత్తు"ని వాడెదరు.

౨ ఇదివఱకు నష్టమైన స్థితియం దుండి (అనఁగా నిదివఱకు నుత్పన్నమైయుండక)యుఁక నుత్పన్నము కానున్నదానిని "అస" త్తని వాడెదరు.

౩ పైఁజెప్పఁబడిన రెండులక్షణములఁ గల్గియున్నది "సదస" త్తని వాడెదరు.

౪ సదసద్విలక్షణము - పైఁజెప్పఁబడిన రెండులక్షణములుకూడ లేనిది 'సదసద్విలక్షణ' మనఁ బరఁగెడిని. మఱియు నీనాల్గుపక్షముల వలన బాధింపఁబడనిది "తత్త్వ"మను పేరఁ బరఁగునని చెప్పఁబడినది.

జగత్తును 'సత్' అనినచో నిదివఱకే ఉత్పత్తి కలిగి, యిప్పుడు స్థితియందున్నది గాన, తిరుగ నుత్పత్తియుండుట ప్రయోజనము లేదు గాన తత్త్వము కానేరదనియు,

జగత్తు 'అసత్' అనినచో నది పుట్టియు నసత్తే యగుటఁ జేసి యుత్పత్తివలన ప్రయోజనము లేదు గాన తత్త్వము గానేరదు.

జగత్తును 'సదసత్' అనినచో సత్తును, అసత్తును పరస్పరవిరోధము లగుటఁ జేసి రెంటికిని తాదాత్మ్యము (ఒకటి మఱియొకటి యగుట) కల్గుట యసంభవము (అనఁగా రెండును నగుట జరుగనేరదు) గాన తత్త్వము గానేరదు.

జగత్తును సదసద్విలక్షణ మనినచో నది వ్యవహారమాత్ర సత్యమగుటఁ జేసి వీలుకానిది గనె యనఁగా నుండినను నుండినది కావలెను, లేకుండిన లేకుండినది కావలెను కాని రెంటికిఁ దప్పిన దగుట యసంభవ మని భావము. ఇది భ్రాంతికల్పితమే యగుచు తత్త్వము కానేరదు.

కాన నీనాల్గుపక్షములచే (సాధింపఁబడక) బాధింపఁబడిన జగత్తు "అసత్తు తుచ్ఛ" మన బరఁగి, తత్త్వముకాక, నసత్యమై శూన్యమై దన రునని యీమతాభిప్రాయము. జగము,బుద్ధియు గలసి శూన్యమనియు (అభావాపత్తి), దాని నెఱుంగుట మోక్షమనియు, నీమతసిద్ధాంతము. సర్వమును "క్షణిక" మను మొదలగు తక్కిన ధర్మములన్నియు బౌద్ధమతమునందు జెప్పబడినవి.

**మాధ్యోదగోత్రము** — (జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు).

## మాధ్వ వైష్ణవ పుణ్య (మృతతిథి) దినములు -

| | | | | |
|---|---|---|---|---|
| ౧. | చైత్రశుద్ధ | ద్వితీయ | వేదవ్యాసతీర్థుల | పుణ్యదినము. |
| ౨. | ,, | నవమి | కవీంద్ర | ,, |
| ౩. | ,, | త్రయోదశి | సత్యవ్రత | ,, |
| ౪. | బహుళ | తృతీయ | వాగీశ | ,, |
| ౫. | ,, | త్రయోదశి | సత్యవిజయ | ,, |
| ౬. | వైశాఖ శుద్ధ | తృతీయ | విద్యాధిరాజతీర్థుల | ,, |
| ౭. | జ్యేష్ఠ శుద్ధ | ద్వితీయ | సత్యసంధ | ,, |
| ౮. | ,, బహుళ | ద్వితీయ | సత్యపూర్ణ | ,, |
| ౯. | ,, | తృ | రఘువర్య | ,, |
| ౧౦. | ఆషాఢ శుద్ధ | నవమి | సత్యాధిరాజ | ,, |
| ౧౧. | ,, బహుళ | పంచమి | శ్రీజయ | ,, |
| ౧౨. | శ్రావణ శుద్ధ | పాడ్యమి | రాఘవేంద్ర | ,, |
| ౧౩. | ,, | సప్తమి | సత్యవర | ,, |
| ౧౪. | ,, | దశమి | సత్యేష్టకామ | ,, |
| ౧౫. | ,, బహుళ | అమావా | మాధవతీర్థుల | ,, |
| ౧౬. | ఆశ్వయుజ శుద్ధ | సప్తమి | సత్యపరాయణ | ,, |
| ౧౭. | ,, | అష్టమి | తెలియదు. | |
| ౧౮. | కార్తీక శుద్ధ | దశమి | సత్యవరతీర్థ | ,, |
| ౧౯. | ,, | చతుర్దశి | వేదనిధి | ,, |

| | | | | |
|---|---|---|---|---|
| ౨౦. | కార్తీ బహుళ | తృతీయ | విద్యానిధి | పుణ్యదినము |
| ౨౧. | ,, | చతుర్దశి | పద్మనాభ | ,, |
| ౨౨ | మార్గశిర శుద్ధ | యేకాదశి | సత్యనిధితీర్థుల | ,, |
| ౨౩. | ,, | ద్వాదశి | రఘునాథ | ,, |
| ౨౪. | పుష్య శుద్ధ | ద్వితీయ | రఘూత్తమ | ,, |
| ౨౫. | ,, బహుళ | షష్ఠి | సత్యకామ | ,, |
| ౨౬. | ,, | నవమి | నరహరి | ,, |
| ౨౭. | ,, | చతుర్దశి | విద్యాధీశ | ,, |
| ౨౮. | | అమావాశ్య | పురందరదాస | ,, |
| ౨౯. | మాఘశుద్ధ | నవమి (మధ్వనవమి) | ఆనందతీర్థుల | ,, |
| ౩౦. | ఫాల్గుణశుద్ధ | ద్వితీయ | సత్యబోధతీరుల | ,, |
| ౩౧. | ,, | తృతీయ | వాదిరాజస్వామి | ,, |
| ౩౨. | ,, | చతుర్థి | వ్యాసరాయస్వామితీర్థుల | ,, |
| ౩౩. | ,, | షష్ఠి | సత్యవ్రతతీర్థుల | ,, |

**మానసగోత్రము** -(నిధృవగణము చూ).

**మానసభిద్యగోత్రము** — (భరద్వాజ ఉపగణము జూడుఁడు).

**మానభూమిజిల్లా (మానభూమ్జిల్లా)**- (చోటానాగపూరుప్రోవిన్సు చూడుఁడు)

**మానవధర్మనియతుల శాస్త్రము** (Ethics)- ఒకనిమనస్సును శోధించుటయు నీ శాస్త్రములోనిదే. మనుష్యుని జీవితధర్మముల నియతులఁగూర్చి చర్చించు శాస్త్రము.

**మానవధర్మపంచకము**-౧. మతధర్మము, ౨. జాతి (లేక కుల)ధర్మము, ౩. ఆశ్రమధర్మము, ౪. దేశధర్మము, ౫. గుణధర్మము.

౧. మతధర్మము-సర్వము నుత్యజించియైనను తన మతధర్మములను ప్రధానముగ నాచరింపవలయును.

౨. జాతిధర్మము-స్వకులధర్మములు తర్వాత నాచరింపఁదగినవి.

౩. ఆశ్రమధర్మము- బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్యాసాశ్రమములలోఁ దానేయాశ్రమమున నున్నాఁడో యాధర్మము తర్వాత ప్రధానమైనది.

౪. దేశధర్మము-తానేదేశమున వసించుచుండునో యాదేశధర్మ(ఆచారము)ముఁ బిదప నాచరణీయము.

౫. గుణధర్మము - లోకసామాన్యములై జనులకందఱకు నవసరములగు నాచారములు పిదపఁ బ్రాముఖ్యతను వహించెడిని.

జ్ఞానవంతుఁడగుచో నీధర్మములనొక్కొక్కటిగ వదలివేయవచ్చు ననియు, నట్లు వదలివేయుటలో తొలుత గుణధర్మమును, పిదప దేశధర్మమును, తరువాత ఆశ్రమధర్మమును, పిదప జాతిధర్మమును, వీడవచ్చుఁ గాని మతధర్మము నెప్పుడును వీడరాదని చెప్పఁబడినది.

**మానసకులగోత్రము** — (మన్యుకుల చూడుఁడు.)

**మానసదేవీక్షేత్రము (మణిమజ్ర)**- పంజాబు దేశమున నంబల్లాజిల్లా, ఖరార్ తహ

శ్శీలునందు 'మణిమజ్రి'యను గ్రామమునం దీ సుప్రసిద్ధ దేవీక్షేత్రము గలదు. ఇది యుంబల్లా కుత్తరమున ౨౩ మైళ్ళదూరము. ఏటేట నిట గొప్ప యాత్ర జరుగును.

**మానసరోవరము**— (రఖస్థల్- రావణాసురుఁడు చూడుఁడు).

**మానసరోవరము** —మాంధాతచక్రవర్తి యిట గొప్పతపం బొనర్చి దీనికి పవిత్రతఁ గల్పించుటచే నామహాత్ముని పేరఁ బరఁగుచున్న పవిత్రసరోవరము. ఇట్టిదియే యగు "రఖస్థల్'



(తొల్లింటి రావణహ్రదము) సింహలద్వీపరాజ్యమేలిన రావణభూపతి పేరఁ బరఁగుచున్నది. ఇది దేవతాపక్షావలంబులగు వారికై పవిత్ర పఱుపఁబడినది. ఆ మాంధాతమహర్షి యొనుకలిటకుఁ గొంతదూరమునఁగల గరళమాంధాత పర్వతమందలి మాందాతశిఖరము దెస నున్న గుహాయందున్నవి. అటనే యామహానీయుఁడు యోగవిధానసిద్ది నొందెనఁట.అట బితర్కనల నొనర్చుచుందురు. దానికి"జ్ఞానగుహా"యనిపేరు

మానసరోవరము రావణహ్రదమంత వైశాల్యము గలదిగనే గన్పించెడిని. భరతదేశము నుండి కైలాసశిఖరదర్శనమున కేగు యాత్రా మార్గమున "తకలాకోట" నుండి 36 మైళ్ళ దూరమునను, ఆల్మోడానుండి 227 మైళ్ళదూరమునను నుండును. ఈ రెండు సరస్సులకును నడుమ దూరము రెండు లేక మూఁడుమైళ్లుండెడిని. తకలాకోటనుండి కైలాసగిరి కేగుమార్గ మీ రెండుసరస్సుల నడుమ నుండియే యేగును. ఈ రెండుసరస్సులును టిబెట్టుదేశములోనివే.

మానసరోవరపుఁ టొడ్లు(తీరములు)తిన్నగ వంకరలేక యుండి, సరస్సంతయు నొకపల్లమున నిలిచిన నీటివలె నగపడుచుండును. మఱియు నిందు ద్వీపములు లేవు. ఎక్కువలోతగుచోట ౨౬౪ అడుగు లుండునని చెప్పఁబడినది. ఈ సరస్సుచుట్టును వేఁడినీళ్ళయూట లనేకము లుద్భవించి యిందు గలియుటంజేసి యుదకములు సమశీతోష్ణతంగల్గి స్నానమొనర్ప సౌఖ్యముగ నుండెడిని. ఇందు కెరటములు మెండుగ నెగురుచు, మొలలోతు జలముల



నిలువఁబడినవారి తలపై నలలు విఱిగి పడుచుండెడిని. నీరు మాధుర్యవంతము. ఈ ప్రాంతముల హంసలు వసించుచుండెడిని.

మానసరోవర తీరమున నెన్మిది బౌద్ధమఠములు గలవు. సరస్సునందలి జలములు పైకి వెడల మార్గములేదు. ఇం దుత్పన్నమగు నదులును లేవు. మఱియుఁ గైలాస పర్వతమునుండి యప్పటప్పట మంచుకరఁగి, యానీరొకపల్లమున బడి యుండే చేరుచుండు నందురు. టిబెట్టు దేశస్థులీ సరస్సును "మాంతాలో" యనియు, "మాబాంగ్" అనియు నందురు. సముద్రపు నీటిమట్టముపై ౧౪౯౦౦ అడుగుల యెత్తుప్రదేశమునం దున్నది. ఇటకుఁ గైలాసపర్వత మేడు మైళ్లుండు నందురు. (రఖస్థల్ చూడుఁడు.)

**మానాఘాటికనుమమార్గము** —ఇది హిమాలయపర్వతఁపుఁ గనుమమార్గము. గడవాలుజిల్లానుండి మానసరోవరమున కరుగు యాత్రికు లీమార్గమునఁ జనుచుందురు. సముద్రఁపునీటిమట్టముపైఁ బదునెన్మిదివేలయడుగుల యెత్తని చెప్పఁబడినది.

**మానాటికాపులు**—(తెలగాలు చూ.)

**మానాధీనామేయసిద్ధిః ప్రమాణాధీనాప్రమేయసిద్ధిః**—ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి. కొలఁత కొలపాత్ర యధీన

మును, ప్రమేయము ప్రమాణాధీనమును నైయుండునని తాత్పర్యము. కొలపాత్రతోఁ గొలిచి, యింతయున్నదని నిర్ధారణ యొనర్తురు. ప్రత్యక్షానుమానాది ప్రమాణములచే ఋజువుపఱిచి, ప్రమేయమును సిద్ధాంతముచేతురు గాన, నవి వాట్లయధీనములని చెప్పఁబడినది.

**మానాధీనామేయసిద్ధిరితి న్యాయము** — ఒకవస్తువుం గొలువవలయు ననిన, ముందుగఁ గొలుచువానికిఁ గొలఁతఁగూర్చిన జ్ఞాన ముండుట యత్యవసరము. ఇట్టి జ్ఞానావసరస్థితులం దీన్యాయము వర్తించును.

**మానిపోయినపుండు మరల రేఁపినట్లు**— (ఆంధ్రలోకోక్తి).

**మానుప్పు**— దీనిని కొందరాంగ్లమున (Impure carbonate of Potash) అని చెప్పుదురు. అఱఁటిమట్టలు, కొబ్బరియాకులు మొదలగు కొన్నిటి గాల్చినరొయ్యినుండి తీసినక్షారము.

లోనికిచ్చిన మూత్రనిరోధము వాపుననియు పైకిఁబూసిన గడ్డలు కరఁగుననియు నందురు. మఱియునీయుప్పుతో ద్రావకముఁ దీయుదురఁట.

**మానేయగోత్రము**-(ఉపమన్యు గణము చూడుఁడు.)

**మానోస్**—(ల్లానోస్ చూఁడుడు.)

**మాన్యఖేటపురము (మాలేఖడ్)**— మహారాష్ట్రదేశము జూడుఁడు.)

**మాన్చెస్టరుషిప్పు కెనాల్** (Manchester-ship Cannal) — సముద్రపుటోడలు తిన్నగా మాంచెస్టరుపురమునకరుగుటకు త్రవ్వఁబడిన జలమార్గము. ముప్పదియైదున్నరమైళ్ళ పొడవు, నూటయిరువదియడుగుల వెడలుపు, సిరువదియెన్మిదడుగులలోతుఁ గలది. బ్రిటనుద్వీపములోనిది.

**మామంధరేషణగోత్రము**—(ఔతథ్య ఉపగణము చూడుఁడు).

**మామంధరేషణగోత్రము**- (కౌమస్థ ఉపగణము చూడుఁడు).

**మామన్యుగోత్రము**--(భారద్వాజ ఉపగణము చూడుఁడు).

**మామికగోత్రము**- (పాణిక ఉపగణము చూడుఁడు.

**మామిడిచెట్టు**— మామిడిచెట్టాంధ్రదేశమున సుప్రసిద్ధము. మామిడిపండ్లనీదేశమునం దెరుగనివా రుండరు. మామిడిచెట్ల జాతిభేదములకులెక్కలేదు. ఇటీవల వీటినంట్లుగట్టుచు చాల యభివృద్ధిజేసిరి. ఈ యభివృద్ధి యాంధ్రదేశమున విశాఖపట్టణ మండలమునఁ నలమండయనఁబడు గ్రామమున నారంభమై, నలుదిశలకు వ్యాపించి యంటుమామిడియనఁబడు పేరఁబరగి రెండువందలవరకు భేదజాతులు బెరిగి యేర్పడినట్లు తెలిసెడిని.

మామిడిపండ్లయందు తీయనిరసము గల జాతులు శ్రేష్ఠములుగను, పులుపుజాతు లధమఁపుఁజాతులుగను, వసవాసనయు, పీచు టెంకలు పెద్దవిగనుండి రసము తక్కువగ నుండు హీనజాతు లధమాధమపు జాతులుగను గలంపఁబడుచున్నవి. అంటుమామిడిపండ్లయందుబీచుండదు. రుచిభేదములచేతను కాయలరూపభేదములచేను పరిమాణభేదములచేతను పండినతరిఁ గన్పించు రంగులభేదములచేతను నంటుమామిడిజాతులఁ బోల్తురు. ఏజాతి పెనను టెంకలం బాతి రెండు సంవత్సరముల మొక్కలుగ బెంచి గోలెములలోనె వలసినజాతి యంటుమామిడి చెట్టు క్రింద గోలెములతో ప్రాతి కొమ్మల కంటుగట్టుదురు. కోసిన కోతలు మాని రెండంట్లును గలిసి గాయముమానినపిదప పైకొమ్మకు జెట్టుతోసం

బంధమును క్రింది మొక్కకు తలభాగమునుగోసి వేసి గాయములు మాన్పి భూమిపైనాటి తోట వేయుదురు. పై కొమ్మజాతికాయలనే యది కాచుచుండును. ఇవి యంటుమామిడులు.

ఇంక పుల్లనిరసముగల జాతులకాయ లూర గాయకు శ్రేష్ఠములుగ నెంతురు. లా. Mangnifera Indica, ఆంగ్ల. mango tree, సం. ఆమ్రః, పికదేవః, పికప్రియః, పికబంధుః, పికమహోత్సవః, చూతః, పికరాగః, పికవల్లభః, రసాఢ్యః, రసాలః, రసికా, వనోత్సవః అనుపదములు చూతసామాన్యమునకును 'వనేజ్యః' అనుపదము బహురసాల మనుజాతిమామిడికిని, "కోశామ్రః" అనుపద మడవిమామిడి యనఁబడు తుమ్మెదమామిడికిని పేళ్లు. అడవిమామిడికి లాటి న్భాషయందు 'Magnifera Sylvatica అనియు, నాంగ్లమున 'Wild mango అనియు నందురు. ఇది చాల చిన్న కాయలఁ గాచును. అడవిమామిడిపండ్లు పులుపుకూడ నగును. ఈజాతి మధ్యరాష్ట్రమునం దెచ్చటజూడ నచ్చట గానవచ్చెడిని.

మామిడిచెటుకఱ్ఱ బల్లలు, కమ్ములుగఁగూడఁ జేయఁబడి, బీదలయిండ్లకు తల్పులు, ద్వారబంధములుగఁ జేయఁబడును గాని కొంతవరకు విలువఁ గల్గియుండును. హిందువుల యిండ్లలో శుభకార్యములకు మామిడాకులు ద్వారములకడ తోరణములు గట్టి యలంకరింతురు. మామిడికఱ్ఱ వంటచెఱకుగ నుపయోగింతురు. ఇంక నెన్నియో యుపయోగములు గలవందురు.

అంటుమామిడిజాతులు క్రొత్తక్రొత్త వేర్పడుచున్నకొలఁది పేళ్లును నధికముగ నేర్పడుచున్నవి. అవి యొక్కొకచోటనే అణఁగియుండుంగాని దేశమంతటను వ్యాపించలేదు. ఆ జాతులును వ్యాపించకున్నవి. సుప్రసిద్ధములగు నవి మాత్ర మిూ క్రింద వివరించితిమి:-

ఇమామ్‌పసందు, ఏండ్రాప్రసు, ఉవ్వ, జహాంగీర్, సువర్ణ లేఖ, సన్నాకులు, సఫారంగు, రాజమామిడి, పలకదంతం, పంచదారకలశ, బంగినపల్లి, బొరామాసి, నీలం, గోవా, నల్లగాజులయేండ్రాప్రసు, మూర్జహాను, నాయుడంటు, మూజవీడు, కలక్టరు, కొబ్బరిమామిడి, కొహిమూరు, గజశిరస్సులు, గన్నేరులు, గోవాలు, తగరంపూడి, పిన్నరసం, పెద్దరసం, హిమాద్రిపసందు మొదలగునవి.

మామిడిచిగుళ్ళు లేక ఆకుల కషాయము వాత, పైత్య, మేహముల నుపశమింప జేసి యించుకవిరేచనబద్ధమునుగల్గించునవియు, నోట నుంచి పుక్కిలించుచుండిన దంతరోగముల నివారించి పండ్లకు చిగుళ్ళకుందు గట్టిపరచుననియు, నాకులపొగ గొంతునొప్పిని వారించుననియుఁ జెప్పఁబడినది. చెక్క రస, కషాయ, చూర్ణము లాము వాతమును హరించి, నీళ్ళవిరేచనములం గట్టునవియు స్త్రీల ఋతురక్తస్రావముంగట్టి కుసుమరోగము నివారించు ననియు జెప్పఁబడినది. మామిడిచిగురు చర్మరోగములను కాళ్ళపగుళ్ళను నివారించునందురు. మామిడి టెంకలలోని జీడి(పలుకులు) చలవజేసి విరేచనబద్ధముగల్గించును. స్త్రీలయధికఋతురక్తస్రావమును నివారించుననియు నీళ్ళవిరేచనములఁ గట్టుననియు నుబ్బసముహరించుననియునందురు.

మామిడికాయ లేఁతది (పింజ, అంబకొంత) గ్రాహణిం గట్టుననియు టెంకగట్టినది కఫము నుద్రేకించి యించుకనొప్పులఁగల్గించి విరేచనబద్ధము, నొక్కొకశరీరమునకు రక్తపైత్యమును గల్గించును. మజ్జిగయు నుప్పును దీనికిఁ బరిహారములని చెప్పఁబడినది.

మామిడికాయ తొడిమనుండి జీడి కారును. ఇది శరీరముపైబడిన చిమచిమలాడి పొక్కుట

యుఁగలదు. ఈపొక్కులు కొబ్బరిఆకుల రసము ను, కొబ్బరిపుచ్చె, లేక కొబ్బరిపెంకుగంధము ను పైని రాయుటవలన నివారణ మగును.

కాస, గ్రహణి, నేత్రరోగము, పైత్య రోగము, మూత్రవ్యాధి, రక్తపైత్యము, వాత రోగము, విసర్పి, శ్వాసరోగము గలవారు పచ్చిమామిడికాయలతినరాదని నిషేధింపఁబడి నది. మఱియు రసముగాని, రసముగలిసినఔష ధములుగాని యుదివఱకుఁ దినియున్నవారును పచ్చిమామిడికాయల తినరాదు.

తియ్యనిమామిడిపండు వాతదోషమును, తల నొప్పి, బద్ధకముల నివారించి విరేచనము గావిం చుననియు, ద్వంద్వరోగులకు, వాతశ్లేష్మతత్వ ములుగలవారికిని, నపథ్యమై కడుపుబ్బరము, కామిల, పాండువు, ఆమదోషము, శ్లేష్మోద్రేకముఁ గల్గించుననియు, పుల్లనిరసముగల మామిడిపం డ్లపథ్యమై యామదోషము, కామిల, పాండు, పైత్యము, శీతపైత్యములఁ గల్గించు ననియుఁ జెప్పఁబడినది.

మామిడిపండ్లరస మొసఁగిన తాంబూలం దును నీగుణములే యుండును. మామిడిపిందె లెండించినవి (వడపిందెలు) విరేచనబద్ధము గల్గించును. గ్రహణిం గట్టును. వీర్యమును గట్టి పడఁ జేయును. ఇంద్రియనష్టము, శీఘ్రస్ఖల నము, మూత్రముతో నింద్రియముపడిపోవుట, యతిమూత్రరోగము నివారించునందురు. మా మిడిపూవు పైత్యశాంతి, మేహశాంతి, విరేచన బద్ధము, గల్గించి దంతరోగముల మాన్పును.

మామిడివలనఁగలుగు దోషములకు నెయ్యి, వరివేళ్లకషాయము, పాలు, శొంఠి, యువ్వా, చల్ల, యేలకులు, సైంధవలవణము, సౌవర్చ లవణము, పరిహారములనియు, నంటుమామిడి పండ్లు చక్కఁగఁబండినవి యేదోషముఁజేయక పథ్యమైయుండుననియు నందురు.

## మామిడి సింగన్న మంత్రి వంశవృక్షము (భారద్వాజగోత్రము)

(శృంగారనైషధములో శ్రీనాథమహాకవిచే వర్ణింపఁబడినది).

పెదతూర్కన్న మంత్రి

పెద్దప్రభుఁడు

మామిడన్న

పెద్దనామాత్యుఁడు. భార్య తల్లమ్మ. ఈతఁడు అనవేమారెడ్డికడ మంత్రిత్వము చేసినవాఁడు

వీరభద్రుఁడు

మారనమంత్రి

వామనమంత్రి. వేమారెడ్డి ప్రభునికడ మంత్రిత్వము చేసిన వాఁడు

వేమమంత్రి

ప్రెగ్గడదండనాథుఁడు

సింగనమంత్రి. (శృంగార నైషధము క

**మాఁమెనవేరు లేక దుంప**—దీనినాంగ్లమున 'Maghali Root' అనియు అరవమున 'మఃఘాళీకిషంగు' అనియు, నందురు. సుగన్ధి వలెనే సువాసన గల్గియుండు ననియు, మేహ శాంతిని గల్గించుననియు నందురు. దీని లేఁత వేరు లేక దుంపల నూరుగాయఁ జేతురఁట.

**మాయశరావి గోత్రము**--(ఉపమన్యు గణము చూడుఁడు).

**మాయావస్థలు ఏడు (సప్తమాయావస్థలు)**—౧. అజ్ఞానము, (జ్ఞానశూన్యత) ౨. ఆవరణము, (విచారణచేయకుండు బాధ్యత లేమి) ౩. విక్షేపము, (తెలుసుకొన నాతురత గల్గునవస్థ) ౪. పరోక్షజ్ఞానము, (పరమేశ్వరునిఁ గూర్చిన మిక్కిలియూహాలుగల్గు నవస్థ) ౫. అపరోక్షజ్ఞానము, (జ్ఞానచిహ్నములు) ౬. దుఃఖనివృత్తి, (జ్ఞానముగల్గుచున్న మనశ్శాంతి) ౭. ఆనందము, (జ్ఞానముగల్గుచున్నదను నానందము.)

**మారఖండము**—దీని నిక్కాలమునఁ 'సమర్ఖండ్' అనుచున్నారు. మహమ్మదీయాక్రాన్తమైన దేశము. శాకద్వీప మని తొల్లింటి పేరని పరిశోధకులు బోల్చియున్నారు. దీనిం గూర్చి "Rawlinson's five great monarchies" అనుగ్రంథమున IV సంపుటము, ౫౬ పుటయందు చర్చింపఁబడినది.

**మారనకవి**—ఆంధ్రకవులందు పూర్వకవులలోఁ బరిగణింపఁబడినవాఁడు. నియోగిబ్రాహ్మణుఁడు. తండ్రిపేరు తిక్కన. మారన తిక్కన శిష్యుఁడు. క్రీ. శ. పదమూఁడవ శతాబ్దాంత కాలమున నుండినవాఁడు. ఈకవి రచించినది యాంధ్ర మార్కండేయ పురాణము. దీనిని కాకతీయప్రతాపరుద్రనృపతి సేనానాయకుఁడగు నాగయగన్న సేనానికిఁ గృతినిచ్చెను.

మలసేనాని

నాగయసేనాని
(మేచకనాయిక పుత్రికకు భర్త).

ఎల్లయసేనాని  మేచయసేనాని  గన్నసేనాని (కృతిభర్త)

వీరు శూద్రకులజులు. మారనకవిచే మార్కండేయపురాణమును కృతినందినవాఁడు.

**మారపురము**—బంగాళ దేశమునందలి ప్రద్యుమ్న నగరమున (ఇప్పటి పాండువా) కిది యాదిపేరు. బుద్ధభగవానునితండ్రిశుద్ధోదనునకు పిదప నాయనసోదరుఁడగు నమితోదనునిపుత్రుఁడగు పాండుశాక్యుఁడుకపిలవస్తుభూపతియై, యట నుండి పారిపోయివచ్చి గంగకివ్వల మారపురమును నిర్మించి, పిదపఁ బ్రద్యోతనగరమని పేరు మార్చెనని యందురు. ఇప్పుడాయన పేరిటనే పాండువా యనఁబడుచున్నది. అవధానకల్పలత అధ్యా. ౧౧ యందును Spence Hardys Manual of Buddhism Page 293 యందును, నాయనకు మహానాముండనుపేరు వాడఁబడియుంట గాననగును.

**మారయ్యమంత్రి కవి**--ఆంధ్రకవులలో నాధునికులందుఁ బరిగణింపఁబడినవాఁడు. నియోగిబ్రాహ్మణుఁడు. తండ్రిపేరు సర్వయామాత్యుఁడు. రచించినది మైరావణచరిత్రము. పద్యకావ్యము.

**మారణాయ గృహీతోఽఙ్గచ్ఛేదం స్వీకరోతీతిన్యాయము**-- చంపఁబడుటకు గాను దొరకిపోయిన వాఁడొక యవయవము గోల్పోయి తప్పించుకొనుటకు సంతోషముతో నంగీకరించె నని యర్థము.

అంతయుఁ గోల్పోవుటకన్నఁ గొంతనష్ట

ముతో తప్పించుకొనుట శ్రేయమని భావము.

**మారాయణగోత్రము**—(ఉపమన్యు గణము చూడుడు).

**మారాయణగోత్రము**-(నిధ్రువ గణము చూడుడు).

**మారిటైమ్‌లీయెన్**(Maritime Lien) వాణిజ్యసంబంధ పరిభాషాపదము. ఓడగమన మందలి సాహసములవలనఁ గల్గిన ఫలితముగ Salrage Damage మొదలగువానికై నోడపై నిర్బంధించి వసూలొనర్చుటకు నోడను జప్తు, యేలముద్వారా సొమ్ము రాబట్టుకొనుటకు దావా (Claim).

**మారీవగోత్రము**-(నిధ్రువగణముఁ జూ.)

**మారీష**—తండ్రి కండుఁడనుమహర్షి. తల్లి ప్రమ్లోచ యను నప్సరస్త్రీ. కారణాంతరమున పదిమందిసోదరు (సమానరూపగుణనామములు గల)లగు ప్రచేతసులకు భార్యయై, దక్షప్రజాపతిని సుతుని గబడసెను. ఈతఁడు రెండవదక్ష ప్రజాపతి. బ్రహ్మమానసపుత్రుఁడగు దక్షుఁడే యిటుల రెండవదక్షుఁడై కారణాంతరమున నీమె గర్భమున జన్మించెనని చెప్పఁబడినది.

మఱియు వసుదేవునితల్లి పేరును మారీషయే. ఈమె భర్తశూరుఁడు లేక శూరసేనుఁడు. యదు సంతతి. చంద్రవంశ క్షత్రియుఁడు.

**మార్కటిగోత్రము**--(గర్గ ఉపగణము చూడుడు.)

**మార్కండిగోత్రము**-(భరద్వాజ ఉపగణము చూడుడు).

**మార్కండేయగోత్రము**-(జమదగ్ని వత్స ఉపగణము చూడుడు.)

**మార్కండేయపురాణము**-ఇది లింగ కూర్మ పురాణములందెనిమిదవదిగను శివపురాణమున నారవదిగను దేవీభాగవతమున రెండవదిగను తక్కిన పురాణములం దేడవదిగను జెప్పఁబడినది. మార్కండేయుఁడు క్రోష్టికిఁ జెప్పినది. గ్రంథసంఖ్య యెల్లెడలను తొమ్మిదివేలనియె కలదు.

**మార్కండేయమహర్షి**—తండ్రి మృకండర్షి. తల్లి మనస్విని. బహుతపస్వియై యోగసిద్ధి నొందినవాఁడు. భార్యపేరు ధూమ్రావతి యనియు, కుమారునిపేరు వేదశిరుఁ డనియుఁ, గొన్నితావులందు జెప్పఁబడియున్నది.

మార్కండేయుని తండ్రిపేరు మృకండుఁడనియు, పితామహుఁడు ధాతయనియు, పితామహి యాయతి యనియు, బ్రపితామహుఁడు భృగు మహర్షి యనియుఁ జెప్పఁబడినది.

**మార్కండేయనది (వేత్రవతీనది)**-(దశార్ణదేశము చూడుడు).

**మార్కండేయాశ్రమము**- మార్కండేయర్షి పరమేశ్వరుఁగూర్చి ఘోరతపమాచరించి చిరకాలజీవియగునట్లు వరముఁబడసెనని బృహచ్ఛివపురాణమున ఉత్తర. 33 అధ్యాయమున జెప్పఁబడినది. ఆతావు లెక్కడనో సరిగ దెలియరాకున్నది. మహాభారతము వనపర్వము ౮౪ అధ్యాయమునగోమతీనదిగంగలోసంగమమగుతావునమార్కండేయాశ్రమమునియు,పద్మ పురాణ సర్గ ౧౬ అధ్యాయమున సరయూనది గంగానదిలో సంగమమగుతావుననియు, జెప్పుచుండ,నడుమ నరవదేశస్థులు తంజాపూరు మండలములోని 'తిరుక్కాడవూర్' అను తావున నొకయాశ్రమ ముండినతావుఁ జూపుచున్నారు. Indian Iconography, Part 1, page 158 యందు గ్రంథకర్తయగు గోపీనాథరావుగారు తిరుక్కాడవూరునే దెల్పియున్నాడు. ఈయనయు దక్షిణదేశస్థుఁడే.

**మార్కండేయర్షి జన్మస్థానము**— (సాలగ్రామక్షేత్రము చూడుఁడు. గండకీనది చూడుఁడు.)

**మార్కండేయుని తపస్థలము**— సరయూ గంగానదుల సంగమమున (గజేంద్ర మోక్షణస్థానముకడనున్న) హరిహరనాథదేవస్థానమున మార్కండేయర్షి తనగండముఁ గడచి దీర్ఘాయుష్మంతుడగుటకు తపఁబొనరించెననియు యమునిదండింప నయ్యెననియుఁ జెప్పఁబడినది.

**మార్కాయణగోత్రము**—(జమదగ్ని వత్స ఉపగణము చూడుఁడు).

**మార్గక్రియలు**—(క్రియాప్రాణము చూ)

**మార్గపథగోత్రము**— (ఆర్ష్టిషేణ గణము చూడుఁడు).

**మార్గప్రాణము**- ఇది సంగీతలయయొక్క దశప్రాణములలో నొకటి. (సంగీతలయ దశప్రాణములు చూడుఁడు.)

నాలుగక్షరముల నుచ్చరించు కాలమునకు మాత్ర యని పేరు. ఎనిమిది మాత్రలకాలమునకు దక్షిణమార్గమనియు, నాల్గుమాత్రల కాలమునకు వార్తికమార్గమనియు, రెండుమాత్రల కాలమునకు చిత్రమార్గమనియు, నొకమాత్ర కాలమునకు చిత్రతరమనియు, నరమాత్రకాలమునకుచిత్రతమమనియు, పాతికమాత్రకాలమునకు నతిచిత్రతమ మనియు, మార్గము లారుగ జెప్పఁబడినవి. ఇది సంగీతలయకు కాలనియతిగ నెఱుంగునది.

**మార్గములు ౨ విధములు**— ౧. ధూమాది మార్గము-ఇష్టాపూర్తకర్మ లొనర్చినవారు చంద్రలోకమునుండి యుత్తమలోకములకుఁ జననగుమార్గము. ఇది పునరావృత్తిసహితమని యెఱుంగునది.

౨. అర్చిరాదిమార్గము-ముక్తికాములై వైరాగ్యోపశాంతులంగల్గి పునరావృత్తిరహితమగు పరబ్రహ్మైక్యముఁ జెంద సూర్యలోకమునుండి జ్ఞానులు జనెడి మార్గము.

**మార్గశిర లక్ష్మీవారముల నోము**- (మహాలక్ష్మీవ్రతము చూడుఁడు.)

**మారయాదీప సమూహము** — (లోవరుబర్మా జూడుఁడు.)

**మార్జాలకిశోరన్యాయము**—పిల్లి తన పిల్లను నోటఁగరచుకొని గోడలందాటి పోవును. (మర్కటకిశోరన్యాయము జూడుఁడు.) ఇచట మర్కటకిశోరన్యాయమందువలెపిల్లపట్టుకాదు; తల్లియే భాధ్యతగల్గి యుండును.

**మార్జాల (పిల్లి) శాస్త్రము**— ప్రయాణములగుతఱి పిల్లియొక్క చర్యలు మానవులకు చికిలీచేసిన శక్తితెఱుంగున సాధకబాధకములుఁ గల్గించుననియు, గాన దానింగూర్చి తప్పక నెఱుంగవలయు ననియు ఋషులు వచించిరి. ఇది సమగ్రమగు శాస్త్రము కాదు.

ప్రయాణములవేళ తనకడ్డముగా మార్జాలము రుదెంచినకార్యహానియనియు, అపసవ్యముగా తననుజుట్టి తిరిగిన కార్యనాశకరమనియు, తనకు ప్రదక్షిణ మొనర్చినటుల పిల్లి తిరుగుట స్వల్పనష్టములతో నరిపోవుననియు, పిల్లులపోట్లాట వినబడునేని కలహముసంభవించు ననియు, తన యింటిగుమ్మమున తాపెంచినపిల్లి ప్రయాణకాలమున నెదురగునేని దోషములేదనియు చెప్పఁబడినది.

ఏదేని పనిని తొందరగా చేయుతఱి, పిల్లి చొరఁబడి యానడుమనుండి పాఱిపోయిన నకార్యము చెడునని యెఱుంగవలయుననియు, పిల్లి తనపిల్లలఁ దీసుకొనివచ్చుటఁ జూచిన తానొనర్చుపని తప్పక చెడిపోవుననియు, తనపిల్లలను

నోటఁగఱచుకొనిపోవుటఁ జూచిన తనకు స్థాన భ్రష్టత్వము కలుగుననియు పెద్దలు వచించియున్నారు. ఇంకను పిల్లులసంభోగముఁగాంచిన ధనకష్టము గల్గుననియు, పిల్లులయఱపుల వినిన మనఃక్లేశమును, ప్రయాణమును, తప్పక గలుగుననియు చెప్పఁబడినది.

పిల్లి తనమూతిని నీటియందు కడుగుకొనుచుండుట జూచిన బంధుదర్శనమును, నెలుకలకు వెఱచి పరుగిడుపిల్లింజూచిన విఘ్నములు నశించి కార్యసిద్ధి యగుననియు, తన్నుజూచి భయపడి పిల్లి దాగుకొనుట గాంచినవానికిఁ గార్యసిద్ధి కల్గుననియు, పిల్లి కక్కుచుండగాచూచిన తనకు శరీరారోగ్యము కలుగు ననియు, పిల్లి మల మూత్రవిసర్జనము చేయుచుండుట తనకంటఁ బడిన తనకు రోగములు గల్గుననియు, పిల్లి కుక్కనుజూచి వెఱచి పరుగిడుటఁ జూచినవాని కించుక శత్రుభయము సంభవించు ననియు ఋషులు వచించిరి.

**మార్జాలశీలము**-(త్రికరణశుద్ధి చూ.)

**మార్జాలాయనగోత్రము** —(నిధృవ గణము చూడుఁడు.)

**మార్జాలి**-బార్హద్రధసంతతి క్షత్రియుఁడు. తండ్రి సహదేవుఁడు. పితామహుఁడు జరాసంధుడు(మగధరాజు). కుమారుఁడు శ్రుతశ్రవుఁడు.

**మార్తాండక్షేత్రము** -కాశ్మీరదేశములోని యిస్లామాబాద్ పురమునుండి యీశాన్యదిశగా నైదుమైళ్ళదూరమునఁగల ప్రసిద్ధసూర్యక్షేత్రము. దేవాలయమునుండి వాయువ్యదిశగా మైలు దూరమున మార్తాండతీర్థ మనియెడి స్నానతీర్థమును, నట విమలతీర్థము, కమలతీర్థము నను రెండు ప్రసిద్ధములగు నీటియూటలును గలవు. మార్తాండదేవళము క్రీ. వె. 320 సంవత్సర ప్రాంతమునఁ గట్టఁబడినదని జనరల్ సర్ కన్నింగ్హామ్ పండితుఁడు వ్రాసియున్నాఁడు. రాజతరంగిణియందు దీనికి సింహారోట్సికా యను పేరుగానవచ్చెడిని. (కాశ్మీరదేశము చూడుఁడు)

**మార్జిన్ (Margin)**— వాణిజ్యసంబంధమున "ఇంతకన్న ధర యధికమైనచోఁ గొనవలదు"అని ఏర్పాటునకు లోబడి, సరకులవెల యితరఖర్చులు నిశ్చయించియే కమీషనువర్తకునకంపి ఖరీదుచేయుటకు ఇచ్చిన ఆర్డరు.

**మార్తికావతము**-(సాల్వదేశము చూ.)

**మార్దవస్ఫుటకరకవి** -(కవికవులుచూ.)

**మార్వాడ్ సంస్థానము (జోద్పూరు సంస్థానము)** మార్వాడ్ దేశమునుండియన్యదేశములకేఁగిన వర్తకులను మార్వాడీ లనుచున్నారు. వా రన్నివర్తకస్థానములందును దరుచుగ గానన గుచుందురు. ఆంగ్లభాషయం దంతమందుండెడి డకారమును దరుచుగ రకారముగ పల్కుచుండుట పద్ధతియైయున్నదిగాన, నాంగ్లేయులు మార్వాడ్సీమయగు జోద్పూర్ సీమను 'మార్వార్' అనుచుందురు. రాజపుత్రస్థానమున నిట్టి సీమలు మూఁడు సుప్రసిద్ధములు. (ఇటఁగల వాడ్ = వాడ. సీమ కే యర్థమిచ్చెడిని.) ఆదిని దీనికి మరుధన్వదేశమని, పేరుండెను. అది మారియే 'మార్వాడీ' అయినది. (ఉదయపూర్ లేక చిత్తోర్ఘడము) మేవాడ్‌ను అజ్మీరు (అజయమేరు) అనఁగా మేరుత్వమొనర్చిన యజయపర్వతమునుండి గల్గినపేరు. మేరు శబ్దమునుండి మేర్వాడ్ (మేర్వారా చూడుఁడు) శబ్దము గల్గెను.

ఇక్కాలమున మరుధన్వదేశ(పుమార్వాడ్ సీమ, జోద్పూర్ సంస్థానరాజ్యముగ తెలియ నగుచున్నది. కొందరు పరిశీలకులు దీనిని ర మనుపేరుగల తావుగ పొరబడి పోల్చిరిగాని, నిజ మారసిన క్రీ. వె. ౧౮౫౯లో

ఈసీమ నేలిన రావ్ జోధా (యోధు) భూపాలుఁడీపురమును నిర్మింపఁజేసి, యదివరకు రాజధానిగనుండిన మండోరు (లేక నాదినామఁపు మందారపురమునుండి) ప్రభుత్వ కార్యాలయముల నిటకుమార్చుకతన, నాటనుండియు ప్రధాననగరమై రాజధానియై బహుశః రావుయోధ భూపాలునిపేరఁ బరగుచు, జోడ్పూ రనఁబరగుచుంట కొంతవరకు యోధపురమనుటయే సమంజసమని తోఁచెడిని. మందారపురము జోడ్పూరున కయిదుమైళ్ళదూరమున నుత్తరముగానున్నది. రాజపుత్రస్థానఁపు సంస్థానరాజ్యములలో నీ జోడ్పూరు సంస్థానరాజ్యమే పెద్దది. ౩౬౦౨౧ చతురఁపుమైళ్ళ వైశాల్యము కలది. ఈశాన్య దిశనుండి నైఋతిదిశకు ౩౨౦ మైళ్లు పొడవును ౧౭౦ మైళ్ళ వెడలుపును కల్గి రాజపుత్రస్థానమున నాల్గవభాగమునకన్న నధికమై యున్నది. ఈ రాజ్యమున కుత్తరమున బికనీరు రాజ్యపుహద్దును, వాయవ్యదిశను జైసల్మేరు రాజ్యమును, బశ్చిమమున సింధుదేశఁపు టెడారియు, నాగ్నేయమున రాన్ఆఫ్ కచ్చి, దక్షిణమున పాలన్పూర్ శిరోవాసంస్థానరాజ్యములహద్దులును, తూర్పున నజ్మీరు, మేర్వారా, కిషన్ఘడ్, ఉదయపూర్ సంస్థానముల హద్దులును నెల్లలు. జయపూర్ సంస్థాన మీశాన్యముగా నుండెడిని. సంస్థాన ప్రభువు రాష్ట్రకూటవంశస్థుఁడు (రహతోర్). శ్రీరామసంతతి. సూర్యవంశక్షత్రియుఁడు. దేశభాషయందు సూర్యవంశమును సురాజబన్సీఖేత్రి యనెదరు. సూర్యపుత్రుఁడగు వైవస్వత మనుసంతతి. (ఇక్ష్వాకుసంతతియని భావము.)

నాడాదిగ నేటివరకు నానగరము రాజధానియై ప్రభుత్వమునకు మూలస్థానమై దనరారుచున్నది. ఉదయసింగు మహారా జక్బరుచక్రవర్తికడను, ఆయన మనుమఁడు గజసింగుమహారాజు, జహంగీరుచక్రవర్తికడను పలుకుబడిగల సామంతులై యుండినటులను, జస్వంతసింగు మహారాజు, షాజిహాను దారాషికోహా రాకొమరుల సైన్యములకు ప్రధానసేనానియై, తిరుగుబాటుల నడంచినటులను (క్రీ. వె. ౧౬౭౮) నాయన సైన్యాధిపతిపదవియందే కాబూలు నగరమున మృతినందినటులను చరిత్రలుదెలుపుచున్నవి.

జాడ్పూరుదుర్గము నగరముకడను తూర్పుపడమరల కారుమైళ్ళపొడవున వ్యాపించియున్న యున్నతశిలాతలముపై నేడు ద్వారములతో నిర్మింపఁబడియున్నది. ఆద్వారము లేయేపురములనుండి వచ్చుబాటలపై గలవో యాపేరులనే దనరుచున్నవి. దేవాలయములే గాక నగరమునందలి పెద్దయిండ్లయందుగూడ జక్కని పనితనముగల శిలాచిత్రములు గలవు. ఇందు గిర్దికోటమార్కట్టు, ధాన్మండి (గోధుమలబజారు) కడనున్న దేవాలయము, తైలాతీమహాల్ చిత్రఁపుఁబనులు, చూచి తీరవలసినవి కలవు. కడపటిది జస్వంతు జనానా (గోషా) యాస్పత్రి (వైద్యశాల)యై యున్నది. నగరము, ప్రజల యాచారములు పురాతనఁపుఁ బోల్కి లక్షణముల నెంతమాత్రమును గోల్పోవక నిలచి యున్నదని పేరందినది. కోటంజుట్టి నగరము వ్యాపించియున్నది. సగటున నగరము, సుందరవంతము, చరిత్రాత్మకము నని చెప్పనగును. కోటలో నేయాయుధశాల, యాభరణభాండాగారము చూడదగినవి కలవు. పురాతనరాజనివాసమందే కలదు. అదిచూడఁదగినది. ఆశిలాతలోన్నతప్రదేశము ౧౨౦ అడుగులఎత్తు. మహారాణీల సహగమనలాంఛనములుగ వారిచేతులు చెక్కఁబడినతావు నెల్లరును గౌరవింతురు. కోటబురుజులపైనుండి చూచిన, క్రింద నగరదృశ్యమును, నాకసమునందెగురుచుండు వాయువిమానముల నుండి క్రిందికింజూచిన నగుపడున ట్లుండును.

నగరమున పదమ్‌సాగరము, గులాబ్ సాగరము, రాణీసాగరము మొదలగు పెక్కుసరస్సులు గలవు. అన్నియు సుందరవంతములు. నగర పరిసరముల నిరుదెసల ప్రతాపసాగరము (లేక కైలానా) బాలసమంద్ అను గొప్పసరస్సును గలవు. అవి నగరమునకు దాహోదకముల నందించు జలనిలయములుగ నున్నవి. నగరమందే యున్నను వేరుగోడల యావరణమునందుంట నగరపరిసరముగ నెన్నంబడుచున్న 'మహామందిర'మను దేవస్థాన మిట పవిత్రస్థలిగా నున్నది. నూరు స్తంభములపై నిర్మింపఁబడిన దేవాలయము చూడఁదగినది. లోన జెక్కబడిన చక్కని శిలాచిత్రములు గలవు. ఈయావరణముననే రెండుప్రాసాదములు కలవు. అందొక ప్రాసాదమునఁ దీ భూపతుల రాజకుటుంబఁపు గురుఁడు వసించుచుండును. రెండవదానియందు గతించినభూపతి యాత్మ వసించుచున్నదని దాని నట్లేయుంచి నైవేద్య మర్పించుచున్నారు. అందొకగదియందు మహారాజునాటి ప్రక్క (శయ్య దిండ్లు) యమర్పంబడి పైని బంగరు రేకుఛత్రమమర్పఁబడియున్నది.

జోడ్పూరు నగరము గొప్పవర్తకస్థలము. దాని పరిమితికి మించినవర్తక మిట నడచుచుండును. ఇది వాయువిమానస్థానములలో ప్రాముఖ్యత నందియున్న తావులలో నొకటిగనున్నది. ఆంగ్ల, ఫ్రెంచి, డచ్చి వాయువిమానము లిట నాగుచుండుతావుగలదు. ఎరోడ్రోము (Aerodrome) చాల పెద్దప్రదేశము గలది. ఇటఁగల Flying club ప్రాముఖ్యతనందిన సంస్థగా జెప్పఁబడినది పురమున నొక గొప్పహోటే లైరోపావారికిఁ గట్టఁబడినది. ఇతర వసతిగృహములును గలవు. బండ్లవసతి విరివిగాఁగలదు. నవంబరు మొదలు ఏప్రెల్‌వరకు సౌఖ్యప్రదమగు శీతోష్ణస్థితి గల్గియుండుతావు. రాత్రులు చల్లగానుండెడిని. జాడ్పూరుదుర్గము రాజపుత్రస్థానఁపు దుర్గములలో మిన్నగఁ జెప్పఁబడినది. అన్యులకు దుర్గమము; శత్రులకు జేయము. దుర్గము చుట్టునుగల శిలాతలఁపుఁ బ్రక్కలు నిలువుగనుండునటులఁ జేయఁబడినవి. కోటచుట్టు చోకఁపు బురుజులు గుండ్రని బురుజులు నపరిమితముగ గట్టఁబడియున్నవి. కోటగోడల యెత్తు ౧౨౦ అడుగులు, గోడలమందము ౭౦ అడుగులును గల్గి కోటలోపలిభాగము ౫౦౦ × ౨౫౦ గజముల ప్రదేశముఁ జుట్టియున్నది. లోనికెక్కిపోవ Zig zag బాట కలదు. నాగర్ ద్వారము కడ, బికనీరు జయపూర్ రాజులతో సంగరమునాటి ఫిరంగిగుండ్ల యానవాళ్ళుగలవు. ఆసంగరము క్రీ. వె. ౧౮౦౭ నాటిదఁట. నగరమున పట్టుబట్టలు, కాలిజోళ్ళు, దంతఁపుఁబనులు, కొమ్ముపనులు, లక్కరురంగుపూతపనులు పేరందినవి. విశేషముగఁ జేతిపనులు జేయఁబడుచున్నవి.

విల్లింగ్డన్ మహోద్యానవనము చూడముచ్చటయగు పూఁదోఁట. రైకాబాగ్ పేలస్ (భవనము) మహారాజుగారి నివాసభవనము. చితార్ హిల్‌పై వారికి వేరొక నివాసభవనము గూడ గలదు. ఇంక నీనగరమునఁ జెప్పఁబడఁదగిన సుందరభవనములు మొహక్మాఖాస్ భవనము. ఇట ప్రభుత్వకార్యస్థానము లుంచఁబడినవి. ఛోపాస్ని విద్యాశాల (Chopasni school) యిట రాజపుత్రబాలుర కాంగ్లదేశఁపు పబ్లిక్‌స్కూలునందు వలెనే యావిధానముననే విద్య గరపెదరఁట.

ఇంక వెనుకటిరాజధానియగు మాండోర్ (మందారపురముఁ) గూర్చి ఇంచుక వివరించి ముగింతుముగాక. ఇప్పటి రహాతోర్ (రాష్ట్రకూట) రాజవంశమునకుఁ బూర్వము, ఈ

విషములపైఁ జక్కఁగఁ బనిచేయును. ఆకు వెచ్చఁజేసి పైనికట్టిన నేత్రరోగములు నివారణ మగును.

వేఁపగిఁజలు, శొంఠి, మారేడునకు విరుగుడు లని చెప్పఁబడినది.

**మార్కెట్ ఓవర్టు** (Market overt) వాణిజ్యసంబంధమున బహిరంగమైన మార్కెట్టునం దనియర్థము.

**మార్కోపోలో** — (Marco Polo) ఈయన యిటలీదేశమున వెన్నిసు నగరఁపు యాత్రికుఁడు. గొప్ప కుటుంబమున జన్మించిన వాఁడు. క్రీ. శ. ౧౨౭౧ సంవత్సరమున నీయ నయు, నీయనతండ్రి పినతండ్రులు, నిల్లు వెడలి చీనాకేగఁ బ్రయాణమైరి. తండ్రిపినతండ్రు లది వఱకా దేశమునకు ౧౨౬౦లో వెళ్ళి దర్శించి యుండిరఁట. అత్తరి వారు పారశీకము, పశ్చిమ ఆసియా, తార్తారు, దేశములనుండి నడచిరఁట. ఈముగ్గురుయాత్రికులు గోబైయెడారిదాటి, చీనా దేశములోని షాంఘూయిపట్టణముఁ జేరిరనియు, అది క్రీ. శ. ౧౨౭౫ అనియుఁ జెప్పఁబడినది. అట ప్రభుండగు మహాఖానుని దర్శించిరఁట. అతఁడు మార్కోపోలోపై దయ గలుగ ననేక గౌరవము లొనర్చుచు, గవర్నరుపదవిఁ గూడ నొసంగుచు గౌరవించెనఁట. అందువలన మార్కోపోలో యాంగ్చౌనగరఁపుఁ బరిపాలకుఁడుగ మూఁడు సంవత్సరము లుండి, చీనాలోని యెల్లసీమలకును, పిదప భరతదేశమునకును వెడలి దర్శించెను. ౧౨౯౨లోఁ బారశీకమునకు రాయబారిగ, తనతండ్రి పినతండ్రులతో నేగి, చీనాఖాను కొమరితను షాగారికిఁ బరిణయ మొనర్చి, యెట్టకేలకు ౧౨౯౫లో స్వదేశమునందలి వెన్నిసునగరమును ముగ్గురు యాత్రికులును జేరిరని చెప్పఁబడినది. పిమ్మట ౧౨౯౮ లో జినోయీస్ అధికారులవలన శిక్షింపఁబడి, యానిర్బంధకాలమునఁ దన యాత్రాచరిత్రను, వ్రాసియున్నాఁడు. ఆచరిత్రము ఫ్రెంచిభాషయం దున్నది.

**మార్క్వెసాస్‌ద్వీపములు** (Marquesas Islands)—ఇవి యోషీనియా యందలి పోలినేసియా ద్వీపసమూహమునకుఁ జెందిన ద్వీపములు. సొసైటీద్వీపముల కీశాన్యదిశగా నున్నవి. వాటివలెనే ఫ్రెంచివారికిజెందియున్నవి. (సొసైటీ ద్వీపములు చూడుఁడు).

ఇవి 'Mendana' అనుపేరుగల నావికునిచే కనుఁగొనఁబడినవఁట. ఆయనను పెరూ వైస్రాయిగా రగు Marquis de Mendoza గారు పంపియుండిరఁట. ఈ ద్వీపములు గవర్నరుగారి పేరఁ బరగుచుండునటుల పేరిడఁబడినవఁట.

(ఓషీనియా, పోలినేసియా ద్వీపములుచూ).

స్వదేశస్థులపే రేమో తెలియరాకున్నది.

**మార్టెల్లో** (Martello)— ఆయుధసహితమైన బురుజు (Armed tower) న కుపయోగించు పేరు. పూర్వము 'Corsica' ద్వీపమున క్రీ. శ. ౧౭౯౪ సంవత్సరమున నాంగ్లేయుల ముట్టడి నెదుర్చుట కొక బురుజుఁ గట్టి, దానిపై నాయుధములమర్చిరి. దానిపేరు 'Martello'. దానినుండి యట్టిబురుజుల కీనామ మన్వర్థ మాయెను.

**మార్టైర్ & కన్ఫెస్సర్**— జర్మనుభాష 'Martyre' అనిన సాక్షి యని యర్థము. ఇక్కాలమున మతవిషయమై యన్యమతస్థుల వలన బాధింపఁబడి, ప్రాణముల నర్పించి మృతులైనవారిని "Martyrs" అనియు, కష్టముల ననుభవించి మతమునకై యన్యులచే ద్వేషింపఁబడి బాధలనందినవారిని (మృతినొం

దశ నిలచినవారిని 'Confessor' అనియు వాడుచున్నారు.

## మాల్టెడ్ మిల్కు (Milk) పరిశ్రమ

"మాల్టెడ్ మిల్కు" అనఁగా పాలనుండి తయారు చేయఁబడు నొకవిధ మగు ఘన పదార్థము. దీనిసారుచ్యమునుబట్టియు, సులభముగా జీర్ణమగు స్వభావమునుబట్టియు, ఇందలి పుష్టికరములగు పదార్థమును బట్టియు ననేకులగు వైద్యశాస్త్రవేత్తలు దీనిని శిశువులకును, రోగులకును పథ్యమగు నాహారముగా సిఫార్సుచేయుచున్నారు. హిందూదేశమునందు Malted milk న కెంతయేని గిరాకీయున్నప్పటికి నీవరి శ్రమ విషయమగు ప్రయత్నము విశేషముగ మన దేశమునందుఁ జేసినటులఁ గానరాదు.

Malted milk తయారుచేయు విధము:—

మాల్టెడ్ మిల్కు తయారు చేయుటయందు రెండవస్థలు గలవు. ప్రథమావస్థ యవగింజలను (Barley) మాల్టు చేయుట యనఁగా— శుభ్రపరచుట, నానబెట్టుట, వాని నంకురింపఁ జేయుట, (మొలకలెత్తువరకు నానబెట్టుట), Barley Malt ఎండబెట్టుట.

ద్వితీయావస్థ:— Manufacture విధానమంతయు నీయవస్థయందే కలదు. ఇందు గోధుమపిండియు, బార్లీ మాల్టును కలిపి ముద్దగ (Mash) తయారుచేయుట, గంజి (Starch)ని maltose గా మార్చుట, Barley malt నందలి పొట్టును వేరుచేయుట, కలుపుట, పాలనుగాని, Condensed milk గాని దానితోఁ జేర్చుట, పేరుకొనఁజేయుట, యిగురఁబెట్టుట, పిండిచేయుట, విక్రయమునకు సిద్ధపఱచుట.

మాల్టు చేయుటయందలి ప్రధానోద్దేశమేమనఁగా, నాహారముగా నుపయోగింపఁబడు పదార్థములోని maltose మాల్టోజు deactrean మొదలగు సారపదార్థములను, తక్కినవి సులభముగా వేరుపరచి సులువుగా జీర్ణమై శరీరపుష్టి కలుగుటకు సౌకర్యము గల్పించుట Barley malt నందింపైన వాసనయు, రుచియు నుండుటచే నిందుకు తరచుగ నుపయోగింపఁబడుచుండును.

Malt చేయుట కుపయోగించు యవలను (Barley) ముందు తగినజల్లెడ్లలోఁ బోసి, బాగుగజల్లించి, యందు జేరియుండు నితరదినుసులు వెలార్చి పుచ్చినగింజలున్నఁ దొలగించి మన్ను రాయి మొదలనవి లేకుండ బాగుచేయించవలెను. తరువాత నాగింజలు నీరు లోనికి పూర్తిగాఁ జొఱుటకు నానబెట్ట వలయును. ఇట్లు నానబెట్టుట గింజలపైమట్టమున కొకటి రెండడుగులుపైగా నీరుపట్టఁజాలు పెద్దబానలి యందుఁ జేయవలయును. నానబోయు నీటిటెంపరేచరు 68°F డిగ్రీలకు సరాసరి యుండవలయును. నానబోసిననీరు మస్టుగట్టకుండను, పులిసి పోకుండను, ఎనిమిదేసిగంటల కొక్కొక పర్యాయము నీరు మార్చుచుండవలయును. బాగుగా నానుటకు 24 గంటలు మొదలు 48 గంటలవరకు కావలసియుండును. మాల్టుహౌసు (Malt House)నుబట్టియు ఋతువునుబట్టియు నానుటకు వలయుకాలము భేదించుచుండును. నానబోయుట కుపయోగించు పెద్దబానలులు Cylenders ఆకారము గలిగి, యడుగుభాగ మూకగా నుండును. వీని కడుగున జలెడవంటి నీరుపోవు మార్గముండును. దానికి క్రిందిభాగమునవున్న మొలకలెత్తుటకై యేర్పాటుచేయఁబడిన Germinating Floor లోనికి గింజలు పడునట్లుచేయు పల్లమైన రంధ్రముండును. (Chute) నానఁబెట్టువిధానములో ప్రతిగింజయు బాగుగానుబ్బి 45 మొదలు 50% వరకు నీటిని పీల్చును. ఓట్సు మొదలగు మారుజాతిగింజలును,

పుచ్చిగింజలును మీఁదికి తేలిపోవును.

బార్లే గింజలు మొలకలెత్తు విధానము:— మొలక లెత్తించుటయందు మూఁడువిధములగు పద్ధతులు ప్రస్తుత మాచరణమునందున్నవి. 1. సిమెంటునేలమీఁదఁ గాని, గచ్చు నేల మీఁదఁగాని యారఁబోసి మొక్క లుబ్బునట్లు చేయుట, 2. అడుగున రంధ్రములుగల కళంజములలోఁ బోయుట Saladin or Pneumatic Trough System, 3. తిరుగలివలె తిరుగుచుండు (Drum) డ్రమ్ములలోఁబోయుట (Pneumatic Drum System)

ఈవిధానత్రయములో దేనియందయినను తడినిగూర్చియు టెంపరేచరునుగూర్చియు నప్రమత్తులయి యుండుట మత్యావశ్యకము. తీసికొను జాగ్రత్త ననుసరించియే యందులో నేర్పడు (Diastase) ను ఇతరములగు ఇంజైమ్సు యొక్కయు వృద్ధిక్షయము లాధారపడి యుండను. తడి కావలసియున్నయెడల నీరు చిలుకరించుచుండవలయును. వేఁడి కావలసినయెడల గాలిబారునట్లు కదుపుచుండవలయును. మొలకెత్తు విధానము 5 దినములు మొదలు 7 దినములవరకు పట్టును. 5 దినములలో పూర్తిగావించుటకు 75° F టెంపరేచరు స్థిరముగా నుండవలయును. ఇందులకు పరిసర వాతావరణము 60°, 65° F డిగ్రీలు టెంపరేచరు గలిగినదియై యుండవలయును. అంకురించుటయొక్క ఆరంభదశకు Cowtching అనిపేరు. ఈదశయందు నీరు చిలుకరింపరాదు.

Barley malt ఆవములలోఁ బోసి యారబెట్టు విధానము:-వలయునంతవరకు మొలకలు లేచిన తరువాత, మొలకలెత్తుట యాపుటకుగా నావములలోఁ బోసి యారఁబెట్టుదురు.

మాల్టుచేయుటయందుపయోగింపబడు వేడిమినిబట్టియు, కాలమునుబట్టియు Malt యొక్క రంగు మారుచుండును. వేడిమి యధికమగు కొలఁదిని దెలుపునకు భంగముకలుగును. Malted Milk తయారుచేయుటకు కావలసిన Barley malt రంగు లేతగానే యుండవలయును. Malt నకు విశేషము ముఖ్యరంగు, అనగా గోధుమరంగు రాకుండఁ జేయుటకై 120° F లోపు టెంపరేచరులోనే యుంచవలయును.

ఇట్లారఁబెట్టినదానిలో చిరువేళ్ళు మొదలగు రద్దుతీసివేసిన నికరపుముద్దకే 'Barley malt' అనిపేరు. తరువాత దీనిని పాలతోగాని Condensed milk తోఁ గాని చేర్చి యారఁబెట్టి Malted milk తయారుచేసి విక్రయమునకు సిద్ధము చేయుదురు.

**మాలక్దాసు జీ**— ఈభక్తుఁడౌరంగజేబు చక్రవర్తి కాలమునాఁటివాఁ డందురు ఈయన రామభక్తుఁడు. ఈయనశిష్యులు గోకులప్రాంతమునఁ గానఁబడుచున్నారు. వీరందరును శ్రీరామభక్తులు. హరిదాసుమతస్థుల వంటివారు. (హరిదాసుమతము-మాలక్దాసుమతము చూ). ఈయన "దశరత్నై" మను మతగ్రంథమును రచించెను.

**మాలకింకిణీలత**—(మావేరు చూ).

**మాలఖండమార్గము**-- పశ్చిమోత్తర సరిహద్దుపరగణాలకుఁ జెందిన యొక కనుమల మార్గము. కాబూల్ (తొల్లింటి కుభా) నదిలోవ నుండి స్వాత్ లోవ కేగు కొండమార్గమున కీపేరు వర్తించుచున్నది.

**మాలతీగంధగుణవిత్ దర్భేనరమంతే హ్యళిః ఇతి న్యాయః**—మాలతీ సుగంధగుణము నెఱిఁగిన తుమ్మెద, దర్భలందురమింపదని యర్థము. అనఁగా నున్నతము లగు నధిక

విశేషరుచుల నెఱింగినవా రల్పరుచుల కాసింప రని భావము.

**మాలప్రభా నది**— మహారాష్ట్రదేశ మున బాదామి(తొల్లింటి వటపీపురము)ప్రక్కఁ బడి ప్రవహించు నది. (మహారాష్ట్ర దేశము చూడుఁడు). వటపి, వాతాపి(రాక్షసుని) తావు.

**మాలరుచ గోత్రము**— (ఆత్రేయ గణము చూడుఁడు.)

**మాల్యగోత్రము**—( ధ్యస్య లేకమిత్ర యుపగణము చూడుఁడు.)

**మాల్యవంతపర్వతము**-ఇప్పటి బళ్లారి జిల్లాలోని జీర్ణవిజయనగరమున నున్నది. తొల్లిఁట వాలిని జంపినపిదప శ్రీరామలక్ష్మణులు వర్షకాల మీపర్వతముపై వసించుచు, సైన్యబలమును గూర్చుకొనిరి. ఇట శ్రీరామాలయము గలదు. ఇప్పుడదిబైరాగులస్వాధీనమందున్నది.

మఱియు మాల్యవంతుఁడను రక్కసుఁడు సుకేశుని పుత్రుఁడు. (కులపర్వతములు చూ).

**మాలాద్వీపములు (మాల్డీవ్సు)**— హిందూమహాసముద్రమున సింహళద్వీపముకడ సింహాలప్రభుత్వరక్షిత రాజ్యమునందలి ద్వీపములు. సుల్తాను ప్రజాపతి; ప్రజలు మహమ్మదీయులు. కొబ్బరితోఁటలుగలవు. గవ్వలుమొదలగునవి సముద్రమునఁ దీయఁబడు చున్నవి. (సింహాలద్వీపము చూడుఁడు).

**మాలాదేశము**—ఇది విదేహ దేశమునకు తూర్పుగను, గంగానది కుత్తరముగను, మగధకు వాయువ్యదిక్కుగను, నొకప్పు డుండిన చిన్న దేశముగఁ బోల్చుచున్నారు. ఇప్పటి చపారమండలప్రాంతసీమ యందురు.

మహాభారతము, సభాపర్వము ౨౭ అధ్యాయమునఁ బ్రశంసింపఁబడినది.

**మాలాయనగోత్రము**— (జమదగ్ని వత్స ఉపగణము చూడుఁడు).

**మాల్టాద్వీపము**-ఐరోపా ఖండములోని యిటలీ దేశమునకుఁ జెందిన సిసిలీ ద్వీపమునకు దక్షిణముగ మధ్యధరా సముద్రమునందున్న ద్వీపము. బ్రిటీషుప్రభుత్వమునకుఁ జెందిన ద్వీపము. "వలెట్టా"పురము ముఖ్యపట్టణము. ఇట బలమైనదుర్గము గలదు. మఱియు మధ్యధరా సముద్రము లోని యాంగ్లనౌకాదళమునకు ముఖ్యనౌకాస్థానముగ నున్నది.

మాల్టాద్వీపమును, ప్రక్క నేయున్న గజో ద్వీపమును, ఐదవ ఛార్లెసు భూపతి క్రీ. వె. ౧౫౩౦-వ సంవత్సరమున Knights of St. John శూరుల కొసంగెను. వారు క్రీ. వె. ౧౭౯౮ వ సంవత్సరమున ఫ్రెంచివారికి వదలి వేసిరి. క్రీ. వె. ౧౮౦౦ సంవత్సరమున బ్రిటీషువారి హస్తగత మాయెను. ఇచటి ప్రజలు మాట్లాడు భాష యరబ్బీకలసిన యిటాలియన్ భాషగా నున్నది.

**మాల్డాజిల్లా**—మాల్డాపురము ప్రధాన స్థానము. ఈజిల్లాయందు తొల్లిఁట బంగాళా దేశమునకు రాజధానిగనుండిన గౌడపురఁపు పాడు కలదు. (బీహారదేశము చూడుఁడు.)

**మాలికారేఖ**—(స్త్రీసాముద్రికము చూ).

**మాలిజమ్** (Malism) — Malus= చెడుగు E ప్రత్యయము Ism = Theory or doctrine=సిద్ధాంతము. ప్రపంచిక ప్రవృత్తి యంతయు దుఃఖ (పాప) పూరిత మనియు దీని నివృత్తియే సద్గతి యనియు నమ్మకము గల సిద్ధాంతము తత్త్వశాస్త్రమునందిది యొకభాగము. దీనినే Pessimism అందురు.

**మాలిక్కి మైదాన్ ఫిరంగి** — ఇది బొంబై రాజధానిలోని బిజాపూర్ కోటయందు

షేర్జేబురుజుపై నున్న ఫిరంగి. పనిచేయుటయందు గురికి పేరందినది. 'యుద్ధరంగ(పుటారిందా' యని దానిపేరున కర్థము. ఇది బిజాపూరునందు పెద్ద ఫిరంగిగా నందరును వాడుచున్నను, నిజమున నీకోటయందే లండీఖానాబురుజుపైనున్న ఫిరంగి పెద్దదిగానున్నది. మాలిక్కి-మైదానుఫిరంగి బహమనీసుల్తానుల కాలమునందు క్రీ. శ. ౧౫౪౯వ సంవత్సరమున నహమదునగరమున నొకతురుష్కో-క్కోగి మహమ్మదుబిన్ హుసనూమీయను నాతడు పోతపోయించెనని దానిపైననే గలదు. వేరొకశాసన మౌరంగజేబుచక్రవర్తి బిజాపూరును వశపర్చుకొని యీఫిరంగిపైననే చెక్కించినటుల తోచెడిని. ఇది ౧౬౮౬ సం॥లో నైయున్నది. ఇది మూతికడనున్నది. దీనికన్న పెద్దదియగు లండీఖానాబురుజుపైనున్న ఫిరంగి, కొంత మరుగుగా నుంట నెల్లరిచే గమనింప(బడమి( గాబోలు దీనివలె సుప్రసిద్ధము గాకుండనోవు.

**మాలినీనది**— అయోధ్య కుత్తరముగ నేబదిమైళ్ళదూరమున ఘాగ్రానదిలో కలియు నదికి మాలిని యనిపేరు. ఇది ప్రలంబదేశమునకు తూర్పుగను, అపర్తాలదేశమునకు పశ్చిమముగను, బ్రవహించునదిగ చెప్ప(బడినది.

శకుంతలను పెంచిన కణ్వమహర్షియాశ్రమము మీమాలినీనదీతీరమని చెప్ప(బడినది.

**మాలోహరగోత్రము**— (భరద్వాజ ఉపగణము చూడు(డు).

**మాలోహరిగోత్రము**—(వశిష్ఠగణము చూడు(డు).

**మావటీ(డు**— ఏను(గు సంరక్షణకై (పరిచర్య) నియమితు(డైన సేవకునకు మావటీ(డని పేరు.

**మావసు(డు** – అమవసదిన మీతనిపేర( బరగుచున్నది. (అచ్ఛోద(జూడు(డు).

**మావేరు (మాలకింకిణీలత)**– మావేరునకు జ్యోతిష్మతీలత యనియు, మాలకింకిణీతీ(గ యనియు, వెక్కు-డుతీగె యనియు, స్వర్ణలత యనియు, కాకాయులత యనియు పేర్లుగలవు.

ఇది పెద్దమావేరు, చిన్నమావేరు నని రెండుభేదజాతులు( గలది. లా. Celastrus Paniculata. సం. కాకవల్లరీ, కాకాయుః, జ్యోత్స్నా, జ్యోతిర్లతా, జ్యోతిష్మతీ, పారావతపదీ, పారావతాంఘ్రి, పీతికా, రక్తఫలా, మాదినీ యనుపేళ్ళు మావేరు (సామాన్యము) నకును, పారావతకలికా యనునది పెద్దమావేరునకును స్వర్ణలతా యనుపేరు చిన్నమావేరునకును వర్తించెడిని.

పెద్దమావేరు ఆకు, విత్తులు, వేరు, రస కషాయ, తైలములు, కాకజేసి విరేచనము వెడలించుననియు, సుబ్బుజాడ్యము, కఫోద్రేకము, క్రిమి, నేత్రరోగములు, జలోదరము, పాండురోగము, పీనస, భగందరము, వాతరోగము, విసర్పి, శోషల, నివారించుననియు, చిన్నమావేరునందు కఫోద్రేకము, మందాగ్ని, రసవాతదోషము, వ్రణములు, విసర్పి, స్ఫోటకముల నడంచుశక్తి కలదనియు( జెప్ప(బడినది.

కొందరు నగటున పెద్ద,చిన్న మావేరులం దీగుణములన్నియు( గలవందురు. ముఖ్యముగ ద్రిదోషముల నడంచి, శిరఃపీడ నివారించునవిగ జెప్ప(బడినవి.

**మాషప్రమాణము**— ఆయుర్వేదవైద్య శాస్త్రమున ౧౦ రతుల యెత్తుగా( జెప్ప(బడినది. రతి యన గురిగింజయెత్తు. (ఆయుర్వేద మానము చూడు(డు)

**మాషరాశిప్రవిష్ట మషీన్యాయము**– మినుములరాశిలో కలసిపోయిన కరుదూప(వు ముక్క-వలె ననియర్థము.

మినుములు నలుపు, కరుదూవపుముక్కయు నలుపే యైనను మిక్కిలి శ్రమచేసి వెతకిన వేరు చేయనగునని భావము.

బాహ్యాకారము లోకతెరంగున నున్నను వేర్వేరు వస్తువులు వేర్వేరుచేయుట కష్టసాధ్య మనుట కీన్యాయము వర్తించును.

**మాపాయనగోత్రము**— (భరద్వాజఉప గణము చూడుఁడు.)

**మాసంతకులగోత్రము**— ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్య గోత్రములు చూడుఁడు). మానస్త లేక మానస్తకుల గోత్రము. ఏకార్షేయ (౧౫)గోత్రము. సంస్కృతగోత్రము వరంతుస. వరతంతుగణము. కపిలాచార్యర్షి. ఆపస్తంబయజుశ్శాఖ. ప్రమాణగ్రంథ మాచ్యప్రవరఖండ. సమానగోత్రము కపిలాచార్యస. మదనేశుఁడు దేవత. భార్య మాళవాంబ. మందాకినీతీరము తపస్థానము. మాళవీసింధువు తటాకము. జపము వెయ్యి. దీపములు ౨౦. క్షేత్రసంఖ్య 30. కపిలధేనువు దానము. మినుములు వర్జనీయము.

**మాసనామకరణము లేక మాసనామము**—(నామకరణములు త్రివిధము చూ.)

**మాసములు (నెలలు) (మాసాదిత్యులు చాంద్రమానమాసములు)**—
చంద్రకళ ప్రారంభమగు శుద్ధపాడ్యమి మొదలు, చంద్రకళాంతమగు బహుళయమావాశ్యకడ కొక చాంద్రమానమాస మగును. ఈ మాసములు సంవత్సరమున పండ్రెండు సాధారణముగ నుండెడిని. అన్ని సంవత్సరములందు పండ్రెండు పౌర్ణములును, పండ్రెండమావాస్యలును గల్గుచుండును.

కొన్ని సంవత్సరములందు పదమూఁడు పౌర్ణములును, పదమూఁడమావాశ్యలును సంభవించును. అట్టివత్సరమున కధికమాససంవత్సరమని యందురు. ఆ సంవత్సరము సంభవించిన నెక్క ఏయగు నెల నధికమాస మనియు నందురు. మరి కొన్ని సంవత్సరములందు పదునొకండు పౌర్ణములును, పదునొకండమావాశ్యలునుసంభవించును. ఇది యరుదు. అట్టి సంవత్సరమున నేనెల లోపించునో యానెలకు నష్టమాసమని పేరు.

ప్రతినెలయందు పౌర్ణమినాఁడే నక్షత్రము సంభవించునో యానెలకా నక్షత్రనామమే బరగెడిని. ఇటులనే చిత్రానక్షత్రయుక్తపౌర్ణమి గల మాసమును చైత్రమాసమనియు, విశాఖానక్షత్రయుక్తపౌర్ణమిగల మాసమును వైశాఖమాసమనియు, జ్యేష్ఠయగునేని జ్యేష్ఠమనియు, ఆషాఢ(పూర్వాషాఢ గాని ఉత్తరాషాఢ గాని) యగునేని యాషాఢమనియు, శ్రవణమగునేని శ్రావణ మనియు భాద్రానక్షత్ర మగునేని (పూర్వాభాద్ర గాని, ఉత్తరాభాద్ర గాని) భాద్రపద మనియు, నశ్విని యగునేని ఆశ్వీజ మనియు, కృత్తిక యగునేని కార్తీక మనియు, మృగశిర యగునేని మార్గశిర మనియు, పుష్య మగునేని పౌష్య మనియు, మఘ యగునేని మాఘమనియు, ఫల్గుణీనక్షత్రమగునేని(పూర్వఫల్గుణి గాని, యుత్తరఫల్గుణి గాని) ఫాల్గుణమనియు, మాసనామము లొప్పెడిని. వరుసగ చైత్రాది పండ్రెండునెలలందును వేదాన్గ, భాను, రవి, గభస్తి, యమ, సువర్ణరేతస్క, దివాకర, మిత్ర, విష్ణు, అరుణ, సూర్యులు మాసాదిత్యులుగనుందురు. అధికమాసమునపూషుఁడు మాసాదిత్యుఁడై తనరెడిని.

**మాసములు (నెలలు)**—మాసమును నెల యందురు. సాధారణముగ నెలయందు ముప్పదిదినము లుండును గాని యందెక్కువ తక్కువలు గూడ సంభవించుటయుఁ గలదు.

భరతదేశపు సిద్ధాంత (జ్యోతిష) వేత్తలు,

చంద్రునివలనఁ దెలిసెడిది "చాంద్రమాన మాస" మనియు, సూర్యునివలనఁ దెలిసెడిది "సౌరమానమాస" మనియు, నక్షత్రముల నుండి తెలియఁ దగినది "నక్షత్రమానమాస" మనియు, ముప్పదిదినములు గలది. "సావన మానమాస" మనియు (Civil year) నాల్గు తెఱఁగులు.

ఇందు మొదటి రెండుమాసములును ప్రధానములు. అందింకను చాంద్రమానమాసము "అమాంత (అమావాస్యాంత) మాసము" లేక "ముఖ్యచాంద్రమాస" మనియు "గౌణచాంద్రమాస" మనియు ద్వివిధము. అమాంత మాసము శుక్లపక్షపాడ్యమి మొదలమావాస్యాంతమువరకు వ్యాపించి యుండునది. దీని యందు మధ్యప్రధానతిథికగు పౌర్ణమియందు దే నక్షత్రము సంభవించునో యానెల కానక్షత్ర నామమే గల్గియుండును. ఇటులనే చిత్తానక్షత్ర యుక్త పౌర్ణమి గలమానము "చైత్ర" మనియు, విశాఖానక్షత్రయుక్త పౌర్ణమిగల మాసము "వైశాఖ" మనియుఁ జెప్పఁబడినది.

ఇంక గౌణచాంద్రమానమాసమున బహుళ పాడ్యమి ప్రథమదినముగను, ప్రధానదినముగు పౌర్ణమి కడదినముగను లెక్కింపఁబడును. దీని యందుఁగూడ పౌర్ణమినాఁటి నక్షత్రమే మాస నామమున కాధారమగును. ముఖ్యవిధానమాస మాంధ్రదేశ మంతటను వాడుక నందియున్నది. గౌణవిధాన మాసము, బార్హస్పత్యమాన సంవత్సరములు వాడుకయందున్న యుత్తరదేశములందు వాడుక నంది యున్నది. కర్ణాట, మహారాష్ట్ర దేశములుగూడ చాంద్రమాన ముఖ్యవిధానము ననుసరించుచున్నవి. బంగాళము, నుత్తరహిందూస్థానము మొదలగు దేశములు బార్హస్పత్యమాన వత్సరమున చాంద్రమాన గౌణవిధానమాసములనుగణించు చుండును.

ఈసందర్భమున భరతదేశఁపు జ్యోతిషశాస్త్రముమేర కమావాశ్యయందు సూర్యచంద్రు లిర్వురు నేకరాశియందే యుండుదినమనియు, నత్తరి వా రిర్వురకు నంతం మేమాత్ర మైన నుండదనియు, పౌర్ణమిని సూర్యచంద్రు లిర్వురు నొకరి కొకరు ౧౮౦ అంతరముల దూరమున నుందురనియు, ననఁగా ౧౮౦ అంశముల యంతరముండుననియుఁ జెప్పఁదగును. అంశ మనిన నాంగ్లమునందు "డిగ్రీ"యనియు, అంతర మనిన దూర మనియు భావము.

(చాంద్రమానమాసము, సౌరమానమాసము, అధికమాసము, నష్టమానము చూడుఁడు).

## మాసలిగోత్రము

(నిధృవగణము చూడుఁడు.)

## మాసురాక్షగోత్రము

—(కౌమన్డ ఉపగణము చూడుఁడు.)

## మాసురాక్షగోత్రము

—(ఔతథ్య ఉపగణము చూడుఁడు.)

## మాసురేషిగోత్రము

—(కౌమన్డ ఉపగణము చూడుఁడు.)

## మాసురేషిగోత్రము

—(ఔతథ్య ఉపగణము చూడుఁడు.)

## మాసోచిత నామములు

— హిందూ కుటుంబములలో క్రొత్తగ జన్మించిన బాలబాలికలకు నామకరణ మొనర్పునతరి నిడఁదగిన మాసనామములు.

చైత్ర- బాలునకు కృష్ణః; బాలికకు భూదేవి, వైశాఖ-బాలునకు అనంతః, బాలికకు కల్యాణి. జ్యేష్ఠ- బాలునకు అచ్యుతః; బాలికకు సత్యాదేవి, ఆషాడ-బాలునకు చక్రికః; బాలికకు పుణ్య

వతీ. శ్రావణ- బాలునకు వైకుంఠః; బాలికకు రూపవతీ. భాద్ర- బాలునకు జనార్దనః; బాలికకు ఇందుమతీ. ఆశ్వీజము - బాలునకు ఉపేంద్రః; బాలికకు చంద్రావతీ. కార్తీకము- బాలునకు యజ్ఞపురుషః; బాలికకు లక్ష్మీదేవి. మార్గశిరము- బాలునకు వాసుదేవః; బాలికకు వాగ్దేవి. పుష్యము- బాలునకు హరిః; బాలికకు పద్మావతీదేవి. మాఘమాసము - బాలునకు గోవిందః; బాలికకు శ్రీదేవి. ఫాల్గుణమాసమున బాలునకు పుండరీకాక్షః; బాలికకు సావిత్రీ దేవి.

మాసనామము నక్షత్రనామముగాక, వ్యావహారికనామము వేఱుగ నిడుచుందురు.

**మాహినది** మాళవదేశమున నొకనది. దీనిప్రశంస మార్కండేయపురాణము, ౫౭ అధ్యాయమునఁ గలదు. దీనిసంగమముఖద్వారమునకడ నొకగుహాయం దంధకాసురుని బరమేశ్వరుఁడే విహారుం జేసినటుల శివపురాణము ౧-౩౫-౪౩ యందుఁ గలదు.

**మాహిష్మతీపురము**-- (అనూపదేశము జూడుఁడు).

**మాహిష్మంతుఁడు** — అత్రి చంద్ర యాదవ హైహయవంశ క్షత్రియుఁడు. చేది దేశపురాజధానియగు మాహిష్మతీపుర మీతని పేరఁబరగుచుండెను. కుమారుఁడు వృష్ణి.

మాహిష్మతీపుర ముండినతా విప్పటి యిందూరు సంస్థానపు టింకూరునకు దక్షిణముగా నలుబది మైళ్ళదూరమున నర్మదానదీతీరమున నున్నది. ఆనాటి శివాలయము "మూళి మాహేశ్వర" మను పేరఁ గడుప్రసిద్ధక్షేత్రము. ఈక్షేత్ర ప్రశంస మత్స్యపురాణము ౧౮౯ అధ్యాయమునఁ గాననగును. (చేదిదేశము చూడుఁడు).

ఈమాహిష్మంతు నొకటవ మాహిష్మంతుఁడనఁ దగును. ఈతని ముమ్మనుమని కుమారుఁడొక మాహిష్మంతుఁడు గలఁడు. అతనికి ధనికుఁడని నామాంతరము. తండ్రి ఉశీనస్సు. పుత్రుఁడు కృతవీర్యుఁడు. మనుమఁడు కార్తవీర్యార్జునుఁడు.మాహిష్మంతునినంతతివారికి తాళజంఘులనియు వాడుకనామము గలదు.

**మాహురము (క్షేత్రము)**_దీనినిప్పుడు 'మాహో'' రని వాడుచున్నారు. ఇప్పుడు మహారాష్ట్రభూమియం దున్నటులఁ దలంపఁబడుచున్న పుణ్యస్థలము. కాకతీయసామ్రాజ్యముండినదినములందాంధ్రభూమిగ నుండినటులఁ గొందరు లకు లనెదరు. నైజాము రాజ్యమున నాదిలాబాదునుండి, దుండ్వో, యమ్రి మున్నగు నిరువదిరెండు గ్రామములమీఁదుగ నేఁబదిమైళ్ళ దూరపుటరణ్యమార్గమున (రోడ్డు లేనినాటిదారి) మృగభయమునకు జాగరూకులై పోవలయును. ఆదిలాబాదు, నైజాంస్టేటు రైల్వే చిన్నలైనుపై "నిజామాబాదు" నుండి ౬౫ మైళ్ళదూరమునఁ గలదఁట. మాహూరు నైజాము రాజ్యపుహద్దులో బీరారుప్రాంతమున నున్నది. ఇచట గొప్ప దుర్గము గలదు. అది చెట్లు మొలచి పాడగుచున్నది. జనాభా 1515 ననియు, నేటేట మూఁడు గొప్పయుత్సవములు జరుగుచుండు ననియు, నత్తఱి నేఁబదివేలవరకు యాత్రికులు (బీరారు ప్రాంతములోని వారు) స్వదేశస్థులు చేరుచుందు రనియు తెలిసెడిని. ఇచట దేవస్థానములు పెక్కులున్నను, ప్రధానములు రెండు. ౧. దత్తాత్రేయదేవస్థానము, ౨. రేణుకాశక్తి దేవస్థానము,(రేణుకాశక్తియే ఏకవీరాదేవి. (ఓరుగంటిపురపుకాకతమ్మ)

దత్తాత్రేయదేవస్థానము- దీని వ్యయములకు గారు గ్రామములు నైజాము రాజ్యమునందును, పదునాలు గ్రామములు బీరారునందును గలవనియు, నరువదివేలరూప్యములు రాఁబడియని

యు నందురు. పరిపాలించు మహాంతు వంశక్రమమున నిరువది యేడవ పురుషుఁడట. మహాన్భావో కలస్థుఁడఁట. దీనిని పిశారీదేవాలయ మనియు వాడుట కలదు. రెండవది యగు రేణుకాదేవి దేవస్థానమునకు బీరారు రాష్ట్రమున రెండు గ్రామము లున్నవఁట. దేవస్థానపు పూజారుల తగవు వలన మంచిస్థితియం దున్నదని చెప్పవీలు లేదు.

మాహూరున నిరువది పూజారిగృహము లున్నవఁట. ఇం దైదుగురు మహారాష్ట్రకులస్థులు ఒకగుంవ్ (ఆంధ్రదేశపుఁ దమ్మిళులవంటి కులము) కూడ కలఁడఁట. పరిసరములఁ బెక్కు దేవాలయములు కలవు. అందు కొన్నింట నుత్సవాదులు జరుగుచున్నవఁట. పరిసరములఁ గొన్ని యష్టోదకకుండములు గలవు. పింగళి సూరనార్యుని కళాపూర్ణోదయమునను, క్రీడాభిరామమునను మాహురక్షేత్రప్రశంసలు, నీ రెండు దేవస్థానముల ప్రశంసలు గలవు. యోగాభ్యాసమొనర్చువారికిఁ గృతార్థతం గల్గించుటకు దత్తాత్రేయ దేవస్థానము పేరందిన దందురు. ఇది భారత యుద్ధకాలమునకే యున్నదని పింగళి సూరనార్యుఁ డభిప్రాయపడి యున్నాఁడు. కార్తవీర్యార్జునచక్రవర్తి కిట సంబంధ మున్నదని పరిశీలకు లందురు. తుళువ నరసభూపాలుఁడు మహురమును జయించెనని వరాహ పురాణమునఁ గలదు. ఈ రేణుకాదేవికే (ఏకవీరాదేవి) 'కాకతమ్మ' యని పేరఁట. ఆమె నారాధించు భక్తులు గాన వారు 'కాకతీయు' లనఁ బడిరఁట. (కాకతీయసామ్రాజ్యము-ఓరుగల్లు చూడుఁడు) ఈశ్వరనరసింహుని విజయగీతములం దీక్షేత్ర ప్రశంస కలదు.

**మాహులగోత్రము**- (సాహులగణము చూడుఁడు.)

**మాహువిగోత్రము**- (ఆత్రేయగణము చూడుఁడు.)

**మాహారాజ్యగోత్రము**-(నిధృవగణము చూడుఁడు.)

**మాహే**—(ఫ్రెంచి యిండియా చూ.)

**మాహేశ్వరపురము**--(అనూపదేశము చూడుఁడు.)

**మాహేశ్వరసూత్రములు**—పరమేశ్వరుండగు శివుఁడు తాండవ మొనర్చు సమయమున నెల్లరును పరమేశ్వర నిజతత్త్వ మెఱుఁగఁ గోరి నిరీక్షించుచుండిరి. అత్తరి తనఢక్క (వాయిద్యవిశేషము)ను బరమేశ్వరుఁడు వాయించెననియు, నది ౧. అ, ఇ, ఉ ణ్, ౨. ఋ, ఌ క్, ౩. ఏ, ఓ ఙ్ ౪. ఐ, ఔ చ్, ౫. హ, య, వ, ర ట్, ౬. ల ణ్, ౭ ఞ, మ, ఙ, ణ, న మ్ ౮. ఝ, భ ఞ్, ఘ, ఢ ధ ష్ ౧౦. జ, బ, గ, డ, ద శ్, ౧౧. ఖ, ఫ, ఛ, ఠ, థ, చ, ట, త వ్, ౧౨. క, ప య్ ౧౩. శ, ష, స ర్, ౧౪. హల్ అనునవి. అనఁగా నిటుల ధ్వనించునటుల నాఢక్క మ్రోఁగెనని భావము. వీటికే 'మాహేశ్వరాణి సూత్రాణి' యనియు, 'మాహేశ్వరాణి' యనియుఁ బేళ్ళు వాడుక యయ్యెనఁట. వీట్ల నింకను గొందఱు 'శివసూత్రము' లని వాడియున్నారు.

ఈ పదునాలుగు సూత్రముల నాధారముగఁ గైకొనియే పాణిని యష్టాధ్యాయిగ వ్యాకరణ సూత్రములను రచించియున్నాఁడు. (సిద్ధాంత కౌముది).

శివభక్తులలో నగ్రేసరుఁ డనఁబడిన నందికేశ్వరుఁ డిరువదియారు కారికలను, రెండు శ్లోకములను, నుపోద్ఘాతముగ రచించెననియుఁ, బిదప నుపమన్యువు (ఉపమన్యువు చూడుఁడు) "తత్త్వవిమర్శిని" యను వ్యాఖ్యానము రచించెననియుఁ జెప్పఁబడినది.

తరువాత నక్షురజ్ఞుం డనునొక యాంధ్రపండి.

తుఁడు వాటికిఁ బ్రతిపద టీకాతాత్పర్యముల నాంధ్రమున రచించుచు, నింకను వాటికిఁ బ్రమాణములుగ బ్రహ్మసూత్రములు, యోగ సూత్రములు, నుపనిషద్వాక్యములు, భగవద్గీ శ్లోకములు, (అధ్యాత్మరామాయణో త్తరకాండ మునందలి)రామగీతాశ్లోకములను, (శంకరభగ వత్పాదుల) వేదాంతప్రకరణ శ్లోకములఁగూడ పొందుపరచి, దానికిఁ "బ్రణవవల్లి" యని పే రిడెనఁట. అట్టిగ్రంథ మిటీవల ముద్రింపఁ బడినది.

## మాళవదేశము- (అవంతి దేశముచూ).

## మాళవదేశపు మాండూపురము —

(సుల్తానులనాటిచరిత్ర). మాళవదేశము నాది కాలమున భోజమహారాజు పాలించెనని యెల్ల రెఱింగినదే. ఇది "రేవా" యనఁబడు నర్మదా నదీతీరములం దున్న దేశము. దీని నిప్పటి ఆంగ్ల భూగోళ శాస్త్రములందు సెంట్రలిండియా (మధ్య ఇండియా) యని వాడియున్నారు. ఆ నాఁటి ధారాపుర (రాజధాని) మిప్పుడు ధార్ సంస్థానపురాజధానియై 'ధార్' అని పిలువఁ బడుచున్నది. ధార్ పుర మిండూర్ పురమునుండి నలుబదిమైళ్ళదూరము ప్రయాణమునకు మంచి మోటారుబాటపై గలదు. అది యడవులనుండి నడచెడిని. ధార్ పురమునుండి యిరువదిరెండు మైళ్ళదూరమునం దడవులలో నొక పర్వతసీమ యందు మనప్రస్తుతాంశమగు మాండూపురపు పాడుగలదు. హిందూప్రభువులనాడు గాకున్న నాఫ్ఘనుసుల్తానులపాలనమునరాజధానిగనుండిన మాండూ(షాదియాబాద్ మాండూ)యిప్పుడు కుగ్రామమై కొందరు భిల్లులకు నివాసమై యున్నది.

మాళవదేశమున ధారానగరమున కిరువది రెండుమైళ్ళదూరమున నుండిన యీపురప్రదేశ మేపేరం బరగుచుండెనో తెలియదు. ఏనామ ము మారి 'మాండూపద' మైనదో చెప్పవీలు గాకున్నది. కాని యిది పూర్వముండినపేరుతో సంబంధమున్న పదమని కొందరనెదరు. ఆఫ్ఘను తురకసుల్తానగు (హూషంగు బహద్దరుకుమా రుఁడు) మహమ్మద్ఘోరీపాలనమున, నాతఁడు దీనికి "షాదియాబా" దని పేరిడి, యాజ్ఞాపత్ర మిచ్చెఁగాని, ప్రజల వాడుకయందు 'షాదియా బాదు' 'మాండూ'యని రెండు పేరులునుకూడ నుండినటుల శాసనములు గన్పించుచున్నవి. 'షాదియా బాద్' అనిన పుష్తూ భాషయందు "సంతోషపుర"మని యర్థమగును.

మాండూపురఁపుపాడునందు పురమును జుట్టి యున్నదుర్గమునందే "రేవాకుండ"మను స్నాన తీర్థము గలదు. దానిని తన భోగవనితయగు రూపమతి భక్తిచేఁ గోర, బాజ్ బహద్ద రను సుల్తాను మరమ్మతుచేయించుచో "బాగు"గఁ గట్టించెను. అది నేఁటికిని హిందువులకు స్నాన తీర్థమై యున్నది. అట నొకయోగిని తపంబొన రించుచు నాశ్రమ మేర్పఱచుకొని వసించు చున్నది. దానిప్రక్కను హిందువులకు సత్రము గలదు. ఈకుండ మాదిని (హిందూప్రభువుల నాఁడే) స్నానతీర్థమై యుండెనఁట. ఆనాటి యానవా ళ్ళిదమిత్థమని వివరింపఁ గానరా కున్నను, నచ్చటచ్చట పడియున్న శిలాచిత్ర ములు, దేవస్థానముల చిత్రపుముక్కలు నిది పూర్వము హిందూరాజులస్థల మని తెలుపక పోవు. స్థూలదృష్టి కిక్కాలమునఁ గనిపించు పాడు కట్టడము లన్నియు, నాఫ్ఘన్ సుల్తానులు నిర్మించినవియే. రేవాకుండమును గొందరు "నీలకంఠగుండ"మనియు వాడుచుందురు. ఇది జలబుద్బుదము. దీనిఁగూర్చి సరిగఁ దెలియరా కున్నది. ఈపరిసరముల నడవినెమ ళ్ళధికముగఁ గానవచ్చెడిని. రాత్రులందు పులిభయము

గలదని వదంతు లున్నవి.

పురముఁ జుట్టిన దుర్గములోని కరుగుతరిఁ దొలుత నలంగీర్ దర్వాజానుండియుఁ బిదప నచిరకాలముననె "భంగీ" దర్వాజానుండియుఁ బోవలసి యుండును. భంగీ యను కూలివాని నాదర్వాజా పునాదులలో బలియిచ్చుటం జేసి యాద్వారమున కాతని పే రిడఁబడెనఁట. ఇంకను దుర్గమునకు ఢిల్లీదర్వాజా మొదలగు పెక్కు ద్వారములుగలవు. పెక్కు లడవిచెట్లుబలసి, పో వీలుగాక యుండును. ఆదిని హిందూప్రభువుల నాఁ డిట నొకదుర్గ ముండెనదనియు, వారు "పరమార్" వంశక్షత్రియు లనియు, యదు మహారాజుసంతతివా రనియు, బలమగు వాదుక లున్నవి గాని నిదర్శనములు స్పష్టమై గానవచ్చుటలేదు. ఇప్పు డీప్రదేశము ధార్ సంస్థాన రాజ్యములోనిదై యుండి, ధార్ పురమున కిరువదిరెండు మైళ్ళదూరముననే యుంట, నీకథనము కొంత నిజమనియె తోఁచెడిని. ధార్ సంస్థానమేలు భూపతులును పరమార్ వంశక్షత్రియులే, యదుసంతతివారేగ నఁగిరియాలోచింప వలసియేయుండును. ఈ క్షత్రియవంశసంభూతుఁడగు కడపటిభూపతి రాజమాలక్దేవునకును నాఫ్ఘనుసేనానియగు నాల్తమష్నకును సంగరము క్రీ.వె. ౧౩౦౫లో నడచుచుండుకతన, నత్తరి ఢిల్లీసుల్తానుగ నుండిన మహమ్మదీయప్రభువు కొంతసైన్య మంపి, క్షత్రియప్రభు నోడింపఁజేసి, యాల్తమష్ను దనకు సామంతునిగా మాళవదేశమునం దుంచెను. ఆతని సుతుఁడగు దిల్వార్ఖాను తనబలముఁ జూచుకొని, ఢిల్లీసుల్తానుపై నతిక్రమించి, సామంతుఁడైయుండక తాను స్వతంత్రుఁడ నైతినని ప్రకటించి, మాళవదేశమున మొదటిసుల్తా నాయెను. ఆతనికిఁ బిదప నాతనిసుతుఁడు హొషంగుషా, తండ్రిసింహాసనము నెక్కి, రాజధానిని మండూపురమునకు మార్చుకొనెను. ఈతఁడు రెండవ సుల్తాను. ఇప్పుడున్న కోటఁ గట్టించినవాఁడు. ఈతఁడు రణశూరుఁ డని చెప్పఁబడినవాఁడు. "ఫెరిష్తా" చరిత్రకారుఁ డితని ఋషివంటి పవిత్రమూర్తి యని పొగడియున్నాఁడు. ఈతని నొకతరి గుజరాతుసుల్తా నోడించి, బందీగాఁ గొంపోయెనఁట. ఆతని నీతఁడు మెప్పించి విడుదలయై తిరిగి మండూ చేరెనఁట. ఫెరిష్తాచారిత్రకుఁ డీయనగోరీకడ ప్రజలు మ్రొక్కులు చెల్లించుచుండి రని వ్రాసెను. ఈ హొషంగుషా నరపాలుఁడే యుత్కలదేశపు జాజ్నగరుపై దండయాత్ర సల్పినవాఁడు. ఆతని మాయ యెత్తు లీయుద్ధమునుండి తెలియఁగలవు. సంగరమొనర్పక వర్తకులవలె బట్టల బేలులఁ గొని, బలాఢ్యులగువారితో నరిగి, యుత్కలభూపతిం దర్శించి, యాతని నకాత్తుగఁ బట్టుకొని బందీ జేయ, నాతఁ డత్తరి జేయునది గానక డెబ్బదియైదు దంతావళములను తనకొలకు జహారరణ్యమునుండి రప్పించినవి యాతనికి బందెగా నొసఁగి పంపివేసెనఁట. జాజ్నగ రిప్పటి భువనేశ్వరక్షేత్ర ప్రాంతమందున్న పాడుగ్రామమై యున్నది.

హొషంగ్షా మాఁడూపురమున నొక పెద్దమశీదును నిర్మించి, యందొక్కశాసనము వేయించెను. అందీమశీదునందలి స్తంభములు మొదలగునవన్నియు మక్కామసీదు దైవగృహ (బైతుల్లా) ము పోల్కెనే నిర్మింపఁబడియెఁ గాన దేవదూతలు పావురములవలెను, గువ్వలవలెను దీనినివదలఁ జాలక నిందు వసించుచుందు రని యున్నది. నిజమున నిక్కాలమున నామసీదునందు పావురములు, గువ్వలు వసించుచునే యున్నవి. పట్టణముపాడై యట బ్రార్థించువారు లేక నవి స్వేచ్ఛతో నిర్భయముగ నుండ వీలగుచున్నది. అందలి హాలు చాల గొప్పదియు

నందమైనదియు పెద్దదియు నై యున్నదని పెర్కొండ్రు పరిశీలకు లభిప్రాయపడి యున్నారు. ఆపరిసరములందే యాయనగోరీయుఁ గలదు. అదియును బెద్దకట్టడమే. ఇందు పెద్దమార్బలురాళ్ళ వాడిడి గలదు.

హుషాంగుషాకుఁ బిదప నాతనిసుతుండు మహమద్ఘోరీ మూడవసుల్తానుగా మాండూసింహాసన మధిష్ఠించెను. ఈతఁ డేకట్టడములను గట్టించినట్లు చెప్పఁబడలేదు. గాని ఫెరిస్తా చారిత్రకుఁ డీతఁ డాపురమునకు "షాదియాబా"దని పేరిడెనని వ్రాసెను గాని, ప్రజలవాడుకయందా మాండూనామము మాసిపోక "షాదియాబాద్ మాండూ" యని వాడఁబడుచుండినటుల శాసనములు బయల్పడినవి. ఈ మూడవసుల్తానుచే నిడఁబడిన పేరునకే సంతోషపుర (City of joy)మని యర్థము. ఈసుల్తాను, మాళవరాజ్యపాలన మంతయు మంత్రికి వదలివైచి, తాను లోలుండై మధుపానముతో కాలముంబుచ్చసాగెను. తన కేబాధలు గలుగకుండ జాగ్రతయోయనునట్లు తనసోదరుం జంపించివైచి, వానిసుతులకుఁ గండ్లు తీయించి యంధులుగఁ జేసెను. కొంతకాలమునకుఁ దనమంత్రిపైగూడ ననుమానపడి యాయనను జంపించి,తానే పరిపాలనము నడుపనారంభించెను. ఆ సుముహూర్తమున మశీదునందు ప్రార్థనలు జరిగె ననియు, టంకశాలయందు తనపేర నాణెములు ముద్రింపఁబడెననియు, బీదల కన్నదానము చేసి, సామంతుల కేనుఁగులు, గుఱ్ఱములు, బహుమానములొసఁగఁబడెననియుఁ దెలిసెడిని. తోడనే దిగ్విజయమునకు వెడలి రాజ్యమును వ్యాపింపఁజేయఁగల్గె నఁట. హిందువుల దేవస్థానములఁ జెఱిపె ననియుఁ,గళాశాలల నిర్మించి విద్యలను వ్యాపింపఁజేసి తనప్రజలను పండితులుగ నొనర్ప



మండూపురము సమర్కండుతో తులదూఁగెనని ఫెరిస్తాచారిత్రకుఁడు వ్రాసెను.

మహమ్మద్ ఘోరీకిఁ బిదప మహమ్మద్ కిల్జీ మాళవదేశపు సింహాసనమునకు నాల్గవసుల్తానుగా వచ్చెను. ఈయన భరతదేశమునకు వెలుపటనున్న రాజ్యాధిపతుల స్నేహముఁగాంక్షించి, "ఫ్రాన్సు ఆక్సియానా" మొదలగుసంస్థానములకు తనరాయబారులపరిముఖమున నాట్యకత్తెలను, పాటకత్తెలను, అబ్సీనియాబానిసలను, మాటలాడనేర్చిన చిలుకలను, మైనాగోరలను ఇంక నిట్టివాటిని బహుమతులుగఁబంపెను. ఒక వైద్యశాలను గట్టించి, యందు స్త్రీ పురుషులకు దూరముగా వేర్వేరువసతులఁ జేసెనఁట.ఆయన న్యాయమూర్తి యనియు, నెవ్వనియింట నైనఁ జోరీపోయిన నానష్టమును పోలీసురక్షకులనుండి వసూలుచేసి వారి కిప్పించుపద్ధతి నేర్పఱిచె ననియు, నాయన పరిపాలనమందు హిందువులును ముసల్మానులునుగూడ సుఖంబున మనిరనియు, ఫెరిస్తాచారిత్రకుఁడు వ్రాసియున్నాఁడు. ఈ మహమ్మదుకిల్జీ సుల్తానే మేవారుభూపతి యగు కుంభమహారాణాపై దాడి వెడలి, సంగరమున నోడి, యాయనకు బందీగాఁ జిత్తూరునకుఁ గొంపోఁబడి, యందుఁ గొంతకాలముంచబడుట కానవాలుగ నటజయస్తంభ మాయన నిర్మింప, నేటికి నది చిత్తూరునందుఁ గాననగుచుండ, ఫెరిస్తాచారిత్రకుఁ డీయన "సంగరమున కుంభమహారాణాను జయించె"నని వ్రాసియున్నాఁడు. దాని కానవాలుగఁ, గొన్నిస్తంభము లీయనయు మాండూపురమున నిర్మించెనఁట గాని యవి కూలిపోయి క్రిందిపునాదులు మాత్రము గాననగుచున్నవి.

మాండూనగరమునందీయనకాలమున 'యూజ్డానీ' యనుపేరుగల చరిత్రకారుఁ డొకఁ డుండి

చరిత్రను వ్రాయుచుండెను. అందలి కొన్ని భాగము లిప్పుడు దొరకెడిని. తక్కిన వెట్లో చెదపాలైన వందురు. ఈయన వ్రాతలఁబట్టి యీయనకు స్త్రీవాంఛ యధిక మనియు,నంతఃపురమును గావాడ స్త్రీలపట్టణ మొకటి యుండెననియుఁ జెప్పఁబడెను. ఈయనకుఁబిదప నీయన సుతుఁడు గయాజుద్దీన్‌మహమ్మదు మాళవ సింహాసనమున కైదవసుల్తా నాయెను.సింహాసన మధిష్ఠించుతరి నీభూపతి తనకు సంగరముపైఁ గాంక్ష లేదనియు, తనదక్కిన కాలమును సౌఖ్యముగఁ గడుపఁ దలంచితి ననియు, ప్రజలకుఁ బ్రకటించెను. నిజముగ నభ్భూపతి యట్లే యొనర్చెనని తెలిసెడిని. జహంగీరుచక్రవర్తి తనస్వీయచరిత్ర (Memoirs)యం దీయనను గూర్చి వ్రాయుచు, నీతనికి వింతయగు స్త్రీల భ్రమ, స్త్రీలచే నింపఁబడిన పూర్తియగు నొక పట్టణమును నీయనచే నిర్మింపఁజేసె ననెను. అందనేకజాతుల, తెగల స్త్రీలు గలరనెను. దండనాథులు రక్షకభటులు, కొత్వాలులు,ఖాజీలు, మొదలగువారెల్లరు నందుఁ గలరనెను. వారికిఁ జిత్రకళలు నేర్పఁబడిన వనియు, నందు వేటకత్తెలు గలరనియు వివరించెను. ఆ సుల్తాను నంతఃకరణము మంచిదనియు తోచుననెను. పెందలకడ మేల్కాంచు టతని కానందమనెను. ఉదయమునవనే మొగమునకు జలము లలఁది లేపుట కాతఁడు కోపగించువాఁడు గాఁడని వివరించెను.

ఆయన వృద్ధయి యెనుబదేండ్లవాఁడై నతఱి నాతనిసుతుఁడు నాజరుద్దీ నాయనకు త్రాగెడి పర్బత్తులో విషముఁగల్పి యిచ్చి మృతిఁజెందఁజేసెనఁట. ఈదుర్మార్గుఁడట్లు పితృహత్యనొనర్చి యారవసుల్తానుగా మాళవసింహాసన మధిష్ఠించె నఁట. కొన్ని పూఁదోఁటలను వేయించి, యొక రాజభవనమును నిర్మింపఁ మొదలిడెను. ఈతనికి దురహంభావమును, ముక్కోపము నధికమట. మద్యపానోన్మత్తుఁడై సదా కాలముబుచ్చుచుండువాఁడఁట. ఒకతఱి నొడలు తెలియక యొకజలకుండమునఁబడి ప్రాణములఁగోల్పోవనున్న యెడ నున,ముప్పురుపరిచారిక లాతని దరిజేర్చిరక్షింప తెలివివచ్చినపిదపఁ దానొనర్చు కార్యమునకు వారు ప్రతిహతకార్య మొనర్చిరని వారియందు నేరము మోపి, యా ముప్పురను తనచేతులార వధించెనఁట. పిదపఁ దాను నందే పడి మృతి నందెనని జహంగీరుచక్రవర్తి స్వీయచరిత్రలో వ్రాసియున్నాఁడు. ఈయనయనంతర మీయన సుతుఁడు రెండవమహమ్మదుకిల్జీ యేడవ సుల్తానుగా మాళవదేశ సింహాసన మధిష్ఠించెను. ఈయన రాజనీతిజ్ఞుఁడై నట్లు గానరాదు. రాజ్య పరిపాలనము ఖడ్గపు (అసి) ధారనుండియే జరుపదగునని యీయనతలంపు. అట్లే యొనర్చి,అసిధారకే యాయనయు తన ప్రాణ మర్పించెను. ఈయనతో మాళవదేశ రాజ్యమేలిన కిల్జీవంశ మంత మయ్యెను. ఈయనకు సంతతి లేనందున, నీయనబంధు వొకఁడు ఖాన్‌బహద్దరను పేరు గలవాఁడు కడపటిసుల్తానుగా సింహాసన మధిష్ఠించెను.

ఖాన్‌బహద్దరు చక్కనివాఁడఁట. తనసౌందర్యమునకాయనకుఁగర్వమధికమఁట. ఈయన పాలన మారేండ్లును, రాజ్యవ్యవహారము లుద్యోగులవశమందు నడచుచుండ,నీమన్మథుండుభోగలాలసుఁడై తనకాల మంతయు "రూపమతి" యనఁబడిన యొకభోగవనితతోఁ గడపుచుండెను. ఆమె గాత్రసౌష్ఠవము, నిపుణత, గలయొక సంగీతపాటకురాలఁట. చనిపోవుటకామె హిందూమతస్థురాలుగనే యుండెను. ఆమె రేవా (నర్మదా) నదికి భక్తురాలఁట. ఈయిర్వురు దంపతులకు మంచపుపొత్తే గాని, కంచపుపొత్తు లేకుండెనఁట. రూపమతీలోలుఁ

డైన యాభూరితి, యామె స్నానములొనర్ప రేవానది కరుగుటమాన్పి, తొల్లింటి నీలకంఠ కుండమునకు "రేవాకుండ" మను పేరిడి, దాని చుట్టున హిందూదేవళముల నిర్మింపఁ జేసి, దానిని బాగుచేయించె ననియు, నాప్రక్క నీయనకుఁ బూర్వుఁడగు రెండవ మహమ్మదుకిల్జి భూపతిచే బ్రారంభింపఁబడిన ప్రాసాదముఁ బూర్తిచేయించి, "రేవామహ" లని పేరిడియె నందురు. ఆ రెండవకిల్జిభూపతినాఁడే నిర్మింపఁబడిన 'జాజ్ మహల్' (Ship Palace) నందే ఈయన వసించుచుండెనని తెలిసెడిని. రేవామహాలును, వినోదభవనముగా వాడుచుండె నందురు.

అక్బరుచక్రవర్తి యీయనను పదభ్రష్టుని జేసి, రాజ్యమును తనసామ్రాజ్యమునకుఁ గల్పుమని ఆదంఖాను సేనాని కుత్తరువొసంగ, నాతఁడు సేనలతోఁ రాఁగా, బాస్ బహద్ద రెదుర్కొని, పోరి యోడిపోయె ననియు, నెల్లెటో తప్పించుకొని "సరంగపూ" రను తావునకుఁ బాఱిపోయి, యట శత్రువునకుఁ దొరకిపోయె ననియు, రూపమతియుఁ బాఱిపోయి సరంగు పూరున కరుగుతరి, శత్రువులకుఁ దొరకి, విషముఁ దిని మరణించె ననియుఁ జెప్పఁబడినది. రాజ్యము డిల్లీసామ్రాజ్యమునకును, పిదప దానినుండి ధార్ సంస్థానాధీశ్వరులగు పరమార్ వంశ ప్రభువులకును, వశమై నేటికిని వారిపాలనమందే యున్నది. మాండూపురము మాసిపోవుచు వదలివేయఁబడి చిన్న భిల్లుగ్రామమై యున్నది. వా రెండవేళలయందు పెద్దమశీదునందలి ప్రార్థనచావడియందువిశ్రాంతి గొనుచు వాడుకొనుచున్నారు. (మేవాడ్, చిత్తూర్ చూడుఁడు).

మాళవదేశ మక్బరునాఁడు మొగల్సామ్రాజ్యమునకుఁ జేరిపోయిన పిదప, పాదియాబాద్ మాండూపురము పాడుపడ నారంభించెనని వేరుగఁ జెప్పనక్కరలేదు. అక్బరుచక్రవర్తి, పిదప నైదుపర్యాయములు మాండూపురము దర్శించినటుల యాయనస్వీయచరిత్రయందుఁ గలదు. ఆయన కచటి కట్టడముల నిర్మాణ మచ్చెరువు గొలిపెనఁట. పిదప నాగ్రవద్ద, కాక్రలికడ నౌకభవన మట్టిది నిర్మింపఁ జేసి, దానికి "మహల్మండూ" యని పేరిడెను. దక్షిణహిందూస్థానముపై దాడివెడలుతరి, నట నౌక మకాముగ నాఁగెనఁట. ౧౫౭౩ లో నౌకతరి నిట కరిగినటులఁ దెలియుచున్నది. పిదప నిటకేగుట ౧౬౦౦ సంవత్సరమునందఁట. అప్పుడాయన వయస్సు నలువది వత్సరములు. అప్పుడు నీలకంఠకుండముకడ మహాలునందు విడిసి, యట నౌకశాసనము వేయించెను. అది నేటికిని స్నానతీర్థమై యున్నది.

పిమ్మట నాయనసుతుఁడు జహాంగీరు చక్రవర్తి, వినోదార్థమట కేగి, యేడుమాసములా ఝాజ్ మహాలు నందు నివసించి, సంగతులను పూర్తిగఁ దనస్వీయచరిత్రలో వ్రాసెను. ఈ ప్రయాణ మాజ్మీరునుండి మాండూకుఁ జేర నలువదియాఱు మకాము లాయెనఁట. చక్రవర్తితో రెండులక్షలమంది యనుచరులుండిరఁట. ఆయన యేనుఁగులపైనిగుఱ్ఱములపైని స్వారియొనర్చుచు జనెనట. శివరాత్రినాటికిమాండూపర్వతపాదమునకుఁ జేరినటులనాయనవ్రాసియున్నాఁడు. జహాంగీరుచక్రవర్తి మాండూయం దుండుతఱి, వర్షకాలము సంభవించెను. వర్షానంతరసౌందర్యము తన చరిత్రయందు చక్కఁగవర్ణించి వ్రాసెను.

ఆ ప్రయాణమునం దాయనతోఁగూడ బ్రిటీషురాయబారి Sir Thomas Roe గారునునుండిరి. ఒకచోచక్రవర్తి, ప్రపంచకపుపటము నాయన కానుకగా నీయ, నందుకొని పరిశీలించి "తనసామ్రాజ్యరాజ్యముయొక్క హద్దులుచాల

తక్కువగా వ్రాయఁబడిన" వనుచుఁ దిరుగ నిచ్చి వేసెనని బ్రిటీషు రాయబారి తనచరిత్ర యందువ్రాసికొని యున్నాఁడు.

**మాళవి**—మద్రదేశాధీశుఁడగు నశ్వపతి మహారాజు భార్య ఈమెకుమార్తె సావిత్రి. (సత్యవంతునిభార్య).

**మ్రానుపండ్లు మ్రానుక్రిందనే పడు తవి**— (ఆంధ్రలోకోక్తి).

**మింగన్పగోడా దేవస్థానము**— ఇది బర్మాదేశమునందు మాండలే నగరమునుండి యైరావతీనది కవ్వలితీరమున నైదుమైళ్లదూర మునఁ గలదు. ఇటకు మాండలేనుండి చిన్నస్టీమరులోఁ బోనగును. ఇది గొప్పపనితనముగల దేవళము. ఆది నిది ప్రపంచమునం దంతటను బెద్దది యనిపించుకొనఁ దగినటుల ౪౫౦ అడుగుల చుట్టుకొలతతో, బోడావపాయ నృపాలుఁడు (బర్మానేలిన ప్రభువు) ప్రారంభించెనఁట గాని జ్యోతిష్కు "లాపని పూర్తి యగుతోడనే యాభూపతి మృతినొందు" నని చెప్పఁటఁజేసి వదలివేయఁ బడినదఁట. క్రీ.శ. ౧౮౩౯ సం॥న భూకంపము దీనిని కొంత పాడుజేసెను. అటనే గల 'మింగ న్బెల్' అనఁబడు పెద్దగంట దర్శనీయము. దీనియెత్తు పండ్రెం డడుగుల యారం గుళములు; అడ్డుకొలఁత (డయామీటరు) పదునారడుగుల మూడంగుళములు. బరు వెనుబదియేడు టన్ను లుండునని యంచనా వేయఁబడినది. ౧౮౩౯ సం॥రం భూకంపమునకు నేలఁబడిపోవ, ౧౮౯౬ లో తిరుగ నెత్తించి, యొక ఇనుప దూలమునకు వ్రేలాడఁదీయించి యున్నారు. మింగన్పగోడా దేవళము, బుద్ధదేవస్థానముగ మొదట సంకల్పింపఁబడినది. ఈగంట యాదేవస్థానానుబంధముగా నుండఁ దలంపఁ బడినది; గాని, యది నెఱవేఱక చూడఁ దగినదిగా మాత్రము నిలిచియున్నది. (మాండలేనగరము చూడుఁడు).

**మింగరాని మిఱిగుడ్డు; నమలరాని నారికేళము**— (ఆంధ్రలోకోక్తి).

**మింట్ పార్ ఆఫ్ ఎక్స్ఛేంజి** (Mint par of Exchange) — (వాణిజ్యసంబంధ పరిభాషాపదము). ఒక దేశములో ప్రచారము నందున్న బంగారునాణెమందున్న యసలు బంగారము, వెండినాణెమందున్న యసలువెండి (ఇతరకలుపుటకు Alloy గాక యని భావము) వేరొక దేశమందలి బంగారు వెండి నాణెముల లోని యసలు బంగారము, నసలువెండి తూనికలు పరిశీలించి వేసినలెక్క. ఇటులనే యొక Bullion (దుక్క) యందున్న యసలు వెండిగాని, బంగారుగాని, యెన్ని నాణెములకు సరిపోవునో వేసినలెక్కకు "Mint price of Bullion" అందురు.

**మికేడో (జపాన్) బిరుదము**— ఇది జపాన్ చక్రవరుల బిరుదము. దీనికి మహాద్వార (Exalted Gate) మని జపాన్ భాషయం దర్థమఁట. వారిగ్రంథములమేరకు దైవాంశసంభూతుఁడగు "జిమ్ము" అను భూపతి మొదటిచక్రవర్తి. క్రీ.పూ.౬౬౦ లో సింహాసన మెక్కెను. ఆతనిసంతతివారే జపాన్‌భూపాలురు. వీరు సూర్యవంశపువారని చెప్పఁబడినది. వీరిలో స్త్రీపరిపాలకు (చక్రవర్తినులు) లేద్గురు గలరు. షోగాను లీనడుమ రాజ్యపాలనము నడపుతతి మికేడోలు పవిత్రశరీరులు మతాధిపతులుగ తలంపఁబడి యుండిరఁట.

**మిక్సెడ్ కరెన్సీ** (Mixed currency) — వాణిజ్యసంబంధ పరిభాషాపదము. ఒకదేశమున Legal tender గ ప్రచారమునందున్న నాణెములు, నోట్లు, కలిసినధనము.

ఇటులనె కాలమునుగూర్చిన షరతులయేర్పాటులను, దూరమునుగూర్చిన షరతులయేర్పాటులనుగూడ గల్గియున్న మెరైన్ఇన్సూరెన్సుపోలసీకి 'Mixed Policy' అనిపేరు.

**మిడ్సమ్మర్డే**(Mid summer day)-ప్రతిసంవత్సరము జూన్ ౨౪ తేది వేసవికాలమున మధ్యదినముగ భావింపఁబడుచున్నది.

**మిడ్నాపూరుజిల్లా (మేదినీపురము)**-మిడ్నాపూరు (మేదినీపురము) ప్రధానస్థానము. కసేయీ (తొల్లింటి కంసావతి లేక కపిశా) నదీతీరము. (బంగాళా దేశము చూడుఁడు.)

**మిడియన్ సీమ**-ఇది మిడీయనుచే నివసింపఁబడిన సీమ. అకబా సంయుక్తాగ్రగుడ ప్రాంత సముద్రతీరఁపు సీమ. అబ్రహాము నకు కెతురా భార్యయందు గల్గిన సుతుఁడగు "మిడియను" నను వాని సంతతివారు గాన, వారు "మిడీయను" లనఁబడిరి. వీరు ముఖ్యముగ వర్తకులై యుండిరఁట. సీనాయిపర్వతప్రాంత దేశము వీరిసీమయఁట. ఈజిప్టు, సిరియా దేశములతో వీరుకార్వానావర్తక మొనర్చువారఁట. జోసెపును, వానిసోదరు లమ్మిన దీమిడీయన్ వర్తకులకే నఁట.

**మిడ్నైటు సన్ (Midnight Sun)**-(ఉత్తరధ్రువమహాసముద్రము జూడుఁడు)

**మితముతప్పి తింటే అన్నీ విషమే**-(ఆంధ్రలోకోక్తి)

**మితకుంభగోత్రము**— (నిధ్రువగణము చూడుఁడు.)

**మిత్రనక్షత్రగోళము** — (నక్షత్రములు భారతీయులు గుర్తించినవి చూడుఁడు).

**మిత్రబాహువు**—అత్రి చంద్ర యాదవ క్షత్రియుఁడు. తండ్రి శ్రీకృష్ణుఁడు. తల్లి నాగ్నజితీదేవి. సోదరులు ప్రద్యుమ్నాదులు. (శ్రీకృష్ణుఁడు చూడుఁడు).

**మిత్రయజ్ఞగోత్రము**-(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు).

**మిత్రయుగ గోత్రము**- (వాధ్ర్యస్వ లేక మిత్రయుపగణము చూడుఁడు).

**మిత్రయుపగణము**— దీనికి వాధ్ర్యస్వగణ మనుపేరు వాడఁబడినది. భృగుసంతతిలోని యొకగణము. (వాధ్ర్యస్వగణము చూ).

**మిత్రయుపగోత్రము**—(వాధ్ర్యస్వ లేక మిత్రయుపగణము చూడుఁడు).

**మిత్రవనము**-పాంచాలదేశమునందలి ముల్తాను ప్రాంతారణ్యసీమ కీపేరు. సాంబపుర మీయరణ్యముననే యుండెను. అది సూర్యక్షేత్రము. సాంబుఁడు శ్రీకృష్ణునిసుతుఁడు.

**మిత్రవంతుఁడు**-అత్రి చంద్ర యాదవ క్షత్రియుఁడు. తండ్రి శ్రీకృష్ణుఁడు. తల్లి మిత్రవిందా దేవి. సోదరులు ప్రద్యుమ్నాదులు. (శ్రీకృష్ణుఁడు చూడుఁడు.)

**మిత్రసప్తమి**— దీనిని "నందాసప్తమి" యనియు, "కాలభైరవ సప్తమి" యనియు నందురు. హిమవన్నగ సీమలందలి నందాదేవి యాత్రయు, నుత్సవములును, కాశీ మొదలగు కాలభైరవక్షేత్రములందు కాలభైరవపూజలును, సూర్యక్షేత్రములందు (మిత్రసప్తమి) సూర్యపూజలును, విశేషముగఁ జరుగు పర్వదినము. మార్గశిరశుద్ధసప్తమి. (పండుగులు చూడుఁడు.)

**మిత్రసహుఁడు**-(కల్మాషపాదుఁడు చూ.

**మితాక్షగోత్రము**-(ముద్గలఉపగణము చూడుఁడు).

**మిత్రావరుణ గోత్రము**—(కుండిన గణము చూడుఁడు).

**మిత్రుఁడు**—భార్య రేవతి. కుమారులు శకృరిష్టుఁడు, పిప్పలుఁడు.

**మిద్రాష్ (Midrash)**—బైబిల్ ప్రాత నిబంధన పైని వ్రాయఁబడిన పురాతనఁపు హిబ్రూవ్యాఖ్య. ఇం దనేకగాథలు వివరింపఁబడినవి.

**మిథిల దేశము, తిరభుక్తి దేశము విదేహ దేశము**—సీతామహాదేవితండ్రియు మహాజ్ఞానియు నగు జనకమహారాజు పాలించిన దేశము. హద్దులు సరిగా తెలియకున్నను, నిప్పటి బీహారదేశములోని దర్భాంగ సంస్థానము, తిరుహూత్, జనకపూరు, శితామర్హి మొదలగుతావు లీదేశములోనివే గాన నాప్రాంత దేశమక్కాలఁపు మిథిలాపురమే జనకపురముగ మారి, నేఁటికి నాపేరఁ బరగుచున్నదఁట. 'శితామర్హి' సీతాదేవిజన్మస్థల మఁట; ఇంక ననేకయానవాళ్లఁ జూపుచున్నారు. తిరభుక్తి యను పేరు తిరుహూత్‌గా మారినదందరు. జనకపురముఁ గూర్చినప్రశంస భాగవతము ౯-౧౩ నందుఁగలదు.

౧౪ వ శతాబ్దమధ్యనుండి ౧౬ వ శతాబ్ద మధ్యవరకు బ్రాహ్మణు లీదేశమేలిరఁట. అందాకవనృపాలుఁడు శివసింహుఁడను పేరుగలవాఁడు తనయాస్థానవిద్వాంసుఁడగు విద్యాపతికి క్రీ. వె. ౧౪౦౦ సంవత్సరమున 'బిసపి' యనుగ్రామ మగ్రహార మిచ్చినటులను, రాజధాని 'గజరథపుర'మనియుఁ దెలియుచున్నది. (లక్ష్మణశకము ౨౯౩ సం॥) మిథిలవిశ్వవిద్యాలయము క్రీ. వె. ౧౪-వ శతాబ్దమున నుండెనఁట. బక్తియార్ కిల్జి విక్రమశైలవిశ్వవిద్యాలయమును భగ్నమొనర్చినపిదప నవద్వీపవిశ్వవిద్యాలయము నిర్మింపఁబడినదఁట.

**మిథిలాయాం ప్రదీప్తాయాం న మే దహ్యతి కించన ఇతి న్యాయము**-మిథిలాపట్టణ మంతయుఁ గాలిపోయినను నా దేమియుఁ గాలిపోదని యర్థము.

కలవానికి బాధ్యత యుండునుగాని, లేనివాని కేబాధ్యతయు నుండదనియు, నట్టివాఁ డెన్నిధర్మముల నైన నన్యులకుఁ జెప్పఁగలఁడనియు భావము.

మహాభారతము-శాంతిపర్వము ౧౭వ అధ్యాయమున:

శ్లో॥ అనంతం బత మే విత్తం యస్య మే నాస్తి
కించన
మిథిలాయాం ప్రదీప్తాయాం న మే దహ్యతి
కించన॥

అనఁగా "పూచీపేచీలు లేనివాని ధర్మప్రబోధ" యనుట కీన్యాయము వర్తించెడిని.

**మిథిలుఁడు**—ఇతనికి విదేహుఁ డనియు జనకుఁ డనియు నామాంతరములు గలవు. మరీచిసంతతి సూర్యవంశ క్షత్రియుఁడు. తండ్రి నిమిచక్రవర్తి. పితామహుఁ డిక్ష్వాకుమహారాజు. కుమారుఁడు సీరధ్వజుఁ డనుపేరుగల జనకచక్రవర్తి. ఈతఁడు మిథిలానగరమును నిర్మించిన వాఁడు.

నిమిచక్రవర్తియు, వసిష్ఠుండును గలహించిరఁట. వసిష్ఠుఁడు నిమి మృతుఁడగునటుల శపించెనఁట. దేశ మరాజకమగుననుభయమున ఋషులు హాహాకారమ్మున నిమికళేబరమును మంత్రపూర్వకముగ మథించిరఁట. కుడిభుజమున నొకబాలుం డుదయింప నాతనికి విదేహుఁ డనియు, జనకుఁ డనియు పేర్లయ్యెనఁట. ఆతఁ డతిబలశాలియు, మహాధర్మనిరతుఁడునగు చక్రవర్తియై యొనఁట. ఆతనినుండియే యాతఁడేలిన దేశము నకు "విదేహదేశ"మని పేరయ్యెనఁట. మరియు

మిథిలాదేశ మనియు వాడుక గలదు. ఈతఁడు నిర్మించినరాజధానికి 'మిథిలాపుర' మనియు, 'జనకపుర' మనియుఁ బేరయ్యెను. జనకపురము నేఁటి కొక చిన్న పల్లెటూరుగ బీహారమున తిరుహూత్ భాగమున నున్నది. (విదేహ దేశము చూడుఁడు.)

ఈ భూపాల సంతతివారి కందరకును "జనకు" లని పేరయ్యెను. ఈతని కుమారునకు సీరధ్వజుఁడని పేరుండినను జనకమహారా జనియే పేరు వాడుకయయ్యెను. అతఁడు చక్రవర్తియఁట.

**మిధునకులగోత్రము**— (మధనకుల చూడుఁడు).

**మిధునరాశి**—మూఁడవది మిథునరాశి. అధిపతి బుధుఁడు. ఇది మృగశిరానక్షత్రము యొక్క 3-౪ పాదములును, ఆర్ద్రానక్షత్రమందలి ౧, ౨, 3, ౪, పాదములును, పునర్వసునక్షత్రమందలి ౧,౨,3 పాదములును గలసి ౯ పాదములరాశి. పరిమాణము ౫-౧౫ ఘడియలు. ఇదిక్రూరరాశి.ద్విస్వభావరాశి.శూద్రవర్ణరాశి. పురుషలక్షణరాశి, ఆకుపచ్చరంగు గలది. పాదజలరాశి, పశ్చిమదిగ్రాశి. శీర్షోదయరాశి, రాత్రి బలమధికము. రొమ్మునందు బల మధికమని చెప్పఁబడినది

మిథునరాశి బుధునకు స్వక్షేత్రము. మూలత్రికోణ మెవ్వరికిని గానేరదు. మరియు నిది యెవ్వరికిని నుచ్చ నీచ రాశికాదు. మిత్రక్షేత్రము చంద్ర శుక్ర శనులకును, శత్రుక్షేత్రము కుజ గురులకును, సమక్షేత్రము రవికిని, వృషభలగ్న మగునేని రవి తృతీయాస్థానమునకును, చంద్రుఁడు ద్వితీయాస్థానమునకును, నధిపతులగుదురు. కుజుఁడుషష్ఠమైకాదశస్థానములకును, బుధుఁడు లగ్నచతుర్థస్థానములకును, గురుఁడు సప్తమ దశమ స్థానములకును, శుక్రుఁడు పంచమ ద్వాదశ స్థానములకును, శని యష్టమ నవమ స్థానములకును, నధిపతులుగ నుండురు.

మిథునరాశి ప్రమాణముఘడియలు ౫-౧౫ లేక రెండుగంటల యారుమినిట్లకాలము.

**గోత్రము**—(వశిష్ఠ గణము చూడుఁడు).

**మినరల్ ఆయిల్సు**(Mineral oils)— భూమినుండి యెత్తఁబడు కిరసనైలు, పెట్రోలియము మొదలగువాని కీపేరు గలదు. ఇవి 'Spirits' అని చెప్పఁబడు చున్నవి.

(వెజిటెబిల్ ఆయిల్సు, ఆనిమల్ ఆయిల్సు చూడుఁడు).

**మినరల్ వాటర్సు**- దీనికి "భూమిలోనుండి యుబికియుండిన" యని యర్థము. వీటియందు Saline ingredient కొన్నియును, తరుచుగ Carbonic acid gas ఉండునని పరిశీలనవలనఁ దేలినది. లోనికిఁద్రాగి గాని, పైకి స్నానాదు లొనర్చిగాని,చెడినయారోగ్య మీనీటివలన బాగుచేయునగును. గాన వీటికి Natural waters అనియుఁ బేరు కలిగెను.

మినరల్ వాటర్సునం దనేకభేదములుగలవు. Chalybeate తెగకుఁ జెందినవానియందు Iron salts కల్గియుండును. Wood hall waters నందు Bromine ను, Iodine ను, గలిగియుండునని కనిపెట్టఁబడినది. మరికొన్ని Radio active గా నుండెడిని కాని,కొన్నింట Argon gas, Helium gas, Niton gas, Krypton gas, Xenon gas మొదలగునవి కల్గియుండునని చెప్పఁబడినది. కొన్ని Thermal (వేఁడి) Mineral waters ఫారన్ హీటు తెర్మామీటరునందు ౮౦ మొదలు ౧౨౦ డిగ్రీలవరకు వేఁడిగల్గియుండును. Baden Baden waters నందు Lithium

ఉండునని కనిపెట్టఁ బడినది.

డ్రోయిట్విచ్ వాటర్సునందు Sodium Chloride విస్తారముండుటచే (అనఁగా నొక పింటు నీటియందు 2712 గ్రైయినులవఱకు) 98 మొదలు 101 డిగ్రీల ఉష్ణ రేచరులందు (Muscular rheumatism) మేహవాతఁపు నొప్పులు కుదుర్చ నగుచున్నది.

కొన్ని మినరల్ వాటర్సు కృతకములుగ నిక్కాలమున చేయఁబడుచున్నవి. అందుఁగొన్ని గుణవంతములు గనే యున్నవని చెప్పుచున్నారు.

## మినరల్ డైస్ (రంగులు) — రంగులు చూడుఁడు).

## మినరాలోజీ— ఖనిజములఁగూర్చి వివరించుశాస్త్రము. "Mine" అనిన ఖని (గని) యనియర్థము. గనులనుండి త్రవ్వి యెత్తఁబడునవి ఖనిజములు. వీటిఁగూర్చి వివరించుశాస్త్రము మినరాలోజీ.

రాళ్ళు, రాతిసబొగ్గు, లోహములు గాక తక్కిన రత్నములు గట్టితనమునకుఁ బేర్వడసి యున్నవి. అందున్న Chemical Composition నుండి గట్టితనమేగాక Specific gravity యును వేర్వేఱుగా నుండెడిని. వీట్లకు "Crystalls" అనియు, వీట్లంగూర్చిన విధానమునకు "Crystallo-graphy" అనియు నందురు.

క్రిష్టల్సునందలి గట్టితనము దానియం దేర్పడియున్న పలకలనుండి యుండునని చెప్పఁబడినది. ఆంగ్లక్రిస్టలోగ్రాఫీలో వివరింపఁబడినమేరకు వజ్రమునకన్న గట్టిక్రిష్టల్ లేదు.

క్రిష్టల్సు పది ముఖ్యములుగఁ బేరందినవి— 1 Talc, 2 Gypsum, 3 Calcite, 4 Fluorspar, 5 Apatite, 6 Orthoclase felspar, 7 Quartz, 8 Topaz, 9 Corundum, 10 Diamond (వజ్రము.).

ఇవి యొకటికన్న (తరువాతదియు పిదప నాతర్వాతదియు) నొకటి యుత్తరోత్తరము గట్టితనమందు మించియుండునని చెప్పఁబడినది.

ఎఱిఁగియున్నంతవఱకును మినరల్సు వేయి వఱకుఁ గలవు గాని, వీటిపై య్యైదువేలవఱకుఁ గాన్పించుచున్నవి.

లోహములు వాటిగుణములఁగూర్చిన కళ యని దీని నెఱుంగునది.

## మినిమ్ (Minim)—ఆంగ్లవైద్య విధానమున ద్రవరూపద్రవ్యములకుఁ గొలత ఒక చుక్క ప్రమాణ ముండును.

## మినియేచర్ (Miniature)--వ్రాసిన చిత్రము గాని, చెక్కినవిగ్రహము గాని, శరీరమున నాభరణముగ ధరింపఁదగినంత చిన్నదిగ నుండినదాని కీపేరు వర్తించును.

లాటిన్భాషాపదమగు "Minium" నుండి యేర్పడినమాట యని చెప్పఁబడినది. దానికిఁ "Red lead" అని యర్థమఁట. తొల్లిఁట M.S.S. (వ్రాతప్రతులకు) వ్రాయుచుండిరఁట.

## మినిస్ట్రేల్ (Minstrel పాటకులు)- ఏలపాటలు పదములు పాడుకొనుచు దేశాటనము చేయువాఁడు.

## మినుముల వ్యవసాయము— ఇది పెసలఁబోలిన పంట. భరతదేశఁపుఁ బంట. పప్పుజాతి. పెసలకన్న మినుము లించుక పెద్దవిగను, బలముగను, బిగిసియుంటయు, నల్లగ నుంటయు, పైకిఁ గన్పించు భేదములు. భరతదేశమునం దంతటను మినుములవ్యవసాయము గలదు. వీటిని జొన్న మొదలగు కాయధాన్యములతోఁగూడఁ గల్పి చల్లి పండింతురు. నల్లభూములపై చక్కఁగఁ బైరగును. ఎకరమున

ఎన్మిదిపౌనుల విత్తులఁ జల్లుదురు. నాల్గుమాసముల కీపంట సిద్ధమగును. మినుములకు బాధకరమైనవి గొంగళిపురుగు లనియు, నవి భూమియందే గ్రుడ్లఁబెట్టుననియు, గాన నెండలకు ముందునుండియు భూమిదున్నుచుండిన, నాగ్రుడ్లు బయల్పడి యెండలకుమాడి చచ్చిపోవుననియుఁ బరిశీలకు లనుచున్నారు. యీకరమునకుఁ బరిస్థితు లనుకూలించుతరి ౩౦౦ మొ॥ ౬౦౦ పౌనుల వరకుఁ బంటపండును.

మినుములు చాల బలకరమైనవి గాన గుఱ్ఱముల కాహారమిడుతరి సెనగలలో సగము గుగ్గిళ్లు వైచి పెట్టెదరు. మినుములను నానబోసి, రుబ్బి, పాలపశువుల కాహారమిడిన నధికముపా లిచ్చునని యందురు గాని, దీనిని చాల జాగ్రతతో వాడవలయుననియు, వాతదోషము కలుగకుండఁ జూచుకొనుచుండవలయు ననియు, పాశ్చాత్య వైద్యవిధానమునఁ జెప్పఁబడినది. (పెసరవ్యవసాయము చూడుఁడు.)

**మినుములుచెట్టు**- లా. Phaseolus Radiatus, ఆంగ్ల. Black gram tree. సం. మాషః, “మధురా సూపధాన్య” యని కొందరనిరిగాని యది నైఘంటికము కాదు.

హిందువులయిండ్లలో పితర్చనసల్పు దినములందు మినుములతో గారెలు చేయుదురు. మినపపప్పుతోఁ జేసిన పదార్థములు పెక్కులు భోజ్యములు. ఇది ప్రసిద్ధ భోజనపదార్థము. పప్పు మిక్కిలి బలకరమనియు, దాని నరిగించుకొనుశ మానవశరీరములకుఁ జాలదనియు, పప్పుపైపొట్టు జీర్ణశ నధికపఱచు ననియుఁ జెప్పఁబడినది. మినపపప్పు బలమిచ్చి మేహశాంతి, వీర్యవృద్ధిఁ జేయుననియు, వాతదోషము మేహవాతము, శ్లేష్మములనడఁచి, విరేచనము జక్కఁగ వెడలించి, శరీరపువేఁడి నధికపరచు ననియు, వాయువును బంధించుననియు, దీనికి



నెయ్యి, యింగువ, అల్లము, ఖండశర్కర, బిడాలవణము, తెల్ల యుత్తరేణిక్షారము, కూరాటి, మేడెద (చెట్టు), నిమ్మవేరురసము విఱుగుడులని చెప్పఁబడినది.

**మిమియోగ్రాఫ్** (Mimeograph)— జర్మనుభాషాసంబంధపదము. ఒక్కమారనేకములగు కాగితములను (నకళ్లను) వ్రాయుటకుఁ గాని, టైపుచేయుటకుఁగాని, పనికివచ్చుయంత్రము. దీనిని మొట్టమొదలు ‘T.A. ఎడిసన్’ అనునతఁడు క్రీ. శ. 1878 లోఁ గనిపెట్టెను. ఈవిద్యకు “మిమియోగ్రాఫీ” యనిపేరు.

**మెమోరాండం ఆఫ్ అసోసియేషన్** (Memorandum of Association)— వాణిజ్యసంబంధమున నొకకంపెనీ యేయుద్దేశములకొఱకు పనిచేయ నేర్పాటయ్యెనో వాటిని వివరించు ఉద్దేశపత్రము.

**మియాజిమాక్షేత్రము**— ఇది జపాను దేశమునకుఁ జెంది హిరోషిమా వియుక్తాగ్రగుడమునందున్న యొక ద్వీపము. దీనియందు పవిత్రదేవాలయములు పెక్కు కలవు. ఈద్వీపమునకు ‘ఇట్సుకుషీమా’ ద్వీపమనియు నందురు. జపానునందలి మూఁడు గొప్ప పవిత్ర స్థలములలో నొకటియై యున్నది. ఇది తొమ్మిదవ శకాబ్దకాలమునుండియు కలఁదట. ఏటేట నలుబదివేలమంది భక్తులు దర్శించిపోవుచుందురని చెప్పఁబడిన పవిత్రస్థానము.

**మిరపకాయచెట్టు**— లా. Capsicum Annum ఆంగ్ల. Spanish pepper, Chillies సం: మరీచి. హిందీ మిర్చి. మిరపకాయలలోని జాతిభేదములకు లెక్క గానరాదు. పెక్కురూపములు, పెక్కురంగులు, పెక్కు పరిమాణములఁ దనరుచు, వేర్వేరు దేశములందు వేర్వేరుజాతులై వెలయుచున్నవి. మిరపకాయలు

కారపురుచికైన భోజన పదార్థము. వేర్వేరు భేదములుగల్గు మిరపకాయలందు కారము హెచ్చుతక్కువలుగ మఱికొన్ని భేదములు కల్పించెనా యనునట్లుండును. ఈ మిరపజాతియందు గుంటూరుసీమను పెరుగు నెట్టి మిరపకాయలు పొడుగుగల్గినవి శ్రేష్ఠమని పేరందినవి. పూనా ప్రాంతముల విస్తారము పైరుచేయఁ బడుచున్న వివిధాకారములు గల వింతవింత జాతులమిరప కాయలు కారముతక్కువగల్గి కూరగఁ జేయ దగియుండును. విశాఖపట్టణపరిసరములఁ బైరగు పసుపుపచ్చరంగు పొట్టి మిరపకాయ లెక్కుడు కారముగల్గి యుండుననియు, గంజాముమండల మున పైరుచేయఁబడు సన్నపు పొడుగు కాయల జాతి కార మెక్కువగల్గిన హీనజాతిగఁ దలంపఁ బడుచున్నది. ఇంకఁ గొన్ని సీమల నెట్టి, పచ్చరంగులకాయలు వలము, పొడవుగల్గి కారమునందు తగ్గియుండుజాతికలదు. అరంగుళము పరిమాణము గల చిన్నకాయ లెట్టిని, నల్లని రంగులవెక్కువ కారముఁగల్గినవి సీమజాతిమిరపకాయలందురు. ఇందు దానియాకారపరిమాణముల కధికముగఁ దోచుకార ముండును. రెండుమూఁడంగుళముల పరిమాణమున నల్లనికాయలఁ గాయుచు, కొంత పెద్దదిగ నెదుగు నల్లని పచ్చిమిరపచెట్లజాతి, రెండు మూడు సంవత్సరములకాలము జీవించి కాయుచుండును. ఈకాయల కించుక కార మధిక ముగ నుండును. బొంబైరాజధానియం దుత్తర కొంకణ(కార్వారు)మండలములోనిగోకర్ణప్రాంతమున సన్నమిరపకాయ లారేడంగుళముల పొడవున కెదుగు నెట్టినిజాతి యొకటి కలదు. ఇంక నెన్నియో జాతులు గాననగు చున్నవి.

తొల్లిఁటి కాలమున భరతవర్షమున మిరప కాయలు లేవనియు, మిరియములే కారమునకు వాడఁబడుచుండెననియు, పిదప చిలీదేశము నుండి వచ్చిన వర్తకులు వీటినిదెచ్చినతరి కారముఁగల్గియుండుట వీనికి మిరియఁపుగాయ లని పేరిడఁబడెననియు, నానాటికి 'మిరియఁపుగాయ' లనుపదము 'మిరపకాయ'లుగ మారెననియు నొకబలమగు ప్రతీతి దేశమున వ్యాపించి యున్నది. మిరపకాయల నెండించినవియుఁ, బచ్చివియుఁ గూడ భోజనపదార్థములందు కారమునకై చేర్పఁబడుచుండును.

ఎండుమిరపకాయలు కాక జేసి, విరేచనము వెడలించి, జీర్ణశక్తి నుద్రేకించి, సర్పవిషము నడంచి, యగ్నిమాంద్యము, నుదరరోగములు, వ్రణములు, సవాయిరోగదోషముల నివారించుననియు, మిరపకాయలలోని గింజలు శూలల నాపుననియు, పచ్చిమిరపకాయలు కాక, పైత్యము, మేహదోషము, శ్లేష్మముల నుద్రేకించుననియు, కూరలలోని వాతగుణమును పరిహరించు ననియు, నధికముగఁ దినిన వీర్యనష్టము గల్గించుననియు, నెయ్యి, పులుసు, మిరియములు విఱుగుడులనియుఁ జెప్పఁబడినది.

మిరపకు పదను విస్తారము తనయందునిల్పుకొనఁగల నల్లభూములు మిక్కిలి ప్రశస్తములని చెప్పఁబడినవి. నీరు పాఱించుటకు నూతులుగాని, చెఱువులుగాని, కాల్వలుగాని వసతిఁ గల సమస్తభూములును బనికివచ్చుఁగాని కేవల మిసుక పట్టులు, చవిటిపట్టులు మాత్రము బనికి రావు. వర్షాధారమువలన పండుమిరపలు చాల తక్కువపంట నిచ్చునని యెఱుఁగునది. అన్ని కాలములయందును మిరపపైరు చేయవచ్చును. భూమిని చక్కఁగ దున్ని మంచియెరువులు వైచి నీటిందోడఁ గలిగిన, మిరప చక్కఁగ ఫలించును. మిరపవిత్తుల నారుబోసి, నాటి, వ్యవసాయము నడుపుదురు. ఎకరమున కొకటిన్నర పౌనుల విత్తులు కావలసి యుండును. ఇవి మొలచుతరిఁ బిచ్చుకలు మొదలగు పక్షులు వీటిని బెకలించి తినివేయును. గాన జాగ్రతగ భద్రపఱుపఁ

వలసి యుండును. మిరపతోఁట యెంత యెక్కువగ దున్నిన నంతవిస్తారము ఫలమిచ్చుటయే గాక కలుపుఁదీయ నవసరముండదు. ఎకరమునకు ముప్పదిబండ్లపేడ గత్తము వేయఁగల్గిన యెడల, సంపూర్ణ ఫలము నిచ్చునని చెప్పఁబడినది. మిరపనారు నాటుటకు ముసురు దినములు మంచివి. కుదురున రెండేసి మొక్కలు చొప్పున నాటుట మంచిది. వర్షములు లేనికాలమున వారమున కొకతడి గట్టినఁజాలును. నాటిన మూఁడుమాసములకు కాపు ప్రారంభించును. పరిస్థితులు బాగుండిన నారు మాసములవఱకు కాచుచునే యుండును. పూత పూయ నారంభించినతోడనే యకరమున కెనిమిదివందల పౌనులయాముదఁపుఁబుచ్చు నీటనానించి, ద్రవరూపమున మొక్కలమొదట నీరు బోసినట్లు బోసి, తరుచుగ గొప్పులఁద్రవ్వుచు నీరుగట్టుచుండిన కాయలు సత్తువగనుంటయు, విస్తారకాలము గాచుచుంటయు, నిలిచియుండును. పఁడినకాలమున వెంటనే పండ్లుగోయుచుండవలయును. చెట్టున నిల్వయుండరాదు. కోసినకాయలను చక్కఁగ నెండించి, వేసవికాలమున నెత్తుకొని నిలవఁ జేసుకొందు రఁట. పాశ్చాత్యదేశములనుండి భరతదేశమునకు తేఁబడిన వింతజాతుల మిరపకాయలు కారమునకై పండించునని కావు. మరియు వీనికెంతనీరుతోడినను కఠినమైన తీక్ష్ణపుటెండలు పనికిరావు. వీని కొకపాటి నీడయుండిన మేలు. సమశీతోష్ణములం దీవింతజాతిమిరపలు జక్కఁగ వర్ధిల్లి కాచెడిని.

**మిరియఁపుఁ దీఁగ**—లాటిన్. Piper nigrum. ఆంగ్ల. Pepper. సంస్కృత. యవనప్రియం, యవనభోజనః, వల్లిజం. మిరియములు మిరియఁపుఁదీఁగెలందు కాచిన కాయలలోనివిత్తులు. నల్లగనుండును. ఆదిని తెల్లనిమిరియములజాతికూడ నుండెననియు, నదియిప్పుడు నశించిన దనియు, దాని సంస్కృత నామము శ్వేతమరీచీ, సితవల్లిజము, నని యుండెననియుఁ గొందరందురు గాని, దానికాధారములు గానరావు. మిరియములపై నల్లతొక్కలఁ దీసివైచిన నవియే తెల్లమిరియము లనఁబరగెడిని గాని, యిటీవలి పరిశీలనలు పైతొక్కలందే విటమినులుండునని బయల్పరచుచున్నవి.

ఆదికాలమున నాంధ్రదేశమునందును, దక్షిణదేశపుసీమలందు వలెనే మిరియములను కారపురుచికై వాడుకొనుచుండువారఁట. విదేశవర్తకులు (ఇప్పుడు మిరపకాయ లనఁబడు వానిని) ఛిలీదేశమునుండి యమ్మకమునకుఁ గొనిరా, వానికారపురుచినుండి "మిరియఁపుఁ గాయ"లని వాడనారంభించిరఁట. నానాటి కా పేరే "మిరపకాయ" లనఁబడుచున్న దఁట. (మిరపకాయలు చూడుఁడు). ఇంకను ఎఱ్ఱ రఁగుగలమిరియములు, పొడుగైనమిరియములు, నపుంతిమిరియములు, జమైకాజాతిమిరియములు గలవని కొందరు విదేశస్థు లనుటయే గాని, భరతదేశమునం దవి గానరాకుంట వాటిని గూర్చి యేమియుఁ దెలియరాకున్నది.

ఆయుర్వేద వైద్యశాస్త్రమున త్రికటుకములలో నొకటిగ మిరియములు చెప్పఁ బడినవి. (త్రికటుకములు చూడుఁడు). ఇవి వేఁడిచేసి, శ్లేష్మమును కరఁగించి, రక్తమును శుభ్రపఱచి యగ్నిమాంద్యమును, నస్థిగతజ్వరమును, ఉబ్బు, కాస, మొలకలుగలమూలవ్యాధి, విషదోషము, శ్వాసరోగము, క్షయరోగముల నడఁచి, మలములను వెడలజేసి, యాహికజ్వరములను, మేహజ్వరములను నడంచునని చెప్పఁబడినది. తెల్లమిరియములు, విటమినులుగల పైపొరఁ గోల్పోవుటచేతఁగాఁబోలు నీగుణములనే బలహీనముగ నొనర్చును. నెయ్యి, పులుసు, మిరియములకు

విషఘ్నములని చెప్పఁబడినది. వీటిపేరునే వహించినచలవమిరియములకు "తక్కోలములు"అని సంస్కృతనామము. వాటిని దాంబూలములోఁ గొందరు వాడుచున్నారు. అవియు నించుక కారముఁ గల్గి చల్లని లక్షణములోఁ ద్రిదోషముల నడఁచి, మేహశాంతి గల్గించి, మూత్ర రోగములను, నేత్రరోగములనువారించి, రక్తము శుద్ధపఱచునని చెప్పుచున్నారు.

ఆదికాలమున భరతదేశపు మిరియములు, పోర్చుగీసువారిని వర్తకమునకై భరతదేశమున కాకర్షించెను. గ్రీసుదేశస్థులకును, రోమనులకును మిరియములు చాల ప్రీతికరములుగనుండె నఁట. (పోర్చుగీసువర్తకుని పదునాఱవశతాబ్దపు లేఖ చూడుఁడు). ఆఫ్రికా దేశము నందు 'Maleguetta' అనుపేరు గల యొకజాతి మిరియములు గలవనియు, నవి యెక్కువ కారముఁ గల్గియుండుననియు, నది అల్లపుజాతికిఁ గొంత సంబంధముగలది యనియు, నిటీవల బయల్పడి నది. దానిం గూర్చి యింకను సరిగాఁ దెలియ రాకున్నది. ఇక్కాలమున మిరియఁపుఁబంట భరతదేశమునందే గాక మలయాన్ సీమలందు జావా, బోర్నియో, ఫిలిప్పైను దీవులందుఁ గూడ విస్తారముగఁ బైరుచేయఁబడుచున్నది. మలయాలోని పినాంగుసీమలం దత్యధికముగ నీపంట గాన్పించెడిని. వేఁడియు, వర్షపాతమును నధికముగనుండు పర్వతముల యేటవాలు ప్రదేశము లీపంట కనుకూలములు. ఈపంట కాఫీ, తేయాకు పంటలవలెనే యధికమగు శ్రద్ధతోఁ బనిచేయవలసినదిగాఁ జెప్పఁబడినది. తొలుత తుప్పల డొంకల, గొట్టివైచి, దున్ని, యీతీఁగెలు ప్రాకుటకాధారముగఁ, ద్వరితముగాఁ బెరిగి గట్టిగను, బలముగను నిలుచు నన్నపుఁజెట్లను దొలుత దూరముగ దోఁటల నాటవలయును. ఇవి కొంత పెరిగినపిదప మిరియఁపుదీఁగెల ముదురుబడ్డుపెఱికి ముక్కలుగఁగోసి, చెట్ల మొదట నాటుదురు. ఈపనిని South West monsoon వానలు ప్రారంభమైన తోడనే చేయవలయును. తరువాత వానల కవి నాటుకొని, వేరుదన్ని, చిగిర్చి చెట్లపైఁ బ్రాఁక మొదలిడి వర్షములుముగియువరకు స్థిరపడును. నాటిన నాలుగైదు వత్సరములవఱకు కాపు ఫలితముండనేరదు. విస్తారముగ నాకులువైచి, బలిసిపోవుటయె గాన్పించెడిని. అవసరములవెంబడి గాబు తీయుటయు, గొప్పులుత్రవ్వుచు నేలను గుల్లబాఱునట్లు చేయుచు, నెరువులు గత్తములు వేయుచుండుటయు, విస్తారముగ పెట్టుబడులును తగులుచునే యుండును. కాపు ప్రారంభమైన పిదప నిచ్చెనలతోఁ జెట్లపైనుండి పంటఁగోసి కుప్పలిడి మిరియపుగింజలను విడఁజేసి యెండించి యుంచుకొనవలసి యుండును. మళయాళ దేశమున నొక్కొకయడవియెుక్క నాధారముగాఁ జూపి ఎన్మిదిలతల నెగఁబ్రాకించుచుందురు. తీఁగ యొక్కటికి పరిస్థితులుమేరకు రెండుపౌనులవఱకుఁ బండ్రెండు సంవత్సరములదనుకఁ గాచుచుండునందురు. కొన్నిప్రదేశములందు పదునేను వత్సరములవఱకుఁ గాచుట కలదు. ఈ తీఁగెల యాయుఃకాల మేఁబదివత్సరములని చెప్పఁబడినది. కాని కాపు క్షీణించిపోవుచుంట ఫలముండకపోవును. మలయాళదేశమున నిక్కాలమున ౯౫౦౦౦ యకరము లీపంటక్రింద నున్నవనియు, ౮౧౩౦ టన్నుల మిరియములు పండుచున్నవనియుఁ దెలియుచున్నది కాని మిరియములు జక్కఁగఁ బండుప్రదేశములు మలేరియాల్ బాధ గల్గియుండు ననుచున్నారు. తలచ్చేరీ పరిసరసీమ పంట యధిక మనుచున్నారు. కూలిపని యిం దధికము.

**మిలి గోత్రము** — (ప్రాణిక ఉపగణము చూడుఁడు.)

మిర్రర్ గాల్వానో మీటరు (Mirror Galvano meter)—ఇది యిటీవల నాంగ్ల శాస్త్రవేత్తలచేఁ గన్పెట్టఁబడి కూర్పఁబడిన యంత్రపరికరము. అలోపతీ (ఆంగ్ల) వైద్య శాస్త్రవిదులు గుండెకొట్టుకొను ధ్వనులపరిమాణమును, నందలిధ్వనివిశేషములనుబలమును నొత్తిడి (Hart beats loudness tone pitch and pressur)యును జక్కఁగనెఱిఁగి, రోగముఁగుర్తించుటకు మైక్రోఫోనునుండి యొక యద్దమున నీడఁగల్గించి దానినుండి ఛాయాపటముఁదీసి చూపు యంత్రపరికరము. అలోపతీ వైద్యమునకు గొప్పయుపయోగకర మని చెప్పఁబడినది. దీనికి మూలసాధనము ఎలక్ట్రో మేగ్నెట్టు (Electro magnet) గా నుండును. కడుస్వల్పములైన విద్యుత్ప్రసారకిరణము లిందు పనిచేయును. ఆ అయస్కాంతమే యెలక్ట్రిక్ పవరిచ్చుటకును, దాను పనిచేయుటకును గూడ నుపయోగించుచుండును. ఇందునకు Permanent horse-shoe magnet నుపయోగించుచున్నారు. క్రి. శ. ౧౮౩౧ నవంబరు నెలలో Faraday పండితుఁ డిట్టి యయస్కాంతముల నుండి దరితీగకు విద్యుత్ప్రసారముఁ గల్గింప నగునని కనిపెట్టె నఁట.

మిలిటారిజమ్ (Militarism)—ఒక జాతిగాని, యొకప్రభుత్వముగాని, యితరులనుండి సంరక్షింపఁ బడుటకు యుద్ధభటవర్గ మవసరమనెడు సిద్ధాంతము.

మిలియన్-(న్యూమరికల్సు చూడుఁడు).

మిల్కీ వే (Milkey way)-(గేలాక్సీ చూడుఁడు.)

మిల్కు షుగర్ (Milk Sugar)—Casein గాని, Cheese గాని, తయారుచేసిన వెనుక పాలలో మిగిలిపోయిన నీటి (Whey) వలన 'మిల్కు-షుగర్' అను నొక పదార్థము తయారు చేయఁబడు చున్నది. Whey లో నీ దిగువ వివరింపఁబడినప్రకారము స్థూలపదార్థము గలదు.

Milk Sugar = 4.6 to 5%
Prottein (Chiefly) = 1.0%
Albumen Fat = 0.3%
Mineral Substances 0.6%

Whey మరగించినయెడల దానియందలి తెల్లని పదార్థము (Albumen) గడ్డకట్టును. మరి కొంతకాల మట్లే మరగించుచున్నయెడల నొక విధమైన చక్కెరవంటి పదార్థము తయారగును. ఇందులో నూటికి 85 పాళ్ళు Milk Sugarను, 10 పాళ్ళు నీరును, 5 పాళ్ళు లోహఁపు (Mineral) జలమును నుండును. అతిస్వల్పముగా Protein నును Fat ను, గూడ నందుండును. Whey విశేషముగా మరగఁబెట్ట వలసి వచ్చినపుడు 'Vacuum Pans' ఉపయోగించి, దానిలోని యావిరినీటి నిగురింపఁ జేయుదురు. Whey యతివేగముగా పులిసిపోయి, Latric Acid అగుట కవకాశము గలదు. కాఁబట్టి పులిసిపోయి Milk Sugar చెడిపోకుండ, సాధ్యమైనంతవేగముగ Whey మరగింపవలయును. Milk sugar అంతయు Lactose అయిపోయినయెడల చాలనష్టము. Whey లో కొంచెము సోడా Sodium Carbonate Solution కలిపిననీరు పోసినయెడల వేగముగ పులిసిపోకుండ నిలుచును.

Sodium carbonate నకుమారుగ 'Farmation' అను వస్తువు నుపయోగింపవచ్చును గాని, యింతకన్న నధికవ్యయమగును. సారము తీయుటకు ముందు Whey లోని పులుపుపదార్థ మంతయుఁ బూర్తిగాఁ దీసివేయవలయును.

Vacuum Pan లో నావిరి యిగిరిపోవు కార్యము 60°-70°C డిగ్రీలకే ప్రారంభమగును. ఆవిరి యిగిరిపోవుచున్నంతసేపు మొదటిమట్టము తగ్గిపోకుండ Vacuum Pan లో Whey పోయుచునే యుండవలయును. క్రమక్రమముగ Whey లోని సారమంతయు దిగిపోయి 30°-32° డిగ్రీలవఱకును జల్లారును. నూటి కఱువది వంతులు గట్టిపదార్థము లభించినపుడు చాలి నంత Capacity గల Crystalizing Tanks లోనికిఁ బంపి, యక్కడ చల్లారునట్లు చేయుదురు. వేసవికాలములో చుట్టును చల్లని నీరుపోసి, వేగముగా చల్లారునట్లు చేయవలెను. టెంపరేచ రిరువదినాల్గు గంటలలో నఱువది నుండి యిరువదికి దిగవలయును. అప్పు డొక కోరా మిల్కు సుగరు (Milk Sugar) దిమ్మ వలె నేర్పడి యడుగున నుండును.

పసుపుఁ బచ్చరంగుగల యీకోరా Milk Sugar అచ్చులో కప్పు డావిధముగు స్థితిలోనే విక్రయింపఁబడును. తెలుపుగా దానిని పరిశుభ్ర పఱచి యమ్ముటయే యాచారము. 50° డిగ్రీల వేఁడిమితోఁ గూడ కొని ముఖమునుండి యావిరి విశేషముగా వచ్చుచున్న రాగికాగులోఁ బోసి దీనినికరఁగునట్లు కలియఁ బెట్టుచుండవలయును. మిశ్రద్రావములో నూటికి24-27వరకు మిల్కుసుగర్ ఉండును.(13°-15° Bc) Albumen అడుగునకు పోవునట్లు చేయుటకై కొంచెమెముకల పొడియు నూటికి రెండువంతులు Acetic Acid కూడ దానిలోఁ గలుపుదురు. ఆ పానకము Boiling point వఱకు మరగింపఁబడవలయును. అందలి ఫాస్ఫరదామ్లక (Phosphoric Acid) మడు గంటునట్లు చేయుటకై కొంచెము Magnissim Sulphate కూడ కలుపుదురు. ఆపానకముపొంగు వరకు కళపెళ మరగింతురు. టెంపరేచర్ 105°ల వరకు లేచును. అడుగున నొకవిధమగు మసుట కట్టును. అంత పైకి తేలిన పానకమును కఱ్ఱ మూఁతగల యొక రాగిగూనలోనికి పంపుచేయు దురు. అందు నుండి ఫిల్టర్ ప్రెస్సులలో వడియఁ గట్టి యడుగున నుండి ప్రవహించునట్లు చేయు దురు. ఆవెనుక 35° Bc గల Vacuum పరి కరములలోని కిందువలన లభించిన పరిశుభ్రమైన పానకసారమును జేర్చుదురు. ఇఁకను పొంగు చున్నయెడలఁ గొంచెము క్రొవ్వుచేర్చి యా పొంగునాపివేయుదురు. అనంతర మీపానకము నిసుపపెనములలోఁ బోసి యచ్చుకట్టునట్లు చేయుదురు.

**మిల్లుకోయిజ్**– (నాణెములపై ముద్రింపఁబడు నరపాలుని రూపబింబములు చూ).

**మిల్లిబార్** (Millibar)–ఇది మీటియో రోలోజీశాస్త్రమున Atmospheric Pressure యొక్క కొలతలోని పరిభాషాపదము. ఒక Bar నందుఁ వెయ్యవభాగమునకు పేరు.

Bar అనిన Pressure of 29.531 inches of atmosphere at 32 degrees Fahrenheit in latitude 45 degrees అని చెప్పఁబడినది.

**మిశ్రకతీర్థము (దధీచియాశ్రమము)**
అయోధ్య రాష్ట్రములోని శీతాపూర్ జిల్లా యందున్నది. ఇట ప్రసిద్ధుఁడైన దధీచిమహార్షి యాశ్రమ ముండినతావు. ఈయన మొదట క్షత్రియుఁడు. పిదప మహార్షి. కుమారుఁడు పిప్పలాదుఁడు. (దధీచి చూడుఁడు–పిప్పలాదుఁడు చూడుఁడు).

**మిశ్రకేశి** — వసుదేవునిసోదరుఁ డగు వత్సకునిభార్య.

**మిశ్రజాతితాళములు**— సంగీతశాస్త్రమున సప్తతాళములందుఁగల యైదుజాతులలో నొకటి. (జాతి (లయ) ప్రాణము చూడుఁడు).

**మిశ్రితతీర్థము**—(దధీచిమహర్షి చూ.)

**మిశ్రోదనగోత్రము** (హారిత ఉపగణము చూడుఁడు).

**మిస్సిస్సిప్పి మిస్సూరీ నది**- భరతదేశపు నదులలో తుంగ భద్రి నదులు కలసి తుంగభద్రానది యైనరీతిని పైరెండునదులు నేకమై రెంటిపేరునఁ బరగుచున్న నది. వీటి పొడవు ౪౨౦౦ మైళ్ళు. ఇది యొకేనది యగునేని నేమజాను నదిని మించును గాన ప్రపంచమునఁ బెద్దనది యిదియే గావలసియుండును. ఇది యొకటింబాతిక మిలియనుల చతురపుమైళ్ళ ప్రదేశపు వర్షపాతమునకుఁ బ్రవాహమార్గముగ నున్నదందురు.

తొలుత నుభయతీరములందును జెరియొక యిరువదిమైళ్లువెడల్పుగలగొప్ప సమతలప్రదేశములగు వ్యవసాయపు బొలములం దడపుచుఁ బ్రవహించి, యోహియోనదిని దనలోఁ గలుపుకొనును. ఈ సమతలసీమ పైభాగము గోధుమలపంటకును, మధ్యభాగము ప్రత్తిపంటకును, కడభాగము ధాన్యము, చెఱకు, నారింజతోఁటలపంటలకును, సుప్రసిద్ధము. దీనినుండి నది యనేక చంద్రవంకలుగ నడచి, యెటఁజూచిన నట జలముల నింపివేయును. నగటున నది కడభాగమున ముంపుదెబ్బ లధికమని చెప్పఁబడినది. గట్ల నెంతనిర్మించి భద్రపరచినను నపాయముగనే యుండునఁట. న్యూఓర్లీన్సు నగరముకడ నుండి దీనికి గొప్పడెల్టా కలదు. దాని నుండి పాయలై నడచి, కడకు మెక్సికో సంయుక్తాగ్రగుడ సముద్రమున నంగమించును.

**మిస్టు** (Mist)— నిర్బంధింపఁ బడని వాతావరణపువాయువు శీతలస్థితినంది, తఱచుగ బుగ్గిపరమాణువులపై నాధారపడి, యేర్పడుచుండును. అవి కంటి కగుపడనంత చిన్నవని మనసునందుం చుకొనవలెను. అట్టి మిస్టునందలి పరమాణు సముదాయము Opaque రం గనఁగా తెల్లనై తెరచాటుంబోలిన యస్వచ్ఛధవళకాంతి నిచ్చునదిగా నగును. దాని నాంగ్లమున mist అనెదరు. నిజ మారసిన నిదియు, పొగమంచు (Fog) ను, నొకేవిధమగు శరీరతత్వము గలవియై యున్నవి. (పొగమంచు (ఫాగ్ చూడుఁడు) ఇది "When the air is damp and chilled below its dew point temperature" అని యాంగ్లమున నిర్వచింపబడియున్నది.

వీటి శరీరతత్వాను సారముగ మిస్టును, ఫాగును నధికమగు నెత్తున నేర్పడఁజాలవు. పొడవైన చెట్ల తలలు, నెత్తగు మేడల పైకప్పులు, పర్వతాగ్రములు, చక్కని నీరెండయం దుండుతఱి నుదయములం దీరెండును నేర్పడి క్రిందివరుసం దనరెడిని. అం దివి యెక్కువ దళసరిగా నేర్పడఁజాలవు. ఉదయములం దొక్కొక్కతఱి సమీపముగ నుండుకొండలకు సగభాగము నేర్పడియుంటఁ గాననయ్యెడిని. కొన్ని విశేషకారణ పరిస్థితులయందీమిస్టు యాకసమునఁజాలయెత్తున నేర్పడెనేని, క్రిందినుండి చూచినవారల కది మేఘమే యనిపించును. మేఘము లిట్లేర్పడినవే యైనను వాటికిని మిస్టునకును భేదము లేకపోలేదు. (ఫాగ్ చూడుఁడు).

**మిస్ట్రాల్ శీతలప్రచండవాయువు**- ఇది యప్పటప్పట కోర్సికా ద్వీపమున (మధ్యధరాసముద్రమున) వీచుశీతలప్రచండవాయువు. ఫ్రాన్సు దేశమునుండి మధ్యధరాసముద్రజలములమీఁదుగా వీచును. ఫ్రెంచి దేశమున మధ్యభాగఁపు పీఠభూములనుండి ప్రారంభమై, రోనునది లోయనుండి చాల త్వరితము గలదై యతిశీతలముగ వీచి సముద్రముపైఁబడి యతి వేగమున కోర్సికా సార్డీనియాద్వీపములఁ జుట్టు

కొని చాలయుసౌఖ్యములఁ గల్గించును.

**మిళిందుఁడు (మేనందేరు)** - (ఉపనివేశదేశము చూడుఁడు.)

**మ్నిమోనిక్సు** (Mnimonics)—ఇది ఆంగ్లశబ్ద. జ్ఞాపకశక్తి నధికముగఁ గల్గించుకొను విధానము. కొన్ని గురుతులమూలమునను, విభజనాదిప్రయత్నమూలమునను జ్ఞాపకముంచుకొను విధానము లిందు వివరింపఁబడినవి.

**మీటియొరోలోజీ** (Meteorology) ఇది యూరోపాఖండఁపు నవీనశబ్ద. భూమింజుట్టియుండు వాతావరణము, దానియందలి శీతోష్ణస్థితులు, వర్షములు, సుడిగాలులు, ప్రచండవాయువులు, తుపానులు, మేఘములు, మెఱుపులు, ఆకాశమండలి యితరస్థితిగతులు, పరిశీలనలవలనఁ గనుఁగొనిన విజ్ఞానమునకు "మీటియొరోలోజీ"యని పేరు. ఇంక నభివృద్ధి నొందవలసియున్నది. "భరతదేశఁపు కాలవిజ్ఞానశాస్త్ర"మగు రెట్టమతముఁ బోలినది. దీనిని 'weather wisdom' వాయువిజ్ఞాన మనియు ననెదరు. దీని యుపయోగము Fore casting of weather అని చెప్పుచున్నారు. ఈశాస్త్రముఁ గూర్చి కొన్ని చరిత్రలను, కనిపెట్టబడినయంశములను వివరింపనిదే సుబోధకము గానేరదు.

పరిశీలకులు ప్రపంచమందలి శీతలదేశము లొకప్పు డాదిని మంచుచేఁ గప్పఁబడి యుండె ననియు, నామంచునుండియే గ్లేసియరు లేర్పడె ననియు, వానినుండి నదులును, సరస్సులు నేర్పడి, కడకు భూములు బయల్పడె ననియు, నాదికాలమునకు 'ice age'అనియు, తరువాత కల్గిన వేఁడికాలమునకు'warmer age'అనియు పరిశీలకు లనుచున్నారు.

వాతావరణమునందలి కలవరము మార్పులఁ గల్గించి తుపానులు, గాలులు, వర్షము మొదలగువానిఁ గల్గించునని కనిపెట్టఁబడినది. ఇది సూర్యకిరణములవలనఁ గల్గినవేఁడియు, భూమి తనకుఁ దానే గిరగిరఁ దిరుగుచుంటయు, ముఖ్యకారణములని తలంపఁబడుచున్నది. ఇటులఁ గల్గినశీతోష్ణస్థితులకే temparatureఅనిపేరు.

Atmosphere భూమిని జుట్టియున్నదని యెఱుంగుదుము, గాని యది యెంతయెత్తునకు వ్యాపించి యున్నదో సరిగాఁ దెలియకున్నది. ఎగురవేయఁబడిన బెలూనులందుఁ జేయఁబడిన పరిశీలనలనుండి యిరువదిరెండు మైళ్ళని తేలుచున్నది. ఇందు సముద్రఁపు నీటిమట్టముపై కొంతయెత్తుదనుక Troposphere అనియు నాపై నున్నదానికి Stratosphere అనియుఁ బేరిడియున్నారు. ట్రోపోస్ఫియరునందు భూమినుండి యాకాశమువైపున కెత్తున కెగిరినకొలఁది నుత్తరోత్తరము శీతల మధిక మగుచుండును. స్ట్రాటోస్ఫియరునం దప్పటి పరిస్థితులనుండి యించుక భేదము లచ్చటచ్చటఁ గల్గుచుండినను నొకేరీతి శీతోష్ణస్థితిఁ గల్గియుండెడిని.

ఎట్మోస్ఫియరునం దేరోప్లేనులు నలుబదివేలయడుగుల యెత్తున కెగురుట నెఱుంగుదుము. మనుష్యులఁ గొంపోయిన బెలూను లారున్నర మైళ్ళవర కెగురును. ఆరవమైలునందు పాదరసము శీతమునకు ఘనీభవించి ముద్దకట్టును. గాలిపడగలు నాలుగుమైళ్ళ యెదుఫర్లాంగుల దనుక నెగిరెడిని.

'ఎట్మోస్ఫియ' రనఁగా మహావాయుపథము (మండలి) క్రిందిభాగములందు Oxygen, Nitrogen, కొంచెముగా Carbonic acid gas, నీటియావిరి, Argon అనంబడు నవరూపమైన గాలియునుఁ గలసియుండు ననియు, పైభాగమునందు Hydrogen gas కొంతగను

Halium గాలి యధికముగను, కలిసియుండు నని కనిపెట్టబడినది.

జరుగుచుండు పరిశీలనలందు, ద్వివిధములగు బెలూనులు పరీక్షకు నాకాశమునకు వదలబడు చుండును. అందొకదానికి Balloon sonde అనియు, Regestering balloon అనియుం బేళ్ళు. ఇందు Meteorograph అనబడు యంత్రపరికరమునుండి పైకి వదలెదరు. బెలూ నాకాశమునను భగ్నమై యాయంత్రపరికరము నేలబడును గాని యది వెదురుచట్రమునం దుంచబడుట బ్రద్దలై చెడిపోవకుండను. అత్తరి దానియందు Temperature, Pressure, Humidity రికార్డుచేయబడియుండును. చాల చిన్నదిగాన దీనింజూచుటకు భూతద్దము వలసి యుండెడిని. రెండవది Pilot balloon అనం బడును. దీని నెగురవైచి, దీనినుండి యెరింగిన సంగతులనుండియే యేరోప్లేనులకు నాకాశమం దలి వాతావరణస్థితులను సర్వమార్గములను తెల్పుచుందురు. ఇంగ్లాండుదేశమున నీయుద్యోగశాఖ Airministry లోని యొకశాఖగా నున్నది.

ట్రోపోస్ఫెరును, స్ట్రాటోస్ఫెరును, గలియు సంధిహద్దాకాశమందుండు వాయుపథమునం దుండును. ఇదియుత్తరధ్రువప్రదేశమున (North Polar region) సముద్రపు నీటిమట్టముపై నైదుమైళ్ల యెత్తుననుండియు, భూమధ్యరేఖకడ బదిమైళ్ళయెత్తుననుండియుం దిరుగ దక్షిణధ్రువమున నైదుమైళ్ళకువంగియునుండును. భూమధ్యరేఖాప్రదేశముల నుష్ణమధికమని యందరెరిగినదే. అట ట్రోపోస్ఫెరునందుం బదిమైళ్ళయెత్తున ఫారన్హీటు తెర్మోమీటరునందుం 110 degrees below zero గా నుండిన చల్లదనము, ధ్రువప్రదేశమున నదేయెత్తున 60 degrees below zeroగా నుండెడిని.

సూర్యకిరణములు భూమిపైబడి యుష్ణము గల్గించుతరి వేడియై పలుచగ వ్యాపించినగాలి, తేలికయై తనయందలి యొత్తిడి గోల్పోయి యుండుం గాన, పైశీతలప్రదేశములకు రేచును. అత్తరి క్రిందిగాలి నెదుర్చుచు తాకుచు నిలుచుట సంభవించును. దీనికి Turbulence అని పేరు. పరిశీలనలవలన టర్బ్యులెన్సు (సంఘర్షణ) అల్లకల్లోలములు, మేఘములు, తుపానులు, ప్రచండవాయువులు, సుడిగాలులు మొదలగునవ్వియు, ట్రోపోస్ఫెరుహద్దునను (అనంగా కడభాగమున) నేర్పడుచుండు ననియు, పైస్ట్రాటోస్ఫెరునందు కాదనియుం దేలినది.

సూర్యకిరణముల వేడి భూమిపైబడి వేడిగల్గి వేడిగల్గించినంత వేగమున నీటిపైబడి వేడిం గల్గించనేరవు. రాత్రులందలి చల్లదనము భూమి నిచల్లబరచినంతవేగముగ నీటినిజల్లపరచనేరవు. భూమిపై గాలియు, నీటిపైగాలియు, నీధర్మములకు లోబడియే యుండును. ఇవి సహజధర్మములని యెఱుంగునది.

భూమిపై యొకతావున గాలి వేడెక్కెనేని యది పైకెగయును. అత్తఱి పైపొరయందలి గాలికి యొత్తిడిగలిగి,యదియదుమబడినట్లు మరియు నొత్తిడిగల్గి దట్టముగ నగును. పైకెగిరిన గాలి తావునాక్రమింప, నితరప్రదేశముల గాలి యట కరుగుచుండును. దీనికి గాలివీచుట యనెదరు. ఇదియు నొకసహజధర్మ మని యెఱుంగునది. ఇట్టి గాలిప్రవాహములు పెద్దవియగుతఱి ప్రచండవాయువులు,సుడిగాలులుగ గూడ నగుటయేగాక,కాలములమార్పులనుగలిగింపనోపు.

భూమధ్యరేఖం జుట్టియుండు వాతావరణమునం దప్పటప్పటవర్షములుతప్ప తక్కిన Atmospheric disturbances ఉండవు.దానిని Doldrums అనియు, Belt of calm అని

యు, ననెదరు. ఇటనుండియె వాతావరణప్రవాహము లనేకములుగ వీవనారంభించును. ఇందు వేడి యధికము గాన, గాలి వేడిగనై పైకెగయుటయు నుత్తరదక్షిణములనుండి గాలులు వీచుచుండును. అత్తటి భూమి తనకుతానై గిరగిర తిరుగుచుంట (ఈతిరుగుట భూమధ్యరేఖకడనే యెక్కువగ తెలియుట) నుత్తరమున కరుగుగాలి కుడివైపునకును,దక్షిణమునకరుగుగాలి యెడమవైపునకును మఱలి, యీశాన్యదిశనుండియు, నాగ్నేయదిశనుండియు వచ్చునవిగఁ దోచుచుండును. ఇవి నిశ్చలముగ వీచుగాలులు. వీటికి Trade windsఅనిపేరు. ఇంక వీట్టిపై నెత్తున వాయవ్య దిశనుండియు, నైరుతిదిశనుండియు వీచుచుండువాటికి Anti trade winds అనిపేరు. ఇవి Tropic ప్రదేశములందు శాంతవాతావరణమున క్రిందికి దిగి, యచటి గాలితోఁ గలసిపోయెడిని. ఇదియు నొక సహజమగు విధియె.

Tropic of Cancer హద్దున కుత్తరదిశగా నైరుతిదిశనుండి వీచు వాయుప్రవాహమొకటియు, దక్షిణదిశగ వాయువ్యోత్తరదిశనుండి వీచువాయుప్రవాహ మొకటియుఁ గలవు. వీటికి పైగా నెత్తున వీచునవి యుత్తరదిశను పశ్చిమపుగాలిగను, దక్షిణమున తూర్పుగాలిగనునుండి roaring forties అను పేరఁ బరగెడిని. ఇదియు సహజమగు విధిగనే యెంచఁబడుచున్నది.

ఇంక భరతదేశముమీఁదుగా నీశాన్యదిశనుండి తొలుతను, నైఋతిదిశనుండి పిమ్మటను వీచుగాలులకు monsoon winds అని పేరు. ఇవి వర్షములఁ గల్గించుగాలులు గాన నావదమే వర్షమున కర్థముగఁ వాడంబడుచున్నది. ఆశియాఖండపు టీశాన్యదిశనుండివీచు North East monsoon గాలియందు వాయువుల pressure యధికముగనుంట చల్లగను, పొడిగను, నుండును. సముద్రముపైనుండి వీచునదిగాన South West monsoonగాలి యందు దటులగాక, చెమ్మ విస్తారముంట బరువుగ వీచి యధికవర్షములఁగురియఁజేయును.ఇదియు నైసర్గికధర్మవిధియై యైయున్నది.

మీటిరియాలాజికల్ ప్రధానకార్యస్థానమున భవిష్యత్సూచనలు (Forecasts) వ్రాయఁబడుచుండును. దీనికిఁ జెందినవి కొన్ని నక్షత్రశాలలు (Observatories),కొన్ని పరిశీలనస్థానములు,కొన్ని Climatological stations లు తాముగ్రహించిన సంగతులను తంతులమూలమున నప్పటికప్పుడు ప్రధానకార్యస్థానమునకు దెల్పుచుండ, కురిసినవర్ష పరిమితిని కొలుచుచు ప్రభుత్వోద్యోగులు తంతీవార్తల నంపుచుండ, Forecasts బహిరంగపర్చుచు తెలుపుచుందురు.

మీటియారోలాజికల్ శాఖ ఉద్యోగులు గమనించి తెల్పుచుండువిషయములు గాలి ఒత్తిడి (Pressure),శీతోష్ణస్థితి (Temperature), గాలివడి (Wind force), గాలి వీచుదిక్కు (Wind direction),చెమ్మపరిమితి(Humidity), Visibility, సూర్యప్రకాశము (Sunshine), వర్షము (Rainfall), మేఘావరణ (Cloudiness), Character of weather మొదలగునవియై యున్నవి. వీట్ల నెఱుంగఁజేయు పరికరము లాయాకార్యాలయముల నమర్పఁబడియే యుండెడిని.

Pressure- బారోమీటరునుండి పరిశీలింతురు. ప్రధానకార్యాలయములందిది ఫోటోకేమెరాయుక్తమైయుండి, యదేపనిగ ఛాయాపటసముదాయముఁ దీయుచుండును. వీటికి 'Barograms' అనియెదరు. ఇంకను 'Aneroid barometer' అనఁబడు చిన్నయంత్ర

పరికరము వాడఁబడుచున్నది. అది యంత నిష్కర్షయగునది కాదని తలంపఁబడుచున్నది. ఇంకను 'Barograph' అనఁబడు వేరుపరికరము కాగితముపై గీతలం గీచి తెల్పునది. Pressure changes సరిగా తెల్పుచుండునది కూడఁ గలదు.

ఉష్ణపరేచరు నెఱుఁగ "థర్మోమీటరు" రనఁబడు యంత్రపరికర ముపయోగింపఁబడుట యెల్లరెఱిఁగినదే. Maximum Temperature తెలుపు ధర్మామీటరొకటియు, minimum టెంపరేచరును దెలుపు తెర్మోమీటరొకటియు, wet Thermometer ఒకటియు, Dry Thermometer ఒకటియు, 'Slevenson screen' అనఁబడు నీడనిచ్చు తెల్లనిరంగుపూయఁబడిన పెట్టెయందుంచి,యారుబయట నెత్తుగుతావున నమర్చి యుంచెదరు. ఇందువలన సరియగు వాతావరణస్థితులు తెలియ ననుకూలించును. wet Thermometer క్రిందిభాగమునఁ దెల్లబట్టజుట్టి, సదా నీటిప్రవాహముచే గుడ్డఁదడుపుచుండున ట్లమర్చుదురు. wet Dry Thermometer లభేదము relative Humidity నెరుఁగ వీలగుచుండును. మంచునమయమున(Foggy weather)రెంటికిని భేదము గాన్పింపకుండినను వర్షములందు వ్యత్యాసముండెడిని. ఇంక Wind force, wind direction, వర్షపరిమితిని దెల్పు Rain gauge లంతటను వ్యాపించియుంట నెల్ల రెఱిఁగినదే. కడపటి యంత్రపరికరములం దింకను"Hyetograph" అనఁబడునది కురిసిన వర్షపరిమితిని తనకుఁదానె రిజస్టరుచేసికొనుచుండునది. సూర్యకాంతిని, ఆకాంతి గల్గించువేఁడిని తెల్పు యంత్రపరికరమునకు "Campbell stokes Sunshine recorder"అనిపేరు.

Tropics నం దప్పుడప్పు డచ్చుటచ్చుట Stroms, Hurricanes, Whirl winds, Typhoons మొదలగు వాతావరణఁపుచికాకులును, నమెరికా సంయుక్తరాష్ట్రములందు 'Tornado' లనఁబడు తుపానులును, చలిదేశములందు 'Storms' అనఁబడు తుపానులును, సంభవించుచుండును. వీనికి:- (1) Irrigular heating of atmosphere, (2) Meeting of two great air currents of different temperatures-మొదలగునవి యు, Turbulences ను, కారణములని తలంపఁబడుచున్నవి. ఇంక నిట్టి కారణమ్ములనుండియే సుడిగాలులుగూడఁ గలుగనోపు. కాని తుపానులఁ గూర్చి వివరించుటయందు (1) పలుచబడిన గాలి యొత్తిడిగలగాలి నెదుర్కొనుటయందు దానిం జుట్టి తిరుగుననియు, (2) ఒత్తిడిగలగాలి పలుచనిగాలివైపున కరుగుతరి, నీరు పల్లమునకు వలె బ్రవహించు లక్షణము గలది యనియు, (3) High pressure నందు వాతావరణము శాంతమై కదలికతగ్గి నిశ్శబ్దముగ నుండుననియు, (దీనికి 'Anti cyclone' అనిపేరు.) (4) Low pressure నందు, వాతావరణ మల్లకల్లోలమై కదలికఁ గల్గియుండుననియు (దీనికే 'Cyclonic weather' అనిపేరు.) నెఱుంగఁదగిన ధర్మములు నాల్గు కనిపెట్టఁబడినవి.

ఈశాస్త్రసంబంధమున నింక నెఱుంగఁదగినవి దశమేఘములనామములును, పొగమంచు (Fog), మంచు (Valley mist), స్లీటు (Sleet), వడగండ్లు (Hail stones), ఆకాశపురంగులు, నింద్రధనుస్సులుగలవు. వాటిఁ గూర్చి యాయాతావులందుఁ గనవలయును. (కాలవిజ్ఞానశాస్త్రముఁ జూడుఁడు).

మీటియర్—(పరోల్కలు చూడుఁడు.)

మీనరాశి(అధిపతి గురుఁడు)- ఇది

పూర్వాభాద్రా నక్షత్రమునందలి నాల్గవ పాదము, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రము లందలి యెన్మిదిపాదములును కలిసియైన ౯ పాదముల రాశి. ప్రమాణము నాల్గు ఘటికలు లేక ఒక గంటయు, ముప్పదియారు మినిట్ల కాలము.

మీనరాశి సౌమ్యరాశి. ద్విస్వభావరాశి. బ్రాహ్మణవర్ణరాశి. స్త్రీ స్వభావరాశి. స్వచ్ఛ వర్ణము. పూర్ణజలరాశి. ఉత్తరదిగ్రాశి, ఉభయోదయరాశి, పగటిబల మధికము. పాదము లందు బలమని చెప్పఁబడినది.

మీనరాశి గురునకు స్వక్షేత్రము. మూల త్రికోణ మెవ్వరికిఁ గాదు. ఉచ్ఛ శుక్రనకును నీచ బుధునకును మిత్రక్షేత్రము. రవికుజులకును, సమక్షేత్రము చన్ద్ర, బుధ, శుక్ర, శనులకును నై యున్నది. శత్రుక్షేత్ర మెవ్వరికిఁగాదు.

మీనలగ్నమునకు రవి షష్ఠస్థానాధిపతి; చంద్రుఁడు పంచమస్థానాధిపతి; కుజుఁడు ద్వితీయ నవమస్థానములకును, బుధుఁడు చతుర్థ సప్తమ స్థానములకును, గురుఁడు లగ్న దశమస్థానముల కును, శుక్రుఁడు తృతీయాష్టమస్థానములకును, శని ఏకాదశ ద్వాదశస్థానములకును నధిపతులై యుందురు.

**మీమాంసాశాస్త్రము** — మీమాంసా శాస్త్రము వేదములకుపాంగముగ నెన్నఁబడుచున్నది. "మీమాంస" యన విచారణ కర్థము. తొల్లింట జైమినిఋషి మీమాంస రచింపఁ బ్రారంభించి, ౧౨ అధ్యాయములు సూత్రములుగ వేదార్థవిచారణ రచించెను. పిదపవ్యాసర్షి యుత్తరమీమాంస రచించెను. ఇది నాల్గధ్యాయములు. సూత్రములుగ రచించెను. పిదప 'మధ్యమమీమాంస' యను సగుణబ్రహ్మోపాసనము, మంత్రాధిదేవతోపాసనావిధానము రచింపఁబడెను.

౧. పూర్వమీమాంస–దీనినికర్మమీమాంస యనియు నందురు. ఇది జైమిని రచించిన సూత్రములు. దీనికి శబరర్షి భాష్యమురచించెను. మాధవాచార్యుఁడు దీనియర్థములను స్పష్టపఱచి వివరించుచు, "జైమినీయన్యాయమాలావిస్తర" మను నొకవ్యాఖ్యను శ్లోకములతో రచించెను. ఇందు పండ్రెండధ్యాయములు గలవు. ఒకటి, రెండు, నాల్గు, ఐదు, ఆరు, ఏడు, ఎన్మిది, పదునొకండు, పండ్రెండు అధ్యాయము లయందధ్యాయమునకు నాల్గేసిపాదములును, తక్కిన మూడు, తొమ్మిది, పది యధ్యాయములయందధ్యాయమున కెన్మిదేసిపాదములును మొత్త మఱువది పాదములు గల్గి, వీని యందు ౯౧౫ అధికరణములుగను, ౨౭౫౬ సూత్రములుగను వివరింపఁబడినది.

పూర్వమీమాంసకర్మప్రతిపాదకము. సత్కర్మసత్ఫలమును,దుష్కర్మ దుష్ఫలమును, నింద్యకర్మ ప్రాణమునకు బంధనానుభవములను విధించుధర్మమున వేదార్థముల వివరించెడిని. ఇందు కర్మప్రధానము. జ్ఞానమంగముగఁ జెప్పఁబడెను. ఈవివరణమున సదర్థవాదము, ససదర్థవాదము, భూతార్థవాదము ననుత్రివిధవాదములు గైకొనఁబడినవి. కర్మమీమాంసకు "భాట్టదీపిక" యను ఖండనగ్రంథమును ఖండదేవుఁడు రచించెను. కర్మమీమాంసయందు భక్తికి తావే యీయఁబడలేదు.

౨. ఉత్తరమీమాంస– దీనిని "బ్రహ్మమీమాంస"యనియు నందురు. ఇది వ్యాసుఁడు రచించిన సూత్రములు. దీనికి వేర్వేఱు మతములకు వేర్వేఱు భాష్యములు గలవు. అద్వైత భాష్యము నీలకంఠ లేక శ్రీకంఠుఁడు రచించినది. శంకర భగవత్పాదు లొకభాష్యమును రచించెను. రామానుజీయ వైష్ణవసిద్ధాంతమున కాయన "శ్రీభాష్య" మనుపేర విశిష్టాద్వైత

సిద్ధాంతప్రతిపాదకభాష్యము రచించెను. ఆనంద తీర్థస్వామి ద్వైతసిద్ధాంతప్రతిపాదకభాష్యము రచించెను. ఇంకను శివాద్వైతభాష్య మను నామాంతరముగల "శ్రీకరభాష్య" మొకటి శ్రీపతి పండితస్వామి రచించెను. దూర్వాస భాష్య మొకటికలదు. చైతన్యభాష్యము వేఱొకటి కలదు. విష్ణుపారమ్యముతో నద్వైతభాష్య మింకొకటి కలదు. ఇటుల పెక్కుభాష్యములు వ్రాయఁబడినవి.

వ్యాససూత్రముల సంఖ్య సరిగాఁ దెలియకున్నది. అట్టి గ్రంథము లేదు. ఏమతస్థుల భాష్యము ననుసరించి యామతస్థులు సూత్రసంఖ్య నెఱుఁగుచున్నారు. అధికరణముల సంఖ్యయు నాయాభాష్యములందు వేర్వేఱుగనే యున్నది. భారతీతీర్థస్వామి యద్వైతభాష్యముపై వ్యాఖ్యగ "వైయాశికన్యాయమాలావిస్తర"మను గ్రంథమును శ్లోకములుగ రచించి యున్నాఁడు.

అన్ని భాష్యములందును సూత్రము లొకే రీతిని వాడఁబడలేదు. తమకు వలయునధికరణములకు సిద్ధాంతధోరణి కనువగురీతి నొక్కొక సూత్రము నవసరమువెంబడి విభజించియు, రెండుసూత్రముల నొకటిగఁ గల్పియు, తమతమ యర్థముల కనుకూలించుటకుఁ దు, చ, మొదలగు వర్ణములను లోపింపఁజేసియుఁ, గల్పించి చేర్చియు, మొత్తము సూత్రములవరుసఁ దప్పనీయక, యవసరము లగు నధికరణములఁ గుదుర్చుకొనిరిగాన సూత్రములసంఖ్య వేర్వేఱు మతస్థుల భాష్యములందు వేర్వేఱై యున్నది. ఇఁక నధికరణములసంఖ్య వేఱగుటకుఁ దోడుగ నొక్కొకచో రూపమే మాఱి యున్నది. భాష్యకర్తలు తమతమ పాండిత్యబలములకొలఁది ప్రజ్ఞలఁ బ్రదర్శించిరి. అద్వైతప్రతిపాదకమగు నీలకంఠభాష్యమున నధికరణములు ౧౯౦, సూత్రములు ౫౪౬; అద్వైత ప్రతిపాదకమగు శంకరభాష్యమున నధికరణములు ౧౯౧, సూత్రములు ౫౫౫; విశిష్టాద్వైత ప్రతిపావక మగు శ్రీ భాష్యమున నధికరణములు ౧౫౬, సూత్రములు ౫౪౫ను, ద్వైతసిద్ధాంత ప్రతిపాదకమగు మధ్వభాష్యమున నధికరణములు ౨౨౬, సూత్రములు ౫౬౪ను, గాననయ్యెడిని. ఈభేదములిట్లున్నను వైయాసిక బ్రహ్మమీమాంసా భాష్యము లన్నియును నాలు గధ్యాయములనే గల్గి, ప్రతి యధ్యాయమునను నాల్గేసి పాదములు గల్గి యున్నవి. వీట్లయన్నిటియందును జ్ఞానమో లేక భక్తియో ప్రధానముగను, అం దొకటి వేఱొకదాని కంగముగను దనరుచు, కర్మను నిరసింపక వేఱొకయంగముగఁ గైకొనుచుండును.

ఈ సందర్భమున నీ బ్రహ్మసూత్రములను రచించిన వ్యాసర్షి స్వకీయ మతసిద్ధాంతమెద్దియో వివరించుట దుస్తరము. దానినిగౌరవించు మతసిద్ధాంతములవారు వ్యాసర్షి మతమును తమ మతమే యని నమ్మటయు, వచించుటయు విధాయకమే. మధ్వమతభాష్యమున వ్యాసర్షి తన నిజమతసిద్ధాంత మదియే యని వచించినటుల వ్రాయఁబడియున్నవి.

వ్యాసునిధర్మమందు జ్ఞానము ప్రధానము; కర్మయు, భక్తియు నంగములు. భక్తి, జ్ఞానము యొక్క పరిణామముగనో, వికారముగనో తలంపఁ బడినది.

**మీరాబాయి**—మీరాబాయిమతస్థులని చెప్పుచుండు బలమైనవాడుక గలదు గాని నిజమున నది యొకమతము కానేరదు. మీరాబాయి చిన్ననాటినుండియు గొప్ప భక్తురాలు.

ఈమహానీయభక్తశీలవిక్రమశకము ౧౪౭౫

మీరతునగరమున విజయమల్లను సర్దారునకు పుత్రికగ జన్మించి, చక్కగ విద్యాభ్యాసమొనర్చి కవిత్వముచెప్పనేర్చి, మేవాడుమహారాణావారి పట్టమహిషియై, పిదప గొప్పభక్తురాలై, బృందావనమున కేగి కృష్ణునియందు భక్తితో ననేకములు కీర్తనములు రచించెను. "పరమేశ్వరునందలిభక్తియే పరమార్థసాధన" మని యీమె బోధించుచుండుటచే, నిది యొక మతమని వాడుకగల్గెను; గాని మతలక్షణములతో నీమె యేదియు నేర్పఱచియుండలేదు.

వ్రజమండలమున నీమతస్థుల మని వచించువారు కొందరు గలరు. వారి కిదియె సిద్ధాంతము. ఈమె శ్రీకృష్ణవిగ్రహములో నైక్యమై యంతర్ధానమైపోయెనను వాడుక గలదు.

**మీర్జా బిరుదము**-ఇది పారశీకదేశపు బిరుదము. అట నామమునకు బిదప నుంచిన ప్రభుగౌరవమును, నామమునకు బూర్వముంచిన నుద్యోగగౌరవమును, విద్యాగౌరవమును నిరూపించెడిని.

మహమ్మదీయుల సంబంధమున భరతదేశమునకుగూడ నిది ప్రాకియున్నది. కొందఱు జమీందారుల కిది వంశపరంపరానుగతమై దనరుచున్నది. Addisions' spectator నందు 'మీర్జా' యను "స్వప్నదర్శన" మని యొకకథనము గలదు. అది బహుశః మృగతృష్ణదర్శనమునుండి యేర్పడినకథన మామీర్జా పండితుడుగ నుండునని తోచెడిని.

**ముంచమయూరగోత్రము**—(శండిలగణము చూడుడు.)

**ముంచికాయన లేక ముంజకాయన గోత్రము**—(ఉపమన్యుగణము చూడుడు.)

**ముంజమహారాజు**—అవంతిదేశమేలిన నృపతి. సుప్రసిద్ధుడగు భోజమహారాజుపిన తండ్రి. ఈయనకడనే హలాయుధుండను సుప్రసిద్ధవిద్వాంసుడుండెను. ముంజునికాలము క్రీ.వె. ౯౭౪-౧౦౧౦ యని కొందఱనెదరు. (అవంతిదేశము చూడుడు.)

ఈయన మాళవరాజ్యమేలినభూపతి. ఈయనకు "వాక్పతిరా" జనుబిరుద ముండెనట. ఈతనియాస్థానమున ధనంజయుడను (దశరూపకకర్త) విద్వాంసు డుండెడివాడు. ఈయన కాలము క్రీ. శ. ౯౯౬ సంవత్సర ప్రాంతమని తెలుచున్నది. (ధనంజయుడు చూడుడు- భోజమహారాజు చూడుడు.)

**ముంజాదీపికోద్ధరణన్యాయము**
ముంజగడ్డిలోని లోపలగడ్డిపొరందీయ బ్రయత్నించుట జరుగనిపనియనియర్థము.

**ముంజేతికంకణముల కద్దమెందుకు?** (ఆంధ్రలోకోక్తి.)

**ముండదేశము** — ఇప్పటి ఛోటానాగపూర్ దేశమునందు రాంచీమండల మనబరగుచున్నప్రదేశమునకొకప్పుడాదిని "ముండదేశ" మని వాడుకయుండినటుల వాయుపురాణము, పూర్వ. ౪౫ యందు గాననగును.

**ముండ్లపంది** -(ఏదుపంది చూడుడు.)

**ముందుకుపోతే నుయ్యి, వెనుకకు పోతేగొయ్యి**— ఆంధ్రలోకోక్తి.

**ముకుందతాళము**-(తాళములు చూ.)

**ముకుళహస్తము**—(హస్తాభినయము చూడుడు. భరతశాస్త్రము చూడుడు.)

**ముక్తవేణి** — దీనిని త్రివేణి యనియు నందురు. బంగాళాదేశమున, హుగ్లీమండలమునందు, బంశబాటిపురము కడనున్న గ్రామము. గంగాతీరమునందున్నది. ఇట గంగానది మూడుపాయలుగ జీలును. వాటిని గంగా

యమునాసరస్వతులు తిరుగ నిట జీలినవందురు. అలహాబాదుపురముకడనున్న త్రివేణిని 'యుక్త వేణి' (కూడిక)యనియు, నిట (త్రిబెనీగ్రామము కడ)'ముక్తవేణి' (జీలిక) యనియు నచటివా రనెదరు.

ఇచట గంగాతీరమున గొప్ప శ్మశానము కలదు. చాల దూరమునుండి శవముల నిటకు దహనపఱుపఁ దెతురఁట.

**ముక్తహస్త వృక్షాసనము.** యోగ శాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి. రెండుచేతుల నొకటి కొకటి యొక మూరెడుదూరమునం దుండునటుల నేలమోపి, వాటిఉనికిపై శరీరమును పైకి నిలువఁబెట్టి, తల క్రిందుగా వ్రేలఁ జేసియుండుట. ఇందు వలన నపాన మూర్ధ్వగతి యగునని చెప్పఁబడినది.

**ముక్తాసనము**— యోగశాస్త్రమునఁ జెప్పఁబడినయాసనములలో నొకటి. ఇదిసిద్ధాసన మునకును సంబంధించిన అవాంతరభేదాసనము. ఎడమకాలి మడమను సీవనిస్థానమం దుంచి, దానిపై కుడికాలిమడమ నుంచి, తక్కిన వన్ని యు సిద్ధాసనమువలెనే. (సిద్ధాసనము చూ).

**ముక్తి**— ముక్తి యన విడువఁబడుట యని యర్థము. సాధారణముగ సంసార (కర్మ) బంధ మునుండి విడువఁబడుట (తప్పించుకొనుట) యని భావము. వేర్వేఱుమతములందుఁ బ్రాణికి వేర్వేఱు విధములుగ ముక్తులు చెప్పఁబడినవి. ముక్తులు ద్వివిధముగ నుండును. ౧ జీవన్ముక్తి— తాను జ్ఞానవంతుఁడై జీవించియుండుతఱి, జ్ఞాన జన్యమగు నానందమయత నుండుట జీవన్ముక్తి యనియు, ౨ మరణమునకుఁ బిదప (శరీరమును విడచి) ముక్తినందియుంట విదేహముక్తి యని యుఁ జెప్పఁబడును.

**ముక్తినాథక్షేత్రము**— నేపాలదేశమం దలి ముక్తినాథక్షేత్రము. గండకీనదీతీరమునందుఁ గాక, నదినుండి యాఱుమైళ్ళదూరమునం దొక పుణ్యసరస్సు నంటియున్నది. దానిని "ముక్తి సరోవర" మనియెదరు. ఇచటియెత్తు సముద్రపు నీటిమట్టముపై పదునేనువేల యడుగులుగఁ జెప్పఁబడినది. కాఘుని యా యనుపట్టణము నుండి యాగ్నేయదిశగా పది లేక పండ్రెండు మైళ్ళదూరమునం దున్నది. ముక్తిసరోవరము నందు నూటయెన్మిది జలబుద్బుదములయుదక ములు జేరును. ఈప్రవాహములకు విష్ణుదేవుని యష్టోత్తరశతనామములపేర్లు వాడుచున్నారు. మఱియు వాటిని శ్రీకారము లనియు నందురు. ముక్తినాథమునకు నేపాలములోని పోఖాప్రపట్ట ణమునుండి రడ్నాగ్లామీఁదుగా మంచిబాట కలదఁట. చాల యాత్రికులు వచ్చుచుండు తావుగ నున్నది. ఆగస్టునెలయందు యాత్రస్థు లధికము. ఇచటినుండి గండకీనది కరిగి, సాల గ్రామములంబట్టి, గొంపోవుదురు. ఇచటి దేవుఁడు ముక్తినాథనారాయణస్వామి.(౧ సాల గ్రామక్షేత్రము, ౨ సాలగ్రామములు, ౩ గండకీ నది, ౪ నారాయణిసాలగ్రామక్షేత్రము, ౫ రిషే శ్వర (హృషీకేశ) క్షేత్రము చూడుఁడు.)

ఇచటి కాళీగండకీనదిని "కర్ణాళీనది" యని టిబెట్టుదేశస్థు లనెదరు. ఇచటికి టిబెట్టుదేశపు సరిహద్దు సమీపముగనే యున్నది. ఇంక నీ కాళీగంగానదినే "శిలాగ్రామి" యనియు, "శిలానది" యనియు, "సాలగ్రామి" యనియు వేర్వేఱు దేశములవారు వాడుచున్నారు.

**ముక్తీశ్వరక్షేత్రము (లేక ఘడ్ ముక్తే శ్వరము)**— ఇది తొల్లింటి హస్తినాపురము నందుండిన ముక్తీశ్వరశివక్షేత్రము. గంగానదీ తీరము. నదియొక్క కుడితీరమునం దున్నది. ఇప్పటి మేరతుమండలములోనిది. మహాభారత

ప్రసిద్ధము. ఇట, హస్తినాపురమున రాజ్యమేలిన శంతన మహారాజు గంగను వరించినతావు. ఏటేట కార్తికమాసమున నిట గొప్పస్నాన యాత్రి జరగుచుండును. దానినీప్రాంతవాసులు "కార్తీకమేలా" యనుచున్నారు. లక్షలకొలఁది ప్రజ స్నానార్థమిట కేటేట నరుదెంచుచుందురు. వారిర్వురు కలసినదినము పౌర్ణమి గాన నది స్నానయాత్రియందు ముఖ్యదినముగ నెన్నఁబడుచున్నది.

**ముక్క లిపీట**— ఈపద మిటుల తప్పుగాఁ బల్కఁబడుచున్నది. గాని దీనిసరియగు రూపము "ముక్కాలి (మూఁడుకాళ్ళ) పీట" యని యెఱుంగునది.

**ముక్కు ఉండేవరకూ పడిశమేనా?** (ఆంధ్రిలోకోక్తి.)

**ముక్కోటిఏకాదశి**- (మహాఏకాదశులు చూడుఁడు. వైకుంఠఏకాదశి-చూడుఁడు.) పుష్య శుద్ధఏకాదశి. (పండుగలు చూడుఁడు.)

**ముఖ మస్తీతి వక్తవ్యం దశహస్తా హరీతకీ**— ఆయుర్వేద వైద్యశాస్త్రమున కరక్కాయగుణములం దెల్పుచు నుడివిన సంస్కృతభాషయందలి లోకోక్తి.

ఒకముఖము, పదిచేతులు కరక్కాయకున్నట్లు చెప్పవలె ననిభావము. ముఖము స్థితింబట్టి పనిచేయుననియు, పదిచేతు లన నంత బలముగా పనిచేయుననియు భావము.

**ముఖము వెలవెలఁబాఱుట(వెల్లఁబోవుట)**-శరీరముయొక్క చర్మపురంగు దాని యుపరిభాగమునం దుండెడిని. (శరీర చర్మపు రంగు చూడుఁడు). అది రక్తప్రసారము వలనఁ బ్రిదర్శింపఁబడుచు, నరఁగా నింకను ముందరికి నెట్టఁబడుచు, దాని నిజస్థితి పైకిఁ గన్పడుచుండెడిని. ఇటుల పైకిఁగన్పట్టుచుండుట ముఖమునం దధికముగా జరుగుచుండెడిని. ఈ రక్తప్రసారముశరీరమంతటికి హృదయమునుండి ప్రారంభమై, యట నూపిరితీసిన గాలినుండి 'ఆక్సిజెను' రక్తమునందుఁ జేరినపిదపనే ప్రారంభమయ్యెడిని. (హీమ్యూమోగ్లోబిన్ చూడుఁడు. రెడ్ సెల్సు చూడుఁడు.) హృదయ మెల్లప్పుడు మేధస్సు (Brain) నందేర్పడువిధానము మేరకు పనిచేయునది. భయము, లజ్జ, నిరాశ మొదలగునవి హృదయమునందుఁ గల్గుతరి, హృదయమునుండి రక్తప్రవాహము తగ్గి, లేక కేవల మాఁగిపోయి, రక్తస్రావముతో రంగు ముందు నకు ముఖమున ప్రతిఫలించుట నిలిచిపోయి, ముఖము వెలవెలఁబాఱుట, (వెల్లఁబోవుట) (ఇంచుక తెల్లనిధాతువ దోచుట) సంభవించెడిని. ఈ తెలుపు,(రక్తహీనమగుట) తెల్లనిసౌందర్యముగాక వెలవెలఁబాఱుటగాఁ జెప్పఁబడినది. ఇట్టి సందర్భస్థితికే "ముఖము గంటుపెడితే రక్తము లేదు" అనులోకోక్తిని వాడుచుందురు. దీని కాంగ్లమున 'Pale'అనియెదరు. భయము, అవమానము నధికమగుతరి కొందరికి గుండెలు కొట్టుకొనుట గూడ నాఁగిపోవునఁట. మూర్ఛ, మృతి, ఇట్టితరిఁ గల్గునందురు. బలహీనమనస్కులకు మేధస్సునఁగూడ రక్తప్రవాహ ముండక యాఁగిపోవునఁట.

**ముఖమువాఁపుతో పండ్లనొప్పి**

నోటపండ్లుండుగూడులయందే కారణమువలననో విషసంబంధ పదార్థము ప్రారంభమై, కొరికి, కొంచెము చర్మము పుండై చుట్టుపట్ల వాచెనేని ఆగూళ్ళునుండి చెడిపోయినరక్తము పుండునీరు బయటికి రాక, లోన బిగిసిపోయియుండును. దీనిని 'పంటినొప్పి' యని యందుము. ఈవాఁపు తరుచుగ ముఖముం సిద్ధమైయుండును. ముఖమున వాఁపు గన్పించెనేని తరుచుగ నది పంటి

నొప్పియనియే గ్రహించునది.

**ముఖరోగములు**-నోటియందు జనించు నమస్తరోగములకు "ముఖరోగము" లనిపేరు.

**ముఖవర్చస్సు**—హృదయమందుఁగల స్థితిగతులను ముఖమునందుఁ గాననగుట యెల్లరెరింగినరహస్యమే. ఆనందమయుఁడగుసంతృప్త హృదయుఁడును, క్లేశహృదయుఁడగు దుఃఖపూరితుండును యోచనలచే నాక్రమింపఁబడిన హృదయముగలవాఁడుఁ గూడ తనముఖవర్చస్సుచే హృదయస్థితి నెఱుంగఁజేయుచుండును. వయస్సు గడచినకొలఁది మనుష్యులముఖమున ముడుత లేర్పడెడిని. యోగ్యునిముఖవర్చస్సు వయస్సుతో సధికమగుచుండును. కుటిలుని ముఖవర్చస్సు వయస్సుతో క్షీణించుచుండును. దుర్మార్గునికి దుర్వర్చస్సు విస్తరించును.

వార్ధక్యదశయందు ముఖమునందలిచర్మము వలుచగనై సాఁగునట్టిశక్తిని గోల్పోవును. దీనినే యావనపటిమ నీరసించుటగా నెఱుంగవలసియుండును. ముఖవర్చస్సు మనశ్శుద్ధినిబట్టియే యుండుననునది మూలసూత్రము. హృదయమందు స్థిరపడియున్న లక్షణములనుండియే ముఖమునందలిచర్మముఁ గదపుచుండుట పరిపాటియైయుండెడిని. అట్లుతఱుచు కదలుతావులందే మడతలుపడుచుండి, రానురాను వయస్సుగడచుకొలఁది నాతావులందు రేఖ లేర్పడుచుండును. ఇట్లే దూరాలోచనము, సదా యోచించుచుండుట, కష్టములకుఁ బాల్పడిచేయు యోచనలు మొదలగునవియు, ముఖమునం దానవాళ్ళనుగల్గించెడిని. ఇటుల వయోధికదశయందు ముఖమునుండి లక్షణము లెఱుఁగనయ్యెడిని. ఇంకను వయస్సు గతించినకొలఁది చర్మమునందు సాఁగుశక్తి (Elasticity)తగ్గుచుండును. అత్తరి శరీరచర్మముపలుచఁబడుటయుఁ గలదు. అటిసిలితయందు ముఖచర్మము నున్నగ నుంట ప్రారంభమగును. (త్వగింద్రియము చూడుఁడు).

**ముఖ్యచాంద్రవహాన మాసము** — (మాసములు చూడుఁడు.)

**ముగ్గి గోత్రము** — (ముద్గలఉపగణము చూడుఁడు).

**ముచికుందుఁడు** — ఇక్ష్వాకుసంతతి. సూర్యవంశక్షత్రియుఁడు. ఋషియైన తపస్వి. కాలయవనుని నీరుగా కరఁగించినవాఁడు. తండ్రి మాంధాతచక్రవర్తి. తల్లి బిందుమతి. (శశిబిందుమహారాజుకుమార్తె). సోదరులు పురుకుత్సుఁడు, అంబరీషుఁడు. తోఁబుట్టువులు సౌభరి యనుమునిభార్యలు ౫౦ మంది. ఇతఁడు శ్రీకృష్ణభక్తుఁడై ముక్తినొందెను.

**ముచికుంద సరస్సు**— ధోల్పూరు (సంస్థానము)నుండి పశ్చిమముగ మూడుమైళ్ళ దూరమున "ముచికుంద" మనుసరస్సు కలదు. ఇది మగధరాజగు జరాసంధునిమిత్రుఁడును, కాశ్మీరభూపతియు నగు కలాయవన (లేక ఒకటవ గొనార్ధు) భూపతి, ముచికుందర్షి నిద్రించుచుండుతఱి సద్దుచేసి నిద్రభంగము గావించి, యాతనికోపాగ్ని కాహుతియై మడిసిన తావు. ఇట తొల్లి యొక పర్వత ముండెననియు, ముచికుందాశ్రమముండినతావనియు విష్ణుపురాణము ౫-౧౩ యందునను వరాహపురాణము ౧౫౮ అధ్యాయమునను వర్ణనలు కలవు.

**ముచికుందము(చెట్టు)**—దీనిం గూర్చి సరిగా తెలియదు. దీని వేరురసము, లేక యాకురసము, లేక కషాయము, ముఖరోగమును, రక్తపైత్యమును, శిరోరోగమును పోఁగొట్టుననిచెప్పఁబడినది

**ముడంబి వేంకటాచార్యులు కవి**— ఆంధ్రకవులలో నాధునికులందుఁ బరిగణింపఁ బడినవాఁడు. శ్రీవైష్ణవుఁడు. శ్రీవత్సగోత్రము. తండ్రిపేరు వేదాంచాచార్యులు. రచించినది "రసప్రదీపిక"యను వైద్యగ్రంథము.

**ముడి-ముళ్లు**-ముడి కాంగ్లమున 'Knot' అని పేరు. రెంటిని గలిపిపట్టుటకు త్రాడు మొదలగువాటిని ముడి వైచెదరు. ముడి వైచుట వేర్వేఱు తావులందు వేర్వేరు విధములుగ నుండును. ముఖ్యములగు కొన్ని విధములు ముక్రింద జూపఁబడును.





చిరకాలమునుండియు భరత దేశమున ద్విజుల యజ్ఞోపవీతములందు వేయఁబడుచున్న ముడికి "బ్రహ్మముడి"యని పేరు. ఈముడి చాలగట్టిగా బిగియునది. అడ్డదిడ్డముగ నొకవిధాన విధులు లేక పడినముడికి "పీడముడి"యని విసుగుతో ననెదరు.















మొత్తమున ప్రసంగములందు ముడిబెట్టుట యన కలుపుట కర్థము. వలయాతరి మిగిల్చిన కొనలంబట్టి లాగినచో వీడిపోవుముడికి "జాఱుముడి" యనెదరు.









ఇంకను భారతదేశమునం బుణ్యస్త్రీల కైదు ముళ్లు విధిగా నాచారమునందు నిర్ణయింపంబడినవి. ౧. జట్టుముడి, ౨ కుత్తికంటముడి, ౩ మంగళసూత్రపుముడి, ౪ కంచుకంపు(రవిక)ముడి, ౫ చీరముడి.

**ముడి మారెడుసాంగునా?**- (ఆంధ్ర లోకోక్తి)

**ముత్తవపులగపుచెట్టు**—చిన్నముత్తవపులగమనియు, పెద్దముత్తవపులగమనియు నిది ద్వివిధము. లా. Pavonia. Zeylanica. (చిన్న జాతి). Pavonia Odorata. (పెద్ద జాతి). ఆంగ్ల. Country mallon; సం. బలా. భద్రోదనీ; హిందీ. ఖురైటి.

ముత్తవపులగపుచెట్టువేళ్ళు కషాయ చూర్ణములు, మేహశాంతిగల్గించి, వీర్యపుష్టి, బలము నిచ్చుననియు, ఉబ్బుజాడ్యముల నివారించుననియు, జ్వరము, రక్తాతిసారము, వాతరోగము, శూలల నివారించుననియు, గర్భిణీస్త్రీలకుంగూడ దీనికషాయ మీయవచ్చుననియు నందురు.

**ముత్యము**— లా. Perla. ఆంగ్ల. Pearl; ఫ్రెంచి. Perle; సం. మౌక్తికమ్.

ముత్యము నవరత్నములలో నొకటిగం జెప్పంబడినది. ముత్యములు నీటియందు ముత్యపుజిప్పలం దేర్పడునవి. ముత్తెపుచిప్పలు, స్వాతికార్తెయందు వర్షించువర్షములకు చిప్పలను విప్పుకొనియుండునని సామెతగ "స్వాతివానకు

ముత్తెపుఁజిప్పలవలె నిరీక్షించుచుంటి" మని పల్కుచుండుటకలదు. ఒకసుప్రసిద్ధుండగు నాంగ్ల రసాయనశాస్త్రపండితుఁడు "A pearl is nothing more than a small mass of carbonate of lime formed by a shell fish inside its shell" అనియు, వేఱొకపండితుఁడు "Secretion deposited by many bivalve molluses, and a few univalves in the form of their layers of calcium carbonate one upon the other" అనియు ముత్యమును వివరించియున్నాఁడు. మరియు నాతఁడే "Its surface is indented with tiny ridges which cause the iridescence or play of colour that gives a pearl its characteristic appearance" అనియుఁ దెల్పెను.

ఇంకను బెక్కండ్రు పరిశోధకు లేకీభావముగా "The play of colour is due to irrigular refraction caused by obstruction to light by the numerous thin layers అని సిద్ధాంతముచేసి నుడివిరి.

ముత్యములు Acids నందు కరఁగునవి. ఆల్కలి (Alkali) సంబంధము గల్గించిన రంగును గోల్పోవును. ఇంతియే గాదు. మానవ శరీరఁపు వేఁడికన్న నధికపు వేఁడివేఁడికి తరుచుగ నందఁజేయుచుండిన చెడి, రంగును గోల్పోవు నిని. ముత్యమును గాల్చిన సున్న మగును. ముత్యములు ముత్తెపుచిప్పలం దేర్పడును. ఆంగ్ల పరిశోధకులు ముత్తెపుచిప్పలలో పెక్కుజాతిభేదములు కలవనియు, నవియన్నియు ముత్యములం జేయుననియు నందురు. వీట్లకాంగ్లమున "Shell fish" అనెదరు. ప్రశస్తమగు ముత్యములు జేయుజాతికి "Pearl oyster" అని పేరిడి యున్నారు. (ముత్యపుఁజిప్ప చూడుఁడు.)

ముత్యపుచిప్పలు లోన ముత్యములు పెరిగిన పిదప భరింపలేనివై నీటమునిఁగియుండఁజాలక అచ్చటచ్చట పైనిఁదేలనారంభింపగనే వతులు వాట్లకై పైన తిరుగుచుంటఁ గనిపెట్టి కాలము వచ్చినదని చిప్పలంబట్ట నారంభింతురు. దానికి "ముత్యాలవలాపము"(Pearl fishing)అని పేరు. భరతదేశమునందలి ముత్యాలవలాపము మన్నారు సింధుశాఖయందు (భరతదేశమునకు సింహళద్వీపమునకు నడుమను) కలదు. ఇంకను పారశీకసింధుశాఖయందలి Bahrein కడనున్న సముద్రమున ముత్యాలవలాపము బహుపురాతన మయినది. ఆస్ట్రేలియా ద్వీపము యొక్క పశ్చిమతీరము, క్వీన్సులాండు తీరము, కాలిఫోర్నియా సింధుశాఖయు గొప్ప ముత్యాలవలాపములు జరుగుతావులుగ నున్నవి.

ముత్యములకు నాణ్యము"అని పాణి" ఉండవలెను. అందుపరిమాణముచక్కఁగఁగల్గి,ముత్యమునందు నీరుండునటుల స్వచ్ఛమగు మణికిశధాతువు గల్గిన నది ముందివెలపెట్టును. చక్కని పిల్లలు పెద్దవారగుచుండుటను దెల్పుటకు 'అని ముత్యమువలె"నని పోల్చుదురు. ముత్యములు నల్లవి, తెల్లవి యని ద్వివిధము. నల్లముత్యములు కేవల మరుదు. పారశీక చక్రవర్తికడ నొక నల్ల ముత్యముగొప్పవిలువగలదికలదనిప్రతీతికలదు. తెల్లముత్తెములందు గుండ్రనివి, కోలనివి యుండును. కోలనివి నేలఁబడుచుండు నీటిబిందువువలెనాకారముఁగుదిర్చి విక్రయింతురు. దీని నాంగ్లమున Drop అనెదరు. కొన్ని ముత్యములను Pear పండునాకారమున కమర్చుదురు. ఇటీవలి కాలమునందు మంచి దళసరిముత్యపుచిప్పలనుండి కృతకముత్యములం జేయ నారంభించిరి. వీటి కాంగ్లమున Imitation pearls అని

పేరు. ఇంకను బుద్ధిమంతులు ముత్యపుచిప్పజంతువుల కేదియోషఫలహారమిడుదురఁట. అదివాటి గర్భమునఁ జేరివాటింజుట్టిముత్యము లేర్పడునఁట. ఇందువలన గర్భితపదార్థములఁజుట్టి యేర్పడు ముత్తెములు పెద్దవిగ నుండి హెచ్చువెలఁబెట్టునఁట. వీట్లకు 'Cultured pearls' అనిపేరు. చిన్నముత్యములు వెల తక్కువగ లభించును. మఱియు నెట్టని చిన్నగుబురులఁగల్గిన ముత్తెములధమపుజాతివి. ఇవియౌషధములలోనికిని కాల్చి భస్మము (సున్నము) చేయుటకును నుపయోగించెడిని. గొప్పవారియిండ్ల తాంబూలమునకు ముత్తెపుసున్నము వాడుదురని ప్రతీతి కలదు. అద్దముతో ముత్తెములవలెఁజేసి, లోన కళాయియు, మైనమును నింపి, అమ్మకమునకు సిద్ధపఱచు మాయముత్తెములు, లేక గుల్లముత్తెములు, ముత్తెములకు తలవంపులుతెచ్చుటకో యన దేశమం దంతటను దొరకుచున్నవి.

ముత్తెపుఁజిప్పల లోపల, ముత్తెముల కించు మించు దగ్గరగ నుండు రంగు గలదు గాన, దానితో చొక్కాలగుండీలు, చాకులపిడులు మొదలగునవి కొన్ని చేయుట కుపచరించును. ముత్తెపుచిప్పలలో పెద్దవి యెనిమిదంగుళముల పొడవుగల్గి చిన్నపళ్ళెమంతగఁ గూడ నుండును.

శాస్త్రోక్తముగఁ జేయఁబడిన ముత్యముల భస్మము, మేహశాంతి పైత్యశాంతిఁ గల్గించి, శూలలు, కఫదోషము హరించి, యాఁకలి నభివృద్ధిపఱచుననియు, ముత్తెపుసున్నము త్రిదోషముల హరించి, సమధాతువు గల్గించుననియు, ముత్తెపు చిప్పలసున్నము కాకజేసి విరేచనము గావించి, శూలల నడంచి, కఫోద్రేకము నివారించు ననియుఁ జెప్పఁబడినది.

ముత్యముల చూర్ణము నేత్రదృష్టి నధికపఱుచుననియు, నరములజబ్బుచేఁగల్గు కాళ్ళు చేతులువడకుటనివారించుననియుఁజెప్పఁబడినది.

అని పాని గలముత్యముచౌలలెక్కగతూఁచెదరు. అనఁగా ముత్య మిన్నిచౌలయెత్తు గలది యని పల్కెదరు.

**ముత్యాలసలాపము**:- ఇట 'ముత్యాలసలాప' మనిన సింహళద్వీపమున కీశాన్యదిశను మన్నారు ద్వీపముకడనుండి పుత్తాలముదనుకఁ గల సముద్రపుఁదరినుండి ౧౨ మైళ్ళదూరమున పదిపాతికములలోతుఁగల సముద్రజలములందు మరుగుప్రదేశమున 'పెరల్ బ్యాంకు' (Pearl banks) అనంబడు జలప్రదేశమం దని గ్రహింపవలసియుండును. ఏలయన నదియే ఆంధ్రదేశమునకు సమీపమునందుఁ గలది. అచట దొరకినముత్యములే యిటఁ గానఁబడునవి.

సముద్రమున ముత్యఁపుఁ జిప్పలజంతువులు జీవింపఁ గల్గెడిని. సముద్ర జలప్రవాహములు (Ocean currents) ఉండినతావుల నివి కొట్టుకొనిపోకుండఁగను పార్కులు, తిమింగలములు మొదలగు గొప్పగొప్ప పెద్దచేపలు, గొప్పపక్షులు వీటిని దినివేయకుండ మరుగుగా నుండవలసియుండునుగాన, నట్టి జలప్రదేశములు వీటి కమరినచో నీముత్యఁపుఁజిప్ప జంతువులు నివసించి బ్రతుకఁగల్గెడిని. ఇట్టి యనుకూలప్రదేశముల కాంగ్లమున "Pearl banks" అనియెదరు. ముత్తెఁపుఁజిప్పలకు సంస్కృతమున "శుక్తి"యనిపేరు. ఇట్టిరక్షణగల పెరల్ బ్యాంకు నందు కెరటము లుండక, అందలి జలములు నిశ్చలములై విశ్రాంతిఁగొనిన ట్లుండెడిని. వసించెడిజంతువులు నిర్భయముగ నిటఁ జీవింపఁ గల్గును. ఎంత మరుగైనను నొకజాతిపక్షులు వీటిని దినివేయుచుండు బాధయు, పార్కు (Shark) అనంబడు జలచరములు వీటిని దినివేయుచుండుబాధయు, తప్పవు గాన, ముత్యపుఁ

జిప్పల జంతువులు విస్తరించి పెరుగక, తఱుఁచుగ స్వల్పసంఖ్యాకములుగ నుండుట సంభవించుచుండును. ఈబాధలనుండియే సింహలద్వీపమునం దేర్పడిన ముత్యాలసలాప మేటేట లభించుటకు మాఱుగ రెండు మూడు, లేక నాల్గుసంవత్సరముల కొకసారి లభించుచున్నది. ముత్తెఁపుఁజిప్పజంతువు లేటేట స్వాతికార్తె వానలకొఱకు నిరీక్షించునటుల, ముత్తెపుఁజిప్పలు విప్పుకొని నీటిపై నిరీక్షించుచుండ, స్వాతి వానచినుకు లాచిప్పలందుఁబడినతోడనే ముడుచుకొనును. అదియె వాటికి గర్భధారణముఁ బోలినది. ఫిబ్రెవరినెలమధ్యను, సింహాలసలాప ప్రదేశమున పక్వస్థితిఁ గల్గెడిని. అవి నీటిపైఁ దేలుచుఁ దిరుగులాడు చుండుట గాంచి వాటినిఁ దిన పక్షులు పైనెగురుచుతిరుగులాడు చుంటఁగాంచి, సలాపము గల్గినదని యెఱుంగ నగును. అత్తరి నాప్రాంతసీమల గొప్ప కలకల మారంభమగును. సింహాలసలాపప్రాంతములఁ గల మార్చి కడ్డె గ్రామ మెప్పుడు నెట్టని మట్టిదిబ్బలపై దీనావస్థం బ్రదర్శించుచుండునది. సలాపముగల్గినకాలమున నేఁబదివేల జనులకు నిలయమై, యద్భుతముగ నంగడులసముదాయముతోఁ గొప్ప కలకలధ్వనితోఁ గదలికఁ గల్గి పట్టణమో యనున ట్లుండెడిని. ఇది ముత్యాలసలాపముపై నాధారపడినతావే గాని, వేఱు ప్రాముఖ్యత యేదియును లేనిది.

ఫిబ్రవరినెల మధ్యనుండి ఆరు, లేక ఎన్మిది వారములదనుక నీముత్యాలసలాపకాల ముండెడిని. వీటినిఁ దీయువారు తురాధనమ్మకముగల మహమ్మదీయులుగ నుందురు. షార్కుజలచరజంతువులబాధగలుగకుండ, అల్లాపవిత్రనామములు వ్రాయఁబడినతాయెతులను మేన ధరించి, మరియు నీట మున్గుచుందురు. మహమ్మదీయేతరులు, జనులపందడివలన షార్కులు బెదరి పాఱిపోవునని యనుచుందురు. సాయంత్రమున పదిటన్నులబరువు మోయఁ గలపడవలను వర్తకులద్దెకుఁ గుదుర్చుకొనియు, నీటమునుఁగువారలఁ గ్గూలికిఁ గుదుర్చుకొనియు సాయంత్రము, గాలి యొడ్డునుండి లోబారునకు విచుట ప్రారంభింపఁగనే, బయలుదేఱి ౧౨ లేక ౧౫ మైళ్ళ దూరము లోబారున కరిగి, దీపములతో రాత్రియంతయు నట పడవలయం దుండెదరు. ఇట్టివి సింహాలసలాపమున నూఱు లేక నూటయేఁబది యనుదిన మరుగుచుండును. సూర్యోదయముతో గాలి యాఁగి నిశ్శబ్దముగ నుండ నీటిలోనికి దిగ నారంభింతురు. బలమగుత్రాటికి సంచులం గట్టి, త్రాటినిబట్టుకొని నీట మున్గెదరు. తోడనే ముత్తెపుచిప్పలను, ధవళశంఖములను, చిత్రవిచిత్రాకారములు, వన్నెలు, రంగులు గల చిప్పలనుగూడ నెత్తి, సంచుల నింపి, త్రాళ్ళపైననే పైకి వచ్చెదరు. అట్లు వారు నీటియందు మున్గి యెఱువది లేక డెబ్బది సెకెండ్లకాల ముండ గల్గుదురు. కొందరాం దాలు ౧౨౦ సెకెండ్లకాలముకూడ నందుండఁ గల్గుదురఁట. సూర్యోదయము మొదలుకొని పగలు పండెడుగంటలదనుక నిట్లు నడచెడిని. అంతట గాలి సముద్రమునుండి యొడ్డునకు వీవ నారంభించుటతో నాఁపి, త్వరపడి, పడవలు బరువుసంచులతోదరికిచుర ల్చెడిని. ఆగుల్లల వేలమును వైచెదరు. ప్రభుత్వమువారు దీనికి లైసెన్సు మూల్యమునంది టిక్కట్లు నిత్తురు. ఇదిసింహాలముత్యాలసలాపము.

## ముత్తెదువ—(ఐదువ చూడుఁడు).

**ముత్రాసుకులము** — వీరికులోత్పత్తిని గూర్చి వివరములతో స్పష్టముగఁ దెలుపఁగల గ్రంథచంచయము చాలకున్నను, వారియందనుశ్రుతముగ నీక్రింది కథనము ప్రచారమునం

దున్నది. వీరు యయాతి మహారాజునకు దేవయానయందుఁ గల్గిన సుతులలో నొకఁడగు తుర్వసుండనువానికి పదుగురుపుత్రులుండిరఁట. వారు, కాలవశమునఁ జెడి, కుల దేవత యగు నంకమ్మను పూజించుట మాని, యా దేవతచే నిహతు లైరఁట. వారిలో నొక్కని పుత్రుఁడగు రవిదేవరాజునకు ౧ కరణమురాజు, ౨ గంగిరాజు, ౩ భూపతిరాజు నను మువ్వురు సుతు లుదయించిరి. వారే యీకులము వారికి మూలపురుషు లైరి. వారినుండియే యీకులను లభివృద్ధి నొందిరని చెప్పుదురు. రవిదేవరాజు కాలమునుండియు వీరి కంకమ్మదేవత ప్రధాన రక్షకకుల దేవతగా నున్న దందురు.

**ముదావతి (సౌనంద)**—తండ్రి విదూరథుఁడు; భర్త వత్సంధ్రి మహారాజు.

ఈమె కుజంభుఁ డను రాక్షసునిచే నపహరింపఁబడి, పాతాళమున చెఱయుంచఁబడినది. వత్సంధ్రుఁ డనుభూపతి ఆకుజంభునిఁ బరిమార్చి యీమెను బరిణయమయ్యెను. (సౌనంద చూడుఁడు.)

**ముదునూరి రామలింగము గారి బహిరంగలేఖ**—ఇది నాగాభరణం దాసు మయ్యగారికి వ్రాసినది. ఇందు భక్తిపూర్వకముగ దేవాంగులగోత్రములు, ఇంటిపేరులు వివరించి యున్నారు. (దేవాంగులు చూడుఁడు. దాసుమయ్యగారికి బహిరంగలేఖ చూడుఁడు.)

**ముద్గల ఉపగణము**—ఇది యాంగీరససంతతి కేవలాంగిరసగణములోని యొక ఉపగణము. ఇందిఱువదియొనిమిదిగోత్రములుగలవు.

మాత్స్యసూత్రోక్త గోత్రములు ౧౧:—

౧ అపాగ్రేయు, ౨ ఆలవాల, ౩ దేవజిహ్వ, ౪ పౌర, ౫ బిడాది, ౬ ముగ్రి, ౭ ముద్గల, ౮ మౌద్గల, ౯ సాత్యముగ్రి, ౧౦ హంసజిహ్వ, ౧౧ హిరణ్యస్తంభి.

బోధాయనసూత్రోక్తగోత్రములు ౧౨:—

౧ ఋషాయన, ౨ ఋషభ, ౩ కార్యభాసిత, ౪ ఛత్రిహాయ, ౫ జంఘ, ౬ తారణ, ౭ దీర్ఘ, ౮ మితాక్ష, ౯ వృష్ట, ౧౦ సూచి, ౧౧ హిరణ్యగర్భ, ౧౨ హిరణ్యాక్ష.

ఇతర గ్రంథోక్త గోత్రములు ౫:—

౧ తార్క్ష్య, ౨ త్రివేది, ౩ దీర్ఘజంఘ, ౪ భార్మ్యశ్వ, ౫ మౌద్గల్య.

ఈగోత్రములకుఁ బ్రవరరూపములు. (ముద్గల ఉపగణము).

౧ ఆంగీరస భార్మ్యాశ్వ మౌద్గల్య.
౨ తార్క్ష్య భార్మ్యాశ్వ మౌద్గల్య.
౩ ఆంగీరస తార్క్ష్య మౌద్గల్య.

**ముద్గలగోత్రము**—(ముద్గల ఉపగణము చూడుఁడు).

**ముద్గలర్షిగోత్రము**—(శిష్టుకరణములు చూడుఁడు). ఈగోత్రమువారికిఁ బ్రధానర్షి ఆంగిరసుఁ డనియు, ప్రవరరూపములు ౧ ఆంగిరస, మౌద్గల్య, భర్మ్యాశ్వ అనిగాని, ౨ ఆంగిరస, భర్మ్యాశ్వ, మౌద్గల్య అనిగాని, ౩ తార్క్ష్య, భర్మ్యాశ్వ, మౌదల్య, అనిగాను, త్ర్యార్షేయములై యుండుననియుఁ జెప్పఁబడినది. శిష్టుకరణములలో శేఖరమహంతివారు, పంచాదివారు, తామరఖండివారు, మూర్గొండవారు, రేగవారు నను నింటిపేర్లుగలవా రీగోత్రజులై యున్నారు.

**ముద్గల లేక పూర్వాతిథిగణము**—ఇది అత్రిసంతతిలోని యొకగణము. దీనిని పూర్వాతిథిగణ మనియు వాడుచుందురు. ఇందు పదునారు గోత్రములు కలవు. ఇవి ఆపస్తంబసూత్రోక్తములు.

బోధాయనసూత్రోక్తగోత్రములు ౧౬:-

౧ ఆర్ష్ణవ, ౨ గవిష్ఠిర, ౩ గారకి, ౪ గౌరవీత, ౫ బోధాత్య, ౬ ముద్గల, ౭ మౌద్గల, ౮ వామేక్ర, ౯ వాయువాన, ౧౦ వాయుపూతి, ౧౧ వైజవాప, ౧౨ వైతభావ, ౧౩ వ్యాలసంధి, ౧౪ శాలిమత ౧౫ శిరీష, ౧౬ సుమంగల.

ఈ ముద్గలగణగోత్రములు ౧౬ కిఁ బ్రవరరూపములు ౩:-

౧ ఆత్రేయ అర్చనానస పౌర్వాతిథి, ౨ ఆత్రేయ అర్చనానస గావిష్ఠిర, ౩ అత్రి సుమంగల శ్యావాశ్వ.

**ముద్గలుఁడు** — అత్రి, చంద్ర, పూరుసంతతిక్షత్రియుఁడు. తండ్రి భర్మ్యాశ్వుఁడు. సోదరులు యవీనరుఁడు, బృహదిషుఁడు, కాంపిల్యుఁడు, సృంజయుఁడు ననువారు. పుత్రుఁడు దివోదాసుఁడు. అహల్య కుమార్తె. ఈమె గౌతమునిభార్య. ఈముద్గలుఁడు బ్రాహ్మణుఁడై మౌద్గల్యసగోత్రబ్రాహ్మణులకు మూలపురుషుఁ డాయెను.

మఱియు ముద్గలుఁడను వేఱొకఋషి గలఁడనియుఁ దోఁచెడిని. ఇతఁడు నిర్జితవిషయేంద్రియుఁడు. కేవలసత్వగుణప్రధానుఁడు. జ్ఞాని.

**ముద్దరాజు రామన్న కవి** ఆంధ్రకవులలో మధ్యకవులందుఁ జేర్చఁబడినవాఁడు. నందవరీక నియోగిబ్రాహ్మణుఁడు. లాక్షణికుఁడు. తండ్రిపేరు గణపయ్య. క్రీ. వె. ౧౬౨౦ ప్రాంతమువాఁడఁట. రచించినది "కవిసంజీవని" యనంబడు లక్షణగ్రంథము.

**ముద్దుకులగోత్రము**— (కంకారకుల చూడుఁడు).

**ముద్దుపళని**—ఆంధ్రకవులలో నాధునికులలో పరిగణింపఁబడినది. ఈమె భోగకాంత. తంజావూరు కాపురము. ఆంధ్రయువతి. తల్లిపేరు ముత్యాలు. ఈమె తంజాపురాధీశుఁడగు ప్రతాపసింహమహారాజను మహారాష్ట్రనృపుని యుంపుడుకత్తియ. క్రీ. వె. ౧౭౬౦సం॥ర ప్రాంతమున నుండినది.

ముద్దుపళని రచించినది "రాధికాసాంత్వన" మను శృంగార ప్రబంధము.

**ముద్రబెండచెట్టు**- దువ్వెన్న చెట్టుచూ.

**ముద్రలు**—యోగశాస్త్రమున ముద్రలిరువదియని చెప్పఁబడినది. యోగశాస్త్రోక్తమగు షట్క్రియాభ్యాసమువలన నాడీశుద్ధి గలిగిన పిదప దశ వాయువులు వాటి వాటి నాడులందు నిరాటంకముగఁ బ్రసరించుచుండుటకును సుషుమ్నానాడిని బ్రహ్మరంధ్రమునఁ బ్రవేశింపఁ జేయుటకును, దృష్టి చంచలము లేక ఏకలక్ష్యము స్థిరపడుటకును, వింశతిముద్రల నభ్యసించుటకు యోగశాస్త్రపద్ధతులు విధించుచున్నవి.

మఱియు నీవింశతిముద్రల నభ్యసించుట వలన శ్వాసకాసలు, ప్లీహరోగము, కుష్ఠురోగము, సమస్త శ్లేష్మరోగములు నడఁగిపోవుటయే గాక, ప్రాణవాయువు సుషుమ్నానాడియందు ప్రవేశింపవీలుగల్గించుననియు, నీవింశతి ముద్రలు ప్రాణాయామాభ్యాసమునకుఁ బూర్వాంగము లనియు, సాధనోపాయము లనియుఁ జెప్పఁబడినది.

వింశతిముద్రలు:-౧ మహాముద్ర, ౨ నభోముద్ర, ౩ ఉడ్డియాణబంధముద్ర, ౪ జాలంధర బంధముద్ర, ౫ మూలబంధముద్ర, ౬ మహాబంధముద్ర, ౭ మహావేధముద్ర, ౮ ఖేచరీముద్ర, ౯ విపరీత కరిణీముద్ర, ౧౦ యోనిముద్ర, ౧౧ వజ్రోళిముద్ర ౧౨ శక్తిచాలన ముద్ర, ౧౩ తటాకముద్ర, ౧౪ మండూకముద్ర, ౧౫ శాంభవీముద్ర, ౧౬ అశ్వనీముద్ర, ౧౭ పాశినీ

ముద్ర, ౧౮ కాకీముద్ర, ౧౯ మాతంగినీ ముద్ర, ౨౦ భుజంగినీముద్ర

కొంద రింకను గొన్ని ముద్రలు గలవందురు గాని యవి ప్రసిద్ధములు కావు. సాధారణముగ వాడుకయందును లేవు. వీటి నిట వివరించుట యసమంజసము.

**ముద్రాక్షరయన్త్రపరిభాష - (Printers' Terms)**-ఈపరిభాష కేవలము ముద్రాక్షరశాలలవ్యాపారసంబంధము. ముద్రింపఁబడు నక్షరము లనేకరకములు, ననేకతరగతులు, ననేక కొలతలు గలవిగనుండెడిని. వాట్లకు సాధారణముగ పేర్లున్నను కొంత చికాకుగనే యుండును. వాట్లకు తొలుత కొలతలంబట్టి చేయఁబడిన యుత్పత్తివిధానము నెఱింగినఁ జక్కఁగ బోధపడునుగాన వాటిని వివరింతుము గాక.

ఒక యంగుళము పొడవును డెబ్బదిరెండుగ విభజించి, ఆడెబ్బదిరెండుభాగములను డెబ్బదిరెండు పాయింట్లని (Points) పేరిడిరి. ఏరకపు అక్షరమునం దెన్ని పాయింట్లుండునో దానిం బట్టి తెలుసుకొనుట గాన నీ విధానమునకు 'Point system' అనుచుందురు. మఱియు 'Type'యొక్క వెడలుపును 'Ems'గ లెక్కింతురు. పొడవును 'Points'గ లెక్కింతురు.

3½ Point అక్ష. లకు Brilliant Type అనిపేరు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 4½ | | | Diamond | ,, | ,, |
| 5 | | | Pearl | ,, | ,, |
| 5½ | | | Ruby | ,, | ,, |
| 6 | ,, | | Nonpearl | ,, | ,, |
| 7 | | ,, | Minion | ,, | ,, |
| 8 | | | Brevier | ,, | ,, |
| 9 | | | Bourgeois | ,, | ,, |
| 10 | | | Long Primer | ,, | ,, |
| 11 | | | Small Pica | ,, | ,, |
| 12 | ,, | ,, | Pica | ,, | ,, |



14 Point అక్ష.లకుEnglish Type అనిపేరు

18 ,, ,, Great primer అని పేరు.

22 ,, ,, Double Pica అనిపేరు.

24 ,, ,, TwolinePica అనిపేరు.

ఇవి వాడుకయందుఁ గల టైపులు. ఇంకను లెక్కలేని పరిమాణములు, నక్షరములు కలవు గాని అవి లెక్కలోనివి కానేరవు. మఱియు నీక్రిందిగుర్తు పరిభాషలును కలవు.

Caps- Capitals.

Caret- an arrow indicating that something is omitted.

Case Lower- Minuscule letters.

Case Upper- Capital letters.

Chase- The frame in which the Type is set up.

Del- Delete take out.

Ems- Type space in printings.

Forme- The frame in which type is set up.

Fount- Style of type.

Half Tone- A form of block engraving used for reproducing photographs.

Line block- A form of engraving in a series of lines.

Pagination- The numbering of pages.

Pie-Muddle Type.

Stet- Let it stand.

Trs- Transpose.

W. F. Wrong Fount- Signifying that wrong kind of type has been used.

**ముద్రాక్షరశాల** — ఇక్కాలమున పట్టణములందే గాక పల్లెలయందుసైతము చ్చటచ్చట ముద్రాక్షరశాలలు వ్యాపించి యుంట గాననగును. వీటింగూర్చిన పూర్వోత్తరచరిత్రలెఱింగియుంటయు వినోదకరముగనే యుండును.

ఐరోపాదేశ సీమలందు క్రీ. వె. ఆఱవశతాబ్దమునందే కఱ్ఱబిల్లలపై వలయునాకారములం జెక్కి ముద్రించినపను లుండెనని కొందఱును, దీనినిజముం గూర్చి సంశయించువారు మఱికొందఱును లేకపోలేదు. మఱికొందఱివి చీనాదేశమునుండి వచ్చినవనియు నందురు. ఏదియెట్లయినను పదునేనవ శతాబ్దమున డచ్చి (హోలండు) దేశఁపు చిత్రకారు లీపనికిఁ గడంగి, రచింప మొదలిడిరని చెప్పఁబడినది.

అచిరకాలముననే ఆవిద్య కఱ్ఱపలకలపై నక్షరములం జెక్కుటగా పరిణమించెనఁట. పిదప నక్షరములను విడివిడిగ వేర్వేరుకఱ్ఱముక్కలపై జెక్కినపనియు, లోహము గరఁగి మూసలలోఁ బోసి విడివిడిగ నక్షరములం జేసినపనియు, క్రీ. వె. ౧౪౪౦-౧౪౫౦ నడుమ జరిగెనని యందురు. అక్కాలమున వ్రాఁతలిపి వాడుకయందుంట గోతిక్ అక్షరములు ఆయత్తపఱుపఁబడినవని చెప్పఁబడినది. ఇట్టి ముద్రణము జర్మనుదేశపు Gutenburg నందు ౧౪౫౫ లో నొకబైబిలు ముద్రింపఁబడెనఁట. విలియమ్ మోరిస్ అనువారి కీముద్రణపు యోచనలు, ననుభవము ప్రయత్నమును జెప్పఁబడినది.

మెయింజు అనఁబడు తావున Peter Schoffer అనువారికి ఆదిప్రయత్నములు చెప్పఁబడినవి. వారే పోఁతఁబోసిన యక్షరములను జేసినవా రఁట. స్పష్టముగఁ దెలియుటకు 'గోతిక్' అక్షరములను ప్రారంభించిన దీయనయే యందురు. మఱియు నిక్కాలమున 'సుబియాకో' పురవాసు లగు Sweynheim and Pannartz అనువారలు ముద్రాక్షరములఁ గరఁగిపోయు వృత్తి జేయుచుండి, గోతిక్కు అక్షరలిపిని మార్చి, రోమనులిపిని అక్షరములం బోతపోయ మొదలిడిరఁట. క్రీ. వె. ౧౪౭౦లో వెనిస్ నగరమున నచ్చుపనులఁ జేయుచుండిన 'Nicolas Jensen' అను ఫ్రెంచిదేశస్థుఁడగు పనివాఁడు, తనబుద్ధిబలముచే Art and craft ముద్రణములం గైకొని యభివృద్ధికిఁ దెచ్చినవాఁడని చెప్పఁబడినవాఁడు. ఇంక నీసందర్భమున నాంగ్లేయుఁడగు William Caxton గారును చిరస్మరణీయులు. వీరు 'కొలోన్' నగరమున పనినేర్చి బ్రూజెసు పురమునఁ గొంచెము కాలము గడపి, ౧౪౭౬ లో లండను నగరమునందు ముద్రాక్షరశాలను స్థాపించి నడుపుచుండిరి. ఆయనకడ ఫోర్మెన్‌గా పనిచేయుచుండిన Wynkyn de wordeగారాయనకుఁబిదప నాపని నేసాఁగించుచుండిరఁట. పదునాఱవ శతాబ్దముననే యీవిద్య యభివృద్ధి గాంచి, యింగ్లాండునందు పండ్రెండును, జర్మనుదేశమున నిరువదియు, నిటలీదేశమున నూఱును స్థలములు ముద్రాక్షరశాలలం గల్గియుండెనఁట.

పదునాఱవ శతాబ్దముననే ఫ్రెంచిదేశమున కలిగిన మతసంబంధపుటొత్తిడికిం దాళలేక విదేశగతులగువారిలో పెక్కండ్రు ముద్రణమే వృత్తిగఁ గలవారైయుండిరి. వారిలో నాంట్వర్పు దేశవాసి యగు ప్లాంటిన్ను పేరుగలవాఁడు సుప్రసిద్ధుఁడని చెప్పఁబడినది. ఆయననుండి యిటలీదేశమున నీకళ యెక్కువ వ్యాపించెనందురు. పదునేడు, పదునెన్మిది శతాబ్దములందీవిద్య యెక్కువ వ్యాపక మందిన ట్లగుపడదు.

పిదప రానురా నీముద్రాక్షరశాలల యక్షరములు, ముద్రణయంత్రములు, రంగురంగుల

సిరాలు, కూర్చుటకైన ఇతరపరికరములు, మార్పులనందుచు నభివృద్ధిఁ గాంచుచు నేఁటి కగుపడురీతులం దనరారుచున్నవి. దినపత్రికలు, గొప్పగొప్ప గ్రంథములు నతిత్వరితముగ లక్షలకొలఁదిగ ప్రతులు ముద్రింపఁ బడుచున్నవి. ఆదిని గంటకు నలువది కాగితముల నొకేప్రక్క ముద్రించుయంత్రములు, మార్పులనంది యిక్కాలమున కొన్ని పెద్దయంత్రములు విద్యుచ్ఛక్తిచే నడుపఁబడుచు గంట కఱువదివేల ప్రతులు ముద్రింపఁబడుచు సర్వరీతిని మడఁచుకొనుచు నిరువదియారేసి ప్రతులుగ కట్టలంగట్టఁబడుచుండుటకుఁ దగినవి కలవు. ఇంక నిక్కాలమున ముద్రాక్షరశాలలందు పనివాండ్రు వాడుకొనుచున్న పరిభాషాపదములను వివరించి ముగించెదము.

అక్షరముల నుంచుకొను అరలుగల తొట్టెలకు 'కేసు' లనిపేరు. ఇది 'అప్పర్ కేసు' 'లోవర్ కేసు' అని రెండుగ నుండును. తఱుచుగ తటస్థించు నక్షరములు లోవరు కేసునను, తక్కినవి అప్పర్ కేసునను నమర్చుకొందురు. కాలీస్థలములం దమర్చుటకు కాలీ (అక్షరములు లేని) దిమ్మలు, ముక్కలు 'స్పేసెస్' అనఁబడును. అక్షరములంగూర్చుటకు 'కంపోజు' అనఁబడును. ఆటులఁ గూర్చుతరి చేతఁబూని యందక్షరములను పైచుకొనుచుండు లోహపుతొట్టెకు 'కంపోజింగ్ స్టిక్' అనిపేరు. దీని నింకను గొందరు 'సెట్టింగ్ స్టిక్' అనుచున్నారు. పంక్తుల నడుమ నెక్కువ వెడలుపు గావలసినచో నుంచుటకు లోహపు రేకు లుండును. వాటికి "లెడ్సు" అనియెదరు. కూర్చినపిదప నక్షరసముదాయమొకనలుపలకలపళ్లెమునకుం జేర్చుదురు. వాటికి "గేలీస్" అనిపేరు. అట్టి 'గేలీ' యందు చట్రముచే బిగించి, యొకకాగితమున ముద్రించి, తప్పుల దిద్దుకొందురు. దానికి "గేలీప్రూఫ్" అని పేరు వాడుచున్నారు. ఈ పరిభాషయందు సిరాకు 'కాటుక' యనుటయుఁ గలదు. అక్షరములపై సిరాపులుము పరికరమునకు 'రోలర్' అనియెదరు. ముద్రించుటకు "స్ట్రియికిం" గనుచుందురు.

**ముద్రికతాళము**-- (తాళములు చూ).

**మునగ (చెట్టు)**— మునగయం దెఱ్ఱ మునగ, తెల్లమునగ, యడవి (లేక కారు) మునగ యని త్రివిధభేదములు గలవు. ఇది ములగకాడ లనుపొడుగగు కాయలఁ గాచు చెట్టు. మునగచెట్టును లాటిన్భాషయందు Moringa Pterygosperma అనియు, నాంగ్ల. Horse Radish అనియు, నందురు. సం. తీక్ష్ణగంధః, మోచకః, మధుగుంజనః, శాకపత్రః, ఉగ్రః, వనపల్లవః, కటుకందః, సీచకః అనుపదములు మునగసామాన్యమునకును శ్వేతశిగ్రుః, శ్వేతమరీచః, సుమూలా, పాచనః, మధుశిగ్రుః అనుపదములు తెల్లమునగకును, రక్తశిగ్రుః, సురంగః, కేసరీసింహ యను పదము లెఱ్ఱమునగకును వర్ణించెడిని. అడవి మునగ లేక కారుమునగకు 'వనశిగ్రుః' అని చెప్పఁబడినది.

ఇది విరేచనము జేయుననియు, నొంటినీ రార్చుననియు, విషదోషమును, వాతపైత్యమును హరించి, నేత్రరోగములను నివారించి, వీర్యవృద్ధిఁగల్గించునని చెప్పఁబడినది

మునగాకు నాముదముతో వెచ్చజేసి కట్టిన నారిబీజము తగ్గిపోవుననియు, నూరి కట్టిన నారికురుపులు మానుననియు, చిగుళ్ళయందుఁ ద్రిదోషములు శమింపఁజేయుగుణము గలదనియు, నేత్రవాతముల నడంచుననియు, మునగపూవు త్రిదోషహరమై నేత్రవాతముల నడఁచుననియు, పువ్వుల వెచ్చఁజేసి పైనఁగట్టిన నేత్ర

రోగముల నివారించుననియు, మునగకాయ కూర, వీర్యవృద్ధియు నాకలియు గల్గించి, మేహ శాంతిఁజేయు ననియు, మూలవ్యాధి నడఁచు ననియు, లేఁతకాయలు పథ్యమైయుండి, వాత మును కఫమును నివారించి, వీర్యవృద్ధి గల్గించు ననియు, ముదురుకాయ వాత కఫముల నుద్రే కించుననియు, మిక్కిలి లేఁతకాయ శ్లేష్మమనియుఁ జెప్పఁబడినది. మునగజిగురు పైనఁ బట్టించిన సుఖవ్యాధులు నివారణమగు ననియు, తత్సం బంధమగు కీళ్ళనొప్పులును, గోరుచుట్టును మాను నందురు. మునగతైలము సమస్తవాతపునొప్పు లను నివారించునని చెప్పఁబడినది.

మునగవేరు కాకజేసి యభిఘాతజ్వరమును, నాహికజ్వరమును, నీడ్పురోగమును, నపస్మార మును, పక్షవాతమును, మూర్ఛను, సుబ్బును, సన్నిపాతమును నివారించుశక్తి గలదనియు, పుప్పిపంటిని మాన్పుననియు నందురు. మునగ గింజలందు వీర్యవృద్ధిఁ గల్గించుటయు, శూలలు, సుఖవ్యాధులను నడంచుటయుఁ జెప్పఁబడిన గుణములు.

మునగకు బెల్లము, నెయ్యి, ఆవాలగుండ, కలినీళ్ళు, పెరుఁగు, చండ్రిచెక్కకషాయమును విఱుగుడులని చెప్పఁబడినది.

**మున్న నది**— (మున్నేరు లేక మున్న నదిఁ జూడుఁడు).

**మునికుల గోతము**— ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్య గోత్రములు చూడుఁడు.)

మునికుల (మూలకుల) గోత్రము- త్ర్యార్షేయ (౧) గోత్రము. తొల్లింటి సంస్కృత గోత్రము మౌద్గల్యస.ముద్గలగణము. ఆపస్తంబ యజుశ్శాఖ. ప్రమాణగ్రంథ మాశ్వలాయన సూత్రము, నిర్ణయసింధు ధర్మసింధు. మాధ వేశుఁడు దేవత. మలయాంబ భార్య. పటీరా చలము తపస్థానము. మలయాంభోధి తటాకము జపముకోటి. దీపములు ౩౦. క్షేత్రసంఖ్య ౨౬. మహిషదానము. కస్తూరి, మునగకాయలు వర్జ్యము.

**మునిజకులగోత్రము** — (మౌంజికుల చూడుఁడు.)

**మునియేరు**—(మున్నేరు లేక మున్న నది (మునియేరు) చూడుఁడు.)

**ముని ర్తనుతే మూర్ఖో ముచ్యతేతి న్యాయము**-'ముని తపస్సుచేసిన మూర్ఖుఁడు తరించె' నని యర్థము. అసందర్భము వల్కుట యనిభావము.

ఇట్టిదే "కాచి న్నిషాదీ పుత్రం ప్రసూతే, కశ్చి న్నిషాదస్తు కషాయపాయీ" అనున్యాయ మును (అనఁగా నొకనిషాదస్త్రీ నీళ్లాడి కుమా రునిఁ గనిన, వేఱొకనిషాదుఁడు కషాయముఁ ద్రాగె ననియర్థము). సందర్భశూన్యమగు మాట కీన్యాయములు వర్తించును.

**ముని లేక మునీదేవి**—తండ్రి దక్షప్రజాపతి, భర్త కశ్యపమహర్షి. ఈమె సంతతి మౌనేయులు (అప్సరలు). (కశ్యపమహర్షి భార్యలు చూడుఁడు.)

**మునిస్వామి** -(అగస్త్యమహర్షి చూ).

**మునిసువ్రతనాథుఁడు**- జైనతీర్థకరులలో నొకఁడు. (తీర్థకరులుచూ.) వీరి చిహ్నము తాఁబేలు హరివంశము. తండ్రి సుమిత్రక రాజా తల్లి శ్యామాదేవి. జన్మస్థానము రాజగృహము. పొడవు ౨౦ ధనుస్సులు. కృష్ణ వర్ణము. ఆయువు ముప్పదివేల సంవత్సరములు. గణధరసంఖ్య ౧౮. నిర్వాణస్థలము సుమేరు శిఖరము. అంతరాళ మారులక్షల సంవత్సర ములు. వీరి కాలముననే శ్రీరామలక్ష్మణులు

జన్మించిరనియు, శ్రీరాముఁడు జైనుఁడు గాన ౭౫౦ మంది మునులతో ఖండగిరిపైనుండి సిద్ధి నంది స్వర్గారోహణ మొనర్చె ననియు, లక్ష్మ ణుఁడు జైనుఁడు గామి నరకవాసమున కేగె ననియు, జైనగ్రంథములయందుఁ జెప్పఁబడినది.

**మున్నేరు లేక మున్నదది (మునియేరు)**--ఇది యొకపాటివాగు. ఘనతవహించిన నిజాంప్రభువుగారిరాష్ట్రమునందలి వరంగల్లు జిల్లాలోని పాకాల లేక పాఖాలచెఱువు పొర్లుపాఱుదలనుండిజన్మించి, కొంత భూప్రదేశమును తనజలములచేఁ దడిపి, ఫలవంతమగు పొలములుగ నొనర్చి, కంబముమెట్టపురము ప్రక్కఁబడి ప్రవహించుచు, కృష్ణవేణీనదియందు సంగమించుచున్నది. (కంబముమెట్ట పురముఁ జూడుఁడు). పాకాలచెఱువు ప్రతాపరుద్రమహారాజుచే ద్రవింపఁ బడినదని చెప్పఁబడినది. ఇది కొండలమధ్యనున్న సాగరము.

మున్నేటిప్రశంస ఆంధ్రవరాహపురాణమున కంబముమెట్టపురవర్ణనా సంబంధమునఁ గలదు. అందు "మున్న"యని వాడిరి. దీని నాప్రాంతవాసులు జీవనది యందురు.

**ముప్పదిమూఁడుకోట్లదేవతలూ ఏకమైతే ముక్కు పట్టించగలరు గాని ప్రాణాయామము పట్టించగలరా? —** (ఆంధ్రలోకోక్తి)

**ముప్పదియాఱుతత్త్వములు**-- ఇవి పరమేశ్వరసంబంధములు. మానవశరీరస్థములు గూడ నైయుండెడిని. అద్వైతసిద్ధాంత గ్రంథములందు వీటినిగూర్చి యిట్లు చెప్పఁబడినది-

౧. పృథ్వీతత్త్వము (పంచభూతములలోనిది)
౨. జలతత్త్వము. ,,
౩. అగ్నితత్త్వము. ,,
౪. వాయుతత్త్వము. ,,
౫. ఆకాశతత్త్వము(పంచభూతములలోనిది)
౬. గంధతత్త్వము. (తన్మాత్ర)
౭. రసతత్త్వము. ,,
౮. రూపతత్త్వము. ,,
౯. స్పర్శతత్త్వము. ,,
౧౦. శబ్దతత్త్వము. ,,
౧౧. పాయుతత్త్వము. (కర్మేంద్రియము)
౧౨. ఉపస్థతత్త్వము ,,
౧౩. పాదతత్త్వము ,,
౧౪. పాణితత్త్వము ,,
౧౫. వాక్తత్త్వము. ,,
౧౬. ఘ్రాణతత్త్వము. (జ్ఞానేంద్రియము.)
౧౭. జిహ్వాతత్త్వము ,,
౧౮. చక్షుస్తత్త్వము ,,
౧౯. త్వక్తత్త్వము ,,
౨౦. శ్రోత్రతత్త్వము ,,
౨౧. మన ము. ,,
౨౨. అహంకారతత్త్వము. ,,
౨౩. బుద్ధితత్త్వము. ,,
౨౪. గుణతత్త్వము(దీని నెపురుషతత్త్వమందురు)
౨౫. ప్రకృతితత్త్వము. (శక్తితత్త్వము)
౨౬. రాగతత్త్వము. (కంచుకతత్త్వము)
,,
౨౮. కాలతత్త్వము. ,,
౨౯. విద్యాతత్త్వము. ,,
౩౦. కలాతత్త్వము. ,,
౩౧. మాయాతత్త్వము (శక్తిజన్యము)
౩౨. శుద్ధవిద్యాతత్త్వము.(పరమేశ్వరసంబంధ)
౩౩. ఈశ్వరతత్త్వము. ,,
౩౪. సదాశివతత్త్వము. ,,
౩౫. శక్తితత్త్వము
౩౬. శివతత్త్వము. ,,

వీటినిగూర్చిన వివరణము:—

౩౬. శివతత్త్వము-ఇది పరమేశ్వరతత్త్వమనఁ

బడును. పరమేశ్వరుని లయమొనర్చు నవస్థ. (పరికరరూపము.) పరమేశ్వరుని ప్రథమావస్థా నిరూపణము. లింగాకారమునందు శిరమున నుండునదిగాఁ జెప్పఁబడిన తత్త్వము.

౩౫. శక్తితత్త్వము - ఇది పరమేశ్వరుని మహిమ లేక శక్తియనఁబడును.(సామర్థ్యము). పరమేశ్వరునకుఁ భోగపరికరము బలావస్థ. మహిమాస్థానము. పరమేశ్వరునియందంతటను వ్యాపించియుండు తత్త్వముగఁ జెప్పఁబడినది.

౩౪. సదాశివతత్త్వము- పరమేశ్వరసంబంధము. పరమేశ్వరుని యధికారావస్థ. స్థితిహేతుకము. ఈ తత్త్వమునుండి నాద ముద్భవించెను. ఆ నాదము ననాహత మందురు. (కొట్టఁబడనిది). నాదమునుండి బిందువును, దానినుండి కళయు నుత్పన్నము లయ్యెను. ౧. నివృత్తి, ౨. ప్రతిష్ఠ, ౩. విద్యా, ౪. శాంతి, ౫. శాంత్యతీతము, ౬. శాంత్యతీతోత్తరము నని కళలాఱు చెప్పఁబడినవి. ఈ యాఱుకళలే "కలాధ్వ"గ వివరింపఁబడినది.

౩౩. ఈశ్వరతత్త్వము- ఇవి ప్రణవమనియు, పరమేశ్వరసంబంధతత్త్వ మనియు, ఐశ్వర్యావస్థ యనియు, స్థితిపరికర మనియుఁ జెప్పఁబడినది.

౩౨. శుద్ధవిద్యాతత్త్వము- ఇది పరమేశ్వర సంబంధతత్త్వము. పరమేశ్వరుని సర్వజ్ఞతావస్థ. (సర్వము నెఱుంగునవస్థ).

౩౧. మాయాతత్త్వము- ఇది పరమేశ్వరుని శక్తిజన్యము. ఈ తత్త్వమునుండియే, ౨౭ నియతి తత్త్వము, ౨౬ కాలతత్త్వము, ౩౦ కలాతత్త్వమును జనించెనని చెప్పఁబడినది.

౩౦. కలాతత్త్వము- ఇది పంచకంచుకములలో నొకటి. మాయాతత్త్వజన్యము. దీనియందు ౨౯ విద్యాతత్త్వము, ౨౮ రాగతత్త్వము, ౨౫ ప్రకృతితత్త్వము నను మూఁడుతత్త్వములు జనించెను.

౨౯. విద్యాతత్త్వము- ఇది పంచకంచుకములలో నొకటి. కలాతత్త్వజన్యము. దీనియందు పంచాశదుద్రరూపములగు నేఁబది వర్ణములు (అక్షరములు) జనించెను. ఈవర్ణము లేఁబదియు "వర్ణాధ్వ" యనఁబడు చున్నది. వర్ణాధ్వ యైదువిధములు.

(౧) శక్తియొక్క ముఖమునుండి జనించిన స్వరములు పదునాఱు. ఇవి యాకారజన్యము లని చెప్పఁబడినవి. "అ"కారమున కాద్యస్వర మనిపేరు. ఇవి తిరుగ జన్యస్వరము లనియు, వికారస్వరము లనియు, గుణస్వరము లనియు, వృద్ధిస్వరము లనియు, అనుస్వార మనియు, విసర్గ మనియు నాఱుభేదములుగ నున్నవి.

౧. జన్యస్వరములు మూఁడు-ఇ-ఉ-ఋ అనఁబడుచున్నవి. ఇవి యాద్యస్వరమగు 'అ' కార వర్ణ జన్యములని చెప్పఁబడినవి.

౨. వికారస్వరములు ఆ-ఈ-ఊ-ౠ-ఌ-ౡ అని యుచ్చరింపఁబడుచున్న యాఱుస్వరములు. ఇవి యాద్యస్వరమగు 'అ'కారజన్యస్వరములకు వికారరూపము లని చెప్పఁబడినవి.

౩. గుణస్వరములు- ఇవి ఏ ఓ అని యుచ్చరింపఁ బడుచున్న రెండుస్వరములు. ఆద్యస్వరమగు 'అ'కారజన్యస్వరములలోని 'ఇ, ఉ' లకు గుణస్వరము లని చెప్పఁబడినవి.

౪. వృద్ధిస్వరములు - ఇవి 'ఐ-ఔ' లని యుచ్చరింపఁబడుచున్న రెండుస్వరములు. ఆద్యస్వరమగు 'అ'కారస్వరమున కివి వృద్ధిస్వరము లని చెప్పఁబడినవి.

౫. అనుస్వారము-ఇది సున్న యని యుచ్చరింపఁ బడుచున్నది

విసర్గము - ఇది ః యని వ్రాయఁబడుచున్నది.

(౨) శక్తియొక్క పంచాగములనుండి జనించినస్వరములు ౨౫. వీనిని "హల్లు"లనుచున్నారు.

౧. క ఖ గ ఘ ఙ (కవర్గమనిపేరు).
౨. చ ఛ జ ఝ ఞ (చవర్గమనిపేరు).
౩. ట ఠ డ ఢ ణ (టవర్గమనిపేరు).
౪. త థ ద ధ న (తవర్గమనిపేరు).
౫. ప ఫ బ భ మ (పవర్గమనిపేరు).

ఇట్లివి ఇరువదియైదక్షరములుగ నున్నవి. వీనిని "హల్లు" లనుచున్నారు.

౩. శక్తియొక్క సప్తధాతువులనుండి జనించిన సప్తధాతుజన్య స్వరములు- ఇవి "య, ర, ల, వ, శ, ష, స, యని యుచ్చరింపఁబడుచున్న సప్తస్వరములు. "హల్లు" లనఁబడుచున్నవి.

౪. శక్తిప్రాణజన్యముగఁ జెప్పఁబడిన 'హ' కారము. ఇది హల్లులలోనే పరిగణింపఁబడుచున్న స్వరము.

౫. శక్తియొక్క యంగధాతుజన్యముగఁ జెప్పఁబడిన యుభయాత్మకస్వరము- (అనఁగా నంగజన్యమగు 'క' కారమును, ధాతుజన్యమగు 'ష' కారమునుఁ గలసిన "ఉభయాత్మకస్వర" మని భావము.) ఇది హల్లులందే పరిగణింపఁబడుచున్న యక్షరమని యెఱుంగునది.

౨౮. కాలతత్వము- ఇది పంచకంచుకములలో నొకటి. మాయాతత్వజన్యము.

౨౭. నియతితత్వము- ఇది పంచకంచుకములలో నొకటి. మాయాతత్వజన్యము.

౨౬. రాగతత్వము- ఇది పంచకంచుకములలో నొకటి. కాలతత్వజన్యము.

౨౫. ప్రకృతితత్వము - ఇది కాలతత్వజన్యము. దీనినుండి గుణతత్వము, లేక పురుషతత్వము జనించెను.

౨౪. గుణతత్వము - దీనిని పురుషతత్వమనియు నందురు. ప్రకృతితత్వ జన్యము. దీనినుండి బుద్ధితత్వము జనించెను. (అంతఃకరణతత్వము).

౨౩. బుద్ధితత్వము - దీని నంతఃకరణతత్వమనియు నందురు. గుణతత్వజన్యము. దీనినుండి యహంకారతత్వము జనించెను.

౨౨. అహంకారతత్వము-ఇది యంతఃకరణముగాఁ జెప్పఁబడినది. బుద్ధితత్వజన్యము. ఇది సాత్వికాహంకారము, రాజసాహంకారము, తామసాహంకారము నని త్రివిధముగ నున్నది.

(౧) సాత్వికాహంకారము- దీనినుండి మనస్తత్వము జనించెను.

౨౧. మనస్తత్వము-ఇది 'యంతఃకరణ'మని చెప్పఁ బడినది. సాత్వికాహంకార జన్యము. దీనినుండి శ్రోత్రతత్వము, త్వక్తత్వము, చక్షుస్తత్వము, జిహ్వాతత్వము, ఘ్రాణతత్వము ననునైదు(పంచజ్ఞానేంద్రియ)తత్వములుజనించెను (పంచభూతములు చూడుఁడు).

౨౦. శ్రోత్రతత్వము- చెవులయందుండు కర్ణేంద్రియము. జ్ఞానేంద్రియ తత్వము. మనస్తత్వజన్యము.

౧౯. త్వక్తత్వము-చర్మమునందుండు స్పర్శ జ్ఞానేంద్రియము. జ్ఞానేంద్రియతత్వము. మనస్తత్వజన్యము.

౧౮. చక్షుస్తత్వము- మనస్తత్వజన్యము.

౧౭. జిహ్వాతత్వము-నోటియందు రుచులం గ్రహించు జిహ్వేంద్రియము. జ్ఞానేంద్రియ తత్వము, మనస్తత్వజన్యము.

౧౬. ఘ్రాణతత్త్వము-ముక్కునందు వాసన అంగీకరించు ఘ్రాణేంద్రియము. జ్ఞానేంద్రియ తత్త్వము. మన స్తత్త్వజన్యము.

[రాజసాహంకారమునుండి యైదు కర్మేంద్రియతత్త్వములు జనించెను].

౧౫. వాక్తత్త్వము- నోటియందు మాటలాడు నింద్రియము. కర్మేంద్రియతత్త్వము. రాజసాహంకార జన్యము.

౧౪. పాణితత్త్వము- చేతులయందు పని జేయించు సామర్థ్యము. కర్మేంద్రియతత్త్వము. రాజసాహంకారజన్యము.

౧౩. పాదతత్త్వము-పాదములందు నడిపించు సామర్థ్యము. కర్మేంద్రి ము. రాజసాహంకారజన్యము.

౧౨. ఉప స్థతత్త్వము-సౌఖ్యమునిచ్చుశరీరేంద్రియము. కర్మేంద్రియతత్త్వము. రాజసాహంకారజన్యము.

౧౧. పాయుతత్త్వము-శరీరమునుండి మలములను బయటికి వెడలించుసామర్థ్యము. కర్మేంద్రియతత్త్వము. రాజసాహంకారజన్యము.

[తామసాహంకారమునుండి శబ్ద తత్త్వము, స్పర్శతత్త్వము, రూపతత్త్వము, రసతత్త్వము, గంధతత్త్వము నను నైదుతత్త్వములుజనించెను].

౧౦. శబ్దతత్త్వము-ఇది తన్మాత్రలైదింటిలో నొకటి. తామసాహంకారజన్యము. దీనినుండి యాకాశ మనఁబడు భూతతత్త్వము జనించెను.

౯. స్పర్శతత్త్వము-ఇది పంచతన్మాత్రలలో నొకటి. తామసాహంకారజన్యము. దీనినుండి వాయు వనఁబడు భూతతత్త్వము జనించెను.

౮. రూపతత్త్వము-ఇది పంచతన్మాత్రలలో నొకటి. తామసాహంకారజన్యము. దీనినుండి యగ్నితత్త్వము జనించెను.

౭. రసతత్త్వము- ఇది పంచతన్మాత్రలలో నొకటి. తామసాహంకార జన్యము. దీనినుండి జలతత్త్వ మనునది (భూతతత్త్వము) కల్గెను.

౬. గంధతత్త్వము- ఇది పంచతన్మాత్రలలో నొకటి. తామసాహంకారజన్యము. దీనినుండి పృథ్వియనఁబడిన భూతతత్త్వము గల్గెను.

౫. ఆకాశతత్త్వము-ఇది పంచభూతతత్త్వములలో నొకటి. శబ్దతత్త్వజన్యము. దీనియందు మంత్రాధ్వకలిగెను. "మంత్రాధ్వ"యన సప్త కోటి మహామంత్రములు చేరినది. (మంత్రములు, మన్త్రాధ్వపదము (పదాధ్వ) చూడుఁడు)

౪ వాయుతత్త్వము- ఇది పంచభూతతత్త్వములలో నొకటి. స్పర్శతత్త్వజన్యము. గాలియనియు, మహావాయుపథ మనియు వాడఁబడుచున్నది.

౩. అగ్నితత్త్వము- ఇది పంచభూతతత్త్వములలో నొకటి.రూపతత్త్వజన్యము.అగ్నిహోత్రి మనఁబడు చున్నది.

౨. జలతత్త్వము- పంచభూత తత్త్వములలో నొకటి. రసతత్త్వజన్యము. ఉదకము, లేక జల మనఁబడుచున్నది.

౧. పృథ్వీతత్త్వము- పంచ భూతములలో నొకటి. గంధతత్త్వజన్యము, భూమి యనఁబడుచున్నది. ఇందు ౧౪ సంఖ్యగల భువనములు, భువనాధ్వ యనఁబడునది కలదు. (భువనాధ్వ చూడుఁడు).

**ముప్పది యిద్దరు నియోగుల (మంత్రుల) పద్యము** — వీరు ముప్పది యిద్దరు నియోగిప్రముఖులు. వేర్వేఱుప్రభుత్వ శాఖలయం దుద్యోగములు జేసినవారు. వేర్వేఱుకాలములం దున్నవారు.అందఱును మహాత్మా

ర్యములొనర్చి స్వశాఖోద్ధరణమునకుఁ బాటుపడినమహనీయులు. ఇందుఁగల మంత్రిశబ్దము నియోగ చిహ్నము గాని యుద్యోగపదవిగా నర్థముఁ జేసికొనరాదు.

వీ రందఱును నియోగి శాఖోద్ధారకులు. ముప్పదియిరువురనామము లొకేసీసపద్యమునఁ గూర్చియున్నారు.

సీ. కవులిచ్చి భూపతి ♦ గాచి పట్టగ నిల్చెఁ
బ్రజలకై రాయన ♦ భాస్కరుండు
వరదాతయై మణి ♦ వలయము లర్థికిచ్చె
దండిభాస్కరునాతి ♦ కొండమంత్రి
భాస్కరువలెఁ గీర్తి బడసెఁ దత్పుత్రుఁడౌ
ఘనరామలింగభా. ♦ స్కరుఁ డొకండు
గణకనిర్వాహంబు ♦ గల్గించె నూయూర
మహి గోపరాజు రా.♦ మప్రధాని
దుర్గమీఁదికి శత్రు ♦ వర్గంబుతోఁ బోరెఁ
బెల్లుగాఁ గరణము ♦ మల్లమంత్రి
యాత్మీయతపముచే ♦ నర్థి నాకమునందు
కేడించె బండారు ♦ కేతమంత్రి
కవి పాముచేఁ జావఁ ♦ గను నాయు వాతని
కై యిచ్చె సేదమ ♦ యాజిఘనుఁడు
వేటాఱుతునియల ♦ విమతులఁ జెండాడె
నాజిలో నాదెళ్ళ ♦ యయ్యలయ్య
పోరిలో నసహాయ ♦ శూరుఁడై తెగి వెన్క
బ్రతికి సిద్దయతిక్కఁ ♦ డతులితముగ
పట్టిసపుర వీర ♦ భద్రునిప్రేమచేఁ
జెన్నొందె శ్రీకోట ♦ సింగరాజు
(భార్య గంగమాంబ.)
ఇలుచూర యాచకా ♦ వళికి దాతలదాత
యై యిచ్చె నిట్టల ♦ హరివరప్ప
తనదుమీఁసముఁ దీసి ♦ తాకట్టుగా నుంచి
కొట్టఁడెట్టుం డర్థి ♦ కోర్కెఁ దీర్చె
గణపతిదేవుని ♦ కరుణ భట్టుకు మణి
యుడపం బొసంగె గుం ♦ డార్యవరుఁడు
అష్టసహస్రంబు ♦ లర్థికిచ్చి సుకీర్తి
మహిని సింగనమంత్రి ♦ మాచఁ డుండె
కొనియె భాస్కరునిచేఁ ♦ దెనుఁగురామా
[యణం
బారూఢి సాహిణి ♦ మారమంత్రి
యాంధ్రనైషధకావ్య ♦ మందె శ్రీనాథుచే
మామిడి సింగనా ♦ మాత్యమౌళి
ఘనదానకర్ణుఁడై ♦ గండపెండెముదాల్చెఁ
గొరవి యన్నామాత్య ♦ కుంజరుండు
పగతుఁ జుట్టమటంచుఁ ♦ బల్లఁగాధనమిచ్చి
చేపట్టెఁ బెమ్మయ ♦ సింగరాజు
గురుజగత్రయదాన ♦ గురుమూర్తియైమించె
నఁడూరి భీమన ♦ గుండమంత్రి
ప్రాణికోటికి నెల్ల ♦ బహుభక్ష్యభోజ్యాన్న
సత్రము ల్వెట్టె వి ♦ స్సప్రధాని
భట్టుమూర్తికిఁ గిన్క ♦ రెట్టింపఁ బచ్చల
హార మర్పించెఁ ది ♦ మ్మరసు మౌళి
ఘనదైవతంబు ద్రా ♦ క్షారామభీమేశుఁ
డని కొల్చె బెండపూ ♦ డన్నమంత్రి
నీడఁద్రొక్కెడునీళ్ళ ♦ నెటి నర్థి కభిమతం
బిప్పించెఁ జేమకూ ♦ రప్పరాజు
ఘనసప్తసంతతు ♦ లొనరించి సత్కీర్తి
వెలయించె విరల ♦ యజ్ఞమంత్రి
యమితశత్రుల గెల్చి ♦ యవనిఁ బాలనఁ జేసె
రహి గుంటుపలి ముత్త ♦ రాజమంత్రి
ఘనభట్టసుకవికి ♦ మణికుండల మొసంగి
నంది తిమ్మనకవీంద్రుఁ ♦ డందెఁ గృతుల
కవుల కర్థ మొసంగి ♦ ఘనకీర్తిని వహించె
రహిఁ గూరగాయల ♦ రామమంత్రి
వాకిటికావలి ♦ జోకతో నొనరించి
దివ్యకీర్తి వహించెఁ ♦ దిమ్మమంత్రి
రిపు గెల్వ నృపుఁడిచ్చు♦విపులార్థములనర్థి
కర్పించెఁ గటికె శా ♦ మన్నమంత్రి

కవిబుధావళి నేలి ♦ ఘనకీర్తిని వహించె
వరకోటిపల్లి శ్రీ ♦ శరభమంత్రి
నిరతాన్నదాతయై ♦ నిత్యకీర్తి వహించె
కాశిపండా పర ♦ దేశిమంత్రి
(ఒక్క—చరణము లభింపలేదు).

రాయనభాస్కరుఁడు, (రాయనభాస్కరుని కొడుకు) కొండమంత్రి, (మనుమడు) రామలింగభాస్కరుఁడు, గోపరాజు రామప్రధాని, కరణము మల్లుమంత్రి, బండారు కేతనమంత్రి, నేదమయాజి, నాదెళ్ల యల్లయ్య, సిద్ధయ తిక్కన్నమంత్రి, కోట సింగరాజు, నిట్టల హరి వరప్ప, కొరవు ఎఱ్ఱన్న, గుండయ్య, లింగ. మంత్రి మాచయ్య, సాహిణిమారమంత్రి, మామిడి సింగన్న, కొరవి యన్నామాత్యుఁడు, పెమ్మయ సింగరాజు, నండూరి భీమనగుండ మంత్రి, వినప్రధాని, తిమ్మరుసు, బెండపూఁడన్నయ్య, చేమకూర అప్పలరాజు, విఠల వెఱ్ఱన్నమంత్రి, గుంటుపల్లి ముత్తరాజు, నంది తిమ్మన్న కూరగాయల రామమంత్రి, తిమ్మమంత్రి, కటికి కామన్నమంత్రి, కోటిపిల్లి శరభరాజు, కాశిపండా పరదేశిరాజు.

**ముముక్షుత్వశాంతము**— (సాధన చతుష్టయము చూడుఁడు).

**ముర**—తొమ్మిదవనందుని (మగధదేశాధీశుని) శూద్రభార్య. కుమారుఁడు చంద్రగుప్తుఁడు. ఈమెసంతతిమగధరాజుల కీమెనుండియే "మౌర్య" లని పేరయ్యెను.

**మురగడకాల్వలు**—(ఇరిగేషన్ చూ).

**మురంద దేశము**— (లంపాకదేశము చూడుఁడు).

**మురస్థానము**—మురాసురుఁడు తొల్లి నివసించినతావు. ఈతని శ్రీకృష్ణుఁడు శ్వేతద్వీపమున సంహారించినటుల వామనపురాణము ౬౦-౬౧ యందుఁ జెప్పఁబడినది.

గాజిపూర్ మండలమున 'గహమ్మార్' అనఁబడు తావు. (E.I. Railway Gehamura Station.)

**మురలీనది**—నర్మదానది కీపేరుగలదు.

**మురామాంసి**—లా. Murraya Exotica. సం. తాలపర్ణీ, దైత్యా, గంధకూటీ, భూరిగన్ధా, గన్ధినీ, భూతగన్ధా, మురా.

ఇది గుజరాతుదేశఁపు సుగంధద్రవ్యము. పరిమళములయందుఁ జేర్చుదురు. లోని కిచ్చిన వేఁడి, పైత్యముఁ జేసి వాతము, భ్రమ, రక్తదోషముల హరించునని జెప్పఁబడినది.

**మురారేః తృతీయః పంథా**— ఇది సంస్కృత భాషయందలి లోకోక్తి. మురారి యనుసుకవిది మూఁడవమార్గ మనియర్థము. ఈయన కాళిదాసుం బోలిన ధోరణికలవాఁడుగాడు, లేక భవభూతింబోలిన ధోరణికలవాఁడును గాఁడు. అవి రెండును ప్రసిద్ధమార్గములు గాన మురారి మూఁడవమార్గపుధోరణికలవాఁడని భావము

**ముర్దార్సింగ్**— లా. Plumbi oxidum Litharge.

దీని నాంగ్లరసాయన వేత్తలు 'Product of molten Lead by slow oxidation' అనియు, 'Oxide of lead' అనియు నందురు. పాదరసములో వండుదురని చెప్పఁబడినది. సీసపు మాతృక (Lead ores)నుండియెదీనినిచేతురట.

ఔషధములలోఁ గలియును. 'Red Lead' అనఁబడు రంగునందు గలియును. కుండసామానునకు మెఱుఁగులిడ ముర్దార్సిం గుపయోగించును. అద్దములు జేయ నిది యుపయోగించును.

అయుర్వేద వైద్యులు దారుణవాతములు, ముఖజాడ్యములు, చర్మరోగములు, వ్రణములు,

దీనివలన నివారింప నగునందురు. ఇది విరేచన బద్ధము గలిగించును.

**మూర్షడాబాదు**—బంగాళారాజ్యమునం గలకత్తానుండి ౧౨౨ మైళ్ళ దూరమునందున్న పురము. క్రీ. శ. ౧౭౦౪లో ఔరంగజేబుచక్రవర్తి పరిపాలనమున రివెన్యూమంత్రిపదవియందుండిన నవాబు మూర్షిద్‌కూలీఖాను, తనపేర నీపురనిర్మాణ మొనర్చి, ప్రభుత్వకార్యాలయముల నిటకు మార్పించెను. (ఢక్కా–దక్షిణేశ్వరీ క్షేత్రము చూడుడు.) ఇట నాయసనంతతి వారలే మూర్షడాబాదు నవాబు లని తెలిసెడిని.

ఇచటం జూడఁదగిన కట్టములు ౧. హజారుదురై ఇమాంబారా, ౨. మోతీఝిల్, ౩. కదంషరీఫ్, ౪. చౌకీమశీదు, ౫. సిరాజుద్దౌలా గోరీ, ౬. ఫ్లాసీయుద్ధస్థలము, ౭. మూర్షడాబాద్ ప్రాసాదము మొదలగునవి కొన్ని కలవు.

**మురికినాడు (ములికినాడు)**- కర్నూలు, బల్లారి జిల్లాలప్రాంతదేశమున కొకప్పుడు "ములుకునాడు" లేక 'ములికినా' డనిపే రుండెనఁట. కాలముగడచి మార్పుఁజెంది 'మురికినా' డని నిలచె నందురు. ఇది నిజామురాజ్యసంబంధమున "ఉల్మల"కను నురుదుభాషాపదము నుండి కల్గినపద మని తలంపఁ బడుచున్నది. నేటికిని మురికినాటివా రను నొకశాఖానామము బ్రాహ్మణులకువాడుకయం దున్నది. దేశనామమువలన శాఖానామము గల్గెనందురు.

**ముర్రీ (సమశీతోష్ణ ప్రదేశము)**—ఇది హిమవన్నగసీమను రావల్పిండినుండి కాశ్మీరములోని శ్రీనగరమున కరుగుపెద్దబాట నంటియున్న సమశీతోష్ణప్రదేశము. సముద్రపునీటి మట్టముపై నేడువేల యైదువందల యడుగులయెత్తగుతావున కొండలపై నిర్మింపఁబడియున్నది. దిగువగా ౭౦౦౦ యడుగుల యెత్తగుతావునుండి కాశ్మీరమున కరుగుబాట పోవుచుండును. ఆప్రదేశమునకు "Sunny Bank" అని పేరిడియున్నారు. ఇటనే 'గల్లీస్' యనఁబడు తావున కరుగుబాట యొకటియు, కొండపై(ముర్రీపట్టణమున) కరుగుబాటయొకటియుం గాశ్మీరమునకు రావల్పిండినుండిజనుబాటతో సంధించెడిని. ఇటను కాలము మేనెల మధ్యభాగమునుండి ప్రారంభమై అక్టోబరుమధ్యవఱకునుండునని(Season) చెప్పఁబడినది. అందు జూలై, ఆగస్టు నెలలందు వర్షము లధికముగాఁగురిసెడిని. నవంబరు, డిశంబరు, జనవరి, ఫిబ్రవరి,మార్చి నెలలందు మంచు (Snow)పడుచు వీథులంగప్పి నిలువయుండును. ముర్రీయందుచుట్టుపట్టప్రదేశములదృశ్యములు వింతగను, చక్కగను గన్పట్టు నెత్తగుతావులు పెక్కులు గలవు.అందుఁ బ్రధానమగునవొకకడను"పిండిపోయిం" టనియు, రెండవకడను"కాశ్మీరపుపోయిం"టని చెప్పఁబడు నున్నతప్రదేశములై యున్నవి. వాటినడుమ రెంటినిగల్పు ప్రధానమార్గమునకు "మాల్" (Mall) అనెదరు. ఇదియే ప్రధానమార్గము. దీని కిరుప్రక్కల నంగడులు, కాఫీహోటళ్ళు మొదలగునవి కలవు. దీనికే "ముర్రీ బజా" రందురు.

వేఱొక యున్నతప్రదేశము "Pinnacle Hill" అనఁబడు పర్వతశిఖరము. ఇటనుండి చక్కనిదృశ్యములు నలుదెసలఁ జూడనగును. ముర్రీపట్టణఁపు నీటిగొట్టములనుండి జలముల నందిచ్చు జలనిలయము (Reservoir) "పండుపార్కు" అనఁబడుతావునఁ గలదు. ఇది చూడఁదగినది. అట చూపఱకై కూర్చుండు బల్లలమర్పఁబడి, బహుజను లరుగుచుండు తావుగ నున్నది. పురమున భరతదేశస్థుల కొఱకును, యైరోపావారి కొఱకును ప్రసిద్ధములగు హోటేళ్లు గలవు. సనాతనధర్మమందిరము,నార్యసమాజమందిరము, గురుద్వారసింగుసభ మొద

లగు ధర్మశాలలు పెక్కులు గలవు. ఇవి సత్రము లుగ నున్నవి. సకాలమున మురీ యాటపాటలకు తావై యుండును. ఇది రావల్ పిండి జిల్లాలోని తహశ్శీలుకు చేరి యున్నతావు. అట నుండి నలువదిమైళ్ళదూరము. మోటారులు, బస్సులు, గుఱ్ఱపుటాంగాబండ్లు, ఎక్కాబండ్లు, సదా తిరుగుచుండి, రాకపోకల కేర్పాట్లుగలవు. ఘోరాగాలీయందున్న లారెన్సుకాలేజీయును, హిందువులకు ప్రత్యేకపు బ్రిభుత్వపు హైస్కూలును, మైనరుబాలుర కొరకు కాన్వెంటుపాఠశాలయు, నాడుపిల్లలకు మిషనుపాఠశాలలు గొన్నియుఁ గలవు. Silver Jubilee Red-cross Hospital పురమునకు 30 మైళ్లదూరమున నిటీవల నిర్మించియున్నారు.

**ములకచెట్టు**—ములక వంగచెట్టునుబోలిన జాతిచెట్టు. ఇది తెల్లములక, నల్లములక, నేలములకయని త్రివిధములు. నేలములక పెద్దనేలములక, చిన్ననేలములక యని తిరుగ ద్వివిధములు.

తెల్లనేలములక లా. Solanum Indicum ఆంగ్ల. Indian Night Shade; సం. కాసఘ్ని, వార్తా. ఈ సంస్కృతపు బేళ్ళన్నిజాతులకు వర్తించునని తోచెడిని. దీనిని కొందరు వాఁకుడుకాయయని యందురు గాని యది సరి కాదు. వాఁకుడు వేఱుజాతిగ దోఁచెడిని. తెల్లములకవేరుయొక్క రసకపాయచూర్ణములందు కామదోషము, కఫదోషము, జ్వరదోషము, మందాగ్ని, మూత్రకృచ్ఛము, వాతములు, శ్వాస, శూలలు, హృద్రోగములు నివారించు గుణము గల దని చెప్పఁబడినది. ఇంక నల్లములకను లాటిన్భాషయందు 'Solanum Jacquini' యనియు నందురు. ఇది త్రిదోషహరమై యగ్నిమాంద్యమును, వాతదోషమును, శ్వేతకుష్ఠువును, శ్లేష్మజ్వరములను, నన్నిపాత దోషములను నివారించునని చెప్పఁబడినది.

ఇంక తక్కిన నేలములక పెద్దనేలములక యనియు, సాదానేలములక లేక చిన్ననేలములక యనియు ద్వివిధము. ఇందు పెద్దనేలములకకు ముళ్ళుండవు. ఈజాతి శ్రేష్ఠమందురు. ఇంచుక వేఁడిజేసి, దేహపుష్టి నిచ్చి, వాత పైత్యముల హరించుననియు, మూత్రమును వెడలించుననియు జెప్పఁబడినది. తక్కిన సాదానేలములకయందు లేతకాయలు పథ్యమనియు, త్రిదోషహరమై జఠరదీప్తిని గలిగించి, నేత్రరోగముల హరించుననియు, ముదిరినకాయ శ్లేష్మమును, జ్వరములను హరించి యించుక పైత్యముఁ జేయుననియు, పండు (చిన్ననేలములకపండు) వాతమును, శ్లేష్మమును, రేఁపుననియు, దీనికిఁ బరిహారములు పెద్దములకకాయ, వెల్లిపుచ్చవేరు, కాకరకాయ, దోసకాయ యనియుఁ జెప్పఁబడినది.

ఇంకను పెక్కండ్రు ఎఱ్ఱములకజాతియుం గలదనియు, దానిపం డెఱుపుగ నుండుననియు, బలముగల్గించి కఫము నివారించు ననియు, నించుక విరేచనబద్ధము గల్గించుననియుఁ నను చున్నారు.

**ములగ చెట్టు**—ములగకాడలు (లేక ములగకాయలు) భోజనపదార్థము గాన నంద ఱెఱిఁగినదే. ఇది చాల సులువుగఁ బెరుగుచెట్టు. త్వరితముగఁ గాచునది. ములగాకు కూరజేసి తిందురు.

ములగకాడలకూర క్రిమిని గల్గించును. బలము నిచ్చును. ఇంచుక వేఁడిజేయును. వేరునందు వేఁడిచేయుగుణముగలదు. ములగకాడల నూఱుగాయగఁ గూడ నొనరురు. (మునగచెట్టు చూడుఁడు).

**ములపాక బుచ్చన్నశాస్త్రి కవి**— ఆంధ్రకవులలో నాధునికులందుఁ బగణింపఁ బడినవాఁడు. పేరూరు ద్రావిడ బ్రాహ్మణుఁడు. భార్గవస గోత్రము. తండ్రిపేరు కోదండరామయ్య. గుండ్లూరి నివాసి.

ఈతఁడు రచించినది "వేంకటేశ్వరవిలాస" మను పద్యకావ్యము.

**ములికినాటి సీమ**—(రాజులవారిసీమ చూడుఁడు - కూళట చూడుఁడు).

**ములికినాటిసీమ (ముఱికినాడు)** దీని నిక్కాలమున "ముఱికినా" డని వాడుటయు, నిచటినుండి వచ్చినటులు తలఁపఁబడు బ్రాహ్మణశాఖను "మురికినాటివా" రనుటయుఁ దప్ప తక్కినసంగతులు తెలియరాకున్నవి. దీనికి వల్లూరు ప్రధానస్థానమైయుండె నందురు. ఇది నైజాంరాజ్యములోని 'ఉల్మలుక్' అను బిరుదపదసంబంధ మని తోఁచెడిని. (రాజులవారిసీమ చూడుఁడు- కూళట చూడుఁడు- పొత్తపినాఁడు చూడుఁడు- పినాకినీనది గండికోటదుర్గము చూడుఁడు.)

**ములుగోరింత చెట్టు (ములుగోరింట, మునిగోరింటచెట్టు)**- ఇది గోరింటతో నేసంబంధము లేని పూవులచెట్టు. ఇది హిందువులయిండ్ల దేవతార్చనలయందు పూజకు బనికివచ్చుంగాని, ములుగోరింతపూవులందు పరిమళము లేదు. ఇందు తెల్లనిపూవులు నెఱ్ఱని పూవులు పచ్చనిపూవులు (అనఁగా నెఱుపు పసుపుపచ్చ కలిసిన కావిరంగు) నీలివర్ణఁపు పూవులఁబూచు నాల్గు భేదజాతులు గానవగుచున్నవి. తెల్లములుగోరింటకు లాటినా్భషయందు 'Barleria Dichotoma' అనియు, సంస్కృతమున సైరేయకః, సైరేయకః, సైర్యకః అనియుఁ బేళ్ళు. ఎఱ్ఱములుగోరింటకు Barleria cristata అనియు, సం. కురువకః, కురుబకః, అనియుం బేళ్ళు. పచ్చములుగోరింటకు Barleria Prionitis, సం. కురంటకః, అనియుం బేర్లు. నీలివర్ణపు ములుగోరింటకు లాటిన్భాషాపదము గానరాదు. గాని సంస్కృతమున ఆర్తగలః,సైర్యః అనుపదములు గలవు. అన్నిటికి వైద్యగుణ మొకటియే యందురుగాని తెల్ల ఎర్ర నీలవర్ణఁపుజాతులచెట్లకు ముళ్లుండక నొకపచ్చజాతికే యపరిమితముగు ముళ్లుండెడిని. దీనిని గొబ్బిచెట్టనికూడ గొందఱందురు.

ములుగోరింట సమూలమును గాల్చి చేసిన క్షారము (బూడిద) నీళ్ళలోఁగల్పి, లోనికిచ్చుచుండిన నుదరరోగములు, నుబ్బురోగములు నివారణమగుననియు, తేనెతోఁగల్పి లోనికిచ్చుటవలన దగ్గు శమించు ననియు, ఆకులుచితుకగొట్టి పైన నుంచుటవలన చిగుళ్ళ యుబ్బులు మాని, నొప్పినివారణమై దంతములు గట్టిపడుననియు, దీనివేరు,యాకుల రస కషాయ చూర్ణములు త్రిదోషములను శమింపఁజేసియు, కాకజేసియు, నుబ్బుజాడ్యము, జ్వరము, కానరోగము,తాపము,విదాహము, శ్వాసరోగము, శూల లను నివారించుననియుఁ జెప్పఁబడినది.

**ముల్లంగి (సొత్తిచెట్టు, గాజరగడ్డ, కేరటదుంపచెట్టు)**—ముల్లంగిదుంప భోజన పదార్థమగుట నీచెట్టు నంద ఱెఱుఁగుదురు. దీని దుంపల రంగులఁబట్టి పేర్లు మాఱుట బహునామములఁ దనరుచున్నది. దుంపలు తెలుపగుతరి, సొత్తి లేక ముల్లంగి యనఁబడుచునధముఁపు జాతిగను, దుంప యెఱుపు, పసుపు, రంగులగల్గియుండ గాజరగడ్డ, కారటదుంప లనఁబడుచు, గొంత విలువఁగల్గిన పైజాతిగ నెంచఁబడుచున్నది. ఇంచుక కారమును ఘాటునుగల్గి భోజన పదార్థమై యుపయోగించుచున్నవి.

ముల్లంగి తెల్లనిదుంపలుగలది. దీనిని సాత్త్రి దుంపలచెట్టనియందురు. లా. Raphanus Sativus. ఆంగ్ల. Country carrot. దీనిని పెదముల్లంగి యనియు నందురు. సం.మూలికా, దీర్ఘమూలకం, మరియు మహాకందః, అను పదము దీనికిని చినముల్లంగికిని సామాన్యపదము. దీనియందు పీచు లేకుండిన శ్లేష్మ మందురు. ముదిరినదుంప దద్రు, కఫము, పైత్యముల నడచి, యాకలి గల్గించి, శోష, కాస, వాతముల ప్రకోపింపఁజేయునని చెప్పఁబడినది. లేతదుంప త్రిదోషహారమై మూత్రము వెడలించి, వ్రణములను శోధించి, యజీర్తి, దద్రు, గళరోగము, గుల్మరోగము, నేత్ర రోగము, మూలశంకల నడఁచి, బుద్ధిబలము తగ్గించునని చెప్పఁబడినది. ముల్లంగికాయ వీర్యమునకు వేఁడి గల్గించి, కడుపులోనిబల్ల గరఁగించి, వాతప్రకోపము, పీనసలఁ గల్గించు నని చెప్పఁబడినది.

ఎఱుపురంగుగల దుంపలను, పసుపురంగు గలదుంపలను నాంగ్లమున 'Carrot' దుంప లని వాడుదురు. సంస్కృతమున'గర్జరః' యని దీనికి పేరు. గాన జరదుంపలని పేరేర్పడియెను. కొన్నిచోటుల 'పిండమూలమ్' అని వాడి యున్నారు. మఱియు నీదు పసుపురంగుగల దుంపలకు సంస్కృతమున'పీతకమ్'' పీతకందమ్' అనిపేర్లు గలవు. వీట్లకు పచ్చముల్లంగి యెఱ్ఱ ముల్లంగి యనియు వాడుకపేర్లు గలవు. రంగు దుంపలు వేఁడిచేసి, వాతమును హరించి, పొడి దగ్గు, పైత్యవికారముల నడంచి, పుంస్త్వమును రేపి, లోని నొప్పుల నివారించు ననియు, మూత్రమును చక్కఁగ వెడలఁ జేయుననియుఁ జెప్పఁబడినది. మఱియు నీదుంపల నుడికించి, పిసికి గడ్డలపైఁ గట్టిన నడఁగఁ జేయును. గింజల నూరి లోని కిచ్చిన గర్భవాతముల నడంచి, మూత్రము చక్కఁగ వెడలించును. పూవులలోని కింజల్కములను లోని కిచ్చుచుండిన మూర్ఛ, నాపుశక్తి గలదనియుఁ జెప్పఁబడినది.

ముల్లంగియాకులందు విస్తారము మూత్రము వెడలించుగుణము గలదు. విత్తులందు శరీరావయవములకు బలముగల్గించుశక్తి గలదు. దుంపలందు ధాతుపుష్టి నొసంగుశక్తి గలదు. ఈ మూడును శరీరారోగ్యముగలవారికిఁగాని,రోగులకుఁ గాదని యెఱుంగునది.

తేనె, ఆవాలచూర్ణము, నువ్వు, జీలకఱ్ఱ, ముల్లంగిజాతి కల్గించుదోషములకు విఱుగుడు లని చెప్పఁబడినది.

ములంగియందు చిన్నజాతి యొకటి కలదు. దానిని చిన్నముల్లంగి యందురు. దీనికి ప్రత్యేక సంస్కృతనామము గానరాదు. దీనియందు కఫము, నజీర్తి, యిన్ద్రియనష్టము, పైత్యాదోషము, వాతదోషముల నడంచుశక్తిగలదందురు.

**ముల్లా**—మహమ్మదీయులందు విద్యాధికుని "ముల్లా"యందురు. సాధారణముగ నుపాధ్యాయుని ముల్లా యని ంచుచుందురు. పారశీక దేశమున "ముల్లా" శబ్దము చక్కని ప్రచారము నొంది యున్నది.

**ముల్తాను పురము (మూలస్థాన పురము)** — ఇది పంజాబు దేశములోనిది. ఇంగువవర్తకమునకుఁ బేరందినది. (పంజాబు దేశముచూడుఁడు- మూలస్థానపురము చూ).

**మువ్వింగ్ ఏవరేజి (Moving average)**— (స్టాటిస్టిక్సు చూడుఁడు).

**ముసలగోత్రము**-(నిధృవగణము చూ.)

**ముసల (రోకలి) రేఖ**-(పురుషసాముద్రికము చూడుఁడు- స్త్రీసాముద్రికము చూ).

**ముసలః కిసలాయతే**--రోకలిచిగిర్చె నదనియర్థము. అసందర్భప్రలాపమనిభావము.

**ముసాంబ్రము**—లా. Aloe Indica ఆంగ్ల. Dried juice of aloes ముదురు కల బందరసము నెండించి చేసినది "ముసాంబ్రి" యందురు.

మిక్కిలి కాక, పైత్యము జేసి విరేచనములు గావించును. కడుపులోపలి దోషములను వెడలించి, శుభ్రపఱచి, స్త్రీల ఋతురక్తమును వెడలించును. పైన పట్టువేసిన కడుపుబ్బరము, నొప్పులునివారించును. దీనికినిమ్మపండ్లపులుసు, వేడినీళ్ళలో నెయ్యివేసి కల్పినది విఱుగుడులని చెప్పఁబడినది.

**ముష్టాప్పర్వతము**— కారకోరమ్‌పర్వతము. (కాశ్మీరరాజ్యము చూడుఁడు).

**ముషికదేశము**—ఈపేరుగల దేశములు రెండో లేక మూఁడో యుండినటులఁ గానవగును. 'కన్నింగ్హామ్' పండితుఁడప్పర్సింధుదేశమున రాజధానిగ నుండిన ఆలోరుపరిసరసీమను 'ముషికదేశ' మని పోల్చియున్నాఁడు.

మహాభారతము భీష్మపర్వము ౯ యందు వివరింపఁబడిన ముషికదేశము దక్షిణ హిందూస్థానమునం దుండెను. దీనిని విల్సన్‌పరిశీలకుఁడు విష్ణుపురాణ(౪౭౪)ప్రసిద్ధముగా కొంకణమును పోల్చియున్నాఁడు.

Mackenzie manuscripts నందు మళయాళము ముషిక మని తెలుచున్నది. ఇందు తుళువ, కేరళ, కువ, ముషికములని చెప్పియుంటయు, Dr. Fleet పరిశీలకునియభిప్రాయానుసారము కొల్లం (క్విలన్) మొదలుకొని కన్యాకుమారియగ్రముదనుక నుండిన దనుటవలనను, తిరువాన్కూరు రాజ్యభాగము ముషికదేశమై యొకప్పు డీపేరఁబరఁగుచుండెనని తెలుచున్నది.

**ముషిడి (ముషిణి లేక ముష్టి)చెట్టు**—లా. Strychnos Nuxvomica ఆంగ్ల. Nux vomica అనియు, కొందఱు Strychnine seed tree అనియు వాడుచుందురు. సంస్కృతమున విషముష్టికః. కొందఱు ముష్టి యనియు వాడిరి. కొందరు "రణముష్టికః" యని గూడ వాడిరి. ముషిడిచెట్టుగింజలు బలమగు విషము గాన లోని కీయ నపాయకరము. ముషిడి యనియు, నాగముషిడి యనియు, తీగ ముషిడి(కప్పతీఁగ) యనియు త్రివిధభేదములు కలది. లోనికిచ్చుతరి గింజలను బలహీనపఱచి యోయవలసి యుండును. వేరుయొక్క గాని, ముషిడి (ముసిఁడి) చెక్కయొక్క గాని, గంధమునందు లేక చూర్ణమునం దామవాతము, మహావాతము, పక్షవాతము, సర్వాంగవాతము మొదలగు నొప్పుల నివారించుశక్తి గలదనియు, నరములరోగములను, చర్మరోగములను, నరములనిస్సత్తువ, కీళ్ళపట్టు లేకపోవుట, సర్పవిషదోషముల నడంచు ననియు, స్త్రీల కుసుమరోగము నివారించుననియు, ఆహికజ్వరము, అపస్మారము, సవాయిరోగము, రక్త గ్రహణి వీర్యనష్టముల నివారించుశక్తి గలదనియు, ముషిడి జాగ్రతగ లోని కిచ్చుటవలన నిద్రగల్గించ నగుననియుఁ జెప్పఁబడినది.

తీఁగముషిణిని'కప్పతీఁగ'యనియు నందురు. దీనికి లాటిన్భాషయందు 'Tiliacorn acuminata'యని యందురు. దీని సమూలరసము నందు సర్వవిషములనివారించుగుణమును, బోదకాలురోగము నివారించుగుణమునుగలదనియు, ఆకులకషాయముతోఁ గడుగుచుండుటవలనఁ వ్రణములు, చీముపట్టుచుండు చర్మవ్యాధులు మాన్పట్టుననియుఁ జెప్పఁబడినది.

ముషిడికి విఱుగుడులు నేరేడిచెక్కరసము, మొగలిచెక్కరసము, వేపచెక్కరసము, నేరేడిగింజలచూర్ణము నని చెప్పఁబడినది.

ముపిడికొట్లపైనుండి వచ్చుగాలి యారోగ్య ప్రదమని యందురు.

**ముష్టికకుల గోత్రము**—ఆర్యవైశ్యుల ౧౦-౨ గోత్రములలో నొకటి. (వైశ్యగోత్రములు చూడుఁడు.)

ముష్టికకుల (శాంతిప్టికుల) గోత్రము. ఏకార్షేయ (౭౫) గోత్రము. ముచికుందర్షి. ఆది సంస్కృతగోత్రము ముచికుందన. ఆపస్తంబ యజుశ్శాఖ. మందరేశుఁడు దేవత. భార్య మందర. దండకారణ్యము తపస్స్థానము. కపిత్థ సరస్సు తటాకము. జపము లక్ష. దీపములు ౫౦. క్షేత్రసంఖ్య ౫౦. షోడశమహాదానములు దానము. కురువేరు వర్జనీయము.

**ముష్టిరాల సుబ్బరాయకవి**—ఆంధ్రకవులలో నాధునికులందుఁ బరిగణింపఁబడిన వాఁడు.

రచించినవి కృష్ణాభ్యుదయము (చక్కిలాల శేషయామాత్యునకుఁగృతి). ప్రద్యుమ్నచరిత్ర, సావిత్రీచరిత్ర, భద్రాద్రిరామశతకము ననునవి.

**ముస్తాఫా కమాల్ పాషా ఘాజీ అటాతురుష్కుఁడు**—అటాతురుష్కుఁడన తురుష్కజనకుఁ డనియు, ఘూజీ యన జయశీలుఁ డనియు నర్థమిచ్చుబిరుదములు. ఇవి యామహాపురుషునకుఁ బ్రజలచే నొసఁగఁబడినవి. తక్కిన పాషా యనుపద మాంధ్రదేశపు మహారాజశ్రీపదమును బోలిన గౌరవ బిరుదము. ఈయన అనటోనియనుకటుంబములలో నొకకటుంబమున సెలోనికాపురమున క్రీ. ౧౮౮౧ లో జన్మించినటులఁ జెప్పఁబడినది. తలిదండ్రులుగొప్ప శ్రీమంతులు గారనియు, చాల మర్యాదస్థులనియు నీయనంగూర్చి తెలియుచున్నది.

తొలుత ప్రష్యమువారి సైన్యదళమున నొకకెప్టనుగా ప్రవేశించి, యైరోపామహాసంగ్రామకాలమున డార్డినల్సు రక్షణకై నియమింపఁబడి, సాండర్సు సేనానిక్రింద పనిచేసి, యాయనకుఁ బిదప సేనానిగ నతనిస్థానమాక్రమించెను. యుద్ధానంతర మప్పటి యేర్పాటుల ప్రకారము జయపక్షమువారి కోటమిపక్షపు దేశములవారు తమతమ యుద్ధపరికరముల నొప్పగింప వలసియుండ, నీకెమాల్ సేనాని యటుల నొనరింపక తన సైన్యమును జేర్చి, అనటోలియాను బ్రవేసించి, యటనున్న చిన్న ఫ్రెంచిసైన్యమును వెనుకకుఁ దరిమివైచి, తన దేశమున గొప్పవీరుఁడని పొగడ్తలనందెనఁట. ౧౯౧౯ సం॥రమున నీయన యొకజాతీయ సభను సమావేశమొనర్చి, జాతీయప్రభుత్వ ధర్మములం బోధించెను. ౧౯౨౦ సం॥లో తాను ప్రధానమంత్రిగ ప్రకటించుకొనియె నఁట.

ఈమధ్య తురుష్కసైన్యముల బలపఱచుకొని, ఆసియామైనరులోని కరిగి, యటనుండి గ్రీకులను వెడలించి, లాసేన్ సంధికి (౧౯౨౩) కారకుఁడై తనస్వదేశస్థులచే "ఘాజీ" బిరుదమందె, యాసంవత్సరమే టర్కీసామ్రాజ్యమునందు ఉస్మాన్ రాజవంశ నృపాలురపాలన మంతమొందించి, సుల్తానులప్రభుత్వ మంతరింపఁ జేసెను. తోడనే యైదవ మహమ్మదు సుల్తాన్ (ఖలీఫా) దేశమును వీడి, యొకబ్రిటీషు యుద్ధనావలో విదేశగతుఁ డాయెను. మరుచటి వత్సరమున (౧౯౨౪) ఖాలీఫాత్ పదవియేరద్దు పఱుపఁబడి, ముస్తాఫాగారు టర్కీప్రజాప్రభుత్వమునకు నియామక(డిక్టేటరు)పదవి నందెను.

ఎల్లడిక్టేటరులవలె తనస్వశక్తిని బలపఱచు కార్యముల నొనర్పనివాఁ డితఁడే యనియెదరు. ఈయనపాలనముననే న్యాయశాస్త్రము ప్రభుత్వశాసనముగ నొనర్పఁబడి ఖురానుధర్మములు.

కొన్ని మార్పులనందెను. సైన్యములు బలపఱుపఁబడె, 'సిక్మేనాఫ్ యూరప్'గా హేళనచేయఁబడుచుండిన తురుష్క-సామ్రాజ్యము, బలముగలది యయ్యెను. ప్రభుత్వమువారి స్వజన దురాధికార మడంగి, పార్టీయధికారవిధానము వాడుకలోనికి వచ్చెను. స్త్రీలముసుఁగు లీయున నాడే తొలఁగింపఁబడెను. ఫెజ్టోపీ లీయున నాడే పరిత్యజింపఁ బడెనఁట. తురుష్క-భాషయు నించుక మార్పునందె ననియు, లాటిన్ అక్షరవర్ణములు తురుష్క-లిపులందుఁ జేర్చుకొనఁబడియె నఁట. రాజకీయసంబంధము లేని యొకవిదేశస్థునితో నీదేశాభిమాని తనమాతృభూమిని తలవంపులు, హీనతలు లేకుండ నితర దేశములవలె నైరోపాయుందుండఁ జేయుట తన కోర్కె యనినటుల నాదేశస్థు లనియెదరు. తురుష్క-దేశస్థులేకమైయీమహాత్మునకు 'అటాతురుష్క' బిరుదము (తురుష్క-జనకుఁడు) నొసంగి బహూకరించియుండిరఁట. పేదవారల కీయునకార్యములు మాహాత్మ్యములా యనిపించును. ౧౯౩౮ సంవత్సరము నవంబరు ౧౦ తేదీని మృతినందెను.

**ముస్సోలోని బెనిటో**- ఈయిటలీదేశపు రాజకీయవేత్త క్రీ. వె. ౧౮౮౩ సంIIరములో జన్మించినవాఁడు. తండ్రి యినుపపని చేయుచుండినవాఁడు. కొంతకాలము ట్రెంటు పురమున సోషలిష్టుసంఘకార్యదర్శిగను, ౧౯౧౫ సంIIర మైరోపామహాసంగ్రామమున దూకినకాలమున Private Soldier గా యుద్ధరంగమునఁజేరి, ౧౯౧౭ సంIIరము ఫిబ్రేవరి ౨౨ తేది దనుక సంగరమునఁ బాల్గొని గాయములచే నాసుపత్రి జేరి చికిత్సనంది, పిదప ౧౯౧౯ సంIIరమున ఫాసిస్టోసంస్థను స్థాపించెను ఫేసిస్టులు రోమకపురియందు ప్రవేశోత్సవము నెఱపుతఱి భూపతి 'విక్టరు ఎమాన్యుయల్' వారి నాహ్వానించెను. ఇది ౧౯౨౨ అక్టోబరు ౩౦ తేది. అంతటినుండి ప్రధానమంత్రిగను, డిక్టేటరుగను నుండెను. లోగడ నీమహాశయుఁడే యన్యదేశవ్యాపారాంగమంత్రిగఁగూడ నుండెనఁట. దేశమును బలపఱిచి వృద్ధికిఁ దెచ్చినవాఁ డందురు వీరి ముఖ్యోద్దేశము 'మధ్యధరాసముద్రమున పలుకుబడి' యని చెప్పఁబడినది. ౧౯౩౫ అక్టోబరు అబిసీనియాయుద్ధ మెల్లరెఱిఁగినదేగాన వేఱుగ వ్రాయనక్కఱలేదు.

(ఇటలీదేశము, రోమకపురి వెటికాన్ చూ.)

**ముస్సోలినీ (మహాశయుఁడు)**— Benito Mussolini మహాశయుఁడు ఇటలీదేశమున గొప్ప రాజకీయవేత్త. క్రీ. వె. ౧౮౮౩ జూలై ౨౯ తేదీని జన్మించి, యుపాధ్యాయవృత్తి నవలంబించినవాఁడు. ౧౯౦౨ లో స్విజర్లాండున కేగి, యట Socialist గా నుండి చేయుచున్నపని కటనుండి వెడలఁగొట్టఁబడి, ౧౯౦౪ సంIIరంలో ఇటలీ జేరి, వార్తాపత్రికారచయితగా నుండెను. ౧౯౧౨ లో మిలాన్ పురమున నవంతి యనుపేరుగల సోషలిస్టు వార్తాపత్రికాధిపతి యయ్యెను. మరియు ౧౯౧౪ సంIIరంలో యుద్ధమునఁ జేరవలయునని ప్రబోధ మొనర్చెను. అంతియే గాక ౧౯౧౫ ఇటలీ యుద్ధమున చేరఁగనె తాను సైనికుఁడై యుద్ధరంగమున కేగెనఁట. యుద్ధము ముగిసినకతన తన కదివఱకుండిన రాజకీయాభిప్రాయమగు Socialism నువదలి, Fascism నవలంబించి, ౧౯౧౯ లో నాయుద్యమమును లేఁపెను. ౧౯౨౨ అక్టోబరులో రోముపట్టణమున నీయనయొనర్చిన యూరేగింపు సుప్రసిద్ధము. అందు రెండులక్షలఫాసిస్టులూరేగిరి. ఆసంవత్సరమే నవంబరు ౧వ తేదీని దేశమునప్రధానమంత్రి యాయెను. పిదప డిక్టేటరనఁబడియెను.

రాజ్యాంగవిధానమున గొప్ప సంస్కరణము లొనర్చి యుద్ధరించినవాఁడు.

**ముహూర్త కాలము**— దినమునందలి యఱువది గడియలలో పదునేనవ భాగము. అనఁగా నాల్గుగడియలు, లేక తొంబదియారు మినిట్లు (ఇంగ్లీషు) కాలమని యర్థము.

**ముహూర్తి**-తండ్రి రెండవదశుఁడు. భర్త ధర్ముఁడు. ఈమె సంతతివారు మౌహూర్తికు లనఁబడువారు.

**ముష్టిస్వస్తికహస్తము**-- (హస్తాభినయము చూడుఁడు-- భరతశాస్త్రము చూడుఁడు.)

**ముష్టిహస్తము**-(హస్తాభినయము చూ- భరతశాస్త్రము చూడుఁడు.)

**మూకగోత్రము**-(వీతహవ్య లేక యాస్క- గణము చూడుఁడు.)

**మూకాంబ (మళయాళభగవతి)** -- (అంబాతీర్థము చూడుఁడు.)

**మూగివానికల (చెప్పఁజాలఁ దని భావము)**-(ఆంధ్రలోకోక్తి)

**మూడరథగోత్రము** — (జౌతథ్యఉపగ ణము చూడుఁడు.)

**మూడుకాళ్లము(ద)సలి** — ఇచట "కాలు" అనిన నేల నూనుకొని శరీరమును పైకి నిలువఁబెట్టు సాధక మనిభావము. కాళ్ళు రెండును చేత (నూఁతగ) నానుకొను కఱ్ఱ యొకటియు నిట మూఁడుకాళ్ళుగ భావింపఁ బడినది. అనఁగా చేత కఱ్ఱనానుకొని నిలువఁబడు నట్టి ము(ద)సలితనమని యిచట నెఱుఁగునది.

**మూఢరథగోత్రము**—(ఆయాస్య ఉప గణము చూడుఁడు.)

**మూత్రకృచ్ఛ్రము** -దీని నశ్మరియని యు నందురు. ఆంగ్ల. Strangury మలము, మూత్రము, శుక్లశోణితములు చెడుస్థితి గల్గి, వికృతి నందుచో పొత్తికడుపునఁ జేరుకతమున మూత్ర నిరోధముగల్గి వెడలుటకష్టమగుచుండురోగము. ఇది మేహసంబంధరోగము.

**మూత్రఘాతము**—ఆంగ్ల. Dysuria. మూత్రము బొట్లుబొట్లుగ కష్టముపైఁ బడు చుంటయు, మూత్రముతోఁగలిసి శుక్లము పడు చుంటయు, రోగి చాల నీరసించుటను గల్గించు జబ్బు.

**మూత్రాశ్మరి (శిలామేహము)** — ఆంగ్ల. Calculi లేక Gravel in the bladder. మూత్రపుసంచి (తిత్తి) లో రాళ్ల వలె దుష్టపదార్థములుగట్టిపడి యేర్పడి మూత్ర ము వెడల నిరోధించుచు భాధించు జబ్బు.

**మూరలకొలత** -పూర్వకాలమున నిప్పటి యడుగులు,గజములు కొలతవలెనే సాధారణపు చిన్నకొలతలు మూరతో కొలుచుచుండిరి. ఇది మోఁచేతిగుంపు మొదలు మధ్యవ్రేలికడవఱకు మూరగనుండెను.భరతదేశమునపొట్టివారిమూర నరకుచేయఁబడనిదిగ నుం..ను. హెబ్రూదేశము న పెద్దమూర, సాధారణపుమూర లని రెండుగ నుండి, సాధారణపుమూర దేశమున వాడుక యందుండెను. పెద్దమూర ఎజకియేలుప్రవక్త మూరకొల. అది యెహోవాదేవాలయపు కొలతలకు వాడఁబడెను.

**మూరుజాతిమహమ్మదీయశాఖ** — వీ రాది నరబ్బులనుండియో, బెర్బరులనుండియో కల్గి రందురు. వీరినుండి మొరాకో (మొరాకమ్) దేశమునకో, ఆదేశవాసమునుండి వీరికో పేరు కల్గెను. ఇప్పుడు సింహాలద్వీపమందుఁగూడ కాన నగుచున్నారు. వీరు మధ్యధరాసముద్రమును దాటి, స్పానియాదేశమున రాజ్య మేర్పఱుచు కొని రనియు, పిదప నొకప్పు డచటివారిచే

తరిమివేయఁబడి రనియు, నందుఁ గొందరు సింహళముసకుఁ జేరిరనియు, కొందరింకను స్పానియాసీమలందే ప్రజలలోఁ గలసిపోయి యున్నారనియుఁ దెలిసెడిని.

**మూరురాయరగండ బిరుదము**—ఇది శ్రీకృష్ణరాయ సార్వభౌమునకును, ఆంధ్రకర్ణాటక సామ్రాజ్యాధిపతులగు మఱికొందరితరభూపతులకును గల్గియుండిన బిరుదము. బిజాపూర్ నవాబున (బహామనీసుల్తాన్) "అశ్వపతి" యనియు, గోల్కొండనవాబునకు(కాల్బలము లధికముగ నుండుటచే) "నరపతు" లనియు,కళింగభూపతికి(ఏనుఁగు లధికముగ నుంట) "గజపతి" యనియు ప్రసిద్ధియుండెను. గజపతుల కళింగోత్కలరాజ్యమున కుంజహారరణ్యమున నేనుఁగులు విసారముగ వసించుట సుప్రసిద్ధము. ఈముగ్గురు భూపతులు మూరురాయరు (ముగ్గురునరపతులు) లనఁబడిరి. వీరి మువ్వురి నోడించుట "మూరురాయరగండఁ" డనఁబడెనఁట.

గజపతిరాజులుమువ్వురు. కపిలేశ్వరగజపతి, (రెండవవానిపేరు తెలియదు), ప్రతాపరుద్రగజపతి. ఇందు మొదటి నృపుసిపుత్రికనే శ్రీకృష్ణదేవరాయ సార్వభౌముఁడు పరిణయమయ్యెనఁట.

**మూరుజాతివారు** Moors— వీరి నాంగ్లభాషయందు "మూర్మెన్" అనుటయుఁ గలదు. మొరాకోదేశమునుండి పేరందినజాతివారు. వీరు మహమ్మదీయులు. తొలుత నరబ్బీదేశపువారై బెర్బరు సంబంధబాంధవ్యములతో నేర్పడి, "మూర్" లని పేరందిరి. వీరు స్పానియాదేశభాగముల నాక్రమించి, కొంతకాల మేలిరి. ఆదేశమునఁగల గ్రెనడాపురము కడనున్న 'అల్హాంబ్రా' కట్టడములును కార్డోవాపురమునకున్న గొప్పమశీదును వీరినిర్మాణచిహ్నములై యున్నవి. స్పానియాదేశమున నుండుతరి వీరికి 'Moriscos' అని పేరు వాడుక యుండెనఁట. పిదప Philip III భూపాలుని కాలమున క్రీ.వె. ౧౬౦౯-౧౬౧౦ సంవత్సరముల కాలమున స్పానియాదేశమునుండి వెడలఁగొట్టఁబడిరి. క్రైస్తవమతావలంబన మొనర్చినవారును, నాల్గు సంవత్సరములలోపు బాలురును, మిగిలినవారు నచటనే యుండిపోయి, స్పానియాదేశస్థులతోఁ గొందరు కలసిపోయిరఁట. వీరిస్వదేశము స్పానియా ఫ్రెంచిదేశస్థుల పక్షమై పేరున కొక సుల్తాను పాలనమున నిలచియున్నది.

**మూరొక్కొండచెట్టు**· లా. Acalypha Indica. సం. విశ్వరూపా. హరితమంజరీ

ఇది కుప్పింటజాతిలోని దనియు, దానిగుణములే దీనికిం గలవనియు కొంద రనెదరు. మూరొక్కొండాకు రస కషాయ చూర్ణములందు కాకజేసి, రక్తమును శుభ్రపఱుచు గుణము కలదనియు, మూలవ్యాధి, గుల్మలు, శూలలు, మలమూత్రనిరోధములు, శ్వాసకాసల నివారించుశక్తి గలదనియు, పసరు చర్మరోగముల పైన రాసిన మాను ననియు, పసరు లోనికిచ్చిన మూర్ఛజబ్బు మానుననియు, వేరునందు వాతమును హరించుశక్తియు, వేరుతో దంతధావనముజేసిన దంతరోగముల నివారించుశక్తియుఁ గలదని చెప్పఁబడినది.

**మూర్తి కొంచెమైనా కీర్తి యధికము**
(భ్రలోకోక్తి.)

**మూర్తిత్రయత్వసిద్ధాంతము**- (Trinity)- పరమేశ్వరుఁ డొక్కఁడే యయ్యు 3 వేర్వేరు రూపములుగ నవసరములగు 3 భేద

కార్యములను నిర్వహించుచుండుటను "మూర్తిత్రయతత్త్వ" మని పేరిడఁబడినది. దాని నాంగమున 'ట్రినిటీ' యనెదరు. ఇట్లనుటయందు సర్వతంత్రస్వతంత్రుఁడయ్యు పరమేశ్వరుఁడు మూఁడు భేదకార్యముల నిర్వహించు నవస్థానిరూపణము లొనర్చి, ముప్పురుగ భావించుట యని స్ఫురించెడిని. భరతదేశమున ందూమత మని చెప్పఁబడుచున్న యార్షమతమున సృష్టి స్థితి లయములకుఁ గర్తయగు పరమేశ్వరునకు సృష్టియొనర్చు నవస్థానిరూపణము బ్రహ్మత్వ మనియు, అట్టిసృష్టి నుద్ధరించి యభివృద్ధికిఁ దెచ్చుచుప్రభవింపఁజేయు నవస్థానిరూపణమునకు విష్ణుత్వ మనియు, దానికి మార్పు గల్గింప లయమొనర్చు నవస్థానిరూపణమునకు రుద్రత్వ (శివత్వ) మనియు, సంకేతనామములిడి, బ్రహ్మ విష్ణు మహేశ్వరులు (రుద్రావస్థానిరూపణము) గ మూర్తిత్రయతత్త్వముం జెప్పుదురు. ఇటులనే క్రైస్తవమతధర్మమునందునను మూర్తిత్రయతత్త్వము వేఱువిధముగ నిర్వచింపఁబడినది. వీరు పునర్జన్మముల నంగీకరింపని సిద్ధాంతమువారు గావున, తండ్రి యగు జహోవా పరమేశ్వరుఁ డనియు, కుమారుఁడుగ భూమి యం దవతరించిన క్రీస్తుప్రభువు,బోధకుఁడుగను, పాపులదోషములకు శిక్షగా తాను శిలువవేయఁబడి మరణించుటనందిన రక్షకుఁడుగను, పరమేశ్వరుని పవిత్రసిద్ధాంతఃకరణము భక్తులపై నావరించి వ్రాలి వారియందలి పవిత్రావయవమును, పవిత్రతను భక్తికిని మూలస్థానమగు మనస్సును, శుద్ధముగనొనర్చి,పూతమై దనర్పఁజేయు పరిశుద్ధాత్మయు మూర్తిత్రయముగఁ జెప్పఁబడినది. ఇట్లనుటయందుఁగూడ నీమూడును పరమేశ్వరసంబంధములే యయ్యు, త్రివిధ భేదకార్యము లొనర్చునవిగ (అవస్థాత్రయ నిరూపణములుగ) నగుచున్నవి

పెక్కులితరమతములం దీమూర్తిత్రయతత్త్వము చెప్పఁబడలేదు. క్రైస్తవులందు నహో యూనిటేరియన్ శాఖకుఁ జెందినవా ర్ట్రినిటీసిద్ధాంతము జెప్పక నిరాకరించి క్రీస్తుప్రభువు దీర్ఘదర్శియు, మతబోధకుఁడునని యందురు. (క్రైస్తవమతము యూనిటేరియన్ సిద్ధాంతము చూడుఁడు.) ఐనను క్రైస్తవులందు 'Pente cost' అనఁబడు Whit Sun day కుఁబిదపవచ్చు నాదివారమును విశేషపర్వదినముగ నెంచి, ట్రినిటీ సండే (సబ్బాత్) యని యాచరించుచుందురు. యూనిటేరియన్ శాఖక్రైస్తవులు దీని నన్ని యాదివారములవలెనే సబ్బాత్ (విశ్రాంతి) దినముగ నెంచుదురు గాఁబోలును.

**మూర్ఛన**—మూర్ఛన మూర్ఛనలు సంగీతశాస్త్రమున దశవిధగమకములలో నొకటి. ఇది షడ్జగ్రామము, మధ్యగ్రామము, గాన్ధారగ్రామము నని త్రివిధము.

౧. షడ్జగ్రామమున- ఉత్తరమన్ద్ర, రంజని, ఉత్తరాయత, శుద్ధషడ్జ, మత్సరీకృతు, అశ్వక్రాంత, హీరుగ్గత యని యేడుమూర్ఛనలు.

౨. గాన్ధారగ్రామమున- సుఖ, ఆలాప, చిత్ర, చిత్రవతి, సుముఖ, విశాల, నంద, యనంబడు నేడుమూర్ఛనలు కలవు. వీట్ల నుపయోగించుట స్వర్గమునందలి గాయకులకు తప్ప భూలోకమునందలి గాయకుల కేమియుఁ దెలియదు. గాన నివి వాడుకలో లేవు.

3. మధ్యగ్రామమున- సౌవీరి, హారిణాశ్వ, కలోపగత, శుద్ధమధ్య, మార్గ,కౌరవి, హృష్య అని యేడుమూర్ఛనలు. ఇటుల మూర్ఛన లిరువదియొకటిలో షడ్జ మధ్య గ్రామములందలి పదునాల్గుమూర్ఛనలు వాడుకయం దున్నవి.

**మూర్ఛిలుట** (Fainting)— ఇట మూర్ఛిలుట యన మూర్ఛరోగమువలనఁ

గాదనియు, హఠాత్తుగఁ దెలిసిన విచారవార్త, ఆపద మొదలగునవి విని భరింపరానిదుఃఖమున మూర్ఛిలుట యని మనస్సునం దుంచుకొన వలయును. దీని నాంగ్లవైద్యవిద్యావిశారదులు "Stoppage of blood supply to some parts of Brain caused by sudden severe emotion" అని నిర్వచించిరి. అత్తరి Blood vessals ముడుచుకొను నఁట. తోడనే మేధస్సునకు రక్తస్రావ మాఁగుటయు, శరీరము వెల్లబాఱుటయు సంభవించుటతో మూర్ఛగల్గి నేలఁబడఁజేయును. అటుల నేలఁ బరుండుటయే దీని నివారణకుమార్గమనియెదరు. భరతదేశపు యోగాభ్యాసపరు లలసటయందు తెల్లగిలఁబండియుండు అర్థశవాస మలసటం బాఱఁదోలి తిరుగ బలముఁ గల్గించునని చెప్పెడియుక్తి స్ఫురించెడిని.

**మూర్ఛాకుంభకము**- నోరు మూసికొని పద్మాసనాసీనుఁడై కూర్చుండి, హృదయము, తాలువులు, కంఠము వీటిబలముచేత నాశికా రంధ్రముల వాయువును పూరించి, జాలంధర బంధమున కుంభించి, యేకాగ్రచిత్తుఁడై మధ్యమందు దృష్టి నిలిపి, నాశికారంధ్రముల నెమ్మదిగా రేచించుట "మూర్ఛాకుంభక" మనఁబడును. ఇది యోగఫల మనియు, మనస్సు స్థిరముగ నిలుచు ననియుఁ జెప్పఁబడినది. (కుంభకము చూడుఁడు).

దీనికిఁ బ్రకారాంతరముగాఁ గొందరు యోగులు ప్లావినీకుంభకము నాచరింతురు. పద్మాసనా సీనుఁడై కూర్చుండి నాశికా, తాలు, హృదయ కంఠముల బలమున నోటిగుండా పూరించి, హృదయమున నిరోధించి, కుంచి నెమ్మదిగ రేచింతురు. ఈయభ్యాసమున మేను చులకన గల్గి ంయువు స్థిరతఁగొందునని యందురు. (అష్టాంగయోగములు చూడుఁడు)

**మూలకుఁడు లేక నారీకవచుఁడు**— తండ్రి అశ్మకుఁడు. పరశురాముఁడు క్షత్రియు లపై దాడివెడలినతఱి స్త్రీ లితనిని తమనడుమ నుంచుకొని కాపాడిరి గాన నారీకవచుఁడనియు, తిరుగ క్షత్రియకుల మీతనివలన నభివృద్ధి యగుట 'మూలకుఁ' డనియు వాడుక గలిగెను. (నారీకవచుఁడు చూడుఁడు)

**మూలకులగోత్రము** —(మునికులచూ.)

**మూలతాపీనది(తపతీనది)**-దీనికిప్పుడు తపతీ నదియని వాడుక గలదు. మత్స్యపురాణ మున ౨౨ అధ్యా. 33 శ్లోకమున మూలతాపి (యనఁబడుతావు)యందు జన్మించుటకతః ౼రందెనని చెప్పఁబడినది. ఆతా విపుడు 'మూల్తాయి'యనుచున్నారు.తపతీనదింగూర్చిన పశ్రంస బృహచ్ఛివపురాణము ౨-౨౦యందు నను, భాగవతము ౫-౧౯ యందునను కలదు. వింధ్యపాదపర్వతపంక్తియందు (సాత్పురాపర్వ తపంక్తి) గోనానగిరి యనఁబడుతావునజనించి, పశ్చిమవాహినియై ప్రవహించుచు సూరత్ పట్ట ణమునకు గతిపయదూరమున పశ్చిమసముద్ర మునందు కాంబే సముద్రశాఖయందు సంగ మించును.

**మూల నున్నవాటిని ముంగలకు తెచ్చేవాఁడు**—(ఆంధ్రలోకోక్తి).

**మూలబంధముద్ర** యోగాభ్యాస విధానమునఁ జెప్పఁబడిన వింశతిముద్రిలలో నొకటి.

ఎడమకాలిమడమను గుదమునకు పైనను, లింగస్థానమునకు దిగువను (అనఁగా సీవని యందు) అదిమిపట్టి, గుదాకుంచన మొనర్చి కడుపును వెన్నున కదిమి, కుడికాలిమడమును లింగస్థానముపై నానించుట మూలబంధముద్ర యనఁబడును.

ఈయభ్యాసము ప్రాణవాయువును జయిం చునని చెప్పఁబడినది.

**మూలవ్యాధి (మూలశంకవ్యాధి)** -- (అర్శరోగము చూడుఁడు)

**మూలస్థాన(పుర)ము (ముల్తాన్)**- పాంచాలదేశమునం దిప్పుడు ముల్తా ననఁబడుచు సైన్యస్థానమై యున్నది. వర్తకస్థలము. ఇంగువకు ప్రసిద్ధినందిన తావు. ఈప్రాంతదేశమునకు వేర్వేరుకాలములం దనేకనామము లుండినటులఁ గన్పట్టెడిని. రామాయణము ఉత్తర ౧౧౫ యందు "మల్లభూమి" యని పేరును, మహాభారతము సభాపర్వము ౩౧ యందు "మాళవదేశ"మనియు దీనిని దెల్పియున్నారు.

భాగవతమునఁ దెల్పఁబడిన నృసింహావతారస్థల మిదియే యని స్థిరపఱుపఁ బడినది. ఇట ప్రహ్లాదపురి యనంబడుతావున పురాతనపు దుర్గమున హిరణ్యపురమని తొల్లివాడఁబడుచు, హిరణ్యకశ్యపుఁడనునసురభూపతివసించుచుండె ననియు, నాయనసుతుఁడే ప్రహ్లాదుఁ డనియు, నటనే నృసింహావతారమున విష్ణుదేవుఁ డుద్భవించి హిరణ్యకస్యపునిఁజీఱి, సుతుని రక్షించిన తావుగాCunningham's Geography of Ancient India అనుగ్రంథమున 230యందు పోల్పఁబడినది. మఱియు నీపరిసరముల ప్రహ్లాదగిరి (పడఁద్రోసినకొండ) మొదలగునానవాళ్ళ పెక్కింటిఁజూపుదురు. ఇంకను శ్రీకృష్ణునిసుతుఁడగు సాంబుఁ డపరాధియై కుష్ఠరోగపీడితుఁడై సూర్యునింగూర్చి తపమొనర్చి పూతుఁడైన తావును(సూర్యకుండము)నీపరిసరములనేగలదు ఇది శకద్వీపవుసరిహద్దు. (మల్లదేశము-నృసింహావతారస్థలము చూడుఁడు).

**మూలానక్షత్రము**—ఇది. గొంతిసింహముంబోలినదైయైదునక్షత్రములకూడిక. దీనికింకను 'అసురం కోపణం నక్తంచరం నిరృతిం నిశాచరం- పిశితాశనం మూలం రాక్షసం' అను పర్యాయనామములు కలవు. దీనికి రాక్షసాధిదైవము. రాక్షసగణము. అధోముఖము, నపుంసకస్వభావము. ఆఁడుకుక్క, చక్రవాకపక్షి, సజ్జచెట్టు, ఈనక్షత్రసంబంధములనియు, ప్రవేశించిన యిరువదిఘడియలపై త్యాజ్యము(అనఁగా విషఘటికల)నియు, నలువదినాల్గు ఘటికలపై నమృతఘటిక లనియు, నిది దారుణస్వభావనక్షత్ర మనియుఁ జెప్పఁబడినది.

**మూషాసిక్తతామ్రన్యాయము**-వలసినయాకారముగ నగుటకు రాగిగరఁగి మూసలోఁబోసినట్లని యర్థము.

లోహము గరఁగిన నీరువలెనైస్వాధీనమగుఁగాన నత్తరి నేరూపముగానైన నట్టిమూసలోఁబోసిన నట్లే రూపించునని భావము. ఈసందర్భమున 'వ్యంజకో వా యథా లోకః' వ్యంజకవ్యంగ్యన్యాయము చూడుఁడు).

**మూషికభక్షితబీజాదనంకురాదిజననప్రార్థనా ఇతి-న్యాయము** - పొలములోఁజల్లినవిత్తనముల నెలుకలు తినివేయఁగా నింకనవి మొలచునని యెదురుచూచునటుల ననియర్థము. గ్రహింపులేనివ్యర్థనిరీక్షణ మనిభావము.

**మూసారహీమ్ ఉర్సు ఉత్సవము** ఈఉర్సు నిజాము రాజ్యములో హైదరాబాదు నగరపరిసరములనున్న "మైశ్రామ్ ఒక్కేడీ" యనఁబడు చిన్న కొండపైనున్న యొకదరగాయం దేటేట నాయన మృతతిథియందు జరుగుచుండును. ఆయన మిక్కిలి నేర్పరియగు సేనానియఁట. ఈ యుత్సవమునకు ముసల్మానులు, హిందువులు, నాయనసేనానిగనుండిన మైశ్రామ్ (రిజిమెంటు) సేనాదళములోని సైనికులును వేలసంఖ్యాకులుగ నరుదెంచి, ఆయన ప్రశంసలఁజెప్పుకొనుచు, ఫలహారము లొనర్చి మరలుచుందురు. సైనికులలోఁ బెక్కండ్రియనాటి

సైనికులసంతతివారేయని తెలియుచున్నది. హిందువు లీతనను 'మూసారామ్' అనియు మహమ్మదీయులు 'మూసారహీమ్' అనియు వాడుచున్నారు

హిందువులచే వారినామమును, మహమ్మదీయులచే వారినామమును గైకొనిన యీ విచిత్రపురుషునింగూర్చి Illustrated weekly of India of December 29-1940 వదు నేడవపుటయం దిటుల నీచరిత్ర వివరింపఁబడినది. ఈయనపేరు Michel Joachim Marie Raymond అని సాధారణముగ నెల్లరచే Francow Raymond అనిపిలువఁబడుచుండువాఁడు. ఫ్రెంచిదేశస్థుఁడు. Serignac జన్మస్థానము. ఇది Gasconey పరగణాలోనిది. క్రీ. శ. ౧౭౫౫ మార్చినెలలో జన్మించినవాఁడు. తండ్రి వర్తకుఁడు. తానును వర్తకుఁడు గాఁగోరియే తనయిరువదియవ సంవత్సరమున Lorient అనఁబడు రేవునుండి స్వదేశమును వీడి భరతభూమి కరుదెంచి యచిరకాలముననే తన బుద్ధిమార్చుకొని సేనానికాఁగోరి, భరతదేశపు సంస్థానాధిపతులక్రింద కొల్వొనర్ప నిచ్ఛగించి తొలుదొల్త మైసూరురాజ్యమున హైదరాలీ నవాబుకొల్వునం దొకపటాలపు Sub-lieun-tenant సేనానిగా ప్రవేశించెను. అక్కాలమునం దాసైన్యదళములకు Chevalier-de-Lasseగారు కమేండరుగా నుండిరఁట. ఆయనయు ఫ్రెంచిదేశస్థుఁడే. ఆసైన్యములతో క్రీ. శ. ౧౭౮౦నుండియు దక్షిణయిండియా భాగరాజ్యములకొఱకు బ్రిటిషువారికెదురుగ యుద్ధము లొనర్చుచుండెను. ఆకొలువునందు కేప్టెన్ హోదాకు నెత్తఁబడెనఁట.

హైదరాలీయనంతరము రేమండుగా రాయుద్యోగమును వదల, Bussy సేనానిక్రింద Aide-de-camp గా ప్రవేశించె నఁట. ఆయన కంగరక్షకుఁడుగ మాత్రమేగాక, యింగీకి బొందు వలె నెల్లకార్యములఁ గల్గించుకొనుచుండి, క్రీ. శ. ౧౭౮౫ లో అయన పుదుచ్చేరిలో మృతినొందినపిదప నాకొలువువదలి, హైదరాబాదు రాజ్యమున కరిగి మూడవ నైజాంప్రభుఁడగు సికందర్ జా బహద్దరుగారి సుతుండగు సలాబత్ జంగుబహద్దరుగారి కొలువునందు సేనానిగఁ జేరియుండెను. ఈయనను ఫ్రెంచివారు సింహాసన మెక్కించిరఁట గాని, పిదప నచిరకాలముననె బ్రిటీషువా రాయేర్పాటును భగ్నపఱచి తండ్రినే తిరుగ ప్రభువుగ స్థిరపఱచిరి.

ఇట్టి యననుకూలపరిస్థితులయందు సైతము ఫ్రెంచిరేమండుగా రెట్లెటో ౧౭౮౬ సం॥ లో నిజామాలీఖాన్ గారి కొలువునందు జేరఁగలిగిరి. ఆయన కొలువునందే పదమూడు వత్సరములుండి, హఠాత్తుగ రేమండుగారు మరణించిరఁట. నైజాముగారి కొలువుఁ జేరినపిదప స్వదేశఁపు సైన్యదళములను తన ఫ్రెంచిదేశఁపు సైన్యదళములవలె తరిఫియ్యతు నొనర్చి, యొక్కొక ఫ్రెంచివానిని దానిపై సేనానిగ నొనర్చుచు, వారి కొక ఫ్రెంచివర్తకుని మూలమున నాయుధములఁ దెప్పించి యమర్చుచుండెనఁట. రేమండుగారిక్రింద ప్రత్యేకముగ నేడునూరుల సైన్య ముండెడిదఁట. టిప్పుసుల్తానుతోడి సంగరము తటస్థించినతరి నతనినుండి కల్గినజయములు నిజాంప్రభువుగారిని బ్రోత్సహింప, అయిదువేల సైనికులఁ గూర్ప నాజ్ఞనిచ్చుచు నాతని కైదు వేలరూప్యములు జీతము నేర్పఱచి యనుగ్రహించిరఁట.

రేమండుగారి యభ్యుదయ మిట్లుండ మహారాష్ట్రులతో నిజాంప్రభువుగారికిఁ బొసఁగిన

ఖార్డ్లా సంగరమున నిజాంప్రభువుగారిసైన్యములకు గొప్పనష్టమును నపజయమును వాటిల్ల, నిరువురు సేనానులును ఫ్రెంచిదేశస్థులే యైనను నొకరినొకరు కొట్టుకొనుస్థితి కల్గెనఁట. దానిఁ గాంచిన నిజాంప్రభువుగారి జనానావా రెవ్వరో యాయనను ప్రోత్సహించి వెఱపించి రేమండుగారిని వెనుకకు మరలఁజేసి వేరొక యుద్యోగి కధికార మీయఁజేసిరఁట. మహారాష్ట్రసేనల నడిపిన ఫ్రెంచిసేనానిపేరు Perron అని యొక చరిత్రకారుఁడు వ్రాసియున్నాఁడు. అత్తరి నిజాముప్రభువుగారు కడువృద్ధులుగఁగూడ నుండిరని తెలిసెడిని. దీనికిఁ బిదప నిజాంప్రభుని సుతుం డాలీజా యనునాతఁడు తండ్రిపైతిరుగఁబడినతఱి నాయుల్లరులను రేమండుగారే యడఁచివైచి శాంతిగల్గించిరఁట. నైజాంప్రభుఁ డాయనకు Controller of Ordinance ఉద్యోగపదవిఁ గల్పించి యాయనకిచ్చి గౌరవించెనఁట. ఆయన తుపాకులు ఫిరంగులు మందుగుండు సామానులు చేయించుచుండిన కర్మాగారశేషమిప్పటికిని ఫతేమైదానముకడ తోప్కా-సంచాయనఁబడుచున్నదని చెప్పఁబడినది.

రేమండుగారు నిజాంప్రభువుగారికి బ్రిటీషుప్రభుత్వముతో సంధికుదురుటకు కొన్ని మాసములు మున్ను హైదరాబాదునగరమున మరణించిరఁట. పిదప ఫ్రెంచిసైన్యములు తొలగింపఁబడియెను. అప్పటి బ్రిటీషురెసిడెంటుగారు Capt Kirk patrick గారని చరిత్రలనుండి తేలుచున్నది. ఈయనపే రెటుల నెప్పుడు మార్పునందెనో తెలియఁబడకున్నను మెయిశామ్ టెకాడీ కొండపైనున్న దరగాకడనే యీయనసమాధియుఁ గలదు. అది నలుపలకల దిమ్మపై పెరామిడ్ వాటముగ పొడవధికముగ నిరువది మూఁడడుగుల యెత్తునకు స్తంభమును బోలి నిలచియుండి, తలపై నొక శిఖరముఁగల్గి యున్నదఁట. గాని దానిపై శాసనములేమియు లేక J.R. అను నక్షరములుమాత్ర మున్నవఁట. ఈయనదరగా కిరువది యెన్మిది స్తంభములు గలవు. దానిని Grecian Temple ఆకారమున నున్నదనియెదరు. దీని నిజస్థితియేమైనను బయల్పడిన చరిత్రను మాచదువరుల కెఱుకఁ జేయుట యాంధ్రవిజ్ఞానమునకు గర్తవ్యముగాన దీని నిజానిజములను చదువరులే పరిశీలింతురుగాక యని వదలుచు ముగించుచున్నారము.

**మృకండుఁడు**-ఋషి. తండ్రిపేరు ధాత. తల్లిపే రాయతి. కుమారుఁడు మార్కండేయుఁడు. (చిరంజీవి). ఈశ్వరోపాసకుఁడు.

**మృగజాతిగజము**— (గజలక్షణము చూడుఁడు).

**మృగతృష్ణలేకఎండమావి**(Mirage). ఇది యద్భుత దృశ్యము. ఎడారులందప్పుడప్పుడు గాననగుచు పాంథులను మోసపుచ్చుచుండునది. ఒక తత్వవేత్త దీనిని "A mirage is an optical illusion due to certain conditions of air, when it is very hot" అని వివరించెను. ఎడారులందు నీరుదొరకుట దుస్తరమని యెల్లరెరింగినదే. అందచ్చటచ్చట నీరుగల ప్రదేశము లరుదుగ నుండును. అచ్చట నొక బావియుండుటయెగాక నాచెమ్మకట పచ్చగడ్డియు చెట్లును, వాటినుండి కొంచెము నీడయుంగల్గి, చల్లని ప్రదేశమగుట ఎడారులఁ దాటిపోవుటకు నడుచు పాంథులకు విశ్రాంతినిచ్చుతావై (మకాము జాగా) యుండెడిని. అట్టితావుల నాంగ్లమున Oases అందురు. ఇట్టి యెడారులందాకసమున వాయువు వాతావరణమునందు పొరలుపొరలుగ నేర్పడుచుంట గలదు. అట్టిపొరలు వేర్వేరు శీతోష్ణస్థితులంగల్గియుంట వేర్వేరు పొరలుగఁ దలంపఁ

బడుచుండెడిని. శీతోష్ణస్థితులమేర కాపొరలు భేదములగు దళసరి (డెన్సిటీ) లను గల్గియుండును. (డెన్సిటీ చూడుఁడు). అట్టి పొరలందు వెలుతురు ప్రసరించుతరి వెనుకకు మరలుట (Deflection) సంభవించుచుండును. నిజమున భూవలయ రేఖ (Horizon) పరిసరముల నెక్కడనోయున్న 'ఒయాసిస్' మొదలగునవియు జలములు, ప్రవాహములు, ఇండ్లు, మార్గములు, జంతుజాలములు నాకాశమున డెన్సిటీవలన నద్దమునందువలె ప్రతిబింబించిన (Reflected images) ఎడారియందు నడుచు బాటసారుల నేత్రములకడకనఁగాదృశ్యభ్రమునకు తిన్నగాఁ జేరుట నుండి యవి మున్ముందెడారియందుండు నిజముగు నొయాసిస్ లవలెను, జలప్రవాహములవలెను, మార్గములవలెను, గృహములవలెను, మనుష్యులు, ఒంటెలు మొదలగుజంతుజాలములవలెను గన్పట్టును. దీనిని మృగతృష్ణ లేక నెండమావియందురు. ఎరుంగనివారి కివి నిజముగ నేతోచియుటజలములభింపగలదనితలంపఁజేయుచుండుఁగానిఅవి ప్రతిబింబదృశ్యము లేకాని నిజములగునొయాసిస్ తావులు గానేరవు. కొంతనడచినపిదప నాదృశ్యములు మరుగుపడిపోవుచు మాయమగుచుండును. ఇట్టిదృశ్యబింబములనాంగ్లమున Mirage అనియెదరు. ఇవి యిట్లనృతములై భ్రమజన్యములైనను నాకాశమున వాయువుపొరలందు గొప్పయద్దమువలె పనిచేయుచుండుగాలిపొరలయందు ప్రతిబింబించిన వెలుతురు ఎక్కడనో దూరమందొకచోట నిజముగ నున్నవాటిప్రతిబింబములని యెఱుంగదగును. ఇట్టిదృశ్యములొక్కొకతరి సముద్రమునం దోడలలో నరుగువారికిఁ గూడ నగుపడునఁట. అట్టితరి గన్పట్టు ప్రతిబింబములు తల్లక్రిందుల నుండిన ట్లగుపడునఁట

శాస్త్రపరిశోధకులచే నిది ప్రతిబింబము (Reflection and refraction) ల కార్యమనుచున్నారు. సముద్రతీరములందును నెడారులందును నిట్టి విచిత్రదృశ్యములు గానవగుచుండెడిని. ఎడారులందు తిన్నగను సముద్రతీరములందు తలక్రిందుగను చెఱువులు, పట్టణములు, వృక్షములు, మనుష్యాకారములును, సముద్రపుటోడలు, పడవలు, ద్వీపములు, నందలివృక్షములు మొదలగునవియు, స్పష్టముగ నిజమో యనున ట్లిండవేళలందుఁ గన్పట్టును. ఎడారులనడచుపాంథు లివిగాంచి, విదాహముగల్గినతరి నిందు నీరుదా్రివసగునని పొరపడి యాదిశల కేగుట కథలందుఁ జెప్పఁబడుచుండును.

ఆకసమున వేర్వేరుశీతోష్ణస్థితులు (Temperatures) గల గాలిపొరలు గొన్ని ఏర్పడి, యవి వేర్వేరుదళసరులుగనుంట సంభవించెనేని, ఇవి మంచిపరిస్థితులందు స్వచ్ఛముగను స్పష్టముగను నుండుటకలదు. దీని యుత్పత్తింగూర్చి పరిశీలకులు "If a ray of light passes threw air layers of deferrent density, the path of the ray becomes a curve. The air shall be of greater density near earth's surface, than at an altitude to this variation, which is almost permanent, if added the causes like the ascent of heated air of desert sands or mountain Valleys — and down following of cold air from hight mirage is produced and this is nothing but abnormality of vision" అని వివరించియున్నారు.

మెసపొటేమియాయం దీమృగతృష్ణలు తరుచని చెప్పఁబడినది.

**మృగతృష్ణాన్యాయము**-"మృగతృష్ణా జలన్యాయ"మనియు నందురు. ఎండమావి యందు నీరున్నట్లే భ్రమగల్గించునట్లు గన్పించును. గాని నిజముగ నీరుండదు. ఇట్టివియె చిత్రాంగనాన్యాయము, శశవిషాణన్యాయము, (కుందేలు యొక్క-కొమ్ము) మొదలగు న్యాయములు కలవు. అన్నియు భ్రాంతియే గాని నిజము గాదని భావము.

**మృగధరదేవస్థానము**-- (యుజాభుక్తి దేశము చూడుడు). (బాందాజిల్లా-కాలాంజరము చూడుడు).

**మృగధావ** —(సారనాథము చూడుడు.)

**మృగమదము**—(కస్తూరి చూడుడు.)

**మృగవ్యాధరుద్రనక్షత్రము**— (నక్షత్రములు భారతీయులుగుర్తించినవి చూడుడు).

**మృగశిర నక్షత్రము** — ఆకసమున శిరస్సుంబోలురూపమున నెన్మిది నక్షత్రములు కూడియుండు సముదాయము. జ్యోతిష శాస్త్ర గ్రంథములందు దీనిని మృగః, చంద్రః, నిశాకరః, నిశానాథః, సౌమ్యః, ఐందవః, శిశుభం, హిమదీధితిః అనుమాటలను పర్యాయపదంబులుగ వాడియున్నారు.

దీనికి చంద్రుఁడధి దేవతయనియు, దేవతా గణమునందలి తిర్యఙ్ముఖ నపుంసక స్వభావ నక్షత్రమనియు, ఆఁడుసర్పము, కోడి, చంద్రచెట్టు నీనక్షత్రసంబంధములనియు, ప్రవేశించిన పదునాల్గుగడియలపై త్యాజ్య (విషఘటిక) మనియు, ముప్పదియెన్మిది ఘడియలపై నమృతమనియు మృదుస్వభావనక్షత్ర మనియుఁ జెప్పఁబడినది

**మృగశీర్షహస్తము** — (హస్తాభినయము చూడుడు. భరతశాస్త్రము చూడుడు).

**మృగస్థలి**—నేపాల దేశమునందలి పశుపతినాథక్షేత్రము. (పశుపతినాథము చూడుడు). దీని ప్రశంస వరాహపురాణము ౨౧౩ యందును, స్వయంభుపురాణము (బౌద్ధగ్రంథము) అధ్యా. ౪ యందునను గలదు.

**మృతజీవులు(చనిపోయినను బ్రతుకుచున్నటువంటివారు)**-౧కవి, ౨త్యాగి, ౩ వీరుఁడు, ౪ దాత, ౫ న్యాయపాలకుండగు భూపతి. (వీరిని ప్రజలు మరువరని భావము.)

జీవన్మృతులు బ్రతికియుండియు చనిపోయినట్టివారు. అనఁగా నిరర్థకమైన జీవనముగలవారని భావము.

౧ లోభి, ౨ దరిద్రుఁడు, ౩కష్టజీవి, ౪నిత్యరోగి, ౫ యాచకుఁడు.

**"మృతందుందుభమాసాద్య కాకోపి గరుడాయతే" ఇతిన్యాయము**-చచ్చిన యానరవెల్లిఁబాముచుటకు (పిఱికిపక్షియైన) కాకియు గరుత్మంతునివంటి దేయని యర్థము.

పడిపోయినపిదప బలహీనులు సైతము బలవంతుని నెదిరింపఁ గలరని భావము.

**మృతవంధ్యత్వము**— (వంధ్యత్వము చూడుడు.)

**మృతంస్యాద్యాచితంభక్ష్యం అమృతంస్యా దయాచితమ్**— ఇది సంస్కృత భాషయందలి లోకోక్తి.

యాచించితినినది భక్ష్యమైనను మృతతుల్యమును, యాచించకుండ తినినది భక్ష్యమమృతమును నని భావము.

**మృతసూచకముగ జండాను జండాకొయ్యనుండి సగముదింపుట**-తొల్లింటి కాలమున నిర్వురురాజులు యుద్ధము నర్పిన్న కతన గెల్చిననరపాలుని జెండామీఁదను, ఓడిన

నరపాలునిజండా దానిక్రిందుగను జెండాకొయ్య యందుంచుట యాచారమై యుండెను. పిదప నావికాయుద్ధములందు నిట్లే జరుగుట సంభవించుచుండెను.

రానురాను జండాదిగుటయన నొకరిజెండా క్రిందనుండుట వారికిలొంగిపోయిన పరాజయమునకును, పైని వేరుజండా లేకున్నను నర్థస్థానమునకు కొంతదిగువగ జెండాను దించి యుంచుట నష్టమును సూచించు గురుతుగ నెంచఁబడుచుండెను.

ఇంకను కాలములుమారి ప్రముఖుని మృతి నష్టముగ నెంచఁదగినది గాన నొకప్రముఖుఁడు మృతుఁడయ్యెనేని జండాను సగముదూరమునకు జండాకొయ్యయందు దింపఁ బరిపాటయ్యెను. ఈదింపుట పరాజయమును సూచింప నేరదు గాని నష్టమును మాత్రము సూచించుచు చనిపోయినవాని గౌరవార్థముగ నెంచఁబడెను.

**మృతి, ఆవేదన, భయమునుపడుచుండుట**—మృతి మెలకువ రానినిద్ర. పరిశీలకులు మృతినందుట నిద్రించుటవంటిదే యందురు. కవిసార్వభౌమ శ్రీనాథమహాకవి తన కాశీఖండమున "పెద్దనిద్రకు మాఁగన్నుఁబెట్టు వేళ"యని మృతినిఁగూర్చి వివరించెను. మృతికి ముందావేదన కల్గునని పెక్కుండ్రు తలంతురు గాని యెట్టియావేదనలు లేకనే సునాయాసముగ మృతినందుటఁ బెక్కుతావులఁ గాననగుచునేయున్నది. మృతికి నావేదనకు నేసంబంధమును లేదనియు, నావేదన యతరి గల్గినచో నది యప్పటి రోగసంబంధమై యుండుననియు స్పష్టమగుచున్నది. ప్రపంచమున పెక్కుదేశములవారు మృతికై భయపడుచుండుట యెల్లరెరింగినదే. ఇది యనాదిగ మతబోధములచే బోధించినది గాన, చక్కగ నెల్లర మనంబులందును నాటికొనినదని తోఁచెడిని. మాటలాడుచుండు పసిబాలురకు మృతిసంభవించిన,వారు వెరగందుట గానరాదు గాన, మృతికి భయపడుట కేయవసరమును నైసర్గికముగ గానరాదు. లోభులగు ధనాశాపరులు, వ్యామోహాలాలసులగు కాముకులు మొదలగు వయస్సువచ్చినవారు, తమసంపదలును నైశ్వర్యమును ప్రేమలును వదలలేనివారు,వాటినివదలవలసివచ్చునని వెరగంది మృతికిభీతినందుదురు గాని నిజమెఱింగిన ధీశాలురు, వీరులు, శూరులు, తత్వవేత్తలు మృతికి వెరగంది భయపడుట గానరాదు. అట్లు వెరగందుట పిరికితనమని చెప్పవలసియుండును. యుద్ధమున మృతినందుట వీరులకు తమ విధికృత్యనిర్వహణమే యైయుండును; తక్కినవారికి మృతి రోగతీవ్రతయమునుండియు వైద్యసహాయలోపమునుండియుఁ గలుగవచ్చును. ఇది మృతికొకకారణము గానోపు. రెండవది నైసర్గికమగు మృతి. అదివార్ధక్యము. యోగసాధనమునఁ దలంచి శరీరమును ప్రాణి వదలుట. ఇంకమూడవకారణము దుర్మార్గులనుండి కష్టముల ననుభవింపఁజాలక ప్రభుత్వోద్యోగసహాయముండని కాలముల తనతనువుంబాసి యాపదలఁ దొలఁగించుకొననిచ్ఛగించు దురదృష్టవంతులు తాము విధిలేక మనస్ఫూర్తిం గల్గించుకొనినటుల నాత్మహత్యఁ గావించుకొని మృతినొందుట కడపటిది యగునాల్గవకారణము. దుర్మార్గులచే వధింపఁబడి బలాత్కారమరణము నందుట లేక మృతినొందుట.

ఎట్లయినను మరణమునకు ముందు కార్బన్ డి ఆక్సైడు మొదలగునవి మేధస్సునాక్రమించ, చైతన్యము తప్ప నారంభించి మృతిగల్గుకతన నైసర్గికమరణమున నిద్రించుస్థితిగల్గుటవంటిదే యగునని చెప్పనగును.

కర్మానుభవమున కాయుత్తమైన పురుష

సంజ్ఞికప్రాణి, తా నాజన్మమునం దదివరకుండిన భౌతికశరీరమును విడచుటను మృతి లేక చావు అందురు. (మృతికారణమున నింటిని వదలి వేయుట చూడుఁడు.) ఇది ప్రాణి కాజన్మమున సంభవించగల కడపటిస్థితి. దీనితో నా(పురుష సంజ్ఞిక)ప్రాణి కాజన్మము,జన్మసంబంధచర్యలు, సరియని భరతదేశఁపు మతగ్రంథములందు చెప్పఁబడినది. మృతి మానవశరీరధర్మములలో నొకటి యనియు, అది తప్పనిదనియు, లోకానుభవమునుండి తేలుచున్నది. అనఁగా మృతి, వార్ధక్యమున నైసర్గికముగనే గల్గుననియు, అటుల జరుగుటకుఁ బూర్వ మొక్కొకప్పుడు శరీరము రోగములచే నాశ్రమింపఁబడుచుండు ననియు, నట్టి యకాలమృతి నౌషధాది యుపాయములచేఁ దప్పింపవచ్చుననియు,వైద్య శాస్త్రవేత్త లందురు. మృతింగూర్చిన పరిశీలకు లిటీవల పాశ్చాత్యదేశములందు పరిశీలనలు సల్పి, నిద వంటి దేయని పోల్చియున్నారు. తెలుఁగున మృతికి 'పెద్దనిద్ర'యని పేరు గలదు. అకాలమరణముగల్గు స్థితికి 'గండ'మని పేరు. (గండము చూడుఁడు). ఒకరు మృతినొందిన పిదప వారిబంధువులకు మైల (అశుచి) సంభవించునని భరతదేశఁపుపద్ధతి యేర్పడియున్నది. (అశౌచము లేక మైల చూడుఁడు).

**మృతికారణముగ నింటిని వదలివేయుట**—మృతి కనర్హములగు దుష్టతిథివార నక్షత్రాదులంగూర్చి భరతదేశఁపు జ్యోతిష శాస్త్రమునం దిటులఁ జెప్పంబడినది. మృతికి పాడ్యమి, ద్వితీయ, షష్టి, సప్తమి, ఏకాదశి, ద్వాదశి, త్రయోదశి, చతుర్దశి తిథు లత్యుగ్రములు. దుష్టతిథులుగాఁ జెప్పఁబడినవి. ఆది, మంగళ, శుక్ర, శని వారము లనర్హములును దుష్టవారములును గా జెప్పంబడినవి. కృత్తిక, రోహిణి, మృగశిర, పునర్వసు, మఖ, ఉత్తర, చిత్త, విశాఖ, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములందు చావింటికిఁ దోషమని చెప్పఁబడినది.

కేవలము తిథిదోషము కర్మమునశాంతించుఁగాన పాటింపనక్కరలేదనియు, తిథి, వారము గూడ, దోషవంతములైన స్వల్పదోషమనియు, తిథి, నక్షత్రము, దోషవంతములైన నర్ధదోషమనియు, తిథి, వార, నక్షత్రములు మూడును దోషవంతములే యైన సంపూర్ణదోషమనియు, చెప్పంబడినది. ద్విపాదనక్షత్రము (రెండుపాదము లొకరాసియందుండునవి) లందు మృతి సంభవించెనేని ఆయింటిని మూడు నెలలు వదలి వేయవలయు ననియు, త్రిపాద నక్షత్రము (మూడుపాదము లొకరాశియం దుండునవి) లందు మృతిసంభవించునేని నాల్గునెల లాయింటిని వదలివేయవలయుననియు, మఖ, రోహిణి నక్షత్రములందు మృతి సంభవించునేని యాయింటి నొకనెలయు, ధనిష్ఠాపంచక(ధనిష్ఠ, శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి) నక్షత్రములందు మృతి సంభవించునేని యారునెల లామరణించినతావును వదలివేయ వలెననియు (వాడుకొనరాదనియు) చెప్పఁబడినది. [మృతి లేక చావు చూడుఁడు.]

**మృత్తికావతము**-(సాల్వదేశము చూ).

**మృత్యువు**-మృత్యునామముతో వేదము నందుఁగాని పురాణములందుఁ గాని గ్రంథమేదియుఁ గానరాదు కాని కఠోపనిషత్తునందు మృత్యు వనునాచార్యునిచేఁ జెప్పఁబడిన కొంత భాగముమాత్రము గానవచ్చుచున్నది. యమ నామముతోడను,యమీనామముతోడను, వైవస్వతనామముతోడను ఋక్సామాధర్వవేదములలో సూక్తములు, నామములు, కొన్ని కొన్ని కాన్పించుచున్నవి. ఋగ్వేదమున దశమమండ

లములో వైవస్వతయముఁ డనియు యమ ఋషి యనియు, నిరువురు మునులయొక్క సూక్తములు కానవచ్చుచున్నవి.

సామవేద ప్రథమపర్వమున 'మృత్యువాహో హితుఁ'డనునొక ఋషియుఁ గలఁడు. వైవస్వతీ నామముతో "యమి" యనునామె యొక్క తెకలదు. ఈ యమి యమునిజాయయో, సోదరి యో తెలియరాకున్నది. ఆమె పేరున ఋగ్వేద దశమమండలమునఁ గొన్ని సూక్తములు గలవు. పురాణములలో నున్న పేరు "యమున." ఆమె యే యమునానది యని ప్రసిద్ధము. యముని చేఁ స్మృతియుఁగలదు. అదియే "యమస్మృతి".

**మృదంగయతి** —ఇది సంగీతశాస్త్రసంబంధఁపు యతి. కవిత్వసంబంధము కాదు. (యతి ప్రాణము చూడుఁడు.)

**మెండెలిజమ్** ( Mendelism ) — ఆస్ట్రియా దేశఁపుటాచార్యులు(Priest)Gregor Mendel అనువారి సిద్ధాంతము. (క్రీ.శ. 1822-1884) ప్రకృతిపరిణామములను వృక్షజీవనములను నితఁడు పరిశోధించి, క్రీ. శ. 1865 సంవత్సరములో తనగ్రంథములను ప్రకటించెను. ఈతని గ్రంథము లిరువదియవ శతాబ్ది వఱకు నెక్కువ ప్రచారమునకు రాలేదు గాని, ప్రకృతకాలమునందుఁ బరిశోధకులు వీని సత్యమును గ్రహించిరి.

**మెంతాల్** (Menthol) — పెప్పర్ మెంట్ (Pepperment) యొక్క Crystalline రూపము. దీని పెప్పర్మింటు Camphor అనియు ననుచుందురుఁ. ఆంగ్లౌషధములందు వాడఁబడుచుండును. శరీరముపై నరాచినలోనికిఁ జొచ్చుకొనిపోవు శక్తి దీనియందుఁ గలదు.

**మెంతులచెట్లు**-లా. Prigonell Foenumbgraecum ఆంగ్ల. Fenugree seeds plant సం. దీపనీ, మిసిః, మిశ్రపుష్పా, మేధా, మేధిః, మేధినీ. (దీనినుండియే మెంతులనుపే రేర్పడి యుండనోవు).

మెంతిచెట్టు గింజలను మెంతు లందురు. ఇది భోజనపదార్థములయందు పరిమళమునకై కలుపుటచేత దీనికి విలువఁ గల్గియున్నది. మేహశాంతిఁగల్గించును. గ్రహణిరక్తగ్రహణుల నివారించును. ధాతువునకు బలముగల్గించి, కఫము హరించును. మెంతిపిండి నుడికించి పైనవేసి కట్టిన గడ్డలు త్వరగమెత్తబడి పగులును. విరిగిన ముల్లు త్వరితముగ సులభముగఁ బైకి తీయనగును. అధికముగఁ బుచ్చుకొనిన పైత్యవికారము, తలనొప్పి గల్గించును. మెంతికూర భోజనపదార్థమును పథ్యమునునై త్రిదోషములను మూలవ్యాధిని శమింపఁజేయును. మూత్రము వెడలించును. స్త్రీల ఋతురక్తమును వెడలఁ జేయును. దీనికివిఱుగుడులు పులుసును పుల్లదానిమ్మపండు నై యున్నవి.

అడవిమెంతు లధమపుజాతి. భోజనపదార్థముగ నెంచఁబడక గుఱ్ఱములకు వేయఁబడును.

**మెంతుల వ్యవసాయము**—మెంతులు భోజనపదార్థమని యాంధ్రదేశమున నెఱుంగనివా రుండరు. ఒండుగలభూములును నల్లరేగటిభూములును దీని కర్హములైన ప్రదేశములు. ఇసుకప్రదేశము లనర్హములు. దీనికి భూములను చక్కఁగా దున్నవలయును. కలుపు పుట్టకుండునట్లు దున్నవలయును. తొలకరి మొదలు చిత్తకార్తెలోపున నెన్మిదిసార్లు దున్న వలెను. ఎకరమునకుఁ గుంచెడు విత్తనములు చిత్తకార్తెయందుఁ జల్లిన, మూఁడు నెలలలో పంట సిద్ధమగును. ఎకరమునకు పదికుంచములు పంట పండెడిని.

ఇది యావాలవలెనే ప్రత్యేకముగ వేయఁ

దగినపంట కాని వేఱొకపంటతోఁ గల్పి వేయఁ దగినది కాదు.

**మెంఫిస్ పురము**- ఈజిప్టుదేశమునందు నైలునదీతీరమున కైరోనగరమునుండి ౧౪మైళ్ల దూరమునం దున్నది. ఇప్పుడు పాడగుచున్న తావు. ఇందు కొన్ని గొప్ప కట్టడములును రెండవ రామిస్సెస్ చక్రవర్తి విగ్రహమును చూడఁ దగినవి. అమెరికాయందు మిసిసిప్పీనదీతీరమున వేఱొక మెంఫిస్ పురము (రేవుపట్టణము)గలదు.

**మెక్లిన్బర్గు శ్వెరిన్ గ్రాండు డచ్చీ** ఐరోపాఖండమున జర్మను దేశములోని మైనరు స్టేట్సునకుఁ జెందిన గ్రాండు డచ్చీ. (జర్మను మైనరుస్టేట్సు, జర్మనుదేశము చూడుఁడు).

**మెక్సికోదేశప్రభుత్వము** (Mexico)- ఉత్తరమెరికా దక్షిణమెరికాలయందున్న ప్రజాప్రభుత్వ దేశము. ఏడులక్షల యిరువదివేల మూఁడువందల చ॥మైళ్ల వైశాల్య మనియు, కోటి నలుబదిమూఁడులక్షల పదివేలు జనసంఖ్య యనియుఁ జెప్పఁబడినది.

**మెక్సికో దేశము**—ఇది యుత్తరమెరికా ఖండమున సంయుక్తరాష్ట్రములకు దక్షిణదిశ యందున్న దేశము. ఉత్తరమున సంయుక్త రాష్ట్రములు, తూర్పున సంయుక్తరాష్ట్రములు, మెక్సికోసంయుక్తాగ్రగుడము,దక్షిణమున మధ్య యమెరికా, పశ్చిమమున ఫశిఫిక్మహాసముద్రమును నెల్లలు. దీనివైశాల్యము ౭,౬౭,౦౦౦ చతురఁపుమైళ్ళు. దేశమధ్యమున ౬౦౦౦ అడుగుల యెత్తుగల పీఠభూమి. ఇది యారోగ్యవంతము గను చల్లఁగను నుండును. ఇందు చుట్టును పర్వతములు గలవు. దక్షిణమున నగ్నిపర్వతములు గూడ నున్నవి. సముద్రతీరప్రాంతము లారోగ్యప్రదములై వేఁడిగ నుండును. 'Rio Grande del Norte' అను పేరుగల నది యొక్కటే చెప్పఁదగినది. అది ఈశాన్యదిశగా సరిహద్దున నున్నది.

మెక్సికోదేశమున వెండిగనులు పలుతావులందుఁ గలవు. జొన్నలు, మొక్కజొన్నలు విరివిగఁ బైరగుచున్నవి. అరఁటి కసవ యనఁబడు పండ్లతోఁటలు, కాఫీ, చెఱకుతోఁటలు, ప్రత్తిపంట వేఁడిభూములందు విస్తారము కలదు. పీఠభూమిపై శీతలప్రదేశమున గోధుమలు పైరుపెట్టఁ బడుచున్నవి. పశువుల నభివృద్ధిపఱచి పెంచుభారములు విస్తారముగఁ గలవు. 'మహాగనీ' చెట్లు, 'లాగ్వుడ్' అనుకఱ్ఱలు గల యడవులు విస్తారములు గలవు. వాటియందు 'Cochineal insect' అనంబడు నెఱ్ఱనిపురుగులు విస్తారముగఁ గలవు. వాటినిబట్టి యెఱ్ఱరంగు జేయుదురు.

అగేవుచెట్లను మళ్ళయందుఁ బెంచి వాటి (తియ్యని) రసముతో 'పుల్క్వ' యనఁబడు సారాయమును జేయుదురు. ఇప్పు డీదేశమున నివసించుచున్న ప్రజలలో మూఁడవవంతమెరికన్ ఇండియనుజాతుల సంతతివారై యున్నారు. ఆఱవవంతు తొల్లింటి స్పానియాదేశస్థుల సంతతి తెల్లజాతివారు. తక్కినవారు వేర్వేరు తెగలవా రీదేశనివాసులై యున్నారు. ఇందు స్పానియాజాతివా రెక్కువ పలుకుబడిఁ గలిగి యుందురు. ఈదేశపు టాదిమనివాసులు టోల్టీ జాతివారు. పిదప నేజిటిక్కలను వేఱొకజాతివా రీదేశమునకు వలసవచ్చిరఁట. వీరు రెండుతెగలవా రాదిమనివాసులు. మతవిషయమై యీ యిరుతెగలవారికిని కలహములుసంభవించి ఏజిటిక్కజాతివారే గెలిచిరఁట. వారి దైవమగు మెక్సిటీ యారాధనలు మెండుగ నీద్వీపమున జరుగ నారంభించెనఁట. అది చూచి యితర దేశస్థు లీ ద్వీపమునకు మెక్సిటీ యని పేరిడిరి...

రానురా నావదము హూఱుచు 'మెక్సికో' యై యున్నది. పిదప స్పానియా దేశస్థులు వీరిద్వారను లోబఱచుకొని యేలసాఁగిరి. (ఇది క్రీ. శ. ౧౫౨౧) కాని ప్రజలకు స్పానియాప్రభుత్వము నరిపడక తిరుగుబాటుజేసి క్రీ.శ. ౧౮౨౧ లో వారిని దరిమివైచి, స్వపరిపాలనము స్థాపించు కొనిరి. పిదప తొల్లింట దీనిలోనివగు టెక్సాసు, కాలిఫోర్నియా, న్యూమెక్సికో, ఊత్ స్టేటులు సంయుక్తరాష్ట్రములలో జేరిపోయెను. ఈ మార్పుచే మెక్సికో బలహీనమైపోయెను. తెల్ల వారికిని, నీగ్రోజాతివారికిని గల్గిన మిశ్రమ సంతతివారికి "Mulatto" లనియు, తెల్లవారి కిని ఇండియన్‌జాతులవారికిని గల్గిన మిశ్రమ సంతతివారికి "Mestizo" లనియు నిటఁ బుట్టిన యైరోపాజాతుల సంతతివారికి "Creoles" అనియు పేర్లుగల్గి యిచటిప్రజలలోఁ గానఁగు చుందురు. రోమ న్కాతలిక్కు మతస్థులు విరివి గాఁ గలరు.

ప్రధాననగర మగు మెక్సికో నగరము (3౭౯000) పీఠభూమియం దున్నది. ఇది బాగుగ నిర్మింపఁబడిన పురము. ఇది సముద్రపు మట్టముపై ౭౫౦౦ అడుగుల యెత్తున నున్నది. Puebla (88000) Guadalagara ఇతర పట్టణములు Vera Cruz అనునది రేవు పట్ట ణము. Campeachy ఒకచిన్న రేవుపట్టణము.

**మెగస్తనీసు**—(మగధరాజ్యము చూ.)

**మెగా స్కోపు** (Megascope)—చిన్న చిన్న చిత్తరువులను పెద్దవానినిగా నొక తెరపై ప్రదర్శింపఁ జేయుయంత్రము. మఱియు చిన్న ఫోటోలను పెద్దవిగా మార్చు "కెమెరా"కను వర్తించును

**మెరిడియన్ సిటీ ఉజ్జయినీనగరము**-ఉజ్జయినీనగరము చిరకాలము భరత దేశమునకంతకును మెరిడియన్ (Meridian City) నగరముగ నుండెనని యెల్లరెఱింగిన దే. ఇది భరతదేశమునకు, నింగ్లాండు దేశఁపు గ్రీనిచ్ పుర మాంగ్లసామ్రాజ్యమున ననుభవించుచున్న టుల, కాలవిజ్ఞాన గణితమునకు ప్రధానస్థానమై యుండియున్నది. ఇచటి జ్యోతిషాలయము నేటి కిని శంకువుగ (Zero) మూలస్థానమై పంచాం గముల ఘడియలు, విఘడియలు దెల్పు మాన ము నెఱుంగఁ జేయుటకు సూర్యోదయ మధ్యా హ్న (అపరాహ్ణ) సూర్యాస్తమయ కాలము లను వేర్వేరు సంవత్సరకాలములందు గుర్తించి లెక్కించుట కనుకూలించుచునే యున్నది. ఈ జ్యోతిషాలయమునందే సుప్రసిద్ధ భరతదేశపు జ్యోతిషశాస్త్రవేత్త యగు వరాహమిహిరుఁడు పరిశ్రమజేసి గొప్పపరిశీలనలు సల్పి, యా చంద్రార్కముగ నుండునటుల "బృహత్సం హిత" (గ్రంథము) ను రచించెను. దీనినుండి దూరములకు నీమహాపండితుఁడు శాస్త్రదృష్ట్యా కొలతలంగుదిర్చి వ్రాసినవ్రాఁతలు నేటికి నచ్చెరువు గొల్పుచుండుట సుప్రసిద్ధమే! ఇటీ వల కొన్నికొలతలు బయల్పడి యాయన జ్యోతిష పరిశీలనలను పేనోళ్ళ చాటుచున్నవి. ఈజ్యోతిషాలయము మధ్యయిండియాపురమున సిప్రా (కాళీగంగా) నదీతీరమున రామ్ఘాట్ దేవస్థానపరిసరముల నున్నది.

ఈ వరాహమిహిరుఁడు మాళవరాజ్యమేలిన సుప్రసిద్ధ విక్రమార్కమహారాజాస్థానవిద్వాం సులలో నవరత్నము లనిపించుకొనినవారలలో నొక్కఁడని యెఱుంగవలయును. ఆమహనీయుని గ్రంథమగు "బృహత్సంహిత" నేటికిని భరత దేశఁపు జ్యోతిష శాస్త్రమున నగ్రగణ్య ప్రమాణగ్రంథమై యలరారుచున్నది.

**మేంతోం ఆరోగ్యప్రదేశము** (Health resort)-దీని నాంగ్లేయులు "Mentone" అని

వాడుచున్నారు. ఐరోపాఖండమున ఫ్రాన్సు దేశమునం దాగ్నేయదిశ నిటలీదేశపుసరి హద్దున నున్నపురము. ఇందు పదునేను వేల జనులు వసించుచుందురు. ఈ పట్టణమునకు తూర్పుహద్దు ఇటలీదేశమని చెప్పవలెను. ఇచటికి నీస్ పట్టణము పశ్చిమముగా పదునేడుమైళ్లదూరముననుమాంటీకార్లో యామార్గమునందే యాలుమైళ్ళ దూరమునను గలవు. మాంటీకార్లో ఫ్రెంచిదేశమున సుప్రసిద్ధమగు Watering place గా నున్నది. మేంతోం పట్టణమునకు శీతకాలమున ఫ్రెంచిదేశస్థులే గాక ఆంగ్లేయులు, జర్మనులు, ఇటలీదేశస్థులు, ఈజిప్టుదేశస్థులు, ఆల్బేనియనులు, గ్రీకుదేశస్థులు, స్విట్జర్లాండు దేశస్థులు, స్వీడనుదేశస్థులు, హంగేరియనులు, నమెరికాదేశములవారును గాక భరతదేశస్థులుకూడ నారోగ్యమునకై పోవుచుండుట కలదు.

శీతకాలమునం దిచట సూర్యరశ్మి చక్కగ నుంటయు, గాలియందు తేమ (తడి) యుండక కడుసౌఖ్యకరమై యారోగ్యకరముగ నమరుటయు, నిది సమశీతోష్ణమగుటకుఁ దోడ్పడుటచే దీనిని ఆరోగ్యస్థలమని పేరందినది. ఐరోపా దేశములందు శీతకాలమునందు వీచుచు, ప్రజలకు బాధకరముగ నుండు శీతల ప్రచండ వాయువుల బాధయిచట లేదు.

ఏలయన నావాయువులు వీచుదెస నెత్తగు పర్వతము లడ్డగ నుంట వాటినుండి రక్షితమై సమశీతోష్ణత నోలలాడుచుంట వినోదకరమై యుండెడిని.

ఇచటి వాతావరణమున నాకలిగల్గించుగుణమును, బలహీనకృశశరీరములకుఁ దార్ఢ్యగల్గించి ప్రోత్సహించుశక్తియుఁ గలదు గాన స్త్రీపాంతములవారు దీనిని 'Pearl of Riviera' అని వాడుచుందురు. పరిసరము లన్నియు నిమ్మ, నారింజ తోఁటలమయముగ నున్నవి. ఆచెట్లీప్రాంతముల నధికకాలము జీవించునందురు. ఇట నన్ని కార్యస్థానములుండుటయే గాక ఇంటర్నేషనల్ క్లబ్బు కూడ కలదు. రెయిల్వే నడుపాయ మున్నది.

ఇచటి సముద్రతీరము చెఱువుంబోలి యల్లకల్లోలములేకయుండును. ఐరోపావారి కొక్కొకప్పుడు సూర్యరశ్మి వేఁడియు, గాలి చల్లదనమును రొంపలఁ గల్గించునందురు. రాత్రిపడినతోడనే గాలిలోఁ దిరుగుట యొకటిరెండుగంటలవఱకును మంచిదికా దందురు కాని యిట్టి రోగములు తఱచుగఁ గానవచ్చుటయే లేదు.

## మేక్(Mac)నామపు గురుతు —

ఇయ్యది స్కాట్లాండు, ఐర్లాండుదేశస్థుల పేరులం దెక్కువగఁ గన్పట్టుచుండెడిని. ఆంగ్లసీమవారి పేరులందలి Son అను గుఱుతువంటిదిగను, ఐర్లాండుసీమవారి పేరులందలి O' అను గుఱుతువంటిదిగను దనరెడిని. వీటికన్నిఁటికిని "సంతతివాఁ" డని యర్థమఁట.

## మేకింటాష్‌కోటు(రైనుకోటు,వర్షపుకోటు)—

పదునెన్మిదవ శతాబ్దాంతముననో, పందొమ్మిదవ శతాబ్దాదియందో, మేకింటాష్ (Mr. Mackintosh)అనునాయన రబ్బరుఁగరంగించి, దట్టమగు గుడ్డకోటుపై పులిమి, రబ్బరుకోటుగ నొనర్చి, వర్షమున తడియకుండ రక్షణముగా నుండఁ గనిపెట్టెనఁట. పిదప ననేక మార్పుల నభివృద్ధుల నందియు, రబ్బరుకోటు నేటికి నాయనపేరుననే బరఁగుచు 'Mackintosh' అనఁబడుచున్నది.

కాని, యిది చలినాఁపి, వెచ్చగ నుండఁజాలమి, మఱికొంద రింకొకవిధానమునఁ జేయ మొదలిడిరఁట. దళసరిగల యున్నిబట్ట (Wool

cloth)తో కోటుగుట్టించి, దాని లోపలిభాగమున కొక రసాయనముల ద్రావకమును (Chemical solution) పూసి, నీటి నెదుర్చున ట్లొనర్చుటతో చలిని కూడ నాపఁగల్గునట్లు చేయఁగల్గిరఁట. దీనిని రైన్ కోటు (Rain coat) అని పిలువసాగిరఁట.

ఇప్పు డీ రెండువిధములకోట్లును నాంగ్లదేశమున నాపేర్లతోనే నేఁటికి నుపయోగింపఁ బడుచున్నవి.

**మేగ్నిటిక్ పోల్సు** (Magnetic Poles)- ఇవి భూపటములందలి ధ్రువప్రదేశములుగ పొరపడరాదు. మేరినర్సు కంపసునందు ముల్లు చూపు దిశలప్రదేశములు. (భూమియందలివని భావము.) ముల్లుచూపుప్రదేశములను భూపటమునందుఁ బోల్చినవి యని భావము.

**మేగ్నిటిజమ్** (Magnetism)--మేగ్నిటును సూదంటురాయి యందురు. దానిని గూర్చియు, దానిశక్తులనుగూర్చియుఁ దెల్పెడి శాస్త్రము "మేగ్నిటిజ" మనఁబడును.

సూదంటురాతి కినుమును, నక్కును, నాకర్షించుశక్తి కలదు. ఈశక్తి సూదంటురాతికణికకు కడలం(కొనలం)దు మాత్రమే యుండును. కణికను విఱిచితిమేని విఱిగినముక్కలయొక్క కొనలం దీశక్తి గన్పించునుగాని, కణికయొక్క యితరభాగమునందుఁ గనుపించదు.

**మేగ్నిటిక్ నార్తు** (Magnetic north)- భూమియొక్క యుత్తర దక్షిణ ధ్రువములందు సూదంటురాతి యాకర్షణశక్తి కలదని పరిశీలనలవలన నిదివఱకే తేలినది. భూమి భూమధ్యరేఖనుండి యుభయధ్రువప్రదేశములకు కరుగుతఱి, నడుగడుగునకుఁ గ్రిందికి దిగిపోవుట సంభవించుకతన, కంపసు (దిక్కులంజూపు యంత్ర పరికరము) నందలి Compass needle ఉత్తరదక్షిణములఁ జూపుచో సించుక భేదము గల్గియుండు టని పెట్టఁబడినది. వీటికిఁగల భేదమునకు 'Magnetic Deviation' అనియు, అట్టి ధృవస్థానప్రదేశములకు "Magnetic Poles" అనియు, అట్టి భావరేఖకు "Magnetic భూమధ్యరేఖ" యనియు నాంగ్లవిద్వాంసులు పేరిడిరి.

ఇటీవల Magnetic deviations భేద పరిమాణములు గణింపఁబడినవనియు వినుచున్నారము. అవి భూమధ్యరేఖకడ సున్నగను నుత్తరదక్షిణధృవముల కరుగుకొలఁదిని నించుక భేదములఁ గల్గియు నుండెడివి. (అయస్కాంతశిల చూడుఁడు.)

**మెగ్నిసియమ్ లోహము** (Magnesium)— ఇది మెటలిక్ ఎలిమెంటుగా చెప్పఁబడినది. దీఁకి సింబల్ Mg. దీని Atomic weight 24.32 అనియు, Atomic number 12 అనియు, Specific gravity 1.75 అనియు చెప్పఁబడినది. తెల్లనిలోహము. దీనితీగనుగాని, రేకునుగాని, దీపమున కంటించిన తెల్లని వెలుఁగిచ్చుచు గాలి బూడిదగ నగును. దీనిని బహిరంగముగు వాతావరణముననే కాల్పనఁగాలును.

Megnesium carbonate మెగ్నసైట్ యందునను, మఱియు Calicum carbonate తో కలసి Dolomite గా నున్న దొరకెడిని.

Magnesium sulphate ను Epsom salts అనియు నందురు.

**మెగ్నిసియుము** — క్షారలవణములను నీటఁ గరఁగించి, బలముగు విద్యుత్ప్రవాహమునందు నెరపి, భేదించుటచే బయల్పడిన ధాతువులలో నొకటి. పరిశీలకుఁడు సర్ హంఫ్రీ డేవీ పండితుఁడు. (హంఫ్రీ డేవీ పరిశీలకుఁడు చూడుఁడు).

ఇది పోటాసియమునకన్నను సోడియము కన్నను చాల బలహీనమైన ధాతువు. అల్యూమినియమురంగుతో మెత్తగనుండును. దీనిని నిప్పుకంటించిన విద్యుద్దీపముంబోలి తేజోవంతమై కాలును. మెగ్నీసియముతీఁగ(కాల్చునది) గను, పచ్చమతాబాలలో పాలుగను, దీని నుపయోగించు చున్నారు.

**మెగ్నీషియా** — (Magnesia) దీనిని 'Oxide of magnesium' అనియు నందురు. దీనిగురుతు Mg.O. అనియై యున్నది. వర్తక వ్యాపారసంబంధమున "Magnesia alba" అను పేరఁ బరఁగుచున్న Carbonate నకు నిదేపేరు కొందరు వాడెదరు.

ఆక్సైడు తెల్లనిగుండగ నుండును. మందులలో వాడుదురఁట. ఫైరుబ్రిక్సుచేయుటయందుపయోగింతురఁట.

**మెజస్టి బిరుదములు**—ఈబిరుదమింగ్లాండుదేశమునం దనాదిగ భూపాలురబిరుదమై యుండెను. ఒకటవజేమ్సు భూపతినాఁడా దేశ ప్రభువులు అఫీషియలుగా వహింప నయ్యెను. ఇక్కాలమున "His most Gracious Magesty" అని వాడఁబడుచున్నది.

ఫ్రెంచి దేశపుభూపతు లున్ననాడు 'Most Christian and Catholic Magesty' అను బిరుదము వహించు చుండిరి. స్పానియా దేశపుప్రభుత్వమున 'His catholic Magesty' అని యుండెను. పోర్చుగలు దేశమున 'Most Faithful Magesty' అను బిరుదముండెడిదఁట. హంగేరీ దేశమునకు ప్రత్యేక భూపాలు రుండిననాడు వారికి 'Apostolic Magesty' అను బిరుదముండెడిదఁట.

**మెజ్మరిజమ్** (Mesmerism)—ఆస్ట్రియా దేశపు వైద్యుఁడు "Mesmer" అను వారిచే (1733-1815) కనిపెట్టఁబడినది. ఇది యొకమానసికశక్తి. ఈపద్ధతిచే కొన్ని వ్యాధులు గూడ కుదుర్పఁబడుచున్నవి. వైద్యుఁడు మనోబలముచే బాధితుని నిద్రిభూతునిజేసి, Nervous system బాగుచేసి ఆరోగ్యవంతునిగఁ జేయును. దీనిని కొందరు గారడివిద్యకు నుపయోగించుచున్నారు.

**మెజారిటీ**—పరిపాలన కర్తృకాలముగ నైరోపా దేశములందు సాధారణముగ బరువగు లోహకవచముధరించి స్వేచ్ఛగ దిరుగఁగలుగు శరీరబలము గలుగుటతో నని సిద్ధాంతముండెను. ఒకయాంగ్లభూపతి పదునేనువత్సరముల ప్పుడును, మరియొకనరపాలుఁడు పదినంవత్సరముల వయస్సునను సింహాసనమెక్కిరి.

ఎనిమిదవ హెన్రీ ప్రభువు (ట్యూడర్ కాలమున)తనకుమారుండగు ఆరవఎడ్వర్డు(ప్రభువు) నకు పదునెన్మిది వత్సరములు వయస్సు కల్గిన పిదప పరిపాలనార్హత (Majority) నియమించెను. నాటినుండియు నదియె యాచారమై పద్ధతిగ జరుగుచున్నది. గాన, పదునెన్మిదిలోపున (Minority) మైనారిటీ యనియును పిదప మెజారిటీ యనియును వాడెదరు. ఇది సాధారణముగ నందరిపద్ధతి యైయున్నది.

జమీందారీలకు మెజారిటీ యిరువదియొక్కసంవత్సరము.

**మెటబోలిజమ్**— జీవపదార్థమున సదా కల్గుచుండుమార్పులఁగూర్చివివరించుశాస్త్రము. అనఁగా ప్రతిశరీరమునఁగల Tissuesలు కల్గుచుండుట, నాశనమగుచుండుట మొదలగుధర్మములఁగూర్చి యనిభావము. ఇది Anabolism (అనఁగా Constructive metabolism) Katabolism (అనఁగా Destructive metabolism) అని యిరుతెరఁగులుగఁజెప్పఁబడినవి.

ఆరోగ్యము శరీరమున సరిగా నున్నవు డీరెండును సమముగ సేవనిచేయుచుండు ననియు, రోగపీడితుఁడై బలహీనతతో నుండుతరి "కట బోలీజ" మతిశయించి యుండుననియుఁ జెప్పఁబడినది. అనఁగా శరీరేంద్రియములు దేనికో యొక దానికి సహాయపడు స్థితియందుండు నని భావము.

**మెటలర్జీ** (Metallurgy)- గనులనుండి త్రవ్వి యెత్తఁబడిన లోహపురాళ్ళనుండి పరిశుభ్రమగు లోహపదార్థము నెట్లు వేఱుచేసి గైకొనవలయునో యావిధానములను వివరించు శాస్త్రము.

**మెటలింగ్ క్లాజ్** (Metalling clause)- వాణిజ్యసంబంధపరిభాషాపదము. మామూలుగ నగు అరుగుదలచిఱుగుదల(Wear & Tear) లవలన గలుగునష్టములకు Under writers ఉత్తరవాదులు కారని స్పష్టపఱచుచు వ్రాయఁబడిన (మెరైన్ ఇన్సూరెన్సుపోలిసీలోని)యొక Clause. (పేరా)

**మెటలైజింగ్ మెషీన్** (Metalizing Machine)— చిన్నచిన్న యినుపభాగములు త్రుప్పుబట్టకుండ పలుచని పైపూఁతబూసి కాపాడు విధానమునకు "మెటలైజింగ్" అని పేరు. అట్టిపైపూఁత తఱచుగా నల్యూమినియమ్ మొదలగులోహజాతులను కరఁగించి పలుచగా నుండునట్లు పూయుదురు. గంధకముచేఁగాని, గంధకాధృతమగు అగ్నిజలము (Hydrogen) చేఁగాని త్రుప్పుపట్టకుండ నుండు సామాన్య లోహ మల్యూమిన మొక్కటియే. ఇది ఆమోనియాసంబంధమగు నావిరికి గాని, కాపర్ సల్ఫేట్ (Copper Sulphate) సొల్యూషనులకుఁ గాని, సముద్రపునీటికిఁగాని సాధారణముగా లొంగదు. అల్యూమినమ్‌పొడి కావలసినంత సన్నముగాఁ జేయవచ్చును. ఇందులో ముతకగానుండుదానిని ప్రత్యేకముగా పోలిష్ (Polish) చేయుప్రక్రియ కుపయోగింతురు. కాని, అతిసునుపుగాఁజేయఁబడినది త్రుప్పుబట్టుచుండుటచే వాడుకలో దాని కంతప్రాముఖ్యత లేదు. 'పోలిషు లని' (Polishes) పిలువఁబడు సున్నితములయిన భస్మములు త్రుప్పుపట్టకుండ జాగ్రత్తచేయు విషయములందుపయోగింపఁ బడును. ఎందుకనఁగా పొడి యెంతసూక్ష్మముగా నుండిన నంత గాలి తగిలి త్రుప్పుబట్టఁజేయకుండ కాపాడుచుండును. ద్రవరూపముగానుండులోహమే పూఁతపూయుట కుపయోగింపఁబడుచుండుటచే పూత పట్టునట్లు చేయుటకై యుపయోగింపఁబడువస్తువు గూడ తగినస్థితిలో నుండవలయును.

**మెటల్లోగ్రఫీ** (Metallography) — 'మెటల్' అనఁగా లోహము, కంకర. లోహముచేతను, కంకరచేతను చేయుపనులకు సంబంధించినశాస్త్రమునకు 'మెటల్లోగ్రాఫీ' యనిపేరు.

**మెటిల్నీ ద్వీపము**—(పోస్ ద్వీపము చూడుఁడు.)

**మెటికెలు విఱుగుట** — వ్రేళ్ళయందొకవైపునకువంగు కలుపులకడ (Finger joints) వంగనివైపునకు కొంచెము వంచుచో నొక్కుదుమేని యచట చిన్నధ్వని చేయును. దీనిని "మెటిక విరిగిన" దని యనుకొందుము.

ఈకలుపులతావులను కణుపు లనియందురు. కొంచెముగ వెనుకకు నొక్కుతరి అలుసుకొను యెముకలు తమ యథాస్థానమునుండి కొంచెమతీతమై యెక్కువగ పైకెక్కి హఠాత్తుగ జాఱి తమ యథాస్థానమునఁ బడును. ఆజాఱుట పడుటయం దైనధ్వనియే మొదట తోలుగుండా పైకేతెంచి వాయువుం గదిపి, అలలం ద్రోసి,

మన కర్ణేంద్రియములకుఁ దాఁకి, మనకు వినఁబడి మనము మెటికవిరిగిన దనుకొందుము.

వాతము మొదలగు కొన్ని కారణములచేత వ్రేళ్ళకణుపులకడ రక్తస్రావము సరిగా నుండక వాచి నొప్పిచేసియుండుతరి, ఆనొప్పిచే మెటికెలువిరుగ వీలుపడకుండును. ఇంకను బెణకుట, దెబ్బతగులుట, శరీరమున రక్తము చెడి దేహము వెల్లఁబాఱి కణుపులు పటిమదప్పి నొప్పికల్గియుండుతరి మెటికెలు విరుగ వీలుగాకుండును.

**మెటీరియలిజమ్**-(అనాత్మవాదసిద్ధాంతము చూడుఁడు).

**మెటోనిక్ సైకిల్**- (చాంద్రపరిక్రమము చూడుఁడు.)

**మెటోనొమి** (Metonymy) — ఒక వస్తువును వర్ణించుటలో మఱియొకవస్తువును స్ఫురింపఁజేయుచుఁ జెప్పునట్టియు, అసలువస్తువు పేరు జెప్పకయే వర్ణనముచే నావస్తువును స్ఫురింపఁజేయునట్టియు విధానము.

ఉదా: కత్తికంటె కలమే బలము గలది. ఇచట కత్తియు, కలమును ప్రధానములు కావు. యోధుఁడు, మంత్రి ప్రధానములు.

**మెట్టతామరచెట్టు** (కృష్ణతామర)-లా. Hibiscus Mutabilis అనియు, Cassia alata. ఆంగ్ల. Ring worm Shrub సం. పద్మచారటీ, పద్మచారిణీ, పద్మనాడికా, లక్ష్మీశ్రేష్ఠా, స్థలకమలమ్, స్థలపద్మమ్.

తొలుత నిది యొక పచ్చపూవులఁబూచు జాతిగఁ దలంపఁబడుచు కృష్ణతామర యని కూడ వాడుకనామముఁగల్గియుండెఁగాని యిటీవల నిందు లెక్కలేనిరంగులపూవులను, మచ్చలనుగలపూవులను, పూచుజాతిభేదములెన్ని యో గలవని తేలినది. దీనిని గొందరు "సీమఅవిసి" యనియు నందురని తెలియుచున్నది.

మెట్టతామరఆకు కొయ్యల రసకషాయము త్రిదోషములను శమింపఁజేసి, శ్లేష్మమును వెడలించి, సుఖవ్యాధులను, తామర మొదలగు చర్మవ్యాధులను, విషజన్తువులవిషములను హరించుననియు, ఎండుఆకులకషాయము విరేచనములంగల్గించుననియు, దీనిపచ్చయాకులు గాని పూవులు గాని ఉప్పుతో నూరి పైనిరాచిన తామర, తీట, గజ్జి మొదలగు చర్మవ్యాధు లడఁగిపోవుననియుఁ జెప్పఁబడినది. ఆకులరసకషాయములు నోటిపూతను మాన్పునందురు.

**మెట్టనున్నా గోతిలోనున్నా ఏనుఁగు ఏనుఁగే!**—(ఆంధ్రలోకోక్తి.)

**మెట్రిక్ సిస్టమ్** (Metric system)- దీనిని "Connected decimal system of weights and measures based upon the metre" అని వివరించియున్నారు. రెండు గుర్తులకు నడుమనున్న దూరమున కీవిధానమున 'metre' అనియెదరు. దీనినుండి యూనిట్సు వేర్వేరుగా నేర్పరచియున్నారు. భారమునకు, చతురమునకు, ఘనము (Cubic)నకు వేర్వేరు యూనిట్లు కలవు.

మెట్రిక్కు-గురుతులు :—

Kilo = K; Hecto = H; Deca = D; Myria = M; (ఇరువదివేలని చెప్పఁబడినది.) Deci = d; Centi = c; Milli = m; Metre = m; Cubic = cc; Centimetre; Gram = g; Kilogram = kg; Litre = l; Hectolitre = Hl; Arc = a; Hactare = Ha; Stere = s; Tonne = t. Quintal = q.

వీట్ల సమానతలు (equivalents).

1a = 100. sq. m. 1sq. km = 100. H.A; 1t = 10. q = 100 kg; 1s = 1

cu.m = 1000000 c.c; 1a = 1; Mikron = 0.00000 1m; 1Mikrogram = 1.00000 1 g; mikrolitre = 0.000001 l.

Approximate English Equivalents.

1m = 39.37 inches (3 feet 3 inches).

1kg = 2.2046 lbs. పౌనులు.

1 Tonne = 0.9842 టన్నులు.

1 Km = 0.62138 మైళ్ళు లేక 5 ఫర్లాంగులు.

1 Sq. km = 0.3862 sq. miles లేక 247.17 ఎకరములు.

1 Ha = 2.471 ఎకరములు.

1 l = 0.2199 గాలనులు లేక $1\frac{3}{4}$ పింట్సు.

1 g = $15\frac{1}{2}$ గ్రెయిన్సు.

**మెట్రోనోమ్**— (Metronome) ఆంగ్ల సంగీతమున విరామము (Exact pace) లను దెల్పుయంత్రపరికరము.

**మెడగాస్కరు ద్వీపము** —(ఆఫ్రికా ఖండమునకుఁజెందినపం(డెండుద్వీపములు చూ)

**మెడీరా ద్వీపము** —(ఆఫ్రికాఖండము నకుఁజెందిన పండ్రెండుద్వీపములు చూడుఁడు.)

**మెడల్సు**-- (న్యూమిస్‌మేటిక్సు చూ.)

**మెడియన్**—(స్టాటిస్టిక్సు చూడుఁడు.)

**మెడిసిస్** (Medices)-(స్టాటిస్టిక్సు చూ)

**మెతుకులుజల్లితే కాకులు కరువా?** (ఆంధ్రలోకోక్తి).

**మెథడీజమ్ క్రైస్తవసిద్ధాంతము** -- క్రీ. వె.౧౮ శతాబ్దమునుండి తలచూపిన ఎలేంజిలికల్ పునరుద్భవము. "Religious communions'' అనియర్థమందురు. నిర్మాత John Wesley గారు వీరి వెస్లియన్‌సిద్ధాంతమును మెథడీస్టుచర్చితోఁ గల్పి 'మెథడీస్టుచర్చి' లేక "మెథడీజము''గా నేకముజేయ క్రీ. వె. ౧౯౩౩లో నొక శాసనము చేయఁబడి వ్యాపించినది.

**మెథేన్** (Methane)-దీని 'Methyl Hydride' అనియందురు. ఇది 'Marsh gas' న కీయఁబడిన 'Scientific name' అని చెప్పఁబడినది.

**మెథోడిజమ్** (Methodism)— మత విధుల సక్రమమార్గముల నాచరించువిధానము. ఆడంబరములులేకుండ మతమునందు సత్యముగ నమ్మకముతో నాచరించుటను బోధించును. John Wesley అనునాతఁడిగ్లండుదేశమున [క్రీ.శ. 1703-91] ఈతత్వమును ప్రతిపాదించి వృద్ధిజేసెను.

**మెయిపావత్‌శాఖ క్షత్రియులు** — (ప్రమారశాఖ క్షత్రియులు చూడుఁడు.)

**మెరకష్ దేశము** -ఇది యాదినామము. పిదప మాటి మొరాకో యని యైరోపా దేశస్థులచే వాడఁబడుచు నాఫ్రికాఖండమునందున్నది.

(మొరాకో దేశము చూడుఁడు. తంజీర్ ఆలీబాబా చూడుఁడు.)

**మెరపు మెఱుము**-(ఉఱుము చూ.)

**మెరినర్సుకంపస్** —(కంపాస్ చూ.)

**మెరీడియన్** (Meridians)- భూగోళ పటమునందలి నిలువుగీతలకు "Meridians'' అనిపేరు. ఒక్కొక్క-నిలువుగీత Meridian పైనుండు అన్నితావులందు నపరాహ్ణ మొకేతరి గల్గును. (డిగ్రీలు చూడుఁడు.)

**మెర్రీఏండ్రూ** (Merry Andrew)— హాస్యగాఁడనియర్థమిచ్చుఉక్తి.తొల్లింటFeast of Fools (in April) పండుగయం దొకప్పుడు Andrews అనుపేరుగల హాస్యవిద్యా విశారదుఁడు కడుపేరందియుండ నాతనిపేరు హాస్యవిద్య నేర్చినవారి కన్వర్థ మాయెను

**మెరుగుడుపురుగు-ప్రకాశము** — మెరుగుడుపురుగు (Glow worm) నందుఁ గలుగు వెలుతురునందు వేఁడి లేదని పరీక్ష వలనఁ గనిపెట్టఁబడినది. మఱియు నీశక్తి దాని వైరుల నది బాధించుట కుపయోగించునది కాదు. గాన రాత్రులయందు దానికి వెలుగు చూపుట కుపయోగించుపరికరము లేక శక్తి యని తోఁచెడిని.

తొల్లింటికాలమున నీవెలుఁగును ఫోస్ఫరస్ సంబంధ మని (Phosphorus cent) తలఁచుచుండిరి గాని, యిప్పటిపండితు లవి ఎక్సరే (X-Ray) సంబంధమగు తేజమని తలంచుచున్నారు. ఏలయన నీతేజ స్సనేకపదార్థముల ననేక జంతుశరీరములగుండా జొచ్చుకొనిపోయి కన్పింపఁజేయుట తెలియనగుచున్నది. మఱియు నీమెరుగుడుపురుగు పేడపురుగులజాతి'Beetle' యనియు, దీనివెలుఁగు దీనియూపిరితో సంబంధముగలిగియున్న దనియు, నింకను నన్నిటికన్న నెక్కువగా మానవులకు దురూహ్యమగు నట్టితేజస్సునందు వేఁడి లేదనియుఁ గనిపెట్టఁబడినది. జర్మనీదేశపండితు డొకఁడు మెరుగుడుపురుగులలో రమారమి యైదు వందలవఱకు భేదములు గలిగియుండునవి కలవని యనెను గాని యిది మనదేశస్థుల కగోచరము.

**మెరుపు**-ఆకసమున దట్టముగ మేఘములు గ్రమ్మి, చల్లనిగాలులు మేఘములను నీరుగ మార్చి వర్షముగురిపించు నదనున ఆ మేఘప్రాంతముల వాతావరణమంతయు విద్యుచ్ఛక్తిమయ మగును. ఇట్టితరి నావిద్యుచ్ఛక్తి (Electricity) యొక మార్గమున నడిపింపఁబడి భద్రపఱుపఁబడినది కాకుంట, తనయిచ్చవచ్చినటుల ప్రవాహముల (Currents)బర్విడఁజేయుచు సరక్షితమై యుండును. ప్రవాహము లొకటినొకటి యెదుర్కొనుటయందగ్ని జనించి మండ నారంభించును. దానినే'మెఱు'పందుము. ఆమెరుపు బంగరుతీఁగవలె వీలగునన్ని వంకరలతో నాకసమునఁ బర్విడుటఁ గాననగుచుండును. అది పర్విడుతరి వాయువునందుఁ గల్గించెడి 'వైబ్రేషన్' ధ్వనినే ఉఱు మనెదము. మొదట మెఱుపుఁజూచి,పిదప దానిధ్వనియగు నుఱుమును వినెదము. ధ్వనివాతావరణముల గుండా ప్రయాణముచేసి పర్విడుచు భూమికడకు జేరుట కొంచె మాలస్యమయ్యెడిని.

మెఱుపునుదీసి ఛాయాపటములను మనము పరిశీలింతుమేని, యాకసమున నాటంకములు లేని మార్గములవెంబడి నొకప్పుడు తిన్నగఁ దనగమనమునడపువిధి, లేక యనేకవంకరలుగ బర్విడుటఁ గాననగును. ఈవంకరలు వణకుచేతివాఁడు గీచిన గీతలకన్న నెక్కువ యనిపించును. దీనికి 'Forked lightning'అనెదరు.



ఈవిద్యుద్గమన మొకప్పుడొకపలుచని మేఘముచాటుగూఁడా పర్విడును. లేక దూరమున నాకసము వంగినట్లు కనిపించుతావున పర్విడినను మనము మెరుపును తిన్నఁగఁజూడఁజాలక దానిప్రకాశపువ్యాపకమును బంగారురంగుపఱచిన విస్తారపుప్రదేశముం బోలిన కొంతవిశేషమును జూతుము. దానికి 'షీట్‌లైట్‌నింగ్' (Sheet lightning) అనిపేరు.

ఇంకను వేఱొకప్పుడు విద్యుచ్ఛక్తిముద్దవలె జాఱి క్రిందఁబడును. దానిని పిడుగందుము. (Thunder Bolt) ఆ విద్యుత్పాతమునకు 'పిడు'గనియు, పడునట్టి విద్యుత్తును 'Ball lightning' అనియు వాడుదురు.

ధైర్యముచాలనివారలకు మెఱుపులు పిడుగులు భయంకరములై యుండును. పిడుగుపడిన నేవృక్షమైనను చచ్చును; ఏభవన మైనను పాడగును. హిందువులందు పిడుగుపడి చచ్చుట చేసిన మహాపాతకములఫలిత మని చెప్పఁబడినది. మనుష్యులు, జంతుజాలములు నంతటితోనే మృతినందును. కాని, యీఱుము మెఱుపులనుండి జగమున మనుష్యుల కమూల్యమగు నుపకారము జరుగుచున్నదని యిటీవల కనిపెట్టఁబడుచున్నది.

వాతావరణమున ఆక్సిజెను నైట్రిజెనులను గల్పి యొక Chemical compound గనై పశువులయొక్కయు చెట్లయొక్కయు నాహారార్థ ముపయోగించును. నైట్రోజెను, ఆక్సిజెనుతో కలియకుండ ని ట్లుపయోగకారి కాఁజాలదు. పిడుగీ ఆక్సిజెను నైట్రిజెనుల కూటమిం జేయుచుండునని కనిపెట్టఁబడినది.

భూమిపై Nitrifying Bacteria విస్తారము కలదు. అది నైట్రోజెను నభివృద్ధిపఱచి నిలుపుచుండ నీ Lightning flashes దాని నాక్సిజెనుతోఁగల్పుచుంటయే లేకున్న భూమిపై నాశన మధికముగ నడుచుచుండును. భూమిం జుట్టివ్యాపించు Lightning flashes నగటున గంటకు 3,60,000 అని పరిశీలకు లంచనా వైచుచున్నారు.

**మెర్క్యురీ గోళము (Mercury)**- ఇది 'Solar system' నకుఁ జెందిన యొక గోళము. సూర్యగోళమునుండి 37,000,000 మైళ్లదూరమున నాగోళమునుజుట్టి, 87 దినముల 23 గంటలలో తిరిగి వచ్చుచుండునది యనియు, భూమితోఁ బోల్చిచూచిన 1. 16 భాగముండుశరీరము గలదియనియుఁ జెప్పఁబడినది. ఐరోపా దేశముల Astronomy శాస్త్రవేత్తల కాదినుండి దీనింగూర్చి తెలియునని చెప్పఁబడినది. దీనిని శాస్త్రవేత్తలు 'Inferior planet' అనియెదరు. దుర్భిణీయంత్రముగుండా దీనిని బరిశీలించిన మనచంద్రునకు వలెనే వృద్ధిక్షీణతలు కలవని తెలియఁగలదు. దీని మార్గము సూర్యునకును భూమికిని నడుమనుండును. భూమి యెన్నడు వీటినడుమ కేగదని లెక్కింపఁబడినది. మెర్క్యురీ తనకు తానై గిరగిరఁ దిరుగునో తిరుగదో తెలియకున్నది. ఏలయన సూర్యునకిది కడుసమీపము గాన, నిందుండెనేని పాదరసము సైతము Boiling point నకుపైగా వేఁడిని గల్గియుండు ననియు, దీని ధృవములకడ (poles) ఉదకము లుడుకుచుండ వలసియుండు ననియుఁ దలంపఁబడుచున్నది.

(సోలార్ సిస్టమ్ చూడుఁడు. ఎస్ట్రొనొమీ చూడుఁడు).

**మెలనేసియా ద్వీపములు** — ఇవి యసంఖ్యాకములగు ద్వీపములుగను ద్వీపసముదాయములుగను పసిఫిక్మహాసముద్రమునం దున్నవి. ఇవి ఓసీనియాయందలి మలనేసియాద్వీ

పములు. ఆస్ట్రేలియాద్వీపమున కుత్తర ఈశాన్య పూర్వదిశలందు కడుదూరము వ్యాపించియున్నవి. నల్లనిరంగుగలప్రజ లీద్వీపవాసు లగుట పాశ్చాత్యు లిట్టినామ మిడిరఁట. ఇందున్యూగినియా ద్వీపము పెద్దది. అది ఆస్ట్రేలియాద్వీపమున కుత్తరదిశగా నున్నది. ఇది గాక న్యూఐర్లాండుద్వీపము లనియు, న్యూబ్రిటను ద్వీపములనియు, న్యూహెబ్రిడీసుద్వీపము లనియు, న్యూకెలడోనియా ద్వీపము లనియు, ఫిజీద్వీపములనియు పెక్కులు కలవు. అందు ఫిజీద్వీపవాసులు క్రైస్తవులైరని చెప్పఁబడినది. కాని, స్వదేశమతస్థు లధికసంఖ్యాకులు గలరు. సోలోమోన్ ద్వీపములు జర్మనువారివి.

౧. న్యూగినియాద్వీపము:-ఇదిచాల పెద్దది. దీనిని 'పాపువా'యనియు నందురు. దీనిదక్షిణభాగమున దీనికిని ఆస్ట్రేలియాకును నడుమ టోర్రీ జలసంధి కలదు. న్యూగినియా,భూమధ్యరేఖకు దక్షిణమున కడుసమీపముననే యుంట వేఁడిగలప్రదేశముగ నున్నది. 3,౧౦,౦౦౦ చ॥ మైళ్ళవైశాల్యము గలదని యంచనా వేయఁబడి యున్నది.

న్యూగినియామధ్యభాగము పర్వతమయము 'Bird of Paradise' అనుపక్షుల కీ న్యూగినియా స్వస్థానము. ద్వీపముయొక్క పశ్చిమభాగమున 'పాపువా' జాతివారును తూర్పుతీరమున 'మలయ'జాతివారును వసించుచున్నారు. పాపువాలు నీగ్రోతెగకుఁ జెందినవారఁట.

ఈ ద్వీపముయొక్క పశ్చిమభాగము డచ్చివారిది. ఆగ్నేయదిగ్భాగప్రదేశము బ్రిటీషువారిది. ఈశాన్యదిశ జర్మనీవారిదై యుండినది. పాపువా యనిన 'తుప్పతల' లేక 'ఉంగరములజు'త్తని యర్థమందురు. ఫ్లైనది యీద్వీపమున ప్రధానమగు నది. 'Port morisby' ఆంగ్లసీమయందలి రేవుపట్టణము.

ఫీజీద్వీపములు- ఇవి న్యూజీలండున కుత్తరదిశయందున్న ద్వీపసమూహము. అన్నియుఁ గలసి ౭౦౦౦ చ॥ మైళ్ళ వైశాల్యము గలవి. వాటి స్వదేశప్రభువునుండి క్రీ.శ. ౧౮౭౪ లో బ్రిటీషువారి వశమై, యిప్పు డాంగ్లసామ్రాజ్యమున క్రౌన్కాలనీగా నుండినవి. పంచదార, పోకచెక్కలు, నూనెలు మొదలగువాటివర్తకము విశేషముగఁ గలదు. న్యూకెలెడోనియా ఫ్రెంచివారి శిక్షానుభవస్థానముగ నున్నది. న్యూఐర్లాండు, న్యూబ్రిటన్, మరియు నా ప్రాంతపు కొన్నిచిన్నద్వీపములు జర్మనులపాలఁబడి 'బిస్మార్కు ఆర్కిపిలెగో' యని పేరందినవి. సోలమోన్ దీవులును వారివే. దక్షిణద్వీపములు బ్రిటీషువారికిఁ జెంది యున్నవి.

**మెలానిజమ్** (Melanism)— మనుష్యుల శరీరములయందును మొక్కలకును నల్లని మచ్చలు, పొడలు లేచువ్యాధి.

**మెలికాయఁచెట్టు తీఁగ** — (నులిదడ చెట్టు చూడుఁడు.)

**మెలోడ్రామా** (Melo drama)-జర్మను భాషయందు 'మెలోస్'అనిన 'పాట'యనియు, 'డ్రామా' యనిన 'నటన' యనియు నర్థములు. పాశ్చాత్యనాటకకలయందు సంగీతయుక్త నాటకములను 'మెలోడ్రామా' లని యందురు. ఇక్కాలమున సంగీతము నాటకముల కంగముగనే వాడఁబడుచున్నను, మెలోడ్రామాయందు నటన, సంభాషణ, కథాసందర్భ మంతయు గానయుక్తమై నడచునదియని యెఱుంగునది.

**మెసపొటేమియా దేశము**-(అల్జజీరా దేశము చూడుఁడు.)

**మెసయ్యా** (Messiah)—హిబ్రూభాషయందు "మెసయ్యా"యన "Anointed"

**మేఘనదము:-** దీనికి మేఘవాహననద మనియుఁ బేరు కలదు. గంగా, బ్రహ్మపుత్రా నదులు కలిసి ఆసామును వీడి సముద్రగామి యగువఱకు నీపేరం బరగును. దీని నిప్పుడు 'మెగ్నా' యనుచున్నారు.

## మేఘముచుట్టు తెల్లనియంచు

(Silvery edge around cloud):—మేఘముచుట్టునుండు అంచు పలుచనిది. మేఘము దట్టమై సూర్యరశ్మి వెలుతురు నాపఁగల్గుచుండును. అంచు పలుచనిదగుట దానిగుండా కొంతవెలుతురు నివ్వలకుఁ బోనిచ్చెడిని. అది తెల్లగనుండుటకుఁ గారణము, ఇట్లగుటయందు మేఘముయొక్క దట్టమైనభాగముతో దీనింబోల్చిన నది పలుచనిది గాన తెల్లనై గాననగుట యని గ్రహించవలసియుండును.

మన కెదురుగఁ గాకున్నను సూర్యుఁ డాకాశమున నెచ్చటనో ప్రకాశించుచునేయుండును గాన నెత్తగుమేఘములయంచులు పలుచగ నుండి, తెల్లనై యించుక వెలుతురు ధరించియుండుట గాననగుచుంట వింతగాదు. మేఘములకుఁ బైగా నేరోప్లేను మొదలగువాటినుండి చూచిన మేఘమంతయు వెలుతురునం దుండియే కన్పించుచుండును. అత్తటి దట్టమై మేఘము నల్లగనుంటఁ దెలియకుండెడిని.

## మేఘములను నమ్మి చెఱువుకట్టఁ దెగఁగొట్టుకుందురా?:-

(ఆంధ్రలోకోక్తి)

## మేఘములు-బరువు - గ్రావిటేషన్ ఫుల్

**ఫుల్**—ఆకాశమునం దెగురుచుండు మేఘములు చులకనవి గాననే గాలిలోనట్టు తేలుచున్నవని పెక్కండ్రు తలంపనగుచున్నది. నిజమున గొప్ప గొప్ప మేఘములు జలములేగాన టన్నులకొలఁది బరు వుండవలసియుండును కాని గ్రావిటేషన్ ఫుల్ (భూమియాకర్షణశక్తి) వలన నాకర్షింపఁబడి భూమిపైఁ బడి పోవకుండుటకుఁ గారణము అవి నిరంతరము చేయఁబడుచుండుట. అది నీటియావిరి. అవి పలుచగనుండునవి. సదా భూజలములయావిరి యాకాశమున కెగురుచుండియు, నాకాశఁపుసావకాశమున విడఁబాఱుచు వ్యాపించుచుఁ దిరుగ గాలివశమునఁ గూడుచు గాలిప్రవాహములబలమున వేఱొకదెసకుఁ గదలుచు, నల్లలాడుచుంటయేగాని వేఱుకాదు. అవి దట్టము (densety) చాలా తక్కువగుటచే నట్లగును. వాటికి శీతగాలి తగిలినచో నీరై డెన్సిటి యధికమై చినుకులరూపమున నేలఁ బడుట (వర్షించుట) భూమియొక్క యాకర్షణ (గ్రావిటేషన్) పనిగాక వేఱేమున్నది? అందుచేత మేఘములు గ్రావిటేషన్‌ఫుల్‌నకు లోఁబడవని చెప్ప వీలులేదు.

**మేఘరంజి:**—ఇది యుబ్బసఁపుదగ్గుజాతులలోనిది. నీటిమేఘము (వర్షముఁ గురియనిమేఘములు కావు) ఆకాశమునఁ గప్పియుండుతఱి బలమగు శ్వాసతోఁగూడిన యుబ్బసరోగముగఁ గల్గుచుండునది.

**మేఘలక్షణ పరీక్ష:-** కాలవిజ్ఞానశాస్త్రమున వివరింపఁబడిన పరీక్షలలో నొకటి. (కాలవిజ్ఞానశాస్త్రము చూడుఁడు)

రెట్టమతశాస్త్రమున మేఘములు ముఖ్యముగ నేర్పడి తెగలుగ విభజింపఁ బడినవి.

౧ పుష్కలావర్తకమేఘములు:— ఇవి యెక్కువగను, మిక్కిలి వింతగను వర్షించు మేఘము

లని చెప్పఁబడినవి. గొప్పవర్షములఁ గురిపించున వీమేఘములే.

౨ మధుమేఘములు:—ఇవి తేనెరంగుఁగల్గియుండు మేఘములు. పదునైదామడల పొడవువఱకు నుండుననియు, నాల్గుతూములవర్షముఁ గురియుననియుఁ జెప్పఁబడినది.

3 వాయు (మండల) మేఘములు:—ఇవి గోరోచనఁపురంగుఁగల్గియుండునవి. (ఇత్తడిరంగునగాననగుచుండునవి) ఇవి కన్పించుచుండిన వర్షము కురియదనియు, పండ్రెండామడల పొడవువఱకుండు ననియుఁ జెప్పఁబడినది. కొందఱు గాలి యెక్కువగాఁ బ్రకోపించి ప్రధానమై యుండుటచే స్వల్పవర్షముఁ గురిపించునని చెప్పియున్నారు.

౪ రాజమేఘములు:— నల్లని తెల్లని మబ్బునందు రాగివలెను, దాసానిపూవువలెను రంగులం గల్గిన మెఱుపులు గాంచఁగల్గిన నామబ్బునందు రాజమేఘములున్నవని యెఱుంగునది. మఱియు నీమేఘములు ముఖ్యముగ వింధ్యోత్తరదేశములందు గంగాతీరసీమల వర్షించునని చెప్పఁబడినది.

౫ బ్రాహ్మణజాతిమేఘములు:—ఇవి కమలముల వన్నెఁ గల్గియుండునని చెప్పఁబడినది.

౬ క్షత్రియజాతిమేఘములు:—ఇవి యెఱ్ఱనిరంగుఁ గల్గియుండునని చెప్పఁబడినది.

౭ శూద్రజాతిమేఘములు:—ఇవి నల్లనిరంగుఁ గల్గియుండునని చెప్పఁబడినది.

౮ నీలమేఘము:—ఇది ఇంద్రనీలముంబోలిన రంగుఁ గల్గియుండుననియు, నిప్పురంగు, మెఱుపులీమేఘములనుండి కల్గుననియు, నివి వింధ్యదక్షిణదేశముల గోదావరినది సముద్రగామి యగుదేశమున వర్షించుననియుఁ జెప్పఁబడినది.

ఈమేఘములు పెక్కునాకారములచేఁ దనరెడిని. మఱియు నివి గురియువర్షము లఖండవృష్టి యనియు, ఖండవృష్టి యనియు నిరుదెఱఁగులు. వర్షమును 'మానికె' అనియు, పదునారుమానికెలగునేని దాని నొక 'తూ' మనియు, నట్టివి నాల్గు తూములైన నొక 'ద్రోణ' మనియు నీశాస్త్రమునఁ గొలఁత చెప్పఁబడినది. కాని సేద్యజీవన మొనర్చువారు, ఎండచేఁ గాలి గట్టిపడినభూమిని నాగేటిచాలున దున్నుటకు వలయుపదునిడు వర్షమును దుక్కివర్షమనియు, మడిగట్లు నిండిన నీరు గలవర్షమును మడికట్టువర్షమనియు లెక్కింతురు. ఇంక నాంగ్లసీమలవారు వర్షము నంగుళములకొలతతో లెక్కింతురు.

౧ గర్భర్తువేళలందు మబ్బు మధువర్ణముఁ గల్గియుండినచో, నత్తఱి గ్రహవక్రములు లేకుండెనేని నాల్గుతూములవర్షముఁ గురియుననియు, గ్రహవక్రస్థితి యట్టితఱిఁ గల్గుటకు ఫలితముగ నది ఖండవృష్టిగ మాఱుననియు;

౨ నాల్గుదెసలయందు నాకసమున మబ్బుగల్గి యేనుఁగువలె రంగుఁగల్గి నల్లగానుండునేని చక్కఁగ వర్షించు ననియు;

3 నాల్గుదెసలం దాకాసమున వ్యాపించినమేఘములు మందగమనము గలవియై మృగములవలెను, ఏనుఁగులవలెను గాన్పించిన బాగుగ వర్షించుననియు;

౫ తళతళమని మెఱయుమెఱుపులు నుఱుములం గలిగి యాకాశమునఁ గ్రమ్ము తెల్లనిమబ్బు దేశమంతటను వర్షించు ననియు;

౫ మబ్బునందలిమేఘములు వింజామరములు, సరస్సులు, తటాకములు, మంచెలు, ఏనుఁగుల కుంభస్థలములు, మొసళ్లు, తెల్లనికొండలు, గోపురములు, తోటలు, వనములు, విమానములు, గొడుగులు, ఖడ్గములు, రాక్షసాకారములు, ఏనుఁగులు, గుఱ్ఱములు, సింహములు, ఎద్దులు, శంఖములు వలె యాకారములు గానఁగుచుంట గొప్పవర్ష హేతువనియు;

౬ కాకులు, నక్కలు, కోఁతులు, ఎలుఁగుబంట్లు, కుందేళ్లు, పడిపోయిన యిండ్లు, దగ్ధగ్రామములు, విఱిగిపోయిన మోడులవలె మేఘములు గాన్పించుట యల్పవృష్టిసూచకము లనియు;

౭ ఎరుపు, పసుపు రంగులుగలిసి (క్రొత్త గోరోజనఁపు) రంగుమేఘములు, ఇత్తడిరంగుమేఘములు, ఇఁగిలీకఁపురంగుమేఘములు, బూడిదరంగుమేఘములు అనావృష్టిసూచకములనియు;

౮ సూర్యాస్తమయ సూర్యోదయ కాలములయం దాకసమున, మేఘము లెఱ్ఱనై గన్పట్టుట వరసూచక మనియు;

౯ కొండలపై కి మేఘములు దిగినట్లు వ్రాలియుంటయు, మబ్బులో మెఱుపులు గన్పట్టుటయు, వాయవ్య, ఈశాన్య దిశలయందు మేఘముఁ గూడుటయు, పెద్దవర్షములకు సూచకము లనియు;

౧౦ సూర్యుఁడుండఁగాఁ దూర్పునఁ గాని, పశ్చిమమునఁగాని మబ్బుపట్టి మెఱయుటయు, మేఘములు బంగారురంగుఁ గల్గియుండుటయు, గొప్పవర్షములకు సూచకము లనియు;

౧౧ గొప్ప మఱ్ఱిచెట్టువలెఁ గన్పించుమేఘముపై బంగారుఛాయతోనున్న యింకొకమేఘము కాన్పించిన మిక్కుటముగజడివానలకు సూచకమనియు రెవిట్టఝ్జాని వచించియున్నాఁడు.

మఱియు నిరువదియేడునక్షత్రములందుఁ బదునెన్మిదివర్షనక్షత్రము లని రెట్టమతమునఁ జెప్పఁబడినవి.

౧ పునర్వసు—ఇం దిరువదిద్రోణముల వర్షము గురిసినఁ బైరులాప్రాంతమునఁ జక్కఁగఁ బండుననియు, వ్యాధులు, కలతలు గల్గియుండుననియు;

౨ పుష్యమియందుఁ బదునేడుద్రోణములు వర్షించినసుభిక్షమనియు, ప్రభువులకుఁ బీడయనియు;

౩ ఆశ్లేషయందుఁ బదమూడుద్రోణములు వర్షించినఁ బ్రజలు దుఃఖరహితులై మనుదు రనియు, పసిబాలు రభివృద్ధిఁ గాంతు రనియు;

౪ మఘయం దిరువదిద్రోణములు వర్షించిన నిర్భయులై మనుటయు, అతిథ్యభ్యాగతుల నాదరించువా రనియు;

౫ పుబ్బయం దిరువదియాఱు ద్రోణముల వర్షము గురిసిన జనులువినయముఁగల్గి వర్తింతురనియు;

౬ ఉత్తరయం దిరువదియైదు ద్రోణములు వర్షించిన ప్రభుత్వమును, ప్రభువులును, సుఖజీవన మొనర్తు రనియు;

౭ హస్తయందుఁ బదునారుద్రోణములు వర్షించిన ద్విజులు సౌఖ్యమున ధర్మపరులై వర్తింతు రనియు;

౮ చిత్తానక్షత్రమున నెక్కువగాలి కల్గిన భయావహ మనియు;

౯ స్వాతియందుఁ బది ద్రోణములు వర్షించినజనులు సుఖింతురనియు;

౧౦ విశాఖయందుఁ బదిద్రోణములు వర్షించిన ద్విజులు ధర్మతత్పరులై మనెద రనియు;

౧౧ అనూరాధయందుఁ బదునాల్గు ద్రోణములు వర్షించిన రాజ్యపరిపాలనసౌఖ్యము ప్రజలకు మోదావహమై యుండు ననియు;

౧౨ జ్యేష్ఠయందుఁబదునేడుద్రోణములువర్షించినఁ బంట లధికముగఁ బండుటయు, చోరభయ మధికమై యుంటయుఁ గల్గుననియు;

౧౩ మూలయందుఁ బదునాల్గుద్రోణములు వర్షించినఁ బ్రజాపీడనము, పరిపాలనయందొత్తి డియుఁ గల్గుననియు;

౧౪ పూర్వాషాఢయందుఁబదమూడుద్రోణములు వర్షించినఁ బైరులు చక్కఁగాఁ బండుననియు, తగ్గిన పైరులు పంట తగ్గు ననియు;

౧౫ ఉత్తరాషాఢయందుఁ బండ్రెండుద్రోణములు వర్షించిన వరిపైరు లెక్కుడుగను, వెల్లిపైరులు తక్కువగను ఫలించుననియు, చోరభయముఁ గల్గియుండు ననియు;

౧౬ శ్రవణమునఁ బదునాల్గుద్రోణములు వర్షించిన విప్రులకుఁ గీడనియు, క్షత్రియులకుఁ గలహపీడ యనియు;

౧౭ ధనిష్ఠయందుఁ బదునారుద్రోణములు వర్షించినఁ జెఱువులు మొదలగు జలాశయముల కపాయము వాటిలు ననియు;

౧౮ శతభిషమునఁ బదునాల్గుద్రోణములు వర్షించినఁ బశువులపాఁడి చక్కఁగ నుండుననియు, రెట్టవిజ్ఞాని వివరించి యున్నాఁడు.

## మేఘవాహనశాఖ క్షత్రియులు:-

(క్షత్రియకులము చూడుఁడు.)

**మెట్రిక్ విధానపుఁగొలత**-(metric system of measuring) 'మెట్రి' క్కనుపదము నకుఁ గొలఁతయని యర్థము. అది యావిధానమున 'Unit' గాఁ జెప్పఁబడినది. ఇది పొడవుకొలఁతగా నెఱుంగునది. ఒకమీటరు (meter) ఆంగ్లమానపు ముప్పదితొమ్మిదిపై మూడవవంతంగుళ ముకన్న నధికమైయుండును. గాన నొకగజముకన్నఁ బెద్దది. ఇంకను నొకమీటరునందు దశాంశకు 'Decimeter' అనియు, శతాంశకు 'centimeter' అనియు, సహస్రాంశకు 'milli meter' అనియు, లాటిన్భాషాపదములను సాంకేతిక నామములుగ నిడిరి. పెక్కండ్రు పరిశీలకు లెల్లదేశముల వారి కొలఁత లెక్క లీమెట్రిక్కుకొలతను పునాదిగఁగై కొనంబడినవే యని యనెదరు. ఇది చాలా సుళువైనకొలతగాఁజెప్పంబడుచున్నది. ప్రపంచమునం దంతటను రసాయనికపుఁగొలతలు, తూనికలు, దీనిపై నాధారపడినవే నఁట.

కాలమునకు యూనిట్ సెకండై (second) నటులను, పొడవునకు యూనిట్ మీటర్ (meter) అయినటులను పదార్థమునకు (mass) యూనిట్ విచారింతము. ఇట్టియెడల సర్వసాధారణముగ నధికడెన్సిటీకలయుదకమును గై కొనుచుందురు. అది జీరో (Zero) కుఁ బైఁగా నాల్గు డిగ్రీలకడ సెంటుగ్రేడు తెర్మామీటరునం దున్నప్పుడు, దానిని యూనిట్ గా రసాయనశాస్త్రవిదులు గైకొనుచున్నారు. దానిని "one cubic Centimeter of water at temperature of 40 (డిగ్రీల) C" అనెదరు. ఈ యూనిట్ నొక gramme అని వాడుచుందురు. దీనిని దశాంక శతాంశ సహస్రాంశలుగా విభజింప సుల

ముగా నుండును. ఇటుల నేర్పఱుపఁబడిన తెర్మో మీటరుగ (centigrade therimo meter నందు సున్నయగు జీరో ఏమియూ లేకుంటం దెల్పుచు, నీరు ఘనీభవించుతావుగఁ జెప్పఁబడి యున్నది. దానికిఁ బైనుండు నూరుడిగ్రీలదనుక నొకటికన్న నొకటి యుష్ణాధిక్యతం దెల్పుచు, కడకు నూరును నీ రుడుకుతావు (Boiling point) గఁ జెప్పఁబడియున్నది. ఈపద్ధతియే యెల్లదేశములందు రసాయనశాస్త్రవిదులు వాడుచున్నారు. ఇట్లే పెక్కు-కొలతలు దీనినే పునాదిగఁ గల్గినవిగఁ గాననయ్యె.

## మేడమ్ బ్లావట్స్కీ మహాత్మురాలు:-

ఈమె నిండుపేరు H. P. Blavatsky. రష్యా దేశఁపు రాకుటుంబమునకుఁ జెందినదఁట. దివ్య జ్ఞానసమాజమును స్థాపించినవారిలో నొకతె. (దివ్యజ్ఞానసమాజము—థియాసఫీ చూడుఁడు.)

ఈమహాత్మురాలి పూర్వోత్తరములు భరత దేశమున కంతగాఁ దెలియలేదు. అడయారునందుఁ గూడిన యొకమహాసభయందు Mrs Josephine Ransom అమ్మగా రుపన్యసించుచు నీక్రిందిసంగతుల నెఱుకపఱిచిరి.

ఆదికాలమున నొకప్పుడు రష్యాసామ్రాజ్య మును ఢోల్గొరొవ్కి- వంశనృపులు పాలించు చుంట చారిత్రక విద్యావిశారదు లెఱుంగనిది కాదు. ఆరాజవంశమునకు మూలపురుషుఁడు రూరిక్ప్రభుండు. ఈయన రణశూరుఁడును, పౌరుషశాలియు నగుట ప్రజలచే "రుస్" అని వాడఁబడుచు, అది యాకుటుంబబిరుదముగ నేర్ప డియెను. వారినుండియే వారి పాలితదేశము "రుష్యా" యని పేరందెనఁట. ఈరాజవంశమున సుప్రసిద్ధుండని చెప్పఁబడిన 'యారోస్లావ్' నరపతి గొప్పధీశాలియై క్రీ. శ. పదునొకండవ శతాబ్దఁపు ధర్మశాసనుఁడని (law giver) పేరందెను. ఈవంశముననే కడపటినృపాలుఁడు 'ఇవాన్-ది-టెరిబిల్' భూపతి. 'యారోస్లావ్' గారి సోదర పుత్రుఁడు Vseslav గొప్ప దైవజ్ఞుండగు భక్తుఁడు, దైవజ్ఞాని, మహాత్మ్యముల నందినవాఁ డని చెప్పఁబడినది.

ఢోల్గొరొకీవంశసంతతియందే జన్మించిన ఎలీనా పావ్లోవ్నా డోల్గొరౌకీరాకొమరిత మన బ్లావట్స్కీ-మహాత్మురాలి ముత్తవతల్లి. ఈమె రచించిన గ్రంథము లిరువదిసంపుటములు పెట్రోగ్రాడు నగరమందలి లెనిన్గ్రాడు విద్యాపీఠఁపుఁ బుస్తక భాండాగారమునఁ గలవు. తల్లిగారే గాక వీరి బంధుజాలమునఁ జేరందిన గొప్పవిద్యాధికు లనేకు లుండిరి. ఆమెతాతగారు 'కాకాశియా' సంస్థాన ముల గవర్నరుగా సారాటోఫ్ నగరమున అట నీకుటుంబమొకదుర్గమున నివసించి రఁట.

మహాత్మురా లనేకగ్రంథములను రచించి, పెక్కుపత్రికలను నడపెను. ఐరోపాదేశములం దుండుతఱి "secret Doctrine" అను మహా గ్రంథమును వ్రాసెను. అక్కాలముననే పెక్కండ్రు విద్యాధికులు, విదుషీమణు లీమెం జేరి శిష్యబృంద ముగ నేర్పడిరి. అందు సుప్రసిద్ధురాలగు డాక్టరు ఏనిబీసెంటమ్మగా రొకరు. బ్లావట్స్కీ- మహాత్మురాలు కొన్నిమాహాత్మ్యములను వారిశిష్యుల కగుపఱచిరని చెప్పఁబడిరి.

**మేడ్-బిల్:—** ఇంగ్లాండునందు పుట్టి ఇతరదేశములందు సొమ్ముచెల్లింపఁబడనున్న హుం డీల కీపేరు వాడుచున్నారు. ఇది వర్తకసంబంధ పారిభాషికపదము.

## మేతకరణము:-

(ఆంధ్రలోకోక్తి.)

**మేదరికులము:**-పార్వతిచేఁ బ్రార్థితుఁడై పరమేశ్వరుఁడు స్త్రీలకు భర్తలతో నెడబాటు గల్గకుండమికి చేటలనోము స్త్రీలొనర్పఁ దగునని తెల్పెనఁట. అదివఱ కాపరిశ్రమ భూమియం దెఱుఁగమింజేసి పాములను వెదురుచెట్లగ నేర్పఱచి వాటిపేళ్ళం జీరి, చేట లల్లుటకు విఘ్నేశ్వరుని, తనప్రమథగణమును, భూలోకమున కంపెనఁట. వారు కొంతకాల ముండుతఱి గంధర్వాంగనలం బరిణయమై, మహేంద్రాచలమున వసించుచు సంతానముఁ గనిరఁట. వారే మేదరికులస్థులకు మూలపురుషు లనియెదరు. ఈగాథఁ దెల్పుగ్రంథములు గానరాకున్నను వారియం దనుశ్రుతముగ వాడుక నందియున్నది.

అట్టి వీరిపూర్వులం దెల్పుటయందు మేదర చెన్నయ్యగారియొక్కయు, ఆయన మేనల్లుఁడగు దొడ్డయ్యగారి యొక్కయు, మేదరి కేతయ్యగారి యొక్కయు, మహాత్మ్యములు, కథనములు వీరి యందుఁ గలవు.

**మేదినీపంచకగోత్రము:**—

(అగస్త్యుఁడుపగణము చూడుఁడు)

**మేదినీపురము:**—

(మిడ్నాపూర్జిల్లా చూడుఁడు-బంగాళాదేశము చూడుఁడు.)

**మేధ (మహామేధ) లత:**— ఇంచుక భేదముతోఁ దెలియఁబడుట కష్టమగు నీతీవ యరుదై యున్నది. ఒకవేళ దొరికెనతఱి దీనివైద్య సంబంధఁపు విలువ మెండుగఁదలంపఁబడును. నేపాలదేశమునఁ గలదందురు. మనదేశమున దీనిదుంపలు (తెల్లతీగెవలెఁ గాననగుచు) అంగడులందు దొరకును.

సం దేవమణిః, శల్యదా, శల్యపర్ణికా, శల్యా, ఇంక మేదస్సారాయన మేధ యనియు, మేధాయన మహామేధకును పేర్లని తెలిసెడిని.

దీనిదుంపలనుండి తీసిన రసము చలువఁజేసి, త్రిదోషముల నడంచుననియు, కఫజ్వరము నడంచుననియు, తాపము, రక్తవాత రక్తపైత్యములు, క్షయల నివారించి శుక్లవృద్ధి నిచ్చుననియుఁ జెప్పఁబడినది.

**మేధస్సు(క్రొవ్వు):**—మేధోరోగమనిన శరీరముననున్న క్రొవ్వుయొక్క అసామ్యస్థితికి సంబంధించినరోగము.

**మేధస్సు - పరిమాణము - పరిణామము:**— ప్రపంచమునం దెక్కువబుద్ధిశాలు రగు జాతులవారిమేధస్సు లెత్తుగను పెద్దవిగనుండు ననియు, బుద్ధిలేనివారిమేధస్సులు చిన్నవిగా నుండు ననియు, సర్వసాధారణముగ నెల్లరుఁ దలంచుచుందురు. ఇది కొంతవఱకు నిజమే యగుఁగాక. మేధస్సు (Brain) నందు పొరలును, కాళీస్థలములును గల్గియుండును. అవి లెక్కలేనివిధములుగనుండెడిని. ఒకజాతి ఒకతెగవారియందే పలుభేదములు గల్గియుండెడిని. వీటిలోఁ బ్రధానము Nerve cells గల Grey layer. అది యుపరిభాగమందే యుండును. ఇట్టి grey పదార్థ మధికమైనతఱి ముడలంబడునం దధికముగఁ గ్రేపదార్థము ముండెడిని. అది యింకను వేర్వేరుమనుష్యులయందు వేర్వేరుమొత్తములుగా నుండెడిని. మేధస్సు. గూర్చి తెలియవలెనని నిజ మాగ్రిమెటీరియల్ స్థితియు, తత్సంబధమగు నాళములు సెల్సు (Nerve cells) యొక్క స్థితియుఁ, బరిశీలించ వలసియుండును. ధీశాలురకు, బుద్ధిహీనులకు నిందే భేదముండుట. ఇంక జాగ్రతగాఁ బరిశీలించిన నొక

నెర్వ్‌సెల్, వేరొక నెర్వ్‌సెల్‌నుబోలి యుండదని పండితు లనుచున్నారు.

**మేధాజననము;-** ఇది యుపనయనము లందుఁ గడదినమున నడచుక్రియ.

**మేధానిధి;-** ఋషి కుమారునిపేరు చిరకారి (చూడుఁడు)

**మేధావి;-** పాండవసంతతిక్షత్రియుఁడు. తండ్రి సునయుఁడుపి. తామహుఁడు పరిప్లవుఁడు. పుత్రుఁడు నృపంజయుఁడు.

**మేధావితీర్థము:-** బుందేలఖండమునందున్న కాలాంజరమునఁగల స్నానతీర్థమునకుఁ బేరు.

**మేధావిభట్టు:-** ఈయన తిట్టుకవి యనుటకన్న నధిక మేమియు సరిగాఁ దెలియరాకున్నది. ఈయన వేములవాడ భీమకవికిఁ బూర్వకాలమందుండిన వాఁడని తోఁచెడిని.

**మేన:—** పితరులకు స్వధీయందుఁ గల్గిన కుమార్తె. ఈమె చెల్లెలు వైతరణి (సోదరి.)

**మేనగోత్రము:—**
(వీతహవ్య లేక యాస్కగణము చూడుఁడు.)

**మేనందేరు:—**
(ఉపనివేశదేశము చూడుఁడు)

**మేన్ అండు బ్రదర్** Am I not a man and a brother?:— మనుష్యులను బానిసలుగ విక్రయించు దురాచారమును మాన్పించుటకు లోకమునఁ బెక్కండ్రుదేశస్థులు వేర్వేరుప్రయత్నము లొనర్చిరి. అందొకటి లండను నగరమున 'anti slavery society' అని యొకసంఘము కలదు. దానిచిహ్నముగ నొక నీగ్రోజాతిమానవుఁ డొకమోఁకాలు నేల కాని, రెండవది నిలువంబెట్టి యానుకొని (మోఁకాలించి) రెండుచేతులంబైకెత్తి ప్రాధేయపడుచున్నటుల నుండువిగ్రహమును. దానితో 'am I not a man and brother (నేను మానవుఁడను మీ బోటివాఁడను కానా?' అని భావము) అను మాటలును గైకొనియున్నారు. ఇట్టి యొక లోహఁపుబిళ్ళను (medallion) నొకదానిని 'wedgewood' అనుశిల్పి తొల్లి క్రీ.వె. ౧౭౬౮ సంవత్సరమున రచించియుండె నఁట. తర్వాత నీయుక్తి మానవసంఘమునకు ఘోరాపరాధమగు కార్యము లొనర్చువారిని నిరసించుటకు వాడఁ బడుచుఁ బ్రసంగముల నందియుండిన ఉక్తి.

**మేన్-ఆఫ్-స్ట్రా** Man of straw:— నిరర్థకుఁడు లేక నిష్ప్రయోజకుఁడు లేక పలుకుబడి లేనివాఁడని తెలుపుట కీఉక్తి యిక్కాలమున వాడఁబడుచున్నది. మొదట దీనియర్థము వేరుగ నుండునది. ఆదియందు మృగములు, పక్షులు మొదలగు (చేలకు బాధఁ గల్గించు) వాట్లను వెఱపించుటకుఁ బంటలకాలమునఁ జేలకడ కట్టెడుగడ్డి బొమ్మ (Scar crow)ల కీపేరు ప్రారంభమై, తరువాత గ్రీసులోని న్యాయస్థానఁపు. గచ్చేరీలకడ డబ్బునకై తామెఱుంగనిసంగతులనైనను సాక్ష్యము పలుకఁ గాచుకొని యుండు సాక్షిబృందమున (వారిక్కాలమున తొడుగుకొనుచుండెడి గడ్డి (కాలి) జోడులనుండి వారి) కన్వయింప నయ్యెను. పిదప నప్రయోజకున కిక్కాలమున వాడుచున్నారు.

**మేనిఫెస్టు:—** వాణిజ్యసంబంధమున నిది యొకరేవున దిగఁదగిన బంగీలు, బస్తాలు మొదలగు నోడపైని సామానుల తపీలు పట్టిక.

**మే (May) మాసము - అమంగళకరము:—** పూర్వకాలమున రోమనుప్రాబల్యదిన

ములలో నప్పటి వారిదేవతలలో నొకదేవతయగు 'మేయో' యనుదేవతపేరున మేనెలయేర్పఱుపఁబడి పేరిడఁబడినది. మేనెలయం దాదేవతను పూజించుచుండిరి.

ఇంకను మేనెలయందే (చనిపోయిన) వారి (రోమనుల) పితృదేవతల నారాధించువారు. అది పితృలర్చన కర్తవ్యమైన పవిత్రమాసము గాన నానెల యందు శుభకార్యము లమంగళప్రదము లగుట యేగాక, ఇతరవినోదములు, నుత్సవములు, మేయోదేవత కాగ్రహాకరములుగ నెంచఁబడుచుండెను గాన మేనెలయందు వివాహాదిశుభకార్యములు జరుప వీలు లేకుండెను.

రోమనుమహాప్రభావ మైరోపాదేశములందంతట నధికారముఁ గల్గియుండినచోట నీయాచారమెల్ల దేశములవారిచే నైరోపాఖండమునగౌరవింపఁబడుచు నాచారమై, విధియై, పద్ధతికూడ నయ్యెను.

కాలములు మాఱి క్రైస్తవమయమైనను నాయాచారమునిలిచియున్నది. క్రైస్తవదేశములందు మేమాస మమంగళకరమని విసర్జింతురు. భరత దేశమందు క్రైస్తవమత మవలంబించినవారును దానినే పాటించుచున్నారు.

**మాయాందేరునది**;-ఇది పప్యామైనరునందున్నది. ఆర్కిపిలెగోసముద్రమునం గలియును. (పప్యామైనరు చూడుఁడు.)

**మేరీచతుష్టయము**:- వీరు నల్వురు. Queen marry of Scots రాజ్ఞిగారి కడ Ladies-in-waiting పదవియం దామెగారికిఁ జెలికత్తెలుగా నుండిరని చెప్పఁబడినది. వీరినిగూర్చి యాంగ్లమున నొకచక్కని పీఠిపాట కలదు. వారి పేరులు marry Beaton, Marry Livingston, Marry Seaton, Mary Fleming. అందఱును రాజ్ఞిగారివయస్సే గల్గినవారఁట. వారివంటి రూపములనే గల్గియుండినవారఁట.

**మేరీదేవి**:— హిబ్రూభాషయందు 'మిరియమ్' అనుపదము క్రీస్తుప్రభునితల్లి. కైస్తవులు 'Saint' అనియు, 'Blessed Virgin mary' యనియు ఫ్రెంచివారు 'our Lady' (Notre Dame) అనియు వాడుచున్నారు. ఈమెభర్త పాలస్తినాదేశమున 'నాజరేత్' అను యూరచెక్కడఁపుఁబనివాఁడుగ నుండిన 'జోసెఫ్' అను పేరుగలవాఁడు. పరిశుద్ధాత్మప్రభావముగ నీమె కుమారునిగ క్రీస్తుప్రభువునిఁ గనెనని క్రైస్తవులనెదరు. జరూసలెమున మృతినందె ననియు, ఆమెసమాధి ఖాళీగానుంటఁ గనుగొనఁబడెననియు కైస్తవులు చెప్పుచుందురు.

**మేర్సు నెస్టు (Mares nest)**:— ఇది 'Mara' యనుపదమునుండి కల్గినది. మేరా యనునది గొప్పపిశాచ మనియు, నిది రాత్రులందుఁ బ్రజలను బట్టి వేధించుచు నమూల్యరత్నములు విశేషముగ బంగారము మొదలగువాట్లఁ జేర్చుకొని తనగూఁటి (nesh) యం దుంచుకొనుననియు నైరోపాదేశములవారి కొకనమ్మక ముండెడిదఁట.

దీనినుండియే 'Night Mure' అనుభయంకరమగు రాత్రిపిశాచమును గూర్చిన ప్రతీతి కల్గెనఁట. ఎవ్వరేని నొకసంగతిని గనుఁగొనినట్లు వాడుకఁగల్గించి, కడకది విలువలేనిదిగఁ దేలినచో దానిని mare nestను కన్గొనుట యని హేళనగ ననియెదరు.

**•మేలకర్తారాగములు**;- (ఉపాంగరాగములు చూడుఁడు. సంగీతము చూడుఁడు)

**మేలంపస్(melampus):-** తొల్లింటిగ్రీకుల పురాణచరిత్రాత్మకపురుషుఁడు. ఈయన మనుష్యులందు మొదటిమతబోధకుఁడు, గొప్ప వైద్య శాస్త్రవేత్త, మృగపక్ష్యాదుల భాషాజ్ఞానము కలవాఁడు, దేవతాసంబంధవిజ్ఞానియై వారితో ననుబంధముఁ గల్గియుండినవాఁడు. ఒకప్పుడుప్రభుత్వముఁజేసినవాఁడనియు నీయననుగూర్చి చెప్పఁబడినది.

**మేలుకోట:** దీనిని "తిరునారాయణపుర" మనియు ననుట కలదు. మైసూరురాజ్యమున ఫ్రెంచిరాక్సనంబడుస్టేషనునుండి పదునెన్మిది మైళ్ళు.

మేలుకోట రామానుజజగద్దేశికుని నివాసస్థానమై యుండెను. ఇట విష్ణుదేవస్థానములు పెక్కులు గలవు. అందు, చల్లపిల్లరాయస్వామిదేవస్థానము సుప్రసిద్ధము. ధనవంతము. ఇది రామానుజీయ శ్రీవైష్ణవులకుఁ బవిత్రవంతమగు స్థలము. ఇట నొకగొప్ప సరస్సు కలదు. దాని తొల్లింటిపేరు తెలియదు గాని, నాజర్‌జం గనంబడినయుద్యోగి దీనికి 'మోతీతలాబ్' అని పేరిడెనఁట. ఇటకుఁ గొంతదూరమున 'తెన్నూ' రను గ్రామము కలదు. అది దోరసముద్రము (తొల్లింటి ద్వారసముద్రము) నుండి హోయిసలవంశఁపు రాజులు తరిమివేయఁబడినపిదప వారిరాజధానిగ నుండినతావు.

**మేవాడ్‌చిత్తూరు (చిత్తూరుఘడ్):-** దీనిని 'చిత్తూర్ ఘడ్' యనుటయుఁ గలదు. రాజపుత్రస్థానములోని ఉదయపూర్ సంస్థానములోనిది ఉదయపూర్ ఉదయసింగు మహారాజునాడు తన పేరున పిఛోలాసరస్తీరమున నిర్మించుకొనినది. ఆ నగర మిప్పుడు రాజధానియై యున్నది. దానినుండియే ఉదయపూర్ సంస్థానరాజ్యమను పేర నిక్కాలమునఁ బరఁగుచున్నది. అంతకుఁబూర్వమీరాజ్యమునకు 'మేవాడ్' రాజ్య మనియుండెను. అక్కాలఁపురాజధాని 'చిత్తూర్‌ఘడ్'. ఈసందర్భముననే జోడ్పూర్ (యోధపుర) సంస్థానరాజ్యఁపుఁదొల్లింటిపేరు 'మార్వాడ్' రాజ్యమనియు, అజ్మీర్ (తొల్లింటి అజయమేరు) మేర్వాడారాజ్యమనియు, నామములభేదము మనసునం దుంచుకొనవలయును. ఇంక ప్రస్తుతాంశమగు మేవాడ్ రాజ్యమునేలుప్రభువులకు 'మహారాణా' యని బిరుదనామము కలదు. మహారాజబిరుదము బ్రిటీషుప్రభుత్వమువారినాటినుండి వచ్చినది. ఈప్రభుసంతతి సూర్యవంశక్షత్రియులు, సుప్రసిద్ధపౌరుషవంతులు, శూరులు, మానవంతులు నగు శిశోదియాశాఖవారు. స్త్రీపురుషులుగూడ నొకేవిధమున రణవీరు లనియు, మానవంతులగు శూరులనియుఁ బేరందినవారు.

ఇట్టి యానాటి చిత్తూరునగరము మూఁడుశతాబ్దముల కాలములలో మూఁడుమహమ్మదీయముట్టడులపాలఁ బడియె. మొదటిముట్టడి:- కుంభమహారాణీపరిపాలనకాలమున మాండూ ప్రభుండగు మహమ్మదుకిల్జీ వలన నీతఁ డోడిపోయి కుంభమహారాణాను బందీయై చిత్తూరునఁ గొంతకాలముంచఁబడి, యనంతర మాయనయనుగ్రహమునఁ దిరిగి తనమండూరాజ్యమును గైకొనియెను. రెండవది:— అల్లాఉద్దీన్ ముట్టడి. ఇది భీమసింగుమహారాణాకాలమున. మూఁడవది యామహారాణాకాలముననే యగ్బరుచక్రవర్తియొనర్చినది. ఈఘోరసంగరమున భీమసింగుమహారాణా నిహతుఁడై వీరస్వర్గమునంద, రాజ్ఞి పద్మినీదేవియు సపరివారసమేతముగ రాజపుత్రవీరులభార్యలతోఁ దమ యాభరణముల నెదురగువారికి విసరియిచ్చివైచి పూలంజల్లుచుఁ జితిని మండించి యందు దుమికి

వీరస్వర్గమునఁదమభర్తలం గలసికొనిరి గాని, శత్రువులకు లోఁబడి, యోడి వంచనబ్రతుకు నిచ్చగింపరైరి. ఈకథ సుప్రసిద్ధమే గానఁ దిరుగ వివరింప నక్కఱలేదు. జీవింపనిచ్ఛగింపని రాజపుత్రవీరులలో మిగిలినవారు స్నానతర్పణము లొనర్చి విరాగ చిహ్నమగు పసుపుఁబచ్చరంగుబట్టలం గట్టుకొని కోటద్వారములఁ దెఱచి సంగరముఁ జొచ్చి, యుద్ధమునఁ జచ్చి వీరస్వర్గమున కరిగిరి. ఇప్పు డా చిత్తూ రించుమించు నిర్జనప్రదేశముగ నొకకొండ పైభాగమునం దున్నది. పట్టణఁపుఁబొడులం దెల్ల నసంఖ్యాకములుగ నెమళ్ళు నివసించుచు, వృద్ధి నందుచు నెటఁగన్న నటఁ గాననగుచున్నవి.

చిత్తూరుపురము రాజధానిగ రాజ్యమేలిన మహారాణాలలో, కుంభమహారాణా గొప్పవాఁడని, యీరాజకుటుంబచరిత్రనుండి తేలుచున్నది. ఈయన ముప్పదియైదుసంవత్సరము లజేయుఁడై రాజ్యమేలినవాఁడు. సకలవిద్యాపారంగతుండనియు, ధర్మశాస్త్రనిధియనియు, వేదాంతశాస్త్రవిదుండనియు, గాన, నాట్యాభినయశాస్త్రకోవిదుం డనియు, గణితశాస్త్రవిశారదుండనియు, గృహకట్టణ శిల్పనిర్మాణకలాప్రవీణుం డనియు, చిత్రలేఖనా చతురుండనియు, బహుభాషాప్రవీణుం డనియు, రణశూరుండనియు, బహుపండితపోషకుండనియుఁ జెప్పఁబడినవాఁడు. ఈయన జైన (అర్హత) మతాభిమాని యనియు, వదంతులు కలవు. మఱియు నీమహాపురుషుఁడు నిర్మించినకట్టడములు చిత్తూరు నందే గాక తనపేరట నిర్మింపఁజేసిన కుంభల్ఘడ్ పురమునను, ఆర్బుద (ఇప్పటి ఆబు) పర్వతోపరి భాగప్రదేశమునను పేరందినవి కలవు.

ఈయన మహమ్మదుకిల్జీ నోడించి బందెగాఁ గొనిన జ్ఞాపకచిహ్నముగాఁ జిత్తూరునందు జయ స్తంభమును నిర్మించెను. ఇది తొమ్మిదియంతస్థులు కలది. లోపల చిత్రములు చెక్కఁబడి వింతఁగొల్పెడిని. దీనికడకెక్కుటకు ౧౫౭ సోపానములు కట్టఁబడినవి. పైనుండి చూచిన పురమంతయునే గాక పరిసరము లద్భుతముగాఁ గానవచ్చెడిని. ఇది క్రీ. వె. ౧౪౩౭ నిర్మాణమని చెప్పఁబడినది. ఇంతటివాఁడయ్యు వార్ధక్యదశ యందుఁ గ్రూరుఁడగు సుతునిచే నిహతుఁడాయె నని వదంతులు కలవు. చిత్తూరు పాడైయున్నను నాటిరాజభవనములు మొదలగునవి పాడుపడి, పడుచు, పడనున్నను, అసంఖ్యాకులగు యాత్రిక జనులచేఁ జూడఁ బడుచున్నవి. మహారాణాల నివాసభవనము 'పట్టామహాల్' అను పేరఁబరఁగెడిని. అది పైకప్పులంగోల్పోయి దీనావస్థయం దున్నను తుడుచుచు శుభ్రపఱచుచుందురు. దాని యావరణముననే శృంగారచౌరీదేవస్థానము కలదు. పురమున నొకయెత్తగుతావున 'కీర్తిస్తంభ' మని వేఱొకటి కలదు. దానిని జైనకట్టడ మందురు. ఇది పురమం దెల్లెడలఁ గన్పించునటుల నిర్మింపఁ బడినది. దీనిచరిత్ర సరిగాఁ దెలియరాదు.

ప్రభునివాసముగ నుండిన 'పట్టామహాల్', గోముఖసరస్సను పేరుగల యొకసరస్తీరమున నెత్తగుతావున నిర్మింపఁబడినది. ఆప్రక్కనే యువరాజనివాసభవనము కలదు. అదియు పాడై యున్నది. ఈసరస్సు పురిముంజుట్టి నిర్మింపఁబడిన దుర్గములోనే అగాధజలములతో నిండియుండును. ఒకజలధార యాకొండయందే పుట్టి, ప్రవహించుచు, నీసరస్సునందుఁజేరుచుంటంజేసి సదా క్రొత్తనీరు పడుచు, నిల్వనీ రవ్వలికి వేరొకకొన నుండి జాఱి కొండదిగువ నొకమూల యిఱుకున వందలకొలఁది యడుగుల క్రిందికి జలపాతముగ వర్షఁపుఁదుంపురులం బోలి యొకచిన్నమంటపము దరిం బడిపోవుచుండును.

ఈసరస్సునందలిజలము లతిశీతలములు. నీటి యూటపైన నొకమంటపమున నేదో దేవస్థాన మేర్పఱుపంబడినది. సరస్తీరమునంటియే యిం కనుగొంత యవ్వల వేఱొకమంటపమును, అం దుష్ణోదకబుద్బుదకుండమునుగలవు. సరస్తీరముననే వేఱొకతావున "మహాసతీస్థల"మను నొకపవిత్ర ప్రదేశము కలదు. అది యప్పటిమహారాణాల శ్మ శానము. అం దాకాలంపుమహారాణీలు కొం దఱు సహగమన మొనర్చుటంజేసి యాపే రయ్యె నంట. ఆసమీపముననే సరస్సుయొక్క యుత్తర తీరమున సమాధీశ్వరదేవస్థాన మున్నది. ఆప్రక్క గనే పెద్దపెద్దవృక్షములు పెరిఁగి యటవింబోలి యున్నతావున భూమికిఁ గ్రిందికి దిగుసోపానపం క్తులు కలవు. అవి యొకమండమునకుఁ జేర్చును. అందుఁ బద్మినీదేవి తపంబొనర్చుచుండెడిదనియు, నక్బరుముట్టడింప నింకఁ గోటనిలుపుకొనఁజాలనట్లు తెలిసి మహారాణా పడిపోయినకతన నాపతివ్రత సపరివారముగ తనతపస్థలినే చితిఁబేర్చించి యందు రాణావారితో దగ్ధమై వీరస్వర్గమునఁ దనపతింజేరె ననియుఁ జెప్పిరి.

పైనఁ జెప్పఁబడిన నీటియూట యొక గోముఖ ముగుండా ఈసరస్సునఁ జేరుటంజేసి యాపేరయ్యె నంట. ఇదియే పురజనులకు దాహోదకములిచ్చు నదిగాఁ దోఁచెడిని. కోటలోననే యొకమూల నొకచక్కని పనితనముఁగల సరస్సు కలదు. గాని యది కడుచిన్నది. సౌందర్యవంతము. ఇంకనునిటఁ జూడఁదగినవి కోట కీశాన్యదిశగా ఫతేప్రకాష్మ హాల్ యొక్కపాడు, మీరాబాయి దేవస్థానము, కొన్ని జైనదేవస్థానములు, కుంభశ్యామదేవా లయము (ఇది కుంభమహారాణా ప్రతిష్ఠితము), పద్మినీదేవి జలభవనము (ఇది సరస్సునందే యొక ద్వీపముంబోలి నిర్మింపఁబడిన రహస్యప్రదేశభవ నము, మూడంతస్థులమేడ), చిత్తూరునగరదుర్గంపుఁ బెద్దద్వారము, పద్మినీదేవిమేడ కెదుటనున్న యొక పాటిమేడ మొదలగునవి కొన్ని గలవు.

చిత్తోర్ఘడ్ నకు రాజ్యమున ప్రధానపురమగు ఉదయపూర్ నుండి నేరోగేజియినుపబాట ఉదయ పూరుప్రభుత్వమువారు వేయించియున్నారు. ఇది బొంబై-బరోడా సెంట్రలిండియా రెయిల్వేతో సంబంధము గలది. (మాళవదేశంపు మాండూ పురము - సుల్తానులచరిత్ర చూడుఁడు.)

## మేవాడ్ సంస్థానము—

(ఉదయపూర్ సంస్థానరాజ్యము చూడుఁడు.)

## మేవాడ (మేవార్) సంస్థానము:—

ఇండియాదేశమందలి రాజపుటానా ఏజన్సీలోని బ్రిటీషురక్షితసంస్థానము లిరువదింటిలో నొకరాజ పుత్రసంస్థానము. (రాజపుటానాఏజన్సీ చూడుఁడు) ఉదయపురము రాజధాని. దీనిని ఉదయపూర్సం స్థాన మనియు వాడుచున్నారు. ఉదయసింగు మహారాజు నిర్మించినపుర ముదయపురము. రాజ భవనములు కడుంగడు సుందరములుగ నుండును. తొల్లింటిరాజధాని చిత్తూరు. సుప్రసిద్ధచరిత్రాత్మక మైన చిత్తూరుముట్టడి, పద్మినీదేవికథ యిక్కడివే. ప్రభువు సూర్యవంశక్షత్రియుల కగ్రగణ్యమా న్యుఁడుగ నెంచఁబడువాఁడు. (ఉదయపూర్ చూ డుఁడు) యీప్రభువులది సుప్రసిద్ధమగు శిశో దియా (కుశ్వాహావంశ) అనియు, జగదేకవీరుండని పేరొందిన బప్పారావల్ వీరి మూలపురుషుఁడనియు గర్వముగ వల్కుచుందురు.

**మేషరాసి**:-ఇది అశ్వనీనక్షత్రముయొక్క ౧-౨-౩-౪ పాదములును, భరణీనక్షత్రముయొక్క ౧-౨-౩-౪ పాదములును, కృత్తికానక్షత్రములోని

౧ పాదమును (తొమ్మిదిపాదములు) కలసినైన రాశి. ఈరాశిప్రమాణము నాల్గుగడియలు లేక గంటా ముప్పదిరెండుమినిట్లకాలము.

మేషము క్రూరరాశి. చరస్వభావరాసి.క్షత్రియ వర్ణము. పురుషలక్షణము. రక్తవర్ణము. పాదజల రాశి. తూర్పుదిక్కురాశి. పృష్ఠోదయరాశి. రాత్రి యందు బలమధికము. అవయవబలము శిరస్సు నెప్పఁబడినది.

మేషము స్వక్షేత్రము కుజునకు, మూలత్రికోణము కుజునకు, ఉచ్చ రవికి, నీచ శనికి, మిత్రక్షేత్రము రవి గురు లకు, శత్రుక్షేత్రము, శనికి, సమక్షేత్రము చంద్రబుధశుక్రులకని చెప్పఁబడినది. మేషము లగ్నమగునేని మేషరాశికి, రవి పంచమాధిపతి యగును. చంద్రుఁడు చతుర్థస్థానాధిపతి యగును. కుజుఁడు లగ్నాష్టమస్థానములకును, బుధుఁడు తృతీయషష్టమస్థానములకును, గురుఁడు నవమ, ద్వాదశ స్థానములకును, శుక్రుఁడు ద్వితీయ సప్తమ స్థానములకును, శని దశమ ఏకాదశస్థానములకును అధిపతు లగుదురు.

**మేషాతకిగోత్రము:-**
(నిధ్రువగణము చూడుఁడు.)

**మేసలిగోత్రము:—** (వీతహవ్య లేక యాస్కగణము చూడుఁడు.)

**మేసలిపిలిగోత్రము:-** (వీతహవ్య లేక యాస్కగణము చూడుఁడు.)

**మైందుఁడు:—** వానరుఁడు. అశ్వినీదేవతలవలనఁ బుట్టినవాఁడు. సోదరుఁడు ద్వివిదుఁడు. ఈతఁడు సుగ్రీవునిసేనానాయకులలో నొకఁడు.

**మైకేలు మహాప్రమథుఁడు (Michael):—** మైకే లనిన హిబ్రూభాషయందు దైవతుల్యుఁ డనియర్థము. మహమ్మదీయ, యూధ మతములం దీయన ప్రథమాగ్రగణ్యుఁ డగు దేవదూత. ఈయన ప్రజాభిమానియు, ఇశ్రాయేలీయులయం దభిమానియు, గ్రీకు పారసీకుల దేవదూతలపై విరోధముగలవాఁడు నని చెప్పఁబడినవాఁడు. స్వర్గమున సంగరము కల్గినతఱి జయ మంది మంచిదేవదూతలపక్ష మవలంబించినవాఁడు.

**మైక్రాస్కోప్ (Microscope):—** కంటికిఁ గనుపించనంతటి సూక్ష్మవస్తువులను పెద్దవిగాఁగనుపింపఁజేయు నద్దములను గలిగిన యంత్రము.

**మైక్రోఆర్గానిజమ్ (Micro organism):—** అతిసూక్ష్మపరిమాణముగల ఓషధులకును, జంతువులకును సంబంధించినవర్గము.

**మైక్రోకోజమ్ (microcosm):—** సూక్ష్మప్రపంచము, సూక్ష్మశరీరము, తత్త్వశాస్త్రమునకు సంబంధించిన పరిభాష.

**మైక్రోక్రోనోమేటర్ (Microchronometer):—** అతిసూక్ష్మకాలమానమును తెలుపు గడియారము. ఒకనులోని యంతర్భాగములను గూడా తెలుపును.

**మైక్రోనేసియా ద్వీపములు:—** ఇవి మిక్కిలిచిన్నపరిమాణముఁ గల్గిన ద్వీపములసమూహము లగుటఁ బాశ్చాత్యు లీపేరిడిరఁట. ఇవి బీసీనియాయందలి మైక్రోనేసియా ద్వీపసమూహములని యెఱుంగునది. మఱియు నివి Ladrone లేక Marianne ద్వీపములనియు, Carolines ద్వీపము లనియు రెండుసమూహములద్వీపములుగా నున్నవి. తొలుత నీరెండుసమూహముల ద్వీపములు స్పానియావారివిగనె యుండినవి గాని కాలో

సీస్ ద్వీపసమూహమును, మారియన్నీద్వీపసమూహమును, స్పానియావారు జర్మనీ కమ్మివైచిరఁట.

'లాడ్రోని' నన స్పానియా దేశస్థుఁడగు మగెల్లాన్. వీరిని క్రీ. శ. ౧౫౨౧ సం॥ కనిపెట్టి, ప్రజలు దొంగలని భావించి, అట్టియర్థ మిచ్చు 'లాడ్రోని' యని పేరిడె నఁట. గాని తర్వాత స్పానియామహారాజ్ఞి పేర 'మరియన్నిద్వీపము' లని మార్పఁబడెనఁట. ఇంక కారొలినీస్ ద్వీపముల పేరు స్పానియాభూపాలుని పేరు సంబంధ మఁట.

**మైక్రోఫోన్:**— (రేడియోవైర్లెస్ చూడుఁడు.)

**మైక్రోబ్సు:**— (అంటువ్యాధులు చూడుఁడు.)

**మైక్రోబ్సు (Microbes):**—మైక్రోబ్సు నందు నిరపాయకరమగునవియు, నపాయకరమగునవియు, రెండుముఖ్యభేదములు గలవు. గాలితో భూమియందుండిపోయిన 'నైట్రోజెన్' అనంబడు పదార్థమును సర్వసాధారణఁపుమొక్కలుపయోగించుకొనఁజాలకుండినతటిఁ, గొన్ని మైక్రోబులు దానిం గైకొని యితరయెలిమెంట్సుతోఁ గూర్చి భోజనపదార్థములుగఁ జేసి మొక్కలుపయోగింపవీలొనర్చునని చెప్పఁబడినది. సేద్య మొనర్చువారొక్కొకసంవత్సరమున పొలము కాళీగా వదలి సేద్యము నాపుట యన నిట్టిమైక్రోబ్సులను పొలమునఁ బెరుగనిచ్చుటయే యగును గాన రైతునకు ముఖ్యములు.

పాలు పితుకఁగనే యందు గాలినుండియు, నీటినుండియు, నెగురుచుండుబుగ్గినుండియు నందుఁ జేరుకొనఁగల్గును. అందపాయకరములుఁ గూడ నుండునని వేఱుగఁ జెప్పనక్కరయుండదు. అందవి యెక్కువయై యధికసంఖ్యాకము లగును. అందపాయకరములగు వాటిలో నుబ్బసఁపుదగ్గును గల్గించు మైక్రోబ్సు చెప్పఁదగినవి. నిరపాయకరములగువాటియందు milk microbes అనఁబడునవియు నుండును. ఇవి పశువులసాలలందుఁ గూడ నుండు నందురు. ఇవి పాలయందుఁ జేరి, యపాయకరముల నంత మొందించుచుండును. తోడువేసినపాలను పులియఁజేయునవియు నవియే యనిచెప్పుదురు. పెరుఁగై తోడుకొనుట కవియే కారణమఁట. లేక పాలను 'క్రీమ్' గా మార్చునవియు నవియే నఁట. వాటియొక్క పరిణావస్థయందుఁ జేసినమేరకుఁ బాలనుండి వెన్న బయలుదేఱునని చెప్పఁబడియున్నది. అవి మానవశరీరమునకుఁ జేరి, జీర్ణశక్తి నధిక మొనర్చుననియు, నపాయముఁ గల్గించు మైక్రోబ్సును బరిమార్చుననియుఁ జెప్పుచున్నారు. పులిసిన పెరుఁగు, మజ్జిగ లీపనిం జేయుటకుఁ గారణ మివియే యందురు.

వెన్న పలుతావులందుఁ జేయఁబడినది రుచిభేదములఁ గల్గియుంటకుఁ గారణ మీమైక్రోబ్సు జాతులందలి భేదములే యని యిటీవలఁ జేయఁబడిన పరిశీలనలు తెల్పుచున్నవి. ఇంకఁ గొందఱు పరిశీలకులిట్టిమైక్రోబ్సు లేకుండినచో వెన్న యేర్పడఁజాలదనిగూడ ననిరి. ఇందువలన మైక్రోబ్సు పైఁజెప్పఁబడిన ముఖ్యభేదజాతులు రెండే గాక, యుపయోగకరమగు వేఱొకజాతిగ విడఁదీయఁదగునని చెప్పనగుచున్నది. ఇట్టియుపయోగకర మగుజాతి మైక్రోబ్సును పెంచువిధము కనిపెట్టఁబడినది. పండితు లిక్కాలమున నట్టివాటికి 'starters' అని సంకేతకనామ మిది వాడుచున్నారు. అవి లంభింపఁగలతావు లమెరికాసంయుక్తరాష్ట్రములందుఁ గలవందురు.

ఇంకఁ బాశ్చాత్త్యులభోజనపదార్థములలో నొకటియగు 'Cheese' అనఁబడునది యగుటకుఁ గారణ నీయుపయోగకరజాతిమైక్రోబ్సులనియే చెప్పఁబడినది. అవి యావుపాలే గాక గేదె మొదలగువాటిపాలతోఁగూడఁ జేయనగు నందురు. ఛజులందుఁగల జాతులకు వేర్వేఱు తెగమైక్రోబ్సుకలవని పరిశీలకు లనెదరు. జంతువులతోళ్ళు పదునుచేయుటకు మైక్రోబ్సుచేయుపని కొంత కలదని పరిశీలకులనుట విచిత్రమనిపించును. పట్టణపారిశుద్ధ్యమునకు మైక్రోబ్సు అధికోపయోగకరములని యనుచున్నారు. కుళ్లిన animal Vegetable human పదార్థములనుండి దోషకర మగుదానిని దొలఁగించి, జీవించియున్నవారి కుపయోగకరములుగ నొనర్ప నీమైక్రోబ్సు ఉపయోగించుచున్నటులం గనిపెట్టఁబడినది.

పండితు లొనర్చినపరిశీలనలు, ఆదిని మైక్రోబ్సు నపదార్థముపై నుండునవి యనియు, రాను రాను చావనున్న జంతుజాలములంగూడ నాశ్రయించియుండం గల్గుచున్నవనియు, అది పరిణావస్థితిగనెంచందగు ననియుఁ దెల్పుచున్నవి. మైక్రోబ్సు ఎండలనెండుచు వానలం దడుచుచుండు నడవిజంతువుల నాశ్రయింపంజాల వందురు. అట్లే అడవిచెట్లూ నందురు. మానవులు పెంచు ంతుజాలమునకును, చెట్లుచేమలకుమాత్రము వీటి బాధ యుండునఁట. ఇది దురూహ్యముగా నుండెడింగాని కఠినమెండవానలు, బహిరంగశీతవాయువులు దీనికిం గారణమై యుండనోపు.

అపాయకరమగు మైక్రోబ్సు తాచుపాముల కన్నను, తేళ్ళకన్నను ఎక్కువయపాయకరము లని గొప్పఆలోపతీవైద్యశాస్త్రవిధు లనుచుందురు. పెంచంబడుచున్నకోతులు, పశువులు మొదలగునవి ఉబ్బసఁపుదగ్గుంగల్గించు మైక్రోబ్సువలన నపాయముఁ గలుగకుండ జాగ్రతం గొనఁదగియుండునఁట.

**మైక్రోమెలిమీటర్** (Micro melimeter) అతి సూక్ష్మపరిమాణములను కనిపెట్టుటకు వృక్షశాస్త్రజ్ఞు లుపయోగించు పనిముట్టు.

**మైక్రోలజీ** (Micrology):— అతిసూక్ష్మపదార్థముల తత్త్వమును పరిశీలించు విధానము; సిద్ధాంతము.

**మైటిలీన్ ద్వీపము(లెస్ద్వీపము):-** (ఏష్యామైనరు చూడుఁడు.)

**మైత్రకులు లేక మైత్రకవంశస్థులు:-** వీరు వల్లభీపురము రాజధానిగ గుజరాతుదేశ మేలినవారు. వీరింగూర్చి యంతగాఁ దెలియకున్నది.

**మైత్రావాహగోత్రము:—** (లౌగాక్షిగణము చూడుఁడు.)

**మైత్రేయ్యగోత్రము:—** (గవిష్ఠిరగణము చూడుఁడు.)

**మైత్రేయగణము:-**ఇది విశ్వబ్రాహ్మణుల యం దొకగణము. ఇం దైదుగోత్రములు చెప్పఁబడినవి. (ప్రణవశాఖ-విశ్వబ్రాహ్మణులుచూడుఁడు)

౧ ధర్మర్షిగోత్రము—మైత్రేయ, సూరిచ, తేజోధర్మ (త్రియార్షేయప్రవర).

౨ సుదర్శనగోత్రము— తేజోధర్మ, సుదర్శన, యజ్ఞ, ఉపగోప, సాస్త్రీ (పంచార్షేయప్రవర).

3 ఉపగోపర్షిగోత్రము:— సుదర్శన, యజ్ఞ, ఉపగోప, (త్రియార్షే).

౪ యజ్ఞగ్నిగోత్రము:- యజ్ఞి, ఉపగోప, సాన్త్వ, మతిబోధక, కౌసల, (పంచార్షేయప్రవర).

౫ సాన్త్వర్షి గోత్రము:- సాన్త్వి, ఉపగోప, స్మృతి బోధ, మతిబోధ, కౌసల, (పంచార్షేయప్రవర).

**మైత్రేయబుద్ధుఁడు:**— ఈమహాత్ముఁడు బుద్ధభగవానునకుఁబిదప నైదువేలవత్సరముల కవతరించనున్నాఁడనియు, నంతదనుకఁ దుషితస్వర్గమునం దుండునని బౌద్ధగ్రంథములందుఁ జెప్పఁబడినది. టిబెట్టుదేశపుబౌద్ధులీమహనీయుని 'బోధిసత్త్వుఁ' డనియు, 'భవిష్యద్బుద్ధభగవానుఁ' డనియుఁ జెప్పుదురు. ఈయన లామాదుస్తులం దొడిగియు రత్నకిరీటమును ధరించునఁట.

చీనాదేశపు 'పీకింగ్' నగరమున నొకవిహారమున నీయనయొక్క కఱ్ఱవిగ్రహము డెబ్బదియడుగుల పొడవుది కలదనియు, మంగోలియాదేశములోని 'ఉర్గా' పురమున ముప్పదిమూఁడడుగుల యెత్తుగల యపరంజిపూతవిగ్రహము గలదనియు, నానందమయుఁడై యుండునట్లుండువాఁ డనియు వినుచున్నాము

**మైత్రేయగోత్రము:-**
(వాధ్ర్యస్వ లేక మిత్రయువగణముచూడుఁడు.)

**మైత్రేయవనము:-** ఉత్కలదేశమునందలి కొనార్కక్షేత్రపరిసరారణ్యమునకుఁ బేరు. ఇది జగన్నాథసీమ. ఇప్పుడు పాడుపడి యిసుకమేట వేసియున్నది. దీనిప్రశంస కపిలసంహితయందును, స్కాందపురాణపర్భాసఖండము ౧—౧౦౦ యందును గలదు.

**మైత్రేయసగోత్రము:**—
(రేభగణము చూడుఁడు.)

**మైత్రేయుఁడు:**— ఋషి. తండ్రి కుశీలవుఁడు. పరాశరునిశిష్యుఁడు. (ఆయనవద్ద విష్ణుసంహిత ఉపదేశమైనవాఁడు.)

ఇతఁడు కామ్యకవనముననున్న పాండవులం జూచి, వారికడనుండి దుర్యోధనునికడకుఁ జని, యుద్ధము వలదని హితోపదేశ మొనర్చినవాఁడు. అవి యాతఁడు వినకుండినఁ గినిసి పోయినవాఁడు.

బౌద్ధులు మఱియొకబుద్ధభగవానుఁడు రాగలఁడనియు, నాయనపేరు మైత్రేయుఁడనియు నందురు.

**మైథహాయనగోత్రము:**—
(ఔతథ్యఉపగణము చూడుఁడు.)—

**మైథాలోజీకల (Mithology):**— ఒక మతమునందున్న పవిత్రకథనమందలి విశేషమునకు 'Mith' అనెదరు. పవిత్రకథనములు చరిత్రాత్మికములుగఁ దలంపఁబడుచుండెను. కొందఱు నవనాగరికుల మనుకొనువా రట్టి పూర్వకథనములను నిరసించుటయుఁ గలదు.

**మైథిలీబ్రాహ్మణులు:-** పంచగౌడశాఖలలో నొకశాఖవారు (బ్రాహ్మణులు చూడుఁడు) వీరు మిథిలదేశవాసులు (మిథిలదేశము చూడుఁడు). వేర్వేఱుకాలములందుఁ జీలిన మైథిలీశాఖలు తొమ్మిది నేటికిఁ గాననగుచున్నవి. వీరు మత్స్యమాంసములు గైకొందురు. స్మార్తశాఖ.

౧ ఒఝ్ఝాబ్రాహ్మణులు:-శుక్లయజుర్వేదులు, మాధ్యందినశాఖ, కాళీదేవి నుపాసించుశాక్తేయులు.

౨ కుమారబ్రాహ్మణులు:-తొల్లింట మిశ్రీలనుండి యీశాఖవా రేర్పడిరని వాడుక కలదు. సామవేదులుగను, శుక్లయజుర్వేదులుగను నున్నవారు.

3 ఖానుబ్రాహ్మణులు:- తొల్లింట మిశ్రీలనుండి యీశాఖవా రేర్పడిరని వాడుక కలదు. శుక్లయజుర్వేదులు, మాధ్యందినశాఖ, మధ్యాహ్నసంధ్య వీరికిఁ బ్రధానము.

Perafin మైనము Crude mineral oils నుండి తీయఁబడుచున్నది.

మైనముయొక్క ముఖ్యములగు నుపయోగములు క్రొవ్వొత్తులలోఁ గలియుట, కఱ్ఱసామానులకుఁ బైనఁబూయు Furniture Polish లలోఁ గలియుట, కొన్నియౌషధములలోఁ గలియుటయు, విద్యుచ్ఛక్తియంత్రములందు Insulators గాఁ జేయఁబడుటలో నుపయోగించుటయు నై యున్నది. మైనమునందు వృక్షములకుఁ దగిలినగాయములను, మనుష్యులకుఁ దగిలినగాయములను మాన్పుగుణము గలదు. గాన మనుష్యుల గాయములు మాన్పునౌషధములందుఁ గలుపుదురు. మామిడి మొదలగు మొక్కల నంటుఁగట్టుతఱిఁ బైనఁ బూయుదురు. ఇది యాయుర్వేద వైద్యశాస్త్రమునఁ దేనెటీగలమైనమే యంగీకరింపఁబడినది గాని తక్కినమైనము లంగీకరింపఁబడలేదు. మైనముతైలముఁ దీసి పైనమర్దనఁ జేసిన శరీరమునందలి మేహవాతఁపునొప్పులు, కడుదుష్టజలములు బయటికివచ్చి, నొప్పులు మాని, నరములకు సత్తువఁ గల్గించునని చప్పఁబడినది.

**మైనాకపర్వతము:**- దీని నిప్పుడు శివాలిక్పర్వత మనుచున్నారు. గంగానదిమొదలు విపాశ, బీయాస్ నదివఱకు వ్యాపించియున్నవి. దీనిప్రశంస మహాభారతము, వనపర్వము ౧౩౫ అధ్యాయమునను, కూర్మపురాణ ముపరిభాగము ౩౯ అధ్యాయమునను గలవు.

మఱియు గంగానది తూర్పున జన్మస్థానముకడ నున్నకొండల కీపేరే గలదందురు. హిందూదేశమునకును, సింహళమునకును నడుమ సముద్రమున నొకమైనాకపర్వతము నీటఁ గలదని రామాయణమునందలి సుందరకాండము ౭ అధ్యాయమునను గుజరాతునకుఁ బశ్చిమముగ భరతదేశఁపుఁ బశ్చిమదిశ నొకమైనాకపర్వతము నున్నదని మహాభారతము వనపర్వము ౮౯ అధ్యాయమునను జెప్పఁబడియున్నది.

**మైనాజాతిదొంగలు:**- వీరుదోపిడిగాండ్రుగ నుండిరి. ఉత్తరహిందూస్థానమునను, నందు ముఖ్యముగ రాజపుత్రస్థానమునను వ్యాపించియుండినవారు. బూందీసంస్థానపురముండిన కొండలోవయందొకకొండశిఖరమం దుండిన తారాఘుడము (దుర్గము) పూర్వము వీరిదిగా నుండెను. (బూందీపురము చూడుఁడు—తేజదశమి చూడుఁడు)

**మైరాపరిమళద్రవ్యము:**- ఇదియొకజాతి చెట్లనుండి కాఱు బంకదియగు. భరతదేశఁపుసాంబ్రాణిం బోలినది. ఈచెట్లరేబియా, అబ్సీనియా దేశములందుఁ గలవు.

ఏసుక్రీస్తు పుట్టఁగనే జ్ఞాను లాయనకుఁ గానుకఁబెట్టినపదార్థములం దీమైరాపరిమళద్రవ్యము కలదని బైబిలునందుఁ జెప్పఁబడినది.

**మైరేజి:**-

(మృగతృష్ణ చూడుఁడు)

**మైల లేక యశౌచము:**- అశౌచము జాతాశౌచము, మృతాశౌచము నని ద్వివిధము. జాతాశౌచము పుట్టుకవలనఁ గల్గునది. దీనికిఁ బురుడని వాడుదురు. మృతాశౌచము చావునుండి కల్గునది. దీనికే మైల యనియు వాడుకగలదు. ఈరెండునుగాక స్త్రీలు ఋతుమతులగుకతన మూఁడుదినములు వారి కశుచిఁ గల్గుచుండుననియు, దానికి ముట్టగుట, బహిష్టయగుట, వాకిటనుండుట మొదలగు వాడుకపేరులు కలవు.

అట్టియశుచి నెలనెలకు స్త్రీలకుఁ గల్గుచుండును గాన, గర్భవతులై నెలనెలకీయశుచి కలుగకుండు స్థితికి 'నెలఁతప్పుట' యని వాడుకఁ గల్గెను.

భరతదేశఁపు ధర్మశాస్త్రపద్ధతులమేర కన్ని యశౌచములు కల్గుటతోఁ బ్రారంభ మగును. అట్లు ప్రారంభమగుట పగలయ్యెనేని యప్పటి వారములు లెక్కింతురు. రాత్రి యయ్యెనేని రాత్రిప్రమాణముఘడియలను మూఁడుభాగములుగఁ బంచి, మొదటి, రెండవభాగములం దయ్యెనేని, పూర్వదినమునం దనియు, మూఁడవ భాగమునం దయ్యెనేని మరుసటిదినమునం దనియుఁ బరిగణింతురు. మైల లేక యశౌచము త్రివిధములుగ నుండును. మృతివార్త వినినపిదప లేక జరిగినపిదప స్నాన మాచరించుటతో సరియగు మైల యనియు, పక్షిణీమైల యనియు, దశరాత్రాశౌచఁపుమైల యనియు, మూఁడువిధములుగ నాచరింపఁబడుచుండును.

శిశువు ప్రాణముతోఁ బుట్టి, బొడ్డుఁగోయక ముందు మరణించెనేని తండ్రికి, నన్నదమ్ములకుఁ, బెండ్లికానియక్కలకు, జ్ఞాతులకు, మూఁడుదినములు (త్రిరాత్రములును), కన్నతల్లికి దశరాత్రములు (పదిదినములు) ను, పురుడు పట్టవలెను. పురిటిస్నానముతో నందరికి మైలశుద్ధి యగునని చెప్పఁబడినది. ఇత్తఱిఁ దొలుతఁ బురు డారంభించినపిదప వచ్చినమైలను బాటింప నక్కఱలే దనియుఁ దొలుత మైల ప్రారంభించిన పిదపఁ గల్గినపురిటిని బాటింపనక్కఱయుండ దనియుఁ జెప్పంబడియున్నది. బొడ్డుకోసినపిదపఁ బదిదినములలో నెప్పుడు మరణించినను, దశరాత్రములు పురుడు పట్టవలెననియు, బిడ్డ చచ్చి పుట్టినతఱిం గూడఁ, బదిదినములే యశౌచమనియు, దశరాత్రములకుఁ బిదప దంతోత్పత్తి (పండ్లు వచ్చుట) కుఁ బూర్వము పిల్ల చనిపోయినచోఁ దలిదండ్రులకుఁ ద్రిరాత్రాశౌచమును, దక్కిన జ్ఞాతిబంధువుల కెల్లరకు స్నానముతోడను శుద్ధియగు ననియు, దంతోత్పత్తికిం బిదప మూఁడుసంవత్సరముల వయస్సు లోపున (పూర్తి) బిడ్డ చనిపోయినఁ దలిదండ్రులకుఁ ద్రిరాత్రాశౌచమును, దక్కినవారి కేక రాత్రి యశౌచముననియు (ఒకపగలు నొకరాత్రి యనిభావము), పదిరాత్రులు దాటి మూఁడు సంవత్సరములు పూర్తియగు లోపున నాఁడుపిల్ల మరణించెనేని తల్లిదండ్రులకుఁ ద్రిరాత్రాశౌచమును, దక్కినవారికి స్నానముతోడనే శుద్ధి యనియు, మూఁడువత్సరము లతిక్రమించి, పురుషుల కుపనయనకాల మతీతము గాకుండను, నాఁడు పిల్ల వివాహము కాకుండను, మరణించెనేని తలిదండ్రులకు, జ్ఞాతులకుఁ గూడ త్రిరాత్రాశౌచమే కర్తవ్యమనియుఁ, బిదప నుపనయనమైనను గాకున్నను, బాలుఁడును, వివాహమైనను గాకున్నను బాలికయు మరణించిరేని పూర్ణాశౌచము విధి యనియుఁ జెప్పఁబడియున్నది.

ఈపక్షిణీ అశౌచసందర్భమున వేఱొకసంగతియుఁ జెప్పఁబడియున్నది. మరణసమయమునకు దగ్గరనున్న పక్షిణీబాంధవులు, త్రిరాత్రాశౌచము పాటించుతఱి, దగ్గరలేనివారికిఁ దొంబదిగడియల కాలమే యశౌచమనియు, నట్టివా రాతొంబదిగడియలను లెక్కించుటయందుఁ జనిపోయిన పగటిని గాని, రాత్రినిగాని ముప్పదిగడియలక్రింద లెక్కకుఁ గలసివచ్చుననియు, ఇంక నీపక్షిణీ అశౌచము దశరాత్రములలోపుననే ననియు, దూరముననున్న వారికి దశరాత్రములలో విన్నదాదిగ నొకపగలు, నొకరాత్రియు, భోజనము మాని యుపవసించినఁ జాలుననియు, ఆదశరాత్రములు దాటినపిదప స్నానముతోనే శుద్ధియగుననియు, దగ్గరలేనివారు

సైతమాతృతవార్త మొదటి తొంబదిగడియల లోపుననే యెఱుఁగఁ గల్గిరేని యప్పటి కామొదటి తొంబదిగడియలకెంత తీరువాయియుండునో యా కాలమునం దుపవసించుచుఁ బిదప స్నాన మొనర్చి, యశౌచమును వీడవచ్చుననియుఁ జెప్పఁబడి యున్నది.

పినతండ్రి, పెదతండ్రులు, మేనమామలు, తల్లితోఁబుట్టువులు, సోదరసోదరీలు వీరును, వీరి పిల్లలును, మాతామహుఁడు, మతామహి, మేనత్తలు, తనతోఁబుట్టువులు, తోఁబుట్టువులభర్తలు, అల్లుఁడు, కుమార్తె, కుమార్తెసంతానము, భార్య తల్లిదండ్రులు, భార్యయన్నదమ్ములు, మరణించి నతతిఁ బక్షిణీ యశౌచమని చెప్పఁబడినది. మేనమామభార్య, మేనత్తపెనిమిటి, పినతల్లి, పెదతల్లులభర్తలు, సాపత్నీసోదరీలమృతియందు స్నానము తోనే శుద్ధియని చెప్పఁబడినది. ఉపనయనములేని పురుషుఁడు, వివాహము లేనిస్త్రీ, కాల మతీత మైనవారలమృతికి స్నానమే శుద్ధికిం జాలునని చెప్పఁ బడియున్నది.

**మైలతుత్థము:—** దీని కాంగ్లమున Sulphate of Copper అనియు, Blue Vitriol అనియుఁ బేర్లు. సంస్కృతమున తుత్థం, తుత్థకం, తుత్థాంజనం, మయూరకం, మయూర గ్రీవకం, మయూరతుత్థం.

మైలతుత్థము రాగిసంబంధమైనది గాన రాగి గనులయందు దొరకునది. దీనియందుఁ దామ్రముండును. కొంతిమైలతుత్థమును గుండఁజేసి పిండి మొదలగువాట్లకుఁ గల్పి నీరుతో నొకయిత్తడి పాత్రియం దుంచి పిండి నుడికించిన నాయిత్తడి పాత్రకు రాగిపూత పట్టును. మైలతుత్థమునకు దేనినైనను కొఱుకు గుణము గలదుగాన వెంద్రుక లూడఁదీయుట కుపయోగింతురు. పైనఁబూయుట వలనఁ జర్మము నగురాఁక గొఱికివేయును. గాన జాగ్రతగ శుద్ధిచేసినది పైనఁబూసిన చర్మవ్యాధులు నివారణ మగును. శాస్త్రోక్తముగ శుద్ధిఁజేయఁబడిన మైలతుత్థభస్మము లోని కిచ్చిన వమనము, విరేచనముఁ గావించును. శూలలు, ఆమపైత్యము, శ్వాసకాసలు, కుష్ఠురోగముల నివారించునని చెప్పఁబడినది. క్షయరోగప్రారంభమునను, నల్లమందుఁ దినుటవలన సంభవించిన విషమావస్థయందును, నమితముగఁ దిండితినుటవలన నూపిరియాడక రుద్రవాతము సంభవించుచిహ్నము లగుపడినప్పుడును, మైలతుత్థభస్మము లోనికిచ్చి వమనముఁ జేయింతురు. మైలతుత్థభస్మమును వెన్నతో లోనికిచ్చిన చర్మవ్యాధులు, విషదోషము, కుష్ఠురోగము నివారణ యగుననియుఁ దమలపాకులరసముతో లోని కిచ్చిన కఫరోగములు నివారణ మగుననియు, నాముదముతోఁ గల్పి లోని కిచ్చిన విరేచనము లగుననియు, వాయువిడంగముల చూర్ణముతో లోని కిచ్చిన సమస్తక్రిమిరోగములు నివారణమగు ననియుఁ జెప్పఁబడినది.

చక్కఁగ శుద్ధిగానిచోఁ గల్గెడిదోషములకు వరిపేలాలు పిసికిననీళ్ళు, మజ్జిగ పులిసినది, నిమ్మకాయలరసము, విఱుగుడులని చెప్పఁబడినది.

**మైలు:—** ఎన్మిదిఫర్లాంగులు లేక ౧౭౬౦ గజముల (పొడవు) దూరముఁగలప్రదేశము. ఇది ఇంగ్లీషుమైలనంబడుచున్నది. బాటపొడవునను మైలురాళ్లు పాతుదురు.

మఱియు ౨౦౨౬ గజముల రెండవదుగుల దూరమున కింగ్లాండునందు 'Nautical mile' అనియు, Geographical mile అనియు ననెదరు.

**మైషీతకిగోత్రము**:- (కపియుపగణము చూడుఁడు.)

**మైసూరు**.—కర్ణాటకదేశమున మైసూరు రాజ్యమున మహారాజునివసించునగరమైయున్న ర చతురస్రమైనపట్టణము. డెబ్బదియైదువేల జనులకు నివాసము. విద్యుద్దీపకలికామయమగు పురము. విజ్ఞానములకుఁ బుట్టినిల్లనంబరఁగుచు, గానవిద్యమొదలగుకలలకుఁ బరిమళములకు, వేదశాస్త్రములకు, విద్యలకుఁబుస్తకభాండాగారములకు బేరందిననగరము, సౌందర్యవంతమగు పురము.

తొల్లింట మహిషాసురునిపేర మహిషపురమను పేరంబరఁగుచుండె నందురు. నగరమునకుఁ బరిసరప్రాంతమును మహిషమండల మనంబడుచుండెనఁట. క్రీ. పూ. మూఁడవశతాబ్దమునాటి యశోకునిశాసనములందు మహిషమండల మను పేరుకలదు. మహాభారతమున నీపేరే వాడఁబడినది. ఆమండలమిదియో లేకమరేదియో పరిశీలింపవలసినదిగాని, యశోకునిశాసనమందలి పేరిక్కడిదియే యనఁదగును. మైసూరురాజకుటుంబము శ్రీరంగపట్టణమునుండి యిటకే నివసింపనేతెంచిరి.

మైసూరంతయు నుద్యానవనములమయమై నగరమొక యుద్యానమున నిర్మింపబడినట్లుండును. కర్జన్‌పార్కు, గార్డన్‌పార్కు మొదలగున వెన్నియోగలవు. మహారాజుగారి ప్రాసాదము కోటలోనున్నది. సింహాసనము విక్రమాదిత్యునిదనివాడుక కలదు. రాజభవనముమిక్కిలి గొప్పకట్టడము. దానిపై శిఖరము బంగారఁపుగదియుంత యుండి, నగరమంతకును గానవచ్చుచుండును.

నగరమునందనేకరాజభవనములుగలవు. వసంతభవనమనబడునది వేసవినివాసము. మైసూరున ఉత్తరదిశగా, చాముండిపర్వతముపై మహిషాసురమర్దనియనంబడిన చాముండీదేవి దేవస్థానమును, మహారాజుగారి యొక నివాసభవనమును గలవు. ఇండ్లపోలికలు, ప్లానులు నెన్నియోరకములు మైసూరునందునిర్మింపఁబడి చూడ వింతగ నుండును. చాముండీపర్వతముననొకమచ్చునకై నిర్మించినబంగాళా కలదు.

చాముండీపర్వతము సముద్రపు నీటిమట్టముపై ౩౪౮౯ అడుగులయెత్తుగ నుండునది. దానిపైకేగుటకు మార్గము కలదు. ఆదారియందొక గండశిల నొకనందిగాఁ జెక్కియున్నారు. అది పదున్నతఱిఁబదునారడుగులయెత్తుగలది. ఈరోడ్డుగాక కొండపై కెక్కుటకు సోపానములు గలవు. నగరమునఁ జీకటిగానరాని యట్లు విద్యుద్దీపములడుగడుగునకు సిద్ధమై వెలుఁగిచ్చుచుండును.

**మైసూరుప్రభువులసింహాసనము**.— దీనింగూర్చి మైసూరుప్రభుత్వపు రికార్డులయందిట్లుఁ జెప్పబడినది. ఇది యాదిని పాండవులింద్రప్రస్థమున వాడుకొనుచుండినదఁట. క్రీ. వె. పదునాలుగవ శతాబ్దకాలమున నాంధ్రకర్ణాటక రాజ్యసంస్థాపనాచార్యులగు విద్యారణ్య మహాస్వామికి దొరకెనట. వారువిజయనగర భూపతుల వశమొనర్ప, వారు వాడుకొన వెఱచి, భద్రపఱచి యుంచుకొనిరఁట. అది తరతరములుగ నట్లులభద్రపఱుపఁబడుచు, నెట్టకేలకు క్రీ. వె. ౧౬౧౦ లో రాజవుదయూర్ బహద్దరు వారికి వశమై, మైసూరునకుఁ జెందిపోయి యున్నదఁట. నాఁడాదిగ మైసూరురాజ్యమేలు భూపతులవశమునందున్నది. మధ్యకాలమున హైదరాలీ టిప్పుసుల్తానులకు వశము కాలేదఁట. ఒక్క శరన్నవరాత్రము (దసరా) లందుమాత్రము మైసూరు

మహారాజులు దీనిపైఁ గూర్చుండురఁటఁ గాని నిత్యము వారు దీని నెక్కుటలేదు.

**మైసోలియాసీమ**—కృష్ణా, గోదావరీ నదులమధ్య సముద్రప్రాంతసీమ కీపే రుండెను. ఇది యాంధ్రదేశములోనిదని యెఱుంగునది.

**మొక్కజొన్నవ్యవసాయము** — దీనినిపాశ్చాత్యదేశములందు 'ఇండియన్కార్న్' (ఇండియాకాయధాన్యమువంట)అని వాడుదురు అమెరికాఖండమునందు, నైరోపాఖండమునందు గొన్నిసీమలలో మొక్కజొన్నలు ప్రజలకు ముఖ్యాహారములై యున్నవి.తొలుత నరేబియా యందలిమక్కాపట్టణమునుండియవనులు భరతదేశమునకుఁ దెచ్చుటచే 'మక్కాజొన్న' లని పేరొందినవి. వీట్లయం దనేకరకములు గలవు. అందునల్లనిగింజలుగలవి. తెల్లనిగింజలు గలవి, పచ్చనిగింజలుగలవి, యెఱ్ఱనిగింజలుగలవి, పెద్దరకమువి, మధ్యరకమువి, చిన్నరకమువి,ముఖ్యజాతులు. మొక్కజొన్నకంకులను పొత్తులనియందురు.

ఇదినాలుగు మొదలు పదిమొదడుగులవఱకెత్తుగఁ బెరుఁగును. సమశీతోష్ణప్రదేశములందును నిది చక్కఁగఁ బెరుగుటఁ గాన నగును. ఉష్ణప్రదేశములందైనను, తగుపాటు నీరుఁగల్గు తావులందును జక్కఁగఁ బెరుగుచున్నది.ఈపరిస్థితులుబాగుండిన సర్వకాలములందు మొక్కజొన్నలు ఫలించును. కాలమునననుసరించి యిది మూఁడు, నాల్గు, నెలలలోఫలించును. పొలములలో వేసినయెడల వీటికి నక్కలవలన బాధయుండునుగాన జాగ్రతగఁగాచుచుండవలయును ఎకరమునందు 12 వందలు మొదలు 15 వందల పౌనులవఱకు గింజలుగల పొత్తులుపండునని పరి-

శీలనవలనదేలుచున్నది.కానిపరిస్థితులనుండియు మంచియెరువుల నుండియు, నీటిసదుపాయముల నుండియు,నమెరికాయందలికెంటకీ సీమయందు 24వేలపౌనులగింజలుగూడ సాధారణముగ ఫలించునని చెప్పబడినది. బజారునందుదొరకు 'కారన్ ఫ్లోర్' మొక్కజొన్నపిండియే యనియందురు.

**మొక్కపుజెట్టు (కణపచెట్టు)** — లా. Engenia Recemosa అనియు schrebera swietenoides అనియుఁ బేర్లు. సం. ఘంటాపాటలీ, ముష్కక.'ముష్కక,పలాశధవ చిత్రక,మదనవృక్షక,శింశుపా,వజ్రవృక్షత్రిఫలా యనువాటిని ముష్కాదిగణమని చెప్పబడినది.

కణపవేరు, కణపచెక్క, రసకషాయచూర్ణములుజ్వరములనుహరించుననియు,మేహశాంతి గల్గించి, శరీరములను వెడలించుననియుఁ జెప్పబడినది.

**మొక్కలంబెంచుతఱిభూమియందలి ఎలక్ట్రిసిటిచేయుపని**— పంటపొలములందు గాలినుండికొద్దిగనో,గొప్పగనో యుక్కడి పరిస్థితులమేరకు, ఎలక్ట్రిసిటీభూమికిం జేరుకొనుచుఁ,బంటలు పండుటకుసహాయపడుచుండునని తలంపఁబడినది. పిదపలోహఁపుదీఁగలు పొలముభూమియందుఁ బాతబడుచు వాటినుండి యెలక్ట్రిసిటీప్రవాహమును భూమిలోనికిబంపి చూడఁ బొలమందలిమొక్కలు త్వరితముగ బెరిగి బలపడుట సంభవించినదనికనిపెట్టబడినది. ఇదియింకనుబరిశీలింపబడవలసియే యున్నదందురు.

**మొక్కలు పెరుగుట ఎరువులు**— మొక్క పెరిగి పెద్దదియగుటకుఁ గొన్నికొన్నింటికిఁ గొన్ని salts కావలసియుండునవి కనిపెట్టబడినది. నగటునమొక్కనపేడ మొదలగువాటి

యందుఁ గుల్ళిన యాకులందును, నెముకలపొడి యందును, నుప్పులుండెడివి-గాన వాటి కెరువులు వేయుచునీరుఁగట్టి పెంచుచు ఫలములనంద నగుచున్నది. ఇక్కాలమున వ్యవసాయశాస్త్రజ్ఞులు వృక్షశాస్త్రజ్ఞులు [agriculture & Hooticulture] దేశమున వ్యాపించి పెక్కురువృక్షముల నూత్నజాతులను కల్పించుచున్నారు. ఇది వాటివాటికిం దగినసాల్టుల నెఱింగి చేసిన యేర్పాటులుగ నున్నవి.

## మొఖముమాడ్పు — ఆంధ్రభాషా సాంప్రదాయార్థపదము.

ఇష్టములేనిసంగతిని, వారి ముఖవర్ఛస్సును 'మొఖముమాడ్పు' [ముఖఁపుమాడ్పు] అనివాడుచున్నారు. బహుశః యిది మోముఁ ద్రిప్పుట కని భావమై యుండనోపు

## మొగలాయి నృపవంశము — వీరు

లోడీవంశము నంత మొందించి ఉత్తరహిందూస్థానమున మహమ్మదీయసామ్రాజ్యమేలిన మునల్మానునృపతులు. వీరు పదముగ్గురు గలరు. వీరి పాలనకాలము క్రీ.వె. ౧౫౨౬ మొదలు ౧౮౫౭ వఱకు.

బాబరు, హుమాయూను, అక్బరు, జహాంగీరు, షాజహాను, ఔరంగజీబు నృపతు లిందు ముఖ్యులు. అందు బేబరు రాజ్యసంపాదకుఁడు. అక్బరు గొప్పచక్రవర్తిగఁబేరందినవాడు జహాంగీరు షాజహాను లెక్కువవైభవముల ననుభవించినవారు. ఔరంగజీబు మతావేశమునఁ గ్రూరుడని పేరందినచక్రవర్తి, తర్వాతివారు మహమ్మదుషా, బహదూర్షా, షాలములు బలహీనులు. కడపటిబహదూర్షానామమాత్రావశిష్టుఁడు. రంగూనందు క్రీ.వె. ౧౮౫౭లో మృతినందినవాడు

## మొగలిచెట్టు — మొగలియాకులపొదవు

ననుముండ్లుండునుగానఁదోఁటలకుఁగంచెలుగవైచుదురు. ఈచెట్టెట్టిసముద్రపు టిసుకలందైనను పెరుగుఁగానిచవిటినేలలందుఁబెరుగదు. ఈచెట్లుండుతావున బాములు మెండుగ నుండునుగాన జాగ్రత్తం గొనవలసియుండును. దీనికట్టెయందు గట్టియును లేదు. మొగలిపూవులందుమంచిపరిమళముగలదు. గాన వాటినుండి పన్నీరుఁ దీయుదురు. మొగలిచెట్టునుండితీయు నార (మొగలి నార యనఁబడును) కొంతయుపయోగమైనదే.

మొగలిచెట్టునుండి క్రిందికి దిగి క్రమముగ భూమినానుకొని వ్రేళ్ళవలె దన్నునొసంగుకాడలకు మొగలియూడలనియందురు. వీట్లరసముదరరోగములు, అనఁగా గుల్మ, కడుపుబ్బరము, శూల మొదలగువాటిని నివారించునని చెప్పఁబడినది.

ఈమొగలియందు ముండ్లధికముగ నుండినది యాఁడమొఁగపుజాతిగను, ముండ్లులేకుండినను త్తమజాతిగను నెన్నఁబడెడిని. కేవలము ముండ్లులేని మొగలిచాల యరుదు. మొగలియందుఁ దెల్లని పూవులు, పచ్చనిపూవులుపూచు రెండుజాతులు కలవు. మొగలిపూవు శివప్రీతికాదనియు, శివలింగములకుఁబూజింపఁదగదనియునందురు. మొగలివేళ్ళుచక్కఁగఁ గుంచెగట్టునుగాన కొన్నితావుల దంతధావనమున నుపయోగింతురఁట.

## మొదటిబౌద్ధమతమహాసభ మహాగాలు

[మగధరాజ్యము చూడుడు]

## మొద్దుబాఱుట తిమ్మెర — కాళ్ళు

[అందు ముఖ్యముగఁబాదములు] గాని, చేతులు గాని, యొకప్పుడు మొద్దుఁబాఱును. గిల్లినను దెలియకుండునంతటి చైతన్యరహితము (insensi-

గ్రీ గారు. పోవును. పిదప జలజిలలాడుచుం డి తక్కిళ్లిదికట్టుగ నొంచెము సేపుండి సద్దుకొనును తిమ్మిరి యుండును.

శరీరము నందలి నరములు (Nerves) చైతన్య వహములు వీట్లయందు రక్తము చక్కగా ప్రవహించుచుండు నేని. చైతన్యము సరిగా నుండును. కొన్ని కారణములవలన నరములందు రక్తము సరిగా ప్రసరింపక పోయినచో నానరములుండు ప్రదేశము (ముఖ్యముగా కాళ్లు, చేతులు) మొద్దుబారి చైతన్యముం దప్పి తిమ్మిర కల్గును.

సర్వసాధారణముగ హృదయతలము నుండి ప్రారంభమై నరములందుం బ్రవహించి, రక్త స్రావమున కాటంకముం గల్గిన (అనగా ముడుచుకొనిచాలసేపుండుట, కాలిపై కిగాలు నెక్కించి యుల్లి చాలకాల ముండుట) నొక్కేపక్కను చాలసేపు పరుండుటసాధారణముగ రక్తప్రవాహమున కాటంకముంగల్గించెడిని. ఆటంకముంగల్గి రక్తము కాలులంగాని చేతులంగాని స్తంభించి నిలచిపోయిననాభాగము మొద్దుబారును. దానిని వదల్చినతటి రక్తము పైకిం ద్వరితముగ నెగం బ్రాకుట యే తిమ్మిర. కితకితలుగల్గినట్లు జిలజిల లాడును. పిదప రక్తప్రవాహము చక్కం బడుటతో సద్దుకొనును.

ఇది రోగముక్రమముగ నేని వాతమువలన నీమొద్దుబారుట సంభవించునని యెఱుంగునది.

**మొనాకో స్టేటు**—ఇది చాల చిన్న సంస్థానము. ఐరోపాఖండవాటి .... (Nice) ప్రాంతమున నున్నది. ఇది independent Principality ... to Charles ...

పేరుగల ద్యూతసంస్థ (జూదము లాడుతావు) కలదు.

**మొనోడ్రామాటిక్సు** monodramatics):—ఏంది భాషాపదభ్యాసము. ఏకపాత్రచే బ్రదర్శింపఁబడు నాటకకళ. భారతీయనాటక సాంప్రదాయమున 'భాణము' అని దీనికిం బేరు.

**మొరలిచెట్టు**—

(చారపప్పుచెట్టు చూడుడు)

**మొరాకోదేశము (మొరకాష్ దేశము)**—

ఇదిఆఫ్రికాఖండములోనిబెర్బరీస్టేట్సులోని యొక దేశము. మొరాకోయనునది యూరోపావారిడిన పేరు- స్వదేశస్థులు తమభాషయందు మొరకష్షేశ మని యెదరు. ఇదిచాల ఫలవంతమగు దేశము. జనసంఖ్య యున్నిస్టేట్సునందుంగన్న నిందధికము పరిమాణము ౨౧౯౦౦౦ చతురపుమైళ్ళ వైశాల్యముకలది. రాజ్యమేలుభూపతియగు సుల్తాను నకు 'True believers prince' అని యర్థమిచ్చు స్వభాషాబిరుదముగలదు. చిరకాలము నుండి దుష్పరిపాలనము దేశమున సర్వసాధారణమై యుండెను. బానిసత్వము వ్యాపించియుంటయేగాక పట్టణములందు బానిససంతలు జరగుచుండెను. Gohn Finnmore పండితుండీదేశమున సంచరించి, తనపుస్తకమున 'How the moors are governed' అని యుండుట కంటె 'How the moors are misgoverned' అని యుండుట సమంజసమని .... యున్నాడు. దేశము ....

ఇటీవల ఫ్రెంచివారు తమసంరక్షణలోనికిఁ జేర్చుకొని సత్పరిపాలనవిధానము నెలకొల్పి, దేశము నుద్ధరింప నారంభించిరి.

మొరకష్పురము రాజధాని. సుల్తానుగారి ప్రభుత్వపుఁగార్యాలయము లిటఁ గలవు. తంజీరుపురము, మొగడోరీపురము, అట్లాంటిక్కు_మహాసము ద్రతీరమందు రేవుపట్టణములు. దేశమునం దీశాన్యదిశగానున్న ఫెజ్‌పురము పవిత్రయాత్రాస్థల ముగ నున్నది. మఱియు నది టోపీలకుఁ బేరందిన తావు. ఈప్రాంతముననేయున్న 'మెక్వినెజ్' అను చోట సుల్తానుగారి మఱియొక ప్రాసాదము కలదు. ఈదేశమునందు (అవ్వలనున్న జిబ్రాల్టర్ కోట కెదురుగనున్న) స్యుటా పురము స్పానియావారి సైన్యనావికాస్థానము.

## మొరాకోదేశపుఁ బ్రభుత్వము:-

స్వదేశీయులు మొరాకష్‌దేశ మనియెదరు. ప్రజలను మూరు లనియు ననుటఁ గలదు. ఫ్రెంచి ప్రభుత్వరక్షితసంస్థానరాజ్యము. ఆఫ్రికాఖండము లోనిది.

రెండులక్షల ముప్పదియొక్క_వెయ్యి యైదు వందల చతురఁపుమైళ్ళు వైశాల్యమనియు, నేఁబది లక్షలజనసంఖ్య యనియుఁ జెప్పఁబడినది. ఖర్జూరఁపుఁ జెట్లదేశము.

## మొరావియన్ బ్రదరెన్ క్రైస్తవసంఘము:-

మొరావియా తొలుత నాస్ట్రియా హంగేరీయం దుండి, తరువాత జుగోస్లావికా యందు గల్పఁబడినది. బొహిమియాకుఁ దూర్పున నున్నసీమ. ఈసంఘము ప్రొటస్టాంటుక్రైస్తవులు మతవ్యాపకమునకుఁ బనిచేయువారు. క్రీ. శ. ౧౪౫౭ లో John Huss గారి మరణానంతరము స్థాపింపఁబడినదిగాఁ జెప్పఁబడినది.

## మొరావియాదేశము:-

(ఆస్ట్రియాదేశము చూడుఁడు.)

## మొరెయినన్స్(morains):—

గ్లేసియర్ నది నడుచుతఱిఁ గొనితెచ్చిన రాళ్లు, రప్పలు దిబ్బగఁ జేరియుండువాటికి 'morains' అని పేరు. (Glaciers చూడుఁడు.)

## మొలక్కా_స్ద్వీపములు:—

మొల్కాస్ అనిన దేశభాషయందు సాంబారుద్రవ్యముల తావని యర్థ మఁట. ఇవి ఓసీనియాయందలి మలేసియాద్వీపసమూహమునకుఁ జెంది యందలి సుండాద్వీపములలోనివై యున్నవి. సెలిజీసుద్వీపమునకుం దూర్పుగానున్న డచ్చివారిద్వీపములు.

వీటియందుఁ బ్రధానద్వీపము లుత్తరదిక్కు_గ నున్న గిలోలో ద్వీపము, మధ్యగాఁగల సెరామ్, అంబోయన, బెర్నేటి ద్వీపములు, దక్షిణభాగమునఁగల బాండాద్వీపములు పెద్దవి, ముఖ్యము లుగ నెన్నఁబడుచున్నవి. 'బాండా' యనిన దేశభాషయందు జాజికాయ లని యర్థము. దీని నాంగ్లదేశస్థులు 'Nutmegs island' అనుచున్నారు. ఈద్వీపములందు సగటున జాజికాయ చెట్లు, లవంగవృక్షములతోఁటలు నిండియుంటఁ గాననగును. లవంగములు, జాజికాయలు, జాపత్రి విస్తార మెగుమతి యగుచున్నవి.

బాండాచుట్టుకొలత యిరువదిమైళ్ళుండును. ఇది జాజికాయతోఁటలమయము. అంబోయన ద్వీపము లవంగములతోఁటలమయము. జాపత్రి, జాజికాయం జట్టుకొని యుండును. లవంగములు, పూలమొగ్గలు నివి యన్నియు డచ్చి (హాలండు) ప్రభుత్వరక్షితములై యుండును.

**మొల్లచెట్టు:—** లా. gasaminum Pubescens; సం. మనోరమః - మనోహరః.

మొల్లలు పరిమళముగల పుష్పములకై పూఁదోఁటలందుఁ బెంచుజాతి. ఇందుఁ దెల్లపూవులం బూచునది, పచ్చపూవులం బూచునది, యడవి మొల్ల యని మూఁడుభేదజాతులు కలది.

దుష్టరక్తమును శుభ్రపఱచి, నేత్రరోగములను గుదుర్చు నందురు.

అడవిమొల్లకు నంద్యావర్త మనుపేరుగూడఁ గలదనియు, సంస్కృతమున గణికా, యూథికా యనునామములు గలవనియు, దీనివేరు విరేచన బద్ధముఁ జేసి, సంగ్రహిణి, రక్తపైత్యముల శమింపఁజేయు ననియు, చలువఁజేయు ననియుఁ జెప్పఁబడినది.

**మొసలిచేదు(తి)కట్టు:—**
(జున్ను చూడుఁడు.)

**మోంటు బ్లాంకు (Mont Blanc):-** యూరోపుఖండమున స్విజర్లాండు ఆల్ప్సుపర్వత మందలిదియై ఫ్రాన్సుదేశఁపు హద్దులలోనున్న పర్వతశిఖరము. "తెల్లనిశిఖరము" అని యర్థమఁట. ౧౫౭౮౨ అడుగులయెత్తు. ఆల్ప్సుపర్వతములం దిది యెత్తైనశిఖరమఁట.

**మోఆబైట్ - శిలాఫలకశాసనము:-** ఇది Klein గారికి దిబన్‌గ్రామమున (పాలస్తీనా దేశఁపు మోఆబ్ సీమయందు) దొరకిన శిలా ఫలకశాసనము. ఇది నల్లని బసాల్టుజాతి రాతిఫలకము. దీనిపై ముప్పదినాల్గుపంక్తులు కలవు. ఆది మహిబూ్రలిపియందు క్రీ. ము. ౮౫౦ కాలము నాటి, ఇస్రీలు వారిపై మోఆబ్ దేశఁపుభూపతి యగు మెషాప్రభునకుం గల్గిన జయములను వివరించిరి. ఇది యిప్పుడు పారిస్‌నగరమున Louvre యం దుంచఁబడి యున్నది. ఇది దొరకుట క్రీ. వె. ౧౮౬౮ లో నఁట.

**మోఘవంతుఁడు :—** నృగునిసంతతి. చంద్రవంశక్షత్రియుఁడు కుమార్తె మోఘవతి. భర్త సుదర్శనుఁడు. ఈమెతో నృగుని వంశము సరి.

**మోచన (శివమల్లి) చెట్టు:—** దీనిం గూర్చి సరిగాఁ దెలియదు. వేరునే మోచన యనుచున్నారు. మోచనవేరురసము లేకఁ గషాయము నించుక వేఁడిఁ గ్గించి వాతము, శ్లేష్మము, విషదోషము, నుబ్బుజాడ్యము, ఊపిరిగొట్టునొప్పి, పాండురోగముల నివారించునని చెప్పఁబడినది.

**మోచర్లవెంకన్న; దత్తప్పకవులు:-** వీ రాంధ్రకవులు. ఏజళ్ళవా రను తెట్టుజమీందారులకడ నాస్థానకవీశ్వరులుగా నుండినవారు. వీరు సోదరులు. వెంకన్నకవి జ్యేష్ఠుఁడు. వీరు రచించిన గ్రంథము లేవో తెలియ రా కున్నవి.

దత్తప్పకవి సర్వజ్ఞసింగమనాయునిచేఁ బరాభవింపఁబడిన యొకవిద్వాంసుఁడు తన శరణువేఁడ నభయ మొసంగి యాతనింగొని సర్వజ్ఞసింగమనాయుని యాస్థానమున కేగి ప్రభుని వంచించి పశ్చాత్తప్తునిం జేసి వండితుని బహూకరింపఁ జేసె నని యొకకథను జెప్పుచున్నారు. ఇందలి నిజ మెంతవరకో తెలియకున్నది.

**మోజోపహితరాష్ట్రము:—** ఇప్పటి జావాద్వీపమునం దుండిన రాజ్యము. జావాద్వీపమునకుఁ దొల్లింటిపేరు యవద్వీపము. సుమిత్రా ద్వీపము, బార్నియో (తొల్లింటిభరణి) ద్వీపము,

సెలిబీసు (తొల్లింటి సులభ) ద్వీపమును, నీప్రాంతముననే గలవు. ఆది మోజోపహితుండను భూపతిచేఁ బాలింపఁబడి, యాయననుండి మోజోపహితరాష్ట్ర మని పే రందినదని బలమైన వాడుక కలదు.

సరియగు తొల్లింటి చరిత్ర లేకపోయినకతన సరిగాఁ దెలియకున్నను, నాకాలఁపుఁ జీనారికార్డులం దీరాష్ట్రముపేరు గాన్పించుచున్నది. దీనిని జయవిష్ణువర్ధనుం డనుభూపతి పాలించుచుండినటుల నిదర్శనములు గలవు. ఈయనరాజ్ఞి పేరు 'రాతుకన్యక'. కుమారుఁడు 'హాయవర్ధనమహారాజు'. జయవిష్ణువర్ధనుని మరణానంతరము రాతుకన్యకాదేవి క్రీ. వె. ౧౩౨౮ మొదలు ౧౩౪౩ వఱ కిరువదినాల్గు సంవత్సరములు సుతుఁడగు హాయవర్ధనునిబాల్యమునఁ బరిపాలన మొనర్చిన ట్లగుపడుచున్నది. ఈమె యోగినిగ నుండెనఁట.

మఱికొందఱు చరిత్రకారు లీమెయందుఁ బ్రజలసూయాగ్రస్తు లగుట, నొకసరస్సునందు మునిఁగి ప్రాణముల వీడెనని యభిప్రాయపడుచున్నారు. మఱియు వారే పశురావరాష్ట్రములోని వండకగ్రామముకడనున్న సరస్సు నాసర స్సనియెదరు. ఈసరస్తీరమున సురాభయరాజ్యాధిపతియగు నుదయనభూపతి కట్టించిన ఛండియవప్రతిదేవాలయము కలదు. సురాభయపురమి ప్పటికి నాపేరనే బరఁగుచు మధురద్వీపమున కెదురుగ నుత్తర తీరమునం దున్నది.

రాతుకన్యకకుఁ బిదప హాయవర్ధనుండు రాజ్యమునకు వచ్చియుండవలెను. కాని, హాయవర్ధనుని బాల్యమునం దభ్రవిజయుండు మోజోపహితరాష్ట్రమును బాలించినటులఁ గొన్నినిదర్శనములు కాన నగుచున్నవి. అభ్రవిజయునికాలము క్రీ. వె. ౧౩౪౯ మొదలు ౧౩౪౯ వఱకని తేలుచుంట నీయైదుసంవత్సరము లీయభ్రవిజయునిపరిపాలనకుఁ గారణ మేమో పరిశీలింప వలసియే యున్నది. అభ్రవిజయునకు సమకాలికుండగు సురాభయరాష్ట్రాధిపతియగు నుదయనమహీపతి తనసురాభయరాష్ట్రములోని మోదకర్తపురమునం బ్రతిష్ఠించిన జలతుండాలయమునందుఁ బెరిగిపోవుచు స్పష్టముగాఁ దెలియకున్న యొకశిలాశాసనమున మోజోపహితరాజ్యముంగూర్చియు, నభ్రవిజయుంగూర్చియు నక్షరము లుంటఁ, బరిశీలన లింకను జరుగుటయే సమంజసము.

ఇంకను రాతుకన్యక పరిపాలనముననే యామె కడఁ బ్రధానమంత్రిగ నుండిన 'గజమాత' యనునాతఁడు ౧౩౪౧ ప్రాంతమున శింగసారిరాజ్యాధిపతి నోడించి, యాతనిరాష్ట్రమునుండి సుపితురంగను వేఱురాజ్యమును గై కొని, తాను భూపతియై పిదప స్వతంత్రుఁ డాయెనని కొన్నిరికార్డులందుఁ జెప్పఁబడియున్నది. సుపితురంగుపురమున కిప్పటిపేరు సుమరంగుగ నుండియున్నది.

సరియగుకాలము తెలియరాకున్నను క్రీ. వె. ౧౩౪౯ కిఁ బిదప రాజ్యమునకు వచ్చిన, అశ్వహాయమహారాజు ౧౪౦౦ సంవత్సరప్రాంతము వఱకు రాజ్య మేలియుండును. లేక మఱియెవ్వరైనను రాజ్యమునకు వచ్చియుండిరేమో తెలియదు. కాని క్రీ. వె. ౧౪౦౦ ప్రాంతమున నంకవిజయుం డనుభూపతి మోజోపహితరాజ్య మేలినటుల నిదర్శనములు కలవు. ఈతఁడు గొప్ప బలాఢ్యుఁడు. సైన్యదళములు, నావికాదళములు విశేషముగఁ గల్గినవాఁడు. సుమిత్రాద్వీపమునందలి భాగమును, భరణిద్వీప (ఇప్పటిబార్నియో) మునందలి భాగమును, తనరాజ్యమునకుఁ గల్పుకొనినవాఁడు. ఈతనిపాలనమునఁ బ్రజలు ధనధాన్యసమృద్ధిఁ గల్గి సుఖమున మనిరని నేటికిని

ప్రజ లీతనింగూర్చి పాటలుఁ బాడుచుందురు. ఈతనికుమార్తెను 'రాదన్ప్రిహామత్తు' అను మహమ్మదీయమతస్థుఁడు పరిణయ మాయెనఁట.

మోజోపహితరాజ్యమునకుఁ గడపటిహిందూ భూపతిపేరు బ్రహ్మవిజయుఁ డనియు, నాతండు మహమ్మదీయులచే క్రీ. వె. ౧౪౭౮ లో సంగరమున మడిసినపిదప, మహమ్మదీయాక్రాంతమైన దనియు, పిదప ౧౫౫౪ లోఁ బోర్చుగీసువారిచే మహమ్మదీయు లోడిరనియు, క్రీ. వె. ౧౬౪౬ హాలండు దేశపుఁ బ్రభువులవశ మాయెననియు, పిదప నించుమించు ౧౬౪౬ ప్రాంతమున జావా ద్వీప మంతయు డచ్చివారి (హాలండు) రాజ్యమై ౧౮౧౧ సం॥రము వరకట్లే యుండి యాంగ్లేయ ప్రభుత్వమువారివశమై ౧౮౧౪ ఆగస్టు ౧౩ తేదీ లండను సంధిపత్రముమేరకుఁ దిరుగ డచ్చివారి కిచ్చివేయఁబడి, తదాదిగ వారిస్వాధీనమందే యున్నది. (మతర రాష్ట్రము చూడుఁడు)

**మోటారు హారన్సు:**—భరతదేశమునఁ దొల్లి రథములలోఁ బ్రియాణమొనర్చువారు శంఖములఁ బూరించుటయు, కొమ్ములను, బూరాల (బాకా) నూదుటయు, ధ్వనిపరికరములుగ వాడుచుండెడివారు. ఎడ్లబండ్లయం దేపరికరములును వాడఁబడక బండితోలువారి యదలింపు కేకలే ధ్వనిపరికరములుగ నుండినవి. ఆంగ్లదేశము నుండి నేర్చిన గుఱ్ఱపుఁబండ్లయం దాదిని లోహముతోఁ జేయఁబడిన బూరా (బాకా) ల నూదుటయుఁ బిదప కాలివ్రేళ్ళతో నొక్కి వాయించు గంటలును వాడఁబడుచుండినవి.

మోటారుబండ్లు వచ్చినపిదప 'హూటర్' (Hooters) అనుధ్వనిపరికరము వాడఁబడుచున్నది. ఇది తనధ్వనిని ముందునకే వదలుంగాని, గుఱ్ఱపుబండియందలి గంటవలె ధ్వని నన్నిదిశలకు వెదఁజల్లి ముందు వెనుకలవారిని కలవరపఱుపదు. మఱియుఁ జాలదూరము ముందునకు వినఁబడుటయు, మోటారు త్వరితగతి కనుకూలముగ నుండుటయుఁ గడుసమంజసముగ నుండును.

**మోటారుసైన్సు (motor signs):**—ఇవి యపాయములు కలుగకుండ జాగ్రతం దెలుపఁ



బాతినస్థంభములపై నమర్పఁబడు పలకలు. ఈస్థంభములు బాటలపైఁ దొమ్మిదియడుగులయెత్తునను, పట్టణములలో నెన్మిదడుగులయెత్తునను నాటఁబడుచుండును. (మోటారుసిగ్నలుసు చూడుఁడు.)

1. Rough Road
2. Zig Zag right
3. Zig Zag left
4. Cross Roads
5. Crossing guarded
6. Level crossing the guarded
7. Warning sign
8. Right turn
9. Left turn
10. School
11. Ded end Cross Road
12. Side road right
13. Side road left
14. Steep hill
15. Ferry
16. Hairpin bend right
17. Hairpin bend left
18. No right turn
19. Closed to axles 3 tons
20. Closed
21. No parking
22. Direction sign
23. Speed limit
24. Parking ground

# MOTORING SIGNS AND SIGNALS.



**మోటారుసిగ్నలులు** (Motor Signals):— బాటలపై మోటారుబండ్లు పరువిడు చుండుతఱి, బాటల సంధిస్థలములకడఁ బోలీసుయుద్యోగులు నిలువఁబడి, బండ్లు నడపువారికి సైగల నిచ్చుచుందురు. Signals.

౧ వ నంబరు (డ్రైవరు)
నేను నిల్పఁ బోవుచున్నాఁడను.



౨ వ నంబరు (డ్రైవరు)
నేను కుడిప్రక్కకుఁ ద్రిప్పఁబోవుచున్నాఁడను.



౩ వ నంబరు (డ్రైవరు)
నేను ఎడమప్రక్కకుఁ ద్రిప్పఁబోవుచున్నాఁడను.



౪ వ నంబరు (డ్రైవరు)
నేను మెల్లగాఁ బోవుచున్నాను.



౫ వ నంబరు (డ్రైవరు)
ఎదుటిడ్రైవరునకు వెనుకనుండి ముందునకు
నాకుడిప్రక్కగా సాగిపొమ్ము.





౧ వ నంబరు (డ్రైవరు)
ముందువైపునుండివచ్చు డ్రైవరుకు బండి ఆఁపు.



౨ వ నంబరు వెనుకవైపునుండివచ్చు డ్రైవరుకు బండి ఆపుము.



౩ వ నంబరు. ముందు వైపునుండియు, వెనుక వైపునుండియుఁగూడవచ్చు డ్రైవరులకు బండి ఆపుఁడు.



౪ వ నంబరు. ఒకటవనంబరు సిగ్నలుమేరకు ఆపఁబడిన బండిడ్రైవరుకు "సాఁగిపొమ్ము".



౫ వ నంబరు- రిలీజుసిగ్నలు ఆఁపఁబడిన బండ్ల డ్రైవరులకు నిలుపఁ బడినది మొదలు సాఁగి పొమ్మని అనువఱకుఁ జూపఁబడుసిగ్నలు.

**మోటుపల్లి రేవుప్రదేశము**:- ఈ సముద్రతీరఁపురేవు ఆంధ్రదేశమున సుప్రసిద్ధమై యుండెడిని. క్రీస్తుపూర్వమునుండియుఁ బేరందియుండెను. ఇప్పటి గుంటూరుమండలమునందు బాపట్లకు సమీపముగా నున్న తావు. ఇది పశ్చిమమున రోమకసామ్రాజ్యము, అలెగ్జాండ్రియాపురము, కైరు పట్టణము మున్నగుమధ్యధరాసముద్రఁపురేవులతోను, తూర్పునఁ జీనా జపాన్ రేవులతోను, సింహాలముతోడను, ఇంకఁ గొన్నిద్వీపములతోను వర్తకము సాగించుచుండినదిగాఁ జెప్పఁబడినరేవు. రోమకులు 'మైసాలియా' యని వారిభాషయందు వాడుచుండిరఁట. చరిత్రకారుఁడగు ప్లయినీయును, భూగోళశాస్త్రజ్ఞుండగు టోలమీయును, ఈ రేవువర్తకముంగూర్చి తమగ్రంథములందు వ్రాయుట కెంత పేర్వడసియుండెనో యోచించినఁ దెలియ నగును. కొంద రక్కాలఁపునవనాగరికులు మోసలపురమనియు, ముకుళపుర మనియు, వేగ్రిలానగర మనియు, కొంద రింకను దేశ్యాక్కొండయనియుఁ బేరులను వాడుచుండిరని తెలియుచున్నది. ఈపేరు లచ్చు టచ్చుట దొరకినశాసనము లందుఁ గాననయ్యెడిని.

ఈరేవుయొక్క యుచ్ఛదశ శాతవాహన, ఇక్ష్వాకు, (ఇఖాల్),బృహత్పాలాయన, విష్ణుకుండి, చాళుక్యరాజ్యములకాలమున నవ్యాహతముగ సాఁగి, చాళుక్యరాజ్యావసానమునఁ జెలరేఁగిన మాండలికమూఁకల దోపిళ్ళవాతంబడుచు, భంగములపాలై నిలచిపోయెను. వర్తకులు పాఱిపోవుచుండిరి. ఏఁబదివత్సరము లిట్లు పాడుపడియుండిన పిదపఁ, గాకతిగణపతిదేవమహారాజు రాజ్యము ప్రారంభమై, యాయనబుద్ధి నాకర్షించెనఁట. ఆయనయు నిట కరుదెంచి, తొల్లింటివర్తకులను రావించి, యభయ మొసంగి, తిరుగ నీరేవున వర్తకము సాగింపఁ బ్రోత్సహింపఁ దిరుగఁ దల యెత్తి, వాణిజ్యము నడువ నారంభించెనఁట. ఆ మహారాజుయొక్కయభయ (శిలాఫలక) శాసన మొకటి మోటిపల్లియందు వీరభద్రదేవస్థానఁపుఁ గల్యాణమంటపమున స్తంభమునం దమర్పఁబడి యున్నది.

మున వినియున్నవాఁడుగాన, దానిం జూఁడఁబోయి తనడైరీయందు 'ముటఫలీ' యని వ్రాసుకొని యుండెను. మోటుపల్లిప్రాంతదేశమునం దంతటను కడుంగడు సన్నఁపుఁబట్టలు రవసెల్లా లనుపేరున విరివిగ నేయఁబడి, యెగుమతి యగుచుంటఁ బ్రసిద్ధి కెక్కియుండెడివి. ఇట రత్నములవర్తకము విస్తార ముండెడిదఁట. ఇటుల నీస్టిండియా కంపెనీ కాలమున, బహామనీసుల్తానుల పోషణక్రింద, మచిలీపట్టణఁపు (బందరు) రేవు ప్రారంభమై యభివృద్ధి నందుటతో మోటుపల్లిరేవు క్షీణింప మొదలిడెను. ఇప్పుడు చిన్న పల్లెగ్రామమై, నామ మాత్రావశిష్టమై యేమైభవము లేక నిలిచి యున్నది. (ధరణికోట సామంతరాజ్యము చూడుఁడు. త్రిలింగ కాకతీయ సామ్రాజ్యము చూడుఁడు.)

## మోట్టన్శాఖక్షత్రియులు:-

(క్షత్రియకులము చూడుఁడు.)

**మోడలిజమ్** (Modalism):—తండ్రి, కుమారుఁడు, నాత్మ యనునవి యొక్కటే పదార్థ మనియు, వ్యక్తిభేదము రూపతః కన్పించుచుండు ననియు సిద్ధాంతము. ఇది బైబిలునందలి క్రైస్తవ ధర్మసిద్ధాంతము.

**మోడెరేటిజమ్** (Moderatism):—క్రమనిబంధనలతోఁ గూడుకొన్నట్టియు, క్రోధము నుద్రేకము లేనట్టియు భావములఁ గార్యసాధనముఁ జేయుసిద్ధాంతము. రాజకీయ మత సాంఘిక పరి పాలనములం దీభావములు గలవారు 'Moderates' అనఁబడుదురు.

**మోడల్పార్లమెంటు** (Model Parlement):—ఇంగ్లాండుదేశమున నొకటవ యెడ్వర్డుభూనాథుఁడు క్రీ. వె. ౧౨౯౫ సంవత్సరము నవంబరులో నాహ్వానించి కూర్చిన పార్లమెంటు మహాసభయందుఁ బ్రతిషైరునుండి యిద్దరేసి Knights ప్రతిముఖ్యమై బరోనుండి యిద్దరేసి Burgesses క్లర్జీప్రతినిధులు, నుండుటంజేసి సంతృప్తికరమై యుండెనఁట. పిదప నేర్పడిన పార్లమెంటుసభలు, ప్రముఖులు, భూస్వాములు (Nobbs), మతగురువులుఁ గూడ నుండున ట్లేర్పాటులు జరుఁగుటం జేసి యీ ౧౨౯౫ నవంబరు నాటిసభ నీపేరున వాడనైనదఁట.

**మోదగిరి** (మాంఘీరు):-దీనికి హిరణ్యగిరి యనిపేరు కలదని చెప్పఁబడినది. ఇంకను హిరణ్యాపర్వతము, ముద్గలగిరి, యనుపేర్లు గలవు. 'monghir' అనుపురముకడ నున్నది. (అంగదేశము చూడుఁడు.)

మాంఘీరు జిల్లాయందు ముఖ్యపట్టణము. ఇట సీతాకుండము కలదు. ఇది స్నానతీర్థము. (అంగ దేశము చూడుఁడు. బీహారుదేశము చూడుఁడు).

## మోదాయనగోత్రము:—

(వాధ్ర్యస్వ లేక మిత్రియువగణము చూడుఁడు.)

## మోదుకులగోత్రము:-

(మోరుకుల చూడుఁడు.)

మార్కోపోలోగారు భరతదేశమునం దుండిన తఱి మోటుపల్లిరేవుప్రఖ్యాతి తనయిటలీదేశ

Gyroscope system:-ఇది యిట్టి యినుప బాటలవిధానమునఁ జాల నభివృద్ధి (improvement) గాఁ జెప్పఁబడినది. క్రీ. శ. ౧౯౦౭ సంవత్సరమున నొక బండికి గైరోస్కోపులయంత్రి మమర్పఁబడినది. దాని Flyweels రెండు నిరుదెసలను మినిటునందు ౭౫౦౦ రివల్యూషను తిరుగుటతో బండియొక్క equilibrium సరిగా నమరి (తూచినట్లుండి), భూమిపైఁ బరువంబడిన యొంటిపట్టాపై బండి పరువిడెను.

వేరొకచో నలువదిమంది నెక్కించుకొనిన బండి ౧౯౦౯ సంవత్సరమునఁ దనయందలి గైరోస్కోపుచక్రము లొక Vacum నందు మినిటునకు 3000 revolutions తిరుగుచుండ భద్రముగఁ బర్విడెనని చెప్పఁబడినది. ఈవిధానమునందు ౧౯౧౦ ప్రాంతముల 'Richard Scherl' అను పేరుగల జర్మను ఎంజనీ రొకఁ డెక్కువగాఁ బరిశీలనల సల్పియున్నాఁడు. ఏది యెట్లున్నను పెక్కండ్రు దీని నింకను 'Experimental stage' యనుచుండుట విన నగుచుండును.

3 ఇంకఁ గడపటిదియగు Langen system:-ఈవిధానమున పైనుండి దిగువవైపుగ బండ్లొంటి పట్టానుండి వ్రేలాడఁ దీయఁబడును. బండ్లు విద్యుచ్ఛక్తిబలముచే నడుపఁబడును. ఇట్టిది Barmen నకును, Elber field నకును వేయఁబడి చక్కఁగఁబనిచేయుచున్నదని తెలిసెడిని.

**మోబోక్రసీ (Mobocracy)**:-ఇది లాటిన్ భాషాపదజన్యము. సుశిక్షితులు గానట్టియు, నీచ తరగతులకుఁ జెందినట్టియుఁ బ్రజాసంఘముచేత నడుపఁబడు ప్రభుత్వము.

**మోరటోరియమ్ (moratorium)**:— ప్రభుత్వమువా రొకదినమును గాని, కొంతకాలమును గాని, యొకప్రత్యేకకార్యార్థమై వినియోగించుటకుఁ గాని, యితరపనుల నాపుమని యుత్తరువుఁ జేయఁబడు నట్టికాలము లేక దినమున కీపేరు వర్తించును.

'మోరటోరియమ్' అన నిలిపియుంచుట కర్థమగును. financial panic గలకాలముల ప్రభుత్వమువారు ప్రజలనమ్మకఁపు సదుపాయముల కిట్టి moratorium ను ఏర్పఱచుటఁ గలదు.

**మోరియాభాగము**:— ఐరోపాఖండము నందలి గ్రీసుదేశములోనిభాగము. దీనిని 'Peninsular Greece' అనెదరు. (గ్రీసుదేశముఁ జూడుఁడు). మోరియా యనిన ద్రాక్షపత్రి మని యర్థము. దీనియాకారముంబట్టి యాపే రిడి రఁట.

**మోరిశాఖక్షత్రియులు**:
(ప్రమారశాఖక్షత్రియులు చూడుఁడు).

**మోరుకులగోత్రము**:—ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి.
(వైశ్యగోత్రములు చూడుఁడు)

మోరుకుల (మోరక, మోర్కాకుల, మోదుకుల) గోత్రము. ఏకార్షేయ (౨౮) గోత్రము, మృకండగణము, సంస్కృతగోత్రము, మార్కండేయస, ఆపస్తమ్బ, యజుశ్శాఖ, ప్రమాణ, ఆద్యప్రవరఖన్డ, మూలస్థానేశుఁడు దేవత. భార్య మూలాంబ. వెంకటాద్రి తపస్థానము. మూలామ్బురాశి తటాకము. జపము లక్ష. దీపము ౧౬. క్షేత్ర సంఖ్య ౨౦. హయదానము. ఇంగువ, మేడికాయ వర్జనీయములు.

**మోర్మనుమతగ్రంథము** (Book fo mormans:— మోర్మను లమెరికాసంయుక్త రాష్ట్రమునందు సాల్టులేక్సిటీయందుఁ గలరు. వీ రా ప్రాంతముల నొకలక్షా యేఁబదివేలు కలరు. ఇంకను నితరప్రదేశముల నేఁబదివేలు కలరఁట. వీ రిది క్రైస్తవమతాంతర్గతమగు నొకశాఖ. వీరు బైబిలు పూర్వోత్తరనిబంధనల రెంటిని నంగీక రించుచుఁ బైఁగా నీమోర్మనుమతగ్రంథము నవ లంబించినవారు. ఇది వారికిఁ దృతీయ నిబంధన గ్రంథము.

ఒకరాతిపెట్టెయందు బంగారురేకులపై లిఖిం పఁబడిన యీగ్రంథము జోసెఫ్ స్మిత్ (Joseph Smith) అనుమహాత్మునకు దైవసూచనలవల్ల దొరకి, వారే దీనిని దేశభాషలోనికి భాషాంతరీ కరించి, క్రీ. వె. ౧౮౩౦ లోఁ బ్రకటించిరి.

**మోర్మనులు:**—వీరు క్రైస్తవమతస్థులం దొక యంతశ్శాఖ. వీరికి బైబిలు మూఁడవనిబం ధనఁ గూడఁ గలదు. (లేటరు డే సెయింట్సు చూడుఁడు.)

**మోర్మన్‌సెయింట్సు:**—క్రైస్తవమత శాఖలలో మోర్మను లొకతెగవారు. అమెరికా సంయుక్తరాష్ట్రమున సాల్టులేకు సిటీప్రాంతమున విస్తారముగఁ గలరు. వీరు బైబిలుమూఁడవనిబం ధనను ప్రధానముగఁ దలంచియున్నారు.

వీరి సెయింట్సునకు 'లేటర్ డే సెయింట్సు' Latter day saints అని వాడుక. ఇతర క్రైస్తవులచేఁ గల్పింపఁబడినది.

**మోర్కాకుల గోత్రము:**— (మోరు కుల చూడుఁడు.)

**మోర్డాన్టుకలర్సు** (mordant colours) **రంగులు:**—

(రంగులు చూడుఁడు,)



**మోర్నింగుస్టార్** (Morning star):— (వెనస్ గోళము శుక్రుఁడు, వెనస్ గోళము చూ డుఁడు.)

**మోర్సు - ఆల్ఫాబెట్:**—

(తంతీవార్తా యంత్రము చూడుఁడు.)

**మోర్గూ** (Morgue):— ఇది యమెరికా సంయుక్తరాష్ట్రదేశమునందుఁ బ్రబలియున్నవార్తా పత్రికాసంబంధసంస్థ. ఇతరదేశములం దంతగా వ్యాపించియుండలేదు. కాని యాదేశమునం దిది పత్రికానిర్వహణమున కత్యావశ్యకమని తలంపఁ బడుచున్నది. గొప్పవిద్వాంసులు దీని నాంగ్లమున 'Reference library' అనియు ననుచున్నారు. ఇందుఁ జరిత్రలు, చరిత్రాత్మకవ్యాసములు, శాస్త్రసంబంధవ్యాసములు, తత్వ (నిజతత్వ) శాస్త్రసంబంధవ్యాసములు, వార్తాపత్రికలనుండి కత్తిరింపఁబడిన వ్యాసములు, ముఖ్యాంశములు, మనుష్యులజీవచరిత్రలు, ఛాయాపటములు, నితర ములగు ముద్రితాకారములు, పత్రికలు, సంచి కలు, ప్రభువులపటములు, వారిజీవచరిత్రలు మొదలగు ఫోటోగ్రాఫులు చక్కనిరీతుల విషయాను క్రమణికలను గూర్చి వరుసఁగ భద్రపఱచి యుం చెదరు. అత్యాతురగ వార్తాపత్రికలం దేదేని వివరిం పఁబడవలసినచో నీమోర్గూనుండి దానింగూర్చి పత్రికలందుఁ బూర్తిగ చరిత్ర వ్రాయఁబడుటకు వలయుఫోటోగ్రాఫ్ లభించెడిని.

(వార్తాపత్రికా నిర్వహణము చూడుఁడు.)

**మోలినిజమ్** (Molinism):- స్పెయిను దేశీయ క్రైస్తవతెగలలో నొకతరగతి. క్రీ. శ. 1535 1600 లూయస్ మోలినా అనువారి యొ క్క సిద్ధాంతము.

**మోలిబ్డెనమ్** (Molybdenum):— ఇది 'metallic element' అని చెప్పఁబడినది. ఇది Chemical symbolmo అనియు,

atomic weight 96 అనియు, atomic number 42 అనియు, specific gravity 8. 6 అనియు, melting point సెంటుగ్రేడు తెర్మోమీటరు 1900 డిగ్రీలవేడియం దనియుఁ జెప్పఁబడినది. వెండివలెఁ దెల్లగ నుండు మెఱుఁగు గల లోహము. ఇది యుక్కుతోఁ జేయుపని ముట్లయందుఁ గల్పుదురట.

**మోాలెక్యూల్ (Molecule):—** తనశరీర సంబంధ మైజలక్షణగుణములను వీడక వాటిని బ్రదర్శించుశక్తిఁ గల్గియుండు నతిచిన్న (అనఁగా నెంతచిన్నదిగ నుండ వీలగునో యంత చిన్నది యగు) పదార్థము, లేక పదార్థమందలిముక్క. ఇందొకటి గాని, యంతకన్న నెక్కువగఁగాని, పరమాణువు (atoms) లుండుంగాని, పరమాణువునందు నైజగుణలక్షణము లుండవు. మోాలెక్యూలు ఘనరూపమునఁగాని, ద్రవరూపమునఁ గాని, వాయురూపమునఁగాని యుండునని చెప్పఁ బడినది.

**మోాల్డీవియాస్టేటు:—**
(రుమేనియాస్టేటు చూడుఁడు.)

**మోాషన్సాఫ్దిఎర్తు:-** (motions of the earth) భూమి గుండ్రముగా నుండి తనకుఁ దానే గిరగిరఁ దిరుగుచుంట యొకటియు, నట్లుఁ దిరుగుచు సూర్యునిం జుట్టువచ్చుచుంట యొకటియు 'motions of the earth' అనఁబడును. ఇందు మొదటిదానికి 'Rotation of the earth on its own axis' అనియెదరు. ఇందువలన భూమధ్యరేఖపై నించుమించు గంటకు ౧౦౫౦ మైళ్ళగమనవేగమును, అందునుండి కల్గు చలనమును గల్గునని లెక్కింపఁబడినది. అటనుండి యుత్తరదక్షిణధ్రువప్రదేశములవఱకు వడి పోనుపోను తగ్గిపోవుచుండుంగానఁ జలనముఁగూడ దానితోఁ దగ్గిపోవుచుఁ గడకు ధృవప్రదేశములందు బొత్తిగాఁ గొంచమై యుండును.

భూమియం దధికపదార్థము (matter) భూమధ్యరేఖవద్దనే యుండునుగాన, భూమియొక్క యాకర్షణశక్తియు నటనేయధికముగాఁగల్గియుంట, సహజధర్మమైనను, నట భూచలనవేగముయొక్క యుద్ధృత మట నుండు నాకర్షణశక్తిం జెదరఁ గొట్టి, భగ్నపఱచుకతన నట యాకర్షణశక్తి తగ్గిపోవుచున్నది. ఇట్టిశక్తికి 'Centrifugal force' అని పేరిడియున్నారు. భూమి తనకుఁదానే తిరుగుట వలనఁ గల్గుచలనమునకు 'Durnal motion' అనియెదరు.

ఇంక రెండవది 'Motion of the earth' అనఁబడిన సూర్యునిం జుట్టివచ్చు చలనమున కొకతటిఁ దిరిగివచ్చుటకు ౩౬౫ దినముల, ౫ గంటల ౪౫ మినిట్ల పైచిలుకుకాలము పట్టును. సూర్యుని డయామీటరు 8,80,000 వేలమైళ్ళ కధికమనియు, భూమి డయామీటరు 8000 మైళ్ళనియు, సూర్యుని శరీరపరిమాణము భూపరిమాణముకన్న Million times అధికమనియుఁ జెప్పఁ బడినది.

ఇటుల భూగోళము సూర్యునిం జుట్టివచ్చు మార్గమునకు 'Orbit' అని పేరు. అది యించుక Oval గా వృత్తమువలె నుండును. దానినడుమగ సూర్యుఁ డుండు తావునకు 'Focus' అనియెదరు. సూర్యునకు భూమి దూరముగ నుండు తావునకు 'Aphelion' అనియు, సమీపముగ నుండు తావునకు 'Perihelion' అనియుఁ బేర్లు వాడుక నందియున్నవి. (ఎస్ట్రోనామీ చూడుఁడు. భూమి చూడుఁడు. కాలము చూడుఁడు. సీజన్సు చూడుఁడు. పాశ్చాత్యకాలవిభజనచరిత్ర చూడుఁడు.)

## మోసేవాని తెలుసును కావడి బరువు:—
(ఆంధ్రలోకోక్తి)

## మోహనఖండము:—
కళింగదేశమున సముద్రతీరప్రాంతభూమి కీపేరుండెను. ఇప్పుడు వాడుకయందు లేదు.

## మోహర్ శాఖక్షత్రియులు:—
(క్షత్రియకులము చూడుఁడు)

## మోహ, సంతస, దుఃఖములు:—
మోహ మనిన కోరిక, లేక వాంఛ. దేనినైనఁ గాంక్షించుటకు మోహమని పేరు. ఎక్కువగా వ్యాపించిన మోహమునకు వ్యామోహ మని పేరు.

సంతస మన తనకోర్కె లభించుకతనఁ గల్గెడి వినోదము. ఇది సంతోషశబ్దమునుండి కల్గిన పదము. ఇది యేకకార్యసంబంధి. ఇది యశేష మగు సర్వకార్యసంబంధి యగుతఱి నానందముగఁ బరిణమించెడిని. ఆనందము పరమేశ్వరునిలక్షణము లలో నొకటిగ హిందూమతమున వివరింపఁబడినది. సంతసము మనుష్యాదులందుఁ గలదు. ఆనందము పరమేశ్వరునియందుఁ గలదు. ఆనందము పరిపూర్ణ మగునది.

దుఃఖము తనకోర్కె లభించకనో, లేక గల్గినది విఫలమౌటనో కల్గెడి విన్నదనము, లేక దుఃఖ విచారము. తనకుఁ గల్గిన నష్టమునకుఁ దాఁ జేయునది లేక సంభవించిన దీనావస్థకు దుఃఖమని పేరు. దుఃఖము విషాదముం గల్గించును.

మోహసంతసదుఃఖములు మూఁటికిని మూలమని చెప్పఁదగిన యవ్యక్తతకు బుద్ధి యని పేరిడఁ బడినది. బుద్ధి యొకతత్త్వముగ మానవశరీరమునం దుండునని యద్వైతమతసిద్ధాంతమునందుఁ దెలుపఁబడినది. బుద్ధి, మనస్సును ప్రోత్సహించుటయో లేక నిరుత్సాహపఱచుటయో సల్పుచుండెడిని.

## మోహిని:—
ఈపేరు రెండువిధములుగ నున్నది. బ్రహ్మకుమార్తె మోహిని రుక్మాంగదునిఁగూడి యాతని యేకాదశీవ్రతభంగముఁ జేయ యత్నించినది.

విష్ణువుయొక్క స్త్రీరూపమగు మోహిని, యమృతము దేవతలకుఁ బంచి యిచ్చుచో, రాహువును ఁగవేసి రాహుకేతువులుగ రెండు చేసినది. మఱియు దారుకావనమున శివుంగూడి సంచరించుచు నచటికర్మవాదులగు ఋషుల నధోగతిపాలొనర్చి శివునివలన (ఆశ్చర్య) భైరవునిం గనినది.

## మోక్షద్వారక:—
(ద్వారకలు చూడుఁడు.)

## మోక్షప్రదపురములు ఏడు (సప్తమోక్షదాయకపురములు):—
౧ అయోధ్య:- సంయుక్తరాష్ట్రములం దిప్పటి పైజాబాదుపురముకడ పాడైయుండిన పురాతననగరము. సూర్యవంశఁపురాజులకు రాజధానిగ నుండెను. సరయూనదీతీరము. వారికిలవేల్పగు నాగేశ్వరనాథశివాలయము, శ్రీరామజన్మస్థానము, యాగస్థలము, పెక్కు శ్రీరామమందిరములు, పురాతనఁపుకోట యానవాళ్లుఁ గలవు.

౨ మధుర:-ఇప్పు డాంగ్లేయులచే ముత్రాయనఁ బడు జిల్లాయందుఁ బ్రధానపురము. యమునానదీతీరమున సంయుక్త రాష్ట్రములలో నున్నది. శ్రీకృష్ణునిజన్మస్థలియగు వ్రజమండల పవిత్రభూమిలోనిది.

3 మాాయాపురి:-దీని నిప్పుడు హారిద్వార మను చున్నారు. తొల్లింటి మాయాపురప్రదేశము వదలివేయఁబడి, యిప్పుడు హారిద్వార మను పేర నాప్రక్కనే క్రొత్తపట్టణము నిర్మింపఁ బడినది. ఒకప్పుడు గంగాద్వార మని వాడుక యుండెనఁట. ఇట మాయాదేవిదేవస్థానము, గంగానదియందు స్నానఘట్టమున విష్ణుపాద ము, కంకాళమున దక్షయజ్ఞగుండస్థలము, దక్షేశ్వరశివలింగము మొదలగునవి కలవు. విశ్వనాథ శివదేవస్థానముకలదు. అది నవీనమని యొకవాడుక కలదు. గంగాతీరము.

౪ కాశీ:-దీని నిప్పుడు బనారస్ అనుచున్నారు. విశ్వేశ్వర, అన్నపూర్ణాదేవి, విశాలాక్షీదేవి, కాలభైరవ, దండపాణి, బిందుమాధవ, దుర్గా దేవస్థానములును, మణికర్ణిక గుండమును గలసుప్రసిద్ధక్షేత్రము. గంగాతీరము. సంయుక్తరాష్ట్రములందున్న నగరము.

ఇది గాక హిమాలయ పర్వతోపరిసీమలందు 'గుప్తకాశీక్షేత్రము' ఉత్తర కాశీక్షేత్రముఁ గూడఁ గలవు గాని యవి సప్తమోక్షదాయక పురములలోనివి కావు.

౫ కాంచీపురము:-దీని నాంగ్లమున 'Conjeeveram' అనుచున్నారు. చెన్నపట్టణముకడ చెంగల్పట్టు మండలముననున్న పురము. పెక్కు విష్ణుదేవస్థానములు, శివదేవ స్థానములు, కామాక్షీదేవస్థానమును గలవు. విష్ణుదేవస్థానములందు వరదరాజస్వామి దేవ స్థానమును, శివదేవస్థానములం దేకాంబరేశ్వర దేవస్థానమును సుప్రసిద్ధములు. కంచికామాక్షీ దేవస్థానము దేశప్రసిద్ధము.

౬ అవంతికాక్షేత్రము:—మాళవదేశమునకు రాజధానిగనుండిన యుజ్జయినీపురము. ఇట మహాకాళీలింగము గలదు. కాళీనదీతీరము. సుప్రసిద్ధక్షేత్రము. ఇది యిట్లుండ మైసూరు రాజ్యమునందలి కోలారుజిల్లాలోని అవనిగ్రామము నవంతీక్షేత్రమనియు, నిట శ్రీరామ ప్రతిష్ఠితశివలింగము, వాల్మీకాశ్రమపర్వత ము మొదలగునవి కలవనియు నొకవాదమును బయలుదేఁదీసియున్నారు. ఇది పరిశీలించ వలసినదిగానే యున్నది.

౭ ద్వారక:— గుజరాతు (తొల్లింటి సౌరాష్ట్ర) దేశమునఁగల సుప్రసిద్ధక్షేత్రము. (ద్వారకలు చూడుఁడు.) శ్రీకృష్ణునినగరము. అనాటి పట్టణము శ్రీకృష్ణనిర్యాణఁపురాత్రి సముద్రగామియైపోవుటచే నిప్పటిపట్టణముఁబిదప నిర్మించుకొనిరని చెప్పఁబడినది. ఇప్పుడు ద్వారకలు మూఁడు కలవు. భేటీద్వారక, కాకడీద్వారక, మోక్షద్వారక యని మూఁడుగ యాత్రాస్థలము లమర్చి యున్నారు. బొంబై రాజధానిలో నున్న సుప్రసిద్ధ విష్ణుక్షేత్రము.

**మోక్షసోపానపంచకము:**—౧ బోధ, ౨ ఉపరతి, 3 వైరాగ్యము (విరక్తి), ౪ భక్తి (దైవభక్తి), ౫ ధ్యానము (బుద్ధినిలచుట - చిత్తవృత్తినిరోధము.)

**మాాంజకాశి గోత్రము:**— (గవిష్ఠిర గణము చూడుఁడు.)

**మాాంజకిగోత్రము:**-(అగస్త్యుఉపగణము చూడుఁడు.)

**మాాంజగవగోత్రము:**—(కణ్వఉపగణము చూడుఁడు.)

**మౌంజగోత్రము:—**
(కణ్వఉపగణము చూడుఁడు.)

**మౌంజాయనగోత్రము:—**
(శాండిలగణము చూడుఁడు.)

**మౌంజాయనగోత్రము:—**
(కథ లేక కథ్యగణ్యము చూడుఁడు.)

**మౌంజిగోత్రము:-**
(అగస్త్యఉపగణము చూడుఁడు.)

**మౌంజికులగోత్రము:-** ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్య గోత్రములు చూడుఁడు.) మాంజి లేక మాంజికుల, (ముంజికుల, మాంజిన) గోత్రము. ఏకాహ్నేయ ౨౫ గోత్రము. ముంజాయనగణము. సంస్కృతగోత్రము మాంజాయనన. ముంజవ్రిత్తి. ప్రమాణ ఆద్య ప్రవరఖండ. సమానగోత్రము. ముంజివ్రితన. మూలేశుఁడు దేవత. మూలాంబ భార్య. పుష్పాచలము తపస్థానము. అభినవసరస్సు తటాకము. జపము ద్వాదశలక్ష. దీపములు ౩౬, క్షేత్రసంఖ్య. ౧౪. కందమూలములు (దుంపలు) దానము. మిరియాలు వర్జనీయము.

**మౌంటెన్సు రేంజి (పర్వతపంక్తి):—** Mountain పర్వతము, గిరి, కొండ, శైలము, చుట్టుపట్లప్రదేశముకన్న నెత్తైన రాళ్ళకు, అడవులకు, తుప్పడొంకల కాకరమై యెత్తుగుప్రదేశమునకుఁ బర్వత మందురు. ఇవి కాలానుగతముగ భూమియందలి వేఁడికిఁ బైకుబికి యున్నైనవి. Hills mountain కన్న చిన్నవి. పర్వతమునందు రంధ్రములుండి, యవి భూమిలోనికి లోతునకుం బోయి లోనివేడిని, పొగను, కరఁగినశిలలను, మట్టిని, పైకి విసరుచుండెనేని దానిని అగ్నిపర్వత (Volcano) మందురు.

పర్వతముయొక్క యుపరిభాగమును Summit, లేక Top అనెదరు. దిగువభాగమును Base లేక Foot. కొండధరి, పాదము, అలిపిరి యనెదరు. పైకి మొనవలెఁ బెరిఁగినపర్వతశిఖరములకు 'Peaks' అనిపేరు. బల్లబఱుపుగ సమప్రదేశము లుపరిభాగమునందుఁగల పర్వతములకు 'Table mountain' అనిపేరు. పర్వతోపరిభాగమునం దున్నట్టి సమప్రదేశమునకు 'Table land లేక Plateaux, అనిపేరు. రెండు peaks నడుమనుండు పల్లఁపుఁబ్రదేశమగు పర్వతభాగమునకు Saddle అనిపేరు. పర్వతపంక్తి (పొడవు) కి Range లేక Chain అనెదరు. బర్వతసముదాయము (కలిసియుండినగుంపు) నకు Group అనియు, ఇటువంటి గుంపులు, పర్వతపంక్తులు కలసియుండిన సముదాయమునకు Mountain System అనిపేరు. వాటి యివ్వలి నుండి యవ్వలికిం దాఁటిపోఁదగినమార్గములుగ నగుచుండుపర్వతములలోని పల్లఁపుఁబ్రదేశములకు 'passes' లేక defiles అనిపేరు. వీట్లగుండా పర్వతములందాటి యివ్వలినుండి యవ్వలి కేగు మార్గము లుండును.

అగ్నిపర్వతమునకు 'Volcano' అనిపేరు. అగ్నిపర్వతముయొక్క రంధ్రమునుండి పొగ(Smoke) ఆవిరి (Steam), కాలినవియు, కరఁగినవియు నగు రాళ్ల (melted rock), బూడిద Cinders, నీరు, పై కప్పటప్పట వచ్చుచుండెడిని. అగ్నిపర్వతములందలి పల్లఁపుభాగములకు రంధ్రములకు, 'Crater' అనిపేరు. కరగినరాళ్ళకు 'Lava' అని యనెదరు. వేఁడినీ ళ్ళగ్నిపర్వతరంధ్రముల

నుండి పైకివచ్చుటయు, నెగురుచుంటయుఁ గల్గిన వాటికి 'Geysers' అనెదరు.

Earth quakes భూకంపములు, అగ్నిపర్వతసంబంధమగు భూమియందలి వేడియొక్క కార్యమని తలంపఁబడుచున్నది.

రెండుకొండలకు లేక పర్వతములకు నడుమ నుండు సమప్రదేశమును 'Valley' యనెదరు. సాధారణముగ Valley ఫలవంతమగునట్టిదిగా నెంచఁబడుచుండును.

**మౌఖరివంశనృపతులు:—** ఒకప్పుడు కన్యాకుబ్జదేశ మేలిన నృపతులు. క్రి. వె. ౬౩౬ లో రెండవశిలాదిత్యుఁడను హర్షవర్ధనుఁడు వీరిం జయించి, రాజ్య మాక్రమించెననియు, మఱియు నాతఁడే స్థానేశ్వరమునుండి కనూజుకు రాజధానిని మార్చెననియుఁ జెప్పఁబడినది.

**మౌత్స్యగోత్రము:—**
(హారితఉపగణము చూడుఁడు.)

**మౌద్గలగోత్రము:—**
(కుండినగణము చూడుఁడు.)

**మౌద్గలగోత్రము:—**
(ముద్గలఉపగణము చూడుఁడు.)

**మౌద్గల్యగోత్రము:—**
దీనిని ముద్గలగోత్రమని కొంద ఱనుచున్నారు.
(ముద్గలఉపగణము చూడుఁడు.)

**మౌద్గల్యగోత్రము:—**
(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.)

**మౌద్గల్యుఁడు:-** ఋషి. శాకల్యుని శిష్యుఁడు.

మఱియు నజామీఢుని రెండవసుతుఁడగు నీలునిసంతతిలోని భర్మ్యాశ్వుఁడు లేక హర్యశ్వుని సుతుఁడగు ముద్గలుఁడు. కుమారుఁడు దివోదానుఁడు కాన్యుఁడు. కుమార్తె యహల్య. గౌతమునిభార్య. ఈముద్గలుఁడు జన్మతః క్షత్రియుఁ డయ్యు బ్రాహ్మణుఁడై నవాఁడు. ఈతనిసంతతి మౌద్గల్యసగోత్రి బ్రాహ్మణులు.

**మౌనం పండితలక్షణమ్:-** ఇది సంస్కృత భాషయందలి లోకోక్తి. మౌనము పండితుల లక్షణమును, నధికప్రసంగము పామరలక్షణమునని భావము. ఇట మౌన మనఁ గొంచెముగా మాట్లాడుట యని యెఱుంగునది. కాని, యిది సభల యందుఁ బనికిరాదని చెప్పఁబడినసంగతి.

**మౌనములు మూడువిధములు:—**

౧ వాఙ్మౌనము:— అనృతము, పరనింద, శృతి కటువు మొదలగు దోషములు రాకుండుటకు మితభాషియై మాటలను నియమముగా నుపయోగించుట.

౨ అక్షమౌనము:— ఇంద్రియనియమము. తన యింద్రియములను దుర్వృత్తులపాలుఁ గాకుండ నియమముగ నడుపుట.

3 కాష్ఠమౌనము:— శరీరము నతయోగాదులచే శుభ్రపఱచి, గట్టిపఱచుకొని మలినము, రోగములపాలుఁ గాకుండ నడుపు నియమము.

**మౌనా త్సత్యం విశిష్యతే:—**
మౌనము వహించుటకన్న సత్యము పల్కుట యెక్కువది.

**మౌనేన కలహో నాస్తి నాస్తి జాగరతో భయమ్:—** మౌనము వహించుటవలనఁ (ఊరకుండుటవలనఁ) గలహ ముండదు, జాగ్రతగా నుండిన భయముండదు నని భావము.

**మానేయులు:**—కశ్యపునకు ముని యను భార్యయందుఁ గల్గినసంతతి. వీరేగంధర్వులు, వీరు పురుకుత్సచక్రవర్తిచే నాగలోకమునుండి తరుమఁ గొట్టఁబడిరని చెప్పఁబడినది.

**మారిషస్ ద్వీపము:**- (ఆఫ్రికాఖండమున కుఁజెందిన పండ్రెండు ద్వీపములు చూఁడుడు.)

**మౌర్యనృపాలురు:**—మగధ భూపాలుండగు నందునికి శూద్రస్త్రీయగు మురయందుఁ గల్గిన సంతతి గాన మౌర్యు లనఁబడిరి. పిదప మౌర్యశబ్దము మయూర యని మార్చఁబడె నఁటఁ గాని, మొదటిపే రస్తమింప లే దఁట. వీరు మగధ రాజ్యమును క్రీ. పూ. ౩౨౧ మొదలు, క్రీ. పూ. ౧౮౫ వఱకు అనఁగా ౧౩౭ సంవత్సరములు పాలించిరి. చంద్రగుప్త, అశోకులపాలనక్రిందికి గాంధారముఁ గూడఁ జేరియుండ, ఆగాతోక్లీ సను సైనికుఁడు గాంధారమునుండి మౌర్యులం దరిమివై చెనని చెప్పఁబడినది.

బుద్ధభగవానుని సమకాలికుఁడగు బింబసారుఁడు, నాయనసుతు డజాతశత్రుఁడు, నతనిసుతుఁడు చంద్రగుప్తమహారాజు, నాతనిసుతుఁడు బింబుసారుఁడు, బిందుసారుని సుతుఁ డశోకచక్రవర్తియు మౌర్యులు.

**మౌర్యచంద్రగుప్తుని తక్షశిలాప్రవాసము:**—సుప్రసిద్ధమగధరాజ్య మాన్నత్యదశ ననుభవించుకాలమునఁ గడపటి (తొమ్మిదవ) నంద మహారాజు చక్రవర్తిగ నుండినకాలమున నాయనకు 'ముర' యనుపేరుగల శూద్రవనిత భోగవనితగ నుండెను. ఆమెయం దాయనకుఁ జంద్రగుప్తుం డనుసుతుం డొకఁ డుండెను. ఆతండు మిగుల బలాఢ్యుండు, ధీశాలి, రాజనీతితంత్రములను బాగుగ నెఱింగినవాఁడు. ఆయనకన్న వేఱు సుతు లామహారాజునకు లేకుండిరి. ఈయనయే యామహారాజునకుఁ బిదప సింహాసనమున కరుదెంచినచో మగధరాజ్యమున 'నందాంతం క్షత్రియకుల' మ్మనుటఁ దటస్థించునని కొంద ఱనుకొనుచుండిరి. ఇట్లుండ నందమహారాజు మృతినొందెను. కొందఱు సామంతులసహాయమున సైనికబలమును జేయూఁతగఁగొని, యప్పటియమాత్యుం డొక జ్ఞాతిని సింహాసన మధిష్ఠింపఁజేసి, రాజ్యకార్యముల నడుప నారంభించెను. క్రొత్త భూపతియుఁ జంద్రగుప్తుని శక్తిసామర్థ్యముల నెఱింగినవాఁడు. గాన వెఱచి యాయనను రాజ్యమునం దుండనిచ్చినఁ దనస్థితి కపాయముఁ గలుగవచ్చునని యాతనిని బాంచాలమున కవ్వలనున్న తక్షశిలానగరమున (ఇప్పటి టాక్సిలా Taxila) కుం బ్రవాసముంపి, యాతనికిఁ గావలిగాఁ గొంతసైన్య మట నుంచి విశ్రాంతిగ నుండెను. చంద్రగుప్తుఁడు మురయొక్క కుమారుండు గాన, మౌర్యచంద్రగుప్తుం డనుపేరు వాడఁబడుచుండెను. ఆతనిసంతతివారికే మౌర్యవంశస్థు లని పేరు.

అక్కాలమున నిప్పటి గ్రీస్ దేశమున కియోనా (Ionia) యనియో, ఇయోనియా యనియో, పేరు వాడుకయం దుండెనఁట. ఆదేశపు వర్తకులు భరతదేశమున కరుదెంచుచు, బంగారము, ముత్తెములు, దంతములు, మిరియములు, ధాన్యములు, పట్టు మొదలగునవి కొని గొంపోవుచుండిరి. వారిని భారతీయులు 'యవను' లని వాడుచుండిరి. ఇయోనాపదమునుండియే యవన పద మేర్పడినది. భరతదేశస్థులచే యవనదేశమనఁ బడుచుండిన నా ఇయోనా దేశమునందు మెసిడోనియా యనుపేరుఁగల యొకప్రత్యేకభాగరాజ్య ముండెడిని. దానిని "ఫిలి"ప్పనుపేరుగల భూపతి

పాలించుచుండువాఁడు. ఆయన ఫిరంగులఁ జేయఁగనిపెట్టినవాఁడు. అదివఱకు యుద్ధములం దొడిసెలత్రాటియందు మట్టియుండల నుంచి త్రిప్పి విసరుచుండెడివా రఁట. ఆ ఫిలిప్పుభూపతిసుతుఁడే సుప్రసిద్ధుండగు మహాలగ్జాండరు (Alexander the great). భరతదేశమునకై దాడివెడల వచ్చినవాఁడు. ఈతనికిఁ బట్టుదల యధికము. తనకుఁ దోఁచిన దంతయుఁ జేయుటయేగాని, రాజనీతి, దూరాలోచనము, రాజ్యతంత్రము, బుద్ధికుశలతల నెఱుంగనిమూర్ఖతఁ గలవాఁడు. బలాఢ్యుఁ డనిపించుకొని, సైన్యబలముం గల్గినవాఁడు. భరతదేశమున కరుదెంచిన వర్తకు లాదేశముం బొగడుచుండ, విని, దాని నాక్రమింప మనసుఁ దగిలి, దాడివెడలి బయలుదేరినవాఁడు. ఆయనతో నెపుడు శూరులు పదునేడువేలపదాతులుండిరి. 'హిరోడోటస్' అనుపేరుగల చరిత్రకారుఁ డొక డుండెను. ఆయన గ్రీకుజాతివాఁడే యని చెప్పఁబడినది.

ఈప్రయాణఁపుస్థితి యిట్లుండ భరతదేశఁపుభూ ౨ లైకమత్యము లేక నంతఃకలహములు మెండై, చీటికి మాటికిఁ గలహించుచుండు దుస్థితివ్యాపించుచుండెను. ఇదే యదనుగఁజూచి, ఇరాన్ (ఇప్పటి పారశీకము Persia) దేశఁపు నృపాలుఁడు, ఒకటవ డెరయస్, భరతదేశఁపు ఇప్పటిపశ్చిమోత్తర పరగణాల (N. W. Frontier Province) పంజాబులోని కొంతభాగము, సింధుదేశ మంతయు నాక్రమించుకొని తనసామ్రాజ్యరాజ్యమునకుఁ జేర్చుకొని యుండెను. ఆయన క్రింద నిరువదియాఱు సత్రాపీ (ఒక గవర్నరు పాలనక్రింది పరగణా) లుండెను. అం దిది యిరువదియవ సత్రాపీ యని పారశీకఁపుగ్రంథములందుఁ జెప్పఁబడినది.

మహాలగ్జాండరు భరతదేశమునకుఁ గైబరు కనుమమార్గమున నరుదెంచి, తొలుదొల్తఁ బారశీకరాజ్యమునను్న నీమూఁడింటి నతిసులభముగాఁ బట్టుకొనెనఁట. దానినుండి యలగ్జాండరుగారి ప్రభుత్వమునకు మున్నూట యిరువది టాలెంటుల బంగారము పన్నులుగా నాదాయము వచ్చుచుండెనని గ్రీకుచరిత్రకారుఁడగు హీరోడోటస్‌గారి వ్రాఁతలనుండి తెలియనగుచున్నది. ఇది యాంగ్ల నాణెములందుఁ బదిలక్షలపౌనులగునని లెక్కించి యున్నారు.

ఇది యిట్లుండఁ దక్షశిలానగరమునఁ బ్రవాసకాలమునకుఁ దరితెలియకఁ జంద్రగుప్తుఁడు విద్యావ్యాసంగములచేఁ గడుపుచుండువాఁడు. అది విద్యలకుఁ బేరందిన విశ్వవిద్యాలయ ముండిన తావు. ఆయనతో బాల్యస్నేహితుఁడగు చాణక్యుండను విప్రుం డొకఁడు కూడ నరిగియుండెను. ఈవిప్రుండే కౌటిల్యుని అర్థశాస్త్రమును రచించిన గ్రంథకర్త. గొప్పరాజనీతిజ్ఞుఁడు. ఇట్లుండ మహాలగ్జాండరు తక్షశిలను ముట్టడించెను. కౌటిల్యుని సలహామేరకుఁ దక్షశిలాపరిపాలకుఁ డెదురేగి, యలగ్జాండరునకు వశవర్తిగ నుందునని వాగ్దానం బొనంగి, ఆయనతో, మున్ముం దాయన నెదుర్చువారితో, సంగర మొనర్ప సంధిఁ గుదుర్చుకొని, తనసైన్యబలముతో నడువసాఁగెను. అది క్రీస్తు వెనుక 3౨౭ - 3౨౫ సంవత్సరములకాలము. పిదప నలగ్జాండరు పాంచాలాధీశ్వరుండగు పురుషోత్తమభూపతి (పోరస్) నెదుర్కొనం బోయెను. పురుషోత్తముఁడు ప్రజలచే నెన్నుకొనఁబడిన నృపాలుఁడు. ముప్పదివేల కాల్బలమును, నాల్గువేలయశ్వదళమును, ఏనూరు రథికులసైన్యమును, కొంతగజదళముం గల్గినవాఁడు. వితస్థా (ఇప్పటిజీలమ్) నదిని దాటి, అలగ్జాండరు పురుషోత్తమునితో ఘోర

సంగర మొనర్చి, తన యుద్ధాశ్వమును 'బూసీ ఫలస్' అనుపేరు గల వాయువేగతురంగముం గోల్పోయెననియు, పురుషోత్తమునకు గాయము తగిలి బాణము గుచ్చుకొని పడియుండ నాయన యెక్కియుండిన యుద్ధగజము సాగిలపడి, తన తుండముతో నాయూచఁ జాగ్రతగ నూడఁబెఱికి యాయనం దనపై వైచుకొని, భద్రమగు తావున కరిగెననియు 'ప్లూటార్చి' యనుపేరుగల చరిత్రకారుఁడు తన అలగ్జాండరు జీవిత' మనుగ్రంథమున వ్రాసియున్నాఁడు. ఎట్టకేల కీసంగరమున సంధి కుదిరి, పురుషోత్తమభూపతి తనరాజ్యమున నలగ్జాండరునకు సామంతుఁడుగా నేర్పడియెను.

ఈగడబిడయం దలగ్జాండరుసైన్యములు కట్టుఁగట్టి యుద్ధముఁ జేయనొల్లమనియు తమదేశము నకై మరలుదుమనియు, నలగ్జాండరును నిర్బంధించిరి. ఆతఁడు చేయునదిలేక మరలిపోవ నంగీకరించెను. ఇందుఁ జాణక్యుని ప్రోత్సాహము కలదని కింవదంతు లట నట వ్యాపించెను. అలగ్జాండరు కొన్నిపడవలం గుదుర్చుకొని వితస్తా [జీలమ్] నది ప్రవాహముతోఁబాటు దిగువకును, దానినుండి శతద్రు [చీనాబ్] గుండా, పిదప రవీనదిగుండా సముద్రమునకుం బ్రయాణమై చనసాఁగెను. సైన్యములు దరిపై నడుచుచు, నాపడవలకు రక్షకముగాఁ జనుచుండెను. మార్గమున మూలస్థానపురికడఁ [ఇప్పటి ముల్తాన్] గొంద రాటంకములు గల్గింపఁ జిన్నసంగరము నడఁచి యాతండు ముందు కఱుగసాఁగెను. వేఱొకచో దుండముఁ డనుతపస్వి యొక్కండు తనయాశ్రమంబునఁ దపంబొనర్చుచుండ, నలగ్జాండ రాతనిం దనకడకు రమ్మని వర్తమాన మంపెను. ఆతపస్వి నాకు నీతోఁ బనిలేదనియు, నీకు నాతోఁబనియున్నఁ నీరాజసతామసములం దూరముగ నుంచి నీవే యిటకు రావచ్చుననియు, తిరుగ వర్తమాన మంప నలగ్జాండరు గినిసెనటఁగాని; సైన్యము లిందేమియుం గల్గించు కొనసందునఁ జేయునది లేక, పయనము సాగించెనఁట. భరతభూమియం దీతండు మొత్తము పందొమ్మిదినెల లుండెనఁట. ఆతండు సూసాపురికిం జేరి, జ్వరపీడితుండై మరణించెను.

అదివఱకే యాతనిసైనికులలో నొకఁడు పురుషోత్తమభూపతిం బరిమార్చియుండెను. అలగ్జాండరు మృతి నందినవార్త తక్షశిలకుం జేరఁగనే చాణక్యుండు మేల్కాంచి ప్రజలఁ బురికొల్పి, చంద్రగుప్తుని తక్షశిలకును, పాంచాలమునకును, పట్టభద్రునిగ నొనర్చెను. ఇటులఁ బశ్చిమోత్తర దిశలప్రభు వయిన చంద్రగుప్తుండు గొప్పసైన్యముం గూర్చుకొని మగధరాజ్యముపైఁ బాటలీపుత్రమునకు దాడివెడలి, ముట్టడించి, సంగరమునఁ దన తండ్రిజ్ఞాతి నోడించి, సింహాసనమునుండి తొలఁగించిఁ బందెగాఁజేసి కారాగారమున నుంచెను. చాణక్యుఁడును, చంద్రగుప్తునకుఁ బట్టముం గట్టి సామ్రాట్టుగ నొనర్చెను. చంద్రగుప్తుం డాదిగ నారాజవంశము మౌర్యవంశ మనంబడుచుండెను.

**మౌలక్దాసుమతము:-** ఈమతమునకుఁ గర్త మౌలక్దాసను మహాభక్తుఁడు. ఇదియు హరిదాసుమతమును బోలినదియే. హరిదాసుమతస్థులు శ్రీకృష్ణుని బూజించి భక్తిసల్పువారు. మౌలక్దాసుమతస్థులు శ్రీరాముని బూజింతురు. ఇంకను కొన్నియాచారభేదములు గలవు. జపములందు భేదము శ్రీకృష్ణ రామ నామజపములే [హరిదాసుమతము చూడుఁడు]

వీరికి ముఖ్యమతగ్రంథము 'దశరత్న' మనునది. వీరిమత మున్నది వ్రజమండలప్రాంతమే.

**మౌలిగోత్రము:—**
(హారిత ఉపగణము చూడుడు,)

**మౌషకగోత్రము:—**
(నిధ్రువగణము చూడుడు.)

**మౌషరిగోత్రము:—**
(నిధ్రువగణము చూడుడు.)

**మౌలిసగోత్రము:—**
[అగస్త్య ఉపగుణము చూడుడు.]

**మౌసోలియన్ సమాధి:—** ఇది యూది కాలపు ఏడు గొప్పవింతలలో నొకటి caria దేశపు భూపాలుండగు 'mausolus' అను వారి ప్రియరాజ్ఞి యగు artimisia క్రీ. ము. ౩౫౩ సంవత్సరము, ఆమరమరణమున దుఃఖితయై Hallearnassus అనుపురమున, నాయనసమాధి నింతవైభవోపేతముగ సుందరభవన నిర్మాణ మొనర్చి నిర్మింపజేసెనట. ఈపేరునుండియే 'mausolium' అనుపదము పిదప నేర్పడియె నట.

రానురానది ప్రపంచమందలి యూది కాలపు వింతలలోఁ బరిగణింపఁ బడుచుండెనట. అది క్రీ. వె. పండ్రెండవ శతాబ్దమువఱకు నిలచియుండె నని చెప్పఁబడినది.

క్రీ. వె. ౧౪౦౪ లో "knight of St john of Jerusalem స్వాధీనపఱచుకొనుతఱిఁ గొన్ని మార్బెలురాళ్ళుసోపానములు మాత్రము కానఁబడుచుండెనట. అప్పు డట క్లీజీ యను పేరుగలనావ ముండెనట. దీనితాలూకు కొన్ని ముక్కలు ఇంగ్లాండులోని లండనునగరమున బ్రిటీషు మ్యూజియమునం దుంచఁబడియున్నవి.

**యంగుమెన్సు క్రిస్టియన్ ఎసోసియేషన్ (youngmens christian association):-**ఇది క్రైస్తవులకైన సంస్థ. సర్ జార్జివిలియమ్సుగారు క్రీ. వె. ౧౮౪౪ సం॥ రమున స్థాపించిరి. వీరియుద్దేశము క్రైస్తవయువకులు మానసికముగను, కాయికముగను, వైజ్ఞానికముగను, నభివృద్ధినందుట కిం దైకమత్యముఁ గల్గియుండుట యైయున్నది. వీరి కనేకతావుల భవనములు గలవు. ఇట్టిసంఘ మొకటి యిటీవల "యంగ్ ఉమన్సు క్రిస్టియన్ అసోసియేషు" నను పేర నేర్పడియున్నది.

**యంత్రపరికరములు, యంత్ర నిర్మాణము, భాగములు:—** యంత్రపరికర సముదాయము యంత్రము. అట్టివనేక భాగములు యంత్రముగా గలసియగును. యంత్రమనిన నవసరములమేరకు వాటివాటిపనులను జేయుచు, యంత్ర మొనర్చవలసినపనినిఁ బూర్తి యొనర్చునగు యంత్రపరికరసముదాయము. అనఁగా వేర్వేఱు రూపముల వాడఁబడుచునే యుండెఁగాని యిక్కాలఁపు గొప్పగొప్ప యంత్రము [engin] లలోని కర్మకగురీతి నిక్కాలమున రచింపఁబడుచున్నవియే యీవ్యాసఁపుఁ బ్రధానాంశము. యంత్రకళావేత్త లిట్టివి నూటిని లెక్కించియున్నారు. వీట్ల రూపములు వేర్వేఱుతావులందు వేర్వేఱు రచయితలచేఁ జేయంబడి యించుకభేదములుఁ గల్గియున్నను మొత్తమున నొకేధర్మముపై నాధారపడి, యొకే పనినిఁ జేయునవిగా [same principal] నుండుఁగాన వాటియందున్న భేదములం బాటింపక వాటి వస్తుతత్వమునే గణింపవలసియుండును.

యంత్రములు వేర్వేఱుపనులఁ జేయ వేర్వేఱుగఁ జేయఁబడును. వాటి యన్నిం మునకును 'machanism' అని పేరిడియున్నారు. కొన్ని మెకానిజములు చిక్కులుగ నుండుచున్నను

నన్ని మెకానిజములు చిక్కు (complicates) గా నుండుట కవసరములేదు. వీట్లయందు wheels cranks మొదలగునవి యుండి, చిక్కుగ నుండి నను పద్ధతుల మీాఱక నేర్పఱుపఁబడినవే గాన నాపద్ధతులఁ జక్కఁగ నెఱింగిన వాటి నిజతత్వము కాంప్లికేటెడ్ స్థితిగా నుండును. అన్ని యంత్రపరికరములకు గమ్యస్థాన మగుకార్యము 'conversion of motion' అని చెప్పఁబడినది. అనఁగా 'A machine is an instrument by which one can change the direction and speed of a given motion' అని యాంగ్లమున యంత్రశాఖవిదులు నిర్వచించి యున్నారు.

మెకానికల్ మూవ్‌మెంట్సు (లేక mechanical purposes) నిమిత్తము motion ను నందించుసాధనములకు 'mechanical movements' అనెదరు. ఇట్టి movements వందల కొలఁది గాక వేలకొలఁదిగఁగూడ నున్నను, నవియన్నియు reciprocating movement యొక్కయు, సర్క్యులర్ మూవ్‌మెంటు [circular movement] యొక్కయు, ప్రతిరూపములు [modifications] అంగీకారరూపములు [adaptations] గాని యన్యములు కావు. రిసిప్రోకేటింగు మూవ్మెంటు ఇటునటు ముందునకు వెన్కకు నడచుచుండు చలనమును సర్క్యులర్ మువ్మెంటు వృత్తాకారమున గుండ్రగఁ జలించు చలనమునై యున్నవి. సిలెండరునందు పిస్టన్ ముందునకు వెనుకకు నడచుచుంట రిసిప్రోకేటింగు మువ్మెంటే. చక్రములు చుట్టుకొని తిరుగుట సర్క్యులర్ మువ్మెంటే. ఇవి రెండు నొకటి నొకటిగ మార్పఁజనును. అనఁగా reciprocating movement ను circular గను, Circular movement ను reciprocating గను, మార్పనగును. ఇట్లు మార్పఁజేయు పరికరమునకు 'Crank' అని పేరు.

యంత్రము లెంత Complicatedగాఁ జేయఁబడినను, ఎంతసులభమైనపద్ధతిని జేయఁబడినను, కొన్ని (Principles) కొన్నిధర్మముల దాట వీలులేని నిర్బంధనలకు లోనై చేయఁబడినవగుట, నందఱకుఁ దెలియనగుచు వేర్వేఱు కార్యము లొనర్ప నుపయోగింపఁబడుచున్నవి. ఇవి త్వరితగతి నెక్కువపనిఁ బూర్తిఁజేయ నిర్మించి, యుపయోగించుచున్నారే కాని, యాదిని నాగరికులున్నైతము చేతితోఁ చేసిన నాటిధర్మములమేరకే [Principles] పనిచేయునట్లు పరిశీలించినఁ దోఁపకపోదు.

యంత్రములస్థితి నిట్లుంచి యంత్రపరికరము లెన్ని భేదాకారములతో నెందఱు రచించినను వాటిపనుల ఫలిత మొక్కటియేయని మనసునం దుంచుకొనవలసి యుండును.

## నూరు యంత్రపరికరభాగములు

(one hundred mechanical movements or parts):—

1 Lever of first order
2 ... second ...
3 ... third ...
4 Revolving lever first order
5 ... second ...
6 ... third ...



7 The inclined plane
8 Wedge a double inclined plane
9 Screw adoptation of inclined plane
10 Pully of Two blocks



 నూరు యంత్రపరికరభాగములు

11 Pulley of three blocks



12 Pulley of one block



13 Another pulley of three blocks
14 Multiple Sheave blocks
15 The Chinese Windlass
16 A rope twist lever
17 An eccentric crank
18 Jumping motion with pin wheel and bell crank
19 Rope sprocket whell
20 U- grooved wheel pulley
21 Rope transmission; One whell drives another
22 Belt transmission; Pulleys revolve together.



23 Cross-belt to drive pulleys opposite Ways



24 Cone pulleys, Speed Varied by shifting belt



25 Two - speed Step pulleys



26 Two speed pulleys
27 Two speed gear
28 Friction gear
29 Grooved friction gear
30 Sprocket wheel and chain
31 Link belt and pulley-
32 V- Toothed gearing



33 Oblique - toothed gearing
34 Star wheel
35 Star wheel gear
36 Internal Spur gear
37 Bevel gears



38 Crown wheel gear
39 Gear train
40 Worm gear
41 Spiral gear
42 Rack and wheel
43 Piston and cylinder



44 Parallel motion

45 Governor for Varying steam supply



46 Compensating Governor



47 Flanged expansion joint
48 Flexible steam joint
49 Overshot water wheel
50 Undershot water wheel
51 Breast water wheel
52 Flutter wheel
53 Pelton water wheel
54 Water turbine





55 Archimedean Screw
56 Fan blower
57 Hydraulic ram



58 Hydraulic press
59 Slip Hook
60 Differential gear

61 Adjustable feed rolls
62 Pin wheel and slotted pinion
63 Slow forward and quick return motion
64 Slow forward and quick return motion
65 Slow forward and quick rèturn motion
66 Sun and planet crank motion



67 Ratchet wheel and pawl
68 Reversible pawl
69 Slow forward and quick return motion
70 Regular and irregular reversals
71 Rectilinear motion by a lever
72 Lazy tongs used for gates and guards
73 Example of toggle joint
74 Heart shaped cam for reciprocating movement
75 Cam with groove to give Variable movement
76 Grooved cylinder Cam
77 Types of crank motion
78 Angle joint and universal coupling
79 Ball and socket joint
80 Two forms of clutch



81 Dead beat escapement
82 Common type of band saw
83 Usual type of circular saw
84 Hand - drilling machine



85 Swivel Shackle
86 Types of turn buckles
87 Grip tongs
88 Sofety valves
89 Valves for water and steam
90 Lifting jock
91 Conveyer screw
92 Link belt bucket elevator
93 Combination callipers; proportional dividers
94 Gears of voriable speed
95 Blower with two fans
96 Example of ball beaing
97 Three blade screw propeller
98 Lathe for making circular objects
99 Hand emery grinder
100 Lever scales for weighing



## యంత్ర ప్రతిష్ఠాంగములు:—
(అంగములు చూడుడు.)

**యంత్రములబలము గుఱ్ఱముల బలముతోఁ బోల్చి కొలచుట:**—ఏపనిఁ జేయుటకైనను గొంతశక్తి (బలము) యుపయోగింపఁబడుచునే యుండును. ఒకఁడు కొంతబరువును మోయుటకు, మోసుకొనిపోవుటకు, నెత్తుటకు శక్తి యత్యావశ్యకము. నడుచుటకును శక్తి యవసరమే.

ఈశక్తిని 'ఫోర్సు' (force) అనియును, (power) 'పవర్' అనియును, నాంగ్లపండితులు ద్వివిధమని పోల్చిరి. ఉదా:- ఒకఁడొక పది పౌనులు బరువుగలతాతి నైదుసెకెండ్లకాలములో మూఁడడుగులయెత్తుగల యరఁగుమీఁది కెక్కించెను. మఱియొకఁ (రెండవవాఁ) డారాతినే యాయరఁగుమీఁది కెక్కించుటకుఁ బదునేడు సెకెండ్లుకాలము పట్టెను. ఇట్టితఱి మొదటివాఁడు (10 × 3 fh)=ముప్పది ఫూట్ పౌనుల ఫోర్సు నుపయోగించెనని తేలుచున్నది. ఈతఁ డీపని నైదుసెకండ్లకాలములోఁజేసెను. రెండవవాఁడన్నో, అంతఫోర్సు నుపయోగించినను, ఆతఁ డెత్తుటకుఁ బదునేనుసెకండ్లకాలము పట్టునుగాన, (15–5=3) రెండవవానికన్న మొదటివాఁడు మూఁడురెట్లబలమును, రెండవవాఁ డొకవంతు బలమును నుపయోగించిరని తేలుచున్నది. ఇదియే వీరికున్న బలమగునేని, రెండవవానికన్న మొదటివాఁడు రెండురెట్లబల మధికముగాఁ గలవాఁడని చెప్పవచ్చును. ఇది బలము (force) నకును, ఫోర్సు (force) నకును గలభేదము.

తొల్లి యింగ్లాండుదేశములో బరువులుమోయ గుఱ్ఱముల నుపయోగించుచుండిరి. బరువును పైకెత్తుట కొక్కొక్కగుఱ్ఱము సాధారణముగా నొక మినిటుకాలమున నొకయడుగెత్తున కెత్తఁగలబరువు ముప్పదిమూఁడువేలపౌను లని 'జేమ్సువాట్' అను పండితుఁడు లెక్కించెను. మఱియు నాతండే కనిపెట్టిన యావిరియంత్రములబలమును నిట్లె లెక్కించి, యిన్నిగుఱ్ఱములసామర్థ్యముగల యంత్రమిదియని లెక్కఁగుదిర్చి, లోకమునకుఁ దెల్పెను. నేటికి నట్లే యున్నది.

**'య ఏవ కరోతి స ఏవ భుంక్తేతి' న్యాయము:**—ఎవ్వఁడు కష్టపడి చేయునో వాఁడే దానిఫలిత మనుభవించునని భావము. చేసినవారికిఁ జేసినంతఫలమని యాంధ్రులోకోక్తి కలదు.

**యకరము (వాడుక):—**
(ఎకరము చూడుఁడు.)

**యకసయగోత్రము:—**
(లౌగాక్షిగణము చూఁడుడు.)

**'యః కారయతి స కరోత్యేవ' ఇతి న్యాయము:—** ఏపనినైనను జేయించినవాఁడు తాఁ జేసినటువంటివాఁడే. అన్యులచేఁ జేయించుటయుఁ దాఁ జేసినటులనే యని భావము.

**యజాభుక్తిదేశము, జజాభుక్తిదేశము, జజామౌలిదేశము, యజాహూతిదేశము, మహోబాదేశము, దాహలమండలము, బుందేలఖండము, బండెల్ఖండ్:—** ఇప్పుడు బుందేలఖండము, లేక బండెల్ఖం డనఁబడుచున్న దేశము. మనదేశమునఁ గాపురముఁ గుదిరిన యాదేశఁపు బ్రిజలను 'బౌందిలీ' లనుచున్నాము. కాలాంజరపర్వతము లేక రవిచిత్రిపర్వత మీదేశములోనిది. దీనిప్రశంస పద్మపురాణ, సర్గ ౧౭–౧౩౦ యందునను, శివపురాణము ౪–౧౬ యందునను, కాలాంజరప్రశంస కలదు. ఇట నీలకంఠమహాదేవుని దేవస్థానము గలదు. అద్దానిప్రశంస వామనపురాణము ౮౪ యందుఁ గలదు. ఇటఁగల కోటితీర్థమును (కరోటీర్థము), ఆటనే మృగధరమను దేవస్థానమును బ్రిసిద్ధములు. "శ్లో॥ సప్తవ్యాధా దశార్ణేషు మృగాః కాలాంజరే గిరౌ। చక్రివాకా స్సరద్వీపే హంసా స్సరసి మానసి। యేఽస్మిన్ జాతాః కురుక్షేత్రే బ్రాహ్మణా వేదపారగాః॥" అని చెప్పఁబడిన సప్తమృగములుగ జన్మించినతా విదియే. ఇందు ఋషుల నర్చింతురు. గొప్పయాత్రాస్థలము. ఒకరాతియం దేడు లేఁడివిగ్రహములు గలవు.

ఈదేశమందు శుక్తిమతీనది చెప్పఁబడినది. దానిని కర్ణావతి లేక కియానా యనుచున్నారు. ఈనది దక్షిణోత్తరములుగఁ బ్రవహించుచు నీఛండేలురరాజ్యమును రెండుగ విభజించుచుండును. అందుఁ దూర్పుభాగమునందుఁ గాలాంజరదుర్గము, అజయగడ్ కోటలు నుండినవి. పశ్చిమభాగము మహోత్సవదేశము. (దీనిని 'మహోబా' యందురు.) ఖజూరానగర మిం దున్నది. శుక్తిమతీనదీప్రశంస వసుచరిత్రయందుఁ గలదు.

మహోత్సవనగరము 'మహోబా' యాయెనఁట. దానినుండియే దేశమున కంతకు నా పేరయ్యెనఁట. ఇది యశోవర్మ యనువాడుకనామముగల చంద్రివర్మ మూలపురుషుఁడుగాఁగల ఛండేలువంశఁపురాజులకు రాజధాని. చంద్రవర్మ ౮౫ దేవాలయముల నిర్మించి కాలాంజరపురమునఁ గోటఁగట్టె నందురు. ఈతఁడు సంవత్ ౨౨౫ యందు జన్మించెనఁట. ఆయనచే నిర్మింపఁబడిన శాసనముఁగల కోటితీర్థమందలి యొకశాసనమున ఛండేలువంశఁపు రాజులకు మూలపురుషుఁడు 'నన్నుకుఁ' డని కలదు. ఈనన్నుకదేవునికాలము క్రీ. వె. ౮౦౦ మొదలనియు, కడపటినృపతి 'కిరాత్సింగు' పదునాఱవశతాబ్ద మధ్యభాగమువాఁడనియు ౧౬౩–౧౯౭ క్రీ. వె. నని చెప్పఁబడినవాఁడు గాన నీకిరాత్సిం గెవరో తెలియకున్నది. ఈతనికాలము ననే కృష్ణమిశ్రుఁడు ప్రబోధచంద్రోదయనాటకము రచించినవాఁడు. కాలాంజరక్షేత్రము క్రీ. వె. పండ్రెండవశతాబ్దమునఁ ద్రివ్వఁబడిన మదనసాగరతీరమునం దున్నది. కిరాతసాగరము పదునొకండవశతాబ్దమునఁ ద్రవ్వఁబడిన దనుచున్నారు. కోటలో నొకహిరణ్యబిందుతీర్థ మని కలదు. అది మహాభారతము, వన ౮౭ యందుఁ బ్రశంసింపఁబడినది. ఇట నొక కాలభైరవవిగ్రహము ౧౮ చేతులు, మెడలోఁ బుఱ్ఱలపేరు ధరించినది కలదు. ఖజూరాపురము క్రీ. వె. ౧౩ శతాబ్దకాలఁపు రాజధాని యందురు.

ఛండేలురాజ్యమునకుఁ దూర్పున వింధ్యపర్వతము, దక్షిణమున కీయాన్ లేక కాన్‌నది జన్మస్థానము, పశ్చిమమున దశాన్‌నది, యుత్తరమున యమునానది. కాలాంజరపుర మిప్పుడు బాందా జిల్లా బదేనాడివిజనులో నున్నది.

## యజాహూతిదేశము:—

(యజాభుక్తి దేశము చూడుఁడు.)

**యజుర్వేదము:**—వేదములందు రెండవవేదమగు యజుర్వేదమును వ్యాసమహర్షి తనశిష్యుండగు వైశంపాయనుని నియమించి వ్యాఖ్యకాజ్ఞ నిచ్చెను. ఆయనయు, నాయన శిష్యప్రశిష్యులును, వ్యాఖ్యలు పూర్తి యొనర్చిరి. యజుర్వేద మాదినుండియు శుక్లయజస్సు, కృష్ణయజస్సు ననిద్వివిధముగ నుండెను.

శుక్లయజుర్వేదమును వైశంపాయనశిష్యుండగు యాజ్ఞవల్క్యర్షి చేకొనెను. ఈతనికిం దోడుగను, పిదపను, నితనిశిష్యులగు కణ్వర్షి మొదలగువారు శుక్లయజుర్వేదము నుద్ధరించిరి. శుక్లయజుర్వేదమున మాధ్యందినశాఖ లేక వాజసనేయశాఖ యనియు, కణ్వశాఖ యనియు, రెండుభాగములు గలవు. ఈవేదమున నలుఁబది యధ్యాయములు గలవు. మఱియు నిందుఁ బదునేనుశాఖ లున్నవి. అవి ౧ మాధ్యందినులు, ౨ జాబాలులు, ౩ బౌద్ధాయనులు, ౪ కాణ్వులు, ౫ శాకేయులు, ౬ తాపనీయులు, ౭ కపోలులు, ౮ పౌండరవత్సులు, ౯ ఆవటకులు, ౧౦ పరమావటకులు, ౧౧ పారాశర్యులు, ౧౨ వైనేయులు, ౧౩ బైధేయులు, ౧౪ ఔధేయులు, ౧౫ బౌధేయులు నని.

శుక్లయజుర్వేదమున మంత్రములు ౧౯౦౦ లును, వాలఖిల్యులు, ౬౯౪౦ మన్త్రిభాగమునఁ గలవు. దీనిబ్రాహ్మణమునకు 'శతపదబ్రాహ్మణ' మని పేరుఁ గలదు. ఇందునుండి యుపనిషత్తులు ప్రత్యేకముగ రచింపఁబడినవి. శుక్లయజుర్వేద మన్నిలక్షణములతో స్వతంత్రమునఁ దనరుచుఁ బ్రత్యేకవేదముగ నలరారుచుండును. పాదస్వరము, కాత్యాయనము నను రెండుకల్పసూత్రము లీవేద సంబంధములు.

ఇంకఁ గృష్ణయజుర్వేదమును వైశంపాయనుఁడు తనశిష్యులగు ౧ తిత్తిరి, ౨ మైత్రావరుణర్షులకును, చరక, ఆహ్వరక, కఠ, ప్రాచ్యకఠ, కపిష్ఠలకఠ, చారాయణీయ, వారతంతవ, శ్వేత, ఔపమన్యవ, శ్వేతతర, వారాయణీయర్షులకును నొసంగి వ్యాఖ్యలం బ్రోత్సహించెను.

ఇందుఁ దిత్తిరి తైత్తిరీయ మనుభాగము నుద్ధరించెనని తోఁచెడిని. ఆతండు తనశిష్యులగు ఖాండికేయునకును, ఔఖకునకును నొసంగి వ్యాఖ్యానములఁ జేయించెను. అందింకను ఖాండికేయును శిష్యులగు నాపస్తంబ బౌద్ధాయన సత్యాషాఢ హిరణ్యకేశి ఔఖేయర్షులును, వ్యాఖ్యాని ముగించిరి.

మఱియు మైత్రావరుణుఁడును, తనశిష్యులగు వారాహర్షియు, మానవర్షియు, దుందుభర్షియు, శాకేయర్షియు, హారిద్రవేయర్షియు, శ్యామర్షియు, శ్యామాయనీయర్షియు, వ్యాఖ్యాత లయి వేదవ్యాసనియమితకార్యమును ముగించిరి.

కృష్ణయజుర్వేదమున మంత్రభాగమునం దిరువదిరెండు శాఖలు కలవు. అందు ౧ చరక, ౨ ఆహ్వరక, ౩ కఠ, ౪ ప్రాచ్యకఠ, ౫ కపిష్ఠలకఠ, ౬ చారాయణీయ, ౭ వారతంతవేయ, ౮ ఔపమన్యవ, ౯ పాత, ౧౦ వెండినేయభాగములు తమతమవ్యాఖ్యానకర్తలగు నాయాఋషులపేరం

బరఁగుచున్నవి. ఈపదిభాగములను సర్వసాధారణముగ "చరకశాఖ" లని వాడుచున్నారు.

ఇటులనే మంత్రభాగమున మానవ, వారాహ, దుందుభ, ఛాగేయ, హారిద్రవేయ, శ్యామాయనీయ శాఖలాఱును, "మైత్రాయణీయశాఖ" లనుపేరం బరఁగుచు, మైత్రావరణర్షి శిష్యులపేరులం బరఁగుచున్నవి. మఱియును యజుర్వేదమంత్రములలో నివేయగు కాలేయ, కాత్యాయనీయ, హిరణ్యకేశీయ, భారద్వాజ, ఆపస్తంబు లను శాఖలు ఖాండికేయులను సామాన్యనామమునం బరఁగుచు, ఖాండికేయర్షిశిష్యులైదుగురు పేరులను, జౌఖేయులనుశాఖ జౌఖకర్షి పేరను బరఁగుచున్నవి.

ఇటుల చరకులు ౧౦ శాఖలును, మైత్రాయణీయశాఖ లాఱును, ఖాండికేయశాఖలైదును, జౌఖలేయశాఖ యొకటియుఁ గలసి యిరువదిరెండు శాఖలు, కృష్ణయజుర్వేద మంత్రభాగమునందుఁ గలవు. ఇందలి బ్రాహ్మణము మామూలుగనే 'విధి' యనియు, 'అర్థవాద' మనియు, ద్వివిధముగ నుండును. మొత్తమున యజుర్వేద మంతటినుండియు నూటతొమ్మిది యుపనిషత్తులు గలిగెనఁట.

యజుర్వేదము ౮౬ శాఖలు, ౨౮౬ అనువాకములు, ౧౯౦౦ యజస్సులు, ౧౯౮౭ ప్రకరణములు. ఇవి మరియును కృష్ణయజుర్వేదమును 'తైత్తిరీయశాఖ' యనివాడుదురు. ఇది సంహిత, బ్రాహ్మణము, నారణ్యకము నని త్రివిధము. సంహిత ౪౪ ప్రశ్నలు, బ్రాహ్మణమున ౨౮, ఆరణ్యకమున ౧౦ మొత్తము ౮౨ ప్రశ్నలు.

ఆపస్తంబ, బోధాయన, సత్యాషాఢ, హిరణ్యకేశీయ, భారద్వాజ, వైఖానస కల్పసూత్రము లాఱును, కృష్ణయజుర్వేదసంబంధములు.



**యజుశ్శాఖ - విశ్వబ్రాహ్మణులు:**— వీరు విశ్వకర్మసంతతిలోని సనాతనర్షి సంతతివారని చెప్పఁబడినది. యజుశ్శాఖవారి మతధర్మగ్రంథమునకు 'సనాతనసూత్ర'మనిపేరు. వీరియందు క్షత్రియవర్ణ మనియు, దారుకావర్ణ మనియు రెండు వర్ణములు చెప్పఁబడినవి. (విశ్వబ్రాహ్మణులు చూడుఁడు.)

క్షత్రియవిశ్వబ్రాహ్మణులు పర్యాయవృత్తివారనియు, వీరిది విష్ణుసంతతి యనియు, కాళీపీఠ మనియుఁ జెప్పఁబడినది. వీరియం దొక్క సనాతనగణమును, నం దైదుగోత్రములును గలవు.

దారుకావర్ణపువిశ్వబ్రాహ్మణు లాదివృత్తివారనియు, వీరిది మయసంతతి యనియు, పరాశక్తిపీఠ మనియుఁ జెప్పఁబడిరి. ఈమయుఁడే మయవాస్తుశాస్త్రమును రచించెననియు, నాతండే వారమున కధిపతి యనియు వీరనెదరు. వీరియందు రైవతగణము, విశ్వతోముఖగణము, వర్ధకిగణము, అనుమానుషగణము నను నాల్గుగణములును, అందిరువదిగోత్రములును గలవని చెప్పబడినది.

**యజ్ఞదత్తుఁడు:**—తపస్వియగు బ్రాహ్మణునికుమారుఁడు ఋషి. తలిదండ్రులు గ్రుడ్డివారు. కడువృద్ధులు. వారియందు భక్తిగలవాఁడు. దశరథుఁడు వేఁటాడఁబోయి, తలిదండ్రుల దాహశాంతికై యొకతుంబతో నీట ముంచుచుండ నగుచుండు బుడబుడశబ్ద మొక యేనుఁగువలనఁ గల్గునదిగఁ దలంచి, బాణమువైవ, నాఋషిపుత్రుఁడు మడిసెను. ఆతనిపేరు యజ్ఞదత్తుఁడు. వృద్ధులగు ఋషిదంపతులు దుఃఖమున మునింగి, పుత్రశోకము భరింపలేక శరీరములు విడచుచుఁ దమపుత్రునిం జంపి తమ్మీయాపదపాల్జేసినన్నృపుని పుత్రశోకముచే మరణించునటుల శాపమిచ్చిరఁట.

దశరథమహారాజునకును నట్టి దుఃఖకరమరణమే శ్రీరామలక్ష్మణుల వియోగమువలన సంభవించె నఁట.

## యజ్ఞపంచపల్లవములు:—

(పంచపల్లవములు చూడుఁడు.)

## యజ్ఞపురము (ఇప్పటి జాజిపూర్):-

ఉత్కలదేశము (ఒరిస్సా) న కటకంజిల్లాయందు వైతరిణీనదిపైనున్న యొకపట్టణము. ఇట యజ్ఞవరాహదేవస్థానమును, అందుఁ జేయఁబడిన పెక్కుయజ్ఞములనుండియు నీపేరు గల్గినది. దీని నిప్పుడు 'జాజిపూర్' అని వాడుచున్నారు. దీనింగూర్చి మహాభారతము, వనపర్వము ౧౧౩ అధ్యాయమునఁ గళింగదేశమందలిపురముగ వర్ణింపఁబడినది.

ఇట యజ్ఞవరాహదేవస్థానమున కెదుట యజ్ఞవేదికయందు (దశాశ్వమేధఘట్టమున) వైతరణీ గోదానము లొనర్తురు. మఱియు విరజాశక్తిపీఠము ప్రసిద్ధము. అటఁగల గదాధరవిష్ణుదేవుని పాదముల పైఁగల నాభిగయయందు గయావర్జితపితృకర్మ లొనర్తురు.

## యజ్ఞములు:—

దేవతాప్రీతిగా నొనర్చు నగ్నిహోత్రకార్యము యజ్ఞ మనంబడును. పాకయజ్ఞము లేడును, హవిర్యజ్ఞము లేడును, సోమయజ్ఞము లేడును గలసి యజ్ఞము లిరువదియొకటిగ చెప్పఁబడినది. పాకయజ్ఞములు- స్మార్తాగ్ని యందుఁ జేయఁబడునవి. హవిర్యజ్ఞములు స్మార్తాగ్ని, ఔపాసనాగ్నియందుగూడఁ జేయబడునవి. ఇవి సోమరహితములు. సోమయజ్ఞములు- ఇవి శ్రౌతాగ్నియందుఁ జేయఁబడు రెండుసంస్థలు. ఈయజ్ఞములు నిత్యములుగఁ జెప్పఁబడినవి. అనఁగా నకరణప్రత్యవాయజనకములు. (చేయ నారంభించియు వదలివేసిన నపాయకర మగునవి.)

మఱియు నభ్యుదయకయజ్ఞములు పెక్కుగలవు. అశ్వమేధయాగము, రాజసూయము, పౌండరీకము, బృహస్పతిసవము, చైనము మొదలగునవి.

ఇంకను నియతముగాఁ జేయవలసిన యజ్ఞములైదు కలవు. అవి పంచమహాయజ్ఞము లనంబడును. అవి ౧ దేవయజ్ఞము (నిత్యోపాసన హోమము) ౨ పితృయజ్ఞము (తర్పణము పితృశ్రాద్ధములు. ఇది వసు రుద్రాదిత్యరూపులగు పితరుల నర్చించుట) ౩ భూతయజ్ఞము- బలులు. ౪ మనుష్యయజ్ఞము- అన్నదానము, భోజనమిడుట, అన్నశాంతి. ౫ బ్రహ్మయజ్ఞము- వేదాధ్యయనము అనఁగా వేదశాస్త్రములం గొంచెముగొంచెముగనైన నన్నిటి నొకసారి వరుసగఁ బఠించుట.

సోమసంస్థలేడు. శ్రౌతాగ్నియందు వ్రేల్చెడు యజ్ఞభేదములు. ఇవి ౧ అగ్నిష్టోమము, ౨ అత్యగ్నిష్టోమము, ౩ ఉక్థ్యము, ౪ షోడశి, ౫ అతిరాత్రము, ౬ అప్తోర్యామము, ౭ వాజపేయము.

## యజ్ఞవరాహైకాదశి:—

మార్గశిరశుద్ధ యేకాదశి. ఉత్కలదేశమందలి వైతరణీనదీతీర మందున్న జాజిపూర్ (తొల్లింటి యాజపురము) యజ్ఞవరాహక్షేత్రమై యున్నది. ఇది పవిత్రస్థలము. ఇటఁ బెక్కండ్రీదినమున యజ్ఞవరాహైకాదశీవ్రత మాచరించి, గోదానములను, ముఖ్యముగఁ గపిల గోదానముల నొనర్తురు. (పండుగలుచూడుఁడు).

## యజ్ఞవాన్గోత్రము:—

(కుశికగణము చూడుఁడు.)

## యజ్ఞవాహగోత్రము:—

ఇది అగస్త్య సంతతి. అగస్త్యప్రాగ్గణములోని యజ్ఞవాహగణముగఁ జెప్పఁబడినగోత్రము. దీని కగస్త్య, దైఢ్యచ్యుత, యజ్ఞవాహ యని ప్రవర రూపము.

**యజ్ఞుఁడు:—** తండ్రి రుచిప్రజాపతి; తల్లి ఆకూతి. (ఈమె స్వాయంభువమనువు కూఁతురు.) సోదరి దక్షిణ. కారణాంతరమున నీతఁడీమెనే వివాహమాడవలసివచ్చి వివాహమయ్యెను. ఆ మిథునము దోషరహితమని రక్షింపఁబడెనని చెప్పఁబడినది.

వీరికిఁ బండ్రెండుగురు పుత్రులు గల్గిరి. వారికి 'యాము' లని పేరు. మఱియు నీయజ్ఞుఁడు విష్ణు దేవునియవతారమని చెప్పఁబడినది. యాములు పండ్రెండుగురును స్వాయంభువ మన్వంతరమున దేవతలై యుండిరి.

**యటఘాన్ కత్తులు:—** ఇవి టర్కీ దేశపుఁ గత్తులు. రెండుదారు లిరుదెసలం గల్గి యుండును.

**యడారి (Desert):—** ఎడారిమైదానములు నిష్ఫలవంతములైన బయళ్లు. ఇసుకచేత నాక్రమింపఁబడిన తావులు. వ్యవసాయమునకుఁ దోఁటలకుఁ బనికిరాక వదలివేయఁబడినవిగ నుండును. అతిశీతలము, నత్యుష్ణముఁ గల్గి నిర్జలములునై యుండెడివి. చెట్లుచేమ లుండనితావులు. జీవ నివాసములు లేనిప్రదేశములు.

సహారా ఎడారి, గోబిఎడారి, దక్షిణధ్రువ ప్రదేశములు నిందు కుదాహరణములు.

**యతి:—** బ్రహ్మమానసపుత్రులలో నొకఁడు. కారణాంతరమునఁ జంద్రవంశఁపుమహారాజగు నహుషునికిఁ బ్రియంవదాదేవియందుఁ గలిగిన యార్వురుపుత్రులలో జ్యేష్ఠుఁడుగ జన్మించి, పూర్వవాసనవలన విరక్తుఁడు, యోగి, జ్ఞానియునై రాజ్య మొల్లక, వెడలిపోయినవాఁడు. ఈతని తరువాతవాఁడగు యయాతి నహుషునకుఁ బిదప రాజ్యాధిపత్యమునకు వచ్చెను.

**యతి-ప్రాణము:.** సంగీతశాస్త్రము నందుఁ జెప్పఁబడిన దశప్రాణములలో నొకటి. ఇది ౧౦౧ తాళములు ప్రస్తరించు ఆఱుయతులు.

(దశప్రాణములు చూడుఁడు.)

యతి (ప్రాణము) యతు లాఱువిధములు.

(౧) సమయతి - ధృత - లఘు-గురు-ప్లుతములలో నేదైనను సమానజాతీయముగ (౦౦౦ లేక 111 లేక ఓఓఓ మొ॥) అంగముఁ గలది.

(౨) స్రోతోవహాయతి:- ఆదియందుఁ గొంచెముగ నుండి క్రమముగ రాను రాను గొప్పదియగు తాళము (u ౦ 1 2. మొదలగునవి.)

(౩) గోపుచ్ఛయతి:- గోపుతోఁకవలె (2 1 ౦ u ఇటుల) నుండుతాళము.

(౪) పిపీలికాయతి:-చీమవలె (2 1 ౦ 1 2 ఇటుల) నుండుతాళము.

(౫) మృదంగ (మద్దెలవలె) యతి:- (౦ 1 2 1 ౦ ఇటుల) ఆద్యంతములు తక్కువగను, మధ్య హెచ్చుగనునుండు తాళము.

(౬) విషమయతి:- ఆదియందు గురుప్లుతములును అంత్యమున లఘుధృతములుఁ గల్గి విషమాకారముగ నుండు తాళము.

**యతిరాజ వేంకటాచార్యుఁడు:-** ఆంధ్ర కవులలో నాధునికులందుఁ బరిగణింపఁబడినవాఁడు. శ్రీవైష్ణవబ్రాహ్మణుఁడు. తండ్రిపేరు పెరుమాళ్లాచార్యుఁడు.

రాజమహేంద్రవరాధ్యక్షుఁడును, పద్మనాయకుఁడును (అనగా వెలమవారు) నగు కోస తిమ్మారాయణింగారను ప్రభువు ప్రోత్సహింప నీకవి

'ముక్తిచింతామణి' యనుపేర జగన్నాథమాహాత్మ్యమును ప్రబంధముగ రచించెను.

**యతిరాజులు:—**

(రామానుజీయవైష్ణవ గురుసాంప్రదాయపరంపర చూడుడు.)

**యతులు:**—పద్యరచనయందు యతులను విశ్వసించెదరు. వేర్వేఱులాక్షణికులు వేర్వేఱు సంఖ్యల యతులం దెల్పిరి. అప్పకవి, తన యప్పకవీయమున ముప్పదియొక్క యతుల నెఱింగించి యున్నాఁడు. ఇతర లాక్షణికులు సాధారణముగ ౩౧ యతు లనిరి.

౧ సరసయతి
౨ సంయుక్తయతి
౩ వర్ణయతి
౪ దేశీయయతి
౫ ఎక్కటియతి
౬ ఖోలిక యతి
౭ చక్కటి యతి
౮ అనుస్వారయతి
౯ స్వరయతి
౧౦ సరసస్వరయతి
౧౧ యూవళియతి
౧౨ ఋవ్వ
౧౩ మూవళియతి
౧౪ ప్రభుయతి
౧౫ విభాగయతి
౧౬ సౌభాగ్యయతి
౧౭ ప్రాసయతి
౧౮ భిన్నయతి
౧౯ ప్రాదియతి
౨౦ అభిన్నయతి
౨౧ అభేదయతి
౨౨ వృద్ధియతి
౨౩ నిత్యసమానయతి
౨౪ ప్లుతయతి
౨౫ ఆదేశయతి
౨౬ వికల్పయతి
౨౭ అనునాసికకల్పయతి
౨౮ కాకుస్వరయతి
౨౯
౩౦ అఖండయతి
౩౧ శంకధుగణయతి.

అప్పకవి తన యప్పకవీయమున వివరించిన నలుబదియొక్క యతులు

స్వరయతులు ఏడు.
౧
౨ స్వరప్రధానయతి
౩ లుప్తవిసర్గస్వరము
౪ ఋవ్వళి యతి
౫ ఋత్వసంబంధము
౬ ఋత్వసామ్యము
౭ వృద్ధియతి
వ్యంజనాక్షరయతులు .౨౧
౧ పాణియతి

వ్యంజనాక్షరయతులు
౨ వర్గయతి
౩ బిందువు
౪ తద్భవవ్యాజము
౫ విశేషము
౬ అనుస్వారసంబంధము
౭ అనునాశికాక్షరము
౮ మువిభక్తయతి
౯ ముకారయతి
౧౦ మవర్ణవిరామము

వ్యంజనాక్షరయతులు
౧౧ ఋఋయతి
౧౨ ప్రత్యేకయతి
౧౩ భిన్నయతి
౪౪ ఏకతరీయతి
౧౫ అభేదయతి
౧౬ అభేదవర్ణము
౧౭
౧౮ సరసము
౧౯ సంయు కి

| వ్యంజనాక్షరయతులు | ఉభయయతులు | |
|---|---|---|
| ౨౦ అన్త్యోష్మసన్ధి | ౫ దేశ్యనిత్యసమాసము | ౧౨ ప్లుతాక్షరయుగళము |
| ౨౧ వికల్పసన్ధి | ౬ నిత్యయతి | ప్రాసయతి ఒకటి |
| ఉభయయతులు ౧౨ | ౭ రాగమసంధి | ౧ ప్రాసయతి |
| ౧ యుష్మదస్మచ్ఛబ్దయతి | ౮ విభాగము | స్వర |
| ౨ పరరూపము | ౯ నామాఖండము | వ్యంజనా ౨౧ |
| ౩ ప్రాది | ౧౦ పంచమీవిభక్తి | ఉభయ ౧౨ |
| ౪ నిత్యసమాసము | ౧౧ కాకుస్వరము | ప్రాస ౧ |
| | | ౪౧ |

సంగీతశాస్త్రమున తాళప్రస్తారమున షడ్యతులు:— ౧ సమయతి, ౨ స్రోతోవహాయతి, ౩ గోపుచ్ఛయతి, ౪ పిపీలికాయతి, ౫ మృదంగయతి, ౬ విషమయతి.

**'యతో ధర్మ స్తతో జయః'** :— ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి. ధర్మ మున్న తావున జయమని యర్థము. ధర్మప్రవర్తన మున్న తావున జయము సిద్ధించునని భావము.

**'యత్ర రథ్యస్యప్రష్టే నవమాతి తత్రాంతే నిబధ్యతేతి' న్యాయము**:— వీఁపుపైఁ జాగా లేకపోతే మెడకుఁ గట్టుదురని తెలుఁగుసామెత కలదు. ఎల్లెడను వహింపకఁదప్పని దని భావము.

ఇంకను 'తిరుమలతాతాచార్యులుగారి ముద్ర భుజముఁ దప్పినా వీఁపుతప్ప' దని వేఱొకలోకోక్తియుఁ గలదు.

**యత్కృతకన్త దనిత్య' మితి న్యాయము**:— ఏది కృతకమో (చేయఁబడినదియో) యది నిత్యముగా నుండునది గాదు. అనఁగాఁ గొంతకాలమునకు నాశన మందునని భావము.

ఒకవస్తువ చేయఁబడుటయన నొకరూపముగఁ జేయఁబడినదని భావము. ఆరూపము నందుటతో దాని కర్హమగు నామమును గల్గుననియుఁ గొంత కాలమున కారూపనామములు చెడి, పూర్వరూపమునఁ దొల్లింటిపదార్థమునఁ గలిసిపోవు ననియు, నదియె నాశన మనియు నెఱుంగునది.

**'యత్రాప్యయః శ్రూయతేతి' న్యాయము**:— ఏది సర్వసాధారణముగ వినిపించుచుండునో, యదే నిజమని లోకులు గ్రహించుచుందురని భావము. కాని యిందు సత్యముగాని, యసత్యముగాని యుండవచ్చును. నిజము నిలకడమీఁదఁ దెలియఁగలదని తెలుఁగుసామెతయుఁ గలదు.

**యత్యాశ్రమ భేదములు (పది)**:— యత్యాశ్రమము లేక తురీయాశ్రమమన సన్న్యాసాశ్రమమని భావము. అద్వైతసిద్ధాంతమున స్మార్తులలో దశవిధములు. మానవునకు బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్తము గడచి, తురీయాశ్రమ (చతుర్థాశ్రమ) మగు సన్న్యాసాశ్రమునఁ బ్రవేశించుటఁ గాన దీనిని తురీయాశ్రమ మనియు, నిర్ణీతదశకమగు యతులను (నియతులు పదింటిని) దీక్షగాఁ బూనినవాఁడు గాన యత్యాశ్రమ మనియు, కామ్యకర్మవిముక్తుఁ (విడచుట) డగుటఁ గాన సన్న్యాసాశ్రమమనియు దీనికి పేరు లయ్యెను. మహామ్నాయ సేతువను గ్రంథమునందు, తుర్యాశ్రమము పదిభేదములుగఁ జెప్పఁబడినది.

౧. తీర్థులు- శ్లో॥ త్రివేణీసంగమేతీర్థే। తత్త్వమస్యాదిలక్షణే। స్నాయా త్తత్త్వార్థభావేన తీర్థనామా స ఉచ్యతే॥

౨. ఆశ్రమి-శ్లో॥ ఆశ్రమగ్రహణే ప్రౌఢే। ఆశాపాశ వివర్జితః। యాతాయాతవినిర్ముక్తః।ఏష ఆశ్రమ ఉచ్యతే॥

౩. వనీ-శ్లో॥ సురమ్యే నిర్జనస్థానే। వనేవాసం కరోతి యః। ఆశాబంధవినిర్ముక్తో వననామా స ఉచ్యతే॥

౪. అరణ్య-శ్లో॥ అరణ్యే సంస్థితో నిత్య। మానన్దే నందనేవనే। త్యక్త్వా సర్వ మిదం విశ్వ। మరణ్యః పరికీర్త్యతే॥

౫. గిరి- శ్లో॥ వాసో గిరివరే నిత్యమ్। గీతాధ్యయనతత్పరః। గంభీరాచలబుద్ధిశ్చ। గిరినామా స ఉచ్యతే॥

. పర్వత- శ్లో॥ వస న్పర్వతమూలేషు। ప్రౌఢం జ్ఞానం బిభర్తి యః। సారాసారం విజానాతి। పర్వతః పరికీర్త్యతే॥

౭. సాగరుఁడు-శ్లో॥ తత్త్వసాగరగంభీరో। జ్ఞానరత్నపరిగ్రహః। మర్యాదాం నైవ లంఘేత। సాగరః పరికీర్త్యతే॥

౮. సరస్వతీ- శ్లో॥ సర్వజ్ఞానరతో నిత్యమ్। సర్వవాదీ కవీశ్వరః। సంసారసాగరాసార। హన్తాఽసౌహి సరస్వతీ॥

౯. భారతీ-శ్లో॥విద్యాభారేణ సంపూర్ణ।స్సర్వభారాన్ పరిత్యజన్। దుఃఖభారం నజానాతి। భారతీ పరికీర్త్యతే॥

౧౦. పురీ- శ్లో॥ జ్ఞానతత్త్వేన సంపూర్ణః। పూర్వతత్త్వపథే స్థితః। పరబ్రహ్మరతో నిత్యమ్। పురీనామ స ఉచ్యతే॥

**'యత్ర తిష్ఠతి ధర్మాత్మా తత్ర దేవోఽపి తిష్ఠతి':—** ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి. ధర్మచింతనఁగలవాఁ డెచట నుండిన నచటనే పరమేశ్వరునితేజస్సు నుండునని భావము.

**'యత్రాకృతి స్తత్ర గుణాః' ఇతి న్యాయము:—** చక్కని యాకారముండిన తావుననే చక్కనిగుణము లుండునని యర్థము దుర్లక్షణములుఁ గలతావున దుర్గుణము లుండుననియు, సల్లక్షణములుఁ గలతావున సద్గుణము లుండుననియు భావము.

**'యత్రార్థావగతి రేవ తత్ర సందేహస్య కా కథా?':—** ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి. అర్థమే తెలియకపోవుచుండఁగా సందేహమున కట తా వెక్కడ? సందేహముగల నిమిత్తమే లేదని భావము.

**యథాక్రతున్యాయము:—** దీనిని యథాతథన్యాయ మనియు నందురు. (ఎట్లో యట్లు)

యథా దేవ స్తథా భక్తః (దేవుఁడెట్లో భక్తుఁడును నట్లే).

యథాగుణ స్తథానామః (గుణము లెట్లుండునో పేరు నట్లే కల్గును.)

యథా పితా తథా పుత్రః (తండ్రి యెట్టివాఁడో కుమారుఁడును నట్టివాఁడె.)

యథా మాతా తథా సుతా (తల్లి యెట్టిదో కూఁతురు నట్టిదే.)

యథాభావ స్తథా దేవః (భావన యెట్టిదో దైవము నట్టిదే.)

యథారాజా తథా ప్రజాః (రా జెట్టివాఁడో ప్రజలు నట్టివారే.)

యథాబీజం తథాఙ్కురమ్ (విత్తన మెట్టిదో మొలవడం అట్టిదే.) మొదలగునవి యథా తథాన్యాయములు.

**యథాజిత్తు:**—అత్రి, చంద్ర, యాదవ క్షత్రియుఁడు. తండ్రి వృష్ణి. పితామహుఁడు సాత్వతుఁడు, (లేక సత్యశృతుఁడు). కుమాళ్లు శిని, అనమిత్రుఁడు ననువారలు. అనమిత్రుని కుమారుఁడు వేఱొక శిని గలఁడు. ఇంకను నన మిత్రునికుమాళ్ళు నిమ్నుఁడు, వృష్ణి యనువారలు. (వృష్ణి చూడుఁడు.)

**యథార్థమున కేడు ఆలోచన లక్క అయుండదు:**—

(ఆంధ్రలోకోక్తి)

**'యథార్థవాదీవిరోధీ':**—

(లోకోక్తి)

**యథావిధిన్యాయము:**— ఇట్టివియే యితరన్యాయములును కలవు (చూడుఁడు.)

యథావిధి [విధియెట్లో యటులను]న్యాయము.

యథాస్థాన [మామూలుతావేదియోయచట] న్యాయము.

యథాధర్మ [ధర్మ మెటులనో యట్లు] న్యాయము.

**యథాశక్తిసహగమనము:**—

[ఆంధ్రలోకోక్తి]

**యదభిధిత్సితం తదభిధీయతాం ఫలే వ్యక్తిర్భవిష్యతీతి' న్యాయము:**— ఒక విషయముఁగూర్చి యెవ్వ రెంతఁ జెప్పినను, దాని నిజమగువిలువ దానివలనఁ గల్గిన ప్రయోజనము నుండి తెలియ నగును. నిజమగువిలువ యుపయోగమువలనఁ దెలియనగునుగాని దానింగూర్చి యన్యులువక్కాడి మాటలవలన నిర్ణయింపఁ దగదని భావము.

**'యదశ్వేన హృతం పురా తత్పశ్చాద్గర్దభఃప్రాప్తుం కేనోపాయేన శక్నుయాత్' ఇతిన్యాయము:**— ఒకని గుఱ్ఱము నొకఁడు దొంగలించి యెక్కి పాఱిపోయె నఁట. దాని నొకగాడిదపై నెక్కి వెంటఁ దఱుముకొని పోయినవాఁ డెంతప్రయత్నించినను ప్రయోజన ముండదు.

ఉన్నతసాధన మధమసాధనముచే నతిక్రమింపఁ బడదు. (అనఁగా జయింపఁబడదని భావము.)

**'యది హృదయ మశుద్ధం తస్య సర్వం విశుద్ధమ్':**— ఇది సంస్కృతభాష యందలి లోకోక్తి. మనస్సు మంచిది కాకపోయిన నంతయు విరోధమే యని భావము.

**యదువు:**— అత్రిసంతతి. చంద్రవంశఁపు క్షత్రియుఁడు. యయాతిమహారాజుపుత్రుఁడు. తల్లి దేవయాని. ఏకోదరుఁడగు సోదరుఁడు తుర్వసువు. భిన్నోదరులగు శోదరులు (సవతితల్లియగు శర్మిష్ఠవలన) దృహ్యుఁడు, అనువు, పూరుఁడు ననువారలు. (యయాతి చూడుఁడు). పితామహుఁడు నహుషమహారాజు. కుమాళ్ళు సహస్రజిత్తు, క్రోష్టువు, నలుఁడు, రిపుఁడు, నను వారలు. యదువునకు, నతనిసంతతివారికిని తండ్రి శాపమువలనఁ దండ్రిరాజ్యము రా లేదని చెప్పఁ బడినది. సోదరులలో యదువు జ్యేష్ఠపుత్రుఁడే.

**యదుశాఖాక్షత్రియులు:-**

(క్షత్రియకులము చూడుఁడు).

## 'య ద్గతం త ద్గతం గతమ్':—

ఏది గతించిపోయినదో యది గతించి (యె) పోయి నది. అనఁగా గతించినదానికి వగచి ప్రయోజన ముండదని భావము.

## 'యద్గ్రహే య దపేక్షం చక్షు స్త దభావే గ్రహేపి తదపేక్షతేతి' న్యాయము:—

ఏది యున్నట్లుఁ జూచుటకు నేత్రములు కావలసియుండునో యది లేనట్లుఁ జూచుటకుఁ గూడ నేత్రములు కావలసియుండు ననిభావము.

అనఁగా నున్నట్లుఁ జూచుటకుఁగాని లేనట్లుఁ జూచుటకుఁ గాని నేత్రములు మూలమని భావము.

## య ద్విశేషయోః కార్య కారణభావో ఽసతి బాధకే తత్సామాన్యయో రపి ఇతి' న్యాయము:—

ఒక ప్రత్యేకపరిస్థితి యందలి చిత్త సంకల్పము కారణముగఁ గల్గినకార్య మొకవిధమగు పరిణామమని యెఱుంగునది. ఇందు వల్ల నిది సర్వమునకు సాముదాయికమగురీతిని గల్గినకారణ కార్యములు కానేరవు. ఇట్లే యకా లము, లేక సకాలము, వర్షానుకూలత, ఎరువుల ప్రాశస్త్యము మొదలగుపరిస్థితులందలి ప్రయత్న ములు కారణములుగఁ గల్గిన విత్తులుచల్లుట (పొలములందు) యొక్క-కార్యము, (అవి మొలచి పెరిగి కాచుట) గాన నట్టిపరిస్థితులను పాటింపక, సామాన్యముగ విత్తులు చల్లుట యంతయు నొకటి గనె భావింపరాదు. అట్టి విశేషపరిస్థితులు లేనిచో విత్తనములు చల్లుకారణము, నవి నాటి మొలచు కార్యమును, సామాన్యముగఁ గారణకార్యము లుగఁ బాటింపవలసియుండును. ఇట్టిసందర్భముల నీన్యాయము వాడుదురు.

## యమదంష్ట్రపుదినములు:-

వ్యాస మహర్షి దేవీభాగవతమున వసంతర్తుదినములను పూర్వభాగఁపుదినములుగను, శిశిరఋతువు పూర్వ భాగఁపుదినములను యమదంష్ట్రదినము లని వా డెను. అనఁగాఁ జల్లని శీతకాలము మాఱి వేడి యగు నుష్ణకాలము ప్రవేశించుట వసంతర్తుప్రారం భమున జరిగెడిని. అట్లే వేడికాలము (వర్షములు సహా) మాఱి చల్లనిశీతకాలము ప్రవేశించుట శిశిరఋతుప్రారంభమున జరిఁగెడిని. ఈమార్పు లందు శరీరము బ కాయాసకరమును, నపాయకర ముఁగూడ నై యుండునటుల రోగము లతిశయించి యుండునని భావము. ఆఋమాసముల కొకతటిఁ గల్గు నీమార్పు సంవత్సరమునఁ గల్గుమార్పులలో బలమైనది గాన యమునికోరలదినములని యాయన యనెను గాఁబోలు! (దేవీపూజా నవరాత్రములు చూడుఁడు.)

## యమదూతగోత్రము:—

(కౌశికగణము చూడుఁడు.)

## యమద్వితీయ:—

దీనిని భ్రాతృద్వి తీయ యనియు నందురు. కార్తికశుద్ధ ద్వితీయ. (పండుగలు, పర్వములు, వ్రతదినములు చూడుఁడు.)

## యమస్తంభగోత్రము:—

(భరద్వాజ ఉపగణము చూడుఁడు)

## యమము:—

అష్టాంగయోగములలో నొకటి. యోగశాస్త్రసంబంధము. ఇది యహింస, సత్యము, అస్తేయము, ఆర్జవము, క్షమ, ధైర్య ము, శౌచము, బ్రహ్మచర్యము, మితాహారము, దయ యని పది తెఱంగులు.

౧ అహింస:- అన్యములను హింసింపకుండుట. ఇది మనస్సుచేత హింసఁ దలంపకుండుట; నోటితో

హింసవచనములు పల్కకుండుట, శరీరముచే నన్యములను హింసింపకుండు వ్రతదీక్ష. ఇట్టి యహింసను దీక్షగఁ బూని నడపినవారిని దుష్టజంతువులు సహితము బాధింప కుండునని చెప్పఁబడినది.

౨ సత్యము- అసత్య మాడకుండునియతి. ఈదీక్షఁ గలవారు లోకమున గౌరవింపఁబడుచుందురు.

౩ అస్తేయము:— అన్యులసొత్తు నాశింపకుండుట.

౪ ఆర్జవము:— లాభనష్టములకు మోదఖేదముల నందక నిశ్చలచిత్తుఁడై యుండుట. ఇందు వలన మనోవికారవేదనలు బాధింపకుండునని చెప్పఁబడినది.

౫ క్షమ:— అన్యులదోషములు తన్ను బాధించి నను సహించి క్షమించుట యనిభావము. శరీ రాభిమానము తగ్గిపోవును.

౬ ధైర్యము:— తాఁ జేయఁబూనిన కార్యమునకు భంగములుఁ గల్గుచున్నను వీడక కార్యమును సాధింపఁ బ్రయత్నించు ధైర్యము. ఈపట్టు దల కార్యసిద్ధిఁ గల్గించునని చెప్పఁబడినది.

౭ బ్రహ్మచర్యము:— స్త్రీసంపర్కమును మా నుట, మాన వీలుఁ గానిచోఁ దగ్గించి మిత ముగ నుంచుట. ఇందువలన సామర్థ్య మతి శయించునని చెప్పఁబడినది.

౮ శౌచము:—(శుచి), పరిశుభ్రత, స్నానాదులచే శరీరబహిశ్శుద్ధియు, ప్రాణాయామ (వాయు ధారణచే) ముచే నంతశ్శుద్ధియు, రాగద్వేష రహితమనోవృత్తిచే మనశ్శుద్ధినిఁ గల్గించు కొనుచుఁ బరిశుద్ధులై యుండుట. ఇందువలన సత్వగుణ మతిశయించునని చెప్పఁబడినది.

౯ మితాహారము:— ఆహారమున కారము, పులు సు, తగ్గించి మధురాహారమును, ఫలములను మితముగఁ దినుచుండుట. ఇంకను గొందఱు యోగవేత్తలు తాము తినఁగలయాహారములో సగముమాత్రముఁ దినవలయు ననియు, తక్కిన సగములో సగము (అనఁగా నాల్గవవంతు) జలముం ద్రాగవలయు ననియు, తక్కిన నాల్గవవంతు పట్టఁదగినజాగాను వాయుసంచా రమునకు వదలివేయ వలయుననియు నియ మించిరి. ఇందువలన నారోగ్య మతిశ యించును.

౧౦ దయ:— (భూతదయ) అందఱియందు నాద రణఁ గల్గియుండుట. అనఁగా నసూయత లేక యుండుట. ఇది సర్వజనప్రియుఁడగునట్లు చేయు నని చెప్పఁబడినది.

ఈ పదిదీక్షలం గల్గియుండుట 'యమ' మని యోగశాస్త్రమునఁ జెప్పఁబడినది.

**యముఁడు:**—అష్టదిక్పాలకులలో దక్షి ణదిక్కున కధిపతి. పితృలోకాధినాథుఁడని చెప్పఁ బడినది. తండ్రి వివస్వంతుఁడను ద్వాదశాదిత్యా త్మకుఁడగు సూర్యుఁడు. తల్లి సంజ్ఞాదేవి. (విశ్వ కర్మ కుమార్తె). సవతితల్లులు ఛాయాదేవి, పద్మినీ దేవి. సోదరులు శనైశ్చరుఁడు, వైవస్వతమనువు. తోఁబుట్టువులు తపతీ (సంవరుణునిభార్య). కాళింది లేక యమున, శ్రీకృష్ణునిభార్య. యమునిభార్యలు శ్యామలాదేవి, ఉర్మిలాదేవి.

యముఁడు దక్షిణదిశాధిపతి. దిగ్గజము వామ నము. దిగ్గజముయొక్క భార్యపేరు పింగల. యమునియాయుధము దండము. వాహనము మహిషము. రాజధాని సంయమినీపురము.

**యమునగిరి:**—యమునానది జన్మించు (యమునోత్తరి) తావునఁగల భండారుపుచ్ఛపర్వత భాగమున కీపేరు కలదని రామాయణము కిష్కింధకాండము ४० అధ్యాయమునుండి తెలియు చున్నది.

**యమునప్రభావము:**— యమునోత్తరి కీపేరు కలదని కూర్మపురాణము ౨-3౭ యందుఁ గలదు.

**యమునోత్తరి:**-యమునానదీజన్మస్థానము. భండారుపుచ్ఛహిమాలయశాఖయందుఁ బెక్కు శాఖలుగ మంచు కరఁగి ప్రవహించు చిన్నచిన్న ప్రవాహములకు దిగువగ 'యమునోత్తరి' యనం బడుతావు కలదు.

**యమెరీరత్నము:**-నలుపుకలసిన బ్రౌను రంగురత్నము. కోరండముజాతిది. చాల గట్టిజాతి. ఇది, ఒంటారియోలోని నెక్సాసునంమును, ట్రాన్సు వాలుగనులయందును దొరకుచున్నది.

**యయాతిపురము:**— సంయుక్తరాష్ట్ర ములలోని కాన్పూరునుండి మూఁడుమైళ్ళదూర మున యయాతిచక్రవర్తిదుర్గ మునుఁజేసితావునఁ జూపుచున్నారు. [శాకాంబరీ దేవక్షేత్రము]. ఇది ఖండేలుభూపతులనాడు తిరిగి కట్టంబడినదుర్గ మఁట. ఇంకను నుత్కలదేశమున నొకతావును గూడ నీపేరునఁ జూపుదురు గాని యది యయా తికేసరి యనునృపతినాటిదని తేలినది.

**యయాతిమహారాజు:**—తండ్రి నహుష మహారాజు. తల్లి ప్రియంవదాదేవి. సోదరు లార్గురు. (నహుషమహారాజు చూడుఁడు.) తండ్రి రాజ్యమును జక్కఁగాఁ బాలించి పేరందినవాఁడు. భార్య లిర్వురు. ౧ దేవయాన. ఈమె శుక్రాచా ర్యునికుమార్తె. ఈమెయం దిర్వురు పుత్రులు కల్గిరి.

౧ యదువు:-ఇతనినుండియే యదువంశ మేర్పడి యెను.

౨ తుర్వసువు:-పాండ్య, చోళ, కేరళ రాజవంశ ములు కలిగెను. [ధుర్వసుఁడనియు నందురు]. రెండవభార్యయగు శర్మిష్ఠాదేవి వృషపర్వుని కుమార్తె. ఈమెయందు యదుమహారాజునకు ముర్వురు సుతులు కల్గిరి.

౧ దృహ్యుఁడు:- ఈతనినుండి గాంధారరాజవంశ మేర్పడియెను.

౨ అనువు:-ఈతనిసంతతివాఁడగు నుశీనరునిసుతుం డగు శిబిమహారాజువలన సౌవీర, మద్ర, కేకయ, అంబష్ఠదేశ రాజవంశము లేర్పడి యెను. [మహారాజులు చూడుఁడు.]

3 పూరువు:—ఈతనినుండి పాంచాల, శ్రావ్దిష, కౌరవ, రాజవంశము లేర్పడియెను. కురుసంత తిలోని యుపరిచరవసువునుండి మగధరాజవంశ మేర్పడియెను.

మఱియుఁ బూరువునుండియే కాణ్వాయన, గార్గ్యశాఖాదులగు బ్రాహ్మణసంతతు లేర్పడి యెను.

యయాతిమహారాజు పూరుని దనరాజ్యమున కభిషిక్తుంజేసి, తాను గొప్పతపం బొనర్చి, మహా మహిమాయుతుఁడై, బ్రహ్మలోకాదిదేవలోకము లన్నియుం దిరిగినవాఁడనియు, నిందుని దయవలన నంతరిక్షమున నక్షత్రలోక మనంబడు సద్భువన మున నుండెననియుఁ జెప్పఁబడినది. పూరువు సుతుఁడు జనమేజయుఁడని పేరుఁగలవాఁడు.

యయాతిమహారాజు తండ్రి నహుషమహారాజు. పితామహుఁడాయువు. ప్రపితామహుఁడు పురూరవచక్రవర్తి. చంద్రవంశపు మొదటిరాజు. సోదరులు ౧ యతి, ౨ యయాతి, 3 సంయాతి, ౪ అయాతి, ౫ ఉద్ధవుఁడు లేక కృతి, ౬ వియతి యనువారేకగర్భజనితులు.

౧ యతి—ఇతఁడు మహాయోగియై రాజ్యము నపేక్షింపలేదు.

౨ యయాతి—రాజ్యము నేలిన మహారాజు.

3 సంయాతి.

ఇంకను పూరువంశక్షత్రియుఁడగు శర్యాతికి సంయాతి యనుపే రుండెను. భార్యపేరు వరాంగి. ఈతఁడు గన్తునికుమారుఁడు.

౪ అయాతి.

౫ ఉద్ధవుఁడు, లేక కృతి.

ఇంకను వసుదేవునితమ్ముఁడగు దేవభాగుని సుతున కీపేరు గలదు.

౬ వియతి.

## యయుత్సుఁడు:—

ధృతరాష్ట్రునకు వైశ్యస్త్రీ (భార్య) యందుఁ గల్గినపుత్రుఁడు. ధృతరాష్ట్రునకుం బిదప నింద్రప్రస్థమున కితఁడు ప్రభు వాయెను.

## యలమంచకులగోత్రము:—

ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్యగోత్రములు చూడుఁడు.)

యలమందకుల(హేలమన్చకుల, ఇలమంచికుల) గోత్రము. ఏకార్షేయ (౪3) గోత్రము. శుచేయగణము. సంస్కృతగోత్రము, శౌచేయస, కృష్ణద్వైపాయనర్షి, ఆపస్తంబయజుశ్శాఖ, ప్రమాణగ్రస్థ మాద్యప్రవరఖణ్డ, సమానగోత్రములు. శుచిస, కృష్ణద్వైపాయనస. వైభవేశ్వరుఁడు దేవత. వైభవకన్య భార్య. ఏకేశ్వరము తపస్థానము. వైభవసరస్సు తటాకము. జపము కోటి. దీపములు ౪౦. క్షేత్రసంఖ్య ౨౦. గోదానము. ఏలకులు వర్జనీయము.

## యల్లోఫీవర్ (Yellow Fiver) జ్వరము:—

ఈరోగము దోమకాటునుండి మనుష్యులకు వ్యాపించునని చెప్పఁబడినది. ఆఫ్రికా పశ్చిమసముద్రతీరప్రాంతములు, మెక్సికో, దక్షిణ యమెరికాల, నట్లాంటిక్కు సముద్రతీరముల నిది యగుపడుచుండును. ౧౮౬౫ సం॥ ౪॥ లో నింగ్లాండునం దగుపడినది. ౧౮౭౫ లో స్పానియాదేశపు మాడ్రిడ్ నగరమునందుఁ దగిలినది.

దోమ కఱచిన మైదారు దినములలో నూష్ణము బయల్పడును. చలితో ౧౦3 డిగ్రీలకుఁ దక్కువ కాని జ్వరము తగిలి, తలనొప్పి, వెన్ను, ప్రక్కలు నొప్పి, నాడి యదరుపాటుఁ గల్గియుండి రెండు లేక మూఁడుదినములకుఁ బిదప కొంపరేచరు తగ్గి నొప్పియు శాంతించును.

అచిరకాలమునవనే జ్వరము తలయెత్తి శరీర మించుకఁ బచ్చఁ బడుచు బాధ తలచూపును. కొన్నింటఁ గ్రమముగఁ దగ్గి, రోగి జీవించును. కొన్నింట నధికమగుటతో మరణము సంభవించును. మెక్సికోయందు నూటికి ౧౦ మొద లిరువదియైదు దనుకను, ఆఫ్రికాయందు నూటి కఱువదివఱకును మరణములుఁ గల్గుచుండునఁట.

## యల్లోప్రెస్ (Yellow Press):—

అమెరికా సంయుక్తరాష్ట్రములందలి sensational [తీవ్రపు] వ్రాతలను వ్రాయు వార్తాపత్రికల కాంగ్లేయు లిడిన హేళననామము. ఆది నొకప్పుడిట్టివ్రాతలను 'Yellow kid' అను పేరను

న్యూయార్కునగరమున 'sunday world' అను పత్రిక ప్రారంభించి ప్రకటించుచుంట నీ పే రిడి రఁట. [యెల్లోజర్నలిజమ్ చూడుఁడు.]

**యల్లోరివర్ (నది)**:—చీనాదేశము నం దలి హోయాంగ్హోనది కిది ప్రతినామము.

**యల్లోసి (Yellow sea)**:—ఈపసుపుఁ బచ్చసముద్రమును చీనాదేశమున వారి స్వభాష యందు "హ్వాంఘాయి" అనిరెదరు. మంచూ రియాదేశఁపు టుత్తరఁపుటెల్లగను, చీనాదేశము పశ్చిమఁపుటెల్లగను, కొరియాదేశము తూర్పు సరిహద్దుగను నున్న ఫశిఫిక్కు మహాసముద్రమునం దలిభాగము. ఇందు సంగమించు హోయాంగ్హో నది తెచ్చినపసుపుఁబచ్చబురద దీనిం గ్రమ్మి సము ద్రమంతయుఁ బచ్చరంగుగా నగుపడుట నీ పే రయ్యెనఁట.

**యవనదేశము**:-
(అరేబియా చూడుఁడు.)

**యవననగరము (యవనపురము)**:- కతియవాడులోని జూనగడ్పురమున కీ పేరుండి నటులఁ దెలియుచున్నది. పురాణప్రసిద్ధము గాదు.

**యవనపురము (జవునప్పూర్)**:— బనారస్ పట్టణమునకు ౪౦ మైళ్ళదూరమునందున్న జవున్పూ రనుపట్టణమున కీ పే రుండెను. బహుశః మహమ్మదీయాక్రమణమునుండి పేరుఁగల్గియుండు నని తలంపఁబడుచున్నది. ఇంక నీపేరు లనేకములు గానవచ్చెడిని. బనారస్పట్టణమునకు నలుఁబది మైళ్ళదూరమునఁగల జౌన్పూరు తొల్లింటి యవన పురమే. గుజరాతుదేశమున కతియవాడునందలి జూనగడ్ యవనపురమే. యవనగడము,జవనఘడ్, జూన్ఘడ్ అయినది.

**యవద్వీపరాజ్యము**:—హిందూ మహా సముద్రమందలి జావాద్వీపమునకుఁ దొల్లింటిపేరు యవద్వీపము. యవద్వీపమనుమాట జావాద్వీప మైనది. దీనిప్రశంస బ్రహ్మాండపురాణము పూర్వ ౫౧ అధ్యాయమునఁ గలదు.

క్రీ. వె. ౬౦౦ సంవత్సరములకుఁ బూర్వము గుజరాతునృపతిపుత్రుఁడు అజిశకుఁ డనువాఁడు యవద్వీపమున కేగి యఁటఁ బ్రబలియున్న వ్యాధు లకు వెఱచి, దేశమునకుఁ దిరుగ మరలెననియుఁ, బిదప క్రీ. వె. ౬౦౩ సంవత్సరమున గుజరాతుకుం జెందిన రాజవంశస్థుఁ డొకఁ డట కేగి నివాసుఁడై దాని నాక్రమించె ననియు, జావాద్వీపఁపుఁ దొల్లిం టిచరిత్రయందుఁ గలదు.

దీనికి 'సువర్ణద్వీప' మనియుం బేరుండెనఁట. చీనావా రేలకో 'కళింగద్వీప' మని వాడుచుండి రఁట. ఈద్వీపమున 'బోరోబందుర్' అనఁబడు తావునఁ గడుంగడుఁ బనితనముగల యిత్తడిబుద్ధ విగ్రహ ముండెడిదనియు, నది క్రీ. వె. 750–800 మధ్యకాలమునఁ జేయఁబడిన దనియుఁ జెప్పఁ బడినది.

**యవధాన్యఁపుఁజెట్టు (బార్లీచెట్టు)**:- లా. Hordeum Hexastichon; ఆంగ్ల. Barley; సం, యవః, యవక్త్రః పవిత్రధాన్యం. కొందఱు మునిధాన్యం, మునిభక్షః, మునిభోజన మ్మనుచుందురు కాని యాపదములు నెవ్వరిధాన్య మునకు వర్తించెడిపదములు. యవలకుఁ దోకగోధు మలనియు, బార్లీబియ్య మనియుఁగూడ వాడుక పదములు కలవు.

యవలు రోగుల కియ్యఁదగిన పథ్యమైనది. దీనిగంజి నిరోగమైనది. కంఠస్వరమును బాగు చేయును. బలముఁ గల్గించును. సమధాతువుగా

గల్గించి, మేహశాంతి నొనర్చును. దగ్గు వగర్పుల నించుక శమింపఁజేయును. విరేచనముఁగావించును.

దీనికి విఱుగుడు నెయ్యి, పంచదార, తెల్లయుత్త రేణిక్షారము, నువ్వులనూనె యనిచెప్పఁబడినది.

**యవనులు:—** యవనశబ్దము మహాభారతమునఁ బలుతావులఁ బేర్కొనఁబడుటచేతఁ బాశ్చాత్యవిమర్శకులు కొందఱు మహాభారతములోని కొన్నిభాగము లలెగ్జాండరు దండయాత్రఁ జేసినపిమ్మటనే రచియింపఁబడినట్లు వ్రాసియున్నారు. ఏలయన గ్రీకులను 'యవను' లని భారతీయులు పిలుచుటయే యఁట! ఇపు డీవ్యాసమున యవను లెవరని తెలుసుకొనుటమూలమునఁ గొందఱు పాశ్చాత్యవిమర్శకుల యభిప్రాయముల చొప్పున నలెగ్జాండరు దండయాత్రలను నెఱపిన యనంతరమే భారతరచనాకాల మను వాదపరిష్కారముఁ గూడఁ బై పొడిక్టువలె (By Product) నిర్వచింప ననువుకాఁగలదు.

గ్రీసుదేశమునకును, భరతదేశమునకును నన్యోన్యసంబంధముఁ గలుగుట యలెగ్జాండరు దండయాత్రతోడనే ప్రారంభము కాలేదు. అంతకు మున్నెన్నో శతాబ్దములకుఁ బూర్వము నుండియు సంబంధము కలిగియే యున్నది. అది యెట్లన?

పాణిన్యాచార్యుఁడు క్రీ. పూ. 8 వ శతాబ్దములప్రాంతమువాఁడని కొందఱును, ౧౨ వ శతాబ్దమువాఁడని మఱికొందఱును పూర్వ పాశ్చాత్య పండితులు వ్రాసియున్నారు. పాణినికంటె శాకటాయనుఁడే ప్రాచీనుఁ డనుటకుఁ బెక్కుమారులు శాకటాయనునే పాణిని తన వ్యాకరణమునఁ బేర్కొనియుంటయే నిదర్శనము. అట్టి శాకటాయనుఁడును, పాణినియును దమతమవ్యాకరణములలో నెన్నోసారులు యవనశబ్దమును వాడియున్నారు. పాణిని శాకటాయనులచే నెన్నో తడవ లుచ్చరింపఁబడిన యవనశబ్దమే మహాభారత గ్రంథకర్తయుఁ దనగ్రంథమున వాడియున్నాఁడు. అట్లగుటఁ బాణిని, శాకటాయన, మహాభారత గ్రంథములం బేర్కొనఁబడిన యవనులు గ్రీసుదేశీయులా? యవనులలిపి దుష్టలిపి. దుష్టలిపి. (౧) వారు భారతీయాచారవిరుద్ధముగ ముండనముఁ జేయించుకొనుచున్నారు. (౨) శాకటాయనుఁడు యవనుల లిపిని మాత్రమే పేర్కొనినాఁడు. పాణిని వారిలిపిని, వారివృత్తిని, వారి యాచారములను గూడఁ బేర్కొనినాఁడు. మహాభారతమునఁ బెక్కుతావుల వీరు యోధులుగాఁ బేర్కొనఁబడిరి.

ఈకారణములచేత శాకటాయనాదులకాలమునకే భారతదేశీయులకుఁ బాశ్చాత్యదేశసంబంధము కలిగియుండె ననియు, ప్రాచీనులు తమగ్రంథములలో నరేబియాదేశీయులనో, గ్రీసుదేశీయులనో బేర్కొనియున్నారనియుఁ దలంపవలసి యున్నది. పాణిని శాకటాయనులు పేర్కొనినలిపి దుష్టలిపి యగుటచేత నయ్యది ఫొనీషియాలిపియో, కీలలిపియో యయియుండునోపు. ఆయవనుఁ లరబ్బులయి యుందురని తలంపఁదగును. అరబ్బులముండనముఁగూడ భారతీయాచారవిరుద్ధమే. భారతదేశ మరబ్బులదేశమునకు సమీపముకూడ నయి యున్నది. అందువలన నరబ్బులనే యవను లని భారతీయులు వ్రాసియుండునోపు. కాని గ్రీకులను గూడ నిటీవల యవనులని వారిపాశ్చాత్యతచేత వ్రాసియుండుట విరుద్ధము కాదు. గాని యలెగ్జాండరు భారతదేశముపై దాడివెడలినపిదపనే భారతమునఁ గొన్నిభాగములు రచియింపఁబడిన వనువ్రాత మాత్రము సహేతుకము కాఁజాలదు.

సుమిత్రావద్దనున్న జావాద్వీపమునకుఁ దొల్లింటి పేరు యవద్వీపము. అచటిప్రజలకు యవనులనియుఁ పేరు కలదు.

**యవప్రమాణము:—** యవధాన్యఁపు గింజయెత్తు. ఆఱావగింజలయెత్తని యాయుర్వేద వైద్యశాస్త్రమునందుఁ జెప్పఁబడినది.

(ఆయుర్వేదమానము చూడుఁడు.)

**యవరేఖ:—**

(పురుషసాముద్రికము చూడుఁడు. స్త్రీసాముద్రికము చూడుఁడు.)

## యవలు - వ్యవసాయము:

నాంగ్లమున 'బార్లీ' (Barley) యనెదరు. చులకని భూములమీఁదఁ జక్కఁగాఁ బండును. భూమి మెత్తగ దున్ను టావశ్యకము. హిమవన్నగసీమలపై సమశీతోష్ణప్రదేశములనే గాక, శీతలప్రదేశములందుఁగూడ నీపంటఁ గాననగును. అహమదాబాదుజిల్లాలో నీపంట గలదు. తగుమాత్రమునీరిడఁగల్గిన నీపంట మెరకభూములందునైతము ఫలించునని తేలుచున్నది. వారమున కొకతడి మెరకభూములందు నీరు కట్టవలయును. తేమ నిలుపుకొనఁగల్గు భూములందు సహితము పక్షమున కొకతడి నీరు కట్టవలయును. యకరమునకుఁ బది మొదలు పదిహేనుబండ్లవఱకు కుళ్ళిన యెరువు వేయవలయునని జెప్పుదురు. 80 మొదలు నూఱుపౌనులవఱకు విత్తనములం జల్లుదురు. పరిస్థితు లనుకూలించినఁ బదునెనిమిదివందలపౌనుల పంట పండును. ఇంతే గాక నొకటన్నుగడ్డి (పశ్వాహారము) కూడ ఫలించును. బార్లీ మనుష్యుల కాహార మగుటకన్న గుఱ్ఱముల కాహారముగ నుపయోగించుచున్నది. బజారులందు దొరకు 'బార్లీమీల్' అనంబడునది యీబార్లీవే యని యందురు.

**యవక్షారము:—** లా. Hordeum Hexastichon, ఆంగ్ల. Barley salt. సం. యవజః, యవనాలజః, యవభస్మ, యవశూకః, యవక్షారః, యవాగ్రజః, యవాహ్వః, యవోద్భవః.

యవలను, భస్మ మొనర్చి యం దుండితీయు లవణము. జఠరదీప్తి నిచ్చుననియు, త్రిదోషములను హరించి, గుల్మరోగము, కఫరోగము, శూలలు, పాండురోగములపైఁ బనిచేయుననియుఁ జెప్పఁబడినది.

**యవాః ప్రకీర్ణా నభవంతి శాలయః:-** ఇది సంస్కృతభాషలోని లోకోక్తి. యవలు చల్లితే శాలీయధాన్యము మొలవవని భావము. వి త్తొకటి వేసే చె ట్టొకటి మొలచునా? యను తెలుగుసామెత కలదు.

**యవీనరుఁడు:—** అత్రి, చంద్ర, పూరు సంతతిక్షత్రియుఁడు. తండ్రి భర్మ్యాశ్వుఁడు, పితామహుఁడు నీలుఁడు.

మఱియు నీపూరుసంతతియందే ద్విమీఢుని సుతునకును, రెండవముద్గలుని సుతునకును, యవీనరుఁ డనుపేరులే యున్నవి.

**యశస్వినీనాడి:—**

(అష్టాంగయోగములు చూడుఁడు.)

**'యశస్తు రక్ష్యం పరతో యశోధనైః':-** ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి. యశస్సే ధనముగా భావించువారు దానిని జాగ్రతగా రక్షించుకొన వలయును.

**'యశ్చోభయోః సమో దోషో న తేనైకశ్చోద్యో భవతీతి' న్యాయము:—** ఒక దోషము (తప్పు లేక లోపము) వాదప్రతివాద

ముల రెంటియందుఁ గల్గియుండిన నావాదము లొండొంటి నతిక్రమింపఁ జాలకుండునని భావము.

**యష్టిమధుకము (అతి మధుర ము):**—లా. Glycerrhiza Glabra; ఆంగ్ల. Liquorice root; హిందీ. మైదాలకిడి; సం. మధుకం, మధుకః, మధుయష్టిః, మధుయష్టికా, మధురసా, మధురా, మధువల్లీ, మధుస్రవా, మధూకం, మధూలికా.

తియ్యగ నుండును. దీనిద్రవము మ్రింగుచుం డిన నూపిరిఁగొట్టునొప్పి కట్టుననియు, విదాహము నడంచుననియు, విషదోషము విఱచుననియు, దగ్గు నడంచుననియుఁ జెప్పఁబడినది. ఇది గురివెంద చెట్టువేరని కొంద ఱనెదరు.

**యష్టివనము:**—ఇప్పటిపేరు జేతియన్. బీహారములోని గయమండలమున సుపాతీర్థము కడఁ దపోవనమున కుత్తరమున రెండుమైళ్ళదూర ముననున్న బౌద్ధమతయాత్రాస్థలము. (రాజగృహ మిటకు ౧౨ మైళ్ళు.) ఇట బుద్ధభగవానుఁడు పెక్కుమాహాత్మ్యముల నగుపఱచెనఁట. బింబ సారమహారా జిటనే బౌద్ధమతస్వీకరణ మొనర్చె నఁట. బింబసారమహారాజు తన పదునాఱవయేట మగధసింహాసన మధిష్ఠించినవాఁడు. తన యిరు వదితొమ్మిదవయేట నిట బౌద్ధుఁడై తన ౬౫ వ యేట మృతి నందినవాఁడు.

**'యస్య దండ స్తత్ర మహిషీ' :** ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి. ఎవనికడఁ గఱ్ఱ యుండునో వానిదే గేదె యని యర్థము. అనఁగా గేదె నెవఁడు తోలుకొనిపోవునో వాడిదే యా గేదె యని తాత్పర్యము.

గేదె యజమానుని బోల్పలే దనియు, నెవ్వఁ డు తోలుకొనిపోయిన వానికి స్వాధీనమై యుండు నదనియు భావము.

**'యస్య నాస్తి పుత్రో న తస్య పుత్ర స్య క్రీడనకాని క్రియన్తేతి' :**—సంతానము లేనివాని పిల్లలకై యాటబొమ్మలు చేయఁబడ లేదని యర్థము.

అనఁగా సంతానము లేనివాని కాటబొమ్మ లనవసరమని భావము.

**'యస్మాత్ జ్ఞానం భ్రమ స్తస్య భ్రాన్తః సమ్యక్చ వేత్తి సః ఇతి':-** అవిద్య యే యుపాధిగఁ గల్గినవారికి (అనఁగా. భ్రమలనే నమ్ముకొనియున్న వారికి) భ్రమయే గతియగుంగాని వారు జ్ఞానవంతులై యుండినను నుండనగును.

అనఁగా జ్ఞానవంతులై యుండుట వేఱు; భ్రమయందుఁ దగుల్కొనుట వేఱు. జ్ఞానవంతు లైనను నొకప్పుడు భ్రమకుఁ బాలగుదురనియు, వారికి భ్రమయే గతియగు ననియు భావము.

**'యస్యోన్మూలనాయ యస్య ప్ర సక్తి ర్భవతి తత స్తస్య బలవత్వమితి':-** ఒకరిని నాశన మొనర్పవలెనని కోరెడి మఱియొ కరు, వారికన్న బలవంతులై యుండుట ముఖ్య మని భావము.

**'య స్సర్వజ్ఞ మాత్మానం మనుతే స ఏవ మూఢః':**—ఎవ్వఁడు మనస్సునందుఁ దాను సర్వజ్ఞుఁడనని నమ్మియుండునో వాఁడే మూఢుఁడని భావము.

**యస్ (S) అక్షరమునకుఁ జెందిన క్రైస్తవస్త్రీనామములు:**—Sabina, Sabine లాటిన్పదము. తొల్లింటి యిటలీనివాసు లగు సాబైన్ జాతిస్త్రీ యనియర్థము. (సాబైను

స్త్రీలు సుందరులు, యోగ్యతఁ గలవారు, పతివ్రతాధర్మములను వీడనివారు.)

Sabrina-లాటిన్పదము. దీనికి 'Severina' అనియు రూపాంతరము కలదు. రోమకచక్రవర్తి యగు Severus పేరు. ఈతఁడు బ్రిటనుదేశమును జయించి, యేలినవాఁడు. యార్కుపురమున 210 సంవత్సరమున మృతి నందినవాఁడు.

Salome, Salomea, Salmone-హీబ్రూపదరూపములు. శాంతికరమని యర్థము. (ఈపేరులు) James the elder యొక్కయు, John the Evangelist గార్లయొక్కయు తల్లిపేరు.

Sancha - లాటిన్పదము. పవిత్రత యని యర్థము.

Sapphero- గ్రీకుపదము. పచ్చరత్న మని యర్థము.

Sapphira- హీబ్రూపదము. వివరించునది యని యర్థము.

Sara, Sarah, Sarotte-హీబ్రూపదములు. అబ్రహాము (దేవునిస్నేహితుఁడు) భార్యయు, ఐజాకుతల్లియు నగు సారాపేరు. ఇందుఁ గల్గిన ముద్దుపేరులు Sal, Sally.

Sebastiana, Sabastiane- గ్రీకుపదము. పూజ్యురాలని యర్థము. Sebastian యొక్క స్త్రీవాచకరూపము.

Sebilla- లాటిన్పదము. బుద్ధిశాలియగు వృద్ధాంగన యనియర్థము. దీనం గల్గిన ముద్దుపేరు Sibbie.

Selima, Soloma - హీబ్రూపదములు. శాంతియని యర్థము.

Selina- గ్రీకుపదము. చంద్రబింబమని యర్థము.

Selinde- ట్యూటానిక్కుపదము. జయమందినసర్ప మని యర్థము.

Septimia- లాటిన్పదము. ఏఁడవది యని యర్థము. Septimus యొక్క స్త్రీవాచకరూపపదము.

Seraphine- హీబ్రూపదము. కాంతిఁగలదని యర్థము. లేక స్ఫురద్దీప్తి యనియర్థము.

Serena- లాటిన్పదము.

Seymourina-నవీనాంగ్లపదము. Seymour యొక్క స్త్రీవాచకపదము.

Shelah, Sheelah-హీబ్రూపదము. ఛేదించునది యనియర్థము. ఐర్లాండునందుఁ బ్రచార మందినపదము.

Sibyl, Sibylla, Sebell, Sibille, Sibylla, Sibylle- లాటిన్పదరూపములు. భవిష్యద్జ్ఞాని యనియర్థము. ఈపేరు రోమకదేశమున భవిష్యత్తు నెఱింగి తెలుపఁ బ్రసిద్ధి వడసిన యొకవృద్ధాంగనపేరు. ఆమె కక్కాలమున నాపే రన్వర్థనామ మయ్యె నఁట. నేటికి నాయర్థమే తెల్పుచున్నారు. (దీనిని 'Syble' అనియును, 'Sybil' అనియును తెలియకఁ దప్పువర్ణక్రమము వ్రాతురఁట. అది సరికాదు). దీనం గల్గిన ముద్దుపేరు Sibbie.

Sidney, Sydney- నవీనకల్పితపదము. ఇది స్త్రీలకుఁ బురుషులకుఁ గూడ వాడఁబడుచున్న సాముదాయికపదము. అనఁగాఁబురుషరూపమును, స్త్రీరూపమును గూడ నివియే యైయున్నవి.

Sidonia, Sidonie-లాటిన్పదములు. నైస్సురసంబంధురాలని యర్థము.

Simone, Simonette-హీబ్రూపదములు. అణఁకువఁగలది యనియర్ధము. Simon యొక్క స్త్రీవాచకపదము.

Sophia, Sophie- గ్రీకుపదములు. మంచి బుద్ధి గలది యని యర్థము. దీనియందుం గల్గిన ముద్దుపేరు Sophy.

Sophronia-గ్రీకుపదము. దూరాలోచనంగల మనస్సుంగలదని యర్థము.

Speranza -లాటిన్పదము. ఆశయనియర్థము.

Sperata- లాటిన్పదము. ఆశించంబడిన యని యర్థము.

Stacy- ఐరిషుపదము.

Stella-లాటిన్పదము. నక్షత్రమని యర్థము.

Stephanie, Stephana, Stephanine, Stefanie- గ్రీకుపదరూపములు. కిరీట ముంచం బడిన యని యర్థము. Stephen యొక్క స్త్రీ వాచకపదరూపములు.

Susan, Suzan, Susana, Susanna. Susannah, Susette, Susanne, Suzette, Suezanne, Sussannah- హిబ్రూపదరూపములు. చెంగల్వపూవనియో లేక తత్సంబంధసంతోషమనియో యర్థము. ఇవి St. Susan ఋషి పేరుయొక్క స్త్రీవాచకవిశేషరూపములు. ఆ ఋషి ముగ్ధత్వమునకు రక్షకుండంట.

Swana- ట్యూటానిక్కుపదము. హంస యనియో, లేక హంసయాన యనియో యర్థము.

Sydney, Sidney- నవీనకల్పితపదములు. ఇవి పురుషులకు, స్త్రీలకుం గూడ నుపయోగించు పదములు.

Sylvia, Silvia, Silvie-లాటిన్పదము. వనవాసి యనియర్థము. Sylvanus యొక్క స్త్రీ వాచకపదము.

## యస్ (S) అక్షరమునకుం జెందిన క్రైస్తవ పురుష నామములు:—

Sabine- లాటిన్పదము.

St. Laurence. same as lawrence- నవీనకల్పితపదము.

Salmon- హిబ్రూపదము. 'peaceble' అని యర్థము.

Salvador- లాటిన్పదము. 'savior' అని యర్థము.

Samson, Sampson, Sanson- హిబ్రూ పదము. 'splendid sun' అని యర్థము.

Samuel- హిబ్రూపదము. 'Heard of God' అని యర్థము.

Sanders, Saunders, Sanderson, Sanford- గ్రీకుపదము. 'helper of men' అని యర్థము. దీని ముద్దుపేర్లు Sandy, Sawnie.

Saul- హిబ్రూపదము. 'demanded' అని యర్థము. ఇజరీలుదేశంపు రాజుపేరు.

Scawen-, Schomberg (ఉచ్చారణ Shomburg) } నవీన కల్పిత పదములు.

Scipio, Scipion- లాటిన్పదము. 'slaff' అని యర్థము.

Seabert, Sigbert- ట్యూటానిక్కు పదము. conquering brightness'అని యర్థము.

Seaforth- ట్యూటానిక్కుపదము. దీని జర్మనురూపము 'Sieg fried' అని. 'Conquering place' అని యర్థము.

Sealy- నవీనకల్పితపదము.

Seaward- ట్యూటానిక్కుపదము. 'Conquering Guardian' అని యర్థము.

Sebastion- గ్రీకుపదము. 'Venerable" అని యర్థము.

Secundus- లాటిన్పదము. 'Secund' అని యర్థము.

Selden- నవీనకల్పితపదము.

Septimus- లాటిన్పదము. ఏఁడవఅనియర్థము.

Serenus- లాటిన్పదము. 'Peaceful serene' అని యర్థము.

Sergius - లాటిన్పదము. నలుగురుపోపుల కీపేరుండెను. రష్యాలో వ్యాపక మెక్కువ.

Seth- హిబ్రూపదము. నియమితుఁ డని యర్థము.

Seton ఉచ్చారణ Seeton అని (స్కాచిపదము), Seward — నవీన పదములు.

Sextus, Sixtus- లాటిన్ పదములు. ఆరవ యని యర్థము. ఆర్గురుపోపుగురుల కీపేరిడఁబడెను.

Seymour - (ఉచ్చారణ seemore అని) నవీనకల్పితపదము.

Shadrach-హిబ్రూపదము. 'Gift of the Lord' అని యర్థము.

Shafto- నవీనకల్పితపదము.

Shawn- ఐరిషుపదము. 'Grace of Lord' అనియర్థము.

Shelley - నవీనపదము. ఒక యాంగ్ల మహాకవిపేరు.

Sherard- (ఉచ్చారణ Sherard), Sherston, Shirley- } నవీనకల్పిత పదములు.

Sylvan, Sylvanus- } లాటిన్పదములు. అరణ్యవాసి యని యర్థము.

Sylvester-, Sylvius- } (same as Silas) St.Sylvester. అనుపేరు గల మువ్వురు పోపుగురువులుండిరి.

Sholto- స్కాచిపదము. 'sower' అని యరము.

Sibbald, Sibel- ట్యూటానిక్కుపదము. 'Conquering prince' అని యర్థము.

Sidney, Sydney- నవీన కల్పితపదము.

Sigismund, Sigmund- ట్యూటానిక్కుపదము. 'conquering protector' అని యర్థము. పోలండు జర్మనీ లోనిభూపాలుర పేరు.

Silas, Silvain, Silyanus, Silva, Silvester, Silvestre లాటిన్పదము (same as sylvanus) అరణ్యవాసి యని యర్థము. దీని ముద్దుపేర్లు Vest, Vester అని.

Simeon, Simon- హిబ్రూపదము. వినువాఁడని యర్థము. దీని ముద్దుపేర్లు Sim, Sims అని.

Sinclair స్కాచిపదము, Singleton ఆంగ్లపదము, Sings by } నవీనపదములు.

Sol- ట్యూటానిక్కుపదము. సూర్యుఁడని యర్థము.

Soloman- హిబ్రూపదము. peaceful. ఇజరేలుదేశపు భూపాలుని పేరు.

Somers, Somerset- (ఉచ్చారణ Summers, Summerset) నవీనకల్పితపదములు.

Somer Ville, Spence, Spencer } నవీనకల్పితపదములు.

Squire- నవీనము. ఇంగ్లాండు నుత్తరభాగమునఁ బ్రచారము గలమాట.

Stafford, Stamford, Standish స్కాచిపదము } నవీనకల్పితపదములు

Stanilaus, Stanilas, Stanilaos- రష్యనుపదము. పోలండుదేశపు రాజులపేరులు.

Stanley
Stanton
(ఉచ్చారణ Stahanton } నవీనకల్పిత పదములు.

Stephen, Steven- గ్రీకుపదము 'crowned' అనియర్థము. దీని ముద్దుపేరులు 'Steve, Stevie' అని యాంగ్లభూపాలుని పేరు.

Stewart, Stuart
Stirling - నవీనకల్పితపదములు.

Suleiman, Soloman- పదము కరబ్బీ౯ాట 'peaceful' అని యర్థము.

Swayne, Swaine- ట్యూటానిక్కు పదము. 'Youth' అని యర్థము.

Swithin, Swithun- ట్యూటానిక్కు పదము. 'Strong friend' అని యర్థము. (St. Swithin ఋషి పేరు. 15 th July ఈఋషిదినము.)

**యక్షప్రశ్నలు:**—మహాభారతము, అరణ్యపర్వము, సప్తమాశ్వాసమున యక్షుం డడుగుటయు, ధర్మజుం డుత్తరము లొసంగుటయు సంభవించెనని వివరింపఁబడినది. దానికే 'యక్షప్రశ్న'లని వాడుకఁ గల్గెను. ఇవి నలుబదియాఱు ప్రశ్నలు.

యుధిష్ఠిరునిసోదరులు నల్వురొకకారణాంతరమున మూర్ఛఁజెంద, వారిం దెల్వి నొందించ యక్షుని నిర్ణయముమేరకు నాతం డడిగిన నలుబదియాఱుప్రశ్నల కుత్తరములొసంగి వారిం దెల్వికిఁ జేర్పఁగలుగుట నెవ్వరేని యడుగుచిక్కుప్రశ్నలకు 'యక్షప్రశ్న' లని వాడుకఁ గాసాగెను. ఇక్కాలమున నిది సామెతగ నున్నది.

౧ సూర్యుని నడుపున దేది? బ్రహ్మపదార్థము.

౨ సూర్యుం గొలుచుచుఁ బరివేష్ఠించువా రెవ్వరు? సురులు.

౩ సూర్యాస్తమయ మేమిటను? ధర్మువు (విధి) వలన.

౪ సూర్యున కాధార మెద్ది? సత్యము.

౫ ఏమిట శ్రోత్రియుఁ డయ్యెడిని? శృతమువలన శ్రోత్రియుఁ డగును.

మహిమ యేమిటం గల్గును? అతులతపంబు వలన.

౭ పురుషుం డేమిట సహాయయుతుఁ డగును? ధృతిచేత.

౮ బుద్ధిమంతుఁ డగు టెట్లు? బుధసేవవలన.

౯ దేవభావ మెట్లుఁ గల్గెడిని? అధ్యయనమువలన.

౧౦ సాధుభావ మె ట్లగును? అధికవ్రతశీలము నుండి.

౧౧ అసాధుత్వ మెట్లగును? విశిష్టవృత్తి వీడుటం జేసి.

౧౨ మనుష్యత్వ మెట్లు గల్గును? మృత్యుభయ సంగతమున.

౧౩ జీవన్మృతుఁ డెట్టివాఁడు? దేవాతిథి పితృ, భృత్యాదుల కిడకఁ దాఁ దినుచుండువాఁడు.

౧౪ భూమికన్న నెక్కువయైన దేది? తల్లి.

౧౫ ఆకసముకన్నఁ బొడవైన దెవ్వరు? తండ్రి.

౧౬ వాయువుకన్నఁ ద్వరితముగ వ్యాపించునదేది? మనస్సు.

౧౭ గడ్డికన్న తరచైనదేది? చింత (ఖేదము).

౧౮ నిద్రించుచుఁ గనుమూయని దెద్ది? మచ్చము.

౧౯ జన్మించియుఁ జేతనత్వముఁ బొందని దేది? అండము (గ్రుడ్డు)

౨౦ రూపముం గల్గియు హృదయము లేని దేది? రాతిరూపము.

౨౧ వేగముతో వరిఁచున దేది? నది.

౨౨ దారినడచువారి బంధు వేది? సార్థము.

౨౩ రోగార్తునిబంధు వెవరు? వైద్యుఁడు.

౨౪ గృహస్థుబంధు వెవరు? సత్కళత్రము.

౨౫ ధర్మమునకుఁ గుదురేది? దాక్షిణ్యము.

౨౬ కీర్తి కాశ్రయ మెయ్యది? దానము.

౨౭ స్వర్గమునకు మార్గ మేది? సత్యము.

౨౮ సుఖమునకు మార్గ మేది? సత్ప్రవర్తనము (శీలము).

౨౯ పురుషున కాత్మయగువాఁ డెవఁడు? ఆత్మజుఁడు.

౩౦ నరునకు దైవికమైనచుట్ట మెవరు? సద్భార్య.

౩౧ నరునకుఁ జైతన్యము దేనినుండి కల్గును? వాయువునుండి.

౩౨ నరుఁడు దేనింబూని యనవద్యత నందును? దానముం గాపాడి.

౩౩ గొప్పదగు ధర్మమెయ్యది? అహింస.

౩౪ ఎయ్యది యెల్లప్పుడును మాసిపోక పడియుండెడిని? యోగకర్మము.

౩౫ దేనిని నిగ్రహించినఁ బ్రమోదసిద్ధి కల్గును? మనోగర్వము.

౩౬ ఎవ్వరిసాంగత్యము సర్వత్ర వికలముఁగాక నిలచును? సుజనసంగతి.

౩౭ లోకమున ది క్కెవరు? సజ్జనబృందము.

౩౮ అన్నోదకము లెట్లుఁ గల్గును? భూమ్యాకాశములనుండి.

౩౯ విష మనఁగ నేమి? విప్రధనము.

౪౦ శ్రాద్ధవిధిసమయ మెద్ది? విప్రాగమము.

౪౧ సర్వజనప్రియుఁ డెట్లగును? గర్వ ముడుగుటం జేసి.

౪౨ శోకరహితుఁ డెట్లగును? క్రోధము నడంచి.

౪౩ అర్థవంతుఁ డెట్లగును? లోభ మడంచి.

౪౪ సుఖి యెట్లగును? ఆశను వదలుటంజేసి.

౪౫ పురుషశబ్దవాచ్యుఁ డెట్టివాఁడు? సంపూర్ణకీర్తిఁ గలవాఁడు.

౪౬ సర్వధని యెవ్వఁడు? ప్రియాప్రియములు, సుఖదుఃఖములు, భూతభావికార్యములు, సమములుగ నెంచు నాతఁడు.

## యక్ష్మరోగము (Tuberculoises):—

దీని నాయుర్వేదమున 'రాజయక్ష్మ' యనియు ననుటఁ గలదు. సూక్ష్మజీవులవలనఁ గల్గి, యతిత్వరితముగ వ్యాపించు నంటువ్యాధి. అన్నిదేశములందు శీతోష్ణభేదములఁ బాటింపక వ్యాపించి యున్నవ్యాధి. దీనిని 'క్షయదగ్గు' అని దగ్గులలో నొక భేదజాతిగ నాయుర్వేదమున వివరింపఁబడి పేరు వ్యాప్తి నొందినది.

ఈవ్యాధి మనుష్యులకే గాక ఆవులు, ఎద్దులు, పావురములు మొదలగు కొన్నిజాతుల పక్షులకుఁగూడ నంటుంగాని, కోతులు, మేకలు దీనికి లోఁబడకుండుననియు, జనసమ్మర్ద మెక్కువగను, విశాలము తక్కువగను నుండి, యొకరు పీల్చినగాలియే యింకొకరు పీల్చఁ దటస్థించు నిఱుకుపట్టణములందు, వాయుప్రసారము చక్కఁగ లేని చీఁకటిండ్లు, మద్యపాన మధికముగఁగల ప్రదేశములు, ఆహారలోపముఁగలతావులు, క్షయరోగమున కాటపట్టనియు, నెండ బాగుగఁ గాయు పల్లెటూళ్లీరోగాభివృద్ధికిఁ బనికిరావనియు, నిది వంశపారంపర్యముగ సంతానమునకుఁ గల్గు వ్యాధి కాకున్న నీరోగముగల తల్లిపాలు ద్రావుటవలన శిశువునకుఁగూడ నీఘోరవ్యాధి సంభవింపవచ్చుననియు, గొప్పవైద్యులు పరిశీలించి తెల్పియున్నారు. దీనిసూక్ష్మజీవి దళముఁగల్గినకణిక వలె నుండుననియు, తూర్పుపడమరలకుఁ గిటికీ లెక్కువయుండి సూర్యరశ్మి చక్కఁగ నింటలోనికి వచ్చు నిండ్లీ రోగమునుండి నివసించువారిని రక్షించు

ననియు, నెండ యీసూక్ష్మజీవులం జంపు నైరి వంటి దనియు నొక సుప్రసిద్ధ ట్యూబర్క్యులోసిస్ వైద్యశిఖామణి యిటీవల నుడివియున్నాఁడు.

జ్వరము, దగ్గు, ఆయాసము, చెమటలు, శరీరము శుష్కించుట, రక్తక్షీణము, శ్వాసకాసలు, కఫోద్రేకము, అగ్నిమాంద్యము, జిహ్వాయందరుచి, బలహీనత లీరోగలక్షణములుగ నన్నియో, కొన్నియో రోగియం దమరియుండెడిని. ఈసూక్ష్మజీవి శ్వాసకోశములనే గాక యితరావయవములఁ గూడ నాశ్రయించియుండుంగాన రోగి కళ్ళెలో లెక్కలేని సూక్ష్మజీవు లుండుననియు, కళ్లెయెండి చిన్నరేణువులుగ గాలిలో నెగురుతఱి నందు సూక్ష్మజీవులుండి రోగము వ్యాపింపఁజేయుననియు, రోగు లుపయోగించుపాత్రలు, ధరించు బట్టలు సంపర్కముననుు, రోగి పరున్నగదిలో నిద్రించుటవలనను, క్షయవ్యాధి గలయావులపాలు త్రాగుటవలనను, రోగిమలమూత్రములపై, కళ్ళెలపై వ్రాలినయీఁగలు తిరుగ వ్రాలుటమూలమునను, ఈఁగ లిటుల సంపర్కముం గల్గించిన మాంసాహారమువలనను, ఈరోగపరిశీలనలు సల్పినఘన వైద్యు లీఘోరవ్యాధి వ్యాపించునని వివరించిరి. కాని యీసందర్భమున నింకొకసంగతిగూడఁ దెల్పియున్నారు. వేఁడియగు సూర్యరశ్మియు, స్వచ్ఛమగు పరిశుభ్రవాయువును, ఈసూక్ష్మజీవుల నిర్మూలింపఁగలవనియు, చాలసేపు వేఁడియందుఁ బక్వముచేయఁబడిన పదార్థముల కంటినసూక్ష్మజీవులు తప్పక నశించుననియుఁ గూడఁ దెల్పియున్నారు.

మానవుని శరీరదార్ఢ్యము బలముగ నున్నంతకాల మాతని నీసూక్ష్మజీవులు వశపఱుచుకొనఁ జాలవు గాన, రోగికి బలముఁ గల్గించు నౌషధము లిచ్చుటయు, ఎండయు, స్వచ్ఛమగు గాలియు బాగుగఁ దగులున ట్లాతని వేఱుగనుంచి, యాతని కళ్ళెను కాగితఁపుసంచులలో నుమియఁజేసి వాటి నెప్పటికప్పుడు కాల్చుచుంటయు, నెత్తగుతావుల నాతని నుంచుటయు, సర్వచికిత్సగ నాంగ్లవైద్యులు మదనపల్లి, బళ్లారి మొదలగుతావులందీరోగనివారణ కారోగ్యాశ్రమములఁ జికిత్సచేయుచున్నారు. (అంటువ్యాధులు, సూక్ష్మజీవులు, దగ్గు చూడుఁడు.)

**యక్షులు:**—కస్యపునకు సురస యను భార్యవలన జనించిన సంతతి. వీరు రాక్షసులలో నొకతెగవారు.

**యాంకీ (yankee):-** యుత్ప సరిగాఁ దెలియరాకున్నయది. అమెరికాఖండమున న్యూఇంగ్లాండనుసీమనివాసస్థుల కీపేరు తఱచుగ వాడుచుందురు. ఇంగ్లాండుదేశమున నమెరికాసంయుక్తరాష్ట్రవాసులనే 'యాంకీ' యని వాడుదురు. అమెరికాయుద్ధసందర్భమున నింగ్లీషువా రమెరికనుల కీపేరు వాడుచుండిరఁట. అమెరికాలో సంయుక్తరాష్ట్రముల దక్షిణసీమలనున్నవా రమెరికనులు. ఇండియనులు సహా యుత్తరసీమలం దున్నవారికిని 'యాంకీ' లని యందురు. ఇది యిండియనుజాతులవారు తక్కిన తెల్లజాతుల కిడిన పేరని తలంపఁబడుచున్నది.

**యాంగ్ట్సెకియాంగు నది:**—ఇది చీనాదేశఁపు గొప్పనదులలో నొకటి. మూఁడువేల మైళ్ళు పొడవుఁ గలది. ౬,౫౦౦౦౦ చతురఁపుమైళ్ళ ప్రదేశఁపు వర్షజలములం గ్రాఁలించునది.

టిబెట్టుదేశఁపుఁ బీఠభూమికిఁ దూర్పుదెసను జనించి, మొరకలనుండి, పల్లమునకు వడిగ దొరలుచు, ఇఛింగుపురమువఱకుఁ జనును. అంతదనుక నావలు నడుచుటకైన నసాధ్యమై యుండెడిని.

ఇఛింగునుండి దీనిద్వారలుట తెలియరాక కాలు వవలె గొప్పనది యై ప్రవహించుచు, హాంకౌ పురము ప్రక్కంబడి వూహూపురముకడ సముద్రఁ పుటుప్పునీటిసంపర్క మందును. ఇటనుండి సముద్రమందలి దీనిముఖద్వారము రెండువందలమైళ్లు దూరముండును. దీనియందలి యుపనదులును గొప్పవియే. గాన నిది పెద్దపెద్ద యోడలు నడచు జలమార్గములలో నెన్నఁబడుచున్నది. నిజముగ వఱదలవలన ముంపు నందఁదగిన దీని దిగువభాగమున నెక్కువమైన వఱదనీటిని గైగొనుసరస్సు లనేకము లున్నవి గాన దీనివఱదలనుండి నష్టమే లేదు.

**యాకులు:—**
(జడలబఱ్ఱెలు చూడుఁడు.)

**యాచితకమండన న్యాయము:—**
ఎరువుమస్తులు సరిగా సరిపోక, పైకే స్పష్టముగఁ దెలియనై యవమానకర మగును. అట్టిస్థితి యం దీన్యాయము వర్తించును.

**యాజుఁడు:—** ఒక ముని. ఈతనియనుగ్రహమున ద్రుపదమహారాజున కగ్నికుండమున ధృష్టద్యుమ్నుఁడను కొమారుఁడును, (ద్రౌపతి) కృష్ణ యనుకుమార్తెయుఁ గల్గి రని చెప్పఁబడినది.

**యాజ్ఞకగోత్రము:—**
(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.)

**యాజ్ఞపిగోత్రము:—**
(శౌనక లేక గృత్సమద ఉపగణము చూడుఁడు.)

**యాజ్ఞవల్క్యగోత్రము:-**
(కుశికగణము చూడుఁడు).

**యాజ్ఞవల్క్యగోత్రము:-**
(వశిష్ఠగణము చూడుఁడు).

**యాజ్ఞవల్క్యమహర్షి:—** తండ్రి బ్రహ్మరాతుఁడు. భార్యలు మైత్రేయి, కాత్యాయిని యనంబడినవారలు. ఈతండు విరక్తిఁజెంది భార్యలకు జ్ఞానోపదేశ మొనర్చినవాఁడు. అతఃపూర్వమీతనిచర్యలు విపరీతములు. తొలుత వైశంపాయనునిశిష్యుఁడై, సమస్తవిద్యలు నేర్చి, పిదప నాయనకోపమునకుఁ బాత్రుఁడై, గినిసి యాయన విద్య లాయనకు వదలివేసి, తిరుగ మిత్రు నాశ్రయించి, శుక్లయజుర్వేదాధ్యయన మొనర్చినవాఁడు. జనకమహారా జొనర్చిన యాగమున నటకేతెంచిన శాకల్యుఁడు మొదలగు ఋషుల నెదుర్కొని వాదమునం దోడించినవాఁడు. (కాత్యాయన చూడుఁడు.)

శుక్లయజుర్వేద (శతపథ) బ్రాహ్మణమునందునను, ఆ వేదశిఖయనందగు బృహదారణ్యకోపనిషత్తునందునను(శతపథ ౧౪—౬—౯—౮ ——౧౪—౬ ౫—౩— బృహదారణ్యక ౮—౩-౨— ౮——౫—౩) యాజ్ఞవల్క్యుఁడు. అరుణుఁడను దేవర్షి పుత్రుండగు నుద్దాలకునికడ శుక్లయజుర్వేదముం జదివెనని చెప్పఁబడినది. ఉద్దాలకుని 'ఆరుణి' యనుటయుఁ గలదు. ఇంక సూర్యునకు, నారుణికి సంబంధమేమో పరిశీలనలు జరుపఁదగియున్నవి. యాజ్ఞవల్క్యుఁడు గొప్పమేధావి, బ్రహ్మజ్ఞాని. జనకసభయం దీతఁడు పెక్కంద్ర నోడించుటఁజేసి యనేకు లీతనిశిష్యులై, మిథిలదేశమున నీరిశాఖ యధికముగ నేటికిని నిలచియున్నది.

**యాజ్ఞవల్క్యర్షిగోత్రము:—** (శిష్టకరణములు చూడుఁడు.) వీరికిఁ బ్రధానఋషి విశ్వామిత్రుఁడు. దేవరాత, చికిత, మను, ఔలక,

వాలకి, ఉలూక, బృహదగ్ని, బభ్రు, శావని, శాలావత, శాలంకాయన, కాలబవ, యను గోత్రీకులు. ప్రవరరూపము యాజ్ఞవల్క్య, వైశ్వామిత్ర, దేవరాత, అనుప్రవర రూపముగఁ జెప్పఁబడినది. శిష్టకరణములలో ౧ కప్పిలివారు, ౨ కొట్టక్కవారు, ౩ గలావిల్లివారు, ౪ తట్టికోటవారు, ౫ ప్రతాపరావువారు, ౬ బొండపల్లివారు, ౭ మగడవారు నను నింటిపేర్లఁ రీగోత్రములు గలవారె రి.

## యాడాకి గోత్రము:—
(భరద్వాజ ఉపగణము చూడుఁడు.)

## యాతాల్య గోత్రము:—
(వాధ్ర్యస్య లేక అమిత్రయుపగణముచూడుఁడు.)

**యాత్రాచతుర్ధామములు (చతుర్ధామములు):—** ౧ రామేశ్వరము:– దక్షిణ రామనాథపురమండలమున.

౨ ద్వారక:– బొంబై రాజధాని పశ్చిమసముద్రతీరము.

౩ బదరీనారాయణము:— హిమవన్నగమున గార్వాల్ లోని బదరీనాథము.

౪ వైద్యనాథము.

**యాత్రాక్షేత్రములు లే. బైరాగులు యాత్రచేయవలసిన అష్టయాత్రలు-(సాధువులు):—** ౧ హరిద్వారము, ౨ ద్వారకాపురి, ౩ మధురాపురి, వ్రజమండలము (ఉత్తర మధుర Mutra) ౪ బృందావనము (వ్రజమండలము), ౫ గోకులము, (వ్రజమండలము), ౬ శ్రీజగన్నాథము (ఉత్కలదేశము), ౭ ఉడిపి (పశ్చిమ సముద్రతీరమున కన్నడదేశమున), ౮ తిరుమల (చిత్తూరుజిల్లా).

**యాదవగిరి:—** దీనికి మేల్కోట యనియు, తిరునారాయణపురమనియుంగూడ పేర్లు కలవు. ఇది ప్రసిద్ధవిష్ణుక్షేత్రము. మైసూరుసంస్థానరాజ్యములోని ఫ్రెంచిరాక్సు స్టేషనుకు సమీపము. శ్రీరంగపట్టణమున కుత్తరముగా నిరువదియైదు మైళ్ళదూరము.

శ్రీవైష్ణవమతసిద్ధాంత స్థాపకుండగు రామానుజస్వామి చాలకాలము వసించినతావు. ఇటఁ జెళ్ళపిల్లరాయుఁడను నామమున శ్రీకృష్ణునిదేవస్థానము కలదు. అదివఱకు జైనుఁడుగనుండిన వేతాళదేవబల్లాలరాయియనంబడినభూపతి రామానుజులశిష్యుండై శ్రీవైష్ణమతస్థుఁడై, విష్ణువర్ధనుఁడను నామము వహించెను. ఇటఁ గట్టిన దేవళము గొప్పప్రసిద్ధిఁగల విష్ణుక్షేత్రమై యున్నది. ఈతఁడు ద్వారసముద్రము రాజధానిగ నీదేశ మేలుచుండువాఁడఁట. శ్రీవైష్ణవులు దీనిని దక్షిణబదరీనాథమని చెప్పుదురు.

**యాదవప్రకాశుఁడు:–** ఈమహాత్ముఁడు గొప్పవిద్వాంసుఁడు. విశిష్టాద్వైతసిద్ధాంతస్థాపకుండగు రామానుజజగద్గురునకు విద్యాగురువు. గాన వారికాలమున కించుకపూర్వుఁడై యుండవలెను. వీరద్వైతపరముగ బ్రహ్మసూత్రభాష్య మొకటి రచించినవారు. శ్రీవైష్ణవులు యాదవప్రకాశులు రామానుజులవారి శిష్యుఁడై పోయె ననియెదరుగాని యిదియెంతవఱకు నిజమాయని సంశయము తోఁపకపోదు. (యాదవమతము చూడుఁడు)

**యాదవమతము లేక యాదవప్రకాశమతము:—** ఇది యద్వైతమతములలో నొకటి. కర్త యాదవప్రకాశు లనుపంశితుఁడు. ఈతఁడు శ్రీవైష్ణవ మతోద్ధారకుండగు రామానుజగద్దేశికులకు విద్యాగురువని చెప్పఁబడినది. వైష్ణవగ్రం

థములందు యాదవప్రకాశులు రామానుజదేశికులకు శిష్యులైై, రామానుజీయవైష్ణవుం డయ్యె (విశిష్టాద్వైతి యయ్యె) నని వ్రాయఁబడినది గాని యాదవప్రకాశమత మద్వైతసిద్ధాంతమున నన్లే యుండుటఁ జూడ, నది యెంతవఱకు నిజమో యని యోచింపవలసియున్నది. యాదవప్రకాశదేశికుఁడు బ్రహ్మసూత్రముల కద్వైతపరముగ వాఖ్య వా :డు.

ఈతనిమతమునఁ బరబ్రహ్మము సన్మాత్రస్వరూప మనియు, నాపరబ్రహ్మమే చిత్తు, అచిత్తు, ఈశ్వరుఁడు నని త్రివిధములుగఁ బరిణమించునని యుఁ జెప్పఁబడినది. 'చిత్తు' అనిన నాత్మయనియు, 'అచిత్తు' అనిన యచేతనమగు శరీరేంద్రియాదిక మనియు, 'ఈశ్వరుఁ' డనిన సర్వనియామకత్వము వహించినపరమచేతనుఁ డనియు నిర్వచింపఁబడినది.

జీవున కభేద మెఱుంగనందువలనఁ గల్గుచున్న భేదజ్ఞానమే సంసారమై త్రివిధభేదములుగ భ్రమించుచున్నదని చెప్పఁబడినది. సత్కర్మాచరణము వలన భేదజ్ఞానము నశించుననియు, నందువలన సంసారమునుండి విముక్తిఁ గల్గుననియు, సంసారమన జననమరణాత్మకబంధమనియు, భేదజ్ఞాననివృత్తి బ్రహ్మప్రాప్తికి సాధకమగుననియు, భేదజ్ఞాననివృత్తివలనఁ గల్గినజ్ఞానమును బ్రహత్వము తనకుఁ బ్రాప్తించుటయును (అనఁగాఁ దానే బ్రహ్మమను నిజము నెఱుంగుట.) ఈ రెండును నీమతమున మోక్షమని చెప్పఁబడినది.

**యాదవామాత్యకవి:**—ఆంధ్రకవులలో మధ్యకవులందుఁ జేర్కొనఁబడినవాఁడు. ఆర్వేల నియోగిబ్రాహ్మణుఁడు. భారద్వాజగోత్రము. తండ్రిపేరు బాపిరాజు. పితామహుఁడు వేంకటరాజు లేక వేంకటాద్రి. పితామహి కొండమ్మ. ప్రపితామహుఁడు నారప్ప. తల్లి చెన్నమ్మ. వీరరాజు, కృష్ణయ్య, తండ్రిసోదరులు. పినతండ్రి కొడుకుపేరు రామరాజు. వీరిపూర్వులలోఁ దిమ్మరాజకవి, భావరాజు ననుపేర్లు కలవారు సుప్రసిద్ధులు.

ఈకవి యైశ్వర్యవంతుఁడనియు, గౌరవప్రపత్తిఁ గలకుటుంబమువాఁ డనియుఁ దోఁచెడిని. ఈతఁడు చంద్రహాసవిలాసమను ప్రబంధము రచించినవాఁడు. హృదయరంజకమైనకవిత్వము, రుచికరమైన శబ్దములపొందిక యీతనికిం బరిపాటి. మఱియు నీతఁడు 'లక్షణశిరోమణి' యనంబడు యాదవామాత్యఛందమును రచించియున్నాఁడు.

**యాదవులు:**—యదుమహారాజుసంతతి. చంద్రవంశక్షత్రియులు. యదువు జ్యేష్ఠపుత్రుఁ డగుసహస్రజిత్తునుండి హేహయవంశమేర్పడియెను. ఇందు హేహయుఁడు, కార్తవీర్యార్జునుఁడు చాల పేరందినమహారాజులు. చేదిదేశాధిపతులు. మాహిష్మతీపురము రాజధాని.

రెండవసుతుఁడగు క్రోష్టువు సంతతిలో శశిబిందువు, జ్యామఘుఁడు, విదర్భుఁడు, గొప్ప పేరందిన భూపతులు. విదర్భుఁడు విదర్భవంశస్థాపకుఁడు. ఆతనిమూఁడవసుతుఁడు దిమహారాజు. (దేశమునకు వంశమునకు నీతనిపేరు వచ్చెను.) విదర్భుని రెండవసుతునిసంతతిలో భోజవంశస్థులు. (ధారానగరాధిపులు) గల్గిరి. అంధకుని సంతతిలో శ్రీకృష్ణుఁడు జన్మించినవాఁడు. వృష్ణిసంతతిలో సత్రాజిత్తు, సాత్యకి జన్మించిరి.

విజయనగరసామ్రాట్టు లగుభూపతులు యాదవులనియే తెలిసెడిని.

**'యాదృశం తాదృశమేవ సాధయతీతి':**—దీనిని 'యాదృశం తాదృశం న్యాయ'

మనియు నందురు. ఏవిధముగ నుండునో యావిధముగనే యగునని యర్థము. అస్త్రు మస్త్రేణ శామ్యతి (అస్త్రము అస్త్రముచేతనే శాంతించును.) యాదృశః పురుషస్యాత్మా తాదృశం సంప్రభాషతే (అన్తఃకరణ మెట్లుండునో యట్టిమాటలనే యాడుచుండును.) యాదృశీభావనా యస్య సిద్ధి ర్భవతి తాదృశీ (భావన యెట్లుండునో యట్లే సిద్ధియు నగును.) యాదృశీ మాతా తాదృశీ పుత్రీ (తల్లి యెట్లుండునో కూఁతురును నట్లే యుండును). యాదృశీ శీతలా దేవీ తాదృశీ ఖరవాహనమ్ (శీతలాదేవి యెట్లుండునో యంతకుఁ దగినదే గాడిద నెక్కుట) మొదలగున విట్టియర్థముగల న్యాయములే.

'యాదృశో యక్ష స్తాదృశో బలి రితి':- యక్షులు, రాక్షసులు, పిశాచములు మొదలగు తెగవారుగ నెంచఁబడుదురు. ఎటువంటియక్షున కటువంటిబలి (Offering) యియ్యఁదగునని భావము. ఇంకను (''అహృదవచసా మహృదయ ముత్తర మితి'' న్యాయము చూడుఁడు.)

**యానగుణము:**-రాజనీతియందలి షడ్గుణములలో నొకటి. (షడ్గుణములు లేక షడ్గుణైశ్వర్యములు చూడుఁడు).

### యానసకులగోత్రము:—

(యానసభికుల చూడుఁడు.)

**యానసభికులగోత్రము:**— ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్యగోత్రములు చూడుఁడు.)

యానసభికుల (యానసకుల, మెనసకుల) గోత్రము. ఏకార్షేయ. (3౯) గోత్రము. అచిధ్యగణము ఔచిథ్యస (సంస్కృత) గోత్రము. పిశాచబర్బిస్ఠి. ఆపస్తంబయజుశ్శాఖ. ప్రమాణ ఆద్యప్రవరఖణ్డ. సమానగోత్రములు. పిశాబర్బస. కోటీశ్వరుఁడు దేవత. కోటాంబ భార్య. మలయాద్రి తపస్థానము. కోటిసరస్సు తటాకము. జపము లక్ష. దీపములు ౧3. క్షేత్రసంఖ్య ౯. ధనదానము. గోధుమలు వర్జనీయము.



### యానాదిజాతి:—

(కొరవజాతి చూడుఁడు).

### యానాము:—

(ప్రెంచియిండియా చూడుఁడు)

### యామెనుభాగము:—

(అరేబియా చూడుఁడు)

### యామ్యసన్నిపాతము:—

(సన్నిపాతదోషము చూడుఁడు)

### యావక్రి గోత్రము:—

(గర్గ ఉపగణము చూడుఁడు.)

'యావ త్తావ త్సాధయతీతి':- ఎంతవఱ కుండునో యంతవఱకు నని భావము.

యావ చ్ఛిర స్తావ చ్ఛిరో వ్యథా (తలయెంతవఱకుండునో యంతవఱకుఁ దలనొప్పి).

యావ త్తైలం తావ ద్వ్యాఖ్యానమ్ (దీపములోఁ జము రెంతవఱకుండునో యంతవఱకు వ్యాఖ్యానము చేయుచుండుట).

యావ త్స్నానం తావ త్ఫలమ్ (ఎంతవఱకు స్నానమో యంతవఱకు ఫలము).

యావద్వచనం తావ ద్వాచనికమ్ (ఎంతవఱకు వచనమో యంతవఱ కర్థము).

మొదలగున్యాయము లిట్టియర్థమే గలవి.

**'యావద్వచనమ్ వాచనికమ్' ఇతి న్యాయము:**—ఎంత చెప్పఁబడినదో యంతకే యర్థము చెప్పవలెను. గాని, యధికము వ్యాఖ్యా నరూపమున నూహల నటఁజేర్పఁ బాడి గాదని భావము.

**యావనాలశర్కర (మన్నా ధమాసా):**—

(తురఞ్జబీను చూడుఁడు)

**యాస్కగణము:**—ఇది భృగుసంతతి యందలి యొకగణము. దీనిని వీతహవ్యగణమని వాడియున్నారు.

(వీతహవ్యగణము చూడుఁడు.)

**యాస్కగోత్రము:**—

(వీతహవ్య లేక యాస్కగణము చూడుఁడు.)

**యాళ్ప్పాణదేశము:**— సింహాలదేశ మునకు యాళ్ప్పాణ దేశమని ద్రవిడగ్రంథము లందు వాడఁబడినది. (అగస్త్యసాంప్రదాయవైద్య ము చూడుఁడు.)

**యుఓమన్ లేక యోమన్ (Yeoman):**— ఈ యాంగ్లపదమునకుఁ జిత్రమైన యర్థము వాడుకయం దున్నది. కూలినాలులు చేసి కొను Labourers కన్న నధికులును, Gentleman కన్న నల్పులుగను నుండు చిన్నరైతులు, మధ్యసంసారులు నని భావము. తొల్లింట యోమెన్ అనిన (పల్లెటూరు) గ్రామనివాసి యని యర్థ ముండెనఁట. కాని యది మాఱెనఁట.

**యీస్టుచెట్టు (Yeast Plant):**— ఇది నిజమున మైక్రోబులతో సరియగుసంబంధ బాంధవ్యములం గల్గి యట్లే జీవించునదైనను, సర్వసాధారణముగ మైక్రోబులలో వాడఁబడుట లేదు. ఇది పంచదార నాల్కోహాలుగను, కార్బన్-డి-ఆక్సైడుగను చేయునది. దీనిని పాశ్చాత్యదేశస్థు లనుదినము రొట్టెలు చేయుటయందు వాడు చున్నారు. యీస్టు ఆల్కోహాలును గాలిగ మార్చి, యెగయున ట్లొనర్చి, కార్బన్-డి-ఆక్సైడును పిండితోఁ గలియునట్లుఁ జేసి, రొట్టెను పొంగఁ జేయును. యీస్టుచెట్టు ప్రత్యేకముగ నాల్కోహాలుంగూడఁజేయుట కుపయోగించుచుండుటయే గాక, పెక్కుపనులం దుపయోగించు చున్నారు.

పెక్కండ్రు యీస్టుచెట్టును వస్తువులను బరిశుభ్రపఱుచుటకుఁ గూడ నుపయోగించు చుందురు. నిల్వయుంచువాటిని జెడిపోనీయక నిల్వ యుంచుశక్తి దీని యందుఁ గల దందురు. ఇది చక్కఁగఁ గాలును. పాశ్చాత్యులు దీనిని పలువిధ ముల నుపయోగించుపదార్థ మనుచున్నారు.

## యు అక్షరమునకుఁ జెందిన క్రైస్తవ స్త్రీ నామములు:—

Ulla-హిబ్రూపదము. ఎత్తనియు, పసిబాల యనియు రెండర్థములు.

Ulrica, Ulrika, Ulrique- ట్యూటోనిక్కుపదరూపములు. విశాలహృదయమగు పరిపాలకురాలని యర్థము. Ullric యొక్క స్త్రీ వాచకపదరూపము.

Ulva- ట్యూటోనిక్కుపదము. తోఁడేలని యర్థము.

Una- సెల్టిక్కుపదము. కరవు పిల్ల యని యర్థము.

Undine- లాటిన్పదము. నీటియొక్కయో, లేక కెరటములయొక్కయో, పేరంటాలదేవత (Fairy) యని యర్థము. ఈపదము జలాధిదేవతపేరు.

Unna- ట్యూటానిక్కుపదము. మనుష్యయువతి యనియర్థము.

Urania, Uranie- గ్రీకుపదము. స్వర్గీయమని యర్థము. Uraniusయొక్క (ఒకగ్రహము-అధిదేవత) స్త్రీరూపకపదము.

Urbana- లాటిన్పదము. పట్టణసంబంధి యని యర్థము. Urban యొక్క స్త్రీవాచకపద రూపము.

Uriel- హిబ్రూపదము. దేవుఁడే నావెలుతురు (వెచ్చఁదనము) అని యర్థము.

Urith- నవీనకల్పితపదము.

Ursula- లాటిన్పదము. భల్లూకి (ఆడఎలుఁగుబంటు) యని యర్థము. జర్మనుదేశమందలి కోలోన్ పురమున నొకప్రసిద్ధిఁజెందిన St.Ursula తపస్విని పేరు. ఈమె యచట బలాత్కారముగ చంపఁబడెనఁట. (saint)

Uta- ట్యూటానిక్కుపదము. సమృద్ధిఁగల యనియర్థము (భాగ్యవంతురాలు).

## యు అక్షరమునకుఁ జెందిన క్రైస్తవ పురుష నామములు:—

Ulfric- ట్యూటానిక్కుపదము. 'wold ruler' అని యర్థము.

Ulick- ట్యూటానిక్కుపదము. 'rich mind' అని యర్థము.

Ullric, Ulric, Ulrick, Uric- ట్యూటానిక్కుపదములు. 'noble ruler' అని యర్థము.

Ulysses- గ్రీకుపదము. అసూయ యని యర్థము.

Uranius- గ్రీకుపదము. 'heavenly' అని యర్థము. గ్రీకుదేవతపేరు.

Urban, Urbanus- లాటిన్పదము. పురవాసియని యర్థము. ఎనమండుగురు పోపుగురుల కీ పేరుండెను.

Uriah- హిబ్రూపదము. 'Lord is my light' అని యర్థము.

**యుక్తవేణి:—** గంగా యమునా సరస్వతీ నదులకూటమిని త్రివేణి యందురు. త్రివేణిక్షేత్రములు రెండు కలవు. సంయుక్తరాష్ట్రముల ముఖ్యనగరమగు నలహాబాద్ నగరములోని ధారాగంజి కడ ప్రయాగప్రక్కగాఁ గోటనంటియున్న గంగా యమునానదుల సంగమమును 'త్రివేణి'యందురు. దీనిని యుక్త (కలియునట్టి) వేణి యని చెప్పుదురు.

మఱియు బంగాళ (వంగదేశ) మునందు హుగ్లీ మండలమున బంశవాటిపట్టణమునకు సమీపమున త్రివేణి యనుపేరుగలగ్రామము కలదు. ఇదియును గంగాతీరమందలి క్షేత్రమే. ఇట గంగనుండి మూఁడుపాయలుచేరి వేరై ప్రత్యేకప్రత్యేకముగ సముద్రముంజేరెడిని. అందొకపాయను యమున యనియు, రెండవదానిని సరస్వతియనియు, ఈనడుట గంగనుండి వేఱగుచుంటఁ దక్కినది శుద్ధగంగ (హుగ్లీ) యనియు, ఇట్టిది ముక్త (విడిపోవు)వేణి యనియు నందురు.

**యుక్తియుక్తం వచో గ్రాహ్యం బాలాదపి శుకాదపి:—** ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి. బాలుఁడైతేనేమి, చిలుకయైతే నేమి? యుక్తమగు వచనములు పల్కిన గ్రహింపవలయునని భావము.

## యుక్తివాదములు ౨ విధములు:-

౧ అద్వైతవాదమతమున:- అధ్యారోపయుక్తి. సర్వము పరమాత్మయే యైయుండ, నందు

జగత్తుగాఁ దోఁచెడిభ్రమ. అనఁగాఁ గనిపించున దంతయుఁ బరమాత్మయని యెఱుంగక, జగత్తని యొకటి కలదనియు, నదియే మన కగుపడుచు నింద్రియగోచరమగున దనియు భ్రమించియుండుట.

౨ అపవాదయుక్తి:-జగత్తును మిథ్యయని యెఱింగి సత్యమగు పరమాత్మయందు (మిథ్యయగు) జగద్భ్రమ లేకయుండునది.

## యుగన్ధరదేశము:

—ఈ పేరుగల దేశ మొకానొకకాలమునఁ గురుక్షేత్రముకడ నుండినటులఁ దెలియుచున్నది. కురుక్షేత్రమునకు దక్షిణమున యమునానదికిఁ బశ్చిమతీరమునం దుండియుండునని తలంచుచున్నారు.

మహాభారతము, విరాటపర్వము, అధ్యా ౧ యందు దీనిప్రశంస కలదు.

## యుగన్ధరుఁడు (లేక యౌగంధరాయణుఁడు):

—కాకతీయవంశస్థుఁడగు ప్రతాపరుద్రమహారాజుకడ మంత్రిగనున్న యుగంధరుఁడు. దేశప్రఖ్యాతి నందినవాఁడు. నేటికిని మంత్రియుగంధరుఁడని బుద్ధి, ఉపాయ, సాహసములు గలవాని ననుచుందురు. మఱియు యాదవసంతతి, చంద్రవంశక్షత్రియుఁడగు సాత్యకిసంతతియగు నొక యుగంధరుఁడు కలఁడు.

## యుగోస్లావియా దేశప్రభుత్వము (Yugoslavie):

—ప్రజలను సెర్బులందురు. ఇంకను నింద్రుఁ గొందరు కలరు.

తొంబదియాఱువేల నూటయేఁబది చతురఁపుమైళ్ళవైశాల్యమనియు, నొకకోటి యిరువది లక్షల జనసంఖ్యయనియుఁ జెప్పఁబడినది.

## యుటిలిటేరియానిజమ్ (Utilitarianism):

—మానవధర్మమునందుఁ గార్యము, ప్రయోజనములనుగురించిన సిద్ధాంతము.

## యుద్ధపుఁగందకము(Trench):

—ఇక్కాలమున యుద్ధకాలమున సైన్యములుండుటకుఁ గందకముఁ (గాడీ) ద్రవ్వఁబడి యందుఁ నుపాకులంబోలు్చపై నికుల నుంచుదురు. పగతుఱగుండ్లు తగులకుండఁ బై నుంచిపోవుటకుఁగాని, త్రవ్విన మన్ను ఎదురుగావేసిన మట్టిగట్టునకుం దగులుచు పై నికులకుఁ దగులకుండ రక్షించునుపాయము. వీటిం ద్రవ్వుటకుఁ బ్రత్యేకపుపారలుకలవు.



## యుధాజితు:

- ఈపేరుగలవా రిర్వురు కలరు. యదుసంతతి చంద్రవంశక్షత్రియుఁడగు వృష్ణి రెండవసుతుఁ డొకయుధాజిత్తు. తని సుతులు శిని, అనమిత్రుఁడు.

మఱియు నొకయుధాజిత్తు దశరథమహారాజు భార్యయగు కైకేయిసోదరుఁడు. కేకయదేశాధిపతి. భరతునిమేనమామ. ఈతనిరాజధాని గిరివ్రజపురము.

## యుధిష్ఠిరుఁడు:

—అత్రి,చంద్ర, పూరు, కురుసంతతిక్షత్రియుఁడు. పాండవులలో జ్యేష్ఠుఁడు. తండ్రి పాండురాజు. తల్లి కున్తీదేవి. తండ్రియనుజ్ఞవలనఁ దల్లికి యమునివలనఁ గల్గినసుతుఁడు. కడుధర్మపరాయణుఁడగుట ధర్మరాజని పేరందినవాఁడు. పాండవులైదుగురు సోదరులే. భార్యయగుద్రౌపదీదేవివలనఁ బ్రతివింధ్యుఁడును, దేవికి అను వేరొకభార్యవలన యౌధేయుఁడును నిర్వురుసుతులు. భారతయుద్ధానన్తరము చక్రవర్తియైనవాఁడు. యుధిష్ఠిరునిశంఖమున కనంతవిజయమనియు, నతని యజ్ఞాతవాసకాలనామము కంకుఁడు, జయుఁడు

ననియుఁ దెలిపెడిని. సర్ విలియమ్ జోన్సు వ్రాసిన చంద్రవంశపువృక్షములో మూలపురుషుఁడగు బుధునినుండి నలుఁబది యారు పురుషాంతరము లయినదని వ్రాసియున్నాఁడు. ఇది ప్రమాదముగ నగపడుచున్నది.

**యుద్ధము-తెల్లజండా:-** యుద్ధమొనర్చు నిరుకక్షులవారిసైన్యములకు రంగులగుర్తులచే భేదముఁగల జెండా లెవరివివారికే యుండును. చూడ వచ్చినవారిజెండా వారికే యుండును. ఇందువలన నేరఁగును, ఏగురుతును లేనితెలజండా యుద్ధమందే సంబంధమును లేనిదనియు, ఎవ్వరిది గాదనియును స్పష్టమే! తెల్లజండాఁ గొనివచ్చువారు యుద్ధమునందుఁబాల్గొనువారికక్షలకుఁ జెందక మధ్యవర్తులని యర్థమగుచుండును. కక్షలకుఁ జెందినవారిలో నుండి యైనను తెల్లజండా నెవ్వరేని గొనివచ్చుచుండిన నేదో రాయబారముఁ గొనివచ్చుచున్నారనియుఁ దెలియనయ్యెడిని. ఇంక శత్రువులు యుద్ధముఁ జాలించుకొన నెంచి, తెల్లజండాక్రింద యేగుటకుఁ గూడ రాయబారమే యభిప్రాయము. దీనికి 'సరెండర్' (Surrender) అనెదరు.

**యుయుధానుఁడు:—** అత్రి, చంద్ర, ...యుఁడు. తండ్రి సత్యకుఁడు. కుమారుఁడు సాత్యకి.

**యురానోగ్రాఫీ (Uranography) Constellations అందలిగోళములు:—** (నక్షత్రములంగూర్చిన శాస్త్రము. ఇది ఎస్ట్రానొమీలోని యొకశాఖ. కాన్ప్నలేమన్ను-ఎస్ట్రొనొమీ చూడుఁడు.

**యురేనస్ (Uranus):-** ఒకగోళము. ఇది సూర్యు నాశ్రయించుకొని సూర్యునిచుట్టుఁ దిరుగుచుండునది.

**యువనాశ్వుఁడు:—** మరీచి, ఇక్ష్వాకు సంతతి. సూర్యవంశక్షత్రియుఁడు. తండ్రి త్రిధన్వుఁడను పృథువు. సోదరులు సూర్యారణ్యుఁడు (త్రయారణ్యుఁడు), విశ్వగంధుఁడు. (ఇంద్రుఁడు, చంద్రుఁడు, అతిచాంద్రుఁడు). కుమారుఁడు మాంధాత.

మఱియు సీతనియన్నకుమారుఁ డొకయువనాశ్వుఁడు కలఁడనియు, నతనికుమారునిపేరు శబస్తుఁ డనియుం దెలియుచున్నది.

**యూక్లిడ్గణితశాస్త్రము:—** దీనిని "జామిట్రీ" యనియు నందురు. ఈశాస్త్రమును 'Mathematics' అనుటయుం గలదు. దీనికిఁ గర్త యెవ్వరో సరిగాఁ దెలియరాకున్నది. ఒక యరబ్బీపండితుఁ డీశాస్త్రమును దొలుత రచించెననియు, నాయననుండి 'యూక్లి' డనుపేరుఁగల గ్రీకుదేశపుఁబండితుఁ డెఱింగి, బహుశః కొన్ని సంస్కరణములొనర్చుచోఁ, దాను గ్రీకుభాషయం దీశాస్త్రమును రచించెనని ప్రతీతి కలదు. ఏది యెట్లైనను ననాదిగా నీశాస్త్ర మాయనపేరిటనే 'Euclid's Elements' అనఁబరఁగుచు నైరోపాదేశములందు వ్యాపక మందినది.

యూక్లిడు పండితుఁడు మొదటి ప్టోలమీకాలమున (క్రీస్తుమునుపు ౩౨౩—౩౮౩) నుండినవాఁడని తెలియుచున్నది. ఈయన యక్కాలమున నలెగ్జాండ్రిపురమున నొక గణితశాస్త్రపాఠశాలను స్థాపించిన నిర్మాతగఁ జెప్పఁబడినవాఁడు. అనేక గ్రంథములను రచించినవాఁ డందురు.

యూక్లిడుపండితుని గణితశాస్త్రమునఁ బదమూఁడుగ్రంథములు (Books) కల వనియుఁ బిదప నొకప్పుడు Hypsicles అనునాయన యింక రెండుగ్రంథములం జేర్చి పదునేనుగ్రంథము

లుగ నీగణితశాస్త్రముం బూర్తిచేసెననియుఁ జెప్పఁబడినది కాని, యట్టి సంపూర్ణమగు పుస్తకము లభించుట లేదు. క్రీ. శ. ౧౭౦౩ లోఁ దొలుత గణితశాస్త్రము ప్రకటింపఁబడియెను. పిమ్మట ౧౮౨౪–౨౫ లలో బెర్లినునగరమున నీగ్రంథము రెండుసంపుటములుగజర్మనుదేశమున Euclidi's Elementorum Lebri Sex Presres అనుపేర బయలువెడలెను. వేఱొకముద్రణమున 1826–29 లలో Demorgan పండితునిచే బయలుదేఱఁ దీయఁబడియెను. క్రీ. శ. 1781-1788 కాలమునా ఆంగ్లమున Robert Simson గణితశాస్త్రజ్ఞుఁడును, వ్రాసి తమ యూక్లిడుగణితమును వెలువరించియుండిరి. ఇవి చాల సుప్రసిద్ధగ్రంథములు.

ఈశాస్త్రమున సమతలరేఖాగణితము (Plane Geometry) (దీనికే క్షేత్రగణిత మనిపేరు.) Solids mathematics Sphericalmathematics, arethemetical mathe matics మొదలగునవి వివరింపఁబడినవి. ౧, ౨, ౩, ౪, గ్రంథములు క్షేత్రగణితమును, ౫, ౬ గ్రంథములు Proportino & Ratio లును, ౭, ౮, ౯ గ్రంథములు, అంకగణితమును ౧౦ వ గ్రంథము గణితములందుఁ దెగనిసంఖ్యలగు Surds లేక irrationals గూర్చియు, ౧౧, ౧౨ గ్రంథములు cubs మొదలగు solids గూర్చియు, వివరించును. (Sphericals గూర్చి ట్రిగ్నోమెంట్రీ వివరించును.) (ట్రిగ్నోమెట్రీ చూడుఁడు.) పదమూడవగ్రంథము సరిగా వ్యాపించనేలేదు. తక్కిన చేర్పఁబడిన రెండుగ్రంథము లెవ్వరో తెలియుటలేదు.

ఇంక నీశాస్త్రమంతయు నిప్పు డగుపడుచున్న రీతిని ౧౦౮ నిర్వచనములపై నాధారపడియున్నది. ఈనిర్వచనములే యీశాస్త్రమునకు సూత్రము లని చెప్పనొప్పును. పరిభాషాపదములు నిర్వచింపఁబడునట్టుల నీశాస్త్రధర్మము లన్నియు నీ ౧౦౮ నిర్వచనధర్మములందు వివరింపఁబడినది. వీటి కాంగ్లమున 'Definitions' అనియెదరు. శాస్త్రమంతయు వీటిపైనే యాధారపడిన ట్లుండును.

పిదప నీశాస్త్రక్రియాభ్యాసవిధానమున నచ్చుటచ్చుట లేనిపోని సంశయములు కలుగకుండునటులఁ బదునారు స్వతఃప్రమాణములు వివరింపఁబడినవి. ఇవి ఋజువు పఱుపనక్కఱలేని నిజములని చెప్పఁబడినది. వీటి కాంగ్లమున 'axioms' అనియెదరు.

ఇవి గాక నీశాస్త్రక్రియాభ్యాసవిధానమున—౧ ఏ రెండుబిందువుల (points) నడుమగనైనను వాటిం గల్పునటుల నొకసమరేఖం గీయవచ్చుననియు, ౨ ఒక సమరేఖ (striat line) నెంతవఱకైనను సమరేఖగఁ బొడిగింప వచ్చుననియు, ౩ ఒకబిందువును మధ్యబిందువుగ (center) గా నొనర్చుకొని దానినుండి కొంతదూరమునఁగల వేరొకబిందువును దూరముగ నొనర్చుకొని వృత్తముం గీయవచ్చుననియు, మూఁడు సావకాశము లీశాస్త్రకార్యములకుంగాను చెప్పఁబడినవి. వీటిమీఁద కీశాస్త్రమునఁ గ్రియాభ్యాసములు (exercises) వివరింపఁబడినవి. ఈసావకాశముల కాంగ్లమున 'postulates' అనిపేరు.

ఇంక నీశాస్త్రమున విమర్శనల నందిన ఉపపాద్యములకు ౧ ప్రశ్న లన్నియు (problems) ౨ సిద్ధాంతీకరణము లనియు (Theorems) రెండుభేదములం గల్పించిరి. రెండును ఋజువుపఱుపఁ బడవలసినవిగనే యుండును. వీటి

రెంటిని సాముదాయికముగ 'problems' అని వాడుచున్నారు. ఇవియే యీశాస్త్రమున సాధకములుగ [Exercises] రుజువుపఱుపఁబడిన యుపపాద్యప్రశ్నములు.

వీటియందు మొదటిగ్రంథమున ౪౮ యును, రెండవగ్రంథమునఁ బదునాల్గును, మూఁడవగ్రంథమున ముప్పదియేడును, నాల్గవగ్రంథమునఁ బదునారును, ఐదవగ్రంథమున నిరువదియైదును, ఆఱవగ్రంథమున ముప్పదిమూఁడు [ఇందుఁ గడపటిప్రశ్నకు మూఁడుపప్రశ్నములు కలవు] ను, పదునొకండవగ్రంథమున నిరువదియొకప్రశ్నలును పండ్రెండవగ్రంథమున ఋజువుపఱుచుటకు సాధనచర్చయగు Lemma యొకటినహా రెండుప్రశ్నములును, చర్చింపఁబడి ఋజువులు ధృవపఱుపఁబడినవి కలవు. ఇటుల మొత్తము నూటతొంబదియారు చర్చ లీశాస్త్రమునందుఁ గలవు.

## స్వతఃప్రమాణ (ధర్మ) ములు.

రేఖాగణితశాస్త్రమునఁ బ్రత్యేకముగ రుజువుపఱుచుటకై ప్రయత్న మక్కఱలేకనే యీక్రిందిధర్మములు స్వతఃప్రమాణములై చెల్లునని నిర్ధారణ యొనర్పఁబడినది.

౧ ఒకవస్తువుతో సమానములగు రెండన్య పదార్థము లొకటితో నొకటి యవియు సమానములై యుండెడిని.

౨ సమానము లగుపదార్థములకు సమానములగు నన్యపదార్థములు చేర్పఁబడునేని, యేర్పడిన మొత్తములును సమానములుగనే యుండెడిని.

౩ సమానములగు పదార్థములనుండి సమానములగు భాగములం దీసివైచిన శేషములును, సమానములుగనే యుండెడిని.

౪ సమానములగు పదార్థముల నసమానపదార్థములకుం జేర్పఁబడునేని యేర్పడిన మొత్తము లసమానముగ నుండెడిని.

౫ అసమానపదార్థములనుండి సమానపదార్థములు తీసివేయఁబడునేని శేషము లసమానములుగ నుండెడిని.

౬ ఒకపదార్థమునకు రెట్టింపుగనుండు రెండన్యపదార్థము లన్యోన్యము సమానములై యుండెడిని.

౭ ఒకపదార్థమునకు సగముగనుండు రెండన్యపదార్థము లన్యోన్యము సమానములై యుండెడిని.

౮ ఒకస్థూలప్రమాణములుగల రెండుపదార్థము లన్యోన్యము సమానములై యుండును.

౯ ఒకపదార్థ మంతయు దానిలోనిభాగమునకన్న నధికమై యుండును.

౧౦ రెండుసమరేఖ లొకప్రదేశమును పూర్తిగ నావరించలేనివిగ నుండెడిని.

౧౧ అన్నిసరళసమకోణములు (right angles) అన్యోన్యము (ఒకటితో నొకటి) సమానములై యుండును.

౧౨ ఒకసమరేఖ రెండు సమరేఖలంగూడుకొని యానడుమ నొకవైపున రెం డల్పసమకోణములం గల్గించుతఱి నారెండును రెండుసరళసమకోణములకన్నఁ దక్కువగ నుండునని భావము. ఆగీతలం బొడగించుచోఁ గడకీమూలలున్న పక్షమునకే చేరును.

## పంచమగ్రంథానుబంధములు.

౧ Eqni multitudes (అనఁగా సమానపరిమాణములు magnitudes) అన్యోన్యము నొకటితో నొకటి సమానముగ నుండునని చెప్పఁబడినది.

౨ సమానములగు magnitudes ఒకటి కొకటి eqnimultiples ఐ యుండఁగా నన్యోన్య మొకటితో నొకటి సమానములని చెప్పఁబడినది.

3 పెద్ద magnitudes గల multiple తక్కువ యగు అదె multiple కన్న నధికమై యుండునని చెప్పఁబడినది.

౪ ఒకదానియొక్క multiple వేఱొక పరిమాణపు (magnitude) multiple కన్న నధికమై యుండుతటి (అమల్టిపి ల్సొకరీతిచేనై నను) అధికమైయుండు మల్టిపిలు పెద్దదిగ నుండెడిని. (జ్యామెట్రీ చూడుఁడు)

## యూడిమోనిజమ్ [Eudemonism or Eudaemonism]:—

తనకుఁ గల్గు నాపదల వలన ననుభవించిన హైరాణ నందుఫలితముగఁ బిదపఁ గలుగనున్న సుఖానుభవములంబట్టియే యుండునను నమ్మకము.

## యూదులకేలండరు (Jewish Calender):—

యూదులు తమ శకసంవత్సరమును సృష్ట్యాదిగఁ జెప్పుచున్నారు. వారిలెక్కమేరకు సృష్టి క్రీస్తుపుట్టుటకుమునుపు మూఁడువేల యేడు వందల యఱువదియొకసంవత్సరములునాడు జరిగెనఁట.

వీరి వత్సరములు చాంద్రమానముచేఁ బరిగణింతురు. సర్వసాధారణముగ నెలకు ౨౯ లేక 3౦ దినములం గల్గినమాసములు పంద్రెండుండును. ఇవి మన చాంద్రమానమాసములవలెనే యుండెడిని. మనవలెనే వారికి నధికమాసములును గలవు. అధికమాసముఁగల సంవత్సరమును 'ఎంబోలిస్మికు వత్సర' మందురు. నెల లమావాస్యదినముననే ప్రారంభ మగుచుండును. నెలయందు మొదటి దినమును పవిత్రముగ నెంతురు. మఱియు ముప్పదిదినములు కలిగిన నెలయందలి కడదినము (ముప్పదియవ దినము) ను పవిత్రదినముగ నెంతురు.

వీరిదినము సూర్యాస్తమయము కాఁగానే ప్రారంభమై, తిరుగ సూర్యాస్తమయమువఱకు నుండును. అనఁగాఁ బ్రతిదినము రాత్రితోఁ బ్రారంభమై తిరుగ రాత్రివఱ కొకదినముగ లెక్కింపఁబడుచుండునని భావము.

౧ తిశ్రినెల:-ఇది మొదటిమాసము. ప్రథమదినము సంవత్సరాదిపండుగ. రెండవదినమునుండి పదిదినములు తపస్సు, జపము, దైవచింతలం దుఁ గడుపునిష్ఠదినములుగ నాచరింతురు. అందు నెలయందలి మూఁడవదినమున గుయెడాలి యూదినమని యుపవాస మొనర్చుదురు. పదియవదినము యోమ్కిపూ రనంబడు మహాపవిత్రదినము.

ఈతిశ్రీమాసమునఁ బదునేను, పదునాఱు దినములు దైవపీఠము, పర్వదినములుగ నాచరింతురు. పిదప నిరువదియొకటవదినమున హూసన్నారాజుపండుగ నాచరింతురు. ఇరువదిరెండవదినమున నేదో యొక పండుగయు, నిరువదిమూఁడవ దినమున మేషేప్రవక్తద్వారా యెహోవాభగవానుఁడు పదియాజ్ఞలరూపమున ధర్మముల ననుగ్రహించిన పర్వదినమహోత్సవమును జరుపుదురు.

౨ హెస్వానునెల:—ఇది రెండవనెల. ఇం దుపవాసదినములు, పండుగలు లేవు.

3 కిస్లేవునెల:—ఇది మూఁడవనెల. ఇం దిరువదియైదవదినమునఁ దొల్లింటి యూదికాలమున జహోవా దేవాలయప్రతిష్ఠాస్మారకోత్సవము సల్పుదురు.

౪ తెబెట్ నెల:—ఇది నాల్గవనెల. ఇందుఁ బండుగలు, పర్వములు లేవు.

౫ సెబాతునెల:—ఇది యైదవమాసము.

అడారునెల:— ఇది ఆఱవనెల. ఇందుఁ బది మూఁడవదినమున ఎస్తేరురాణి తమపూర్వు లను చావునుండి తప్పించి, యూపదవాపిన జ్ఞా పకార్థము పండుగ జరుపుదురు. పదునాల్గవ దినమున 'పులిమ్' అనఁబడుపర్వదినము. పదు నేనవదినము షుషాన్పురిమ్ పండుగనాచరిం తురు.

౭ నిసాన్మాసము:—ఇది యేఁడవనెల. ఇందుఁ బదు నేనవదినమున పాసోవరు పండుగఁజేతురు. ఆ నాడు పులియని పిండిరొట్టెలంజేసి భుజింతురు.

౮ యియార్నెల:—ఇది యెన్మిదవనెల. ఇందుఁ బదునెన్మిదవదినమున ఓమెరనంబరగు పండుగ నాచరింతురు.

౯ శివాన్‌నెల:— దీనిని శివన్నెల యనియు నం దురు. ఇది తొమ్మిదవనెల. ఇం దాఱనదిన మునను, ఏఁడవదినమునను, పెంటికాస్టనంబడు వ్రతము పండుగ నాచరింతురు.

౧౦ తముజ్‌నెల:—ఇది పదియవమాసము. ఇందుఁ బదునెన్మిదవరోజునఁ దముజ్జనంబడు నుపవాస వ్రత మాచరించుదురు.

౧౧ అబ్‌నెల:— ఇది పదునొకండవ మాసము. ఈనెలయందుఁ బదియవదినం బుపవాసదినము.

౧౨ ఎలుల్యాన్నెల:—ఇది కడమాసము. ఇం దే విశేషదినములును లేవు.

## యూదులయహ్వో (జహోవా) మతము:—

ఈమతమునకు సరియైనగ్రంథము లున్నట్లుఁ దెలియఁబడుటలేదు. వీరి పూర్వచరిత్ర మొదలగు కొన్ని యూనాటిమతధర్మములు బైబిలు ప్రాతనిబంధనయందుఁ గానవచ్చుచున్నను నది క్రైస్త వులమతగ్రంథ మగుట వీరిదృష్ట్యా యంత యామోదకరము గాదు. మఱియు వీరిమతగ్రంథ మగు 'తాల్మడ్' వీరిమతధర్మములను, న్యాయ ధర్మములను వివరించునదైనను, నభిప్రాయభేద ములపాలై 'జరూసలెమ్తాల్మడ్' దనియు, 'బాబి లోనియాతాల్మడ్' దనియు ద్వివిధములుగ నుంట నిదమిత్థమని వ్రాయ వీలు గాకున్నది. అది గాక నీరెండును నవీనగ్రంథములు గాని, పురాతనగ్రంథ ములు గావు. (తాల్మడ్ గ్రంథముఁ జూడుఁడు.) ఇంక వీరిమతసిద్ధాంతముల నెఱింగించు నియమ ప్రమాణములు పదమూఁడు చెప్పఁబడియున్నవి. అవి మతస్థులు నిశ్చలమనస్కులై నమ్మఁదగిన భావనలు. వాటివలన వీరిమతవిధానము కొంతఁ దేటపడఁగలదు.

౧. పావనమైన నామముఁగల సృష్టికర్త తానే సృష్టించి, యట్లుఁ దాను సృష్టించిన సమస్త జీవరాసులను బాలించుచుండుననియు, చేయు చు, చేయుచుండుచు, సర్వమును గల్గి యుండునని, పరిపూర్ణాంతఃకరణయుతుఁడనై నమ్ముచున్నాను.

౨ పావననాముఁడగు సృష్టికర్త యద్వితీయుఁ డనియు, నిరుపమానుఁడనియు, ఆస్వామియే మా కిష్టదైవతమనియుఁ బరిపూర్ణాంతఃకరణ యుతుఁడనై నమ్ముచున్నాను.

౩ పావననాముఁడగు సృష్టికర్త యశరీరుఁడనియు ననఁగా బహిరంగమగు స్థూలశరీరముఁ గల వాఁడు కాఁడనియు, నిట్టివాఁడని గ్రహించు టకు వీలుపడని శరీరముఁ గలవాఁడనియు, జగత్తునం దనుపమానస్థితిఁ గలవాఁడనియుఁ బరిపూర్ణాంతఃకరణ యుతుఁడనై నమ్ముచు న్నాను.

౪ పావననాముఁడగు సృష్టికర్త యాదియు, నంత్యముఁగూడ నై యున్నవాఁడని పరిపూ ర్ణాంతఃకరణయుతుఁడనై నమ్ముచున్నాను.

౫ పావననాముఁడగు సృష్టికర్తయే పూజార్హుఁ డనియు, నన్యు లెవ్వరైనను పూజార్హులు

కారనియుఁ బరిపూర్ణాంతఃకరణయుతుఁడనై నమ్ముచున్నాను.

౬ దైవప్రేరితులైన ప్రవక్తలు ప్రవచనరూపమునఁ దెల్పినదంతయు సత్యమేయని పరిపూర్ణాంతఃకరణయుతుఁడనై నమ్ముచున్నాను.

౭ విశ్రాంతియందుఁ బ్రశాంతతనున్న మాగురుఁడగు మోషే తెల్పియుండిన దంతయు సత్యము, ధర్మముననియు, నాయనపూర్వులకుఁ దర్వాతివారికిఁగూడ నాయన జ్ఞానులకు జ్ఞానియనియు, నందఱుజ్ఞానులకుఁ బిత్రుసమానుఁడనియుఁ బరిపూర్ణాంతఃకరణ యుతుఁడనై నమ్ముచున్నాను.

౮ విశ్రాంతియందుఁ బ్రశాంతతనున్న మాగురుఁడగు మోషే, మా కొసంగి తెల్పినధర్మవితతియె నేటివఱకు మాయాచరణ యందు మాకుఁ గల్గియుండినదని పరిపూర్ణాంతఃకరణ యుతుఁడనై నమ్ముచున్నాను.

౯ ఈధర్మవితతి యెప్పటికిని మార్చఁబడనిదనియు, నన్యధర్మములను పావననాముఁడగు సృష్టికర్త యొసంగువాఁడు కాఁడనియుఁ బరిపూర్ణాంతఃకరణయుతుఁడనై నమ్ముచున్నాను.

౧౦ పావననాముఁడగు సృష్టికర్త మనుష్యులొనర్చిన, ఒనర్చుచున్న, ఒనర్చెడి ప్రతికార్యమును వారిమనస్సులలోని తలంపులను, నెఱిగినసర్వజ్ఞుఁడని పరిపూర్ణాంతఃకరణయుతుఁడనై నమ్ముచున్నాను.

౧౧ పావననాముఁడగు సృష్టికర్త తనయాజ్ఞలను వినయముగ ననుష్ఠించువారిని బహూకరించి, వినయముగ నిరసించి దాటువారిని శిక్షించుననియుఁ బరిపూర్ణాంతఃకరణయుతుఁడనై నమ్ముచున్నాను.

౧౨ బోధకుం డొకఁడు రాఁగలఁడనియు [messiah] నాయన యిట్లు వచ్చుట కాలసించినను, ఆయనరాకకై వచ్చువఱకు నిరీక్షించుచుండవలయు ననియుఁ బరిపూర్ణాంతఃకరణయుతుఁడనై నమ్ముచున్నాను.

౧౩ పావననామముఁగలవాఁడును, సర్వకాలములయం దెలుఁగెత్తి స్తుతింపఁదగిన చిరస్మరణీయుఁడు నగుసృష్టికర్తయొక్క యాజ్ఞచే విధింపఁబడినతఱి, మృతినందినవారు పునర్జీవితులగుదురని పరిపూర్ణాంతఃకరణయుతుఁడనై నమ్ముచున్నాను.

ఇంకను నివియే గాక యూధమతస్థులు పరమేశ్వరుఁడగు పావననాముఁడు నోవా కనుగ్రహించి [illegible] ౦ దాజ్ఞ సప కముకల దందురు.

౧ విగ్రహములను (బొమ్మలను) బూజింపరాదు.

౨ దేవునిపవిత్రనామమును నిరసనపూర్వకముగ దూషింపరాదు.

౩ న్యాయస్థులును, ధైర్యవంతులు నగువారిని న్యాయాధికారులుగ నియమించి యందఱకు న్యాయముఁ గల్గించుచుండు నేర్పాటుఁ జేయుచుండవలయును.

౪ అపరిశుభ్ర కార్యము లొనర్పరాదు.

౫ హత్య [ప్రాణముఁదీయుటఁ] జేయరాదు.

౬ దొంగతనముఁ [చౌర్యముఁ] జేయరాదు.

౭ ఏజీవజంతువునైను భక్షింపరాదు.

**యూదులు:**—వీరి నాంగ్లమున 'Jews' అనుచున్నారు. యూదాదేశవాసులు. పాలస్తినా వీరిస్వదేశమని తలంపఁబడుచున్నది. వీరి దాదిని నాల్గువేల వత్సరములచరిత్ర కలదందురు గాని, కాలములు సరిగాఁ దెలియవు. క్రీస్తుమతకర్తయగు ఏసుక్రీస్తుప్రభువు యూదుఁడే. వీరు దేవుని సొంత

జనులమని చెప్పుకొందురు. వీరిదేవునిపేరుఁ మ్హ్వే హాన్. వీరిచరిత్రి బైబిలుపూర్వనిబంధనయందుఁ గాననగును.

ఇక్కాలమున వీ రనేకదేశములందు వ్యాపించి కాపురము కుదిరియున్నారు. వాణిజ్యవ్యాపారము నందుఁ జాలకలిను లనియు, గడసరులనియుఁ బ్రతీతి కలదు. కలినుఁడగు వడ్డీవ్యాపార మొనర్చు వానిని యూదుండని వెక్కిరింతగా ననుచుందురు.

ఈసందర్భమున వీరిమూలపురుషుఁడగు యూదా, యాకోబునాల్గవసుతుం డనియు, తల్లిపేరు లేయా యనియు, నీతఁ డీజిప్టుదేశమున మరణించె ననియు నెఱుంగఁదగినది.

## యూనిటేరియన్ సిద్ధాంతము:—

ఇది థియాలోజీ (థియాలోజీ చూడుఁడు) యందలి పరిభాషాపదము. దేవునియందు నమ్మకము, భక్తియుండి, మూర్తిత్రయతత్వ (Trinity) నిరాకరణము వీరిసిద్ధాంతము. యేసుక్రీస్తుప్రభువు దేవుని కుమారుఁడని వీరొప్పుకొనక, దీర్ఘదర్శియు, మత బోధకుఁడు నని యందురు. జహోవాదేవుఁడు తండ్రియనియు, క్రీస్తుప్రభువు కుమారుఁడనియు, పరిశుద్ధాత్మతోఁగల్పి 'మూర్తిత్రయతత్వము' [ట్రినిటీ] సిద్ధాంతమును యూనిటేరియనులు నిరాకరింతురు. పరమేశ్వరుఁ డొకనియం దారోపణచేయఁబడు సిద్ధాంతము.

## యూనిఫైడ్ రేటు[Unified Rate]:-

వాణిజ్యసంబంధపరిభాషాపదము. ఇతరకారణములకుఁ గాని యొకేరీతి ధర నేర్పఱచియుంచినధరకీపేరు వర్తించెడిని. అట్టిసరకునకు 'Unified Stock' అనియు నందురు.

## యూనియన్ . దక్షిణాఫ్రికాస్టేట్సు

[States] కలసి యేర్పడిన దినము. ౧౯౧౦ సం॥ రం మేనెల 31 వ తేది.

## యూనియనిస్టుపార్టీ (Unionist party):—

బ్రిటీషుసీమలం దొక రాజకీయకక్ష. క్రీ. వె. ౧౮౮౬ లో నేర్పడినది. అత్తఱిఁ గొందఱు లిబరల్సు చీలిపోయి యీపార్టీని స్థాపించిరి. ౧౮౯౫ లోఁ బవరులోనికి వచ్చి, కాన్సర్వేటివు కక్ష వారితో రాజీ కుదిరి, యీపార్టీ బలపడినది. వీరు కాన్సర్వేటివ్ లిబరల్ యూనియనిస్టులని యర్థము.

ఇది యింగ్లాండుదేశపు రాజకీయకక్షలలో నొకటి. (టోరీ కక్ష చూడుఁడు). ఈకక్షవారినే కాన్సర్వేటివుకక్షవా రనుటయుం గలదు. గ్లాడ్సన్మంత్రి యైర్లాండునకు హోంరూలీయవలయు నన్నతఱి సయిష్టముఁ జూపినవారిని 'లిబరల్సు' అనుటకు మాఱుగ, 'కాన్సర్వేటివు' లనఁ దొడఁగిరి. పిదప లిబరల్సుతో రాజీ కుదిరి, యూనియన్ కుదురఁగా 'యూనియనిస్టు' లనిరి. గ్లాడ్సన్‌గారు ౧౮౮౬ సం. రములో సలహా నిచ్చి యుండిరి.

## యూనిలేటరల్ కాంట్రాక్టు:—Unilateral Contract:—

వాణిజ్యసంబంధ పరిభాషాపదము. ఒకపార్టీనే నిర్బంధించి బాధ్యునిగాఁ జేయునట్టి కాంట్రాక్టు.

## యూనివర్సేలిజమ్ (Universalism):—

(1) జగత్తంతయు నొకటే వస్తుతత్వమనియును, నదఁగా భిన్నరూపము లన్నియు నొక పదార్థ జన్యమే యనియు నుడువు సిద్ధాంతమునకును, (2) జగత్తున కంతకును సర్వసామాన్యమగు ధర్మములకును, (3) సర్వత్రి వ్యాపించెడు శక్తికిని సంబంధించిన విజ్ఞానము.

## యూ. పి. :-

(ఆగ్రా, అయోధ్య, సంయుక్తరాష్ట్రములు చూడుఁడు).

**యూబిక్విటేరియానిజమ్ (Ubiquitarianism)**:— సర్వవ్యాపకత్వమునుగురించిన సిద్ధాంతము. (రాజుయొక్క యధికారము రాజ్యమందు వ్యాపించి యున్నది. అనఁగా రాజు రాజ్యమంతటను వ్యాపించి యున్నాఁడు.) "భగవంతుఁడు చైతన్యరూపమున సర్వత్రి వ్యాపించి యున్నాఁడు" అను మోస్తరు సిద్ధాంతము.

**యురేనస్ (Uranus) గోళము**:— ఇది Solar system నకుఁ జెందిన యొకగోళము. సూర్యగోళమునుండి 1,82,20,00,000 మైళ్ళ దూరమున నాగోళమును జుట్టి, 30686 దినముల 19 గంటలలోఁ దిరిగి వచ్చుచుండునది యనియు, భూమితోఁ బోల్చిచూచిన 83 రెట్లధికశరీరముఁ గలది యనియుఁ జెప్పఁబడినది. ఇది ప్రధాన గోళము.

క్రీ. శ. 1781 లో Dr. Herchel పండితుఁడు దీనిని గనుంగొనియెను. ఇది superior plantes తెగలలోనిది. సూర్యునుండి వెలుతురు, వెచ్చఁదనముల నందుచున్నగోళము, కాని స్వప్రకాశముఁ గలది కాదు. హర్స్చెల్ పండితుఁడు దీనికి మూఁడవజార్జిప్రభునిపేర 'Georgian star' అని పేరిడెఁగాని యది ప్రచార మందలేదని చెప్పఁబడినది.

దీని నాశ్రయించి దీనిచుట్టుఁ దిరుగుచుండు చంద్రగోళము లారు కలవు. వీటి నన్నిటిని Herchell పండితుఁడే గనుంగొనె నఁట. కొందఱు దీనిని 'Herchell star' అని వాడుటయుఁ గలదు. ఇది సూర్యునకుఁ జాల దూరమునందున్న గోళము. (సోలార్ శిష్టమ్ చూడుఁడు. ఎష్ట్రొనోమీ చూడుఁడు.)

**యూలోజీ (Eulogy)**:— పొగడుటంగూర్చిన కల. స్తుతించుట, పొగడుచు వ్రాసిన వ్రాతలు, ఉపన్యాసములందుఁ బొగడుచు మాట్లాడుట మొదలగువాట్ల విధానలక్షణములను దెలుపు కల.

**యెజిడి మతస్థులు (అజద్మతము)**:— వీరు ఇరాన్ (పరిశియా) దేశము, ఇరాక్, మసొల్ దేశములందుఁ గానఁగుచున్నారు. వీరిప్రధానస్థానము మసొలుపురము. అచటనే వీరి ప్రథమజగద్దేశికుఁడును, మతకర్తయు, దీర్ఘదర్శియు నగు షేక్ ఆది ఇబిన్ మొసఫర్ మహాత్మునిగోరీ కలదు. ఇదియే వీరియాత్రాస్థలముగ నున్నది. ఈమహాత్ముఁడు క్రైస్తవుల యేసుక్రీస్తు, మహమ్మదీయుల మహమ్మదు మహాత్ములంబోలి, దేవునియొక్కయు, సైతానుయొక్కయు దీర్ఘదర్శి, ప్రవక్తయుఁగూడ నై యున్న మతకర్త. వీరిగోరీకడ కీమతస్థులు సంవత్సరమున కొకతూరి సంవత్సరమునందు యాత్ర సల్పి మోకాళ్లపై నిలచి ప్రార్థన లొనర్తురు. అది వీరియనుదినప్రార్థనలకుఁ బెదపఁ జేయుమతవిధి. మోకాళ్ళపై నిలువఁబడి ప్రార్థనలు సల్పుట వీరియందు ముఖ్యము.

యెజిడీ లాదమునుండి కలిగినవారు. ఆదము మహాత్ముఁడు ప్రథమతః దేవునివలన సృష్టింపఁబడిన మనుష్యుఁడు. అత్తటి నీయనయందే పుంసత్వబీజమును, స్త్రీబీజమును గూడ నుంట, ఆయన నుండియే వీరు కల్గిరి. పిదప, ఈవు సృజింపఁబడి, ఆదమునుండి స్త్రీబీజము తీసివేయఁబడి, ఈవునందుంచఁబడెను. తర్వాత వారికిఁ గల్గినసంతతినుండి మసల్మానులు, క్రైస్తవులు (యూదులు) మొదలగు తెగలవారు గల్గిరి.

వీరిమతదృష్ట్యా, ఆదము ఈవుల వివాహ మపరిశుద్ధము గాన వారిసంతతివా రపరిశుద్ధులనియు, తాము పరిశుద్ధుల మనియు వీ రనెదరు.

వీరి యాదిమత మేరూపమున నుండెనో తెలియరాదు. ఒకతటి షేకాదీ ఇబిన్ మెసఫరుగారు పరిశియాదేశమునం దుండినతటి నావేశముఁ గలిగి తిరిగి మసౌల్పురముఁ జేరుకొనెనఁట. అటఁ దన మతమును బోధింప మొదలిడ వేలకొలఁది శిష్యులేర్పడి, మతమేర్పడి వ్యాపింపసాఁగెనఁట. దేవుండును, సైతానును ఈయనయే. ఈమతమున దీర్ఘదర్శి, ప్రవక్తయుం గూడఁ గానలయునని సంకల్పించిరని వీ రనెదరు. ఈయనజన్మము పాలస్తినాదేశఁపు లెబనాన్‌సీమలోని బాల్బెక్ పురమనియు, జన్మకాలము మహమ్మదీయశకఁపు పైదవశతాబ్దకాల మనియుఁ జెప్పఁ బడినది. ఇది క్రీస్తువెనుక పదునొకండవ శతాబ్దకాల మగునఁట.

షేకు ఆది ఇబిన్ మెసఫరుమహాత్ముఁడు మత వ్యాప్తికై దూరప్రయాణముఁ జేయుతటి సైతానాయనరూపమున నగుపడుచు నాయనస్థానమునం దుండుచు సర్వకార్యములు నెఱప నారంభించెనఁట. జను లాసైతాను మాయామహనారూపమే నిజమని నమ్మియుండిరఁట. పిదపఁ గొంతకాలమునకు నిజమగు షేకు ఆదిగారు తిరిగి మసౌలుకు రాఁగా నాతం డెవ్వఁడో మాయవేషధారిగఁ దలంచి యామతస్థులే యాయనం జంపివైచిరఁట. తోడనే సైతాను తననిజస్వరూపమునఁ గన్పడి యిది దైవసంకల్పమనియు, దేవుం డాయనను దీర్ఘదర్శిని జేసి తనకడనుండ నియమించి యట్లుఁ దనకడకుఁ జేర్చుకొనె ననియు, నిప్పు డాతఁడు దేవుని కుడిపైపునఁ గూర్చొని యున్నాఁడనియు, భూమిపైఁ దనపరిపాలనకాలము పదివేలవత్సరము లని దేవుఁడు నియమించెననియుఁ బిదప తానును దేవునికడకు స్వర్గమున కరిగి యాయనక్షమ నంది వారిర్వురిమధ్యఁ గూర్చుండుననియుఁ దరువాత కాలమున దేవుఁడే పరిపాలించుననియుఁ దెల్పి యాదీర్ఘదర్శివంశమునుండి మరియొకని మతాధిపతిగ నెన్నుకొనుఁడనె నఁట. నేటికి నట్లె యా వంశమునుండియే మతాధిపతు లెన్నుకొనఁబడుచున్నారు.

వీరియందు మతాధిపతికి 'వకీ' లనియందురు. వెనుకటివకీలు మరణించినపిదప నిప్పటివకీలు జే ఇబిన్ ఆలీబే గారికి మతసంబంధమగు వకీలు పదవియు, మిరాల్ బిఖాన్ మతబిరుదమును, అను శుశ్రీతాచారముమేర కొసంగి యొకపత్రమును వ్రాసియిచ్చిరని తెలియుచున్నది. వీరికి వీరివకీలు, క్రైస్తవులకు పోపుకన్నను, ఇస్లాంమతస్థులకు ఖలీఫాకన్నను నధికుఁడని వారు గౌరవింతురు.

యెజిడిమతస్థులకుఁ దనమహిమాధికారములం దన్యులతో విభాగములేని యద్వితీయుండగు దైవమునకు "అల్లా" యనిపేరు. భూమికిం గడు దూరమునునుండు స్వర్గమునం దుండువాఁడు. మంచియే శరీరముగాఁ గలవాఁడు. సర్వదా యన్నిటియందు క్షమయే కృత్యముగాఁ గలవాఁడు. మనుష్యులకు హానిచేయనొల్లనివాఁడుఁగాన క్షమించుటయే కాని, శిక్షింపకుండును. దేవునిసింహాసనముకడ నాజ్ఞానువర్తులగు పరిచారకులు ౧ ఇశ్రాయేలు, ౨ గేబ్రియేలు, ౩ మైకేయేలు, ౪ సమాన్సయేలు, ౫ డార్డయేలు, ౬ ఇస్రాఫేల్ అను పేరులుగల యార్గురుదూతలం గల్గినవాఁడు.

ఇంకఁ దేవునికడనేయున్న ప్రముఖులగు దూతలలో నగ్రగణ్యుఁడు, ఇశ్రాయేలునకు సైతానని పేరు. ఈతనిని పిశాచముగా నన్యులగులోకులు

వాడుచుంటఁ గలదు. ఈతఁడు మనుష్యులకు హానిఁ జేయు క్రూరస్వభావముఁ గలవాఁడు. ఆతనికిఁ గనికరపడి క్షమించునైజము లేదు. మనుష్యు లాయననుదూరిన, పగఁ దీర్చుకొనునైజముఁ గలవాఁడు. సైతాను భూమిపై వారలకడనే యుండి వారలం బరిపాలించుచుంట, దైవసంకల్ప మని చెప్పఁబడినది. కాని యీపరిపాలనము సృష్ట్యాది పదివేలవత్సరము లని దేవునిసంకల్పము. అం దిప్పటికి మూఁడువేలవత్సరములవరకు గతించెఁగాన నింక నేఁడువేలవత్సరములమట్టుకు, ఇస్రాయేలు (సైతానుపిశాచ) పాలనము భూమిపైఁ గల్గియుండెడిని. ఈకాలమునందలి సైతానుపరిపాలన దేవుఁ డంగీకరించినదే. భూపరిపాలనసందర్భమున సైతానుకు 'మాలెక్టౌస్' అనిబిరుదనామముఁ జెప్పఁబడినది. ఈ యరబ్బీపదమునకు 'మయూరరాజ' మనియు, 'మయూరప్రముఖుఁ' డనియు, 'దూతల మయూర' మనియు, సందర్భానుసారముగ నర్థము లయ్యెడిని. 'ఇజ్రాయే' లనుపదము హిబ్రూభాషా పదము.

సైతానుపరిపాలన దైవికము గాదు. పదివేల వత్సరములకుఁ బిదప నాతఁడు స్వర్గమున కేగసి దేవునిక్షమ నంది, దేవునకును, షేకు ఆది ఇబిన్ మొసఫర్ వకీలుగారికి మధ్యను కూర్చుండుననియు, తోడనే దేవునిపాలనే భూమిపైఁ బ్రారంభమగు ననియు, నీమతస్థు లనెదరు. యోగ్యుఁడుగను, సత్ప్రవర్తకుఁడుగను, (సైతానుపాలనకాలమున) భూమిపై మనియుంటకు సైతానుదయయే కారణ మగును గాన సైతానుభక్తి యీమతమునం దవసరము. దేవునిచే సైతానే క్షమింపఁబడునుగాన నతని భక్తులగువారికిఁ దప్పక దైవక్షమ కలదు.

దేవుఁ డొనర్చిన సృష్ట్యాదికార్యముల కాయన కుఁ గృతజ్ఞతఁ దెలిపి, రక్షణకు, దుర్మార్గములనుండి తన్ను మరల్చుటకు నాపదలం దప్పించుటకు బాగొనర్చి యాపదల పాల్పడనీయకఁ గాచుటకు సైతానును భక్తితో నీమతస్థులు ప్రార్థింతురు. వీరిపద్ధతి ప్రకారము సృష్టికిం దేవుఁడు నిమిత్త కారణముగఁ దెలుచున్నది. సైతాను సర్వతంత్ర స్వతంత్రుఁడు గాన, సర్వప్రార్థనలకు గురియగుట సైతానుత్వముననేగాని దైవత్వముగఁ గాదు.

బహుశః ఈయన ఇంస్లాంమతస్థులమహమ్మదు, క్రైస్తవులయేసుక్రీస్తులంబోలినవాఁడేమొ? యీజడి మతస్థులు, ఇస్లాంమతస్థులు, క్రైస్తవమతస్థులకుఁ గాని స్వతంత్రమతస్థులుగ నున్నారు. వారిదృష్ట్యా యన్యు లపరిశుద్ధులు.

## యెజోద్వీపము:—

(జపానుదేశము చూడుఁడు.)

## యెట్టర్బియమ్ (Ytterbium) :—

ఇది 'rare element' అని చెప్పఁబడినది. దీని Chemical symbol Yb అనియు, atomic weight 173. 6 అనియు, atomic number 70 అనియు జెప్పఁబడినది.

మఱియు దీనియంతర్భాగములుగ రెండు Elements కలవఁట. అవి 'neoytterbium' అనియు, 'letucium' అనియుఁ బేరిడఁబడెనఁట. యెట్టర్బియమ్ క్రీ. శ. ౧౮౭౮ సం॥ రములోఁ గన్గొనఁబడెనఁట. ౧౯౦౭ లో విభాగము కనొనఁ బడెనఁట.

## యెట్రియమ్ (Yttrium):-

ఇది metallic element అనియు, దీని Chemical symbol yt అనియు, atomic weight 88 . 9 అనియు, atomic number 39 అనియుఁ జెప్పఁబడినది. dark grey powder వలె నుండునఁట.

**యెన్ (Yen):**—— ఇది జపాను దేశపుఁ బ్రిధాననాణెము. ౫ యెనులు, పదియెనులు, ఇరువదియెనులు బంగారునాణెములు ముద్రింపఁబడుచున్నవి. యెనునందు ౧౦౦ సెనులు కలవు. ఇది యించుమించుగ రూపాయిన్నరమొదలు రెండు రూప్యములఁదనుక (మధ్య) ధరం గల్గియుండును.

**యెఫిసస్ పట్టణపుఁబాడు:**—యెఫిసస్ లేక ఎఫిసస్ పట్టణముంగూర్చి సరిగాఁ దెలియకున్నను, నిది ఆసియామైనరునందు సముద్రతీరఁపు గొప్పరేవుపట్టణముగను, వర్తకస్థలముగను నుండినదిగాఁ దెలియుచున్నది.

పాడుపడినగృహములు, విచిత్రములు, వీటియందు దయానాదేవళ మొకటి కలదు.

**యెరుళగుహలు:**— వీట్లకు వెల్లురయనియు, బెరూల్ అనియు, ఎల్లూరా యనియుఁ బేరులు కలవు. సర్వసాధారణముగనెల్లరు నెల్లూరా గుహ లనుచున్నారు. బృహత్సంహిత ౧౪—౧౪ యందుఁ జెప్పఁబడినవి. నైజాంరాష్ట్రమునన్నున్న గుహలు. చక్కనిచిత్రములు, పనితనముం బ్రదర్శించుచుఁ జూడ వింతగ నుండెడిని. దేశప్రసిద్ధములుగాన వేఱుగ వివరించి వ్రాయనక్కఱలేదు.

**యెల్లో జర్నలిజమ్ (Yellow Journalism):**—— పత్రికానిర్వహణ ధర్మపద్ధతులను బాటింపక హద్దు మీఱుచు వార్తల కధికార్థములను, అపార్థములను, గుదురుసటుల బొమ్మలం గుదిర్చియు, అనవసరోక్తులం గల్పియు, ఉత్పాతకరమగువార్తలను, విషయములను వ్రాయుచుండు వ్రాతలుగల వార్తాపత్రికల కీపేరు, అమెరికాసంయుక్తరాష్ట్రములందు వాడుచుందురు.

అన్యులకుం జెరుపుఁ గల్గునటులఁ బెంకెతనము గొలఁది వార్తల కపార్థవృత్తిఁ గల్పించుకుచేష్టవ్రాతలను, ఆకతాయవ్రాతలను వ్రాయు పత్రికానిర్వాహకులవ్రాతలంగూర్చి వాడుపదము.

(వార్తాపత్రికానిర్వహణము చూడుఁడు)

ఇది యసూయతచే నిరసనగా నను ప్రయోగము గాని, 'పసుపుపచ్చరంగు' అను ప్రయోగమున కేమి సాంప్రదాయార్థమో సరిగాఁ దెలియరాకున్నది. (యెల్లోప్రెస్ చూడుఁడు.)

**యేన నాప్రాప్తి న్యాయము:**— దీనిని 'యేన నాప్రాప్తే యో విధి రారభ్యతే స తస్య బాధకో భవతీతి న్యాయ' మనియు ననుటఁగలదు.

ఏది ప్రాప్తించకపోవుటవలన నేవిధి సిద్ధించునో యది దానికి బాధకమగునని యర్థము. ఇది వ్యాకరణన్యాయము. మామూలుగ నడుచుపద్ధతికి బాధకముగ సంభవించువిధికి యేలోపము గల్గుట కారణమో, యాలోపము దానికి బాధకమని భావము.

**యోగబంధత్రయము:**—హఠయోగాభ్యాస మొనర్చువారు తమశరీరమును మూఁడు విధములుగా బంధించుకొనెదరు.

౧ మూలబంధము:— ఇనుపకచ్చడముతోఁ (గోచీతో) బంధించుకొనుట, ౨ ఉడ్యాణబంధము:— నడుమును త్రాటిచే బంధించుకొనుట, 3 జాలంధరబంధము:— హంసదండమును మెడక్రింద నిడి యానుకొని స్థిరపడి కదలకుండుట.

**యోగములు:**—— పంచాంగము లనఁబరగెడి రోజుయొక్క యైదంగములలో నాల్గవదియగు యోగ మిరువదియేడు తెఱఁగులు.

౧ విష్కంభము, ౨ ప్రీతి, 3 ఆయుష్మాన్, ౪ సౌభాగ్యము, ౫ శోభనము, ౬ అతిగండము

౭ సుకర్మము, ౮ ధృతి, ౯ శూలము, ౧౦ గండము, ౧౧ వృద్ధి, ౧౨ ధృవము, ౧౩ వ్యాఘాతము, ౧౪ హర్షణము, ౧౫ వ్రజము, ౧౬ సిద్ధి, ౧౭ వ్యతీపాతము, ౧౮ వరీయాన్, ౧౯ పరిఘము, ౨౦ శివము, ౨౧ సిద్ధయోగము, ౨౨ సాధ్యయోగము, ౨౩ శుభయోగము, ౨౪ శుభ్రము, ౨౫ బ్రహ్మయోగము, ౨౬ ఐంద్రము, ౨౭ [illegible]

అష్టాంగయోగములు:—౧ యమ, ౨ నియమ, ౩ ఆసన, ౪ ప్రాణాయామ, ౫ ప్రత్యాహార, ౬ ధ్యాన, ౭ ధారణ, ౮ సమాధులు.

పంచదశయోగములు:— అష్టాంగయోగములెన్మిది, ౯ త్యాగము, ౧౦ మౌనము, ౧౧ దేశాచారము, ౧౨ కాలానుగుణ్యా వర్తనము, ౧౩ మూలబంధము, ౧౪ దేహసామ్యము, ౧౫ దుఃఖరహితము.

త్రివిధాభ్యాసయోగములు:— ౧ ప్రాకృతము లేక మంత్రయోగము, ౨ వైకృతము లేక లయయోగము, ౩ కుంభము లేక హఠయోగము.

షోడశయోగములు, భగవద్గీతోక్తములు:— ౧ సాంఖ్యయోగము, ౨ కర్మయోగము, ౩ జ్ఞానయోగము, ౪ సన్యాసయోగము, ౫ బుద్ధియోగము, ౬ నిష్కామయోగము, ౭ విజ్ఞానయోగము, ౮ బ్రహ్మయోగము, ౯ రాజగుహ్యయోగము, ౧౦ విభూతియోగము, ౧౧ భక్తియోగము, ౧౨ ప్రకృతియోగము, ౧౩ గుణత్రయయోగము, ౧౪ పురుషోత్తమయోగము, ౧౫ ఆచారవివేకయోగము, ౧౬ మోక్షయోగము.

## యోగమూలఅభిధ:—

(లక్షణ చూడుఁడు).

## యోగశాస్త్రినాడులు:—

(నారి నాడులు, స్వరనాడులు చూడుఁడు)

**యోగశాస్త్రము:**—యోగాభ్యాస మొనర్చి యోగసిద్ధి నందినవారు యోగు లనంబడుదురు. యోగము హఠయోగమనియు, లంబికా యోగ మనియు, రాజయోగమనియుఁ ద్రివిధములుగఁ జెప్పఁబడినది. ఇందు రాజయోగము మిగుల సులభసాధ్యమనియు, హఠయోగము శరీర కష్టము నెక్కువగ శాసించునది యనియుఁ జెప్పఁబడినది.



ఆదిని 'శ్వేతయోగి' యనుపేరంబరఁగిన మహాశివభక్తుం డీశాస్త్రమును రచించియుండెను. ఈ మహనీయునకు శ్వేతకేతుం డనుపేరును గలదని కొంద ఱనెదరు. శ్వేతుఁడు మొదలు లకులీశుండను యోగపుంగవునివఱకు యోగాచార్యులని శైవగ్రంథములందుఁ జెప్పఁబడినది. వీరికి నూటపండ్రెండుగురు శిష్యులు కలరని చెప్పఁబడినది. పిదపఁ జిరకాలమునకుఁ బతంజలి యోగశాస్త్రమును సూత్రములుగ రచించెను. శ్వేతకేతు కృతమగు 'స్వరచిన్తామణి' యును 'హఠయోగప్రదీపిక' మొదలగు కొన్ని యోగశాస్త్రగ్రంథములుఁ గలవు.

యోగశాస్త్రమున వివరింపఁబడినరీతిని అష్టాంగయోగములు యోగాభ్యాసమున ముఖ్యములు.

పిదప కాలమున సాంఖ్యశాస్త్ర మిందుఁ జేరెను. (స్వరశాస్త్రము చూడుఁడు.) అంగయోగము లెన్మిది. అవి ౧ యమము, ౨ నియమము, 3 ఆసనము, ౪ ప్రాణాయామము, ౫ ప్రత్యాహారము, ౬ ధారణ, ౭ ధ్యానము, ౮ సమాధి యనంబడునవి. (అష్టాంగయోగములు.)

వీటియం దింక ననేకములుగ నంతర్భాగములు చెప్పఁబడియున్నవి. ఆసనము లెనుఁబదినాలుగు చెప్పబడినవి. ఇరువదిముద్రలు చెప్పఁబడినవి. షట్క్రియలు చెప్పఁబడినవి. ప్రాణాయామసందర్భమున పూరక, కుంభక, రేచకములు చెప్పఁబడినవి. ఇంకను నజప, దశవాయువులు, షట్చక్రములు, భూతములు వివరింపఁబడినవి. వాటివాటింగురించి వేర్వేరుతావులందుఁ జూడనగును.

**యోగశాస్త్రముద్రలు ౨౦ (వింశతి ముద్రలు):**— ౧ మహాముద్ర, ఇదిప్రకారాన్తము, ౨ నభోముద్ర, 3 ఉడ్యాణబంధముద్ర, ౪ జాలంధరబంధముద్ర, ౫ మూలబంధముద్ర, ౬ మహాబంధముద్ర, ౭ మహావేధముద్ర, ౮ ఖేచరీముద్ర, ౯ విపరీతకరణీముద్ర, ౧౦ యోనిముద్ర, ౧౧ వజ్రోళిముద్ర, ఇది ప్రకారాన్తము, ౧౨ శక్తిచాలముద్ర, ౧3 తటాకముద్ర, ౧౪ మండూకముద్ర, ౧౫ శాంభవీముద్ర, ౧౬ అశ్వినీముద్ర, ౧౭ పాశినీముద్ర, ౧౮ కాకముద్ర, ౧౯ మతంగినీముద్ర, ౨౦ భుజంగినీముద్ర.

(యోగశాస్త్రము చూడుఁడు.)

**యోగసిద్ధి:**— అంగిరసునికుమార్తె. బృహస్పతిచెలియలు. ప్రభాసునిభార్య. విశ్వకర్మతల్లి.

**యోగాంగములు:**—

(అంగములు చూడుఁడు)



**యోగాచారబౌద్ధమతము:**— ఇది చతుర్విధబౌద్ధములలో నొకటి. సర్వలక్షణములచే నీమతము బౌద్ధసిద్ధాంతము ననుసరించినది. (బౌద్ధమతము చూడుఁడు). బుద్ధభగవానునితరువాత వారగు బౌద్ధపండితులలో నొకప్పుడు వివాదములు గల్గి బౌద్ధులు ౧ మాధ్యమికులు, ౨ యోగాచారులు, 3 సౌత్రాంతికులు, ౪ వైభాషికులు నని నాల్గుతెగలవారైరి. వీరివిభేదము లొక్కజ్ఞానజ్ఞేయము లగు అన్తరార్థమగుబుద్ధి లేక ఆత్మ, బాహ్యార్థమగు వెలుపలనుండు లేక బాహ్యగోచరములగు జగద్వస్తువులంగూర్చియేయని యెఱుంగునది. ఇంకను వీరిలో నించుక నాచారభేదము లుండినను నవి స్వల్పములుగాఁ బాటింపఁబడఁజనవు.

యోగాచారబౌద్ధులను బాహ్యశూన్యత్వవాదు లనియు, నిరాలంబనవాదు లనియు, నితరమతస్థులు వాడియున్నారు. వీరు వాదసౌకర్యము కొఱకు మాధ్యమికుల సదసద్వాదమువంటి జ్ఞానజ్ఞేయవాదమును, జాతివ్యక్తివాదమును నేర్పఱచుకొనిరి.

**జ్ఞానజ్ఞేయవాదము:**— ఒకపదార్థ ముండినదనుటయం దది జ్ఞానము, జ్ఞేయము నను రెండుభాగములు గలదిగ నుండవలయును. జ్ఞానము, బుద్ధి యొకటియే గాన జ్ఞానమగుబుద్ధిచే జ్ఞేయ మెఱుంగఁదగినది. అనఁగా జ్ఞాన మెఱుంగఁదగినశక్తియు, జ్ఞేయ మాశక్తి నెఱుంగఁబడువస్తువును నై యున్నవి. జ్ఞానమునకు భేదప్రత్యయ ప్రవాహరూపమగు స్వరూపవైచిత్ర్య మనాదివాసనావశమునఁ గలదు. అనఁగా నొకవస్తువునుండి వేరొకవస్తువునకుఁ గల భేదము (లేక భేదజ్ఞానము) ఎడతెగక (నదీజలప్రవాహమువలె) కల్గుచుండుట యనిభావము.

బుద్ధియగుజ్ఞానముయొక్క స్వరూపవైచిత్ర్యమే పైకిఁ గన్పించువస్తువు. అదియే బాహ్యగోచర

మగుచు (పైకిఁగన్పించువస్తు వని చెప్పఁబడినది. ఇంతయేగాని పైకి గోచరించువస్తువయే నిజమై దాని యాకార మంతరజ్ఞానమునకుఁ బ్రతిఫలించుట లేదని చెప్పఁబడినది. మఱియు నిటులఁగల్గు సహోపలంభనియమము, (అనగా జ్ఞానముఁ బట్టియే వస్తు వనియతముగఁ దెలియుచుండుట) వలన నంతరమగుజ్ఞానము బాహ్యమగువస్తువుగ భ్రమించుచుండుట సమస్త దృశ్యజగత్పదార్థములు భ్రమాత్మకములై యున్నవని చెప్పఁబడినది.

ఇంక నంతరమగుజ్ఞానము సత్యము. ఇది బాహ్యగోచరములగుపదార్థముల కసాధారణము (అసాధారణ మనఁగా నేవస్తువును ప్రతిఫలింపఁజేయు జ్ఞాన మావస్తువునకుఁ బ్రత్యేకప్రత్యేకమై వేరుగ నుండునని భావము). బుద్ధియనంబడు జ్ఞానము క్షణికమై క్షణక్షణమునకు మాఱుచుండుట, యసాధారణమగుట, జ్ఞానమునకుఁ బెక్కురూపములు గలవనియు, నిది జ్ఞానమున కవసర మనంబడుననియుఁ జెప్పఁబడినది.

ఈవాదమువలన బాహ్యప్రపంచవస్తువులు నిజపదార్థములు కావనియు, జ్ఞానముయొక్క ప్రతిబింబములై, శూన్యము లనియు, నివి కేవలభ్రమాకల్పితములు గాన, తత్వము కాదనియు, నీమతసిద్ధాంతము. ఇందువలన బాహ్యగోచరములగు జగద్వస్తువులు దృష్టమగు (ప్రత్యక్ష) ప్రమాణముచే సాధింపఁబడినవని యెఱుంగునది.

ఇంక ననుమానప్రమాణ మైదు తెఱంగులు. ౧ నామము, ౨ జాతి, ౩ గుణము, ౪ ద్రవ్యము, ౫ క్రియానుమానము లనియై యున్నది. అనుమానమసలువస్తువుంగూర్చియే యనినచో నవద్రవ్యములును బుద్ధియనంబడుజ్ఞానముయొక్క ప్రతిఫలభ్రమారూపములే గాన, శూన్యములే యనియు,

జగద్వస్తువులు జాత్యనుమానప్రమాణ మనినచో, వస్తువునుండి జాతి వేఱగునేని, జాతియు వస్తువువలెఁ బైకగుపడవలయుం గాన నట్లు పైకిఁ గనుపడనిజాతిలే దని (శూన్య మని) చెప్పవలయుం గాని తత్వమనరా దనియు,

అసలువస్తువే యుండనప్పుడు గుణానుమానము, క్రియానుమానము, నామానుమానము,ప్రసక్తియే యుండదనియు, జగత్తునందలి సకలవస్తువులు శూన్యములై, తత్వములు కాక మిథ్యయై భ్రాంతియగుతఱి, పుద్గలము (పరమాణువు) లనలే తలంపఁబనిలే దనియు,

ఇంక నేమనిన నంతరమగుబుద్ధి లేక జ్ఞానమవిభాగ్యమయ్యును, జ్ఞాన జ్ఞేయ జ్ఞాతరూపముల గ్రాహ్యము, గ్రహణము, గ్రహీతయుం గూడఁ దానైయె త్రివిధములఁ బ్రతిఫలించుచుఁ గనిపించునవి యనియు,

మాధ్యమికబౌద్ధు లనునటుల జ్ఞానముఁగూడ శూన్యమైనచోఁ దెల్వియనునదే యుండక, సర్వాంధకారబంధురమై యుండవలసియుండెడి దనియు, నిది లోకానుభవవిరుద్ధముఁ గాన వాదవ నిల్వనేర దనియు,

గావున జ్ఞానమే (బుద్ధి లేక విజ్ఞానము) తత్వమనియు, నదియును క్షణిక మనియు, నింకను మాధ్యమికులమతమున సర్వమును శూన్యమే యనుటవలనఁ బ్రమాణప్రమేయములు, స్వపక్షపరపక్షములుఁ గూడ శూన్యములని యర్థముగాన, స్వపక్షస్థాపనము శూన్యస్థాపన మగును. పరపక్షఖండనము శూన్యమునే ఖండించుట యగుననియు, మఱియు సర్వశూన్యమునందుఁ దానును శూన్యమే గానఁ దాను లేనివాఁడై వాదింప నర్హుఁడే కాఁడనియు, తనయునికి తానే యొప్పుకోనివాని వాదము వాదమే కాదనియు,

సకలవాసనలు నశింప, వివిధవిషయాకారబాధితము గాని విశుద్ధవిజ్ఞానోదయమే పరమోదయమనంబడి, మోక్షముగఁ దనరుననియు, ముముక్షులాబుద్ధినే యుపాసింపవలయు ననియు సిద్ధాంతము.

## యోగానందము:-

(ఆనందములు చూడుఁడు.)

## యోగాభ్యాసక్రియాషట్కము-(షట్క్రియలు):—

మానవ (స్థూల) శరీరము స్వతస్సిద్ధముగ వాత, పైత్య, శ్లేష్మతత్త్వాత్మకమై, వాత, పైత్య, శ్లేష్మ సంబంధరోగముల కాటపట్టయినది. గాన తఱచుగ వాట్లబాధలు కల్గుచుండుట సర్వసామాన్యమే. అందు యోగాభ్యాస మొనర్చువారలకుఁ బ్రాణాయామ మొనర్చుతఱి వాత పైత్య శ్లేష్మ రోగములుగాని, వాటి సంబంధరోగములుగాని, యాటంకములు గల్గించుచుండును. గాన నటిదోషాటంకములం బరిహరించి నాడుల నర్హ... నుంచుటకు 'షట్క్రియములు' పరిహారసాధనములుగఁ జెప్పఁబడినవి.

అవి ౧ ధౌతి, ౨ బస్తి, ౩ నేతి, ౪ నౌళి, ౫ త్రాటకము, ౬ కపాలభాతి, యనఁబడునవి. ఈయాఱుక్రియలం దింకను అంతర్భాగములుగఁ గొన్నియుపక్రియలు కలవు. వాట్లంగూర్చి, ఆయాతావులందుఁ జూడనగును. ఈక్రియ లన్నియు యోగాభ్యాస మొనర్చువారికే యనియు, నన్యములగు లౌక్యములుఁ గావనియు నెఱుంగునది.

## యోగి (రసవాది) మతము:—

ఈ మతము శివప్రోక్తమనియు, నాదిశక్తికిఁ బరమేశ్వరుఁడు దెల్పినపారదధర్మమహాత్మ్యము లనియు, కాయ (శరీర) సిద్ధికి సాధనముగ పాదరసము (పారదము) నుపయోగించు విధివిధానము లెఱింగింప, నాదికాలమునఁ బెక్కండ్రుసిద్ధులు దీనిని శిష్యుల కుపదేశించుచుండి రనియు, గోవిందభగవత్పాదాచార్యుఁడు దీనిని గ్రంథరూపమున రచించెననియుఁ జెప్పఁబడినది.

జీవన్ముక్తిఁగాంక్షించుయోగులు కాయసిద్ధినందుటకు సాధనమగు పారదము (పాదరసము) ఈశ్వర శరీరసంజాతముగను, అభ్రకము (తేకులు) పార్వతీ శరీరసంజాతముగను జెప్పఁబడినది. ఇవి యర్హారీతిని శుద్ధిఁజేయఁబడినచో శరీరమునకు సిద్ధినొసంగఁజేసి, జీవన్ముక్తికి సాధనమగునని యీమతాభిప్రాయము. ఎల్లమతములందు భౌతికశరీరము వీడిన (మృతికిం) బిదప ము చెప్పఁబడినది. ఈమతమున సిద్ధులగు యోగులకు సశరీరముగ ముక్తి చెప్పఁబడినది. ఇదియే యీమతమునఁ బ్రధానలక్షణము.

ఈమతధర్మమున ముక్తిజ్ఞానమువలన సిద్ధించునది. తక్కినధర్మము లన్నియు నద్వైతధర్మములం బోలియుండును. శివపారమ్యము, జ్ఞానము యోగాభ్యాసమూలమున సంపాదింపవలసినది. యోగాభ్యాసమున శరీరసిద్ధిగలుగుట సులభముగఁ గల్గెడిని. శరీరసిద్ధియుఁ, యోగసిద్ధియుఁ గల్గెనేని యణిమాద్యష్టసిద్ధులు గల్గి, సూక్ష్మశరీరముఁ గలవాఁడై, సర్వజ్ఞుఁ డగును. ని రము యోగులకుఁ బ్రసిద్ధమని రసేశ్వరసిద్ధాన్త మనుగ్రంథమునఁ జెప్పఁబడినది. మహేశాదిదేవతలు, దైత్యులలోఁ బెక్కండ్రును, వాలఖిల్యాదిమునులు, సోమేశ్వరాదినృపులు నిట్టులనే సిద్ధులయిరి. విధివిధానమున గోవిందభగవత్పాదాచార్యులీపారదమును, నభ్రకమును మొదట రక్తమునకును, బిదప శరీరమునకును బ్రయోగింప వలయునని చెప్పియున్నాఁడు. దృష్టిచేతఁగాని, స్పర్శముచేతఁగాని, పూజచేతఁగాని, నీసిద్ధి నందవలయునని చెప్పఁబడినది. సిద్ధిమూలమున మాయనుండి విముక్తుఁడై, మహి

మూసహితుఁడై పరిపూర్ణత్వము నందనయ్యెడిని. అదియే ముక్తి.

**యోగినులు** (౯౭):- శ్రీచక్రాంతర్గత, త్రైలోక్యమోహనమునందలి ప్రథమావరణమున దశ ప్రకటయోగినులు (దశసిద్ధులు):- ౧ అణిమా, ౨ మహిమా, ౩ లఘిమా, ౪ ఈశిత్వసిద్ధి, ౫ వశిత్వసిద్ధి, ౬ ప్రాకామ్యసిద్ధి, ౭ భుక్తి, ౮ ఇచ్ఛా, ౯ ప్రాప్తి, ౧౦ సర్వకామసిద్ధి.

ద్వితీయావరణమున షట్ఛక్తులు:- ౧ బ్రాహ్మి, ౨ మాహేశ్వరి, ౩ కౌమారి, ౪ వైష్ణవి, ౫ వారాహి, ౬ మాహేంద్రి, మఱియు నీయావరణముననే పరదేవతాశక్తులు ౨. చాముండా, మహాలక్ష్మియనునవి.

తృతీయావరణమున దశముద్రాధిదేవతలు:- ౧ సర్వసంక్షోభిణీ, ౨ సర్వవిద్రావిణీ, ౩ సర్వాకర్షిణీ, ౪ సర్వవశీకరిణీ, ౫ సర్వోన్మాదినీ, ౬ సర్వమహాంకుశీ, ౭ సర్వఖేచరీ, ౮ సర్వబీజా, ౯ సర్వయోని, ౧౦ సర్వత్రిఖండా.

ఇటుల దశసిద్ధులు, షట్ఛక్తులు, రెండుపరదేవతాశక్తులు, దశముద్రాధిదేవతలు కలసి త్రైలోక్యమోహనచక్రమునందలి ప్రకటయోగిను లిరువదియెన్మిదిసంఖ్యాకులు.

యోగినులు ౬౬ :— సర్వాశాపరిపూరకచక్రమునందలి షోడశదళములందుండు షోడశగుప్తయోగినులు:— ౧ కామాకర్షిణీ, ౨ బుధ్యాకర్షిణీ, ౩ అహంకారాకర్షిణీ, ౪ శబ్దాకర్షిణీ, ౫ స్పర్శాకర్షిణీ, ౬ రూపాకర్షిణీ, ౭ రసాకర్షిణీ, ౮ గంధాకర్షిణీ, ౯ చిత్తాకర్షిణీ, ౧౦ ధైర్యాకర్షిణీ, ౧౧ స్మృత్యాకర్షిణీ, ౧౨ నామాకర్షిణీ, ౧౩ బీజాకర్షిణీ, ౧౪ ఆత్మాకర్షిణీ, ౧౫ అమృతాకర్షిణీ, ౧౬ శరీరాకర్షిణీ.

సర్వసంక్షోభణచక్రమునందలి యష్టదళపద్మమునందుండు అష్టగుప్తయోగినులు:- ౧ అనంగకుసుమా, ౨ అనంగమేఖలా, ౩ అనంగమదనా, ౪ అనంగమదనాతురా, ౫ అనంగరేఖా, ౬ అనంగాంకుశీ, ౭ అనంగవేగినీ, ౮ అనంగమాలినీ.

ఇటుల గుప్తయోగిను లిరువదినలుగురు.

సౌభాగ్యదాయకచక్రమునందలి చతుర్దశకోణములందుఁ జతుర్దశసాంప్రదాయ యోగినులు:- ౧ సర్వసంక్షోభిణీ, ౨ సర్వవిద్రావిణీ, ౩ సర్వాకర్షిణీ, ౪ సర్వాహ్లాదినీ. ౫ సర్వసమ్మోహినీ, ౬ సర్వస్తంభినీ, ౭ సర్వజృంభిణీ, ౮ సర్వవశంకరీ, ౯ సర్వరంజనీ, ౧౦ సర్వోన్మాదినీ, ౧౧ సర్వార్థసాధనీ, ౧౨ సర్వసంపత్ప్రపూరిణీ, ౧౩ సర్వమంత్రమయీ, ౧౪ సర్వద్వంద్వక్షయంకరీ.

సర్వార్థసాధకచక్రమునందలి దశత్రికోణములందు దశకులోత్తీర్ణయోగినులు:— ౧ సర్వసిద్ధిప్రదా, ౨ సర్వసంపత్ప్రదా, ౩ సర్వప్రియంకరీ, ౪ సర్వమంగళకారిణీ, ౫ సర్వకామప్రదా, ౬ సర్వదుఃఖవిమోచనీ, ౭ సర్వమృత్యుప్రశమనీ, ౮ సర్వవిఘ్ననివారిణీ, ౯ సర్వాంగసుందరీ, ౧౦ సర్వభాగ్యదాయినీ.

సర్వరక్షాకరచక్రమునందలి దశ త్రికోణములందు దశనిగర్భయోగినులు:—౧ సర్వజ్ఞా, ౨ సర్వశక్తి, ౩ సర్వైశ్వర్యప్రదా, ౪ సర్వజ్ఞానమయీ, ౫ సర్వవ్యాధివినాశినీ, ౬ సర్వాధారస్వరూపిణీ, ౭ సర్వపాపహరా, ౮ సర్వానందమయీ, ౯ సర్వరక్షాస్వరూపిణీ, ౧౦ సర్వేప్సితఫలప్రదా.

సర్వరోగహరచక్రమునందలి యష్టరహస్యయోగినులు:— ౧ వశినీ, ౨ కామేశ్వరీ, ౩ మోదినీ, ౪ విమలా, ౫ అరుణీ, ౬ జయినీ,౭ స
౮ కౌళినీ.

యోగినులసంఖ్య:—

౧ త్రైలోక్యమోహనమునఁ బ్రకట
యోగినులు ౨౮
౨ సర్వాశాపరిపూరకమున గుప్త
యోగినులు ౧౬
౩ సర్వసంక్షోభణచక్రమున గుప్త
యోగినులు ౮
౪ సర్వసౌభాగ్యదాయకచక్రమున
సాంప్రదాయయోగినులు ౧౪
౫ సర్వార్థసాధకచక్రమున కులోత్తీర్ణ
యోగినులు ౧౦
౬ సర్వరక్షాకరచక్రమున నిగర్భ
యోగినులు ౧౦
౭ సర్వరోగహరచక్రమున రహస్య
యోగినులు ౮

| | |
|---|---|
| ఇటుల యోగినులసంఖ్య | ౯౪ |
| అతిరహస్యయోగినితోసహా | ౧ |
| | ౯౫ |

**యోగీశ్వరద్వాదశి:—** కార్తీకశుద్ధద్వాదశి. శ్వేతయోగవేరంబరఁగు పవిత్రదినము. ఆయన యోగశాస్త్రమున కాదిపురుషుఁడు. (క్షీరాబ్ధిద్వాదశి చూడుఁడు. చిలుకుద్వాదశి చూడుఁడు.) ఈదినముననే యాదెని క్షీరాబ్ధిమథనము జరిగెనందురు. (పండుగలు చూడుఁడు.)

**యోగులు:—**

౧ ఆరురుక్షులు:— (యోగశాస్త్రమున) ఎక్కుట కారంభించినవారు.

౨ ఆరురోహులు:— (యోగశాస్త్రమున) ఎక్కుచున్నవారు.

౩ ఆరురూఢులు లేక యారూఢులు:—(యోగశాస్త్రమున) ఎక్కుట ముగించినవారు లేక యెక్కి (యున్న) నవారు.



**'యోగ్యప్రయుక్తం సాధనం కార్యసాధకమ్':—** ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి. సాధన (పనిముట్టు లేక యాయుధము) మెంతమంచిదైనను దాని నుపయోగించువాఁ డావిద్యయందు సమర్థుఁడై యుండిననే కార్యము జయమగునని భావము.

**యోగ్యాపత్యగోత్రము:—**
(శౌనక లేక గ్రిత్సమదగణము చూడుఁడు.)

**యోచనశక్తి, గ్రాహ్యాశక్తి, పసిఁబట్టుశక్తి:—** యోచన యన నాలోచించునది. ఈశక్తి యనేకసంగతులవిషయము లొకచోఁ జేర్చి వాటి మంచిచెడ్డలను యోచించుట, అర్హమగురీతి నాచరించుట, లేక మానుట, యోచనశక్తికిం జెందినవి. ఈశక్తి మానవులం దధికముగను, కుక్కలు, ఏనుఁగులు, కోతులు మొదలగుకొన్నిజాతుల జంతువులందునను గాన్పించును. ఇంక గ్రాహ్యాశక్తి యితరులు చెప్పుదానిం గ్రహించుశక్తి. అదియు మనుష్యులం దధికము. గురువు బోధించుదానిని శిష్యుఁడు కుశాగ్రబుద్ధిఁ గల్గి నేర్చుటయు, న్యాయవాదులవాదములందలి ప్రధానముఖ్యాంశములను న్యాయాధిపతి సులభముగ గ్రహించుటయు, గ్రాహ్యాశక్తికిఁ జెందినవియే. మూఁడవదియగు పసిఁబట్టుశక్తి కుక్కలు మొదలగు కొన్నిజంతువులకు మాత్రి ముండును. తనయజమాని నడచిన యడుగులజాడను వాసనం జూచుచుఁ బసిఁబట్టు, యాతనికడకుఁ గుక్క యరుగుటఁ బసిఁబట్టుశక్తితోఁ జేసినపని యగును. ఇట్టిదాని నాంగ్లమున 'instinct' అనియెదరు. క్రొత్తగ నీనిన యావులకు లేగబెయ్యల కాకలియగుతఱినే పాలుచేపు వచ్చుటయు నిట్టి 'ఇన్‌స్టింక్టు' గనే తలంపనగును.

ఇంకను దక్కిన నైసర్గికగుణము లేజాతిజంతువులం దాగుణములు స్వతస్సిద్ధములుగ స్వభావిక

ములే యని యెల్లరెఱింగినదే. ఇట్టివి కుక్కలందుఁ దమయజమాని యింటియందలి యాస్తులం గా పాడు లక్షణము మొదలగునవి.

### యోధకాలకిగోత్రము:-

(లౌగాక్షిగణము చూడుఁడు.)

**యోధానయోధు:—** "యో" ధనిన యుద్ధవీరుఁడని యర్థము. గాన "యోధానయో" ధనిన యుద్ధవీరుల కెల్ల యుద్ధవీరుఁడని యర్థమగుచుండెను. గాని, కాలము మాఱి యిప్పుడు దూరాలోచనపరుని 'యో' ధనియు, నట్టివారిలో నగ్రగణ్యుని 'యోధానయో' ధనియు వాడుక యేర్పడినది.

**యోనదేశము:—**దీనిని తప్పుగా యవన దేశమని కొంద ఱనిరి కాని, యవనదేశ మిప్పటి యరేబియా యనఁబడినది. దీనిని హ్యూయెన్‌చ్వాంగు దర్శించుతఱిఁ గాబూల్వేలీ అంతయు వలెనె యశోక శాసనములు, బౌద్ధస్తూపములు కలవని వ్రాసి యున్నాఁడు. ఈదేశమునుండి లోచార్ణ (ఇప్పటి లోహార్ణ) ప్రవహించెడిని.

తొల్లింటిరాజధాని కరిశిపురమును బౌద్ధులు 'కలాశి' యని వాడిరి. దానికడనే యలగ్జాండరుచే నిర్మింపఁబడిన 'అలగ్జాండ్రియా' (పిదప అలసన్ద) పురమందుఁ గలసిపోయి రెండును నొకేపురముగ నయ్యెను. ఇది మేనన్డ్రేర్ (పిదప మిళింద) భూపాలుని జన్మస్థలముగఁ జెప్పఁబడినది. మహమ్మదీయులీప్రాంతదేశ మాక్రమింపకపూర్వమే గల్గిన భూకంపముచే నీపురము పాడైనదఁట. కరిశిపుర ముండిన తావును ఇప్పటి ఓపియన్ (లేక నిఫండ) పురమునకుఁ దూర్పునఁ గొన్నిమైళ్ళదూరమున బిగ్రాం లేక బేగ్రా మనంబరఁగు గ్రామముకడ నున్నపాడుగాఁ బోల్చిరి.

ఈదేశమున కదూశ్రియనుపుర ముండెడిది. అది యిప్పుడు 'కొరాతాన్' అనుగుట్టలపైనున్న పాడుదిబ్బలుగ నిటీవలఁ బోల్చఁబడినది. ఆఫ్గనులు దీనిని 'కాఫిర్కోట' యనుచున్నారు. బేగ్రామున కీశాన్యదిశగా నారుమైళ్ళదూరమున నున్నది. పార్శి లేక పార్శియాపుర మప్పుడు పంజహీరనుపేరు నందియున్నది. మహమ్మదీయులు దీని నాక్రమించినపిదప రాజధాని ఘజినీపుర మయ్యెనని చెప్పఁబడినది.

### యోనికూటము (యోనిపొంతనము)

జ్యోతిషశాస్త్రమునందు వధూవరుల యెన్నికలం గూర్చి వివరింపఁబడిన పండ్రెండుకూటములలో నొకటి. (ద్వాదశకూటములు చూడుఁడు).

అశ్విని — శతభిషములు — గుఱ్ఱములు
భరణి — రేవతి — ఏనుఁగులు
కృత్తిక — పుష్యమి — మేఁకలు
రోహిణి — మృగశిర — పాములు
మూల — ఆర్ద్రలు — శునకములు
మఖ — పుబ్బ — ఎలుకలు
ఆశ్లేష — పునర్వసు పిల్లులు
స్వాతి — హస్త — ఎనుములు
విశాఖ — చిత్త — పులులు
జ్యేష్ఠ — అనూరాధ — వృశ్చికములు
ఉత్తర — ఉత్తరాభాద్ర — గోవులు
ఉత్తరాషాఢ — అభిజిత్తు — ముంగిసలు
పూర్వాభాద్ర — ధనిష్ఠలు — సింహములు
పూర్వాషాఢ — శ్రవణము — కోఁతులు

నక్షత్రసంబంధ జంతువుల నిట్లెఱింగి వధూవరుల నక్షత్రజంతువుల యనురాగాదుల కనుకూలించునటుల నెన్నికలు నెరపఁదగునని చెప్పఁబడినది.

**యోనిముద్ర:—** ఇది యోగాభ్యాస విధానమునఁ జెప్పఁబడిన వింశతిముద్రలలో నొకటి.

సిద్ధాసనాసీనుఁడై, చేతుల బొటనవ్రేళ్ళతోఁ జెవులను మూసి, చూపుడు వ్రేళ్ళతోఁ గన్నులను మూసి, మధ్యవ్రేళ్ళతో ముక్కురంధ్రములను మూసి, అనామికలతోఁ బై పెదవిని, చిటికెన వ్రేళ్ళతోఁగ్రిందిపెదవిని జాగ్రతగా మూసిపట్టి, కాకీముద్రవలె నోటితోఁ బ్రాణవాయువును బీల్చి, దాని నపానముతోఁ గలియఁజేసి, కుంభించుట 'యోనిముద్ర' యనియు, దీని యభ్యాసమున సమాధిస్థితి సిద్ధించుట సంభవించుననియుఁ జెప్పఁబడినది.

**యోన్యాసనము:**— యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి. సిద్ధాసనమునఁ గూర్చుండి యోనిముద్రను చేతులతోఁ బట్టుట. (సిద్ధాసనము, యోనిముద్ర చూడుఁడు). ఇందువలన నింద్రియనిరోధము గల్గునని చెప్పఁబడినది.

**'యో యం ప్రతిసేవ్యస్స తస్మాద్భిన్నః':**—ఇది ద్వైతసిద్ధాంతగ్రంథములందు వాడఁబడిన న్యాయము. ఎవ్వఁడెవ్వనిని సేవిస్తూంటాడో, వాఁడాతనికంటె భిన్నుఁడై యుంటాఁడు. జీవాత్మ పరమాత్మలంగూర్చి ద్వైతులు చెప్పు న్యాయము.

**'యోవై చితేన దూరస్థః సమీపస్థోపి దూరతః':**- ఇది సంస్కృత భాషయందలి లోకోక్తి. మనస్సుచేత దూరస్థుడైనవాఁడు. (అనఁగా మనస్సున కనుకూలింపనివాఁడు) సమీపమునందున్నను దూరస్థుఁడే యగునని భావము.

**యౌధేయదేశము:**—
(అయోధదేశము చూడుఁడు.)

**యౌవనాశ్వగోత్రము:**—
(హారిత ఉపగణము చూడుఁడు.)

**యౌవనాశ్వుఁడు:**— ఇక్ష్వాకుసంతతి. సూర్యవంశక్షత్రియుఁడు. తండ్రి యంబరీషుఁడు. కుమారుఁడు హారితుఁడు.

**యౌవనుఁడు:**— ప్రియవ్రతునిసంతతి. తండ్రి ధీమంతుఁడు.

**రంగజ్యోత్స్నతాళము:**—
(తాళములు చూడుఁడు.)

**రంగతాళము:**—
(తాళములు చూడుఁడు.)

**రంగధాముఁడు:**— ఆంధ్రభాషా సాంప్రదాయార్థముపదము. విలువ (ప్రయోజకత్వము) లేని వేషధారియగు నాతఁడు గొప్పగొప్పవారి కూటములలోనికిఁ జొచ్చుకొనిపోవుచుండుతటి హేళనగా నావేషధారిని రంగధాముఁడని యనుచుందురు.

**రంగనాథుఁడు:**-ఆంధ్రకవులందుఁ బూర్వకవులలోఁ బరిగణింపఁబడినవాఁడు. రామాయణమును ద్విపదగా రచించి కృష్ణామండలములోని మనుమూరి సంస్థానాధిపతియైన కోనవిఠలరాజు సుతుఁడగు బుద్ధరాజు రచించిన ట్లీతఁడు పేరిడినను దాని కాతనిపేరు రాక రంగనాథరామాయణ మనుపేరుతోఁ జెలంగుచున్నదని వాడుక గలదు. ఈతని లాక్షణికునిగాఁ బూర్వకవులు తలంచిరి.

**రంగప్రదీపము:**-
(తాళములు చూడుఁడు.)

**రంగప్పరాజు:** ఈతఁడు శ్రీకృష్ణరాయసార్వభౌముని యల్లుఁడగు నళియరామరాజు పెదతండ్రికుమారుఁడు. క్రీ. శ. ౧౫౬౦ సంవత్సరములు ప్రాంతమువాఁడు. ఈతఁడు రచించినద్ది

సాంబోపాఖ్యానమను ప్రబంధము. శ్రీరంగనాథున కంకిత మొసంగెను. ఇందు జాంబవతీవివాహాదులు చెప్పఁబడినవి. ప్రౌఢిమగల కవిత్వము. పైకిఁ గొంత క్లిష్టముగ నగుపడును. భావరంజకత్వము కల్గినను రసపుష్టియం దించుక లోపము గలదని చెప్పఁబడినది. శబ్దార్థరచనావైశద్యముఁ జూపుటయం దీకవి పరిపూర్ణుఁడు.

## రంగాభరణము:-

(తాళములు చూడుఁడు)

## రంగుల యద్దకపుఁ బరిభాష.

| ఆంధ్రపదము | ఆంగ్లేయపదము |
|---|---|
| ద్రావకపురంగులు | Acid dyes |
| వాయువర్ణ చిత్రణము | Aerograph printing |
| పటిక | Alum |
| కల్పితపురంగులు, చేతరంగులు | Artificial dyes |
| క్షారపురంగులు | Basic dyes |
| నలుపురంగులు | Black dyes |
| చలువచేసినమల్లులు | Bleached clothes |
| చలువచేయుట | Bleaching |
| చలువసున్నము | Bleaching powder |
| మయూరతుత్థము | Blue stone |
| గంజి | Boiled Starch |
| పొటాసుకారము | Caustic Potash |
| సోడాకారము | Caustic Soda |
| లవణము | Chlorine |
| సహేతుకరసాయన వాదము | Chemical Theory |
| కిరిమింజి | Cochineal |
| కలంకారీయద్దకము | Calico Printing |
| సవర్ణనిరోధము | Coloured resists |
| సమష్టిరంగులు | Compound Colours |

| ఆంధ్రపదము | ఆంగ్లేయపదము |
|---|---|
| దేశవాళీసబ్బు, నాటుసబ్బు | Country Soap |
| అన్నభేది | Copperas |
| దోహదపురంగులు | Developed Colours |
| ముదురుఛాయలు | Deep Shades |
| సజ్జాకారము, చాకలిచౌడు | Dhoby's Earth |
| నిరుపాధికపురంగులు | Direct dyes |
| విసర్జనపద్ధతి | Discharge Style |
| విసర్జకములు | Discharges |
| అద్దకము | Dyeing |
| రంగురేజు, అద్దకము చేయువాఁడు. (రంగురేజువాఁడు) | Dyer |
| రంగులు | Dyes |
| చిత్రపు అద్దకము | Engraved Plate Printing |
| పక్కారంగులు | Fast dyes |
| తైలనిరోధములు | Fattyresists |
| తయారైన సరుకులు | Finished Products |
| బంధనములు | Fixing Agents |
| కచ్చారంగులు | Fugitive dyes |
| తుమ్మబంక | Gum Orabic |
| దిమ్మలయద్దకము | Hand Block printing |
| లాడీలు, నూలుపిళ్ళు | Hanks |
| శంఖద్రావకము | Hydro - Chloric acid |
| నాటురంగులు | Indigenous dyes |
| విరామయంత్రము | Intermittent machine |
| చాకిబాన | Kier (boiler) |
| లేఁజాయలు | Light Shades |
| నారబట్టలు | Linens |
| మంజిష్ఠపద్ధతి | Madder Style |
| మిశ్రణవాదము | Mechanical Theory |
| భస్మములు | Matallic oxides |

| ఆంధ్రపదము | ఆంగ్లేయపదము |
|---|---|
| ఖనిజఁపురంగులు | Mineral dyes |
| ఖనిజోపాధులు | Mineral mordants |
| సోపాధికఁపురంగులు | Mordant (Nadjective dyes) |
| ఉపాధులు | Mordants |
| ఉపాధిపద్ధతి | Mordant style |
| కసటువేయుట | Mordanting |
| స్వాభావికఁపురంగులు | Natural dyes |
| కాగితఁపుగుజ్జు | Paper Pulp |
| పూతరంగులు | Pigment Colours |
| పూతపద్ధతి | Pigment Style |
| సాదాఅద్దకము | Plain dyeing |
| కోరా (ముడి) సరుకు | Rawmaterial |
| ఎఱుపుసారము | Red Liquor |
| గుగ్గిలము | Resin |
| నిరోధములు | Resists or Reserves |
| నిరోధపద్ధతి | Resist or Reserve Style |
| తిరుగుడుయంత్రముల అద్దకము | Roller Printing |
| వ్యష్టిరంగులు | Simple colours |
| సోడాసాడి | Soda ash |
| ఆవిరిరంగులు | Steam colours |
| ఆవిరిపద్ధతి | Steam Style |
| ఆవిరినీలము | Steam Blue |
| ఆవిరి ఆకుపచ్చ | Steam green |
| ఆవిరి యెఱుపు | Steam red |
| ఆవిరి పసుపు | Steam yellow |
| అద్దకఁపుఁబద్ధతులు | Styles of Printing |
| చిల్లుల యద్దకము | Stencil printing |
| నిరుపాధికఁపురంగులు | Substantive dyes |
| గంధకద్రావకము | Sulphuric acid |
| జిగురులు | Thickeners |
| కట్లద్దకము, ముళ్ళద్దకము | Tie and Dye work |
| తళుకు అద్దకము | Tinsel printing |
| కోరాబట్టలు | Unbleached clothes |

333½

**రంగుల నిజతత్త్వము**:—ప్రపంచమున రంగులు పెక్కు లున్నవనియు, వాటికిఁ బేర్లు కలవనియు, నెల్ల రెఱింగినదే. అవి మొదటినుండి కన్గొనఁబడియున్న రంగులు కావనియు, వాటిం బోలునట్లు దిరుగఁ జూపింపఁబడిన కృతకము లనియు, వాటినామములు, సాంకేతికములు వాటి కిడఁ బడినవనియుఁ గన్గొనఁబడఁ దగినవాటిలో మిక్కిలి కొంచెము పాటిసంఖ్యగల రంగులనే చూడఁగల్గుదురనియు, ఆచూడఁ గల్గినవాటియం దింకను తక్కువసంఖ్యగల రంగులకే పేర్లిడఁబడినవనియుఁ జెప్పినఁ గ్రొత్తవార్తగను, వింతగను నుండి, కొందఱ కాశ్చర్యముఁ గొల్పనోపు. కొందఱకు నమ్మకమే యుండక పోనోపు.

నిజ మారసిన భూమిపై నుండువారల కాకసమున సూర్యాదిగోళములనుండికల్గు వెలుతురునందు వెలుతురును విభజించుటవలన మనకండ్ల కగుపించునవి రంగులు. తెలరంగని మనము గ్రహించు రంగునందుఁ బెక్కురంగు లున్నవి. అవి యన్నియుం గలసియే తెల్లరంగైనది. ఇంతవఱకుఁ బాశ్చాత్యపండితు లెఱింగిన రంగులవిధానము మేర కవి యసంఖ్యాకములనియే చెప్పవలసియున్నది. జగత్తునందలి యత్యద్భుతములలో నిది యొకటి యనవచ్చును. ఇవి వెలుతురునం దగుఁపడుచుండునవి. వెలుతురుతరంగము (light waves) లనుండి యేర్పడి యగుపడునవి. తరంగ పరిమాణమునకు ‘pitch’ అని వాడుచున్నారు. తరంగములపొడవునకు ‘Wave length’ అనెదరు. తరంగములపొడవులనుండి వేర్వేఱురంగు లాకసమున వెలుతురునందుఁ గన్పట్టుచుండునని స్పెక్ట్రిమ్ పరిశీలనలనుండి కన్గొనఁబడియున్నది.

రంగులు ఎఱుపు (Red) మొదలు ఊదా (Violet) వఱకు నని రసాయనశాస్త్రజ్ఞులు వాడుచుందురు. ఈరంగులు వెలుతురుతరంగము

లలో నొక pitch దనుకఁ గొన్నియు, కొన్నితరం గములకూడికయొక్క యొక pitch దనుకఁ గొన్నియు నేర్పడినట్లుఁ దెలియనగుచుఁ గాన్పించు చుండును. వీటింగూర్చి యింకను పరిశీలించుతఱిఁ జూచునేత్రము ఇష్టాయిష్టములమేరకుఁ గొన్నిటి నెఱింగిగ్రహించుననియు, మఱికొన్నిటి నెఱుంగక సరకుఁజేయక వదలుననియుఁగూడఁ జెప్పవలసి యుండును. స్పెక్ట్రమ్‌గుండా పరిశీలించిన నగుపడు రంగు లొకటియం దొకటి చేరుకొనుచుఁ గలసి పోవుచు వేఱురంగుగఁ బరిణమించుటలుగూడఁ గాననగును. అందుఁ గొన్నిమాత్రమే స్పష్టముగఁ గాననగునవి వేర్పడఁబడియున్నవి. నిజమునఁ గొన్ని రంగులు నేత్రసాధనమునఁ జూడఁబడనే చూడఁ బడవు. వాటింగూర్చి యాంగ్లరసాయనశాస్త్రజ్ఞులు "సెకండుకాలమున నెన్నివెలుతురు కిరణములు కన్పడ నోవునో యాసంఖ్యనుబట్టియుండు" నని నిర్ధారణ ఁజేసియున్నారు. ఇట్టిదానిని నేత్రము చూడఁదగినవిగా నుండునని వేరుగఁ జెప్పనక్కఱ లేదు. అనఁగా నేత్రముచేఁ జూడఁగల వెలుతురు తరంగముల సెకెండుకాలఁపుసంఖ్య దీనికిఁగల లెక్కకుఁ గారణమని యెఱుంగునది. ఇందునుండి రంగు లసంఖ్యాకములుగ నుండునని తేలుచున్నది. అందుఁ గొన్నిటిమాత్రమే నేత్రము చూడఁగల్గి లెక్కింపఁబడనగుచున్నది.

ఇటులనే దీనింబట్టి వెలుతురుతరంగముల సంఖ్యకూడ నుండునని చెప్పఁడగియుండును. తరంగములపొడవు (Wave length) లనుండియే తరంగసంఖ్య గల్గి యొకటినుండియొకటి భేదమగు నటుల, తరంగపరిమాణములును భేదములం గల్గి యుండెడిని. ఈలెక్క లన్నియు నొకసెకెండుకాలమునఁ గల్గునవిగా మనసునం దుంచుకొనుట యత్యావశ్యకము. ఆసెకెండుకాలమునఁగల్గు wave length లధికమగుతఱిఁ దఱుగసంఖ్య స్వల్పము గను,స్వల్పమగుతఱిఁ దరంగసంఖ్య యధికముగను, నుండునని స్పష్టము. అట్లే నేత్రము చూడఁగలదు. అట్లే వెలుతురు కిరణతరంగములందు Dullest Red that is almost inviseble అనియును దానియందు సెకెండుకాలమున స్వల్పసంఖ్యగల తరంగము లుండుననియు వివరింపఁబడినది. అటు లనే వెలుతురు తరంగములందు Voelet రంగు త్వరితగమనముగల Waves నుండి గల్గి, Shors wave lengths వలన నేర్పడుననియుఁ గూడఁ జెప్పఁబడియున్నది. ఇట్టిసందర్భములందు వెలుతురుతరంగములసంఖ్య నవి నడచు వేగములతోఁ బోల్చి పొరఁబడరాదు. ఈలెక్కకు long wave length గల కిరణములు తక్కువగనైనను, short wave length గల కిరణము లెక్కువ యైనను నొకసెకండు (second) కాలము మాత్రమే ప్రధానము గాని, వాటి ప్రత్యేకగమనములతోఁ బనియే లేదు.)

పిదప నింకను Rays of invisible heat (కిరణములు) Red rays తరువాతఁ గలవు. అవియు Visiable light కిరణములం బోలి వేర్వేఱుగ నుండునవియే వీట్లంగూర్చి గొప్పగొప్ప పరిశీలనలు జరిగియున్నవి. Inviseble heat కిరణములు కనిపించనివి గాన నవి గల్గించువేఁడి ననుసరించియే వాటింగూర్చి యెఱుంగఁదగినది. పరిశీలనలఫలితముగా సర్వసాధారణముగ నంద రెఱింగిన తెర్మోమీటరువంటి యంత్రపరికరమే దానికన్న బహుసునాయాసముగ నట్టివేఁడికిరణము లం బరిశీలింప వీలయ్యెడిని. Spectrum విజ్ఞుల్ వెలుతురుతరంగగతుల నెఱుంగఁజేయునట్లే invisible heat కిరణములు వేర్వేఱనియుఁ జెప్పి వాటిగతుల నెఱుంగఁజేయునది. Key board of invisible waves అని పేరిడి

యున్నది. [క్రిబోగ్రాఫ్ ఇన్విజబుల్. హీటువేవ్స్ చూడుడు, రిఫ్లెక్షను చూడుడు, రిఫ్రెక్షను చూడుడు.]

**రంగులఫోటోగ్రాఫీ** (Colour Photo graphy):—ఇది ఫోటోగ్రాఫీలోని యొకభాగ మగు విద్య. స్వభావసిద్ధమగురంగు (Natural Colours) లగు నెఱుపు (Red), ఆకుపచ్చ (Green), నీలి (Blue), ఊదా (Violet) రంగుల, రంగులవడియగట్టుసాధనముల (Colour filters) ఉపయోగించి కిరణములను విడఁ (Split up) జేసి లెన్సుగుండా వెలుతురును చొప్పించి ప్లేట్సుపైఁ బడునట్లుచేయుదురు. ఇటుల మూఁడురంగుల యద్దకము లేర్పడి యందొక్కటి యన్యములగురంగుల సాంగత్యమున నించుకభేద ములుగల రంగులుగూడ నగును. ఇది రంగుల ఫోటోగ్రాఫీ యనంబడుచున్నది.

**రంగులమరకలు** (Colour stains):-పరిశుద్ధమైన నీటియందు మరకలనుగల్గించు రంగే మియు లేదుగాన మరకలను గల్గింపఁజాలదు. ఇంక నాజలము బట్టలందడిపి యదివరకుఁ బడి యున్నరంగులమరకలనుఁ గడిగివేయును. నీటియం దేరంగులును కరగియుండనిస్థితియందు జరుగుపని యిది. ఇంక నం దేవేనిరంగులఁ గరగించి (dissol-ved) యుండుతటి నాప్రదేశమును మరకగ నొన ర్చెడిని. పలనన రంగు లాపదార్థములోనికిఁ గూడఁ జనవీలగునేని జనగలవిగ నుండును. కాగితముపై కలము సిరాయందుముంచి వ్రాయుతటి నీజరగు పనియు నిదియె. ఇందు రంగు సిరాయనఁబడు చున్నది. రంగులు వదలనివి, వదలిపోవునవియని ద్వివిధములుగ నుండును. ఆంగ్లరసాయనశాస్త్ర వేత్తలు రంగులందు 'ఐయన్స్' కలసియుండు నందురు. ఇందు లవణము (salts) లుండెడిని. సిరాలందు కలశియుండు Prussian blew కూడ ఐయర్న్ సాల్టుగఁ జెప్పంబడినదియే. ఆంగ్ల రసాయనశాస్త్రవిదులచే సిరా soluation of salt అను పదార్థములో వివరింపఁబడుచున్నది.

**రంగులు**:—నేతబట్టలు, తోళ్ళు, కాగి తములు, నూనెలు, భోజనపదార్థములు, వార్నీ షులు మొదలగువానికి వేయురంగులకుఁ బాశ్చా త్యులగు ఛాయావిద్యావిశారదులు dyes అని యు dyestuffs అనియు వాడుచున్నారు. రంగులను సాధారణముగ మినరల్ డై స్టప్సు అనియు, నేచురల్ డై స్టప్సనియు, ఆర్టిఫిషల్ డై స్ట ప్సనియు మూఁడుజాతులుగ విభజించుచున్నారు.

మినరల్ డై స్టప్సునందు ౧ Prussian Blue ౨ iron buff ౩ chrome yellow ౪ ch-rome orange ౫ manganese bronze ౬ metallic oxide khaki యనఁబడునవి ప్రధానములు. నూలుపైఁ జక్కగ నీరంగులు పట్టును. వీనివాడుక యించుక యిప్పుడు తగ్గియు న్నది.

నేచురల్ డై స్టప్సునందు ౧ నీలిమందురంగు, (indegocolour) ౨ logwood, ౩ fustic ౪ Persian berries, ౫ orchil, ౬ Cud-bear, ౭ Ctuch అనఁబడురంగులు ప్రాము ఖ్యతనందినవి. ఇందొకటి మైదుసంఖ్యలుగల రంగు లకుఁదప్పఁ దక్కిన నేతబట్టలకలఁదుతటి ముందుగా salts రూపములనుండు metals ముందుగ నలఁది మరియు వేయవలసియుండుననియు దీనికి mordanting proces అని పేరనియుఁ జెప్పఁ బడినది.

ఆర్టిఫిషల్ డై స్టప్సుకు Coaltar dyes అని యు వాడుకనామము గలదు. వీనియందు or-

ganic Compounds చాలఁ జేరియుండును. రసవాదశాస్త్రముమేర కివి పదునేనుగ విభజింపఁ బడినవఁట. ప్రతిదానియందు నొక్కొక్క definite structure కల్గి దాని నతిక్రమింపకుండు నని చెప్పఁబడినది. కాని రంగుభేదములు ప్రధానముగాఁగల్గిన దృష్టిలో నీక్రిందియేఁడుమాత్రము ముఖ్యభేదములుగ నెన్నఁబడుచున్నవి. ౧ acid Colours, ౨ Basic Colours, ౩ direct cotton colours, మరియు వీనిని salt colours అనియు నందురు. ౪ mordant colours, ౫ sulphide colours, ౬ Vat colours, ౭ insoluble colours లేక colours formed on fibre, ఇవి coaltar జన్యములఁట.

## రంగులు మానవశరీరమునకుఁ గల్గించు గుణములు:—

మానవశరీరమునందలి లీవరు (కార్జము) స్థితిగతులనుండి శరీరమునకు సౌఖ్యము నసౌఖ్యమునుఁ గలుగునట్లే వాతావరణమునందలి శీతోష్ణములు నితరగుణదోషములును మానవశరీరమునకు సౌఖ్యారోగ్యములను నసౌఖ్యారోగ్యములనుఁ గూడఁ గల్గించుననుట లోకప్రసిద్ధమే. అటులనే వెలుతురునందలి రంగులు సోకుటవలనఁగూడ మానవశరీరమునకుఁ గొన్ని గుణములఁ గల్గించును.

శరీరస్థితింబట్టి శీతోష్ణాదులలో నేది శరీరమునకుఁ దత్కాలమునం దావసరముగ నుండునో దానిని వాంఛించుచుండునట్లే శరీరమునం దేరంగు తక్కువయై వాంఛింపఁబడుచుండునో యారంగు నేత్రములకు, శరీరమునకు హితవై, యనుకూలమై యుండును. అననుకూలమగు రంగు బాధకరముగఁ దోచుటయేగాక శరీరమునకు బాధలఁ గల్గించును. అనఁగా నావసరమైనరంగును మనస్సే వాంఛించు నని తేలుచున్నది.

జీవితకాలమునం దొకప్పుడు మనస్సున కహితమగు పదార్థములు వే రొకప్పుడు హితవగుట వలెను నేత్రముల కొకప్పు డహితవుగ నుండిన రంగులు వేరొకప్పుడు హితవగుటయు శరీరస్థితి మారుటయేయని యెఱుంగునది. Infantile పక్షవాతరోగ మెఱుపు నూదా రంగులచే బాగుఁ జేయనగునని యిదివరకే వైద్యు లెఱింగి యున్నారు. రోగి భరింపఁగల్గి యాగినచో నెరుపురంగు hundred percent life power నీయఁగల దఁట. అనుకూలములగు శరీరస్థితి మనస్థితు లమరకుండినఁదటె నారెుఱుపురంగే యపాయకరమై Vitality ని పాడుఁజేసి నీరసింపం జేయునని కని పెట్టఁబడినది. Spectrum రంగులు Human wave length లుగఁ జెప్పఁబడి enargey ని గలించు నందురు. (స్పెక్ట్రం ఎనాలిసిస్ చూడుఁడు) ధూమ్రవర్ణము (Purple) చక్కఁగ శరీరమునందుంటఁ జక్కనియారోగ్యస్థితి యమరియుండునని కనిపెట్టియున్నారు.

ఊదారంగు శరీరమున సమృద్ధిగ నుండుతటె Purple లేక Voilet రంగులబలము (శక్తి) చైతన్యజ్ఞానములఁ గల్గించుననియుఁ దలచినపని యందు బాధ్యత బలపర్చుననియు నందురు. వైద్యులు రంగులను (గుణమునుంబట్టి) మూఁడుతెగలుగ విభజించుచున్నారు. ౧ పసుపుపచ్చతెగ రంగులు పెరిగి యభివృద్ధి యగుటఁ జకచకఁ గల్గి యుండుటకును, ౨ ఊదాతెగరంగులు జ్ఞాపకము, చైతన్యములను బాగుఁజేసి యభివృద్ధి పరచుటకును, ౩ ఎరుపుతెగరంగులు శరీరత్రాణను బాగుపరిచి బల మొసంగుటకును నుపయోగించు నని మూఁడుతెగలుగ విభజించియున్నారు. వీని

వీనివైద్యవిధానమున Basic colours అనియు, వీని సర్వరీతిని వాడవలసియుండ వీనియం దామోదము మనస్సునం దుత్పన్నమైయుండుస్థితికి Realization స్థితియనియుఁ బరిభాషాపదములుగ వాడుచున్నారు.

మొక్కలు చక్కఁగాఁ బెరుగుట, సకాలమునఁ బూచి కాయుట, మనుష్యులు పగలు పనిపాటలం జేయఁగల్గు చైతన్యస్థితియం దుండుట, రాత్రి నిద్రపోవుట మొదలగునవి రంగుల యనుకూల స్థితియగు రియలైజేషన్ కార్యములే నఁట. వాతావరణమునందున్న యెక్కుడు వెలుతురు మొక్కలఁ బాడుచేయునటులఁ జెట్లకాలమునఁ బూచుటఁ గాచుటఁ గొన్నియసలే పూతకాపులు మాని గొడ్డుఁబారియుండుట, కొందరికి రాత్రులందు నిద్రపట్టకపోవుట, లేక తఱుచుగ మెలకువఁ గల్గుచుండుట, పగలు బద్ధకముగ నుండుట 'ఈరియలైజేషన్' కుదరక వెలుతురునందలి రంగులనుకూలపడని దోషమని చెప్పుచున్నారు. ఈ వైద్యవిధానమున నొకశాస్త్ర మేర్పడి యాంగ్లేయులచే నరుదుగ వాడఁబడుచున్నదఁటఁ గాని యంతగా వ్యాపించియున్నటులఁ గానరాదు.

భరతదేశమునందు వర్ణవైద్యమను నొకవైద్యవిధానము వ్యాపించియున్నది. దీని నజ్ఞతతో రంగుసీసాలవైద్యమనియు, రంగుసీసాలనీటివైద్యమనియు వాడుచుంటయుఁ గలదు. ఈవైద్యవిధానమునఁ బలురంగులసీసాల నుంచుకొని వాని యందు నిర్మలజలముఁబోసి మూతలను బిగించి రెండున్నరగంటలకాలము వేడియెండలో నుంచి యాజలముల నౌషధములుగ నుపయోగింతురు. పెద్దవారికిఁ బెద్దమోతాదును, బాలుర కర్హమగు రీతిని చిన్నమోతాదును వాడుచుందురు. పుండ్లుఁ గూడ నీ జలములతోఁ గడుగుటవలన మానునందురు.

వేర్వేరురోగములకు వేర్వేరు రంగులసీసాల జలము నౌషధముగా నిచ్చుటయు రోగియొక్క రోగము నెఱుంగుటకు ౧ శరీరంపురంగు (తగ్గినదియో లేక హెచ్చినదియో?) ౨ నేత్రములు, గోళ్ళు, మూత్రము, రోగిమలము మొదలగునవి పరీక్షింతురు. గాఢమగు నీలంపురంగు సీసాలలోని జలము కుక్కకాటు, దగ్గు, పగరుపు, అజీర్తి, వికారము, కాస మొదలగురోగములపైఁ బని చేయునందురు. ఎరుపురంగుసీసాలలోని జలము వేడిఁ జేయునఁట.

తిమ్మెరులందు సర్వమగురంగు నద్దములనుండి బాధగల ప్రదేశములందుఁ బ్రసరింపఁజేసిన నెండ వెలుతురు గుణముఁ గల్గించునఁట. రాత్రులందు దీపంపువెలుతురు నారంగులయద్దమునుండి ప్రసరింపంజేసిన గుణ మగునఁట. కొందరీవైద్యవిధానమెండ లేనిరోజులలో జరుగదనియు, నిరర్థకమనియు ననుచున్నారు.

**రంగూన్‌నగరంపు ష్వేడేగన్‌దేవస్థానము:—** ఆదిని తలైయంగు తెగబర్మీయులు తెల్పు కథనముమేర కాదికాలంపువారగు 'పు', 'ట' యను పేరుగల సోదరు లిర్వురు మహాభక్తులుండిరఁట. వారి భక్తికి మెచ్చి క్రీ. ము. ౫౮౮ నాడు బుద్ధభగవానుఁడు వా రిర్వుర కెన్మిదిరోమములు తమవి యొసంగి పూజించుకొమ్మనెనఁట. వా రిట నొకచిన్న దేవస్థాన మేర్పఱిచి యం దా వెంట్రుకలనుంచి పూజించుచుండ నాతావున నొక పల్లెగ్రామ మేర్పడి 'డాగో' ననుపేరఁ బరఁగుచుండెనఁట. ఇది తలైయంగులు దీనియుత్పత్తిం గూర్చి తెల్పు కథనము.

పిమ్మట క్రీ. వె. ౧౭౫౫ నాడు అలౌంగు పాయ (బర్మీయుఁడగు నృపతి) నరపతికిఁ దలై యంగులతో నీప్రాంతమున సంగరము జరిగెనని చరిత్ర తెలుపుచున్నది. అందుఁ దలైయంగు లోడిరఁట. భూపతి యత్తఱి నీదేవస్థానము నాక్రమించి దేవళముఁ దిరుగఁ గట్టించి, యాగ్రామము నకు డాగోననుపేరు మార్చి సంగరాంతమని యర్థమిచ్చు 'యాంగా' ననుపే రిడెనఁట. ఆపేరే నానాటికి మార్పుల నందుచు నేటికి రంగూనయ్యె నఁట. పిమ్మట క్రీ. ము. ౫౮౦ నుండి క్రీ. వె. ౧౭౫౫ దనుకఁగల దీనికథనము చరిత్రల యందుఁ గానవచ్చుటలేదు.

'ష్వేడేగన్' అన బంగారుఁపు దేవళమని యర్థము. ఇది రంగూన్‌నందలి కంటన్మెంటుపరిసరముల నున్నది. గొప్పదేవళమని దీనినిఁ జెప్పుట కన్న దేవళసముదాయ మనుట సమంజసముగ నుండును. నిరుపమానసౌందర్యవంతము. చాల నెత్తగుతావునఁ దచటి భూమట్టముపై ౩౭౦ యడుగులయెత్తునకుఁ గట్టఁబడిన యిటుకకట్టడము. వాయించు చేతిగంట (Bell) యాకారమున నిర్మింపఁబడినది. దీని పై గోపురఁపుఁటో (dome) మంతయు బంగారురేకుల నమర్చి కప్పఁబడి యెండ యందు మెరయుచుఁ జూడఁ గనులకు మిరుమిట్లుఁ గొల్పుచుండును. శిఖరమునం దమర్పఁబడిన (హ్టి) గొడుగునం దమూల్యరత్నము లమర్పం బడిన వందురు. పునాది చుట్టుఁగొలత ౧౩౦౦ యడుగు లుండును. ఇట్టి మహాదేవళమునందు బుద్ధభగవానుని విగ్రహము పూజల నందుచున్నది. ఈష్వేడేగన్‌దేవస్థానము నగరపరిసరప్రదేశముల దూరములును, సమీపములును నగు పలుతావులనుండియు, నగరమునందలి డల్హౌసీ పార్కులోని రాయల్లేక్సు (సరస్సున) కాన్నేయ దిశనున్న యెత్తగు నొకతావునుండియు దీనిపెక్కుసౌందర్యదృశ్యములు గాంచ నగుచున్నవి. రాత్రులం దీదేవళము విద్యుద్దీపకళికలచే నలంకరింపం బడుటయేగాకఁ దీక్ష్ణకాంతివెలుఁగున దేదీప్యమానసౌందర్యదృశ్యమగున ట్లొనర్పంబడి ప్రకాశించుచు నసమానసౌందర్యవిరాజమానమై రాత్రులందు వింతఁగొల్పుచుండును. దీనిం గాంచి విదేశపరిశీలకు లిది Wonder of the world గాఁ బొల్చెదరు.

ష్వేడేగన్ ప్రధానదేవళమునకు నాల్గు దెసలందును నాల్గువీథులు గలవు. వానియందన్నియు దేవళములే నిర్మింపంబడి గొప్పగొప్పపనితనములం గల్గియున్నవి. ప్రత్యేకప్రత్యేకముగ నరువది, డెబ్బది, లేక నెనుఁబదియడుగుల యెత్తులంగల్గిన దేవాలయ స్తంభములతోఁ బ్రత్యేకములుగనుండి యంతయుం గలసి యొకేయావరణముగ, గ్రామమువలె నుండును. వీనియందలి చిత్రములలో హంసలు, బ్రాహ్మిణీబాతులు (పెద్దజాతివి) కమలములు, మయూరములు, బోధివృక్షచిత్రములు చక్కని పనితనములఁ గల్గియున్నవి. అన్నియు బుద్ధదేవళములే. పూజించుభక్తులలో స్త్రీ లధికసంఖ్యాకులుగ నుందురు. మార్గముల కిరుదెసలయందును, సోపానముల కిరుదెసలను గొప్పబజారు కలదు. అందుఁ బూవులు, పండ్లు, భోజనపదార్థములు, దీపారాధనకొవ్వొత్తులు, ముఖ్యముగ నమ్మఁబడుచుండును. (రంగూనునగరము చూడుఁడు)

**రంగూన్ నగరము:**— ఇక్కాలమున రంగూన్‌నగరము బర్మాదేశమునకు మాత్రమే ప్రధాననగరమై యున్నను నాదేశమున కంతకును బ్రధానవర్తకస్థలమై, ప్రధానరేవుస్థలముగఁగూడ నేర్పడియున్నది. ఆంధ్రదేశఁపురేవులనుండి పాటకఁపుజనులు, వ్యవసాయఁపుజనులు, వర్తకులు,

బర్మా దేశమున కరుగుచుంట నెల్లరెఱింగినదేగాన బర్మా కొంతవర కాంధ్రసంబంధము విరివిగనే గల్గియుంటఁ గాననగును. ఇంకను చాకలి, మంగలి కులమువారు వృత్తి జీవనమునకై రంగూనున కరుగుచుంటయుఁ గలదు.

ఇక్కాలఁపుఁ బరిస్థితులమేరకుఁ జూచువారల కిది బర్మీయులపట్టణ మనిపించదు. ఐరోపావద్ధతుల నధికముగ నడపుచున్నకతన నాంగ్లేయులు దీనిని cosmopolit an city అందురు. ఇం డైరో పా దేశజాతులు నార్మీనియనులు, సింహాలులు, నాంధులు, నరనదమ్మిళులు, చీనావారు, జపా నీయులు, మలయనులు, పారశీకులు, మార్వా డీలు, నాటికోటిశెట్లు మొదలగు పలుదేశముల వారు వీధులం దగుపడుచుందురు. భారతీయులుఁ బెక్కండ్రుఁ గన్పట్టుచుండుట సర్వసామాన్యమే. ఇచటి గృహనిర్మాణ విధానమున కాంగ్లమున Half Italian half oriental అని పేరిడిరి.

వేడిదేశమైన బర్మాయందలి రంగూన్‌నగర మున సూర్యరశ్మి యధికతీక్ష్ణమైనకతనఁ బెద్ద బాటల కిరుదెసలను జల్లనినీడ నిచ్చు ఛాయా వృక్షములు నాటంబడుచుంటఁ బరిపాటియై యు న్నది. వేడికిఁదోడు తెల్లనిదీప్తి యధికముగానుంట నేత్రములకు బాధకరమై యుంటయు, రేవునం దుండు స్ట్రాండురోడ్డు (బాట) నంటియె నిర్మిం పంబడిన ధాన్యఁపుమరలపాగ గొట్టములనుండి బయల్వెడలు ధూళియును, ధూమములును, మేఘములఁబోలి వేడిని బలపర్చుచుండ నగరమున కెదురుగనే నదీజలములం దదేపనిగ జరుగుచుండు నోడలమరమ్మత్తుల సుత్తిపెట్లధ్వని చెవులను గింగురు మనిపించుచుండ నీగడబిడలు రంగూను పురమున విశ్రాంతికిఁ దావులే దనిపించుచుండును. ఇంకఁ గొండవాం డ్రెడవులందుఁ బట్టుకొని రం గూనుబజారునం దమ్మం దెచ్చిన యడవిమృగములఁ బిల్లలుఁజూచి వెఱఁగంది, బెదరి, యిటునటుఁబర్విడు పాంథుల వెత్తినడకలచేఁ గలవరపరుపంబడిన వీధి నడకకదలికతో వింతఁగొల్పుచుండెడిని. పరిస్థితు లిట్లున్నను నిజమున రంగూనునగరము చూడ సౌందర్యవంతమును, కాపురముండ సౌఖ్యవంత మును ననిపింపకపోదు. వెడల్పైన తిన్ననిబాటలు, నిరుదెసలఁ జల్లనినీడ నిచ్చుఛాయావృక్షములు, వానివెనుక సుందరభవనములు, చక్కనిపూఁదో టలు, వేర్వేరురంగులదుస్తులం ధరించినపలుజాతిప్ర జలు, కిటకిట లాడుచుండువీధులు, ఎగుమతిదిగుమ తులతోఁదెరిపి లేకనుండు రేవుజట్టీలు, పలుదేశముల వింతవింతబావుటాలు ధరించిన లెక్కలేనిపాగ యోడలు, తన్ననుసరించుచుండ శాంతజలప్రవా హమహానౌకామార్గమనందగు నైరావతీనది కిరు వెనలం గట్టఁబడి జీవనమునకై తన్నుఁజేరవచ్చిన యర్థులగు పనివాండ్రకుఁ దీరని పనిపాటులఁ గల్పించి మనఁజేయుచు ధనార్జనాసక్తచిత్తులగు వణిక్ప్రంగవుల నాదరణమునఁ దనుపుచు కర్షకుల కదనముగఁ బంటలఁ బండించి తృప్తిఁ గల్గించుచు మహోన్నతమై భవవిరాజమానమై యైశ్వర్యమునఁ దనరుచు గర్వముగఁ దనకున్న స్వర్ణాభరణములతో మిన్నయగు ష్వేడేగన్ దేవళమును చుట్టుపట్లఁ గొన్నిమైళ్ళదూరమునందున్న వారికిసైత మగుపడు చుండునట్లుఁ జూపుచునుండు నగరమై రంగూన్ పురము దనరెడిని. నగరపరిసరసీమ పరిపాలము లేగాన వ్యవసాయకాలమం దాకుపచ్చరంగును, పంటకాలమునఁ బసుపుఁబచ్చరంగును భూవలయ రేఖనంటి పూసిన ట్లగుచుండెడిని. సముద్రముపై నోడలలో నేతెంచువారికి నగరసౌందర్య మేమి యుఁ గానరాక నొక్కష్వేడేగన్ దేవస్థానఁపు బంగారుదేవళముమాత్ర మగుపడుటతో సరి పోయెడిని. ఐరావతీనది కుత్తరతీరమున నగర

మెక్కువ వ్యాపించియున్నది. దల్లా, కామకాశి టన్, కనౌంగో, కెయిక్ గ్యి, అనంబడుపేటలు దక్షిణతీరమునను, సైరియమె, పెగ్గూనది కవ్వలను నున్నవి. వీనిని పరిసరములనియు, వెలిపాలెము లనియుఁ దలంచుచుందురు. రంగూన్ రేవునకు దిగువను నగరఁపుఁ గఱ్ఱలయఁడుతులు, కోతల కర్మాగారములు (saw milles) గలవు. ఇంతఁ దనుక నుత్తరఁపుటడవులనుండి తెప్పలుగఁ గలప (దూలము) లిట కైరావతీజలములందుఁ దేబడఁ గడునేర్పుఁగల యేనుగుఁలు వానిలోనియొక్కొక్క దూలమును రెండుకడలందుఁ జెరియొకటియుఁ దొండముం జుట్టి పట్టుకొని పైకెత్తి దరికిఁజేర్చుచు యంత్రముల కందిచ్చుట విచిత్ర మనిపించును. అన్యదేశముల కంపు దూలముల నట్లే పొగయోడ లకుఁ దగిల్చి యంపుచుందురు.

రంగూన్ నగరమున విశాలములగు వినోద స్థలము (మైదానములు, బయళ్ళు) లధికముగాఁ గలవు. ఇవి పోలోయాట, ఫుట్బాల్ ఆట, గోల్ఫు ఆటలాడువారికై యేర్పరుపఁబడియున్నవి. ఇవి చూపరులకు వినోదస్థలములు. కాంచి యనంబడు పురభాగమున గుఱ్ఱఁపుఁ బందెముల మైదానము (race course) 'రంగూన్మెయిన్' అనంబడు బర్మాస్టేటురయల్వేస్టేషనుకడనున్న 'బర్మాఅథెలిటి క్కసోసియేషన్' వారి యాటలమైదానము, ఎగ్రి హార్టికల్చరల్సొసైటీవారి తోఁటయు, విక్టోరియా పార్కునందలి జంతుజాలప్రదర్శనము (Zoo), కంటోన్మెంటుపూఁదోటలు, డల్హౌసీపార్కుద్యానవనమును, అందు గర్భితములైన రాయల్ లేక్సు (సరస్సు) లును, నగరమునఁ జేర్కొనంబడఁదగిన వినోదప్రదేశములుగఁ జేర్కొనఁదగినవి. డల్హౌసీపార్కునందలి సరస్సులే నూటయిరువదియకరముల పరిమితిఁ గల్గియున్నవి. అం దొకచోట క్లబ్బు కలదు. దీనియం దాగ్నేయదిశగనున్న యొకమెరకప్రదేశమునుండి నీటి కవ్వలఁ గన్పించు ష్వేడేగన్ దేవస్థాన సౌందర్య మద్భుతము. ఈ మైదానములు, పార్కులు నగరాలంకారము లనిచెప్పిన నతిశయోక్తి కానేరదు. మరియు నివి యిట సుప్రసిద్ధస్థలములు గను, ననుదినమును వేనవేలు జను లరుదెంచుతావులుగను నున్నవి. నగరమున కుత్తరదిశగఁ గంటోన్మెంటున కవ్వల ౬౦౦ యకరముల విక్టోరియా సరస్సునుండి దాహోదకము నగరమున కమర్పంబడినది. దీని కింకను నవ్వలఁ బదిమైళ్ళదూరమున మింగల్డన్ గోల్ఫుకోర్సు (ఆటలమైదానము) కలదు. అది పటాలఁపుసైనికుల కుపయోగించుచున్నది. దీని కరుగుబాటయు, విక్టోరియాసరస్సుం జుట్టిన బాటలును కడుమనోహరములు. చూడందగిన వినోదప్రదేశములుగ నున్నవి.

ఇప్పటి యాకారముమేర కీరంగూన్నగరము క్రి. శ. ౧౮౫౨ లో బ్రిటీషువారివశమైనతోడనే Lient Fraser సేనానికి వశపర్పంబడి నగర నిర్మాణాధికార మొసంగంబడిన దఁట. ఆయన 'శూలై పెగోడా' యనఁబడు దేవాలయమును కేంద్రస్థలిగాఁ గైకొనుచు నాల్గుదెసలందును నాల్గురాజబాటలును, వానింబట్టి పట్టణఁపు టితర బాటలను నేర్పరిచి వీథులు తిన్నగ వంకరలు లేకుండునటులఁ గుదిర్చి మైదానములను, పార్కుల నమర్చి కట్టంజేసెను. అదియే యిప్పటి రంగూను నగరము. రంగూనునం దాపులపాడిలేమి గొప్పలోపము. దీనికిబదులు మేకలపాలను వాడుచున్నారు. కాలములం దాఁడుమేకలమందలు వీథులందుఁ బ్రత్యక్ష మగుచుండును.

పట్టణపారిశుధ్యకార్యములనిమిత్తము రంగూన్ నగరము మూఁడుభాగములుగఁ జేయఁబడి రేవు

భాగము ఫోర్టుట్రస్టుసంఘమువారి వశమునను, సైన్యస్థానభాగము కంటోన్మెంటుకమిటీయనంబడు సైనికోద్యోగులసంఘమువారివశమునను, తక్కిన ప్రజలనివాసభాగము మ్యూనిసిపాలిటీసంఘము వారి వశమునను పరిపాలింపంబడుచున్నది. ఈ మూఁడుసంఘములు వారివారిభాగములందు నీటి గొట్టఁపుఁగొళ్ళాయిల వ్యవహారములును, వీధు లందు, రేవులందు, నదియందు విద్యుద్దీపముల వ్యవహారములు, నితరపట్టణ పారిశుధ్యసంబంధ వ్యవహారములును నిర్వర్తించుచున్నారు. పెగ్గూ నది యైరావతియం దటనే సంగమించుతావునఁ జేరుచు మెరకవేయుచుండుతావునకు 'Hastings shoal' అని పేరిడిరి. అది ఫోర్టుట్రస్టువారి పరి శీలనాధికారములం దున్నది. మ్యూనిసిపల్‌కమిటీ వారి కీనగరమున మూఁడుపెద్దమార్కెట్టులు (బజా రులు) కలవు. ఇవిగాక నెనిమిదిమార్కెట్టులు వేర్వేరుస్వామ్యములవారివి (Private owned) కలవు. ఈబజారులందుఁ జిన్న, పెద్ద వస్తువులు, భోజనసామగ్రులు, బట్టలు, షాపుసామానులు మొదలగునవియులేగాక నేనుఁగులు గుఱ్ఱములు, ఎద్దు, పెద్దపులులు, చిరుతపులులు, ఎలుగుబంట్లు, సింగములు మొదలగుజంతువులు, పక్షులుగూడఁ గొననగును.

నగటున రంగూన్‌నగరము సౌందర్యవంతమై, మహానగరలక్షణవిరాజితమై, సౌఖ్యకరమై, జల సమృద్ధమై దనరెడిని. పెద్దవగువీధులందు ట్రాం బాటలుఁ గలవు. ఇంక నీరంగూన్‌నగరోత్పత్తిం గూర్చి రంగూన్‌నగరఁపు ష్వేడేగన్ దేవస్థానము జూడుఁడు.

**రంతిదేవుఁడు:**—అత్రి, చంద్ర, పూరువు సంతతి క్షత్రియుఁడు. తండ్రి నరుఁడు. మఱియు పూరువుసంతతియందే సంకృతికుమారుఁడొక రంతి దేవుఁడు కలఁడు. ఈతఁడు మహాదాత. రంతిదేవ మహారాజు షోడశమహారాజులలో నొకఁడుగఁ జెప్పఁబడినవాఁడు.

**రంతిపురము:**— ఇప్పుడు 'రిన్తిపూర్' అనియు, 'రిన్తాంబూర్' అనియుఁ బిలుచుచున్నారు. గోమతిలోఁ జంబల్ (చర్మణ్వతి) కలియును. కాళిదాసుమేఘసందేశమున ౧-౪౭ నుడివిన రంతి దేవనృపాలునిరాజధాని. మహాభారతము ద్రోణ పర్వము అధ్యా ౬౭ యందు రంతిదేవునిప్రశంస కలదు.

**రంధ్రదోషము:**— జ్యోతిషశాస్త్రము నందు ముహూర్తభాగమున నుపనయనముహూ ర్తమునుగూర్చి చెప్పఁబడినదోషములలో నొకటి. లగ్నాదికేంద్రములందుఁ గేతువుండిన, రంధ్రదో షమనియు, వటువుతండ్రికిఁ గీడనియుఁ జెప్పఁబడి నది.

**రంభాణిగోత్రము:**—
(నిధ్రువగణము చూడుఁడు)

**రంభాతృతీయ:**—జ్యేష్ఠ శుద్ధ తృతీయ. ఈదినమున నరఁటిచెట్టుక్రింద గౌరీదేవిని బూజించు వ్రత మొనర్తురు. (పండుగలు, పర్వతిథులు, వ్రత దినములు చూడుఁడు).

**రంభుఁడు:**— తండ్రి యాయువు. పితా మహుఁడు పురూరవుఁడు. సోదరుఁడు నహుష మహారాజు.

**రంక్షునది:**— దీని నిప్పుడు 'రంగాట్' అనుచున్నారు. ఇది తీస్థా (టీస్తానది) నదిలో సంగమించును. హిమవత్పర్వతములపై డార్జిలింగు జిల్లాలో నగుపడును. మార్కండేయపురాణమున ౫౭ అధ్యాయమునఁ బ్రశంసింపఁబడినది.

## రక్తగ్రహణి:-

(అమాతిసారము చూడుఁడు, రక్తాతిసారము చూడుఁడు).

## రక్తపుచ్ఛిక (నలికిరిపాము) శాస్త్రము:

—రక్తపుచ్ఛిక యన నెత్తురితోఁకఁగలదని యర్థము. దీనిని బచ్చలిపా మనియు, న పాము నియు, నలికనులపా మనియు, నల్లికండ్లపా మని యు, నలికిరి యనియు, నలికి చనియు, వాడుక నామములుగల పాదములుండు పామువలె నేలం బ్రాకుజంతువు. దీనితోఁక మెఱ్ఱగనుండెడిఁ గాన సంస్కృతంపుఁబేరు 'రక్తపుచ్ఛిక' యని వాడి యున్నారు.

ఊర్ధ్వకాయమున (అనఁగా నాభికిఁ బైభాగమున) నెచ్చటనైనఁబడి క్రిందికి దిగినను, ప్రాకినను, జయ మనియు, పైకెగఁబ్రాకి యెక్కినను, తాకి నను, నాకినను, నాపదలసూచక మనియుఁ జెప్పఁ బడినది. మఱియును వీపుపైఁబడిన భాగ్యమనియు, మూఁపుపయిఁబడినచోఁ దనస్వస్థలమును వీడి యన్యస్థలమునకుఁ జేరనగుననియు, కుడిమెడమ రెక్కలపైఁ బడిన తనకాపురము చెడుననియు, పాటుకు ఫలములుగఁ జెప్పఁబడినది.

మఱియును శరీరముయొక్క యధోభాగమునఁ (అనఁగా నాభికిఁ గ్రిందిభాగమునఁ) బ్రాఁకినను, నాకినను, ఎక్కినను, చుట్టినను, ఫలములు చెప్పఁ బడలేదు. ఇది సమగ్రమగు శాస్త్రమును కాదు.

## రక్తపైత్త్యము:

—ఆంగ్ల. Hoemorrhage. ముక్కువెంటఁగాని, నోటివెంటఁగాని పైత్యోద్రేక సమయముల రక్తముపడఁ జేయుజబ్బు.

## రక్తమునందలి లవణము:

— రక్తముప్పగ నుండును. అది లంగ్సునుండి తిరుగ వచ్చు తఱి నాక్సిజెను నచటఁ గైకొనుంగాని, యది శరీర మం దుపయోగింపఁబడుచుఁ గడకుఁ దగ్గిపోవును. తిరుగఁదలలో కార్బన్ డి ఆక్సైడు తిరుగ లంగ్సు నకుఁ గొంపోవఁబడుచుండును. అది రక్తమునందున సాల్టుతోఁగలసి గాని, యాపని జరుగనేరదు. గాన రక్తమునందుంట శరీరజీవితము కవసర మగు చున్నది. ఇది భోజనముతో లోని కరుగవలసి యుండునని వేఱుగఁ జెప్పనక్కఱయుండదు. ఆయు ప్పున కాంగ్లరసాయనశాస్త్రవిదులు 'Sodium Carbonate' అని పేరిడియున్నారు. అదియే సర్వసాధారణముగ 'Washing soda' యనఁ బడుచున్నది. ఇది కాంపౌండు అనఁగా Compound of metal sodium, and Carbon de oxide అని చెప్పఁబడియున్నది.

ఇట్టిదే 'Sodium bi carbonate' అను లవణ మింకొకటి కలదు. దీనినే 'Baking soda' యనెదరు. పరిశీలనలనుండి బహిఃప్రపంచమున నీరెం డులవణములంగూర్చికొన్నిపరిస్థితులందు simple కార్బనేటు కార్బన్ డి ఆక్సైడును గైకొని, కల్పు కొనుటతోఁ బైకార్బనేటుగ నగుననియు, మఱి కొన్ని వేఱుపరిస్థితులందుఁ బైకార్బనేటు తనయం దున్న కార్బన్ డి యాక్సైడులోని సగభాగమును పోల్పోయి, వదలివైచి, తాను simple Carbonate అగుచుండుననియుఁ దెలియుచున్నది. (హేమోగ్లోబిన్ చూడుఁడు, రెడ్ సెల్సు చూ డుఁడు, సెల్సు చూడుఁడు).

శరీరమునందలి రక్తమంతయు నొకేవిధముగ ద్రవపదార్థమై యుండను. అందు గుండ్రనిగోళ ములుగఁ బరమాణువులు చేరియుండెడిని. వాటి నాంగ్లమున 'Corpuscles' అని పేరిడియున్నారు. ఇటీవల నొక జర్మను రసాయనశాస్త్రపరిశోధ కుఁడు రక్తగోళములు (Blood Corpuscles)

శరీరరక్తమున లవణమున్నంతఁదనుక నటులగుండ్రని యాకారములం గల్గి, గోళములుగ నుండు ననియు, లవణము తగ్గిపోయినతఱిఁ బలుచఁబడి, బిళ్ళలవలె నగుచుండు ననియు (flat), కనిపెట్టి వెల్లడించి యున్నాఁడు. ఇటుల లవణము రక్తమునందుఁ దగ్గి పోయినతఱినే, వెలుపలనుండి తాఁకెడి వేఁడి గాడ్పు, ఎండ మొదలగునవి శరీరమున కధికబాధ కరములై యుండెడినఁటఁ గాన ననుదినమును భోజనపదార్థములలో లవణ మిడుచు, లోనికిఁ దినుచుండుట కేవలము రుచికేగాక, వైద్యశాస్త్ర రీత్యా యత్యావశ్యకమని యున్నారు.

కొన్నియుష్ణదేశములం దీబాధ శరీరముల కధికమై యుండునఁట. అత్తఱి నచ్చటివా రెండవేళలఁ జిటికెడు లవణము నోటనుంచుకొని, జలములం ద్రావుట శ్రేయమని చెప్పఁబడుచున్నది. చెమట నుండిఁ గూడఁ గొంతలవణము శరీరరక్తమునుండి బయటికి వెడలుచుండునని మరువరాదు. అల్పాచమానమునుండియుఁ గొంతలవణము బహిర్గత మయ్యెడిని.

**రక్తవర్షము:**—ఇచట రక్తము కాదు. ఎఱ్ఱని రంగుగల వర్షమని యర్థము. దీని నాంగ్లమున 'blood rain' అందురు. గాని యది సరియగు పదము కానేరదు. ఇటలీదేశమున మధ్యధరాసముద్రతీరమున నిట్టియెఱ్ఱనివర్షము పడుచుంట నప్పట ప్పట సంభవించుచుండుననియు, నది సహారా యెడారినుండి గాలిచేఁ గొట్టుకరాఁబడిన ధూళితో వర్షఁపుఁజినుకులకుఁగల్గిన సాంగత్యమున నిట్టిరంగు గల్గెననియుఁ బరిశీలనలవలనఁ దేలినది. బ్రిటీషుదీవులందుఁగూడ నిట్టియెఱ్ఱనివర్షము పడుట మిక్కిలి యరుదుగ సంభవించుచుండునని యందురు.

**రక్తవాతము:**— ఇది కుష్ఠురోగభేదములలో నొకటి యందురు. శరీరమున రక్తము సహజలక్షణముల సరిగాఁ బ్రసరించి ప్రవహించుచుండక, శరీరమం దచ్చటచ్చటఁ గూడి, నిల్వయగుచు, వాచుచు, నెఱ్ఱఁబడుచు, పోటుఁగల్గించుచుండు

**రక్తవిరేచనములు:**—
(అమీబా చూడుఁడు-రక్తాతిసారముఁజూడుఁడు.)

**రక్తష్ఠీవి-సన్నిపాతము:**—
(సన్నిపాతదోషము చూడుఁడు.)

**రక్తాతిసారము:**—ఇది జిగటవిరేచనముల జాతికిం జెందిన యామాతిసారరోగభేదము.

రక్తవిరేచనములం గల్గించుజబ్బు, (ఆమాతిసారము చూడుఁడు. అమీబా చూడుఁడు.)

**రక్తష్ఠిసన్నిపాతము:**—
(సన్నిపాతదోషము చూడుఁడు.)

**రఖుస్థల్:**—
(రావణాసురుఁడు చూడుఁడు.)

**రఖుస్థల్:**—దీని కాదిపేరు రావణహ్రద మనియు, రాక్షసతల మనియు నుండెను. సింహాల ద్వీపాధిపతి రావణభూపతి యిచట నాశ్రమ మేర్పఱుచుకొని గొప్పతపం బొనర్చి సామగానముచేఁ గైలాసాచలవాసుండగు పరమేశ్వరునికడ వరము లందుటనుండి రావణహ్రద మనియు, తలా వనిక నుత్తరదేశభాషలందు సరస్సున కర్థముగాన రాక్షసులసరస్సని చెప్పుటకు రఖుస్థల్ అనియు, రాక్షసతలమనియుఁ బేరులయ్యెను. ఇట్టిదేయగు మానససరోవరము మాంధాత (మహారాజు) మహర్షి చే దేవతాపక్షావలంబులగు వారికైఁ బవిత్రపఱుపఁ బడియె. ఆప్రాంతముననే గరళమాంధాతపర్వతమున నొకగుహయందు మాంధాత యస్తులు కలవు.

రావణహ్రదము, మానససరోవరమును మానసమై శాల్యముగలవిగనే గన్పించెడిని. భరతదేశమునుండి కైలాసశిఖరదర్శనమున కేగుయాత్రామార్గమున, తకలాకోటనుండి పదిమైళ్ళదూరమునను, అల్మోడా నుండి ౨౧౧ మైళ్ళదూరమునను నుండును. రెండు సరస్సులకు నడుమదూరము రెండు లేక మూఁడు మైళ్ళుండెడిని. తకలాకోటనుండి కైలాసగిరి కేగు మార్గము రెండుసరస్సుల నడుమనుండియే యేగును. ఈ రెండుసరస్సులును టిబెట్టుదేశము లోనివే.

రఖుస్థల్ సరస్సునడుమ నొకద్వీపము కలదు. అది తొల్లింటిరావణభూపతి తపం బొనర్చిన యాశ్రమ మందురు. అం దిప్పుడొక బౌద్ధభిక్షువు వసించు చుండును. ఆయన యాపాంతములవసించుహంసలగుడ్లులదొలకలం జేర్చి యందు నిల్వఁజేయు చుఁడు నందురు.

రావణహ్రదముయొక్క అంచులు (ఒడ్డు) పలువంకరలు తిరిగి చుట్టుకొలత యధికముగఁ దన రును. దీనియం దనేకద్వీపములుండి, కడు రమ్యమై కాన్పించును. దీనిలోతే౧౭దియడుగులని చెప్పఁబడి నది. ఉదకము లతిశీతలములు, మాధుర్యములు, కడురుచ్యములునై యుండును. దీనియుత్తరదిశను, వాయవ్యదిశను, విస్తారము బురదనేలలు నీటిని బైకిఁ జిమ్ముచుండిని. మఱియు నది బుడుగులం గల్గి, పెక్కునీటిబుగ్గ లీసరస్సునంబంధమున నేర్పడి, వాటిజలములు చిన్నవగు రెండుప్రవాహములుగ నేర్పడి, పశ్చిమముగా శతధృ (ఇప్పటిశెట్లజ్) నది గను, తూర్పుగా బ్రహ్మపుత్రానదిగను నేర్పడును.

రాక్షసతలసరస్సును టిబెట్టుదేశస్థులు 'లాగాం' గని యనెదరు. అది సముద్రపునీటిమట్టముపై ౧౪౯౦౦ అడుగులయెత్తుప్రదేశమునం దున్నది. (మానససరోవరము చూడుఁడు. అనవతప్తసరస్సు చూడుఁడు).

**౧౨౫:—**

(ఔతథ్యఉపగణము చూడుఁడు.)

**రఘుమహారాజు:—** ఇక్ష్వాకు సంతతి సూర్యవంశక్షత్రియుఁడు. తండ్రి దిలీపమహారాజు. కుమారులు కల్మాషపాదుఁడు, శంఖణుఁడు నను వారలు.

ఈతఁడు గొప్పక్రతువు లొనర్చినవాఁడును, జయశీలుఁడును నగుగొప్పమహారాజని ప్రతీతి. ఈతనివలన నీతనసంతతికి రఘువంశము పే ర్వచ్చెను.

**రఘురామావతారహస్తము:—**

(రామావతారహస్తముచూడుఁడు,అభినయము-భరతశాస్త్రము—హస్తాభినయము—చూడుఁడు.)

**రజస్సు:—**అనేనస్సునంతతి. కుమారుఁడు త్రికకుత్తు.

**రజి:—**తండ్రి ఆయువు. పితామహుఁడు పురూరవుఁడు. సోదరుఁడు నహుషమహారాజు. సుతు లేనూర్గురనియు, వారందఱు నింద్రునిచేనిహతులైరనియుఁ జెప్పఁబడినది.

**రజితపురము (ఉడిపి):—**

(తులుదేశము చూడుఁడు— ఆనందతీర్థస్వామి చూడుఁడు).

**రజుఁడు:—**ప్రియవ్రతునిసంతతి. తండ్రి విరజుఁడు.

**రట్లం సంస్థానము:—** సెంట్రలిండియా యేజన్సీసంస్థానములలో నొక చిన్నసంస్థానము. రట్లం పురము రాజధాని.

**రణశిల:—**
(గయ చూడుఁడు-దేవీధురము చూడుఁడు).

**రత్నగిరిజిల్లా:—** దీనిని దక్షిణకొంకణ మందురు. రత్నగిరిపురము ప్రధానస్థానము.
(బొంబై రాజధాని చూడుఁడు.)

**రత్నపురము:—**
(లంకారాజ్యము చూడుఁడు).

**రత్నపురుషచెట్టు:—** లా. Viola suffruticosa. దీనిని నేలకొబ్బరియని కొందఱనెదరఁట. దీని సమూలరస కషాయ చూర్ణములు మూలవ్యాధి నడచి, వీర్యనష్టదోషము నివారించి, మూత్రమును వెడలించి, సెగరోగమును మాన్పి, మిక్కిలివీర్యవృద్ధి, బలముఁ గల్గించునని చెప్పఁబడినది. నూరి పైనరుద్దుచుండిన ఁోదకాలిరోగము నయ మగునని యందురు. చక్కనిధాతుపుష్టిం గల్గించును.

**రత్నము:—** లా. Gemma. ఆంగ్ల. Gem. ఫ్రెంచి Gemme. సం. రత్నం. రత్నములు తొమ్మిదిగఁ జెప్పఁబడినవి. అవి వజ్రము, వైఢూర్యము, మరకతము, మాణిక్యము, కెంపు, పచ్చ, ముత్యము, నీలము, పగడము ననునవి. రత్నశబ్దమునకు స్వజాతియందు శ్రేష్ఠత్వ మర్థముఁగాన రాళ్ళజాతియందు స్వజాతిశ్రేష్ఠత రత్నముల కారోపింపఁ బడినదని స్ఫురించెడిని. పాశ్చాత్యదృష్ట్యా రత్నము లనేకములు కలవు. అవి Amethyst - Garnet - Aquamarine - Blood stone - Sardonyx - Peridot - Turquoise - Opal - Pink lourmaline - Agate - moonstone - Jasper - Onyxe మొదలగున వన్నియు రత్నములుగనే పరిగణింపఁబడి, యాకారములు కుదర్పఁబడి యాభరణములం దమర్పఁబడుచున్నవి.

ఇది యిటుండ రత్నశబ్దమునకు స్వజాతిశ్రేష్ఠత యర్థముగాన శ్రేష్ఠమగు వాట్లకు రత్నమనుట వాడుకలోనికివచ్చెను. ఇటులనే బౌద్ధమతధర్మమునఁ బ్రధానమనోవృత్తులం దెల్పుమంత్రత్రయమగు "బుద్ధం శరణం గచ్ఛామి; బోధం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి" అను మాటకిని రత్నత్రియమని పేరయ్యెను. మఱియు నిటులనే యొకప్రసిద్ధకవిపుంగవుఁడు జనకతనయను కాంతా రత్న మనియు, వసంతకాలమును కాలరత్న మనియు మొదలగుసంగతులను నుడివియున్నాఁడు.

ఇంక నీరత్నముంగూర్చి వివరించుతఱి వాట్లను సానఁబట్టుట వివరింపఁబడఁ దగినది. సానఁబట్టుట యన కళకాంతు లెక్కువయై సంపూర్ణప్రకాశము తల్లులతోఁగలుగునటుల ముఖములను లేక పలకలనుగోయుటయని యెఱుంగునది. ఈసానఁబట్టుట, పవడమునకు, ముత్యమునకు వేఱువిధముగను, తక్కినరత్నసముదాయమున కంతకును వేఱువిధముగను నుండెడిని. పవడమున కొకయాకారముఁ దెచ్చుటకన్న వేఱుగ ముఖములు పలకలుగఁ బట్టరు. ముత్తియమును సానఁబట్టుట ద్వివిధము. గుండ్రనియాకారముం గుదిర్చి గుబురుల సరఁగఁ దీయుట యొకటియు, పైనుండి క్రిందికిఁబడు నీటిబొట్టుఁ (జలబిందువుం) బోలి కోలగనుండు రూపముం (drop) గుదుర్చుట యొకటియునై యుండును. ఇవి హారములుగ నుపయోగించునవిగను, ఆభరణముల నమర్చునవిగను వీట్లకు నడుమ నుండి రంధ్రములు వైచెదరు. ఇటీవల హారము

నందుండు ముత్తియముల నొకరీతి లోత్తులవలె ముఖములం గుదుర్చుటయు నారంభమయ్యెను. ఇది యాంగ్లనాగరికతాఫలితము. ఇంకఁబవడమును గొప్పగొప్పవారియిండ్ల మంచఁపుఁగోళ్ళు, [ ]కాలి పావకోడు, గొడుగులు మొదలగువాట్ల కుపయోగించుచుంట సుప్రసిద్ధమే.

ఇంక ముఖములుగఁ గోయఁబడురత్నములం గూర్చి వివరించుటయనన ప్తవిధములుగ సానఁబట్టు విధానములు నెఱింగించుటయే యగును. ఆకోత లిక్కాలమున నాంగ్లవిధానమునకు స్వాధీనమై యుంట నొకప్రసిద్ధవిద్యానిధి వీట్లను వివరించిన మాటలను తొలుత వివరింతునుగాక.

పాశ్చాత్యపద్ధతిమేరకు రత్నఁపుఁగోత లనేకము లున్నను నందుఁ బ్రధానవిధానములు (1) Brilliant Cutting (2) Rose Cutting (3) Briolette Cuttıng (4) Star Cutting (5) Trap or Step Cutting (6) Table Cutting (7) Dome shaped Cabochou Cutting అని యేడు విధములు.

(1) Brilliant cutting:—to cut a flat octagonal table sorrounded by 32 smaller facets sloping to the girdle The lower part is pyramidal 24 facets sloping to the flat culet-

A half brilliont is only faceted from girdle to table having a flat base.

(2) Rose cutting:-దీనిని కమల మందురు. to cut like a half brilliant- the top being cut into six or more trangular facets of uniform size with falt back.

(3) Briolette Cuttig:— to cut like a pear and to coqer it (in cuttig)with trangular facets having no table, girdle, or culet.

(4) Star Cutting:— This cutting is a combination of brilliant cutting and rose cutting - but will have facets in groups of 6 in number as space allows.

(5) Trap Cutting:—This is also called step cutting - Thise are mostly rectangular and will have long facets which are flat, they will be parallel to the girdle.

(6) Table Cutting;— This is either double pyramids of four sules or regular octahedra with large table and culet either equall or varying in size:

(7) Dome shaped cabochon cutting:— This is a convex like cutting the convexity may be equall or dissimilar on both faces or the base itself shall be flat.

ఈయేడువిధములగు కోతలందుఁ జేయఁబడు తీసివేయుటలు, తగ్గించుటలు, అసలురత్నమునకు సాధ్యమగునంతవఱకు లోపము, నష్టము, వెలితి రాకుండునటుల విధిలేనితఱి నారోపింపఁజేయఁబడి లేక యొప్పుకొని యుంచఁబడిన కళంకములు. అన్నియుఁగూడ రత్నముయొక్క యాకారసౌందర్యమును పోషించుటకేయని చెప్పఁబడినది.

కమలము లేక Rose Cutting నందు మంచి వజ్రమైనచో నూరుముఖములుగూడఁ గోయుదురు. ఇది యెక్కువ పనితనముగ నెన్నఁబడును.

**రత్నములు** (Precious stones):— పాశ్చాత్యవిజ్ఞానమున రత్నములకు విలువగల రాళ్ళని యర్థమిచ్చుపదములను వాడుచుందురు. గాని నిజమున నివి రాళ్ళయందు మినరల్సు గాని, రాళ్ళు కానేరవు. మినరల్సు రాళ్లలోఁ గలిసి యున్న పెక్కు Constituents లో నొకటి గాని సంపూర్ణముగ stone గానేరదు. కాని వాటియందు మినరల్సు చాల తక్కువభాగమే

యుండెడిని. మఱియు నాతక్కువభాగ మపరి శుభ్రమై యాకారరహితములగు Crystals గ నుండును గాని సంపూర్ణ లక్షణయుక్తమై యుండఁ జాలవు.

పాశ్చాత్యవిధానమున రత్నపరీక్షయం దందము, స్వచ్ఛత, ఆకారవిధి ముఖ్యములు. గాన వాటిం గల్గించిన మాతృకలగు minerals గూర్చియు, కల్గెడి యాకారములంగూర్చియు, నెఱుంగవలసి యుండును గాన, వీటింగూర్చి తెల్పెడు కళకు Crystallo graphy తో నెక్కువసంబంధ ముం డును. Mineral పదార్థములు స్వచ్ఛములుగ ఘనీభవించుతఱి, చిన్నవిగ నుండినను పెరుఁగుటకు వీలగునటుల వలయు నేర్పాటులమేరకుఁ దనస్థితిం గైకొనియే యుండునని పరిశీలనలవలనఁ దేలు చున్నది.

Crystalline quartz రూపమున తఱు చుగ Selicon eliment యొక్క oxide అగు Selica దొరకుచుండెడిని. ఇదియే యింకను igneous rocks నందునను, ఇసుకలయందునను ప్రధానద్రవ్యమై యుండును. మఱియు నీసిలికా గ్రెనైటు రాళ్ళయందుండుతఱి విధాన మొకటి లేని crystals గా నపరిశుభ్రపదార్థయుక్తమై యుండును.

Ordinary Quartz రూపమునను, mil- key quartz (క్రొవ్వురాయి తెల్లనిది) రూపము నను, ఇందే విలువయునుండదు గాని Igneous rocks లోని వెలుతులంజుట్టి వింతవింత cry- stals గా నేర్పడుతఱి వాటియం దచ్చటచ్చట 'Topaz' అనునవి యేర్పడుచుండును. వాటికిఁ గొంతవిలువ కలదు. ఆవెలుతులంముఁ దొల్లి యొ కప్పు డేవో gasses ఉండియుండి, వీట్ల నిర్మేర్ప డఁజేసియుండునని తలంపఁబడుచున్నది.

Semi pricious stones జాతులం దెల్ల డల quartz ప్రధానద్రవ్యమై దనరెడిని. స్వచ్ఛ తమంగల్గిన rock crystals (స్ఫటికములు) ను, Purple amethyst రాళ్ళును, Brown eairngorm అనంబడురాళ్ళును, నధమంపుజాతి విగ Pricious stones నందుఁ బరిగణింపఁ బడుచున్నవి.

అధిక మూల్యమునకు నమ్మఁడుపోవు రత్న ములు తఱుచుగ దొరకునవి గాక, అరుదుగ దొరకునవిగా నుండును. వీటికి విలువఁగల్గుట యన Commercial Valu గల్గుటయే గాన, ఎక్క డనో కొన్నితప్ప తక్కినసర్వరత్నములు సాధారణ ముగ నవలక్షణయుక్తమై యుండవలయును.

౧ స్వచ్ఛతఁగల్గియుండుట-(Transperancy).

౨ బీటలు (Cracks) వారకనుండుట.

౩ లోన బుడగలులేకుండుట- (Clean, and Clear).

౪ అపరిశుభ్రపదార్థములు లోసిమిడి యుండ కుండనుండుట-

౫ ప్రకాశముఁ (brilliant sparkle) గల్గి యుండుట-

౬ అర్హమగు మంచిరంగుఁ గల్గియుండుట-

౭ కఠినత (hardness) గల్గియుండుట-

౮ కెమికల్సునకుఁ జెడక నాగియుండుట-(power to resist chemical wear).

౯ అరగిపోక నిలచియుండుశక్తిఁగల్గియుండుట- (power to resist wear phigsically)

ఇవి నవలక్షణములు. ఇన్నియుండినను రత్నము కొతకుఁ బనికిరానిది యగునేని యారత్నము నిర ర్థకమైయె యమూల్యమే యగును.

రత్నములం దెక్కువయైనది వజ్రము. దీనిని "రత్నరాజ" మనెదరు. వజ్రములు, పచ్చలు,

కెంపులు, నీలములు, నిజరత్నములుగ "True precious stones" అని చెప్పఁబడినవి. మఱి యుఁ గొందఱు వీటిని 'aristocrates among jewels' అని చెప్పుటయుఁ గలదు. ఇవి యుత్తమ జాతిగ నెన్నఁబడు చుండెడిని. తఱుచుగ నివి మంచి విలువఁ దెచ్చుచుండును.

మధ్యమజాతిరత్నము లాకారఁపువయ్యారములు, కోతపనితనములు, స్వచ్ఛతయుం గల్గినచో నాయ తిశయములనుండి విలువఁగలవి యగును. తక్కినవి యధమఁపుజాతులు పెక్కు గలవు.

ఈవిధానముమేరకు Topaz, Opal, agate, Blood stone, Rock crystals, amethy-st, Brown cairngorm మొదలగునవన్నియు రత్నముల తెగకుఁ జెంది, 'Precious stones' అనుపేరనేబరఁగెడిని. (వాట్లంగూర్చి యాతావులం గనవలయును).

ఎఱుపుపగడములు, ముత్యములు, నీవిధానమున precious stones గా పరిగణింపఁబడలేదు. ఐనను ముఖములు కోయఁబడినవాటిని 'Gems' అనునటులనే ఎఱ్ఱని పగడములను, ముత్యములను గూడ 'జెమ్సు' అని వాడెదరు. ఇంత వఱకింకను గనిపెట్టఁబడినరత్నములు 1 Garnet, 2 aqra, marine, 3 Cats, eye, 4 sardonyx, 5 Pe-ridot, 6 Turquoise, 7 Opal, 8 pink, Tourmaline, అనునవిగూడ నీసందర్భమునఁ జెప్పఁదగినవి కలవు. ఇంకను గొందఱు moon-stone కూడ 'gem' అనియే యందురు.

**రత్నములు - దేవీనవావరణ పూజ యందైదు విధములు:—** ౧ స్వర్గరత్న, ౨ గగనరత్న, ౩ మర్త్యరత్న, ౪ నాగరత్న, ౫ పాతాళరత్న ములని యైదు కలవు.

నవరత్నములు:— వజ్రము, వైఢూర్యము, గోమేధికము, పుష్ప (లేక) పుష్యరాగము, మరకతము, మాణిక్యము, పవడము, నీలము, ముత్యము. ఇవి ప్రసిద్ధమగు రత్నములు.

**రత్నసభ:—** (చిదంబరము చూడుఁడు, పేరూరు చూడుఁడు. తిరువెలంగాడుచూడుఁడు.)

**రత్నసానువు:—** మేరువుపర్వతమునకుఁ బేరు. రత్నఁపురాళ్లు చరియలుగాఁ గలది యని భావము.

**రత్నాకరనది:—** ఇప్పుడు కానానది యను పేరఁబరఁగుచు బంగాళములోని హుగ్లీ జిల్లా యం దున్నది. ఈనదిపై కానాకులకృష్ణనగర ముండెను. అట ఘంటేశ్వరశివలింగము కలదు. దీనిప్రశంస మహాలింగేశ్వరతంత్రమునఁ గలదు.

**రత్నాలన్నీ యొకచోట - నత్తగుల్ల లన్నీ యొకచోట:—**
(ఆంధ్రలోకోక్తి)

**రతియెత్తు (గురిగింజయెత్తు):—** మూఁడుయవలయెత్తు (యవప్రమాణము చూడుఁడు.) ఒకరతి యనియు, ౾ రతుల నొకఅణా యనియు, ౧౦ రతులయెత్తు మాషప్రమాణ మనియుఁ జెప్పఁబడినది. (ఆయుర్వేదమానము చూడుఁడు).

**రతికాయనగోత్రము:—**
(నిధృవగణము చూడుఁడు.)

**రతితాళము:—**
(తాళములు చూడుఁడు.)

**రతీదేవికి మన్మథుఁడు; మన్మథునకు రతీదేవి తగిన జోడా:—**
(ఆంధ్రలోకోక్తి.)

(తాళములు చూడుఁడు.)

**రతీదేవి:—**
మన్మథునిభార్య. (మన్మథుఁడు, ప్రద్యుమ్నుఁడు చూడుఁడు.)

**రథవడవాన్యాయము:—** బండికిఁ బూచిన రెండుగుఱ్ఱములు నొకదానితో నొకటి కలసి పనిఁజేసిననే యాబండి లాగఁగలవు. ఐకమత్యము, నన్యోన్యసహాయము, ప్రతికార్యమునకుఁ బ్రధానమని భావము.

**రథసప్తమి:—** మాఘశుద్ధసప్తమి. సూర్యపూజ లొనర్తురు. సప్తమి భానువార మయ్యేనేని భానుసప్తమి. చాల పవిత్రముగ నెంతురు. హిందూగృహములస్త్రీలు సూర్యపూజ లొనర్చి, చిక్కుడుకాయలరథములం జేసి, చిక్కుడాకులలో క్షీరాన్ననివేదనము లొనర్తురు. సూర్యచంద్రవ్రతము నుగూడ రొనర్తురు. (పండుగలు చూడుఁడు.)

**రథస్థానది (రఫ్తీఐరావతి):—** రఫ్తీ(ఐరావతి) నది కీపేరు కలదు. ఇది యయోధ్యపరగణాలలో నున్నది. దీనిప్రశంస మహాభారతము-ఆదిపర్వము ౧౭౨ గలదు.

**రథ్యాదీపన్యాయము:—** బండికిఁ దగిల్చిన (లాంతరు) దీపములు బండినడచుతటిఁ గ్రొత్తవి వెలుఁగులోనికి వచ్చుచు నదివఱకే వెలుఁగులో నున్నవి వెన్కకుఁ జీకటిలోని కరుగుచున్నట్లు మార్గగమనము నడుచునని భావము.

**రథికుఁడు:—**
కురువుసంతతి. జయత్సేనునిసుతుఁడు.

**రథితర లేక వైరూప ఉపగణము:—**
ఇదియాంగిరస సంతతియందలి కేవలాంగిరసగణములోని యొక యుపగణము. దీనిని వైరూప ఉపగణమని కొందఱు వాడుచుందురు. ఇందుఁ బదునాఱుగోత్రములు చెప్పఁబడినవి.

| | |
|---|---|
| ౧ అష్టదాంష్ట్ర, | ౯ రథితర, |
| ౨ ద్వాయన, | ౧౦ వైరూప, |
| ౩ దానక, | ౧౧ విరూప, |
| ౪ నైతదాక్షి, | ౧౨ వైరూప్య, |
| ౫ పృషదశ్వ, | ౧౩ శైలాలి, |
| ౬ భిలి, | ౧౪ సాహత, |
| ౭ భిలీబాయన, | ౧౫ హస్తి, |
| ౮ భైక్షువాహ | ౧౬ హేమగవ. |

ఈరథితర లేక వైరూప ఉపగణమునందలి ౧౬ గోత్రములకుఁ బ్రవరరూపములు:—

౧ ఆంగిరస, వైరూప, రథితర.
౨ ఆంగిరస, వైరూప, పార్షదశ్వ.
౩ అష్టాదాంష్ట్ర, పార్షదశ్వ, వైరూప.
౪ అష్టాదాంష్ట్ర, వైరూప, పార్షదశ్వ.
౫ ఆంగిరస, విరూప. (ద్వ్యార్షేయ ప్రవర)
౬ ఆంగిరస, బృహదశ్వ, వైరూప్య.
౭ ఆంగిరస, ప్రిషద, వీతహవ్య.
౮ ఆంగిరస, పార్షదశ్వ, వీతహవ్య.

**రథీతర (రథితర) గోత్రము:—**
(రథితరయుపగణము చూడుఁడు).

**రథీతరుఁడు:—** మరీచిసంతతి, సూర్యవంశక్షత్రియుఁడు. తండ్రి విరూపుఁడు. పితామహుఁ డంబరీషుఁడు. ఈతఁడు బ్రాహ్మణుఁడై నందున నీతనిసంతతివారు రథీతరులు లేక రథీతర గోత్రబ్రాహ్మణులు.

**రన్ ఎవే విత్ ది హారో** (Run away with the harrow) ఆదరణగాఁ జూడక పోయిన తఱి నంకెసది లంకించుకొని పాఱిపోయె ననుట కీయుక్తిని వాడుచున్నారు. గుఱ్ఱముల నాగలి కింబూన్చి యున్న దేశములందు గుఱ్ఱముకుఁ దిండి సరిగాఁ బెట్టనిచో నది తప్పించుకొని పాఱిపోవుట కర్థము. దాని మెడనుండి harrow చులకనఁగా నీడ్చుకొని పాఱిపోఁగలదని భావము.

**రన్నర్** (Runner):—వాణిజ్యపరిభాషా పదము. Run అన పరుగిడుట కర్థము. వాటాల యమ్మకమునకుఁగాను బర్విడుచుఁ బనిఁజేయు Broker నకు 'Runner' అనియు, Running broker అనియు ననెదరు. ఓడ రేవుల నిలచి యుండు దినములు గాకఁ బర్విడు చుండుదినములకు 'Running days' అనియు నందురు.

**రఫియాపని** (Raffia work):— ఒక జాతి తుంగ గడ్డియాకులను రంగులలో ముంచి, చిత్రవిచిత్రములుగ రంగులతో బొమ్మలు, చెట్లు, జంతువులువలె వచ్చున ట్లల్లుటకు 'రఫియాపని' యని పేరు. ఇట్టి పనులందుఁ దుంగతో బట్టలు, తట్టలు, తడకలు, చాపలు నల్లుదురు. కఱ్ఱచట్రము లందుఁ జుట్టి కన్నములగుండా బిగించియుండు నటులఁ బటములంగూడ నల్లుట నీమధ్యకాలమునఁ బ్రారంభమైనది. పని గట్టి కాకున్నను పనిచాల యందముగానుంట నలంకారార్థముగ గొప్పవా రుపయోగించుచుందురు.

**రఫ్తినది**:—

(అచిరావతి చూడుఁడు.)

**రబ్బరుచరిత్రము**:— ఇది యాంగ్ల పదము. దీనికిఁ జెఱుపునదియని యర్థము. వ్రాసిన వ్రాఁతను చెఱుపునది యనిభావము. పెన్సలుతోఁ గాని, సిరాతోఁగాని వ్రాయఁబడినదానిని చెఱిపి వేయవలెననిన రబ్బరుతో దానిపై రాచినఁ జెఱిగి పోవుటగా నెఱుంగునది. ఈపేరి ట్లేర్పడినను రబ్బరిక్కాలమున నింకను వేర్వేఱుపనుల కుపయోగించుటఁజేసి తనవిలువఁ గల్గియున్నది. ఇక్కాలమున దీని నెఱుంగనివా రుండరు.

దీనిచరిత్రంగూర్చి యోచించిన మనకుఁ దెలిసినంతవఱ కాదిని Anghiera నివాసులగు P. Martyr అను పేరుగలవారు వ్రాసినయొక పుస్తకమునఁ గొన్నియాటబంతులంగూర్చి తాను మెక్సికోదేశమునఁ జూచినటుల, నవి తుళ్లునవిగ వివరించెను. ఆకాల మేదైనను నాగ్రంథము క్రీ.వె.౧౫౨౫ లోఁ బ్రకటింపఁబడినది. అట్టిబంతులకు రబ్బరుబంతులని పేరు లేకుండనోపు.

౧౭౩౬లో దక్షిణయమెరికాకు

కంపఁబడినవారిలో నొకరగు La,Con iamine గా రారబ్బరుచెట్లనుగూర్చి వాటినుండి పాలుతీసి, రబ్బరుచేయుటంగూర్చి దక్షిణ యమెరికావారి విధానములను చక్కఁగ వివరించుచు, నెఱుకిపరచెను. పదునెన్మిదవ శతాబ్దాంతకాలమున రబ్బరు వ్యాపారముంగూర్చి ప్రియత్నములు ప్రారంభమయ్యెను. తొలుఁదొల్తఁ గరఁగించి బట్టల కలఁది 'వాటరుప్రూఫు'గాఁ జేయఁ బ్రయత్నించిరఁట. ఇది టర్పెంటైనునందుఁగరఁగునని కనిపెట్టిరి. ౧౮౨౩లో గ్లాస్గోనివాసియగు ఛార్లెసు మెకింటోషుగారు దీని దుర్వాసన హాపి, కోటులం జేసి, వర్షకాలమునఁ దడియనివిగాఁ జూపిరి. ౧౮౪౨-౪౩ గుడియర్ గా రమెరికాయందు గొప్పపరిశీలనలు సల్పి, గట్టిపఱచి బండిచక్రములకుఁ గమ్ములుగ నుపయోగించి చూపిరి. ఇటుల Thomas Haucock గారు వల్కనైజుఁ జేయుట నాసంవత్సరమే కనిపెట్టిరి. ఇటుల నీపరిశ్రమ దువ్వెనలునహా రబ్బ

రుతోఁ జేయఁబడుట కభివృద్ధినందియున్నది. ఇంక రబ్బరుయొక్క యుత్పత్తింగూర్చి యోచింతము.

విత్తనములం బ్రాతి నాటించి, మొక్కలం బుట్టించు విధానము వేఱుగ వ్రాయనక్కఱలేదు. అట్లుపుట్టినమొక్కలను రెండడుగులకన్న నెక్కువగ నెదుగనీయకఁ జిగురులను గోసివేయుచుందురు. అవి బలిసి 'stumps' అనుపేరఁబరఁగెడిని. వాటిని యకరమునకు డెబ్బదిచొప్పునఁ బ్రాతుదురు. అప్పటికే తోఁట పెరిఁగి నీడయగుననియు, నత్తటి మధ్యకొమ్మల నఱకి, యెండఁ బ్రసరించునట్లుఁ జేయవలసియుండుననియుఁ గొందఱనెదరు. తోఁట నాటుప్రదేశములం దదివఱకుండినచెట్లను నఱకి, యెండనిచ్చి కాల్చివేయుట మంచిది. కాల్చినప్రదేశమున నీచెట్లు చక్కఁగ వృద్ధినందునని కనిపెట్టఁబడినది. తోఁట చక్కఁగఁ బెరిగిన నైదాఱుసంవత్సరములలో మొదటినుండి యొకగజమెత్తున నిరువదియంగుళములచుట్టుకొలతఁ గల్గియుండునని చెప్పఁబడినది. ఇంతటినుండియుఁ బాలుదీయుట (Tapping) ప్రారంభింపవచ్చును.

ఓపిం గధికమైనను, న్వర్గవిధానమున జరుగక పోయినను, అడివి బలుపు బలిసి చెట్లు ఫంగా యిడురోగమునకుఁ బొల్పడును. ౨౦ నుండి ౨౪ అంగుళములవలముఁగలఁ జెట్టునుండి సంవత్సరమునందు రెండున్నర లేక మూఁడు ఎల్చిపౌనులదిండు రబ్బరుకావలసినపాలు వచ్చునని లెక్కింపఁబడినది. పాల కాంగ్లమున 'Latex' అనెదరు. నేర్పరి పనివాఁడు మూఁడువందలచెట్లను గీయఁగలఁడందురు.

ఆదిని రబ్బరు మెక్సికో, బ్రెజిలు దేశముల నుండి మాత్రమే వచ్చుచుండెడిది. ఇక్కాలమునఁ బెక్కుదేశములం దీతోఁటలు నాటఁబడియుంటఁ గాననగును. మోటారుబండ్లవ్యాపార మధికమౌటతో రబ్బరుయొక్కయవసర మధికమైనది. ఈపనిని బైసికిల్సు ప్రారంభించినవని చెప్పనగును.

ఆదికాలమున స్పానియాదేశస్థుఁడగు పిజ లేక పెరూయనునాయన యిప్పటి పెరూదేశమును జయించి, యాక్రమించెనఁట. ఆయననుండియేయాదేశమున కాపేరు గల్గినదని చెప్పఁబడినది. ఈయనపాలనము క్రీ. వె. ౧౪౭౧-౧౫౪౧ యని చెప్పఁబడినది. ఈస్పానియావారు రబ్బరునుగూర్చి యెఱిఁగియుండియు, నతిరహస్యముగ నుంచి, దాని యమ్మకఁపులాభమును వారే యందుచుండిరి. క్రీ. వె. పదునెన్మిదవ శతాబ్దపు మధ్యకాలమువఱకుఁ బ్రాన్సుదేశఁపురసాయనవేత్తలకు రబ్బరుంగూర్చి తెలియనేలేదఁట. ఇది బహుశః ఇండియారబ్బరుంగూర్చి కాకుండనోపు.

**రబ్బరుబంతి త్రుళ్లుట:—** రబ్బరుబంతి గట్టిముక్కయగునేని తుళ్ళుటకుఁ గారణ మిది. రబ్బరు సాఁగదీసిన సాఁగునట్టియు, వడచిన నణఁగునట్టియు (Elastic) పదార్థము. దానిని నేలకుఁ గొట్టినపుడు కఠినమగుభూభాగమునకు [కొట్టిన దెబ్బయొక్కబలము [force] వలన] నొత్తుకొని భూభాగమునకుఁ దాకినదానిభాగము నడఁగునట్లు చేయును.

అణఁగినను, సాఁగినను, వీలగునంత త్వరగ దానియథారూపమునకు మరలుశక్తి రబ్బరునందుఁ గలదు. ఆశక్తి యడఁగినరబ్బరుబంతిభాగమును తోడనే విదల్చి పూర్వరూపము నందింప విజృంభించును. దానితో బంతి విదల్చిన యూపునకుఁ బైకిఁ దుళ్ళును.

బంతి గుల్లయై లోన గాలియుండునేని రబ్బరుచే నావరింపఁబడినగాలి రబ్బరుచేయు పనినే తానును జేయనై యుండును గాన నిందుకుఁ దాను బాధ్యత వహించియే యుండును.

బంతి కొకప్పుడు రంధ్రము పడునేని లోపలి గాలి పూర్తిగా రబ్బరువలన నావరింపఁబడియుండ

దని భావముగాన రబ్బరుకుండుశక్తిని తాను గల్గియుండఁజాలదు. గానఁ దుర్నిర్ణయమైనట్టి సరిగా జరుగదు. పూర్తిగా నావరింపఁబడియుండునేని రబ్బరు లక్షణములే గర్భమునందున్న గాలికిని సిద్ధమగును.

ఇట 'రబ్బ' రను నాంగ్లపదమునకుఁ జెఱుపునది యనియర్థము. ఈపద మీగుణముంగూర్చి సరియగునది కాదని కనిపించుచున్నను, వేఱుపదము గానరాకుంట దీనినే వాడవలసియున్నది.

## రబ్బరుసొల్యూషను పరిశ్రమ Rubber solution:—

రబ్బరుసొల్యూషను చినిఁగిన రబ్బరు నడఁగా రబ్బరుబెల్టు మొదలగువాటి నతికి యంటించుట కుపయోగించుచున్నారు. గాన దీనియుపయోగ మిక్కాలమున నధికమనియే చెప్పవలయును.

Absolute alcohol — 6 భాగములు
Carbon disulphide — 100 భాగములు
Caoutchouc Q. S.

తొలుత నాల్కోహాలును, కార్బన్ డి సల్ఫైడ్డును చక్కఁగఁ గలపి పిదప నందు వలయునంత Caoutchouc కల్పుదురు. ఈమూలసూత్రము మనసునం దుంచుకొని పలు తెఱంగుల దీనిని జేయుచున్నారు. ఇది యొకవిధమగు బంకవలె నుండి, యారి బిగిసిపోవును. లేక వేఁడి తగిలినను గట్టిపట్టుఁ బట్టి బిగిసి యంటుకొనును.

## రబ్బరుస్టాంపులు చేయుపరిశ్రమ:—

ఈకాలములో రబ్బరుస్టాంపులు వాడుకచేయు నపేక్ష దినదినము నధిక మగుచుండుటచే నీపరిశ్రమ మిగుల లాభకరమయినదని చెప్పవచ్చును.

ఇది యొకసులభమైనవిధానము. దీనికిఁ గావలసినవస్తుసామగ్రియుఁ బరికరములును సంపాదించుటకు మిగుల వ్యయప్రయాసములు పడనవసరము లేదు. అందుచే నెవ్వరైనను తగుమాత్రఁపుమదుపుచే నీపరిశ్రమ నవలంబింప వచ్చును. కాని దీని వివరములు పూర్తిగాఁ దెలియుటమాత్ర మావశ్యకము.

ఇందులో మొట్టమొదటఁ జేయవలసినపని టైపులు సెట్ చేసికొనుట. తరువాతిపని వానిని మౌంటు [Mount] చేయుట. కూచూక్ అనఁబడునొక రకఁపురబ్బరుమీఁదఁ జెక్కఁబడు నక్షరములు చాల కాలమువఱకు మన్నుటకు మంచి కఱ్ఱదిమ్మపై మౌంటు చేయఁబడవలయును. ఈ క్రింద వివరింపఁబడిన యుపదేశములను మిగుల జాగ్రత్తగాను, చాకచక్యముతోడను, నాచరించిన నీపరిశ్రమ సామాన్యముగా నందఱికి నందుఁబాటులో నుండును.

ఈరబ్బరుస్టాంపులలో ననేక నమూనాలు కలవు. ఎట్టినమూనాప్రకారము చేయుటకైనను మంచిబుద్ధియు, చేతివాడితనముఁ గావలయును. అవి యలవడినయెడల నీపంక్తిలోనుండు పేరు స్టాంపుమొదలుకొని పెద్దపెద్దచక్రాకారములుగల వేరువేరు నమూనాలస్టాంపులైనను సులభముగఁ జేయవచ్చును.

### కావలసిన పనిముట్లు.

ఈవ్యాపారము ప్రారంభించుటకుఁ గావలసిన పరికరములు:— ఒకటిరెండు ఫాంటుల యచ్చు టైపులు, ఒకటిరెండు డక్షరముల బిగింపుచట్రములు, కొన్ని లెడ్లు, చిన్నముద్రణయంత్రము, లోహముచే నిర్మింపఁబడిన చక్కనియొక 'చేజు'. అనఁగా టైపు కూర్చు పరికరము.

స్టాంపులుచెక్కుట కుపకరించురబ్బరు, ఈపనికిఁ ప్రత్యేకముగాఁదయ్యారుచేయు నొకరబ్బరు కలదు. అది పరిశుభ్రమైనట్టియు, వల్కనైజు [Vulcanize] కాఁబడనట్టియు రబ్బరైయుండవలయును.

వల్కనైజు జేయఁబడుట కంతయు సిద్ధమైనదియై యుండవలయును. వల్కనైజు జేయఁబడిన రబ్బరు వాడుకచేయుటచేతనే యనేకులగు పనివాండ్రచేఁ దయారుఁజేయఁబడిన రబ్బరుస్టాంపులు పనికిరాకుండఁ బోవుచున్నవి. అది యనుకూలమగుదళసరి గలదియై యుండునట్లుఁ జూచుట యవసరము.

విధానముయొక్క ఆకారము.

ప్రారంభమునకు టైపు సెట్ చేయుటఁ గొంత కష్టముగా నుండును. కాని యభ్యాసమయినకొలఁదిని నేర్పువచ్చును. బిగింపుచేజు (chase) టైపు జాగ్రత్తగాను, గుత్తముగాను, సెట్ చేయఁబడవలయును. అది సరియైన మట్టములో నుండునట్లుఁ జూచుకొనవలయును. అచ్చుటైపెప్పుడు నద్దములోని ప్రతిమవలె వెనుకనుండి చదువఁబడదగినదియైయుండవలయు ననుసంగతి యందరెఱింగినదే గదా! కూర్చినవెనుక నక్షరములలోఁ బొరపాట్లు లేకుండ నద్దమునెదుటనుంచి చూచుకొనవలయును. తరువాత చట్రములో బిగింపఁబడినటైపున కవసరమగుచోట్ల జాగా (space) లు వేయవలయును. తరువాత టైపు పైమట్టముపై నెట్టి హెచ్చుతగ్గులు లేకుండ సాపుగానున్న కఱ్ఱబల్లను మోపి సరిచూడవలయును.

తరువాత నొకసీసాలో నాలుగౌన్సుల టర్పెంటయినుపోసి, దానిలో రెండుఔన్సుల సాంబ్రాణి చేర్పవలయును. లేదా యొక ఆలివ్‌తైలఁపుసీసాయైనను దీసికొని, యందులో నొకచిన్నకుంచె (Brush) ముంచి టైపుమీఁదిభాగ మంతయు నాబ్రష్‌తో శుభ్రముఁ జేయవలయును. అప్పుడు టైపులోని యవసరభాగములన్నియు నూడిపోవునట్లుఁజేసి మధ్యభాగములను బ్లాటింగ్ పేపరుతో నొత్తవలయును.



తరువాత నక్షరములకూరుచు చేజు (Chase) నటుంచి చట్రముయొక్క ముఖమునకును, లోనిభాగమునకును ప్లాస్టర్ కిన్ అంటుకొనకుండునట్లుగాఁ బైతైలపదార్థమురాసి తేలికగా శుభ్రపఱుపవలయును.

రెండుఔన్సులమంచిరకఁపు ప్లాస్టర్ ఆఫ్ పేరిస్ (Plaster of Paris) తో నొకఔన్సు ఫ్రెంచి సుద్దను కలిపి ప్లాస్టర్ అనఁబడు నొకవిధమగు లేపనఁపుముద్దఁ దయారుచేయవలయును. అది వద్రంగులు సాధారణముగాఁ దయారుచేయు మక్కు, లేక పుట్టీవలె నుండును.

తరువాత నాప్లేస్టరును జట్రము (Erame) లో వేయవలయును. పక్కలనుండి పైకిఁ గక్కునంతపూర్తిగా వేయవలెను. ఒకకత్తితో నంచులయఁ దధికముగానున్న ప్లేస్టరుచట్రఁపుటంచులతో సమమట్టమున నుండవలయును. ఎక్కడైనను లో వెలితిలేకుండ నడుమ రంధ్రములుగాని, ముద్దలుగాని, పడకుండఁ జట్రమంతయు ప్లేస్టరుతో నిండియుండవలయును. ప్లాస్టరు గట్టిపడిపోకుండఁ జట్రము క్రిఁగలఁగాఁ జేసి మీఁదనుంచి సమానమగు ప్రెషర్‌తో నొక్కవలయును. అంత రెండుమూఁడునిమిషములలో ప్లాస్టరు గట్టిపడినవెనుకఁ జేజుమీఁదనుండి చట్రము మెల్లగాఁ దీసివేయవలయును. చేజునకు ప్లేస్టరంటుకొనియుండఁగా నాలుటకై పొయ్యిసెగను బెట్టవలయును.

బాగుగా నాటినవెనుక కాస్టును వల్కనైజుఁ జేసి దానినొక కఱ్ఱమాంటుపై నంటించి, పిడి యమర్చినయెడల రబ్బరుస్టాంపు తయారగును.

**రబీంద్రనాథటాగోర్:**— ఈ మహనీయుఁడు వంగదేశస్థుఁడగు మహాకవి. మహర్షి దేవేంద్రనాథటాగోరుకుమారుఁడు. ద్వారకనాథ

టాగోరుపౌత్రుఁడు. వీరిది చాలఁ బ్రసిద్ధినందిన వంశము. ఈయనది బ్రహ్మసమాజమతము.

రవీంద్ర మహాకవి ఝార్న్వప్వత్యమాన ౧౭౮౩ సంవత్సరమున క్రీ. శ. ౧౮౬౦ సంవత్సరమున జనించినవాఁడు. సమస్తవిద్యాపారంగతుఁడో యనునట్లుఁ బెక్కుకళల నేర్చినవాఁడు. అన్నిటికి వన్నెఁబెట్టున దీతనికవిత్వరచన మిగులరసపుష్టిఁ గల్గి యర్థగాంభీర్యమున నలరారుచుండును. ఆంగ్లమునం దసమానపాండిత్యముఁ గలవాఁడు. తత్వవేత్త. భక్తుఁడు.

ప్రభుత్వమువా రీయనకు నైటుహుడ్డు (సర్ బిరుదాంకము) నొసంగి గారవించి యుండిరి. దాని నొకవిద్ధూరఁపుసందర్భమునఁ బరిత్యజించెను. ఈయనకు ౧౯౧౩ సంవత్సరమున డాక్టరుబిరుదమును విశ్వవిద్యాలయము లొసంగి గారవించెను. ఈబోల్పూరుకడ శాంతినికేతన మను నాశ్రమమును, అందు విశ్వభారతి విశ్వవిద్యాలయమును స్థాపించి దానికిఁ జాల ధనముఁ బోగుచేసి యిచ్చెను. ఈయన కొకతరి నోబెల్ బహుమానమురా నాధనము నాశాంతినికేతన విశ్వవిద్యాలయమున కొసంగెను. శాంతినికేతనము సార్వజాతీయ విశ్వవిద్యాలయ (International Univercity) సంస్థగా నేర్పఱచెను. (శాంతినికేతనము చూడుఁడు).

**రబ్బీ:**— హిబ్రూభాషయందలి పదము. సంబుద్ధియం దధ్యాపకా యనియు, స్వామీ యనియు, బోధకుఁడా యనియు, నర్థములగు పదము. యేసుక్రీస్తుప్రభువు నాయనయనుచరులగు వారు 'రబ్బీ' యని పిలిచినట్లు బైబిలు - సెంటు జాన్ ౧-౩-౬ నందుఁ గలదు. పిదప యూదులందు గొప్పవిద్వాంసుఁడై Mishnah పత్రికా సంపాదకుఁడగు జూడా (యూదా) గారు రబ్బీ యనంబడినవారే. ఇక్కాలమున యూదమతగురువుల నందఱను రబ్బీ యని వాడుచున్నారు. మహమ్మదీయులందును, క్రైస్తవులందు నిక్కాలమున నీసంబుద్ధి ప్రచారమునందున్నట్లుఁ గానరాకున్నది.

**రబ్బీనిజమ్ (Rubbinisam):**—యూడియూగురుసిద్ధాంతపరంపరాగతమగు మతమునందుఁ గల నమ్మకము.

**రభసుఁడు:**— ఆయువుపౌత్రుఁడు. రంభుని పుత్రుఁడు. కుమారుఁడు గంభీరుఁడు. మఱియు రభసకోశమను నిఘంటు రచించిన రభసపండితుఁ డొకఁడు గలఁడు.

**రమణగోత్రము:**—

(కణ్వయుపగణము చూడుఁడు.)

**రమణ దుర్గము:**—ఇది సమశీతోష్ణప్రదేశము. సాందూరుసంస్థానరాజ్యములోనిది. బళ్లారిజిల్లాహాసుపేటరెయిల్వేస్టేషనునుండి పదునెన్మిది మైళ్ళదూరమునం దున్నది. కొండపైకిసైతము మోటార్లు పోవుచక్కనిబాట కలదు. ఈప్రాంతవాసులు వేసవియం దిట కధికసంఖ్యలుగ నేగుట కలదు. ఇట వేసవియందు థారహేంటుతెర్మోమీటరుమేరకు డెబ్బది డిగ్రీలనుండి తొంబదిమూఁడు డిగ్రీలకు మించనివేఁడి యుండునఁట. ఐదువందల యకరములు ప్రదేశము నివాసయోగ్యమైనది కలదందురు. సముద్రఁపునీటిమట్టపై ౩౨౦౦ అడుగులయెత్తు, చక్కనిదృశ్యములును, నన్నిదిశలకు మోటారుబాటలు, నడకబాటలు విరివిగఁ గలవు. మినర ల్వాటరులు, మంచి జలవసతులు, వైద్యసంస్థలు, సంస్థానఁపుఁ బ్రభుత్వమువా రేర్పఱిచియున్నారు. భోజనపదార్థములు, షాపులు, కలవు.

**రమణికద్వీపము-మానసఖండము:-** ఆగ్రా, అయోధ్య, సంయుక్తరాష్ట్రములలోని ఆల్మోడా లేక కాళీకుమాన్ సీమయం దాల్మోడా నుండి నలువదినాల్గుమైళ్ళదూరమునను, ఆల్మోడా నుండి కైలాసశిఖరమున కేగుమార్గమునఁగల పితోరాఘడ మనులోవ నుండి ముప్పదినాల్గుమైళ్ళ దూరమునను, నున్న నాగములసీమ నీపేర్లచే వాడుచున్నారు. కృష్ణుఁడు కాళీయమర్దన మొనర్చి యందలినాగముల నిటకుఁ బొమ్మని యాజ్ఞాపింప, నవి యీప్రదేశమునకుఁ జేరి, స్థిరపడె నందురు.

ఈసీమయందు వేర్వేరుశిఖరముల వేణీనాగము, (ఇప్పటి బేనీనాగ్ గ్రామముకడను), పింగళనాగము (పచ్చనిసర్పము), మూలనాగము (ప్రధానసర్పము), ఫేణీ (పడగ) సర్పము ధవళనాగము, కాలనాగము ననియీలు సర్వరాజములకు దేవస్థానము లేర్పడియున్నవి. (వేణీనాగ మన జడం బోలినశరీరముఁగల సర్పమని యర్థము). ఇవి యాప్రాంతముల వారిచేఁ బూజింపఁబడుచు యాత్రాస్థలములై యున్నవి. ఈప్రాంతసీమయందుఁ దేయాకుతోఁటలు కలవు. వేణీనాగ మనుగ్రామమునఁ దపాలాఫీసుమొదలగుసౌకర్యము లున్నవి.

**రమదాన్ మాసము:—** మహమ్మదీయులకుఁ బవిత్రవంతమగు నెల. వారి కిది తొమ్మిదవనెల. ఖురానుషరీఫు, ఈనెలయందు జిబ్రెల్ పరిముఖమున మహమ్మదుగురున కెఱుకపఱుపఁబడిన నెల గానఁ బూతమైనదిగ నెంచఁబడుచున్నదఁట. ఈనెలయందు సూర్యోదయాత్పూర్వమును, సూర్యోదయాత్పరమునను వారు భుజించుచు, పగ లుపవాసముండి ఖురానును బఠింతురు. ఆమహాగ్రంథ మిందుకై ముప్పదిభాగములుగ విభజింపఁబడి, యీనెలయందు దిన మొకభాగముగఁ బఠింపఁబడుచుండునది. అందుఁ గడపటి పదిదినములు కడుపవిత్రవంతములుగఁ జెప్పఁబడినవి.

**రమ్యాక్షిగోత్రము:—**
(అగస్త్యుఁడుపగణము చూడుఁడు).

**రమ్మేజింగు ఎ షిప్పు (Rummaging a ship):-** వాణిజ్యపరిభాషాపదము. కస్టంమ్సు ఉద్యోగులు విదేశఁపుటోడలను తనిఖీ చేయుటకుఁ బేరు.

**రవితీర్థము:—**
(సూకలతీర్థము చూడుఁడు.)

**రవిదాస్ (మహాభక్తుఁడు):—** ఈయన కబీరుదాసునకు సమకాలికుఁడు. చమార్ (గోడారి) కులసంజాతుఁడు. ఆయనవలెనే రామానందుల శిష్యుఁ డందురు. ఈయనయుపదేశములను పాటలుగ రచించినాఁడు. ఈయనకుఁ బెక్కుమంది శిష్యులు, శిష్యురాండ్రు నుండిరి. సుప్రసిద్ధురాలగు రాకొమరిత మీరాబాయియు, చిత్తూరు రాజకుటుంబమునకుఁ జెందిన రాకొమరిత జాలీబాయియు, యోగినులుగ వీరిశిష్యురాండ్రని చెప్పఁబడినది. వీరింగూర్చి 'భక్తిరసబోధిని' యను గ్రంథమున నించుకఁ దెలిపెడిని. దానిని వారి పాటలం జేర్చి రవిదాసుగారి మృతికిఁ బిదప మూఁడువందలసంవత్సరములనాటివాఁడగు ప్రియదాసుగా రనుపేరుగల భక్తుఁడు క్రీ. వె. ౧౭౧౩ సంవత్సరమునఁ గూర్చియుండెను. వీరిశిష్యులం దుద్ధవదా సనువా రగ్రగణ్యులఁట. పిదపఁ జెప్పఁదగినవారు బీర్భాను (వీరభానుఁడు). బీర్భాను సాధుసాంప్రదాయ మనునొక రాగి సంఘమును స్థాపించెను. రాజపుత్రస్థానమున కీశాన్యదిశగానున్న బిజేశ్వర్ గ్రామమునందీప్రధానమతము స్థాపితమై

యున్నది. వారు దేవుని సత్యనాముఁ డందురు. గాననే యీసంఘమందలి గోసాయీలకు 'సత్యనామి' యనుపేరు వాడుకయం దున్నది.

## రశీదు:—

(ఎకౌంటబిల్ రిసీట్ చూడుఁడు.)

## రష్యాతురుష్కస్థానము:-

ఆసియాఖండమునఁ దురుష్కస్థానదేశములోని భాగదేశము. దక్షిణమునను, తూర్పునను పర్వతమయముగను, తక్కినప్రదేశము పల్లముగను నుండును. విస్తారమిసుకపఱ్ఱలు కలవు. దేశ ముత్తరమున కేటవాలు కలది. సైర్దారియా యనంబడుజాక్సారిటీసునదియు, ఆముడారియా యనంబడు ఆక్సస్నదియు నీదేశముగుండా ప్రవహించి, అరాల్సముద్రమున సంగమించును. ఆముడారియానదియే కొంతవఱకు హద్దుగ నుండును. కాస్పియన్సముద్రమున సంగమించు అట్రెక్నది కొంతదనుక నైరుతిదిక్కున హద్దుగ నున్నది. ఇంకను జరాష్ణానునదియు, ముర్ఘానదియు దేశమునఁ గలవుగాని యవి వేసవియందెండిపోవుచుండును.

కొన్నితావుల నదీతీరములందుఁ గొంచెము పంటలును, పండ్లతోఁటలును గలవు. దేశము వ్యవసాయదేశము కాదు. శీతోష్ణములు వాటికాలములం దధికములై యుండును. కొన్నిప్రదేశముల నూతులుసైతము లేని నిర్జలభూమి కలదు. ప్రజలు సున్నీతెగమహమ్మదీయులు. వీరికి షియాతెగవారగు పారశీకమహమ్మదీయులపై నసూయత కలదు. ఉత్తరభాగములందు దేశదిమ్మరులగు కిర్ఘిజ్ తెగవారు, ఉజ్బెక్తెగలవారునగు తార్తారులు గలరు. వారికి గొఱ్ఱెమందలు, మేకమందలు ఆస్తిగా నుండును. ఈదేశఁపు గుఱ్ఱములు మంచిజాతివి కలవు. అవి బరువు మోయుటయేగాక పాలసిచ్చుచుండును. గుఱ్ఱఁపుఁబాలతోఁ బాలుపెరుఁగులేగాక కౌమిస్సనంబడు మత్తుపానీయము జేయుచుందురు. వర్తకమంతయు గుఱ్ఱఁపుఁగార్వానాపై నడుచుచున్నది. బేబరుచక్రవర్తికి స్వదేశమగు కోఖాన్ఫెర్ఘానా (కోఖాన్ఖనాతు) లోని కోఖానుపురము పెద్దపట్టణము, వర్తకస్థలము నై యున్నది. తాష్కండుపురము పెద్దపట్టణము. రష్యాఁప్రఁపుఁగార్యస్థానములున్న ప్రధానస్థానము. జరాష్ణానునదిప్రవహించుఁ గొండలోవలోనున్న సమర్ఖండుపురమొకప్పుడు తామూర్, వేక తామర్లేన్ (తార్తారుపు) దండయాత్రలు వెడలుకాలమున రాజధానిగనుండిన గొప్పపట్టణమై యుండినది. ఇది క్రీ. వె. ౧౩౭౦—౧౪౦౫ కాలము. ముర్ఘాజునదీతీరమందున్న మెర్వ్పురము వెనుక వరకస్థానమెయుండి గొప్పదశ ననుభవించియుండినది.

ట్రాన్సుకాస్పియను రైల్వే కాస్పియనుసముద్రతీరమునందలి క్రాస్నోవోడ్స్కపురమునుండి మెర్వ్పురము, బోఖారాపురము, సమర్కండుపురములమీఁదుగా నడిచి తాష్కండుపురమున విరమించునది.

(తురుష్కస్థానము చూడుఁడు—చీనాతురుష్కస్థానము చూడుఁడు— సెంట్రల్తురుష్కస్థానము చూడుఁడు. సైర్దారియానది - ఆముడారియానది చూడుఁడు).

## రష్యాదేశఁపుసామెతలు:—

ఎలుఁగుబంటును వేఁటాడువాఁ డేమఱలియుండరాదు.

ఒక్కచేతితో తాడు ముడివేయడ మేలాగు?

కథలు చెప్పవచ్చును గాని కార్యములను జేయుట దుర్ఘటము.

కాళ్ళమీఁదబడి వేళ్ళు కఱచే రకము.

గంట ప్రార్థన కందరినీ పిలుస్తుందిగాని తా నేగదు.

గడుసునక్కకుఁ గన్నములు మూఁడు.

గుఱ్ఱంపాటిపోతే తోఁక ఉండిపోతుందా?

చంపుటే అపాయకరము, చంపలేకపోవుట మరి యపాయకరము, గాయముఁజేసివదలుట యన్నిటి కన్నా అపాయకరము.

గొంతుక మొయ్యా తినేవాఁడికిఁ జమువున్నే.

నీయింటి కిటికీలలోనుంచి దేశమంతా చూడఁ గలవా?

నోటితో నాకి కాళ్ళతోఁ దన్నినట్లు.

దిగఁగొట్టినను త్రిదా? లేక దిగినమేకుదా ప్రశ్న?
పశువులకు నాల్క పెద్దదే మాట్లాడఁగలవా?
బుఱ్ఱ మంచిదైతే చేతులు నాల్గున్న ఫలము.
మనస్సు లేనిబుఱ్ఱ మట్టిముద్దతో సమానము.
మేకకు జ్ఞాపకంవుండేదంతా మేఁతప్రసంగమే.
సలహాలు చెప్పేవాళ్లు చాలామంది లభిస్తారు
గాని సాయంచేసేవాళ్ళు దొరకడం కష్టము.

సంవత్సరంలో రెండు వేసవులు రావు.

రోజు మంచిదని సాయంత్రం అనకు. మఱునా డుదయమం దనుకో.

**రష్యాదేశము:-** ఐరోపాఖండమున దూర్పుభాగముననున్న గొప్పదేశము. ఇది యైరోపాయందు సగముండునని తలంపఁబడుచున్నది. ఉత్తరమున నార్కిటిక్కు మహాసముద్రమును, తూర్పున ఊరల్పర్వతములు, ఊరల్‌నది, కాస్పియన్‌సముద్రమును, దక్షిణమున కాకేసుపర్వతములు, బ్లాక్సీ, రూమేనియాదేశము, ఆస్ట్రియాదేశమును, పశ్చిమమునఆస్ట్రియాప్రష్యాదేశములు, బాల్టిక్కుసముద్రము, స్వీడన్‌దేశము, ఫిన్లాండుదేశమును, ఈమహాదేశమున కెల్లలుగా నున్నవి. వైశాల్యము 2100000 చతురఁపుమైళ్ళని యంచనా వేయఁబడినది. అట్లగునేని భరతదేశమునకన్న మూఁడవవంతుపెద్దదిగ నుండవలెను. ఇది యైరోపాలోని రష్యాదేశము. ఇంక ఆసియాఖండములోని రష్యాదేశము వేరు. దానికి 'సైబీరియా' యని పేరు. అది యీలెక్కయందుఁ జేరలేదు.

బాల్టిక్కుసముద్రము, ఏసెల్‌ద్వీపము, డేగో ద్వీపము, ఆలాండుద్వీపమును, ఆర్కిటిక్కుమహాసముద్రమునందలి నోవాజింబ్లాద్వీపము, స్పిట్సుబర్గెన్ద్వీపము, వెయిగట్సుద్వీపమును రష్యాకుఁ జెంది యున్నవి. స్పిట్సుబర్గెన్ నాల్గుద్వీపముల సముదాయమునకుఁ బేరు. ఇవి చాల పెద్దద్వీపములే కాని యిందు నివసించువా రెవ్వరు లేరు. శీతల మధికము. కొన్ని జంతువులు నివసించుచుండును. రష్యాదేశమంతయు, సాధారణముగ సమతల భూమియే. పర్వతప్రాంతములయందు స్థితి వేఱుగా నుండును. పెట్రోగ్రేడు (తొల్లింటి సెంటుపీటర్సుబర్గు) నకును, మాస్కోనగరమునకును నడుమ నుండు వల్డైకొండలు (Valdai Hills) ఏమంత పెద్దవిగాకున్నను వర్షమున కాధారభూతమై యున్నవి. పెద్దవియగు ఊరల్‌పర్వతములు, కాకేసస్ పర్వతములు, సరిహద్దులం దున్నవి. తక్కినదేశమంతయు సమతలము.

రష్యాదేశఁపునదు లెక్కువ యున్నతస్థానములందు జనింపమిఁ బ్రవాహోదకముల వడి చాల తక్కువగా నుండును. ఇది పడవలు నడుచుటకుఁ జాల యనుకూలపరిస్థితియే గాని, శీతలాధిక్యతచే సంవత్సరమునఁ జాల కాలము ఘనీభవించి నీరు మంచుగ బిగిసిపోయియుంట నిరర్థకముగ నొనర్చుచున్నది. రష్యాదేశఁపునదులయందుఁ బెద్దది వోల్గానది. ఆర్కిటిక్కుసముద్రమునందు సంగమించును. ద్వీనానదివైట్సీయందుఁ జేరుకొనును.

నీవానది లోడేవాగో సరస్సునుండి ఫిన్లాండుసంయుక్తాగ్రిగుడమునందుఁ జేరుచున్నది. డూనానది, విశ్చులానది, నీమెన్‌నది, బాల్టిక్కు-సముద్రమునం గలియుచున్నవి. నీస్టరునది, నీపార్నది, బ్లాక్సీయందు సంగమించుచున్నవి. డాన్‌నది, నీఆఫ్ ఎజోవునందుఁ గలియుచున్నది. వోల్గానది (ఐరోపాయంతకుఁ బెద్దనది), ఊరల్‌నది కాస్పియను సముద్రమువాలఁబడుచున్నవి. డాన్యూజునదియొక్క యుపనదియగు ప్రూత్నది దక్షిణమున రుష్యా-రూమేనియాలహద్దుగాఁ బ్రవహించుచు, డాన్యూజునందు సంగమించుచున్నది. రష్యాదేశమునందు వాయువ్యదిశగానున్న లడోగాసరస్సు తియ్యనీరు గలది. ఇది మైరోపాయందుఁ బెద్దసరస్సని చెప్పఁబడినది. ఒనోగాసర స్సంతకన్ననించుకఁ జిన్నదిగా నుండును. పై ప స్సరస్సు ఫిన్లాండుసంయుక్తాగ్రిగుడమునకును, రైగాకును, నడుమనున్నది. ఇంకను నాగ్నేయదిశయందుఁ గొన్నిగొన్నియుప్పునీటిసరస్సులు కలవు. కాస్పియన్సీయును, బ్లాక్సీయును, సరిహద్దులం దున్నవి.

ఈదేశమున నుత్తరభాగములందు శీతకాలము దీర్ఘముగను, వేసవి హ్రస్వముగను నుండును. దక్షిణభాగములందు దానికి వ్యతిరేకముగ వేసవి దీర్ఘముగను, శీతకాలము హ్రస్వముగను నుండును. మధ్యభాగమున రెండును సమముగ నుండుచో నుష్ణశీతములు కఠినములుగఁ దోఁచెడియును. మొత్తమున వేఁడిదేశమని యేవైపున ననిపించదు.

ఊరల్పర్వతములందు రత్నములు, బంగారము దొరకుగనులు గలవు. ఇవి సుప్రసిద్ధములు. తూర్పుప్రదేశములు లోహపుగనులు విస్తారముగఁగల్గియున్నవి. ఇనుము, రాగి, ప్లాటినము, బంగారము దొరకుచున్నలోహములు, ఉప్పు, రాక్షసబొగ్గుఁగూడ దొరకుగనులు గలవు. రష్యాయం దుత్తరభాగము పై బేఁచియాకు వలెనే బురద, ఔకు, జౌకు నేలలం గల్గియున్నది. దానికిఁ గ్రింద (దక్షిణముగ) గొప్పయడవిభాగము కలదు. ఇది ఐరోపాయందుఁ బెద్దదియగు మహారణ్యప్రదేశముగఁ జెప్పఁబడినది. దానికి దిగువగ (దక్షిణముగ) జనపనార, యవిసెనార, రైధాన్యము, ఓటుధాన్యములు పైరు చేయఁబడుచున్న భూములును, వాటికి దిగువ నల్లరేగటినేల సమతలప్రదేశమును గలదు. ఇందు విస్తారము గోధుమలు, జొన్నలు, ధాన్యము పైరు చేయఁబడుచున్నవి. ఇమ్మహాప్రదేశమున నెండలు వేఁడిమిఁగల్గి యుంటను, నీరుఁగల్గి భూమి సారవంతమై సమతలముగ నుంటను గొప్పపంటలు పండుచు, సస్యసమృద్ధిఁ గల్గించు మహావిశాలప్రదేశమై యున్నవి. ఇంకను దక్షిణప్రాంతముల జొన్నలు, ద్రాక్షలు, విస్తారముగనే పైరుచేయఁ బడుచున్నవి. ఈపంటభూములందుఁ జెట్టుచేమలు గానరావు. వీటియందుఁ దాత్తారులు, గుడారములందు వసించుచు, గుఱ్ఱములపైఁబడి తిరుగుచు జీవనములఁ గడపుచుందురు.

అరణ్యములుగల పెట్రోగ్రేడు మాస్కోల నడుమ నుడుతలు చెట్లపైనుండియే భూమికి దిగకుండనే పోఁగలవని సామెతగఁ జెప్పుచుందురు. ఈప్రాంతముల యం దిండ్లు కఱ్ఱవియే కట్టుచున్నారు. Sable మృగము, ermine మృగము శ్రేష్ఠమైన బొచ్చు (Fur) నిచ్చుతోళ్ళు కలవి. ఇవి యుత్తరమున విస్తారముగ నున్నవి. దక్షిణమున గొఱ్ఱెలు, నావులు, నెద్దు, గుఱ్ఱములు విస్తారము పెంచఁబడుచున్నవి. తోడేళ్ళు, నల్లయెలుఁగు బంట్లు, నడవిమృగములు నుత్తరఁపు మంచుప్రదేశముల 'పోలారుబీర్' అను తెల్లయెలుఁగుబంట్లు కలవు. మఱియు నట రైన్డీయరు మృగములు,

నీలుజలచరములుఁగూడఁగలవు. నీలుజలచరములు బాల్టిక్కుసముద్రమునను, కాస్పియన్ సముద్రముననుగూడ గలవు. రష్యాదేశము పెద్దదైనను, జనాభాయందుఁ దక్కువ. చతురఁపుమైలునందు ౨౧ జనులు వసించుచున్నారని లెక్కింపఁబడినది.

ఈదేశమందలి యాదిమనివాసులు 'sarmations' అనఁబడు దేశదిమ్మరులగుజాతివా రని చెప్పఁబడినది. అందుఁ గొందఱు Scythians కూడ నుండిరఁట. ఇప్పుడు ఫిన్లాండుసంయుక్తాగ్ర గుడమునకు దక్షిణమున 'Lithuanians'అను జాతివారు వసించుచున్నారు. వీరిభాష సంస్కృతముతోఁ జాలసంబంధముఁ గల్గియున్నది. గాని, యూరోపాభాషలకు సంబంధించియుండదు. డాన్ నదీజలములు ప్రవహించుదక్షిణసీమలందు డాన్కో జాకుజాతివారు వసించుచున్నారు. వారు దేశదిమ్మరులు, పొట్టివారు, యుద్ధకాలములందు సైన్యములందు వీరు light Cavalry సైనికులుగ నుండెదరు. కాకసస్పర్వతదేశములందు Circassians వసించుచుందురు. వీరు రణశూరులగు మహమ్మదీయులు. చాల సౌందర్యవంతులు గాన వీరిస్త్రీలను టర్కీఘనులు పరిణయమగుచుండిరి. రష్యాదేశవాసులలోఁ బెక్కండ్రు slavonic జాతులవారు కలరు.

మఱియు నీదేశమున Finn జాతులు, జర్మను జాతులు, పోలు (Pole) జాతులు, యూదులు, పశ్చిమదేశములందు విస్తారముగవసించుచున్నారు. ఆగ్నేయదిక్సీమలందు దేశద్రిమ్మరులగు మంగోలియా జాతివారు విస్తారముగఁ గలరు. టర్కీజాతులవారును గొందఱు నివసించుచున్నారు.

రష్యాప్రజలు చాలయనాగరికులుగ నుండిరి. మూఢభక్తి వీరియం దెక్కువగా నుండెననియుఁ జెప్పఁబడినది. క్రూరులనియు, పాపమునకుఁగూడ వెఱువక, పట్టినపట్టు వీడనిమూర్ఖత గలవారనియు వాడుకఁ గల్గియుండెను. తొలుతకాలమున భూములను విక్రయించుతఱి నందలిప్రజలనుగూడ విక్రయించుదురాచారము వీరియం దుండెనఁట. దానిని రెండవయలగ్జాండరుభూపతిపాలనమున నాఁపివేయఁబడి రద్దుపఱుపఁబడెనని చెప్పఁబడినది.

ఒక స్కాండినేవియాదేశస్థుఁడగు రూరిక్కను పేరుగలవాఁడు తొలుత క్రీ. వె. ౮౬౨ వ సంవత్సరమునఁ గొంతసైన్యముతో వచ్చి, కొందఱను జయించుచు, స్థిరపడి రష్యాదేశమున మొదటి యేలిక యాయెననియు, నాయనసంతతివాఁడగు 'Vladimir' అనునాతఁడు క్రీ. వె. ౯౮౧ లో నొకగ్రీకుభూపతిసుతం బరిణయమై, తాను క్రైస్తవుఁడై ప్రజలలోఁ గొందఱు క్రైస్తవులుగ నొనర్చెననియు, దేశఁపుఁబాటలందుఁ గాననయ్యెడిని. రెండుశతాబ్దములకాలము మంగోలు లేలిరఁట. గాని, 'Ivan the Great' అనుభూపతిచే నోడింపఁబడి, పరాజితులైరఁట. క్రీ. వె. ౧౬౧౩ లో వెనుకటిరాజవంశము స్థిరపడి యధికారమునకు వచ్చెనఁట. 'పీటర్ ది గ్రేటు' మహాపతి ప్రజల ననేకవిధముల నభివృద్ధికిఁ దెచ్చి, తన పేర సెంటుపీటర్సుబర్గు నగరము నిర్మించెను. ఇది నీవానదీతీరము. ఆయనయే రాజధానిని మాస్కోనగరమునుండి యటకు మార్చినవాఁడు. అది యిప్పుడు పెట్రోగ్రెడ్ డనఁబరఁగుచున్నది. ప్రభుత్వము పెరికి ఆబ్సల్యూటుమోనార్కీగా నుండెను. మొన్నటి యూరోపామహాసంగ్రామకాలమునఁ దిరుగుఁబాటుఁగల్గి, రాజకుటుంబమును బరిమార్చి ప్రజాప్రభుత్వమును స్థాపించుకొనిరి. ఇప్పుడు (Soviet) రష్యాయై యున్నది. ప్రభుత్వకాలమున రష్యాదేశము ౬౮ గవర్నమెంటుభాగములుగ నుండెను. చక్రవర్తికి 'జా' రనుపే రుండెను. ఇది సీజరుపద

సంబంధ మనిమెదరు. రష్యాదేశమునందలి గ్రీకు చర్చి సంబంధక్రైస్తవులకు జారుభూనాధుఁడే ప్రధానాచార్యుఁడై యుండెనఁట.

పట్టణములు.

౧ పెట్రోగ్రాడ్-నీవానదిపై నున్న నగరము. తొల్లింటిపేరు సెంటుపీటర్సు బర్గు. పీటరు దిగ్రేటు చక్రవర్తివలన క్రీ. శ. ౧౭౦౩ సంవత్సరములో నిర్మింపఁబడినది. నీవానదీతీరము గొప్పవర్తకస్థలము. విశాలవంతమైనది. ఇటనుండి ఫిన్లండు సంయుక్తాగ్రగుడములోనికి పిష్పు కెనాలు కలదు.

క్రోన్స్టాట్ పురము-దీనికి 'Crown city' యని యర్థము. నీవానది ముఖద్వారమున నొకద్వీపమునందు గొప్పదుర్గమునందున్న పురము. రుష్యన్బాల్టిక్కు-షీటనావికాదళమునకుఁ బ్రధానస్థానము.

ఆర్కేంజిల్ పురము. ఉత్తరద్వీనానదీముఖద్వారమున వైట్సీపైనున్న రేవుపట్టణము. సంవత్సరమున ౮ నెలలు రేవుమంచుచే బిగిసిపోయి, యోడలు నడువ వీలు గాకుండును.

రైగాపురము-డూనానదీముఖద్వారముకడ రైగా సంయుక్తాగ్రగుడమునందలిరేవు. వర్తకస్థలము.

విల్నాపురము- లితూయానియాకుఁ దొల్లింటి రాజధానియై యుండినపురము. గొప్పవర్తకస్థలము. ఇట యూదు లధికముగాఁ గలరు.

మాస్కో-నగరము- ప్రధానకార్యస్థానము, ప్రజాప్రభుత్వకార్యాలయములు గలవు. ఒకప్పుడు సామ్రాజ్యపురాజధానిగ నుండెను. మతసంబంధపవిత్రస్థానముగ నుండెను. moskva నదీతీరము. ఈనదినుండియే పురమునకుఁ బేరు కల్గెనఁట. ఇటప్రధానస్థానమగు 'క్రెమ్లిన్' దేవాలయమందలి గ్రిట్బెల్ (గంట) లోకమునఁ బెద్ద గంటయని పేరందినది.

నిజనీనోవ్గొరోడ్ పురము—ఇచట సంత లోకప్రసిద్ధము.

కాజాన్ పురము -వోల్గానదీతీరము. వర్తకస్థలము.

సరాటోవ్ పురము- వోల్గానదీతీరము. వర్తకస్థలము.

పెరమ్ పురము—ఎకాటరిన్బర్గుపురము. ఊరల్పర్వములయం దిరుదెసలనున్న పురము. గనులుగల ప్రదేశముల స్థానములు.

తులాపురము— (మాస్కోనగరపరిసరము) ఇనుపపని విశేషముగ జరుగుచుండుతావు. దీనిని Birmingham of Russia' అనుచుందురు.

క్రాకోవుపురము— సంత జరగుస్థానము. అప్పుడు గొప్పవర్తకము జరుగును.

కీవ్ పురము-నీపార్నదీతీరము. ఒకప్పుడు రాజధానిగ నుండినపురము.

ఒడెస్సా-పురము—బ్లాక్సీపై రేవుపట్టణము. వర్తకస్థలము. ఇది నీపరు, నీస్టరు నదులముఖ్య నున్నది. గోధుమలవర్తక మధికముగ జరుగుచుండును.

ఖెరన్సు—ఎక్రనాగ్ పురముల వర్తకస్థలములు.

సకోలయివ్పురము-బ్లాక్సీయందలినావికస్థానము.

ఆస్ట్రిఖాన్ పురము— వోల్గానదీముఖద్వారముకడనున్న పురము. గొప్పవర్తకస్థానము.

ఇంక సైబీరియాదేశము చూడుఁడు, ఐరోపా చూడుఁడు, రష్యాదేశమంతయు ౮,౫౦,౦౦౦,౦౦ చతురపుమైళ్ళు.)

**రష్యాదేశము (Russia) ప్రభుత్వము**:—ఐరోపాఖండమునందలి రష్యాదేశమును, ఆశియాఖండములోని సైబేరియాదేశమును కలసినసామ్రాజ్యముగా నుండెను. ప్రపంచమందంతటను పెద్దదిగ నుండినదేశము. ఇటీవలఁ జక్రవర్తిని దొలగించి సోవియట్ (Soviet) ప్రభుత్వముగను,

Socialist ప్రభుత్వముగను, రెండు ప్రజాపరిపాలనలు దేశమున స్థాపింపఁబడి, రెండును గలసి దేశపాలన నడుపుచున్నవి. (ప్రజాపరిపాలనమే.)

సరిగాఁ దెలియరాకున్నను, ఎన్బది యొకలక్ష యేఁబదివేల చతురఁపుమైళ్ళ వైశాల్యమనియు, పదునాల్గుకోట్ల డెబ్బదిలక్షలు జనసంఖ్యయనియుఁ దలంపఁబడుచున్నది.

**రస:**—భారతమున నీమె ప్రజాపతిభార్య యనియు, నహుఁడను వసువుయొక్క తల్లియని యుఁ జెప్పఁబడినది.

**రసగంగాధరము:**— జగన్నాథపండితరాయు లనునొక యాంధ్రవేగినాటి బ్రాహ్మణుఁడు రచించిన యలంకారశాస్త్రము. ఈతఁడు "లవంగీ కురంగీ మదంగీ కరోతు" అనుశ్లోకముల రచించిన కవి. ప్రౌఢమగు శాస్త్రగ్రంథము. ఇది గ్రంథ మంతయు దొరకుట లేదు.

**రసనిరూపణము:**—ఇది యొక యలంకారశాస్త్రగ్రంథము. ఇందు శృంగారరస నిరూపణము, అష్టరసనిరూపణము, భావనిరూపణము ననుభాగములు గలవు.

**రసములు (నవరసములు):**— రసములు తొమ్మిది. నవరసము లని ప్రసిద్ధముగ నంద రెఱిఁగినదే. అవి ౧ శృంగారరసము, ౨ వీరరసము, 3 కరుణారసము, ౪ అద్భుతరసము, ౫ హాస్యరసము, ౬ భీభత్సరసము, ౭ భయానకరసము, ౮ రౌద్రరసము, ౯ శాంతరసము.

౧ శృంగారరసము:— ఇది సయోగశృంగారమనియు, నయోగశృంగార మనియు, ద్వివిధము. అయోగమునకు వియోగశృంగారమనియు, విప్రలంభశృంగారమనియుఁ బేరులు కలవు. ఇట్లు ద్వివిధమగు సయోగ, అయోగ శృంగారరసమునందు దశావస్థలును, గొన్ని భావములును జెప్పఁబడియున్నవి.

౧ దశావస్థలు:—౧ చక్షుఃప్రీతి (చూచుట), ౨ మనస్సంగమము (మనస్సు దగులుట), 3 సంకల్పము, ౪ అరతి, ౫ తాపము (గల్గుట), ౬ లజ్జాత్యాగము (తెగింపుఁ గల్గుట), ౭ జాగరము (నిద్ర పట్టకుండుట), ౮ ఉన్మాదము (భ్రమఁజెందుట), ౯ మూర్ఛ, ౧౦ ధన్యత (కోర్కెఁదీరుట) యనునవి.

౨ రెండవది యభావము:—విభావము, అనుభావము నని యిరుతెఱఁగులు.

౧ విభావము:—ఆలంబనము, ఉద్దీపనము నని తిరుగ ద్వివిధము.

౧ ఆలంబనము- ఇది యొకే విధము.

౨ ఉద్దీపనము- ప్రాయము, నలంకారము, చేష్టలు, తటస్థము నని చతుర్విధము లుగ నున్నది.

౨ అనుభావము:— ఇది మూఁడుతెఱఁగులు. ౧ సాత్త్వికభావములు, ౨ సంచారీభావములు, 3 చేష్టలు అని.

౧ సాత్త్వికభావములు ఎనిమిది చెప్పఁబడినవి. అవి ౧ స్తంభనము ౨ ప్రళయము, 3 రోమాంచలము, ౪ స్వేదము, ౫ వైస్వర్ణ్యము, ౬ కంపము, ౭ అశ్రువు, ౮ వైవర్ణ్యము ననునవి.

౨ సంచారీభావములు ముప్పదిమూఁడు:- అవి ౧ నిర్వేదము, ౨ శ్రమము, 3 దైన్యము, ౪ జాడ్యము, ౫ గ్లాని, ౬ త్రాసము, ౭ శంక, ౮ ఆర్తి, ౯ రోషము, ౧౦ గ

ర్వము, ౧౧ అవేగము, ౧౨ ౧౩ స్మృతి, ౧౪ చాపలము, ౧౫ ఉగ్రత, ౧౬ అవహిత్థి, ౧౭ త్రప, ౧౮ విషాదము, ౧౯ మదము, ౨౦ ఔత్సుక్యము, ౨౧ మతి, ౨౨ నిద్ర, ౨౩ మోహము, ౨౪ బోధము, ౨౫ మృతి, ౨౬ ముదము, ౨౭ ఆలస్యము, ౨౮ వితర్కము, ౨౯ సుషుప్తి, ౩౦ అసూయ, ౩౧ చింత, ౩౨ ఉన్మాదము, ౩౩ అపస్మృతి యనఁబడునవి.

౩ చేష్టలు- ఇవి చిత్తజములు, గాత్రజములు, వాగారంభములు, బుద్ధ్యారంభములు నని నాల్గు తెఱఁగులు.

౧ చిత్తజములు:- ఇవి యేఁడు విధములు. ౧ హావము, ౨ భావము, ౩ హేల, ౪ మాధుర్యము, ౫ ప్రాగల్భ్యము, ౬ అసితము, ౭ ధైర్యము.

౨ గాత్రజములు:- ఇవి పదునొకండువిధములు. ౧ లీల, ౨ విలాసము, ౩ విచ్ఛిత్తి, ౪ విభ్రమము, ౫ కిలికించితము, ౬ మొట్టాయితము, ౭ కుట్టిమితము, ౮ చకితము, ౯ బిబ్బోకము, ౧౦ భావితము, ౧౧భావన.

౩ వాగారంభములు:- ఇవి పండ్రెండు విధములు.

౪ బుద్ధ్యారంభములు:- ఇవి మూఁడువిధములు. ౧ లీల, ౨ వృత్తి, ౩ ప్రవృత్తి, యనఁబడునవి.

౨ వీరరసము-ఇది త్రివిధము. ౧ దానవీరము, (తా నిదివఱకు నీవి నిచ్చియుండియు, నవసమగుతఱి నర్హతగలవారికిఁ దిరుగ వెనుఁదీయక, ఈవి నొసంగ సంసిద్ధుఁడగుటకు దానవీరమని పేరు.) ౨ దయావీరము (ఎవ్వరికైన నర్హతఁగాంచి తా నీవి నీయఁదలంచినతఱి నాటంకము లెన్నియున్నను, వెనుఁదీయకఁ దన దయం జూపి, వారికి దాన మొసంగి సహాయ మొనర్చుటకు దయావీర మనిపేరు.) ౩ యుద్ధవీరము:- (కలహము లొనర్చుటచేఁ దానలసియుండియు, నౌకరిని రక్షించుటకుఁ దోడనె తాఁగల్గించుకొని యుద్ధసన్నద్ధుఁ డగుటకు యుద్ధవీరమనిపేరు.) ఈమూఁడును వీరరసములు.

౩ కరుణారసము-తా నందరియందు భూతదయ సమానముగఁగల్గి, వారివారిదోషములం బాటించి సరకుఁగొనకఁ గరుణ నెఱపుచుండుట.

౪ అద్భుతరసము- ఆశ్చర్యముఁ గల్గించునది, తలపనిది, జరుగుటం గాంచినఁ దోఁచు వింత.

౫ హాస్యరసము—ఇది షడ్విధములు. హాస్యరసము మనస్సును వికసింపఁజేసి, ఉత్సహించుట ముఖమునఁ గానవయ్యెడిని. ఇంకను నధికమగుచో నవ్వుక్రిందఁ బరిణమించును. ఆ ముఖవికాసమును, పరిణామమగునవ్వును నాఱువిధములగు భాగములు. అనఁగాఁ గొంచెముగాఁ గల్గిన స్మిత మనియు, దాని కధికమైన హసిత మనియు, దాని కధికమైనది విహసితమనియు, పిదప నుపహసితము, నపహసితము, నతిహసితము (పకపగనగుట) ననియు, దీని యభిప్రాయము.

౬. భీభత్సరసము—ఇది ఒకేవిధము. ఒకనియొక్క గర్వభంగము లేక ఒకచేయుచుండుపనికి నవాంతరముఁ గల్గి భంగపడుట. ఇది యితరులకు (హేళనపూర్వకమగు) నవ్వుం గల్గించునది. దీనికి భీభత్సమని పేరు.

౭ భయానకరసము—బలవంతుఁడు గల్గించు బాధలకు వెఱచియుండుట భయ మనంబడును.

తాఁ జేయుప్రతిక్రియ లేకుండినతఱి భయము౦ జెందియుండుట భయానక మనఁబడును.

రౌద్రరసము—ఇది మాత్సర్యరౌద్రము, విద్వేషరౌద్రమునని ద్వివిధము. ఎప్పటి కప్పు డన్యుల శ్రేయస్సుఁగాంచి యోర్వలేక పోవుటవలనఁ గల్గిన మత్సరమునఁ దానుసుఁ డగుట మాత్సర్యరౌద్రమనియు, అదివరకె తనకుం గల్గియున్న పగం దీర్చుకొన నుద్దేశించి తామసుండై రౌద్ర మగుపఱ్చుట విద్వేషరౌద్రమనియుఁ జెప్పఁబడును.

శాన్తరసము—ఇది నాల్గువిధములు. ౧ ఆత్మానాత్మవివేకశాంతము, ౨ ఇహాముత్రార్థఫలభోగవిరాగశాంతము, ౩ శమదమాదిషట్కసంపదశాంతము, ౪ ముముక్షుత్వశాంతమునని. దీనిని మనశ్శాంతిగ నెఱుంగునది.

**రసరత్నాకరము:**— ఒక రసవాదశాస్త్రగ్రంథము. నవరత్నములు, పంచలోహములు, గంధకము మొదలగువానింగూర్చిన వస్తునిరూపణము. భస్మములు చేయువిధానము, కరఁగించుట మొదలగువానిం దెల్పుగ్రంథము. ిత్యనాథసిద్ధుఁడు రచించినరసాయనశాస్త్రము.

**రసవాదిమతము:**—

(యోగిమతము చూడుఁడు).

**రసశాస్త్రము:**—రసశాస్త్ర మాయుర్వేదవైద్యవిధానమందలి రసాయన తంత్రమునకుఁ జెందినభాగము. ఇది రసఖండము, చికిత్సాఖండము, రసాయనఖండము, మంత్రఖండము, వాదఖండము నని యైదుభాగములుగ నున్నశాస్త్రము.

౧. రసఖండము— ఇది అభ్రకము, వైక్రాంతము మొదలగు ఖనిజపదార్థములంగూర్చియు, బంగారము, వెండి, రాగి, యినుము మొదలగు లోహపదార్థములం గూర్చియు, వజ్ర, వైఢూర్య, మౌక్తిక, ప్రవాళాది రత్నపదార్థములంగూర్చియు, నుత్పత్తిభేదములు, స్వరూపములు, వాటిని చికిత్సల కుపచరించునటుల ౧ శుద్ధి యొనర్చుట, ౧ మారణమొనర్చుట, ౩ సత్వపాతనమొనర్చుట, ధృతిగనొనర్చుట యను చతుర్విధపరిణామములం గల్గించువిధానములను శోధనమారణాదుల కావశ్యకములగు యంత్రములు, మూసలు మొదలగు పరికరముల లక్షణములు నింకవాట్లంగూర్చి శాస్త్రమున వాడఁబడిన పరిభాషాపదములు మొదలగు వాట్లను వివరించుభాగము.

౨. చికిత్సాఖండము— ఇది యాయారోగములకు వలసినయౌషధములం దెల్పెడిభాగము. ఇట నౌషధములన రసఖండమునఁ జెప్పఁబడిన ఖనిజలోహరత్నపదార్థముల పరిణామరూపములు, లేక వాటింగూర్చి చేసినయౌషధములని యెఱుఁగ వలయును. అనఁగా వేర్వేరు రోగలక్షణముల వివరించుచుఁ దత్పరిహారౌషధములం దెల్పునని భావము.

౩. రసాయనఖండము— ఇది సామాన్యవ్యాధుల నడంచి, ముదిమి రాకుండునటులఁ (అనఁగా వృద్ధాప్యమునుండి సిద్ధమగు క్షీణత యనిభావము) జేయు నౌషధాదులను వివరించుభాగము. ఇంకను నిది యాకాశగమనసిద్ధిని గల్గించు ఘుటికాప్రయోగములను, దేహ (కాయ) సిద్ధినిగల్గించు సాధనములను, జీవన్ముక్తి విధానసాధనములను వివరించును. దీనిని రసవైద్యవిధానమని కొందరనెదరు.

౪. మంత్రఖండము-దీనిని మంత్రశాస్త్రమనియు ననుటఁ గలదు. మంత్రములం జపింప షట్ప్రి

యోగములవిధానమిందుఁ జెప్పఁబడినది. మెస్మరిజ మనంబడు వశీకరణశక్తి. ఒకరి కొకరులొంగి స్వాధీనమగుటయగుశక్తి, పాతశక్తియు నిందులోని యంతర్భాగములే. దీని నుపయోగించి జ్వరములు మొదలగురోగములను, నపస్మారము, మూర్ఛలు మొదలగుమానసికరోగములను నివారించి, యారోగ్యముం గల్గించు విధానము లిందుఁ గలవు.

౫. వాదఖండము—దీనిని రసాయనశాస్త్రమని కొందఱు వాడుచుండుటయుఁ గలదు. ఇందు బంగారము, వెండి చేయువిధానములును, కృతకరత్నములం (artificial diamonds) జేయు విధానమును వివరింపఁబడినది.

ఈయైదుభాగములందుఁ జెప్పఁబడిన విషయములు, అనాశ్రితోత్పత్తిఁ గలవిగఁ బరిశీలకులగు పూరాణపండితులు కొందరు వివరించియున్నారు.

చిరకాలముక్రిందట క్రీ. వె. ౮౦౦ సంవత్సరమున నరబ్బులు సుశ్రుతమును తమయరబ్బీవాఙ్మయములోని కనువాదము లొనర్పఁజేసిఁ గైకొని చేర్చుకొనియుండిరి. దానినుండి గ్రీకులు తమభాషలోని కనువదింపఁ జేసికొనిరి. దీనిమూలమున వేర్వేరు పాశ్చాత్యసీమల కీగ్రంథములోని సంగతులు తెలిసియుండెనని నిదర్శనములు చరిత్రనుండి కలవని చెప్పుదురు.

ఆయుర్వేదవైద్యవిద్యాపారంగతులగు వైద్యరత్న పండిత శ్రీగోపాలాచార్యులవారు పరిశీలనఁబొనర్చి 'రసఖండచికిత్సాఖండములవిషయమున నిర్వివాదాంశమేయనియు' నింకవాదఖండ,మంత్రఖండ, రసాయనఖండములందలివిషయము లిక్కాలంపువార కతిశయోక్తులుగఁ దోఁచుచున్నను, ప్రకృతము మనము వినెడి,చూచెడి విషయములలోనగు False diamonds - German silver- Candian Gold - Airoplanes నుంగూర్చి జ్ఞప్తికిఁ దెచ్చుకొనిన వాని నతిశయోక్తులని యూహింపఁజాలరని తలచెదను" అని వ్రాసియున్నారు.

**రససింధూరము:**— దీని నాంగ్లమున Cinnabar of Antimony అందురు. అనుదినముఁ జనుబాలలో నానఁబెట్టుచుండవలెననియు, నుదయముననే యాపాలం బారఁబోసి క్రొత్తపాలందుఁ బోయుచుండవలెననియు నిటుల మూఁడు దినములుచేసిన రససింధూరము శుద్ధియగుననియుఁ జెప్పఁబడినది.

శుద్ధిమైన రససింధూర మగ్నిమాంద్యరోగమును, అర్శస్సు (మూలవ్యాధి) ను, గ్రహణిని, జ్వరములను, జలోదరమును, దుష్టవ్రణములను, ప్రమేహమును, పాండువును, భగంధరమును, మేహమును, రాజయక్ష్మను, వాతపైత్త్యములను, వాంతిశ్వాసకాసలను, శూలలను, శోషను, క్షయరోగములను నివారించునని చెప్పఁబడినది.

దీనింగూర్చి యిటులఁ జెప్పఁబడినది.

శ్లో॥ శుద్ధసూతస్య గృహ్ణీయాద్ భిషగ్భాగచతుష్టయమ్
శుద్ధగంధస్యభాగైకంతావత్కృత్రిమగంధకం।
అథవా పారదాస్యార్థం శుద్ధగంధకమేవ హి।
తయోః కజ్జలికాం కుర్యాద్దినమేకం విమర్దయేత్॥
మృత్తికాం వాససార్థం కుట్టయే దతియత్నతః।
తథా వారత్రయం సమ్యక్ కాచకూపీం ప్రలిప్తయేత్॥
మృత్తికాం శేషయిత్వాతు కూప్యాం కజ్జలికాం క్షిపేత్।
తాం కూపీం వాలుకాయంత్రే స్థాపయిత్వా రసం పచేత్॥

అగ్నిం నిరంతరం దద్యాత్ యావద్దినచతుష్టయం ।
గృహ్ణీయాత్ దూర్ధ్వ సంలగ్నం సింధూరం సదృశం రసం

## రసాయన శాస్త్రపదముల కొంగ్ల పదములు, గురుతులు:—

Antimoney  లేక 

Arsenic  లేక 

Cobalt 

Copper 

Gold 

Iron 

Lead

Mercury (పాదరసము)

Silver 

Tin

Zinc

## రసాయనశాస్త్రమున భౌతికపదార్థముల కొంగ్లపదములు, సంజ్ఞలు, వాని యుధమపరిమాణపు ( దూనికలు(Abriviations of Elements with their approximate atomic weights):—

1 Aluminium దీని atomic weight 27 గురుతు Al.

| | | |
|---|---|---|
| 2 Antimony | 120 | Sb. |
| 3 Argon | 40 | A. |
| 4 Arsenic | 75 | As. |
| 5 Barium | 137 | Ba. |
| 6 Bismuth | 208 | Bi. |
| 7 Boron | 11 | B. |
| 8 Bromine | 80 | Br. |
| 9 Cadmium | 112 | Cd· |

| | | |
|---|---|---|
| 10 Caesium | 133 | Cs. |
| 11 Calcium | 40 | Ca. |
| 12 Carbon | 12 | C. |
| 13 Cerium | 140 | Ce. |
| 14 Chlorine | 35.4 | Cl. |
| 15 Chromium | 52 | Cr. |
| 16 Cobalt | 59 | Co. |
| 17 Copper | 63.5 | Cu. |
| 18 Erbium | 167 | E. |
| 19 Fluorine | 19 | F. |
| 20 Gallium | 70 | Ga. |
| 21 Germanium | 72 5 | Ge. |
| 22 Glucinum దీనికే Beryllium అనియు నందురు. | 9.1 | Gl. |
| 23 Gold | 197.2 | Au. |
| 24 Helium | 4 | He. |
| 25 Hydrogen | 1 | H. |
| 26 Indium | 115 | In. |
| 27 Iodine | 127 | Ir. |
| 28 Iridium | 193 | Ir. |
| 29 Iron | 56 | Fe. |
| 30 Krypton | 83 | kr: |
| 31 Lanthanum | 139 | La. |
| 32 Lead | 207 | Ph. |
| 33 Lithium | | Li. |
| 34 Magnesium | 24 | Mg. |
| 35 Mangsnese | 55 | Mu. |
| 36 Mercury | 200 | Hg. |
| 37 Molybdenum | 96 | Mo. |
| 38 Neodymium | 144.3 | Nd. |
| 39 Neon | 20 | Ne. |
| 40 Nickel | 58.6 | Ni. |
| 41 Niobium | 93.5 | Nb. |
| 42 Nitrogen | 14 | N. |
| 43 Osmium | 191 | Os. |
| 44 Oxygen | 16 | O. |
| 45 Palladium | 106.7 | Pd. |
| 46 Phosphorus | 31 | P. |
| 47 Platinum | 195 | Pt. |
| 48 Potassium | 39 | K. |
| 49 Praeseodymium | 140.5 | Pr. |
| 50 Radium | 226 | Ra. |
| 51 Rhodium | 103 | Rh. |
| 52 Rubidium | 85 | Rb. |
| 53 Ruthenium | 101.7 | Ru. |
| 54 Samarium | 150 | Sa. |
| 55 Scandium | 44 | Sc. |
| 56 Selenium | 79 | Se. |
| 57 Silicon | 28 | Si. |
| 58 Silver | 108 | Ag. |
| 59 Sodium | 23 | Na. |
| 60 Strontium | 87.5 | Sr. |
| 61 Sulphur | 32 | S. |
| 62 Tautalum | 181 | Ta. |
| 63 Tellurium | 127.5 | Te. |
| 64 Thallium | 204 | Tl. |
| 65 Thorium | 232 | Th. |
| 66 Thulium | 168.5 | Tu. |
| 67 Tin | 119 | Sn. |
| 68 Titanium | 48 | Ti. |
| 69 Tungsten | 184 | W. |
| 70 Uranium | 238 5 | V. |
| 71 Vanadium | 51 | V. |
| 72 Xenon | 130.5 | Xe. |
| 73 Ytterbium | 172 | Yb. |
| 74 Yttrium | 89 | Y. |
| 75 Zinc | 65 | Zn. |
| 76 Zirconium | 90.5 | Zr. |

## రసాయన (రసవాద) శాస్త్రము:–

పాశ్చాత్యులు రసాయనశాస్త్రము (Chemistry) ను (Natural scince) నందలి భాగమందురు. వారు దీనిని "Study of composition of substance అనియు, Chemical changes by which substance are formed, the factors which influence such changes, and the accompanying phenoniena" అనియు, వివరించియున్నారు.

పాశ్చాత్య రసాయనశాస్త్రము నుద్ధరించినవాఁడు Robert Boyle అని యందురు. ఈతఁడు క్రీ. శ. ౧౬౨౭ మొదలు ౧౬౯౧ వరకు జీవించెనఁట. ఆయన కెనుఁబది లేక తొంబది లోహములఁగూర్చి తెలియునఁట. లోహములు తమనుండి వేడిని, యెలక్ట్రిసిటీని నడుపఁ గలవని యాతఁడు గ్రహించెనఁట. ఆపనిఁ జేయలేని వానికి non metals అని పేరిడెనఁట.

Arsemic Cellurium మొదలగునవి కొన్ని metals యొక్కయు, nonmetals కొన్నిపదార్థములఁ గల్గియుండును. Elements అనఁబడు వానియందుఁ గొన్ని గట్టివిగనుండు లోహములుగను, హైడ్రోజను, ఆక్సిజెను, క్లోరెన్, నైట్రోజను మొదలగుకొన్ని గాలులుగను, mercury and crumine అను రెండును ద్రవరూపములుగ నుండునవియు నన్నియు elements అనియుఁ జెప్పఁబడినది.

రెండుగాని, మూఁడుగాని కలుపుటవలన సిద్ధమైనఁ గలుపుడులోహాదుల కల్లుఁ గలసినపదార్థములనుండి symbols ఏర్పరుపఁబడినవి. మరియు నాసింబల్సు దాని atomic weight ను గూడఁ దెలుప నుపయోగించెడివి. ఒక్కొక్కతటి నట్టి లోహపుఁగలుపుటలం దేదేనియొక్కవ 'ఆటోము' (పుద్గలము) లు కలుపఁబడినవాని నక్షరముల ప్రక్కనంకెలతో వివరింతురు.

రేడియో విధానము రసాయనశాస్త్రమును జక్కఁగ ననుసరించినది. (రసాయనశాస్త్రఁపుగురుతులు, తూనికెలు చూడుఁడు)

**రసాంజనము:**— ఇదియు నొకవిధమ Antimoney యని చెప్పఁబడినది. వేడిఁజేయునవియు, నూపిరిఁగొట్టినొప్పి, యెక్కిళ్ళు, కఫరోగము, చర్మముఖరోగ నాశికారోగ నేత్రరోగములు, రక్తపైత్యము, వాతపైత్యము, వాతరోగములు, విషదోషములు, శ్వాసకాసలు నివారణమగునని చెప్పఁబడినది.

**రసానది:**— ఇప్పుడు 'జక్సార్టీస్' అనఁబడుచున్న నది. పారశీకుఁడు 'అవెస్తా' గ్రంథమున దీనిని 'రహ్హా' యని పేర్కొని యున్నాఁడు. రసానదిప్రశంస ఋగ్వేదమునఁ గాన నగుచున్నది.

**రస్కినిజమ్ (Ruskinism):**— జాన్ రస్కిన్ 1819–1900 ప్రాంతమున రస్కిన్ గొప్ప కళావిమర్శకుఁడు. కావ్యకళావిమర్శనములం దొక్కయగ్రస్థానము నొందినవాఁడు. ఈతనిమార్గములు 'రస్కినిజమ్' అనఁబడును. ప్రపంచమున నిప్పు డితని ననుసరించువార లనేకులు కలరు.

**రసేశ్వరుఁడు:**—ఈరససిద్ధుఁడు గోవిందభగవత్పాదులశిష్యుఁడు. ఈతనినామ మిది కాదనియు, గొప్పగొప్పపరిశీలన లొనర్చుచుండుటకు మెచ్చుకొని యాతనిగురుఁడగు గోవిందభగవత్పాదులు వీరి కీబిరుదనామ మిచ్చిరనియు నదంతి కలదు. (గోవిందభగవత్పాదులు చూడుఁడు.)

**రక్షించినవానిని భక్షించేవాఁడు:**—
(ఆంధ్రలోకోక్తి)

**రాంపూర్ స్టేటు:**— ఆగ్రా యయోధ్య సంయుక్తరాష్ట్రముల గవర్నరుగారి యధికారమునకు లోఁబడిన స్వదేశసంస్థానము. రోహిల్లా లధికముగఁ గలరు. పరిపాలకుఁడు నవాబుగారు. రాంపూరు రాజధాని. పురముఁజుట్టును గొప్ప వెదురు డొంకయు, కందకమును గలవు. ఇది చద్దరుల నేతకుఁ బే రందినది. చిన్నరాజ్యము.

**రాకాసిగెడ్డచెట్టు:—** దీనింగూర్చి యంతగాఁ దెలియకున్నది. దీనికి లాటిన్భాషయందు agave americana అనియు, సంస్కృతమున 'కంటలః' అనియు, బేర్లని కొందరందురు గాని 'కంటలః' అనుపదము తుమ్మచెట్టునకు వర్తించెడు పదము.

దీని యాకులలో నుండెడిగుంజు పైనికట్టిన కండ్లయుడుకు, ఎరుపు, మంటలు నివృత్తి యగుననియు, పంచదారతోఁ దినిన సెగరోగము నివృత్తి యగుననియు, వేళ్ళరసము మూత్రమును జారీ చేయుననియుఁ జెప్పఁబడినది.

**రాక్షసబొగ్గు** (Coal) :— దీని నెఱుంగని వారు లేరు. అనేకదేశములందు దొరకుచున్నది. దీనియందు, కార్బన్, హైడ్రోజన్, ఆక్సిజెన్, నైట్రోజనులుఁ గలవని తేలినది. గాన నిది కాలి మండి వేడినొసంగుటకు సంసిద్ధమై యుండును. రాక్షసబొగ్గును రసాయన శాస్త్రవేత్తలు, "all coals originated in cellulose which is main constitutent of plant tissue" అని తెల్పునున్నారు.

రాక్షసబొగ్గునందు Bituminous coal అనియు, brown coal (ignited) అనియు, Cannel coal (amorphous black-casily ignited) అనియు, Anthracirte cole (Stone like and not readily ignited) అనియు, పరిశీలకులు విభజించియున్నారు)

రాక్షసబొగ్గునుండి దొరకు (తీయంబడుచున్న) పదార్థములు (Products) విలువఁగల్గి యుపయోగకరములై యున్నవి. దీనియందు Gas, Tar, Coke అనఁబడు ముఖ్యపదార్థములు మూఁడు లభించుచున్నవి. అందు Tar నుండి (1) ammonia (2) Naphtha (3) Creosote (4) anthracene oil (5) Pitch అనఁబడుపదార్థము లైదు తీయఁబడుచున్నవి.

మరియు నిందలి Naphtha నుండి (1) Benzene (2) Toluene (3) Solvent naphtha, (4) Carbolic acid అను నాల్గుపదార్థములును, Creosote నుండి Naphthaline అనఁబడు పదార్థమును, Anthracene oil నుండి anthracene అనఁబడు పదార్థమును తీయుచున్నారు.

రాక్షసబొగ్గు కర్మాగారములం దుపయోగింపంబడుట యెల్లరెఱిఁగినదే.

**రహతూర్ (రాష్ట్రకోట) క్షత్రియులు:—** రహతూర్ వంశము రాజపుత్రస్థానములందలి ముప్పదియాఱు క్షత్రియవంశములలో నొకటి. వీరు క్రీ. శ. అయిదవశతాబ్దమునకుఁ బూర్వమునుండియు కనోజి, కన్యాకుబ్జపురము రాజధానిగాఁ బరిపాలించియున్నట్లుఁ జరిత్రకారులు వ్రాసియున్నారు. కన్యాకుబ్జము కుశుని కుమారులలో నొకఁడగు కుశనాభునిచే నిర్మింపఁబడిన పట్టణము. పాటలీపురము ముఖ్యపట్టణముగాఁ బరిపాలించిన యవనాశ్వుఁడు రహతూర్ వంశమునకు మూలపురుషుఁడని ప్రతీతికలదు గాని, వీ రాది కాలమునుండి పండ్రెండవశతాబ్దమువఱకుఁ గన్యాకుబ్జపురమే రాజధానిగాఁ బరిపాలించుచుండినట్లుఁ జరిత్రాత్మకములగు నిదర్శనము లుండుటచేఁ గుశునిసంతతివా రనుటయే సమంజసమని తోఁచెడిని.

ఇప్పుడు 'మార్వారు' అనఁబడు రాజపుత్ర దేశమును బరిపాలించువారు రహతూర్ సంతతి

వారే. ఈరహతూరు లుత్తమమైన యభిజాత్యముఁ గలవారు. సద్వంశసంజాతులమని వారిస్వాతిశయభావము. వీరివంశమువాఁడగు జయచంద్రుని (సంయుక్తాదేవితండ్రి) కాలమునందే ఢిల్లీ కనోజి రాజ్యములు విధ్వంసములై విమతస్థులచేతిలోఁ బడినవి. తత్సంబంధమగుచారిత్రక గాథ యెల్ల రెఱింగినదే.

కనోజిరాజ్యము శతృవశమయినవెనుక జయచంద్రునిపౌత్రులగు సియోజి, సేత్రాము ననువారు తమ జన్మదేశమును విడిచిపెట్టి, హతశేషులగు రెండువందలమంది పరివారముతోఁ బశ్చిమాభిముఖులై పోవుచుండఁగా, కలామదదుర్గాధీశ్వరుఁడగు సోలంకివంశక్షత్రియుఁ డొకఁడు శత్రువిజయార్థమై వీరిసహాయము నపేక్షింపఁగా వీ రంగీకరించి సమరమునకుఁ గడంగ నారణమునందు వీరికి జయము సిద్ధించెనుగాని, సియోజీసోదరుఁడగు సేత్రాము వీరశయనము నందినట్లును, సియోజి తనకుఁ జేసినసహాయమునకుఁ గృతజ్ఞతగా నుభయవంశములవారికి నప్పటినుండియు మైత్రిఁగలిగి, మార్వారునందు రహతూర్‌వంశము స్థాపించుటకు సోలంకివా రమూల్యమైనసహాయ మొనర్చినట్లును, నప్పటినుండియు రహతూర్‌వంశము యోధపురము రాజధానిగా మార్వారునందు దినదినాభివృద్ధిఁ గాంచినట్లును, ఈయభ్యుదయ మజితసింహుఁడు తన కుమారుఁడగు నభయసింహునిచే హత్యఁగావింపఁబడువఱకు నిరాఘాటముగా సాఁగెననియును జేమ్సుటాడ్ తనరాజస్థానచరిత్రయందు వ్రాసియున్నాఁడు.

ఈరహతూర్‌వంశజులు మొగలాయీ పాదుషాయగు నౌరంగజేబుపరిపాలనకాలములోఁ దమదేశమగు మార్వారు, తత్పాలకుఁడగు జస్వంతసింగు ననంతరమునఁ దురుష్కులచేతిలోఁ బడకుండ ఠాకూర్ దుర్గాదాస్ (యోధపురవీరాగ్రేసరుఁడు) అనునొక బ్రాహ్మణవీరునిసహాయమున ముప్పది సంవత్సరములు పోరాడి తుదకుఁ దమరాజ్యమును నిలఁబెట్టుకొనినట్లు దేశచరిత్రములందుఁ గలదు.

**రహస్యలేఖనము:—** దీని నాంగ్లమున Crypto graphy అందురు. ఏర్పరుచుకొన్న పలురకముల సాంకేతికాక్షరములతోను, అంకెలతోను, గురుతులతోను రహస్యలేఖలను వ్రాయు విధానము.

**రహస్యసంఘములు:—** సాముదాయిక కార్యార్థులుగఁ గూడుట సంఘ మగును. అన్యుల కెఱుక లేకుండ నాలోచించుటయు, కార్యాచరణమునకుం గడఁగుటయు రహస్య మగును. ఇంత మాత్రమున నపాయ మెవ్వరికిఁ గానరాదు. సుప్రసిద్ధమగు ఫ్రీమేసనరీసంఘ మిట్టిదియె; కాని సంఘములు కుట్రలు నడపుట కేర్పాటైనవి. తమ పేరుగాని, యునికిగాని, కూడుటఁగాని, యభిప్రాయములుగాని కడుఁగడు రహస్యముగ నుంచుకొని యెక్కువ జాగరూకతతో మారుపేర్లు, మారువేషములు నైచుకొని యతిసాహసమునఁ బాపభీతి లేకుండుట, నిర్దయ, క్రూరతలంగల్గి కుట్రలు నడుపుచు నిలచియుండెడివి. ఇవియే రహస్యసంఘములు (Secret societies). ఇట్టివే ప్రభుత్వములనుసైతము తారుమా రొనర్చియు, భగ్న మొనర్చియు, హత్య లొనర్చియు, రాజకీయాధికారములఁ బడయఁ బ్రయత్నించును.

ఏదేశములం దిట్టియుద్యమములు ప్రారంభింపఁబడినవో యాదేశస్థులే దానియందుఁ బ్రధాననాయకు లగుటయుఁ గానరాదు. ఒక్కొకతఱి నన్యులుఁగూడ నుండుటఁ గానవచ్చెడివి. ఇటలీదేశమునం దొకప్పుడు 'అండర్గ్రౌండుసంఘముగఁ'

దలంపఁబడిన నాజీయుద్యమసంఘమున నొకరగు హిట్లరుగారు ఆస్ట్రియాదేశస్థుఁడగుటయు, రష్యా ప్రభువగు జారును హత్య యొనర్చి ప్రభుత్వమును తారుమారొనర్చిన స్టాలిన్‌గారు జార్జియాదేశస్థుఁడగుటయు, టర్కీసుల్తాను ఖలీఫాగారిని పదభ్రష్టుంజేసి ప్రభుత్వమునకు మార్పుఁ గల్గించిన ముస్తఫాకెమాల్పాషాఅటాటుర్కుగారు సెలోని కాయందు జన్మించిన గ్రీసుదేశస్థుం డగుటయుఁ జూడ నీవిధిం గూర్చిన రహస్య మేదియో కల దనియు, రహస్యసంఘములు కేవలరాజకీయోద్యమములకేగాకఁ బ్రత్యేకకార్యములకుఁగూడ నుం డుననియు స్ఫురింపకపోదు. ఇంతకును నివి రహస్య సంఘములు. ప్రభుత్వోద్యోగుల కభేద్యమై యుం డుటకు వలయు కట్టుదిట్టములు జాగ్రతలఁ గొని యుంటయు, బయల్పడుదనుకఁ దెలియనిరహస్య ములుగ నెంచుటయె సమంజస మందురు.

రష్యాదేశముఁన జక్రవర్తి కుటుంబఁపుహత్య యు క్రీ. శ. ౧౮౫౦ నాటినుండియుఁ గల చరిత్ర యగు మాస్కోట్రియల్సు రహస్యసంఘకార్య ములుగఁ దలంపఁబడుచున్నవి. ౧౮౦౫ లో సుప్ర సిద్ధుండగు ట్రోట్స్కీగారు ప్రధాననాయకుఁ డగుటయు, ౧౮౦౭ లోఁ బోలీసువిజృంభణమున సంఘనాయకులు విదేశములకు వెడలిపోవుటయు గమనించఁదగినవి. ఈనాయకులలోఁ గొందరికిఁ దమస్వంతగూఢచారిదళములు గల వందురు.

ఇటలీదేశమున రహస్యసంఘములకు స్పానియా దేశఁపురహస్యసంఘముల పోల్కె లున్న వందురు. ఇరుదేశములవారును రహస్యవిద్యలందు నేర్పరు లనియు నం డిటలీవా రెక్కుడు దూరాలోచనా పరులును, నధికసాహసులును నని వాడుకలు గలవు. ఇటలీయందుఁ బురాతనరహస్యసంఘమును 'కార్బొనరీ' యందురు. (రాక్షసబొగ్గును దహిం చువారని దీని కర్థ మఁట.) అందలిసభ్యులకు Good cousin అని వ్యవహారనామమనియును, వా రొకరి నొకరు సంబోధించుకొనుటయు నిట్లె యనియును, నాసంఘఁపు ముఖ్యోద్దేశములు స్వేచ్ఛాసంపాదనమును నొసరమగుతఱి నధికారధిక్కారమునినియును, నింకఁ గొన్నియుద్దేశములు కాలమునుబట్టి యవసరములమేరకు మారుచుండె ననియును వాడుకలు ప్రబలియున్నవి. ఇటలీదేశ మున వే రొక రహస్యసంఘము 'కామొఱ్ఱా' యని తెలిసెడిని. దీని నన్యదేశములవారు 'గొమొఱ్ఱా' యనుచుంటయు, నెపోలియనునాటి దియో లేక నాతనితో సంబంధముఁ గల్గియుండి నదో తెలియకున్నదిగాని దీనిని Nepolitan Cammorra యనుటయుఁగూడఁ గలదు. ఇది బలముఁ గలదియై యపాయకరమైనదనియు, ప్రభుత్వోద్యోగు లుదాసీనులై యూరకుండుఁటచేతి వ్యాపకముఁ గల్గియున్న దనియు నందురు. దీని ప్రధాననాయకులకు బిగ్‌హెర్రీయని యుద్యోగ నామమని చెప్పుకొ గలదు. దీని వింతచర్య లిటలీ యందేగాక నమెరికాసంయుక్తరాష్ట్రసీమలందును గన్పట్టుచుండు ననుచున్నారు. ఇంతియెగాక నిటలీ దేశమున Black hand అను రహస్యసంఘము కల దందురు.

సిసిలీ ద్వీపమున 'మేఫియా' యనఁబడు రహస్య సంఘము రాజకీయసంస్థగ నుండినదనియు నైరో పామహాసంగ్రామమునకు ముందుకాలమున దీని యందలి సభ్యత్వము సగర్వముగఁ దలంపఁబడు చుండెడిదనియుఁ బిదప నేరము లొనర్చునదిగ నాయెననియు, దీని నడఁచుటకు ముస్సొలోనీగారు పటాలముల నుపయోగించవలసివచ్చెననియు నం దురు. దీని నన్యదేశములందు Sicilian mafia

యు, యుగోస్లావియాయం దీపేరునె వహించిన వేరొక రహస్యసంఘమును, Czech mafia యనియు, వాడుచుండుటఁ గలదు.

స్పానియాదేశమున రహస్యసంఘకార్యములు తరుచు బయల్పడుచుండు నందురు. వాటిలో ముఖ్యమైనది Gardiena రహస్యసంఘము. ఇది యెప్పుడు జనించెనో తెలియదుగాని క్రీ. శ. ౧౮౨౦ నుండియుఁ గలదందురు. ౧౯౩౨ లోఁ జాలభాగ మడఁచివేయఁబడి యప్పటప్పటఁ దల యెత్తుచునే యున్నదందురు. ఆదేశఁపుఁ బర్వతారణ్యములు వీటికి క్షేమకరములగు రక్షక స్థానములుగ నుండుననియు, దక్షిణఅమెరికా, మెక్సికో, పెరూ, బ్రెజిల్దేశఁపు రహస్యసంఘములతో స్పానియారహస్యసంఘములకు సంబంధము లేర్పడియున్నవనియు వదంతులు వ్యాపించియుంటఁ గాననగును.

రహస్యసంఘముల చర్యలనుండి జర్మనిదేశ మైరోపాఖండమున Hot Bed గాఁ దలంపఁబడుచున్నదఁట. ఆది నీదేశఁపుసంఘములు జాతి, తెగల భేదములనుండి యేర్పడినవఁట. పెక్కులు Vehmgericht tribunal నాటినుండి యుండినవనియు నైరోపామహాసంగ్రామకాలమునుండియు నధికములైనవనియు నందు Monarchist steel Helmets సంఘము, The Republican gold Banner సంఘము, The werwolves సంఘము, The Black Reichswehrసంఘము, The "C" organisation సంఘము, ముఖ్యములనియు, ఇంకఁ గొన్నికమ్యూనిష్టురహస్యసంఘములు కూడఁగలవనియు వాడుకలు వ్యాపించియున్నవి. హిట్లరు గారిట్టి రహస్యసంఘములను కొంతవరకడఁచి నాజీపార్టీ యనుపేర నేకముఁజేసిరనియు, పైకి రాజకీయముగ నాజీపార్టీ కన్పించుచున్ననుదానివిపరీతచర్యలును, వింతపనులును లోకులకనుమానముఁ గల్గించుచున్నవనియు, వీనినైక్యత తాత్కాలికముగాని స్థిరముగాదేమోయని సందేహింపఁ జేయుచున్నదనియుఁ దలంచుచున్నారఁట.

ఆస్ట్రియా రహస్యసంఘములు బాల్కను రాష్ట్రముల సంఘములఁ బోలిన వందురు. ఇప్పుడీదేశము జర్మనీకిఁ జేరిపోయియుంట వీటిభవిష్యత్తింకను స్పష్టముగ నూహింపఁ జాలనిది. ఫ్రాన్సుదేశమున రహస్యసంఘముల ప్రాముఖ్యత లేదనియు, పారిస్, మార్సలీస్ నగరములందున్న ట్లూహింపంబడునవి విదేశసంబంధములనియుఁ దలంపంబడుచున్నవి. గాని నేరము లధికముగ జరుగుచు బయల్పడుట దుర్భరముగుస్థితిఁగల్గియుంట ననుమానాస్పదముగ నున్నదనుచున్నారు. గ్రీసుదేశమునందే ప్రభుత్వమును నధికకాలము నిలువఁజాలనిదుస్థితికీరహస్యసంఘములే కారణ మందురు. వీటి కన్నిటికిని టర్కీ-ధిక్కారము, జాతీయాభిమానము ప్రధానోద్దేశము లందురు. ఆదిని గ్రీసుదేశమున Hetaires of Rhigas అనఁబడు కూటములు (associations) ఉండెడివనియు, వానిసంతతియె నేటిరహస్యసంఘములనియు ననుచుందురు. పోలాండుదేశమున నైరోపామహాసంగ్రామమునకుఁ బూర్వము (స్వతంత్రత లేనినాడు) రష్యానుండి విముక్తిఁగాంచ రహస్యసంఘములు పనిచేయుచుండెనఁట. నేటికినిఁ గొన్నియాదేశమున లేకపోలేదని వదంతులుఁ గలవు.

బాల్కనురాష్ట్రదేశములం దిట్టిరహస్యసంఘముల పరిశీలనలం దాల్బేనియా, యుగోస్లావేకియా (లేక జుగోస్లావ్ లేక సెర్బియా) రూమేనియా దేశములు పేరొందఁదగిన వనుచున్నారు. ఆల్బేనియా యాదినుండియు పేరందినదనియు, Clirine kombetar రహస్యసంఘము కమ్యూ

నిష్టుసంస్థయనియు, దీనికిటలీదేశరహస్యసంఘముల తోఁ సంబంధములు కలవనియుఁ బెక్కండ్రుతలంచు చున్నారు. యుగోస్లావేకియా(మునుపటిసెర్బియా) యందు Ujedinjenjc ile smrt అనఁబడు రహస్యసంఘము ప్రపంచమందలి రహస్యసంఘ ములలో భయంకరమైనదనియు, దీనిచిహ్నము విప్పినయరచేయి నల్లసిరంగుఁగలదిగాన దీనిని Serbian Black hand అని విదేశములందు వాడుటఁ గలదనియు, దీని కిటలీదేశపుబ్లాకు హేండు సంఘముతో నేసంబంధము లేదనియు నందురు. ఇంకఁ గొందరీరహస్యసంఘము ఆస్ట్రియాదేశము నందుండిన Pan slav movement నుండి యేర్పడినదిగాఁ దలంచుచున్నారు. ఇటీవల ఆస్ట్రియా నెదుర్కొనుటకు (Czech) మొఫియాసంఘము బయలుదేరినదఁట. దీనిముఖ్యోద్దేశము స్వతంత్రసంపాదనమందురు. రూమేనియాయందు రహస్యసంఘములు పెక్కులున్నను తిరుగుఁబాటు గానవచ్చుట లేదందురు. Iron guard అనఁ బడునది semi secret society అని కొందరు తలంతురు. దీనికిం గారకుఁడు, కర్తయు పోలాండుదేశస్థుఁడగు Codreannu అనుపేరుగలవాఁడు క్రీ. శ. ౧౯౨౭ లో స్థాపించెనఁట. దీని నిజతత్వ మేమిటోగాని దీనిప్రధానవైరి Madame Lupescu అమ్మగారు దీనికివెరచి ౧౯౩౨ దీనితో రాజీ కుదర్చుకొనిరనియు, ౧౯౩౪ ప్రధానమంత్రి హత్యకుఁ గొంతసంబంధము కలదనియు వాడుకలు ప్రబలియుండ విననగుచుండును.

ఐర్లాండుదేశమునందు రహస్యసంఘములు కలవని వాడుకలు ప్రబలియున్నవి. స్వతంత్రముంబడయుటతోఁ దగ్గిపోయినను నింకను కొన్ని నిలిచియున్నవని తలంచువారును గలరు. ఇంగ్లాండునందిట్టిసంస్థలు లేవనియె చెప్పనగును.

**రాగములు:**—సంగీతశాస్త్రమున వివరింపఁబడినటుల స్వరములను రాగరత్నాకరమునఁ జెప్పఁబడినపద్ధతులమేరకు దశవిధగమకములపాల్జేసి ప్రస్తరించిన రాగము లేర్పడును. ఉత్తరదేశమునందుఁ బ్రచారమునందున్న రాగ రాగిణీపుత్రవిధానమును, దక్షిణదేశమునందు వాడుకయందున్న కర్ణాటక సాంప్రదాయవిధానమును, రాగములయేర్పాటును గూర్చినవై యున్నవి. అం దుత్తరదేశఁపువిధానము కడుపురాతనమైన దందురు. ఉత్తరదేశఁపు విధానమునఁ గర్తారాగము లనుటకుబదులు 'తాట్' లందురు. వీట్ల నుత్తరదేశఁపుసంగీతవిద్యావిశారదులు గొంద రేర్పఱిచిరని పరిశీలనవలనఁ దేలుచున్నది.

క్రీ. శ. ౧౬౬౦ సం॥ర ప్రాంతముల జీవించియుండిన గాయకశిఖామణియగు వేంకటమఖి 'చతుర్దండి ప్రకాశిక' యనుగ్రంథమును రచించిన వాఁడు. మఱియు నాయనయే మేళకర్తారాగముల నుండి జనించెడిజన్యరాగములు విధాన మేర్పఱచియో, చక్కఁబఱచియో యుద్ధరించిన మహనీయుఁడని తేలుచున్నది. కాని వేంకటమఖికాలమునకు నిప్పటి మేళకర్తారాగములలోఁ గొన్నిటికి మాఱు పేరు లుండినటులఁ బరిశీలనవల్లఁ దెలియు చున్నది. [జనకరాగములు చూడుఁడు. సంగీతము చూడుఁడు.)

రాగములు మేళకర్తారాగములు, లేక జనక రాగములనియు, జన్యరాగము లనియు, వక్రరాగములనియు, నవకరిరాగములనియు, నుపాంగము లనియు, భాషాంగరాగములనియు పేరులచేఁ దన రారుచున్నవి. వాట్లను వేర్వేరు తావులఁ గాననగును.

ఈరాగము లన్నియు సంపూర్ణము లనియు, షాడవము లనియు, ఔడవము లనియు, మొదట త్రివిధభేదములుగనుండినవి. అవి వివరింపఁబడును.

| | |
|---|---|
| సంపూర్ణ రాగములు | ౭౨ |
| సంపూర్ణ షాడవరాగములు | ౪౩౨ |
| సంపూర్ణ ఔడవరాగములు | ౧౦౮౦ |
| షాడవసంపూర్ణ రాగములు | ౪౩౨ |
| షాడవషాడవరాగములు | ౨౫౯౨ |
| షాడవఔడవరాగములు | ౬౪౮౦ |
| ఔడవసంపూర్ణ రాగములు | ౧౦౮౦ |
| ఔడవషాడవరాగములు | ౬౪౮౦ |
| ఔడవఔడవరాగములు | ౧౬౨౦౦ |
| | ౩౪౮౪౮ |

సంగీతశాస్త్రమునఁ జెప్పఁబడినరీతిని ప్రస్తరింపఁబడదగు నీముప్పదినాలుగువేల యెన్మిదివందల నలుబదియెన్మిదిరాగము లన్నియుఁ బూర్తిగా వాడుక నందియుండలేదు. ఇందుఁ బెక్కురాగములకుఁ బేరులు పెట్టఁబడలేదు. దక్షిణదేశమునందుఁ బ్రచార మందియున్న కర్ణాటకసాంప్రదాయ విధానమున నెక్కువపేరందిన త్యాగరాజపండితుఁడు రమారమి నాల్గువేలవఱకు రాగములకుఁ బేర్లిడి, అందుఁ గొన్నిటియందో, యన్నిటియందో కృతులు రచించియున్నాఁడు.

వెంకటమఖికాలమునకుఁ గొన్ని కర్తారాగములకు మాఱుపేర్లు ప్రచారమునం దుండినటుల ముఁన్ను వివరింపఁబడియె. మఱియు జన్యరాగములు కూడ కొన్ని యుండెనని కొందఱు పరిశీలకు లభిప్రాయపడియున్నారు. ఏది యెట్లున్నను జన్యరాగ విధానము నుద్ధరించిన దామహనీయుఁడేనని యనకఁ దప్పదు. మన మిక్కాలమునకు వాడుకలోనున్న నామములతో రాగసముదాయమును బాటింతము గాక.

## రాఁగలశని రామేశ్వర మేగినా వెంటాడించేదే:—

ఆంధ్రలోకోక్తి)

## రాగవర్ధనతాళము:—

(తాళములు చూడుఁడు).

## రాగి:—

(తామ్రము చూడుఁడు)

## రాఘుహి గోత్రము:—

(కౌశికగణము చూడుఁడు.)

## రాఘువ గోత్రము:—

—:—ఇది యాంగీరససంతతి. గౌతమగణములోని రాఘువయుపగణమని చెప్పఁబడినది. దీనికిఁ బ్రవరరూపములు రెండు.

ఆంగీరస, రాఘువ, గౌతమ, (త్ర్యార్షేయము).
అంగీరస, గౌతమ, రాఘువ (త్ర్యార్షేయము).

## రాచపుండు:—

ఆంగ్ల Carbancle. ఇది మహాఘోరవ్రణము. శరీరమునకు వెనుకభాగమున లేచునది. అతిమూత్రరోగులకుఁ దదోగ్రపరిణామము.

ఇది యపాయకర మగునది. ఆంగవై ద్యవేత్తలు శస్త్రముఁ జేయుదురు.

## రాచిరాజుగారి సీసమాలిక:-

శ్రీమన్మహామండలేశ్వర బిరుదాంకితు లగు పూసపాటి రాచిరాజుమహారాజులుంగారు రాచిరాజుగారనియు, కేతవరఁపుఁబ్రభుఁడ (మొగలితుర్రు) గు రాచిరాజుగారిచే రచింపఁబడిన సీసమాలికను 'రాచిరాజుగారి సీసమాలిక' యనియు సుప్రసిద్ధముగ వాడుచున్నారు. వీరు వశిష్ఠగోత్రక్షత్రియ కుటుంబముల యింటిపేరులంగూర్చియే యీసీస మాలికను వ్రాసియుండిరి. వీరు దీనిని రచించిన కాలము శాలివాహనశకసంవత్సరములు ౧౪౦౬. అనఁగా క్రీ. వె. ౧౪౮౪ అగునని చెప్పఁబడినది.

సీ స మా లి క.

శ్రీకరంబయిరి వ-శిష్ఠగోత్రోద్భవుల్
సప్తాశ్వేయులు - సార్వభౌము
లా ధరాధీశవం - శావతారాది ప్ర
శస్తవృత్తాంతంబు - విస్తరింతు
అలఘువిక్రముఁడు కో - సలజయాదిత్యుండు
దక్షిణవిజిగీష - దాడి వెడలి
నిగమాగమాంతపా - రగుఁ డాజి భీష్ముండు
నలదేవవర్మ సై - న్యాధిపతిగ
నఖిలసీమల విజ - యస్తంభములు నాటి
దివి కేగెను; దిర్లింగ - దేశభూమి
వాహినీపతి దేవ - వర్మ ప్రభుం డయ్యె
అష్టూరిసీమలో - నాజిఁ గొండుఁ
వల్లభు నోడించి - వైభవంబుల మించి
సార్వభౌమపదంబు - జగతిఁ గాంచె
నతనిసుతుండు బు - ద్ధావనీశుఁడు రాచ
తపస్వియై కాంచెను - ధర్మనృపుని
తనయు లాతనికి బు - ద్ధయదేవవర్మలు
బుద్ధరాజందుఁ బ్ర - సిద్ధుఁ డయ్యె
నతనితనూజుఁ డాలతబలోన్నతుఁడు మా
ధవవర్మనృపతి ము - త్తాతఁ బోలి
జనకునాజ్ఞను సప్త - శతి సాంగముగ రాచ
దేశముచే నుప - దేశ మొందె
కనకదుర్గకటా - క్ష ప్రాప్తవిభవుఁడై
మల్లియసింగనిబోర - మర్దింద్ఁ జేసె
చబుబళహత్తి మ - ళ్ళబలాధిపుని రక్త
ధారచేఁ బరదే వ - తను భజించె
వసుదిగింద్రియశక - వత్సరంబుల జయ
వాటికాదుర్గ వైభ - వముఁ గాంచె
గగనవాణీవాక్య - గౌరవంబునఁ బూస
పాటిభూమినిఁ బుటీ - వరముఁ గట్టి
వాసిఁగాంచుటఁ బూస - పాటివా రనుపేరు
పేరుఁ గాంచిరి రాచ - పెద్దలయిన

యమలరాజాదిగాఁ - బ్రముఖులు మావారు
తద్గృహానామంబుఁ - దాల్చుచుండ్రి
మామకవంశశ్రీ - మన్నృపాలుసచివుండు
దండనాథాగ్రణి - దానరాజు
వేములవాడ శ్రీ - భీమమనీషిచే
గోపాలచరితంబుఁ - గొనినమేటి
వత్సవాయిని చంద్ర - వర్మచే గిరినిధి
గగనేందుశకములఁ - గాన్క నొంది
నజ్జాపురముఁ గొట్టి - సకలారిమండల
భయదప్రతాపంబుఁ - బాదుకొలిపె
వెలసె నావంశజు - లిల వత్సవాయివా
రైరి కాకర్లమూ - డనెడివీట (గుంటూరుజిల్లా)
నయ్యపరాజేంద్రు - నాజ్ఞానువర్తియై
కనువన్నృపాలుంపు - కార్యదక్షుఁ
డై మించె నిందుఁ బృ - హస్పతిపోలిక
నావంశగృహానామ - మయ్యె నదియ
సాగివామావనీ - శ్వరు చతురోత్తల
కలరి యయ్యన్నృపాలుఁ - డాదరమున
నిజమంత్రిగాఁ జేసి - బెజవాడపరగణా
యచ్చెర్లసాగను - నట్టెవీట
బాదుర్గ మొకటి ని - ర్మాణంబుఁ గావించి
యాతని కొసఁగె ద - యాపరతను
నాఁటగోలెను దగ - నాగృహానామంబు
సాగివారని మఱి - సచివవరులు
దండనాథులును, బాం - ధవులు, సామంతులు
ఫౌఁజుదారులు; పోటు - బంటుమాను
లయిన తద్గోత్రజు - లల్లూరి వేంకట
రాజు, నయ్యపరాజు - రామరాజు
మంతిన గుర్రాజు - కంతేటి పెదరాచి
రాజును, బాలాజు - రామరాజు
సిరుగూరి గుర్రాజు - చేకూరిదేవన్న
పాలుండు కంచెర్ల - పాటి తమ్మి

రాజాగ్రిణియు భయి - ర్రాజు భయర్రాజు
పేరిచ ర్లక్కభూ - విభుఁడు పెమ్మ
రాజువీరపరాజు - రాపెపాటన్నపృ
థ్వీభర్త సరిపల్లి-తిమ్మరాజు
వేగేశనయ్య పృ - థ్వీనాథుఁ డడ్డూరి
శ్రీరంగరాజును - చెరుకువాడ
కోనన్నృపాలుండు - కూనమపూడి బ
య్యపరాజు కోసూరి - యమలరాజు
నందేల కృష్ణ భూ - నాధుండు ధేనువు
కొండాధిపుఁడు పెద్ద - గోపరాజు
వేజెళ్ళ సామంత - రాజు బంధుజనాళి
నవపద్మవనహేళి - నంబిరాజు
అయినముపూఁడి రం - గావనీనాథుండు
పొత్తూరి తిరుమల - బుక్కరాజు
కూనపరాజు సు - గుణరాశి మలారాజు
దెందుకూర ర య్యాల - దేవరాజు
వెలగనాట్యాహవ - విజయుండు సరాజు
ములగవాటీపెద్ద - బుద్ధరాజు
వాడపల్లి కృష్ణ - వసుమతీనాథుండు
ఇందుకూర రచ్చిరా - జేంద్రవిభుఁడు
సామంతపూడి కృ - ష్ణమరాజు, సకినేటి
తిరుమలవేంకట - వరదరాజు
గురజాల విజయాంక - కోదండరామరా
జగ్గెపల్లిశుండు - పెద్దిరాజు
కొలుకులూరన్న నృ - కుంజరుం, డస్డాల
గోవిందరాజును - గోకరాజు
కనువన్నృపాలుఁడు - గాదిరా జన్నప
రాజు, నిసుకపల్లి - రామరాజు
రుద్రరాజును రామ - భద్రనృపాలుఁడు
నడిమిపల్లి జగ - న్నాథరాజు
వలిపర్తి జగ్గన్న - పాలుఁడు, వేగిరా
జచ్యుతరామరా - జప్రభుండు
బుద్ధరాజు కొండ - భూపతి, గణపతి
రాజు గొంకనరాజు - రాజరాజు
గోరింట పెద్దకు - మారరాజాగ్రణి
పిన్నమరాజు పృ - థ్వీవరుండు
ఆదిగా నేబది - యాఱు కుటుంబముల్
కొమరొందెదరు వశిష్ట - గోత్రమునకు
వసుమతీభారధూ - ర్వహు లాశ్రితావనుల్
కలనైన బొంకెఱుం - గని సుకృతులు
అదురుగుండెయుఁ బిక్క - బెదురులేనిబలాఢ్యు
లాహవార్జునులు వి - ద్యాధికారు
లెన్నడు వైరికి - వెన్నీని శూరులు
దైవభూసురభక్తిఁ - దనరువారు
శమదమాదిసుగుణ - సంపత్తిఁగలవారు
శరణాగతత్రాణ - బిరుదువారు
అనుచు శ్రీరామచం - ద్రార్పణముగ బుతు
గగనాబ్ధిచంద్రశ - కంబునందు
తే॥ గీ॥ సరససంగీతసాహిత్య - చక్రవర్తి
రాజమార్తాండ శ్రీతిమ్మ - రాజరాజ
రాచిరాజోదితంబు వి - భ్రాజితంబు
ధరణి వెలయుత నాచంద్ర - తారకముగ॥

## రాజ (అరాధ్య) త్రయము:—

(ఆంధ్రబ్రాహ్మణులు చూడుఁడు).

**రాజకోటసంస్థానము:—** బొంబైరాజధానీప్రభుత్వఁపు టధికారమునకు లోఁబడిన చిన్న స్వదేశసంస్థానము. కచ్ఛిద్వీపకల్పమునం దున్నది. రాజకోట రాజధాని.

**రాజగిరి:—** ఇప్పటి పంజాబునందు విపాశ (బీయాస్) నది కుత్తరతీరమున నున్నది. తొల్లి యొకప్పుడు కేకయదేశ మేలిన యశ్వపతిమహారాజునకు రాజధాని.

జాగా రఘ్బురుచక్రవర్తిగారికాలమున వారిసర్వ సైన్యాధిపతిగ నుండిరఁట.

జయపూరురాజ్యమున కాది నంబరీషపురమని పేరుండెనఁట. అంబరీషపుర 'మంబ' రని పేరున నేటికిని గలదు. జయసింగుమహారాజునకు సవాయిజయసింగని బిరుద ముండెను. వారే జయపుర నగరనిర్మాత. వీరు గొప్పజ్యోతిషవిద్వాంసులు. అయిదు నక్షత్రశాలలు నిర్మించినవారు. అందొకటి ఢిల్లీయందు నొకటి యిచ్చటను, నింకొకటి బనారసునగరమునను గలవు. మాన్సింగుమహారాజంబరును బాగుగ పునర్నిర్మాణ మొనర్చినవాఁడందురు. జయపురము చేతిపనులకు, విన్నాణములకు, సౌందర్యమగు వీధులకు, భవనములకు, పూఁదోఁటలకు, బాటలకుఁ బేరందిననగరముగ నున్నది.

ఆల్వారురాజ్యము తొల్లింటి (భారతప్రసిద్ధ సాళ్వదేశమని) పోల్పఁబడినది. బూందిరాజ్యము పురాతనసంస్థానముల నాల్గింటిలో నొకటి. దీని నుండి క్రీ. వె. ౧౬౨౫ లో చీలి వేఱుగ నేర్పడిన కోటాసంస్థానమిప్పుడు వేఱుగ నున్నది.

[illegible]రు (మేర్వారా) తొల్లింటి అజయమేరు (మేరుత్వ మొనర్చిన అజయపర్వతము) రాజ్యము. ఇది యిప్పుడు బ్రిటీషువారిదిగ నున్నది.

**రాజపురప్రవేశన్యాయము:**— ఒక దీర్ఘమగు (అనేకోక్తులంగలిగిన) వాక్యము (Sentence). చూడఁగనే సరిగా బోధపడని యంత ర్విశేషము లనేకము లావాక్యమందలి వేర్వేరు మాటలను వేర్వేరుగఁ బరిశీలించుతఱి, నర్థములు చక్కఁగ స్ఫురించి, సుబోధకము గావచ్చును. అట్లె యదివఱకు సంశయగ్రస్తములుగ నుండు నవి రాజపురప్రవేశమునవలె స్పష్టపడి, చక్కఁగ సుబోధకమగునని భావము. పరిశీలనకై యీన్యాయము వాడుదురు.

## రాజబలి గోత్రము:—

(లాంగాక్షిగణము చూడుఁడు).

## రాజబెంకోళము:—

(తాళములు చూడుఁడు).

## రాజమహేంద్రవరరాజ్యము:—

(వేఁగిదేశము చూడుఁడు).

**రాజమహేంద్రవరము:**— ఆంధ్రదేశమునందలి గోదావరీమండలముననున్న పట్టణము. గోదావరినది తీర్పుతీరమునం దున్నది. ఇది విద్యావంతమగు పట్టణము. ఆంగ్లభాషాకలాశాల ప్రభుత్వమువారు కొంతకాలమునుండి యిట నిర్మించి జరపుచుంట నిచట నాంగ్లవిద్య ప్రజలందు వ్యాపించియుంటఁ గానఁగును. సంస్కృతవిద్యయు, శాస్త్రవిద్యయు నించుక తగ్గినను, గవిత్వ మిట సాధారణముగఁ గల్గియున్నది. విశ్రాంతుఁడ్వైహాసంస్కార మాంధ్రదేశమునఁ బ్రారంభించిన రావుబహదూరు కందుకూరి వీరేశలింగంపంతులువారీపురవాసులే యగుట సంస్కారప్రియత్వ మిట మెండు.

ఇచటికి కై దుమైళ్ళదూరమునఁగల ధవిళేశ్వరముకాలువ మొగయానకటయు, గోదావరీనదియందుఁ బడవలగుండా నడచువర్తక మొకపాటిది గల్గియుంటయు, రైల్వేవసతులుఁ గల్గియుంటయు, పంటఁగలసీమకు నడుమనుంటయుఁ గారణములుగ రాజమహేంద్రవర మొకమోస్తరు వర్తకస్థానమై యున్నది. గోదావరీనదియందు దిగిన కలపవర్తక మిట మెండు. ఇచటఁ గొన్ని ఫాక్టరీలు కలవు. అందుఁ గర్ణాటికుపేపరుమిల్లు ముఖ్యమైనది.

ఆదికాలఁపు రాజమహేంద్రివరఁపుఁ జరిత్రి సరిగాఁ దెలియరాకున్నది. నిదర్శనములు లేనికథలు కొన్ని కలవు గాని, చాళుక్యరాజులనాటినుండి కొంత తెలియుచున్నది. గోదావరీనదిగుండా నడుచుమార్గమును స్వాధీనమం దుంచుటకు నదీతీరముననే యొకదుర్గము నిర్మింపఁబడియుండునని తలంపఁబడుచున్నది. మఱియు నది పశ్చిమచాళుక్య లీ దేశమేలుతఱి నందు వసించుచుండిరని తలంపఁబడుచున్నది. ఈపట్టణమందలి పెద్దమశీదు ద్వారమునఁగల యొకశాసనముమేర క్రీస్తుశక క్రీ. వె. ౧౩౨౪ ప్రాంతములఁ గట్టబడినటులఁ దేలుచున్నది. పిదప వరంగల్ రాజ్యము వారిహస్తమై యది బలహీనత నందుకతనఁ గళింగోత్కలగజపతుల క్రీస్తుశక వశమాయెను. క్రీ. వె. ౧౪౭౦ లో బహమనీవంశనృపతియగు రెండవమహమ్మదువశ మాయెను. కాని, గజపతులు వారిని నెమ్మదిగ నుండనీయలేదు. ఈకలహములలో, క్రీ. వె. ౧౫౧౨ లో శ్రీకృష్ణరాయసార్వభౌముఁడు స్వాధీనపఱచుకొని గజపతులకిచ్చివేసెను. కాని, ౧౫౭౨ లో మహమ్మదీయసైన్యాధిపతియగు రఫత్ఖానుకు వశమై మహమ్మదీయులహస్తగత మాయెనఁట. క్రీ. వె. ౧౭౫౪ మొదలు ౧౭౫౮ వఱకు ఫ్రెంచిసేనానియగు బుస్సీ సైన్యములకు రాజమహేంద్రివరము నివాసమై యుండెను. పిదప నొకసారి యాంగ్లులపాల్పడెం గాని, సేనానియగు ఫోర్డ్ శూరుఁడు బందరుపై కేగినయదనునఁ దిరుగ ఫ్రెంచిసేన లాక్రమించెను గాని, నిలువలేకపోయెను. తోడనే యాంగ్లు లాక్రమించిరి. నాటనుండియు నాంగ్లప్రభుత్వమునకుఁ జేరియున్నది.

ఇచటఁ గోటయానవాళ్ళుఁ గాననగును. ఇంకఁ జాళుక్యులనాటికార్యములు, యానవాళ్లు పట్టణ ప్రాంతములందుఁ జూపుచున్నారు. ఇట గోదావరీనదిపై నిరుపమంతెనను రెయిల్వేవారు నిర్మించిరి. అది యొకటిన్నఱమైళ్ళపొడవుఁ గలది. నూటయఱువదియెనుగుల దూరముల యేఁబదియాఱు రాతిదిమ్మలపై నిర్మింపఁబడినది. (వేఁగిదేశము చూడుఁడు, కన్యకాపరమేశ్వరి చూడుఁడు).

## రాజయక్ష్మ:—

[యక్ష్మరోగము (క్షయదగ్గు) చూడుఁడు].

## రాజయోగము:—

(అభ్యాసయోగములు చూడుఁడు)

## రాజర్షులు:—

(ఋషులు చూడుఁడు).

## రాజలింగారాధ్యులు (కవి):—

ఆంధ్రకవులలో మధ్యకవులందుఁ జేర్పఁబడినవాఁడు. ఆరాధ్యబ్రాహ్మణుఁడు. ఆశ్వలాయనసూత్రము. వశిష్ఠసగోత్రము, తండ్రిపేరు సర్వేశ్వరారాధ్యులు. క్రీ. వె. ౧౬౩౦ ప్రాంతమునం దుండినవాఁడు.

ఇతఁడు కూర్మపురాణము నాంధ్రపద్యములుగా రచించెను. దీనిని తనమిత్రుండగు కోరపుట్లగ్రామనివాసి, చెరకు లక్ష్మణామాత్యుని ప్రేరణవలన రచించెనఁట. ఈతఁ డేతురకప్రభువు కడనో మంత్రిగ నుండెనఁట.

## రాజవిద్యాధరము:—

(తాళములు చూడుఁడు).

## రాజశేఖి గోత్రము:—

(లౌగాక్షిగణము చూడుఁడు).

## రాజసభాంగములు:—

(అంగములు చూడుఁడు)

## రాజస్తమ్భ గోత్రము:—

(భరద్వాజ ఉపగణము చూడుఁడు).

**రాజ్యపరిపాలనా చతురిమ:**— పరిపాలనము ప్రభు వొసర్చినను లేక ప్రజలే తమ్ముఁదాము పరిపాలించుకొనినను, నది పరిపాలనమే యగును. దీనినే యాంగ్లమున 'గవర్నమెంటు' అనియు, ఫ్రెంచిభాషయందు 'గువర్నమా' యనియు నందురు. ఇట్లుఁ బరిపాలనయందుఁ జూపు చతురతయే యాంగ్లరాజకీయవేత్తలచే Politics (రాజకీయములు) అని పేర్కొనఁ బడుచున్నది. మరియు నీచతురిమ నొకరాజకీయవేత్త Politics the Science of Government (రాజనీతులు, అనఁగా రాజ్యపరిపాలనాతంత్రము) అని వ్రాసియున్నాఁడు.

గ్రీసుదేశమందును, తత్పరిసరదేశములందును, 'పోలిస్' అనినఁ బ్రధాననగరమని యర్థము. ఆదిని ప్రధాననగరమందు రాజకీయములం దఱచుగఁ జర్చించుకొనుట రాజకీయము లేక పరిపాలన వ్యవహారములకు నాభాషయందు 'Politeia' యని పేరు కల్గెను; ఆపదమునుండి యాంగ్లపదముగ 'Politics'. అనుపదము వచ్చెను. రానురాను పాశ్చాత్యుల దృష్టియం దికాలమున 'పరిపాలన' యను శబ్దము art science Philosophy అను నీమూఁడును గలసి యేర్పడిన విద్యకు వాడుకలో నున్నది.

W. S Mac Kechnic M. A. D. Ph., పండితుఁ డీవిద్యను "Rightly cansidered political theory is co-extensive with all these branches of knowledge which treat eternal principals on which depends the happens prosperity & moral elevation of mankind grouped into king doms States or Nations" అని నిర్వచించెను. ఈమహానీయుఁడే "The state and Individual" అను రాజకీయతంత్రగంథమును రచియించి యున్నాఁడు. ఇంక నీశాస్త్రమును గూర్చిన గ్రంథములు కొన్ని పాశ్చాత్యభాషలందున్నను, నమెరికాసంయుక్తరాష్ట్రముల కధ్యక్షపదవి నందిన వుడ్రొ విల్సన్ మహాశయుఁడు రచించిన "పొలిటికల్ సైన్సు" అనుమహాగ్రంథ మగ్రగణ్య మని చెప్పుట యతిశయోక్తి కానేరదు. అందు Despotic Monarchy మొదలు, Republican Government వఱకు నన్నివిధముల ప్రభుత్వ పరిపానావిధానములును చక్కఁగఁ జర్చింపఁబడినవి.

రాజకీయశాస్త్రవేత్తలు జగత్తునందలి రాజకీ చరిత్రలం బరిశీలించిన, ఆదిని, Plato and aristotle పండితులు దెలిపిన ధర్మము లాదిగ League of Nations వారిధర్మముల దనుక నేర్పడినట్టివే చరిత్రలందు నడిచినవియని యనుచుందురు. (లీగాఫ్ నేషన్సు చూఁడుడు.)

రాజకీయచతురతలకుఁ బ్రతిఫలములుగ 'Permanance & Progress' అనియు, Authoricy & Liberty అనియుఁ జెప్పుదురు. అనఁగా నీరెండు నొండొంటి నెడఁబాసియుండని ద్వంద్వములుగఁ జెప్పఁబడినవి. మఱియు నీద్వంద్వ మొక్కొక్కయెడను, నాద్వంద్వ మింకొక్కతెఱని సంభవించుచుండునని రాజకీయవేత్తలనుచున్నారు.

ఈమహాఫలసిద్ధి కావలెనన్న దేశఁపుఁబ్రజలకు రెండునుగుణము లబ్బవలసియుండును. అవి యణఁకువ, గౌరవము లై యున్నవి. అందు శాసనముల (పద్ధతుల) పట్ల నడఁకువయును, వానినాచరణము నం దుంచెడిప్రభుత్వాధికారులందుఁ జూపెడి గౌరవమును, ప్రధానములు. ఇట్టి యీయాయణఁకువ, గౌరవము లోకద్వంద్వమని చెప్పనొప్పు. ఈద్వంద్వమునకే Law & order అని యనుచున్నారు.

అనఁగాఁ బ్రభుత్వాధికారులును, ప్రజలును, గూడ నొకేరీతిని, తా మందఱు నొకదేశపుఁ బ్రజలయ్యును, ఆయా కార్యములందు నియమితులమని తలంచున ట్లన్యాయవర్తనమునది రాసియక నిష్పక్షపాతచిత్తులై ప్రభుభక్తియు, దేశభక్తియుఁ గూడఁ గల్గి కార్యనిర్వహణ మొనర్చుచుండవలసియుండును. ఇట్టి ధర్మమునే Judicial (న్యాయశాస్త్ర నిబద్ధధర్మము) అని యందురు. న్యాయస్థానము లీజ్యూడీషియల్సంబంధములే యగును.

ఈధర్మములందు లోపములు గల్గినచో, ననర్థమును, నసంతృప్తియు సిద్ధమగును. Order (క్రమత) సరిగా నడచిననే Liberty (స్వేచ్ఛ) కల్గును. లేకున్న నిర్బంధము స్ఫురించుచునే యుండెడిని. అవి లేని Liberty యరాజకమునకు దగ్గిర మార్గము. అధికారము దారిఁ దప్పుచు, నతిశయించిన నదియే 'Tyranny' యయ్యెడిని. ఇంకఁ బ్రజాబాధకరములగు దుశ్శాసనము లన్నియు, నసంతృప్తికిని, సంచలనమునకును, దారిఁ దీయునవియే యగును. గాన, దేశము Constitution నం దివి జాగ్రతగఁ జూచుకొనఁదగును. ఇది పాలకపాలిత విధ్యుక్తధర్మమనియే చెప్పుట సమంజసము.

ఇంకఁ బ్రభుత్వదేశములందుఁ బ్రభువులు నడుపు పరిపాలనావిధానము ప్రజానురంజకమై యుండుటయే చేకురఁదగిన ఫలము. అట్లుండుటకుఁ బ్రజాప్రతినిధులను నొకసభగాఁ జేర్చి, వారి యనుమతిమేరకు దేశమును శాసించుచుండుటయే ప్రజారంజకమగు పరిపాలన యని చెప్పనొప్పును. కాని, యిం దొక చిక్కు గలదు.

అల్పసంఖ్యాకులగు (Minorities or minor Communities) వారిహక్కులను, స్వాతంత్ర్యములను, సంస్కారులమని చెప్పుకొనుచుండు వారు ప్రభుత్వశాసనసాధనమున నణఁచివేయకుండఁ దగిన కట్టుదిట్టము లేర్పడి యుండవలసియుండును. ఇ ట్లనుటతో శాసననిర్మాణసభయందలి కార్యములకు గట్టిపరిశీలనయు (strong scrutiny), దురాగతనిరోధమును (Jabardastecism) నేర్పడవలసియుండును. ఇట్టియేర్పాటు పార్లమెంటు హౌసులు రెండుగ నుండుటయే యని యింతదనుకఁ దలంపఁబడుచున్నది. Constitutional & Limited monarchy లలోఁ దొలుదొల్తఁ జెప్పఁదగినదగు బ్రిటీషుసామ్రాజ్యమునందునను, ప్రజాప్రభుత్వదేశములం దగ్రేసర మనంబడిన యమెరికాసంయుక్తరాష్ట్ర ప్రభుత్వమునందునను, నిట్లే పార్లమెంటుసభలు రెండుగ నున్నవి. ఇంకను, నమెరికాసంయుక్తరాష్ట్రములందు దుశ్శాసనము లేవైనఁ జేయఁబడెనేని, వానిని రద్దుచేయుటకు న్యాయస్థానముల కధికారము కలదు. ఇట్టితరుణములందు స్విట్జర్లాండు (Switzerland) దేశమునందు రిఫరెండమ్ (Referendam) పద్ధతి వాడుకలో నున్నది. ఈ Referendam పద్ధతిచేత majority of Voters కు Veto (సమ్మతింపకుండు) చేయు నధికారము కలదు.

ఇట్టిదేశప్రభుత్వమునకు లోఁబడినవియు, పరిపాలనకై ప్రజలవశమునం దుంచఁబడినవియు నగు Local Self Government సంస్థలు పనిఁ జేయుచుండును. ఈప్రభుత్వమునందు రెండు ముఖ్యాంశములు వేర్వేఱు దేశములందు వేర్వేఱు విధములుగ నుండి ప్రజలదృష్టి నాకర్షించుచుండెడిని. అవి Destribution of Power between Central & Local anthorities and the protection of minor Communities. మఱికొన్ని క్రైస్తవదేశములందుఁ జర్చికిఁ బ్రభుత్వ

ముతోఁ గలసంబంధముగూడ నిట్టిదియే యైయుండును. ఆదికాలమున, న్యాయపరిపాలనాదులు సామంతభూపతులకు వశపఱుపఁబడు కాలమున వారివారి యన్యోన్యమత్సరములు దేశాభివృద్ధికి బదులుగఁ గలహములకే దారిఁ దీయుచుండుట నాపద్ధతి నిరర్థకమనియే స్పష్ట మనుచున్నారు.

ఈవిషయము నిట్లు వదలి దేశసభయగు పార్లమెంటునకుఁ బ్రజలచే నంపఁబడు సభ్యులంగూర్చి వివరించుట సమంజసము. వీరియందు నైసర్గికముగ Conservatives అనియు, Liberals, అనియు నిరుకక్షులుగ భేదాభిప్రాయములం గల్గినవా రుందురు. రాజకీయములందు మార్పునఁగనే, యదివరకుఁ బరిపాటిగ నుండిన సంగతులు రావచ్చును. అది యలవాటైనవిధానమున నట్లే జరుగకొఁగొందఱకుఁగొంతచీకాకు నలజడి, యసంతృప్తి గలుగవచ్చును. ఒక్కొకతఱిఁ గొందఱ కపాయకరముగఁగూడ నుండవచ్చును గాన Conservatives మార్పునకు వెఱతురు. ఏదేని యొక విధానము గొంతకాలము నడచుటయందే యభివృద్ధి కలుగవలెనన్న మతమువారు వీరు.

రెండవకక్షవారు లిబరల్సు:— వీరు నిలచియున్నపరిస్థితులను సంస్కరించి వానికి మార్పులు చేకూర్చుటవలననే యభివృద్ధిగల్గుననువారు. అట్లయ్యును దొందరపడక నొకటితర్వాత నొకటిగ మార్పులు కలుగవలెనని వీరనుచుందురు. వీ రిర్వురకును భేదాభిప్రాయములు మెండైకలియనొల్లకుందురు. రాజకీయపరిజ్ఞాను [Statesmen] లీయిరుకక్షులవారిలోని మంచినంతయు నేర్చి కూర్చుటయే శ్రేయ మందురు.

ఇంకను చిత్రమేమనిన, నితరకక్షులు పెక్కులు లేచి, ప్రబలుచున్నవి. అవి నేషనల్ లిబరల్సు అనియు, టోరీకక్ష యనియు, సోషలిస్టు కక్ష యనియు, బోల్షవిక్కు కక్ష యనియు, కలెక్టివిజమ్ కక్ష యనియు, పలుకక్షులు భేదాభిప్రాయములతో బయలుదేఱినవి.

## రాజ్యపరిపాలనాంగములు:-

(అంగములు చూడుఁడు.)

## రాజ్యమంత్రాంగములు:—

(అంగములు చూడుఁడు.)

**రాజాతోడరుమల్లు:**—అక్బరుచక్రవర్తి కాలమున నాయనకు నమ్మకస్థుఁడగు సైన్యాధిపతియు, రాజకీయతంత్రవేత్తయు నగు నుద్యోగి. క్షత్రియజాతి. పాంచాలదేశస్థుఁడు. అయోధ్యారాష్ట్రమందలి లహర్పూరుగ్రామము జన్మస్థానము. లాహోరుమండలమునఁ జూమన్పూరియఁ దితని స్వగృహములగు దివ్యభవనము లిప్పటికిఁ బాడగుచున్నవఁట. బాల్యముననే దండ్రి మరణించెనఁట. తల్లి యతఁ డేకపుత్రుండు గాని బీదస్థితియం దుండియుఁ దోడరుమల్లున కుచితవిద్యఁ జెప్పించెను.

నిరనుద్దైన తోడరుమల్లుఁడు జీవనోపాధికి ఢిల్లీనగరముం గూర్చి పాదచారియై పోవుతఱి నూరిపొలిమేరను బాట కడ్డముగ నొక పేడకడింజుట్టుకొని యొకత్రాఁచుపా ముండుటయు, దాని పడగపై నొకకాటుకపిట్ట యత్రాత్తుగ వ్రాలితోడనే యెగిరిపోయె నఁట. ఆప్రక్కనుండి దీనిం గాంచిన యొకజ్యోతిషవేత్త తోడరుమల్లున కీశకునముం జూపి, మనశాస్త్రములు నిజమయ్యెనేని యాశకునము నీకు మంత్రిత్వముంగూర్చి, రాజ్యకార్యనిర్వాహకునిగ నొనర్చితీరునని యభివందనము నల్పెనఁట. పిదపఁ బమనైదుదినములకు మెల్లగ ఢిల్లీనగరముం జేరి యొకమఠమున విడసిన తోడరమల్లునకుఁ గోశాధ్యక్షుండగు ముజఫరు

ఖానుకడ నుద్యోగముఁ గుదిరి, యాయననిఘా యందుఁబడి, ఆయనపరిశీలనలకుఁ బాల్పడి, యను గ్రహపాత్రుఁడై యచిరకాలముననే చక్రవర్తిసాం తకార్యనిర్వహణోద్యోగియై దినములు కలసి రాఁ జక్రవర్తికడ సన్మాని యయ్యెను. అతనిపరిశీలనా శక్తియు,దూరదృష్టియుఁ గార్యనిర్వాహకసామర్థ్య మును నన్నిటికన్న నెక్కువగ భక్తివిశ్వాసములను జక్కఁగ గ్రహింపఁగల్గిన యక్బరుచక్రవర్తి యీతని గౌరవించుచు, మహాకార్యము లీతని పరిముఖమునఁ జేయించి జయమందు చుండు వాఁడు.

చక్రవర్తిసైన్యములు పోవుతఱి వర్తకులు సరకులంగొని కూడ నేగుచు విడిసినతోడనే తమ బజారులు విప్పి వలయుపదార్థముల నమ్మునట్టి ప్రయాణఁపుబజారుల నేర్పాటుఁ జేసిన దీతోడరు మల్లే. అక్బరుసైన్యమున బహదరుఖాను, ఆలీకు లీబేగు ననంబడుసైన్యాధిపతులు రాజద్రోహులై తిరుగఁబడినతఱి వారిపితూరీల నడంచిన దీతోడరు మల్లే. గుజరాతు, బీహారము, బంగాళముల దండయాత్రలందు సైన్యమునడపిన దీతోడరుమల్లే.

**రాజాధిదేవి:—** యదువంశక్షత్రియుఁడగు శూరసేనునిపుత్రిక. సోదరులు వసుదేవాదులు. అవంతిభూపాలుఁడగు జయత్సేనునిభార్య. (జయత్సేనుఁడు కురుసంతతిలోని సార్వభౌముని సుతుఁడు.) ఈమెసుతులు విందానువిందులు. కుమార్తె మిత్రవింద. (శ్రీకృష్ణునిభార్య) శ్రీకృష్ణుఁడు రాజాధిదేవికి మేనల్లుఁడు.

**రాజాయనగోత్రము:—**
(ఔతథ్యఉపగణము చూడుఁడు.)

**రాజాయనగోత్రము:—**
(కౌమణ్డ గోత్రము చూడుఁడు.

**రాజా రామమోహనరాయి బహద్దరు గారు:—** వీరు బంగాళాదేశమున జమీాందారులు. (గొప్పభూస్వాములు.) బ్రహ్మసమాజమత మనఁ బడు పరిశుద్ధాస్తికమతమునకుఁ గర్త. బంగాళీబ్రాహ్మణకులమున క్రీ. శె. ౧౭౭౪ లో జన్మించిరి. గొప్పవిద్వాంసు లఁట. అనేకభాషలు నేర్చినవా రఁట. క్రీ. శె. ౧౮౩౦ సంవత్సరమునఁ గలకత్తా నగరమున బ్రహ్మసమాజస్థాపన మొనర్చిరి.

వీరి జన్మస్థానము బంగాళములోని బర్ద్వాను మండలమున రాధానగర మనంబడుగ్రామ మని చెప్పఁబడినది. విగ్రహారాధనము, జాతిభేదములు వీరు నిరసించుచుండిరి. క్రైస్తవమతమును వీరికి సరిపడలేదు.

క్రీ. శె. ౧౮౮౩ లో నింగ్లాండుదేశమందలి బ్రిస్టల్‌నగరమున వీరు మృతి నొందిరి. వీరికాల మున నీమతము వ్యాపింపఁజాలకపోవుటయే గాక, వీరివెనుక నీమతము క్షీణింప నారంభించె నఁటఁ గాని, దేవేంద్రనాథఠాకూర్‌మహర్షి వారియొక్కయు, కేశవచంద్రసేనుబాబుగారియొక్కయు, నవ లంబనలు తిరుగ దీనిని లేవఁదీసినవఁట. కేశవచంద్రసేనునకు 'బ్రహ్మనంద' యని బిరుదము నెవ్వరో యిచ్చిరని వినుదుము. వారు ౧౮౮౪ లోఁ జనిపోయిరి.

**రాజావర్తము:—** దీని నాంగ్లమున Lapis Lazuli. ఇది లక్కరంగుగ నుండు రాయి యందురు. దీనిని గ్రమముగ శుద్ధిజేసి భస్మ మొనర్చిన నది కఫదోషము, పాండురోగము, పైత్యములు, మూలవ్యాధి, వాతములు, శూలలు నివారించునని చెప్పఁబడినది.

**రాజికేశిగోత్రము:—**
(కపి యుపగణము చూడుఁడు.)

## రాజిగోత్రము:—
(గర్గ ఉపగణము చూడుఁడు.)

## రాజిమ్ (రాజీవలోచనపురము):-
(రాజీవలోచనపురము చూడుఁడు.)

## రాజీవలోచనపురము (రాజిమ్):-
మహానదితోఁ బూర్ణానది సంగమించుతావున నున్నది. శ్రీరామచంద్రుం డిట కేతెంచి శత్రుఘ్నునియాపద కడ్డు పడుటకతన రాజీవలోచనుని (శ్రీరాముని) పేర నీపురమునకు 'రాజీవలోచన' మని వాడుక ప్రారంభమై, నానాటికి 'రాజిం' అనునట్లు మారెనట. దీనింగూర్చిన ప్రశంస పద్మపురాణ పాతాళ అధ్యా ౨౭ శ్లో. ౨౭-౩౮-౫౯ లలోఁ గలదు.

ఇటఁ గల శ్రీరామాలయమున క్రీ. శ. ఎన్మిదవశతాబ్దపు శిలాశాసన మొకటి గలదుగాని సరిగాఁ జదువరాదు. మధ్యరాష్ట్రములలో రాయపూర్ మండలమునఁ గలతావు.

## రాజుభార్య మేడ యెక్కితే కుమ్మరిభార్య గుడిశ నెక్కినదఁట:—
(ఆంధ్రలోకోక్తి).

## రాజు మెచ్చినది ప్రయోజకత్వము; సభ మెచ్చినది మాట; మగఁడు మెచ్చినది సత్కళత్రము:—
(ఆంధ్రలోకోక్తి.)

## రాజులవారిసీమ (ములికినాటిసీమ):-
కడపమండలమున, కడపకుఁ దూర్పుగా 'పొత్తపి' మొదలగు గ్రామములుగల సీమ. దీనిని మట్లుభూపాలురు పాలించియుండిరి. ఇందు బాహుదానది, గుంజనీనది జలములుగనుండి ఫలవంతముగ నుండు ప్రదేశము. హా రీసీమయందే నివసించువారు. పండితుల కరువదినాలు గగ్రహారము లిచ్చినవారు. వారివంశజు లీప్రాంతములందే నేఁటికి నివసించుచున్నారు. ఆరాజులలో నొకభూపతి యొకతతి మారువేషమున నొకవిప్రునింటి కేగి, భోజన మర్థింప నాకుటుంబమువా రాతనింగోల్చి యేమొ పచ్చడు లధికముగఁ జేసి భోజనమిడ, భూపతి మెచ్చి మాన్య మిచ్చెనఁట. ఆభూములు పచ్చడులమాన్యముగఁ బరఁగుచున్నవి. గండికోట మొదలుకొని దీనిని ములికినాటిసీమ యనెదరు. ములికినాటిశాఖబ్రాహ్మణు లిటనుండియే పేరందిరి.

## రాజ్యానికి రాజా? జగానికిఁ జంద్రుఁడా?:—
ఆంధ్రభాషా సాంప్రదాయార్థపదము. ఏమంత ప్రధానముగుముఖ్యుఁడు కాఁడని భావము.

## రాతగోత్రము:—
(గర్గ ఉపగణము చూడుఁడు.)

## రాతికుండ కినుపతెడ్డు:—
(ఆంధ్రలోకోక్తి.):—

**రాతిచెట్లు**:-గోడేశియాయొక్క యుత్తరభాగమునం దిటీవలఁ గనిపెట్టఁబడిన వనియు, Messrs F. B. macrae and gordon Laucaster గార్లు వీటిని గనుఁగొనిరనియుం దెలియుచున్నది. వీరు దక్షిణాఫ్రికాలో నార్కియాలోజికల్ ప్రసిద్ధులఁట. విజివా యనంబడు నదీతీరమునం దుంట నీ చెట్లసముదాయము నచ్చటివారు విజివారణ్యమనియే పిలుతురఁట. ఈరాతిచెట్లు రెండడుగులకన్న నెక్కువ యెత్తునకుఁ బెరిగినవి లేవఁట. ఈతావు ఫోర్టుజేమీసన పట్టణమున కుత్తరముగా డెబ్బదియైదుమైళ్ళదూర ముండునఁట.

కట్టు తాయిగ మారినది, లేక రాయియే యట్లు మొలచి పెరిగియో పెరుఁగకయో యేర్ప డినది. పరిశీలకులు పెక్కండ్రు పెక్కువిధములుగ నభిప్రాయపడుచున్నారు.

## రాతినూతి కినుపబొక్కేన:—
(ఆంధ్రలోకోక్తి)

## రాతిపువ్వు (శిలాధాతువు):—
లా Parmelia Perlate. ఆంగ్ల. Rounded Lichen. సం. శిలాపుష్పం, శిలాప్రసూనం, శిలా భవం, శిలాసనం, శిలాహ్వా, శిలేయం, శిలోద్భ వం, శైలేయం.

దీనిచూర్ణము చలువఁజేసి యగ్నిమాంద్యరో గము, గుల్మ, జ్వరము, దురదలు, ప్రమేహము, పాండువు, పైత్యము, మూలవ్యాధి, విషరక్త దోషము, క్షయరోగములు నివారించునని చెప్పఁ బడినది.

## రాతిపై నారఁ దీయువాఁడు:—
ఆంధ్ర భాషాసాంప్రదాయర్థపదము. దుష్కరములగు కార్యములందుఁ బట్టువదలక నిర్వహించుట కీడు కిని వాడుచుందురు.

లోభినుండి ద్రవ్యాకర్షణము, పరోపకారశూ న్యుండగు కఠినహృదయునివలన నుపకారము నందు ట మొదలగునవి యుదాహృతములు.

## రాత్రులందుఁ గట్టుసామానులు తమంతటఁ దాము ధ్వనిం గల్గించుట:-
పగటియందు వాతావరణ మించుక యుష్ణస్థితి నందకఁ దప్పదు. రాత్రులం దించుక శీతలస్థితి నందకఁ దప్పదు. దీని నెల్ల రెఱుంగుదురు. రసా యనశాస్త్రధర్మమగు Heat expadns bodies, and Cold contracts them" అను పద్ధతిమేరకుఁ గుర్చీలు, బల్లలు మొదలగు కట్టు సామానులందలి కుసులు మొదలగునవి వాతా వరణము వెచ్చనగుటఁ బగటియం దించుక యుబ్బి బిగిసి యుంటయు, రాత్రులందు వాతావరణ శీతలస్థితియందు సంకోచమంది ముడుచుకొనిపోయి వసు లగుచుంటయు సంభవించుచుండును. అత్తఱిఁ గల్గుచుండు చిన్నచిన్న ధ్వనులే వాయువునం దల లుగ నేర్పడి వినిపించుచుండును. ఇంకను రాత్రు లందు నిశ్శబ్దముగనుంట నివి నిద్రనుండి మేల్కాంచి యున్నవారికిఁ జక్కఁగ వినిపించెడిని. పగటియందుఁ బెక్కుధ్వనులు, మాటలకలకలము, నడకచప్పుడు, బండ్లచప్పుడు మొదలగున వంతఁ జక్కఁగ వినఁ బడనీయ కుండునని యెల్ల రెఱింగినదే.

## రాత్రులందుఁ జీఁకటి, పగటియందు వెలుతురు:—
ఇది యందఱుఁ జూచు చున్న వింతయే. అంద రెఱింగిన రహస్యమే. భూమి తనకుఁ దానై గిరగిరఁ దిరుగుచు సూర్యు నింజుట్టి తిరుగుచుంటవలననె దినభేదము, సంవ త్సరభేదము, కాలభేదములు గల్గుచున్నవి. తనకుఁ దానై గిరిగిరఁ దిరుగుతఱి సూర్యున కెదుటనున్న కాలము పగ లనియుఁ, వెనుకఁ దిరిగియుండు కాలము రాత్రియనియు, నెఱిఁగియే యున్నారము. సూర్యునివెలుతురు సరిగా భూమిపైఁబడుట వెలుఁగు, వెచ్చఁదనముఁ గలుగుంగానఁ బగలు వెలుఁగుగ నుండెడిని. రాత్రులందు సూర్యగోళ మునకు వెనుకఁ దిరిగియుండునుగాన భూమియొక్క యొకభాగఁపునీడయే. రెండవభాగమును చీఁకటిఁ గల్గించెడిని. అట్టి చీఁకటిరాత్రులందుఁ జంద్రుఁ డొప్పునునుంట సంభవించునేని సూర్యునివెలు తురు చంద్రగోళముపైఁబడి, ప్రతిఫలించుచుఁ దిరుగ భూమిపైనానుట వెన్నెల యగును. లేకున్న నంధకారమే ధృవప్రదేశముల నాఱువెలల చీఁక

టియు, నాలుగునెలలు వెలుతురు నుండుట, ఉత్తర ధృవ మూడునెలలు సూర్యుని కెదురుగ నుంట యు, దక్షిణధృవ మూడునెల లెదురుగ నుంట యుఁ గారణములని యెఱుంగునది. ఉత్తరధృవ మెదురుగ నుండుతఱి దక్షిణధ్రువమున నొకే రాత్రిగను, దక్షిణధ్రువ మెదురైయుండుతఱి నుత్తరధ్రువమున నొకేరాత్రిగ నుంటయు, సంభ వించెడిని. ఎదురుగనుండుతఱి నాలుగునెలలు నొకే పగలై యుండును.

**రాధ లేక రాధిక:—** యాదవుఁడును, శ్రీకృష్ణుని పెంపుడుతండ్రియు నగు నందుని సోదరి. శ్రీకృష్ణుని ప్రియురాలు. భర్త్రరాలు.

మఱియుఁ గర్ణుని (అంగదేశాధిపతి) తల్లిపేరు రాధయే. గాన నతనికి రాధేయుఁడని పేరుండెను.

**రాధాదేశము, గంగాదేశము, గాంగి పురరాజ్యము, సప్తగ్రామదేశము, సుమహాదేశము:—** ఇది సప్తగ్రామదేశమే. వేరు కాలమునఁ గల్గినమార్పుగ నిన్ని పేర్లు గల్గినవి. కౌశీతకీ ఉపనిషత్తు ౧ — ౧ యందు దీనిని పేర్కొని యున్నారు. చిత్రభూపతి గాంగసుతుఁడొట గాంగే యుఁ డనంబడే యీదేశఁపు బ్రభువుగఁ జెప్పఁ బడినవాఁడు. Periplus of the Erythraena sea అనుగ్రంథమున దీనికి 'రాధాదేశ' మని పేరనియు, సప్తగ్రామపుర మనంబడు గంగాపురము రాజధాని యనియుఁ జెప్పఁబడినది. కన్నాడపురఁపు రాగిరేకుశాసనము (3 వ కృష్ణరాజు) న నీదేశప్ర శంస గలదు. ఇంకను హరిహరబేలూరుశాసనము లందుఁ గళింగమగధదేశముల మధ్యనుండుదేశ మని చెప్పఁబడినది.

గంగాతీరభూమియగుట గంగారాష్ట్ర మనం బరఁగుచు, రాష్ట్రశబ్దమే రాష్ట్ర, రాత్ర, రాత, రాధ గా మారెనని కొందఱు పరిశీలకులు తలం చుచున్నారు. ఆనందభట్టుని బల్లాలచరిత్రమున ౧ యందు గంగానదీపశ్చిమతీరదేశ మనియు, నిందుఁ దామ్రలిప్తి (ఇప్పటితామ్లూక్), మేదినీ పురము (ఇప్పటిమిడ్నాపూర్), హుగ్లీ, వర్ధ మానము (ఇప్పటిబర్ద్వాన్) సీమ లీదేశములోని విగఁ జెప్పఁబడినవి. మూర్షిదాబాద్ మండల భాగ ముఁగూడ నుత్తరఁపుహద్దునం దుండెనని చెప్పఁ బడినది.

దేవీపురాణమున 'రాధాదేశ' మనియు కాళి దాసునిరఘువంశమున ౪-3౫ యందు 'సుమహా దేశ' మనియుఁ బేర్కొనంబడినది. మహాలింగేశ్వర తంత్రమను గ్రంథమున, తారకేశ్వర సిద్ధినాథశివ లింగము లీదేశమున నుండినవిగఁ జెప్పఁబడినవి.

కొంతకాలమునది యుత్తరరాధయనియు, దక్షి ణరాధయనియు రెండుగ విభజింపఁబడినదేశము లాయెను. క్రీ. వె. ౧౧ వ శతాబ్దమున వ్రాయఁ బడిన ప్రబోధచంద్రోదయనాటకము ౨ యందు దక్షిణరాధయని చెప్పఁబడియుంట నక్కాలము నకు ముందే విభజన నందియున్నటులఁ దెలియు చున్నది. అజయనది కుత్తరమున నుత్తరరాధ దేశమనియు, దక్షిణమున నున్నది దక్షిణరాధదేశ మనియుఁ దెలియుచున్నది. మూర్షదాబాదుభాగ ముత్తరరాధదేశమునందే యుండియుండ వలయును.

ఏఁడువందలశూరులతో సింహళముపై దాడి వెడలి, దాని నాక్రమించినట్లు జెప్పఁబడిన విజ యుఁడు గంగాదేశస్థుఁడేయని చెప్పఁబడినది.

క్రీస్తువెనుక ౧, ౨ శతాబ్దములందు 'సప్త గ్రామము' రాధాదేశమునఁ బ్రధాననగరమైయుం డెనని తెలియుచున్నది. సప్తగ్రామమిప్పుడు 'సా తాన్' అని పిలువఁబడుచు బంగాళదేశమునం

దున్నది. (ఇందలి యేఁడుగ్రామములంగూర్చి సప్తగ్రామములు చూడుఁడు).

చోడగంగుఁడను నుత్కలదేశమేలు గంగవంశపు రాజు సుమహుండనువాఁడుకనామముఁగల మందారుఁడను గంగదేశపురాజుతోఁ గలహించి వానింబరిమార్చి రాజ్య మాక్రమించెనని చెప్పఁబడినది,

క్రీ. శ. (A.D) ౧౬౩౦ ప్రాంతమునకుఁబూర్వము సప్తగ్రామములు గొప్పవర్తకస్థలములై యుండి, యాసంవత్సరఁపుఁ దుపానున రేవు చెడి లంక పెంచి దూరముగనేగ హుగ్లీ రేవాయెనఁట. సప్తగ్రామముల పేరులు ౧ బాన్సుబేరియా, ౨ క్రిష్ణపుర, ౩ బాసుదేవపుర, ౪ నిత్యానందపుర, ౫ శిబపుర, ౬ సాంబచోరా, ౭ బలాఘ్డాటీ యనిచెప్పఁబడినది.

**రాధామాధవకవి (చింతలపూడి యెల్లనార్యుఁడు):**—ఈతనితండ్రి కామయప్రభువు. శ్రీవత్సగోత్రజుఁడు. మదనగోపాల మంత్రమును జపించువాఁడు. ఈతనినివాస మెద్దియో సరిగాఁ దెలియరాకున్నది. కళింగదేశస్థుఁడనియు, విశాఖపట్టణమండలములోని వీరవల్లి తాలూకాయందలి చింతలపూడి గ్రామవాస్తవ్యుఁడనియు, శ్రీవత్సగోత్రజులగు చింతలపూడివారు కళింగదేశమందుండుటంజేసి పోల్పఁబడుచున్నది. ఈరాధామాధవకవి ప్రప్రథమమున విశాఖపట్టణమండలమందున్న పొట్నూరిపరిపాలకులగు మేదినీరావువారి యాస్థానమున నుండెడివాఁడనియు, శ్రీకృష్ణదేవరాయలు కళింగగజపతులను జయించినపిదపఁ గృష్ణరాయుల యాస్థానమునం దున్నట్లును, కవితాశక్తిచే నచ్చటఁ బేర్వడసినట్లును, 'కవికావ్యప్రశంసాచంద్రిక'యందు వ్రాయఁబడియున్నది. కళింగదేశపుగవియగు తిరుమలరాజు సూరపరాజుకవి తన 'ద్రౌపదీపరిణయకావ్యము' న రాధామాధవకవినిఁగూర్చి పేర్కొనియున్నాఁడు. రాధామాధవకవి యల్లసాని పెద్దనార్యునిసమకాలికుఁడు. ఈతని గ్రంథములు రాధామాధవకావ్యము, తారకబ్రహ్మరాజీయము, విష్ణుమాయానాటకములని తెలియుచున్నది. ఈతఁడు విష్ణుభక్తుఁడైనను, శివపారమ్యముఁ బాటించు నద్వైతి. రాధామాధవకావ్యము శృంగారరసబంధురముగను, భక్తిరసప్రాధాన్యముగను, చెప్పుటంజేసి రాధామాధవులను ప్రాతపోషణఁ గావించియుండుటవలన నీతనికి 'రాధామాధవ' కవి యను ప్రసిద్ధనామము వచ్చియుండవలయును. శ్రీకృష్ణదేవరాయల యాస్థానమునఁ బ్రవేశించు నపుడు నగరు తగరు తొగరు పగరు అనుపదములు ప్రాసస్థానమందుంచి, రామాయణపరముగాను, భారతభాగవతపరములుగాను, చెప్పుచున్నట్లును, నావిధముగానే యాశువుగాఁజెప్పినట్లును తెలియుచున్నది. ఈతని గృహనామము చింతలపూడివారు. స్వనామ మెల్లనార్యుఁడు.

**రాధావల్లభమతము:**— ఇది వల్లభాచార్య (వైష్ణవ) మతముతో సంబంధించినది. దాని ననుసరించియుండునది. చాల నవీనమైన మతము. హరివంశాచార్యమతమనియు, హితహరివంశాచార్య మతమనియు దీనికి వాడుక గలదు. మతకర్త హరివంశాచార్యుఁడు. తండ్రి వ్యాసుఁడు. తల్లి తారాదేవి. జన్మస్థానము దేవవనము. (మథురప్రాంతము). ఈతఁడు విష్ణుభక్తుఁడు. భార్యపేరు రుక్మిణి. మఱియొకవృద్ధుఁ డిర్వురుకుమార్తెలంగూడ నిచ్చి పరిణయమొనర్చెననియు భార్యలు ముగ్గురనియుఁ జెప్పఁబడినది. ఈతఁడు గౌడబ్రాహ్మణుఁడు. నివాసము వ్రజమండలమునందలి బృందావనము. అట నీయన

ప్రతిష్ఠించిన రాధాకృష్ణుల దేవాలయమును, వీరి సమాధియుఁ గలదు. ఈమతగ్రంథమగు రాధా సుధానిధి వీరు రచించినది. మఱియు 'భక్తమాల' యనుగీతములసముదాయము రచించిరి. (వల్లభా చార్యమతము చూడుఁడు.) వీరి ప్రథమశిష్యుఁడు వ్యాసజీ యనువారు వీరిమాహాత్మ్యములఁ బెక్కింటిం గనిపెట్టినవారఁట. వీరి రెండవశిష్యులు ధ్రువదాసు. వీరు 'శివదశ', 'వేదగానము' మొదలగు నీమతగ్రంథముల ననేకములను రచించిరి. వీరిమతమున భక్తి ప్రధానము. రాధాకృష్ణులు జీవాత్మ పరమాత్మభావమునఁ బూజింపఁబడుదురు. కంఠమునఁ దులసిమాల ధరింతురు. ఏకాదశిదినమునఁ దాంబూలము వైచెదరు. గోపీచందనధారులు.

**రాధావల్లభాచార్యుఁడు (హరివంశ్యాచార్యులు):**—ఈమహాత్ముని తండ్రిపేరు వ్యాస్జీ. తల్లి తారాదేవి. వ్రజమండలసమీపమునఁగల దేవవనమున విక్రమశకము ౧౫౫౯ లో జన్మించినవారు. తలిదండ్రులిడిన నామము హరివంశ్యులు. భార్యపేరు రుక్మిణీదేవి. ఇఁక నిర్వురు భార్యలుఁగూడఁ గలరు. రుక్మిణివలన మోహనచంద్రుఁడు, గోపీనాథుఁడు నను నిర్వురు పుత్రులును, నొకకుమారెయు సంతానము. వీరు సన్యాసము స్వీకరించుటకు బృందావనమున కేతెంచుచుండ, మార్గమున నొకముదుసలి యెదురై, తనయిర్వురుకుమార్తెలను, రాధావల్లభవిగ్రహమును సమర్పించి చనియెనఁట. వీ రద్దానిని శ్రీకృష్ణునియాజ్ఞగా నెఱింగి, వారిని భార్యలుగఁ గైకొని బృందావనమునకేగి యావిగ్రహముం బ్రతిష్ఠించి పూజించుచు నావనితలతో గార్హస్థ్యసుఖమనుభవించుచుంట 'రాధావల్లభు' లని పేరందిరఁట.

వీరు రాధావల్లభుని సదా స్మరించుచు గొప్ప భక్తులై యొకమతముం గల్పించి శిష్యులకు బోధించుచుండి రఁట. (రాధావల్లభమతము చూడుఁడు.)

వీరు 'రాధాసుధానిధి' మొదలగు కొన్ని గ్రంథముల రచించిరఁట. వీరు రచించిన గీతములకు 'భక్తిమాల' యనిపేరఁట. వీరికిఁ జాల మంది శిష్యులు కలరఁట. ప్రథమశిష్యుఁడు వ్యాస్జీ యనుపేరుగలవారఁట. వారి కనేకమహత్తులు చూపిరఁట. వీరిశిష్యులలో నొకరగు ధ్రువదాసనువారు, 'జీవదశ' 'వేదగానము' మొదలగు కొన్ని గ్రంథములను రచించిరని తెలిసెడిని. ఈమతస్థులు రాధావల్లభకృష్ణునిఁ బూజించువైష్ణవులు తులసిమాలల ధరింతురు. ఏకాదశిదినమునఁ దాంబూలము వైచుటకు వీరికి శ్రీకృష్ణునియాజ్ఞ కల దందురు.

**రాథోరులు లేక రాథోరువంశనృపతులు:**—వీరు కనూజి రాజధానిగ రాజ్యమేలిన నరపతులు. పృథ్వీరాజునైరియగు జయచంద్రుఁ డీవంశస్థుఁడే. వీరు మహమ్మద్ఘోరీని హతుని జేసి రాజ్య మాక్రమించిరి.

**రానిగోత్రము:**—
(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు).

**రానిగోత్రము:**—
(కథ లేక కథ్యగణముచూడుఁడు)

**రాఫ్టుఫౌండేషన్ (Raft foundation):**-
(పునాది చూడుఁడు).

**రాఫీలిజమ్ (Raphaelism):**— చిత్రకళయందు 'రాఫీలు' అనునతనిపద్ధతి ననుకరించు విధానము. ఈతనిచిత్రములు రసవత్తరములగు

నాత్మానుభవకళలను వ్యక్తీకరించును. ఇతనిచే వ్రాయఁబడిన 'The modanna and child' అను చిత్రపటము లండనునగరమున నేషనల్ గాలరీ యం దలంకరింపఁబడియున్నది.

## రాబింగ్‌పీటర్‌పేయింగ్‌పాల్ (Robbing Peter Paying paul)

అన్యాయార్జిత విత్తమును ధర్మమొనర్చుట కీఉక్తిని వాడుదురు. పీటరు రష్యాదేశ మేలిన చక్రవర్తి. Paul క్రైస్తవమతబోధకుఁడగు స్వామి.

## రామకృష్ణ పరమహంసస్వామి:—

ఈమహాత్ముఁ డద్వైతసిద్ధాంతమును సోదాహరణ పూర్వకముగఁ బ్రజల కుద్బోధించి చెప్పుచుండు వాఁడు. అనేకమందిశిష్యులు గలవాఁడు. ముఖ్య శిష్యుఁడు వివేకానందస్వామి. ఇప్పటిరామకృష్ణ మిషనువా రందఱు వీరిశిష్యవర్గమువారే. వీరిది



లోకైక మతము ని పేరిడి వాడు చుందురు గాని యన్యమతస్థులు దీని కంగీకరింపరు. రామకృష్ణ పరమహంసస్వామి మతగ్రంథ మేదియు రచించియుండ లేదు. ఐనను జ్ఞాపకముమేరకు వారి బోధవాక్యములు వా రప్పుడప్పుడు సెలవుచుండిరని వారిశిష్యు లొకగ్రంథముగ బయలుదేఱఁదీసియున్నారు.

తండ్రిపేరు ఖుదీరామచటోపాధ్యాయులు. తల్లిపేరు చంద్రమణీదేవి. తండ్రి దక్షిణేశ్వరమునఁ గాళీదేవస్థానమునఁ బూజారి. రామకృష్ణుఁడును, నటనే పూజారిగ నుండెను. జన్మస్థానము హుగ్లీ మండలమునఁ గర్నారుపుఖా రనియు, జన్మకాలము క్రీ. శ. ౧౮౩౬ ఫిబ్రవరి ౧౮ యనియు, మృతి ౧౮౮౬ అనియుఁ జెప్పఁబడినది. వీరు వంగదేశఁపు శ్రోత్రియబ్రాహ్మణ కుటుంబమువారు. పరమహంసస్వామి నైసర్గికముగ యోగాభ్యాసశక్తిఁగల్గి గంటలకొలఁది నిర్వికల్పసమాధిస్థితి నందియుండు వారఁట. వీరు వివాహమైనవారఁట. వీరి గురువొకవంగవితంతువని యందురు. గాని వారిం గూర్చి యేమియుం దెలియదు. పిదప, 'తోతాపురి' యని పేరుగల సాధువు వీరికి గురుండయ్యెనని యందురు.

వీరిబోధయందు మానవుల కన్యోన్యప్రేమ ముఖ్యము. సిద్ధాంత మద్వైతమే. జాతి వీరి కంత బాధకముగా నుండలేదు. వీరి కప్పుడప్పుడు క్రైస్తవవిద్వాంసులతోడను, మహమ్మదీయమౌలానాలతోడను, మతతత్త్వవాదములు సంభవించు చుండెనని చెప్పుదురు. అన్నిమతము లొకేతావునకుఁ దారిఁదీయునని వీరియభిప్రాయము. బ్రహ్మసమాజమతనాయకులగు కేశవచంద్రసేనులును, గొప్పగ్రంథకర్తలని పేరందిన బంకించంద్రచటర్జిగారును, నాటకకలావిశారదులని పేరందిన గిరీశచంద్రగోషుగారును, వీరిని బహూకరించుచు 'గొప్పమతతత్త్వవేత్త' యని పొగడుచుండువారు.

వీరిశిష్యులు వివేకానందస్వామి యమెరికా మొదలగు పలుదేశముల కరిగి, వీరిమతధర్మము లుపన్యసించి, శిష్యులంజేర్చుచుండిరి. (వివేకానంద స్వామి చూడుఁడు). వీరియాశ్రమస్థానములును పలుతావులందుఁ గలవు. వీరు ధర్మవైద్యము నచట నెఱపుచుందురు. వీరి రామకృష్ణమిషను మూలధనము కలదందురు. హిమవన్నగరముపైఁ జంపావతికడనున్న మాయావతీయద్వైతాశ్రమము వీరిదే.

**రామగడము:**—ఛోటానాగపూరు పరగణాలోని శిర్గూజాసంస్థానముననున్న యొక పర్వతము. ఇం దొకగుహ కలదు. ద్వారమున నశోకశాసనములు చెక్కఁబడియున్నవి. దానిని సీతాబాబంగిరగుహ యందురు. ఇది రామాయణమునఁ జెప్పఁబడిన రిక్షవిల యని పోల్చుచున్నారు.

ఇటనే హాతిఫోర్ అనంబడుగుహామార్గము కలదు. అందునుండి యొకనది యుత్పన్నమై ప్రవహించుచుండును. ఆ tunnel పొడవు ౧౫౦ అడుగులు. వెడల్పు వేర్వేఱుతావుల ౧౬ మొదలు ౫౫ అడుగులవఱకుండును. ఎత్తు ౧౦౦ అడుగుల కెక్కువయే గాని తక్కువ కాదు.

(రామాయణము కిష్కిన్ధాకాండము ౫౧౫౭ చూడుఁడు.)

**రామగ్రామస్తూపము:** బెంగాల్ నార్తువెస్ట్రన్ రై (B. N. W. R.) ముండేర్వా రెయిల్వేస్టేషనుండి దక్షిణముగా రెండుమైళ్ళదూరమున రాముఫూర్ అనుగ్రామము కలదు. తొల్లింటి రామగ్రామ మనిపోల్చఁబడినది. ఈగ్రామపరిసరములనే యిప్పుడు సింహళద్వీపమున కేండీయం దుంచఁబడి, పూజింపఁబడుచుండిన బుద్ధభగవానునిదంత ముంచఁబడి స్తూపము నిర్మింపఁబడెనఁట. నాస్థూపము శిథిలావస్థయందుండినది.

భగవానుని యస్థులకై మల్లులు కలహించి పంచుకొనిన వాటినుండి నాగకులస్థుఁ డొకపన్ను దొంగిలించెననియు, నది యిటఁ గొంతకాల ముండెననియుఁ జెప్పఁబడినది. హ్యూనచ్వాంగు దీనిని దర్శించి, రామగ్రామమును 'లాన్మెలో' యని వ్రాయుచు, నెనమండుగురుమల్లులలో నొకభూపతి యిట దనవాటాయస్థులపై నీస్థూపనిర్మాణ మొనర్చియుండు ననియు, దానినుండె నాగకులస్థుఁడు తస్కరించియుండుననియుఁ దనయాత్రాచరిత్రమున వ్రాసికొనియున్నాఁడు.

**రామగిర్యాశ్రమము:**— మహాకవి కాళిదాసు మేఘసందేశమున మొదటిశ్లోకమున వివరించినతావు. ఇట శ్రీరాముఁడు సీతాసమేతుఁడై వసించినతావున దేవస్థానముఁ గలదు. ఇంకను వరాహదేవస్థానముఁ గలదు. రామాయణము ఉత్తర ౮౮ అధ్యాయమున శైవులగిరి యని పేర్కొనఁబడినతావు. మఱియు నిట నాగార్జున దేవస్థానమును గలదు. తొల్లింట శంభుకుఁ డిట తపంబొనర్చినతావు. ఇవి యన్నియు నొకకోట యందుఁ గొండపై నున్నవి. వెలుపల నొకపవిత్ర సరోవరము కలదు. అందు జలకములాడిన కుష్టువ్యాధులు నివర్తించునఁట. మధ్యరాష్ట్రములలోని నాగపూరున కిరువదినాల్గుమైళ్ళదూరమున 'రామటిక్' అనఁబడుచున్నది. (చిత్రకూటము చూడుఁడు. అనూపదేశము చూడుఁడు.)

**రామగిరిసింగనకవి - ఆంధ్రకవి:**

ఆర్వేలనియోగి బ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. భరద్వాజసగోత్రము. తండ్రిపేరయ్యలమంత్రి. (రాజమహేంద్రవరపురాధీశుండగు తొయ్యేటి అనపోతభూపాలుని మంత్రియై, గోదావరి కుత్తరతీరంబునందలి పెద్దమడికి అగ్రహారము నందెను.) పితామహునిపే రల్లాడమంత్రి. (ఇతఁడు తిక్కనసోమయాజి పౌత్రునికుమారుఁడు. భర్తకాపురము కృష్ణానదీ తీరమందలి రావెలయగ్రహారము.) పినతాత లేక పితామహుని కనిష్ఠసోదరుఁడు గంగనమంత్రి. ప్రపితామహునిపేరు గుండనార్యుఁడు. సింగనకవి కనంతయ్య, అబ్బయ్య, నారయ్య యనువారలు తమ్ములు.

రచించినవి భాగవతదశమస్కంధము (ప్రత్యేకపద్యకావ్యము). పద్మపురాణోత్తరఖండము, వా

సిష్టరామాయణము (ఆంధ్రపద్యములుగ) రచించెను.

**రామగిరిసీమ (సబ్బినాడు):**—దీనిని రామాద్రిసీమ యని సింగకవి వాడియున్నాఁడు. ముప్పభూపాలుఁ డేలినరాజ్యములోనిది. ఈసీమ యందే యీసింగకవి కేఁడగ్రహారము లీయఁబడిన వఁట. రామగిరి ముప్పభూపాలుని రాజ్యమునఁ బ్రధాననగరమని తోఁచెడిని. ఆనాఁ డీసీమకు 'సబ్బినా' డనిగూడఁ బేరుండెనఁట.

ఈసీమ నిప్పటినిజాముదాజ్యములోని మంథెన (కాళేశ్వరము) ప్రాంతమునఁగల ధర్మపురముఁ (ఇఁటఁగల విష్ణుదేవళ మానాటిది కలదు.) జుట్టును గల ప్రాంతదేశమని యనుచున్నారు. ధర్మపుర మునఁగల నృసింహస్వామికిఁ గృతిగా '...'ధర్మ పురనివాస దుష్టసంహార నరసింహ దురితదూర' అను మకుటముఁగల నృసింహశతకము రచింపఁ బడినది.

**రామదేశము:**—ఈపేరుగలరాజ్య మొక ప్పు డుండినదని తెలియుటకన్న దీనింగూర్చి యేమి యుఁ దెలియరాకున్నది.

**రామనాడ్జిల్లా:**- అఱవదేశములోనిది. చెన్నపురిరాజధానిం జేరియున్నది. రామనాథపురము (రామనాడ్) ప్రధానస్థానము. ఇది గొప్ప జమీందారీస్థానము. సుప్రసిద్ధమగు రామేశ్వర క్షేత్రము, శ్రీరామసేతువు, పాంబన్‌పట్టణము గలరామేశ్వరద్వీప మీజిల్లాకుఁ జెందినది. దర్భ శయనము, నవపాషాణము, నీజిల్లాలోనివి. పర మక్కుటి, సత్తిరక్కుటి యితరపట్టణములు. (నాటుకోటుశెట్లు—దేవకోట చూడుఁడు).

**రామనామాత్యుఁడు:**— ఆంధ్రకవుల లో నాధునికులందుఁ బరిగణింపబడినవాఁడు. నియోగిబ్రాహ్మణుఁడు. తండ్రిపేరు తిమ్మరాజు.

రచించినది గయోపాఖ్యానము. దీనికిఁ 'కృష్ణార్జున సంవాద' మని వాడుకనామముఁ గలదు.

**రామపరమారనృపాలుఁడు:**— తెలింగానాదేశమేలినవాఁడు. (పరిమారశాఖక్షత్రియులు చూడుఁడు).

**రామపాలము:**— తొల్లింటి వంగదేశఁపురాజధాని. (వంగదేశము చూడుఁడు).

**రామఫలముచెట్టు (రాంభాళఁపుఁ జెట్టు):**—శ్రీరామ లక్ష్మణ సీత లరణ్యావాస మొనర్చుతఱి నీపండును శ్రీరాముఁడు తెచ్చి యిష్టముగ భుజించుట నీపేరయ్యెనని వాడుక గల దు. ఇటులనే సీతాఫలమును, లక్ష్మణఫలమును గూడ పేర్లనందియున్నవి. ఆంగ్లమున దీనిని 'Great Red custered apple' అని కొంద అనె దరు. పేర్లు సరిగాఁ దెలియఁబడకున్నవి. రాంభాళ మనియు, రామబాణఫల మనియు నజ్ఞులు వాడు చుందురఁట. ఆహారోపయోగమగు ఫలము.

దీనిప ండ్లగ్నిమాంద్యము, శూల, తలనొప్పి నధికముగఁ దినుచుండినఁ గొంతకాలమునకుఁ గల్గించుననియు, గరక్కా-యముర బ్బా, **గుల్కా-ందు** దీనికి విఱుగుడులనియుఁ జెప్పుదురు.

**రామమిశ్రులు:**— (రామానుజీయవైష్ణవ సాంప్రదాయ పరంపర చూడుఁడు).

## రామరాజభూషణుఁడు:—భట్టుమూర్తి వంశవృక్షావళి—

ప్రబంధాంకమువారి వంశవృక్షము-రామరాజభూషణుఁడు- భట్టుమూర్తి. వీరు భట్రాజులు. కాపురము బట్టుపల్లె.

ప్రబంధాంక సింగరాజు
|
తిమ్మరాజు

- వేంకటరాయ భూషణుఁడు
  - మూర్తిరాజు, బట్టుమూర్తి లేక శారదామూర్తి కావ్యలంకార చూడామణి యనఁబడు నరసభూపాలీయమును రచించెను.
- సూరపరాజు
  - మూర్తిరాజు రామరాజభూషణుఁడు వసుచరిత్ర రచించెను.

## రామరాజభూషణకవి (ప్రబంధాంకము, మూర్తిరాజు)

—ఆంధ్రకవులలో మధ్యకవులందుఁ బరిగణింపఁబడినవాఁడు. మహాకవి యనిబిరుదముఁ గలవాఁడు. వీరిపూర్వులకుఁ బట్టుపల్లె యనుగ్రామ మగ్రహారముగ విజయనగర ప్రభువులచే నీయఁబడినదఁట. వారు కొద్దిగనో, గొప్పగనో కవిత్వరచనయం దారితేరినవారని చెప్పఁబడినది గాని వారిగ్రంథములు గానకుండమి వారందఱు బహుశః చాటుధారపద్యములం జెప్పుచుండువారై యుండనోపు.

మూర్తిరాజు శ్రీకృష్ణరాయసార్వభౌముని కాలమునం దుండెనో లేదో కాని, యాయన యల్లుండగు రామరాజుకడ నాస్థానకవిగనుండి, యాయనను మెప్పించి, రామరాజుభూషణుఁ డని బిరుదమంది యాపేరం దఱుచుఁ బిలువఁబడు చుంట నిజనామము తగ్గిపోయి, రామరాజభూషణ నామమే వాడుకయై నేఁటికి నీపేరుతోనే నాయన నెఱుంగుచున్నాము.

వీరి బట్టుపల్లె యేదో సరిగాఁ డెలియరాకున్నది. బల్లారిమండలములోని పాలమండలసమీపమున నొకబట్టుపల్లెయు, కడపమండలములోని పులివెందలితాలూకాలో నొకబట్టుపల్లెయుఁగలవు. రెండుగ్రామములు భట్రాజులనివాసములే. రెండు గ్రామములలోనివారు తమగ్రామమే ప్రబంధాంకమువారి యగ్రహారముగ నెలుఁగెత్తి చెప్పుచుందురు. పరిశీలన మిది జరుపఁదగినది.

ఇంక నీకవిని నరసభూపాలీయము రచించిన బట్టుమూర్తి లేక శారదామూర్తితోఁ గల్పి యొకఁడే యని కొందఱు తలంచుచుండిరి. ఇటీవలి పరిశీలనమున నాతఁడు వేఱనియు, నిర్వురు పినతండ్రిపెదతండ్రికుమాళ్ళనియు, నిద్దరు మూర్తిరాజనునామమే గలవారనియుఁ దేలినది.

ఈకవి రచించినది వసుచరిత్ర. దీనిని శ్రీకృష్ణదేవరాయునియల్లుండగు నళియరామరాజుసోదరుఁడగు తిరుమలరాజునకుఁ గృతినిచ్చెను.

**రామరాజు రంగప్పరాజు కవి:—** ఆంధ్రకవులందు మధ్యకవులలోఁ బేర్కొనఁబడిన వాఁడు. క్షత్రియుఁడు. సూర్యవంశము. ఆపస్తంబ సూత్రము. ఆత్రేయసగోత్రుఁడు. గురువుపేరు తిరుమల శ్రీనివాసాచార్యులు. కోనేటితిమ్మరాజు కడ నాస్థానకవి. క్రీ. వె. ౧౫౫౦ - ౧౫౬౦ ప్రాంత కాలమువాఁడు.

ఈతఁడు రచించినది సాంబోపాఖ్యాన మను ప్రబంధము. దీనిని శ్రీరంగనాథస్వామికిఁ గృతిగ సమర్పించెను.

**రామలక్ష్మణద్వాదశి:—** జ్యేష్ఠశుద్ధద్వాదశి. (పండుగలు చూడుఁడు.)

**రామానందమతము:—**

(ఆనందమతము చూడుఁడు.)

**రామానందుఁడు:—** ఈ మహనీయుఁడు గొప్పపండితుఁడు. కాశీప్రాంతమున గొప్పవిష్ణు భక్తుఁడై యుండినవాఁడు. క్రీ. వె. ౧౪ శతాబ్దమునాటివాఁ డందురు. ఈతఁడు బోధించినది వైష్ణవమతమే యనిపించును. ఈమతస్థులు గోపీచందనమును తెన్నలతిరుమణివలెనే మోమున ధరింతురు. శ్రీరామభక్తి వీరికే మెండు. వీరికి భక్తమాల మొదలగుమతగ్రంథములు కలవఁట. ఆగ్రాప్రాంతములను, గొంతవఱకు గంగానదీతీరమునను, నీమతస్థులు గాననగుచున్నారు. రామానందులకుఁ గబీరు, విఠలపంత్ మొదలగువారు పన్రెండుగురు ముఖ్యశిష్యులు కలరని చెప్పఁబడినది. వీరిమతమున జాతిభేదము, నాచారాములు గలవు. ఈమతస్థులు వైరాగులవలె నుందురు.

కబీరు తురక యని రామానందగురుం డాతనికి మంత్రోపదేశ మొనర్పకుండె నఁట. ఒకనాఁ డామహాత్ముఁడు తెల్లవారుఝామున మేల్కాంచి, గంగాస్నానమున (కాశీపట్టణమున) కొకఘట్టమున దిగుచుండఁ జీఁకటియందుఁ గానక నటఁ జల్లఁదనముళ్లైన సోపానములపైఁ బరుండి నిద్రించుచుండిన కబీరుపై నడుగిడి, 'రామరామ' యని స్మరించుకొని, మనుష్యునిం ద్రొక్కితినని పశ్చాత్తాపమందఁ గబీరు మేల్కాంచి 'స్వామీ! శిష్యుఁడను. కబీరు నాపేరు. ఇది నాకు మంత్రోపదేశము' అని నమస్కరించెనఁట. ఆతనిగురుభక్తికి రామానందులు మెచ్చుకొని రమ్మని యాతని జలక మాడఁజేసి రామనామ ముపదేశించెనఁట. కబీరును గొప్పభక్తుఁడౌట చాల పేరందె నఁట. రామానందులు రచించినమతమున 'కానందమత' మనియెదరు. రామానందుని యానందమతమున జాతిభేదము గలదు. కాని, కబీరు బోధించిన మతమున జాతిభేదమును నిరసించెనఁట.

**రామానుజీయ వైష్ణవగురుసాంప్రదాయపరంపర:—** పవిత్రవంతమగు నీరామానుజీయ వైష్ణవమతరహస్యము లాదిని పరమాత్ముఁడగు శ్రియఃపతియే (విష్ణుదేవుఁడే) శ్రీ (లక్ష్మి) దేవికి నుపదేశించిరనియు, వారు విష్వక్సేనునకును, వారు శఠకోపులకును, వారు నాదమునులకును, వారు పుండరీకాక్షులకును, వారు రామమిశ్రులకును, వారు యామునాచార్యుల వారికని (యామునమునిన్), వారు పరాంకుశదాసు గారికని, వారు రామానుజజగద్దేశికునకును (వీరినే యతిరాజు లనియు నుడయవరు లనియు నందురు) నుపదేశించిరి.

రామానుజస్వామి మణవాళమహామునుల కుపదేశింప, వారిశిష్యవర్గమువారు పిదపఁ బీఠస్థులయ్యఁబడుచు దేశికపరంపరలుగ నాచార్యపురుషులుగ నున్నారని తెలిసెడిని.

**రామాయణమంతయు విని రాముఁనకు సీత యేమగునని యడిగి నట్లు:—**

(ఆంధ్రలోకోక్తి)

**రామాయణము:—** సూర్యవంశఁపు రాజులయొక్కయు, నందు ముఖ్యముగ శ్రీరామునియొక్కయు చరిత్ర. ఇది యితిహాసము. సంస్కృతమున వాల్మీకిమహర్షిచే రచింపఁబడినది.

హిందీభాషలో దులసీ దాసనుభక్తుఁ డనువదించెను. ఆంధ్రమునఁ బెక్కండ్రు వ్రాసిరి. దీని నాదికావ్య మందురు. ఇది బాలకాండము, అయోధ్యాకాండము, అరణ్యకాండము, కిష్కింధాకాండము, సుందరకాండము, యుద్ధకాండము, ఉత్తరకాండము ననియేఁడుకాండములుగ నున్నది. గ్రంథసంఖ్య ౨౪౦౦౦. ఒక్కొకవేయి మొదటిశ్లోకము గాయత్రీ మంత్రాక్షరములలో నొక్కొక యక్షరముతోఁ బ్రారంభింపఁబడి గాయత్రీరూపమని చెప్పఁబడు నుద్గ్రంథము.

**రామావర్ఝుల కొండుభట్టుకవి:—** ఆంధ్రకవులలో నాధునికులంమఁ బరిగణింపఁబడినవాఁడు. వెలనాటిబ్రాహ్మణుఁడు. హరితసగోత్రము. తండ్రిపేరు నరసావధాని. తల్లి అక్కమ్మ.

రచించినది కపిలగోసంవాదము. ఇది యాధ్యాత్మికవిద్యాప్రతిపాదకము. దీని నహోబల నృసింహస్వామికిఁ గృతిగ సమర్పించెను.

**రామావతారహస్తము (రఘురామావతారహస్తము:-** (హస్తాభినయము చూడుఁడు. భరతశాస్త్రము చూఁడుఁడు.)

**రామ్బిగోత్రము- భృగుసంతతి:-**
(ఆర్ష్టిషేణగణము చూడుఁడు.)

**రామ్రిద్వీపము:—**
(లోవరుబర్మాదేశము చూడుఁడు.)

**రామ్టెక్కు:—** మధ్యరాష్ట్రములలోని నాగపూరున కుత్తరముగా ౨౪ మైళ్ళదూరమునునున్న శ్రీరామక్షేత్రము. ఇచట ననేకదేవాలయములు గలవు. పురాతనపుదేవళము హేమాద్పంతుకట్టడముగ నున్నది. శ్రీరాముఁ డరణ్యవాసమునఁ గొంతకాల మీపర్వతముపై నుండెనఁట. ఈప్రాంతమునఁగల 'అంబాలా' గ్రామముకడనున్న పవిత్రసరోవరమున నేఁటట లక్షజనులు గూడు గొప్పస్నానయాత్ర జరగును. తమలపాకు లిట నుండి విస్తారముగ నెగుమతి చేయఁబడుచున్నవి. కొన్నిగనులును గలవు.

**రామునిరాజ్యము, భరతునిపట్టణము:—** ధర్మపరిపాలనము, సౌఖ్యజీవనము, గల్గియుండుటం దెలుపుట కీసూక్తిని వాఁడుచున్నారు. రామునిరాజ్యము ధర్మపరిపాలనమునకును, భరతునిపట్టణము సౌఖ్యములకును బేరందియుంట సుప్రసిద్ధము.

**రామునివంటి రా జుంటే, ఆంజనేయునివంటి బం టప్పుడే యుంటాడు:—** (ఆంధ్రలోకోక్తి.)

**రా మెటీరియల్:-** వాణిజ్యపరిభాషయందుఁ బత్తి, ఉన్ని, యినుపరాయి మొదలగు సరకులకు 'రా' (Raw) అనియెదరు. 'పనిచేయఁబడనున్న' యని యర్థము.

**రామేశ్వరదేవస్థానము:—** ఇది సుప్రసిద్ధదేవస్థానము. రామనాథస్సైకతలింగము సీతామహాదేవి యొనర్ప శ్రీరాముఁడు ప్రతిష్ఠించెనని శ్రీమద్రామాయణమునఁ జెప్పఁబడినది. ఇట యాత్ర ప్రారంభింపఁదగినతావు లక్ష్మణతీర్థము. ఇది యొకవాటి చెఱువు. లక్ష్మణప్రతిష్ఠితశివలింగ మిటఁ గలదు. అగ్నితీర్థము సముద్రములోనిరేవు. దేవాలయముయొక్క పూర్వమున నున్నది.

దేవాలయావరణమునఁనే మాధవతీర్థము, నల నీల గవయ గవాక్ష గంధమాదన మహాలక్ష్మి గాయత్రి సావిత్రి సరస్వతి శక్ర శివ సాధ్యామృత శంఖ గయా గంగా యమునా సూర్య చంద్ర బ్రహ్మహత్యానివృత్తి సర్వకోటితీర్థములును గలవు. ఇంక ననేకతీర్థములుకలవుగాని యంతముఖ్యములుగావు.

దేవాలయమునఁ బెక్కుశివలింగములు గలవు. అవి ప్రతిష్ఠఁ జేయఁబడలేదు. ఆంజనేయప్రతిష్ఠిత విశ్వనాథలింగమును ముందు దర్శింతురు. శ్రీరాములనాటివని చెప్పచున్న రెండుస్ఫటికలింగము లీదేవస్థానమునఁ గలవు. ధనవంతమగు దేవస్థానము. దీనికి భూస్థితివలన రాఁబడి నలుఁబదివేల రూప్యములు. (ధనుష్కోటి చూడుఁడు). దేవాలయము, మంటపములు మార్గములు చాలఁబెద్దవి.

# రాయనిమంత్రి భాస్కరుని వంశావళి వివరణము

హరిదాసు-చమదయ్య

త్రిపురాంతకుడు-(భార్య గంగమ్మ)

అహోబలమంత్రి-(భార్య తిప్పమ్మ)

(రాయన్న భార్యమల్లమ్మ) నరసింహం నరసింహాము అయ్యలయ్య (భార్య అన్నమ్మ) తిమ్మయ్య

రాయనమంత్రి భాస్కరుడు భార్య (తిరుమలమ్మ) అనంతయ్య అహోబలుడు ఓబళయ్య రామభద్రయ్య పృథ్వీనాథుడు చిన్నయ్య రాయన్న

ప్రగడప్ప కొండప్ప దండనాథుడు రామయామాత్యుడు

రామయామాత్యభాస్కరుడు (కుమార్తె) చిన్నాంబ

రామలింగయ్య నరగయ్య లేక వేంకటయ్య పెదతిరుమలయ్య లేక కొండప్ప అప్పన్న

(రామలింగ) భాస్కరుడు. ఈతడు గుంటుపల్లి ముత్తనను దత్తతీసుకొనినవాడు

భాస్కరుడు తిరుమలయ్య తిరువెంగళనాథుడు నరసింహుడు లేక నరగప్ప వేంకటయ్య

వేంకటయ్య కోనేరాయుడు కేశవరాయుడు

**రాయనిగోత్రము:-**
(ఆత్రేయగణము చూడుఁడు.)

**రాయలసీమ:—** బళ్ళారిజిల్లా, యనంత పురంజిల్లాలలోని, జీర్ణవిజయనగరప్రాంతదేశమును 'రాయలసీమ' యని వాడుచుందురు. జీర్ణవిజయ నగర మేలినభూపాలురకు 'రాయలు' బిరుద ముండెను.

**రాయల్‌కమీషన్** (Royal Commisoin:— ఒకప్పుడు దేశమునఁ బ్రభుత్వ మవలం బించిన విధానము. ప్రజాభిప్రాయమున కనుకూల పడక యశాంతి కలుగును. రెండువిధముల యభి ప్రాయములు గల్గియుండినఁ బార్లమెంటునందలి యేపాసునకుఁ జెందిన యేపార్టీవారైనను, రా యల్‌కమీషను నిమ్మని కోరవచ్చును. ఎక్కువ ప్రాముఖ్యతఁ గలవాటికి రాయల్కమీషనును, ప్రాముఖ్యత కొంచెముగఁ గలవాట్లకు డిపార్టు మెంటల్ విచారణయు (Departmental enquery) ను కర్తవ్యములు.

రాయల్‌కమీషన్ విచారణఁ జేయుటకు, వినుటకుఁ దాము సమనులు (Summons) పంపుటకును, నవసరమగునెడఁ బ్రమాణముఁ జేయించుటకు (to adminsteoatte) నధి కారముఁ గల్గియుండును. దీని కగువ్యయములు పార్లమెంటుసభ్యులసమ్మతులపై నుండును. మఱి యు దీని కవసరమగు నుద్యోగుల (establishment) ను ప్రభుత్వమువారి యుద్యోగశాలనుండి యొసఁగఁబడును. విచారణపైని కమీషనరులు తమతమ యభిప్రాయములను కలసి దానిని వేఱుగ వ్రాసి సమర్పింతురు. పార్లమెంటునం దాయభిప్రాయములను చక్కఁగా యోజింతురు. గాని యటులనే శాసింపవలయు ననునిబంధన మాత్రము లేదు.

**రాయసం వేంకటపతి కవి:—** ఆంధ్ర కవులలో మధ్యకవులందుఁ బరిగణింపఁబడినవాఁడు. ఆర్వేల నియోగిబ్రాహ్మణుఁడు. వశిష్ఠసగోత్రము. తండ్రి పేరు అక్కరాజు.

ఈకవి 'లక్ష్మీవిలాస' మను శృంగారప్రబంధ ము రచించెను. ఈకవి యార్వీటి శ్రీరంగనాయుని యాస్థానవిద్వాంసుఁడు. ఈయన పరిపాలనము క్రీ. శ. ౧౫౭౭ మొదలు ౧౫౮౫ వఱకు. ఈ తనిరాజధాని పెనుగొండ (అనంతపురముజిల్లా). ఈతనితండ్రి వసుచరిత్రఁ గృతినొందిన తిరుమల రాయలు.

**రాయి గ్రుద్దనేల? చెయ్యి నొవ్వ నేల?:—**
(ఆంధ్రలోకోక్తి)

**రాలవిగోత్రము:—**
(కుశిక గణము చూడుఁడు).

**రావణకుమారతంత్రవైద్యము:—**
(కుమారతంత్రి బాలవైద్యము చూడుఁడు)

**రావణగోత్రము:—**
(ఉపమన్యు గణము చూడుఁడు.).

**రావణప్రతిష్ఠితశివలింగములు:-**
(పట్టిశలింగములు చూడుఁడు.)

**రావణభూపతి:—**
(దశకంఠుఁడు చూడుఁడు.)

**రావణమృతతిథి:—** లంకారాజ్య మేలిన రావణభూపతిని సంగరమున శ్రీరాముం డాశ్వీయుజ శుద్ధ దశమి (విజయదశమి) ని నిహతుం జేసిన టుల ను త్తరహిందూస్థానమున నా విజయదశమీ

దివసమనఁబనె రామలీలామహోత్సవము నెఱపు చున్నారు.

**రావణహ్రదము, రఖుస్థల్ సరస్సు:-** హిమాలయమునఁ గర్ణాళీనది కవ్వలఁ గైలాసశిఖరముకడ మానససరోవరముతో సరిగా నాప్రక్కనే యీసరస్సు కలదు. రావణభూపతి యాశ్రమ మిటఁ గలదు. గొప్పతపం బొనర్చి పరమేశ్వరునుండి మహాబలమగు నొకశివలింగముం బడసెననియు, నాలింగ మిపుడు గోకర్ణమున (దక్షిణ) మహాబలేశ్వరలింగమునఁ బేర్వడిసియున్న దనియుఁ జెప్పఁబడినది.

[illegible] మైళ్ళ వెడలుపును గలిగి మధ్య నొకపర్వతము దరెని గ్యాన్తాంగ్ (గోస్సల) మఠముం గల్గి యుండును. పర్వతమున నాశ్రమముకడ శిలావిగ్రహ మొకటి రావణునిది కలదు. మఱియుఁ గైలాస శిఖరమున హోమకుండ మనఁబడుతావున రావణ తపస్థానముం జూపుదురు. ఈసరస్సునకు వెలుపల నీటియూటలనుండియే శతద్రు (సట్లెజునది) ప్రారంభ మగును. (అనవతప్త సరస్సు చూడుఁడు).

**రావణాసురుఁడు:**—రావణుఁ డసురుం (దేవతలకునైరి) డగుట రావణాసురుఁడని వాడఁబడెను. ఈయన దైత్యుఁడని చెప్పఁబడినది. కశ్యప సంతతివాఁడు. గొప్ప శివభక్తుఁడు. వేదవేత్త. అందు సామవేది యని తెలియుచున్నది. ఈయన లంకారాజ్యము (సింహాలద్వీపము) నేలిన మహారాజు. ఈయనసోదరుఁడు విభీషణుఁడు. కుబేరుఁ డన్నగారని యనిరి గాని, బహుశః ఆయనయు, నీయనయు నేకోదరులు గారనియు, పినతండ్రి పెదతండ్రిపిల్ల లేమో యనియుఁ దోఁచెడిని. రావణభూపతిరాజ్ఞి పేరు మందోదరి. విభీషణునిభార్య పేరు సరమాదేవి. విభీషణుఁడు శ్రీరామభక్తుఁడైన వాఁడు. ఐనను రామేశ్వరదేవస్థానమున విభీషణ ప్రతిష్ఠితమని యొకశివలింగమును జూపుచున్నారు. వీరి కింకను కుంభకర్ణుఁడను వే ఱొకసోదరుఁ డుండి నటులఁ దెలియుచున్నది. కుబేరుఁడు గొప్ప శివభక్తుఁడు. అలకాపట్టణరాజ్య మేలినవాఁడు. కొంతకాల ముత్తరదిక్పాలకుఁడుగ నుండెను. అసమానధనవంతుఁడుగ నీశ్వరప్రసాద మందినవాఁడు. యక్షుల కధినాథుఁడై యుండినవాఁడు.

మాంధాతమహీపాలుఁడు తన తపోబలమున మానససరోవరమును ప్రతిష్ఠించి, దేవతలకుఁ బవిత్రస్నానతీర్థముగ నొసంగి యట నొకపర్వతకందరమునఁ దనభౌతికశరీరమును వీడి, అస్తుల వదలి వేయ రావణభూపతి తానును, రాక్షసుల కొక పవిత్రస్నానతీర్థము నేర్పఱచి, కైలాసగిరికడ కరిగి మానససరోవరముప్రక్కగనే 'రఖుస్థల్' రాక్షసతలము, అనఁగా (రాక్షససరోవరము) నేర్పఱచి, దాని పవిత్రతకై గొప్పతప మాచరించి, పరమేశ్వరదత్త మహాబలశివలింగము నట నుంచకఁ దనలంకాపురికిఁ గొంపోవ నెంచి మరలి మధ్యేమార్గమునఁ బశ్చిమ సముద్ర తీరమందున్న తామ్రగాకీనదీతీరమందలి గోకర్ణమునం దుంచి, తాను శివపూజ నెఱప నది యాగోకర్ణమున స్థిరపడెననియు, దానిని విఘ్నేశ్వరుం డొకపండితుం బోలి వచ్చి [illegible] జేయించెననియుఁ జెప్పంబడినది. ఇంక నీయన సింహాలమునఁ 'దొండ్రా' యనఁబడుతావుకడఁ గోటిశివలింగములఁ బూజించిన [illegible] డందురు. ఈమహారాజెన్నిగ్రంథముల రచించినవాఁడొ గాని యిక్కాలమున 'రావణకుమారతంత్ర' మను బాలచికిత్సాగ్రంథ మొకటియు, రావణభుజంగస్తవ మను నిరువదిచరణముల శివస్తోత్ర మొకటియు మాత్రముఁ గానవచ్చుచున్నవి. వీటినుండి రావణమహీపాలుఁడు

గొప్పశివభక్తుండేగాక మహాపండితుండగు వేద వేత్త యని చెప్పఁగల్గుచున్నారము.

ఈయన శ్రీరామునిభార్యయగు సీతామహాదేవిఁ జెఱఁగొని లంకకుఁ జేర్చెను. ఆమె యొక యశోకవృక్షముక్రింద వసించుచు శ్రీరామునిరాకకై నిరీక్షించుచుండెను. (సీతా ఎలియా చూడుఁడు.) శ్రీరాముం డటకు దండయాత్ర వెడలి సీతఁ దెచ్చుకొనెను. ఆయుద్ధమున రావణుండు నిహతుఁడు కాఁగా శ్రీరాముం డారాజ్యము విభీషణుని కొసంగెను.

ఈరాక్షసులు క్షీణించినకతన వీరికి స్వదేశస్థులగునరస్త్రీలయందుఁ గల్గిన సంతతివారలుగఁ జెప్పఁబడుచున్న వెడ్డాజాతివా రిప్పుడు సింహాలమున 'ఘారంకట్రీ' యనంబడు నరణ్యసీమలందు వసించుచున్నారు. వారిబాలయగు వల్లెదేవి శివకుమారుండగు కుమారస్వామిని బరిణయ మయ్యెనందురు. (కతారగామా చూడుఁడు. వెడ్డాజాతి వారు చూడుఁడు.)

రావణభూపతికి మందోదరివలన నంగదుఁడు, ఇంద్రజిత్తు, అక్షయకుమారుఁడు నని మువ్వురు సుతులు గల్గిరని చెప్పఁబడినది. ఈయనతోఁబుట్టువ (చెలియలు) శూర్పణఖ యనెదరు. జనస్థానమున వీరి కొక సైన్యస్థాన ముండెడిదనియు, నది వింధ్యారణ్యమం దిప్పటి నాశికాపురప్రాంతసీమ యనియుఁ దెలిసెడిని. మఱియు నట సైన్యాధిపతిగా నుండిన ఖరాసురుండును నెట్లో సరిగాఁ దెలియఁబడకున్నను, రావణభూపతికిఁ దమ్ముఁడేయని తెలిసెడిని. సింహళమునందలి లంకాపట్టణ మిక్కాలమునఁ గాననగుట లేదు. అఁనటివారు సముద్ర మాక్రమించి తనలోనికిం జేర్చుకొనె ననెదరు. గ్రేట్ బేసిస్, విటల్ బేసిస్ అనుతావులయందెత్తగు పీఠభూమిపై లంకాపట్టణము, రావణభూపతినాటి దుర్గములును ఉండెననియు, నవి కాలవశమునఁ గుఱింగి, సముద్రాక్రాంత మాయె ననియు నందురు.

అఱువది కోట్లో, లక్షలో, లేక వేలుమాత్రమోగాని, సైన్యమున కధిపతిగ నుండిన మాల్యవంతుఁ డను రక్కసి రావణుని మేనమామ యఁట.

**రావణాసురుని వల్లకాడు:-** ఇది యాంధ్రభాషాసాంప్రదాయార్థపదము. రావణభూపతికాష్టము (చితి) ఎప్పుడు నారనిదని యొకనమ్మకము గానఁ జల్లారనివైరముల నిట్లనెదరు.

ఇది కేవల మసందర్భకార్యము. రావణునిశరీరమునకు దహన మనుటయే యర్థము లేసపదము. అది నిత్యము నారిపోక కాలుచుండుననుట యసందర్భము. ఇట్లయ్యుఁ జిరకాలమునుండి తీరనివైరములకు 'రావణాసురునివల్లకాడు' అని యసూయతతో వాడుచునేయున్నారు.

## రావణిగోత్రము:—

(వశిష్ఠగణము చూడుఁడు).

**రావణుఁడు:**—అసురుఁడు. తండ్రి పులస్త్యునికుమారుఁడగు విశ్రవసువు. తల్లి సుమాలికుమార్తెయగు కైకసి. భార్య మయుని కుమార్తెయగు మందోదరి. సోదరులు కుంభకర్ణ విభీషణులు. తోఁబుట్టువ శూర్పణఖ. ఈమె విద్యుజ్జిహ్వుఁడను యసురునిభార్య. కుమాళ్ళు ౧ మేఘనాదుఁడు (ఇంద్రజిత్తు), ౨ అతికాయుఁడు, 3 మహాపార్శ్వుఁడు (మహాకాయుఁడు), ౪ దేవాంతకుఁడు, ౫ నరాంతకుఁడు, ౬ త్రిశిరుఁడు నను వారలు. ఈతఁడు శ్రీరాముని రాణియగు సీతాదేవి నపహరించి యాయనచే నిహతుఁడైన వాఁడు. లంకారాజ్య మేలినవాఁడు. శివభక్తుఁడు.

గోకర్ణమున మహాబలశివలింగమును కైలాసంబు నుండి తెచ్చి ప్రతిష్ఠించినవాఁడు. అందునకై కైలాసశిఖరముదరిని రావణహ్రదము లేక రాక్షస తలము (రఖస్థల్) సరస్సుకడ నాశ్రమముఁ గుదుర్చుకొని ఘోరతపం బాచరించినవాఁడు. గొప్ప విద్వాంసుఁడు. రావణభుజంగస్తోత్రమును రచించినకవి. దుర్మార్గుఁడు. అతిబలాఢ్యుఁడు. తపస్సంపన్నుఁడు.

## రావలిగోత్రము:—

(లౌగాక్షిగణము చూడుఁడు.)

**రావిచెట్టు (అశ్వత్థవృక్షము) పిప్పల వృక్షము:**—రావిచెట్టు హిందువులకుఁ బవిత్రవృక్షము. చల్లని నీడనిచ్చు చెట్టు. చెఱువుగట్టులపై నాటి నీడకై పెంచుదురు. దీనిమొదలున నారాయణ (దేవు) ని ప్రతిష్ఠించి యశ్వత్థనారాయణుఁడని పేరిడి పూజింతురు. రావిచెట్టును, వేపచెట్టును నొకచోట నిడి పెంచి రెంటికిఁ బరిణయ మొనర్చి, వీధిదంపతులుగఁ జూతురు. తొల్లి రావిచెట్లమధ్య దొరకుటంజేసి పిప్పలాదుఁ డనుఋషి యాపే రందెను. ఆమహనీయుని తపశ్శక్తిగ నుద్భవించిన కృత్య యనఁబడుశక్తిని సముద్రస్నానము లొనర్చువారు "పిప్పలాదాత్సముత్పన్నే కృత్యే లోకభయంకరే! సైకతం తే మయాదత్త మాహారార్థం ప్రకల్పిత" మ్మని కొంత యిసుకను సముద్రమునఁ బడవైచి యనంతరము స్నాన మొనర్తురు.

రావిచెట్లు తెల్లరావి, యెఱ్ఱరావి యని ద్వివిధము. తెల్లరావి చాలా యరుదైనది. బళ్లారి మండలములోని హాసుపేటదరి హంపివిరూపాక్షేశ్వరదేవస్థానమునకు వెనుకఁ దొల్లింట విద్యారణ్య యతీశ్వరుఁ డొక తెల్లరావిచెట్టునీడను తపం బొనరించుచుండెనని చెప్పఁబడినది. ఆమునలిరావిచెట్టు నేటికిని గలదు. అది తెల్లరావి. రావిఁయందుఁ దెల్లరావి యెక్కువ పవిత్రవంతమనియు, నెఱ్ఱరావియందు వైద్యగుణ బల మధికమనియుఁ జెప్పఁబడినది.

రావిచెట్టునకు లాటిన్‌భాషయందు Ficus Religiosa అనియు, ఆంగ్ల. Peepul tree అనియు, సంస్కృతమున అశ్వత్థః, అశ్వద్ధీ, పవిత్రకః, పవిత్రా, పిప్పలః అనుపేర్లును గాననయ్యెడిని. ఇఁక నశ్వసన్నిభా యనినఁ గండ్లరావియని చెప్పఁబడుటచే నిం దదియు నొకజాతిభేదమే యని తోఁచెడిని.

రావిచెక్కరసకషాయములు వ్రణములు, పుండ్లు, గజ్జి, చిడుము, తామర, తీట, విసర్పి మొదలగు చర్మరోగముల పరిశుభ్రపఱచి మాన్పుంగానఁ గషాయముతోఁ గడుగుదురు. పుక్కిలించిన నోటిపూత మాన్పును. నోటిరసఁపుఁబట్టు వదల్చును. లోనికిఁ గూడ నీయవచ్చు నందురు. జ్వరము హరించి, మేహశాంతిఁ గల్గించి దేహపుష్టి నిచ్చునని చెప్పఁబడినది. రావిచిగుళ్లరసము విరేచనబద్ధముం గల్గించుంగాన, నతిసార రక్తగ్రహణి గ్రహణివిరేచనములకు లోని కిత్తురు. చిగుళ్ళు నూరినముద్ద నమలుచు దంతములుం బట్టియుండు నట్లుంచుచుండుటవలన దంతములు పటిమ చెడకఁ గుదుళ్ళు గట్టిపడును. రావిపండ్లామవాతము రేఁపును. రావిపండ్లనెండించి చూర్ణముఁజేసి లోని కిచ్చిన నుబ్బసఁపుదగ్గు నివారణమగుననియు, పురుషులకు వీర్యవృద్ధియు, స్త్రీలకు వంధ్యాత్వ నివారణమును గల్గునని చెప్పఁబడినది. ఎండించిన రావి విత్తుల చూర్ణము తత్వప్రకృతిని మార్చుననియు, మేహశాంతిఁజేసి, వీర్యవృద్ధని గల్గించి, బల మొసంగుననియుఁ జెప్పఁబడినది. రావిపండ్లు గల్గించు

నామవాతదోషమునకుఁ బరిహారము సర్పచెట్టాకు కషాయమని చెప్పఁబడినది.

**రావిపాటి తిప్పన్నకవి (త్రిపురాంతకుఁడు):**— ఆంధ్రకవులలోఁ బూర్వకవులలో నొక్కఁడుగఁ జెప్పఁబడినవాఁడు. ఈతనిఁ ద్రిపురాంతకదేవుఁడనియు వాడుచుండిరఁట. ఇతఁడు 'ప్రేమాభిరామ' మను సంస్కృతవీధినాటకము రచించినట్లును, దానింబట్టి వినుకొండవల్లభరాయకవి తెలుఁగునఁ గ్రీడాభిరామ మను వీధినాటకమును రచించినట్లును చెప్పఁబడినది.

ఈమహనీయుఁడు నియోగిబ్రాహ్మణుఁడు. ఈయన యింకను రచించిన యాంధ్రగ్రంథములు త్రిపురాంతకోదాహరణము, మదనవిజయము, చంద్రతారావళి, అంబికాశతకము ననునవి.

త్రిపురాంతకోదాహరణ మొక్కొకవిభక్త్యంతమున నొక్కొకపద్యముతర్వాత నొక్కొక్కకళికను, తరువాత నొక యుత్కళికను గల్గియుండును. ఇట్టిగ్రంథముల కుదాహరణగ్రంథము లనిపేరు. ప్రబంధపద్యరచనలకుం బూర్వమీగ్రంథములే యాంధ్రవాఙ్మయమునఁ బ్రాముఖ్యత వహించియుండునవి. అనేకచాటుధారపద్యములు రచించినవాఁడు.

**రావీనది (రవి లేక యైరావతీనది):**—
(పరూష్ణీనది చూడుఁడు.)

**రాశ్యాధిపకూటము (వర్ణకూటము):**- జ్యోతిషశాస్త్రమునందు వధూవరుల యెన్నికలం గూర్చి వివరింపఁబడినఁ బండ్రెండుకూటములలో నొకటి. (ద్వాదశకూటములు చూడుఁడు)

కర్కాటకరాశి, వృశ్చికరాశి, మీనరాశి, బ్రాహ్మణవర్ణ రాసు లనియు, సింహరాశి, ధనూరాశి, తులారాశి, క్షత్రియవర్ణ రాసులనియు, మేష రాశి, మిథునరాశి, కుంభరాశి, వైశ్యరాసు లనియు, వృషభ కన్యా మకరరాసులు శూద్రవర్ణ రాసులనియుఁ జెప్పఁబడినవి. వీటి తారతమ్యమెఱింగి వధూవరుల యెన్నికల నెఱపుట శ్రేయమనియు నీయెన్నికకు రాశ్యాధిపకూటమనియు, వర్ణకూటమనియు, వర్ణపొంతనమనియుఁ బేర్లని చెప్పఁబడినది.

**రాశికూటము (లేక రాశిపొంతనము):**- జ్యోతిషశాస్త్రమునందు వధూవరుల యెన్నికలం గూర్చి వివరింపఁబడినఁ బండ్రెండుకూటములలో నొకటి. (ద్వాదశకూటములు చూడుఁడు). స్త్రీ రాశినుండి పురుషునిరాశి రెండవదియైనమృత్యువు, పండ్రెండవదైన చిరాయువు, మూఁడవదైన దుఃఖము, పదకొండవదైనసుఖప్రదము, నాలుగవదైన దారిద్ర్యము, పదియైన ధనయోగము, ఐదవదైన నశుభప్రదము, తొమ్మిదవదైన శుభప్రదము, ఆరవదైన సంతాననాశము, ఎనిమిదవదైన సంతానప్రదము, ఏడవదైన మాంగళ్యము.

పురుషరాశినుండి స్త్రీరాశి పండ్రెండవదైన మృత్యువు, రెండవదైన చిరాయువు, పదునొకండవదైన దుఃఖము, మూఁడవదైన సుఖము, పదియైన దరిద్రము, నాలుగవదైన ధనసంపద, తొమ్మిదియశుభప్రదము, ఐదవదైన శుభము, ఎనిమిదియైన సంతాననాశనము, ఆరవదైన సంతానప్రదము, ఏడవదైన మాంగల్యప్రదము నని చెప్పఁబడినది.

**రాష్ట్రకూటదేశము:**—
(మహారాష్ట్రదేశము చూడుఁడు).

**రాష్ట్రకూటవంశనృపతులు:**— వీరు పదముగ్గురు నృపతులు. వీరి మొదటిరాజధానిం గూర్చి యేమియుఁ దెలియకున్నది. వీరి నుత్తర దేశఁపుహిందీభాషయందు 'రహతోర్' అనుచున్నారు. వీరిమూలపురుషుఁడు దంతివర్మ యని.

తెలియుచున్నది. చారిత్రదృష్ట్యా యీతని నొక టవ దంతివర్మ యని చారిత్రకపరిశోధకులు వాడి యున్నారు.

౧ రెండవ దంతివర్మ:—ఈయనకాలము నిష్కర్షగఁ దెలియకున్నను క్రీ. వె. ౭౫౪ ప్రాంతమని తలంపఁబడుచున్నది. ఈయన పూర్తియగు పేరు ఖడ్గావలోకనదంతిదుర్గ లేక దంతివర్మ మహారాజు. ఈతఁడు చాళుక్యులం జయించి స్వతంత్రరాజ్యమేర్పఱుచ్చుకొనిన మొదటిభూపతి.

౨ కాని యతనిని ఈతనిపినతండ్రి యకాలవర్ష శుభతుంగకృష్ణరాజు (౧ వ కృష్ణరాజు) పద చ్యుతుంజేసి రాజ్య మాక్రమించి తానుఁ ప్రభు వాయెనని చెప్పఁబడినది. ఈతనికాలముననే రాజ్యము విస్తీర్ణమై, పశ్చిమసముద్రమునుండి యాంధ్రదేశమున సగభాగముంగూడ నాక్ర మింప నీయన చక్రవర్తి యనఁ బరఁగినవాఁడు. ఈతనియనంతర మీతనిసుతుఁడగు రెండవ గోవిందరాజు సింహాసన మెక్కెను.

3 రెండవ గోవిందరాజు:—ఈయన పూర్తియగు పేరు నిరుపమధ్రువరాజగోవిందరాజు. ఈయన కాలము నిష్కర్షగఁ దెలియకున్నను, క్రీ. వె. ౭౬౫ అని తలంపఁబడుచున్నది. ౭౭౦ వఱకుఁ బాలించిన చక్రవర్తి. ఈతఁడు మద్యపానోన్మత్తుఁడై, విషయలోలుఁడై యుండువాఁడని ప్రతీతి కలదు.

౪ పిదప ధారావర్ష, కవివల్లభ నిరుపమధ్రువ రాజు క్రీ. వె. ౭౭౦ మొదలు ౭౯౩ వఱకుఁ బాలించెను. కాని యీయనకుఁ దండ్రియగు 3 వ నృపతి రెండవగోవిందరాజు పాలనము ననో, యంతకుఁ గొంచెము పూర్వమునుండి యో గాని క్రీ. వె. ౭౬౦ నుండియు, ౯౬౭



వఱకు (మూఁడవకృష్ణరాజుపాలన) రాష్ట్ర కూటులకు, వేంగిచాళుక్యులకు నెడతెగని యుద్ధములు విరామములేక రెండువందల సం త్సరములు నడిచెను.

౫ మూఁడవగోవిందరాజు:- ఈతఁడు పైన వివ రింపఁబడిన ధ్రువరాజుతమ్ముని కొడుకు కఁట. ఈతని పూర్తియగుపేరు ప్రభూతవర్ష శ్రీ వల్లభ జగత్తుంగగోవిందరాజు. ఈతనికాలము క్రీ. వె. ౭౯3 — ౮౧౪ అని చెప్పఁబడినది. ఈతఁడే మాల్యఖేట [పుర] ముం గట్టి తన రాజధాని నటకు మార్చినవాఁడు. గుజరాతు దేశము నీతఁడు జయించి తనతమ్ముఁడగు నిందరాజు కిచ్చెనని చెప్పఁబడియున్నది.

౬ ఒకటవ అమోఘవర్ష మహారాజు:- ఈతని పూర్తియగుపేరు నృపతుంగమహారాజ శర్వ అమోఘవర్షుఁడు. ఈయనకాలము క్రీ. వె. ౮౧౪-౮౭౮ అనఁగా నఱువదినాల్గుసంవత్సర ముల దీర్ఘకాలము. ఈమధ్య నీతఁ డొకతఱిని జైనమతస్వామి [సన్యాసి] యై సింహాసనము వదలియుఁ దిరుగ సింహాసన మధిష్ఠించి పాలన నడిపెను. గాన ప్రభుఁ డొక్కఁడేయయ్యు రెండుతడవలు సింహాసన మెక్కినవాఁడని చెప్పఁబడినది. చాళుక్యులతో యుద్ధము లదే పనిగ నడుచుచుండిన యాకాలమున (అనఁగా యుద్ధము ౭౬౦—౯౬౭) ఈతనితోఁబుట్టువును కలివిష్ణువర్ధనుని (చాళుక్య భూపతికిని) కూతురు సుశీలామహాదేవి నీతని సుతునకును నిచ్చి వివాహములు జరిగియు, యుద్ధములాగి యిర్వురకు శాంతి కలుగ లేదఁట. వీరి వైర ములు పోలేదఁట.

౭ రెండవ కృష్ణరాజు:- ఈతఁ డమోఘవర్షుని కుమారుఁడు. ఈతనిపూర్తియగుపేరు అకాల

వర్ష శుభతుంగ కృష్ణరాజు. ఈతఁడు చాళుక్య శాత్రవులను పూర్తిగ నోడించి, రాజ్యముఁ గైకొన, నాతఁడు శరణుఁజొచ్చి ప్రార్థేయప డినతోడనే తిరుగ నాతని కతనిరాజ్య మిచ్చి దయఁ జూపెనఁట. ఈతనికిఁ బిదప నీతని సుతుఁడు (రెండవ జగత్తుంగరాజు) రాజ్యపాలనముఁ గైకొనమి మనుమఁడు సింహాసనమునకు వచ్చెను.

౮ మూఁడవ యింద్రరాజు:- ఈతనిపూర్తియగు పేరు నిత్యవర్షయిందర్రాజు. తల్లిపేరు లక్ష్మీదేవి. ఈతనికాలము క్రీ. వె. ౯౧౫ —౯౧౮ అని చెప్పఁబడియున్నది.

౯ నాల్గవ గోవిందరాజు:- ఈతనిపూర్తియగుపేరు ప్రభూతవర్ష సువర్ణవర్ష నృపతుంగ గోవింద రాజు. ఈతనికాలము క్రీ. వె. ౯౧౮—౯౩౩ అని చెప్పఁబడియున్నది. ఆంధ్రుండగు పంప కవి యీతనియాస్థానకవియై యుండెను. ఆతఁడు రచించినగ్రంథములు పంపభారతము, ఆదిపురాణము సనుగ్రంథములు గాన నగుచున్నవి. పిదప నీతని పినతండ్రి రాజ్యమునకు వచ్చి కొలఁదికాలము మాత్రము రాజ్యమేలెనఁట. (ఱ గోవిందుఁడు ఆంధ్రచాళుక్యభీమునిచే ఓడింపఁబడెనట.)

౧౦ అమోఘవర్షవద్దిగరాజు:- ఈతనికాలము క్రీ. వె. ౯౩౪—౯౩౭ అని చెప్పఁబడినది. (ఈతఁడే యాపినతండ్రి.)

౧౧ మూఁడవ కృష్ణరాజు:—ఈతఁడు నాల్గవగోవిందునిసుతుఁడు. ఈతని పూర్తియగుపేరకాల వర్షకృష్ణరాజు. ఈతఁడు గొప్పచక్రవర్తియనిపించుకొనినవాఁడు. ఈయనకాలము క్రీ. శ. ౯౩౭ — ౯౬౭ అని చెప్పబడినది. ఈయన రాజ్యమున కుత్తరమున గంగా యమునా నదులును, దక్షిణమునఁ గావేరినదియు నెల్లగాలు నుండినవి. రాజ్యము గొప్పయుచ్చదశ ననుభవించెను. ఈయనయనంతరము రాజ్యము బలహీనమై పటుత్వముఁ గోల్పోయి, యాఱు వత్సరము లట్లే నడిచె నందురు.

౧౨ నిత్యవర్ష ఖొట్టిగ దేవరాజు. ఈతనికాలము ౯౬౮ — ౯౭౧ (నాల్గుసంవత్సరములు). బలహీనమగు పరిపాలనము నడచెనఁట.

౧౩ రెండవ కక్కరాజు:— ఈతని పూర్తియగుపేరమోఘవర్షనృపతుంగ కక్కరాజు. ఈతని కాలము క్రీ. వె. ౯౭౨ — ౯౭౩ అని చెప్పఁబడినది. ఈతనికాలమున రాజ్యపరిపాలనము నామమాత్రముగ నుండి కడుదుర్బలమై, తుదకుఁ బతన మాయెను. ఈతఁడే కడపటి భూపతి.

గాన రాష్ట్రకూటసామ్రాజ్యము క్రీ. వె. ౭౫౦ ప్రాంతము లావిగాఁ గల్గి ౯౭౩ లో నస్తమించెను. ఈ రెండువందల యిరువదిసంవత్సరములలోఁ బదముగ్గురు భూపతులైరి. వీరు మహారాష్ట్రులు. రాజధాని యిప్పుడు 'మాల్కే' డనుపేరఁ బరఁగుచున్నది.

**రాష్ట్రపాలిక:**— ఉగ్రసేనుని యైదవ కుమార్తె. సృంజయునిభార్య.

**రాష్ట్రపాలుఁడు:**—కంసుని సోదరుఁడు.

**రాష్ట్రీయగోత్రము:**—
(ఉపమన్యు గణము చూడుఁడు.)

**రాస్** (Ras or Rass:-)
Cape అగ్రము. (Land portions చూడుఁడు.)

**రాసులు:—**
(ద్వాదశరాసులు చూడుఁడు.)

**రాహునపురము:—**
(విహారమహాదేవి చూడుఁడు.)

**రాహులగోత్రము:—**
(సాహులగణము చూడుఁడు.)

**రాహూగణగోత్రము:—** ఇది యాంగీరససంతతి. గౌతమగణములోని రాహూగణ మను నుపగణములోనిది. ఆంగీరస రాహుగణ గౌతమ యనియు, ఆంగీరస గౌతమ శారద్వంత యనియుఁ బ్రవరరూపములు.

**రాహూగణగోత్రము:—**
(ఔతథ్య ఉపగణము చూడుఁడు).

**రాహూగణగోత్రము:—**
(శరద్వంత ఉపగణము చూడుఁడు).

**రింగ్:—** వాణిజ్యపరిభాషాపదము. Ring Speculation. వర్తకము చేయువారు కొందరు గూడి ధరను హెచ్చించుటకు గాని, తగ్గించుటకు గాని మాయాప్రయత్నము లొనర్చుతెఱి వారి కూటమి కీపేరు వాడెదరు.

**రింగ్‌లీడర్ [Ring leader]:—** తిరుగుఁబాటొనర్చువారి నాయకుఁ డనుట కీఉక్తి వాడఁబడుచున్నది. అపాయకరమగు కాగితములో సంతకము లొనర్పవలసి వచ్చినతఱి నందుఁ బ్రధాన నాయకుఁడు [ముందు సంతకము చేసినవాఁడు] ఎవ్వరో తెలియకుండునటుల నొకయుంగరమువలె నందరిసంతకములు వృత్తాకార మేర్పడునట్లుఁ జేతురఁట. అందు మొదటిసంతక మెవ్వరిదో తెలియరాకుండును. దానికి 'Ring' అనియు దానినాయకుఁడు 'Ring Leader' అనియు నీఉక్తి యేర్పడినదఁట.

**రికంవా (శాఖ) క్షత్రియులు:—**
(పర్మారశాఖక్షత్రియులు చూడుఁడు).

**రిక్వెస్టునోట్ (Request note):—** వాణిజ్యపరిభాషాపదము. ప్రార్థనపత్రము. త్వరితముగఁ జెడిపోవు Perishable goods, మొదలగువాని నోడనుండి Clearence వఱకు నిరీక్షింపక వెంటనే దింపివేయుమనియు, సరకుల నొకగొడౌన్‌నుండి వేరొకగోడౌనుకు (డ్యూటీ చెల్లింపఁబడకపూర్వమే) మార్చుమనియు నిచ్చెడిప్రార్థన పత్రములు.

**రిక్షగోత్రము:—**
(భరద్వాజ ఉపగణము చూడుఁడు).

**రిఖేశ్వర (హృషీకేశ) క్షేత్రము:—** పశ్చిమనేపాలమున పాల్పా రాష్ట్రంపు గవర్నరు వసించుపురమగుపాల్పాకు వాయవ్యదిశగా నెన్మిది మైళ్ళదూరమున రిడి యనంబడుగ్రామము కలదు. అటకు సమీపముననే గండకి [ఇట వాడుక 'కాళీగండకీ'] నదీతీరమున హృషీకేశనారాయణుని దేవస్థానము కలదు. అది సుప్రసిద్ధము. రెండు పర్వతశిఖరముల నడుమగ గండకీనది మార్గముఁ జేసుకొని, కొండప్రదేశములం గోసికొనుచు ప్రవహించుచుండును. అత్తావున సాలగ్రామము లధికముగ దొరకెడిని. [నారాయణిసాలగ్రామ క్షేత్రము చూడుఁడు.] ఇది సాలగ్రామములు దొరకుతావులలో నొకటిగఁ జెప్పఁబడినది. ఇట నరణ్యమయములగు శిఖరప్రదేశము లంతటను గలిగిన దేవాలయములు లెక్కకు మీఱినవో యనునట్లుగాఁ గానఁగుచుఁ గడుంగడు పవిత్రప్రదేశమై

దనరెడిని. ఇచట హృషీకేశనారాయణదేవస్థానమును జనులు 'రిషీకేశ్వర' మని వాడుచున్నారు. ఇక్కడివా రాదిని హృషీకేశనారాయణ విగ్రహము, చిన్నదిగనుండి, నానాటి కెదుగుచున్న దందురు. శ్రావణశుద్ధయేకాదశి [శయనైకాదశి] ని విష్ణుదేవుం డీక్షేత్రమున నిదురించి, కార్తీకశుద్ధయేకాదశి [ఉత్థానైకాదశి] నీట మేల్కాంచుననియుఁ గాన నీక్షేత్రము కడుపవిత్రవంత మనియు, యతు లీక్షేత్రమునఁ జాతుర్మాస్యలం గడపిన, వారిసన్యాసాశ్రమమందు సంభవించిన దోషములు పరిహారమగుననియుఁ జెప్పుదురు. యతులకిది గంగాతీరమునందలి కాశీక్షేత్రమునకన్న నతిశయమైన క్షేత్రమని చెప్పఁబడినది. చాల పవిత్ర క్షేత్రముగ నున్నది. హృషీకేశ మన హరిద్వారముకడనున్న హృషీకేశము గాదనియు, గండకీనదీతీరంపునేపాలములోని క్షేత్ర మనియు, నెఱుంగవలయును. ఇది సాలగ్రామములుగల తావులలో నొకటిగ లెక్కింపఁబడినది.

౧ సాలగ్రామ క్షేత్రము, ౨ గండకీనది, 3 ముక్తినాథక్షేత్రము, ౪ సాలగ్రామములు, ౫ నారాయణి. (సాలగ్రామ క్షేత్రము చూడుఁడు.)

**రిజర్వు** (Reserve): వాణిజ్య పరిభాషాపదము. నిల్వయుంచినది యని యర్థము. 'Reserve fund' అన హానినివారణమిత్తము నిల్వయుంచినధనమని యర్థము. ఒక limited company యొక్క కొంతభాగమును వసూలు పఱచిగాని, వసూలుపఱుపకగాని ఉంచివేసి, winding up చేయుట కుపయోగించుదానికి 'Reserve capital' అనిపేరు. వేలము ప్రారంభించు నధమంపు (కనీసంపు) ధరకు 'Reserve Price' అని పేరు.

**రిజల్యూషన్** [Resolution]:— వాణిజ్యపరిభాషాపదము. ఏర్పఱుచుకొనినదని యర్థము. ఒకసభయందుఁ జేయఁబడినతీర్మానమున కీపేరు వాడుచున్నారు.

**రిజస్టరుడు** (Regestered):— వాణిజ్య పరిభాషాపదము. ప్రభుత్వముయొక్కగాని, అట్టివర్తకముఁజేయు నొకసంఘముయొక్కగాని పుస్తకములో భద్రమునిమిత్తము నమోదుఁజేయించుట. అసుపత్రములు, వాటాలు మొ॥ దస్తావేజులను, ఉత్తరములను నిటులఁ జేయింతురు.

**రిటెన్యూ** (Retenue):—వాణిజ్యసంబంధ పరిభాషాపదము. దేశమందుఁ బ్రచారమునలోనున్న నాణ్యములను ముద్రించుటకుఁగా వెండి బంగారు బంగ్లియను తెప్పించువారికిఁ దగులు fright rate. (ఇవి తక్కువరే ట్లుండును).

**రిటెయినింగువాల్సు** (Retaining walls):—

(గోడలుచూడుఁడు).

**రిడమ్ప్షన్** (Redemption):—వాణిజ్య పరిభాషాపదము. వదల్చుకొనుట. తనఖాఆస్తినవదల్చుకొనుట 'Redemption of motguge' అనిపేరు.

**రిడిలుకనన్డ్రమ్**:— (Riddle and Conundrum) పెక్కండ్రువిద్యాధికులున్నై తము రెంటి నొకటే యని తలంచి పొరఁబడుదురు. 'రిడిల్' అనునది యొకప్రశ్న. దీని కుత్తర మిచ్చుటకు దూరాలోచనమును, నెక్కువబుద్ధిబలమును నత్యవసరములు. వస్తుజ్ఞానము, లోకపరిచయము నెక్కువగాఁగలవారు సరియగు ప్రత్యుత్తరముల నొసంగ యోచింపఁ గలుగుదురు. ఇంక 'కొనన్డ్రమ్' అన నది విద్యాధికులు, శబ్దపరిచయజ్ఞానులు,

యోచింపఁదగినది. రెండుమాటల కొకటే యర్థ ముండినను, లేక యొకేవిధమునఁ బెకుచ్చారణఁగల్గి యర్థమున భేదముఁగల (Aloud-allowed) విగ సుఁడువాల్లం గూర్చి వివరించునది 'కొనన్డ్రిమ్' అఁబడును.

కొనన్డ్రిము లన్నియు రిడిల్సు కావచ్చును. గాని రిడిల్సు అన్నియు కొనన్డ్రిములు కావని యెఱుంగునది. అనఁగాఁ గొన్నిరిడిల్సు కొనన్డ్రిము లగుననియు, కొన్నిరిడిల్సు రిడిల్సుగానే యుండును గాని కొనన్డ్రిములు కాకుండుననియు నెఱుంగునది.

## రిడ్యూసింగు ఇంటు పొజిషన్(Reducing into posseion:—

వాణిజ్యపరిభాషా పదము. హక్కుగల ఆస్తిని, స్వాధీనపర్చుట లేక స్వాధీనపర్చుకొనుట.

## రినవ్యాఅల్ ఆఫ్ ఏ బిల్ (Renwal of a bill)

వాణిజ్యపరిభాషయందు Renwal అనఁ దిరిగి వ్రాయుట. ఒకహుండీని కాలముఁ గడ పుటకుఁ దిరిగి వ్రాయుట కీపేరు వాడుచున్నారు.

## రిపుఁడు:—

యదుమహారాజుయొక్క నాల్గవ సుతుఁడు. సోదరులు సహస్ర క్రోష్టువు, నలుఁడు.

## రిప్యూటెడ్ ఓనర్‌షిప్పు(Reputed ownership):-

ఒకఁడు దివాలాతీయుకాలమున నత నిస్వాధీనమందున్న యాస్తులతనివేయనుతలంపు.

## రిఫరీ:—

(అఫీషియల్ చూడుఁడు.)

## రిఫరెన్సు (Reference):—

వాణిజ్య పరిభాషాపదము. ఒకరియొక్క యోగ్యత, సామ ర్థ్యము, విలువ మొదలగువానింగూర్చి యింకొకరి నడిగి తెలుసుకొనుట.



## రిఫ్లెక్షన్ (Reflection) ధర్మము:—

రేడియంటుహీ టనంబడు invisible heat టకును, వెలుతురు (light) నకును ధ్వని (sound) కిని, రిఫ్లెక్షన్‌ధర్మము, రిఫ్రేక్షన్‌ధర్మము నను ద్వివిధములగు ధర్మములు గలవు. ఈరిఫ్లెక్షను కును, రిఫ్రేక్షనుకును గలభేదముల నెఱుంగుట ముఖ్యము. రిఫ్లెక్షను వెనుకకుఁ దిరిగి మరలుట (bending back) యనియు, రిఫ్రేక్షను భిన్న మై మరలుట (breaking back) యనియు నెఱుంగవలయును. అనఁగా రిఫ్లెక్షనునందు వెలు తురు భిన్నము గాక, ఆరంగు, లేక యారంగు బింబ మట్లే వంగి వెనుకకు మరలుటయని భావ ము. (రిఫ్రేక్షను చూడుఁడు). ఈరిఫ్లెక్షనునం దొక విధముగ రంగుం గల్గించు నేర్పాటు కలదు. రసాయనశాస్త్రవిదులు జగమందలి రంగులు రిఫ్లె క్షనునుండి కల్గినవే యనుచుందురు. ఒక luminous పదార్థమునుండి కల్గిన వెలుతురు దాని కెదుటనుండు వేఱొక non-luminous పదా ర్థముపైఁబడి దానికిఁగూడ నెదుటనుండు నింకొక non-luminous పదార్థముపైఁ గూడఁ బ్రతి ఫలించుట రిఫ్లెక్షనుగాఁ జెప్పఁబడినది. దీనికి సాదృశ్యముగా సూర్యునికాంతి చంద్రునిపైఁబడి, భూమిపై వెన్నెలగాఁ బ్రతిఫలించుటయని చెప్పఁ దగినది. ఇందుసూర్యగోళము luminous body గను, చంద్రగోళము, భూమిగోళము nun-luminous bodys గను, నెఱుంగవలసియుం డును. ఒకదీపమువెనుక నుంచఁబడు రిఫ్లెక్టరుపై నాదీపఁపుఁగాంతులు పడి యెదుటనుండు గోడల పైఁగాని, క్రిందిభాగము పైఁ గాని ప్రతిఫలించు చు నధికవెలుతురుఁ గల్గించుట రిఫ్లెక్షనుధర్మమే.

నిజమును పరిశీలించినఁ దెల్లనివెలుతురునం దనేకరంగులు కలసియున్నవి. సూర్యరశ్మి తెల్ల

వెలుతురని పెక్కండ్రు తలంతురుగాని, యది పసుపుఁబచ్చ, ఎఱుపు మొదలగు కొన్నిరంగులు కలసిన రంగని పరిశీలనలు తెల్పుచున్నవి. అగ్ని, అది కల్గించుమంటలందుఁ బసుపు, నెఱుపు, నాకుపచ్చ, ఊదా (Violet) మొదలగు కొన్నిరంగులు కలసియుండును. ఇట్టిరంగులు ఆ 'luminous bodys' వెల్లడించుచుండునవియే. భూమి, చంద్రుఁడు మొదలగు non-luminous bodies నందుఁ గాననగురంగులు luminous bodies నుండి కల్గింపఁబడి, రిఫ్లెక్షనుధర్మమునఁ జేరి యగుపడుచుండునవి. [రంగుల నిజతత్వము చూడుఁడు. కీబోర్గ్రాఫ్ ఇన్విజబుల్ హాట్వేవ్స చూడుఁడు. సెలక్టివ్ రిఫ్లెక్షను చూడుఁడు].

## రిఫ్రాక్షను:—

(ఆప్టిక్సు చూడుఁడు.)

## రిఫ్రెక్షన్ (Refraction) ధర్మము:—

రిఫ్రెక్షనుధర్మము రిఫ్లెక్షనువలెనే రేడియంటు హీటునకును, వెలుతురునకును, ధ్వనికింగూడఁ గల్గుచుండునది. ఈరిఫ్రెక్షనునకును, రిఫ్లెక్షనునకును, గలభేదము నెఱుంగుట ముఖ్యము. (రిఫ్లెక్షనుధర్మము చూడుఁడు.) ఆంగ్లరసాయనశాస్త్రవేత్తలచే 'Refraction is breaking back' అని నిర్వచింపఁబడినది. వెలుతురు భిన్నతనంది వేర్వేఱురంగులుగనై గన్పడుట రిఫ్రెక్షనుగాఁ జెప్పఁబడినది. మనము చూచుతఱిఁ గన్పట్టు వస్తుప్రతిబింబము లన్నియు నించుమించు రిఫ్రెక్షన్, రిఫ్లెక్షనుల ధర్మములోనే గన్పట్టుచుంట దీని నెఱుంగుట ముఖ్యము.

రిఫ్రెక్షన్ ధర్మమును సూత్రప్రాయముగఁ దెలుప వీలుపడదు. గాన నుదాహరణపూర్వకముగను, లక్ష్యలక్షణములం దెల్పు రీతిని, వివరింపవలసియుండును. సర్వసాధారణముగ నలువది సంవత్సరముల లోపువయస్సున దృష్టి బాగుండు తఱి, నేత్రముతోఁ జూచుటయన నొకవస్తువు యొక్క వెలుతురుబింబము నేత్రపు వెనుకభాగమునుండు Retina or curtain of the eye పైకిఁ జేరుట యగును. వెలుతురుబింబమన వెలుతురునందలి రంగులనికూడ వేఱుగఁ జెప్పఁబనియుండదు. ఇట్లగుట స్పష్టమై, స్వచ్ఛమైన యావెలుతురుబింబ మగుపడుటయే యగును. ఇది రిఫ్రెక్షనుధర్మమనియే చెప్పఁబడినది. నలువదివత్సరములవాఁడు నేత్రములకుఁ జత్వారదశ ప్రారంభమగుకతన ధరింపనగు సులోచనములందలి యద్దములు చేయుపని రిఫ్రెక్షనుగనే చెప్పఁబడినది.

ఇంకను నిట్టివేయగు మైక్రోస్కోపు (microscope) యంత్రములు, టెలిస్కోపుయంత్రములు, లోనియద్దములు, మేజిక్కులాంతరు (Magic Lantern) అద్దములు వాటివాటి శక్తిసామర్థ్యములకొలది రిఫ్రెక్షనుపనినే చేయుచుండునని చెప్పఁబడినది. అనఁగా వెలుతురుకిరణములు లేక తరంగములు బగులఁదీసి నడిపించి వెలుతురుబింబములం జూపుట యను భావము. ఇంకను రిఫ్రెకనుధర్మము నాచరించుటయందు స్వచ్ఛపదార్థములగు నద్దములు, ఉదకము, వజ్రములు మొదలగు వేర్వేఱుపదార్థములకు వేర్వేఱు సామర్థ్యము, లేక బలముఁ గలశక్తులు గలవని తేలినది. దీని కుదాహరణముగ నీటినుండి చూచుతఱిఁ గల్గు రిఫ్రెక్షనుకంటె వజ్రమునుండి చూచినతఱిఁ గల్గు రిఫ్రెకను నధికబలమై యుండుఁ గాననే యట్లు వెలుతురు భేదింపఁ బడుటం గల్గిన యాకుపచ్చ, ఊదా, ఎఱ్ఱవూదా మొదలగు రంగులు దానినుండి బలముగ వ్యాపించుచుండె

డిని. గాననే వజ్రమంత ప్రకాశవంతమైఁ దనరెడిని.

న్యూటను పండితుని ప్రిసిమ్ (Prism glass) అద్దము చేయుపని రిఫ్రాక్షననియు, నది వేర్వేఱురకముల యద్దములు, వేర్వేఱుబలముల పనిం జేయుచు రిఫ్రాక్షనును నడుపుచుంట యను భవ్యైకవేద్యమే. స్పెక్ట్రమ్ చేయుపనియు రిఫ్రాక్షను గాక వేరేమియుం గాదు.

సూర్యగోళము మొదలగునవి భూమిపైనున్న వారికండ్ల కగుపడుటయందు రిఫ్రేక్షను అవస్థ నందియే యావెలుతురుబింబ మిటకుఁ జేరి కన్పించు చున్నది. చూచుతఱి సూర్యుని వెలుతురు బింబ మీతరునుండి కొంతద వ్వరిగి, భూమిం జుట్టిన వాతావరణమును దొలుతఁ జేరెడిని. వాతావరణమున కవ్వల నేమియులేని (empty space) తా వున్నదని తలంపఁబడుచున్నను సూర్యగోళ మునఁ జుట్టి, వాతావరణ ముండిన నుండనగును. ఏలయన నట మంటలుఁ గాన్పించునే యున్నవి. కాని భూమికిని, సూర్యగోళమునకుఁ గలయధిక దూరముఁ దలఁచిన నడుమఁ గొంత యేమియులేని empty space ఉండునోపునని తోఁచకపోదు. ఈప్రయాణఁపు దారిభేదములందు వెలుతురు యొక్కతరంగముల గమనత్వరితము మొదలగునవి యించుక మార్పుం జెందుచుండును. దానినుండి యాబింబఁపువేర్వేఱు వెలుతురుకిరణములు, లేక తరంగములు వేర్వేఱువిధముల మార్పులనందును. ఈసంబంధమున The denser the subject threw which the emage of light is passing the more it is retarded" అని రసాయనశాస్త్రధర్మముమేరకు గా నుండును. దారియందుండుగాలి డెన్సిటీ యధికమగుతఱి నిం కనువంకఅలఁజెందియగునని దీనిభావము. రిఫ్రేక్షనే గాని వేరేమియుం గానేరదు. ఇంక నీసందర్భమున when the image of light travelling threw empty space it reache the air (atmosphere of the earth) slightly retarded and bent" అని చెప్పఁబడిన వేఱొకధర్మముమేరకు వాయువున కవ్వలి ప్రదేశమునుండి వచ్చుతఱినిగూడ వెలుతురుబింబ మించుక వంగి రావలసియుండెడిని. గానవె మన ముదయమునఁ జూచుతఱి సూర్యగోళ మప్పటికిఁ గన్పించుచుండుతావున నింమక భేదమగు నాసమీప ప్రదేశముల నుండనోపునని చెప్పఁగల్గుచున్నారము. ఇది రిఫ్రాక్షనుపనిగాని వేరేమియుఁ గాదు. ఇవియె గాక వాయువునుండి నీటిసంబంధమునకు, నీటిసంబంధమునుండి వాయువునకు, చలించుతఱి వెలుతురుబింబమునకు రిఫ్రేక్ష నధికబలముగఁ గల్గెనని పరిశీలన లిదివఱకే బయల్పఱచినవి. వాయువునందు కన్న నీటియం దధికమైన డెన్సిటీ యుండుట వెల్ల రెఱింగినదే. (డెన్సిటీ చూడుఁడు). ఇటులవంగుట యేగాక భేదింపఁబడినతఱి నన్నిరంగులసముదాయ మగు తెల్లవెలుతురు తనయం దదివఱ కిమిడియుండిన పెక్కురంగుల బయల్పెట్టి ప్రదర్శింపకపోదు.

**రిఫ్లెక్షను:**—

(ఆప్టిక్సు చూడుఁడు).

**రిబ్బొనిజమ్ (Ribbonism):**— ప్రొటెస్టెంటు క్రైస్తవశాఖకు వ్యతిరేకమగు నొక క్రైస్తవశాఖ.

**రియల్ (Real):**— వాణిజ్య పరిభాషా పదము. నిజమగు నని యర్థము. నిస్సంశయమగు ఆస్తిని real Estate అనియు, Realty అనియు నందురు. (Lease holds ను personal Estate అనియెదరు). Real Estates యొక్క తన ఖాదస్తావేజులను 'Real Securities' అనెదరు.

బాకీలను వసూలుచేయుట, దస్తావేజులను నగదుగా మార్చుట realisation అనెదరు.

**రియా (Ria):**— ఒకటితో నొకటి వరుసలుగ (Paralel) రెండుకొండలవరుసలు భూమిపై నుండి సముద్రతీరముదనుక నరుగుతావులందు నడుమను పల్లమై మునిగిపోవున ట్లున్న తీరములు. నడుమ నీటితో భూమిలోనికి జొచ్చుకొనిపోవుచుఁ గడకుఁ బోనుపోను మెరకయై పోవు జలప్రదేశమును, నాంగ్ల భూగోళశాస్త్రమున 'రియా' యనెదరు.

ఫియోర్డును నించుమించు చిటులనే యున్నను నదియాదిని యొకప్పుడు (మంచు) గ్లేసియరుగ నుండి యుండినటులను, రియా కానటులను పండితులగు పరిశీలకులు పోల్చిరి. దొరకిన యానవాళ్ళనుబట్టి, ఫియోర్డులు (Feords) క్రిందకిఁ గృంగిపోయి, వేడి నంది కరఁగి నీరైన గ్లేసియరు లని తేలినది.

**రియాలిజమ్ [Realism]:**—అనుభవసిద్ధమగు విజ్ఞానముతోడనుమాత్రమే తత్త్వజిజ్ఞాసఁ జేయువిధానము. ఈసిద్ధాంతమునందు శాస్త్రప్రమాణ మనుభవసిద్ధమగు విషయమును త్రోచివేయఁ జాలదు. ప్రకృతిసిద్ధపరిణామములకును, మానవుని మానసికప్రవృత్తికిని గనఁబడుసంబంధము నాధారముఁ జేసికొని, తత్త్వజిజ్ఞాస నేటికాలమున జరుగుచున్నది. తొంటికాలమునఁ బ్రత్యేకము దృశ్యపదార్థవిజ్ఞానమే యీ 'రియాలిజమ్' అనఁబడునది.

**రిలేటివిటీధర్మము:**—[ఐన్‌స్టన్ సిద్ధాంతము చూడుఁడు. అన్యోన్యానుబంధసంబంధము చూడుఁడు].

**రిలోమోనాస్ట్రిచర్చి** — ఈ క్రైస్తవదేవాలయము బల్గేరియాదేశములోనికెఁ గడుంగడు పురాతనమని చెప్పఁబడిన గ్రీకుచర్చి. ఈజిప్తుదేశమునందలి కోప్టుజాతి క్రైస్తవు లీచర్చిసంబంధులందురు.

క్రీ. శ. ౧౦౫౪ లోఁ గ్రైస్తవులు పడమటి రోమనుచర్చిసంబంధులుగఁ గొందఱును, తూర్పునఁ గాన్‌స్టాంటునోపిల్ చర్చిసంబంధులుగఁ గొందఱును విభక్తులై యిరుసంఘములై విడిపోయి యుండిరి.

**రివర్ బాంక్సు:**—

(తీరములు చూడుఁడు).

**రివర్బేసిన్ (Riverbasin):**— ఒకనదియొక్క పార్శ్వములందుఁ బడినవర్ష జలముగాని, యాప్రాంతములందున్న మంచుకరఁగిననీరు గాని, పల్లమునకు దొరలుచు నానదియందుఁ జేరుచు, నదీప్రవాహ మగుట నెల్లరెఱింగినదే. ఏప్రదేశమునందలినీరు నదిలోనికిఁ జేరుకొనుచుండునో యాప్రదేశ మంతయు నొకనదికి 'బేసిన్' అనఁబడును.

నదులబేసినులు వర్షములకు నాని జలములతోఁ గలసి రెయింద్రుడుబురదగ నీటంగలసి ప్రవాహజలములందుఁ జేరుచు, తీరములందునను, కడకు సముద్రముమొగను జేరుకొనుచు, నేటిలంకలుగను, డెల్టాలుగను ఏర్పడుచుండును.

**రివర్షన్:**—వాణిజ్యపరిభాషాపదము. తిరిగి మొదటితావునకుఁ జేరుటయని యర్థము.

**రివర్సు కోరిలేషన్ (reverse co- relation)**

(స్టాటిస్టిక్సు చూడుఁడు).

**రివల్యూషన్:**—

(రొటేషన్ చూడుఁడు).